# విషయసూచిక

## ప్రథమ కాండము



## ద్వితీయకాండము



## తృతీయకాండము

శ్రీరస్తు

*నామలింగానుశాసన మను శ్రీ మదమరసింహవిరచితం బైన*

# అమరకోశము

సంస్కృతాంధ్రవ్యాఖ్యాన సహితము

## ప్రథమకాండము

లింగమసూరివిరచితా పదవృత్తిః

శివం హరిం విధాతారం తత్పత్నీస్తత్సుతాన్ గురూన్,
నత్వా సమస్త ప్రత్యూహశాన్తయే మంగళాయ చ,
పదవాక్య ప్రమాణజ్ఞైః క్షీరస్వామ్యాదిసూరిభిః,
కృతాన్ గ్రన్థాన్ సమాలోచ్య బాలానాం సుఖబుద్ధయే.
యత్కృతం సురసింహేన నామలింగానుశాసనమ్,
తత్రస్థాయాః పదావళ్యా వివృతిర్వక్ష్యతే మయా.

అవః___అథ సకల శాస్త్రాభిజ్ఞః అమరసింహాఖ్యో మహాప్రాజ్ఞః లోకోపకారాయ నామలింగానుశాసనాఖ్యం గ్రన్థం చికీర్షుః ప్రారీప్సితస్య గ్రన్థస్యా విఘ్న పరిసమాప్తయే ఇష్టదేవతా నమస్కారరూపం మంగళమాదా వాచరతి.

### గురుబాల ప్రబోధిక యను తెనుగు టీక

అవతరణిక.___ సకలశాస్త్రాభిజ్ఞుండగు నమరసింహుం డను మహాపండితుడు లోకోపకారముకొఱకు నామలింగానుశాసన మను గ్రంథమును జేయ నారంభించువాడై ప్రారంభించు గ్రంథము నిర్విఘ్నముగా బరిసమాప్తి నొందుటకొఱకు నిష్టదేవతా నమస్కారరూపమైన మంగళమును జేయుచున్నాడుః

## స్వర్గ వర్గము

**మూ. యస్య జ్ఞాన దయాసిన్ధో రగాధస్యానఘా గుణాః**
**సేవ్యతా మక్షయో ధీరాః † స శ్రియైచామృతాయ చ.** 1

యస్యేతి. హేధీరాః =హేపణ్డితాః, జ్ఞానదయాసిన్ధోః = జ్ఞానకృపా సముద్రస్య, అగాధస్య = గంభీరస్య, యస్య = దేవస్య, గుణాః, అనఘాః = పాపరహితాః, అక్షయః = నాశరహితః, సః = దేవః, శ్రియై = సంపదే, అమృతాయ = మోక్షాయ చ, సేవ్యతాం, సముద్రపక్షే–గుణాః= రత్నాకరత్వాదయః, అక్షయః–అస్య = విష్ణోః క్షయః = నివాస ఇత్యర్థః.శ్రియై = లక్ష్మ్యై, అమృతాయ = సుధాయై, సేవ్యతా మిత్యన్వయః.

అర్థము. హే ధీరాః = ఓ విద్వాంసులారా। జ్ఞానదయాసిన్ధోః = జ్ఞానమునకును దయకును ఆశ్రయభూతుడైన, అగాధస్య = గంభీరుడైన, యస్య = ఏ దేవునియొక్క, గుణాః = గుణములు, అనఘాః = రాగాదిదోషములు లేనివో, అక్షయః = నాశరహితుడైన, సః = ఆ దేవుడు, శ్రియైచ = సంపదకొఱకును, అమృతాయచ = మోక్షముకొఱకును, సేవ్యతాం = సేవింపబడుగాక. ఇది పరమాత్మపరమైన యర్థము. సముద్రపక్షమందు. యస్య = ఏ, అగాధస్య = లోతైన, సిన్ధోః = సముద్రునియొక్క, గుణాః = రత్నాకరత్వాది గుణములు, అనఘాః = నిర్దోషము లైనవో, అక్షయః–అ= విష్ణువునకు, క్షయః = నివాసమైన, సః = ఆ సముద్రుడు, శ్రియైచ = లక్ష్మీదేవికొఱకును,అమృతాయచ = అమృతము కొఱకును, సేవ్యతాం = సేవింపబడుగాక. అనగా పూర్వకాలమునందు దేవతలు సముద్రమును సేవించి లక్ష్మీదేవిని, అమృతమునుబడసినట్టు భగవంతుని సేవించువారలు ధర్మార్థకామము లనెడి త్రివర్గసంపదను మోక్షమునుం బొందుదురని తాత్పర్యము.

టీకాసర్వస్వం–శ్లో.ప్రత్యూహపర్వతతటీవప్రక్రీడాధురంధరమ్, వందే అంతరాయ కదళీభంజనం కుంజరాననమ్. బర్హిణబర్హాపీడః సుషిరపరో బాలవల్లవో గోష్ఠే, మేదుర ముదిరశ్యామల రుచిరవ్యాదేష గోవిందః. అథ టీకాసర్వస్వం దశటీకా విత్కరోత్యమరకోశే, యద్యపి సంత్యతి గుణినః శ్రమ స్తథాప్యత్ర మమ హి మౌఖర్యాత్. లలితం రౌతి పికశ్చేద్వ్యాయామం యాతు కిం కాకః తత్రాదౌ భగవతః సేవాయాః పరోపదేశేన ప్రారీప్సిత ప్రత్యూహశమనాయ ధర్మమార్జ యన్నాహ. య స్యేత్యాది. హేధీరాః సేవ్యతామిత్య నేన ధైర్యశాలిన ఏవ సేవితుం శక్ను వంతీతి తాన్ సంబోధయతి. యస్య గుణాః, అనఘాః రాగాది పాపరహి

తాః, తథా చాజయ్యకోశే అఘశబ్దో భవేత్పాపే దుఃఖవ్యసనయో రపీతి. గుణాః మైత్రీశమాదయః జ్ఞానదయాసిన్ధోరితి, జ్ఞానం = సమస్తవిధ పరిజ్ఞానం, దయా = పరదుఖప్రహాణేచ్ఛా, తాభ్యాం సిన్ధుః, 'ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యాన' మితి తృతీయా. 'తృతీ' యేతి యోగ విభాగా త్సమాసః. సిన్ధుశబ్దో విపులాధారత్వ ఉపచరితః. సిన్ధుసామ్య మేవాహ అగాధస్యేతి –అగాధస్యాన్యై రనధిగతదయాపారత్వాత్ అపరిచ్ఛేద్య గాంభీర్యస్య, అక్షయః పరహితాపాదనేషు నాస్తి క్షయోనాశో యస్యేత్యక్షయః సినుపక్షే వ్యక్త ఏవ ప్రయోజనానను ప్రదర్శనేన ప్రేక్షావదప్రవృత్తేః ప్రయోజనం దర్శయతి 'శ్రియైచామృతాయ' చేతి. శ్రియై = త్రివర్గసంపదే. తదుక్తం వ్యాడినా. లక్ష్మీ సరస్వతీ ధాత్రీ త్రివర్గ సంపద్విభూతిశోభాసు, ఉపకరణవేష రచనా విశేషేషు చ శ్రీ రితి ప్రథి' తేతి. అమృతాయ = మోక్షాయ. చకార ఉభయ ప్రాధాన్య ద్యోతానార్థః సిన్ధు రపి సురాసురైః శ్రియై = లక్ష్మ్యై, అమృతాయ = పీయూషాయ సేవితః. అత్ర, చానుక్తో ఽపిశబ్దార్థో జ్ఞానదయాదిభిః సృష్టం ప్రతీయత ఇతి ప్రసాదనామాయ మర్థగుణః. తదుక్తం సరస్వతీకణ్ఠాభరణే 'యత్తు ప్రాకట్యమర్థస్య ప్రసాదః సో ఽభిధీయత' ఇతి. అయముదయతి ముద్రాభంజనః పద్మినీనా ముదయగిరివనాళీ బాలమన్దారపుష్పమ్, విరహవిధురకోక ద్వన్ద్వబన్ధుర్విభిన్దౕ కుపితకపికపోలక్రోడ తామ్రస్తమాంసి. అత్రానుక్తో ఽపి సూర్య ఉదయతీతి పద్మ ముద్రాభంజకత్వాదినా ప్రతీయతే. బౌద్ధదర్శ విద్వేషిణ ఇహ ప్రవృత్తిర్న స్యాదిత్యతో ఽత్ర బుద్ధపదోపాదానం న కృతాం కవినా. రూపకం చ కావ్యాలంకారః. తదుక్తం దండినా 'ఉపమైవ తిరోభూతభేదా రూపకముచ్యతే, యథా బాహులతా పాణిపద్మం చరణపల్లవ' ఇతి.

అవ___ ఇష్టదేవతాయై నమస్కృత్య ప్రేక్షావత్ప్ర వృత్తయే చికీర్షి గ్రన్థస్య నామ్నా సహ ప్రయోజనమాహః___

అర్థము. ఇష్టదేవతకు నమస్కరించి చదివెడివారికి రుచి గలుగుటకై తాను జెప్పెడి గ్రంథమునకు పేరును ప్రయోజనమును జెప్పుచున్నాడుః–

**సమాహృత్యాన్య తం త్రాణి సంక్షిప్తైః ప్రతిసంస్కృతైః,**
**సంపూర్ణ ముచ్యతే వర్గైర్నామ లిఙ్గాను శాసనమ్,** 2

అన్యతంత్రాణి = వరరుచివాగురివానాదికృతాన్ త్రికౌణ్డ్యు త్పలినీ ప్రభృతీన్ గ్రన్థాన్; సమాహృత్య, సంక్షిప్తైః పరిహృతానావశ్యకైః ప్రతిసంస్కృతైః ఏకార్థవాచి పర్యాయపదైః, వర్గైః = పరస్పరసంబన్ధి పర్యాయపద సమూహైశ్చ, సంపూర్ణం, నామలింగానుశాసనం = నామలింగానుశాసనాఖ్యో గ్రన్థ ఉచ్యతే. ఉత్పలిన్యాదీనా మసంక్షిప్తత్వాత్, నామమాలాదీనాం లింగహైన్యాత్, అమరమాలాదీనా మసంపూర్ణ త్వాత్. అన్యేషాం కేషాం చిద్వర్గహైన్యాచ్చ సర్వగుణసంపత్త్యా సర్వోత్కృష్టత్వా దస్మిన్నేవ గ్రన్థే ప్రేక్షావతాం ప్రవృత్తిరితి ప్రయోజనం సూచితమ్.

అర్థము. అన్యతంత్రాణి. వరరుచివాగురి వామనాదులు రచించిన త్రికాండి ఉత్పలిని మొదలైన గ్రంథములను, సమాహృత్య = సంగ్రహించి, సంక్షిప్తైః = సంక్షేపింపబడిన, ప్రతిసంస్కృతైః = పర్యాయపదములచేతను లింగ నిర్ణ యాదుల చేతను శోధింపబడిన, వర్గైః= తమలో సంబంధము గల పర్యాయ పదముల యొక్క సమూహములచేత, సంపూర్ణం=నిండియున్న, నామలిఙ్గానుశాసనమ్ = నామలింగానుశాసన మనెడు గ్రంథము, ఉచ్యతే = చెప్పబడుచున్నది. అసారవర్జనాద్వర్గాః, *వృజీవర్జనే. అసారములను వర్జించుటవలన వర్గ లనంబడును. నమ్యతే అభిధీయతే ఉర్థో ఉనేనేతి నామ *ణముప్రహ్వత్వే శబ్దే. అర్థము దీనిచేత జెప్పబడును గనుక నామము. లింగ్యంతే వ్యజ్యంతే జీప్ టాబాదిభిః స్త్ర్యాదయో యేన తల్లింగం *లిగి గతౌ. దీనిచే స్త్రీత్వాదులు జీప్టాబాది ప్రత్యయముల వలన నెఱిగింపబడును గనుక లింగము. అనుశాస్యతే అనే నేతి అనుశాసనం *శాసు అనుశిష్టౌ. ఏతయో రనుశాసనం నామలింగాను శాసనమ్. ఈ నామలింగములు దీనిచేత శిక్షింపబడును గనుక నామ లింగానుశాసనము. ఉత్పలిన్యాదులు సంక్షిప్తములు కాకపోవుట వలనను, నామమాలాదులు లింగాది విహీనము లౌటవలనను, అమరమాలాదులు అసంపూర్ణము లౌటవలనను, గోలోమ్యాదులు వర్గువులు లేని వౌటవలనను ఈ గ్రంథము సంక్షేపింపబడి ప్రతిసంస్కృతములైన వర్గువులు గలిగి సంపూర్ణమై సర్వగుణ సంపద్యుక్తమై యుండుటవలనను నిది

యన్నిటికంటె నుత్కృష్టమైనది గాన దీనియందు బుద్ధిమంతులకు ప్రవృత్తిగలుగునని ప్రయోజనము చెప్పఁబడెను.

టీ. ఇదానీ మభిధిత్సిత ముపన్యస్యతి సమహృత్యేత్యాది. నామ లింగానుశాసనముచ్యతే, *ణము ప్రహ్వత్వే శబ్దే ఇత్యస్మాత్ నమ్యతే అభిధీయతేనేనేతి నామ లింగ్యతే టాబాదిభిర్వ్యజ్యత ఇతి లింగం స్త్రీ పున్నపుంసకం –తయో రనుశాసనం శాస్త్రం – అనుశిష్యతేఽ నేనేతికరణ వ్యుత్పత్త్యా –స్వకపోల రచితత్వవ్యుదాసాయ సమాహృత్యాన్య తంత్రాణీత్యుక్తం. అన్యతంత్రాణి – వ్యాడివరరుచి ప్రభృతీనాం, సమాహృత్య ఏకీకృత్య, అతఏవ సంపూర్ణమిదం – యత స్త్రీకాణ్డ్యుత్పలిన్యాదీని నామతంత్రాణి – వ్యాడివరరుచిప్రణీతానితు లింగమాత్రతంత్రాణి. వర్గై రితి ఇత్థం భూతలక్షణే తృతీయా– వర్గైర్లక్షిత మిత్యర్థః – ప్రకరణం వర్గః ప్రకరణబద్ధం చ సుఖగ్రాహ్యం భవతి వర్గానేవ విశినష్టి– సంక్షిప్తైః ప్రతి సంస్కృతైరితి స్తోకేన భూయో ఽభిధానం–సంక్షేపః. సూక్తి రచనా–ప్రతిసంస్కార. అథవా హరిప్రియావత్ ప్రతి సంస్కారః అయమర్థః –హరి రితి విష్ణోర్నామమాత్ర నోక్తం తదనుశ్రీపర్యాయే హరిప్రియేత్యుక్తం. తేన హరిరప్యస్య నామేత్యుక్తం భవతి.

అవ.____ నను ప్రతిపదం లింగభేదోక్త్యా న సంక్షేపః అనుక్త్యాన సంపూర్ణః– ఇత్యా శంకాయాం తత్పరిహారార్థం త్రిభిః శ్లోకైర్యథై తదుపపద్యతే తథోచ్యతే సంజ్ఞయేత్యాహ. ____

అర్థము. ఓయీ నామములకు లింగ నిర్ణయము సెప్పునపుడు ప్రతి పదమునకు లింగ నిర్ణయము చేసిన సంక్షేపము గాదు. చేయకుండిన గ్రంథము సంపూర్ణముగాదు అని శంకరాఁగా, తత్పరిహారార్థమై మూడు శ్లోకములచేత నీ గ్రంథమందు జెప్పెడి గుఱుతులను సంజ్ఞా రూపమున దెలుపుచున్నాడు:____

**ప్రాయశో రూప భేదేన సాహచర్యాచ్చ కుత్రచిత్**
**స్త్రీ పున్నపుంసకం జ్ఞేయం తద్విశేష విధేః క్వచిత్,** 3

ప్రాయశ ఇతి – ప్రాయశః = ప్రాయేణ, రూపభేదేన = పదానాంవిసర్గ స్త్రీ ప్రత్యయతద భావరూపభేదేన, స్త్రీపున్నపుంసకం, జ్ఞేయమిత్య స్వయః కుత్రచిత్ రూపభేదేన అజ్ఞేయ లింగస్థలే సాహచర్యాత్ – జ్ఞాత

లింగపదసాహచర్యాత్, పూర్వవత్ జ్ఞేయమిత్యర్థంః. క్వచిత్ రూపభేద సాహచర్యాభ్యాం జ్ఞేయ లింగస్థలే. తద్విశేషవిధేః తత్తల్లిఙ్గత్రయవిశేష విధేః స్త్రియాం, పుంసి, నపుంసకే, ఇతి విధేరిత్యర్థః. పూర్వవత్ జ్ఞేయమిత్యనేనాన్వయః రూపభేదశ్చత్రేధా - నామ్నాం నామని శేషణానాం నామపరామర్శి సర్వనామ శబ్దానాం చేతి. 'కౌమోదకీ గదా ఖడ్గో నందక' ఇత్యత్ర తత్తన్నామాం రూపభేదేనైవ తత్తల్లింగ నిర్ణయః.'గండకపోలౌ తత్పరా హను' రిత్యత్ర హనుపద విశేషణీ భూతతత్పరాపద స్త్రీలిఙ్గ రూపభేదేన హనుశబ్దస్య స్త్రీలిఙ్గతా నిర్ణయః 'కుతూఃకృత్తిః స్నేహపాత్రంసై వాల్పాకుతుపః పుమా' నిత్యత్ర నేతినామ పరామర్శి సర్వనామ శబ్దరూపభేదేన కుతూశబ్దస్య స్త్రీలిఙ్గతా నిర్ణయః 'అశ్వయుగశ్వినీ' 'భానుః కరః' వియద్విష్ణుపద' మిత్యత్ర అశ్వయుగ్భాను వియచ్ఛబ్దాదీ నాం సందిగ్ధ లిఙ్గత్వాద్రూప భేద జ్ఞాపిత లిఙ్గాశ్వనీకర విష్ణుపదసాహచర్యాత్తత్తల్లిఙ్గ నిర్ణయః విశేషవిధి శ్చతుర్ష్వస్థలేషు. రూపభేదేన లిఙ్గాజ్ఞానస్థలే, సాహచర్యేణ లిఙ్గాజ్ఞానే, తేనభిన్న లిఙ్గతాజ్ఞానే, బహులిఙ్గతాజ్ఞాపనేచ 'వల్లరీ మంజరీ స్త్రియా' విత్యత్ర ఇన్నంతత్వేన సంశయే రూపభేదేన స్త్రీత్వా నిర్ణయాత్ స్త్రియామితి విశేషవిధిః. ద్వితీయే 'స్త్రియః సుమనసః పుష్ప' మిత్యత్ర పుష్పపద సాహచర్యాత్సుమనస ఇత్యత్ర న స్త్రీలిఙ్గతా నిర్ణయః తదర్థం స్త్రియ ఇతి విశేషవిధిః తృతీయే 'ఖనిః స్త్రి యా మాకరః స్యాదిత్యత్ర ఆకరశబ్దసాహచర్యేణ ఖనిశబ్దస్య పుంలిఙ్గతాజ్ఞానే తదపవాదత్వేన స్త్రియా మితి విశేషవిధిః. చతుర్థే - విటంకంపున్నపుంసకం' 'తటం త్రిషు' 'అశనిర్ద్వయోః' ఇత్యాదిషు అనే కలిఙ్గతాజ్ఞాపనార్థం విశేషవిధిః. యద్యపిరేణురిత్యత్ర రూపభేదేన నిర్ణయ ఏవ తథాపి ద్వయోరిత్యే కలిఙ్గతా జ్ఞాన నివృత్యర్థం విశేషవిధిః.

అర్థము. ప్రాయశః = తఱుచుగా, రూపభేదేన = శబ్దములయొక్క స్త్రీ ప్రత్యయాదులు మొదలైన రూపభేదములచేత స్త్రీపున్నపుంసకం= స్త్రీలింగ పుంలింగ నపుంసకలింగములు, జ్ఞేయం = తెలియదగును. కుత్రచిత్ = ఒకానొకదిక్కున, సాహచర్యాత్ = ఎఱుగబడిన లింగము. గల పదము యొక్క సాన్నిధ్యము వలన లింగము తెలియఁదగినది. క్వచిత్ = (ఎక్కడ రూప భేద సాహచర్యముల వలన లింగము దెలియబడదో) అక్కడ,

తద్విశేషవిధేః తత్ = ఆమూడు లింగముల యొక్క, విశేషవిధేః = ఇది యాలింగ మని చెప్పుటవలన లింగము తెలియదగినది. రూపభేదము త్రివిధము. 1. నామరూపభేదము 2. నామవిశేషణ రూపభేదము, 3. నామపరామర్శి సర్వనామరూపభేదము అని. 1. నామరూపభేద మెట్లనిన 'కౌమోదకీ గదా' 'ఖడ్గో నందః' అనుచోట ఆయానమముల 'కాయా రూప భేదములచేత లింగ మెఱుఁ గఁబడుచున్నది. 2. నామవిశేషణ రూపభేద మెట్లనిన 'గండకపోలౌ తత్పరాహనుః అనుచోట–హనుశబ్దమునకు విశేషణమైన 'తత్పరా' అనెడు శబ్దముయొక్క స్త్రీలింగ రూపముచేత హను శబ్దము స్త్రీలింగమని తెలియబడుచున్నది. 3. నామ పరామర్శి సర్వనామరూపభేద మెట్లనిన 'కుతూఃకృత్తి స్నేహపాత్రం సై వాల్పా కుతుపః పుమాన్' అనుచోట 'సైవ' అనెడి నామపరామర్శి సర్వనామశబ్దముచేత 'కుతూః' అనెడు శబ్దము స్త్రీలింగమని యెఱుగబడుచున్నది. 'అశ్వయుగశ్వినీ' 'భానుః కరః' 'వియద్విష్ణుపదం' ఇచ్చుట అశ్వయుగ్భాను వియచ్ఛబ్దములు మూడు లింగములలో నొక విధముగా నుండును గనుక రూప భేదముచేత లింగ మెఱుంగరాదు. అశ్వినీ కర విష్ణుపద శబ్దముల సాహచర్యమున నాయాలింగములని తెలియదగినది. విశేషవిధి నాల్గువిధములు గలది. 1. రూపముచేత లింగ మెఱుగరాని దిక్కున జెప్పునదియు, 2. సాహచర్యమున దెలియరాని దిక్కున దెలుపునదియు, 3. సాహచర్య లింగాపవాదకంబును, 4. అనేక లింగ విధాయకంబును అని. 1, రూపముచే లింగ మెఱుఁగ రాని దిక్కున నెట్లనిన 'వల్లరీ మంజరీస్త్రియౌ' అనుచోట వల్లరీ మంజరీశబ్దములు నకారాంతంబు లని సంశయము తోచుచున్నది. కనక 'స్త్రియౌ' అనెడి విశేషవిధిచేత దెలియజెప్పబడెను. 2,సాహచర్యము వలనఁ దెలియరాని దిక్కునఁ జెప్పెడి విశేష విధి యెట్లనిన 'స్త్రియః సుమనసః పుష్పః' ఇక్కడ సుమన శబ్దమునకు పుష్ప ద సాహచర్యము వలన లింగ మెఱుగరాదు. కనుక,' స్త్రియః' అనెడు విశేషవిధిచేత జెప్పబడెను. 3.సాహచర్యలింగాప వాదకమయిన విశేషవిధి యెట్లనినః 'ఖనిః స్త్రియామాకరః స్యాత్' ఇక్కడ ఆకర శబ్ద సాహచర్యము లన ఖని శబ్దము పుల్లింగము గాగా దాని నపవాదించి

'స్త్రియాం' అని విశేషవిధి చెప్పబడెను. అనేక లింగవిధి యెట్లనిన___ 'విటంకం వున్న పుంసకం' ఇక్కడ విటంకశబ్దము వున్న పుంసకలింగముల యందు విధించుటవలన అనేకలింగవిధి.

అవ.___ నను రూపభేదేన లిఙ్గనిర్ణయ ఇత్యుక్తం తదయుక్తం. సమాహారద్వంద్వే నానాలిఙ్గానామపి పదానాం సమాసాన్తే నపుంసక లిఙ్గతావశ్యంభావాత్, సమాస్తాన్తర్గతానాం పదానాం లిఙ్గా నిర్ణయాత్ ఇతరేతరద్వన్ద్వేచ 'పరవల్లింగం ద్వంద్వతత్పురుషయో, రితిపరలింగేన సమాసాన్తర్గత పూర్వపదలింగానామశ్రవణాత్, భిన్న లింగానామపి ఇతరేతర ద్వన్ద్వసద్భావాత్, పూర్వవదశ్వ బడబావితి విశేషవిధినా పరలింగ ప్రతిషేధే నోత్తరపదలింగా నిర్ణయాత్, 'మాతా చ పితా చ పితరా' వితి ద్వంద్వైకశేషలుప్తమాతృ శబ్దాదీనాం లింగా నిర్ణయాచ్చేత్యాశం కాయాం తత్పరిహారార్థ మాహః ___

అర్థము. ఏదైన నొక లింగ నిర్ణయము రూపభేదముచే దెలియవలయు ననిన నది సమాసావయవములకు గూడదు. అది యెట్లనిన, సమాహార ద్వంద్వమందు ఏలింగమైనను కడపట నపుంసకము గావలయు గనుకను ఇతరేతర ద్వంద్వసమాసమందును 'పరవల్లింగం ద్వంద్వతత్పురుషయోః' అని పరశబ్దలింగమువలె సమాసాంతర్గతపదముల కెల్ల లింగ మెఱుగవచ్చునన్నను భిన్నలింగములకు సమాసము గలదు గనుకను, పూర్వవ దశ్వబడబౌ అను నివి మొదలైనవి శేషవిధులచేత పరలింగమునకుఁ బ్రతిషేధ మున్నది గనుకను, 'మాతాపితరౌ' అను నివి మొదలైన ద్వంద్వైకశేషములలో లుప్తమైన మాతృశబ్దము మొదలైన శబ్దములకు లింగము దెలియరాదు గనుకను, ఇట్టిశంకలు రాఁగా వానిం బరిహరింపుచున్నాడు.

**భేదాఖ్యానాయ న ద్వన్ద్వోనైక శేషో న సఙ్కరః,**
**కృతో ఽత్రభిన్న లిఙ్గానామనుక్తానాం క్రమాదృతే.** 4

భేదాఖ్యానాయేతి – అత్ర భేదాఖ్యానాయ అనుక్తానాం భిన్న లిఙ్గానాం ద్వన్ద్వ ఏకశేషశ్చ న కృతః క్రమా దృతే సంకరశ్చ న కృత ఇత్య న్వయః అత్ర శాస్త్రే భిన్నలిఙ్గానాం శబ్దానాం సమాహారేతరేతర యోగద్వన్ద్వో వా ఏక శేషశ్చ వాన క్రియతే కిన్త్వ భిన్నలిఙ్గానా

మేవ, భిన్నలిఙ్గానాం తేన భేద జ్ఞాపనాసంభవా ద్భేదాఖ్యానాయ న తే షాం తత్సమాస ఇతి భావః. యథా 'ద్యోదివౌ ద్వే' 'స్వర్గనాకత్రి దివత్రిదశాలయాః' 'జనుర్జననజన్మా' నీత్యాదిష్వ భిన్న లింగా నామేవ ద్వంద్వః 'నాసత్యావశ్వినౌ దస్రౌ' 'జీమూతౌ మేఘపర్వతౌ' ఇత్యాత్ర అభిన్నలిఙ్గానామేవైకశేషః నను భిన్నలిఙ్గానామపి 'అప్సరోయక్ష రక్షో గన్ధర్వ కిన్న రాః'ఇత్యాదిషు ద్వన్ద్వో దృష్ట ఇత్యత్రాహ. ___'భిన్న లిఙ్గానామనుక్తానా' మితి. అన్యత్రోక్త్యా ప్రసిద్ధలింగానాం తు ద్వం ద్వః క్రియత ఏవ. కృతే ఽపి న దోష ఇతి భావః 'స్త్రియాం బహుష్వప్సరసః' 'యక్షైకపింగైలబిల' 'యాతురక్షసీ' ఇత్యాదిషు తేషాముక్తలిఙ్గాత్వాన్న బాధక మితి భావః 'మాతాపితరౌ పితరౌ' 'శ్వశ్రూశ్వశురౌ శ్వశురౌ' ఇత్యేక శేషే ఽపి జనయిత్రీ ప్రసూర్మాతేత్యాదిభి రుక్తలింగత్వాన్నోక్తదోషః. నను భిన్నలిఙ్గానాం సమాసే వా కాణ్డేవా వర్గేవా సాఙ్కర్యమయుక్తమ్. తథాసతి తదర్థం విశేషవిధి భిర్గ్రంథగౌరవం వం స్యాత్. నేష్టాపత్తిః సంక్షేప ప్రతిజ్ఞావిరోధాత్ రత్నాకోశాదిష్వివ ఏకైకలిఙ్గతయా కాణ్డ త్రయోక్తౌలాఘవమస్తి. ఏక హేళికయా లిఙ్గజ్ఞాన సౌకర్యాదిత్యత్రాహ.___ క్రమాదృతే సంకరో న కృత ఇతి. స్వర్వ్యోమ దిక్కాలాదీనాం తత్తన్నాంమకవర్గైః ప్రతిపాద్యతయా క్రమేణ తత్త ద్వస్తువాచక పర్యాయపదానాం తత్తద్వస్తుసంబంధ ప్రతిపాదకపర్యాయ పదానాం చ ప్రతిపాద్యతావశ్యంభావేచ స్వర్గాదిపర్యాయే ద్యోదివాది పదానాం హరిహరనామ నిరూపణావసరే తత్సంబధి లక్ష్మీ గౌర్యాదీనాం పర్యాయనామభిః ప్రతిపాదనస్యావశ్యకతయా లిఙ్గసాఙ్కర్యస్యా పరిహార్యత్వాత్. అన్యథా తత్తన్నామ్నాం పరిజ్ఞానం నస్యాత్. అతః క్రమేణ తత్తద్వర్గేత త్తద్వస్తూనాం తత్తత్సంబంధినాం ప్రతిపాదనం సాఙ్కర్యేణ వినా నోపపద్యత ఇతి క్రమాదృతే సఙ్కరో నకృత ఇత్యుక్తం. గ్రన్థాన్తరేషు భిన్నలిఙ్గానా మేకార్థవాచక పర్యాయపదానాం స్థలాంతరే నిర్మాపణేన ఏకత్రైవ–సర్వపర్యాయపదైరనాయానేన తత్తద్వస్తుజ్ఞానం న స్యాత్. తతః సాఙ్కర్యా న్నహి దోషః సాఙ్కర్యే క్రమస్య హే తుత్వాత్. తస్య చాభిమతత్వాత్. కించ సాఙ్కర్యే ఽపి క్రమేణైవ. సాఙ్కర్యం సుఖపరిజ్ఞానాయ. 'ముత్ప్రీ తిః ప్రమదో హర్ష' ఇత్యా

దిషు ఏకార్థవాచకత్వే ఽపి ముత్ప్రీతిశబ్దయోః స్త్రీలిఙ్గయోరేకత్ర క్రమేణ నిరూపణానంతరం పుంలిఙ్గయోః ప్రమదహర్షపదయో రనంతరం క్రమేణ నిరూపణం. అన్యథా హర్షో ముత్ప్ర మదః ప్రీతిరిత్యపి వక్తుం శక్యత్వాత్, అతః క్రమాదృతే క్రమేణ వినా సాఙ్కర్యం నోచ్యత ఇతి నిష్కృష్టార్థః.

అత్ర = ఈగ్రంథమందు, భిన్న లింగానాం = తమలోతాము భిన్నలింగము లైన శబ్దములయొక్క, భేదాఖ్యానాయ = లింగ భేదములు జెప్పుట కొఱకు, ద్వంద్వః = ద్వంద్వసమాసమును, ఏకశేషశ్చ = ఏక శేషసమాసమును, న కృతః = చేయబడలేదు. అభ్నిలింగములకైనచో ద్వంద్వైక శేషములు సేయబడును అది యెట్లనిన 'ద్యోదివౌద్వేస్త్రియాం' 'స్వర్గ నాకాత్రి దివత్రిదశాలయాః' 'జనుర్జనన జన్మాని' ఇవి మొదలైన స్థలముల యందు ద్వంద సమాసము 'నాసత్యావశ్వినౌ' 'జీమూతౌ మేఘపర్వతౌ' ఇవి మొదలైన దిక్కులనేక శేష సమాసమును. ఓయీ భిన్న లింగములకును ద్వంద్వైకశేషములు సేయఁబడెనే అదెట్లనిన, 'విద్యాధరో ఽ ప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాః' ఇవి మొదలైన దిక్కులయందు ద్వంద్వంబును, 'శ్వశ్రూశ్వశూరరౌ శ్వశూరౌ' ఇవి మొదలైన దిక్కులందు నేక శేషంబును జెప్పఁ బడి యున్న వని శంక గలుగఁగా తత్పరిహారార్థమై 'అనుక్తానాం' అను విశేషణము చెప్పఁబడినది. స్థలాంతరమందు లింగము చెప్పఁబడని శబ్దములకే ద్వంద్వైకశేషములు సేయఁబడవు. స్త్రియాం బహుష్వప్సరస' 'యక్షైకపింగైలబిలశ్రీద పుణ్య జనేశ్వరాః' ఇవి మొదలైన స్థలములయందు లింగము చెప్పబడిన అప్సరోయక్షాది శబ్దములకును, 'శ్వశ్రూశ్వశురౌ' ఈ మొదలగు శబ్దములకును ద్వంద్వైకశేషము సేయవచ్చును. ఓయి భిన్న లింగములైన శబ్దములకు శంకసేయ నేల ? శంక చేసినను విశేషవిధులు మొదలైన సంజ్ఞలచేత గ్రంథ గౌరవము గలుగును. అర్థము దెలిసికొనుటకు గష్టము గనుక రత్నకోశాదులవలె 'స్త్రీ లింగ పుంలింగ నపుంసకలింగ కాండములు ప్రత్యేకములుగా నొనర్చిన నీ ప్రయాసము లేదని శంక కలుగఁగా తత్పరిహారార్థమై చెప్పుచున్నాడు. 'క్రమాదృతే సంకరో నకృతః' అని. క్రమాదృతే = ప్రస్తావము లేక, సంకరః = సంకరసమాసము, న కృతః= చేయబడదు. ప్రస్తా

వము గలిగిన యెడల సంకరము సేయcబడును. ఈగ్రంథమునందు స్వర్వ్యోమ దిక్కాలాదులైన వర్గలయందు నయ్యైసంబంధి వస్తువులును నయ్యై వస్తువులకుc గల పర్యాయపదము లన్నియు నాప్రస్తావముల యందే చెప్పవలయు. అదియేమి యనిన, ఆయాప్రస్తావమున నొక్కొక్క దిక్కుననే యన్ని పేళ్లు దెలియుటకై స్వర్గాది పర్యాయములయందు ద్యో దివాదిశబ్దములును హరిహర ప్రస్తావమునందు లక్ష్మీగౌర్యాది నామములును జెప్పుటయుc గాన లింగ సాఙ్కర్యము గలిగెను. క్రమము లేని సంకరము సేయcబడదు. క్రమముగల చోటునను యథాసంభవముగా నాయాస్థలములయందు సంకరము లేక త్రిలింగములు చెప్పc బడెను. అది యెట్లనిన 'ముత్ప్రీతిః ప్రమదోహర్షః ప్రమోదామోదా సమ్మదాః, స్యాదానంద థురానందః శర్మాశాతసుఖాని చ' ఈ మొదలైన తావులయందు నేయేలింగము లాయాప్రస్తావములయందే చెప్పcబడెగాని గణపాఠమువలె నీవల నావలc జెప్పcపడలేదు. రత్నకోశాదులయందును పుంలింగాది క్రమంబున కాండము చెప్పెదనని ప్రతిజ్ఞ సేసినను 'స్వర్గస్త్రీదివస్త్రీవిష్టపంక్లీ బే' అని రత్నకోశమందును, 'క్లీబేత్రివిష్టపం స్వర్గ స్త్రీదివశ్చ సురాలయుకః' యమరిమాలయందును, ఆయాస్థలములయందే తఱచుగా సంకరము కానc బడుచున్నది. కావున ప్రసంగమున వచ్చిన సంకరమును పరిహరింపరాదు గనుక, స్వర్వ్యోమదిక్కాలాది వర్గక్రమముననే స్త్రీలింగాదులc జెప్పునది సుకరము. రత్నకోశాదులవలె ప్రతికాండము పర్యాయపాఠమైనc దెలియునది కష్టము.

అవ. నను సాఙ్కర్యే తత్తల్లింగ జ్ఞానాయతత్తద్విశేష విధ్యవశ్యం భావే గ్రంథగౌరవ మపరిహార్యం స్యాదిత్యాశంక్య లఘుభిస్సంజ్ఞా విశేషైః విశేషవిధౌ గ్రంథగౌరవం నా స్తీత్యభిప్రేత్యాహ.___

అర్థము. విశేష విధులయందును 'స్త్రీపున్నపుంసకం' అని చెప్పిన నధిక మగును గనుక వ్యవహార లాఘవార్థమై కొన్ని సంజ్ఞలను జేయుచున్నాcడు.

**త్రిలిఙ్గ్యాం త్రిష్వితి పదం మిథునే తుద్వయోరితి,**
**నిషిద్ధలిఙ్గం శేషార్థం త్వంతాథాదిన పూర్వభాక్** 5

త్రిలిఙ్గ్యామితి.___ త్రయాణాం లిఙ్గానాం సమాహార స్త్రి లిఙ్గీతస్యాం జ్ఞాప్యాయాం 'త్రిషు' ఇతి పదం ప్రయుజ్యతే యథా 'తటంత్రిషు' ఇతి

మిథునశబ్దః స్త్రీపుంలింగపరః. తజ్జ్ఞాపనే ద్వయోరితి పదం ప్రయుజ్యతే. యథా 'అశనిర్ద్వయో' రితి. యద్యపి ద్విత్రిశబ్దయోః సామాన్యతః సఙ్ఖ్యేయవాచకత్వం తథాప్యస్మిన్ శాస్త్రే లింగ విశేషవాచకత్వేన సంజ్ఞావిధానాత్తాభ్యాం లింగభేద నిర్ణయోయుక్తః. సఙ్ఖ్యేయ వస్తు సఙ్ఖ్యా వాచకతావివక్షాయాం సఙ్ఖ్యాపరత్వమేవన లింగపరత్వం యథా. 'అర్థరాత్ర నిశీథైద్వా' వితి. నిషిద్ధం లిఙ్గం యస్య తత్పదం నిషిద్ధలిఙ్గం శేషార్థం శేషయోర్నిషిద్ధేతరయోః లింగయోరర్థః ప్రయోజనం ప్రయోగ రూపం యస్యతదిత్యర్థ'. యద్వా నిషిద్ధం చ తల్లిఙ్గం చేతి కర్మధారయః శేషార్థం ఇతరలింగార్థం తథా చ ఏకస్మిన్ శబ్దే ఏకలిఙ్గ నిషేధస్తదితరలిఙ్గసద్భావార్థ ఇతి భావః త్వన్తాథాదీతి____ తుశబ్దో ఉ ంతే యస్య తత్త్వన్తం అథ శబ్ద ఆదిర్యస్యతదథాది త్వన్తంచ అథాది చత్వన్తాథాది పది మితి శేషః న పూర్వేభాక్ నపూర్వణ గ్రంథేన సంబధ్యత ఇత్యర్థః త్వన్తం లిఙ్గవాచకపదంచే దుత్తరపద లిఙ్గజ్ఞాపకం, యథా 'అన్తర్ధావ్య వధాపుంసి త్వన్తర్ధి' రిత్యత్ర పుంసిత్వి తిత్వన్తం అన్తర్థిపదలిఙ్గవిధాయకం. 'శోభా కాన్తిర్ద్యుతి శ్ఛవిః' 'అవశ్యాయస్తు నీహార' ఇత్యత్ర అవశ్యాయశబ్దస్య నీహారపదసంబంధిత్వేన తత్పర్యాయతా; న పూర్వ పదపర్యాయత్వం. 'ఏతస్య కలికా గంధఫలీ స్యాదథ కేసరే' ఇత్యత్ర అథాదిః కేసరశబ్దః స్వార్థమేవ వకుళవఞ్జుళ శబ్దయోరతిదిశతి, న గంధఫల్యాదేః. త్వన్తనామపదస్య కశ్చిదన్యో ఉ స్తి విశేషః 'దారాస్యాత్తు కుటుంబి' నీత్యత్ర, త్వన్తం 'స్యా' దితి క్రియాపదం నతు దారా ఇతి పదం. తథాపి అన్వయేన త్వన్తం' సత్ దారా ఇతి పదం కుటుంబినీ స్యాదిత్యుత్తరేణ సంబద్ధం సత్ పత్నీవాచక మజని. 'దినాహనీ వాతు క్లీబే దివస వాసరా' విత్యత్ర వాత్వితి త్వన్తం క్లీ బవిశిష్టం సత్ దివసవారయోరేవ లింగ వికల్పబోధకం, న దినాహ్నోః 'అనుక్రోశో ఉ ప్యథో హసః' 'పోతాధానమథో ఝుషా' ఇత్యాదిష్వథశబ్దపర్యాయాధో శబ్దాదేరపి శబ్దస్య పూర్వేణాన్వయః. 'పుంస్యేవాందుః ప్రహిః కూప ఉదపానం తు పుంసి' వేత్యత్రతు శబ్దః నపూర్వపదపర్యాయతా ముదపానపదస్య నిషేధతి తదర్థకత్వాత్. కింతు పుంసి వేత్యుత్తరేణాన్వితం సత్ పుంలింగతాభావ వైషమ్యమేవ బోధ

యతి. తచ్చ రూపభేదేనైవ సిద్ధ్యతి. పుంస్యేవేతి నియమ ఏవ వ్యావర్తతే. యథా కథంచిదుత్తరేణైవాన్వయ ఇతిన ప్రతిజ్ఞావిరోధః ఏవం లఘుసంజ్ఞయైవ లింగజ్ఞానాత్సాఙ్కర్యే ఽపి న గ్రంథగౌరవ మితిభావః.

అర్థము. త్రిలింగ్యాం = మూఁడులింగములయందు నని చెప్పఁదగిన దిక్కున, 'త్రిషు' అని చెప్పఁబడును. అది యెట్లనిన ___'తటం త్రిషు' స్త్రీపుంలింగములను 'మిథున' మని చెప్పదురు. ఆ మిథున మని చెప్పవలసిన దిక్కున 'ద్వయోః' అని చెప్పబడును. అది యెట్లన్నను___ 'అశనిర్ద్వయోః' ద్విత్రిశబ్దములు సామాన్యముగా సంఖ్యేయవాచకములు గాని స్త్రీలింగపుంలింగాది విశేషవాచకములు గావు. అయినను ఈ గ్రంథమందు లింగ వాచకములుగానే సంజ్ఞలు చేసినాఁడు గనుక ద్విత్రిశబ్దములు లింగవాచకములని తెలియునది. ఈ ప్రకారమే యీ గ్రంథమందెల్ల సంజ్ఞలు అక్కడక్కడఁ జెప్పఁదగిన వస్తువులఁ జెప్పిన దిక్కున ద్విత్రి శబ్దములు లింగపరములుగావు. అది యెట్లనిన 'అర్ధరాత్ర నిశీథౌ ద్వౌ అనెడు దిక్కున ద్విశబ్దము అర్ధరాత్రనిశీథశబ్దములకు విశేషణమైయున్నది గనుక లింగవాచకముగాదు. నిషిద్ధలింగం = నిషేధింపఁబడిన లింగపదము, శేషార్థం = నిషేధింపఁబడని కడమలింగముల యందుఁ గలదని చెప్పఁబడును. అది యెట్లనిన 'ద్వీపో ఽస్త్రియా మంతరీపం' ఇక్కడ 'అస్త్రియా మని స్త్రీ లింగమును మాత్రము నిషేధించినందున పున్న పుంసకలింగము లౌనని చెప్పబడుచున్నది గనుక గ్రంథలాఘవము. ఇఁకను సులభముగా నర్థము దెలియుటకొఱకు సంజ్ఞలఁ జేయుచున్నాఁడు. 'త్వంతాథాది న పూర్వభాక్' త్వంతాథాది = తుశబ్దము అంత ముందుఁ గల శబ్దమును, అథశబ్దము = ఆదియందుఁ గల శబ్దమును, న పూర్వభాక్ = పూర్వపదముతో సంబంధింపదు. ఆ పూర్వపరముతో సంబంధింపని పదములు మూడుఁవిధములు, నామపదమును, లింగపదమును, అర్థపదమును. అందు నామపద మెట్లనిన: 'శోభా కాంతిర్ద్యుశ్ఛవిః అవశ్యాయస్తు నీహారః' ఇక్కడ తుశబ్దము అంతమందుఁగల అవశ్యాయపదము తన నామమునే చెప్పును గాని శోభాది పదములను జెప్పదు. లింగపదమెట్లనిన 'అంతర్ధావ్యవధాపుంసి త్వంతర్ధిః' ఇక్కడ 'పుంసితు' అనెడు త్వంతమైన లింగపదము అంతర్ధిశబ్దమునే చెప్పును

గాని అంతర్ధావ్యవధా శబ్దములను జెప్పదు. అర్థపద మెట్లన్నను, 'శాపే త్వభిషంగః' ఇక్కడ త్వన్తమైన శాపశబ్దము అభిషంగ శబ్దమునకు అర్థము గాని ప్లవగ శబ్దమునకు అర్థము గాదు. అథాదియైన నామపద మెట్లనిన 'ప్రాలేయం మిహికాచాథ హిమానీ హిమసంహతిః' ఇక్కడ అథాదియైన హిమానీశబ్దము హిమసంహతినే చెప్పును గాని ప్రాలేయమిహికా శబ్దములను జెప్పదు. అథాదియైన లింగ పదమెట్లనిన 'భార్యా జాయాథా పుంభూమ్ని దారాః' ఇక్కడ అథాదియైన పుంభూమ్ని అనెడు లింగపదము దారశబ్దమునే చెప్పును గాని భార్యాజాయాశబ్దములను జెప్పదు. అథాదియైన అర్థపద మెట్లనిన, 'ఏతస్య కలికా గంధఫలీ స్యా దథ కేసరే వకుళో వంజుళః' ఇక్కడ అథాదియైన కేసర శబ్దము తన యర్థమును వకుళ వంజుళ శబ్దములకుఁ జెప్పునుగాని గంధఫలీశబ్దమునకుఁ జెప్పదు. త్వంతమైన నామశబ్దమునకు మఱియొక విశేషము గలదు. అది యెట్లనిన___ 'దారాః స్యాత్తు కుటుంబినీ' ఆను చోటున 'స్యాత్తు' అని క్రియాంతమం దుండెడు తు శబ్దము. ఆ క్రియాన్వితమైన దారశబ్దము నాకర్షింపుచున్నదై ఆదార శబ్దమునకు పూర్వపదముతోడి సంబంధమును జెప్పక ఉత్తరమైన కుటుంబినీ పదముతో సంబంధమును జెప్పుచున్నది; గనుక దారకుటుంబినీ శబ్దములు పత్నీ వాచకము లాయెను. త్వంతమైన లింగపదమున కింకొక విశేషము గలదు. ఏమనిన, 'ఘస్రో దినాహనీ వాతు క్లీబే దివసవాసరౌ' ఇక్కడ త్వంతమైన వాశబ్దము క్లీబ విశిష్టమగుచున్నదై దినాహన్శబ్దములను జెప్పక దివసవాసరములకే విథాయకమాయెను. అథశబ్ద పర్యాయమైన అథోశబ్ద మాదియందుఁ గల పదమును పూర్వపదముతోడ సంబంధింపదు. అది యెట్లనిన ___ 'అనుక్రోశో ఉప్యథో హాస', 'పోతాథానమథో ఝుషః' అనుచోట అథ శబ్దాదియైన శబ్దము పూర్వపదముతో సంబంధింపదు. 'పుంస్యేవాంధుః ప్రహిః కూప ఉదపానం తు పుంసి వా' అనెడు దిక్కున తుశబ్దము ఉదపానశబ్దమునకు పుంలింగత్వమును నిషేధించుచున్నది. అక్కడ ఉదపాన శబ్దమునకు రూపభేదముచేతనే పుంలింగ నిషేధము గలుగుచుండఁగా తు శబ్దము వ్యర్థమై 'సిద్ధే సత్యారంభో నియమార్థః' అనెడు న్యాయమువలన

నియమార్థమగుచున్నది. ఆ నియమమేమనిన, ఉదపానశబ్దము పూర్వపదముతోడ సంబంధింపదు. 'పుంసివా' అనెడు పదముతోడనే సంబంధించును. కూపశబ్దమన్ననో 'పుంస్యేవ' అనెడు పూర్వ నియమముతోడనే సంబంధించునుగాని 'పుంసివా' అనుదానితోడ సంబంధించదు అని యీ ప్రకారముగా నీ గ్రంథవ్యవహార మెఱుఁగుటకొఱకు సంజ్ఞలు చేయఁబడెను.

ఈ గ్రంథమునందు మూడుఁలోకములను జెప్పవలయును గనుక నందు సర్వశ్రేష్ఠము స్వర్గమౌటవలన మొదట స్వర్గము చెప్పఁబడెను. తర్వాత తదాశ్రితు లయిన దేవసామాన్యులును, గణదేవతలును, దేవతా విశేషములలో యథాశ్రేష్ఠముగా బ్రహ్మవిష్ణురుద్రేంద్రులును సపరివారముగాఁ జెప్పఁబడిరి. ఇంద్రుఁడు పూర్వదిక్పతిగాన నాపర్యాయముననే ఇంద్రాగ్నియమ నిర్రుతివరుణవాయుకుబేరులు చెప్పఁబడిరి. వారి పరివారపరికరములును జెప్పఁబడెను. ఆ వెనుక దిక్ప్రస్తావమున నాకాశమును, ఆకాశాధిపతియైన చంద్రుఁడును, నక్షత్ర గ్రహములను, గ్రహాధి పతియైన సూర్యుఁడును చెప్పఁబడిరి. సూర్యుఁడు కాలకర్త గనుక నా ప్రసంగమున ప్రత్యూషాదికాలము, ప్రళయకాలమును చెప్పఁబడెను. ఆ పిమ్మట మనుఋషి ప్రముఖులు సృష్టికి ధర్మాదులు కారణమనిరి గనుక నవియును జెప్పఁబడెను. పిదప తద్ జ్ఞానహేతువులైన బుద్ధ్యాదులను, బుద్ధిప్రస్తావమున విషయాదులును, ప్రస్తావమున వచ్చిన శబ్దాదులును, నృత్తగీతవాద్యాదులును, దిక్ప్రసంగమున నధోదిక్కైన పాతాళమును, తన్నివాసులైన నాగాదులును, పాతాళ సంబంధమైన సముద్రమును, జలమును, జలచరములైన మత్స్యాదులును, పద్మాదులును జెప్పఁబడెను. ఈరీతిగ స్వర్గపాతాళ లోకములను ప్రథమ కాండమునందుఁ జెప్పి ద్వితీయకాండమునందు సర్వాధారమైన భూమియును, తదాశ్రితములైన పురగ్రామ గృహశబరాలయాదులును, శబరాలయము గిరివనసంశ్రయము గనుక పర్వతవనాదులును, తత్సంబంధములైన యోషధ్యాదులును, తదాశ్రయములైన సింహవ్యాఘ్ర మృగపక్ష్యాదులును, సర్వ ప్రాణి ముఖ్యులైన మనుష్య సామాన్యులును, అందు వర్ణక్రమముగా బ్రహ్మక్షత్త్రియవైశ్య శూద్ర సంకరులును సపరికరముగాఁ జెప్పఁబడిరి. ఆ తర్వాత

నీ రెండు కాండములయందుఁ జెప్పఁబడిన పదార్థములే ప్రకారాంతరమున సుకృత్యాదులైన విశేష్యనిఘ్న శబ్దములును, పదార్థ సంబంధములైన కర్మాదులును, నానార్థములైన నాకాదిశబ్దములును, అవ్యయములైన ఆఙాదులును, లింగ ప్రతిపాదికంబైన లింగాది సంగ్రహ వర్గమును జెప్పఁబడెను. ఇది యీ గ్రంథము యొక్క విషయ సంక్షేపము.

అవ.___ ఉపోద్ఘాతానన్తరం చికీర్షితం గ్రంథమారభతే స్వరవ్యయ మిత్యాదినా.___

**స్వరవ్యయం స్వర్గ నాక త్రిదివ త్రిదశాలయాః,**
**సురలోకో ద్యో దివౌ (ద్వే) (స్త్రియాం) (క్లీబే) త్రివిష్టపమ్.** 6

స్వర్–అవ్యయం, స్వర్ శబ్దము అవ్యయము స్వర్యతే స్తూయత ఇతి స్వః = పొగడఁబడునది గనుక స్వర్ అనబడును. *స్వృ శబ్దోపతాపయోః, స్వర్గాది శబ్దసాహచర్యమువలనఁ గలిగెడి పుంలింగ సందేహ నివృతికొఱకు 'అవ్యయమ్' అని విశేషవిధి చెప్పబడెను. శ్లో సదృశం త్రిషు లింగేషు సర్వాసు చ విభక్తిషు, వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్. లింగ సంఖ్యా కారకేషు న వ్యేతి వివిధ రూపం న గచ్ఛతీత్యవ్యయమ్. లింగ విభక్తివచనాదులయందు ననేక రూపముల నొందక ఏకరూపముగా నుండును గనుక అవ్యయము. అవ్యయత్వే ఉపి స్వర్గనామత్వా దత్ర నిరూపితమ్. స్వర్ శబ్దము అవ్యయమైనను స్వర్గనామ మగుటవలన నిచ్చటఁ జెప్పఁబడెను. అవ్యయ వర్గమందుఁ జెప్పఁదగిన యీ శబ్దదము నిచ్చటఁ జెప్పుట మంగళార్థమని కొందఱు. ౧. సుష్ఠు అర్జ్యతే ఉస్మిన్నితి స్వర్గః = ఇచ్చట లెస్సగా సుఖమనుభవింపబడును గనుక స్వర్గము. *అర్జ అర్జనే. ౨. నాకః, కం సుఖం తన్న భవతీత్యకం తన్నాస్త్యత్రేతి నాకః. కము అనఁగా సుఖము అది గానిది అకము– అనఁగా దుఃఖము, ఆ దుఃఖ మిచ్చట లేదు గనుక నాకము. ౩. త్రిదివః తృతీయో దివో లోకః త్రిదవః ___ మూడవలోకముగనుక త్రిదివము. హరిహర బ్రహ్మాఖ్యాస్త్రయో దీవ్యం తి క్రీడంత్యత్రేతి వా త్రిదివః– విష్ణు శివ బ్రహ్మలు ఇచ్చటఁ గ్రీడింతురు గనుకనైనను త్రిదివము. ౪. త్రిదశానా మాలయః త్రిదశాలయః. దేవతలకు నివాసస్థానము గనుక త్రిదశాలయము. ౫. సురాణాం లోకః

సురలోకః. సురలోకము గనుక సురలోకము. ౬. స్వర్గశబ్దము మొదలు సురలోక-శబ్దమువఱకు. అకారాంత పుంలింగములు. ద్యోదివ్ శబ్దములు స్త్రీలింగమందు వర్తించును. ద్యౌః, ఓ. దివ్. వ. దీవ్యంత్యస్యామితి ద్యౌః. దివ్. చ. ఇందుఁ గ్రీడింతురు కనుక ద్యౌః. దివ్ అనఁబడును. ౭.౮. తృతీయం విష్టపం = భువనం-త్రివిష్టపమ్. అ-న. మూఁడవలోకము గనుక త్రివిష్టపము. ఈ ౯ స్వర్గము పేళ్లు.

**అమరా నిర్జరా దేవా స్త్రిదశా విబుధా స్సురాః,**
**సువర్వాణః సుమనస స్త్రిదవేశా దివౌకసః,** 7
**అదితేయా దివిషదో లేఖా అదితినందనాః,**
**ఆదిత్యా ఋభవో ఉ స్వప్నా అమర్త్యా అమృతాంధసః.** 8
**బర్హిర్ముఖాః క్రతుభుజో గీర్వాణా దానవారయః,**
**బృందారకా దైవతాని (పుంసి వా) దేవతాః (స్త్రియామ్.)** 9

అమరాః-న మ్రియంత ఇత్యమరాః చావనివారు గనుక అమరులు. మృజ్ ప్రాణత్యాగే. మరః మరణమ్ పచాద్యచ్. నాస్తి మరో యేషామితివా అమరాః మరః = మరణము, యేషాం=ఎవరికి, నాస్తి= లేదో, తే=వారలు-అమరులు. ౧. నిర్జరాః న విద్యతే జరా యేషాం తే. ముదిమి లేనివారుగనుక నిర్జరులు. జౄష్ వయోహానౌ. నిరస్తా జరాయైస్తే ఎవర్లచేత ముదిమి తిరస్కరింపఁబడెనో వారు నిర్జరులు. జరాయాః నిష్క్రాంతాః-ముదిమి వలన విడువఁబడినవారు. ౨. దేవాః- దీవ్యంతీతిదేవాః- క్రీడించువారు గనుక దేవులు. దివ్ క్రీడాదౌ. ౩. త్రిదశాః ఉత్పత్తి స్థితి వినాశాత్మికాస్తిస్రో దశా వయోవస్థా యేషాం తే త్రిదశాః తదతిరిక్తవయోవస్థా నాస్తీత్యర్థంః. అమరా స్సదా పంచవింశతివార్షికా ఇత్యస్తి ప్రమాణమ్. ఉత్పత్తి స్థితి నాశములనెడు మూడవస్థలు గలిగిన వారు గనుక త్రిదశులు-అనగా నుత్పత్తి స్థితి నాశకాలములయం దెల్లప్పుడు నిరువదియైదేండ్ల వయస్సు గలవారి వలె నుందురు గనుక నీయుత్పత్త్యాద్యవస్థలు దప్పఁ దక్కిన వయోవస్థలు లేనివారని తాత్పర్యము. త్రిదశపరిమాణం వయో యేషాం తే-ముప్పదియేండ్లకు లోఁబడిన వయస్సు గలవారు గనుక త్రిదశులు. ౪. విబుధ్యంత ఇతి విబుధాః -విశేషముగా నెఱింగినవారు గనుక విబుధులు. బుధ అవగమనే ౫. సు

రంతీతి సురాః ఐశ్వర్యశాలినః. ఐశ్వర్యయుక్తులు గనుక సురలు. సుర ఐశ్వర్యే. సుష్ఠు రాజంత ఇతి వాసురాః – లెస్సగాఁ బ్రకాశించువారు. రాజృ దీప్తౌ. భక్త్యా దత్తం హని రాదికం సుష్ఠు రాంతి. గృహ్ణంతీతి వాసురాః భక్తిచే నిచ్చిన హవిరాదులను లెస్సగా గ్రహించువారు. రా ఆదానే. శుభం రాంతి బ్రువంతీతి వాసురాః–శుభమును జెప్పెడువారు. రై శబ్దే సముద్ర మథనోద్భవా సురా యేషా మస్తీతివా సురాః సముద్రమందుఁ బుట్టిన అమృతము గలవారు. తదుక్తం 'సురాపరిగ్రహాద్దేవాస్సురా ఇత్యభి విశ్రుతా' ఇతి. సుష్ఠువాంఛితం ఫలం రాంతి దదతీతి వాసురాః – లెస్సగా వాంఛిత ఫలము నిచ్చువారు. రాదానే. ౬ అమరాదిశబ్దములు ౬ అకారాంత పుంలింగములు. సుపర్వాణః– నాం తః పు. సుష్ఠు. పూరయంతి కామాౕ పాలయంతీతి వాసుపర్వాణః–లెస్సగా నభీష్టముల నిండించువారు– లేక–పాలించువారు గనుక సుపర్వులు. పౄ పాలనపూరణయోః. శోభనం పర్వచరితం యేషాం తే–మంచి చరిత్రము గలవారు. శోభనాని పర్వాణ్యంగుళ్యాది గ్రంథయో యేషాంతే – మంచి అంగుళ్యాదిగ్రంథులు గలవారు. శోభనాని పర్వాణ్యుత్సవా యేషామితి వా శుభకరము లైన యుత్సవములు గలవారు. ౭. సుమన సః–సాంతః –పు. సుష్ఠు మన్వత ఇతి సుమనసః– లెస్సగా నెఱిఁగినవారు గనుక సుమనస్సులు. మన జ్ఞానే. శోభనం మనో యేషాం తే – మంచి మనస్సు గలవారు. ౮. త్రిదివేశాః –త్రిదివస్య ఈశా స్త్రిదివేశాః–స్వర్గమునకుఁ బ్రభువులు. ౯. దివౌకసః స–పు. దివ్ దివం వా ఓకః స్థానం యేషాం తే – స్వర్గము స్థానముగాఁ గలవారు. దివశబ్దము అకారాంతంబును గలదు. శ్లో. 'న శోభతే తేన హి నో వినాపురం మరుత్వతా వృత్రవధే యథా దివం' అని అనిరుద్ధచరిత్రమునందు దివశబ్దము అకారాంతముగఁ బ్రయోగింపఁబడియున్నది. ౧౦. అదితేయాః. ఆదితే రపత్యాని ఆదితేయాః– అదితికొడుకులు. ౧౧. దివిషద. ద–పు దివి సీ దంతి వర్తంత ఇతి దివిషదః– స్వర్గమునందుండువారు. షద ౡ విశరణ గత్యవసారనేషు. ౧౨. లేఖాః. గ్రీవాహస్తపాదే ప్రశస్తా లేఖా యేషాం తే లేఖాః– కంఠహస్త పాదములయందు మంచిరేఖలు గలవారు. లిఖ్యంతే ధ్యానార్థం పటాదౌ వా లేఖాః– ధ్యానముకొఱకు

పటాదులయందు వ్రాయఁబడువారు. లిఖ విలేఖనే. ప్రాణినాం శుభా శుభ ఫలం లిఖంతీతి వాప్రాణుల శుభాశుభ ఫలమును వ్రానెడువారు. లిఖ అక్షరవిన్యాసే. ౧౩. అదితేర్నందనాః అదితినందనాః–అదితి దేవిపుత్రులు. ౧౪. ఆదిత్యాః. అదితే రపత్యాని ఆదిత్యాః–ఆదితి కొడుకులు. ౧౫. ఋభవః–ఉ–పు. ఋతేన సత్యేన భవంతీతి ఋభవః, సత్యముతోఁ బుట్టినవారు. ఋః=అదితిః తస్యాం భవంతీతివా ఋభవః, ఋ అనఁగా అదితిదేవి. ఆమె వలన జనించినవారు. ౧౬. అస్వప్నాః నాస్తి స్వప్నో నిద్రా యేషాం తే –నిద్రలేనివారు. ౧౭. అమర్త్యాః నమ్రియంత ఇత్యమర్త్యాః చావనివారు. మృజ్ ప్రాణత్యాగే. అమృతాంధసః–స–పు. అమృత మంధో ఽ న్నమేషాం తే–అమృతము అన్నముగాఁ గలవారు. ౧౯. బర్హిర్ముఖాః. బర్హిరగ్నిర్ముఖం యేషాంతే– అగ్నియే ముఖముగాఁగలవారు. (అనఁగా నగ్నియందు హోమము చేయఁబడిన హవిరాజ్యాదులవలనఁ దృప్తిఁ జెందువారు). ౨౦. క్రతుభుజః.జ–పు. క్రతౌ భుజంత ఇతి క్రతుభుజః–యజ్ఞమందు భుజించువారు. భుజ పాలనాభ్య వహారయోః ౨౧. గీర్వాణాః రేవ శాపలక్షణా వాణో బాణో యేషాం తే వబయో రభేదః–శాపరూపమైన వాక్కు బాణముగాఁ గలవారు. గిరం వేదశాస్త్రాదిరూపాం వణంతి వ్యాకుర్వంతీతి గీర్వాణాః– వేదశాస్త్రాదిరూపమైన వాక్కును వివేచించి చెప్పువారు. వణక్వణ శబ్దే. ౨౨. దానవానా మరయః– దానవారయః– ఇ–పు. దానవులకు శత్రువులు. ౨౩. బృందారకాః. శోభనం బృందం యేషాం తే–మంచి సమూహము గలవారు. ౨౪. దైవతాని. అ–న్న. దేవతాః. అ.సీ. దేవా ఏవ దేవతాః దేవతాఏవ దైవతాని–దేవులే దేవతలు; దేవతలే దైవతములు. 'పుంసి వా' అనెడి విశేషవిధిచేత దైవతశబ్దము పుంలింగమును గలదు. ఈ ౨౫. దేవత పేళ్లు.

**ఆదిత్య విశ్వ వసవ స్తుషితా భాస్వరానిలాః.**
**మహారాజిక సాధ్యాశ్చ రుద్రాశ్చ (గణదేవతాః).** 10

ఆదిత్యాః – ఆదిత్యులు పన్నిద్దఱు – ఇంద్రుఁడు, ధాత పర్జన్యుఁడు, త్వష్ట, పూష, అర్యముఁడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశు మంతుడు, వరుణుడు, మిత్రుఁడు అనువారలు. ౧. విశ్వే. శ్రాద్ధా

గ్రే విశంతీతి విశ్వే–శ్రాద్ధాగ్రమందుఁ బ్రవేశించువారు. విశ ప్రవేశనే–వారలు పదుగురు. వసుబంధులు, క్రతుదక్షులు, కాలకాములు, ధురివిరోచనులు, పురూరవాద్రవులు అనువారలు. ౨. వసవః, ఉ–పు. ఆహత్య వసంతీతి వసవః –కూడుకొని యుండువారు. వస నివాసే వారలెనమండ్రు. ఆపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు అనువారలు. ౩. తుషితాః. తుష్యంతీతి తుషితాః– సంతోషించువారలు. తుష తుష్టౌ. వారు ముప్పది యాఱ్వురు. ౪. భాస్వరాః ప. ఆభాస్వరాః. భాసంత ఇతి భాస్వరాః –అంతట ప్రకాశించువారు. భాసృ దీప్తౌ వారు అఱువదినలువురు. ౫. అనిలాః అన్యంతే ప్రాణ్యంతేలోకా ఏభి రిత్యనిలాః– వీరిచే లోకములు ప్రాణయుక్తములుగాఁ జేయఁబడును గనుక అనిలులు, అన ప్రాణనే. ఇలా యాం న చరంతీతి వా – భూమియందు సంచరించనివారు. వారు ౪౯ ద్రు. ౬. మహారాజికాః. మహతీరాజిఃపఙ్క్తి ర్యేషాం తే– అధికమైన పఙ్క్తి గలవారు. వారు ౨౨౦. మహారాజశబ్దో యేషాం తే–మహారాజులనెడి శబ్దము గలవారు. ౭. సాధ్యాః. సాధ్యంతే ఆరాధ్యంత ఇతి సాధ్యాః–ఆరాధింపఁబడువారు. సాధ్యం సిద్ధిర్యేషా మస్తీతివా–సిద్ధి గలవారు. రాధ సాధ సంసిద్ధౌ. వారు ౧౨రు. మనుఁడు, హనుమంతుడు, విష్ణువు, ధర్ముఁడు, నారాయణుఁడు మొదలగువారు. ౮. రుద్రాః రోదయంత్య సురానితి రుద్రాః– దుష్టుల దుఃఖింపఁజేయువారు. రుదిర్ అశ్రువిమోచనే. రుజం దుఃఖం ద్రావయంతీతి వా –దుఃఖమును బోఁగోట్టువారు. ద్రా కుత్సాయాం గతౌ. రుతం వేదాత్మకం శబ్దం కల్పాదౌ రువంతీతి వా–కల్పాదియందు వేదస్వరూపమైన శబ్దమును బలుకువారు. రుశబ్దే వీరు ౧౧ ద్రు. అజుఁడు ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట, రుద్రుఁడు, హరుఁడు, శంభుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు అనువారలు ఈ ౯ గణదేవతల పేళ్లు.

**విద్యాధరో ౭ ప్సరో యక్ష రక్షో గంధర్వ కింనరాః,**
**పిశాచో గుహ్యక స్సిద్ధో భూతో ౭ మీ దేవయోనయః.** 11

విద్యాధరః. విద్యాయాః గుటికాఞ్జనాది విషయిణ్యాః ధరాః ధారకాః– గుటికాంజనాది విద్యలను ధరించిన జీమూతవాహనుఁడు మొద

లయినవారు. ఈ శబ్దము స్థలాంతరమందుఁ జెప్పఁబడనిది గనుక లింగభేదము దెలియుటకై సమాసముగాఁ జెప్పక జాతివివక్షచే 'విద్యాధరః' అని యేకవచనముగాఁ జెప్పఁబడెను. అప్సరః ప్రభృతి శబ్దములు స్థలాంతరమందు లింగభేదము దెలియునట్లు చెప్పఁబడియున్నవి గనుక నిచ్చట ద్వంద్వసమాసముగాఁ జెప్పఁబడినవి. ౧. అద్భ్యస్సరన్తీతి అప్సరసః- నీటివలనఁ బుట్టినవారు అప్సరసలు. ఊర్వశీప్రభృతులు. ౨. యక్ష్యంతే పూజ్యంతే యక్షాః- పూజింపఁబడువారు. యక్షులు కుబేరాదులు. యక్షపూజాయాం. ౩. రక్ష్యన్త్యేభ్యో రక్షాంసి- రక్ష పాలనే. వీరినుండి జంతువులు కాపాడఁబడును గాన రక్షస్సులు. విభీషణాదులు. ౪. సౌరభం గన్ధం అర్వన్తి గన్ధర్వాః- సువాసనను పొందువారు. అర్వ గతౌ-గంధర్వులు. హాహాహూహూ ప్రభృతులు. ౫. అశ్వముఖత్వాత్కుత్సితా నరాః కింనరాః గుఱ్ఱపుమోము గలవారుగాన ఏవగింపఁదగినవారు కిన్నరులు. ౬. పిశాచాదిశబ్దములు ఇతర స్థలమందుఁ జెప్పబడనివి గనుక విద్యాధరశబ్దమువలె లింగభేదము దెలియుటకై జాతివివక్షచేత నేకవచనముగాఁ జెప్పఁబడినవి. పిశితమశ్నంతీతి పిశాచాః-మాంసమును భుజించువారు-కుబేరానుచరులు. అశ భోజనే. ౭. గుహ్యకః. నిధీ న్గూహంతీతి గుహ్యకాః - నిధులఁ గాచువారు. గుహూ సంవరణే. ప్రాయేణ గుహ్యం కుత్సితం కాయంతి వదంతీతి వా-తఱుచుగాఁ గుత్సితముం బలికెడువారు. మాణిభద్రుఁడు మొదలైన నిధిపాలకులు. కైశబ్దే. ౮. సిద్ధ. అణిమాదిసిద్ధిర్యేషామస్తీతి సిద్ధాః- అణిమాది సిద్ధి గలవారు. విశ్వావసు ప్రభృతులు. ౯. భూతః. భవన్తి ఇష్టం ప్రాప్నువంతీతి భూతాః-బాలగ్రహాదయః- ఇష్టము నొందెడి బాలగ్రహాదులు. భూప్రాప్తౌ. ౧౦. అమీ దేవయోనయః- దేవా ఏవ యోని రుత్పత్తిస్థానం యేషాంతే, అమీ = వీరు, దేవయోనయః-దేవతలే యుత్పత్తిస్థానముగాఁగలవారు. అనఁగా దేవతలవలనఁ బుట్టినవారు. ఈ ౧౦. దేవతాభేదముల పేళ్లు.

**అసురా దైత్యదైతేయ దనుజేంద్రారి దానవాః,**
**శుక్రశిష్యా దితిసుతాః పూర్వదేవాః సురద్విషః.** 12

ఆసురాః. న విద్యతే సురా యేషాం తే - అమృతము లేనివారు. సురేభ్యో ఽన్యే వా - దేవతలు గానివారు. యజ్ఞభాగాన్ని రస్యంత ఇతి

వా- యజ్ఞభాగము వలనఁ ద్రోయఁబడినవారు. అసు క్షేపణే. అసూన్ ప్రాణాన్ రాంతి గృహ్ణంతీతివా - ప్రాణముల గొనువారు. రా ఆదానే. ౧. దైత్యాః. దైతేయాః. దితేరపత్యాని దైత్యాః. దైతేయాశ్చ-దితికొడుకులు. ౨. ౩. దనుజాః. దానవాః, దనోర్జాతా దనుజా. దానవాశ్చ-దనువనెడి స్త్రీవలన బుట్టినవారు, దైత్యదానవులకు భేదము గలిగియున్నను అసురత్వసామాన్యముచేత నభేద కథనము. ౪. ౫. ఇంద్రస్యారయః ఇంద్రారయః-ఇ .పు. ఇంద్రునికి శత్రువులు. ౬. శుక్రస్య శిష్యా-శుక్ర శిష్యాఃశుక్రునికి శిష్యులు. ౭. దితే స్సుతాః దితిసుతాః-దితికొడుకులు. ౮. పూర్వం దేవపదేస్థితాః పూర్వదేవాః-పూర్వకాలమందు దేవపదమునందున్న వారు. ౯. సురాన్ ద్విషంతీతి సురద్విషః- ష-పు. దేవతలను ద్వేషించువారు. ద్విష అప్రీతౌ. ఈ ౧౦ రాక్షసుల పేళ్లు.

**సర్వజ్ఞః సుగతో బుద్ధో ధర్మ రాజ స్తథాగతః,**
**సమంతభద్రో భగవాన్మరజి ల్లోకజిజ్జినః.** 13
**షడభిజ్ఞో దశబలో ౭ ద్వయవాదీ వినాయకః,**
**మునీంద్రః శ్రీఘనః శాస్తా మునిః -**

సర్వజ్ఞః. సర్వంజానాతీతి సర్వజ్ఞః - సమస్తము నెఱింగినవాఁడు. జ్ఞా అవబోధనే. ౧. సుగతః. శోభనం గతం జ్ఞానమస్య సుగతః-మంచి జ్ఞానము గలవాఁడు. సుష్ఠు అపునరావృత్త్యా మోక్షం గతః- లెస్సగా పునరావృత్తి లేక మోక్షమును బొందినవాడు. ౨. బుద్ధః. సర్వం క్షణికం బద్ధ్యతే బుద్ధః -సమస్తమును క్షణికముగా దలంచువాఁడు. బుధ అవగమనే. ప్రశస్తా బుద్ధిర్యస్య సః బుద్ధః- మంచి బుద్ధి గలవాఁడు. ౩. ధర్మరాజః. ధర్మస్య సత్యాహింసాదేః. రాజా-సత్యము అహింస మొదలుగా గల ధర్మములకు రాజు. ౪. తథాగతః. యథా పునరావృత్తిర్నభవతి తథా మోక్షం గతః- ఎట్లు పునరావృత్తి గలుగదో అట్లు మోక్షమునొందినవాడు. తథా సమ్యగ్గతం జ్ఞాన మస్యేతి తథాగతః- మంచిజ్ఞానముగలవాఁడు. యథామునయో మోక్షం గతా స్తథా మోక్షం గత ఇతివా - మునులెట్లు మోక్షమును బొందిరో అట్లు మోక్షమును బొందినవాడు. ౫. సమంతభద్రః. సమంతతః పుణ్యసంభారాత్ జ్ఞాన

సంభారాచ్చ భద్రః శ్రేష్ఠః – పుణ్యసంభారము వలనను జ్ఞాన సంభారము వలనను శ్రేష్ఠుడు. సమంతం సంపూర్ణం భద్రం మంగళమస్యేతి వా– సంపూర్ణమైన శుభము గలవాఁడు. ౬. భగవాన్ త.పు. శ్లో. "మహాత్మ్యస్య సమగ్రస్య ధైర్యస్య యశసశ్శ్రియః జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ" ఇత్యక్తభగో ఽస్యాస్తీతి. భగవాౝ– సంపూర్ణమైన మాహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము అనునివి భగమని చెప్పబడును అదిగలవాఁడు. ౭. మారం మన్మథం జయతీతి మారజిత్ –త. పు. మన్మథుని జయించినవాఁడు. మారాౝ కామక్రోధాదీౝ జయతి వా–కామక్రోధాదులను జయించినవాఁడు. బౌద్ధాస్తుస్కంధమారః క్లేశమారో మృత్యుమారో దేవపుత్ర మారశ్చేతి చతురోమారానాహుః. తాౝ జయతీతివా– బౌద్ధులచే జెప్పఁబడెడు స్కంధమారాదుల జయించినవాఁడు. ౮. లోకజిత్ లోకం తపసాజయతీతి– లోకమును తపస్సుచే జయించినవాఁడు. ౯. జినః జయతి భవం జినః సంసారమును జయించెడివాఁడు. జి జయే. ౧౦. షట్ అభిజ్ఞాః యస్యసః షడభిజ్ఞః–దివ్యదృష్టి, దివ్యశ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్తజ్ఞానము, అప్రత్యక్షవిషయజ్ఞానము, వియద్గనాగమన వ్యూహాదిలక్షణమైన బుద్ధి అను నీ యాఱు అభిజ్ఞలు గలవాఁడు. దశబలః. దశ బలాని బుద్ధ్యాదీని యస్యసః–బుద్ధి, క్షాంతి, వీర్యము, ధ్యానము, జ్ఞానము, కృప, శీలము, బలము, దానము, ఉపేక్ష అనెడు పదిబలములు గలవాడు, అద్వయం జీవాత్మ పరమాత్మనో రభేదం వదతీతి అద్వయవాదీ. న–పు. జీవాత్మ పరమాత్మలకు నభేదమును జెప్పెడువాడు. వద వ్యక్తాయాం వాచి. ౧౩. వినాయకః. సర్వాౝ వినయతి హిత మనాశాస్తీతి వినాయకః– ప్రాణులకు హితమును బోధించువాడు. ణీఞ్ ప్రాపణే. ౧౪. మునీంద్రః. మునీనా మింద్రః శ్రేష్ఠః–మునులలో శ్రేష్ఠుడు. ౧౫. శ్రీఘనః. శ్రియా యోగవిభూత్యాఘనః పూర్ణః– యోగసంపద చేత నధికుఁడు. ౧౬. శాస్తా. ఋ–పు. దుష్టాౝ శాస్తి శిక్షతీతి శాస్తా–దుష్టులను శిక్షించువాడు. శాసు అనుశిష్టౌ. ౧౭. మునిః ఇ.పు. సర్వధర్మాణాం మననాన్మునిః – సర్వధర్మముల నెఱుంగుటవలన ముని. మన అవబోధనే. ఈ ౧౮ బుద్ధదేవునిపేళ్లు.

**శాక్యముని స్తుయః.** 14

**స శాక్యసింహ స్సర్వార్థసిద్ధ శ్శౌద్ధోద నిశ్చసః,**

**గౌతమ శ్చార్క బంధుశ్చ మాయాదేవీసుతశ్చ సః.** 15

శాక్యమునిః. ఇ.పు. శాకవనవాసిత్వాచ్ఛాక్యః. శాక్యశ్చాసౌ మునిశ్చ శాక్యమునిః. శాకవృక్షప్రతిచ్ఛన్నం. వాసం యస్మాచ్చ చక్రిరే, తస్మాదిక్ష్వాకు వంశ్యాస్తే శాక్యా ఇతి భువి స్మృతాః. శాకవనమందుండువాడు. శకదేశేషు జాతో మునిః– శకదేశములయందుఁ బుట్టిన ముని. ౧. శాక్యసింహః. శాక్యేషు సింహఃశ్రేష్ఠః– శాక్యులలో శేష్టుడు. ౨. సర్వార్థసిద్ధః.సర్వార్థేషు సిద్ధో నిష్పన్నః– అన్నిపనులయందు గృతార్థుడైనవాడు. ౩. శౌద్ధోదనిః. ఇ–పు. శుద్ధం న్యాయ పరిశుద్ధం ఓదనం భుజ్తే శుద్ధోదనః, తస్యాపత్యం శౌద్ధోదనిః–న్యాయపరిశుద్ధమైన అన్నమును భుజించువాని కొడుకు. ౪. గౌతమః. గౌతమస్య శిష్యాశ్శాక్యా గౌతమా ఇత్యుచ్యతే, తద్వంశావతీర్ణత్వా ద్బుద్ధో ఽపి గౌతమముని శిష్యులు గనుక శాక్యులు గౌతములు. ఆ వంశమందుఁ బుట్టినవాఁడు. ౫. అర్కవంశత్వాత్ అర్కబంధుః. ఉ–పు. సూర్యవంశమున జనించుటవలన అర్కబంధువు. ౬. మాయాదేవ్యాస్సుతః మాయాదేవీసుత – మాయాదేవికొడుకు. ఈ ౭ శాక్యముని పేళ్లు.

**బ్రహ్మాత్మ భూః సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః,**

**హిరణ్యగర్భో లోకేశ స్స్వయంభూశ్చతురాననః.** 16

**ధా తాబ్జయోని ర్ద్రుహిణో విరిఞ్చిః కమలాసనః,**

**స్రష్టా ప్రజాపతి ర్వేధా విధతా విశ్వప ద్విధిః.** 17

**(శతానన్ద శ్శతధృతిర్విరిఞ్చోజో విరిఞ్చనః.)**

బ్రహ్మ.న–పు. బృంహతి వర్ధయతి ప్రజా ఇతి బ్రహ్మ–ప్రజలను వృద్ధి బొందించువాడు. బృహి వృద్ధౌ. ౧. ఆత్మభూః. ఊ–పు. ఆత్మనా భవతీ త్యాత్మభూః –తనంతటఁ బుట్టినవాఁడు. ౨. సురాణం జ్యేష్ఠః సుర జ్యేష్ఠః– దేవతలలోఁ బెద్దవాడు. ౩. పరమే ఉత్కృష్టే పదే బ్రహ్మ లోకాఖ్యే తిష్టతీతి పరమేష్ఠీ–న–పు. ఉత్కృష్టస్థానమం దుండెడువాఁడు. ష్ఠా గతినివృత్తౌ. ౪. పితామహః. పితౄణాంః పితా–పితౄణా మపి

జనయి తేత్యర్థః. పిత (తండ్రు)ల బుట్టించినవాడు. ౫. హిరణ్యగర్భః. హిరణ్యమయో గర్భో యస్యసః హిరణ్యగర్భః– హిరణ్యమయమైన గర్భము గలవాడు. హిరణ్యం గర్భే యస్యేతి వా–గర్భమందు హిరణ్యము గలవాడు. ౬. లోకేశః. లోకానాం చుతుర్దశలోకానా మీశః– పదునాల్గులోకములకు ప్రభువైనవాఁడు. ౭. స్వయంభూః. ఊ–పు. స్వయం భవతీతి స్వయంభూః– తనంతటనే పుట్టినవాఁడు. భూసత్తాయాం. ౮. చతురాననః. చత్వారి ఆననాని యస్య సః–నాలుగుముఖములు గలవాఁడు. ౯. ధాతా. ఋ.పు. సర్వం దధాతీతి ధాతా – సమస్తమును ధరించినవాడు. డుధాఞ్ ధారణ పోషణయోః. ౧౦. అబ్జయోనిః. ఇ.పు. అబ్జం విష్ణునాభికమలం యోని రుత్పత్తిస్థానం యస్యసః– విష్ణునాభికమలమే ఉత్పత్తి స్థానముగాఁ గలవాఁడు. ౧౧. ద్రుహిణః. ద్రుహ్యతి హింసత్య సురేభ్యో ద్రుహిణః– అసురులకు హింసచేయువాఁడు. ద్రుహ జిఘాం సాయాం. ౧౨. విరించిః–ఇ–పు. విరచయతి భూతాని విరించిః– భూతములను సృజించువాఁడు. విభిః హంసైః రిచ్యతే ఉహ్యత ఇతి వా–వి శబ్దము పక్షి వాచకము గనుక హంసలచేత వహింపఁబడువాడు. ౧౩. కమలాసనః. కమలం ఆసనం యస్య సః–కమలము ఆసనముగాఁ గలవాఁడు. ౧౪. సృజతీతి స్రష్టా. ఋ–పు. సృజించువాఁడు. సృజ విసర్గే. ౧౫. ప్రజానాం పతిః, ప్రజాపతిః. ఇ–పు. ప్రజలకుఁ బ్రభువు. ౧౬. విధతి సృజతీతి వేధాః–స–పు. సృజించువాఁడు. విధ విధానే. ౧౭. విదధాతి సర్వం విధాతా–ఋ–పు. సర్వముఁ జేయువాఁడు. డు ధాఞ్ ధారణ పోషణయో. ౧౮. విశ్వం సృజతీతి విశ్వసృట్ – జ–పు. విశ్వమును సృజించువాడు. సృజ విసర్గే. ౧౯. విదధాతీతి విధిః– ఇ–పు. సర్వముఁ జేయువాఁడు. ౨౦. ఈ బ్రహ్మపేళ్లు.

**విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః,**
**దామోదరో హృషీకేశః కేశవో మాధవః స్వభూః.** 18
**దైత్యారిః పుండరీకాక్షో గోవిందో గరుడధ్వజః,**
**పీతాంబరో ఽ చ్యుతః శార్ఙ్గీ విష్వక్సేనో జనార్దనః.** 19
**ఉపేంద్ర ఇంద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః,**
**పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః.** 20

**దేవకీనందన శ్శౌరిః శ్రీపతిః పురుషోత్తమః,**
**వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః.** 21
**విశ్వంభరః. కైటభజి ద్విధుః శ్రీవత్సలాంఛనః,**
**(గదాగ్రజో ముంజకేశో దాశార్హో దశరూపభృత్).**

విష్ణుః. ఉ-పు. విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః- విశ్వమును వ్యాపించి యుండువాడు. విష్ణ వ్యాప్తౌ. ౧. నారాయణః నరస్యేదంనారం అవతారేషు నారం వపురయుత ఇతి నారాయణః- నరసంబంధమైన శరీరము నారము. అవతారములయందు నరశరీరమునుబొందువాడు. అయగతౌ. నారా ఆపః అయనం స్థానం యస్యసః-నారమనగా జలము అది స్థానముగా గలవాడు నరసమూహో నారం తస్యాయనమితి వా, తదయనమస్యేతివా-నర సమూహమునకు స్థానమయినవాడు. లేక నర సమూహము నివాసముగా గలవాడు. రాశ్శబాః అయంతే నిర్గచ్ఛంతే యస్మా త్సనారాయణః. రాయణాదన్యః అరాయణః, అరాయణోనభవతీతి నారాయణః-శబ్దగమ్య ఇత్యర్థః-ఎవనివలన శబ్దములు బయలువెడలుచున్నవో అతడు రాయణుడు. రాయణుడు గానివాడు అరాయణుడు. అరాయణుడు గానివాడు నారాయణుడు. అనగా శబ్దగమ్యుడనుట. రైశబ్దే. ౨. కృష్ణః. సర్వంకరోతీతి కృష్ణః- అన్నిటిని జేయువాడు. డుకృఞ్ కరణే. దైత్యాౕ కర్షతీతి వా-దైత్యులను నలిపివేయువాడు. కృష్ణ విలేఖనే-కృష్ణవర్ణ త్వాద్వా- కృష్ణవర్ణుడు గనుక కృష్ణుడు. ౩. వైకుంఠః. కస్మింశ్చిన్మన్వంతరే వికుఠాయాంమాతరి జాతత్వాద్వై కుంఠః - ఒకానొక మన్వంతరమున వికుంఠ యను తల్లియందు నవతరించె గావున వైకుంఠుడు. ౪. విష్టరశ్రవాః. స-పు. విష్టరే ఇవశ్రవసీ కర్ణౌయస్యసః - దర్భముడి వంటి చెవులు గలవాడు. విష్టరే అశ్వత్థతరౌ శ్రూయత ఇతివా- అశ్వత్థవృక్షము నందు వినబడువాడు. విష్టరాకారో రోమావర్తః శ్రవసి యస్యసః - విష్టరాకార మైనరోమావర్తము చెవియందుగలవాఁడు విష్టరం వ్యాపనశీలంశ్రవః కీర్తిర్యస్యసః-వ్యాపనశీలమైన కీర్తిగలవాడు. ౫. దామోదరః. ఉదరే దామయస్యేతి దామోదరః. ఉదరమందు తులసిమాలిక గలవాడు. దామ్నాఉదరే మాత్రా బద్ధ; - బాల్యమందు యశోదచేత పలుపున నుదరమందుఁ గట్టబడిన

వాఁడు. ౬. హృషీకేశః. హృషీకాణా మింద్రియాణామీశః – ఇంద్రియములకు నీశ్వరుఁడు. ౭. కేశవః. శోభనాః కేశాః యస్యసః–మంచి వెండ్రుకలు గలవాడు. కేశిన మసురం హతవానితి–కేశి యను నసురుని జంపినవాఁడు. కశ్చ ఈశశ్చ కేశౌ, తావస్మిన్ స్త ఇతి వా. తదుక్తం శ్లో.క ఇతి బ్రహ్మణో నామ ఈశో உహం సర్వదేహినాం, ఆవాం తవాంగే సంభూతౌ తస్మా త్కేశవ నామవానితి హరివంశే–బ్రహ్మరుద్రులు ఈయనయందు జనించిరి గనుక కేశవుడు. కశ్చ అశ్చ ఈశశ్చ కేశ్వాః, తే సంత్యస్మిన్నితి కేచిత్ – బ్రహ్మవిష్ణురుద్రులు ఈయన యందుండుటవలనఁ గేశవుఁ డని కొందఱు. ౮. మాధవః. మాయాః లక్ష్మ్యాః ధవః – లక్ష్మీదేవికి భర్త. యదోర్జ్యాయా న్పుత్రో మధుః, తద్వంశ జత్వాన్మాధవః – యదువనెడివాని పెద్దకొడుకు మధుఁడు; అతని వంశమునఁ బుట్టినవాఁడు. మధూయతే శత్రూనితివా–శత్రువులఁ గంపింపఁజేయువాఁడు. ధూఞ్ కంపనే. ౯.స్వభూః ఊ–పు. స్వే నాత్మనా జాయత ఇతి స్వభూః–తనంతఁదానే పుట్టినవాఁడు. ౧౦. దైత్యానామరిః దైత్యారిః–ఇ–పు. దైత్యులకు శత్రువు. ౧౧. పుండరీకాక్ష. పుండరీకే ఇవ అక్షిణీ యస్య సః– తెల్లదామరవంటి కన్నులు గలవాడు. పుండరీకం హృత్కమలం అక్ష్ణోతి వ్యాప్నోతీతివా–హృదయకమలమును వ్యాపించియుండువాఁడు. అక్షూ వ్యాప్తౌగా. ౧౨. గాంభూమిం ధేనుం స్వర్గం వేదం వా విన్దతి ఇతి గోవిందః – భూమిగాని, గోవునుగాని, స్వర్గమునుగాని, వేదమునుగాని పొందెడువాఁడు. ౧౩. గరుడధ్వజః. గరుడః ధ్వజః యస్య సః – గరుత్మంతుఁడే ధ్వజముగాఁ గలవాఁడు. ౧౪. పీతాంబరః. పీత మంబరం యస్యసః – పచ్చని వలువ గలవాఁడు. ౧౫. అచ్యుతః. నాస్తి చ్యుతం స్ఖలనం స్వపదాద్యస్యసః – తన చోటునుండి భ్రంశము నొందనివాఁడు. ౧౬. శృఙ్గస్యం వికారః శార్ఙ్గం ధనుః. తదస్యాస్తీతి శార్ఙ్గ మనెడి విల్లు గలవాఁడు. ౧౭. విష్వక్సేనః. విష్వక్సమంతతః వ్యాప్తా సేనా యస్య సః – అంతట వ్యాపించిన సేన గలవాఁడు. ౧౮. జనార్దనః. సముద్రమధ్యవర్తినో జననామ్నో ఉసురా నర్దితవానితి జనార్దనః సముద్రమధ్యమం దుండెడు జనులనెడు నసురులఁ బీడించినవాఁడు. ప్రళయకాలే స్సర్వానపి అర

యతీతి వా జనార్దనః – ప్రళయకాలమం దెల్ల జనులను బీడించువాడు. అర్దపీడనే. ౧౯. ఉపేంద్రః. ఇంద్ర ముపగతః అనుజత్వా దుపేంద్రః– ఇంద్రునికి తమ్ముడు గనుక ఉపేంద్రుడు. ఇంద్రరక్షణాయ తత్సమీపే స్థితో వా –ఇంద్రుని రక్షించుటకై అతనియొద్ద నున్నవాఁడు. ఇంద్రలోకా దుపరితిష్ఠతీతి వా ఉపేంద్రః– ఇంద్రలోకమున కంటె పైలోకమందుండువాఁడు. ౨౦. ఇంద్రస్య అవరజః. ఇంద్రావరజః–ఇంద్రునికి దమ్ముడు. చక్రపాణిః. ఇ–పు. చక్రం పాణౌ యస్యసః – చక్రము హస్తము నందు గలవాఁడు. ౨౨. చతుర్భుజః చత్వారో భుజా యస్యసః – నాలుగు భుజములు గలవాఁడు. ౨౩. పద్మనాభః. పద్మం నాభౌ యస్యసః– పద్మము నాభియందు గలవాఁడు. ౧౪. మధో రసురస్య రిపుః మధురిపుః –ఉ – పు. మధు వనెడి రాక్షసునికి శత్రువు. ౨౫. వాసుదేవః. వసుదేవ స్యాపత్యం పుమాన్ – వసుదేవుని కుమారుడు. వసంత్యస్మిన్ జగంతీతి వాసుః – వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః – అన్ని జగములు తనయందు గల దేవుఁడు. వస నివాసే. జగతి వస త్యయమితివా జగమున నంతట నుండు దేవుఁడు. తదుక్తం. శ్లో. వసత్యాత్మా జగత్య త్ర తస్మి న్వసతి వా జగత్, స వాసుదేవ ఇత్యాది. ౨౬. త్రివిక్రమః, బలిబంధనకాలే త్రిషు లోకేషు త్రయో విక్రమాః పాదన్యాసాః యస్య సః – బలిబంధనకాలమందు మూఁడులోకములను మూఁడడుగులచేఁ గప్పినవాఁడు. క్రము పాదవిక్షేపే. ౨౭. దేవక్యాః నందనః దేవకీనందనః – దేవకీదేవి కొమారుఁడు. ౨౮. శూర ఇతి వసుదేవస్య పితాతస్య గోత్రాపత్యం శౌరిః– ఇ–పు. శూరుడనగా వసుదేవునితండ్రి, అతని మనుమఁడు. ౨౯. శ్రీపతిః. ఇ – పు. శ్రియః లక్ష్మ్యాః పతిః లక్ష్మీదేవికి భర్త. ౩౦. పురుషే షూత్తమః పురుషోత్తమః – పురషుల యం దుత్తముఁడు. ౩౧. వనమాలీ. న. పు. శ్లో. ఆపాదపద్మం యామా లా వనమాలేతి సా మతా, ఇతి కళిఙ్గః. సా అస్యాస్తీతి వనమాలీ –పాదములదాక వ్రేలెడు పుష్పమాలిక గలవాఁడు. ౩౨. బలిధ్వంసీ. న–పు. బలినం ధ్వంసితుం శీలమస్యేతి–బలి నణచినవాఁడు. ధ్వంసు అవస్రంసనే. ౩౩. కంసారాతిః. ఇ–పు. కంసస్య అరాతిః – కంసుని శత్రువు. ౩౪. అధోక్షజః, అధఃకృతాని అక్షాణీంద్రియాణి యస్మిన్ కర్మణి తద్యథా తథా

జాతః. తదుక్తం. శ్లో.'యస్యేంద్రియం ప్రమథితుం ప్రమదా న శక్తా' ఇతి ఇంద్రియములను అధఃకరించి జనించినవాఁడు. అథోక్షాణాం జితేంద్రియాణాం జాయతే ప్రత్యక్షీభవతీతి వా అధోక్షజః-జితేంద్రియులకు ప్రత్యక్ష మగువాఁడు. అధఃకృతం అక్షజం ఇంద్రియజన్య జ్ఞానం యేనేతి వా- ఇంద్రియజన్యజ్ఞానమును అధఃకరించినవాడు. ౩౫. విశ్వంభరః. విశ్వం బిభర్తీతి విశ్వంభరః-విశ్వమును భరించినవాఁడు. ౩౬. కైటభజిత్. త-పు. కైటభమసురం జితవాన్ - కైటభుఁ డనెడి యసురుని జయించినవాఁడు జి జయే. ౩౭. విధుః ఉపు విధ్యతి ప్రత్యర్థిన ఇతి విధుః శత్రువులను వ్యథపెట్టువాఁడు. ౩౮. శ్రీవత్సలాంఛనః. శ్రీవత్సోనామ వక్షఃస్థలే మహాపురుష లక్షణో రోమావర్త విశేషః సఏవ లాఞ్ఛనం యస్యసః - వక్షః స్థలమందు మహాపురుషలక్షణమైన శ్రీవత్స మనెడు మచ్చ గుఱుతుగాఁ గలవాఁడు-ఈ ౩౯ విష్ణుదేవుని పేళ్లు.

**వసుదేవో ఽ స్య జనక స్స ఏవా ఽఽనక దుందుభిః** 22

అస్య = ఈ కృష్ణదేవునియొక్క, జనకః = తండ్రి, వసుదేవః = వసుదేవుడు, స ఏవ = ఆ వసుదేవుఁడే, ఆనకదుందుభిః= ఆనకదుందుభి యనఁబడును. వసుదేవః. వసుభిర్ధనైర్దీవ్యత ఇతి వసుదేవః-ధనములచే బ్రకాశించువాఁడు. ౧. అనకదుందుభిః. ఇ-పు. అస్య జన్మకాలే దేవతాభి రాన కాశ్చ దుందుభయశ్చ వాదితా ఇత్యానక దుందుభిః - ఇతని జన్మకాలమున దేవతలచేత ఆనకములును, దుందుభులను వాయింపఁబడినవి. ౨. వసుదేవుని పేళ్లు.

**బలభద్రః ప్రలంబఘ్నో బలదేవో ఽ చ్యుతాగ్రజః,**
**రేవతీరమణో రామః కామపాలో హలాయుధః.** 23
**నీలాంబరో రౌహిణేయ స్తాలాంకో ముసలీ హలీ,**
**సంకర్షణ స్సీరపాణిః కాళిందీ భేదనో బలః.** 24

బలభద్రః. బలేన భద్రః శ్రేష్ఠః - బలముచేత శ్రేష్ఠుడు. ౧. ప్రలంబఘ్నః. ప్రలంబ మసురం హతవాన్ - ప్రలంబుఁ డను రాక్షసుని జంపినవాఁడు. ౨. బలేన దీవ్యతీతి బలదేవః- బలముచేతఁ బ్రకాశించువాఁడు. ౩. అచ్యుతాగ్రజః అచ్యుత స్యాగ్రజో జ్యేష్ఠః - అచ్యుతునికి అన్న. ౪. రేవతీరమణః. రేవత్యాఃరమణః పతిః- రేవతిదేవికి భర్త. ౫.

రామః. రమయతి మోదయతి రూపసంపదేతి రామః - రూపసంపద చేత సంతోషింపఁజేయువాఁడు. రము క్రీడాయాం. ౬. కామపాలః. భక్త కామాన్పాలయతీతి కామపాలః- భక్తుల కోరికలను దీర్చువాఁడు. కామం స్మరం పాలయతి ఆత్మజత్వాత్కామపాలః కొమారుఁ డగుట వలన మన్మథుని భాలించువాడు. హలాయుధః. హలం లాంగలం వలన ఆయుధం యస్య సః- నాఁగేలు ఆయుధముగాఁ గలవాఁడు ౮. నీలాంబరః. నీల మంబరం వాసో యస్యసః - నల్లని వలువ గలవాఁడు. ౯. రౌహిణేయః. రోహిణ్యా అపత్యం- రోహిణీదేవి కొడుకు. ౧౦. తాలాంకః. తాల వృక్షాకృతి ఠంకో ధ్వజో యస్యసః - తాళవృక్షాకారమైన ధ్వజము గలవాఁడు. ౧౧. ముసల మాయుధ మస్యాస్తీతి ముసలీ. న-పు. రోఁకలి ఆయుధముగాఁ గలవాఁడు. ౧౨. హల మస్యాస్తీతి హలీ. న-పు. నాఁగలి యాయుధముగాఁ గలవాఁడు. ౧౩. శత్రూణ్ ప్రళయే జనాన్వాసంకర్షతీతి సంకర్షణః-శత్రువులను లేక ప్రళయమందు సర్వజనులఁ గాని సంహరించువాఁడు. ౧౪. సీరపాణిః ఇ-పు. సీరం లాంగలం పాణౌ యస్య సః- నాఁగేలు హస్తమందుఁ గలవాఁడు. ౧౫. కాళిందీం యమునాం హలేన భినత్తీతి కాళిందీ భేదనః-హలముచేతఁ గాళిందీ నదిని భేదించినవాఁడు. ౧౬. బల మస్యాస్తీతి బలః-బలము గలవాఁడు. ఈ ౧౭ బలదేవుని పేళ్లు.

**మదనో మన్మథో మారః. ప్రద్యుమ్నో మినకేతనః,**
**కందర్పో దర్పకో ఽ నంగః కామః పంచశరః స్మరః.** 25
**శంబరారి ర్మనసిజః కుసుమేషు రనన్యజః,**
**పుష్పధన్వా రతిపతి ర్మకరధ్వజ ఆత్మభూః.** 26
**(శృంగారయోనిః శ్రీపుత్రః శూర్పకారాతి రిత్యపి, )**
**బ్రహ్మసూర్విశ్వకేతుః స్యాత్ -**

మదనః. మదయతీతి మదనః-మదింపజేయువాఁడు. మదీ హర్ష గ్లేపనయోః. ౧. మననం మత్ చేతనా తాం మథతీతి మన్మథః- బుద్ధిని గలియఁ బెట్టువాఁడు. మంథ విలోడనే. ౨. మారయతి విరహిజనం మారః -విరహిజనులను జంపువాడు. మృజ్ ప్రాణత్యాగే. ౩. ప్రకృష్టం ద్యుమ్నం బలమస్య ప్రద్యుమ్నః- ప్రకృష్టమైన బలము గలవాఁడు. ౪. మీనకేతనః మినః కేతనం ధ్వజో యస్య సః- మత్స్యము టెక్కెము

గాఁ గలవాఁడు. కందర్పః. కం కుత్సితే ఉవ్యయం. కుత్సితో దర్పోయస్యసః కందర్పః- కుత్సితమైన దర్పము గలవాఁడు. కం సుఖం తద్వత్సు దర్పో యస్యసః - సుఖవంతులయందు దర్పించువాఁడు. కేబ్రహ్మణ్యపి దృప్తవాన్ కందర్పః- బ్రహ్మమీఁదనుగూడ దర్పించినవాఁడు. ౬. దర్పయతీతి దర్పకః- గర్వింపఁ జేయువాఁడు ౭. అనంగః. న విద్యతే అంగం యస్యసః - శరీరములేనివాఁడు. ౮. కామః. కామ్యతే అనేన కామః - వీనిచేత కోరఁబడును. ౯. ఉన్మాదన తాపన శోషణ స్తంభన సమ్మోహనాఖ్యాః పంచశరాః యస్యసః పంచశరః - ఉన్మాదన తాపన శోషణ స్తంభన సమ్మోహనములను నైదు బాణములు గలవాఁడు. ౧౦. స్మరః. స్మరయ త్యుత్కణ్ఠయతీతి స్మరః - కాముకులను కామినులను తొందర పెట్టువాఁడు. స్మృ ఆధ్యానే. ౧౧. శంబరారిః. ఇ-పు. శంబరస్యాసుర స్యారిః- శంబరుఁ డనెడి రాక్షసునకు శత్రువు. ౧౨. మనసి జాయత ఇతి మనసిజః- మనస్సునందుఁ బుట్టెడువాఁడు. ౧౩. కుసుమేషుః. ఉ-పు. కుసుమాన్యేవ ఇషవో యస్యసః- పుష్పములే బాణములుగా గలవాఁడు. ౧౪. అనన్యజః. మనసో ఉ న్యస్మాన్న జాయత ఇత్య నన్యజః, మనస్సునకంటె నన్యస్థల మందుఁ బుట్టనివాఁడు. ౧౫. పుష్పధన్వా . న-పు. పుష్పం ధను రస్య పుష్పధన్వా-పుష్పములు ధనుస్సుగాఁ గలవాఁడు. ౧౬. రతేః పతిః రతిపతిః- రతీదేవికి భర్త. ౧౭. మకరధ్వజః మకరోధ్వజోయస్య సః-మకరము ధ్వజముగాఁ గలవాఁడు. ౧౮. ఆత్మని మనసి భవతి త్యాత్మభూః ఊ-పు. మనస్సున బుట్టువాఁడు. ఆత్మనా స్వయమేవ భవతీతివా- తనంతతనే పుట్టువాఁడు. ౧౯. బ్రహ్మ తపః బ్రహ్మాణం వా సువతి చాలయతీతి బ్రహ్మసూః-తపస్సుగాని బ్రహ్మనుగాని కలతపెట్టువాఁడు. ౨౦. ఋశ్యకేతుః. ఉ-పు. ఋశ్యో మృగవిశేషః కేతుర్యస్య సః-ఋష్య మను మృగము టెక్కెముగాఁ గలవాడు. విశ్వకేతుః- అనుపాఠమునందు - విశ్వవ్యాపీకేతు ర్ద్యుతిర్యస్యసః- విశ్వవ్యాపకమైన తేజస్సు గలవాఁడు. ఈ ౨౧ మన్మథుని పేళ్లు.

### అనిరుద్ధ ఉషాపతిః.

అనిరుద్ధః న నిరుధ్యతే పరైరిత్యనిరుద్ధః - పరులచేత నడ్డగింపబడని వాఁడు. రుధిర్ ఆవరణే. ౧. ఉషాపతిః, ఇ - పు, ఉషా బాణసుతా,

**వియద్విష్ణుపదం వా తు పుం స్యాకాశ విహాయసీ,**
**(విహాయసో ఽ పి నాకో ఽ పి ద్యురపి స్యా త్త దవ్యయం.** 2
**తారాపథ శ్శబ్దగుణో మేఘద్వారం మహాబిలమ్.)**

ద్యౌః. ఓ–సీ. దివ్. వ–సీ. దీవ్యతీతి దౌః, దివ్ చ. దివ్ క్రీడాదౌ–ప్రకాశించునది. ౧. ౨. న భ్రమతి అమూర్తత్వాత్ అభ్రం. భ్రము చలనే–అమూర్తమైనందున చలింపనిది. నభ్రాజత ఇత్యభ్రం. భ్రాజృదీప్తౌ – అమూర్తమైనందున ప్రకాశింపనిది. ౩. విశ్వం వ్యయతి సంవృణోతీతి వ్యోమ. న. వ్యేఞ్ సంవరణే – విశ్వమును వ్యాపించునది. విశేషేణ అవత్యవకాశదానేనేతి వ్యోమ. అవ రక్షణే – విశేషముగా అవకాశ మిచ్చి రక్షించునది. ౪. పుష్పత్యవకాశమితి పుష్కరం. పుష పుష్టౌ–అవకాశమును పోషించునది. పుష్కముదకం రాతీతి వా. రాదానే–ఉదకము నిచ్చునది. ౫. అంబతే శబ్దాయత ఇత్యంబరం. అభి శబ్దే–శబ్దగుణక మగుటవలన మ్రోయుచుండునది. ౬. మేఘైర్న భాతీతి నభః. స.న.భా దీప్తౌ–మొయిళ్లచేతఁ బ్రకాశింపనిది. ౭. అంతః ఈక్ష్యతే జగదస్మిన్నిత్యంతరిక్షం. ఈక్ష దర్శనే–దీనిలోపలను జగత్తు చూడఁబడును. అంత ఋక్షాణి సంత్యస్మిన్ని త్యంతరిక్షం–నక్షత్రము లిందుఁ గలవు. ౮. గచ్ఛంత్యనేన దేవా ఇతి గగనం. గమ్ల్ గతౌ – దీనిమార్గము వలన దేవతలు పోవుదురు. గచ్ఛత్యత్ర ఖగజాతిరితివా – పక్షిజాతి యిచ్చట సంచరించును. ౯. న విద్యతే అంతో యస్యతత్ అనంతం. అంతము లేనిది. ౧౦. సురాణాం వర్త్మ సురవర్త్మ. న–న. సురల యొక్క మార్గము. ౧౧. ఖనతి జ్ఞానమితి ఖం. నీరూపత్వాద్దు ర్జ్ఞే యమిత్యర్థః. ఖను అవదారణే –రూపము లేనిది కనుక బుద్ధిచేతఁ దెలియఁగూడనిది. ౧౨. వియచ్ఛతి నోపరమత ఇతి వియత్. త. న. యము ఉపరమే – ఎడతెగక యుండునది. ౧౩. విష్ణోః పదం విష్ణుపదం–విష్ణువునకు స్థానము. ౧౪. ఆసమంతా త్కాశంతే సూర్యాదయః అత్రేత్యాకాశం. అ. ప్న. కాశృదీప్తౌ – దీనియందంతటను సూర్యాదులు ప్రకాశింతురు. ఆసమంతా త్కాశత ఇతివా–అంతట ప్రకాశించునది. ౧౫. విశేషేణ హాయతి గచ్ఛతి సర్వమస్మిన్నితి విహాయః. స. ప్న. హాయ గతౌ – దీని యందు విశేషముగా నన్నియు సంచరించును. జిహీతే సర్వం

విహాయః, ఓ హాఙ్ గతౌ – సర్వము దీనిఁ బొందును. ౧౬. అభ్రశబ్దాది సర్వం క్లీబం. ఆకాశ విహాయశ్శబ్దౌ పుంలింగేచ – ఇచ్చట ఆకాశవిహాయ శ్శబ్దములకు రెంటికి వాపుంసి అనుటవలన పక్షాంతరమందు పుల్లింగంబును గలదు. ఈ ౧౬ ఆకాశము పేళ్లు.

# దిగ్వర్గము

**దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చ తాః,**

దిశంత్యవకాశమితి దిశః. శ–సీ. దిశ అతిసర్జనే అతిసర్జనందానం– అవకాశమునిచ్చునవి. ప్రాచీయం దక్షిణేయ మిత్యతి దిశ్యం ఇతివా – ప్రాగ్దక్షిణాది భేదములచేత వ్యపదేశింపఁబడునవి. ౧. కేనసూర్యేణస్కుభ్నం తిద్యోతంత ఇతి కకుభః. భ–సీ. సూర్యునిచేత ప్రకాశించునవి. కం ఉదకం వాయుం వాస్కుభ్నంతి విస్తారయంతీతి కకుభః కుభి ద్యుతౌ విస్తారేచ–ఉదకమునైనను గాలినైనను విస్తరింపఁజేయునది. ౨. కాశంతే ప్రకాశంత ఇతి కాష్ఠాః. కాశృ దీప్తౌ – ప్రకాశించునవి. ౩. ఆసమంతాత్ అశ్నువత ఇత్యాశాః. అశూ వ్యాప్తౌ – వ్యాపించియుండునవి. ౪. హరంతి తమాసింహరితః. త–సీ ః. హృఞ్ మరణే–తమస్సులను హరించునట్టివి. హర్యతే అభిరప్రతీతి రితి హరితః–వీనిచే నజ్ఞానము హరింపఁబడును. ౫. తాఇతి తచ్ఛబ్ద సాహచర్యాత్ దిగ్వాచకాః పంచ స్త్రీలింగాః. 'తాః' అనెడి తచ్ఛబ్ద సాహచర్యమువలన నీదిగ్వాచక శబ్దములు ౫ స్త్రీలింగములు. ఈ ౫ దిక్కులకు పేళ్లు.

**ప్రాచ్యవాచీ ప్రతీచ్య స్తాః పూర్వదక్షిణ పశ్చిమాః.** 1

**ఉత్తరాది గుదీ చీ స్యాత్ -**

ప్రాక్ ప్రథమం అంచత్యస్యాం రవి రితి ప్రాచీ. ఈ–సీ. ప్రథమమున సూర్యుఁడు ఈదిక్కునఁ బొడమును గనుక ప్రాచి. ౧. అవా గంచతి దక్షిణాయనే నాస్యాం రవి రిత్యవాచీ. ఈ–సీ. సూర్యుఁడు దక్షిణాయనముచేత నీదిక్కునఁ దోఁచును. అవ మధ్యాహ్నే అంచత్యస్యాం రవి రిత్యవాచీ–మధ్యాహ్నమున సూర్యుఁడు దీనిఁ బొందును గనుక అవాచి. ౨. ప్రతీచీ. ఈ–సీ. ప్రతి పశ్చాద్దివసావసానే అస్యాం అంచతి

సూర్యో ఽ స్తమేతీతి ప్రతీచీ, అఞ్చు గతి పూజనయోః - సాయంకాలమందు సూర్యుఁడు ఈదిక్కున నస్తమించును గనుక ప్రతీచి. ౩. ఉత్ ఊర్ధ్వ మంచత్యస్యా ముత్తరాయణేన రవిరిత్యుదీచీ - దీనియందు సూర్యుఁడు ఉత్తరాయణముచేత నూర్ధ్వముగాఁ బొందును. ౪. ప్రాచీ, అవాచీ, ప్రతీచీ, ఉదీచీ ఇతి పూర్వదక్షిణ పశ్చిమోత్తరదిశాం క్రమేణ నామాని-ప్రాచి, అవాచి, ప్రతీచి, ఉదీచి అను నివి క్రమముగా తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము ఈ దిక్కులకు పేళ్లు. పూర్వదక్షిణ పశ్చిమాః, పూర్వత్వాత్పూర్వా-మొదటిదిక్కు. దక్షతే వర్ధతే దక్షిణా, దక్ష వృద్ధౌ - వృద్ధిబొందునట్టిది. పశ్చాద్భవా పశ్చిమా - వెనుకదిక్కు ఉత్తరతి మేర్వాదిభ్య ఇత్యుత్తరా. తౄ ప్లవన తరణయోః-మేర్వాదులను దాఁటియుండునది. ఇవి ౪. క్రమముగా ౪ దిక్కులకుఁ బేళ్లు.

**దిశ్యం తు త్రిషుదిగ్భవే,**

**(అవాగ్భవ మవాచీన ముదీచీన ముదగ్భవమ్,**

**ప్రత్యగ్భవం ప్రతీచీనం ప్రాచీనం ప్రాగ్భవం త్రిషు.)**

దిశి భవం దిశ్యం - దిక్కులయందుఁ బుట్టినది దిశ్య మనంబడును. త్రిషు లింగేషు వర్తతే. (అవాక్ దక్షిణస్యాం భవం అవాచీనం-దక్షిణ దిక్కునఁ బుట్టినది. ఉదక్ ఉత్తరస్యాం భవం ఉదీచీనం - ఉత్తరదిక్కునఁ బుట్టినది. ప్రత్యక్ ప్రతీచ్యాం భవం ప్రతీచీనం - పశ్చిమమునఁ బుట్టినది. ప్రాక్ ప్రాచ్యాం భవం ప్రాచీనం - తూర్పునఁ బుట్టినది. ఏతేత్రిషు వర్తంతే - ఇవి మూఁడులింగముల యందును వర్తించును.)

**ఇన్ద్రో వహ్నిః పితృపతి ర్నైరృతో వరుణో మరుత్.** 2

**కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్,**

ఇంద్రాదయ ఈశాంతా అష్టౌ శబ్దాః క్రమాత్ పూర్వాదీనాం దిశాం విదిశాం చ పతయః-ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నిరృతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు వీరలెనమంద్రు వరుసగా తూర్పు మొదలైన యెనిమిది దిక్కులకు పాలకులు.

**ఐరావతః పుణ్డరీకో వామనః కుముదో ఽ ఞ్జనః** 3

**పుష్పదన్త స్సార్వభౌమ స్సుప్రీకశ్చ దిగ్గజాః,**

ఇరా ఆపః అస్మిన్ సంతీతి ఇరావాన్ సముద్రః. తస్మిన్ జాతః ఐరావతః – సముద్రమునందుఁ బుట్టినది. ౧. పుండరీకవర్ణత్వా త్పుండరీకః – తెల్లదామరవంటి కాంతి గలది. పుణతి శోభత ఇతి వా పుండరీకః, పుణ శభకర్మణి చ – ప్రకాశించునట్టిది. ౨. వామనత్వా ద్వామనః–పొట్టిదిగనుక వామనము. వామం వల్గు శరీర మస్యాస్తీతి వా వామనః– అందమైన శరీరము గలది. ౩. కుం పృథ్వీం మోదయతీతి కుముదః ముద హర్షే–భూమిని సంతోషింపఁజేయునట్టిది. కుముదవర్ణత్వాత్కుముదః – తెల్లగలువవంటి వన్నె గలది. ౪. అంజనాభత్వాదంజనః – కాటుకవన్నె గలది. అనక్తి గచ్ఛతి ప్రకాశతేవా అంజనః. అంజూ వ్యక్తిశ్లక్ష కాంతిగతిషు – లెస్సగా నడుచునదైనను ప్రకాశించునదైనను, అంజనము. ౫. పుష్పవత్ప్రకాశమానౌ దంతౌ యస్యసః పుష్పదంతః – పుష్పములవలె ప్రకాశించునట్టి దంతములుగలది. ౬. సర్వభూమ్యాం విదితః సార్వభౌమః – సమస్తభూమియందు నెఱుఁగఁబడినది. ౭. శోభనాః ప్రతీకా అవయవా యస్యసః సుప్రతీకః – మంచి అవయవములు గలిగినది. దిక్షు గజాః దిగ్గజాః – దిక్కులయందుండు గజములు. ఈ ౮ వరుసగా నష్టదిగ్గజముల పేళ్ళు.

**కరిణ్యో౽భ్రముః కపిలా పిఙ్గళానుపమాః క్రమాత్.** 4
**తామ్రపర్ణీ శుభ్రదన్తీ చాఙ్గనా చాఞ్జనావతీ,**

నభ్రమతి స్వం వల్లభం హిత్వా కుత్రచిన్న గచ్ఛతీ త్యభ్రముః. ఉ–సీ భ్రముచలనే–తన మగని విడిచి కదలనిది. అభ్రేషు మాతివర్తత ఇత్యభ్రముః. మాఙ్ మానే వర్తనేచ – మేఘములయందుండునది. ౧. కపిల వర్ణత్వాత్కపిలా – కపిలవర్ణము గలిగినది. కామ్యత ఇతి కపిలా–కోరఁబడునది. ౨. పింగళవర్ణత్వా త్పింగళా–పింగళవర్ణము గలిగినది. ౩. న విద్యతే ఉపమా యస్యాస్సా అనుపమా–తనకు సాటిలేనిది. ౪. తామ్రపర్ణాఖ్యౌషధీ సాహచర్యాత్తామ్రపర్ణీ. ఈ–సీ. తామ్రపర్ణ మనెడి ఓషధితోఁగూడినది. ౫. శోభనౌదంతౌ యస్యాస్సా శుభ్రదంతీ. ఈ–సీ. చక్కని దంతములు గలది. ౬. శోభనాన్యంగాని యస్యాస్సా అంగనా – మంచి అవయవములు కలది. పా. అంజనగిరి సదృశత్వా దంజనవర్ణ త్వాద్వా అంజనా – అంజనపర్వత సమానమౌట వలననైనను కాటుకవన్నె గల

దౌటవలన నైనను అంజన. ౭. అంజనాకారో వర్ణో ఉ స్యా అస్తీత్యంజనావతీ – కాటుకవంటి దేహకాంతి గలది. ఈ ౮ వరుసగా నష్టదిగ్గజముల భార్యల పేళ్లు.

**క్లీబావ్యయం త్వపదిశం దిశో ర్మ ధ్యే విదిక్ స్త్రియామ్.** 5

దిశోర్మధ్యం అపదిశం క్లీబం అవ్యయం చ–ఇది నపుంసకమును, అవ్యయమును, దిక్కులయొక్క మధ్యము. ౧. దిగ్భ్యాం విగతా విదిక్ – శ–సీ. రెండుదిక్కులవలన విగతమైనది. విశిష్టా దిక్ విదిక్–విశిష్టమైన దిక్కు. ఈ ౨ ను ఆగ్నేయము మొదలగు మూలలపేళ్లు.

**అభ్యన్తరం త్వన్తరాళం -**

అభ్యంతరాంతరాళశబ్దౌ అష్టదిఙ్మధ్యవాచకౌ. ఉపచారాత్కేవ లమధ్యవాచకౌ చ. ఈశబ్దములు ౨ అష్టదిఙ్మధ్యవాచకములు. ఉపచారముచేత కేవల మధ్యవాచకమును, అంతర మవకాశ మభిగతం అభ్యంతరం–అవకాశము గలిగినది. ౧. అంతరమవకాశం లాతీత్యంతరాళంలా దానే–అవకాశము నిచ్చునది.

**చక్రవాళం తు మండలమ్,**

చక్రవాళమండలశబ్దౌ మండలాకారదిక్సమూహనామనీ. దిఙ్మండల మిత్యాది ప్రయోగః. ఉపచారా దన్యత్రాపి మండలాకారవస్తు వాచకౌ చ – చక్రవాళమండల శబ్దములు మండలాకార దిక్సమూహ వాచకములు, ఉపచారమున కేవల మండలాకార వస్తువాచకములును. చక్రస్యేన వాళః సంవరణ మస్యేతి చక్రవాళం. వల సంవరణే – చక్రము వంటి వలయము గలిగినది. చక్రాకారేణ వాలతే వర్తతే చక్రవాళం–చక్రాకారముగా నుండునది. ౧. మండయత్యలంకరోతీతి మండలం, మడిభూషాయాం – అలంకరించునది. ౨.

**అభ్రం మేఘో వారివాహః స్తనయిత్ను ర్వలాహకః.** 6
**ధారాధరో జలధర స్తటిత్వా న్వారిదో ఉ మ్బుభృత్,**
**ఘన జీమూత ముదిర జలము గ్ధూమయోనయః.** 7

అపః బిభర్తీ త్యభ్రం, భృఞ్ భరణే–ఉదకమును భరించునది. నభ్రంశం త్యాపో ఉ స్మాది త్యభ్రం, భ్రంశ గతౌ–ఉదకములు దీనినుండి కొఱతపడవు – అనఁగా దీనియందు లేకపోవు. అపో రాతీ త్యభ్రం, రా

దానే. ఉదకము నిచ్చునది. అభ్రతిగచ్ఛతీత్యభ్రం, అభ్రగతౌ - సంచరించునది. ౧. మేహతీతి మేఘః, మిహ సేచనే-తడుపునది. ౨. వారి వహతీతి వారివహః, వహ ప్రాపణే - జలమును వహించునది. ౩. స్తనయతీతి స్తనయిత్నుః ఉ-పు. స్తన గదీ దేవశబ్దే - మ్రోయునది. ౪. బలంన జహాతీతి బలహకః, ఓహాక్ త్యాగే, వబయో రభేదాత్ వలాహకః - బలమును విడువనిది. ౫. జలాధారాణాం ధరః ధారాధరః, ధృఞ్ ధారణే - జలధారలను ధరించునది. ౬. జలస్య ధరః జలధరః - జలమును ధరించునది. ౭. తటితః అస్య సంతీతి తటిత్వాన్ త-పు. మెఱుపులు గలది. ౮. వారి దదాతీతి వారిదః, డు దాఞ్ దానే - ఉదకము నిచ్చునది. ౯. అంబు బిభర్త తయంబుభృత్, త-పు. భృఞ్ భరణే - ఉదకమును భరించునది. ౧౦. హంతి తాపమితి ఘనః - తాపమును బోఁగొట్టునది. వాయునా హన్యత ఇతి వా ఘనః, హన హింసాగత్యోః ః-వాయువుచేత కొట్టఁబడునది. ౧౧. జీవన ముదకం మూయతే బద్ధ్యతే ఽత్ర జీమూతః, మూఙ్ బంధనే-ఉదకము దీనియందు బంధిపఁబడును. ౧౨. మోదంతే అనేన కృషీవలా ఇతి ముదిరః, ముదహర్షే - దీనిచేత పైరుపెట్టుకాఁపులు సతోషింతురు. ౧౩. జలం ముంచతీతి జలముక్. చ-పు. ము ఛ్ల్ మోక్షణే - ఉదకమును విడుచునది. ౧౪. ధూమః యోనిః కారణం యస్య సధూమయోనిః - ఇ-పు. ధూమము కారణముగాఁ గలిగినది. ఈ ౧౫ మబ్బుపేళ్లు.

**కాదమ్బినీ మేఘమాలా -**

క ముదక మాదదత కదంబాః మేఘాః. తే ఽత్ర సంతీతి కాదంబినీ. ఈ-సీ. జలమును పుచ్చుకొనునవి గనుక కదంబము లనఁగా మేఘములు-అవి గలిగినది. కదంబాః వృక్షాః పుష్ప్యం త్యస్యామితి కాదంబినీ - ఇది గలిగినప్పుడు కడపచెట్టు పుష్పించును. కాదంబాః కలహంసా అస్యాం సంతీతి వా - హంసలు గలిగినది. ౧. మేఘానం మాలా మేఘమాలా-మేఘములయొక్క వరుస. ఈ ౨ మేఘపంక్తి పేళ్లు.

**త్రిషు మేఘభవే ఽభ్రియం,**

అభ్రే భవం అభ్రియం, తచ్చ త్రిషు లింగేషు వర్తతే - మేఘము వలనఁ బుట్టినది. ఈ ౧ మేఘమందుఁ బుట్టినదాని పేరు.

**స్తనితం గర్జితం మేఘ నిర్ఘోషో రసితాది చ.** 8

స్తనతీతి స్తనితం, స్తన దేవశబ్దే – మ్రోయుచుండునది. ౧. గర్జతీతి గర్జితం గర్జశబ్దే – గర్జించునది. ౨. మేఘానాం నిర్ఘోషః మేఘ నిర్ఘోషః – మేఘములయొక్క అతిధ్వని. ౩. రసతి శబ్దాయతే రసితం. రసశబ్దే – మ్రోయుచుండునది. ౪. ఆదిశబ్దేన గర్జనాదయః – మేఘగర్జితనామాని. ఈ ౪ ను ఆదిశబ్దముచేత గర్జనశబ్దాదులును ఉఱుము పేళ్లు.

**శంపా శతహ్రదా హ్రాది న్యైరావత్యః క్షణప్రభా,**
**తడి త్సౌదామనీ విద్యు చ్చంచలా చపలా అపి.** 9

భయంకరత్వాచ్ఛం సుఖం పిబతీతి శంపా – భయమును గలిగించునదిగాన సుఖమును మ్రింగివేయునది. పా పానే. ౧. శతధాహ్రాదతే శతహ్రదా. హ్రాద అవ్యక్తేశబ్దే – అనేకవిధములుగా అస్ఫుటమై మ్రోయుచుండునది. ౨. హ్రాదో ౽స్యా అస్తీతి హ్రాదినీ. ఈ–సీ. అవ్యక్త శబ్దము గలిగినది. ౩. ఇరా ఆపః సన్త్యస్య ఇరావాన్ – మేఘః –తస్మిన్ ఇరావతి భవా ఐరావతీ. ఈ–సీ. ఇరావంతము మేఘము. అందుఁ బుట్టినది. ౪. క్షణం ప్రభా యస్యా స్సా క్షణప్రభా – క్షణమాత్రము ప్రకాశించునది. ౫. ప్రభయా తమాంసి తాడయతీతి తడిత్. త – సీ. తడ ఆఘాతే–అంధకారమును పోఁగొట్టునది. ప్రభయా నయనాని తాడయతీతి తడిత్ – కాంతిచేత కన్నుల మూయింపఁజేయునది. ౬. సుదామ్నా ఐరావతేన సహవర్తత ఇతి సౌదామినీ. ఈ–సీ. సుదామమనఁగా నైరావతము, దానితోఁ గూడియుండునది. సుదామ్నా అద్రిణా ఏకదిక్ సౌదామినీ – సుదామ మనెడి పర్వతముతోఁ గూడ నొక దిక్కునందుండునది. సుదామవ ద్దీర్ఘాకారో ౽స్యా అస్తీతి వా – దండవలె దీర్ఘాకారము గలది. ౭. విశేషేణ ద్యోతత ఇతి విద్యుత్. త. సీ. ద్యుత దీప్తౌ – మిక్కిలి ప్రకాశించునది. ౮. చంచతీతి చంచలా. చంచగతౌ కదలునది. ౯. చోపతీతి చపలా. చుప మందాయాం గతౌ – మెల్లఁగాఁ బోవునది. ఈ ౧౦. మెఱుపు పేళ్లు.

**స్ఫూర్జథు ర్వజ్రనిర్ఘోషే-**

స్ఫూర్జతీతి స్ఫూర్జథుః ఉ – పు. టు ఓ స్ఫూర్జా వజ్రనిర్ఘోషే – మిక్కిలి మ్రోయునది. ౧. వజ్రస్య నిర్ఘోషః వజ్ర నిర్ఘోషః. వజ్రాయుధము

యొక్క మ్రోఁత. పా. వజ్రనిష్పేష ఇతి వజ్రనిర్ఘాత ఇతిచ పాఠః. ఈ ౨ వజ్రపు మ్రోఁత పేళ్ళు.

**మేఘజ్యోతి రిరంమదః,**

మఘస్య జ్యోతిః మేఘజ్యోతిః. స–న. మేఘ సంబంధమైన అగ్ని. ౧. ఇరయా జలేన మాద్యతి దీప్యత ఇతి ఇరంమదః మదీహర్షగ్లేపనయోః–ఇర యనఁగా జలము. దానిచేత వృద్ధిఁబొందునట్టిది. ఈ ౨ వజ్రాగ్నిపేళ్లు.

**ఇంద్రాయుధం శక్రధనుః -**

ఇంద్రస్య ఆయుధం ఇంద్రాయుధం. ఇంద్రుని యాయుధము. ౧. శక్రస్య ధనుః శక్రధనుః. స–న. శక్రుని ధనుస్సు. ౨. మేఘప్రతిఫలిత నానావర్ణస్య ధానురాకారేణ దృశ్యమానస్య సూర్యరశ్మే ర్నామనీ–ఇది మేఘమునందు బ్రతిఫలించి, నానావర్ణమై ధనురాకారముగా నగపడుచున్న సూర్యరశ్మి. ఈ ౨ ఇంద్రుని ధనుస్సు పేళ్లు.

**తదేవ ఋజు రోహితమ్.** 10

తదేవ ఋజు రోహిత మిత్యుచ్యతే – ఆ యింద్ర ధనుస్సు చక్కఁగా నుండునేని రోహిత మనంబడును. రోహతీతి రోహితం. రుహ బీజజన్మని ప్రాదుర్భావే చ–ప్రాదుర్భవించునది. రోహితవర్ణత్వా ద్వా రోహితం రక్తవర్ణము గలది. ఈ ౧ చక్కని యింద్రధనుస్సు.

**వృష్టి ర్వర్షం -**

వర్షతీతి వృష్టిః ఇ – సీ. వర్షం చ. వృషు సేచనే – తడుపునట్టిది గనుక వృష్టి, వర్షము. ఈ ౨ వాన పేళ్లు.

**తద్విఘాతే వగ్రహావగ్రహౌ సమౌ,**

తద్విఘాతే వృష్టి ఘాతే వగ్రహావగ్రహశబ్దౌ వర్తేతే. అవగృహ్ణాతి ప్రతిబధ్నాతి వర్ష మితి వగ్రహ అవగ్రహశ్చ గ్రహ ఉపాదానే–వర్షమును ప్రతిబంధించునట్టిది గనుక వగ్రహము, అవగ్రహమును. ఈ ౨ ను గ్రహవిరోధముచేత సంభవించిన వర్షప్రతిబంధము. వాన కఱవు పేళ్లు.

**ధారాసంపాత ఆసారః –**

ధారాణాం సంభూయ పతనం ధారాసంపాతః – ఉదకధారలు కూడి యెడతెగక పడుట. ౧. ఆసమంతా త్సరతీ త్యాసారః, సృగతౌ

అంతటఁ బడునట్టిది. ౨ జడివానపేళ్లు.

**శీకరో ఽ మ్బుకణాః సృతాః.** 11

శీకతే సించతీతి శీకరః. శీకృ సేచనే - తడుపునది. శీతం కరోతీతి వా శీకరః - శీతమును జేయునది. ౧. సృతాః, వాయునా ఇత స్తతః ప్రేరితాః అమ్బుకణాః శీకరాః-గాలిచే నిటునటు విసరఁబడిన వానచినుకులు శీకరములు. ౨. నీటితుంపురులు.

**వర్షోపలస్తు కరకా -**

వర్షస్య ఉపలః వర్షోపలః-వానయొక్క శిల. ౧. కృణోతి హినస్తిసస్య మితి కరకా. ప్స. కృఞ్ హింసాయాం పయిరులను చెఱచునది. కీరతే వాయునా భువీతి కర్యకా. కౄవిక్షేపే-వాయువుచేత వెదచల్లఁబడునది. అయం పుంలింగేచ వర్తతే-ఇది పుంలింగమందును గలదు. 'వర్షోపలస్తు కరకా కరకో ఽ పిచ దృశ్యత' ఇతి రభసః ౨ వడగండ్లు.

**మేఘచ్ఛన్నే ఽ హ్ని దుర్దినమ్,**

మేఘచ్ఛన్నే ఽ హ్ని దుర్దినశబ్దో వర్తతే - మొయిళ్లచేఁ గప్పఁబడిన దినము దుర్దిన మనంబడును, దుష్టం దినం దుర్దినం - దుష్టమైన దినము. ౧ మబ్బు పట్టిన దినము.

**అంతర్ధా వ్యవధా పుంసి త్వంతర్ధి రపవారణమ్.** 12
**అపిధాన తిరోధాన పిధానాచ్ఛా దనాని చ,**

అంతర్ధీయతే అనయా అంతర్ధా, వ్యవధీయతే అనయా వ్యవధా, డు ధాఞ్ ధారణపోషణయోః - పదార్థము దీనిచేత వ్యవహితముగా ధరింపఁబడును. ౧. ౨. అంతః ధీయతే అనేన అంతర్ధిః. ఇ-పు. దీనిచేత పదార్థము కానఁబడదు. ౩. అపవార్యతే అనేనేత్యపవారణం, వృఞ్ వరణే-దీనిచేత పదార్థము కప్పఁబడును. ౪. అపిదధాతీత్యపిధానం-మిక్కిలి మఱుఁగుపఱచునది. ౫. తిరో దధాతీతి తిరోధానం-అడ్డమగునది. ౬. పిదధాతీతి పిధానం మఱుఁగగునట్టిది. ౭. చాదయతీతి చ్ఛాదనం ఛద అపవారణే కప్పునది. ౮. ముసురుకొనుట.

**హిమాంశు శ్చన్ద్రమాశ్చన్ద్ర ఇన్దుః కుముదబాన్ధవః.** 13
**విధు స్సుధాంశు శ్శుభ్రాంశు రోషధీశో నిశాపతిః,**
**అబ్జో జైవాతృక స్సోమో గ్లౌర్మృగాఙ్కః కళానిధిః.** 14

**ద్విజరాజ శ్శశధరో నక్షత్రేశః క్షపాకరః,**

హిమాః శీతాః అంశవో యస్య సః హిమాంశుః ఉ. పు. చల్లని కిరణములు గలవాడు. ౧. చంద్రేణ కర్పూరేణ మీయతే ఉపమీయత ఇతి చంద్రమాః. స. పు. మాఙ్ మానే. చంద్ర మనఁగా కర్పూరము. దానితోఁ బోల్చఁబడువాఁడు. ౨. చందయతీతి చంద్రః. చది ఆహ్లాదనే సంతోషింపఁజేయువాఁడు. ౩. ఉనక్తి తుషారకణైరితి ఇందుః. ఉ.పు. ఉందీ క్లేదనే–మంచుకిరణములచేత తడిపెడువాఁడు. ౪. కుముదానాం బాంధవః కుముదబాంధవః – కలువలకు చుట్టము. ౫. దేవా ఏనం విశేషేణ ధయంతి పిబంతీతి విధుః. ఉ. పు. ధేట్పానే–వేల్పు లీతని మిక్కిలి పానము చేయుదురు. ౬. సుధారూపా అంశవో యస్య సః సుధాంశుః, ఉ–పు. అమృతరూపములైన కిరణములు గలవాఁడు. ౭. శుభ్రాః అంశవో యస్యసః శుభ్రాంశుః ఉ–పు. తెల్లని కిరణములుగలవాఁడు. ౮. ఓషధీనామీశః ఓషధీశః –వరి మొదలగు నోషధులకుఁ బ్రభువు. ౯. నిశాయాః పతిః నిశాపతిః. ఇ. పు. రాతిరికి ఱేడు. ౧౦. అప్సుజాతఃఅబ్జః. జనీ ప్రాదుర్భావే–నీటియందుఁ బుట్టినవాఁడు. ౧౧. ఓషధీః జీవయతీతి జైవాతృకః జీవప్రాణధారణే – పైరులను బ్రతికించువాఁడు. ౧౨. సూతే అమృతమితి సోమః, షూఙ్ ప్రాణిప్రసవే– అమృతమును బుట్టించినవాఁడు. సూయత ఇతివా సోమః–ప్రతిపక్షమునందును బుట్టింపఁబడువాఁడు. ౧౩. ప్రతిమాసం గ్లాయతిక్షయతీతిగ్లౌం. ఔ. పు. గ్లేమ్లైహర్షక్షయే–ప్రతిమాసము క్షయించువాఁడు. ౧౪. మృగః అంకో యస్య సః మృగాంకః– మృగము చిహ్నముగాఁ గలవాఁడు. ౧౫. కళానాం నిధిః కళానిధిః. ఇ. పు. కళల కునికిపట్టు. ౧౬. ద్విజానాం బ్రాహ్మణానాం రాజా ద్విజరాజః–పుడమి వేల్పుల ఱేఁడు. ౧౭. శశస్య ధరః శశధరః–కుందేటిని ధరించినవాఁడు. ౧౮. నక్షత్రాణామీశః నక్షత్రేశః – చుక్కలఱేఁడు. ౧౯. క్షపాం కరోతీతి క్షపాకరః. దు కృఞ్ కరణే–రాత్రిని జేయువాఁడు. ౨౦ చంద్రుని పేళ్లు.

**కలా తు షోడశో భాగో -**

చంద్రస్య షోడశోభాగోయః సకళేత్యుచ్యతే–చంద్రుని పదియాఱవ భాగము కళ యనంబడును. కల్యతే సంఖ్యాయత ఇతి కలా, కలసం

ఖ్యానే - లెక్క పెట్టఁబడునది. ౧ చంద్రునిలోని పదియాఱవపాలు.

**బిమ్బో ఽ స్త్రీ మణ్డలం త్రిషు.** 15

బింబతి విస్తారం ప్రాప్నోతీతి బింబః. పు. బింబ ఆభోగే-విస్తారమును జెందునది. బింబతి ప్రకాశత ఇతివా బింబః, బింబ గతి ప్రజనన కాంత్యసనఖాదనేషు - ప్రకాశించునది. ౧. మండయతి భూషయతీతి మండలం. త్రి. మడిభూషాయాం-అలంకరించునది. ౨. సూర్యచంద్రుల మండలములు.

**భిత్తం శకలఖణ్డే వా పుంస్యర్ధః -**

భిద్యత ఇతి భిత్తం, భిదిర్ విదారణే-వ్రక్కలింపఁబడునది. ౧. శక్తతే భేత్తుమితి శకలం ! పు. శక్‌శక్తౌ-భేదింప శక్యమైనది. ౨. ఖంద్యత ఇతి ఖండం. పు. ఖడి ఖండనే-త్రుంచఁబడునది. ౩. అర్ధతి భేదం గచ్ఛతీత్యర్ధః. పు. అర్ధగతౌ - భేదమును బొందునది. ఋద్యతే ఛిద్యతే సముదాయో ఽ నేనేతి అర్ధః, ఋధు వృద్ధౌ - దీనిచేత సముదాయము విభజింపఁబడును. ౪. తునక పేళ్లు.

**అర్ధం సమే ఽ ంశకే,**

అర్ధం. న. ౧ సగముపాలు.

ఈ అర్ధశబ్దము శకలమును జెప్పునప్పుడు పుల్లింగము. సగమును జెప్పునపుడు న. లిం.

**చన్ద్రికా కౌముదీ జ్యోత్స్నా -**

చంద్రో ఽ స్త్యస్యామితి చంద్రికా-చంద్రయుక్తమైనది. ౧. కు ముదానా మియం కౌముదీ, తద్వికాసహేతుత్వాత్-కలువలు పుష్పించుటకు హేతువైనది గనుక కౌముది. ౨. జ్యోతి రస్యామస్తీతి జ్యోత్స్నా-ప్రకాశము గలిగినది. ౩. వెన్నెల పేళ్లు.

**ప్రసాదస్తు ప్రసన్నతా.** 16

ప్రసీదదీతి ప్రసాదః. షద్ విశరణగత్యవసాదనేషు. ప్రసన్న స్వభావః ప్రసన్నతా-ప్రసన్నమగుట ప్రసాదము. ప్రసన్నతయు. ఈ ౨ ను నైర్మల్యము పేళ్లు.

**కళఙ్కాఙ్కౌ లాంఛనం చ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్,**

**(పాఠః కేతు ర్ధ్వజో లిఙ్గం నిమిత్తం వ్యఙ్జనం పదమ్,**

**ప్రజ్ఞానం చాప్యభిజ్ఞానం లలామమం చ లలామ చ.)**

కల్యతే జ్ఞాయతే అనేనేతి కళంకః, కల సంఖ్యానే–దీనిచేత పదార్థం బెఱుంగఁబడును. ౧. అంక్యతే అనేనేత్యంకః, అకి లక్షణే–దీనిచేత పదార్థము లక్షింపఁబడును. ౨. లాంఛ్యతే లక్ష్యతే అనేనేతి లాంఛనం లాఞ్ఛ లక్షణే–పదార్థము దీనిచేత లక్షింపఁబడును. ౩. చహతీతి చిహ్నం, చహ పరికల్కనే–ఎఱిఁగించునది. చహ్యత ఇతి చిహ్నం–ఎఱుఁగఁబడునది. ౪. లక్ష్యతే అనేనేతి లక్ష్మ. ౫. న–న–లక్షణంచ, లక్షదర్శనాంతకనయోః– ౬ పదార్థము దీనిచేతఁ జూడఁబడును. ఈ ౬ గుఱుతుపేళ్లు.

**సుషమా పరమా శోభా -**

సుష్ఠు సమం సర్వ మస్యా స్సుషమా–దీనికి సర్వము లెస్సగ సమమై యుండును. ౧. శ్రేష్ఠమైన కాంతి.

**శోభా కా న్తిర్ద్యుతి శ్ఛవిః -** 17

శోభయతీతి శోభా, శుభ శుంభ శోభార్థే–ప్రకాశింపఁజేయునది. ౧. కామ్యత ఇతి కాంతిః. ఇ–సీ. కము కాంతౌ – ఇది కోరఁబడుచున్నది గనుక కాంతి. ౨. ద్యోత ఇతి ద్యుతిః ఇ–సీ. ద్యుత దీప్తౌ–ప్రకాశించునది. ౩. ఛ్యత నాశయత్యంధ కారమితి–ఛవిః. ఇ – సీ. ఛోఛేదనే అంధకారమును పోఁగొట్టునది. ఛ్యతి నాశయత్యశోభా మితివా–అశోభను పోఁగొట్టునది. ౪. శోభాసాహచర్యా త్కాంత్యాదయః స్త్రీలింగాః–శోభా శబ్దముతోడి కూటమి వలన కాంత్యాది శబ్దములు ౪. స్త్రీలింగములు. ౪ కాంతి పేళ్లు.

**అవశ్యాయస్తు నీహార స్తుషార స్తుహినం హిమమ్,**
**ప్రాలేయం మిహికా చ -**

అవశ్యాయతే శైత్యం సంపద్యత ఇత్యవశ్యాయః, శైజ్గతౌ – శైత్యమును బొందునది. ౧. నితరాం హ్రియతే అగ్నినా నీహారః, హృఞ్ హరణే–అగ్నిచేత మిక్కిలి హరింపఁబడునది. ౨. తప్తం తోషయతీతి తుషారః, తుషతుష్టౌ – తాపము నొందినవాని సంతోషింపఁజేయునది. ౩. తోహతి అర్దయతి పద్మమితి తుహినం, తుహిర్ అర్దనే – పద్మమును బీడించునది. ౪. హంతి తాపమితి హిమం, హన హింసాగత్యోః – తాపమును బోఁగొట్టునది. ౫. ప్రళయాచ్ఛరదంతా దాగతమితి ప్రాలేయం.

ప్రళయ మనఁగా అంతము. శరత్కాలాంతమున వచ్చునది. ౬. మేహతి భువనమితి మిహికా, మిహ సేచనే-భూమిని దడుపునది. పా. మహికా మహ్యతే రాగిభిరతి మహికా, మహ పూజాయాం - కాముకులచేత పూజింపఁబడునది. పా. హిమికా, హినోతి వర్ధతే హిమికా. హి గతౌ వృద్ధౌ చ - వృద్ధిఁబొందునది. ఈ ౭ మంచు పేళ్లు.

**అథ హిమానీ హిమసంహతిః.** 18

మహ ద్ధిమం హిమానీ. ఈ-సీ. అధికమైన మంచు. ౧. హిమస్య సంహతిః హిమసంహతిః. ఇ - సీ మంచు సమూహము. ౨ దట్టమైన మంచు.

**శీతం గుణే -**

శీతం గుణవాచి క్లీబం - శీతశబ్దము గుణమును జెప్పునపుడు. న. చలి (చలువ) పేరు.

**తద్వదర్థాస్సుషీమ శ్శిశిరో జడః,**

**తుషార శ్శీతల శ్శీతో హిమ స్సప్తాన్య లిఙ్గకాః.** 19

శ్యాయతే శీతం. శ్యైజ్ గతౌ - వ్యాపించునది. ౧. తద్వదర్థాశ్శీత గునవద్వస్తువాచకాః, సుషీమాదయ స్సప్త అన్యలింగకాః విశేష్యలింగాః-ఆశీత గుణముగల పదార్థమును జెప్పెడు సుషీమ శబ్దము మొదలగు ౭ శబ్దములు విశేష్యలింగము గలవి. సుష్ఠు సీమా మర్యాదా యస్య సుషీమః-చక్కని హద్దుగలది. పా. సుశీమః, సుష్ఠు శ్యాయత ఇతి సుశీమః ఇతితాలవ్యపాఠో ఽ ప్యస్తి - లెస్సగా వ్యాపించునది. ౧. శినోతి పద్మ శోభా మితి శిశిరః-శీఞ్ నిశాతనే-పద్మములకాంతిఁ జెఱుచునది. ౨. జలత్యపవారయతీతి జడః, లడయోరభేదాత్ జలఅపవారణే - ధైర్యమును నివారించునది. ౩. తప్తం తోషయతీతి తుషారః, తుష తుష్టౌ - తప్తుఁడైనవానిని సంతోషింపఁజేయునది. ౪. శ్యాయతే శీతః శ్యైజ్ గతౌ. వ్యాపించునది. ౬. హినోతి వర్ధత ఇతి హిమః, హిగతౌ వృద్ధౌ చ- వృద్ధిఁబొందునది. ఈ ౭ చల్లని వస్తువు పేళ్లు.

**ధ్రువ ఔత్తానపాదిః స్యాత్ -**

ధ్రువతీతి ధ్రువః, ధ్రువస్థైర్యే-స్థిరమైనవాఁడు. ౧. ఉత్తానపాదస్య అపత్యం ఔత్తానపాదిః - ఉత్తానపాదుని కొడుకు. ఈ ౨ ధ్రువుని పేళ్లు.

**అగస్త్యః కుమ్భసమ్భవః**

**మైత్రావరుణిః -**

అగం విన్ధ్యం స్త్యాయతి స్తంభయతి త్యగస్త్యః. స్త్యైష్ట్యై శబ్దసంఘాతయోః –అగ మనఁగా పర్వతము విన్ధ్యపర్వతము. దాని నణఁచినవాఁడు. అగస్తి రితిపాఠాంతరం. ౧. కుంభే సంభవో యస్య సః కుంభసంభవః–కలశమునందుఁ బుట్టినవాఁడు. ౨. మిత్రావరుణయో రపత్యం మైత్రావరుణిః. ఇ. పు. మిత్రావరుణులకొడుకు. ఈ 3 అగస్త్యుని పేళ్లు.

**అస్యైవ లోపాముద్రా సధర్మిణీ.** 20

అస్యైవ అగస్త్యస్యైవ సధర్మిణీ పత్నీ లోపాముద్రేత్యుచ్యతే– ఈ యగస్త్యునిభార్య లోపాముద్రయనంబడును. లోపయతి యోషితాం, రూపాభిమానమితి లోపా. ముద్రయతి స్రష్టు స్సృష్టిమితి ముద్రా. లోపా చాసౌ ముద్రాచ లోపాముద్రా – స్త్రీలయొక్క రూపాభిమానమును లోపింపఁజేయునదియు, బ్రహ్మసృష్టిని ముద్రింపఁ జేయునదియును గనుక లోపాముద్ర. ముదం రాతీతి ముద్రా, రా ఆదానే. సా న భవతీత్యముద్రా, విరహే పతిశుశ్రూషాలోపే అముద్రా అసంతుష్టా లోపాముద్రా– ముద్ర యనఁగా సంతోషముగలది. భర్తృవిరహకాలమునందు పతిశుశ్రూష లేమిచేత సంతసములేనిది గనుక లోపాముద్ర. ౧. సమానః ధర్మః అస్యా అస్తీతి సధర్మిణీ – పతితోడ సరియైన ధర్మముగలది. ౧ అగస్త్యుని భార్య.

**నక్షత్రమృక్షం భం తారా తారకాప్యుడు వా స్త్రియామ్,**

నక్షరతీతి నక్షత్రం, క్షర సంచలనే–నశింపనిది గనుక నక్షత్రము. న క్షీయత ఇతి వా నక్షత్రం. క్షీ క్షయే–నశింపనిది. ౧. ఋక్షతి తమో నాశయతీతిఋక్షం. ఋక్షహింసాయాం చీఁకటిని బోఁగొట్టునది. ఋక్ష తీతి ఋక్షం, ఋక్షగతౌ – సంచరించునది. ౨. భాతీతి భం, భా దీప్తౌ – ప్రకాశించునది. 3. తరంత్యనయా నావికా ఇతి తారా. తారకా చ.స్న. తౄప్లవనతరణయోః – దీనిచేత నావికులు తరింతురు. ౪. ౫. ఉడ్డీయత ఇత్యుడు. ఉ. స్న. డీఙ్ విహాయసా గతౌ–ఆకాశమందు సంచరించునది. ౬. ఉడు వాస్త్రియాం. ఉడుశబ్దో వికల్పేన స్త్రీలింగే వర్తతే. పక్షే నపుంసకలింగేచ. తారకాఽపీత్యపిశబ్దేన తార కాశబ్దస్యాపి వాస్త్రియామి

త్యనేనాన్వయః. పక్షేక్లీ బత్వం చ ఉడుశబ్ద సాహచర్యాత్. తదుక్తం-ద్విత్రై ర్వ్యోమ్ని తుషారబిందుమధురచ్ఛాయైః స్థితం తారకై రితి-ఉడు శబ్దమునకు స్త్రీ నపుంసకలింగములు గలవు. తారాతారకాశబ్దములకు ఉడుశబ్దమునకువలె లింగములు గలవు. ఈ ౬ సాధారణముగా నన్ని చుక్కలకుఁ బేళ్లు.

**దాక్షాయణ్యో౽ శ్వినీత్యాది తారాః -**

అశ్వినీత్యాదితారా దాక్షాయణ్య ఇత్యుచ్యంతే - అశ్విన్యాది రేవత్యంత నక్షత్రములు దాక్షాయణు లనంబడును. దక్షస్య ప్రజాపతే రపత్యాని స్త్రియః దాక్షాయణ్యః-దక్షప్రజాపతియొక్క కొమార్తెలు. ౧ అశ్వినిమొదలు ౨౭ నక్షత్రములకుఁ బేళ్లు.

**అశ్వయు గశ్వినీ.** 21

అశ్వం యునక్తి రూపేణ బధ్నాతీ త్యశ్వయుక్. జ.సీ. యుజిర్ యోగే - రూపముచేత అశ్వసామ్యమును బొందునది. ౧ అశ్వరూప యోగా దశ్వినీ. ఇ.సీ. అశ్వమువంటి రూపము గలది. ౨. అశ్విని పేళ్లు.

**రాధా విశాఖా -**

రాధ్నోతి కార్యమనయా రాధా, రాధ సంసిద్ధౌ - దీనిచేఁ గార్యము సిద్ధించును. ౧. విశాఖతే కాంత్యా వ్యాప్నోతీతి విశాఖా శాఖృ వ్యాప్తౌ - కాంతిచేత వ్యాపించునది. ౨ విశాఖ పేళ్లు.

**పుష్యే తు సిధ్యతిష్యౌ-**

పుష్ణాతి అభిలషితమితి పుష్యః. పుష్యంత్యస్మి న్నర్థా ఇతి వా పుష్యః, పుష పుష్టౌ - కోరికను వృద్ధిఁబొందించునది. ౧. సిధ్యం త్యస్మిన్నర్థా ఇతి సిధ్యః -దీనియందు ప్రయోజనములు సిద్ధించును గనుక సిధ్యము. పా. సాధ్నోతి వాంఛిత మితి సిధ్యః - కోరికను సాధించునది. ౨. తుష్యం త్యస్మి న్నర్థసిద్ధయే ఇతి తిష్యః, తుష తుష్టౌ - దీనియందు కార్యసిద్ధికొఱకు సంతోషింతురు. త్వేషత ఇతి వా తిష్యః త్విష దీప్తౌ-ప్రకాశించునది. ౩. పుష్యనక్షత్రము పేళ్లు.

**శ్రవిష్ఠయా,**

**సమా ధనిష్ఠా -**

శ్రూయతే శుభకర్మణీతి శ్రవిష్ఠా, శ్రు శ్రవణే - శుభకర్మము

నందు మంచిదని వినఁబడునది. ౧. ధనతి ధనం కరోతీతి ధనిష్ఠా, ధనధాన్యే-సంపదను జేయునది. ౨. ధనిష్ఠ పేళ్లు.

**స్యుః ప్రోష్ఠపదా భాద్రపదాః స్త్రియః.** 22

ప్రోష్ఠోగౌః. తస్యేవ పాదాయాసామితి ప్రోష్ఠపదాః. ఆ. సీ. ప్రోష్ఠ మనఁగా నెద్దు, దానిపాదములవంటి పాదములు గలవి. భద్రం పదం యాసాం తాః -శుభకరములైన పాదముగలవి. ఈ ౨ పూర్వభాద్ర ఉత్తరాభాద్రల పేళ్లు.

**మృగశీర్షం మృగశిర స్తస్మి న్నే వాగ్రహాయణీ,**

ఆకృత్యా మృగస్యేవ శీర్షం యస్య తత్ మృగశీర్షం, మృగశిరశ్చ. స. న. ఆకృతిచేత మృగముయొక్క శిరమువంటి శిరము గలిగినది. ౧. ౨. అగ్రే హాయనో ఽస్యాః ఆగ్రహాయణీ. ఈ. సీ. మృగశీర్షయు క్పూర్ణిమాయాః సంవత్సరాదౌ నవధాన్య హ విర్యాగహేతుత్వాత్ - మృగశీర్ష నక్షత్రముతోఁగూడిన పున్నమయందు సంవత్సరమునకు మొదట నూతన ధాన్యముచేత హవిర్యాగము చేయుటవలన ఆగ్రహాయణి యనఁగా అగ్రమందు హాయనము గలిగినది. ఆగ్రహాయనాః నవవ్రీహయః అస్యాం సంతీతి ఆగ్రహాయణీ - నూతన ధాన్యములు ఇందుఁ గలవు గనుక ఆగ్రహాయణి. ఈ ౩ మృగశీర్షము పేళ్లు.

**ఇల్వలా స్తచ్ఛిరోదేశే తారకా నివసన్తియాః.** 23

తస్య మృగశీర్షస్య శిరోదేశే యాస్తారకా నివసంతితాః ఇల్వలా ఇత్యుచ్యంతే- మృగశీర్ష నక్షత్రమునకు మీఁద నున్న నక్షత్రములు ఇల్వల లనంబడును. ఇలంతి గచ్ఛంచి నక్షత్రాణాం మూర్ధ్నితి ఇల్వలాః. సీ. ఇలప్రేరణే - నక్షత్రములమీఁద సంచరించునవి - శివబాణేన ఇల్యంతే ప్రేర్యంతే ఇల్వలాః - శివుని బాణముచేత ప్రేరేపింపఁబడునవి. పా. ఇన్వకాః-మృగశీర్షపై నుండు చిన్న చుక్కలకు పేళ్లు.

**బృహస్పతి స్సురాచార్యో గీష్పతి ర్ధిషణో గురుః,**
**జీవ ఆఙ్గీరసో వాచస్పతి శ్చిత్ర శిఖండిజః.** 24

బృహతాం దేవానాం వేదమంత్రాణాం వా పతిః బృహస్పతిః, ఇ.పు. దేవతలును వేదమంత్రములును బృహత్తు లనంబడును. వారలకైె నను వానికైనను ప్రభువు. ౧ సురాణాం ఆచార్యః సురాచార్యః - దేవతల

కాచార్యుఁడు. ౨. గిరాం పతిః గీష్పతిః–వాక్కులకు పతిః 3 ధిషణాబుద్ధిరస్యాస్తీతి ధిషణః–మంచిబుద్ధి గలవాఁడు. ౪. సర్వార్థాన్ గృణాతీతి గురుః. ఉ. పు. గృశబ్దే–సర్వార్థములను వచించువాఁడు. ౫. జీవయతి దేవానితి జీవః. జీవప్రాణధారణే–దేవతలను బ్రతికించువాఁడు. జీవ్యతే మృతో உనేనజీవః – చచ్చినవాఁడు ఈయనవలన బ్రతుకును. ౬. అంగిరసః అపత్యం ఆఙ్గిరసః అంగిరస్సు కొడుకు. ౭. వాచాం పతిః వాచస్పతిః – వాక్కులకు పతి. ౮. అంగిరా ఏవ చిత్రశిఖండీ తస్మాజ్జాతః చిత్రశిఖండిజః – చిత్ర శిఖండి యనఁగా నంగిరస్సు, వానికొడుకు. ౯. బృహస్పతి (దేవగురువు) పేళ్లు.

**శుక్రో దైత్యగురుః కావ్య ఉశనా భార్గవః కవిః,**

శుక్లవర్ణత్వా చ్ఛుక్రః – శ్వేతవర్ణము గలవాఁడు. రుద్రశుక్రద్వారేణ నిర్యాతత్వాద్వా శుక్రః – రుద్రునిరేతస్సు వలనఁ బుట్టినవాఁడు. శుచం దుఃఖం రాతి దేవేభ్య ఇతి వా శుక్రః రాదానే–దేవతలకు దుఃఖము నిచ్చువాఁడు. ౧. దైత్యగురుః. ఉ–పు. దైత్యులకు గురువు. ౨. కవే రపత్యం కావ్యః కవి యను ఋషికొడుకు. ౩. వష్టి ఇచ్ఛతి దైత్యశ్రేయ ఇత్యుశనాః. స పు. వరకాంతౌ – అసురులశ్రేయస్సు నిచ్ఛయించువాఁడు. ౪. భృగోరపత్యం భార్గవః–భృగు సంతతియందుఁ బుట్టినవాఁడు. ౫. కవయతి చాతుర్యేణ వర్ణయతీతి కవిః. ఇ–పు. చాతుర్యముచేత వర్ణించువాఁడు. ౬. శుక్రుని పేళ్లు.

**అఙ్గారకః కుజో భౌమో లోహితాఙ్గో మహీసుతః.** 25

అంగతి గచ్ఛతీత్యంగారకః, అగి గతౌ – సంచరించువాఁడు. అంగాని అరయతి పీడయతీతి వా, అర పీడనే–శరీరములను పీడించువాఁడు. అంగీరవర్ణత్వా దంగారకః – నిప్పువంటివర్ణము గలవాఁడు. ౧. కౌ పృథివ్యాంజాతః కుజః, నీప్రాజదుర్భావే – భూమియందుఁ బుట్టినవాఁడు. ౨. భూమేరపత్యం భౌమః – భూమికొడుకు. ౩. లోహితమంగం యస్యసః లోహితాంగః – ఎఱ్ఱని శరీరకాంతిగలవాఁడు. ౪. మహ్యాః సుతః మహీసుతః – భూమికొడుకు. ౫. అంగారకుని పేళ్లు.

**రౌహిణేయో బుధ స్సౌమ్యః**

రోహిణ్యాః. అప్యతం రౌహిణేయః. రోహిణీదేవి కొడుకు. ౧.

బుధ్యతే సర్వమితి బుధః–బుధ అవగమనే–సర్వము నెరింగినవాఁడు. ౨. సోమస్యాపత్యం సౌమ్యః–చంద్రుని కొడుకు. ౩ బుధుని పేళ్లు.

**సమౌ సౌరి శనైశ్చరౌ,**

**(శనిమన్దౌ పఙ్గు కాళౌ ఛాయాపుత్రో ఽ సితో ఽ ర్కజః,)**

సూరస్యాపత్యం సౌరిః – పా. సౌరో వా–సూర్యుని కొడుకు. ౧. శనైర్మందం చరతీతి శనైశ్చరః, చర గతిభక్షణయోః – మెల్లఁగా సంచరించువాఁడు. ౨. (శనిః, మన్దః, పఙ్గుః, కాళః, చాయాపుత్రః, అసితః, అర్కజః) ఏతాన్య పిశనైశ్చర నామాని ఈ ౨ శనైశ్చరుని పేళ్లు.

**తమస్తు రాహుస్స్వర్భాను స్సైంహికేయో విధుంతుదః.** 26

సూర్యాచంద్రమసౌ అనేన తామ్యత ఇతి తమః. అ. పు. తము గ్లానౌ – ఇతనిచేత సూర్యచంద్రులు వ్యథను బొందుదురు. ప. తమస్కారిత్వాత్తమః. స. న. తమస్సును జేయువాఁడు. తమ ఆకృతి రస్య తమః–స. న. చీఁకటి రూపముగాఁ గలవాఁడు. రహతి భుక్త్వా త్యజతి సూర్యాచంద్రమసా వితి రాహుః. ఉ. పు. రహత్యాగే–సూర్యచంద్రులను కబళించి విడుచువాఁడు. ౨. స్వః స్వర్గే భాతీతిస్వర్భానుః. ఉ. పు. భాదీప్తౌ–స్వర్గమునందు ప్రకాశించువాఁడు. ౩. సింహికాయాః అపత్యం సైంహికేయః–సింహిక హిరణ్యకశిపుని చెల్లెలు, ఆమె కొడుకు. ౪. విధుం తుదతీతి విధుంతుదః, తుద వ్యథనే–విదు వనఁగా చంద్రుఁడు వానిని వ్యథఁ బెట్టువాఁడు. ఈ ౫ రాహువు పేళ్లు. (కేతుః. శిఖి. ౨. కేతువు పేళ్లు.)

**సప్తర్షయో మరీ చ్యత్రి ముఖాశ్చిత్ర శిఖణ్డినః,**

సప్తఋషయః మరీచ్యత్రిముఖాః చిత్రశిఖండిన ఇత్యుచ్యంతే. మరీచిః, అత్రిః, అంగిరాః పులస్త్యః, పులహః, క్రతుః, వసిష్ఠశ్చేతిసప్తైతే ఋషయః–మరీచి, అత్రి. అంగిరస్సు, పులస్త్యుఁడు, పులహూఁడు, క్రతువు, వసిష్ఠుఁడు–వీర లేడుగురును చిత్రశిఖండు లనంబడుదురు. చిత్రాశ్శిఖండాః చూడావిశేషాః ఏషాం సంతీతి చిత్రశిఖండినః. న. పు. చిత్రములైన జటా విశేషములుగలవారు. ౧. సప్త ఋషుల పేళ్లు.

**రాశీనా ముదయో లగ్నం -**

రాశీనాంమేషాదీనా ముదయోలగ్న మిత్యుచ్యతే మేషాదిరాసుల

యొక్క యుదయము లగ్న మనంబడును. రాతి దదాతి కాలాదిఫలమితి రాశిః. ఇ. పు. కాలాది ఫలము నిచ్చునది. లగతి గ్రమైస్సంబధ్నాతీతి లగ్నం. లగే సంగే- గ్రహములతో సంబంధించునది. లగ్నముపేరు.

**తే తు మేషవృషాదయః.** 27

తే తుమేష వృషాదయోద్వాదశ - అవి మేషము మొదలుగాఁగలవి.

**సూర సూ ర్యార్య మాదిత్య ద్వాదశాత్మ దివాకరాః,**
**భాస్క రాహస్కర బ్రధ్న ప్రభాకర విభాకరాః.** 28
**భాస్వ ద్వివస్వ త్సప్తాశ్వహరిద శ్వోష్ణరశ్మయః,**
**వికర్తనార్క మార్తణ్డ మిహిరారుణ పూషణః.** 29
**ద్యుమణి స్తరణి ర్మిత్ర శ్చిత్ర భాను ర్విరోచనః,**
**విభావసు ర్గ్రహపతి స్త్విషాంపతి రహర్పతిః.** 30
**భానుర్హంస స్సహస్రాంశు స్తపన స్సవితా రవిః,**
**(కర్మసాక్షీ జగచ్చక్షు రంశుమాలీ త్రయీతనుః,**
**ప్రద్యోతనో దినమణిః ఖద్యోతో లోకబాన్ధవః.**
**సురోత్తమో ధామనిధిః పద్మినీవల్లభో హరిః,)**

సరతి చరతీతి సూరః, సృ గతౌ - సంచరించువాఁడు. పా. సూర శబ్దశ్శూరితి తాలవ్యాదిరప్యస్తి. తుక్తమాశ్చర్యమంజర్యాం. 'నిత్య ముదయవానపి శూరశ్చక్రవర్త్యపి తరణిరివ తీక్ష్ణకరతాపిత భువనవలయ ఇతి' సూరశబ్దము శవర్ణాదియునుగలదు. ౧. సువతి ప్రేరయతి వ్యాపారేష్వితి సూర్యః-షూఙ్ ప్రేరణే-వ్యాపారములయందుఁ బ్రే రేపించువాఁడు. ౨. ఇయర్తి గచ్ఛతీతి అర్యమా. న. పు. ఋగతౌ-గమనయుక్తుఁడు. ౩. అదితేరపత్యం ఆదిత్యః - అదితి కొడుకు. ౪. ద్వాదశ ఆత్మానః మూర్తయః యస్య ద్వాదశాత్మా. న. పు. పండ్రెండువిధములైన మూర్తులుగలవాఁడు. ౫. దివా దినం కరోతీతి దివాకరః-దినమును జేయువాఁడు. దివా అహని ప్రాణినశ్చేష్టావతః కరోతీతి దివాకరః-పగలు జీవులను వ్యాపారవంతులుగాఁ జేయువాఁడు. ౬. భాసం కరోతీతి భాస్కరః-కాంతిని గలుగఁజేయువాఁడు. ౭. అహః కరోతీత్యహస్కరః-అహస్సును జేయువాఁడు. ౮. అన్యతేజః బధ్నాతి ప్రతిబధ్నాతీతి బ్రధ్నః-ఇతర తేజస్సులను నిరోధించువాఁడు. బధ్నాతి తిమిరంబ్రధ్నః. బధబంధనే-తిమిరము నడ్డపెట్టి

వాఁడు. ౯. ప్రభాం కరోతీతి ప్రభాకరః–ప్రశస్తమైన కాంతినిఁ జేయువాఁడు. ౧౦. విశేషేణభాం కరోతీతి విభాకరః–మిక్కిలి కాంతినిఁ గలుగఁజేయువాఁడు. ౧౧. భాసః అస్య సన్తీతి భాస్వాన్. త. పు. కాంతులుగలవాఁడు. ౧౨. వివస్తే ప్రభయా ఆచ్ఛాదయతీతి వివస్వాన్. వస ఆచ్ఛాదనే–కాంతిచేత నన్నిటినిఁ గప్పెడువాఁడు. ౧౩. సప్త అశ్వాః యస్య సః సప్తాశ్వః–ఏడు గుఱ్ఱములు గలవాఁడు. సప్తనామకః అశ్వో యస్యేతి వా సప్తాశ్వః–సప్తయనెడు ఒక గుఱ్ఱము గలవాఁడు. ౧౪. హరితః హరిద్వర్ణా అశ్వాః యస్య హరిదశ్వః–పచ్చనికాంతి గల గుఱ్ఱములు గలవాఁడు. ౧౫. ఉష్ణాః రశ్మయో యస్య ఉష్ణరశ్మిః. ఇ.పు. ఉష్ణములైన కిరణములు గలవాఁడు. ౧౬. వికృన్తతి తమ ఇతి వికర్తనః. కృతీ ఛేదనే – తమస్సును పోఁగొట్టువాఁడు. విశ్వకర్మణా వికృత ఇతి వావికర్తనః–పూర్వ మితఁడు సహింపఁగూడని తేజస్సుగలవాఁడై యుండఁగా విశ్వకర్మచేత నితని కాంతి సానపట్టి తగ్గించఁబడినది. ౧౭. అర్చ్యత ఇత్యర్కః, ర్చపూజాయాం. పూజింపఁబడువాఁడు. ౧౮. మృతండస్యాపత్యం మార్తండః–మృతండుఁడను వాని కొడుకు. పా. మార్తాండః. మృతం బ్రహ్మాండం జీవయతీతి మార్తాండః–నశించిన బ్రహ్మాండమును బ్రతికించువాఁడు. ౧౯. మేహతి మేఘరూపీ విశ్వం సించతీతి మిహిరః, మిహ సేచనే–తాను మేఘరూపియై ప్రపంచమును తడిపెడువాఁడు. ౨౦. ఇయర్తి గచ్ఛతీత్యరుణః ఋగతౌ. సంచరించువాఁడు. ౨౦. పుష్ణాతీతి పూషా. న.పు. పుష పుష్టౌ–పోషించువాఁడు. ౨౨. దివః ఆకాశస్య మణిః ద్యుమణిః. ఇ. పు. ఆకాశమునకు మణివంటివాఁడు. ౨౩. తరంత్యనేన తమితి తరణిః ఇ–పు. తౄప్లవన తరణయోః – అంధకారము నితనిచేతఁ దరింతురు. తరతి నభ ఇతి వా–ఆకాశమును దాటువాఁడు. ౨౪. సర్వభూతేషు మేద్యతి స్నిహ్యతీతి మిత్రః. ఞి మిదా స్నేహనే–సర్వభూతములయందు స్నేహయుక్తుఁడు. ౨౫. చిత్రాః భానవో యస్యసః చిత్రభానుః. ఉ.పు. నానావర్ణములైన కిరణములుగలవాఁడు. ౨౬. విశేషేణరోచతే ప్రకాశత ఇతి విరోచనః. రుచ దీప్తౌ–విశేషముగాఁ బ్రకాశించువాఁడు. ౨౭. విభాప్రభైవ వసుద్రవ్యమస్య విభావసుః. ఉ.పు. కాంతియే ధనముగాఁగలవాఁడు. ౨౮. గ్రహాణాంపతిః గ్రహపతిః ఇ.పు. గ్రహములకుఁ బ్రభువు. ౨౯. త్విషాం

ప్రభాణాం పతిః, త్విషాంపతిః. ఇ.పు. కాంతులకు పతి. అలుక్సమాసము. ౩౦. అహ్నాపతిః అహర్పతిః. ఇ. పు. పగటికిఁ బ్రభువు. ౩౧. భాతీతి భానుః, ఉ.పు. భాదీప్తౌ-ప్రకాశించువాఁడు. ౩౨. హంతి తమ ఇతి హంసః హన హింసాగత్యోః-తమస్సును బోఁగొట్టువాఁడు. ౩౩. సహస్రమంశవో యస్య సహస్రాంశుః. ఉ.పు. వేయికిరణములు గలవాఁడు. ౩౪. తపతీతి తపనః, తపసంతాపే-తపింపఁజేయువాఁడు. ౩౫. సుపతి సుప్తం ప్రేరయతీతి సవితా. ఋ.పు. షూ ప్రేరణే-సుప్తుని ప్రేరేపించువాఁడు. ౩౬. రూయతే స్తూయత ఇతి రవిః. ఇ. పు. రుశబ్దే-నుతింపఁబడువాఁడు. ౩౭. కర్మణః సాక్షీ కర్మసాక్షీ. న.పు. కర్మలకు సాక్షి. జగతశ్చక్షురివ జగచ్చక్షుః. స.పు. జగత్తునకు నేత్రమువంటివాఁడు. అంశుమాలాః కిరణరాజయః అస్య సంతీతి అంశు మాలీ. న.పు. కిరణ సమూహముగలవాఁడు. త్రయీాత్ర యోవేదా ఏవ తనుర్యస్య త్రయీతనుః. ఉ.పు. మూఁడువేదములే శరీరముగాఁ గలవాఁడు. ప్రకృష్టం ద్యోతతే ప్రద్యోతనః -విశేషముగాఁ బ్రకాశించువాఁడు. దినస్యమణిః-దినమణిః. ఇ. పు. పగటికి రత్నమువంటివాఁడు. ఖేద్యోతతే. ఖద్యోతః, ద్యుత దీప్తౌ-ఆకాశమందుఁ బ్రకాశించువాఁడు. లోకస్యబాంధవో లోకబాంధవః - లోకమునకుఁ జుట్టము. సురేషు ఉత్తమ స్సురోత్తమః-దేవతలయందు శ్రేష్ఠుఁడు. ధామ్నాం నిధిః ధామనిధిః - కాంతులకు గనియైనవాఁడు. పద్మిన్యాః వల్లభః పద్మినీ వల్లభః - తామరతీఁగకుఁ బ్రియుఁడు. తమోహరతీతి హరిః-చీఁకటిని బోఁగొట్టువాఁడు). ౩౭ సూర్యునకుఁ బేళ్లు.

**మాఠరః పిఙ్గళో దణ్డ శ్చణ్డాంశోః పారిపార్శ్వకాః.** 31

సూర్యస్య దయాలుత్వా ద్రక్షోవరప్రదానశంకయా ఇంద్రాదయ స్తన్నికటే విఘ్నం కుర్వన్తో వర్తంతే. తత్ర యమాగ్ని రుద్రాః క్రమేణ మాఠరపిఙ్గళదణ్డా ఇత్యుచ్యన్తే - సూర్యుఁడు దయాళువు గనుక రాక్షసులకు వరమిచ్చునను సందియముచేత నింద్రాదులు విఘ్న దేవతలై నామాంతరములతో సూర్యుని సమీపముల నుందురు. అందు యమాగ్ని రుద్రులు వరుసగా మాఠరపింగళదండు లనంబడుదురు. మఠతి నివసతి సూర్యసమీపే మాఠర, మఠ నివాసే - సూర్యసమీపమున నివసించువాఁడు. ౧. పింగళవర్ణత్వా త్పింగళః - పింగళవర్ణము

గలవాఁడు. ౨. దండకారి త్వాద్దండః–దండించువాఁడు. ౩. పరిపార్శ్వమేవ పారిపార్శ్వం తత్రవర్తంతే పారిపార్శ్వికాః – పార్శ్వలయందంతట నుండువారు. పా. పారిపార్శ్వం గచ్ఛంతీతి పారిపార్శ్వగాః–ప్రక్కల యందంతట సంచరించువారు. ఈ ౩ ను నామాంతరధారులై సూర్యునకుఁ బరిచర్యసేయు నింద్రాదులు ౧౮ మంద్రలోఁ గ్రమముగా ముఖ్యులకు మువ్వురకుఁ బేళ్లు.

**సూర్యసూతో ఽ రుణో ఽ నూరుః కాశ్యపి ర్గరుడాగ్రజః,**

సూర్యస్య సూతః సూర్యసూతః – సూర్యుని సారథి. ౧. ఋచ్ఛతీ త్యరుణః. ఋ గతౌ–గమనయుక్తుఁడు. అరుణవర్ణత్వాదరుణః–ఎఱ్ఱనికాంతి గలవాఁడు. ౨. న విద్యతే ఊరూ యస్య స అనూరుః. ఉ. పు. తొడలు లేనివాఁడు. ౩. కశ్యపస్య అపత్యం కాశ్యపిః. ఇ. పు. కశ్యపప్రజాపతి కొడుకు. ౪. గరుడస్య అగ్రజః – గరుడునికి అన్న. ౫ సూర్యసారథి యగు ననూరుని పేళ్లు.

**పరివేషస్తు పరిధిః -**

పరితః పరితో విష్యతే–అనేన పరివేషః. వి ష్లృ వ్యాప్తౌ–అంతట వ్యాపించునది. పరివేశ ఇతి పాఠాంతరం. ౧. పరితో దధాతీతి పరిధిః. ఇ. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః – అంతట నావరించునది. ౨. పరివేషశబ్ద సాహచర్యా త్పరిధిశబ్దః పుల్లింగః – పరివేషశబ్దము తోడ్పాటువలనఁ బరిధిశబ్దము పుంలింగము. ౨. పరివేషము పేళ్లు.

**ఉపసూర్యక మణ్డలే.** 32

సూర్యసమీపే ప్రతికృతిత్వేన వర్తత ఇత్యువ సూర్యకం–సూర్య సమీపమునందుండునది. ౧. మణ్డయతీతి మణ్డలం. మడిభూషాయాం–అలంకరించునది. ౨. ప్రతిసూర్యుని పేళ్లు. పూర్వోక్తాని చత్వార్యపి నామాని పరివేషస్యైవేతి కేచిత్ – పరివేషశబ్దము మొదలు ౪ శబ్దములు పరివేషమునకే పేళ్లని కొందఱు.

**కిర ణో స్ర మయూ ఖాంశు గభ స్తి ఘృణి ఘృష్టయః,**
**భానుః కరో మరీచిః స్త్రీపుంసయో ర్దీధితః స్త్రియామ్.** 33

(ద్వయోస్తు గౌర్న పుం స్యర్చి స్తేజో ధామ మహో విభా.)

కిరతి తమ ఇతి కిరణః, కౄ విక్షేపే – తమస్సును పోఁగొట్టునది.

౧. వసంత్యత్రాప ఇతి ఉస్రః, వసనివాసే-దీనియందు జలము లుండును. ౨. మినోతి ప్రక్షిపత్యంధకారమితి మయూఖః, దు మిఞ్ ప్రక్షేపణే. అంధకారమును బోఁగొట్టునది. ౩. అశ్నుతే వ్యాప్నోతీ త్యంశుః ఉ.పు. అశూవ్యాప్తౌ-వ్యాపించునది. ౪. గోజ్ఞేయవర్గః. తం బభస్తి దీపయతీతి గభస్తిః. ఇ.పు. భసభర్త్స నదీప్త్యోః -వస్తువులను జూపునది. ౫. జిఘర్త్యస్మాజ్జలమితి ఘృణిః ఘృష్టిశ్చ. ఇ.పు. ఘృ క్షరణదీప్త్యోః-దీనివలన జలము జాఱును గనుక ఘృణి. ఘృష్టియు. జిఘర్తి ప్రకాశత ఇతివా-ప్రకాశించునది. పా. ధృష్ణోతి ప్రగల్భత ఇతి ధృష్ణిః. ఇ.పు. ప్రగల్భమైనది. ౬. ౭. కిరణశబ్దేన సహ ద్వంద్వసమాసాద్గభస్తిఘృణి ఘృష్టిశబ్దాః పుంలిఙ్గాః. భాతీతి భానుః. భ్యా దీప్తౌ - ప్రకాశించునది. ౮. కృణాతి తమ ఇతి కరః, కృఞ్ హింసాయాం - తమస్సును హింసించునది. కీర్యతే భువీతివా కౄవిక్షేపే- భూమియందు వెదఁజల్లఁబడునది. కరోతి వృష్టిమితివాకరః, డు కృఞ్కరణే - వర్షమును గలుగఁజేయునది. ౯. మ్రియంతేక్షుద్ర జంతవస్తమాంసి వా అనేనేతి మరీచిః. ఇ. ప్స. మృజ్ ప్రాణత్యాగే - దీనిచేత క్షుద్రజంతువులుగాని అంధకారముగాని నశించును. మరీచిశబ్దః స్త్రీపుంసయోర్వర్తతే. ౧౦. దీధీతే దీప్యత ఇతి దీధితిః. ఇ.సీ. దీధిఙ్ దీప్తి దేవనయోః-ప్రకాశించునది. ఈ ౧౧ కిరణముల పేళ్లు.

**స్యుః ప్రభా రు గ్రుచిస్త్వి డ్భాభాశ్ఛ విద్యుతి దీప్తయః,**
**రోచి శ్శోచి రుభే క్లీబే -**

స్త్రియా మిత్యస్య ప్రభాదిష్వపి సంబంధాత్ ప్రభాదిశబ్దా అపి స్త్రీలిఙ్గాః. ప్రభాశబ్దము మొదలు ౧౧ సూర్యకాంతిపేళ్లు. ప్రకర్షేణ భాతీతి ప్రభా-మిక్కిలి ప్రకాశించునది. ౧. రోచతే రుక్. చ.సీ. రుచిశ్చ. ఇ.సీ. రుచ దీప్తౌ-ప్రకాశించునది గనుక రుక్కు, రుచియు. ౨, ౩. త్వేషతే త్విట్. ష. సీ. త్విష దీప్తౌ-కాంతియుక్తమైనది. ౪. భాతీతిభా. ఆ.సీ భా దీప్తౌ-ప్రకాశించునది. ౫. భాసతేభాః. స.సీ. భాసృ దీప్తౌ -ప్రకాశించునది. ౬. ఛ్యతి తమ ఇతి చవిః. ఇ. సీ. చో ఛ్చేదనే-అంధకారమును బోఁగొట్టునది. ౭. ద్యోతతే ద్యుతిః. ఇ.సీ. ద్యుత దీప్తౌ - ప్రకాశించునది. ౮. దీప్యతే దీప్తిః. ఇ.సీ. దీపీ దీప్తౌ-ప్రకాశింపఁజేయునది. ౯. రోచత ఇతి రోచిః. స. న. రుచ దీప్తౌ - ప్రకాశించునది. ౧౦. శోచయతీతి శోచిః. స.న

శుచ శోకే–తీవ్రమైనది గనుక దుఃఖపెట్టునది. ౧౧. రోచిశ్శోచి శ్శబ్దౌన పుంసకలింగౌ. ఈ ౧౧ కాంతి పేళ్లు.

**ప్రకాశో ద్యోత ఆతపః.** 34

ప్రకాశతే ప్రకాశః, కాశృదీప్తౌ–ప్రకాశించునది. ౧. ద్యోతతే ద్యోతః, ద్యుతదీప్తౌ – ప్రకాశించునది. ౨. ఆ సమంతాత్తపతీత్యాతపః, తప సంతాపే– అంతటఁ దపించునది. ఈ ౩ ఎండ పేళ్లు.

**కోష్ణం కవోష్ణం మన్దోష్ణం కదుష్ణం త్రిషు తద్వతి,**

1. కించిదుష్ణం కోష్ణం–కవోష్ణం 2. కదుష్ణం. చ. 3. మన్దం చ.తత్ ఉష్ణంచ మన్దోష్ణం–కొంచెము వేఁడియైనది. ౪. కోష్ణాదయశబ్దాః గుణవాచిత్వే నపుంసకలింగాః–గుణవద్వస్తువాచిత్వే త్రిలింగాః యథా–కోష్ణా ఆపః. కోష్ణ స్సూర్యః. కోష్ణం భస్మ. ఏవం కోష్ణాదిశబ్దములు ౪ గుణవాచకములైనప్పుడు నపుంసక లింగములు. గుణముగల పదార్థములకు వాచకములైనప్పుడు త్రి. ఈ ౪ కొంచెము వేఁడిమి పేళ్లు.

**తిగ్మం తీక్ష్ణం ఖరం తద్వత్ -**

తేజ యతీతి తిగ్మం తీక్ష్ణం చ. తిజ నిశాతనే–మిక్కిలి వేఁడియైనది. ౧, ౨. ఖమింద్రియం రాత్యభిభవతీతి ఖరం. రా దానే–ఇంద్రియ క్షోభమును గలిగించునది. తద్వత్. ధర్మే క్లీబత్వం. ధర్మిణీ త్రిషు – తిగ్మాది శబ్దములు గుణవాచకములైనప్పుడు నపుంసకములు. గుణముగల పదార్థమునకు నామములైనప్పుడు త్రిలింగములు. వేఁడిమి పేళ్లు.

**మృగతృష్ణా మరీచికా** 35

మృగాణాం తృష్ణా అస్యామితి మృగతృష్ణా–మృగములకు దీనియందు ఆశ గలదు. ౧. మ్రియంతే అనయా క్షుద్రజంతవో మృగావా మరీచికా–మృజ్ ప్రాణత్యాగే–క్షుద్ర జంతువులైనను మృగములైనను దీనిచేత మృతిఁజెందును. మరీచిరివ మరీచికా–కిరణమువలె తోఁచునది. మృగతృష్ణా మరీచికాశబ్దములు ౨ ఎండమావుల పేళ్లు.

## కాల వర్గము

**కాలో దిష్టో౽ ప్యనేహాపి సమయో౽ పి -**

కల్యతే సంఖ్యాయతే అనేనకాలః. కలసంఖ్యానే – దీనిచేత లెక్క

పెట్టఁబడును. కాలయతి ప్రేరయతీతి వా కాలః. కల కిల క్షేపే–ప్రేరేపింపఁ జేయునది. ౧. దిశ్యతే సుఖదుఃఖాదికమనేనేతి దిష్టః. దిశ అతిసర్జనే–దీనిచేత సుఖదుఃఖాదు లీయఁబడుచున్నవి. దిశంతి వ్యాప్రియంతే ఽత్ర దిష్టః–దీనియందు జనులు వ్యాపారయుక్తులగుదురు. ౨. నాహంతి నాగచ్ఛతి నాహన్యతే ఇతి వా అనేహా, స. పు. హనహింసాగత్యోః–నశించనిది. న ఈహతే అనేహా, ఈహ చేష్టాయాం. చేష్ట లేనిది. ౩. సమ్యగయతే సమయః. అయగతౌ – లెస్సగా నెఱుఁగఁబడునది. ఈ ౪ సామాన్యకాలమునకుఁ బేళ్లు.

**అథ పక్షతిః,**

ప్రతిపద్ద్వే ఇమే స్త్రీత్వే–

పక్షస్య మూలం ప్రారంభః పక్షతిః – శుక్ల కృష్ణ పక్షములయొక్క ప్రారంభము. ౧. ప్రతిపద్యతే చంద్రస్య ఉదయః క్షయో వా అస్యాం ప్రతిపత్, ద. సీ. పత్ గతౌ – దీనియందు చంద్రునియొక్క ఉదయముగాని క్షయముగాని తెలియఁబడును. ౨ పాడ్యమికిఁ బేళ్లు.

**తదాద్యా స్తిథయో ద్వయోః.** 1

తన్యతే షష్టిఘటికాభిరితి తిథిః, ఇ. ప్స. తనువిస్తారే–అఱువది గడియలచేఁ బెంపొందునది.

**ఘస్రో దినాహనీ వా తు క్లీబే దివసవాసరౌ,**

ఘస త్యన్ధకారమితి ఘస్రః, ఘ స్ల అదనే – అంధకారమును దినివేయునది. ౧. ద్యతి అంధకారమితి దినం. దో అవఖండనే – అంధకారమును ఖండించునది. ౨. న జహాతి ప్రత్యాగమనమిత్యహః. స. న. ఓహాక్ త్యాగే – తిరిగివచ్చుటను విడువనిది. సూర్యేణ న హీయత ఇత్యహః–సూర్యునిచే విడువఁబడనిది. ౩. దీవ్యంతి జనా అస్మిన్నితి దివసః. ప్న. దివు క్రీడాదౌ – దీనియందు జనులు ప్రకాశింతురు. వసంత్య స్మిన్నితి వాసర్దః. ప్న. వస నివాసే – దీనియందు వసింతురు. వాసయతి స్థాపయతి జదితి వాసరః – లోకమును నిలుపునది. ౫. దివసవాసర శబ్దౌ వికల్పేన నపుంసకలిఙ్గే వర్తేతే – దివసము, వాసరము ఇవి యొక పక్షమున నపుంసకలింగములు నగును. ఈ ౫ పగలు పేళ్లు.

**ప్రత్యూషో ఒహర్ముఖం కల్య ముషః ప్రత్యుషసీ అపి.** 2
**ప్రభాతం చ-**

ప్రత్యూషతి నిశాం ప్రత్యూషః, ఊష రుజాయాం–రాత్రిని బోఁగొట్టునది. పా. ప్రత్యుషః. అ. పు. ఓషత్యంధకారమితి ప్రత్యుషః–చీఁకటినిఁ బోఁగొట్టునది. తథాచ ప్రయోగః___ 'ప్రత్యుషః పారిజాత' ఇతి సూర్యశతకే. ౧. అహ్నః ముఖమారంభః అహర్ముఖం–అహస్సుయొక్క ప్రారంభము. ౨. కల్యంతే ప్రతిబుధ్యంతే ఒత్ర కల్యం. కలగతౌ–ఇందు జనులు ప్రబోధింపఁబడుదురు. కలయతి మంగళంకల్యం, కలశబ్ద సంఖ్యానయోః–శుభమును జేయునది. పా. కాలే సాధు కాల్యమితి వా–కాలమందు యోగ్యమైనది. ౩. ఓషతి అర్కకరై రిత్యుషః ప్రత్యుషశ్చ. స. న. ఉషదాహే–సూర్యకిరణములచేత దహింపఁజేయునది. ప్రతిరుపసర్గాంతర వ్యావర్తకః. ౪, ౫. భాతుం ప్రవృత్తం ప్రభాతం, భా దీప్తౌ–ప్రకాశింపఁ బ్రవర్తించినది. ౬ ప్రాతఃకాలము పేళ్లు.

**దినాన్తే తు సాయః -**

దినస్య అంతః దినాంతః–దినము యొక్క అవసానకాలము. ౧. స్యతిదినం సాయః అ. పు. షో అంతకర్మణి–దినము నంతముఁ బొందించునది. 'సాయమండన మభిత్వరయంత్యః' అని కిరాతార్జునీయమందు సాయ శబ్దం బకారాంతముగా భారవిచేః బ్రయోగింపఁబడియున్నది. పా. సాయమ్–అనిమాంతమైన అవ్యయమును గలదు. సాయం సాయే ప్రగేప్రాతః–అని తృతీయ కాండమందు వ్యయవర్గములోఁ జెప్పఁబడియున్నది. ౨. ఇవి దినముయొక్క కడపటిభాగమందలి 3 ముహూర్తముల కాలము పేళ్లు.

**సంధ్యా పితృప్రసూః,**

సమ్యక్ ధ్యాయంత్యస్యామితి సంధ్యా, ధ్యైచింతాయాం–దీనియందు లెస్సఁగా ధ్యానము చేయుదురు. సంధీయతె అహోరాత్రాభ్యా మితివా సంధ్యా. డు ధాఞ్ ధారణపోషణయోః. అహోరాత్రములచే సంధింపఁబడునది. ౧. పితౄన్ ప్రసూత ఇతి పితృప్రసూః. ఊ. సి. షూఙ్ ప్రాణిగర్భ విమోచనే – పితృదేవతలఁ బుట్టించునది. ౨. సంధ్యాయాః బ్రహ్మశరీరత్వాత్ పితృప్రసూరితి పురాణప్రసిద్ధిః–సంధ్య బ్రహ్మ శరీరము గనుక పితృలోకమును బుట్టించుటచేత పితృప్రసు వనంబడును. సూర్యా

స్తమయమునకుఁ 3 గడియలును సూర్యోదయమునకు ముందు ౫ గడియలును సంధ్య యనంబడును. ఈ ౨ సంధ్యా కాలము పేళ్లు.

**ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్నాస్త్రి సంధ్యమ్ -**

అహ్నః ప్రారంభః ప్రాహ్ణః–అహస్సుయొక్క మొదటిభాగము. అహ్నః అపరో భాగః అపరాహ్ణః – అహస్సుయొక్క కడపటిభాగము. అహః మధ్యో భాగః మధ్యాహ్నః –అహస్సు యొక్క మధ్యభాగము. ఇవి 3 ను త్రిసంధ్య మనంబడును. తిసృణాం సంధ్యానాం సమాహారః త్రిసంధ్యం–మూఁడుసంధ్యల యేకీభవము త్రిసంధ్యము. భిన్న కాలమునందు సమాహారము గూడనిదైనను బుద్ధిచేత యుగపద్గ్రహణమువలన నేకకాలత్వము. ౩ ను మూఁడు కాలముల పేళ్లు.

**అథ శర్వరీ.** 3

**నిశా నిశీథినీ రాత్రి స్త్రియామా క్షణదా క్షపా,**
**విభావరీ తమస్విన్యౌ రజనీ యామినీ తమీ.** 4

శృణాతి వ్యాపారం దినం వా శర్వరీ. ఈ. సీ. శౄ హింసాయాం – వ్యాపారమునుగాని దినమునుగాని చెఱుచునది. ౧. నితరాం శ్యతి సర్వ వ్యాపారా౯ నిశా. శో తనూకరణే – అన్ని వ్యాపారములను మిక్కిలి స్వల్పముగాఁ జేయునది. ౨. నిశీథః అస్యామస్తీతి నిశీథినీ. ఈ.సీ. నిశీథమనఁగా నడిరేయి, అది దీని యందుఁ గలదు. ౩. రాతి సుఖమితిరాత్రిః ఇ. సీ. రాదానే. సుఖము నిచ్చునది. ౪. త్రయో యామాః యస్యాంసాత్రియామా – యామమనఁగా జాము, మూఁడు జాములు గలది, రాత్రియందు ప్రథమయామము చేష్టాకాలముగనుకను, అంత్యయామము విబోధకాలము గనుకను నీ రెండు యామములందు సగము దివసమానముగా వునఁ ద్రియామ యనంబడును. ౫. క్షణమవ్యాపారస్థితిం యూనాముత్సవం వాదదాతీతి క్షణదా, డుదాఞ్ దానే–వ్యాపారశూన్యమైన స్థితినిగాని యౌవనవంతులకు నుత్సవమునుగాని యిచ్చునది. ౬. క్షపయతి సర్వచేష్టా ఇతిక్షపా. క్షైక్షయే– సర్వవ్యాపారములను క్షయింపఁజేయునది. ౭. విభాం సూర్యకాంతిం ఆవృణోతీతి విభావరీ. ఈ. వృఞ్వరణే – సూర్యకాంతిని గప్పునది. విభాతి చంద్రాదిభిరితి విభావరీ. భాదీప్తౌ – చంద్రాదులచేతఁ బ్రకాశించునది. ౮. తమః అస్యామ స్తీతి తమస్వినీ. ఈ. సీ. చీఁకటి గలిగినది. ౯. రం

జంతి కామినో ఽత్ర రజనీ. ఈ.సీ. రంజ రాగే–దీనియందు కాముకులు రాగయుక్తులగుదురు. ౧౦. యామా అస్యాం సంతీతి యామినీ–యామములు గలిగినది. ౧౧. తామ్యంతి విరహిణః అత్రేతి తమీ. ఈ.సీ. తముగ్లానౌ–దీనియందు విరహవంతులు గ్లానిని బొందుదురు. తమేతివా పాఠః తదుక్తం. 'విభూషణం కిం కుచమండలానాం కీదృశ్యమా చంద్రమసః కుతఃశ్రీః, కిమాహ సీతా దశకంఠనీతా హారామహా దేవరతాతమాతః' ఇతి. ఈ ౧౨ రాత్రికిఁ బేళ్లు.

**తమిస్రా తామసీ రాత్రిః -**

తమో ఽస్యామస్తీతి తమిస్రా. ౧. తమోబహుళా తామసీ. ఈ–సీ. అధికమైన తమస్సు గలిగినది. ౧. కటికిచీఁకటి గల రాత్రి పేరు.

**జ్యౌత్స్నీ చన్ద్రికయాన్వితా,**

చంద్రికయాన్వితా రాత్రిః జ్యౌత్స్నీత్యుచ్యతే జ్యోత్స్నా చంద్రికా తద్యోగాజ్జ్యౌత్స్నీ–జ్యోత్స్న యనఁగా వెన్నెల. దానితోఁ గూడినది. జ్యోత్స్నే త్యాకారాంతపాఠో ఽప్యస్తి. ౧ వెన్నెలరాత్రి పేరు.

**ఆగామివర్తమానా హర్యుక్తాయాం నిశి పక్షిణీ.** 5

ఆగామివర్తమానా హర్యుక్తా నిశా పక్షిణీ–జరుగుచుండెడి పగటి తోడను రాఁగల పగటితోడను గూడినరాత్రి పక్షిణి యనంబడును. ఆగామి వర్తమానాహనీ పక్షావివ అస్యా ఇతి పక్షిణీ. రాఁబోవు పగలును జరుగుచున్న పగలును ఇరుప్రక్కల ఱెక్కలవలెఁ గలిగినది. ౧ రెండు పగళ్ల నడుమ నున్న రాత్రి పేరు.

**గణరాత్రం నిశా బహ్వ్యః -**

బహ్వ్యోనిశా గణరాత్ర మిత్యుచ్యతే. అనేకరాత్రులు గణరాత్ర మనంబడును. రాత్రీణాం గణః గణరాత్రం రాత్రులయొక్క సముదాయము. ౧ అనేక రాత్రులపేరు.

**ప్రదోషో రజనీముఖమ్.**

దోషాయాః ప్రారంభః ప్రదోషః. దోష యనఁగా రాత్రి. దాని యొక్క ప్రారంభము. ౧. రజన్యాః ముఖం రజనీముఖం. రాత్రియొక్క యారంభము. ౨ రాత్రి యొక్క మొదలు.

**అర్ధరాత్ర నిశీథౌ ద్వౌ**

అర్ధం రాత్రే రర్ధరాత్రః–రాత్రి యొక్క సగము. ౧. నియతం శేరతే అస్మిన్నితి నిశీథః. శీఙ్స్వప్నే–దీనియందు నియతముగా నిద్రింతురు. ౨. నడిరేయి.

**ద్వౌ యామ ప్రహరౌ సమౌ.** 6

యాతీతి యామః. యా ప్రాపణే–స్థాయిగానిది. ౧. ప్రహ్రియతే ఢక్కాది రస్మిౙ ప్రహరః. దీనియందు ఢక్కాదివాద్యములు వాయింపఁబడును. ౨. ఇమౌ సమార్థౌ సమలింగౌచ– ఇవి సమానార్థములును, సమలింగములను. ఈ ౨ జాము పేళ్లు.

**స పర్వసంధిః ప్రతిపత్పఞ్చ దశ్యో ర్యదన్తరమ్,**

ప్రతిపత్పఞ్చ దశ్యోర్యదంతరం స సంధిః పర్వేత్యుచ్యతే–పాడ్యమి యొక్కయు అమావాస్య పున్నమలయొక్కయు మధ్య కాలము సంధి. అది పర్వమనఁబడును. పృనాతి పూరయతిపాలయతివా అభిలషితమితిపర్వ. న. న. పౄపాలన పూరణయోః –అభిలషితమును నిండించునది లేక పాలించునది. సంధీయతే అనేన పూర్వకాల ఉత్తరకాలేనేతి సంధిః. ఇ.పు. పూర్వకాలము దీనిచే ఉత్తరకాలముతోడ సంధింపఁ బడును గనుక సంధి. అత్రకేచిత్ పర్వచాసౌసంధిశ్చే త్యేకం పదం మన్యంతే తదా ప్రతిపత్పంచ దశ్యోర్యదంతరం సః పర్వసంధిరితి యోజనా–ఇచ్చట పర్వమైనసంధి పర్వ సంధి అని యొక పదముగానే కొందఱు తలంతురు. ౧. పర్వసంధిపేరు.

**పక్షాన్తౌ పఞ్చదశ్యౌ ద్వే-**

పక్షయోః అంతౌ పక్షాన్తౌ, శుక్ల కృష్ణపక్షములయొక్క తుదలు. ౧. పంచదశానాం తిథీనాం పూరణ్యౌ పంచదశ్యౌ. ఈ–సీ. పంచదశ తిథులను నిండించునవి. ౨. పూర్ణిమకును అమావాస్యకును పేళ్లు.

**పౌర్ణమాసీ తు పూర్ణిమా.** 7

మీయతే తిథిరనేన మాః చంద్రః. పూర్ణశ్చాసౌ మాశ్చ పూర్ణమాః. తస్యేయం పౌర్ణమాసీ. ఈ.సీ. ఇతనిచేత తిథి లెక్క పెట్టఁబడును గనుక మాః అనఁగా చంద్రుఁడు. అతఁ డిందు పూర్ణుడుగాఁ దోఁచును. పూర్ణోమాసో ఽ స్యామితావా, మాసము ఇందు పూర్ణమౌను. ౧. చంద్రస్య పూర్ణతయా నిర్వృత్తా పూర్ణిమా, చంద్రునియొక్క నిండుటచేత

నిర్వృత్తమైనది. పూర్ణఃమాశ్చంద్రో ౽స్యామితివా పూర్ణిమా, అఖండచంద్రుఁడు గలిగినది. ౨ పున్నమ పేళ్లు.

**కళాహీనే సానుమతిః -**

నిశాకరే కళాహీనే సతి సా పూర్ణిమా అనుమతి రిత్యుచ్యతే. చతుర్దశీ యుక్తేతి భావః – చంద్రుఁడు కళాహీనుఁడైనపుడు ఆ పున్నమ అనుమతి యనంబడును. అనఁగాఁ జతుర్దశితోఁ గూడినదని భావము. ౧. ఒకకళ తక్కువగాఁ గల చంద్రునితో గూడిన పున్నమ.

**పూర్ణే రాకా నిశాకరే,**

తస్మిన్ పూర్ణే సతి సా రాకేత్యుచ్యతే శుద్ధేతిభావః–చంద్రుఁడు పూర్ణుఁడై యున్నపుడు ఆ పున్నమ రాక యనంబడును. అనఁగాఁ జతుర్దశి వేధ లేనిది. అనుమన్యంతే దేవాః పితృసహితా అస్యామిత్యనుమతిః. ఇ. సీ. మన జ్ఞానే దీని యందు దేవతలు పితృసహితులై సేవకొఱకు తలఁపఁబడుదురు. రాతి దదాతి సుఖమితి రాకా. రా దానే–సుఖము నిచ్చునది. ౧. అన్ని కళలతో నిండిన చంద్రుఁడు గలది.

**అమావాస్యా త్వమావస్యా దర్శ స్సూర్యేన్దు సంగమః.** 8

అమాశబ్దస్సహార్థే అవ్యయం. అమా సహ తిష్ఠతః రవిచంద్రావస్యామిత్య మావాస్యా. అమావస్యా చ. వస నివాసే–దీనియందు సూర్యచంద్రులు కూడుకొనియుందురు. ౧, ౨. దృశ్యేతే సూర్యచంద్రావత్రేతి దర్శః, దృశిర్ ప్రేక్షణే–దీనియందు సూర్యచంద్రులు కూడుకొని యగపడుదురు. ౩. సూర్యేందోః సంగమః మేళనమత్ర సూర్యేందుసంగమః–దీనియందు సూర్యచంద్రులకు సంగమము కలదు గనుక సూర్యేందు సంగమము. ౪ అమావాస్య పేళ్లు.

**సా దృష్టేన్దు స్సినీవాలీ -**

అః విష్ణుః తేన సహవర్తత ఇతి సా లక్ష్మీః సా అస్యామితి సినీ చంద్రకళా సా బాలా అస్యామితి సినీవాలి. ఈ. సీ. అ. అనఁగా విష్ణువు. అతనితోఁగూడినది గనుక సా అనఁగా లక్ష్మి. ఆలక్ష్మి గలది గనుక సిని అనఁగాఁ జంద్రకళ. ఆ చంద్రకళ దీనియందు లేఁతదైయుండును గనుక సినీవాలి. వబయోరభేదః. ౧. చంద్రకళతోఁ గూడిన యమావాస్య పేరు.

**సా నష్టేన్దుకళా కుహూః,**

కుహయతి విస్మాపయతి తమసేతి కుహూః. ఊ–సీ. తమస్సుచేత నాశ్చర్యమును గలుగఁ జేయునది. ౧. చంద్రకళ గానరాని యమావాస్య పేరు.

**ఉపరాగో గ్రహః -**

ఉపరజ్యేతే సూర్యాచంద్ర మసావనేన ఉపరాగః, రంజరాగే–సూర్యచంద్రులు దీనిచేత రాగమును బొందింపఁబడుదురు. ౧. గృహ్యేతే సూర్యాచంద్రమసావనేన గ్రహః–గ్రహ ఉపాదానే. దీనిచేత సూర్యచంద్రులు గ్రహింపఁబడుదురు. ౨ గ్రహణము పేళ్లు.

**రాహుగ్రస్తే త్విన్దౌ చ పూష్ణి చ.** 9

**సోపప్లవోప రక్తౌ ద్వౌ -**

ఉపప్లవేన ఆకులతయా సహవర్త ఇతి సోపప్లవః - ఉపప్లవముతోఁ గూడినవాఁడు. ౧. ఉపరజ్యతే ఉపరమతే వ్యాపారాదిత్యుపరక్తః. వ్యాపారమువలన నుపరతుఁ డైనవాఁడు, ఉపరజ్యత ఇత్యుపరక్తః– రాహువుచేత తమోయుక్తుఁడుగాఁ జేయఁబడినవాఁడు. ఈ ౨ రాహుగ్రస్తులైన సూర్చచంద్రులపేళ్లు.

**అగ్న్యుత్పాత ఉపాహితః,**

ప్రకృతే రన్యథాభావః ఉత్పాతః. అగ్నేరుత్పాతః అగ్న్యుత్పాతః–స్వస్వభావమును విడిచి వికారమును బొందుట యుత్పాతము. అగ్నియొక్క యుత్పాతము అగ్న్యుత్పాతము. ౧. ఉప ఆసన్నమహితమస్య ఉపాహితః. అనిష్టము దీని కాసన్నమైయుండును. ౨. ఆకాశాదులందుఁ బుట్టిన యగ్నివికారముపేళ్లు.

**ఏకయోక్త్యా పుష్పవన్తౌ దివాకర నిశాకరౌ.** 10

పుష్పవంతా వితి ఏకయోక్త్యా దివాకర నిశాకరావుచ్యేతే - ఒక మాటచేత సూర్యచంద్రు లిద్దఱు పుష్పవంతు లనంబడుదురు. పుష్పం వికాసః పుష్ప వికసనే, తద్వంతౌ పుష్పవంతౌ త–పు. పుష్పమనఁగా వికాసము, అది గలవారు పుష్పవంతులు. అకారాంతో ౽ప్యస్తి తదుక్త మమరమాలాయాం, రవిశశినౌ పుష్పవంతాఖ్యావితి. తథా ఆశ్చర్యమం జర్యామపి. 'ప్రాక్ప్రత్యగ్ధరణీధర శిఖరస్థిత పుష్పవంతాభ్యా' మితి; ఈశబ్దము అకారాంతంబును గలదు. ౧. సూర్యచంద్రు లిద్దఱికిని ఒక్కటే పేరు.

**అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా -**

అష్టాదశ నిమేషాః కాష్ఠేత్యుచ్యతే - పదునెనిమిది ఱెప్పపాట్ల కాలము కాష్ఠ యనంబడును. కాశతే కాష్ఠా, కాశృ దీప్తౌ-ప్రకాశించునది. ౧. ౧౮ నిమేషములకాలము ౧ కాష్ఠ.

**త్రింశత్తు తాః కలా,**

త్రింశత్కాష్ఠాః కలేత్యుచ్యతే. ౩౦ కాష్ఠలకాలము కల యనంబడును. కాలం కలయతీతి కలా. కల సంఖ్యానే. కాలమును లెక్కపెట్టునది. ౧. ౩౦ కాష్ఠలు ౧ కల.

**తాస్తు త్రింశ త్క్షణః -**

త్రింశత్కలాః క్షణ ఇత్యుచ్యతే. ౩౦ కలలు గల కాలము క్షణమనంబడును. క్షిణోతి హిన స్తీతి క్షణః. క్షిణు హింసాయాం. హింసించునది. ౩౦. కలలు ౧ క్షణము.

**తే తు ముహూర్తో ద్వాదశాస్త్రియామ్.** 11

తే క్షణాః ద్వాదశ ముహూర్త ఇత్యుచ్యతే - ౧౨ క్షణములు గూడిన కాలము ముహూర్తమనంబడును. హూర్ఛతి కుటిలో భవతి శుభాశుభదర్శనాదితి ముహూర్తః. ష్న. హుర్ఛాకౌటిల్యే. శుభాశుభ దర్శనమువలన కుటిలమగునట్టిది. ముహుర్ము హురియర్తీతి ముహూర్తః. ఋ గతౌ. పలుమాఱును బోవుచుండునది. ఘటికాద్వయం ముహూర్తః. ౧. ౧౧. క్షణములు ౧ ముహూర్తము (రెండు గడియలసేపు).

**తే తు త్రింశ దహోరాత్రః -**

త్రింశన్ముహూర్తా అహోరాత్ర ఇత్యుచ్యతే ౩౦ ముహూర్తములకాలము అహోరాత్ర మనంబడును. అహ్నా సహితా రాత్రిః అహోరాత్రః. పగటితోఁగూడిన రాత్రి. ౧. ౩౦ ముహూర్తములు ౧ అహోరాత్రము (రోజు).

**పక్ష స్తే దశపఞ్చ చ,**

పంచదశతే అహోరాత్రాః పక్ష ఇత్యుచ్యతే. ౧౫ అహో రాత్రముల కాలము పక్షమనంబడును. పక్షతి భూతానీతి పక్షః డు పచష్ పాకే-భూతములను పరిపాకము నొందించునది. పక్ష్యత ఇతివా పక్షః. పక్ష పరిగ్రహే. పరిగ్రహింపఁబడునది. ౧. ౧౫ అహోరాత్రములు ౧ పక్షము.

**పక్షౌ పూర్వా పరౌ శుక్ల కృష్ణౌ -**

పూర్వాపరౌ పక్షౌ శుక్ల కృష్ణౌ విత్యుచ్యేతే, ఇందు పూర్వపక్షము శుక్ల మనియు, అపరపక్షము కృష్ణ మనియుఁ జెప్పఁబడును. మొదటిది శుక్లపక్షము, రెండవది కృష్ణపక్షము.

**మాసస్తు తావుభౌ.** 12

తావుభౌ మాస ఇత్యుచ్యతే ఆ పక్షములు రెండు కూడిన కాలము మాస మనంబడును. మస్యతే పరిమీయతే ఽనేనేతి మాసః. మసీ పరిమాణే–దీనిచేత కాలము పరిమాణము చేయఁబడును. ౨ పక్షములు ౧ నెల.

**ద్వౌద్వౌ మాఘాదిమాసౌ స్యా దృతుః -**

ద్వౌద్వౌ మాఘాదిమాసౌ ఋతురిత్యుచ్యతే. మాఘము మొదలైన రెండేసి మాసములు ఋతు వనంబడును. ఇయర్తీతి ఋతుః. ఋ గతౌ–గతించునది. ౨ నెలలు ౧ ఋతువు.

**తైరయనం త్రిభిః,**

తైస్త్రిభిః అయనముచ్యతే. మూఁడుఋతువులు చేరిన కాలము అయన మనంబడును. అయతే యాత్యనేనార్క ఇత్యయనం, అయగతౌ–దీనిచేత సూర్యుఁడు పోవును. ౩ ఋతువులు ౧ అయనము.

**అయనే ద్వే గతి రుద గ్దక్షి ణార్కస్య -**

అర్కస్య ఉదక్ ఉదగ్భాగే దక్షిణా దక్షిణభాగే చ యదాగతిః తదా క్రమాత్ ఉత్తరాయణ దక్షిణాయనే స్తః – మాఘము మొదలు ఆషాఢమువఱకు సూర్యుఁడు ఉత్తరముగాఁ బోవును గనుక నది యుత్తరాయణము. శ్రావణము మొదలు పుష్యమాసపర్యంతము దక్షిణముగాఁ బోవును గనుక నది దక్షిణాయనము.

**వత్సరః.** 13

తే ద్వే వత్సర ఇత్యుచ్యతే. ఆ దక్షిణాయనోత్తరాయణములు. కూడినకాలము వత్సర మనంబడును. ఉత్తరాయణ దక్షిణాయనములు ౨ చేరి ౧ సంవత్సరము పేరు.

**సమరాత్రిందివే కాలే విషువ ద్విషువం చ తత్,**

కాలే సమరాత్రిందివే సతి విషువత్ విషువమితి చోచ్యతే. రాత్రిశ్చదివాచ రాత్రిందివం. సమం రాత్రిందివం యస్మిన్ సః సమరాత్రిందివః

**అథాహ్వాయః.** 7

**ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ చ,**

ఆహూయతే ఽ నేనేత్వాహ్వాయః. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దేచ. దీనిచేత పిలువఁబడును. ౧. ఆఖ్యాయతే ఽ నయేత్యాఖ్యా. ఖ్యా ప్రకథనే–దీనిచేతఁ బలుకఁ బడును. ౨. ఆహూయతే ఽ నయేత్యాహ్వా. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దేచ. దీనిచేత పలుకఁబడును. ౪. నమ్యతే అనేనేతి నామధేయం. నామ చ. న–న ణము ప్రహ్వత్వే శబ్దే. దీనిచేత పలుకఁబడును గనుక నామధేయము–నామమును. ఈ ౬ నామధేయము పేళ్లు.

**హూతి రాకార ణాహ్వానమ్ -**

హూయతే అనయేతి హూతిః. ఇ–సీ. ఆహ్వానం చ. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ. దీనిచే పిలుతురు గనుక హూతి, ఆహ్వానమును. ౧, ౨. ఆకారయంత్య నేనేత్యాకారణం. ఆఞ్ పూర్వో డు కృఞ్ కరణ ఇతి ధాతుః. దీనిచేత పిలుతురు. ఆకారణే త్యాకారాంత స్త్రీలింగ పాఠో ఽ ప్యస్తి. ఈ 3 పిలుచుట పేళ్లు.

**సంహూతి ర్బహుభిః కృతా.** 8

సంభూయ హూతిస్సంహూతిః–అనేకులు చేరి పిలుచుట సంహూతి. ఈ ౧ బహుజనులు చేరి పిలుచుట పేరు.

**వివాదో వ్యవహారః స్యాత్ -**

వివిధో వాదో వివాదః. వద వ్యక్తాయాం వాచి–వివిధమైన వాదము. ౧. వ్యవహరంత్యనేనేతి వ్యవహారః. వ్యవపూర్వోహృఞ్ హరణే ఇతిధాతుః. దీనిచేత వ్యవహరింతురు. ఈ ౨ ధనాదినిమిత్తమైన కలహము పేళ్లు.

**ఉపన్యాసస్తు వాఙ్ముఖమ్,**

ఉప న్యసన ముపన్యాసః. ఉపనిపూర్వః అసుక్షేపణే ఇతా ధాతుః. ఉపన్యసించుట ఉపన్యాసము. ౧. వాచః ముఖ ముపక్రమః వాఙ్ముఖమ్. వాక్కుయొక్క ప్రారంభము. ఈ ౨ వాక్యారంభము పేళ్లు.

**ఉపోద్ఘాత ఉదాహారః -**

ఉప సమీపే ఉద్ధన్యత ఇత్యుపోద్ఘాతః. ఉపోత్పూర్వో హన హింసాగత్యోరితి ధాతుః – మిక్కిలి సమీపము నందెఱుఁగఁ జేయఁ బడునది. ౧. ఉద్ధృత్య ఆహ్రియత ఇత్యుదాహారః. ఉదాఙ్పూర్వో హృఞ్

హరణ ఇతి ధాతుః. ఎత్తి చెప్పఁబడునది. ఈ ౨ ఉపన్యాసాదిశబ్దములు; ౪ సమార్థములని కొందఱు ప్రకృతార్థమును ప్రతిపాదించుటకొఱకు నర్థాంతమును జెప్పుట పేళ్లు.

**శపనం శపథః పుమాన్.** 9

శపనంశపథః. శప ఆక్రోశే–ఆక్రోశించుట శపనము; శపథమున్ను. శపతి విశ్వసత్యనేనేతి శపనం; శపథశ్చ. శప ఉపాలంభనే. దీనిచేత జనము విశ్వసించును. ఈ ౨ ఒట్టు పెట్టుకొనుట పేళ్లు.

**ప్రశ్నో ఽ నుయోగః పృచ్ఛా చ-**

ప్రచ్ఛనం ప్రశ్నః. పృచ్ఛా చ. ప్రచ్ఛ జ్ఞీప్సాయాం. ఎఱుఁగఁ గోరి యడుగుట ప్రశ్నము. పృచ్ఛయు. ౧, ౨. అనుయుజ్యత ఇత్యనుయోగః. అనుపూర్వః యుజిర్యోగ ఇతి ధాతుః. ఈ ౩ అర్థము నెఱుఁగుటకై అడుగఁబడునది.

**ప్రతివాక్యోత్తరే సమే,**

పృష్టస్య ప్రతివచనం ప్రతివాక్యం – అడిగినందులకు బదులుచెప్పుట ప్రతివాక్యము. ౧. ఉత్తరన్త్యనేన చోద్యమిత్యుత్తరం. తౄ ప్లవనతరణయోః. అడిగిన శంకను దీనిచేత దాఁటుదురు. ఈ ౨ అడిగిన దానికి జవాబుఁ జెప్పుట పేళ్లు.

**మిథ్యాభియోగో ఽ భ్యాఖ్యానమ్-**

అభియుజ్యత ఇత్యభియోగ, ఆక్షేపః. మిథ్యాభూతశ్చాసావభియోగశ్చ మిథ్యాభియోగః అంతట సంబంధించి వాడుట అభియోగము. అసత్యమైన అభియోగము మిథ్యాయోగము. ౧. అభి అసత్యమారోప్య ఆఖ్యాన మభ్యాఖ్యానం. క్యా ప్రకథనే. లేనిదాని నారోపించి పలుకుట. ఈ ౨ మిథ్యావివాదము పేళ్లు.

**అథ మిథ్యాభిశంసనమ్.** 10

**అభిశాపః-**

మిథ్యాభూతమభిశంసనం మిథ్యాభిశంసనం. అభిపూర్వకశ్శంసు స్తుతావితి ధాతుః. అసత్యమైన నిందను జెప్పుట మిథ్యాభిశంసనము. ౧. అభి ఆరోప్య శప్యత ఇత్యభిశాపః – శప ఆక్రోశే. నిందను జెప్పి యాక్రోశింపఁబడునది. ఈ ౨ లేని దోషము నారోపించి చెప్పుటకుఁ బేళ్లు.

**ప్రణాదస్తు శబ్ద స్స్యా దనురాగజః,**

ప్రకృష్టో నాదః ప్రణాదః. ణద అవ్యక్తేశబ్దే. ప్రకృష్టముగాఁ బలుకుట. ఈ ౧ అనురాగమువలనఁ బుట్టిన శబ్దము పేరు.

**యశఃకీర్తిస్సమజ్ఞా చ-**

అశ్నుతే దిశ ఇతి యశః. స – న. అశూ వ్యాప్తౌ. దిక్కులను వ్యాపించునది. యాతి దేశాంతరమితి వా యశః. యా ప్రాపణే. దేశాంతరమును బొందునది. ౧. కీర్త్యత ఇతి కీర్తిః. ఇ. సీ. కౄత సంశబ్దనే. కీర్తింపఁబడునది. ౨. సమ్యక్ జ్ఞాయతే పురుషో௨నయేతి సమజ్ఞా. సమాజ్ఞేతి వా పాఠః. జ్ఞా అవబోధనే. దీనిచేత పురుషుఁడు లెస్సగా నెఱుఁగఁబడును. పా. సమ్యగాఖ్యాయత ఇతి సమాఖ్యా. ఖ్యాప్రకథనే. లెస్సగాఁ గీర్తింపఁబడునది. ఈ ౩ కీర్తి పేళ్లు.

**స్తవః స్తోత్రం స్తుతి ర్నుతిః.** 11

స్తూయతే అనేనేతి స్తవః, స్తోత్రం చ, స్తుతిశ్చ. ఇ. సీ. ష్టుఞ్‌స్తుతౌ. దీనిచేత స్తోత్రము చేయఁబడును గనుక స్తవము, స్తోత్రము, స్తుతియు. ౩. నూయతే అనేనేతి నుతిః. ణు స్తుతౌ. దీనిచేత నుతింపఁబడును. ఈ ౪ స్తోత్రము పేళ్లు.

**ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తమ్ -**

ఆమ్రేడ్యతే అసకృదుచ్చార్యత ఇత్యామ్రేడితం. ఆఙ్పూర్వోమ్రేడృ ఉన్మాద ఇతి ధాతుః. పలుమాఱు పలుకఁబడునది. మ్రేడృ ఉన్మాదే అను ధాతువు ఆఙ్పూర్వమై ఇచ్చట తత్కార్యమైన ద్విస్త్రిరుక్తమందు వర్తించును. సంతోషసంభ్రమముల చేత రెండుమూఁడు మార్లు పలుకఁబడిన శబ్దము పేరు.

**ఉచ్చైర్ఘుష్టం తు ఘోషణా,**

ఉచ్చైర్ఘుష్యత ఇత్యుచ్చైర్ఘుష్టం. ఘుషిర్ అవిశబ్దనే. బెట్టుగాఁ బలుకఁబడునది. ౧. ఘుష్యత ఇతి ఘోషణా – పలుకఁబడునది. ఈ ౨ బెట్టుగాఁ బలుకుటపేళ్లు.

**కాకుః స్త్రియాం వికారో య శ్శోకభీత్యాది భిర్ధ్వనేః.** 12

కుత్సితం కూయత ఇతి కాకుః. ఉ.సీ. కు శబ్దే – కుత్సితముగాఁ బలుకఁబడునది. ఈ ౧ శోక భయాదులచేతనైన ధ్వనియొక్క వికారము పేళ్లు.

**అవర్ణాక్షేప నిర్వాద పరీవా దాపవాదవత్,**
**ఉపక్రోశో జగుప్సా చ కుత్సా నిన్దా చ గర్హణే.** 13

వర్ణ్యత ఇతివర్ణః. స్తుతిః విరుద్ధస్తుతిరవర్ణః. వర్ణస్తుతౌ. వర్ణమనఁగా స్తుతి. అదిగాని విరుద్ధస్తుతి అవర్ణము. ౧. ఆక్షిప్యతఇత్యాక్షేపః. క్షిపనిందాయాం–ఆక్షేపించుట ఆక్షేపము. ౨. నికృష్టో వాదో నిర్వాదః, పరీవాదః, అపవాదశ్చ. వదవ్యక్తాయాం వాచి. అపవాదము. నిష్క్రాంతో వాదాదితి నిర్వాదః–వాదమువలన నిష్క్రాంతమైనది. ౩, ౪, ౫. పరీవాదాపవాదవ దితి వతిప్రత్యయేన ఉపక్రోశాదయో ఉపిఅవర్ణాదివత్ నిందార్థా ఇతిజ్ఞాప్యతే. ఉపక్రోశ సాహచర్యాత్తే షాంపుంలింగతా చ. పరీవాదాపవాదవత్ అనుచోట వతిప్రత్యయముచేత అవర్ణాదిశబ్దములవలె నుపక్రోశాదిశబ్దములు పుల్లింగములనియు ఁదెలియఁదగినది. ఉపక్రోశ ముపక్రోశః. క్రుశ ఆహ్వానే రోదనేచ. అంతట నాక్రోశించుట ఉపక్రోశము. ౬. జుగుప్సనం జుగుప్సా. గుపగోపన కుత్సనయోః. రోయుట జుగుప్స. ౭. కుత్సనం కుత్సా. కుత్స నిందాయాం. నిందించుట కుత్స. ౮. నిందనం నిందా. ణిదికుత్సాయాం–నిందించుట నింద. ౯. గర్హణం. గర్హ కుత్సాయాం. గర్హించుట గర్హణము. ఈ ౧౦ నిందించుట పేళ్లు.

**పారుష్య మతివాద స్స్యాత్ -**

పరుష మప్రియం వచః, తస్య భావః పారుష్యం–పరుషమనఁగా అప్రియ వచనము, దాని భావము పారుష్యము. ౧. అతివదనమతివాదః. అతిక్రాంతో వాదమతివాదః - వాదము నతిక్రమించి పలుకుట అతివాదము. ఈ ౨ అప్రియముగాఁ బలుకుట పేళ్లు.

**భర్త్సనం త్వపకారగీః,**

భర్త్స్యతే అనేనేతి భర్త్సనం. భర్త్స తర్జనే–దీనిచేత బెదరింపఁబడును. ౧. పరునకు భయముఁ బుట్టించుటకై పలికెడు వాక్కు పేరు.

**యస్స నిన్ద ఉపాలమ్భస్తత్రస్యా త్పరిభాషణమ్.** 14

ఉపాలభ్యత ఇత్యుపాలంభః. డు లభష్ ప్రాప్తౌ. దుర్వాక్యమును పలుకుట ఉపాలంభము. స చ సత్కుల ప్రసూతస్యతే ఈ దృశ ముచితమితి గుణావిష్కరణ పూర్వకః అసతీసుతస్య అగమ్యాగమన ముచితమేవేతి

నిందాపూర్వకశ్చేతి ద్వివిధః. తత్ర నిందాపూర్వక ఉపాలంభః పరిభాషణ మిత్యుచ్యతే–ఆయుపాలంభము మంచి కులంబునఁ బుట్టిన నీకు నిట్టి కార్యము యుక్తమా యను నిట్టి గుణావిష్కరణ పూర్వకమనియు, వ్యభిచారిణీపుత్రునికి చేయరానిపని చేయుట యుక్తమే యను నిట్టి నిందాపూర్వకమనియు రెండు విధములు. అందు నిందా పూర్వకమైన యుపాలంభము పరిభాషమనంబడును. పరితః నిందం భాషణం పరిభాషణం. భాష వ్యక్తాయాం వాచి–అంతట నిందతోడఁ బలుకుట పరిభాషణము. ఈ ౧ నిందతోఁగూడిన దుర్వాక్యమునకుఁ బేరు.

**తత్ర త్వాక్షారణా య స్స్యా దాక్రోశో మైథునం ప్రతి,**

ఆక్షరతి పరితః వ్యాప్నోతీత్యాక్షారణా. క్షుర సంచలనే–అంతట వ్యాపించునది. ఈ ౧ మైథునమునుగూర్చి ఘోషించుట పేళ్లు.

**స్యా దా భాషణ మాలాపః -**

ఆసమంతాద్భాషణ మాభాషణం. భాష వ్యక్తాయాం వాచి. అంతట సంభాషించుట ఆభాషణము. ౧. ఆలపన మాలాపః. లప వ్యక్తాయాం వాచి. లెస్సగాఁ బలుకుట ఆలాపము. ఈ ౨ సంభాషణము పేళ్లు.

**ప్రలాపో ఽ నర్థకం వచః.** 15

ప్రలపనం ప్రలాపః–మిక్కిలి పలుకుట ప్రలాపము. ఈ ౧ ప్రయోజనము లేనిమాట పేరు.

**అనులాపో ముహుర్భాషా -**

అనుపశ్చాదాలాపః అనులాపః – చెప్పినవెనుక మఱలఁ జెప్పుట అనులాపము. ఈ ౧ పలుమాఱు పలుకుట పేరు.

**విలాపః పరిదేవనమ్.**

విలపనం విలాపః – విలపించుట విలాపము. ౧. పరిదేవన మనుశోచనం. దేవృ పరిదేవనే. దుఃఖించి పలుకుట పరిదేవనము. ఈ ౨ దుఃఖముతోఁ బలికెడు వాక్కు పేళ్లు.

**విప్రలాపో విరోధోక్తిః -**

విరుద్ధః ప్రలాపః విప్రలాపః–విరుద్ధమైన ప్రలాపము. ఈ ౧ విరోధముతోఁ బలుకుట పేరు.

**సంలాపో భాషణం మిథః.** 16

సమ్యగాలాపః సల్లాపః - మంచిభాషణము సల్లాపము. ౧. ప్రీతిచేత పరస్పరము భాషించుటకు పేరు.

**సుప్రలాప స్సువచనమ్ -**

సుష్టుప్రలపనం సుప్రలాపః–లెస్సగాఁ బలుకుట సుప్రలాపము. ౧. సుష్ఠు వచనం సువచనం. వచ పరిభాషణే. మంచివచనము. ఈ ౨ పరిశుద్ధమైన మాటకు పేళ్లు.

**అపలాపస్తు నిహ్నవః,**

అపలపతీత్యపలాపః - అపలపించునది. ౧. నితరాం హ్నూయతే అనేనేతి నిహ్నవః. హ్నుఙ్ అప యనే. దీనిచేత మోసపుచ్చఁబడును. ఈ ౨ మోసపుఁ బలుకు పేళ్లు.

**సందేశవాగ్వాచికం స్యాత్ -**

అన్యేన సందిశ్యత ఇతి సందేశః. సంపూర్వో దిశ అతిసర్జన ఇతిధాతుః. తస్య వాక్ సందేశవాక్. చ–సీ. ఒకనిచేతఁ జెప్పఁబడు అర్థము సందేశము, ఆ వాక్కు. ౧. సందిష్టార్థా వాగేవ వాచికం. వచ పరిభాషణే. సందిష్టార్థము గలిగి వాక్కే వాచికము. వాచః అస్మిన్ సన్తీతి వాచికం–వాక్కులు దీనియందుఁ గలవు. ఈ ౨ చెప్పిపంపు మాట పేళ్లు.

**వాగ్భేదాస్తు త్రిషూత్తరే.** 17

ఉత్తరే వాగ్భేదా రుశత్యాదయః త్రిషు వర్తన్తే ముందు జెప్పఁగల రుశత్యాది సమ్యక్ఛబ్దాంతములైన వాగ్విశేషములు. ౩. లింగముల యందును వర్తించును.

**రుశతీ వాగ కల్యాణీ -**

రుశతి కల్యాణమితి రుశతీ. ఈ - సీ. రుశ హింసాయాం. శుభమును జెఱుచునది. పా. ఓషతి దహతి మన ఇత్యుషతీ. ఇ. సీ. ఉషదాహే. మనస్సును వ్యథపెట్టునది. ౧. అశుభమైన వాక్కునకుఁ బేరు.

**స్యా త్కల్యా తు శుభాత్మి కా,**

కలయితుం సంఖ్యాతుం యోగ్యా కల్యా. కల సంఖ్యానే. ఎంచఁదగినది. కలాసు క్రియాసు సాధురితి వా కల్యా– క్రియలయందు ఉచితమైనది. ౧. శుభమైన వాక్కునకుఁ బేరు.

**అత్యర్థమధురం సాన్త్వమ్ -**

అత్యర్థం నితాంతం మధురం శ్రోత్రప్రియం వచః అత్యర్థమధురం. మిక్కిలి శ్రోత్రములకు విననింపైన పలుకు. సాంత్వయతీతి సాంత్వం. సాంత్వ సామప్రయోగే. ఊరడించునది. ఈ ౧ బుజ్జగించుట పేరు.

**సంగతం హృదయఙ్గమమ్.** 18

సంగచ్ఛతే మన ఇతి సంగతం. సంపూర్వోగమ్ గతావితి ధాతుః. మనస్సును లెస్సగాఁ బొందునది. ౧. హృదయం గచ్ఛతీతి హృదయం గమం. మనస్సును బొందునది. ఈ ౨ మనస్సునకుఁ బ్రియమైన మాట పేళ్లు.

**నిష్ఠురం పరుషమ్ -**

నిశితమివ తిష్ఠతీతి నిష్ఠురం. ష్ఠా గతినివృత్తౌ. తీక్ష్ణమైయుండునది. ౧. పిపర్తివక్తారమితి పరుషం. పౄ పాలన పూరణయోః. పలికెడు వానిని బూర్ణముగాఁ జేయునది. ఈ ౨ కఠినమైన వాక్కు పేళ్లు.

**గ్రామ్య మశ్లీలమ్ -**

గ్రామే భవం గ్రామ్యం–గ్రామమందుఁ బుట్టినది. ౧. శ్రీఃచారుతా సా నాస్త్యస్మిన్నిత్యశ్లీల–శ్రీ యనఁగా నొప్పిదము; అది లేనిది గనుక అశ్లీలము. ఈ ౨ పామరజను లాడెడి పలుకుల పేళ్లు.

**సూనృతం ప్రియే,**

**సత్యే -**

సుష్ఠునృత్యన్త్యనేనేతి సూనృతం. నృతీ గాత్రవిక్షేపే. దీనిచేత లెస్సగా నాడుదురు. శోభనా నృతా పుంస్త్వమత్రేతివా సూనృతం. మంచివీర్యము గలది. ఈ ౧. ఇష్టంబును సత్యంబునైన మాట పేరు.

**అథ సంకుల క్లిష్టే పరస్పర పరాహతే.** 19

సంకులక్లిష్టశబ్దౌ పరస్పరవిరుద్ధే వచసి వర్తేతే. యథా ___ "యావజ్జీవమహం మౌనీ బ్రహ్మచారీ చ మే పితా, మాతా మమ చ వంధ్యా ఉ సీ త్పురాభో ఉనుపమో భవాౝ." సంకులక్లిష్ట శబ్దములు పూర్వోత్తర విరుద్ధమైన వాక్కుపేళ్లు. ఇందు కుదాహరణము. యావజ్జీవమహం మౌనీ యను శ్లోకము. సంకులన్తి జడీభవంత్య నేనేతి సంకులం. కుల సంస్త్యానే. దీనిచేత జడులవుదురు. ౧. క్లిశ్యంత్యనేనేతి క్లిష్టం. క్లిశూ విబాధనే. దీనిచేత క్లేశము నొందుదురు. ఈ ౨ విరుద్ధార్థముగల మాట పేళ్లు.

**లుప్తవర్ణపదం గ్రస్తమ్ -**

గ్రస్యంతే పీడ్యంతే వర్ణాః పదానివా అత్రేతి గ్రస్తం. గ్రసుగ్లసు అదనే. దీనిచేత వర్ణములుగాని పదములుగాని మ్రింగఁబడును. అశక్త్యాదులచేత వర్ణములుగాని పదములుగాని లోపించిన శబ్దము పేరు.

**నిరస్తం త్వరితోదితమ్,**

నిరస్యతే త్వరయా నిరస్తం. అసుక్షేపణే. త్వరచేత ప్రేరేపింపఁబడినది. ఈ ౧ త్వరగాఁ జెప్పిన మాట పేరు.

**అమ్బూకృతం సనిష్ఠేవమ్ -**

నిష్ఠేవ సంపర్కా దనంబు అంబుక్రియత ఇత్యంబూకృతం. తుంపురులతోఁ గూడుటవలన జలప్రాయముగాఁ జేయఁబడినది. ౧. నిష్ఠేవేన సహితం సనిష్ఠేవం – తుంపురులతోఁ గూడినది. ఈ ౧ తుంపురులతోఁ గూడిన వాక్కు పేరు.

**అబద్ధం స్యా దనర్థకమ్.** 20

న బధ్యతే హృదయమత్రేత్యబద్ధం. బంధ బంధనే. దీనియందు హృదయము నిలుపఁబడదు. ౧. న విద్యతే సముదాయార్థో ఽత్రేత్యనర్థకం – దీనియందు సముదాయార్థము లేదు. ఈ ౨ సముదాయారము లేనిమాట పేళ్లు.

**అనక్షర మవాచ్యం స్యాత్ -**

కుత్సితాన్యక్షరాణి అత్రేత్యనక్షరం. నఞత్ర నిందార్థకః. నిపాతానా మనేకార్థత్వాత్. కుత్సితములైన అక్షరములు గలిగినది. ౧. వక్తుం యోగ్యం వాచ్యం తన్నభవతీ త్యవాచ్యం. పలుక యోగ్యముగానిది. ౨. ఉచ్చరింపరాని తిట్టుపేళ్లు. యథా ___ "మృగతృష్ణాం భసిస్నాతః ఖపుష్పకృత శేఖరః, ఏష వంధ్యాసుతో యాతి శశశృంగధనుర్ధరః" ఇత్యాదులు.

**ఆహతం తు మృషార్థకమ్,**

ఆహన్యతే ప్రమాణాంతరేణేత్యాహతం. హన హింసాగత్యోః. ప్రమాణాంతరము చేత బాధింపఁబడునది. ౧. మృషా అసత్యభూతో ఽర్థః యస్మిన్ తత్ మృషార్థకం ___ అసత్యమైన అర్థము గలిగినది. ఈ ౨ అత్యంతా సంభావితమైన అర్థము గల వాక్యము పేళ్లు.

**(సోల్లుణ్ఠనం తు సోత్ప్రాసమ్-)**

ఉల్లుణ్ఠనేన సహితం సోల్లుణ్ఠనమ్ – దెప్పుటతోఁగూడినది. ఉత్ప్రాసేన సహితం సోత్ప్రాసమ్ – ఎగతాళితోఁ గూడినది. ఈ ౨ పరిహాసముతోఁ గూడిన మాట పేళ్లు.

**మణితం రతికూజితమ్**

మణ్యత ఇతి మణితమ్ – కేకవేయఁబడినది. మణ కూజనే. రతౌ కూజితమ్ రతికూజితమ్ – సురతమందలి కేక. ఈ ౨ రతికూజితము పేరు.

**అథ మ్లిష్ట మవిస్పష్టమ్ -**

మ్లేచ్ఛ్యత మ్లిష్టం. మ్లేచ్ఛ అవ్యక్తే శబ్దే. స్పష్టముగాఁ బలుకఁబడనది. ౧. విస్పష్టం న భవతీత్య విస్పష్టం – స్పష్టముకానిది. ఈ ౨ ప్రకటముగాని మాటపేళ్లు.

**వితథం త్వనృతం వచః.** 21

విగతం తథ్యం సత్యమత్రేతి వితథం – తథ్యమనఁగా సత్యము, అది దీనియందు లేదు. ౧. ఋతం సత్యం తన్న భవతీత్యనృతం–ఋత మనఁగా సత్యము. అదిగానిది అనృతము. ఈ ౨ అనృతవాక్కు పేళ్లు.

**సత్యం తథ్య మృతం సమ్యగమూని త్రిషు తద్వతి,**

సత్సు సాధుషు భవం సత్యం – సత్పురుషులయందుఁ బుట్టినది. ౧. తథాతేన ప్రకారేణ సాధు తథ్యం – ఆ ప్రకారముగా మంచిది గనుక తథ్యము. ౨. ఇయర్తి హృదయమితి ఋతం. ఋ గతౌ. హృదయమును పొందునది. ౩. అర్థేన సమం అంచతి సంగచ్ఛత ఇతి సమ్యక్. చ. న. అఞ్చు గతి పూజనయోః. అర్థముతోఁగూడ సంగతమై యుండునది. ౪. వాగ్భేదాస్తు త్రిషూత్తర ఇత్యుక్తత్వాత్. సత్యా వాక్, సత్యో వ్యాహారః, సత్యం వచ ఇతి త్రిషు లింగేషు వర్తంతే. అమూని త్రిషు తద్వతీ త్యుక్తత్వాత్ సత్యవద్వస్తు విషయత్వే ఉపి లింగత్రయేవర్తంతే. యథా సత్యోవిప్రః, సత్యా నారీ, సత్యం విప్రకులం ఇత్యాది. 'వాగ్భేదాస్తు త్రిషూత్తరే' అని చెప్పుటవలనఁ బూర్వోక్తశబ్దములు త్రిలింగములు. ఈసత్యాది శబ్దములు సత్యముగల పదార్థములుఁ జెప్పునపుడును త్రిలింగములు. సత్యమైనదాని పేళ్లు.



# శబ్దాది వర్గము

**శబ్దే నినాద నినద ధ్వని ధ్వాన రవ స్వనాః,**
**స్వాన నిర్ఘోష నిర్హ్రాద నాద నిస్వాన నిస్వనాః.** 1
**ఆర వారావ సంరావ విరావాః -**

శబ్ద ఉక్తః. ౧. శబ్ద శబ్దమునకు ముందు వృత్తి చెప్పఁబడియున్నది. నినదతీతి నినాదః, నినదశ్చ. ణద అవ్యక్తే శబ్దే. మ్రోయునది నినాదము, నినదమున్ను. ౨, ౩. ధ్వననం ధ్వనిః ఇ. పు. ధ్వానశ్చ. ధ్వన శబ్దే. ౪, ౫. రౌతీతి రవః. రు శబ్దే. ౬. స్వనతీతి స్వనః  స్వానశ్చ. స్వన శబ్దే. ౭, ౮. నిర్ఘోషతీతి నిర్ఘోషః. ఘుషిర్ శబ్దనే. ౯. నితరాం హ్రాదతే నిర్హ్రాదః. హ్రాద అవ్యక్తే శబ్దే. ౧౦. నదతీతి నాదః. ౧౧. నితరాం స్వనతీతి నిస్వానః, నిస్వనశ్చ. స్వన శబ్దే. ౧౨, ౧౩. రౌతీత్యారవః. ఆరావః. సంరావః. విరావః. రు శబ్దే. ఈ ౧౭ మ్రోఁత పేళ్లు.

**అథ మర్మరః,**

స్వనితే వస్త్రపర్ణానామ్ -

మర్మరధ్వని రత్రాస్తీతి మర్మరః - దీనియందు మరమర యనెడు ధ్వని గలదు. ౧. కోకలు ఆకులు మొదలైనవానియొక్క మ్రోఁత పేరు.

**భూషణానాం తు శిఞ్జితమ్.** 2

శింజతీతి శిఞ్జితం. శిజి అవ్యక్తేశబ్దే. అస్ఫుటముగా మ్రోయునది. ఈ ౧ భూషణముల ధ్వనికి పేరు.

**నిక్వాణో నిక్వణః క్వాణః క్వణః క్వణన మిత్యపి,**

నితరాం క్వణతీతి నిక్వాణః. నిక్వణః. క్వాణః. క్వణః. క్వణనం చ. వణక్వణ శబ్దే. లెస్సగాఁ బలుకునది. ఈ ౫ వీణాది సకలవాద్య ధ్వనులకుఁ బేళ్లు.

**వీణాయాః క్వణితే ప్రాదేః ప్రక్వాణ ప్రక్వణాదయః.** 3

ప్రకర్షేణ క్వణతీతి ప్రక్వాణః. ప్రక్వణశ్చ. క్వణ శబ్దే. మిక్కిలి మ్రోయునది. ఈ ౨ వీణాదిధ్వని పేర్లు.

**కోలాహలః కలకలః -**

కోలానాహలతీతి కోలాహలః. హల విలేఖనే. కోలములు వరాహములు వానిని భయపఱచునది. కోలనం కోలః ఏకీభావః, తమాహరతి

భినత్తీతివా కోలాహలః. కోలమనఁగా చేరియుండుట, దానిని జెఱుచునది. ౧. కల్యతే అవ్యక్తం శబ్ద్యత ఇతి కలకలః. కల శబ్ద సజ్ఖ్యానయోః. అవ్యక్తముగాఁ బలుమాఱు పలుకఁబడునది. కలకలః అని అభీక్ష్ణ్యమందు ద్విర్భావము. ఈ ౨ గుంపునఁ బుట్టిన గొప్పధ్వని పేళ్లు.

**తిరశ్చాం వాశితం రుతమ్,**

వాశ్యతే ఇతి వాశితం. వాశృ శబ్దే. పలుకఁబడునది. ౧. రూయత ఇతి రుతం. రుశబ్దే. పలుకఁబడునది. ఈ ౨ మృగ పక్ష్యాదుల ధ్వనికిఁ బేళ్లు.

**స్త్రీ ప్రతిశ్రు త్ప్రతిధ్వానే -**

ప్రతి శ్రూయతే ఇతి ప్రతిశ్రుత్. త.సీ. శ్రు శ్రవణే. ఎదురుగా వినఁబడునది. ౧. ప్రతిధ్వననం ప్రతిధ్వానః. ధ్వన శబ్దే. ఎదురుగాఁ బలుకుట ప్రతిధ్వానము. ఈ ౨ ప్రతిధ్వనికి నామములు.

**గీతం గాన మిమే సమే.** 4

గీయత ఇతి గీతం. గానం చ. గై శబ్దే. పాడఁబడునది. ఈ ౨ పాట పేళ్లు. ఈ ౨ ను సమానార్థకములు.

## నాట్య వర్గము

**నిషా దర్షభ గాన్ధార షడ్జ మధ్యమ ధైవతాః,** 1
**పఞ్చమ శ్చేత్యమీ సప్తతన్త్రీ కంఠోత్థితా స్స్వరాః.**

(షడ్జం మయూరో వదతి గావస్త్వృ షభభాషిణః,
అజావికం తు గాన్ధారం క్రౌఞ్చః క్వణతి మధ్యమమ్.
పుష్పసాధారణే కాలే పికః కూజతి పఞ్చమమ్,
ధైవతం హేషతే వాజీ నిషాదం బృంహతే గజః,
మయూరాదయ ఏతే హి మత్తా గాయన్తి పఞ్చమమ్.)

నిషీదంతి స్వరా అస్మిన్నితి నిషాదః. షద్ విశరణగత్యవసాదనేషు. కడపటి స్వరమగుటవల్ల దీనియందు స్వరములన్నియుఁ జేరియుండును. ౧. ఋషతి హృదయం ప్రవిశతీతి ఋషభః. ఋషగతౌ. హృదయమును బ్రవేశించునది. ఋషష స్వర సంవాదిత్వాద్వా ఋషభః – వృషభస్వరము వంటి స్వరమును బలుకునది. ౧. తదుక్తం "షడ్జం మయూరో వదతి గావస్త్వృషభభాషిణః" ఇత్యాది. గాం వాచం ధరతీతి గాంధారః

ధృఞ్ధారణే. వాక్కులను ధరించునది. స్వరాంతరస్య గంధంలేశం ఆరాతీతివా గాంధారః. రా ఆదానే. స్వరాంతరముయొక్క శ్రుతిని బుచ్చుకొనునది. గాంధారదేశీయైర్గీయత ఇతి వాగాంధారః గాంధార దేశపు జనులచేఁ బాడఁబడునది. ౧. షట్సుస్థానేషు జాయత ఇతి షడ్జః. జనీప్రాదుర్భావే. "నాసా కంఠమురస్తాలు జిహ్వా దన్తాశ్చ సంస్పృశ౯, షడ్భ్యస్సంజాయతే యస్మా త్తతషడ్జస్స ఉచ్యతే" నాసిక, కంఠము, ఱొమ్ము, దవడలు, నాలుక, దంతములు అనెడు నీ ౬ స్థలములయందును బుట్టునది. ౧. మధ్యమః "తద్వదేవోత్థితో వాయు రురః కంఠ సమాహితః, నాభిప్రాప్తోమహానాదో మధ్యస్థత్వాత్తు మధ్యమః' ఉరఃకంఠములతోఁగూడి మధ్యావయవమైన నాభివలనఁ బుట్టునది. స్వరాణాం మధ్యస్థితత్వాద్వా మధ్యమః –సప్తస్వరములయొక్క మధ్యమునందుండునది. ౧. ధీమద్భిర్గీయ తఇతి ధైవతః –బుద్ధిమంతులచేతఁ బాడఁబడునది. ధావతి నాభ్యాది స్థానేభ్య ఆగచ్ఛతీతివా ధైవతః. ధావు గతిశుద్ధ్యోః. నాభ్యాదిస్థానముల వలనఁ బుట్టునది. ౧. పంచమః "వాయుస్సముత్థితో నాభేరురోహృత్కంఠ మూర్ధసు, సంచర౯ పంచమస్థానప్రాప్త్యా పంచమ ఉచ్యతే" నాభి, ఉరస్సు, హృదయము, కంఠము, శిరస్సు అనెడి ౫ స్థానములయందుఁ బుట్టునది గనుక పంచమము. పికైః పంచ్యత ఇతి వా పంచమః. పచి విస్తారే. కోయిలలచేత విస్తరింపఁజేయఁబడునది. ఈ ౭ నుక్రమముగా సప్తస్వరముల పేళ్లు.

**కాకలీ తు కలే సూక్ష్మే -**

కలః మధురాస్ఫుటో ధ్వనిః. సూక్ష్మేతస్మి౯ కాకలీ. ఈ.సీ. కల మనఁగా మధురంబును అస్ఫుటంబునునైన ధ్వని. అది సూక్ష్మమైనయెడల కాకలి యనంబడును. కుః సూక్ష్మః సచా సౌ కలశ్చ కాకలీ. సూక్ష్మమైన కల ధ్వని. ఈ ౧ సూక్ష్మమైన ధ్వనిపేరు.

**ధ్వనౌ తు మధురాస్ఫుటే,**

**కలో -**

మధురే శ్రుతిసుఖే, అస్ఫుటే అవ్యక్తాక్షరే ధ్వనౌ కలః – సుఖమై వ్యక్తముగాని వర్ణములు గలిగిన ధ్వని కల మనంబడును. కం సుఖం లాతీతికలః. లాదానే. సుఖము నిచ్చునది. కలో మదః తద్యోగాద్వాకలః. కల

మదే. కల మనఁగా మదము, అది గలిగినది. ౧. అవ్యక్తమధురధ్వని పేరు.

**మన్ద్రస్తు గమ్భీరే -**

మన్యతే బుధ్యతే అనేనేతి మంద్రః – దీనిచేత నెఱుఁగఁబడును. మందతే శనైర్నిస్సరతీతి మంద్రః. మది స్తుతి మోద మద స్వప్న కాంతిగతిషు. మెల్లగాఁ బలుకఁబడునది. ఈ ౧ గంభీరధ్వని పేరు.

**తారో ఽ త్యుచ్చైః -**

తారయతి స్థానేభ్యస్స్వరమితి తారః. తౄప్లవనతరణయోః. స్వరము నన్నిస్థానములవలనను దరింపఁజేయునది. ఈ ౧ ఉచ్చధ్వని పేరు.

**త్రయస్త్రిషు.** 2

త్రయః కలమంద్రతార శబ్దాః త్రిషులింగేషు వర్తంతే. యథా___ కలోధ్వని, కలావాణీ, కలం క్వణనం ఇత్యాది. కలాదిశబ్దములు ౩ ను మూఁడు లింగములయందును వర్తించును.

**సమన్వితలయస్త్వేకతాలో -**

సమ్యగన్వితః అనుగతః లయః యత్రసః స ఏకతాల ఇత్యుచ్యతే. లయమనగా నృత్తగీత వాద్యములు సరిగా ముగించుట. అది యెందు లెస్సగాఁ గూడియుండునో అది ఏకతాల మనంబడును. ఏకః సమః తాలః కాలక్రియామానం యస్య స ఏకతాలః – సమమైన కాలక్రియామానములు గలిగినది. ఈ ౧ గీత వాద్య లయ సామ్యము పేరు.

**వీణా తు వల్లకీ,**

**విపఞ్చీ -**

వేతి జాయతే స్వరో ఽ స్యామితి వీణా. వీ గతిప్రజననకాంత్యసన ఖాదనేషు. సర్వము దీనియందుఁ బుట్టును. ౧. వల్లతే ధ్వని విశేషమితి వల్లకీ. ఈ. సీ. వల వల్ల సంవరణే. స్వరవిశేషమును ధరించునది. ౨. విపంచయతి స్వరానితి విపంచీ. ఈ. సీ. పచి విస్తారే. స్వరములను విస్తరింపఁజేయునది. వివిధం పంచ్యంతే వ్యక్తీక్రియంతే స్వరా అస్యామితి వావిపంచీ. పచి వ్యక్తీకరణే. దీనియందు స్వరములు వ్యక్తములుగాఁ జేయఁబడును. ఈ ౩ వీణ పేళ్లు.

**సాతు తన్త్రీభి స్సప్తభిః పరివాదినీ** 3

పరితోవదతి సప్తస్వరానితి పరివాదినీ. ఈ.సీ. వద వ్యక్తాయాం

వాచి. అంతటను సప్తస్వరములఁ బలుకునది. ఈ ౧ తంతువులతోఁ గూడిన వీణ పేరు.

**తతం వీణాధికం వాద్యమ్ -**

తన్యత ఇతి తతం. తంత్రీ సూత్రం తద్యోగా ద్వీణాదికమపి తతం. తనువిస్తారే. విస్తరింపఁబడునది గనుక తంత్రి, సూత్రము తత మనంబడును. ఆతంతువులు గలవి గనుక వీణాదులును తతము లనంబడుచున్నవి. తన్యంతే వ్యక్తీక్రియంతే స్వరా అత్రేతి తతం – దీనియందు స్వరములు వ్యక్తములుగాఁ జేయఁబడును. ఆదిశబ్దముచేత కిన్నరి, సైరంధ్రి, రావణహస్తము మొదలైన వాద్యములును తతము లనంబడును. వీణ మొదలైన తంత్రీవాద్యము పేరు.

**ఆనద్ధం మురజాదికమ్,**

ఆనహ్యతే చర్మణేత్యానద్ధం. ణహ బంధనే. చర్మముచేతఁ గట్టఁబడునది. ఈ ౧ మద్దెల మొదలైన చర్మవాద్యముల పేరు.

**వంశాదికం తు సుషిరమ్ -**

సుషిః ఛిద్రం విద్యతే అస్మిన్నితి సుషిరం. సుషి యనఁగా రంధ్రము, అది గలది సుషిరము. సుషిర ఇత్యపి పాఠో ఽస్తి. ఈ ౧ వేణుశంఖకాహళ్యాది ముఖవాద్యముల పేరు.

**కాంస్యతాలాదికం ఘనమ్.** 4

మన్యత ఇతి ఘనం. హన హింసాగత్యోః. కొట్టఁబడునది. అనల సంయోగాద్ద్రవీభూయ పునర్ఘ నాయతి ఇతివా ఘనం. అగ్ని సంయోగము వలన ద్రవమునుజెంది మఱల గట్టియగునది. ఈ ౧ కంచుతాళము మొదలైన వాద్యముల పేరు.

**చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్యనామకమ్,**

వాదయంతి ఏనమితి వాద్యం వాదిత్రం. చ. వద వ్యక్తాయాం వాచి. దీనిని బలికింతురు గనుక వాద్యము. వాదిత్రమును. ౧, ౨. ఆసమంతాత్ తోద్యత ఇత్యాతోద్యం. తుద వ్యథనే. అంతట వాదింపఁబడునది. ఈ ౩ తతానద్ధసుషిర ఘనములనెడి నాలుగింటికిని పేళ్లు.

**మృదఙ్గా మురజాః -** 5

మృద్యత ఇతి మృదంగః. మృద మర్దనే. కొట్టఁబడునది. మృత్

అంగమస్యేతి వా మృదంగః – మృత్తిక అంగముగాఁగలది. ౧. మురతీతి మురః వేష్టనం. మురవేష్టనే. చర్మపట్టికాసంవేష్టనా జ్జాతఃమురజః. మురమనఁగా చర్మవలయము. అందువలనఁ గలిగినది. ఈ ౨ మద్దెలపేళ్లు.

**భేదా స్త్వఙ్క్యాలిఙ్గ్యోర్ధ్వకా స్త్రయః.**

'హరీతక్యాకృతి. స్త్వంక్యో యవమధ్యస్తథోర్ధ్వకః, ఆలింగ్యశ్చైవగోపుచ్ఛ ప్రకృత్యా సంప్రకీర్తితః' కరక కాయవంటి యాకారము గలది అంక్యము. యవమధ్యమువంటి నడుముగలది ఊర్ధ్వకము. గోపుచ్ఛమువంటి యాకారముగలది ఆలింగ్యము. అంకే ఉత్సంగే వాద్యత ఇంత్యంక్యః – తొడమీఁద నుంచుకొని వాయింపఁబడునది. ౧. వాద్యమాన ఆలింగన్యత ఇత్యాలింగ్యః – వాయించు సమయమున నాలింగనము చేయఁబడునది. వాదనార్థం ఊర్ధ్వస్థస్సన్ కాయతీతి ఊర్ధ్వకః. కైశబ్దే. వాయించుటకై పొడవుననుండి పలుకునది. ఈ ౧ మద్దెళ భేదములకుఁ బేళ్లు.

**స్యా ద్యశఃపటహో ఢక్కా -**

యశోర్థః పటహః యశఃపటహః–కీర్తికొఱకైన పటహము గనుక యశః పటహము. ౧. ఢగితి అవ్యక్తం కాయతీతి ఢక్కా. కైశబ్దే. ఢక్ అనెడి శబ్దమును బలుకునది. ఈ ౨ ఢవణపేళ్లు.

**భేరీ స్త్రీ దున్దుభిః పుమాన్,**

బిభ్యతి శత్రవో ఽస్యా ఇతి భేరీ. ఈ. సీ. ఞి భీ భయే. దీనివలన శత్రువులు భయపడుదురు. ౧. దుందుశబ్దేన భాతీతి దుందుభిః. ఇ. పు. భాదీప్తౌ. దుందువను శబ్దముచేత ప్రకాశించునది. ఓభనం ఉభిః పూరణం. ఉభ పూరణే. దుందుశబ్దేన ఉభిరత్రేతి దుందుభిః. ఉభి యనఁగా నిండుట. దుందు అనెడి ధ్వనిచేత నిండుట దీనియందుఁ గలదు. భేరి పేళ్లు.

**ఆనకః పటహో ఽ స్త్రీ స్యాత్ -**

అనితి చేష్టతే స్వరవిశేషో ఽస్మాదానకః. అ. ప్న. అన ప్రాణనే. దీని వలన స్వరవిశేషము ఉజ్జీవితమౌను. ౧. పటదితి శబ్దం జహాతీతి పటహః. అ. ప్న. ఓహాక్ త్యాగే. పటత్ – అనెడు శబ్దములను బలుకునది. ఈ ౨ తమ్మట పేళ్లు.

**కోణో వీణాదివాదనమ్.** 6

కుణ్యతే అనేనేతి కోణః. కుణ శబ్దోపకరణయోః. దీనిచేఁ బలి

కింపఁబడును. ౧. వీణాదీన్వాదయతీతి. వీణాదివాదనం, వీణాదులను వాయించునది. వీణాదివాద్యముల వాయించు కొడుపు పేరు.

**వీణాదణ్డః ప్రవాళస్స్యాత్ -**

ప్రవలంతే సర్వా అత్రేతి ప్రవాళః. వల సంవరణే. స్వరములు దీనియందుఁ గూడియుండును. ఈ ౧ వీణయొక్క ఒళుగు పేరు.

**కకుభస్తు ప్రసేవకః,**

కకుభ ప్రసేవకశబ్దౌ వీణాదండాధస్థితవక్రదారుణి వర్తేతే. కంవాయుం స్కభ్నాతి బధ్నాతీతి కకుభః స్కభి స్తంభనే. వాయువును పోనీయక నిలుపునది. ౧. ప్రసేవ్యత ఇతి ప్రసేవకః, షేవృ సేవనే – మిక్కిలి కదిసియుండునది. ఈ ౨ వీణయొక్క కరివెపేళ్లు.

**కోలమ్బకస్తు కాయో ఽ స్యా -**

అస్యాః = ఈవీణయొక్క, కాయః = తంత్రి ఒళుగు మొదలైన శరీరము, కోలంబకః = కోలంబక మనంబడును. కుల్యతే అనేన శబ్ద ఇతి కోలం బకః. కుల సంస్త్యానే. దీనిచేత శబ్దము విస్తరింపఁజేయఁబడును. కే శిరసి తంత్రీరవలంబత ఇతి కోలంబకః. లబి అవస్రంసనే. శిరస్సునందుఁ దంతువుల నవలంబించి యుండునది. క్రోడే లంబమానః కాయతీతి కోలంబకః. కైశబ్దే. ఉరస్థలమందుండి శబ్దించునది. ఈ ౧ వీణయొక్క తంత్రి ఒళగు మొదలగు శరీరము పేరు.

**ఉపానాహో నిబన్ధనమ్.** 7

ఉపనహ్యంతే తంత్ర్యో ఽ త్ర ఉపనాహః ణహ బంధనే. తంతులు దీనియందుఁ గట్టఁబడును. ౧. నిబధ్యంతే తంత్ర్యో ఽ త్ర నిబంధనం బంధబంధనే. దీనియందుఁ దంతులు కట్టఁబడును. ఈ ౨ తంతులు గట్టెడి బిరడల పేళ్లు.

**వాద్యప్రభేదా డమరు మడ్డు డిణ్డిమ ఝ ర్ఝ రాః,**
**మర్దలః పణవో ఽ న్యే చ-**

డమేతి శబ్దం రౌతీతిడమరుః, డమ అనెడి శబ్దమును బలుకునది. ఇది యోగికాపాలికాదులు వాయించునది. ౧. అయమేవ ఘనశ్చేన్మడ్డు రిత్యుచ్యతే, ఈడమరుకమే ఘనమైన మడ్డు వనంబడును. మడితిరౌతీతి మడ్డుః, రుశబ్దే. మడ్ అని పలుకునది గనుక మడువు. ౧. డిండీతి శబ్దం మనోతి ప్రక్షిపతీతి డిండిమః, డుమిఞ్ ప్రక్షేపణే. డిండి యనుశబ్దమును

జేయునది. ఝర్ఝతే భాషత ఇతి ఝర్ఝరః, ఝర్ఝ పరిభాషణ సంతర్జనయోః. ధ్వనిఁ జేయునది. ఝర్ఝేతి శబ్దం రౌతీతి ఝర్ఝరః. ఝర్ఝయనెడి ధ్వనిని బలుకునది. ౧. మృద్యత ఇతి మర్దళః మృద క్షోదే. మర్దింపఁబడునది. ౧. పణ్యతే స్తూయతే అనేనేతి పణవః. పణ వ్యవహారే స్తుతౌచ. దీనిచేత స్తోత్రము చేయఁబడును. ౧. 'అన్యే చ' అన్నందున గోముఖ హుడుక్కాదులైన కొన్ని వాద్య భేదములుం గలవు. డమరు శబ్దము మొదలు ౬ వరుసగా డమరుగము, గుమ్మెట, రాయడి గిడిగిళ్లు, కైమళ్లు, మద్దెల, ఉడుక అను వాద్యభేదముల పేళ్లు.

**నర్తకీ లాసికే సమే.** 8

నృత్యతీతి నర్తకీ. నృతీ గాత్ర విక్షేపే. ఆడునట్టిది. ౧. లసతి క్రీడతి రంగభూమావితి లాసికా. లస శ్లేషణ క్రీడనయోః. రంగస్థలమునందుఁ గ్రీడించునది. ఈ ౨ నాట్యమాడు స్త్రీ పేళ్లు.

**విలమ్బితం ద్రుతం మధ్యం తత్త్వ మోఘో ఘనం క్రమాత్,**

విలంబితం, ద్రుతం, మధ్యమితి లయవిశేషాః క్రమాత్ తత్త్వం, ఓఘః, ఘనమిత్యుచ్యన్తే. విలంబిత, ద్రుత, మధ్యంబు లనెడి లయ విశేషములు వరుసగా తత్త్వ, ఓఘ, ఘనము లనంబడును. విలంబన్తే కరపదాదయో ఽత్రేతి విలంబితం. ప్రత్యేకం గతి విశేషత్వాత్. లబి లంబనే. వేఱు వేఱుగా గతి విషేములు గలుగుట వలన దీనియందు కరపదాదులు నిలుకడగలవగును. ౧. ద్రవన్తిత్వరన్తే కరచరణాదయో ఽత్రద్రుతం. ద్రుగతౌ. దీనియందుఁ గరచరణాదులు త్వరితములై యుండును. ౧. విలంబితద్రుత యోర్మధ్యే భవత్వాన్మధ్యం. విలంబిత ద్రుతములయొక్క కూడుటచేత నారెంటి నడుమ నుండునది. ౧. కరచరణగతీనాం ప్రత్యేకదర్శన క్రియాయాః తనమత్రాస్తీతితత్త్వం. తను విస్తారే కరచరణాదిగతి విశేషముల యొక్క ప్రత్యేకదర్శన క్రియావిస్తారము గలిగినది. ౧. కరచరణాదిగతి విశేష సమవాయః ఓఘః. ఉచ సమవాయే. కరచరణాది గతివిశేషముల యొక్క సమవాయము. ౧. హన్యతేభిద్యతే అనేనేతి ఘనం. హనహింసాగత్యోః. దీనిచేత భేదింపఁబడును. ౧. ఈ ౩ ను వరుసగా నృత్తగీతవాద్యముల విలంబ ద్రుత మధ్యమానముల పేళ్లు.

**తాలః కాలక్రియామానమ్ -**

హస్తాకుఞ్చన ప్రసారణాది క్రియాయాః కాలస్య చ యత్ ప్రమాణం తత్తాళ ఇత్యుచ్యతే. హస్తాకుంచనప్రసారణాది క్రియకును కాలమునకును గల ప్రమాణముపేరు. ఏతావత్కాలావధిః అంగుళ్యాది విన్యాసజ్ఞాపకః క్రియాకాల పరిమాణస్తాళః. ఇంతకాలముచేత నీక్రమమున నంగుళీవిన్యాసాదులు చేయవలయునని తెలియఁబఱచునట్టి కాలక్రియా పరిమాణము తాళ మనంబడును. తల న్తితిష్ఠన్తి గీతవాద్య నృత్తాన్యత్రేతి తాలః. తలప్రతిష్ఠాయాం. నృత్తగీతవాద్యములు దీనియందు నిలిచియుండును. ఈ ౧ కాలమునకును హస్తాకుంచన ప్రసారణాది క్రియకును గల ప్రమాణముల పేరు.

**లయ స్సామ్యమ్ -**

లీయంతే నృత్తగీతాదయో ఽ స్మిన్నితి లయః. లీఙ్ శ్లేషణే. నృత్త గీతాదులు దీనియందు సమముగాఁ గూడియుండును. ఈ ౧ నృత్త గీత వాద్యములు సమముగా నుండుట పేరు.

**అథాస్త్రియామ్.** 9

తాణ్డవం నటనం నాట్యం లాస్యం నృత్యం చ నర్తనే,

తణ్డునా ప్రణీతం తాణ్డవం. ప్న. తణ్డువనెడి ఋషిచేతఁ జెప్పఁబడినది. తాద్యతే భూమి రనేనేతి తాణ్డవం, దీనిచేత భూమి కొట్టఁబడును. అస్త్రియామిత్యస్య తాండవశబ్దేనాన్వయః. ౧. నట్యతే నటనం. ణటనృత్తౌ. నటించుట నటనము. ౨. నటస్య కర్మ నాట్యం. నటుని యొక్క వ్యాపారము. ౩. లసనం లాస్యం. లసశ్లేషణ క్రీడనయోః. క్రీడించుట లాస్యము. ౪. నృత్యం. పా. నృత్తం, నర్తనం చ. నృతీగాత్ర విక్షేపే. నర్తించుట నృత్యము నర్తనమును. ౫, ౬. భరతశాస్త్రే తాండవాదీనాం పరస్పరం భేదః. యథా ___ ఉద్ధతకరణాఙ్గ విక్షేపమార భటీ వృత్తిప్రధానం తాండవం. కోమలకరణాఙ్గ విక్షేపం కైశికీవృత్తి ప్రధానం లాస్యం. అంగవిక్షేపమాత్రం నృత్తం. వివాహాభ్యుదయాదౌ సర్వరసప్రధానం నాట్యం." భరతశాస్త్రప్రక్రియలైన యీయాఱింటికిని బరస్పరము భేదము గలదు. అది యెట్లనినః___ ఉద్ధతకరణాంగ విక్షేపములు గలిగి ఆరభటీవృత్తి ప్రధానమైనది తాండవము. కోమలకరణాంగ విక్షేపములు గలిగి కైశికీవృత్తి ప్రధానమయినది లాస్యము.

అంగవిక్షేపమాత్రము గలది నృత్తము. వివాహాది శుభకార్యములయందలి సర్వరసప్రధానమయినది నాట్యము. ఆటపేళ్లు.

**తౌర్యత్రికం నృత్త గీత వాద్యం నాట్య మిదం త్రయమ్.** 10

తూర్యం మురజాదిః తత్ర భవః శబ్దః తౌర్యః, త్రయః అవయవాః అస్యేతి త్రికం. తౌర్యేణత్రికం తౌర్య త్రికం. తూర్య మనఁగా మద్దెల మొదలైనవి. అందుఁ బుట్టిన శబ్దము తౌర్యము. దానితో మూఁడవ యవములు గలిగినది. ౧. నటస్యేదం నాట్యం నటుని సంబంధమయినది. ఈ ౨ నృత్త గీత వాద్యములు మూఁడును గూడుట పేళ్లు.

**భ్రకుంసశ్చ భ్రుకుంసశ్చ భ్రూకుంసశ్చేతి నర్తకః,**
**స్త్రీవేషధారీ పురుషో -**

భ్రూభ్యాం కుంసః భాషణం శోభా వా యస్యసః భ్రకుంసః. భ్రుకుంసః. భ్రూకుంసశ్చ. కుసిర్భాషాయాం. కనుబొమ్మలచేత అర్థమును సూచించుటయైనను కాంతియైనను గలవాఁడు భ్రకుంసుఁడు, భ్రుకుంసుఁడు–భ్రూకుంసుఁడు. ఈ ౩ స్త్రి వేషధారియై నటనము చేయు పురుషుని పేళ్లు.

**నాట్యోక్తౌ -**

ఇత ఆరభ్య ఆఙ్గిక సాత్త్వికే ఇత్యన్తం నాట్యోక్తా విత్యనువర్తతే. ఇది మొదలు ఆంగిక సాత్త్వికే అనువఱకు నాట్యోక్తౌ (నాట్యపరిభాష యందు) అను పదం బనువర్తించుచున్నది.

**గణికా ౭ ర్జుకా.** 11

అర్జయతీత్యర్జుకా. పా. అజ్జుకా. అర్జ అర్జనే. ఆర్జించునది. ఈ ౧ (నాట్య పరిభాషయందు) వేశ్యపేరు.

**భగినీపతి రావుత్తో-**

అవతి భగినీమిత్యావుత్తః అవరక్షణే. తోఁబుట్టువు నేలువాఁడు. ఈ ౧ తోడఁబుట్టిన దాని మగనిపేరు.

**భావో విద్వాన్ -**

భావయతీతి భావః. సర్వార్థములను భావింపఁజేయువాఁడు. ఈ ౧ విద్వాంసునిపేరు.

**అథావుకః,**

**జనకో**

అవతీత్యావుతః. అవరక్షణే. రక్షించువాఁడు. ఈ ౧ తండ్రిపేరు.

**యువరాజస్తు కుమారో భర్తృదారకః.** 12

యువా చాసౌ రాజా చ యువరాజః. పిన్నఱేఁడు. ౧. కుమారయతీతి కుమారః. ఆడువాఁడు. కుమార క్రీడాయామ్. ౨. ద్రియత ఇతి దారకః. ఆదరింపఁబడువాఁడు. భర్తుః దారకః భర్తృదారకః. దొరకొడుకు. ఈ ౩ యువరాజు పేళ్లు.

**రాజా భట్టారకో దేవః -**

భటాః సేవకాః తైర్యుద్ధ ముత్తారయతీతి భట్టారకః తౄప్లవన తరణయోః. భటులు సేవకులు. వారిచేత యుద్ధమును తరించువాఁడు. భటాన్ శత్రూన్ అరతి పీడయతీతి వాభట్టారకః. అరపీడనే. శత్రుభటులను బీడించువాఁడు. ౧. దీవ్యతీతి దేవః. దివు క్రీడాదౌ. ప్రకాశించువాఁడు. ఈ ౨ రాజు పేళ్లు.

**తత్సుతా భర్తృదారికా,**

పూర్వవద్వ్యుత్పత్తిః భర్తృదారక శబ్దమువలె నీశబ్దమునకు వ్యుత్పత్తి. ఈ ౧ ఆరాజుకూఁతు పేరు.

**దేవీ కృతాభిషేకాయామ్ -**

దీవ్యతీతి దేవీ. దివు క్రీడాయాం. క్రీడించునది. ఈ ౧ పట్టాభిషిక్తురాలైన రాజభార్య (రాణీ) పేరు.

**ఇతరాసు తు భట్టినీ,** 13

భటతి ఉద్ధతం భాషత ఇతి భట్టినీ. ఇట పరిభాషణే. బిగ్గరగాఁ బలుకునది. (పట్టపురాణికాక) తక్కిన రాజభార్యల పేరు.

**అబ్రహ్మణ్య మవధ్యోక్తౌ -**

బ్రహ్మణే హితం బ్రహ్మణ్యం శాంతతా. తన్నభవతీ త్యబ్రహ్మణ్యం. బ్రాహ్మణునికి హితముగానిది. ౧. చంపఁదగనివాఁడనుమాట వేరు.

**రాజస్యాలస్తు రాష్ట్రియః.**

రాష్ట్రీ రాజ్ఞీ తస్యాః భ్రాతా రాష్ట్రియః. రాష్ట్రియనఁగా రాజ భార్య దానికి భ్రాత ఈ ౧ రాజు పెండ్లాము తోడఁబుట్టినవాని పేరు.

**అమ్బా మాతా -**

అంబ్యతే శబ్ద్యతే బాలై రిత్యంబా. అబి శబ్దే. బాలురచేఁ బిలు

వంబడునది. ఈ ౧ తల్లిపేరు.

**అథ బాలా స్యా ద్వాసూః -**

వసతి మాతృసమీపే వాసూః. ఊ-సీ. వస నివాసే. తల్లిసమీపమున నుండునది. ఈ ౧ పిన్నపడుచు పేరు.

**ఆర్యస్తు మారిషః.** 14

ఆరాత్ పాపకర్మభ్యో యాతీత్యార్యః. పాపకర్మములకు దూరముగాఁ బోవువాఁడు. అరణీయః అభిగమ్యోవా ఆర్యః. పూజ్యుఁడైనందున నందఱిచేతను సేవింపఁ దగినవాఁడు. ౧. మారయతి పాపానీతిమారిషః. మృజ్ ప్రాణత్యాగే. పాపములను జెఱుచువాఁడు. మర్షణాత్సహనాద్వామారిషః. అన్నిటి నోర్చువాఁడు. ఈ ౨ పూజ్యునిపేరు (పెద్దతాళగాని పేళ్ళని కొందఱు).

అత్తా మాతా సైవ అత్తికా. తల్లియే అత్తిక యనఁబడును. పా. అన్తికా. 'అత్తికా చాన్తికా తథా' ఇతి ద్విరూపకోశాత్. ఈ ౧ అక్కపేరు.

**నిష్ఠా నిర్వహణే సమే,**

నాటకే పూర్వోత్తరకథా సంగతి స్సంధిరిత్యుచ్యతే. స.చ. "ముఖం ప్రతిముఖం గర్భో విమర్శశ్చతథైవచ, నిష్ఠా నిర్వహణం చేతి నాటకే పంచ సంధయ" ఇతి పంచవిధః. తేషు పంచమోనిష్ఠా నిర్వహణమితి చోచ్యతే. నాటకమందు పూర్వోత్తర కథలయొక్క సంగతి సంధియనంబడును. ఆ సంధులు ౫. అందు నైదవసంధి నిష్ఠయనియు, నిర్వహణ మనియుఁ జెప్పఁబడును. నియతం స్థానం నిష్ఠా. ష్ఠా గతి నివృత్తౌ కథకు నియతమైన పర్యాప్తిస్థానము. ౧. ప్రస్తుతకథాయా నిర్వాహః పరిసమాప్తిః నిర్వహణం. ప్రస్తుత కథ యొక్క సమాప్తి నిర్వహణము. ఈ ౨ నిర్వహణము పేళ్లు.

**హణ్డే హఞ్జే హ లాహ్వానం నీచాం చేటీం సఖీం ప్రతి.** 15

ఈ 3 ను సంబోధనార్థకములైన యవ్యయములు. వరుసగా నీచురాలిని, దాసిని, చెలికత్తెనుగూర్చి బిలుచుటపేళ్లు.

**అఙ్గహారో ఽఙ్గవిక్షేపో -**

అంగస్య స్థానాంతరాత్ స్థానాంతరాహరణ మంగహారః. హృఞ్

హరణే. శరీరము నిటు నటుఁ ద్రిప్పుట. ౧. అంగస్య విక్షేపః అంగవిక్షేపః క్షిప ప్రేరణే. అంగమును గదలించుట. ఈ ౨ ఆడునప్పుడు శరీరమును కదలించుట పేళ్లు.

**వ్యఙ్జకాభినయౌ సమౌ.**

అర్థం వ్యన క్తీతి వ్యంజకః. అంజూ వ్యక్తిశ్లక్ష్ణ కాంతిగతిషు. అర్థమును వ్యక్తముగాఁ జేయునది. ౧. అభిముఖేన అర్థో నీయతే అనే నేత్యభినయః. ణీఞ్ ప్రాపణే. దీనిచేత నభిముఖముగా నర్థము పొందింపఁబడును. ఈ ౨ హస్త విన్యాసాదులచేత భావార్థమును దెలుపుట పేళ్లు.

**నిర్వృత్తే త్వఙ్గసత్త్వాభ్యాం ద్వే త్రి ష్వాఙ్గిక సాత్త్వికే.** 16

అఙ్గేన నిర్వృత్తమాఙ్గికం. అ. త్రి. అంగముచేతఁ జేయఁబడినది. ౧. సత్త్వేన నిర్వృత్తం సాత్త్వికం. సత్త్వముచేతఁ బుట్టింపఁబడినది. ౨. భూతల విక్షేపాదయః క్రియా అంగికాః. భూతలవిక్షేపాదిక్రియలు ఆంగికములు. "స్తంభప్రళయరోమాంచా స్స్వేదో వైవర్ణ్యవేపథూ, అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితా" ఇతి. స్తంభ ప్రళయములు మొదలైన యెనిమిది సాత్త్వికములు. వరుసగాఁ గనుబొమ్మలు మొదలైన యంగములచేతను, మనోవృత్తియైన సత్త్వ గుణముచేతను బుట్టింపఁబడిన క్రియలకును, స్వేదరోమాంచాదులకును బేళ్లు.

**శృఙ్గార వీర కరుణాద్భుత హాస్య భయానకాః,**
**బీభత్స రౌద్రా చ రసాః-**

శృఙ్గారాదయో ఽష్టౌ రసాః. చశబ్దాచ్ఛాన్తో ఽపి నవమః. వాత్సల్యం దశమ. తత్ర శాన్త స్యాలౌకికత్వేన, వత్సలస్య పుత్రాది స్నేహ రూపత్వా ద్రసాత్మకత్వేన, న నిర్దిష్టౌ. శృంగారము మొదలుగా రసములు. ౮. చశబ్దమువలన శాంతము తొమ్మిదవది. వత్సలరసము పదియవది. వానిలో శాంతము అలౌకికము. వత్సలము పుత్రాదిస్నేహరూపము. కనుక వీనితోఁ జేర్పఁబడలేదు. సామాజికైః రస్యన్తే ఆస్వాద్యన్త ఇతి రసాః. రస ఆస్వాదనే. సభాసదులచేత నాస్వాదింపఁబడునవి. ఈ ౮ వరుసగా ౮ రసముల పేళ్లు.

**శఙ్గార శ్శుచి రుజ్జ్వలః.** 17

శృఙ్గం ప్రాధాన్యమియర్తీతి శృఙ్గారః. ప్రాధాన్యము నొందు

నది. ౧. పరిశుద్ధత్వాచ్ఛుచిః. ఇ. పు. జుగుప్సా విరహితమై పరిశుద్ధమైనది. ౨. ఉజ్జ్వలతి ప్రకాశత ఇత్యుజ్జ్వలః. జ్వల దీప్తౌ. ప్రకాశించునది. ఈ ౩ శృంగారరసము పేళ్లు.

**ఉత్సాహవర్ధనో వీరః -**

ఉత్సాహేన వర్ధత ఇత్యుత్సాహ వర్ధనః వృద్ధు వృద్ధౌ. ఉత్సాహముచేత వృద్ధిఁ బొందునది. ౧. వీరయంత్యనేన వీరః. శూర వీరవిక్రాన్తౌ. దీనిచేత విక్రమింతురు. ఈ ౨ వీరరసము పేళ్లు.

**కారుణ్యం కరుణా ఘృణా,**

**కృపా ద యానుకమ్పా స్యా దనుక్రోశో ఽ పి -**

కుర్వంత్యాత్మాన మధీన మనేనేతి కరుణా. డు కృఞ్ కరణే. దీనిచేత జనులు తన్ను అధీనము చేసికొందురు. కరుణైవ కారుణ్యం. కరుణయే కారుణ్యము. ౨. ఘృణన్తి సించంత్యనయేతి ఘృణా. ఘృక్షరణే. దీనిచేత మనస్సును ద్రవ యుక్తముగాఁ జేయుదురు. ౩. కృపయన్తే అనయా కృపా. కృప కృపాయాం. దీనిచేత దయచేయుదురు. ౪. దయన్తే రక్షన్త్యనయేతి దయా దేఙ్ రక్షణే, దీనిచేత రక్షింతురు. ౫. అనుకమ్పన్తే అనయేత్యనుకమ్పా. కపి కిఞ్చిచ్చలనే. దీనిచేఁ గొంచెముగాఁ గదలుదురు. ౬. అనుక్రోశన్త్యనే నేత్యనుక్రోశః. క్రుశ ఆహ్వానే రోదనే చ. దీనిచేత దుఃఖింతురు. ఈ ౭ దయారసము పేళ్లు.

**అథో హసః.** 18

**హాసో హాస్యం చ -**

హాసయతి జనానితి హసః. హసః. హాస్యం చ. హసే హసనే. జనులను నవ్వించునది. ఈ ౩ హాస్యరసము పేళ్లు.

**బీభత్సం వికృతం త్రి ష్విదం ద్వయమ్,**

బంధ బంధన ఇత్యస్య నిందాయాం సన్. బీభత్సా నిందా. సా ఽ స్త్రాస్తీతి బీభత్సం. బీభత్స యనఁగా నింద; అది గలిగినది. ౧. వికృన్తతి మన ఇతి వికృతం, కృతీచ్ఛేదనే. మనస్సును దుఃఖపెట్టునది. బీభత్స వికృతశబ్దౌ తద్ధేతు శోణిత మాంసాదివాచిత్వే త్రిషు లింగేషువర్తేతే. ఈ ౨ బీభత్సరసము పేళ్లు.

**విస్మయో ఽ ద్భుత మాశ్చర్యం చిత్రమపి -**

విస్మాపయతీతి విస్మయః. ష్మిఙ్ ఈషద్ధననే. విశేషముగా నవ్వించునది. ౧. అదిత్యాశ్చర్యార్థే అవ్యయం. తస్య భవనం ఉత్పత్తిస్థాన మద్భుతం భూ సత్తాయాం. అత్ అని యాశ్చర్యార్థకమైన యవ్యయము. ఆయాశ్చర్యమునకు ఉత్పత్తిస్థానము. ౨. ఆ సమంతా చ్చరితు మాస్వాదితుం యోగ్యం ఆశ్చర్యం. చర గతిభక్షణయోః. ఆస్వాదించుటకు యోగ్యమైనది. ౩. చిత్రయతీతి చిత్రం చిత్రచిత్రకరణే. ఆశ్చర్యమును జేయునది. ఈ ౪ అద్భుతరసముపేళ్లు.

**అథ భైరవమ్.** 19

**దారుణం భీషణం భీష్మం హోరం భీమం భయానకమ్,**

**భయంకరం ప్రతిభయమ్ -**

భీరోస్సంత్రాసకృద్భైరవం. ఞి భీ భయే. భీరులకు వెఱపుఁబుట్టించునది. బిభేత్యస్మాదధీర ఇతివా భైరవం. అధీరుఁడు దీనిచేత వెఱపుఁజెందును. ౧. దారయతి చిత్తమితి దారుణం. దౄ విదారణే. చిత్తమును భేదించునది. ౨. బిభేత్యస్మాదితి భీషణం. భీష్మం. భీమం. భయానకం చ. అధీరుఁడు దీనిచేత వెఱపుఁజెందును గనుక భీషణము, భీష్మము, భీమము, భయానకము. ౩, ౪, ౫, ౬. ఘురతీతిఘోరం ఘుర భీమార్థశబ్దయోః. వెఱపించునది. ౭. భయంకరోతీతి భయంకరం. డుకృఞ్కరణే. భయమును గలుగఁజేయునది. ౮. భయం ప్రతిగతం ప్రతిభయం. భయముతోఁ గూడినది. ఈ ౮ భయానక రసముపేళ్లు.

**రౌద్రం తూగ్రమ్ -**

రుద్రో దేవతాస్య రౌద్రం. రుద్రుఁడే అధిదేవతగాఁ గలిగినది. ౧. ఉగ్రత్వా దుగ్రం. ఉగ్రమైనది. ఈ ౨ రౌద్రరసము పేళ్లు.

**అమీత్రిషు.** 20

**చతుర్దశ -**

అద్భుతాద్యుగ్రాంతా శ్చతుర్దశ శబ్దాః రసహేతుమద్వస్తువాచిత్వే త్రిలింగాః. అద్భుతాది శబ్దములు. ౧౪. రసహేతు వస్తువాచకంబులగునప్పుడు త్రిలింగములు.

**దర త్రాసౌ భీతి ర్భీ స్సాధ్వసం భయమ్,**

రసానుక్త్వా భావానాహ–దరేతి దీర్యతే ఽస్మాదితి దరః. దౄభయే. ౧. త్రసనం త్రాసః. త్రసీ ఉద్వేగే. ౨. భీతిః. ఇ. సీ. భీః. భయం చ. ఞి భీభయే. భీతి సాహచర్యాత్ భీశబ్దః స్త్రీలింగః. సాధ్వానస్య తీతి సాధ్వసం. అసు క్షేపణే. సాధువులను బాధించునది. ఈ ౬ వెఱపు పేళ్లు.

**వికారో మానసో భావః -**

క్రోధ హర్షాదికృత మనోవికారో భావ ఇత్యుచ్యతే. క్రోధహర్షాది కృతమైన మనోవికారము భావ మనంబడును. భావయతి కరోతి రసాఽభావః. భూ సత్తాయాం. రసములను బుట్టించునది. స్వకారణా ద్భవతీతిభావః తన కారణమువలన నగునట్టిది. భావయతి బోధయతి కవేరభిప్రాయమితి భావః. కవి యభిప్రాయము నెఱింగించునది. స చత్రివిధః. స్థాయీ వ్యభిచారీ సాత్త్వికశ్చేతి. తత్ర స్థాయీ రతిహాసాది రూపభేదేన అష్టవిధః. వ్యభిచారీ తు నిర్వేదగ్లాని శం కాదిరూపేణ త్రయస్త్రిం శద్విధః. సాత్త్వికః స్తంభప్రళయాదిరూపేణాష్టవిధః. ఆభావము స్థాయి, వ్యభిచారి, సాత్త్వికము అని మూఁడు విధములు. అందుస్థాయి భావము రతిహాసాది భేదముచేత ౮ విధములు గలది. వ్యభిచారిభావము నిర్వేదాది భేదముచేత 33 విధములు గలది. సాత్త్వికము స్తంభ ప్రళయాదిభేదముచేత ౮ ప్రకారములు గలది. ఈ ౧ మనోవికారము పేరు.

**అనుభావో భావబోధకః.** 21

అను పశ్చాదర్థం భావయతి ప్రకాశయతీత్యనుభావః. అర్థము నెఱింగించునది. ౧. భావస్య బోధకః భావబోధకః. బుధ అవగమనే. భావము నెఱింగించునది. రత్యాదిభావము నెఱింగించు ముఖవికాస రోమాంచాదుల పేరు.

**గర్వో ఽభిమానో ఽహంకారో -**

గర్వత్యనేనేతి గర్వః. ఖర్వ గర్వ దర్పే. దీనిచేత గర్వింతురు. ౧. ఆత్మాన ముత్కృష్టం మానయతీత్యభిమానః. మను అవబోధనే తన్ను ఉత్కృష్టునిఁగాఁ దలఁపించునది. ౨. అహమితి బుద్ధిం కరోతీత్యహంకారః. డుకృఞ్ కరణే. నేను ఉత్కృష్టుఁడ నను బుద్ధినిఁ జేయునది. ఈ 3 అహంకారము పేళ్లు.

**మానశ్చిత్త సమున్నతిః,**

ఆత్మానం మానయతీతి మానః. మాన పూజాయాం. తన్నుఁ బూజించుకొనఁ జేయునది. ౧. చిత్తస్య సమున్నతిః చిత్తసమున్నతిః. చిత్తముయొక్క ఔన్నత్యము. "శ్లో. గర్వో నామ కులైశ్వర్యరూప విద్యాబలాదిభిః, ఇష్టార్థ విషయ ప్రాప్తేర్నీ చగోచర" ఇత్యాచార్యః. పరత ఉత్కర్షేణ చేతస ఉన్నతిర్మానః. యథా ___ శూరో ఽ స్మి, అర్థవానస్మీతి. ప్రణతి యోగ్యేషు ఉన్నతికథనం వా మానః. ఇతి గర్వమానయోర్భేదః. నే నుత్కృష్టుఁడ నను చిత్తౌన్నత్యము పేరు.

**అనాదరః పరిభవః పరీభావ స్తిరస్క్రియా.** 22

**రీఢా ఽ వమాన నా ఽ వజ్ఞా ఽ వహేళన మసూ ర్క్షణమ్,**

ఆదరస్సత్కారః స న భవతీత్యనాదరః. ఆదర మనఁగా సత్కారము; అది గానిది అనాదరము. ౧. పరిభూయతే పరిభవః, పరీభావశ్చ భూసత్తాయాం. పరిభవించుట పరిభవము, పరీభావమును. ౨, ౩. తిరస్కరణం తిరస్క్రియా. డు కృఞ్ కరణే. తిరస్కరించుట. ౪. రిహతి హినస్తీతి రీఢా. రిహ కత్థనయుద్ధనిందా హింసాదానేషు. పీడించునది. ౫. మాననం పూజా తద్విరోధినీ అవమాననా. మాననమనఁగా పూజ; దానికి విరుద్ధమైనది. ౬. అవజ్ఞాయతే అనయేత్యవజ్ఞా. జ్ఞా అవబోధనే. దీనిచేత నీచముగాఁ దలఁపఁబడును. ౭. అవహేడ యతీత్యవహేళనం. హేడృ అనాదరే. ళడయోరభేదః. అనాదరించుట అవహేళనము. ౮. అసూ ర్క్షణ మనాదరః. సూ ర్క్ష్య ఆదరే. అనాదరము అసూ ర్క్ష్యణము. అసుక్షణం, అసూక్షణం, ఇతి చ పాఠః. ఈ ౯ తిరస్కారము పేళ్లు.

**మన్దాక్షం హ్రీ స్త్రపా వ్రీడా లజ్జా -**

మన్ద మక్షం వాగ్యత్ర మన్దాక్షం. తిన్ననిమాటలుగలది. ౧. జిహ్రేతీతి హ్రీ. ఈ. సీ. హ్రీ లజ్జాయాం. సిగ్గుపడుట హ్రీ. ౨. త్రపతే త్రపా. త్రపూష్ లజ్జాయాం. లజ్జించుట త్రప. ౩. వ్రీడయతీతి వ్రీడా. వ్రీడచోదనే లజ్జాయాం. చ. ప్రేరేపించునది. వ్రీడశబ్దః పుల్లింగో ఽ ప్యస్తి. తథాచ___ "వ్రీడాదివాభ్యాశగతైర్విలల్యే" ఇతి మాఘకావ్యే, తృతీయసర్గే. ౪. లజ్జనం లజ్జా. ఓ లజీ ఓ లజ్జీవ్రీడే. లజ్జించుట లజ్జ. ౫. సిగ్గు పేళ్లు.

**సా ఽ పత్రపా ఽ న్యతః.** 23

నికృష్టా త్రపా అపత్రపా. చెడ్డసిగ్గు అపత్రప. ౧. పరులుచెంత నున్నందునఁ గలిగిన సిగ్గు పేరు.

**క్షాన్తి స్తితిక్షా -**

క్షమా క్షాంతిః. ఇ. సీ. క్షమూష్ సహనే. క్షమించుట క్షాంతి ౧. తితిక్షతే తితిక్షా. తిజ నిశాతనే. ఓర్చుట తితిక్ష. ఈ ౨ ఓర్పుపేళ్లు.

**అభిధ్యా తు పరస్వవిషయే స్పృహా,**

అపహరణే గ్రహణే ధ్యాన మభిధ్యా. ధ్యైచింతాయాం –అపహరించవలెనను చింత. అభిధ్య. ఈ ౧ పరధన విషయమైన యభిలాషకు పేరు.

**అక్షాన్తిరీర్ష్యా -**

న క్షాంతిః అక్షాంతిః. ఇ–సీ. క్షాంతి ఓర్పు; అదిగానిది అక్షాంతి. ౧. ఈర్ష్యతీతి ఈర్ష్యా. ఈర్ష్య ఈర్ష్యాయాం. ఓర్వలేకుండుట ఈర్ష్య. ఈ ౨ పరుల సంపదను సహించలేకుండుట పేళ్లు.

**అసూయా తు దోషారోపో గుణేష్వపి.** 24

గుణేషు సత్స్వపి పరేషు దోషారోపః అసూయా. మంచిగుణములు గలిగియున్నను చెడుగుణముల నారోపించుట అసూయ యనంబడును. అస్యతీత్య సూయా. అసు క్షేపణే. మంచియున్నను పరునియందు దుర్గుణముల నారోపించుట పేరు.

**వైరం విరోధో విద్వేషో -**

వీరస్య కర్మ వైరం. వీరునియొక్క వ్యాపారము. ౧. విశేషేణ రోధః. విరోధః. రుధిర్ ఆవరణే. ఓర్పును విశేషముగా నడ్డగించునది. ౨. విశేషో ద్వేషః విద్వేషః ద్విష అప్రీతౌ. అధికమైన ద్వేషము విద్వేషము. ఈ ౩ వైరము పేళ్లు.

**మన్యు శోకౌ తు శుక్ స్త్రియామ్,**

మన్యతే అనేనేతి మన్యుః. ఉ. పు. మనజ్ఞానే. దీనిచేత నెఱుఁగఁబడును. విరుద్ధలక్షణచేత నేమియు నెఱుఁగఁబడని యర్థము. ౧. శోచనం శోకః. శుక్ చ. చ–సీ. చ. చ–సీ శుచ శోకే. శోచించుట శోకము శుక్ ఈ ౩ శోకము పేళ్లు.

**పశ్చాత్తాపో ఒ నుతాపశ్చ విప్రతీసార ఇత్యపి.** 25

పశ్చాత్తాపయతీతి పశ్చాత్తాపః అనుతాపశ్చ తప సంతాపే. అజ్ఞానముచేత ముందొకపనిఁ జేసి వెనుక నొచ్చుకొనుట పశ్చాత్తాపము, అనుతాపమును. ౧, ౨. విరుద్ధం ప్రతిసరణం విప్రతీసారః. సృగతౌ – విరుద్ధమునుగూర్చి ప్రవర్తించుట. ఈ ౩ పశ్చాత్తాపముపేళ్లు.

**కోప క్రోధామర్షరోష ప్రతిఘా రు ట్క్రుధౌ స్త్రియౌ,**

కోపనం కోపః కుప క్రోధే. కోపించుట. ౧ క్రోధేనం క్రోధః. క్రుధ క్రోధే–క్రోధించుట క్రోధము. ౨. న మర్షణమమర్షః. మృషు సహనే. ఓర్వకుండుట అమర్షము. ౩. లుష్యతే అనేనేతి రోషః రుష హింసాయాం–దీనిచేత హింసింపఁబడును. ౪. ప్రతిహంతీతి ప్రతిఘః హనహింసాగత్యోః. సత్కర్మను జెఱుచునది. ౫. రుష్యత ఇతి రుట్. ష–సీ. రుష రోష రోషించుట. ౬. క్రోధః. క్రుధ్. ధ. సీ. క్రుధరోషే, క్రోధించుట. ఈ ౭ కోపము పేళ్లు.

**శుచౌ తు చరితే శీలమ్ -**

శీలతీతి శీలం. శీల సమాధౌ. లెస్సగా నడచుట శీలము. ౧.

**ఉన్మాద శ్చిత్తవిభ్రమః.** 26

ఉన్మాద్యతే అనేనేత్యున్మాదః. మదీ హర్షగ్లేపనయోః. దీనిచేత మదించును. ౧. చిత్తస్య విభ్రమః చిత్తవిభ్రమః. చిత్తముయొక్క భ్రాంతి. ఈ ౨ భూతావేశాదులచేతఁ గలిగిన చిత్తచాంచల్యము పేళ్లు.

**ప్రేమా నా ప్రియతా హార్దం ప్రేమ స్నేహః -**

ప్రియస్య భావః ప్రేమా. న. పు. ప్రియతా చ.ప్రియము యొక్క భావము ప్రేమ ప్రియత. ౨ హృదయే భవం హార్దం. హృదయ మందుఁ బుట్టినది. ౩. ప్రీణనం ప్రేమ. న. న. ప్రీఙ్ తర్పణే. సంతోషింపఁజేయుట. ౪. స్నిహ్యత ఇతి స్నేహః. ష్ణిహప్రీతౌ. ప్రీతి. ఈ ౪ స్నేహము పేళ్లు.

**అథ దోహదమ్,**

**ఇచ్ఛా కాఙ్క్షా స్పృహేహాతృడ్వాఞ్ఛా లిప్సా మనోరథః.** 27
**కామో ౽ భిలాషస్తర్షశ్చ -**

దోహః పూర్తిః. దుహ ప్రపూరణే – తం దదాతీతి దోహదం డు దాఞ్ దానే. దోహ మనఁగాఁ బూర్తి ; దాని నిచ్చునది. ౧. ఏష

ణమిచ్ఛా. ఇషు ఇచ్ఛాయాం. ఇచ్ఛయించుట ఇచ్ఛ ౨. కాంక్షణం కాంక్షా. కాంక్షికాంక్షాయాం. కాంక్షించుట కాంక్ష. ౩. స్పృహణం స్పృహా. స్పృహ ఇచ్ఛాయాం. ఇచ్ఛయించుట స్పృహ. ౪. ఈహన మిహా. ఊహ చేష్టాయాం. మనోవ్యాపారము ఈహ. ౫. తర్షణం తృట్. ష. సీ. తృషపిపాసాయాం. ఇచ్ఛయించుట. తృషధాతోః పిపాసార్థత్వేపి అత్ర ఇచ్ఛాసామాన్యే వర్తతే. తృషధాతువు దప్పిగోరుట యను నర్థముగలదైనను ఇచ్చట నిచ్ఛాసామాన్యమందు వర్తించుచున్నది. ౬. వాంఛనం వాంఛా. వాఛి ఇచ్ఛాయాం. కోరుట వాంఛ. ౭. లబ్ధుమిచ్ఛా లిప్సా. డు లభష్ ప్రాప్తౌ. ఒకయర్థమును పొంద నిచ్ఛయించుట. ౮. భ్రామకత్వేన మనసో రథఇవ స్థితత్వాన్మనోరథః. భ్రమింపఁజేయుటవలన మనస్సునకు రథమువంటిది. మన ఏవ రథో యస్యస మనోరథః–మనస్సే రథముగాఁ గలిగినది. ౯. కమనం కామః. కముకాంతౌ. కోరుట కామము. ౧౦. అభిలషణ మభిలాషః. లష కాంతౌ. కోరుట అభిలాషము. ౧౧. తర్షణం తర్షః తృష పిపాసాయాం. ఇచ్ఛయించుట తర్షము. ఈ ౧౨ కోరికపేళ్లు.

**స మహా౯ లాలసా ద్వయోః,**

స ఏవ అధికశ్చేత్ లాలసా. అధికమైన యాకోరికయే లాలస మనంబడును. లస్యతే లాలసా. ష్స. లస శ్లేషణ క్రీడనయోః మనస్సు యొక్క కూడుటయైనను క్రీడయయినను లాలసము.

**ఉపాధి ర్నా ధర్మచిన్తా -**

ఉప సమీప ఆధీయతే ధర్మో ౬ స్య ఉపాధిః. ఇ. పు. డు. ధాఞ్ ధారణ పోషణయోః. దీని సమీపమునందు ధర్మము చేయఁబడును. ౧. ధర్మస్యచింతా ధర్మచింతా. ధర్మమును చింతించుట ధర్మచింత. ౨ ధర్మచింత పేళ్లు.

**పుం స్యాధి ర్మానసీ వ్యథా.** 28

ఆధీయతే దైన్యమనే నేత్యాదిః. ఇ. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః – దీనిచేత దైన్యము సంపాదింపఁబడును. ఈ ౧ మనస్సంబంధమైన వ్యథపేరు.

**నస్యా చ్చిన్తాస్మృతి రాధ్యానమ్-**

చిన్త్యతే చిన్తా. చితి స్మృత్యాం. చింతించుట చింత. ౧. స్మరణం స్మృతిః. స్మృఆధ్యానే. స్మరించుట స్మృతి. ౨. ఆధ్యాయతే ఆధ్యానం. ధ్యైచింతాయాం. చింతించుట ఆధ్యానము. ఈ 3 చింతించుట పేళ్లు.

**ఉత్కణ్ఠోత్కలికే సమే,**

ఉత్కంఠ్యతే ఉత్కంఠా, కఠీ శోకే–ఉద్గతమైన శోకము ఉత్కంఠ ౧. ఉత్కల్యతే ఉత్కలికా. కల సంఖ్యానే ఉద్గతమైన సంఖ్య గలిగినది. ౨. ఇష్టవస్తుప్రాప్తియందలి కాలవిళంబము నోర్వఁజాలక తహతహపడుటపేరు.

**ఉత్సాహో వ్యవసాయ స్స్యాత్ -**

ఉద్గతం సహనం ఉత్సాహః షహ మర్షణే ప్రయాసము నోర్చుట. ౧. వ్యవసీయత ఇతి వ్యవసాయః. షో౽న్తకర్మణి–విశేషముగా నిశ్చయించుట వ్యవసాయము. పా. అధ్యవసాయః. ౨. మహాకార్యవిషయమైన యుద్యోగముపేళ్లు.

**స వీర్య మతిశక్తిభాక్.** 29

వీరే సాధు వీర్యం – వీరునియం దుండునది. ౧. మిక్కిలి దృఢమైన యా యుత్సాహము పేరు.

**కపటో౽స్త్రీ వ్యాజ దమ్భోపధయ శ్ఛద్మకైతవే,**

**కుసృతి ర్నికృతి శ్శాఠ్యమ్ -**

కం బ్రహ్మాణమపి పటతీతి కపటః. అ. ప్న. పట గతౌ – బ్రహ్మను గూడ పొందునది. కే శిరసి పటవదాచ్ఛాదకః కపటః. శిరస్సునఁ బటమువలెఁ గప్పియుండునది. ౧. వ్యజ్యతే అనేనేతి వ్యాజః. అజ గతి క్షేపణయోః. దీనిచేత ప్రేరేపింపఁబడును. ౨. దభ్నోతి హినస్తీతి దంభః దమ్భు దమ్భనే. పీడించునది. 3. ఉప సమీపే ధీయత ఇత్యుపధిః. ఇ. పు. డు ధాఞ్ ధారణపోషణయోః. సమీపవస్తువు నందుంచఁబడునది. ౪. ఛాద్యతే స్వరూపమనేనేతి ఛద్మ. న. న. ఛద అపవారణే. దీనిచేత స్వరూపము గప్పఁబడును. ౫. కితవస్యకర్మ కైతవం. కితవుఁడనఁగా ధూర్తుఁడు; వాని వ్యాపారము కైతవము. ౬. కుత్సితా సృతిర్గతిః కుసృతిః. ఇ. సీ. సృ గతౌ. కుత్సితమైన నడత. ౭. నికృష్టం కృణాతి హీనస్తీతి నికృతిః. ఇ. సీ. కౄఞ్ హింసాయాం – నీచముగా హిం

సించునది. ౮. శరస్యభావః శార్యం. శరునియొక్క భావము. ౮. కపటము పేళ్లు.

**ప్రమాదో ౽ నవధానతా.** 30

శక్తుండైయుండియు చేయఁదగిన కార్యము చేయకుండుట ప్రమాదము. ప్రకృష్టో మదః ప్రమాదః. మదీ హర్షగ్లేపనయోః. ప్రకృష్టమైన మదము ప్రమాదము. ౧. అనవధానస్య భావః అనవధానతా. అవధానము లేనివానియొక్క భావము అనవధానత. ఈ ౨ ప్రమాదముపేళ్లు.

**కౌతూహలం కౌతుకం చ కుతుకం చ కుతూహలమ్,**

కుత్సితం పాపం తూలయతీతి కౌతూహలం. కుతూహలం చ. తూల నిష్కోషణే – కుత్సితమైన పాపమును బయలుపఱచునది. ౧, ౪. కుత్సితం తోజయతి హినస్తీతి కుతుకం. కుతుకమేవ కౌతుకం. తుజహింసాయాం – కుత్సితమును జెఱుచునది కుతుకము. కుతుకమే కౌతుకము. ఈ ౩ అపూర్వవస్తువును గోరుటపేళ్లు.

**స్త్రీణాం విలాస బిబ్బోక విభ్రమా లలితం తథా.** 31
**హేలాలీలే త్యమీ హావాః క్రియాః శృఙ్గార భావజాః,**

స్త్రీణాం శృంగారభావరతి జనితాః విలాసాదిక్రియాః భావా ఇత్యుచ్యన్తే. స్త్రీలయొక్క శృంగారభావమైన రతివలనఁ బుట్టిన విలాసాది క్రియలు భావము లనంబడును. భూయంతే రాగిణో ౽ త్ర భావాః. భూ సత్తాయాం. దీనియందు కాముకు లగుదురు. పా హూయంతే రాగిణో౽త్ర హావా ఇతి వా.పాఠః. హు దానాదనయోః – దీనిచేత కాముకులు స్వవశముగాఁ జేయఁబడుదురు. ౧. విశేషేణ లసనం విలాసః. లసశ్లేషణ క్రీడనయోః ప్రియునియొక్క దర్శనము చేతనైన కటాక్ష భ్రూవికారాదులు విలాసము. ౧. వివోః గతివిశేషస్య ఓకః స్థానం బిబ్బోకః. వబయోరభేదః. విపూర్వకోవా గతిగంధన యోరితి ధాతుః. విపు అనఁగా గతి విశేషము; అదిగలది. సాపరాధుఁడైన ప్రియునికథ వినునపుడు ఇంచుకంత యనాదరము బిబ్బోకము. ౧. విశేషేణ భ్రమః. విభ్రమః. భ్రము. అనవస్థానే. విశేషమైన చలనము విభ్రమము. త్వరచేత భూషణ విపర్యయము విభ్రమము. ౧. లలతీతి లలితం. లల విలాసే సుకుమారాంగ విన్యాసరూపమై యొప్పునది. ౧. హేలనం హేలా హిల భావ

కరణే. సంభోగమందలి యభిప్రాయము హేల. ౧. లీలనం లీలా. లీజ్ శ్లేషణే. సంశ్లేషము లీల. ౧. ఇతిశబ్దస్య ఆద్యర్థకత్వా ద్విచ్ఛిత్తి కిలికించిత కుట్టమితాదయో గృహ్యన్తే – తి శబ్దము ఆద్యర్థకముగావున విచ్ఛిత్తి కిలికించిత కుట్టమితాదులును గ్రహింపఁబడుచున్నవి.

**ద్రవకేళి పరీహాసాః క్రీడాలీలా చ నర్మ చ.** 32

ద్రవతి చిత్తమనేన ద్రవః. ద్రుగతౌ. దీనిచేత మనస్సు కఱఁగును. ౧. కిలం త్యనేనేతి కేళిః – ఇ. పు. కిల క్రీడాయాం. దీనిచేఁ గ్రీడింతురు. ౨. పరితః హసంత్యత్రేతి పరీహాసః హసే హసనే. దీనియందు నవ్వుదురు. ౩. క్రీడనం క్రీడా. క్రీడృ విహారే. విహరించుట. ౪. లయనం లీలా. లీజ్ శ్లేషణే. సంశ్లేషణము లీల. ౫. నృణాతి రత్యతిశయం ప్రాపయతీతి నర్మ. న. న. నౄనయే. రత్యతిశయమును బొందించునది. ఈ ౬ స్త్రీ పురుషులు పరస్పరము చేసికొనునట్టి పరిహాసము పేళ్లు.

**వ్యాజో ౽ పదేశో లక్ష్యం చ –**

పరద్రోహమే ఫలముగాఁ గలది కపటము. తన ప్రయోజనమునకై యొకటి నుద్దేశించి మఱియొకటి సేయుట వ్యాజము. వ్యజ్యతే క్షిప్యతే అనేనేతి వ్యాజః. అజ గతిక్షేపణయోః. దీనిచేత అరిష్టము పోఁగొట్టఁబడును. ౧. అపదిశంతే అత ద్రూపణేత్యపదేశః. దిశ అతిసర్జనే. ఉద్దేశించిన పదార్థము దీనిచేత విడువఁబడును. ౨. లక్ష్యతే అనేనేతి లక్ష్యం. పా. లక్షం. లక్షదర్శనాంకనయోః. దీనిచేత ప్రయోజనము కానఁబడును. ఈ ౩ వ్యాజము పేళ్లు.

**క్రీడా ఖేలా చ కుర్దనమ్,**

క్రీడనం క్రీడా. క్రీడృ విహారే. క్రీడించుట క్రీడ. ౧. ఖేలనం ఖేలా. విహరించుట. ౨. కుర్దః కుర్దనం. కుర్ద ఖుర్ద గుర్ద గుద క్రీడాయామేవ. క్రీడించుట కుర్దనము. ఈ ౩ కందుకాది క్రీడ పేళ్లు.

**ఘర్మో నిదాఘ స్స్వేద స్స్యాత్ –**

జిఘ ర్తీతి ఘర్మః. ఘృ క్షరణదీప్త్యోః కాఱునది. ౧. నితరాం దహతీతి నిదాఘః. దహ భస్మీకరణే. మిక్కిలి పీడించునది. ౨. స్విద్యతే అనే నాఙ్గమితి స్వేదః. దీనిచే నొడలు చెమర్చును. ఈ ౩ చెమట పేళ్లు.

**ప్రళయో నష్టచేష్టతా.** 33

ప్రలీయంతే క్రియా అత్రేతి ప్రళయః – దీనియందు క్రియలు లీనమౌను. ఈ ౧ హర్షాదులవలన దేహచేష్టలు మాలియుండుట పేరు.

**అవహిత్థాకారగుప్తిః -**

అనురాగాది జనతమోహాత్ చక్షురాది వికార ఆకారః. తస్య లజ్జా భయాదినా గోపన మవహిత్థేత్యుచ్యతే – అనురాగాదులవలనఁ బుట్టిన గగ్గురుపాటు మొదలైన యవయవ వికారము ఆకారము. దానిని లజ్జా భయాదులచేతఁ గప్పుట అవహిత్థ యనంబడును. అవహీయతే గోప్యతే ఆకారః అనయే త్యవహిత్థా. ఓ హాక్ త్యాగే. దీనిచేత నాకారము గోపనము చేయఁబడును. పా. అవహిద్ధం అని కొందఱు. ఈ ౨ ఆ కారగోపనము పేళ్లు.

**సమౌ సంవేగ సంభ్రమౌ,**

సం విజ్యతే అనేనేతి సంవేగః. ఓ విజీ భయచలనయోః. దీనిచేఁ జలింపఁ బడును గనుక నైనను, వెఱవఁబడును గనుక నైనను సంవేగము. ౧. సం భ్రమ్యతే అనేనేతి సంభ్రమః. భ్రము చలనే. దీనిచేఁ జలనము గలుగును. ఈ ౨ హర్షాదుల వలననైన పనులయందలి త్వరపేళ్లు. పరసైన్య దర్శనాదులవలనఁ బుట్టిన తారతమ్య విచారము పేళ్లని కొందఱు.

**స్యా దాచ్ఛురితకం హాస స్సోత్ప్రాసః -**

ఉత్ప్రాస్యతే ఉత్క్షిప్యతే అనే నేత్యుత్ప్రాసః. తేన సహ వర్తత ఇతి సోత్ప్రాసః, ఆచ్ఛురితక మిత్యుచ్యతే. ఉత్ప్రాసమనఁగా నెత్తిపొడుచుట; దానితోఁ గూడిన నవ్వు ఆచ్ఛురితక మనంబడును. ఆ సమంతాచ్ఛురతీత్యాచ్ఛురితకం. ఛుర ఛ్ఛేదనే. అంతటఁ గోయునది. ఈ ౧ ఇతరులకు రోషము గలిగించు నవ్వుపేరు.

**స మనాక్ స్మితమ్.** 34

సః హాసః మనాక్ ఈషచ్ఛేత్ స్మిత మిత్యుచ్యతే. ఆ నవ్వు అల్పమైనచో స్మిత మనంబడును. స్మీయతే స్మితం. ష్మిజ్ ఈషద్ధసనే. ఇంచుకంత నవ్వుట స్మితము. కపోల వికాసమాత్రము గలది స్మితము. (పాత్రుశరీరం కంపం అతిహసితం – బాష్పశరీరకంపములతోఁ గూడినది అతిహసిత మనంబడును.) చిఱునగవుపేరు.

**మధ్యమః స్యా ద్విహసితమ్ -**

స్మితాతిహసిత యోర్మధ్యమః విహసితం. చిఱునవ్వునకును పెద్ద నవ్వునకును మధ్యమైన నవ్వు విహసిత మనంబడును. విశేషేణ హసనం విహసితం. హసే హసనే. విశేషముగా నవ్వుట విహసితము.

**రోమాఞ్చో రోమహర్షణమ్,**

రోమ్ణామంచనం రోమాంచః. అంచు గతి పూజనయోః. రోమములు గగ్గురుపొడచుట రోమాంచము. ౧. రోమాణి హృష్యంత్యనేన రోమహర్షణం. హృష తుష్టౌ. దీనిచేత రోమములు ప్రకాశించును. ఈ ౨ గగ్గురుపొడచుట పేళ్లు.

**క్రన్దితం రుదితం క్రుష్టమ్ -**

క్రన్దనం క్రన్దితం. క్రది ఆహ్వానే రోదనే చ. రోదించుట. ౧. రోదనం రుదితం. రుదిర్ అశ్రువిమోచనే. దుఃఖముచేత కన్నీరు జాఱవిడుచుట. ౨. క్రోశనం క్రుష్టం. క్రుశ ఆహ్వానే రోదనే చ. ఏడ్చుట క్రుష్టము. ఈ ౩ రోదనము పేళ్లు.

**జృమ్భస్తుత్రిషు జృమ్భణమ్.** 35

జృంభంతే అనేనేతి జృంభః. అ. త్రి. జృంభణం చ. జభ జృభిగాత్ర వినామే. దీనిచేత దేహము సంకోచ వికాసాదులఁ బొందును. ఈ ౨ ఆవులింత పేళ్లు.

**విప్రలమ్భో విసంవాదో -**

విప్రలంభనం విప్రలంభః. డులభష్ ప్రాప్తౌ. విపరీతముగా నర్థమును బొందుట విప్రలంభము. ౧. విసంవదనం విసంవాదః. వద వ్యక్తాయాం వాచి. విపరీతముగాఁ బలుకుట. ఈ ౨ విపరీతముగాఁ బలుకుట పేళ్లు.

**రిఙ్ఖణం స్ఖలనం సమే,**

రింఖో రింఖణం. రింఖగతౌ. పా. రింగణం. జాఱుట రింఖణము, రింగణమును. ౧. స్ఖలితం స్ఖలనం. స్ఖల సంచలనే. చలించుట స్ఖలనము. ఈ ౨ జాఱుటకుఁ గాని స్వధర్మమును వదలుటకుఁగాని పేళ్లు.

**స్యాన్నిద్రా శయనం స్వాప స్స్వప్న స్సంవేశ ఇత్యపి.** 36

నియతం ద్రాన్తి ఇంద్రియాణ్యత్రేతి నిద్రా. ద్రా కుత్సాయాం గతౌ. దీనియందు నింద్రియములు నియతముగా నుపరతములౌను. ౧. శేతే శయనం. శీఙ్ స్వప్నే. నిద్రించుట శయనము. ౨. స్వపితం స్వాపః ;

స్వప్నశ్చ. ఞిష్వప్ శయే. శయనించుట స్వాపము, స్వప్నంబును. ౩, ౪. సంవిశం తీంద్రియాణ్యత్రేతి సంవేశః. విశప్రవేశనే. ఇంద్రియములు దీనియందు ప్రవేశించును. ఈ ౫ నిద్ర పేళ్లు.

**తన్ద్రీ ప్రమీలా -**

అత్యంత మింద్రియాణి ద్రాంత్యత్రేతి తంద్రీ. ఈ. సీ. ద్రాకుత్సాయాం గతౌ. దీనియందు ఇంద్రియములు మిక్కిలి యుపరతములౌను. ౧. ప్రమీలం తీంద్రియాణ్యత్రేతి ప్రమిలా. మీల నిమీలనే. ఇంద్రియములు దీనియందు మిక్కిలి మూయఁబడును. ఈ ౨ కునికిపాటు (అత్యన్త శ్రమాదులచే నన్నియవయవములు స్వాధీనము తప్పియుండుట) పేళ్లు.

**భ్రకుటి ర్భ్రుకుటి ర్భ్రూకుటిః స్త్రియామ్,**

భ్రువోః కుటిః కుటిలతా భ్రకుటిః, భ్రుకుటిః, భ్రూకుటిశ్చ. కుటకౌటిల్యే. కనుబొమ్మల కుటిలత్వము భ్రకుటి, భ్రుకుటి, భ్రూకుటియు. ఈ ౩ బొమముడిపేళ్లు.

**అదృష్టి స్స్యా దసౌమ్యే౽ క్ష్ణి -**

రోషాదసౌమ్యా దృష్టిరదృష్టిః రోషముచేత క్రూరమైన దృష్టి. విరుద్ధా దృష్టిరదృష్టిః – విరుద్ధమైన దృష్టి అదృష్టి. ఈ ౧ రోషముచేత క్రూరమైన చూపుపేరు.

**సంసిద్ధి ప్రకృతీ సమే.** 37

**స్వరూపం చ స్వభావశ్చ నిసర్గశ్చ -**

సమ్యక్ సిద్ధిః సంసిద్ధిః ఇ.సీ. షిధు గత్యాం. పదార్థమును లెస్సగా పొందునది. ౧. ప్రకృష్టం కరోతీతి ప్రకృతిః. ఇ. సీ. డు కృఞ్ కరణే. పదార్థమును ప్రకృష్టముగాఁ జేయునది. ౨. సమే. అనెడు విశేషణముచేత సంసిద్ధి ప్రకృతిశబ్దములు స్త్రీలింగములు. స్వస్య రూపం స్వరూపం–తనయొక్క రూపము స్వరూపము. ౩. స్వస్య భావః. స్వభావః తనయొక్క భావము స్వభావము. ౪. నిసృజ్యతే అనేనేతి నిసర్గః. సృజ విసర్గే. పదార్థము దీనిచేత మిక్కిలి సృజింపఁబడును. ఈ ౫ స్వభావము పేళ్లు.

**అథ వేపథుః,**

**కమ్పః -**

వేపనం వేపథుః. టు వేప్పృ కంపనే. కంపించుట వేపథువు. ౧. కంపనం కంపః. కపి కఞ్చిచ్చలనే. చలించుట కంపము. ఈ ౨ వణఁకుపేళ్లు.

**అథ క్షణ ఉద్ధర్షో మహ ఉద్ధవ ఉత్సవః.** 38

క్షణుతే హినస్తి దుఃఖమితి క్షణః. క్షణు హింసాయాం. దుఃఖమును చెఱుచునది. ౧. ఉద్ధర్షయం త్యనేనేత్యుద్ధర్షః. హృష అలీకే. దీనిచేత సంతోషింతురు. ౨. మహ్యతే జనైరితి మహః. అ. పు. మహపూజాయాం. జనులచేతఁ బూజింపఁబడును. ౩. ఉత్ ధునోతి దుఃఖమిత్యుద్ధవః. ధూఞ్ కంపనే. దుఁఖమును పోఁగొట్టునది. ౪. ఉత్సూతే సుఖమితి ఉత్సవః. షూఙ్ ప్రాణిగర్భ విమోచనే. సుఖమును బుట్టించునది. సువతిప్రేరయతి జనానితివా ఉత్సవః. షూ ప్రేరణే. జనులను ప్రేరేపించునది. ఈ ౫ ఉత్సవము పేళ్లు.

# పాతాళ వర్గము

**అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్,**
**నాగలోకః -**

అధః స్థితం భువన మధోభువనం – క్రిందనుండు లోకము. ౧. పతంత్యస్మి౯ పాపాత్పాతాళం. పత్ ౯గతౌ. పాపమువలన దీనియందుఁ బడుదురు. ౨. బలేరసురస్య సద్మ నివాసః బలిసద్మ. న. న. బలిచక్రవర్తికి నివాసము. ౩. రసాయాః భూమేః తల మధోభాగః రసాతలం–భూమి యొక్క అధోభాగము. ౪. నాగానాం సర్పాణాం లోకః నాగలోకః – సర్పములయొక్క లోకము. ఈ ౫ పాతాళలోకనామములు.

**అథ కుహరం సుషిరం వివరం బిలమ్.** 1
**ఛిద్రం నిర్వ్యథనం రోకం రన్ధ్రం శ్వభ్రం వపా సుషిః,**

కుం భూమిం హరతీతి కుహరం. హృఞ్ హరణే. భూమిని హరించునది. కుత్సితం కృత్వా హరతీతి కుహరం–పదార్థమును కుత్సితముగాఁ జేసి హరించునది. కుహతి విస్మాపయతి తమసా వా కుహరం. కుహ విస్మాపనే. తమస్సుచేత విస్మయమును జేయునది. ౧. సుష్ఠు స్యతి గతిమితి సుషిరం. షో ఉన్తకర్మణి. మిక్కిలి గతిని జెఱుచునది. ౨. విగతః వరః వారణమస్య వివరం. వృఞ్ వరణే. అడ్డములేనిది. ౩. బిల్యతే భిద్యత ఇతి బిలం. బిల భేదనే.

భేదింపఁబడునది. ४. ఛిద్యత ఇతి ఛిద్రం. ఛిదిర్ ద్వైధీకరణే. ఛేదింపఁబడునది. ౫. నిశ్చయేన వ్యథనం భయమత్ర నిర్వ్యథనం. వ్యథ భయచలనయోః. దీనియందు నిశ్చయముగా భయము గలదు. ౬. లోచతే ప్రకాశత ఇతి రోకం. రుచ దీప్తౌ. ప్రకాశించునది. రోచతే అనేన వస్త్వాది కమితి రోకం-దీనిచేత వస్త్వాదులు ప్రకాశించును. ౭. రణతి వాయునేతి రంధ్రం. రణ శబ్దే. వాయువుచేత మ్రోయునది. ౮. శోభనమభ్ర మాకాశ మస్మిన్నితి శ్వభ్రం. బయలు దీనియందు లెస్సగాఁ గలదు. ౯. ఉప్యతే క్షిప్యతే తృణాదికమత్రేతి వపా. టు వపి బీజసంతానే. తృణాదులు దీనియందు పెట్టఁబడును. ౧౦. సుష్ఠు స్యతి ప్రమాదపతితానితి సుషిః. ఇ. సీ. షో ఽ న్తకర్మణి. ప్రమాదమువలనఁ బడినవారిని హింసించునది. ౧౧. వసాసాహ చర్యాత్సుషి శబ్దః స్త్రీలింగః-వసాశబ్ద సాహచర్యముచేత సుషి శబ్దము స్త్రీలింగము. ఈ ౧౧ రంధ్రము పేళ్లు.

**గర్తావటౌ భువి శ్వభ్రే -**

గిరతి సర్పాదికమితి గర్తః. గౄ నిగరణే. సర్పాదులను తనయం దణఁ గించునది. ౧. అవతి సర్పాదిక మిత్యవటః. అవ రక్షణే. సర్పాదులను రక్షించునది. ఈ ౨ భూమియందుండు బొక్క పేళ్లు.

**సరన్ధ్రే సుషిరం త్రిషు** 2

సుషిరశబ్దో రంధ్రవద్వస్తు వాచకత్వే త్రిలింగః – సుషిరశబ్దము రంధ్రముతోఁ గూడిన వస్తువును జెప్పునపుడు మూఁడులింగములయందును వర్తించును.

**అన్ధకారో ఽ స్త్రియాం ధ్వాన్తం తమిస్రం తిమిరం తమః,**

అంధం హతదృష్టిశక్తికం లోకం కరోతీత్యంధకారః. అ. ప్న. డుకృఞ్ కరణే. లోకులను అంధులుఁగాఁ జేయునది. ౧. ధ్వనంత్యత్ర మార్గ మపస్యంత ఇతి ధ్వాన్తం. ధ్వన శబ్దే. మార్గమును గాననివారలై దీనియందు మొఱపెట్టుదురు. ౨. తమయతి లోకం తమః. స. న. తమ ఏవ తమిస్రం. తము గ్లానౌ. లోకమును గ్లానిఁ బొందించునది. ३, ४. తిమ్యత్యనుష్ణత్వాత్తిమిరం. తిమష్టిమ ఆర్ద్రీభావే. ఉష్ణము లేక ఆర్ద్రమైయుండునది. తిమ్యంతే కాముకహృదయాన్యనేనేతివా తిమిరం-దీనిచేత కాముక హృదయము లార్ద్రముగాఁ జేయఁబడును. ఈ ౫ చీఁకటి పేళ్లు.

**ధ్వాన్తే గాఢే ऽ న్ధతమసమ్ -**

అంధం కరోతీత్యంధం. అంధం చ త త్తమశ్చ అంధతమసం. అ. న. లోకము నంధముగాఁ జేయునట్టి తమస్సు. ఈ ౧ గాఢాంధకారముపేరు.

**క్షీణే ऽ వతమసమ్ -**

అవహీనం తమః అవతమసం. అ. న. అల్పమైన తమస్సు. ఈ ౧ క్షీణమైన చీఁకటిపేరు.

**తమః.** 3

**విష్వ క్సంతమసమ్ -**

విష్వక్సర్వతః వ్యాప్తం తమః సంతమసం. అ. న. అంతట వ్యాప్తమయిన తమస్సు సంతమసము. సంతత మవిచ్ఛిన్నంతమః సంతమసం. అవిచ్ఛిన్నమయితన తమస్సు సంతమసము. ఈ ౧ అంతట వ్యాపించిన చీఁకటిపేరు.

# భోగి వర్గము

**నాగాః కాద్రవేయాః -** 1

నాగకాద్రవేయశబ్దౌ మానుషాకారేషు ఫణాలాంగూలాది యుక్తేషు దేవయోనిషు భోగిషు వర్తేతే. నాగకాద్ర వేయశబ్దములు పడిగలు తోఁకలు గలిగి, మనుష్యరూపులును దేవయోనులునునైన పాములపేళ్లు. నగే పర్వతే చందనతరౌ వా భవాః నాగాః. అ. పు. పర్వతమునందుఁ గాని చందనవృక్షమునందుఁ గాని పుట్టినవి. పద్భ్యాంనాంగంతీతి వా నాగాః. అగి గతౌ. పాదములచేత సంచరింపనివి. ౧. కద్ర్వాః అపత్యాని కాద్రవేయాః. అ. పు. ఈ ౨ కద్రువు కొడుకుల పేళ్లు.

**తదీశ్వరః,** 2

**శేషో ऽ నన్తో -**

శేతే హరిరస్మిన్నితి శేషః. శీఙ్ స్వప్నే. హరి యితనిమీఁద శయనించును. కల్పాంతే ऽ పి శిష్యత ఇతివా శేషః – కల్పాంతమునందును మిగిలియుండువాఁడు. ౧. న విద్యతే అంతో నాశో యస్య సః అనంతః – నాశము లేనివాఁడు. ఈ ౨ నాగులకు రాజైన ఆదిశేషుని పేళ్లు.

**వాసుకిస్తు సర్పరాజః -** 3

వసు రత్నం కే శిరసి యస్య సః వసుకః, తస్యాపత్యం వాసుకిః.

ఇ. పు. వసు వనఁగా రత్నము, అది శిరస్సునఁ గలవాఁడు వసుకుఁడు, వాని కొడుకు వాసుకి. వసతి పాతాళ ఇతి వాసుకిః. వస నివానే. పాతాళ మందుండువాఁడు. ౧. సర్పాణాం రాజా సర్పరాజః – సర్పములకు ఱేఁడు. ఈ ౨ వాసుకి పేళ్లు.

**అథ గోనసే.** 4

**తిలిప్స స్స్యాత్ -**

గోరివ నాసా యస్య సః గోనసః – గోవు నాసికవంటి నాసిక గలది. ౧. తిలతి చరతీతి తిలిప్సః. తిల గతౌ. చరించునది. ఈ ౨ కొండచిలువ పేళ్లు.

**అజగరేశయు ర్వాహస ఇ త్యుభౌ -**

అజం ఛాగం గిరతీత్యజగరః. గౄ నిగరణే. మేఁకను మ్రింగునది. న జాగర్తీత్య జగరః. జాగృ నిద్రాక్షయే. ఎప్పుడును మేలుకొననిది. అజః నిత్యః గరః అస్య వా అజగరః – నిత్యమైన విషము గలిగినది. ౧. శేతే అత్యర్థం శయుః. ఉ. పు. శీఙ్ స్వప్నే. మిక్కిలి నిద్రించునది. ౨. వాతీతి వాయుః, తేన మసతీతి వాహసః. హసేహసనే. వా యనఁగా వాయువు. దానిచేత సంతోషించునది. వాహం గమనం స్యతీతి వాహసః. షో ఉన్తకర్మణి. గమనమును జెఱుచునది. ఈ ౩ పెనుబాము పేళ్లు.

**అలగర్దో జలవ్యాళః -**

అలంగిరతి భేకా నిత్యలగర్దః. గౄ నిగరణే. మిక్కిలి కప్పలను మ్రింగునది. పా. అరగర్ధః. అరః శీఘ్రగః గర్ధః కాంక్షావాజ్. గృధు అభాకాంక్షాయాం. అరశ్చాసౌ గర్ధశ్చే త్యరగర్ధః. అరమనఁగా శీఘ్రముగాఁ బోవునది; గర్ధమనగా కాంక్షించునది; కనుక అరగర్ధము. రలయోరభేదాత్. పా. అళివద్గర్దతీత్యళిగర్దః. గర్దశబ్దే. కర్కటకమువలె నఱచునది. పా. నిర్విషతయా న జగ దర్దయతీతి అజగర్దః. అర్ధ పీడనే. విషములేని దౌటచే జగత్తును బీడింపనది. ౧. జలే వ్యాళః జలవ్యాళః –ఉదకమందుండెడి సర్పము. ఈ ౨ నీరు కట్టుపాము పేళ్లు.

**సమౌ రాజిల దుణ్డుభౌ.** 5

రాజిః రేఖా అస్మిన్నస్తీతి లాజిలః – రేఖలు గలిగినది. ౧. డుండతీతి డుండుభః. డుడి మజ్జనే. అణఁగియుండునది. ఈ ౨ ఇరుదల శిఖండి పేళ్లు.

**మాలుధానో మాతులాహిః -**

మాలుభిర్ధీయతే పోష్యత ఇతి మాలుధానః. డు ధాఞ్ ధారణ పోషణయోః. మాలు లనఁగా నీచులు; వారిచేఁ బోషింపఁబడునది. ౧. మాతులానామ ఓషధిః తస్యాం స్థితః అహిః మాతులాహిః – మాతుల యనెడి యోషధియందుండు సర్పము. ఈ ౨ ఉమ్మెత్తలో నుండెడి ముఱ్ఱులఁబాము పేళ్లు.

**నిర్ముక్తో ముక్త కఞ్చుకః,**

కంచుకేన ముక్తః నిర్ముక్తః. ముచ్ ౯మోక్షణే. కుబుసముచే విడువఁబడినది. ౧. ముక్తః కుంచుకో ౭నేన ముక్త కఞ్చుకః – విడువఁబడిన కుబుసము గలది. ఈ ౨ అప్పుడు కుబుసము విడిచిన పాము పేళ్లు.

**సర్పః పృదాకు ర్భుజగో భుజంగో ౭హి ర్భుజంగమః.** 6
**ఆశీవిషో విషధర శ్చక్రీ వ్యాళ స్సరీసృపః,**
**కుణ్డలీ గూఢపా చ్చక్షుశ్శ్రవాః కాకోదరః ఫణీ.** 7
**దర్వీకరో దీర్ఘపృష్ఠో దన్దశూకో బిలేశయః,**
**ఉరగః పన్నగో భోగీ జిహ్మగః పవనాశనః.** 8
**(లేలిహానౌ ద్విరసనో వ్యాళః కుమ్భీనసో హరిః,)**

సర్పతీతి సర్పః. సృప్ ౯గతౌ. చరించునది. ౧. పర్దతీతి పృదాకుః. ఉ. పు. పర్ద కుత్సితేశబ్దే. కుత్సితముగాఁ బలుకునది. ౨. భుజం కుటిలం గచ్ఛతీతి భుజగః; భుజంగః; భుజంగమశ్చ. గమ్ ౯గతౌ. కుటిలముగాఁ బోవునది గనుక భుజగము, భుజంగము, భుజంగమము, 3, ౪. ౫. అంహతీత్యహిః. అహి గతౌ. చరించునది. ౬. ఆశిషి దంష్ట్రాయాం విషమస్యా స్తీ త్యాశీవిషః–ఆశీస్సు అనఁగా కోఱ, అందు విషము గలది. ఆశీశబ్ద ఈకారాంతో ౭ప్యస్తి. "ఆశీమివ కలామిందో" రితి రాజశేఖరః. ౭. విషస్య ధరః విషధరః – విషమును ధరించునది. ౮. శిరసి చక్రయోగాచ్చక్రీ. న. పు. శిరస్సునందు చక్రము గలిగినది. చక్రం మండలాకారతా అస్యాస్తీతివా చక్రీ – మండలాకారమై యుండునది. ౯. దష్టుం వ్యడతీతి వ్యాడః. ళడయోభేదాత్. వ్యాళః. అడ ఉద్యమనే. కఱువ నుద్యమించునది ౧౦. కుటిలం సర్పతీతి సరీసృపః. సృప్ ౯గతౌ. కుటిలముగాఁ బోవునది. ౧౧. కుండలాకారం వపురస్యేతి కుండలీ. న. పు. కుండలాకారమైన శరీరముగలది. ౧౨. గూఢాః పాదాః యస్య సః

గూఢపాత్. ద. పు. కానరాని పాదములు గలది. ౧౩. చక్షుర్భ్యాం శృణోతీతి చక్షుశ్శ్రవాః. స. పు. శ్రు శ్రవణే. కన్నులవలన వినునది. చక్షుషీ శ్రవణే యస్యేతి, వా–కన్నులే చెవులుగాఁ గలిగినది. ౧౪. కాఈషత్ అకం కుటిలగతికం ఉదరమస్యేతి కాకోదరః – ఇంచుకంత కుటిలగతియైన కడుపు గలది. కాకస్యేవ ఉదరమస్యేతి వాకాకోదరః–కాకిపొట్టవంటి పొట్టగలది. ౧౫. ఫణా అస్యాస్తీతి ఫణీ. న. పు. పడిగగలిగినది. ౧౬. దర్వ్యాకారత్వాత్ఫణా దర్వీ, సైవ ప్రహరణాదౌ కరో ఉస్యేతి దర్వీకరః – తెడ్డువంటి ఆకారముగలిగినది గనుక పడిగదర్వి యనంబడును. ఆ పడిగ హస్తముగాఁ గలిగినది. ౧౭. దీర్ఘం పృష్ఠం అస్యేతి దీర్ఘపృష్ఠః–దీర్ఘమైన వీఁపుగలిగినది. ౧౮. కుత్సితం దశతీతి దందశూకః. దంశదశనే. కుత్సితముగాఁ గఱచునది. ౧౯. బిలే శేత ఇతి బిలేశయః. శీఙ్ స్వప్నే. బిలమునందు నిద్రించునది. ౨౦. ఉరసా గచ్ఛతీత్యురగః గమ్ ౯ గతౌ. ఉరస్సుచేత సంచరించునది. ౨౧. పద్భ్యాం న గచ్ఛతీతి పన్నగః– పాదములచేతఁ బోవనిది. పన్నం పతితం యథాతథా గచ్ఛతీతి పన్నగః– పడినట్టుగాఁ బోవునది. ౨౨. భోగస్సర్పశరీరం దతస్యాస్తీతి భోగీ. న. పు. భోగమనఁగా సర్పశరీరము; అది గలిగినది. ౨౩. జిహ్మం వక్రం గచ్ఛతీతి జిహ్మగః గమ్ ౯ గతౌ. వక్రముగాఁ బోవునది. ౨౪. పవనః అశనంయస్య సః పవనాశనః – వాయువు ఆహారముగాఁ గలిగినది. ఈ ౨౫ సామాన్యముగా సర్పము పేళ్లు.

**త్రిష్వాహేయం విసాస్థ్యాది -**

అహౌ భవం ఆహేయం. త్రి. అహియందుఁ బుట్టినది. ఈ ౧ పాముయొక్క విషము, అస్థి, చర్మము మొదలైనవాని పేళ్లు.

**స్ఫటాయాం తు ఫణా ద్వయోః,**

స్ఫుటతీతి స్ఫటా. పా. స్ఫుటా. స్ఫుటిర్ విశరణే. విస్తీర్ణమైనది. ౧. ఫణత్యనయా ఫణా. పు. ఫణ గతౌ. సర్పము దీనిచేఁ బోవును. ఈ ౨ పడిగపేళ్లు.

**సమౌ కఞ్చుక నిర్మోకౌ -**

కంచతే బధ్యతే అనేనేతి కంచుకః. కచి దీప్తి బంధనయోః. దీనిచేత సర్పశరీరము బంధింపఁబడును. ౧. నిర్ముచ్యత ఇతి నిర్మోకః. ముచ్ ౯

మోక్షణే. విడువఁబడినది. ఈ ౨ పాముకుబుసము పేళ్లు.

**క్ష్వేళస్తు గరళం విషమ్.** 9

క్ష్వేళతే మోహయతీతి క్ష్వేళః. ఞి క్ష్విదా స్నేహనమోహనయోః. మోహమును బొందించునది. ౧. గిరతి జీవం గరళం. గౄ నిగరణే. ప్రాణమును మ్రింగునది. ౨. దేహం వేవేష్టీతి విషం. విష్ ఌవ్యాప్తౌ. దేహమును వ్యాపించునది. ౩. పుంసి క్లీబే చేత్యృనీదీ పూర్వేణ విషశబ్దే నాన్వయాత్ విషశబ్దః పుల్లింగే ఽపీతి కేచిత్ – పుంసి యనెడు శబ్దమునకు విషశబ్దముతో నన్వయమగుటచేత ఆ శబ్దమునకు పుంలింగముం గలదని కొందఱు. ఈ ౩ సామాన్యముగా విషనామములు.

**పుంసి క్లీ బే చ కాకోల కాలకూట హలాహలాః,**
**సౌరాష్ట్రిక శౌక్లికేయో బ్రహ్మపుత్ర ప్రదీపనః** 10
**దారదో వత్సనాభశ్చ విషభేదా అమీ నవ,**

కాకవత్కృష్ణవర్ణత్వాత్కాకోలః. కాకివలె నల్లనై యుండునది. కా ఈషత్ కోలతి సంస్త్యాయతీతి కాకోలః. కుల సంస్త్యానే. ఇంచుక కూడి వ్యాపించునది. ౧. కాలస్య వర్ణస్య కూటః కాలకూటః – కృష్ణవర్ణమునకు స్థానము. కాలం యమమపి కూటయతి కాలకూటః. కూటపరిదాహే. యమునిఁగూడ పీడించునది. తిర్యగ్రేఖ బుద్బుదాకార ఘనబిందువ్యాప్త పృథు మాలినామకాసురరక్తజన్య విషనామ – ఇదం అహిచ్ఛత్రమలయ కోంకణ శృంగిబేర పురాదిషూత్పద్యతే – అడ్డగీఱలుగలిగి నీటిబుగ్గలవంటి పెద్ద బొట్లచేత వ్యాపించఁబడినదై దేవాసురయుద్ధమందు పృథుమాలియను నసురుని నెత్తురువలనఁ బుట్టినది. ఇది అహిచ్ఛత్రము మలయము మొదలైన దేశములయందుఁ బుట్టును. ౧. హలతి జఠరం విలిఖతి నలి ఖతి చ హలహలః. హల విలేఖనే. కడుపులో నొకపర్యాయము చీల్చుచున్నట్టును, ఒకపర్యాయము లేనట్టు నుండునది. తాళపత్ర సంస్థాన నీలగోస్తనాకృతిగుచ్ఛ వృక్షదాహక విషనామ. ఇదం హిమవత్పర్వత కిష్కింధా కోంకణదేశ దక్షిణసింధ్వాదిషు భవతి–తాటాకువంటి యాకృతి గలిగి నల్లనై గోస్తనాకృతియైన గుత్తులు గలిగి సమీపమందుండెడు వృక్షముల దహించునది; ఇది హిమవత్పర్వత కిష్కింధాదుల యందుఁ బుట్టును. ౧. సురాష్ట్ర దేశేభవః సౌరాష్ట్రికః– సౌరాష్ట్ర దేశమునఁ బుట్టు

నది. ౧. శుక్ల దేశేభవః శౌక్లి కేయః–శుక్ల దేశమందుఁ బుట్టినది. ౧. బ్రహ్మణః పుత్రః బ్రహ్మపుత్రః–బ్రహ్మవలనఁ బుట్టినది. ఏష కపిలవర్ణో మల యాద్రిభవః– ఇది కపిలవర్ణమై మలయాద్రియందుఁ బుట్టినది. ౧. ప్రదీప యతీతి ప్రదీపనః. దీపీ దీప్తౌ. మిక్కిలి దీప్తముగాఁ జేయునది. ఏషరక్తవర్ణో ఉంజనాద్రిభవః. ఇది ఎఱ్ఱవన్నె గలదై అంజనాద్రియందుఁ బుట్టునది. ౧. దరదదేశేభవః దారదః –దరదమను దేశమునఁ బట్టినది. దరదే నాగవిశేషేభవః దారదః–దరదమను పామునందుఁ బుట్టినది. ౧. వత్సస్యేవ నాభిరస్య వత్సనాభః – వత్సముయొక్క నాభివలె నుండునది. సింధువారసమపత్ర వృక్ష విశేషభవః తత్సంబంధి వాయుర్జ్వర ప్రదః– వావిలాకువంటి ఆకులు గలిగిన వృక్షమందుఁ బుట్టునది. దీనియందుఁ బుట్టిన వాయువుయొక్క స్పర్శము చేత జ్వరము పుట్టును. స్థావర విషభేదముల పేళ్లు.

**విషవైద్యో జాఙ్గలికో -**

విషవిద్యాం వేత్తీతి విషవైద్యః–విషమును దించు విద్యను దెలిసినవాఁడు. ౧. జాంగలం విషవిద్యాం వేత్తీతి జాంగలికః. పా. జాంగులికః. జాంగల మనగా విషమును దించు మంత్రము; దాని నెఱింగినవాఁడు. ౨. విషము దించునట్టి వైద్యుని పేళ్లు.

**వ్యాళగ్రా హ్యాహితుణ్డికః.** 11

వ్యాళం గృహ్ణాతీతి వ్యాళగ్రాహీ. న. పు. పా. వ్యాళగ్రాహః–గ్రహ ఉపాదానే. పామును బట్టువాఁడు. ౧. అహి తుణ్డేన జీవతీత్యహి తుణ్డికః–సర్పముఖముచేత బ్రతుకువాఁడు. ఈ ౨ పాములఁ బట్టువాని పేళ్లు.

# నరక వర్గము

**స్యా న్నారకస్తు నరకో నిరయో దుర్గతిః స్త్రియామ్,**

నృణాతి ప్రాపయతి పాపినస్స్వసమీపమితి నరకః. నరక ఏవ నారకః–నృ నయనే. పాపిష్టును తన సమీపమును బొందించునది గనుక నరకము; నరకమే నారకము. నరాః కాయంత్యస్మిన్నితి వా నరకః; సఏవ నారకః. కైశబ్దే–నరులు దీనియందు మొఱపెట్టుదురు. ౧, ౨. అయః శుభావహో విధిః–సనిర్గతః. అస్మాదితి నిరయః అయమనఁగా శుభావహ విధి. అది దీనివలన నిర్గతమౌను. ౩. దుష్టాగతిః దుర్గతి. ఇ. సీ. దుష్టమైన గతి. ఈ ౪ నరకము పేళ్లు.

౨ **తద్భేదాస్తప నావీచి మహారౌరవ రౌరవాః.** 1
**సఙ్ఘాతః కాలసూత్రం చేత్యాద్యాః -**

పాపినః తాపయతీతి తపనః. తప సంతాపే. పాపులను దపింపఁజేయునది. ౧. తరంగస్స్వల్ప యోర్వీచి రితిరుద్రః. నాస్తి సుఖస్యస్వల్పో ఽ ప్యత్ర అవీచిః. ఇ. పు. వీచి యనఁగా స్వల్పము. సుఖముయొక్క లేశమైన దీనియందులేదు గనుక అవీచి. అవంత్యస్మాదితివా అవీచిః. అవ రక్షణే. దీనివలన తమ్ము రక్షించుకొందురు. అవీచిశబ్దః తపనాది సాహచర్యా త్పుంసి; స్త్రియామప్యస్తి. తథా చామరమాలాయాం ___ 'విశేషాస్స్యురవీచిః స్త్రీ'తి. అవీచి శబ్దము తపనాది శబ్ద సాహచర్యమువలనఁ బుంలింగమందును, అమరమాలయనెడు నిఘంటువునందు స్త్రీలింగముగాఁ జెప్పుటవలన స్త్రీలింగమందును వర్తించును. ౧. మహాన్ రౌరః రవః అత్రేతి మహారౌరవః; రౌరవశ్చ – మిక్కిలి భయంకరమైన ధ్వని గలిగినది. ౧. సంహన్యన్తే ఽ త్రేతి సంఘాతః. హన హింసాగత్యోః. దీనియందు మిక్కిలి హింసింపఁబడుదురు. ౧. పా. సంహ్రియంతే పాపినో ఽ త్ర సంహారః. హృఞ్ హరణే. పాపులు దీనియందు సంహరింపఁబడుదురు. ౧. కాలాన్యయోమయాని సూత్రాణ్యస్మిన్నితి కాలసూత్రం– ఇనుముతీఁగలు దీనియందుఁ గలవు. ౧. ఆద్య శబ్దేన తమిస్రాంధతమిస్రాదయో గృహ్యంతే. ఆద్యశబ్దముచేత తమిస్రాంధ తమిస్రాశాల్మలీ తప్తవాలుకాదులు గ్రహింపఁబడుచున్నవి. ఈ ౬ నరకభేదముల పేళ్లు.

**సత్త్వాస్తు నారకాః,**

**ప్రేతాః -**

నరకే భవాః నారకాః. అ. పు. నరకమున నుండువారు. ౧. ప్రకర్షేణ నరక మిత్రాః ప్రేతాః. ఇణ్‌గతౌ – ప్రకృష్టముగా నరకమును బొందినవారు. క్షుత్పిపాసాదిభిః భృశం ప్రాప్తా వాప్రేతాః. ఆప్ ఌ వ్యాప్తౌ క్షుత్పిపాసాదులచేత మిక్కిలి పొందఁబడినవారు. ఈ ౨ నరకమునందుండు జంతువుల పేళ్లు.

**వైతరణీ సిన్ధుః -**

విగతం తరణమత్ర వైతరణీ. తౄ ప్లవనతరణయోః. దీనియందు దాఁటుట లేదు. వితరణేన గోదానాదినా తీర్యత ఇతి వైతరణిః – గోదానా

దులచే దాఁటఁబడునది. విరుద్ధం తరణం వితరణం, తదస్యామస్తీతి వైతరణీ-కష్టమైనదాఁటుటగలది. వితరణౌ అసూర్యే పాతాళీ భవా వైతరణీ. సూర్యుఁడు లేనిది గనుక వితరణి పాతాళము; అందుఁ బుట్టినది వైతరణి. ఈ ౧ నరకమందున్న నది పేరు.

**స్యా దలక్ష్మీ స్తు నిరృతిః.** 2

లక్ష్మీర్న భవతీత్యలక్ష్మీః. ఈ. సీ. సంపత్తుగానిది అలక్ష్మి. ౧. ఋతేస్యస్మార్గా న్నిర్క్రాంతా నిరృతిః - సన్మార్గమువలనఁ బాసినది. ఈ ౨. నరకసంబంధమైన యభాగ్యము పేళ్లు.

**విష్టి రాజూః -**

వేవేష్టీతి విష్టిః. ఇ. సీ. విష్ఌవ్యాప్తౌ. వ్యాపించునది గనుక విష్టి. విశతి నరకమనాయా వా విష్టిః. విశ ప్రవేశనే. దీనిచేత జనము నరకమును ప్రవేశించును. ౧. ఆ సమంతా దుఃఖం జనయతీత్యాజూః. ఊ. సీ. జనీప్రాదుర్భావే. అంతట దుఃఖమును బుట్టించునది. ఆజుషతే నరక మనయేతివా ఆజూః. జుషీ ప్రీతిసేవనయోః. దీనిచేత నరకమును బొందుదురు. ఈ ౨ జీతమీయక కొలువు చేయించుకొనుట పేళ్లు. భద్రకరణముపేళ్లని కొందఱు. బలాత్కారముగా నరకమున ద్రొబ్బుట పేళ్లని కొందఱు.

**కారణా తు యాతనా తీవ్రవేదనా,**

కృణాతీతి కారణా. కౄ హింసాయాం. బాధించునది. ౧. యాంతి నాశమనయేతి యాతనా. యాప్రాపణే. దీనిచేత నాశమును బొందుదురు. యాతయతీతి వా యాతనా. యతీ ప్రయత్నే. ఉపద్రవించుటకై ప్రయత్నము చేయించునది. ౨. తీవ్రాచ సా వేదనాచ తీవ్రవేదనా. తీవ్రమైన వేదన. ఈ 3 అతివేదన పేళ్లు.

**పీడా బాధా వ్యథా దుఃఖ మామనస్యం ప్రసూతిజమ్.** 3

**స్యా త్కష్టం కృచ్ఛ్రా మాభీలం త్రి ష్వేషాం భేద్యగామి యత్,**

పీడ్యంతే అనయేతి పీడా. పీడ అవగాహనే. దీనిచేత జనులు పీడింపఁబడుదురు. ౧. బాధ్యంతే అనయేతి బాధా. బాధృ విలోడనే. దీనిచేఁ గలియఁబెట్టఁబడుదురు. ౨. విధ్యంతే అనయేతి వ్యథా. వ్యథ భయచలనయో. దీనిచేఁ జనులు భయపడుదురు లేక చలింతురు గనుక

వ్యథ. ౩. దుష్టాని ఖాని ఇంద్రియాణ్యత్రేతి దుఃఖం – దీనియందు ఇంద్రియములు దుష్టములౌను. దుర్నిందితం ఖనతి వా దుఃఖం. ఖను అవదారణే. దుష్టముగా ఖేదపెట్టునది. ౪. మానసే సాధు మానస్యం. తన్నభవతీ త్యమానస్యం – మానసమునం దొప్పునది మానస్యము. అదిగానిది అమానస్యము. పా. అమనసోభావః ఆమనస్యమితివా – దుష్టమైన మనస్సుయొక్క భావము ఆమనస్యము. ౫. ప్రసూతౌజాతం ప్రసూతిజం. జనీ ప్రాదుర్భావే. ప్రసూతియందుఁ బుట్టినది. ౬. కష్యతి హినస్తీతి కష్టం. కష హింసాయాం. హింసించునది. ౭. కృంతతీతి కృచ్ఛ్రం. కృతీ ఛ్చేదనే. ఛేదించునది. ౮. ఆసమంతాత్ భయంలాతీ త్యాభీలం. లాదానే. అంతట భయము నిచ్చునది. ౯. పీడాదిషు దుఃఖాదయః అభేదోపచారాత్ యదా విశేష్యనిఘ్నాః తదాత్రిషు లింగేషు వర్తన్తే. యథా కష్టా సేవా. కష్టో భృత్యభావః. కష్టం వ్యాకరణం. ఇతి లింగభట్టాదయః. పీడాదిశబ్దేషు యద్యద్విశేష్యగామి తత్సర్వం త్రిషు లింగేషు వర్తత ఇతి టీకాస్వరస్సకారాదయః – పీడాది శబ్దములలో అభేదోపచారము వలన విశేష్యనిఘ్నము లగు దుఃఖాదిశబ్దములు లింగత్రయమందున వర్తించును. కష్టా సేవా ఇత్యాదు లుదాహరణములు. పీడాదులు ౬ మనఃపీడకును, కష్టాదులు ౩ శరీరపీడకును పేళ్లు. ఈ ౯ దుఃఖమునకే పేళ్లని కొందఱు.

# వారి వర్గము

**సముద్రో ఽ బ్ధి రకూపారః పారావార స్సరిత్పతిః,**
**ఉదన్వా నుదధి స్సిన్ధు స్సరస్వా౯ సాగరో ఽ ర్ణవః.** 1
**రత్నాకరో జలనిధి ర్యాదఃపతి రపాంపతిః,**

సమ్యగునక్తి చంద్రోదయాదితి సముద్రః. ఉదీ క్లేదనే. చంద్రోదయమువలన మిక్కిలి క్లేదమును బొందునది. అనఁగా వృద్ధిఁ బొందునది. సమంతాన్ముదం రాతీతి వా సముద్రః. రా దానే. అంతట సంతోషము నిచ్చునది. ముద్రయా సహితస్సముద్రః – ఈశ్వరాజ్ఞతోఁ గూడుకొనియుండునది. ౧. ఆపః ధీయంతే అస్మిన్నిత్యబ్ధిః. ఇ. పు. డుధాఞ్ ధారణపోషణయోః. జలములు దీనియందు ధరింపఁబడును. ౨. మర్యా

దయా న కుం పృథివీం పృణాతీత్యకూపారః. పృ పాలన పూరణయోః –మర్యాదచేతను భూమిని నింపనిది. అకుత్సితం పారమస్య అకూపారః –కుత్సితముగాని దరిగలిగినది. అవిద్యమానా కుః పృథ్వీ పారే ఽస్యేతి వా అకూపారః – దీని ఆవలి దరియందు భూమి లేదు. ౩. పారమావృణోతి పారావారః. వృఞ్ వరణే. దరిని గప్పునది. అనఁగాఁ దరిలేని దనుట. పా. పార మపారమస్య పారాపారః. అపారమైన తీరము గలిగినది. "సతమాస్సత మాలతయా పారాపారాయ యస్సదా వోదావ" ఇతి హరిప్రబోధే సందిష్టయమకం. ౪. సరితాంపతిః సరిత్పతిః. ఇ. పు. నదులకుఁ బ్రభువు. ౫. ఉదక మస్మిన్నస్తీత్యుదన్వాన్. త. పు. ఉదకము గలిగినది. ౬. ఉదకం ధీయతే అస్మిన్నిత్యుదధిః ఇ. పు. దు ధాఞ్ ధారణ పోషయోః. ఉదకము దీనియందు ధరింపఁబడును. ౭. స్యందతే సింధుః. ఉ. పు. స్యందూ ప్రస్రవణే. ప్రవహించునది. ౮. సరో నీరే తటాకే చేతి రుద్రః. తద్యోగాత్సరస్వాన్ త. పు. సరస్సనఁగా నుదకము అది గలిగినది. ౯. సగరిపుత్రైః ఖాతస్సాగరః – సగరపుత్రులచేఁ ద్రవ్వఁబడినది. ౧౦. అర్ణాంసి సంత్యస్మిన్నిత్యర్ణవః – జలములు గలిగినది. ౧౧. రత్నానామాకరః రత్నాకరః – రత్నములకెల్ల గనియైనది. ౧౨. జలాని నితరాం ధీయంతే ఽస్మిన్నితి జలనిధిః. ఇ. పు. డుధాఞ్ ధారణ పోషణయోః. జలములు దీనియందు మిక్కిలి ధరియింపఁబడును. ౧౩. యాదసాం జలజంతూనాంపతిః యాదఃపతిః. ఇ. పు. యాదస్సు లనఁగా జలజంతువులు. వానికి పతియైనది. ౧౪. అపాంజలానాంపతిః అపాంపతిః ఇ. పు. జలమునకు వతియైనది. ఈ ౧౫ సముద్రము పేళ్లు.

**తస్య ప్రభేదాః క్షీరోదో లవణోద స్తథాపరే.** 2

క్షీరోదలవణోద శబ్దములును, తథాపరే అన్నందున, దధ్యుద, ఘృతోద, ఇక్షూద, సురోద, స్వాదూద శబ్దములును ప్రత్యేకముగా సముద్రభేదములు. క్షీరమివ ఉదకం యస్యసః క్షీరోదః–పాలవంటినీళ్లు గలిగినది. ౧. లవణమివ ఉదకం యస్యసః లవణోదః–లవణమువంటి ఉదకము గలిగినది. ఈరీతిని దధ్యుదాది శబ్దములకు అర్థము తెలియఁదగినది.

**ఆపః స్త్రీభూమ్ని వార్వారి సలిలం కమలం జలమ్,**
**పయః కీలాల మమృతం జీవనం భువనం వనమ్.** 3

**కబన్ధ ముదకం పాథః పుష్కరం సర్వతోముఖమ్,**
**అమ్భో ఽ ర్ణస్తోయ పానీయ నీర క్షీరామ్బు శంబరమ్.** 4
**(కృపీటం కాణ్డ మస్త్రీ స్యాజ్జీవనీయం కుశం విషమ్.)**
**మేఘపుష్పం ఘనరసం -**

ఆప్నువం తీత్యాపః. ఆప్ ౹వ్యాప్తౌ. వ్యాపించునవి. పకారాంత స్త్రీలింగ నిత్యబహువచనము. ౧. అపవారయతి నిమ్నోన్నతమితి, వాః. ర. స్త్రీ. వారి చ, ఇ-న. వృఞ్ వరణే. నిమ్నోన్నతములను గప్పునది. వార్ శబ్దో రేఫాంతః స్త్రీలింగః పూర్వసాహచర్యాత్ ; ఉత్తరసాహచర్యాత్ క్లీబే చ. ౨, ౩. సరతీతి సలిలం. సృ గతౌ; ఉత్తరసాహచర్యాత్ క్లీబే చ. ౨, ౩. సరతీతి సలిలం. సృ గతౌ. రలయోరభేదః. ప్రవహించునది. సరతీతి సలిలం. షల గతౌ - పోవునది. ౪ కామ్యతే తృషార్తైరితి కమలం. కము కాంతౌ. దప్పిగొన్నవారిచేఁ గోరఁబడునది. ౫. జలతి జడీభవతీతి జలం. జల ఘనే - జడీభవించునది. ౬. పయత ఇతి పయః స - న. పయ గతౌ. ప్రవహించునది. పీయత ఇతి వా పయః. పా పానే. పానము చేయఁ బడునది. ౭. కీలాన్ జ్వాలాన్ అలతి వారయతీతి కీలాలం. అల భూషణపర్యాప్తి శక్తివారణేషు. అగ్నిజ్వాలలను వారించునది. కీల్యతే బధ్యత ఇతివా కీలాలం. కీల బంధనే. బంధింపఁబడునది. ౮. న మ్రియంతే అనేనేత్యమృతం. మృఙ్ ప్రాణత్యాగే. దీనిచేత మరణమును బొందరు. ౯. జీవంత్యనేనేతి జీవనం. జీవ ప్రాణధారణే. దీనిచేత బ్రతుకుదురు. ౧౦. భవతి సర్వమనేనేతి భువనం. భూ సత్తాయాం. దీనివలన నన్నియుఁ గలుగును. ౧౧. వన్యతే యాచ్యత ఇతివనం. వను యాచనే. అడుగఁబడునది. వనీతివా వనం. వన సంభక్తౌ. లెస్సగాఁ గూడియుండునది. ౧౨. కం శరీరం బధ్నాతీతి కబంధం - శరీరమును నిలుపునది. పా. కమంధమితిపాఠే కం, అంధం ఇతి నామద్వయం. కామ్యత ఇతి కం. కము కాంతౌ. కోరఁబడునది. అనంత్యనే నేత్యంధం. అనప్రాణనే. దీనిచేత బ్రతుకుదురు. ౧౩. ఉనక్తీతి ఉదకం. ఉందీక్లేదనే. ద్రవమైయుండునది. ౧౪. పీయతే పాథః. స-న. పా పానే. పానము చేయఁబడునది. పాతి భూతానీతి పాథః. పా రక్షణే. భూతములను రక్షించునది. ౧౫. పోషయతీతి పుష్కరం. పుష పుష్టౌ. పోషించునది. ౧౬. సర్వతః ముఖాన్యస్య సర్వతోముఖం -

ప్రవహించునప్పుడు అంతటు ముఖములు గలది. ౧౭. అమతి గచ్ఛతీత్యంభః. స-న. అమగత్యాదిషు. పోవునది. ౧౮. ఋణాతీత్యర్ణః. స. న. ఋ గతౌ. పోవుచుండునది. ౧౯. తాయతే పాలయతీతి తోయం. తాయృ సంతానపాలనయోః – రక్షించునది. ౨౦. పీయత ఇతి పానీయం పా పానే. పానము చేయఁబడునది. పాతు యోగ్యమితి వా పానీయం–పానము చేయఁదగినది. ౨౧. నిమ్నమీర్తే నీరం. ఈరగతౌ. పల్లమును బొందునది. నయతి సుఖమితి నీరం. నీఞ్ ప్రాపణే. సుఖమును బొందునది. ౨౨. క్షీయతే క్షీరం. క్షి నివాసగత్యోః. ప్రవహించునది. ౨౩. అంబతే అంబు. ఉ. న. అబిరబి లబి శబ్దే. ప్రవహించునప్పుడు ధ్వనియుక్తమై యుండునది. ౨౪. శంబయతీతి శంబరం. పా. సంబయతీతి సంబరం. షంబ సంవరణే; శంబ చ. ఆవరించునది. శంవృణోతీతి శంబరం. వృఞ్ వరణే. సుఖముచేతఁ గప్పునది; వబయోరభేదః. ౨౫. మేఘానాం పుష్పం మేఘపుష్పం– మేఘములకు పుష్పము వంటిది. ౨౬. ఘనస్య రసం ఘనరసం. అ. ప్న. మేఘముయొక్క రసము. ఈశబ్దము పుంలింగంబును గలదు. 'పుంలింగస్స్యాద్ఘ నరసస్సాంద్రనిర్యాసయోర' పీతి రుద్రః. ఈ ౨౬ ఉదకముపేళ్లు.

**త్రిషు ద్వే ఆప్య మమ్మయమ్,**

అపాం వికారః ఆప్యం; అమ్మయం చ. త్రి. జలముయొక్క వికారము ఆప్యము, అమ్మయంబును. ఈ ౨ జలవికారము పేళ్లు.

**భఙ్గ స్తరఙ్గ ఊర్మిర్వా స్త్రియాం వీచిః -**

భజ్యతే స్వయమేవ భంగః. భఞో ఆమర్దనే. తనంతట నశించునది. ౧. తరతీతి తరఙ్గః. తౄ ప్లవనతరణయోః. దరి చేరునది. ౨. ఋచ్ఛతి గచ్ఛతీత్యూర్మిః. ఇ. ప్స. ఋ గతౌ. చరించునది. ఊర్మిశబ్దః పుంలింగే ఉ ప్యస్తి. తథా చ వామనభట్టః "పుంలింగస్త్రీలింగా మరీచిమణి యష్టి ముష్టయో వీచిః, కోటిరపి పాటలిరపి శాల్మలీ తరణీ శ్రేణ్యూర్మయ" ఇతి. ౩. వాతీతి వీచిః. ఇ. ప్స. వా గతిగంధనయోః.చరించునది. విస్మయం చినోతీతి వా వీచిః. చిఞ్ చయనే. విస్మయమును జేయునది. వీచిశబ్దః. వా స్త్రియామితి కేచిత్. ఈ ౪ కరుళ్ల పేళ్లు.

**అథోర్మిషు.** 5

**మహా త్సూల్లోల కల్లోలౌ -**

ఉత్ ఊర్ధ్వం లోడతీత్యుల్లోః. లోడృ ఉన్మాదే. లడయోరభేదః. పైకి లేచునది. ౧. కలతే శబ్దాయతే కల్లోలః. కల అవ్యక్తే శబ్దే. అవ్యక్తముగా మ్రోయునది. కల్యతే జలమనేనేతి కల్లోలః. కల కిలక్షేపే. దీనిచేత జలము చల్లఁబడును. ఈ ౨ గొప్ప కరుళ్ల పేళ్లు.

**స్యా దావర్తో ఽ మ్భసాం భ్రమః**

ఆవర్తతే చక్రవద్భ్రామ్యతీత్యావర్తః. వృతు వర్తనే-చక్రమువలెఁ దిరుగునది. ఈ ౧ నీళ్ల సుడిపేరు.

**పృషన్తి బిన్దుపృషతాః పుమాంసో విప్రుషః స్త్రియః.** 6

వర్షంతి సించంతీతి పృసంతి. త. న. బహువచనము. పృషు సేచనే. తడుపునవి. ౧. బిందంతీతి బిందవః. ఉ. పు. బ. బిది అవయవే. జలము యొక్క అవయవములు బిందువులు. ౨. వర్షంతి సించంతీతి పృషతాః. అ. పు. బ. తడుపునవి. విగతః ప్రుట్ దాహః ఆభ్య ఇతి విప్రుషః.ష.సీ. బ. ప్రుషుప్లుషుదాహే. దీనివలన దాహము నివర్తించును. ౪. పృషదాదిశబ్దానాం బహువచన నిర్దేశః ప్రాయికః. 'పృషతో బిందురిష్యత' ఇత్య మరమాలాయా మేకవచన దర్శనాత్. ఈ ౫ ఉదకబిందువుల పేళ్లు.

**చక్రాణి పుటబేధాః స్యుః -**

చక్ర మనఁగా వాఁక. భూమిని ప్రక్కలించి నీళ్లూరి వచ్చెడు బుగ్గపేళ్లని కొందఱు. చక్రాకార ఏషామస్తీతి చక్రాణి. అ. న. చక్రము వంటి యాకారము గలిగినవి. పా. వక్రత్వాద్వక్రాణి. వఞ్చు కౌటిల్యే. వక్రమయిన యాకారముగలవి. ౧. పుటం సంశ్లిష్టం భిందంతీతి పుటభేదాః. భిదిర్ విదారణే. లెస్సగా గట్టియై కూడియున్న స్థలమును భేదించునవి. ఈ ౨ నదీవక్రము పేళ్లు.

**భ్రమాశ్చ జలనిర్గమాః,**

భ్రమతి జలమేభిరితి భ్రమాః. భ్రము చలనే. జలము దీనిచేతఁబోవును. ౧. జలాని నిర్గచ్ఛంత్యేభ్య ఇతి జలనిర్దమాః - జలము వీని వలన బయలు దేరుచున్నది. ౨. కొందఱు చక్రాదిశబ్దములు ఈ ౪ ను జలమార్గము పేళ్లందురు. నీళ్లు పోవుటకుఁ గట్టిన తూము దోనె మొదలైనవాని పేళ్లు.

**కూలం రోధశ్చ తీరం చ ప్రతీరం చ తటం త్రిషు.** 7

కూలతీతి కూలం. కూల ఆవరణే–నదిని గప్పియుండునది. ౧. రుణద్ధి జలమితి రోధః. స. న. రుధిర్ ఆవరణే–జలమును నిలుపునది. ౨. తరంత్యనేనేతి తీరం. తౄప్లవనతరణయోః–దీనిచేఁ దరింతురు. తీరయతి సరిత్త రణకర్మాత్రేతి వా తీరం. పార తీర కర్మసమాప్తౌ – దీనియందు నదీతరణ వ్యాపారము సమాప్తమౌను. ౩. తీరమేవ ప్రతీరం–తీరమే ప్రతీరము. తీరశబ్దస్య ప్రేత్యుపసర్గ యోగః ఉపసర్గాంతర నివృత్తిజ్ఞాపకః – తీరశబ్దమునకు ప్ర అనెడు ఉపసర్గయోగము తక్కిన యుపసర్గముతో యోగము లేదని యెఱింగించుచున్నది. ౪. తటతీతి తటం. త్రి. తట ఉచ్ఛ్రాయే–ఉన్నతమయినది. ఈ ౫ దరిపేళ్లు.

**పారావారే పరార్వాచీ తీరే -**

పరంచ అర్వాక్చ పరార్వాచీ, తే తీరే పారావారే ఇత్యుచ్యేతే. పార అవారశబ్దములు వరుసగా, ఈవలిదరికిని ఆవలిదరికిని పేళ్లు. పార్యతే తరణకర్మాత్ర పారం–దీనియందు దాఁటెడు వ్యాపారము ముగియును. ౧. న విద్యతే వాః జల మత్ర అవారం – దీనియందు జలము లేదు. పా. అపారమిత్యపి పారముగానిది అపారము. ౧.

**పాత్రం తదన్తరమ్.**

పీయత ఇతి ప్రాతం. పా పానే–పానముచేయఁబడునది. ఈ ౧ ఆ రెండుదరుల నడుముపేరు.

**ద్వీపో ఽ స్త్రియా మన్తరీపం యదన్త ర్వారిణస్తటమ్.** 8

వారిణో ఽ ంతః వారిమధ్యే యత్తటం, తస్మిన్ ద్వీపాంతరీపశబ్దౌ వర్తేతే– ద్వీపాంతరీపశబ్దములు ౨ నీళ్లనడుమనున్న దిన్నెపేళ్లు. ద్విర్గతాః ఆపః అస్మిన్నితి ద్వీపః. అ. ప్న. దీనియందు జలము రెండు భాగములుగా నిరుప్రక్కల ప్రవహించును. ౧. అపామంతః మధ్య మంతరీపం – జల మధ్యము అంతరీపము. అంతర్గతౌ ఆపః అస్మిన్ని తివా–దీనియందు జలము అంతర్గతమై యుండును. ఈ ౨ లంక పేళ్లు.

**తోయోత్థితం త త్పులినమ్.**

తోయే క్షీణే సతి ఉత్థితం దృశ్యం తత్ పులినమిత్యుచ్యతే.

నీళ్లు తీసినతర్వాతఁ గనఁబడు దిన్నె పులిన మనంబడును. పులః మహత్త్వమస్యాస్తీతి పులినం. పుల మహత్త్వే–ఆధిక్యము గలిగినది.

**సై కతం సికతామయమ్,**

సికతాః అస్య సంతీతి సైకతం; సికతామయంచ–సికతమనఁగా ఇసుక; అది గలిగినది సైకతము, సికతామయమును. ఈ ౨ ఇసుకదిన్నె పేళ్లు.

**నిషద్వరస్తు జమ్బాలః పఙ్కోఽ స్త్రీ శాదకర్దమౌ.** 9

నిషీదంతి వరాహాదయోఽత్రేతి నిషద్వరః. షద్ ౢ విశరణ గత్యవ సాదనేషు –వరాహాదులు దీనియందుండును. ౧. జమతి గ్రసతే గతిం వస్తువా జంబాలః. నము ఛము జము ఝము అదనే–గతినిగాని వస్తువునుగాని కబళించునది. ౨. పంచతే విస్తారమాపద్యత ఇతి పంకః అ. పు. పచి విస్తారే–విస్తారమును బొందునది. ౩. శీయతే పాదోఽత్ర శాదః. శద్ ౢ శాత నే–పాదము దీనియందు కృశించును. ౪. కృణోతీతి కర్దమః. కృఞ్ హింసాయాం–పీడించునది. కర్దతి కుత్సిత శబ్దం కరోతీతి వాకర్దమః. కర్దకుత్సితే శబ్దే–కుత్సిత శబ్దమును జేయునది. ఈ ౫ అడుసు పేళ్లు.

**జలోచ్ఛ్వాసాః పరీవాహాః -**

ప్రవృద్ధం జలముచ్ఛ్వసితియైస్తే జలోచ్ఛ్వాసాః. అ. పు. అధికమయిన జలము వీనిచేత ఊఁచును. జలస్య ఉచ్ఛ్వాసా ఇవ జలోచ్ఛ్వాసాః. శ్వస ప్రాణనే– జలములకు నిట్టూర్పువంటివి. ౧. పరివహతి జలంయైస్తే పరీవాహాః. అ. పు. అధికమైన జలము. ఈమార్గములచేత ప్రవహించును. ఈ ౨ అలుఁగుల పేళ్లు.

**కూపకాస్తు విదారకాః,**

స్వల్పాః కూపాః కూపకాః. అ. పు. అల్పములైన నూతులు. ౧. విదార్యంతే విదారకాః. అ. పు. దౄ విదారణే–త్రొవ్వఁబడునవి. ఈ ౨ చెలమలు పిల్లనూతులు మొదలైనవాని పేరు.

**నావ్యం త్రిలిఙ్గం నౌతార్యే -**

నావా తార్యం నావ్యం. అ. త్రి. ఓడచేత దాఁటఁదగినది. ఈ ౧ ఓడలచే దాఁటఁదగిన నద్యాదుల పేరు.

**స్త్రీయాం నౌ స్తరణి స్తరిః.** 10

నయతీతి నౌః ఔ. సీ. ణీఞ్ ప్రాపణే - పదార్థమును గట్టును

బొందించునది. నుద్యత ఇతివా నౌః. ణుద ప్రేరణే–ప్రేరేరింపఁబడునది. ౧. తరంత్యనయా నదీమితి తరణిః. ఇ.సీ. తరిశ్చ. ఇ–సీ. పా. తరీ. ఈ–సీ. 'తరీషు తత్ర్యమఫల్గుభాండ' మితి మాఘః. దీనిచేత తరింతురు గనుక తరణి, తరియు ఈ 3 ఓడలపేళ్లు.

**ఉడుపంతు ప్లవః కోలః -**

ఉడవః ఆపః తాభ్యః పాతీత్యుడుపం. పా రక్షణే. ఉడువు లనఁగా ఉదకములు; వానివలన రక్షించునది. ౧. ప్లవంత్యనేనేతి ప్లవః. ప్లవగతౌ - దీనిచేత దాఁటుదురు. ౨. కోలతి సంస్త్యాయతి కోలః. కుల సంస్త్యానే– తెలుచుండునది. ఈ 3 తెప్ప పేళ్లు.

**స్రోతో ఽ మ్బుసరణం స్వతః,**

స్వతః అంబుసరణం స్రోత ఇత్యుచ్యతే – తనంతట పాఱుచున్న ప్రవాహము స్రోతస్సనంబడును. స్వతః సరతీతి స్రోతః. స. న. సృగతౌ–తనంతటఁ బోవునది. ౧. తనంతటపాఱుదాని పేరు.

**ఆతర స్తరపణ్యం స్యాత్ -**

ఆతరంత్యనేనేతి ఆతరః. తౄప్లవనతరణయోః–దీనిచేత దాఁటుదురు. ౧. పణ్యం మూల్యం తరస్య తరణస్య పణ్యం తరపణ్యం–దాఁటుటకు మూల్యము తరపణ్యము. ఈ ౨ ఓడ నడుపువాని కిచ్చెడు కూలిపేళ్లు. కేవు.

**ద్రోణీ కాష్ఠామ్బువాహినీ.** 11

ద్రవత్యస్యాం జలమితి ద్రోణీ. ఈ.సీ. ద్రుగతౌ–దీనియందు జలము కాఱిపోవును. ౧. అంబు వహతీత్యంబువాహినీ; కాష్ఠకృతా అంబువాహినీ కాష్ఠాంబువాహినీ. ఈ. సీ. కాష్ఠముచేఁ జేయఁబడిన అంబువాహిని. ఈ ౨ దోనెపేళ్లు.

**సాంయాత్రికః పోతవణిక్ -**

సముదితానాం యాత్రా సంయాత్రా ద్వీపాంతరగమనం; సాప్రయోజనమస్య సాంయాత్రికః. సంయాత్ర యనఁగా ద్వీపాంతరగమనము; అది ప్రయోజనముగాఁ గలవాఁడు. ౧. పవతే వాతే ఽ నేనేతి పోతః యానం. తత్ప్రధానః వణి క్పోతవణిక్. జ. పు. పోతమనఁగా కలము; అది ప్రధానముగాఁ గల వర్తకుఁడు. ఈ ౨ ఓడబేరగాని పేళ్లు.

**కర్ణధారస్తు నావికః,**

'కర్ణః శ్రోత్రమరిత్రం" చేతి భట్టః. కర్ణమరిత్రం ధరతీతి కర్ణధారః. ధృ ధారణే–కర్ణమనఁగా నోడ నడిపెడు తెడ్డు; వానిని ధరించినవాఁడు. ౧. నావా తరతీతి నావికః–ఓడచేత దాఁటువాఁడు. ఈ ౨ ఓడనడిపెడివాని పేళ్లు.

**నియామకాః పోతవాహాః -**

నియచ్ఛంతి పోతం నియామకాః. అ. పు. యమ ఉపరమే–కలమును నియమించువారు. ఈ ౧ ఓడ కంబముమీఁదనుండి కలము నడిపెడువాని పేళ్లు.

**కూపకో గుణవృక్షకః.** 12

కాయతీతి కూపకః. కైశబ్దే. పతాకముచేత నించుకంత ధ్వనిగలిగినది. ౧. గుణేన రజ్జ్వా బద్ధో వృక్షః. గుణవృక్షకః–త్రాడుచేతఁ గట్టబడిన వృక్షము గుణవృక్షకము. ౨. ఓడమీఁద టెక్కము గట్టెడి స్తంభముపేళ్లు.

**నౌకాదణ్డః క్షేపణిస్స్యాత్ -**

నౌకాయాః ప్రేరణదండో నౌకాదండః – నావను త్రోయు కఱ్ఱ. ౧. క్షిప్యతే నౌ రనయేతి క్షేపణిః. ఇ. సీ. క్షిపప్రేరణే. దీనిచేత నోడ ప్రేరేపింపఁబడును. పా. క్షేపణీ. ఈ ౨ ఓడ నడపు గడ పేళ్లు.

**అరిత్రం కేనిపాతకః,**

ఋచ్ఛతి నౌర నేనేత్యరిత్రం. ఋ గతౌ. దీనిచేత నావ నడుచును. ౧. కే జలే నిపాత్యన్తే నావః అనేనేతి కేనిపాతకః. పత్ ౯గతౌ. జలమందు ఓడలు దీనిచేత నడపఁబడును. ఈ ౨ ఓడ నడుపు తెడ్డుపేళ్లు.

**అభ్రి స్త్రీ కాష్ఠకుద్దాలః -**

అభ్రయతి లవణాదిక మిత్యభ్రిః. ఇ. సీ. అభ్ర గతౌ – లవణాదికమును బొందించునది. ౧. కాష్ఠేన కృతః కుద్దాలః కుష్ఠకుద్దాలః–కఱ్ఱతోఁజేయఁబడిన గుద్దలి. ఈ ౨ లవణాదులు త్రవ్వునట్టి మ్రానిగుద్దలి పేళ్లు.

**సేకపాత్రం తు సేచనమ్.** 13

సేకః సేచన తస్య పాత్రం–నీల్లు చల్లుటకు పాత్రము. ౧. సిచ్యతే అనేన నౌకాజలమితి సేచనం. షిచిర్ క్షరణే – ఓడలో నీళ్లు దీనిచేతఁ జల్లఁబడును. ఈ ౨ ఓడలోఁ జొచ్చిన నీళ్లను వెళ్లఁజల్లెడి పాత్రముపేళ్లు.

**యానపాత్రంతు పోతః -**

యానాయ పాత్రం యానపాత్రం – గమనమునకు యోగ్యమైన పాత్రము. ౧. పూయతే కాలక్రమేణేతి పోతః పూయీ విశరణే–కాలక్రమమున ప్రక్కలైపోవునది. ఈ ౨ నడచునట్టి కల మను నోడ పేళ్లు.

**అబ్ధిభవే త్రిషు సముద్రియమ్,**

సముద్రే భవం సముద్రియం. అ. త్రి. సముద్రమునందుఁ బుట్టినది. సముద్రియా ఆపః; సముద్రియో ముక్తామణిః; సముద్రియం లవణం. అని మూఁడు లింగములయందును వర్తించును. ఈ ౧ సముద్రమునఁ బుట్టిన వస్తువుపేరు.

**క్లీబే ఒర్ధనావం నావో ఒర్ధే -**

అర్ధం నావః అర్ధనావం – నావలో సగము అర్ధనావము. ఈ ౧ ఓడలో సగముపేరు.

**అతీతనౌకే ఒతిను త్రిషు.** 14

నావ మతిక్రాంత మతిను. ఉ. త్రి. నావ నతిక్రమించునది. ఈ ౧ ఓడ నతిక్రమించిన వస్తువు పేరు.

**త్రిష్వాగాధాత్ -**

గాధ శబ్దమువఱకుఁ గల శబ్దములు 3 లింగములయందు వర్తించును.

**ప్రసన్నో ఒచ్ఛః -**

ప్రసీదతీతి ప్రసన్నః. షద్ ౹౩ విశరణగత్యవసాదనేషు – ప్రకృష్టముగా మనస్సును బొందునది. ౧. న ఛ్యతి దృష్టిమిత్యచ్ఛః. ఛో ఛేదనే–దృష్టిని బీడించునది. ఈ ౨ నిర్మలమైన వస్తువు పేళ్లు.

**కలుషో ఒనచ్ఛ ఆవిలః,**

కలతి మనః క్షిపతీతి కలుషః. కల కిల క్షేపే–మనస్సును బీడించునది. ౧. న అచ్ఛః అనచ్ఛః – అచ్ఛముగానిది. ౨. ఆ సమంతాద్బిల్యత ఇత్యావిలః. బిల భేదనే. వబయోరభేదః. అంతట భేదింపఁబడునది. ఈ 3 కలఁగినదానిపేళ్లు.

**నిమ్నం గభీరం గమ్భీరమ్ -**

ఖననాయ నితరాం మ్నాయతే అభ్యస్యత ఇతి నిమ్నం. మ్నా అభ్యాసే – త్రవ్వుటకు మిక్కిలి యభ్యసింపఁబడునది. ౧. గమనే భియం

రాతీతి గభీరం, గంభీరం చ. రా దానే- చొచ్చునపుడు మిక్కిలి భయము నిచ్చునది. ఈ ౩ లోఁతైనదాని పేళ్లు.

**ఉత్తానం తద్విపర్యయే.** 15

ఊర్ధ్వం తన్యతే ఉత్తానం. తను విస్తారే. ఊర్ధ్వమందు విస్తరింపఁజేయఁబడునది. ఈ ౧ లోఁతుకానిదాని పేరు.

**అగాధ మతలస్పర్శే -**

నాస్తిగాధః ప్రతిష్ఠా అస్య అగాధం. గాధృ ప్రతిష్ఠాలిప్సయోర్గ్రథే చ. ప్రతిష్ఠలేనిది అగాధము. ౧. నాస్తి తలస్పర్శః అధస్స్పర్శః అస్మిన్ అతలస్పర్శః - అడుగుముట్టుట లేనిది. ౨. మిక్కిలిలోఁతైనదాని పేళ్లు.

**కైవర్తే దాశధీవరౌ,**

కే జలే వర్తన్త ఇతి కేవర్తాః మత్స్యాదయః. తేషామయం హంతా కైవర్తః జలమునందు వర్తించునట్టివిగనుక కేవర్తములు అనఁగా మత్స్యాదులు; వాని జంపెడువాఁడు. కస్య జలస్య ఈః లక్ష్మీః తయావర్తః వర్తనం యస్యసః కైవర్తః జలలక్ష్మిచేత వర్తనముగలవాఁడు. ౧. విక్రేయణ మత్స్యాన్ దాశతి ద్యతి దాశ్నోతీతివా దాశః దాశృదానే; దో అవఖండనే; దాశహింసాయాం. విక్రయముచేత మత్స్యాదుల నిచ్చువాఁడుగాని ఖండించువాఁడుగాని పీడించువాఁడుగాని దాశుఁడు. పా. సాంతో ౭ప్యస్తి. "కైవర్త భృత్యయోర్దాస" ఇతి రుద్రః. ౨. ధత్తే మత్స్యాదీనితి ధీవరః. డు ధాఞ్ - ధారణ పోషణయోః - మత్స్యాదులను ధరించువాఁడు. ఈ ౩ చేఁపలఁ బట్టుజాలరివాని పేళ్లు.

**ఆనాయః పుంసి జాలం స్యాత్ -**

అనీయంతే మత్స్యా అనే నేత్యానాయః. ణీఞ్ ప్రాపణే-దీనిచేత మత్స్యములు అంతట లాగఁబడును. ౧. జాలవద్గవాక్ష వత్తిష్ఠతీతి జాలం- గవాక్షము వలెనుండునది. జలే క్షిప్యత ఇతి వా జాలం-జలమున వేయఁబడునది. ఈ ౨ వల పేళ్లు.

**శణసూత్రం పవిత్రకమ్,**

శణ ఆదానంతస్యసూత్రం శణ సూత్రం - మత్స్యాదుల నీడ్చెడు సూత్రము శణసూత్రము; ఇది సకారాదియుఁ గలదు. శణమయం సూత్రం

శణసూత్రం జనుముచేతఁ జేయఁబడిన సూత్రము. ౧. నిర్మత్స్యేన జలం పునాతీతి పవిత్రకం. పూఞ్ పవనే–మత్స్యములఁబోఁగొట్టి యుదకమును పవిత్రముగాఁ జేయునది. "శణసూత్రమయం రాజ్ఞోవైశ్యస్యావికసూత్రకం" అని మనువుచేఁ జెప్పఁబడినదిగనుక పవిత్రకము. ఈ ౨ వలత్రాటి పేళ్లు.

**మత్స్యధానీ కువేణీ స్యాత్ -**

మత్స్యాః ధీయంతే ఽత్ర మత్స్యధానీ. ఈ. సీ. డు ధాఞ్ ధారణపోషణయోః. మత్స్యములు దీనియందు వేయఁబడును. ౧. కుత్సితం వేణంతే మత్స్యా అస్యామితి కువేణీ. ఈ. సీ. వేణృగతౌ. మత్స్యములు దీనియందు కుత్సితముగా సంచరించును. ఈ ౨ చేపలబుట్ట పేళ్లు.

**బడిశం మత్స్యబన్ధనమ్.** 16

బలినః మత్స్యాన్ శ్యతీతి బడిశం. శో తనూకరణే. బలముగల మత్స్యములను కృశముగాఁ జేయునది. లడయోరభేదః. ౧. మత్స్యాః బధ్యంతే అనేన మత్స్య బంధనం. బన్ధ బంధనే. మత్స్యములు దీనిచే బంధింపఁబడును. పా. మత్స్యాః విధ్యంతే యేన తత్ మత్స్యవేధనం వ్యధతాడనే. మత్స్యములఁ బీడించునది. ఈ ౨ గాలము పేళ్లు.

**పృథురోమా ఝషో మత్స్యో మీనో వైసారిణో ఽణ్డజః,**
**విసార శ్శకులీ చ-**

ముఖదేశే పృథూని రోమాణ్యస్య పృథురోమా. న. పు. ముఖమునందు పొడుగు రోమములుగలది. మత్స్య సామాన్యమునకు పేరుగనుక నీపృథురోమ శబ్దము రోమములేని మత్స్యమునందును వర్తించును. ౧. ఝషతి హినస్తి బాలమత్స్యానితి ఝషః. ఝష హింసాయాం. పిల్ల చేఁపలను జంపి తినునది. ౨. మాద్యతి మాంసజిఘృక్షయా మత్స్యః. మదీ హర్షే. మాంసమును హరించు నిచ్ఛచేత హర్షించునది. ౩. మీయతే ధీవరేణమీనః. మీఙ్ హింసాయాం. జాలరివానిచేత హింసింపఁబడునది. మినోతి క్షిపతి జలమితి వా మీనః. డుమిఞ్ ప్రక్షేపణే. జలము చల్లునది. ౪. విసరతీతి విసారీ విసార్యేవ వైసారిణః. సృగతౌ. చరించునది గనుక విసారి. విసారియే వైసారణము. ౫. అండాత్ జాయత ఇత్యండజః. జనీప్రాదుర్భావే. గ్రుడ్డువలనఁ బుట్టునది. ౬. విచిత్రం సరతీతి విసారః. సృ గతౌ. విచిత్రముగాఁ జరించునది. ౭. మత్స్యానాం కవచప్రాయా

స్థూలా త్వక్ శకులః, తద్యోగాచ్ఛకులీ. న. పు. పా. శకలీ-మత్స్యములకు కవచప్రాయమై స్థూలమైఉండు చర్మము శకులము; అది గలిగినది శకులి. ఈ ౮ సామాన్యముగా మత్స్యముల పేళ్లు.

**అథ గడక శ్శకులార్భకః.** 17

గడతి సించతీతి గడకః. గడ సేచనే. నీళ్లు చల్లునది. ౧. శకులస్య అర్భకః శకులార్భకః-చేఁపపిల్ల శకులార్భకము. శకుల అర్భక ఇవ శకులార్భకః -పిల్లవంటి మీను శకులార్భకము. ౨. మీను పిల్లలపేళ్లు. జెల్లలపేళ్లని కొందఱు.

**సహస్రదంష్ట్రః పాఠీనః -**

సహస్రం దంష్ట్రాః అస్య సహస్రదంష్ట్రః - వేయికోఱలు గలిగినది. ౧. పాఠీం పృష్ఠ మున్నయతీతి పాఠీనః- పాఠీ అనఁగా వీఁపు; దాని నెత్తికొని యుండునది. భక్ష్యతయా శాస్త్రే పఠ్యత ఇతివా పాఠీనః. పఠవ్యక్తాయాం వాచి. శాస్త్రములయందు భక్ష్యముగాఁ బఠింపఁబడినది. ఈ ౨ వేయికోఱలు గల మీను పేళ్లు.

**ఉలూపీ శిశుకస్సమౌ,**

ఉత్ ఊర్ధ్వం లుంపతి భ్రమతీతి ఉలూపీ. లుప్ ఌ చేదనే. ఊర్ధ్వముగా భ్రమించునది. ౧. చాపల్యాచ్ఛిశురివ శిశుకః - చాపల్యమువలన శిశువువంటిది. ఈ ౨ శిశువువలె చపలమైన ఉలసమీనుపేళ్లు.

**నడమీన శ్చిలిచిమః -**

నడాఖ్యే తృణే మీనః నడమీనః-నడమను తృణవిశేషమునందు సంచరించు మీనము. ౧. చీయతే లీయతే చిలిచిమః. చిఞ్ చయనే. లీఙ్శ్లేషణే. అణఁగు చుండునది. ఈ ౨ క్రాలుగసువునఁ దిరుగు మీనుపేళ్లు.

**ప్రోష్ఠీ తు శఫరీ ద్వయోః.** 18

ప్రోష్ఠీ శఫరీ ద్వయం భక్షయితు రంతరుదర దాహక మత్స్యానామనీ-ప్రోష్ఠీ శఫరీశబ్దములు భక్షించినవానికి సైత్యముఁ జేసెడిపెనుపేళ్లు. ప్రోష్ఠతి పిత్తకృత్త్వాత్ప్రోష్ఠీ. ఈ. సీ. ప్రుషదాహే. పైత్యకారి యగుటవలన దహించునది. ప్రకృష్టః ఓష్ఠః అస్యా ఇతివా ప్రోష్ఠీ - పెద్దపెదవి గలిగినది. ౧. శఫాః గతిసాధనావయవాః రిణాతి పీడయ

తీతి శఫరీ. ఈ. ప్స. రి గతిశోషణయోః. శపములనఁగా గొరిసెలు, వానిని శీఘ్రగమనముచేతఁ బీడించునది. ౨. మత్స్యవిశేషము పేళ్లు.

**క్షుద్రాణ్డ మత్స్య సఙ్ఘాతః పోతాధానమ్ -**

అణ్డా దచిరనిర్గతా మత్స్యాః అణ్డమత్స్యాః, క్షుద్రాశ్చతే అణ్డ మత్స్యాశ్చ క్షుద్రాణ్డమత్స్యాః, తేషాం సఙ్ఘాతః = క్షుద్రాణ్డమత్స్య సంఘాతః – క్షుద్రములును, అండమువలన నప్పుడు నిర్గతంబులును నైన మత్స్యములయొక్క గుంపు క్షుద్రాణ్డమత్స్యసంఘాతము. ౧. పోతాః మత్స్యపోతాః ఆధీయంతే అస్మిన్నితి పోతాధానం. డు ధాఞ్ ధారణ పోషణయోః. మీను పిల్లలు దీనియందుండును. ఈ ౨ మీను పిల్లలగుంపు పేళ్లు.

**అథో ఝషాః,**

**రోహితో మద్గుర శ్శాలో రాజీవ శ్శకుల స్తిమిః.** 19

**తిమింగిలాదయశ్చ -**

రోహితత్వాత్ రోహితః–ఎఱ్ఱనై యుండునది. ౧. జలే మజ్జతీతి మద్గురః. టుమస్ మజ్జనే. జలమందు మునిఁగియుండునది. ౧. శలతిశీఘ్రం గచ్ఛతీతి శాలః. శల ఆశుగమనే. శీఘ్రముగాఁ బోవునది. అరుబుమీను. ౧. రాజిః పఙ్క్తిరస్త్యస్య రాజీవః – మత్స్యములవరుస గలిగినది. కొలువాసములనుమీను. ౧. శక్నోతి గంతుం శకులః. శ క్ల శక్తౌ. వేగిరముగాఁ బోవుటకు శక్తమయినది. బేడిసమీను. ౧. తిమ్యతీతి తిమిః. ఇ. పు. తిమి ష్టిమ ఆర్ద్రీభావే. ఆర్ధ్రమైయుండునది. నూఱుయోజనముల నిడుపుగల మీను. ౧. తిమింగిలతీతి తిమింగిలః. గౄ నిగరణే. తిమిని మ్రింగునది. ౧. ఆదిశబ్దముచేత తిమింగిల గిలాదులును గ్రహింపఁ బడుచున్నవి. తరుక్తం రామాయణే ___ 'తిమింగిలగిలో ఉ పృస్తి తద్గిలో ఉ పృస్తి రాఘవ' ఇతి. ఈ ౭ ను వేర్వేఱుగా నొక్కొక మత్స్య విశేషము పేళ్లు.

**అథ యాదాంసి జలజన్తవః,**

యాన్తీతి యాదాంసి. స. న. నిత్యబహువచనము. యా ప్రాపణే. చరించునవి. యతన్తే బాలమత్స్యా౯ హంతుమితివా యాదాంసి. యతీ ప్రయత్నే. బాలమత్స్యములను హింసించుట కొఱకు యత్నముచేయునవి. ౧. జలే జంతవః. జలజంతవః ఉ. పు. జలమందలి జంతువులు. ఈ ౨ జలజంతువుల పేళ్లు.

**తద్భేదా శ్శింశుమా రోద్ర శఙ్కవో మకరాదయః.** 20

శిశూ౯ మారయతీతి శింశుమారః. మృజ్ ప్రాణత్యాగే. శిశువులను జంపునది. పా. శిశుమార ఇత్యపి కేచిత్. మొసలి. ౧. ఉనక్త్యుద్రః. ఉందీ క్లేదనే. క్లేదపెట్టునది. నీరుపిల్లి. ౧. శంకతే అస్మాల్లోకః శంకుః. ఉ. పు. శకి శంకాయాం. దీనిచేత లోకము శంకించును, నీరుపంది. ౧. ప్రాణికబళనే ముఖం కిరతీతి మకరః. కౄ విక్షేపణే. ప్రాణులను కబళించునప్పుడు ముఖమును విదిలించునది. మాయాం కరోతీతి మకరః. డుకృఞ్ కరణే. మాయను జేయునది. చొరమీను. ౧. ఆదిశబ్దముచే జలహస్త్యాదులు గ్రహింపఁబడుచున్నవి. జలజంతువుల భేదములపేళ్లు.

**స్యా త్కుళీరః కర్కటకః -**

కౌ భూమౌ లీయత ఇతి కుళీరః – భూమియం దణఁగియుండునది. ౧. కృణోతి జననీం కర్కటః. కృఞ్ హింసాయాం. పుట్టినప్పుడు తల్లిని జంపునది. ఈ ౨ ఎండ్రకాయపేళ్లు.

**కూర్మే కమఠ కచ్ఛపౌ,**

కుత్సితః ఊర్మిర్వేగః అస్యకూర్మః – ఊర్మియనఁగా వేగము; కుత్సితమైన వేగము గలది. 'ఊర్మిః స్త్రీపుంస యోర్వీచ్యాం ప్రకాశే వేగభంగయో' రితి రభసః. కం జలం ఊర్వతీతివా కూర్మః. ఊర్వీ హింసాయాం. జలమును జెఱుచునది. ౧.కే ఉదకే మఠతీతి కమఠః. మఠ నివాసే. జలమునందు వసించునది. యజ్ఞార్థం కామ్యత ఇతివా కమఠః. కముకాంతౌ. యజ్ఞార్థమై కాంక్షింపఁబడునది. ౨. కచ్ఛేన పుచ్ఛేన పిబతీతి కచ్ఛపః. పా పానే. పుచ్ఛముచేత పానము చేయునది. కచ్ఛమనూపదేశం క్షుద్రజంతు భక్షణేన పాతీతి వా కచ్ఛపః–జలప్రాయ ప్రదేశమును క్షుద్ర జంతు భక్షణముచేత రక్షించునది. ఈ ౨ తాఁబేటి పేళ్లు.

**గ్రాహో ౭ వహారో -**

గృహ్ణాత్యేవ సముంచతీ ప్రాణీన ఇతి గ్రాహః. గ్రహ ఉపాదానే. ప్రాణులనుబట్టి విడువనిది. ౧. అవహరతీత్యవహారః. హృఞ్ హరణే. ప్రాణులను హరించునది. ఈ ౨ లతాకారముగాఁ జుట్టుకొని ప్రాణిహింసఁజేయు మత్స్యముపేళ్లు.

**నక్రస్తు కుమ్భీరః -**

నక్రామతీతి నక్రః. క్రము పాదవిక్షేపే. భూమియందు పాదవిక్షేపము చేయనిది. ౧. కుంభినో గజాన్ రాతీతి కుంభీరః. రా ఆదానే. గజములను గ్రహించునది. ఈ ౨ ఏనుఁగునుబట్టి యీడ్చుకొనిపోవు జలజంతువు పేళ్లు.

**అథ మహీలతా.** 21

**గణ్డూపదః కించులకో -**

మహ్యాం లతేవ తిష్ఠతీతి మహీలతా – భూమియందు లతవలె నుండునది. ౧. గండవః శరీర గ్రంథయః తఏవ పాదాః అస్య గండూపదః – గండు లనఁగా శరీరమున నున్న బుడుపులు; అవి పాదములుగాఁగలది. ౨. కించిచ్చలతీతి కించులకః–ఇంచుకంత చలించునది. ఈ ౨ ఎఱ్ఱపేళ్లు.

**నిహాకా గోధికా సమే,**

నిజహాతి స్థలమితి నిహాకా. ఓహక్ త్యాగే. భూమిని విడచి నీళ్ల యందుండునది. ౧. గుధతీతి గోధికా. గుధ పరివేష్టనే. చుట్టుకొని యండునది. ఈ ౨ నీరుడుము పేళ్లు.

**రక్తపాతు జలూకాయాం స్త్రియాం భూమ్ని జలౌకసః.** 22

రక్తం పిబతీతి రక్తపా. పా పానే. రక్తమును బానముచేయునది. ౧. జల మోకః స్థానం యస్యాస్సా జలూకా; జలౌకసశ్చ. స. సీ. జలమే స్థానముగాఁ గలిగినది గనుక జలూకము; జలౌకస్సును. జలౌకశ్శబ్దము సకారాంత స్త్రీలింగ నిత్యబహువచనము. ఈ ౩ జలగపేళ్లు.

**ముక్తాస్ఫోట స్త్రి యాం శుక్తిః -**

ముక్తాః స్ఫుటంత్యస్మాదితి ముక్తాస్ఫోటః. స్ఫుట వికసనే. ముత్యములు దీనివలన వికసించును. ౧. శోకంత్యత్రేతి శుక్తిః. ఇ–సీ. శుకగతౌ. ముత్యములను బుట్టించునది. ఈ ౨ ముత్యపుచిప్పపేళ్లు.

**శ జస్స్యా త్కమ్బు రస్త్రియౌ,**

శామ్యత్య శుభమనేనేతి శంఖః – అశుభములు దీనిచేత శమించును. శం సుఖం ఖవతి జనయతీతి శంఖః. ఖను అవదారణే. సుఖమును బుట్టించునది. ౧. కామ్యతే శుభార్థిభిరితికంబుః. ఉ–ప్న. కము కాంతౌ. శుభార్థులైనవారిచేత కాంక్షింపఁబడునది. ఈ ౨ శంఖముపేళ్లు.

**క్షుద్రశఙ్ఖా శ్శఙ్ఖనఖాః -**

క్షుద్రాశ్చ తే శంఖాశ్చ క్షుద్రశంఖాః. అ.పు. క్షుద్రములైన

శంఖములు. ౧. శంఖాః నఖా ఇవ శంఖనఖాః – నఖములవంటి శంఖములు. ఈ ౨ గుల్లలపేళ్లు.

**శమ్బూకా జలశుక్తయః.** 23

శామ్యతి దుఃఖం శంబూకాః. ప్స. దుఃఖమును శమింపఁజేయునది. 'శ్లో శంబూక పిణ్యాక మధూకభేకా' ఇత్యమరమాలాయాం. 'శంబూకాభిస్సహ పరిచయా న్నీయతే పామరీభి'రితి కాళిదాసః. ౧. జలమాత్రాశ్శుక్తయః జలశుక్తయః –జలసామ్యానమునం దెల్లఁ బట్టునవి. ఈ ౨ కప్పుచిప్పలపేళ్లు.

**భేకే మణ్డూక వర్షాభూ శాలూర ప్లవ దర్దురాః,**

బిభేతి సర్పాద్భేకః. ఞిభీ భయే. సర్పమువలన భయపడునది. ౧. మండతే శోభతే తటాకాదౌ మండూకః. మడి భూషాయాం. తటాకాదులయం దొప్పునది. ౨. వర్షాసు భవతీతి వర్షాభూః. ఊ – పు. భూ. సత్తాయాం. వర్షాకాలమునఁ బుట్టునది. ౩. శలతి ఉత్ప్లుత్య గచ్ఛతీతి శాలువః. శలగతౌ. గంతులువేయుచు చరించునది. పా. సాదిరప్యస్తి. 'పరిసరకృకలాసస్వేదసాలూరసర్పాః' ఇతి ప్రయోగాత్. ౪. ప్లవతే ప్లవః. ప్లుఙ్గతౌ. గంతులు వేయుచుఁ బోవునది. ౫. శబ్దేన కర్ణే దృణాతీతి దర్దురః. దౄ విదారణే. శబ్దముచేత చెవులను వ్రక్కలించునది. ఈ ౬ కప్పపేళ్లు.

**శిలీ గణ్డూపదీ -**

శిలతీతి శిలీ. ఈ. సీ. శిల గతౌ. పోవునది. శిలతి మృదమితి శిలీ. శిల ఉంఛే. మృత్తును భక్షించునది. ౧. గండూపదస్యస్త్రీ గండూపదీ. ఈ.సీ. గండూ పదము యొక్క స్త్రీ గండూపది. ఈ ౨ ఆఁడుఎఱ్ఱపేళ్లు.

**భేకీ వర్షాభ్వీ -**

భేకస్య స్త్రీ భేకీ – భేకముయొక్క స్త్రీ భేకీ. ౧. వర్షాభ్వాః స్త్రీ వర్షాభ్వీ. ఈ. సీ. వర్షాభువుయొక్క స్త్రీ వర్షాభ్వి. ఈ ౨ ఆఁడుకప్పపేళ్లు.

**కమఠీ ఢులిః.** 24

కమఠస్య స్త్రీ కమఠీ – కమఠముయొక్క స్త్రీ కమఠి. ౧. ఢులతీతి ఢులిః. పా. డులిః. ఇ. సీ. ఢుల ఉత్క్షేపే. జలమును జల్లునది. ఈ ౨ ఆఁడుతాఁబేటి పేళ్లు.

**మద్గురస్యప్రియా శృఙ్గీ –**

మద్గురస్య జలాంతర్మకరస్య ప్రియా శృంగీత్యుచ్యతే – శృంగీ శబ్దము మద్గురమను మీనుయొక్క పెంటిపేరు. శృణాతీతి శృంగీ. ఈ. సీ. శౄ హింసాయాం. హింసించునది. ౧. ఆఁడుమద్గురము పేరు.

**దుర్నామా దీర్ఘకోశికా,**

దుష్టం నామ నమన మస్యా దుర్నామా. ఆ. సీ. ణము ప్రహ్వత్వే శబ్దేచ. దుష్టమైన నమనము గలిగినది. దుర్నిందితం నామ అస్యా ఇతి దుర్నామా. న. సీ. దుష్టమైన నామము గలది. ౧. దీర్ఘకోశాత క్యాకారత్వాత్ దీర్ఘకోశికా–నిడుపు బీరకాయవంటి దేహముగలది. ఈ ౨ ఏనుఁగు జలగపేళ్లు.

**జలాశయో జలాధారః -**

జలమాశేతే ఽ త్ర జలాశయః. శీఙ్ ఽ స్వప్నే. జలము దీనియందుండును. ౧. జలస్య ఆధారః జలాధారః జలమునకు స్థానము. ఈ ౨ నీరుండెడు తావుపేళ్లు.

**తత్రాగాధజలే హ్రదః.** 25

హ్రాదతే కల్లోలైర్హ్రదః. హ్రాద అవ్యక్తే శబ్దే. కల్లోలములచే నవ్యక్తముగా మ్రోయునది. ఈ ౧ అగాధ జలాశయము పేరు.

**ఆహావస్తు విపానం స్యా దుపకూపజలాశయే,**

ఆహూయంతే పశవో ఽ త్రే త్యాహావః. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దేచ. దీని యందు పశువులు పిలువఁబడును. ౧. నియతం పిబంతి జలం పశవో ఽ త్ర నిపానం. పా పానే. నియతముగాఁ బశువులు దీనియందు పానము చేయును. ఈ ౨ పశ్వాదులు నీరు ద్రావుటకై నూతియొద్దున నుంచఁబడిన ఱాతితొట్టి మొదలగువాని పేళ్లు.

**పుం స్యేవాన్ధః ప్రహిః కూప ఉదపానంతు పుంసివా.** 26

జనాః అనేన అనంతీ త్యంధుః. ఉ. పు. అన ప్రాణనే. జనులు దీనిచేత బ్రతుకుదురు. ౧. ప్రకృష్టం హ్రియతే జలమస్మాదితి ప్రహిః. ఇ. పు. హృఞ్ హరణే. ప్రకృష్టముగా జలము దీనివలన గ్రహింపఁబడును. జలం ప్రజహాతివా ప్రహిః. ఓహాక్ త్యాగే. మిక్కిలి జలము నిచ్చునది. ౨. కుత్సితాః కోర్వా ఆపః అస్మిన్నితి కూపః – కుత్సితములైన యుదకములుగాని భూమి సంబంధములైన యుదకములుగాని దీని యందుఁ గలవు.

౩. ఉదకం పీయతే అస్మాదుదపానం. అ. ప్న. ఉదకము దీనివలనఁ బానముచేయఁబడును. ఈ ౪ నూతిపేళ్లు.

**నేమి స్త్రికాస్య -**

నీయతే జల మనేనేతి నేమిః. ఇ. సీ. ణీఙ్ ప్రాపణే. దీనిచేత జలము పొందింపఁబడును. ౧. త్రయః అవయవాః అస్య త్రికా–మూఁడవయవములు గలిగినది. త్రికాశబ్ద సాహచర్యమువలన నేమిశబ్దము స్త్రీలింగము. ఈ ౨ నూఁతియందు నీళ్లెత్తుటకు సమీపమున నుంచిన రాట్నము ఏతము మొదలైన దారుయంత్రము పేళ్లు.

**పీనాహో ముఖబన్ధన మస్య యత్,**

పినహ్యతే ఇష్టకాభిరితి పీనాహః. ణహ బంధనే. ఇటికెలు మొదలైనవానిచేతఁ గట్టఁబడినది. ఈ ౧ హంసపాది మొదలగు నూతి వాయికట్టు పేరు.

**పుష్కరిణ్యాం తు ఖాతం స్యాత్ -**

పుష్కరం జలం తద్యోగాత్పుష్కరిణీ. ఈ. సీ. పుష్కరమనఁగా జలము; అది గలిగినది. ౧. ఖన్యత ఇతి ఖాతం. ఖను అవదారణే. త్రవ్వఁబడునది. ఈ ౨ నలుచదరముగాఁ ద్రవ్వఁబడిన బావిపేళ్లు.

**అఖాతం దేవఖాతకమ్.** 27

న ఖన్యత ఇత్యఖాతం – మనుష్యులచేఁ ద్రవ్వఁబడనిది. ౧. దేవైః ఖన్యత ఇతి దేవఖాతం – దేవతలచేఁ ద్రవ్వఁబడినది. ఈ ౨ దేవతలచేతఁ ద్రవ్వఁ బడిన పుణ్యతీర్థముల పేళ్లు.

**పద్మాకర స్తటాకో <u>ఽ</u> స్త్రీ -**

పద్మానాం ఆకరః పద్మాకరః పద్మములకు ఉనికిపట్టు. తటాన్యకతీతి తటాకః. అ. ప్న. అక అగ కుటిలాయాం గతౌ. గట్టును కుటిలముగాఁ బొందియుండునది. పా. తడతీతి తడాగః. తడ ఆఘాతే. గట్టును గొట్టునది. ఈ ౨ తామరలుగల చెఱువు పేళ్లు.

**కాసార స్సరసీ సరః,**

కాసత ఇతి కాసారః. కాసృ శబ్దే. మ్రోయునది. కం జలం ఆసరత్యత్ర కాసారః. సృ గతౌ. జలము దీనియందుఁ బొందును. ౧. సరతి ప్రవహతీతి సరః. స. న. సరసి చ. ఈ. సీ. సృ గతౌ. ప్రవహించునది

సరస్సు, సరసియును. ఈ ౩ కొలని పేళ్లు. పద్మాకరాదులు ౫ ను ఏకార్థములని కొందఱు.

**వేశన్తః పల్వలం చాల్పసరః -**

విశంతి మహిషాదయః అత్ర వేశంతః. విశ ప్రవేశనే. మహిషాదులు దీనియందుఁ బ్రవేశించును. ౧. పలంతి మహిషాదయో ఽత్ర పల్వలం. పల గతౌ. మహిషాదులు దీనియందు చలించును. ౨. అల్పం చ తత్ సరశ్చ అల్పసరః. స. న. అల్పమైన సరస్సు. ఈ ౩ పచ్చికపడియల పేళ్లు.

**వాపీ తు దీర్ఘికా.** 28

ఉప్యన్తే పద్మాదయః అత్ర వాపీ. ఈ. సీ. టు వప్ బీజసన్తానే. పద్మాదులు దీనియందు మొలవఁబెట్టఁబడును. వారి పీయతే ఽత్ర వాపీ. పా పానే. దీనియందు జలము పానము చేయఁబడును. ౧. దీర్ఘైవ దీర్ఘికా – దీర్ఘమైనది. ఈ ౨ నడబావి పేళ్లు.

**ఖేయం తు పరిఖా -**

ఖన్యత ఇతి ఖేయం. ఖను అవదారణే. త్రవ్వఁబడునది. ౧. పరితః ఖన్యత ఇతి పరిఖా–అంతటఁ ద్రవ్వఁబడునది. ఈ ౨ అగడ్తపేళ్లు.

**ఆధార స్త్వమ్భసాం యత్రధారణమ్,**

ఆధ్రియతే జలమత్ర ఆధారః. ధృ ధారణే. జలము దీనియందు ధరింపఁ బడును. ఈ ౧ కట్టగట్టి నీల్లు నిలిపియున్న మడుఁగుపేరు.

**స్యా దాలవాల మావాల మావాపః -**

ఆలూయతే ఖన్యత ఇత్యాలవాలం. లూఞ్ ఛేదనే. త్రవ్వఁబడునది. ౧. ఆవలతె జలమత్రే త్యావాలం. వల సంచలనే. ఉదకము దీనియందుఁ గొంచెము కదలుచుండును. ౨. ఆసమంతాదుప్యతే న్యస్యతే జలమత్ర ఆవాపః. టు వప్ బీజసంతానే. దీనియందు నీళ్లు అంతట నిలుపఁబడును. ఈ ౩ చెట్టుపాది పేళ్లు.

**అథ నదీ సరిత్.** 29

తరఙ్గిణీ శైవలినీ తటినీ హ్రాదినీ ధునీ,
స్రోతస్వినీ ద్వీపవతీ స్రవన్తీ నిమ్నగాపగా. 30
(కూలంకకషా నిర్ఘరిణీ రోధోవక్రా సరస్వతీ)

నదతీతి నదీ. ఈ. సీ. ణద అవ్యక్తేశబ్దే. మ్రోయునది. ౧. సరతీతి

సరిత్. త. సీ. సృగతౌ. ప్రవహించునది. ౨. తరంగాః అస్యాం సంతీతి తరంగిణీ – అలలు గలిగినది. ౩. శైవలమస్యా అస్తీతి శైవలినీ–నాచు గలిగినది. ౪. తటమస్యా అస్తీతి తటినీ–దరులు గలిగినది. ౫. హ్రాదః అవ్యక్త శబ్దః అస్యామస్తీతి హ్రాదినీ–అవ్యక్తశబ్దము గలిగినది. ౬. ధునోతి వాతేన ధునీ. ధూఞ్ కంపనే. వాయువుచేతఁ గంపించునది. ౭. స్రోతః అస్యా అస్తీతి స్రోతస్వినీ – తనంతటఁ బ్రవహించునది. ౮. ద్వీపాః అస్యాం సంతీతి ద్వీపవతీ – ద్వీపములు గలిగినది. ౯. గిరిభ్యః స్రవతీతి స్రవంతీ. స్రు స్రవణే. పర్వతమువలన స్రవించునది. ౧౦. తరంగిణ్యాది శబ్దములు. ఈ. సీ. నిమ్నం గచ్ఛతీతి నిమ్నగా. గమ్లౄగతౌ. పల్లమును గూర్చి పోవునది. ౧౧. అపాం సమూహః ఆపం, తేన గచ్ఛతీ త్యాపగా ఉదకసమూహము ఆపము; దానిచేతఁ బోవునది. ఈ ౧౨ నదులపేళ్లు.

**గఙ్గా విష్ణుపదీ జహ్నుతనయా సురనిమ్నగా,**
**భాగీరథీ త్రిపథగా త్రిస్రోతా భీష్మసూరపి.** 31

హరిచరణాత్ గాం భూమింగతా గంగా. గమ్లౄగతౌ. హరిపాదము వలన భూమిని బొందినది; హరోత్తమాంగాద్భూమిం గతా గంగా–హర శిరస్సువలన భూమిని బొందినది. ౧. విష్ణుపదోద్భవా విష్ణుపదీ. ఈ. సీ. విష్ణుపాదమునఁ బుట్టినది. ౨. జహ్నోస్తనయా జాహ్నవీ – జహ్ను మహామునియొక్క చెవియందుఁ బుట్టినది. ౩. సురాణాం నిమ్నగా సురనిమ్నగా సురలయొక్క నది. ౪. భగీరథేన రాజ్ఞా భూలోకమవతారితేతి భాగిరథీ. ఈ. సీ. భగీరథుఁడను రాజుచేత భూలోకమునకుఁ దేఁబడినది. ౫. స్వర్గమర్త్యపాతాళ మార్గేషు త్రిషు గచ్ఛతీతి త్రిపథగా. గ ౙగతౌ. స్వర్గమర్త్య పాతాళమార్గములయందు మూఁటియందును బోవునది. ౬. త్రీణిస్రోతాంసి యస్యాస్సా త్రిస్రోతాః. స. సీ. మూఁడు ప్రవాహములు గలది. ౭. భీష్మం సూత ఇతి భీష్మసూ. ఊ. సీ. షూఙ్ ప్రాణిప్రసవే. భీష్మునిఁ గన్నది. ఈ ౮ గంగానది పేళ్లు.

**కాళిన్దీ సూర్యతనయా యమునా శమనస్వసా,**

కళిందపర్వతాజ్జాతా కాళిందీ. ఈ. సీ. కళింద పర్వతమువలనఁ బుట్టినది. ౧. సూర్యస్య తనయా సూర్యతనయా – సూర్యుని కూఁతురు. ౨. యమేన సహ జాతా యమునా – యమునితోఁ గూడఁ బుట్టినది.

౩. శమనస్య యమస్య స్వసా శమనస్వసా. ఋ. సీ. యమునిచెల్లెలు. ఈ ౪ యమునానది పేళ్లు.

**రేవా తు నర్మదా సోమోద్భవా మేఖలకన్యకా.** 32

రేవతే రేవా. రేవృ ప్లవగతౌ. దాఁటులతోఁ బోవునది. ౧. నర్మ కేళిం దదాతీతి నర్మదా. డుదాఞ్ దానే. నర్మమనఁగా క్రీడ, దానినిచ్చునది. ౨. సోమవంశజేన పురూరవసా భువం ప్రత్యవతారితా సోమోద్భవా – సోమవంశమునఁ బుట్టిన పురూరవుఁ డనురాజుచేత భూమికిఁ దేఁబడినది. ౩. మేకలపర్వతప్రభవత్వా న్మేఖలకన్యకా – మేకల పర్వతమునఁ బుట్టుటవలన మేఖలకన్యక. ఈ ౪ నర్మదానది పేళ్లు.

**కరతో యా సదా నీరా -**

ఈశ్వరకరతో యాజ్జాతా కరతోయా – ఈశ్వరుని హస్తమువలనఁ బుట్టినది. ౧. సదా నీరమస్యామితి సదానీరా – ఎల్లప్పుడు జలము దీని యందుఁగలదు. ఈ ౨ గౌరీ వివాహ కాలమున దారపోయునపు డీశ్వరుని హస్తమువలనఁ బుట్టిన నది పేళ్లు.

**బాహుదా సైతవాహినీ,**

లిఖితనామ్నః ఋషేః ఛిన్న బాహోః బాహుదానాత్ బాహుదా – లిఖితుఁ డను ఋషి శంఖుఁ డను ఋషియాశ్రమమునందు అతఁడు లేనపుడు ఫలములను భక్షించిన యపరాధముకొఱకు అతని యాజ్ఞ వలన ప్రద్యుమ్నుఁ డనురాజుచేతఁ జేతులఁ గోయించుకొని తనయందు స్నానము సేయఁగా, నాలిఖితఋషికి బాహువుల నిచ్చినది గనుక బాహుద. బహుదేన కార్తవీర్యార్జునేన అవతారితా బాహుదా–బహుప్రదుఁడైన కార్తవీర్యార్జునిచే భూమికిఁ దేఁబడినది. ౧. సితమంబు వహతీతి సితవాహినీ; సితవాహిన్యేవ సైతవాహినీ. ఈ. సీ. తెల్లని జలమును వహించునది సైతవాహిని. ఈ ౨ బాహుదానది పేళ్లు.

**శతద్రుస్తు శితద్రు స్స్యాత్ -**

పుత్రశోకార్తం కణ్ఠే శిలాం బధ్వా ప్రవిష్టం వసిష్ఠం దృష్ట్వా శతధా ద్రుతాశతద్రుః. ఉ. సీ. పుత్రశోక దుఃఖితుఁడై కంఠంబున ఱాయి గట్టుకొని తనయందు దుమికిన వసిష్ఠునిఁ జూచి నూఱు పాయలుగాఁ బ్రవహించినది. ౧. శితం తీక్ష్ణం ద్రుతా శితద్రుః. ద్రుగతౌ. తీవ్ర

ముగాఁ బ్రవహించునది. ఈ ౨ వసిష్ఠునికి వెఱచి నూఱుపాయలై ప్రవహించిన నదిపేళ్లు.

**విపాశాతు విపాట్ స్త్రియామ్.** 33

పుత్రశోకాత్పాశైర్బద్ధ్వా ప్రవిష్టం వసిష్ఠం పాశాద్విమోచితవతీ విపాశా. విపాట్ చ. శ. సీ. పుత్రశోకమువలనఁ బాశబద్ధుఁడై తన యందుఁ బ్రవేశించిన వసిష్ఠుని పాశములవలన విడిపించినది. ఈ ౨ విపాశానది పేళ్లు.

**శోణో హిరణ్యవాహ స్స్యాత్ -**

శోణతీతి శోణః. శోణృ వర్ణగత్యోః. ప్రవహించునది. శోణవర్ణత్వాద్వా శోణః –ఎఱ్ఱనికాంతిగలది. ౧ హిరణ్యం వహతీతి హిరణ్యవాహః. వహ ప్రాపణే. హిరణ్యమును వహించునది. ఈ ౨ శోణ నదము పేళ్లు.

**కుల్యాల్పా కృత్రిమా సరిత్,**

కోలతి సంస్త్యాయతీతి కుల్యా. కుల సంస్త్యానే. వ్యాపించునది. ౧ మనుష్యులచేతఁ ద్రవ్వఁబడిన చిన్న కాలువ పేరు.

**శరావతీ వేత్రవతీ చన్ద్రభాగా సరస్వతీ.** 34

(గోదావరీ భీమరథీ కృష్ణా వేణీ చ గౌతమీ.)

**కావేరీ -**

శరాఖ్యః తృణవిశేషః అస్యామతి శరావతీ. ఈ. సీ. శరమనఁగా ఱెల్లు; అది గలిగినది. ౧. వేత్రయోగా ద్వేత్రవతీ. ఈ. సీ. ప్రేఁపతీఁగెలుగలది. ౧. చంద్రభాగాభ్యాం శైలాభ్యాం ప్రభవతి చంద్రభాగా చంద్రభాగములనెడు పర్వతములవలనఁ బుట్టినది. చంద్రస్య భాగతోన్యస్తా చంద్రభాగా – చంద్రునియొక్క భాగమునఁ బుట్టినదని కొందఱు. పా. చాంద్రభాగా. ౨. సరాంసి అస్యాం సన్తీతి సరస్వతీ. ఈ. సీ. సరస్సులు దీనియందుఁ గలవు. ౩. కవేరపర్వతాత్ప్రభవతీతి కావేరీ. ఈ. సీ. కవేరమనెడు పర్వతమునఁ బుట్టినది. కవేరస్య రాజ్ఞో௨పత్యం స్త్రీ కావేరీ – కవేరుఁ డనురాజు కూఁతురు. ఈ ౫ ను వేర్వేఱు నదులపేళ్లు.

**సరితో௨న్యాశ్చ -**

అన్యాశ్చ–ఇతరములైన కృష్ణ, వేణి, గోదావరి, సరయువు మొదలైనవియు సరిత్తు లనంబడును.

**సంభేద స్సిన్ధు సంగమః,**

సంభిద్యన్తే సంగచ్ఛన్తే నద్యో ఉత్ర పరస్పరమితి సంభేదః. భిదిర్ విదారణే. నదులు పరస్పరము దీనియందు సంగతములౌను. ఈ ౧ నదులతో నదులుగాని, నదులు సముద్రముతోఁ గాని కూడుట పేరు.

**ద్వయోః ప్రణాళీ పయసః పదవ్యామ్ -**

ప్రణల త్యంభో ఉనయా ప్రణాళీ. ఈ.ప్స. ణలగతౌ. దీనిచేత జలము పోవును. ప్రణల్యతే బధ్యత ఇతి ప్రణాళీ. ణల బంధనే. పాషాణాదుల చేతఁ గట్టఁ బడునది. గోముఖసూత్రము మొదలైన జలమార్గము పేరు.

**త్రిషు తూత్తరౌ.** 35

ఉత్తరౌ = ఈముందు చెప్పఁబడు దావి కసారవశబ్దములు, త్రిషు = మూఁడు లింగములయందును వర్తించును.

**దేవికాయాం సరయ్వాం చ భవే దావిక సారవౌ,**

దేవికాయాం భవో దావికః దేవికానదియందుఁ బుట్టినది. ౧. సరయ్వాం భవస్సారవః – సరయూనదియందుఁ బుట్టినది. ౨. వరుసగా దేవికానదియందును సరయూనదియందును బుట్టిన వస్తువులపేళ్లు.

**సౌగన్ధికం తు కహ్లారం -**

సుగంధః ప్రయోజన మస్య సౌగంధికం – సుగంధము ప్రయోజనముగాఁ గలిగినది. ౧. కే జలే హ్లాదతే కహ్లారం – జలమందు సంతోషించునది. ఈ ౨ ఇంచుక యెఱుపును మిక్కిలి పరిమళమును గలిగియుండు కలువ పేళ్లు.

**హల్లకం రక్త సన్ధ్యకమ్.** 36

హ్లాదయతీతి హల్లకం. హ్లాదీ సుఖే చ. సంతోషమును జేయునది. హల్లతి భ్రమరో వా అత్ర హల్లకం. హల్లభ్రమణే. దీనియందు తుమ్మెద తిరుగును. ౧. సంధ్యావద్రక్తం రక్తసంధ్యకమ్ – సంధ్యవలె రక్తవర్ణమైనది రక్తసంధ్యకము. ఇవార్థమునందు కప్రత్యయము. ఈ ౨ చెంగలువపేళ్లు.

**స్యా దుత్పలం కువలయం -**

ఉత్ ఊర్ధ్వం పలతి గచ్ఛతీ త్యుత్పలః. పల గతౌ. ఊర్ధ్వమును బొందునది. ౧. కౌ వలత ఇతి కువలయం. వల సంవరణే. భూమియందుఁ జుట్టుకొని యుండునది. కుత్సితో బహిర్వలయః పత్రసంవేష్టనమత్రే

తివా కువలయం – కుత్సితమైన పత్రవలయము గలిగినది. ౨. ఉత్పలకువలయ శబ్దములు సామాన్యముగా నుత్పలవాచకములైనను విశేషములైన నీలోత్పలాదులయందును వర్తించును. కువలయమిందీవరం చ నీలాబ్జం" అని అమరమాలయందును, "కువలయదళశ్యామో ఽ ప్యంగందధత్పరి ధూసరం" అని మాలతీమాధవీ యమందును నీలోత్పలవాచకముగాఁ బ్రయోగింపఁబడియున్నది. ఉత్పలశబ్దము పద్మకుముదముల రెంటియందును వర్తించును. 'అరవిందం మహోత్పలం' అని పద్మవాచకముగా ముందు చెప్పఁబడుచున్నది. కేవలమైన ఉత్పలశబ్దము ఇందీవరాదులఁ జెప్పినట్లు పద్మమును జెప్పదు. అది యెట్టనిన ___ ధాన్యశబ్దము సామాన్యముగా సకల ధాన్యవాచకమైనను కేవల ధాన్యశబ్దము కలమాదులం జెప్పినట్లు ముద్గాదులం జెప్పదు. ఈ ౨ సామాన్యముగాఁ గలువపేళ్లు.

**అథ నీలామ్బుజన్మ చ,**

**ఇన్దీవరం చ నీలే** ఽ **స్మిన్** –

అంబుని జన్మ అస్యేత్యంబుజన్మ; నీలం చ తత్ అంబజన్మ. న. న. నీటియందు జన్మము గలిగినది అంబుజన్మము; నీలమైన అంబుజన్మము నీలాంబుజన్మము. ౧. ఇన్దతీతి ఇన్దీ ర్లక్ష్మీః, తయా వ్రియత ఇతి ఇన్దీ వరం. వృఞ్ వరణే. ఐశ్వర్యయుక్తురాలు గనుక ఇంది యనఁగా లక్ష్మి; ఆమెచేత వరింపఁ బడినది. ఇంద్రియాణి వృణోతీతి వా ఇందీవరం. వృఞ్ వరణే. ఇంద్రియములను సంతోషముచేతఁ గప్పునది. ఈ ౨ నల్లకలువపేళ్లు.

**సితే కుముదకైరవే.** 37

కౌమోదత ఇతి కుముదం. ముద హర్షే. భూమియందు మోదించునది. ౧. కే రౌతీతి కేరవః హంసః; తస్యేదం ప్రియమితి కైరవం – జలమందుఁ బలుకునది గనుక కేరవమనఁగా హంస; దానికిఁ బ్రియమైనది. ఈ ౨ తెల్లకలువపేళ్లు.

**శాలూక మేషాం కన్ద స్స్యాత్ -**

శలతే శాలూకం. శల సంవరణే. చుట్టుకొనియుండునది. ఈ ౧ కలువ మొదలైనవాని దుంపపేరు.

**వారిపర్ణీతు కుమ్భి కా,**

వారిణి పర్ణయోగాత్ వారిపర్ణీ. ఈ. సీ జలమందు పర్ణములు

గలిగినది. ౧. కేన జలేన ఉభ్యత ఇతి కుంభికా. ఉభ పూరణే. జలము చేతఁ బూర్ణమగునది. ఈ ౨ నాఁచుపేళ్లు.

**జలనీలీ తు శైవాలం శైవలః -**

జలే నీలీవభాతీతి జలనీలీ–జలమందు నీలివలె నుండునది. ౧. జలే శేతేశైవాలం శైవలం చ. శీఙ్ స్వప్నే. జలమం దుండునది. పా. శేవలమనియుఁ బాఠము గలదు. 'అఘటయ న్మదనస్య సరోగృహేశర దసావభిషేక మహోత్సవం, రుచిరరూప్యసితైరివ సారసైస్సకలశే కలశే వలమానకే" ఈ ౨ పాఁచిపేళ్లు.

**అథ కుముద్వతీ.** 38

**కుముదిన్యామ్ -**

కుముదాన్యస్యాస్సంతీతి కుముద్వతీ. ఈ. సీ. కుముదినీ చ. ఈ. సీ. కుముదములు గలది. ఈ ౨. కుముదములు గల దేశమునకైనను సరస్సునకైనను బేళ్లు.

**నళిన్యాం తు బిసినీ పద్మినీ ముఖాః,**

నళం పద్మమస్యామ స్తీతి నళినీ. ఈ. సీ. నళమనఁగాఁ బద్మము; అదిగలిగినది. 'నళమబ్జే నళో నళ' ఇతి రుద్రః. ౩. బిసమస్యామస్తీతి బిసినీ. ఈ. సీ. తామరతూండ్లు గలిగినది. ౩. ముఖ మన్నందున కమలి న్యబ్జినీ సరోజిన్యాది శబ్దములు గ్రహింపఁబడుచున్నవి. పద్మములు గల దేశమునకుఁగాని పద్మ సమూహమునకుఁగాని తామరతీఁగెకుగాని పేళ్లు.

**వా పుంసి పద్మం నళిన మరవిన్దం మహోత్పలమ్.** 39
**సహస్రపత్రం రమలం శతపత్రం కుశేశయమ్,**
**పఙ్కేరుహం తామరసం సారసం సరసీరుహమ్.** 40
**బిసప్రసూన రాజీవ పుష్క రామ్భోరుహాణి చ,**

పద్యతే ఽ త్ర లక్ష్మీరితి పద్మం. అ. ప్న. పద్ల గతౌ. దీనియందు లక్ష్మి పొందును. ఇది వికల్పమునఁ బుంలింగంబును గలదు. ౧. నల్యతే బధ్యతే చంద్రేణేతి నలినం. చంద్రునిచేత ముకుళరూపమున బంధింపఁబడినది. ౨. అరాన్ కేసరాన్ విందతీతి అరవిందం. విద్ల లాభే. కేసరములను బొందియుండునది. ౩. మహచ్చ తత్ ఉత్పలం చ మహోత్పలం – మహత్తైన ఉత్పలము. ౪. సహస్రం పత్రాణ్యస్య సహస్రపత్రం

వేయిఱేకులు గలది. ౫. కం జలం అలతి భూషయ తీతి కమలం. అల భూషణాదౌ. జలమును భూషించునది. కేన మల్యతే ధార్యత ఇతి వా కమలం. మలమల్ల ధారణే. జలముచేత ధరింపఁబడునది. ౬. శతం పత్రాణ్యస్య శతపత్రం. నూఱుఱేకులు గలది. సహస్రపత్రశతపత్ర శబ్దములు పద్మవిశేషవాచకములైనను పద్మత్వ సామాన్యముచేత నేకార్థములు. ౭. కుశే జలే శేత ఇతికుశేశయం. శీఙ్ స్వప్నే. నీళ్లయందుండునది. ౮. పంకే రోహతీతి పంకేరుహం. రుహ బీజ జన్మని ప్రాదుర్భావే. అడుసునందు మొలచునది. ౯. తమఃప్రకర్షో రసో ఽ స్య తామరసం – ప్రకృష్టమైన రసము గలిగినది. తామ్యద్భిః రస్యత ఇతి వా తామరసం. రస అస్వాదే. బడలినవారిచే నాస్వాదింపంబడునది. తామరం జలం తత్రసస్తి తిష్ఠతీతి తామరసం. షస స్వప్నే. ఉదకమునందుండునది. ౧౦. సరసిభవం సారసం – సరస్యునఁ బుట్టినది. ౧౧. సరస్యాం రోహతీతి సరసీరుహం. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ. కొలనియందు మొలచునది. ౧౨. బిసస్య ప్రసూనం బిసప్రసూనం–తామరతూడుల యొక్క పుష్పము. ౧౩ . కేసరరాజియోగాత్ రాజీవం–ఆకరులయొక్క పంక్తి గలిగినది. ౧౪. శ్రాన్తం పుష్ణాతీతి పుష్కరం. పుక్ష పుష్టౌ. బడలినవానిని బోషించునది. ౧౫. అంభసి రోహతీతి అంభోరుహం– జలమందుఁ బుట్టునది. ఈ ౧౬ తామరపువ్వులపేళ్లు.

**పుణ్డరీకం సితామ్భోజం -**

పుణతి మంగళత్వా త్పుండరీకం. పుణ కర్మణి శుభే. ౧. సితం చ అంభోజం చ సితాంభోజం – తెల్లనైన తామర. ఈ ౨ తెల్లతామరపేళ్లు.

**అథ రక్త సరోరుహే.** 41

**రక్తోత్పలం కోకనదం -**

రక్తం చ తత్ సరోరుహంచ రక్తసరోరుహం–ఎఱ్ఱనైన తామర. ౧. రక్తం చ తత్ ఉత్పలం చరక్తోత్పలం–ఎఱ్ఱతామర. ౨. కోకాశ్చక్రవాకా నదంత్యస్మిన్నితి కోకనదం. ణద అవ్యక్తే శబ్దే. చక్రవాకములు దీనియందు అవ్యక్తముగాఁ గూయును. ఈ 3 ఎఱ్ఱతామరపేళ్లు. 'రక్తాబ్జే రక్తకుముదే బుధైః కోకనదంస్మృతం' అనెడు వృద్ధసమ్మతిచేత రక్త

సరోరుహము, ఎఱ్ఱదామర; రక్తోత్పలము, ఎఱ్ఱకలువ. ఈ రెండును కోకనద మనంబడునని కొందఱు.

**నాళో నాళం -**

నాళః నాళం. తామర కలువ మొదలయినవాని కాఁడపేళ్లు. నల్యతే బధ్యతే పుష్పేణేతి నాళః నాళం చ. పుష్పముతో బంధింపఁబడునది. పున్నపుంసకములు రెంటియందుఁ గలదు. నాళా నాళమ్ అని స్త్రీనపుంసకలింగములుగాఁ గొందఱు చెప్పుదురు.

**అథాస్త్రియామ్,**

**మృణాళం బిసం -**

మృణ్యతే భక్ష్యత ఇతి మృణాళం. అ. ప్న. మృణహింసాయాం. భక్షింపఁ బడునది. ౧. బిస్యంతే ఉత్సృజ్యంతే భక్షణసమయే తంతవో ఽత్ర బిసం. బిస ఉత్సర్గే. భక్షణ సమయమున దీనియందుఁ గల తంతువులు విడువఁబడును. ఈ ౨ తామరతూఁడుపేళ్లు.

**అబ్జాదికదమ్బే షణ్డ మస్త్రియామ్.** 42

భ్రమరేభ్యో రసం సనోతీతి షండః. అ. ప్న. షణు దానే. భ్రమరములకు మకరందము నిచ్చునది. పా. శండ ఇతి తాలవ్యాదిరప్యస్తి. ఈ ౧ తామపువ్వులు మొదలైనవాని సమూహము పేరు.

**కరహాట శ్శిఫా కన్దః -**

కం జలం ఊర్ధ్వస్థిత్యా రహయన్తీతి కరహాః పద్మాః; తానటతీతి కరహాటః. రహ త్యాగే. అట పటగతౌ. మీఁదనుండుటచేత జలమును విడుచునది గనుక కరహములు పద్మములు; వానినిఁ బొందియుండునది. కరాన్హస్తాన్ హాటయతి దీపయతీతి కరహాటః. హాట దీప్తౌ. హస్తములఁ బ్రకాశింపఁజేయునది. ౧. శినోతి భువం శిఫా. శిఞ్ నిశాతనే. భూమిని కృశముగాఁ జేయునది. ౨. కందయతి భక్షకాన్ మత్స్యాదీనితి కందః. కది ఆహ్లాదనే. తన్ను భక్షించునట్టి మత్స్యాదుల సంతోషపెట్టునది. ౩. కొందఱు శిఫాకందమని యొకటిగాఁ జెప్పుదురు. శిఫాసహితం కందం శిఫాకందం–శిఫలనఁగా గొమ్మలు, వానితోఁ గూడిన దుంప. ఈ ౩ తామరదుంపపేళ్లు.

**కింజల్కః కేసరో ఽస్త్రియామ్,**

కించిజ్జలతి జడీభవతి కింజల్కః–ఇంచుకంత జడమైయుండునది. ౧. కే జలే సరతి కేసరః అ. ప్న. సృగతౌ. జలమం దుండునది. పా. కేశరః. 'ఆందోళిత కుసుమ కేశరే కేశర' ఇతి వాసవదత్తాయాం. కేశీర్యత ఇతి కేశరః. శౄ హింసాయాం. కొనయందు విడిపోవునది. అకరువుపేళ్లు.

**సంవర్తికా నవదళమ్ -**

సంవర్తయతి వేష్టయతీతి సంవర్తికా. వృతువర్తనే. తామర దుద్దును జుట్టి యుండునది. ౧. నవోత్పన్నం దళం నవదళం – క్రొత్తఁగాఁ బుట్టిన ఱేకు. ఈ ౨ లేఁత తామరఱేకుపేళ్లు.

**బీజకోశో వరాటకః.** 43

బీజానాం పద్మాక్షాణాం కోశః ఆకరో బీజకోశః – తామరవిత్తులకు నెలవైనది. ౧. వరం శ్రేష్ఠం పద్మ మటతి వరాటకః. అట పట గతౌ. శ్రేష్ఠమును బొందునది. వృణోతి బీజానితి వరాటకః విత్తులను గప్పునది. ఈ ౨ తామరపువ్వులోని దుద్దుపేళ్లు.

**ఉక్తం స్వర్వ్యోమ ది క్కాలధీ వాక్ఛబ్దాది నాట్యకమ్,**
**పాతాళ భోగి నరక వారి చైషాం చ సంగతమ్.** 44

కాండం నిగమయన్ బుద్ధిసౌకర్యాయ కాండోక్త మనువదతి. సర్గాది వారిపర్యంత వర్గేషు స్వర్వ్యోమ దిక్కాల ధీవా క్ఛబ్దాది, ఆది శబ్దేన రసగంధాది ర్గృహ్యతే; నాట్యం తత్సంబంధి గీతాదికముచ్యతే; పాతాళభోగి నరకవారిచ ద్వంద్వైకవద్భావః ఉక్తమిత్యనేనాన్వయః. ఏషాం యత్సంగతం స్వర్గే దేవతాది, దిశిదిగ్గజాది, కాలే ఉపరాగాది, ధీ సంగతం విచారాది; వాచిశ్రుత్యాది, శబ్దే ఉదాత్తాది, నాట్యే భ్రుకుంసాది, పాతాళే కుహరాది, భోగిని కంచుకాది, నరకే బాధాది, వారిణి నౌకాపద్మోత్పలాది, ఏత త్సర్వ మస్మిన్ ప్రథమకాణ్డే ఉక్తమిత్యర్థః.

కాండమును ముగించుచు నీకాండమునందుఁ జెప్పఁబడిన వర్గముల నన్నిటి నొకసారి పేర్కొనుచున్నాఁడు. స్వః = స్వర్గము, వ్యోమ = ఆకాశము, దిక్ = దిక్కులు, కాల = కాలము, ధీ = బుద్ధి, వాక్ = వాక్కు, శబ్ద = శబ్దము, ఆదిశబ్దముచేత రసగంధాదులు. నాట్యకం = నాట్యసంబంధి గీత వాద్యాదులు, పాతాళ = పాతాళము, భోగి = సర్పములు, నరక = నరకము, వారి = జలమును, ఏషాం = ఈస్వర్గాదుల యొక్క, సంగతం =

సంబంధవస్తువులు. ఎట్లనినః___ స్వర్గసంగతములైన దేవతాదులును, దిక్సంగతములైన దిగ్గజాదులును, కాలసంగతములైన గ్రహణాదులును, ధీసంగతములైన విచారాదులును, వాక్సంగతములైన శ్రుత్యాదులును, శబ్దసంగతములైన యుదాత్తాదులును, నాట్యసంగతములైన భ్రకుంసాదులును, పాతాళసంగతములైన కుహరాదులును, భోగిసంగతములైన కంచుకాదులును, నరకసంగతములైన బాధాదులును, వారిసంగతములైన నౌకాదులును జెప్పఁబడినవని యర్థము.

**ఇ త్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే,**
**స్వర్గాదికాణ్డః ప్రథమ స్సాఙ్గఏవ సమర్థితః.** 45

అమరసింహకృతౌ = అమరసింహునికృతి యగు, నామలింగాను శాసనే= నామలింగానుశాసనమను నీకోశమందు, ఇతి = ఇట్లు, ప్రథమః = మొదటిదగు, స్వర్గాదికాండః = స్వర్గము మొదలగువాని వర్గముల సమూహము, సాంగేవ = సమగ్రముగనే, సమర్థితః = నెఱవేర్పఁబడెను.

# ప్రథమ కాండము సమాప్తము



శ్రీరస్తు

*నామలింగానుశాసన మను శ్రీ మదమరసింహవిరచితం బైన*

# అమరకోశము

సంస్కృతాంధ్రవ్యాఖ్యాన సహితము

## ద్వితీయకాండము

## భూమివర్గము

అవ. ఏవం ప్రథమకాణ్డం పరిసమాప్య ద్వితీయకాణ్డే వక్ష్యమాణ వర్గాన్ సంగ్రహేణ వక్తి వర్గాః పృథ్వీతి శ్లోకేన.___ ఈ ప్రకారముగా మొదటికాండమును ముగించి, రెండవకాండమునందుఁ జెప్పఁబడు వర్గములను సంక్షేపముగాఁ జెప్పుచున్నాఁడు___

**వర్గాః పృథ్వీ పుర క్ష్మాభృ ద్వనౌషధి మృగాదిభిః,**
**నృ బ్రహ్మ క్షత్ర వి ట్ఛూద్రై స్సాఙ్గో పాఙ్గై రి హోదితాః.** 1

పృథ్వీచ పురం చ క్ష్మాభృచ్చ వనౌషధిశ్చ మృగాదీ చతైః ఇహకాండే పృథ్వీప్రభృతిభిః, నృబ్రహ్మ క్షత్ర విట్ఛూద్రైః సాంగోపాంగైః అంగ ప్రత్యంగ సహితైః దశభిః వర్గా ఉదితాః. అత్ర మృగాది శబ్దేన సింహ ఉచ్యతే. మృగా నత్తుంశీల మస్యేతి వ్యుత్పత్తిః. యద్వా మృగ శబ్ద ఆరణ్యపశుమాత్రపరః, ఆదిశబ్దేన పక్షికీటాదీనాం గ్రహణమ్. ఇహ = ఈకాండమునందు, సాఙ్గోపాఙ్గైః = మృత్తికాదులైన అంగములతోడను, అధ్వాదులైన ప్రత్యంగములతోడను గూడియున్న, పృథ్వీ పురక్ష్మాభృద్వనౌషధి మృగాదిభిః = భూపురశైల వనౌషధి సింహాదులతోడను, నృ బ్రహ్మ క్షత్ర విట్ఛూద్రైః = మనుష్య బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులతోడను ఉపలక్షితములైన, వర్గాః = వర్గములు, ఉదితాః = చెప్పఁబడుచున్నవి.

**భూ ర్భూమి రచ లానన్తా రసా విశ్వమ్భరా స్థిరా,**
**ధరా ధరిత్రీ ధరణిః క్షోణిర్జ్యా కాశ్యపీ క్షితిః.** 2

**సర్వంసహా వసుమతీ వసుధార్వీ వసున్ధరా,**
**గోత్రాకుః పృథివీ పృథ్వీ క్ష్మా ఽ వని ర్మేదినీ మహీ.** 3
**(విపులా గహ్వరీ ధాత్రీ గౌ రిలా కుమ్భినీ క్షమా,**
**జగతీ రత్న గర్భా చ భూతధా త్ర్యబ్ధిమేఖలా.)**

భవతీతి భూః. ఊ. సీ. భూమిశ్చ. ఇ. సీ. ఇది యుదకమువలనఁ బుట్టును. ౧. ౨. న చలతీత్యచలా. చల కంపనే. చలింపనిది. ౩. నాస్త్యంతో ఽ స్యాః అనంతా–అంతములేనిది. ౪. రసాస్సంత్యస్యా మితిరసా–రసములు దీనియందుఁ గలవు. రస్యతే ఆస్వాద్యత ఇతి వా రసా. రస ఆస్వాదనే. అనుభవింపఁబడునది. ౫. విశ్వం బిభర్తీతి విశ్వంభరా. భృఞ్ భరణే. విశ్వమును భరించునది. ౬. తిష్ఠతి సదా స్థిరా. ష్ఠా గతినివృత్తౌ. ఎల్లప్పుడు నుండునది. తిష్ఠతి సర్వమస్యామితి వా స్థిరా – సర్వము దీనియందుండును. ౭. ధరతి విశ్వం ధరా; ధరిత్రీ. ఈ. సీ. ధరణిశ్చ. ఇ. సీ. విశ్వమును ధరించునది. ౮, ౯, ౧౦. క్షౌతీతి క్షోణిః. ఇ. సీ. పా. క్షోణీ. ఈసీ. టు క్షు శబ్దే. శబ్దించునది. ౧౧. జినాతి సర్వమస్యామతి జ్యా. జ్యా వయోహానౌ. సర్వము దీనియందు నశించును. ౧౨. కశ్యపస్యేయం కాశ్యపీ. ఈ.సీ. పరశురామునిచేత కశ్యపునికొఱకు యజ్ఞ దక్షిణగా నియ్యఁబడినది. తథాచోక్తం.___ 'శ్లో. త్రిసప్తకృత్వః పృథివీం కృత్వానిః క్షత్రియాం తతః, దక్షిణా మశ్వమేధాంతే కశ్యపాయాదదాత్ప్రభు' రితి. ౧౩. క్షియంతి నివసంతి సర్వే ఽ స్యామితి క్షితిః. ఇ. సీ. క్షి నివాసగత్యోః. దీనియందందఱుందురు. ౧౪. సర్వం సహత ఇతి సర్వంసహా. షహమర్షణే. సర్వమును సహించునది. ౧౫. వసుధనమస్యామస్తీతి వసుమతీ. ఈ. సీ. ధనము దీనియందుఁ గలదు. ౧౬. వసు దధాతీతి వసుధా. డుధాఞ్ ధారణ పోషణయోః. ధనమును ధరించునది. ౧౭. ఉరుత్వాదుర్వీ. ఈ. సీ. ఘనమైనది. ఊర్ణూయతే పర్వతై రిత్యుర్వీ. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే. పర్వతములచేతఁ గప్పఁబడునది. ౧౮. వసుధారయతీతి వసున్ధరా. ధృ ధారణే. ధనమును ధరించునది. ౧౯. గోత్రాః పర్వతాస్సంత్యస్యామి తోగోత్రా–పర్వతములు దీనియందుఁ గలవు. గాస్తృణాదిభిస్త్రాయత ఇతి గోత్రా. త్రైఙ్ పాలనే. తృణాదులచేత ఆవులను రక్షించునది. ౨౦. కాయతి ధ్వనతీతి కుః. ఉ.

సీ. క్రై శబ్దే. మ్రోయునది. ౨౧. ప్రథతే పృథివీ; పృథ్వీ చ. ఈ. సీ. ప్రథ ప్రఖ్యానే. ప్రసిద్ధమగునది. పృథుచక్రవర్తినా సత్కృతావా పృథివీ; పృథ్వీచ – పృథుచక్రవర్తిచేత లెస్సగాఁ జేయఁబడినది. పృథుత్వాత్పృథివీ–విశాలమైనది. ౨౩. క్షమతే భారం క్ష్మా – భారము నోర్చునది. ౨౪. అవతి ప్రజాః; అవ్యతే నృపైర్వా అవనిః. ఇ. సీ. ప్రజలను రక్షించునదిః లేక రాజులచేత రక్షింపఁబడునది అవని. ౨౫. మధుకైటభ యోర్మేదసా పరిప్లుతత్వాత్ మేదినీ. ఈ. సీ. మధుకైటభుల మెదడుచేతఁ దడుపఁ బడునది. తథాచోక్తం.___ "శ్లో. మధుకైటభయోస్త్వం యన్మేదసా సంపరిప్లుతా, తేనేయం మేదినీ దేవీ ప్రోచ్యతే బ్రహ్మవాదిభి" రితి. ౨౬. మహ్యతే మహీ. ఈ. సీ. పా. మహిః. ఇ. సీ. మహ పూజాయాం. పూజింపఁబడునది. ఈ ౨౭ భూమిపేళ్లు.

**మృన్మృత్తికా -**

మృద్యత ఇతి మృత్. త. సీ. మృత్తికా చ. మృద క్షోదే. మెదుపఁబడునది. ఈ ౨ మన్నుపేళ్లు.

**పశస్తాతు మృత్సా మృత్స్నా చ మృత్తికా,**

ప్రశస్తామృత్ మృత్తికా మృత్సా. మృత్స్నా చ. ఈ ౨ ప్రశస్తమైన మృత్తికపేళ్లు.

**ఉర్వరా సర్వసస్యాఢ్యా -**

ఉర్వతి క్షుధం హినస్తీత్యుర్వరా. ఉర్వీ హింసాయాం. ఆఁకలిని బోఁగొట్టునది. ఉరుం మహాంతం వృణోతి తదర్థత్వా దుర్వరా – అధికమును వరించునది. ఈ ౧ సమస్తమైన పైర్లతోఁ గూడియున్న భూమిపేరు.

**స్యా దూషః క్షారమృత్తికా.** 4

ఉషతి బీజమూషః. ఊష రుజాయాం. విత్తనమును జెఱుచునది. ౧. క్షారా చ సా మృత్తికా చ క్షారమృత్తికా–ఉప్పుమన్ను క్షారమృత్తిక. ఈ ౨ చౌటిమట్టిపేళ్లు.

**ఊషవా నూషరో ద్వావ ప్యన్యలిఙ్గా -**

ఊషో ౽ స్యాస్తీత్యూషవాన్. త. ఊషరశ్చ. చౌటిమట్టి గలిగినది. ఈ ౨ ను విశేష్య మేలింగమో ఆలింగముగలవి. ఊషరం స్థలం, ఊషరోదేశః; ఊషరా భూమిః అని యుదాహరణములు. ఈ ౨ చౌటినేలపేళ్లు.

**స్థలం స్థలీ,**

స్థలతీతి స్థలం; స్థలీ చ. స్థల స్థానే. స్థానమైయుండునది. ఈ ౨. జలశూన్యమై తనంతటనే చదరమైయుండెడు నేలపేళ్లు.

**సమానౌ మరుధన్వానౌ -**

తృష్ణయా మ్రియన్తే౽త్ర మరుః. ఉ. పు. మృఙ్ ప్రాణత్యాగే. దప్పిచేత దీనియందు మృతులగుదురు. ఈ ౨ సమలింగములు. నీళ్లులేని భూమిపేళ్లు.

**ద్వే ఖి లా ప్రహతే సమే.** 5

**త్రిషు -**

హలేన న లిఖితమితి ఖిలం. లిఖ అక్షరవిన్యాసే. నాఁగేటిచేత దున్నఁబడనిది. ఖం లాలీతి ఖిలం. లా దానే. శూన్యము నిచ్చునది. ౧. లాంగలాదినా న ప్రహన్యత ఇత్య ప్రహతం. హన హింసాగత్యోః. నాఁగేలు మొదలైన వానిచేతఁ బీడింపఁబడనిది. ఈ ౨ ను త్రిలింగములు. దున్నిననేలపేళ్లు.

**అథో జగతీ లోకో విష్టపం భువనం జగత్,**

గమ్య తేజనైరితి జగతీ. ఈ. సీ. జగచ్చ. త. న. గమ్ ౢగతౌ. జనులచేతఁ బొందఁబడునది. ప్రళయకాలే గచ్ఛతీతి జగతీ. జగచ్ఛ – ప్రళయకాలమందు లయమైపోవునది. ౧. లోక్యతే సర్వ మస్మిన్నితి లోకః. లోకృ దర్శనే. సర్వము దీనియందుఁ గానఁబడును. ౨. విశం త్యస్మిన్నితి విష్టపం. విశ ప్రవేశనే. దీనియందుఁ బ్రవేశింతురు. ౩. భవత్యస్మిన్నితి భువనం దీనియందు సర్వము గలుగును. ఈ ౪ జగత్తు పేళ్లు.

**లోకో౽యం భారతం వర్షమ్ -**

అయం జమ్బూద్వీప నవమాంశః హిమసేతు మధ్యస్థో లోకః భారత వర్ష మిత్యుచ్యతే–హిమవత్పర్వతమునకు దక్షిణంబును దక్షిణ సముద్రమునకు నుత్తరంబునునైన యీదేశము భారతవర్ష మనంబడును. భరతస్యరాజ్ఞ ఇదం భారతం–భరతుఁడనురాజు సంబంధమైనది. ౧ వృష్యతే సిచ్యతే మేఘైరితి వర్షం–మేఘములచేతఁ దడుపఁబడునది. ఈ ౧ భారత వర్షముపేరు.

**శరావత్యాస్తు యో౽వధేః.** 6

**దేశః ప్రాగ్దక్షిణః ప్రాచ్యః -**

ఏతస్మింశ్చ భారతే శరావతీ నామ నదీ ఈశాన్యా దిశస్సకాశాత్ పశ్చిమసముద్రగామినీ వహతి. తస్యా అవధేః యః ప్రాగ్దక్షిణో దేశః సః ప్రాచ్య ఇత్యుచ్యతే – ఈభారతవర్షమునందు శరావతి యెనెడు నది ఈ శాన్యదిక్కుననుండి నైరృతిమూలకుఁ బాఱి, పడమటిసముద్రమునఁ గలియుచున్నది. ఆ నదియే యెల్లగాఁ గల తూర్పుతోఁ గూడిన దక్షిణదేశము ప్రాచ్య మనంబడును. ప్రాక్సహచరితో దక్షిణః ప్రాగ్దక్షిణః. తూర్పుతోఁ గూడిన దక్షిణము ప్రాగ్దక్షిణము. ఈ ౧ ప్రాచ్యదేశముపేరు.

**ఉదీచ్యః పశ్చిమోత్తరః,**

తస్యా శ్శరావత్యాః అవధేః యః పశ్చిమోత్తరః స ఉదీచ్య ఇత్యుచ్యతే. ఆ నదియే యెల్లగాఁగల పడమరతోఁ గూడిన యుత్తరపుదిక్కున నుండు దేశము ఉదీచ్య మనంబడును. పశ్చిమేన సహ చరిత ఉత్తరః పశ్చిమోత్తరః పశ్చిమములతోఁ గూడిన యుత్తరము పశ్చిమోత్తరము. ఈ ౧ ఉదీచ్యదేశముపేరు.

**ప్రత్యన్తో మ్లేచ్ఛదేశ స్స్యాత్ -**

భారతవర్ష స్యాంతదేశః శిష్టాచారరహితః కామరూపాదిః మ్లేచ్ఛదేశ ఇత్యుచ్యతే–భారతవర్షముయొక్క తుదనుండు శిష్టాచారరహితమైన కామ రూపాదిదేశము మ్లేచ్ఛదేశ మనంబడును. అంతంప్రతి గతః ప్రత్యంతః – తుదముట్టినది. మ్లేచ్ఛానాం దేశః మ్లేచ్ఛదేశః – తురకల దేశము. తథాచోక్తంః ___ శ్లో. "చాతుర్వర్ణ్య వ్యవస్థానం యస్మిన్ దేశేన విద్యతే, మ్లేచ్ఛదేశ స్స విజ్ఞేయ ఆర్యావర్తస్తతః పర" మితి. ఈ ౨ శిష్టాచారరహిత కామరూపాది దేశము పేళ్లు.

**మధ్యదేశస్తు మధ్యమః.** 7

హిమవద్వింధ్యయోః వినశన ప్రయోగయోశ్చ మధ్యే భవత్వాత్ మధ్యమః – హిమవద్వింధ్యగిరులయొక్కయు, వినశన ప్రయాగలయొక్కయు మధ్యమం దుండునది. తథా చోక్తం మనునా.___ 'శ్లో. హిమద్ధ్యయోర్మధ్యే యత్ప్రాగ్వినశనాదపి, ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యవద్విందేశ స్స ఉచ్యతే" ఇతి. ఈ ౨ మధ్యదేశముపేళ్లు.

**ఆర్యావర్తః పుణ్యభూమి ర్మధ్యం విన్ధ్యహిమాగయోః,**

ఆర్యా ధార్మికా వర్తంతే అస్మిన్నిత్యార్యావర్తః. వృతువర్తనే. ధార్మికులు దీనియందు వర్తింతురు. ౧. పుణ్యా చ సా భూమిశ్చ పుణ్యభూమిః. ఇ. సీ. పుణ్యమైనభూమి. ౨. తదుక్తం మనునా.___ "శ్లో. ఆసము ద్రాచ్ఛవై పూర్వాదాసముద్రాచ్ఛ పశ్చిమాత్, హిమవద్వింధ్యయోర్మధ్యమార్యావర్తం విదుర్బుధాః" ఇతి. ఈ ౨ తూర్పుపడమర సముద్రములు ఎల్లలుగాఁగల హిమవద్వింధ్య పర్వతములయొక్క మధ్యదేశము పేళ్లు.

**నీవృ జ్జనపదౌ -**

నియమేన వర్తంతే జనా అస్మిన్నితి నీవృత్. త. పు. ఇందు జనులు నియమముగా వర్తింతురు. జనపదసాహచర్యా న్నీవృచ్ఛబ్దః పుల్లింగః. జనాః పద్యంతే ఉత్ర జనపదః. పద్ ౙగతౌ. జనులు పొందుదురు. ఈ ౨ గ్రామ సమూహము పేళ్లు.

**దేశ విషయౌ తూపవర్తనమ్.** 8

దిశ్యత ఇతి దేశః. దిశ అతిసర్జనే. ఇయ్యఁబడునది. ౧. విశేషేణ బధ్నాతీతి విషయః. షిఞ్ బంధనే. విశేషముగాఁ బ్రీతిని బుట్టించునది. ౨. ఉపవర్తతే అస్మిన్నితి ఉపవర్తనం. వృతు వర్తనే. దీనియందు జనులు వర్తింతురు. ఈ ౩ జనపద సమూహము పేళ్లు. నీవృచ్ఛబ్దము మొదలు ౫ శబ్దములు దేశము పేళ్లని కొందరు.

**త్రిష్వాగోష్ఠాత్ -**

ఇతఃప్రభృతి గోష్ఠపర్యంతం వక్ష్యమాణాశ్శబ్దాః విశేషవిధిం వినాత్రిషు వర్తంతే – ఇది మొదలు గోష్ఠ శబ్దమువఱకుఁ గల శబ్దములలో విశేషవిధిచేతఁ జెప్పఁ బడనివి మూఁడులింగములయందును వర్తించును.

**నడప్రాయే నడ్వా న్నడ్వల ఇత్యపి,**

నడప్రచురోదేశః నడప్రాయః–క్రాలుకసవు తఱుచుగాఁగల దేశము. బాహుళ్యేన నడో ఉస్త్యస్మిన్నితి నడ్వాన్.త. నడ్వలశ్చ. నడమనఁగాఁ గ్రాలుకసవు; అది గలిగిన దేశము. ఈ ౨ క్రాలుకసవు తఱుచుగాఁ గల దేశము పేళ్లు.

**కుముద్వాన్ కుముదప్రాయే -**

కుముదప్రచురో దేశః కుముదప్రాయః. కుముదాన్యస్మిన్ సంతీతి కుముద్వాన్. త. తెల్లకలువలు తఱుచుగాఁ గల దేశము. ఈ ౧ తెల్లకలు

వలు తఱుచుగాఁ గల దేశము పేరు.

**వేతస్వా న్బహువేతసే.** 9

వేతసాస్సంత్యస్మిన్నితి వేతస్వాన్. త. పు. ౧ బహవో వేతసా యత్ర బహువేతసం. ప్రబ్బలిచెట్లు తఱుచుగాఁ గల ప్రదేశము పేళ్లు.

**శాద్వల శ్శాదహరితే -**

శాదో బాలతృణమస్మిన్న స్తీతి శాద్వలః – లేఁతకసవుగల దేశము. ౧. శాదో బాలతృణం తేన హరితో దేశ శ్శాదహరితః – లేఁతకసవుచేత పచ్చనైన దేశము. ఈ ౧ లేఁతకసవుచేతఁ బచ్చగానుండు దేశము పేరు.

**సజమ్బాలే తు పఙ్కిలః,**

జంబాలేన సహవర్తత ఇతి సజంబాలః. పంకోస్యాస్తీతి పంకిలః. అడుసు గలిగినది. ఈ ౧ అడుసుతోఁగూడిన దేశము పేరు.

**జలప్రాయ మనూపం స్యా త్పుంసి కచ్ఛస్తథావిధః.** 10

అనుగతా ఆపో ఽస్మిన్ని త్యనూపం–తఱుగని నీళ్లు గలిగినది. ౧. నీళ్లు తఱుచుగాఁ గల దేశముపేరు. కష్యతే జలైరితి కచ్ఛః. కష హింసాయాం. జలముచేతఁ బీడింపఁబడునది. కంపానీయం ఛ్యతీతి కచ్ఛః ఛ్ఛోదనే. జలమును విడుచునది. పుంసీతిత్రిష్వాగోష్ఠాదిత్యస్య బాధకం. అయంశబ్దః క్లీబే ఽపి. తథా చ అమరమాలా.___ "కచ్ఛంక్లీబే ఽనూపదేశ" ఇతి. ౧. నీళ్లు తఱుచుగాఁ గల నదీసరస్సుల సమీప ప్రదేశము పేరు.

**స్త్రీ శర్కరా శర్కరిల శ్శార్కర శ్శర్క రావతి,**

శృణాతీతిశర్కరా. సా అస్త్యత్రేతి శర్కరా. శౄ హింసాయాం. పీడించునది. గనుక శర్కర; అనఁగా మొరము. అది గలిగిన నేల శర్కరా. ౧. శర్కరా అస్మిన్నస్తీతి శర్కరిలః. శార్కరః. శర్కరావాంశ్చ. మొరము దీనియందుఁ గలదు. ఈ ౪ మొదపనేలపేళ్లు.

**దేశ ఏవాదిమౌ -**

శర్కరాది శబ్దేషు ఆదిమౌ శర్కరాశర్కరిల శబ్దౌ శర్క రావతిదేశ ఏవవర్తేతే. ఇతరౌ దేశే అన్యత్ర చ. యథాః.___ శార్కరోదేశః. శార్కర మోదనమిత్యాది శర్కరాది శబ్దములయందు మొదటి శబ్దములు రెండు మొరముగల దేశమునకే పేళ్లు. తక్కిన రెండుశబ్దములు మొరము గల దేశమునకును వస్త్వంతరమునకును బేళ్లు.

**ఏవ మున్నేయా స్సికతావతి.** 11

ఏవం సికతావతి దేశే సికతా. సికతిల ఇతి ద్వౌ. అన్యత్రచసైకతః సికతావాన్ ఇతి, పూర్వవద్వ్యుత్పత్త్యాదికం–సికత యనఁగా నిసుక; అదిగలిగిన దేశమునందు సికతా సికతిలః అనియు, ఇసుకగలదాని యందు సైకతః, సికతావాన్ అనియు నూహింపఁదగినది.

**దేశో నద్యమ్బు వృష్ట్యమ్బు సమ్పన్న వ్రీహిపాలితః,**
**స్యాన్నదీ మాతృకో దేవమాతృకశ్చ యథాక్రమమ్.** 12

నద్యంబూని చ వృష్ట్యంబూని చ తైస్సంపన్నాశ్చ తే వ్రీహయశ్చ తైః పాలితః. నీ మాతాస్య నదీమాతృకః–నదియే తల్లిగాఁగలది. ౧. దేవః మాతాస్య దేవమాతృకః – పర్జన్యుఁడే తల్లిగాఁ గలది. ఈ ౨ ను నదీజలముచేతను, వర్షోదకముచేతను బండు పైర్లుగల దేశము పేళ్లు.

**సురాజ్ఞి దేశే రాజన్వాన్ స్యాత్ -**

శోభనో రాజాస్యాస్తీతి రాజన్వాన్. త. మంచిరాజుగలది. ఈ ౧ మంచిరాజుగల దేశముపేరు.

**తతో ఽ న్యత్ర రాజవాన్,**

రాజా స్త్యస్య రాజవాన్. త. పు. రాజు గలిగినది. ౧. ఆ దేశమున కంటె వేరైన సామాన్య రాజుగల దేశము పేరు.

**గోష్ఠం గోస్థానకమ్ -**

గావ స్తిష్ఠంత్యత్ర గోష్ఠం. ష్ఠా గతినివృత్తౌ. దీనియందు గోవులుండును. గవాంస్థానం గోస్థానం – గోవులుండెడి స్థానము. ఈ ౨ ఆవులుండెడు మందపేళ్లు.

**తత్తు గౌష్ఠీనం భూతపూర్వకమ్.** 13

భూతపూర్వం గోష్ఠం గౌష్ఠీనం – పూర్వపుదైన గోష్ఠము. ఈ ౧ పురాతనమైన యాలమంద పేరు.

**పర్యన్తభూః పరిసరః -**

పర్యంతే ఉపాంతే భూః పర్యంతభూః. పరితస్సరంతి చర్యంత్యత్రేతి పరిసరః. సృగతౌ. దీనియందు నలుదిక్కుల సంచరింతురు. ఈ ౧ గ్రామ నగరాదులయొక్క సమీపభూమిపేరు.

**సేతు రాళౌ స్త్రియాం పుమాన్,**

పుమా౯ సేతుః స్త్రియామాళౌ వర్తతే. సిన్వంతి బధ్నంతి మృత్పాషాణాదిభిరేన మిద సేతుః. ఉ. పు. షిఞ్ బంధనే. మృత్పాషాణాదులచేత దీనిఁ గట్టుదురు. ౧. అల్యతే నివార్యతే జలమనయేత్యాళిః. ఇ–సీ. అల భూషణపర్యాప్తి వారణేషు. దీనిచేత జలము నిలుపఁబడును. ఈ ౨ కట్టపేళ్లు.

**వామలూరుశ్చ నాకుశ్చ వల్మీకం పున్నపుంసకమ్.** 14

వామం వామైః ప్రాణిభిర్వాలూయత ఇతి వామలూరుః ఉ. పు. పా. వామలూరః. లూఞ్ ఛేదనే. కుటిలముగాఁగాని కుటిలములైన జంతువులచేతఁ గాని త్రవ్వఁబడునది. ౧. ప్రాణినః ప్రవేశే నమంత్యతనాకుః. ఉ.పు. ణము ప్రహ్వత్వే శబ్దే చ. జంతువులు ప్రవేశించినపుడు దీనియందు వంగును. ౨. వలంతే దలంతే ప్రాణినో ౽త్ర వల్మీకం. వల సంచరణే సంవరణే చ. జంతువులు దీనియందు సంచరించును. పా. వల్మీకం "నద్యాం కూపతటేతరో చ వివరే శైలేచ కౌ వల్మిక" ఇతి ప్రాణేశ్వరః. "వాల్మీకో వాల్మికః ప్రోక్తో వాల్మీకిరపి వాల్మికి" 'రితి తారపాలః. ఈ ३ (భూమిలోనుండి చీమలు మున్నగువానిచేఁ దోడఁబడిన మట్టిదిబ్బ) పుట్టపేళ్లు.

**అయనం వర్త్మ మార్గధ్వ పన్థానః పదవీ సృతిః,**
**సరణిః పద్ధతిః పద్యా వర్తన్యేకపదీతి చ.** 15

అయంతే ౽నేనేత్యయనం. అయపయగతౌ. దీనిచేతఁ బోవుదురు. ౧. వర్తంతే అనేనేతి వర్త్మ. న. న. వృతు వర్తనే. దీనిచేత నడచెదరు. ౨. మృగయంతే గవేషయంత్యనేన మార్గః. మృగ అన్వేషణే. దీనిచేతఁ బదార్థమును వెదకుదురు. మృజ్యతే పథికపదై ర్నిస్తృణీక్రియత ఇతి మార్గః. మృజూ శుద్ధౌ. తెరువరుల యడుగులచేతఁ దుడవఁబడునది. ३. అద్యతేభక్ష్యతే పథికైరత్ర అధ్వా. న. పు. అదభక్షణే. దీనియందు పథికులచేత భుజింపఁబడును. ४. పంథంతి యాంత్యనేన పంథాః. న–పు. పథిగతౌ. దీనిచేతఁ బోవుదురు. ౫. పద్యంతే గచ్ఛంత్య స్యామితి పదవీ. ఈ. సీ. పద్ ౙ గతౌ. దీనియందు నడతురు. పదాన్యస్యాం విద్యత ఇది పదవీ–దీనియం దడుగులుండును. ౬. సరంత్యనేనసృతి. ఈ–సీ. సరణిశ్చ. ఇ. సీ. సృగతౌ. దీనిచేత సంచరింతురు. ౭, ౮. పదాభ్యాం హన్యత ఇతి పద్ధతిః.

ఇ. సీ. హన హింసాగత్యోః. పాదములచేతఁ గొట్టఁబడునది. ౯. తృణకంటకాది రహితత్వాత్ పాదాయ హితా–పద్యా–తృణకంట కాదిశూన్యమై యుండుటవలనఁ బాదములకు హితమైనది. ౧౦. వర్తంతే అనయావర్తనీ. ఈ. సీ. వృతు వర్తనే. దీనిచేతఁ బ్రవర్తింతురు. ౧౧. ఏకే కతిపయే పదా లక్ష్యంతే అస్యామితి ఏకపదీ. ఈ. సీ. కొన్నియడుగులు దీనియందుఁ గానబడును. ఏకః అసహితః పాదో ఽస్యామితివా ఏకపదీ – విడివిడిగా నుండు నడుగులుగలది. ఈ ౧౨ త్రోవపేళ్లు.

**అతిపన్థా స్సుపన్థాశ్చ సత్పథ శ్చార్చితే ఽ ధ్వని,**

అతిశ్రేష్ఠః పంథాః అతిపంథాః. న. పు. శ్రేష్ఠమైన మార్గము. ౧. సుశోభనః పంథాఃసు పంథాః. న. పు. ఒప్పెడుతెరువు. ౨. సంశ్చాసౌపంథాశ్చ సత్పథః. అ.పు. ఈ 3 మంచిత్రోవపేళ్లు.

**వ్యధ్వో దురధ్వో విపథః కదధ్వా కాపథ స్సమాః.** 16

విరుద్ధః అధ్వా వ్యధ్వః–విరుద్ధమైన త్రోవ. ౧. దుష్టో ఽ ధ్వాదురధ్వః– చెడ్డత్రోవ. ౨. విరుద్ధః పంథాః విపథః – విరుద్ధమైన మార్గము. 3. ఏతే అకారాంతాః. కుత్సితో ఽ ధ్వా కరధ్వా. న. పు. కుత్సితమైన మార్గము. ౪. కుత్సితః పంథాః కాపథః – కుత్సితమైన తెరువు. ౫. ఈశబ్దములు సమాః సమార్థకముల పుల్లింగములు. ఇచ్చట విపథకాపథశబ్దములు నపుంసకములుం గలవు. ఈ ౫ చెడ్డత్రోవ పేళ్లు.

**అపన్థాస్త్వపథం తుల్యే -**

పంథా న భవతీత్యపంథాః. న. పు. అపథం చ– తెరువుగానిది. ఈ ౨ తప్పుత్రోవపేళ్లు.

**శృఙ్గాటక చతుష్పథే,**

శృంగైరటంత్యస్మిన్నితి శృంగాటకం. ఆటపట గతౌ. కొమ్మలచేత దీని యందుఁ గ్రీడింతురు. ౧. చతుర్ణాం పథాం సమాహార శ్చతుష్పథం. నాలుగు తెరువులు గూడినది. ఈ ౨ నాలుగుత్రోవలుగూడిన చోటుపేళ్లు.

**ప్రాన్తరం దూరశూన్యో ఽ ధ్వా -**

ప్రకృష్టం గ్రామయోరంతరం వ్యవధానమత్రేతి ప్రాంతరం – అధికమైన గ్రామములయొక్క వ్యవధానము గలిగినది. ఈ ౧ ఎడారియై జనసంచారము లేని మార్గముపేరు.

**కాన్తారం వర్త్మ దుర్గమమ్.** 17

కాంశ్చిన్న తారయతీతి కాంతారం. తౄప్లవనతరణయోః. ఎవ్వరిని చొచ్చి దాఁటనీయనిది. ౧. దుష్టోగమో యస్య తద్దుర్గమం–దుష్టమైన గమనము గలిగినది. చోరకంటకాదులచేఁ బోవ శక్యముగాని మార్గముపేరు.

**గవ్యూతి స్త్రీ క్రోశయుగమ్.**

క్రోశద్వయం గవ్యూతిరిత్యుచ్యతే. "చతుష్కాధికవింశత్యా అంగుళైర్హస్తముచ్యతే, సహస్రై రష్టభిః ఖ్యాతం హస్తకైః క్రోశమానకం" ఇరువదినాలుగు అంగుళము లొక హస్తము. ఎనిమిది వేల హస్తము లొక క్రోశము. అట్టి క్రోశములు రెండు గవ్యూతి యనంబడును. గవోః క్రోశయోః యూతిః మిశ్రణం గవ్యూతిః. ఇ. సీ. యు మిశ్రణే. గోవనగాఁ గ్రోశము. రెండు క్రోశముల కూటమి గవ్యూతి. ఈ ౨ రెండు కోసులదూరముగల త్రోవ పేళ్లు.

**నల్వః కిష్కు చతుశ్శతమ్,**

కిష్కుర్హస్తః చతుశ్శతంహస్తాః నల్వ ఇత్యుచ్యతే–కిష్కు వనఁగా హస్తము. నన్నూఱు హస్తములు గల త్రోవ నల్వమనంబడును. నల్యతే బధ్యతే అనే నేతినల్వః. ణల బంధనే. దీనిచేత లెక్కపెట్టఁబడును. ఈ ౧ నన్నూఱుచేతుల పొడవుగల త్రోవ పేరు.

**ఘణ్టాపథ స్సంసరణమ్.**

దశధనురంతరో రాజమార్గః ఘంటాపథస్సంసరణమితిచోచ్యతే –పదివిండ్ల పట్టుగల రాజమార్గము ఘంటాపథము, సంసరణము ననంబడును. ఘంటో పలక్షితానాం గజానాం పంథాః ఘంటాపథః – ఘంటలతోఁ గూడిన యేనుఁ గులకు మార్గము. ౧. సంహతా స్సరంత్యత్ర సంసరణం. సృ గతౌ. అనేకులు దీనియందుఁ గూడి సంచరింతురు. ౨. రాజమార్గముల పేళ్లు.

**త త్పురస్యోప నిష్కరమ్.** 18

(ద్యావాపృథివ్యౌ రోదస్యౌ ద్యావాభూమీ చ రోదసీ,
దివః పృథివ్యౌ గుఞ్జా తు రుమా స్యాల్లవణాకరః)

పురసంబంధమైన యాఘంటాపథమే ఉపనిష్కర మనంబడును, ఇచ్చట పురమనఁగా దుర్గమైన పురము. కేవల పురసంబంధమైనది ఘంటా

పథమే యనంబడును. ఉపనిష్క్రియతే సైన్యమత్రేతి ఉపనిష్కరం. పా. ఉపనిష్కరం. కృవిక్షేపే. అంతట సైన్యము పర్యాప్తముగాఁ జల్లఁబడును. ఈ ౧ పురమార్గముపేరు.

# పుర వర్గము

**పూః స్త్రీ పురీ నగర్యౌ వాపత్తనం పుటభేదనమ్,**

**స్థానీయం నిగమః -**

పూర్యతే జనైరితి పూః ర.సీ. పురీ. ఈ. సీ. పౄపాలన పూరణయోః. జనులచేత నిండింపఁబడునది. ౧. ౨. క్రీడార్థం నగాః వృక్షాః పర్వతావా అత్ర సంతీతి నగరీ. ఈ. సీ. విహారార్థమై వృక్షములుగాని పర్వతములుగాని దీనియందుఁ గలవు. నగాః నగసదృశాః ప్రాసాదాదయో ఽత్ర సంతీతి నగరీ- పర్వత సమానములైన రాజగృహములు మొదలైనవి దీనియందుఁ గలవు. పురీనగర్యౌవా స్త్రియౌ, పట్టణ సాహచర్యాత్క్లీబే ఽపి-పురీనగరీ శబ్దములు పట్టణ శబ్ద సాహచర్యమువలన పురం నగరం అని నపుంసకలింగములు గలవు. ౩. ఆపతంతి వణిజో ఽస్మిన్నితి పత్తనం. పత్ ౯గతౌ. పా. ఆపటంతి పట గతౌ. వర్తకులు దీనింగూర్చి వత్తురుగనుక పత్తనము. పట్టణమనియుఁ బాఠము గలదు. ౪. పుటాః పుటికాః ఘటాదయః సమ్మర్దా ద్భిద్యంతే ఽత్ర పుటభేదనం. భిదిర్ విదారణే. పుటములనఁగా ఘటాదులు; అవి దీనియందు ఒరయుటవలన వ్రక్కలౌను. ౫. అకుతో భయత్వాత్ స్థానాయ వాసాయ హితం స్థానీయం. ష్ఠా గతినివృత్తౌ. ఎక్కడను భయములేని దౌటవలన ఉండుటకు యోగ్యమైనది. రాజస్థాన యోగ్యత్వాద్వా స్థానీయం-రాజులుండుటకు యోగ్యమైనది. ౬. నియతం జనోగచ్ఛత్యత్రనిగమః. గమ్ ౯గతౌ. నియతముగా దీనియందు జనులు చేరుదురు. ౭. పట్టణము పేళ్లు. కొందఱు పూర్‌శబ్దము మొదలు ౩ పురము పేళ్లనియు, పత్తనపుట భేదనశబ్దములు ౨ పట్టనము పేళ్లనియు, స్థానీయనిగమశబ్దములు స్థానీయము పేళ్లనియుఁ జెప్పుదురు. అందు ౮౦౦ గ్రామముల వ్యవహారమునకు స్థానమై అన్నిటికిఁ బ్రధానమైయుండునది పురమనంబడును. కోట అగడ్తలచేత దుర్గములై యుండునవి స్థానీయపట్టణము లనంబడును.

**అన్యత్తు యన్మూల నగరాత్పురమ్.** 1

**త చ్ఛాఖా నగరమ్ -**

మూలనగరే అసమ్మానిత జనౌఘస్య సరిదంకే సరో ఽ ంకే వాకల్పితంపురం శాఖానగర మిత్యుచ్యతే - మూలనగరమనఁగా రాజధాని; అందు జనులకు చోటుచాలక నదీసమీపమందుఁ గాని సరస్సమీపమందుఁగాని కట్టఁబడిన వేఱొకపట్టణము శాఖానగర మనంబడును. మూలనగరస్య తరుస్థానీయస్య శాఖాసదృశత్వాత్ శాఖానగరం – తరుస్థానీయమైన ప్రధానపట్టణమునకు కొమ్మవలె నుండునది. ఈ ౧ శాఖానగరముపేరు.

**వేశో వేశ్యా జన సమాశ్రయః,**

విశంతి కాముకా అత్ర వేశః. విశప్రవేశనే. కాముకులు దీని యందుఁ బ్రవేశింతురు. ౧. వేశ్యాజనస్య సమాశ్రయః – వెలయాండ్ర నెలవు. ఈ ౨ వేశ్యలుండు చోటుపేళ్లు.

**ఆపణస్తు నిషద్యాయామ్ -**

ఆసమన్తాత్ పణాయన్తే వ్యవహరన్త్యస్మిన్నితి ఆపణః. పణ వ్యవహారేస్తుతౌ చ. దీనియందు వ్యవహరింతురు. ౧. నిషీదంతి వణిజో ఽ స్యామితి నిషద్యా. షద్ ౢ విశరణగత్యవసాదనేషు. దీనియందు వర్తకులుందురు. ఈ ౨ మళిగ పేళ్లు.

**విపణిః పణ్యవీథికా.** 2

విపణిః ఇ. సీ. పా. విపణా. ౧. పణ్యానాం విక్రీతు మానీతానాం వీథిః పణ్యవీథికా–విక్రియింపఁ దెచ్చిన వస్తువు లుండెడు వీథి. ఈ ౨ అంగడివీథిపేళ్లు.

**రథ్యా ప్రతోళీ విశిఖా -**

రథాయ హితా రథ్యా – రథమునకు యోగ్యమైనది. ౧. ప్రతోలయంతి జనా అస్యామితి ప్రతోళీ. తుల ఉన్మాదే. దీనియందు జనులు మదింతురు. ౨. విశీయంతే ప్రకాశ్యంతే ఽ స్యామితి విశిఖా. శీఙ్స్వప్నే. విపూర్వకత్వాత్ ప్రకాశార్థకత్వం – దీనియందుఁ బ్రకాశింపఁజేయఁబడుదురు. ముండితశిరోవ త్సమభూమిత్వా ద్విశిఖా – ముండితశిరస్సువలె సమభూమిగా నుండునది. ఈ ౩ పురమధ్యమార్గము పేళ్లు. గ్రామమునఁ బ్రధానమైన రచ్చమిట్ట పేళ్లని కొందఱు.

**స్యా చ్చ యో వప్ర మస్త్రియామ్,**

పరిఘోద్ధృతమృత్తికయాయః స్తూపః క్రియతే తత్ర చయ వప్రశబ్దౌ వర్తేతే. తదేవ దుర్గమిత్యుచతే. చీయతే పాషాణాదిభిరితి చయః. చిఞ్ చయనే. పాషాణాదులచేతఁ గట్టఁబడునది. ౧. ఉప్యతే ప్రాకారో உత్ర వప్రః. అ. ప్న. టు వప్ బీజసంతానే. దీనియందు ప్రాకారము పాఁతఁబడును. ౨. అగడ్తలోనుండి యెత్తి ప్రాకారమునకుఁ జుట్టును బలకరముగాఁ బోయఁబడిన మట్టిదిన్నె పేళ్లు.

**ప్రాకారో వరణః సాలః -**

ప్రకర్షేణ క్రియత ఇతి ప్రాకారః. డు కృఞ్ కరణే. లెస్సగాఁ జేయఁబడునది. ౧. వ్రియతే వేష్ట్యతే నగరమనేన వరణః. వృఞ్ వరణే. దీనిచేత పట్టణము చుట్టఁబడును. ౨. స్యతి పర్యంతం కరోతీతి సాలః– పట్టణమునకు కడను జేయునది. సలతి నగరమితి వా సాలః. షల గతౌ. పట్టణమును గ్రమ్ముకొని యుండునది. ఈ ౩ కోట పేళ్లు.

**ప్రాచీనం ప్రాన్తతో వృతిః.** 3

దుర్గాదేః వేణువేత్రమయీా వేష్టనికా ప్రాచీన మిత్యుచ్యతే. ప్రాక్ చీయత ఇత ప్రాచీనం. చిఞ్ చయనే. గ్రామమునకు ముందర నేర్పఱుపఁబడునది. ప్రాగంచతీతి వా ప్రాచీనం. అఞ్చుగతి పూజనయోః. గ్రామము యొక్క మొదట నుండునది. పా. ప్రాక్ ఈర్యత ఇతి ప్రాచీనం. ఈరగతౌ. మొదట పొందఁబడునది. ౧. వ్రియతే உనయా వృత్తిః. ఇ. సీ. వృఞ్ వరణే. దీనిచేతఁ జుట్టిరాఁబడును. ఈ ౨ ఊరిచుట్టు వేసిన వెలుఁగు పేళ్లు.

**భిత్తిః స్త్రీ కుడ్యమ్ -**

భిద్యతే భిత్తిః. ఇ. సీ. భిదిర్ విదారణే. భేదింపఁబడునది. ౧. కౌతి పతనసమయే కుడ్యం. కూ శబ్దే. పడునప్పుడు మ్రోయునది. ఈ ౨ గోడ పేళ్లు.

**ఏడూకం యదన్తర్న్యస్తకీకసమ్,**

ఇల్యతే క్షిప్యతే కీకస మంతరితి ఏడూకం. ఇల స్వప్న క్షేపణయోః. దీనియందు ఎముకలు నడుమ నుంచఁబడును. ఈడ్యత ఇతి ఏడూకం. ఈడస్తుతౌ. అసాధ్యమౌటచేత స్తోత్రము చేయఁబడునది. పా.

ఏడుకం. తథా చోక్తం. "ఉపశల్యం గ్రామాంతిక మేడుక మంతర్గతాస్థి కుడ్యం స్యా" దితి రత్నకోశే. నడుమ యెముక లుంచి కట్టఁబడిన గోడ పేళ్లు.

**గృహం గేహోదవసితం వేశ్మ సద్మ నికేతనమ్.** 4

**నిశాన్తవస్త్య సదనం భవ నాగార మన్దిరమ్,**

**గృహాః పుంసి చ భూమ్న్యేవ నికాయ్య నిలయాలయాః.** 5

**(ధిష్ణ్య మోకో ని సనం స్థానావసథ వాస్తు చ,**

**సంస్థాయ ముటజం ధామ నివేశ శ్శరణం క్షయః.)**

గృహ్ణాతి పురుషేణార్జితం ధనమితి గృహం. గేహం చ. గ్రహ ఉపాదానే. పురుషునిచే సంపాదింపఁబడిన ధనమును గ్రహించునది. ౧. ౨. ఉదకం వసిత మాచ్ఛాదనీకృత మనేనేతి ఉదవసితం. వస ఆచ్ఛాదనే. ఉదకము దీనిచేత ఆచ్ఛాదనముగాఁ జేయఁబడును. ఉదవసియతే బధ్యతే వంశాదిభి రిత్యుదవసితం – వెదురు మొనలైనవానిచేఁ గట్టఁబడునది. ఉత్ ఊర్ధ్వం అవసీయత ఇత్యుదవసితం. షిఞ్ బంధనే. పొడుగుగాఁ గట్టఁబడునది. ౩. విశంత్యత్రేతతి వేశ్మ. న. న. విశ ప్రవేశనే. దీనియందుఁ బ్రవేశింతురు. ౪. సీదంతి తిష్ఠంత్యత్ర సద్మ. న. న. షద్ ౯ విశరణగత్యవసాదనేషు. దీనియందుందురు. ౫. నికేతయంతి నివసంత్యస్మిన్నితి నికేతనం. కిత నివాసే. దీనియందు నివసింతురు. ౬. నితరాం శామ్యతి దుఃఖమత్రేతి నిశాంతం. శము ఉపశమే. దీనియందు దుఃఖము మిక్కిలి శమించును. అవశ్యం నిశాయా మమ్యతే గమ్యత ఇతి నిశాంతం. అమ గతౌ. అవశ్యముగా రాత్రియందు పొందఁబడునది. ౭. అవస్త్యాయంతి సమూహీభవం త్యత్ర జనా ఇతి వస్త్యం. స్త్యై ష్ట్యైశబ్ద సంఘాతయోః. "వష్టివాగురి రల్లోపమవాప్యోరుపసర్గయో" రితి వచనా దకారలోపస్య వైకల్పికత్వాత్. వస్త్యం అవస్త్యం చ. జనులు దీనియందుఁ గూడుదురు. అవ అనెడి ఉపసర్గమునకుండు అకారలోపము వైకల్పికమౌటవలన వస్త్యము. అవస్త్యమును. వస్త్యంవస్తుషు సాధు వస్త్యం. వస్తువులయందు మంచిది. ౮. సీదంత్యత్ర సదనం. షద్ ౯ విశరణగత్య వసాదనేషు. దీనియం దుందురు. ౯. భవంతి బాలా అత్రేతి భవనం. భూ సత్తాయాం. బాలురు దీనియందుఁ జనింతురు. ౧౦. అగాః

వృక్షా౯ స్తంభభూతా నియర్తీత్యగారం. ఋ. గతౌ. స్తంభభూతములైన వృక్షములను బొందియుండునది. ౧౧. మాదతే సుప్యతే ఽత్ర మందిరం. మది స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు. దీనియందు నిద్రింపబడును; సంతోషింపఁబడును గనుక మందిరము. ఈశబ్ధము స్త్రీలింగంబును గలదు. తథా చోక్తం బాణేన.___ "వ్రజతి పథి మనాజ్మం దిరాతస్తవారి" రితి. ౧౨. గృహశబ్దము పుల్లింగమైనపుడు బహువచనమందే వర్తించును. నపుంసకమైనప్పుడు మూఁడువచనములయందును. గృహ్ణంతి ప్రవిష్టానితి గృహాః. గ్రహఉపాదానే. ప్రవేశించినవారిని గ్రహించునది. ౧౩. నిచీయతే ద్రవ్యమత్ర నికాయ్యః. చిఞ్‌చయనే. దీనియందు ద్రవ్యము కూర్చఁబడును. ౧౪. నిలీయన్తే ఆలీయంతే జనో ఽత్రనిలయః. ఆలయశ్చ. లీఙ్‌శ్లేషణే. దీనియందు జనులు అణఁగియుందురు. ఈ ౧౬ ఇంటిపేళ్లు.

**వాసః కుటీ ద్వయోః శాలా సభా -**

వసంత్యస్మిన్నితి వాసః. వస నివాసే. దీనియందు జనులు నివసింతురు. ౧. కుటతి కుటిలీభవతీతి కుటీ. కుట కౌటిల్యే. వక్రమగునది. ౨. శలన్త్యస్యామితి శాలా. ప్స. శలగతౌ. దీనియందు జనులు చేరుదురు. శాల్యతే శాలా. శాల శ్లాఘాయాం. కొనియాడఁబడునది. ౩. సహభాంత్యస్యామితి సభా – దీనియందుఁ గూడికొని ప్రకాశించురు. సమ్యగ్భాతీతి సభా – లెస్సగా నొప్పునది. ఈ ౪ సభాగృహము పేళ్లు.

**సంజవనం త్విదమ్,**

**చతుఃశాలమ్ -**

సంజవన్తే మిథస్సంగచ్ఛన్తే ఽస్మిన్నితి సంజవనం. జుగతౌ. దీనియందు లెస్సగాఁ బొందుదురు. ౧. చతసృణాం శాలానాం సమాహార శ్చతుశ్శాలం– నాలుగుశాలలయొక్క కూటమి. పా. చతుశ్శాలా. ౨ నలుదిక్కుల యందు అభిముఖముగా నడుమ నెడము విడిచి కట్టిన యింటి పేళ్లు.

**మునీనాం పర్ణశాలోటజో ఽ స్త్రియామ్.** 6

పర్ణైః కృతాశాలా పర్ణశాలా – ఆకులచేతఁ గట్టఁబడినది. ౧. ఉటైస్తృణ పర్ణై ర్జాయత ఇత్యుటజః. అ. ప్స. జనీ ప్రాదుర్భావే. ఉటము

లనఁగాఁ దృణపర్ణములు, వానిచేతఁ గలిగినది. ఈ ౨ మునుల యింటి పేళ్లు.

**చైత్య మాయతనం తుల్యే -**

చీయతే పాషాణాదినా చైత్యం. చిఞ్ చయనే. పాషాణాదులచేఁ గట్టఁబడునది. ౧. ఆయతన్తే ఽస్మిన్నితి ఆయతనం - దీనియందు యత్నము చేయుదురు. ఈ ౨ యజ్ఞశాలపేళ్లు. బౌద్ధాలయమని కొందఱు-రచ్చచెట్లని మఱికొందఱు.

**వాజిశాలా తు మన్దురా,**

వాజినాం శాలా వాజిశాలా - గుఱ్ఱముల చావడి. ౧. మందంతే అశ్వా అత్ర మందురా. మది స్తుత్యాదౌ. దీనియందు గుఱ్ఱములు మదించును. ఈ ౨ గుఱ్ఱపు చావడి పేళ్లు.

**ఆవేశనం శిల్పిశాలా -**

ఆవిశంతి కర్మకారయితారో ఽత్ర ఆవేశనం. విశప్రవేశనే. దీనియందు పనులు చేయించువారు ప్రవేశింతురు. ౧. సువర్ణకారాది శిల్పినాం శాలా శిల్పిశాలా-స్వర్ణకారాది శిల్పులయొక్క శాల. ఈ ౨ కంసాలి కొట్టము పేళ్లు.

**ప్రపా పానీయశాలికా.** 7

ప్రకర్షేణ పిబంత్యస్యామితి ప్రపా. పా పానే. దీనియందు ఉదకమును మిక్కిలి పానముచేయుదురు. ౧. పానీయస్య జలస్య శాలా పానీయశాలికా - జలముయొక్క యిల్లు. ఈ ౨ చలిపందిరి పేళ్లు.

**మఠ శ్ఛాత్రాది నిలయః -**

మఠన్తే ఽస్మిన్నితి మఠః. మఠ మదనివాసయోః. దీనియందు నివసింతురు. ఛాత్రో ఽన్తేవాసీ ఆదిరేషాంతే పరివ్రాజక క్షపణకాదయః, తేషాం నిలయః. ఈ ౨ శిష్యులు సన్యాసులు మొదలగువారి గృహము (మఠము) పేళ్లు.

**గఞ్జాతు మదిరాగృహమ్,**

గఞ్జంతి శబ్దాయంతే ఽస్యామితి గంజా. గజి శబ్దే. దీనియందు కూఁతలు పెట్టుదురు. ౧. మదిరాయా స్సంధానగృహం మదిరాగృహం - మద్యమును చేసియిచ్చునట్టి యిల్లు. ఈ ౨ మద్యముచేయు నింటి పేళ్లు.

**గర్భాగారం వాసగృహమ్ -**

నిర్వాతత్వాత్ గర్భఇవ అగారం గర్భాగారం–గర్భమువలె గాలిలేక యుండునది. ౧. వాసస్య శయనస్య యోగ్యం గృహం వాసగృహం– శయనమునకు యోగ్యమైన యిల్లు. ఈ ౨ పడకటింటి పేళ్లు. గర్భాగార మనఁగా దేవతాగృహమని కొందఱు.

**అరిష్టం సూతికా గృహమ్.** 8

మంత్రాదినా కృతరక్షత్వాత్ గ్రహైర్న రిష్యతే న హింస్యతే బాలకాదిర త్రేత్యరిష్టం. రిష హింసాయాం. మంత్రాదులచేతఁ జేయఁబడిన రక్షణ గలుగుట వలనఁ బిశాచాదులచేత పీడింపఁబడని బాలకాదులు గలిగినది. ౧. సూతికా అభినవసూతికా తస్యాః గృహం సూతికాగృహం–క్రొత్తగా బిడ్డనుగన్న బాలెంతయిల్లు. పా. సూతిగృహం. ఈ ౨ పురుటింటి పేళ్లు.

**వాతాయనం గవాక్షః -**

వాతస్య అయనం మార్గో వాతాయనం – వాయువునకు మార్గము. ౧.గవాం కిరణానాం అక్షో వ్యాపారో ఽ త్రేతి గవాక్షః. అక్షూవ్యాప్తౌ. గోవులనఁగా కిరణములు, దాని వ్యాపారము దీనియందుఁ గలదు. ఈ ౨ గవాక్షి పేళ్లు.

**అథ మణ్డపో ఽ స్త్రీ జనాశ్రయః,**

మణ్డ్యతే జనైరితి మణ్డపః. అ. ప్న. మడి భూషాయాం. జనులచేత నలంకరింపఁబడునది. ౧. జనానామాశ్రయః జనాశ్రయః – జనులకు ఆశ్రయము. ఈ ౨ కొలువుచావడి మొదలైనదాని పేళ్లు. స్త్రీ లుండఁదగిన మండపమని కొందఱు.

**హర్మ్యాది ర్ధనినాం వాసః -**

మనో హరతీతి హర్మ్యం. హృఞ్ హరణే. మనస్సును హరించునది. ౧ ధనినాం వాసః – ధనికుల యిల్లు. ఆదిశబ్దముచేత అట్టాలకాది నామములుం గలవు. ధనికుల గృహము పేరు.

**ప్రాసాదో దేవభూభుజామ్.** 9

ప్రసీద న్త్యస్మిన్నితి ప్రాసాదః. పద్ ౢ విశరణగత్యవసాదనేషు. దీనియందు ప్రసన్నులై యుందురు. ప్రముదితా స్సీదంత్యస్మిన్నితి ప్రాసాదః – దీనియందు సంతుష్టులై యుందురు. దేవగృహమునకును రాజ

గృహమునకును పేరు.

**సౌధో ఽ స్త్రీ రాజసదనమ్ -**

సుధాయోగాత్ సౌధః. సుధ యనఁగా సున్నము; అదిగలది. ౧. రాజ్ఞాం సదనం రాజసదనం – రాజులయొక్క గృహము. ఈ ౨ రాజగృహము పేళ్లు.

**ఉపకార్యోపకారికా,**

ఉప సమీపే క్రియత ఇత్యుపకార్యా–ప్రయాణ సమయమమందుఁ జేయఁ బడునది. పటాదిభిరుప క్రీయత ఇత్యుపకార్యా పటాదులచే నిర్మితమైనది. ౧. ప్రయాణాయ ఉపకరోతీతి ఉపకారికా. డు కృఞ్ కరణే. ప్రయాణము కొఱకు ఉపయోగించునది. ఈ ౨ గుడారము (విడిది యిల్లు) పేళ్లు. సామాన్యముగా రాజగృహముపేళ్లని కొందఱు.

**స్వస్తికః సర్వతోభద్రో నన్ద్యావర్తాదయో ఽ పి చ.** 10

**విచ్ఛన్దకః ప్రభేదా హి భవన్తీశ్వరసద్మనామ్,**

స్వస్తికాదయ శ్శబ్దాః ఈశ్వరసద్మనాం రాజదేవగృహాణాం ప్రభేదాః ద్వారాళిందాది రచనావిశేషజన్యాః భేదా భవంతి. ఆదిశబ్దేన రుచక వర్ధమానాదయః. తథా చోక్తం ___ "స్వస్తిక స్సర్వతోభద్రో రుచకో వర్ధమానకః, నంద్యావర్తాదయశ్చాపి ద్వారాళిందాది భేదజాః" స్వస్తిక సర్వతో భద్ర నంద్యావర్త విచ్ఛన్దక శబ్దములు, ఆదిశబ్దముచేత రుచకవర్ధమానాదులును రాజదేవగృహములయొక్క ద్వార భేదముల వలనను, ఆళింద భేదములవలనను బుట్టిన రచనావిశేషములపేళ్లు. స్వస్తి క్షేమంకరోతీతి స్వస్తికః – శుభమును జేయునది. ఇది తూర్పువాకిలి గల యిల్లు. ౧. సర్వతోభద్ర మస్య సర్వతోభద్రః – అంతట శుభముగలిగినది. ఇది నాలుగు వాకిళ్లు గల యిల్లు. ౨. నంద మానంద మావర్త యతీతి నంద్యా వర్తః. వృతువర్తనే. ఆనందమును బ్రవర్తింపఁజేయునది. ఇది పడమటి వాకిలి లేక మిగిలిన మూఁడు వాకిళ్లు గల యిల్లు. తథాచ సంహితాయాం వరాహమిహిరః ___ "అపరో ఽంత్యగతో ఽ ళిందః ప్రాంతరగతౌ తదుత్థితౌచాన్యౌ, తదవధి ధృతశ్చాన్యః ప్రాగ్ద్వారం స్వస్తికం శుభదం. అప్రతిషిద్ధాళిందం సమంతతో వాస్తు సర్వతో భద్రం, నృపవిబుధ సమూహానాం కార్యం ద్వారై శ్చతుర్భిరపి. నంద్యావర్త మళిందై శ్శాలాకుడ్యా త్ప్రదక్షిణాం

తగత్తైః, ద్వారం పశ్చిమ మస్మిన్ శేషాణి కార్యాణి. ప్రాక్పశ్చి మావళిందావంత్యగతౌ తదస్థితౌ శేషౌ, రుచకం ద్వారం న శుభ ముత్తరతో ఽ న్యాని శస్తాని. ద్వారాళిందో ఽ ంత్యగతః ప్రదక్షిణో ఽ న్యస్తతశ్చాన్యః, శుద్ధశ్చ వర్ధమానో ద్వారం తు న దక్షిణం కార్య" మితి. విశిష్టశ్ఛన్దో ఽ త్ర విచ్ఛన్దకః. యద్వా విశిష్టాఇఛన్దయతి సాభిలాషా న్కరోతీతి విచ్ఛన్దకః. పా. విచ్ఛర్దకః. ఉత్తమమైన ఛందముగలది. లేక ఉత్తములకుఁ గోరికఁ బుట్టించునది. ఈ ౪ ఈశ్వర గృహ భేదములు.

**స్త్ర్యగారం భూభుజా మన్తఃపురం స్యా దవరోధనమ్.** 11

**శుద్ధాన్తశ్చావరోధశ్చ -**

అంత రభ్యంతరం పురం గృహ మంతఃపురం. "అగారే నగరేపుర" మితి రత్నమాలాయం. పురమనఁగా గృహము. లోపలిగృహము అంతఃపురము. ౧. అవరుధ్యంతే రాజస్త్రియో ఽ త్ర అవరోధనం. అవరోధశ్చ. రుధిర్ ఆవరణే. రాజస్త్రీలు దీనియందు నిరోధింపఁబడుదురు. ౨. శుద్ధాః పరిశుద్ధాః రక్షకాః అంతే సమీపే అస్యేతి శుద్ధాన్తః - పరిశుద్ధులైన రక్షకులు సమీపమందుఁ గలిగినది. ఈ ౩ రాజస్త్రీలుండు గృహము పేళ్లు.

**స్స్యా దట్టః క్షౌమ మస్త్రియామ్,**

అట్టంతే హింసన్త్యత్ర అట్టః. అట్ట అతిక్రమహింసనయోః. దీనియందుఁ బీడింతురు. ౧. క్షువంతి శబ్దాయంతే యోధా అత్రక్షౌమం. అ. ప్న. టు క్షు శబ్దే. యుద్ధము చేయుటకై వాకిటి మండపముమీఁదఁగాని కొత్తళముమీఁదఁగాని యుద్ధముచేయువారు దీనియందుఁ గూఁతలు పెట్టుదురు. పా. క్షోమం. ఈ ౨ కట్టినయిండ్ల పేళ్లు. మేడలయొక్క వెనుక ప్రక్కఁగట్టిన యింటి పేళ్లని కొందఱు.

**ప్రఘాణ ప్రఘ ణాలిన్దా బహిర్ద్వార ప్రకోష్టకే.** 12

ప్రహన్యతే ఘటాది రనేన ప్రఘాణః. ప్రఘణశ్చ. హన హింసాగత్యోః. కడవ మొదలైనవి దీనిచేత పగులఁగొట్టఁబడును. ప్రవిశద్భిర్జనైః మన్యత ఇతి ప్రఘాణః - ప్రవేశించు జనులచేఁ దన్నఁబడునది. ౧, ౨. అల్యతే భూష్యత ఇత్యళిన్దః. అల భూషణపర్యాప్తి వారణేషు. అలంకరింపఁబడునది. పా. ఆళిందః. తథా చ అమరమాలాయం.__

"గృహైకదేశ ఆళిందః ప్రఘాణః ప్రఘణస్తథే" తి. వాకిలితొట్టికట్టునకు వెలుపల నుండు తలవాకిలిముందర నుండు చావడి పేళ్లు.

**గృహావ గ్రహణీ దేహళీ -**

గృహమవగృహ్యతే పరిచ్ఛిద్యతే అనయా గృహావగ్రహణీ. ఈ. సీ. గ్రహ ఉపాదానే. గృహము దీనిచేత ఇంతయని వ్యవచ్ఛేదింపఁబడును. ౧. సుధాదినా దిహ్యత ఇతి దేహళీ. ఈ. సీ. దిహ ఉపచయే. సున్నము మొదలైనవానిచేతఁ బూయఁబడునది. దేహం ప్రవేశేన లాతీతి దేహళీ. లా ఆదానే. ప్రవేశముచేత దేహమును గ్రహించునది. ౨. కడప పేళ్లు.

**అఙ్గణం చత్వ రాజిరే,**

అంగన్త్యత్రేతి అంగణం. అగి గతౌ. జనులు దీనిని బొందుదురు. పా. అంగనం. "అంగనం ప్రాంగణే యానే కామిన్యా మంగనామ" తేతి విశ్వప్రకాశః. అంకణమనియుఁ గలదు. ౧. అత్రస్థిత్వా యాచకైః చత్యత ఇతి చత్వరం. చతే యాచనే. దీనియందుండి యాచకులడుగుదురు. ౨. అజంతి క్షిపంతి ధాన్యాదికమత్రే త్యజిరం. అజ గతి క్షేపణయోః. దీనియందు ధాన్యాదులఁ జల్లుదురు. ఈ ౩ ముంగిలి పేళ్లు.

***అధస్తాద్దారుణి శిలా -**

శాల్యతే శ్లాఘ్యత ఇతి శిలా. శాల శ్లాఘాయాం. కొనియాడఁబడునది. 'శిలా ద్వారాదధస్స్తంభదృషదోశ్శిలముంఛక" ఇత్య జయః. ద్వారస్తంభము క్రింద నడ్డముగానున్న త్రొక్కుడుపలక (బురదపట్టె) పేరు.

**నాసా దారూపరిస్థితమ్.** 13

గృహస్య నాసికేవ తిష్ఠతీతి నాసా – ఇంటికి ముక్కువలె నుండునది. "నాసా ద్వారోర్ధ్వకాష్ఠే స్యా న్నాసికాయాం చ కీర్తి" తే త్యజయః. ౧. ఆశిలమీఁద ద్వార స్తంభముల నడుమ నడ్డముగానున్న కొయ్యపేరు. ద్వారముమీఁదనున్న మాను (లక్ష్మిపట్టె) పేరని కొందఱు. మేడలు మొదలగువానియందలి మఱుఁగువాకిలి పేళ్లని కొందఱు.

**ప్రచ్ఛన్న మన్తర్ద్వారం స్యాత్ -**

ప్రచ్ఛాద్యత ఇతి ప్రచ్ఛన్నం. ఛద అపవారణే. కప్పఁబడునది. ౧. అంతః స్థితం ద్వారమంతర్ద్వారం–లోపలివాకిలి. ఈ ౨ లోపలివాకిలిపేళ్లు.

**పక్షద్వారం తు పక్షకః.**

పక్షే పార్శ్వే ద్వారం - పార్శ్వమునందుండునట్టి వాకిలి. గృహస్య పక్షే పార్శ్వేక్రియత ఇతి పక్షకః–గృహముయొక్క పార్శ్వము నందుఁ జేయఁబడునది. ఈ ౨ దిడ్డివాకిలి పేళ్లు.

**వలీకనీవ్రే పటలప్రాన్తే -**

వలతి సంవృణోతి కుడ్యమితి వలీకం. వల సంవరణే. గోడను గప్పునది. ౧. నిశ్చయేన వ్రియతే అనేనేతి నీవ్రం. వృఞ్ వరణే. నిశ్చయముగాఁ గప్పబడునది. ౨. పటలస్య ప్రాంతఃపటలప్రాంతః – కప్పుయొక్కకొన. ఈ ౩ చూరుకొణిగె పేళ్లు.

**అథ పటలం ఛదిః.** 14

పటకార్యం లాతీతి పటలం. లా దానే. కోకయొక్క ప్రయోజనము నిచ్చునది. ౧. ఛాద్యతే అనేనేతి ఛదిః. స. న. ఛద అపవారణే. దీనిచేత నిల్లు కప్పఁబడును. ఈ ౨ కప్పు పేళ్లు.

**గోపానసీ తు వలభీచ్ఛాదనే వక్రదారుణి,**

గోపాయతీతి గోపా. గూపూ రక్షణే. నాసేవ నాసా. గోపాచాసౌ నాసాచ గోపానసీ. ఈ. సీ. ఇంటికి కప్పైన నాసికవలె నుండునది. ౧. వలతి సంవృణోతీతి వలభీ. ఈ. సీ. వల సంవరణే. కప్పుకొనియుండునది. ఈ ౨ కొణిగెకు ఆధారమైన పట్టె దానిని గప్పుచున్న వంకరవ్రాకు గోపానసి యనంబడును. గృహమునకు కప్పైన వక్రదారువు పేళ్లని కొందఱు.

**కపోతపాలికాయాం తు విటఙ్కం పుంనపుంసకమ్.** 15

కపోతా న్పాలయతీతి కపోతపాలికా. పాల రక్షణే. కపోతము లనఁగాఁ బావురములు. వానిని రక్షించునది. ౧. వీ౯ పక్షిణః టంకయతి బధ్నాతీతి విటంకం. అ. ప్న. టకి బంధనే. పక్షులను బంధించునది. ఈ ౨ మేడలు మొదలైన విహార స్థానములయందు చతురములైన పక్షులుండెడు వ్రాఁకు పేళ్లు.

**స్త్రీ ద్వా ర్ద్వారం ప్రతీహారః -**

వార్యతే నూతనపురుషో ఽత్ర ద్వాః. ర. సీ. ద్వారం చ. వృఞ్ ఆవరణే. క్రొత్తఁగా వచ్చినవారు దీనియందు నివారింపఁబడుదురు. ద్వార్శబ్దము రేఫాంతస్త్రీలింగము. ౧, ౨. ప్రతిహ్రియంతే రుధ్యంతే జనా

అనేనేతి ప్రతీహారః. హృఞ్ హరణే. దీనిచే జనులు అడ్డగించఁబడుదురు. ఈ ౩ వాకిటి పేళ్లు.

**స్యా ద్వితర్దిస్తు వేదికా,**

శ్రమం వితర్దయతీతి వితర్దిః. ఇ-సీ. తర్ద హింసాయాం. బడలికను జెఱుచునది. ౧. విదంత్యస్యామితి వేదికా. విదజ్ఞానే. దీనియందుండి అన్నిటిని నెఱుఁగుదురు. పథికై ర్విద్యతే లభ్యతేవా వేదికా. విద్ ౡలాభే. తెరువరులచేఁ బొందఁబడునది. ఈ ౨ అరఁగు పేళ్లు.

**తోరణో ఽ స్త్రీ బహిర్ద్వారమ్ -**

మంగళార్థం త్వరితా భవంత్యత్ర తోరణం. తుర త్వరణే. మంగళముకొఱకు దీనియందు త్వరితులగుదురు. ౧. ద్వారాద్బహిః బహిద్వారం-పుష్పమాలికాదులు గట్టుటకయి గృహములకు వెలుపల స్తంభద్వయముచేత ద్వారమువలెఁ గట్టఁ బడునది తోరణ మనంబడును.

**పురద్వారం తు గోపురమ్.** 16

గోప్యతే శూరైరితి గోపురం గుపూ రక్షణే. శూరులచే రక్షింపఁబడునది. ఈ ౧ పట్టణమువాకిలి పేరు.

**కూటం పూర్ద్వారి యద్దస్తినఖ స్తస్మిఙ్ -**

హస్తినఖ ఇవ తిష్ఠతీతి హస్తినఖః - ఏనుఁగుగోరువలె నుండునది. ఈ ౧ పట్టణమువాకిట గొబ్బున శత్రువులు రాకుండునట్లు నిమ్నోన్నతముగా వేసిన మట్టి దిన్నె పేరు.

**అథ త్రిషు,**

**కవాట మరరం తుల్యే -**

కం వాతం వాటయతీతి కవాటం. అ. త్రి. గాలిని నిలుపునది. పా. ప్రవిశతాం కం శిరః పాటయతీతి కపాటం. పట భేదనే. ప్రవేశించువారి శిరమును భేదించునది. కైర్వాతైః పాటయతి భాషత ఇతి కపాటం. పటశబ్దే. వాయువుచేత శబ్దించునది. ౧ ఇయర్తి యాతాయాత ప్రకారేణే త్యరరం. అ. త్రి.ఋ గతౌ. ఇట్టట్టు చలించునది. ౨. పుల్లింగమైనపుడు అరరి యని ఇకారాంతము. తథాచ.____ "ప్రేర్యంతే ఽ మీ పర మరరయో హర్మ్యవాతాయనానా" మితి కప్పిణాభ్యుదయః. ౨ తలుపు పేళ్లు.

**తద్విష్కమ్భే ఽ ర్గలం ననా.** 17

విష్కభ్నోతి బధ్నాతీతి విష్కంభం. ష్కభి ప్రతిబంధే. తలుపు నడ్డగించునది. ౧. అరేణ కర్షణేన గళతీత్యర్గళం. స్న. గళ అవస్రంసనే. తీయునపుడు జాఱివచ్చునది. ఈశబ్దము పుల్లింగంబును గలదు. తథాచ రభసః.___ "అర్గళం త్రిషు కల్లోలే దండే చాంతః కవాటయో" రితి. గడియ మ్రానిపేరు.

**ఆరోహణం స్యా త్సోపానమ్ -**

ఆరోహంత్య నేనేత్యారోహణం. రుహ బీజ జన్మని ప్రాదుర్భావేచ. దీనిచేత ఉన్నతస్థలము నెక్కుదురు. ౧. సహ ఉపానమం త్యస్తిన్నితి సోపానం. ణము ప్రహ్వత్వే శబ్దే. దీనియందు ఎక్కునప్పుడు దిగునపుడును ఇంచుకంత వంగుదురు. ఈ ౨ మెట్టు పేళ్లు.

**నిఃశ్రేణి స్త్వధిరోహిణీ,**

నిశ్చయేన శ్రయంతి ఉన్నత స్థలమనయేతి నిశ్రేణిః. ఇ. స. శ్రిఞ్ సేవాయాం. దీనిచేత ఉన్నత స్థలమును నిశ్చయముగాఁ బొందుదురు. ౧. అధిరోహంత్యనయేతి అధిరోహిణీ. ఈ. సీ. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. దీనిచేత ఉన్నత స్థలము నెక్కుదురు. ఈ ౨ నిచ్చెన పేళ్లు.

**సంమార్జనీ శోధనీ స్యాత్ -**

సమ్మృజ్యతే అనయేతి సమ్మార్జనీ. ఈ. సీ. మృజూ శుద్ధౌ. దీనిచేత లెస్సగా స్థలము శుద్ధిచేయఁబడును. ౧. శుధ్యతే అనయేతి శోధనీ. ఈ. సీ. శుధ శౌచే. దీనిచేత శోధింపఁబడును. ఈ ౨ చీఁపురుకట్ట పేళ్లు.

**సంకరో ఽ వకరస్తయా.** 18

**క్షిప్తే -**

సంకీర్యతే అవకీర్యత ఇతి సంకరః, అవకరశ్చ. కౄ విక్షేపే. పాఱఁజల్లఁబడునది. ఈ ౨ చీఁపురుకట్టచేఁ దుడువఁబడిన కసవు దుమ్ము మొదలైనదాని పేళ్లు.

**ముఖం నిఃసరణమ్ -**

గృహస్య ముఖప్రాయత్వాత్ ముఖం – గృహమునకు ముఖమువంటిది. ౧. గృహాత్ నిస్సరంత్య నేనేతి నిస్సరణం. సృ గతౌ. గృహము నుండి దీనిచేత వెడలుదురు. ఈ ౨ ఇంటివాకిటనుండెడు ప్రదేశము పేళ్లు.

**సంనివేశో నికర్షణమ్,**

సమంతాన్ని విశంత్యత్ర సన్నివేశః. విశ ప్రవేశనే. అంతటట సంచారార్థమై దీనియందుఁ బ్రవేశింతురు. ౧. నివృత్తం కర్షణ మత్ర నికర్షణం. కృషవిలేఖనే. దీనియందు దున్నుట లేదు. ఈ ౨ పట్టణము చుట్టువాఱిన బయలుపేళ్లు.

**సమౌ సంవసథగ్రామౌ -**

సంవసంత్యత్ర సంవసథః. వస నివాసే. దీనియందు లెస్సగా నుందురు. ౧. గ్రస్యతే భుజ్యత ఇతి గ్రామః. గ్రసు అదనే. ప్రాణులచేత భుజింపఁబడునది. ఈ ౨ గ్రామము పేళ్లు.

**వేశ్మభూర్వాస్తు రస్త్రియామ్.** 19

వేశ్మనో భూః వేశ్మభూః–ఇంటియొక్క భూమి. ౧. వసంత్యస్మిన్నితి వాస్తుః ఉ. ప్న. వస నివాసే. దీనియందుండుదురు. ఈ ౨ ఇల్లు గట్టఁదగిన భూమిపేళ్లు.

**గ్రామాన్త ముపశల్యం స్యాత్ -**

గ్రామస్య అంతం గ్రామాంతం – గ్రామముయొక్క సమీపము. ౧. ఉపగతః శల్యః కీలకో యస్య ఉపశల్యం–నేల గుఱుతు దెలియుటకుఁగాను సమీపమందు శిలగలిగినది. ఈ ౨ గ్రామసమీప ప్రదేశము పేళ్లు.

**సీమ సీమే స్త్రియా ముభౌ,**

సీయతే బధ్యత ఇతి సీమా. న. సీ. సీమా చ. ఆ. సీ. షిఞ్ బంధనే. ఇంత మేర యని కట్టఁబడునది. ఈ ౨ పొలిమేర గుఱుతు పేళ్లు.

**ఘోష ఆభీరపల్లీ స్యాత్ -**

ఘోషంతి గావో ఽత్ర ఘోషః. ఘుషిర్ అవిశబ్దనే శబ్దే చ. దీనియందు గోవులు ఘోషించును. ౧. ఆబిభ్యతి; అభితః గాః ఈరయంతీతివా ఆభీరాః గోపాః, తేషాం పల్లీ ఆభీరపల్లీ. ఈ. సీ. ఞి భీ భయే. ఈర ప్రేరణే. వెఱచువారుగాని గోవులనంతటట ప్రేరేపించువారుగాని ఆభీరులు, అనఁగా గొల్లలు వారి పల్లె. ఈ ౨ గొల్లపల్లె పేళ్లు.

**పక్కణః శబరాలయః.** 20

పచ్యతే కదన్నమత్రేతి పక్కణః. డు పచష్ పాకే. కుత్సితాన్నము దీనియందుఁ బాకము చేయఁబడును. ౧. శబంతే భ్రమంతీతి శబరాః,

శబ భ్రమణే. తేషామాలయశ్శబరాలయః - భ్రమించువారు శబరులు; వారికి ఆలయము శబరాలయము. ఈ ౨ బోయపల్లె పేళ్లు.

## శైల వర్గము

**మహీధ్ర శిఖరిక్ష్మా భృదహార్య ధర పర్వతాః,**
**అద్రి గోత్ర గిరి గ్రా వాచల శైల శిలోచ్చయాః.** 1

మహీం కీలభూతో ధరతీతి మహీధ్రః. ధృఙ్ ధరణే. భూమిని చీలవలె నుండి ధరించునది. ౧. శిఖరాణ్యస్యసన్తీతి శిఖరీ. న. పు. శిఖరములు గలది. ౨. క్ష్మాం బిభ ర్తీతి క్ష్మాభృత్. త. పు. డు భృఙ్ ధారణపోషణయోః. భూమిని ధరించునది. ౩. హర్తుమశక్యః అహార్యః. హృఞ్ హరణే. హరింప నశక్యమైనది. ౪. ధరతి భువం ధరః. ధృఙ్ ధరణే. భూమిని ధరించునది. ౫. పర్వాణి సంధయో ఽస్య పర్వతః-సంధులు గలిగినది. ౬. నరాణా ముపజీవనీయత్వాత్ అద్యత ఇత్యద్రిః. ఇ. పు. అదభక్షణే. ఫలమూలద్వారమున నరులచేత భక్షింపఁబడునది. ౭. గాం భువం త్రాయత ఇతి గోత్రః. త్రైఙ్ పాలనే. భూమిని రక్షించునది. ౮. కాలేన గీర్యత ఇతి గిరిః. ఇ. పు. గ్రావా చ న. పు. గృా నిగరణే. కాలముచేతఁ జెఱుపఁబడునది. ౯, ౧౦. న చలతీత్యచలః. చల కంపనే. చలింపనిది. ౧౧. శిలా అత్ర సంతీతి శైలః-శిలలు దీనియందుఁ గలవు. ౧౨. శిలానాముచ్చయః శిలోచ్చయః-శిలలయొక్క సమూహము. ఈ ౧౩ కొండ పేళ్లు.

**లోకాలోక శ్చక్రవాళః -**

అస్యాభ్యంతరం సూర్యకిరణైః ప్రకాశ్యతేన బాహ్యమితి ప్రకాశా, ప్రకాశతయా లోక్య తేనలోక్యత ఇతి చ లోకాలోకః. లోకృదర్శనే. ఈ పర్వతముయొక్క లోపలి పార్శ్వము సూర్యకిరణములచేత ప్రకాశించును. వెలుపలి పార్శ్వము ప్రకాశింపదు గనుక కొంత చూడఁబడునదియు, కొంత చూడఁబడనిదియు నగుటచే లోకాలోకము. ౧. చక్రాకారేణ వలతే సంవృణోతీతి చక్రవాళః. వల సంవరణే. చక్రాకారమున భూమినిఁ జుట్టియుండునది. ఈ ౨ భూమికి కోటవలె చుట్టువాటి యుండు పర్వతము పేళ్లు.

**త్రికూటస్త్రి కకు త్సమౌ,**

త్రయః కూటాః శిఖరాణి యస్య సత్రికూటః. త్రయః కకుదోయస్య త్రికకుత్. ద. పు. మూఁడు శిఖరములు గలది. ఈ ౨ త్రికూట పర్వతము పేళ్లు.

**అస్తస్తు చరమక్ష్మాభృత్ -**

అస్త మనుపలబ్ధిం గ్రహనక్షత్రాణాం కరోతీతి అస్తః – గ్రహనక్షత్రములకు అప్రకాశమును గలిగించునది. ౧. చరమః పశ్చిమః సచాసౌ క్ష్మాభృచ్చ చరమక్ష్మాభృత్. త. పు. పడమటిదిక్కుననుండు కొండ. ఈ ౨ అస్తమయ పర్వతము పేళ్లు.

**ఉదయః పూర్వపర్వతః.** 2

ఉత్యన్తి గ్రహా స్సూర్యాదయ అస్మాత్ ఉదయః. ఇణ్ గతౌ. దీనియందు సూర్యాదులు ఉదయింతురు. ౧. పూర్వశ్చాసౌ పర్వతశ్చ పూర్వపర్వతః – తూర్పు దిక్కున నుండెడు పర్వతము. ఈ ౨ ఉదయపర్వతముపేళ్లు.

**(హిమాలయో ఽ ద్రి రాజ స్స్యాన్మలయ శ్చన్దనాలయః)**
**హిమవా న్నిషధో విన్ధ్యో మాల్యవా న్పారియాత్రకః,**
**గన్ధమాదన మన్యే చ మేమకూటాదయో నగాః.** 3

హిమమస్యాస్తీతి హిమవాన్. త. పు. మంచుగలిగినది. ఇది కింపురుష వర్షమునకు దక్షిణమందు మేరయై యుండునది. ౧. నిషీదంతి సురా అత్రేతి నిషధః. షద్ ౯ విశరణగత్యవసాదనేషు. సురలు దీనియందుందురు. ఇది హరివరమనెడు వర్షమునకు ఉత్తరమందు బాలసూర్య ప్రకాశమైయుండును. ౧. అగస్త్యేన విద్ధత్వాత్ వింధ్యః. వ్యథ తాడనే. అగస్త్యునిచే వ్యథఁబొందినది. అది భారతవర్షమందుండు కులపర్వతము. సూర్యపదవీం విధ్యతీతివా వింధ్యః – సూర్య గమనము నడ్డగించినది. ౧. మాల్యాకారతాస్యాస్తీతి మాల్యవాన్; మాల్యమనఁగాఁ బూలదండ. అట్టి ఆకారముగలది ఇదియే క్రౌంచపర్వతము. ఇది మేరు పర్వతమునకుఁ బడమట గంధమాదన సమప్రమాణమై యుండును. ౧. పరితో యాత్రా గమన మస్యాస్తీతి పారియాత్రకః–చుట్టువాఱ నడచుట గలిగినది. అది

భారతవర్షమందు కులపర్వతము. ౧. గన్ధేన మాదయతి హర్షయతీతి గంధమాదనం. మదీ హర్షగ్లపనయోః. పుష్పగంధముచేత సంతోషింపఁజేయునది. అయం పుల్లింగే౽పి. "సుగంధిర్గంధమాదన" ఇతి కాళిదాసప్రయోగాత్. ఇది మేరుపర్వతమునకుఁ దూర్పున నుండునది. ౧. హేమమయాః కూటా అస్య హేమకూటః – బంగారుశిఖరములు గలది. అది కింపురుషవర్షమునకు నుత్తరమున నుండునది. ౧. ఆదిశబ్దముచేత మలయదర్దురములు మొదలైన మఱికొన్ని పర్వతములు గలవు. ప్రత్యేకము తమతమ నామములచేతనే ప్రసిద్ధములైన పర్వతముల పేళ్లు.

**పాషాణ ప్రస్తర గ్రావోపలాశ్మానశ్శిలా దృషత్,**

వస్తూని పినష్టి చూర్ణయతీతి పాషాణః. పిష్ ౯ సంచూర్ణనే. వస్తువులను చూర్ణము చేయునది. ౧. స్తృణాతి ఆచ్ఛాదయతి భువమితి ప్రస్తరః. స్తృఞ్ ఆచ్ఛాదనే. భూమిని గప్పునది. ౨. ఆతపాదిభిస్తప్తస్సన్ జలం గిరతీతి గ్రావా. న. పు. గౄనిగరణే. ఎండచేఁ గ్రాఁగినదై జలమును గ్రహించునది. ౩. ఉపలాతి భినత్తి వస్తూనీతి ఉపలః. లా ఆదానే. వస్తువుల ఖండించునది. ౪. అశ్నుతే వ్యాప్నోతి భువ మశ్మా. న. పు. అశూ వ్యాప్తౌ. భూమిని వ్యాపించునది. ౫. శినోతి తనూకరోతి ఆయుధమితి శిలా. శిఞ్ నిశాతనే. ఆయుధమును గృశింపఁజేయునది. ౬. దృణాతీతి దృషత్. ద. సీ. దౄ హింసాయాం. హింసించునది. పా. దృశత్. ఈ ౭ ఱాతి పేళ్లు.

**కూటో౽ స్త్రీ శిఖరం శృఙ్గమ్ -**

కూట్యతే దహ్యతే సూర్యదావాభ్యాం కూటః. అ. ప్న. కూటదాహే. సూర్యదావాగ్నులచేత దహింపఁబడునది. ౧. శిఖేవాగ్ర శిలా అస్యాస్తీతి శిఖరం. అ. ప్న. శిఖవంటి కొనఱాయిగలది. "సారాంధకార శిఖర సహస్రాంగారతోరణా" ఇతి పున్నపుంసకాధికారే చంద్రగోమినా పఠితత్వాత్ శిఖరశబ్దస్య పుంస్త్వమపి. ౨. శృణాని హినస్తీతి శృంగం. శౄ హింసాయాం. హింసించునది. ఈ ౩ పర్వతశిఖరముపేళ్లు.

**ప్రపాతస్తు తటో భృగుః.** 4

ప్రపతంత్యస్మాదితి ప్రాపాతః. పత్ ౯ గతౌ. దీనినుండి పడుదురు. ౧. తటతీతి తటః. తట ఉచ్ఛ్రాయే. ఉన్నతమైనది. ౨. భ్రజ్యతే తప్యతే

సూర్యాగ్ని తేజసా భృగుః. ఉ పు.భ్రస్జ పాకే. సూర్యాగ్ని తేజస్సులచేతఁ దపింపఁ జేయఁబడునది. ఈ 3 కొండచఱియ పేళ్లు.

**కటకో ౽ స్త్రీ నితమ్బో ౽ ద్రేః -**

కట త్యావృణోతీతి కటకః. కటే వర్షావరణయోః. పర్వతము చుట్టువాఱి యుండునది. ౧. పర్వతస్య నితంబప్రాయత్వాన్ని తంబః – పర్వతమునకు నడుమువంటిది నితంబము. ఈ ౨ కొండనడుము (మేఖల) పేళ్లు.

**స్నుః ప్రస్థస్సాను రస్త్రియౌ,**

స్నాతీతి స్నుః. ఉ. పు. ష్ణా శౌచే. పవిత్రమైనది. స్నౌతి జలమితిస్నుః. జలమును స్రవించునది. ౧. ప్రతిష్ఠంతే ౽ స్మి న్సమ భూభాగత్వా త్ప్రస్థః. అ. పు. ష్ఠా గతినివృత్తౌ. సమభూమియౌటవలన మిక్కిలి దీనియందు వసింతురు. ౨. సనోతి సుఖం దదాతీతి సానుః. ఉ. పు. షణుదానే. సుఖము నిచ్చునది. ఈ 3 పర్వతముమీఁది సమభూమి పేళ్లు.

**ఉత్సః ప్రస్రవణమ్ -**

ఉనక్త్యంభసా ఉత్సః. ఉందీ క్లేదనే. జలముచేఁ గదియునది. ౧. ప్రస్రవంత్యాపో ౽ స్మాదితి ప్రస్రవణం. స్రు గతౌ. దీనియం దుదకము జాఱును. ఈ ౨ కొండయూట పేళ్లు.

**వారిప్రవాహో నిర్ఝరో ఝరః.** 5

నిర్ఝర్యతే కాలేన స్వల్పో భవతీతి నిర్ఝరః. ఝరశ్చ. ఝౄష్ వయోహానౌ. కాలక్రమముచేత స్వల్పమైపోవునది. పా. ఝరీ. ౧, ౨. కొండలయందుఁ బుట్టిన జలప్రవాహము (సెలయేరు) పేళ్లు. ఈ ౫ ను పర్యాయములని కొందఱు.

**దరీ తు కందరో వాస్త్రీ -**

దీర్యతే దరీ. ఈ. సీ. దౄ విదారణే – భేదింపఁబడినది. ౧. కేన జలేన దీర్యత ఇతి కందరః. పు. దౄ విదారణే – జలముచేత వ్రక్కలింపఁబడునది. ౨. కృత్రిమమైన (మనుజులు ద్రవ్విన) గృహాకారమైన పర్వత బిలము పేళ్లు.

**దేవఖాతబిలే గుహా,**

**గహ్వరమ్ -**

దేవైః ఖాతం ః–దేవతలచేఁ ద్రవ్వఁబడినది. ౧. బిల్యత ఇతి బిలం.

బిల భేదనే. భేదింపఁబడునది. ౨. దేవఖాతం చ త ద్బిలం చ దేవ ఖాతబిలం. తస్మిన్ గుహా గహ్వరశబ్దౌ వర్తేతే. అని రెండవపక్షమందు. గుహత్యంధకారమితి గుహా. గుహూ సంవరణే. అంధకారము నాక్రమించియుండునది. ౩. గతిం హ్వారతీతి గహ్వరం. హ్వృకౌటిల్యే. శైల గమనమును కుటిలముగాఁ జేయునది. ఈ ౩ అకృత్రిమమైన (దేవతలచేఁ ద్రవ్వఁబడిన) కొండయొక్క బిలము పేళ్లు.

**గణ్డశైలాస్తుచ్యుతాః స్థూలోపలా గిరేః.** 6

భూకంపాదినా గిరేశ్చ్యుతా మహోపలాః గండశైలా ఇత్యుచ్యంతే – భూకంపాదులవలనఁ బర్వతమునుండి జాఱిన దొడ్డరాళ్లు గండశైలములనంబడును. గండా ఇవ శైలాః గండశైలాః–కపోలములవలె వెడల్పులై నునుపులైన శైలములు. గండాః స్థూలాః శైలావా గండశైలాః – స్థూలములైన శైలములు. కొండలమీఁద నుండి దొర్లిన పెద్దగుండ్ల పేళ్లు.

**ఖనిః స్త్రియా మాకర స్స్యాత్ -**

ఖన్యతే రత్నాదికమత్రేతి ఖనిః. ఇ – సీ. ఖను అవదారణే. రత్నములు మొదలైనవి దీనియందుఁ ద్రవ్వఁబడును. పా. ఖానిః 'ఆకరస్తు ఖనిః ఖాని' రితి వ్యాడిః. ౧. ఆకీర్యంతే లోహాదయో ఽత్ర ఆకరః. కౄ విక్షేపే. లోహాదులు దీనియందుఁ జల్లఁబడును. ఈ ౨ జేగుఱు, లోహము, రత్నములు మొదలైనవి పుట్టుగని పేళ్లు.

**పాదాః ప్రత్యన్త పర్వతాః,**

అద్రేః పాదా ఇవాధస్థితత్వా ద్ధారణాచ్చ పాదాః–పర్వతములకు పాదములవలె క్రిందనుండునవి. పద్యంత ఇతిపాదాః. పద్ ౯గతౌ. పొందఁబడునవి. ౧. ప్రత్యంతే సమీపే పర్వతాః ప్రత్యంతపర్వతాః – సమీపమందుండునవి. ఈ ౨ కొండ సమీపమునందు చుట్టువాఱ నుండెడు చిన్నతిప్పల పేళ్లు.

**ఉపత్య కాద్రే రాసన్నా భూమి రూర్ధ్వ మధిత్యకా.** 7

పర్వతము క్రిందనున్న సమీపభూమి ఉపత్యకయనంబడును. పర్వతము మీఁద నున్న భూమి అధిత్యక యనంబడును. ఉపసమీపే భూమిరుపత్యకా – పర్వతము యొక్క సమీపభూమి. ౧. ఊర్ధ్వప్రదేశస్థా భూమి రధిత్యకా –పర్వతము మీఁద నుండెడు భూమి. ఈ ౨ పర్వతమునకు క్రిందను

మీఁదను చేరియుండు భూముల పేళ్లు.

**ధాతు ర్మనశ్శిలా ద్యద్రే ర్గై రికం తు విశేషతః,**

హరితాళాది రశ్మవికారో ధాతు రిత్యుచ్యతే – మనశ్శిల హరిదళము గంధకము మొదలైన శిలావికారములన్నియు సామాన్యముగా ధాతువు లనంబడును. విశేషధాతు ర్గై రిక మిత్యుచ్యతే – విశేషధాతువు గైరిక మనంబడును. ధత్తే మిథో వ్యావర్తకం ధర్మం ధాతుః. ఉ. పు. డుధాఞ్ ధారణపోషణయోః. పరస్పరము భేదమైన ధర్మమును ధరించునది. ౧. గిరౌ భవం గైరికం – పర్వతమునందుఁ బుట్టినది. ౨. ఆదిశబ్దేన సువర్ణాదయో గృహ్యంతే. "సువర్ణరౌప్యతామ్రాశ్మ హరితాళ మనశ్శిలాః, గైరికాంజనకాంస్యాది లోహసీసా స్సహింగుళాః. గంధకో ఉ భక్రమిత్యాద్యా ధాతవో గిరిసంభవా" ఇతి. ధాతువుల పేళ్లు.

**నికుఞ్జ కుఞ్జౌ వాక్లీబే లతాదిపి హితోదరే.** 8

కా వజనీతి కుఞ్జః. నికుఞ్జశ్చ. ప్న. జనీ ప్రాదుర్భావే. భూమి యందుఁ బుట్టినది. లతాదిపిహితోదరే. ఈ ౨ తీఁగెలు మొదలగువానిచేఁ గప్పఁబడి యింటివలె నుండు పొద పేళ్లు.

# వనౌషధి వర్గము

**అటవ్యరణ్యం విపినం గహనం కాననం వనమ్,**

అటం త్యస్యాం మృగయార్థ మిత్యటవీ. ఈ. సీ. దీనియందు వేఁటకొఱకు సంచరింతురు. ౧. ఇయర్తి మృగాదిరత్ర అరణ్యం. ఋ గతౌ. మృగాదులు దీనియందుఁ దిరుగును. ౨. వేపంతే భయాదత్రేతి విపినం. టు వేపు కంపనే. భయముచేత దీనియందు వడఁకుదురు. ౩. గాహ్యత ఇతి గహనం. గాహూ విలోడనే. దుష్టమృగములచేఁ గలఁచఁబడునది. ౪. కంజల మననం ప్రాణన మస్య కాననం. అనప్రాణనే. జలమే ప్రాణముగాఁ గలది. కన్యతే గమ్యత ఇతి వాకాననం. కన దీప్తికాంతి గతిషు. పొందఁబడునది. ౫. వన్యతేసేవ్యత ఇతి వనం. వన షణ సంభక్తౌ. జనులచే నాశ్రయింపఁబడునది. ఈ ౬ అడవి పేళ్లు. కానన వనశబ్దములు దట్టమైన వృక్షులతాదులు గల ప్రదేశమాత్రమునకెల్ల పేళ్లని కొందఱు.

**మహారణ్య మరణ్యానీ -**

మహదరణ్యం మహారణ్యం. అరణ్యానీ చ. ఈ. సీ. మహత్తైన అరణ్యము. ఈ ౨ పెద్దయడవి పేళ్లు.

**గృహారామస్తు నిష్కుటః.** 1

గృహే ఆరామః గృహారామః – గృహమందలి తోఁట. ౧. కూటాత్ గృహాత్ నిర్గతః నిష్కుటః. కూట మనఁగా గృహము; దాని వెలుపల నుండునది. ఈ ౨ ఇంటిచేరువ నున్న తోఁట పేళ్లు.

**ఆరామ స్స్యా దుపవనం కృత్రిమం వనమేవ యత్,**

ఆరమన్త్యత్ర ఆరామః – ఇందు క్రీడింతురు. ౧. ఉపగతం వనం ఉపవనం. ౨. ప్రాదయో గతాద్యర్థే ఇతి సమాసః. యత్ కృత్రిమం వనం తదేవ. ఈ ౨ మనుష్యులు వేసి పెంచిన తోఁట పేళ్లు.

**అమాత్య గణికా గేహూపవనే వృక్షవాటికా.** 2

వటతీతి వాటికా, వృక్షాణాం వాటికా వృక్షవాటికా. వటవేష్టనే. పరివేష్టించి యుండునది గనుక వాటిక, అనఁగా పఙ్క్తి. వృక్షములయొక్క పఙ్క్తి. ౧. మంత్రి యొక్కయు బోగముదానియొక్కయు నిండ్లయందలి తోఁటపేరు.

**పుమా నాక్రీడ ఉద్యానం రాజ్ఞ స్సాధారణం వనమ్,**

ఆ క్రీడంతి జనాః అస్మిన్నితి ఆ క్రీడః. క్రీడృ విహారే. దీనియందు సర్వజనులును గ్రీడింతురు. ౧. ఉద్యాంత్యస్మిన్ని త్యుద్యానం. యాప్రాపణే. జనులు దీనియందుఁ జేరుదురు. ఈ ౨ ఎల్లరు విహరింపఁదగిన రాజు క్రీడోద్యానము పేరు.

**స్యా దేతదేవ ప్రమదావన మంతః పురోచితమ్.** 3

ప్రమదానాం వనం ప్రమదావనం – స్త్రీలయొక్క వనము. పా. ప్రమదవనం. 'ప్రమదవనోపకంఠనలినీషు లతాభవనేషు భూయః' 'చార కర్మణి నిష్ణాతః ప్రవిష్టః ప్రమదావన' మిత్యుభయత్రో దాహరణం. ఈ ౧ రాజుయొక్క అంతఃపురస్త్రీలు మాత్రము విహరించుతోఁట పేరు.

**వీథ్యాళి రావళిః పఙ్క్తిః శ్రేణీ -**

విథ్యతే ఽ త్ర వీథీ. విథృయాచనే. దీనియందు యాచింతురు. ౧. అలతి భూషయతీ త్యాళిః. అల భూషణ పర్యాప్తివారణేషు. అలంక

రించునది. ౨. ఆవలతే సంవృణోతీత్యావళిః. వల సంవరణే. చుట్టుపాటి యుండునది. ౩. పచ్యతే వృక్షాదయో౽నయేతి పఙ్క్తిః. పచి వ్యక్తీకరణే. దీనిచేత వృక్షాదులు వ్యక్తములుగాఁ జేయఁబడును. ౪. శ్రియతే స్వశోభయేతి శ్రేణీ. శ్రీఞ్ సేవాయాం. ఒప్పిదముచే నాశ్రయింపఁబడునది. ఈ ౫ నడుమ సందులు గల పంక్తి పేళ్లు.

**లేఖాస్తు రాజయః,**

లిఖ్యంత ఇతిలేఖాః. లిఖ అక్షరవిన్యాసే. అక్షరపఙ్క్తివలె లిఖింపఁబడునది. ౧. రాజంతే రాజయః. ఇ. సీ. రాజృ దీప్తౌ. ప్రకాశించునది. ఈ ౨ క్రిక్కిఱిసిన పంక్తి పేళ్లు.

**వన్యా వనసమూహే స్యాత్ -**

వనానాం సమూహో వన్యా. వనములయొక్క సమూహము. ఈ ౧ వన సమూహము పేరు.

**అఙ్కురో౽భినవోద్భిది.** 4

అఙ్క్యతే లక్ష్యత ఇత్యంకురః. అకిలక్షణే. కానఁబడునది. పా. అంకూరః. 'అంకూరశ్చాంకురః ప్రోక్త' ఇతి హలాయుధః. తథా చాశ్వ చరితే వసంతరాజః.___ 'అంకూరితే పల్లవితే సపుష్పే ఫలాన్వితే భూరుహిసారమేయ' ఇతి. ౧. ఉద్భినత్తి భువం బీజం చ ఉద్భిత్. ద. పు. భూమిని గాని బీజమునుగాని ఛేదించునది. ఈ ౨ క్రొత్తగా మొలచిన మొలక పేళ్లు.

**వృక్షో మహీరుహ శ్శాఖీ విటపీ పాదపస్తరుః,**
**అనోకహః కుటస్సాలః పలాశీద్రు ద్రుమాగమాః.** 5

వృశ్చ్యతే ఛిద్యత ఇతి వృక్షః. ఓవ్రశ్చూ చ్ఛేదనే. ఛేదింపఁబడునది. ౧. మహ్యాం రోహతీతి మహీరుహః. రుహబీజజన్మని ప్రాదుర్భావేచ. భూమియందు మొలచునది. ౨. శాఖాః అస్య సంతీతి శాఖీ. న. పు. కొమ్మలు గలిగినది. ౩. విటపాః అస్య సంతీతి విటపీ. న. పు. కొమ్మలుగలది. ౪. పాదైర్మూలైః జలం పిబతీతి పాదపః. పా పానే. పాదములనఁగావేళ్లు; వానిచే జలమును బానము చేయునది. ౫. తరంత్యాతప మనేనేతి తరుః. ఉ. పు. తౄ ప్లవనతరణయోః. ఎండను దీనిచేత తరింతురు. ౬. అనసః శకటస్య ఆకం గమనం హంతీతి అనోకహః. హన హింసాగత్యోః. అనస్సనఁగా బండి; అక మనఁగా గమనము; బండియొక్క గమనమును

ఆఁపునది. ౭. కుటతి శాఖాదినా వక్రీ భవతీతి కుటః. కుటకౌటిల్యే. శాఖాదులచేత వక్రమై యుండునది ౮. సల్యతే గమ్యతే జనై రితిసాలః. సల గతౌ. జనులచేత పొందఁబడునది. ౯. పలాశాని పర్ణాని అస్య సంతీతి పలాశీ. న. పు. పలాశములనఁగా ఆకులు; అవి గలది. ౧౦. ద్రూయతే ద్రుః. ఉ. పు. ద్రు గతౌ. పొందఁబడునది. ౧౧. ద్రుః వృక్షావయవో ఽస్య ద్రుమః. ద్రు అనఁగా శాఖ; అది గలిగినది. ౧౨. న గచ్ఛతీత్యగమః. గ మ్లృ గతౌ. కదలనిది. ఈ ౧౩ చెట్టు పేళ్లు.

**వానస్పత్యః ఫలైః పుష్పా త్తైరపుష్పా ద్వనస్పతిః,**

వనస్యపతిః వనస్పతిః. వనస్పతౌ భవః వానస్పత్యః – పుష్పము వలనఁ బుట్టిన ఫలములతోఁ గూడిన మామిడి మొదలైనది వానస్పత్య మనంబడును. వనస్య పతిః వనస్పతిః – పుష్పములు లేక ఫలములతోఁ గూడిన పనస మేడి మొదలైనది వనస్పతి యనంబడును.

**ఓషధ్యః ఫలపాకాన్తాః -**

ఓషం దాహం ధయంతీత్యోషధ్యః – ఫలింపఁగానే చెడిపోవు అరఁటి, వరి మొదలైన యోషధులపేళ్లు. ఈ. సీ. ధేట్ పానే. దాహమును బోఁగొట్టునది. ఓషో దామో ధీయతే ఽత్రేతి ఓషధ్యః. ఉషదాహే. డు ధాఞ్ ధారణపోషణయోః. దీనియందు దాహము ధరింపఁబడును. ౧. ఫలపాక ఏవ అంతో యాసాం తాః ఫలపాకాంతాః – ఫలపరిపక్వమే అంతముగాఁగలవి. ఈ ౨ ఒక్కపంటతోన తుదముట్టు అరఁటి వరి మొదలగువానిపేరు.

**స్యా దవన్ధ్యః ఫలేగ్రహిః.** 6

న వంధ్యః అవంధ్యః – గొడ్డుగానిది అవంధ్యము. ౧. ఫలాని గృహ్ణాతీతి ఫలేగ్రహిః. ఇ. పు. ఫలములను గ్రహించునది. ఈ ౨ గొడ్డువోక ఫలించెడు మ్రాఁకు పేరు.

**వన్ధ్యో ఽ ఫలో ఽ వకేశీ చ -**

స్వగతవైగుణ్యేన ఫలాని బధ్నాతీతి వంధ్యః. బధ బంధనే. తనయందలి వైగుణ్యము చేత ఫలముల నడ్డపెట్టునది. వబయోరభేదః. ౧. న సంతి ఫలాన్యస్య అఫలః – ఫలములు లేనిది. ౨. అవకం శూన్యం ఈష్టే పాలయతీత్యవకేశీ. న్. ఈశ ఐశ్వర్యే. అవక మనఁగా శూన్యము.

దానినిఁ బాలించునది. ఈ ౩ గొడ్డుమ్రాని పేళ్లు.

**ఫలవాన్ ఫలినః ఫలీ,**

ఫలాని సంత్యస్య ఫలవాన్. త. ఫలినః. అ. ఫలీ చ. న. ఫలములు గలిగినది. ఫలవంతము ఫలినము. ఫలి. ఈ ౩ తత్కాలమునఁ బండి యున్న మ్రానిపేళ్లు.

**ప్రఫు ల్లోత్ఫుల్ల సంఫుల్ల వ్యాకోశ వికచస్ఫుటాః.** 7

**ఫుల్ల శ్చైతే వికసితే -**

ప్రఫుల్లతి ఉత్ఫుల్లతి సంఫుల్లతీతి ప్రఫుల్లః, ఉత్ఫుల్లః, సంఫుల్లశ్చ. ఫుల్ల వికసనే. వికసించునది ప్రఫుల్లము, ఉత్ఫుల్లము, సంఫుల్లము. ౧, ౨, ౩. వ్యావృత్తః కోశః సంకోచో ఽస్మాదితి వ్యాకోశః. కుశశ్లేషణే. కోశమనఁగా నిఱుకు; అది దీనియందులేదు. పా. వ్యాకోషః; వ్యాకోచః. ౪. విగతః కచోబంధన మస్య వికచః కచ బంధనే. విగతమైన బంధము గలిగినది. ౫. స్ఫుటతి వికసతీతి స్ఫుటః. స్ఫుటిర్ విశరణే. వికసించునది. ౬. ఫుల్లతీతి ఫుల్లః. ఫుల్ల వికసనే. వికసించునది. ౭. వికసతి విస్తారం ప్రాప్నోతీతి వికసితః. కస గతౌ. విస్తారమును బొందునది. 'తథా పుష్పిత మున్నిద్ర హసితోన్మీలితాని చ, స్యాదుద్బుద్ధం చోన్మిషితం తథైవచ విజృంభితమ్'. ఈ ౮ వికసించినదానిపేళ్లు.

**స్యు రవన్ధ్యా దయస్త్రిషు,**

అవంధ్యశబ్దము మొదలు వికసితశబ్దముదాఁకఁ గల శబ్దములు త్రిలింగములు.

**స్థాణు రస్త్రీ ధ్రువ శ్శఙ్కుః -**

వాయునా నిహతో ఽపి తిష్ఠతీతి స్థాణుః. ఉ.పు. ష్ఠా గతినివృత్తౌ. వాయువుచేఁ గొట్టఁబడియు నిలచియుండునది. ౧. చలనాభావాత్ ధ్రువతీతి ధ్రువః. ధ్రువస్థైర్యే. చలనము లేకుండుటవలన స్థిరమైయుండునది. ౨. శంకతే అస్మాత్పురుషధియా శంకుః. ఉ. పు. శకి శంకాయాం. పురుష బుద్ధిచేత దీనియందు శంకింతురు. ఈ ౩ మోడు పేళ్లు.

**హ్రస్వ శాఖా శిఫః క్షుపః.** 8

హ్రస్వాః శాఖాః శిఫాః యస్య సః క్షుప ఇత్యుచ్యతే. హ్రస్వములైన కొమ్మలను, ఊడలును గలిగియుండు గుజ్జుమ్రాఁకు క్షుప

మనంబడును. దావాగ్నినా దహ్యమానః క్షౌతీతి, క్షుపః. టుక్షు శబ్దే. దావాగ్నిచేత దహింపఁబడినదై ధ్వనించునది. ఈ ౧ కుఱుచకొమ్మలు ఊడలు గల గుజ్జు మ్రానిపేరు.

**అప్రకాణ్డే స్తమ్బ గుల్మౌ -**

తిష్ఠతీతి స్తమ్బః. ష్ఠా గతినివృత్తౌ. స్థిరమైయుండునది. ౧. గుడతి చోరాది భిర్భీతాౕ గుల్మః. గుడ రక్షాయాం. చోరాదులచేత భయపడువారిని రక్షించునది. ౨. ప్రకాండము లేక ఆకులు తఱుచుగాఁ గల పొదపేళ్లు. (చెట్టుయొక్క వేళ్లకును కొమ్మలకును నడుమ నుండెడు భాగము ప్రకాండ మనఁబడును.)

**వల్లీ తు ప్రతతి ర్లతా,**

వలతే వేష్టతే యష్ట్యాదికమితి వల్లీ – ఈ. సీ. వల వేల సంవరణే. కఱ్ఱ మొదలగువానిని జట్టుకొనియుండునది. ౧. ప్రకృష్టా తతిర్విస్తారో ఽ స్యాః ప్రతతిః ఇ. సీ. తను విస్తారే. మిక్కిలి విస్తారము దీనికిఁ గలదు. పా. ప్రతతీ. ఈ. సీ. తథా చ.___ "ప్రస్థస్సానుని మానే చ ప్రతితిస్తతివీరుధో" రితి పకారాదా వజయః. "ధరాధరేంద్రం ప్రతతీతతీరివ" ఇతి మాఘః. ౨. లాతి వేష్టనార్థం యష్ట్యాదికమితి లతా. లాదానే. ప్రాఁకుటకొఱకు గడలు మొదలైనవానిని బట్టుకొనునది. ఈ 3 తీఁగెపేళ్లు.

**లతా ప్రతానినీ వీరు ద్గుల్మిన్యులప ఇత్యపి.** 9

విరుణద్ధీతి వీరుత్. ధ. సీ. రుధిర్ ఆవరణే. విశేషముగాఁ జుట్టుకొని యుండునది. వివిధం రోహతీతివా వీరుత్. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ. నానావిధములుగా మొలచునది. ౧. గుల్మో లతాసమూహోఽ స్యా అస్తీతి గుల్మినీ. ఈ. సీ. గుల్మమనఁగా లతాసమూహము; అది గలిగినది. ౨. ఉలతే ఆవృణోతీత్యులపః. ఉలసంవరణే. చుట్టుకొనియుండునది. 3. దట్టముగా నల్లిన లతాసమూహము గల పొదపేళ్ళని కొందఱు. ఈపక్షమందు లతాప్రతానినీ అని యేకపదము. ప్రతాన మనఁగా కొమ్మలయందుండు నాకులగుంపు; దానితోఁ గూడిన ద్రాక్షాతాంబూల వల్ల్యాదు లని కొందఱు. అప్పుడు లతాప్రతానినీ యని భిన్న పదములు.

**నగాద్యారోహ ఉచ్ఛ్రాయ ఉత్సేధ శ్చోచ్ఛ్రయశ్చ సః,**

ఉత్ శ్రయణ ముచ్ఛ్రాయః, ఉచ్ఛ్రయశ్చ. ఊర్ధ్వముగాఁ బొం

దుట ఉచ్ర్ఛాయము, ఉచ్ఛ్రయమును. ౧, ౨. ఉద్గతి రుత్సేధః. షిధుగత్యాం. ఊర్ధ్వముగాఁ బోవునది. ౨. చెట్టు మొదలగువాని పొడవు పేళ్లు.

**అస్త్రీప్రకాణ్డః స్కన్ధ స్స్యాన్మూలా చ్ఛాఖావధే స్తరోః.** 10

ప్రకామ్యతే ఫలరక్షణాదిభిరితి ప్రకాండః. కము కాంతౌ. ఫలములు రక్షించుట మొదలగువానిచే మిక్కిలి కోరఁబడునది. ౧. స్కంద్యతే అధిరుహ్యత ఇతి స్కంధ. స్కందిర్ గతిశోషణయోః. ఎక్కఁబడునది. ఈ ౨ పేళ్లు మొదలు కొమ్మలవఱకు గల మ్రాని పేరు.

**సమే శాఖాలతే -**

శాఖతి దిశో వ్యాప్నోతీతి శాఖా. శాఖృ వ్యాప్తౌ. దిక్కులను వ్యాపించునది. ౧. లాతి వేష్టనార్థం యష్ట్యాదికమితి లతా. లా దానే. ప్రాఁకుటకొఱకు గడలు మొదలైనవానిని జుట్టుకొనునది. ౨ కొమ్మల పేళ్లు.

**స్కన్ధశాఖా శాలే -**

స్కంధాన్నిర్గతా శాఖా స్కంధశాఖా. స్కంధమనఁగా మ్రాఁకు మొదలు; దానినుండి పుట్టినకొమ్మ స్కంధశాఖ. ౧. శాలతే శాలా. శాల శ్లాఘాయాం. శ్రేష్ఠమైనది. ఈ ౨ మ్రాఁకు మొదటికొమ్మ పేళ్లు.

**శిఫా జటే,**

శినోతి వృక్షమూలమితి శిఫా. శిఞ్ నిశాతనే. చెట్టుమొదలు నల్పముగాఁ జేయునది. ౧. జటతి సమూహీ భవతీతి జటా. జట సంఘాతే. సమూహముగా నుండునది. ఈ ౨ వృక్షమూలమున జడవలె నుండునట్టి యూడ పేళ్లు.

**శాఖాశిఫా వరోహ స్స్యాత్ -**

అవరోహతే లంబత ఇత్యవరోహః. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ. వ్రేలుచుండునది. మఱ్ఱిచెట్టు మొదలైనవాని కొమ్మలయందుండునట్టి యూడ పేళ్లు.

**మూలా చ్చాగ్రం గతా లతా.** 11

లతా మూలాత్ అగ్రం గతా–చెట్టుమొదటి నుండి కొనవఱకు నల్లిన తీగెపేరు.

**శిరో ఽ గ్రం శిఖరం వా నా -**

శ్రయతి స్వాంగం శిరః. స. న. స్వాంగమందుండునది. ౧. అగ

తీత్యగ్రం. అగ కుటిలాయాం గతౌ. కుటిలముగాఁ బోవునది. ౨. శిఖాకారతాస్యాస్తీతి శిఖరం. అ. ప్న. శిఖవంటి ఆకారము దీనికిఁ గలదు. ఈ ౩ చెట్టుకొన పేళ్లు.

**మూలం బుధ్నో ఽఙ్ఘ్రినామకః,**

మూలయతీతి మూలం. మూల ప్రతిష్ఠాయాం. ప్రతిష్ఠను జేయునది. ౧. బుధ్యంతే అనేనేతి బుధ్నః. బుధ అవగమనే. దీనిచేత వృక్షము లెఱుఁగఁ బడును. పా. బ్రధ్నః. ౨. అంఘ్రేర్నామ పాదపర్యాయో యస్యసో ఽఙ్ఘ్రి నామకః – పాదములకు ఏపర్యాయపదములు గలవో అవి యన్నియు దీనికిఁ గలవు. ఈ ౩ చెట్టుమొదటి పేళ్లు.

**సారో మజ్జా సమౌ -**

కాలాంతరం అభిసరతీతి సారః. సృ గతౌ. కాలాంతరమును బొందియుండునది. ౧. మజ్జతీతి మజ్జా. న. పు. టుమసో శుద్ధౌ. పరిశుద్ధమైనది. దార్వంతరే మజ్జతీతి మజ్జా. మ్రాఁకులో మునిఁగియుండునది. పా. మజ్జా. ఆ. సీ. ఈ ౨ చెట్టులోనుండు చేవ పేళ్లు.

**త్వక్ స్త్రీ వల్కం వల్కల మస్త్రియామ్.** 12

త్వచతి వలతి, ఆవృణోతి వృక్షమితి త్వక్. చ. సీ. వల్కం వల్కలంచ. అ. ప్న. త్వచ సంవరణే. వల సంవరణే. వృక్షమును గప్పు కొనియుండునది గనుక త్వక్కు, వల్కము, వల్కలమును. ఈ ౩ నారపేళ్లు.

**కాష్ఠం దారు -**

కాశతే అగ్నినా సమం కాష్ఠం. కాశృదీప్తౌ. అగ్నితోఁగూడి ప్రకాశించునది. ౧. కుతారాది నా దీర్యత ఇతిదారు. ఉ. న. దౄవిదారణే. గొడ్డలి మొదలయిన వానిచేఁ జీల్చఁబడునది. పా. దారుః. 'పున్నపుంసకయోర్దారు' రితి త్రికాండశేష. ఈ ౨ కొయ్య పేళ్లు.

**ఇన్ధనం త్వేధ ఇధ్మ మేధ స్సమిత్ స్త్రియామ్,**

ఇంధే అగ్నిరనేన ఇంధనం. ఇధ్మశ్చ. ఞి ఇంధీ దీప్తౌ. దీనిచేత నగ్ని ప్రకాశించును. ౧, ౨. ఏధతే అగ్నిరనేనే ఏధః. స. న. ఏధశ్చ. అ. పు. ఏధవృద్ధౌ. దీనిచేత అగ్ని వృద్ధిఁబొందును. ౩, ౪. సమిధ్యతే అగ్ని రనయేతి సమిత్. ధ. సీ. దీనిచే నగ్ని మిక్కిలి ప్రకాశించును. ఈ ౫ సమిధ పేళ్లు.

**నిష్కుహః కోటరం వా నా -**

నిష్కూయతే విస్మాపయతీతి నిష్కుహః. కుహ విస్మాపనే. విస్మయమును బొందించునది. ౧. కుటతీతి కోటరం. అ. ప్న. కుట కౌటిల్యే. కుటిలమై యుండునది. ఈ ౨ మ్రానితొఱ్ఱ పేళ్లు.

**వల్లరీ మఞ్జరీ స్త్రియౌ.** 13

వల్లతే శాఖాంసంవృణోతీతి వల్లరీ. ఈ. సీ. వల వేల్ల సంవరణే. కొమ్మను గప్పునది. ౧. మన్యతే పికాదిభి ర్బహుమన్యతే మంజరీ. ఈ. సీ. మన అవబోధనే. కోకిలాదులచేత నిక్షేపమువలెఁ దలఁచఁబడునది. ౨. ఈశబ్దములు ఇకారాంతములుం గలవు. పూవులగుత్తికిఁగాని పూచినకొమ్మకుఁగాని పేళ్లు.

**పత్రం పలాశం ఛదనం దళం పర్ణం ఛదః పుమాన్,**

వృక్షాత్పతతీతి పత్రం. పత్ ౯గతౌ. వృక్షమునందుండి పడునది. ౧. పలాశ్యతేఽగ్రస్యతే పలాశం. పరపూర్వః అశ భోజన ఇతి ధాతుః. రలయోరభేదః . వ్రతయుక్తులైనవారిచేత భక్షింపఁబడునది. ౨. ఛాద్యతే వృక్షః అనేనేతి ఛదనం. ఛద అపవారణే. దీనిచేత వృక్షము కప్పఁబడును. ౩. దళతీతి దళం. దళ విశరణే. పగులునది. ౪. పిపర్తి వృక్షమితి పర్ణం. పౄపాలనపూరణయోః. వృక్షమున నిండియుండునది. ౫. ఛాద్యతే వృక్షో ఽనేనేతి ఛదః. ఛద అపవారణే. దీనిచేత వృక్షము కప్పఁబడును. ఈ ౬ ఆకులపేళ్లు.

**పల్లవో ఽస్త్రీకిసలయమ్ -**

పలతి వాయువశాచ్చలతీతి పల్లవః. అ. ప్న. పల గతౌ. వాయువశమునఁ గదలునది. ౧. కించిచ్చలతీతి కిసలయం. షల గతౌ. ఇంచుకంత చలించునది. ఈ ౨ చిగురుపేళ్లు. ఆకులతోఁ గూడిన కొమ్మ పేళ్లని కొందఱు.

**విస్తారో విటపో ఽస్త్రియామ్.** 14

విస్తీర్యతే తరురనేనేతి విస్తారః. స్తృఞ్ ఆచ్ఛాదనే. వృక్షము దీనిచేత విస్తారముగాఁ గప్పఁబడును. ౧. వటతిఆచ్ఛాదయతీతివిటపః. వట వేష్టనే. పరివేష్టించియుండునది. విటాన్ పాతీతి విటపః. పా రక్షణే. విటులను పాలించునది. ఈ ౨ వృక్షముయొక్క కొమ్మలు చివుళ్లు మొదలయినవాని సమూహముపేళ్లు.

**వృక్షాదీనాం ఫలం సస్యమ్ -**

సస్తి వృషమధిశేతే సస్యం. షస స్వప్నే. వృక్షమందు శయనించునది. ఈ ౧ వృక్షలతాదులయొక్క ఫలము పేరు.

**వృన్తం ప్రసవబన్ధనమ్,**

వృణీతే పుష్పమితి వృంతం. వృఙ్ సంభక్తౌ. పుష్పమును సంబంధించి యుండునది. ౧. ప్రసవాః పుష్పఫలపత్రాణి సంబధ్యన్తే ఽనేనేతి ప్రసవబంధనం. బంధ బంధనే. ప్రసవ మనఁగా పుష్పఫలపత్రములు; అవి దీనిచేత బంధింపఁ బడును. ఈ ౨ తొడిమ పేళ్లు.

**ఆమే ఫలే శలాటు స్స్యాత్ -**

శలతి పుష్టిమాపద్యతే శలః. శల శ్చాసౌ అటుశ్చ శలాటుః. ఉ. పు. శల చలనసంవరణయోః. పుష్టిని బొందునది. ఈ ౧ పచ్చికాయపేరు.

**శుష్కే వానమ్ -**

వాయతి శుష్యతీతి వానం. ఓ వై శోషణే. శుష్కమగునట్టిది. ఈ ౧ ఎండినకాయ (పండు) పేరు.

**ఉభే త్రిషు.** 15

శలాటువానశబ్దములు మూఁడు లింగములయందును వర్తించును. శలాటుః కర్కటీ, శలాటవో మాషాః, శలాటూని ఫలాని; వానా హరీతకీ, వానో ముద్గః, వానం ఫలమ్.

**క్షారకో జాలకం క్లీబే -**

క్షరతి ప్రసూతే క్షారకః. క్షర సంచలనే. పుష్పాదులఁ బుట్టించునది. ౧. జలతీతి జాలకం. జల ఘాత్యే. తీక్ష్ణమైనది. ౨. పసరు మొగ్గలకును కసుగాయలకును బేళ్లు. పసరు మొగ్గల గుత్తికిఁ బేళ్లని గొందఱు.

**కలికా కోరకో ఽ స్త్రియామ్,**

కల్యతే ప్రసూనమితి శబ్ద్యతే కలికా. కల శబ్దసంఖ్యానయోః. పుష్పమగు నట్టిదని పలుకఁబడునది. ౧. కూర్యతే శబ్ద్యతే కోరికః. అ. ప్న. కురశబ్దే. పుష్పమగునట్టిదని పలుకఁబడునది. ఈ ౨ ఇంచుకంత ప్రవృద్ధమైన మొగ్గపేళ్లు.

**స్యా ద్గుచ్ఛకస్తు స్తబకః -**

"ఏకప్రరోహే పుష్పాణి పృథగ్యత్ర బహూని చ, పుష్పగుచ్ఛ

స్స విజ్ఞేయో యథా స్యాత్కరవీరక" ఇతి. గూయతే సాధురితి గుచ్ఛకః. గుజ్ శబ్దే. మంచిదని పలుకఁబడినది. పా. గుత్సకః. ౧. స్తూయతే స్తబకః. ష్టుజ్ స్తుతౌ. స్తోత్రముచేయ బడునది. ఈ ౨ బహుశాఖలుగల పూగుత్తిపేళ్లు.

**కుట్మలో ముకులో ౽ స్త్రియామ్.** 16

కుటతి ఈషత్కుట్మలః. కుట కౌటిల్యే. ఇంచుకంత కుటిలమై యుండునది. ౧. కలికావస్థాం ముఞ్చతీతి ముకుళః. అ. ప్న. ముచ్ ౯ మోక్షణే. మొగ్గగా నుండుటను విడుచునది. ఈ ౨ అప్పుడు వికసింపఁగల పరువైన మొగ్గ పేళ్లు.

**స్త్రియ స్సుమనసః పుష్పం ప్రసూనం కుసుమం సుమమ్,**

సుప్రీతం మనః ఆస్వితి సుమనసః. స. సీ. బహువచనము. వీని యందు మనస్సు లెస్సగానుండును. "బహవశ్చ సమా స్సికతా వర్షా స్సుమనో జలౌకసో౽ప్సరసః" అని వామనమతమందు బహువచనము. ఇతరమతములం దేకవచనంబును గలదు. 'సుమనాః కుసుమం పుష్పం' అని నామమాల. "త స్మాన్న రేణ కులశీల సమన్వితేన వేశ్యా శ్మశాన సుమనా ఇవ వర్జనీయా" అని శూద్రకుఁడును జెప్పియున్నాఁడు. ౧. పుష్ప్యతీతి పుష్పం. పుష్ప వికసనే. వికసించునది. ౨. ప్రసూయత ఇతి ప్రసూనం. షూజ్ ప్రాణిప్రసవే. పుట్టునది. ౩. కుస్యతి భ్రమరాదినా శ్లిష్యతీతి కుసుమం. కుస శ్లేషణే. భ్రమరములతోఁ గూడియుండునది. ౪. సుమమ్. పా. సమం = ఈ నాలుగు సమార్థకములు. ఈ ౫ పుష్పములపేళ్లు.

**మకరన్దః పుష్పరసః -**

మంక్యతే పుష్ప్యతే అనే నేతి మకరందః. మకి మండనే. దీనిచేత పుష్పమలంకరింపఁబడును. ౧. పుష్పాణాం రసః పుష్పరసః. పుష్పముల యొక్క రసము. ఈ ౨ పూఁదేనెపేళ్లు.

**పరాగ స్సుమనోరజః.** 17

పరాగచ్ఛతి వాయువశేనేతి పరాగః. పరాజ్‌పూర్వో గమ్ ౯ గతావితి ధాతుః. వాయువశమునఁ బోవునది. ౧. సుమనసాం రజః సుమనోరజః. స. న. పుష్పములయొక్క ధూళి. ఈ ౨ పుప్పొడి పేళ్లు.

**ద్విహీనం ప్రసవే సర్వమ్ -**

ప్రసవః ఫలం పుష్పంచ తత్రవర్తమానం వృక్షవాచకశబ్ద స్వరూపం ద్విహీనం స్త్రీలింగ పుంలింగహీనం భవతి. నపుంసక లిగంమితియా వత్. ప్రసవమనఁగాఁ బుష్పము ఫలము; అందు వర్తించునట్టి సకలమైన వృక్షవాచక శబ్దరూపము స్త్రీలింగపుంలింగహీనమై యుండును. అనఁగా నపుంసకమే యనుట. అది యెట్లనినః.___ చంపకస్య పుష్పం చంపకం. ఆమ్రస్య ఫలం ఆమ్రం. ఆమలక్యాః ఫలం ఆమలకం. ఇత్యాది.

**హరీతక్యాదయః స్త్రియామ్,**

హరీతక్యాదయో వృక్షవాచినశ్శబ్దాః ఫలవృత్తావపి స్త్రియాం వర్తంతే. హారీతకీ కోశాతకీ ధాత్రీ. ద్రాక్షాదులు పుష్పఫలవాచకము లైనప్పుడును స్త్రీలింగమునందే వర్తించును. హరీతక్యాః ఫలం హరీతకీ. కోశాతక్యాః ఫలం కోశాతకీ. ఇత్యాదులు.

**ఆశ్వత్థ వైణవ ప్లాక్ష నైయగ్రో ధైఙ్గుదం ఫలే.** 18
**బార్హతం చ -**

అశ్వత్థస్య ఫలం ఆశ్వత్థం-రావిపండు అశ్వత్థ మనంబడును. వేణోరిదం వైణవం - వెదురుబియ్యము వైణవ మనంబడును. ప్లక్షస్య ఫలం ప్లాక్షం - జువ్విపండు ప్లాక్ష మనంబడును న్యగ్రోధస్యఫలం నైయగ్రోధం - మఱ్ఱిపండు నైయగ్రోధ మనంబడును. ఇంగుదస్య ఫలం ఐంగుదం - గారపండు ఐంగుద మనంబడును. బృహత్యాః ఫలం బార్హతం-ములకపండు బార్హత మనంబడును. వరుసగా అశ్వత్థాతి ఫలముల పేళ్లు.

**ఫలే జమ్బ్వాః జమ్బూః స్త్రీ జమ్బు జామ్బవమ్,**

జంబ్వాః ఫలం జంబూః. ఊ. సీ. జంబు. ఉ. న. జాంబవంచ. ఈ 3 నేరేడుపండుపే ళ్లు.

**పుష్పే జాతిప్రభృతయః స్వలిఙ్గాః -**

జాతిప్రభృతయశ్శబ్దాః పుష్పవాచకత్వే ఉపి స్వలింగాః - జాతిమల్లికా శేఫాలికా యూధికాది శబ్దములు పుష్పవాచకము లైనప్పుడును తమతమలింగముల యందే యుండును. అనఁగా స్త్రీలింగములు, ఎట్లనిన-జాతేః కుసుమం జాతిః. మల్లికాయాః కుసుమం మల్లికా. ఇత్యాదులు.

**వ్రీహయః ఫలే.** 19

వ్రీహ్యాది శబ్దములు ఫలవాచకములైనప్పుడును స్వలింగములే.

ఎట్లనః.___ వ్రీహీనాం ఫలాని వ్రీహయః. ముద్గస్య ఫలం ముద్గః. మాషస్య ఫలం మాషః.

**విదార్యాద్యాస్తు మూలే ऽ పి -**

విదారీ, గంభారీ, బృహత్యాది శబ్దములు మూలవాచకము లైనప్పుడును, అపిశబ్దమువలన పుష్పవాచకములైనప్పుడును స్వలింగములే. విదార్యాః మూలం ఫలం కుసుమం వా విదారీ. గంభార్యాః మూలం ఫలం కుసుమం వా గంభారీ.

**పుష్పే క్లీబే ऽ పి పాటలా,**

పాటలాశబ్దము పుష్పవాచకమైనప్పుడు నపుంసకలింగంబును గలదు. పాటలాయః పుష్పం పాటలం, పాటలా వా.

**బోధిద్రుమ శ్చలదళః పిప్పలః కుఞ్జరాశనః.** 20

**అశ్వత్థే -**

బుధ్యతే అనేనేతి బోధిః; బోధినామా ద్రుమో బోధిద్రుమః. దీనిచేత సర్వమెఱుంగఁబడును గనుక బోధిద్రుమము. 'పిప్పలే బోధిరశ్వత్థః' అని రత్నమాల. ౧. నిత్యం చలతి దళాని యస్య సః చలదళః-ఎల్లప్పుడు కదులుచుండెడు ఆకులుగలది. ౨. భక్తాౝ పాతీతి పిప్పలః - తనను సేవించువారిని రక్షించునది. ౩. కుంజరాణాం అశనం కుంజరాశనః-ఏనుఁగులకు భక్షణమగునది. ౪. అశ్వరూపేణాగ్ని రస్మిౝ తిష్ఠతీత్యశ్వత్థః. ష్ఠా గతినివృత్తౌ. అశ్వరూపమున దీనియందగ్ని యుండును. ౫ రావిచెట్టు పేళ్లు.

**అథ కపిత్థే స్యు ర్దధిత్థ గ్రాహి మన్మథాః,**
**తస్మిౝ దధిఫలః పుష్పఫల దన్తశఠావపి.** 21

కపీనాం ప్రియత్వేన తిష్ఠతీతికపిత్థః-కోఁతులకు ప్రియమైయుండునది. ౧. దధీన తిష్ఠతీతి దధిత్థః. ష్ఠా గతినివృత్తౌ. పెరుఁగువలె నుండునది. ౨. విష్టంభకారిత్వాద్గ్రాహీ. న. పు. గ్రహపాదానే. మలబంధమును జేయునది. ౩. ఫలైః మనో బధ్నా తీతి మన్మథః. మంథ విలోడనే. ఫలములచేత మనస్సును గలఁగించునది. ౪. దధివ దామ్లం ఫలమస్యేతి దధిఫలః - పెరుఁగువలెఁ బుల్లనైన ఫలములు గలిగినది. ౫. పుష్పాత్ఫలమస్యేతి పుష్పఫలః - పుష్పము వల్లనైన ఫలముగలది. ౬. ఆమ్లత్వాత్ దంతానాం శఠో దంతశఠః-పులుపౌట వలన దంతములకు నహితమైనది. ఈ ౭ వెలఁగచెట్టు పేళ్లు.

**ఉదుమ్బరో జన్తుఫలో యజ్ఞాఙ్గో హేమదుగ్ధకః,**

ఉన్నతత్వా దుల్లంఘిత మంబరం అనే నేతి ఉదుంబరః – ఔన్నత్యముచేత నాకాశమును దాఁటునది. ౧. జంతుయుక్తం ఫలమస్యేతి జంతుఫలః – జంతువులతోఁ గూడిన ఫలములు గలిగినది. ౨. యూపాదిరూపేణ యజ్ఞస్యాంగ ముపకరణ మితి యజ్ఞాంగః – యూపాదిరూపముచేత యజ్ఞమునకు అంగమైయుండునది. ౩. హేమవర్ణం దుగ్ధం క్షీరమస్య హేమదుగ్ధకః–బంగారువంటి పాలుగలది. ఈ ౪ అత్తిచెట్లు పేళ్లు.

**కోవిదారే చమరికః కుద్దాలో యుగపత్రకః.** 22

కుం భూమిం విదారయతీతి కోవిదారః దౄ విదారణే, భూమిని వ్రక్కలించునది.౧ చమరసదృశమంజరీత్వాచ్చమరికః– జూలులవంటి పూలగుత్తులు గలది.౨ కుం భువం మూలైర్దళయతీతికుద్దాలః. దళ విశరణే. వేళ్ల చేత భూమిని వ్రక్కలించునది. ౩ యుగం యుగళం పత్రమస్యయుగ పత్రకః జోడుగానుండునట్టి యాకులుగలది. ౪ ఎఱ్ఱకాంచనపుచెట్టు పేళ్లు.

**సప్తపర్ణే విశాలత్వ క్శారదో విషమచ్ఛదః**

ప్రతిపర్వ సప్తపర్ణాని యస్య సః సప్తపర్ణః కనుపుకనుపున నేడేసి యాకులు గలది. ౧ విశాలాః త్వచో యస్య సః విశాలత్వక్ చ.పు. వెడలుపైన పట్టగలది. ౨ శరది పుష్ప్యతీతి శారదః – శరత్కాలము నందు పూచునది. పా. శారదీ. ఈ.సీ. ౩. సప్తపర్ణత్వాద్విషమాః ఛదాః యస్య సః విషమచ్ఛదః ఏడాకులు గలది. ఈ ౪ ఏడాకుల యరఁటి పేళ్లు.

**ఆరగ్వధే రాజవృక్ష శమ్యాక చతురఙ్గులాః,** 23
**ఆరేవత వ్యాధిఘాత కృతమాల సువర్ణకాః**

ఆరంజయంతీతి ఆరజో మూలాన్తేషాం వధః ఛేదనమత్రేతి ఆరగ్వధః– మూలాకారములైన ఫలములయొక్క ఛేదనముగలది, ఆరంజ యంతీత్యారజః త్వగ్దోషాః, తేషాం వధో ௨త్రేతి ఆరగ్వధః హస్తము నెఱ్ఱగాఁజేయునవి గనుక ఆరక్కులు త్వగ్దోషములు, వానిఁ జెఱుచునది, పా.ఆర్గ్వధః "ఆరగ్వధో ௨థ సంపాకః కృతమాల స్తథార్గ్వధ" ఇది రత్నమాలాయం. ౧ రాజా చాసౌ వృక్షశ్చ రాజవృక్షః – వృక్షశ్రేష్ఠము, రోగరాజం వృశ్చతి ఛినత్తివా రాజవృక్షః. ఓ వ్రశ్చూచ్ఛేదనే. రోగరాజమును జెఱుచునది. ౨ శమీం అకత్యనుగచ్ఛతీతి శమ్యాకః. అక అగ

కుటిలాయాం గతౌ. జమ్మిని అనుకరించునది. పా. సమ్యక్ పాకో ఽత్రసంపాకః మంచిపాకముగలది. ౩. చతురంగుళ పర్ణ పర్వకత్వాచ్చతురంగుళః – నాలుగంగుళములు గలిగిన ఆకులు గల కనుపులు గలది. ౪ ఆరవతే ఉత్ప్లుత్య గచ్ఛత్యనేన రోగ ఇత్యారేవతః. రేవృప్లవగతౌ. రోగము దీనిచేత నెగిరిపోవును. ౫ వ్యాధిం హంతీతి వ్యాధిఘాతః – వ్యాధిని జెఱచునది. ౬ ఫలైః కృతామాలా యస్య సః కృతమాలః–ఫలములచేతఁ జేయఁబడిన వరుసగలది. ౭ సువర్ణాకారాణి పుష్పాణి యస్య సః సువర్ణకః– బంగారువన్నెగల పువ్వులు గలది. ఈ ౮ రేలచెట్టు పేళ్లు.

**స్యుర్జమ్బీరే దన్తశఠ జమ్భ జమ్భీర జమ్భలాః.** 24

జమ్యతే భక్ష్యత ఇతి జంబీరః, జము అదనే. భక్షింపఁబడునది. ౧ దంతానాం శఠః అమ్లత్వా ద్దంతశఠః – పులుసౌటచేత దంతములకు శఠమైనది. ౨ జంభయతి మోహయతీతి జంభః. జంభీరః, జంభలశ్చ, జభ గోత్రవినామే. మోహింపఁజేయునది జంభము, జంభీరము, జంభలము. ఈ ౫ నిమ్మచెట్టు పేళ్లు.

**వరుణే వరణ స్సేతు స్తిక్తశాకః కుమారకః,**

వృణోతీతి వరుణః; వరుణశ్చ–చుట్టుకొనియుండునది. ౧, ౨ వ్యాధించినోతీతి సేతుః. ఉ.పు. షిఞ్ బంధనే. వ్యాధి నడ్డగించునది. ౩. తిక్తరసశ్శాకో యస్య సః తిక్తశాకః– చేదైన ఆకులు గలది. ౪ సదా తరుణత్వా త్కుమారకః – ఎల్లప్పుడు కోమలమైయుండునది. ఈ ౫ ఉలిమిరిచెట్టు పేళ్లు.

**పుంనాగే పురుష స్తుఙ్గః కేసరో దేవవల్లభః.** 25

పున్నాగ ఇవ పున్నాగః – పురుష శ్రేష్ఠునివలె పూజ్యమైనది. ౧ పురుషవ దున్నతత్వాత్పురుషః; తుంగశ్చ– పురుషునివలె ఉన్నతమైనది పురుషము, తుంగమును, ౧, ౨ ౩. ప్రశస్తాః కేసరాస్సంత్యస్య కేసరః – మంచి అకరువులు గలది. ౪ దేవానాం వల్లభః – దేవతలకు ప్రియమైనది. ఈ ౫ సురపొన్న పేళ్లు.

**పారిభద్రే నిమ్బతరు ర్మన్దారః పారిజాతకః,**

పరితో భద్ర మస్య పారిభద్రః–అంతటను శుభముగలది. ౧ నయ

త్యారోగ్యం నింబః, స చాసౌ తరుశ్చ నింబతరుః, ణీఙ్ప్రాపణే. ఆరోగ్యమును బొందించునది. ౨ మందాని సూక్ష్మాణి అరాణి కంటకాని యస్య సః మందారః - సూక్ష్మములైన ముండ్లు గలది. ౩. పారిణః సముద్రాజ్జాతః పారిజాతకః - సముద్రమందుఁ బుట్టినది. ఈ ౪ పారిజాత వృక్షము పేళ్లు.

**తినిశే స్యన్దనో నేమీ రథద్రు రతి ముక్తకః,** 26

**వఞ్జల శ్చిత్రకృచ్ఛ -**

చిరజీవిత్వాన్నిశా మతిక్రాంత స్తినిశః-చిరకాలముండునది. ౧ స్యందనోపయోగ్యత్వాత్ స్యందనః - రథమున కుపయోగించునది. ౨ రథచక్రాంతే సమతీతి నేమిః. ఇ.పు. తేరుబండికంటి కడపట నమ్రమైయుండునది. ౩. రథాయ ద్రుః రథద్రుః-రథము కొఱకై నవృక్షము. ౪ అతి విస్తృతత్వాదతి ము క్తకః-మిక్కిలి విస్తారముగలది. ౫ వన్యతే అర్థ్యత ఇతి వంజుళః. వను యాచనే. ప్రార్థింపబడునది. ౬ లఘుత్వే ఽ పిదా ర్ధ్యదైర్ఘ్యాభ్యా మాశ్చర్యకారిత్వా చ్చిత్రకృత్. త.పు. చులకనై యుండియు దృఢమై దీర్ఘమై యుండుటచే నాశ్చర్యమును జేయునది. ఈ ౭ నెమ్మిమ్రానిపేళ్లు.

**అథ ద్వౌ పీతన కపీతనౌ,**

**ఆమ్రాతకే -**

రసేన వస్త్రాదికం పీతం కరోతీతి పీతనః - రసముచేత వస్త్రాదులను బచ్చగాఁ జేయునది. ౧ కపీనా మిష్టైః ఫలైః ప్రీతిం తనో తీతి కపీతనః. తను విస్తారే. ఫలములచేఁ గోఁతుల కోరికను విస్తరింపఁజేయునది. ౨ ఆమ్ర మీష దతతి అనుగచ్ఛతీతి ఆమ్రాతకః. అత సాతత్యగమనే. మామిడిని ఇంచుకంత అనుసరించియుండునది. ఈ ౩ అంబాళపు చెట్టుపేళ్లు.

**మధూకే తు గుడపుష్ప మధుద్రుమౌ.** 27

**వానప్రస్థ మధుష్ఠీవౌ -**

మధురసః ఉచ్యతే యుజ్యతే అత్రేతి మధూకః, ఉచ సమవాయే. దీనియందు తేనె కూర్చఁబడును. ౧ గుడవత్ స్వాదూని పుష్పాణి యస్య సః గుడపుష్పః - బెల్లము వంటి పువ్వులు గలది. ౨ మధుప్రధా

నో ద్రుమః మధుద్రుమః. మద్యమే ప్రధానముగాఁ గల వృక్షము. 3. వనప్రస్థే వనస్థలే భవో వానప్రస్థః–వనస్థలియందుఁ బుట్టినది. మధు ష్ఠీవతీతి మధుష్ఠీవః. ష్ఠివు నిరసనే. తేనెను స్రవించునది. ఈ ४ ఇప్పమ్రాని పేళ్లు.

**జలజే ఽ త మధూలకః,**

మధు ఉలతీతి మధూలకః, ఉల ఆవరణే. తేనెను గప్పుకొని యుండునది. ఈ ౧ నీళ్లలోఁ బుట్టిన యిప్పమ్రాని పేళ్లు.

**పీలౌ గుడఫల స్స్రంసీ -**

పీయతే మాధుర్యాత్పీలుః. ఉ.పు. పాపానే. మాధుర్యమువలనఁ బానము చేయఁబడునది. ౧ గుడవ న్మధురాణి ఫలాని యస్య గుడఫలః– బెల్లమువలె మధురమైన ఫలము గలది. ౨. స్రంసయతి ఫలాదికమితి స్రంసీ.న.పు. స్రంసు అవస్రంసనే. ఫలాదుల నిచ్చునది. ఈ 3 గోఁగుపేళ్లు.

**తస్మింస్తు గిరిసమ్భవే.** 28

**ఆక్షోట కన్దరాలౌ ద్వౌ-**

అక్ష్ణోతి మూలైర్భువంవ్యాప్నోతీతి ఆక్షోటః అక్షూ వ్యాప్తౌ. వేళ్ల చేత భూమిని వ్యాపించునది. ౧ కందరాః సానూ నలతి భూషయతీతి కందరాలః. అల భూషణ పర్యాప్తి వారణేషు. పర్వతగుహా ప్రదేశములను అలంకరించునది. ఈ కొండగోఁగు పేళ్లు.

**అజ్కోలే తు నికోచకః,**

అక్యతేకణ్టకై రజ్కోలః అకి లక్షణే. ముండ్లచేత గుఱుతులు గలదై యుండునది. ౧ నికుచ్యతే కంటకత్వేనాస్మాన్నికోచకః, కుఞ్చ గతికౌటిల్యాల్పీభావయోః, ముండ్లు గలది గనుక దీనివలన సంకోచము గలుగును. ఈ ౨ ఊడుగ చెట్టు పేళ్లు.

**పలాశే కింశుకః పర్ణో వాతషోథః-**

పుణ్యాని పలాశాని యస్య సః పలాశః – పుణ్యములైన ఆకులు గలది. సంపుష్పైః పలం మాంసం అశ్నాతీవ తిష్ఠతీతి వా పలాశః– పుష్పములచేత మాంసమును భక్షించు దానివలె నుండునది. ౧ కించిచ్ఛుకవన్నీలత్వాత్కింశుకః – ఇంచుకంత పచ్చనై చిలుకవలె

నుండునది. ౨ ప్రశ స్తపర్ణ యోగాత్పర్ణః – మంచి ఆకులు గలది. ౨ వాత రోగం పోథయతీతి వాతపోథః. పుథ హింసాయాం. వాతరోగమును బోఁగొట్టునది. ఈ ౪ మోదుగచెట్టు పేళ్లు.

**అథ వేతసే.** 29

**రథాభ్రపుష్ప విదుల శీత వానీర వఞ్జులాః**

వేతి అంభో ఽ నువర్తతే వేతసః. వీ గతిప్రజనకాంత్యసనఖాదనేషు. జలమును బొందియుండునది. వితన్యతి కాలేన వా వేతసః, తను ఉపక్షయే. కాలవశమున క్షయించునది. ౧ రమంతే ఽస్మిౙ పక్షిణ ఇతి రథః. రము క్రీడాయాం. పక్షులు దీనియందు రమించును, ౨ అభ్రసమయే పుష్పమస్య అభ్రపుష్పః– వర్షాకాలమందు పుష్పించునది. అభ్రవర్ణాని పుష్పాణ్యస్యేతి వా అభ్రపుష్పః– మేఘవర్ణములైన పుష్పములు గలిగినది. ౩. విదుల్యతే వాయునేతి విదులః. విపూర్వో డుల క్షేప ఇతి ధాతుః. వాయువుచేతఁ గొట్టఁబడునది. ౪ దాహశమనాచ్ఛీతః – దాహమును శమింపఁజేయునది. ౫ దాహశమనార్థం వన్యత ఇతి వానీరః; వంజులశ్చ, వన షణ సంభక్తౌ. దాహశమనార్థమై పొందఁబడునది. ఈ ౭ ప్రబ్బలిచెట్టు పేళ్లు.

**ద్వౌ పరివ్యాధ విదులౌ నాదేయీ చామ్బువేతసే.** 30

పరివిధ్యతే అంభసా పరివ్యాధః వ్యధ తాడనే. జలముచేత అంతట కొట్టఁ బడును. ౧ విదుల్యతే అంభసా విదులః, డుల క్షేపే. జలముచేతఁ ద్రవ్వఁబడినది. ౨ నద్యాం భవా నాదేయీ, ఈ. సీ. నదియందుఁ బుట్టినది. ౩. అంబుని వేతసో ఽమ్బు వేతసః– జలమందలి ప్రబ్బలి. ఈ ౪ నీరు ప్రబ్బలి పేళ్లు.

**శోభాఞ్జనే శిగ్రు తీక్ష్ణ గన్ధ కాక్షీబ మోచకాః,**

శోభా మన క్తీతి శోభాంజనః, అంజూ వ్యక్తిశ్లక్షకాంతిగతిషు, కాంతిని బొందునది. పా. సుష్ఠు ముఖం భనక్తి తీవ్రగంధత్వాత్ సోభాంజనః, భంజో ఆమర్దనే, తీవ్రగంధమౌటచేత ముఖమును బీడించునది. ౧ శినోతి శమయతి కఫాదీౙ శిగ్రుః శీఞ్ నిశాతనే, శ్లేష్మాదుల నల్పముగాఁ జేయునదిగాని శమింపఁ జేయునదిగాని శిగ్రువు. ౨ తీక్ష్ణోగంథో ఽస్యాస్తీతి తీక్ష్ణగంధకః తీక్ష్ణమైన గంధము గలది. ౩. ఆక్షి

బంత్యనేన ఆక్షీబః. క్షీబృ మదే. దీనిచేత ఇంచుకంత మదింతురు. పా. అక్షీబ. ౪ ముంచత్యుగ్రగంధం మోచకః. ముచ్ ౡ మోక్షణే. ఉగ్ర గంధమును విడుచునది. ఈ ౫ మునగచెట్టు పేళ్లు.

**రక్తో౽సౌ మధుశిగ్రు స్స్యాత్**

మధు ప్రధానశ్శిగ్రుః మధుశిగ్రుః – తేనె ప్రధానమైయుండెడు మునగ. ఈ ౧ ఎఱ్ఱపూవుల మునగపేరు.

**అరిష్టః ఫేనిల స్సమౌ** 31

నరిష్యంత్యనేన అరిష్టః రక్షాహేతుత్వాత్. రిష హింసాయాం, రక్షాహేతువైనది గనుక దీనిచేత హింసింపఁబడరు. ౧ ఫేనా స్సంత్యస్య ఫేనిలః– నురుఁగులు గలది. ఈ ౨ కుంకుడుచెట్టు పేళ్లు.

**బిల్వశ్శాణ్డిల్య శైలూషౌ మాలూర శ్రీఫలావపి,**

బిలతి కుష్ఠాదీ౯ బిల్వః, బిల భేదనే. కుష్ఠాదులను గొట్టివేయునది. సేవకస్య పాపం బిలతి హిన స్తీతి వా బిల్వః, సేవకుని పాపమును బోఁగొట్టునది. ౧ శాండిల్యఋషివ ద్విప్రమాన్యత్వాత్ శాండిల్యః– శాండిల్యుఁ డనెడి ఋషివలె బ్రాహ్మణ పూజ్యమైనది. ౨ శైలూషవన్నట ఇవ నానారూపపరివర్తనాత్ శైలూషః – శైలూషుఁ డనఁగా నటుఁడు; వానివలె నానారూపముల ధరించునది. ౩. మల్యతే దేవైః మాలూరః. మల మల్ల ధారణే. దేవతలచేత ధరింపఁబడునది. మాం లక్ష్మీం లాతీతి వా మాలూరః. లాదానే. సంపద నిచ్చునది. ౪ శ్రీప్రదం శ్రీప్రియం వా ఫలమస్యేతి శ్రీఫలః – లక్ష్మీప్రదముగాని, లక్ష్మీప్రియముగాని అయిన ఫలముగలది. ఈ ౫ మారేడు చెట్టు పేళ్లు.

**ప్లక్షో జటీ పర్కటీ స్యాత్ -**

ప్లక్షతి మూలై రధోగచ్ఛతీతి ప్లక్షః – వేళ్లచేత అడుగునకు జాఱునది. ప్లక్షతి కఫదోషమితి ప్లక్షః, ప్లక్ష భక్షణే. కఫదోషమును హరించునది. ౧ జటా స్సంత్యస్య జటీ. న. పు. ఊడలు గలది. ౨ పృచ్యతే పరస్పరం పర్కటీ. న.పు. పృచ సంపర్కే. అన్యోన్యము గూడియుండునది. జటీ పర్కటీ శబ్దములు ఈ కారాంత స్త్రీలింగములని కొందఱు. ఈ ౩ జువ్విచెట్టు పేళ్లు.

**న్యగ్రోధో బహుపా ద్వటః** 32

న్యక్ రుణద్ధి మార్గమితి న్యగ్రోధః. రుధిర్ ఆవరణే. మార్గము నడ్డముగాఁ గప్పునది. ౧ బహవః పాదాః మూలాని సంత్యన్యే బహుపాత్. ద. పు. విస్తారమైన యూడలుగలది. ౨ వటతిమూలైః స్వస్థానం వేష్టయతి వటః. వట వేష్టనే. ఊడలచేత స్వస్థానమును జుట్టుకొని యుండునది. ఈ ౩ మఱ్ఱిచెట్టు పేళ్లు.

**గాలవ శ్శాబరో లోధ్ర స్తిరీటః స్తిల్వ మార్జనౌ,**

గాలవతి స్రావయత్య క్షిరోగానితి గాలవః – నేత్రరోగములను బోఁగొట్టునది. గాలవాదృషేః ప్రభూత ఇతివా–గాలవుఁ డను ఋషివలనఁ బుట్టినది. ౧.శబరసంబంధిత్వాచ్ఛాబరః– శబరిసంబంధమైనది. పా. సాబరః "సాబరాఖ్యాపరాధే చలోధ్రేపాపేచ పర్యత" ఇతి సకారాదావజయః. ౨. రుణద్ధి అతిసారాదికం లోధ్రః. రుధిర్ ఆవరణే. రలయోరభేదః. అతిసారాదుల నడ్డపెట్టునది. ౩. తీరయతి రోగాṉ తిరీటః. పారతీర కర్మసమాప్తౌ. రోగములను సమాప్తి బొందించునది. ౪. తిలతి స్నిహ్యత్యం గమనేనేతి తిల్వః. తిల స్నేహనే. దీనిచేత శరీరము నున్ననౌను. ౫. మార్జయతి ఉద్వర్తయత్యంగమనేన మార్జనః. మృజూశుద్ధౌ. దీనిచేత అంగము పరిశుద్ధమౌను. ఈ ౬ తెల్లలొద్దుగుచెట్టు పేళ్లు.

**ఆమ్ర శ్చూతో రసాలః-**

అమ్యతే అభిలష్యతే ఆమ్రః. అమగత్యాదిషు. అభిలషింపఁబడునది. ఆమయతి రోగయతివా అమ్రః. ఆమరోగే. రోగమును గలిగించునది. ౧ చ్యోతతి రసం స్రవతీతి చూతః. చ్యుతిర్ క్షరణే. రసమును స్రవించునది. ౨ రసం ఆలాతీతి రసాలః. లా దానే. రసము నిచ్చునది. రసమలతి భూషతివా రసాలః. అల భూషణాదౌ. రసము నలంకరించునది. ఈ 3 మామిడిచెట్టు పేళ్లు.

**అసౌ సమకారో ఽ తిసౌరభః.** 33

సహకారయతి మేళయతి స్త్రీపుంసావితి సహకారః. డు కృఞ్కరణే. స్త్రీ పురుషులఁ గలుపునది. మిక్కిలి పరిమళము గల (తియ్య) మామిడిపేళ్లు.

**కుమ్భోలూ ఖలకం క్లీ బే కౌశికో గుగ్గులుః పురః,**

కుంభోలూ ఖలాకారాత్ వృక్షకోశాన్నిర్యాతి కుంభోలూఖల

కం–కుంభాకారమైన ఉలూఖలాకారమైన మానివోసు వలనఁ బుట్టినది. ౧. కుంభోలూఖల శబ్దము ఏకనామమని కొందఱు. ఇందుదాహరణము. ___ "కుంభోలూఖలకం క్లీబే గుగ్గులుః ప్రావృషాయణిః" అని మహేంద్రుఁడు. కుంభం ఉలూఖలం అని నామద్వయ మని కొందఱు. ఉదాహరణము ___ ! కాముకే ఉ పరనార్యాశ్చ కుంభః క్లీబం చ గుగ్గలౌ, ఉలూఖలే గుగ్గలౌ చ క్లీబముక్త ములూఖలం" అని రభసుఁడు. కుంభోలూఖలకోశే భవః కౌశికః – మొగ్గవలె నుండెడు మోసువలనఁ బుట్టినది.౨ గుడతివాతరోగాద్గుగ్గులుః. ఉ. పు. గుడ రక్షణే. వాత రోగమువలన రక్షించునది.౩. పురతి అగ్రే సరతి ధూపవృక్షేష్వితి పురః. పుర అగ్రగమనే. ధూప వృక్షములయం దగ్రేసరమైనది. ఈ ౪ గుగ్గిలపు చెట్టు పేళ్లు.

**శేలుః శ్లేష్మాతక శ్శీత ఉద్దాలో బహువారకః.** 34

శినోతి రోగాణ్ శేలుః. ఉ.పు. శిఙ్ నిశాతనే. రోగములను అల్పముగాఁ జేయునది. ౧ శ్లేష్మాణమాతయతీతి శ్లేష్మాతకః. అత సాతత్యగమనే. శ్లేష్మమును ఎల్లప్పుడు పోఁగొట్టునది. ౨. విరుద్ధలక్షణయా శీతవీర్యత్వాచ్ఛీతః– ఉష్ణమును జేయునది. ౩. ఉద్దాలయత్యంగ ముద్దాలకః. దళ విదారణే. శరీరమును జీల్చునది. ౪. బహు వృణోతి స్రోతాంసి బహువారకః. వృఞ్ వరణే. బహుళముగాఁ బ్రవాహములను జుట్టు వాఱియుండునది. ఈ ౫ విరిగి చెట్టు పేళ్లు.

**రాజాదనం ప్రియాలః స్యా త్సన్నకద్రు ర్ధనుష్పటః,**

రాజ్ఞామదనం మృష్టత్వాత్ రాజాదనం. అద భక్షణే. రాజులకు భక్ష్యమైనది. ౧. ప్రియతి అతిరసత్వాత్ హృదయం గచ్ఛతీతి ప్రియాలః. ప్రియగతౌ. అంత్యంత రసము గలది గనుక హృదయమును బొందునది. పా. పియాలః. ౨. సన్నకః ద్రుస్స్కంధో ఉస్య సన్నకద్రుః– పలుచనైన కొమ్మలు గలది. ౩. ధనుష ఇవ పటోవిస్తారో ఉస్య ధనుష్పటః – ధనుస్సువంటి విస్తారముగలది. ఉక్తరీత్యా ఏకం నామేతి కేచిత్. "సన్నకద్రుశ్చా పపటో లవణస్తాపనప్రియ" ఇతి నిఘంటుః. ధనుః, పట ఇతి నామ ద్వయమితి కేచిత్. తదా ధనుశ్శబ్ద ఉకారాంతః. "ధనుః ప్రియాళక ద్రుమరాశి భేదయోశ్శరాసన" ఇతి. "పటః ప్రియాళవృక్షే

నా సుచేలే పున్నపుంసక" మితి చ రభసః. ధనుష్పటః. అని యేకనామమని కొందఱు. ధను, పటః అని నామద్వయ మని కొందఱు. ఈ ౪ మోరటిచెట్టు పేళ్లు.

**గమ్భారీ సర్వతోభద్రా కాశ్మరీ మధుపర్ణి కా.** 35
**శ్రీపర్ణీ భద్రపర్ణీ చ కాశ్మర్యశ్చాపి.**

సారవత్త్వాత్ గమనే భారో உస్యా అ స్తీతి గంభారీ. ఈ.సీ. సారముగలది గనుక గమనమందు భారముగలది. ౧. సర్వతో భద్రమస్య ఇతి సర్వతోభద్రా – అంతట శుభముగలది. ౨. కృశ్యతి తనూకరోతి పిత్తాదికమితి కాశ్మరీ. ఈ. సీ. కృశ తనూకరణే. పిత్తాదులను కృశముగాఁ జేయునది. పా. కషతి పిత్తాదికమితి కాష్మరీ. కష హింసాయాం. పిత్తాదులను పోఁగొట్టునది. ౩. మధూని స్వాదూని పర్ణాన్యస్య మధుపర్ణికా – తియ్యనైన ఆకులు గలది. ౪. శ్రీప్రదాని పర్ణాని యస్యాస్సా శ్రీపర్ణీ. ఈ సీ. ౫. భద్రప్రదాని పర్ణాని యస్యాస్సా భద్రపర్ణీ. ఈ. సీ. శుభప్రదమైన ఆకులు గలది. ౬ కృశ్యతి తనూకరోతి పిత్తాదికమితి కాశ్మర్యః. కృశ తనూకరణే. పిత్తాదుల నల్పముగాఁ జేయునది. పా. కాష్మర్యః. ఈ ౭ గుమ్ముడు చెట్టు పేళ్లు.

**అథ ద్వయోః,**

కర్కన్ధూ ర్బదరీ కోలీఘోణ్టా

కర్కాణి లోహితాని పర్ణాని ఫలాని చ ధత్త ఇతి కర్కన్ధూః. ఊ. ప్స. డు ధాఞ్ ధారణ పోషణయోః, కర్కమనఁగా ఎఱుపు, అటువంటి ఆకులును పండ్లును గలది. ౧. బదతీతి బదరీ. ఈ.సీ.బద స్థైర్యే. స్థిరమై యుండునది. ౨. కోలతి నిబిడావయవత్వాత్ కోలీ. ఈ. సీ. కులసంస్త్యానే. దట్టమై యుండునది. ౩. ఘుణతి వృత్తతయా భ్రమతీతి ఘోంటా. ఘుణ ఘూర్ణభ్రమణే.వట్రువై తిరుగునది. ఈ ౪ రేఁగు చెట్టు పేళ్లు.

**కువల ఫెనిలే.** 36

**సౌవీరం బదరం కోలమ్.**

కౌ భువి వలతే భ్రమతీతి కువలం. వల సంచలనే, భూమియందు చరించునది. ౧. ఫేనో உస్యాస్తీతి ఫేనిలః– నురుఁగుగలది. ౨. సువీర దేశే ప్రచురత్వాత్ సౌవీరం – సువీరమనెడు దేశమందు నెక్కువైయుం

డునది. ౩. బదర్యాః ఫలం బదరం – రేఁగుయొక్క ఫలము. ౪. కోల్యాః ఫలం కోలం. కోలియనఁగా రేఁగు చెట్టు; దానియొక్క ఫలము. ఈ ౪. రేఁగు పండు పేళ్లు. ఘోంటాశబ్దము మొదలు ౬ ఫలవాచకములని కొందఱు.

**అథ స్యా త్స్వాదుకణ్టకః,** 37

వికఙ్కత స్స్రువావృక్షో గ్రంథిలో వ్యాఘ్రపాదపి.

స్వాదుఫలత్వా త్కంటకవత్త్వాచ్చ స్వాదుకంటకః – తియ్యనైన ఫలములును, ముండ్లును గలది. ౧. వికంకతే ప్రసరతీతీ వికంకతః. కకిగతౌ. విశేషముగాఁ బోవునది. ౨. స్రువా స్రుక్, తదర్థం వృక్షః స్రువావృక్షః–స్రుక్ స్రువములకొఱకైన వృక్షము. పా. స్రుచావృక్షః, ౩. గ్రంథిలత్వాద్గ్రంథిలః, బుడుపులు గలది, ౪. వ్యాఘ్రస్య పాదా ఇవసాదామూలా న్యస్య వ్యాఘ్రపాత్. ద. పు. పులియడుగులవంటి వేళ్లు గలది. ఈ ౫ పుల్ల వెలఁగ చెట్టుపేళ్లు.

**ఐరావతో నాగరఙ్గః -**

ఇరావతీ విద్యుత్, సేవ రక్తత్వా దైరావతః– ఇరావతి యనఁగా మెఱపు; దానివలె నెఱ్ఱనైనది. ౧ నాగస్య సిందూరస్యేవ రంగో రాగో ౽స్యేతి నాగరంగః– నాగమనఁగా సిందూరము; దానివలె నెఱ్ఱనైనది. ఈ ౫ నాగరంగపు (నారింజ) చెట్టు పేళ్లు.

**నాదేయీ భూమిజమ్బుకా,**

నద్యాంభవా నాదేయీ. సీ. నదీతీరమందుండునది. ౧. భూమౌ జంబూః భూమిజంబుకా – భూమియందలి నేరేఁడు. భూమౌజమ్యత ఇతి భూమిజంబుకా, జము అదనే. భూమియందు భక్షింపఁబడునది. ౨. కాకినేరేఁడు పేళ్లు. ఈ ౪ నాగరంగపు చెట్టుపేళ్ళని కొందఱు.

**తిన్దుకః స్ఫూర్జకః కాలస్కన్ధశ్చ శితిసారకే.** 38

తిమ్యతి ఆర్ద్రీభవతీతి తిందుకః. తిమ ఆర్ద్రీభావే. ఆర్ద్రమైయుండునది. ౧. స్ఫూర్జతి దహ్యమానః శబ్దం కరోతీతి స్ఫూర్జకః. టు ఓ స్ఫూర్జా వజ్రనిర్ఘోషే, దావాగ్నిచేత దహింపఁబడినదై ఉఱుమువంటి శబ్దమును జేయునది. ౨. కాలః స్కంధో ౽స్య కాలస్కంధః – నల్లని మొదలుగలది. ౩. శితి ర్నీలస్సారో ౽స్య శితిసారకః– నల్లని చేవ గలది. ఈ ౪ తుమికిచెట్టు పేళ్లు.

**కాకేన్దుః కులకః కాకపీలుకః కాకతిన్దుకే,**

కాకా ఇన్దంత్యత్ర కాకేన్దుః, ఉ. పు. ఇది పరమైశ్వర్యే. కాకులు దీనియందు లెస్సనై యుండును. ౧. కుత్సితైః కాకాదిభిః లక్యత ఇతి కులకః. లకి ఆస్వాదనే. కుత్సితములైన కాకాదులచేత ఆస్వాదింపఁబడునది. ౨. కాకైః పీయత ఇతి కాకపీలుకః. పా పానే. కాకులచేతఁ బానముచేయఁబడునది. ౩. కాకైస్తిమ్యత ఇతి కాకతిందుకః. తిమఆర్ద్రీభావే. కాకులచేతఁ దడుపఁబడునది. కాకవన్నీ లత్వాత్ కాకతిందుకః– కాకివలె నల్లనై యుండునది. ఈ ౪. నల్లతుమికి పేళ్లు.

**గోలీఢో ఝాటలో ఘణ్టా పాటలిర్మోక్ష ముష్కకౌ.** 39

గోభిః లిహ్యతే ఆస్వాద్యత ఇతి గోలిఢః, లిహ ఆస్వాదనే, గోవులచేత ఆస్వాదింపఁబడునది. ౧. ఝాటం సంఘాతం లాతి ఆదత్త ఇతి ఝాటలః, లా దానే. గుంపును గూర్చునది. ౨. పశుభక్షణార్థం హన్యతే ఘంటా. హన హింసాగత్యో, పశుభక్షణార్థమై నఱుకఁబడునది. ౩. పాటం విస్తారం లాతీతి పాటలిః, ఇ. పు. పా. పాటలా. లా దానే, విస్తారము నిచ్చునది. ౪. మోక్షతి సహతే పశ్వాది సంమర్దమితి మోక్షః. మోక్ష సహనే. పశ్వాది సంమర్దమును సహించునది. ౫. ముష్ణాతి రోగాన్ ముష స్తేయే. రోగములను హరించునది. పా. ముష్కరః, ఈ ౬ మొక్కపుచెట్టు పేళ్లు.

**తిలకః క్షురక శ్రీమాన్ -**

తిలాభాని పుష్పాణ్యస్య తిలకః – నువ్వుపువ్వులవంటి పువ్వులు గలది. ౧. క్షురతి పరుషత్వాత్ క్షురకః. క్షుర ఐశ్వర్యదీప్త్యోః. పరుషమైయుండునది. ౨. శ్రీః శోభా ఽస్యాస్తీతి శ్రీమాన్ త.పు. ఒప్పిదముగలది. ఈ ౩ తిలకపుచెట్టు పేళ్లు.

**సమౌ పిచుల ఝాబుకౌ,**

పిచుం తూలం లాతీతి పిచులః, లా దానే, పిచువనఁగా దూది; దానిని సంసర్గమున నుంచుకొనునది. ౧. ఝమ్యతే ఝాబుకః. ఝము ఆదనే. భక్షింపఁబడునది. ఈ ౨. సన్నని యాకులుగల పక్కె చెట్టు పేళ్లు.

**శ్రీపర్ణికా కుముదికా కుమ్భీ కైడర్య కట్ఫలౌ.** 40

శ్రీః పర్ణేష్వస్యాః శ్రీపర్ణికా ఆకులయందు ఒప్పిదముగలది. ౧.

కుముదవర్ణ త్వా త్కుముదికా – తెల్ల కలువవంటి వర్ణముగలది. ౨. కుంభయతి పర్ణై రాచ్ఛాదయతీతి కుంభీ. ఈ. సీ. కుభి ఆచ్ఛాదనే. ఆకులచేఁ గప్పుకొనియుండునది. ౩. కద్యతే ప్రకర్షేణ లక్ష్యతే కైడర్యః. కడ మదే. మిక్కిలి కానఁబడునది. కం రసం ఈష్టే స్తౌతీతి కైడర్యః. ఈడ స్తుతౌ, రసమును స్తోత్రముఁ జేయునది. ౪. కటూని ఫలాన్యస్యేతి కట్ఫలః, కారముగల ఫలములు గలది. ఈ ౫. టేఁకుమ్రాని పేళ్లు.

**క్రముకః పట్టికాఖ్య స్స్యా త్పట్టీ లాక్షాప్రసాదనః**

క్రామతీతి క్రముకః, క్రము పాదవిక్షే. ఆక్రమించునది. ౧. పట్టికా ఇత్యాఖ్యా యస్య సః పట్టికాఖ్యః–పట్టిక యనెడుపేరు గలది. ౨. పట్టోవ్రణ బంధన సామర్థ్యమస్యాస్తీతి పట్టీ. న.పు. ఘనమైన పట్టగలది. ౩. లాక్షాం ప్రసాదయతీతి లాక్షాప్రసాదనః, షద్ ౢ విశరణగత్యవసాదనేషు. లక్క నలంకరించునది. ఈ ౪ ఎఱ్ఱలొద్దుగు పేళ్లు.

**తూదస్తు యూపః క్రముకో బ్రహ్మణ్యో బ్రహ్మదారు చ.** 41
**తూలం చ**

తుద్యతే యూపార్థం తూదః. తుద వ్యథనే. యూపార్థమై వ్యథ పెట్టఁబడునది. పా. సూదః. ౧ యూపార్హ త్వాద్యూపః–యూపమునకు అర్హమైనది. పా. పునాతీతి పూగః, పూఞ్ పవనే. పరిశుద్ధమునేయునది. ౨. క్రామతీతి క్రముకః – ఆక్రమించునది. ౩. బ్రహ్మణి వైదిక కర్మణి సాధుః బ్రహ్మణ్యః – వైదికకర్మమందు మంచిది. ౪. బ్రహ్మణే వైదికకర్మణే యోగ్యం దారు బ్రహ్మదారు – వైదికకర్మముకొఱకు తగిన వృక్షము. ౫. తూల్యతే ఽ సాదగ్నిరితి తూలం, తూల నిష్కర్షణే. దీనివలన నగ్ని బయలువెడలును. ఈ ౬ గంగరావిచెట్టుపేళ్లు.

**నీప ప్రియక కదమ్బాస్తు హలిప్రియే,**

నయతి ప్రాణినస్సుఖం నీపః, ణీఞ్ ప్రాపణే. ప్రాణులను సుఖము నొందించునది. ౧ ప్రీణాతీతి ప్రియకః, ప్రీఞ్ తర్పణే. ప్రీతినిఁజేయునది. ౨. కం వాతం దమయతీతి కదంబః, దము ఉపశమే. వాతమును శమింపఁజేయునది. ౩. హలినః బలభద్రస్య ప్రియః సురాధివాసాత్ హలిప్రియః– మద్యస్థానమౌటచేత బలభద్రునికిఁ బ్రియమైనది. ఈ ౪ కడపచెట్టు పేళ్లు.

**వీరవృక్షో ఽ రుష్కరో ఽ గ్నిముఖీ భల్లాతకీ త్రిషు,** 42

వీరాణా ముపస్పర్శయోగ్యో వృక్షః వీరవృక్షః – అత్యుష్టమైనది గనుక వీరులకే స్పర్శయోగ్యమైనది. ౧. అరూంషి వ్రణాన్ కరోతీతి అరుష్కరః – ఆరుస్సు లనఁగా వ్రణములు ; వాని జేయునది. ౨. అగ్ని వన్ముఖమస్యా అగ్ని ముఖీ. ఈ. సీ. అగ్నివంటి ముఖముగలది. ౩. భల్ల ఇవాతతీతి భల్లాతకీ. త్రి. అత సాతత్యగమనే. అంబువలె పోవునది, ఈ ౪. జీడిమ్రాని పేళ్లు.

**గర్దభాణ్డే కన్దరాల కపీతన సుపార్శ్వకాః,**

**ప్లక్షశ్చ**

గర్దభ ఇవ అండం మూలమస్య గర్దభాండః – గర్దభమువంటి మొదలుగలది. ౧. కందర మలతీతి కందరాళః అల భూషణాదౌ. గుహాప్రదేశము నలంకరించునది. ౨. కం జలం పీతయతీతి కపీతనః–జలమును పచ్చఁగా జేయునది. ౩. శోభనౌ పార్శ్వౌ యస్యసః సుపార్శ్వకః– మంచిపార్శ్వములు గలది. ౪. ప్లక్ష్యతే భక్ష్యతి ఇతి ప్లక్షః, ప్లక్షభక్షణే. భక్షింపఁబడునది. ఈ ౫. కలజువ్విచెట్టు పేళ్లు.

**తిన్త్రిణీ చిం చామ్లికా-**

తిమ్యతి ముఖమనేనేతి తిన్త్రిణీ. ఈ. సీ. తిమ ఆర్ద్రీభావే. దీనిచేత ముఖము ఆర్ద్రమవును. పా. తి న్త్రిడీ. ౧. చించిమాయతే ముఖ మనయేతి చిన్చా – దీనిచేత ముఖము చిమచిమమనును. ౨. అమ్లరసత్వాదామ్లికా – పులుసైనది. ఈ ౩ చింతచెట్టుపేళ్లు.

**అథో పీతసాలకే** 43

**సర్జ కాసన బన్ధూకపుష్ప ప్రియక జీవకాః,**

పీతవర్ణస్సాలః పీతసాలకః – పచ్చని వృక్షము. పా. పీతవర్ణస్సారో ఉ. స్యాస్తీతి పీతసారకః – పచ్చని చేపగలది. ౧. సృజతి నిర్యాసం సర్జకః సృజవిసర్గే. బంకను బుట్టించునది. ౨. అస్యతికుష్ఠాదీని త్యసనః. అసుక్షేపణే. కుష్ఠాదులను బోఁగొట్టునది. ౩. బంధూకస్యేవ రక్తాని పుష్పాణియస్యసః బంధూకపుష్పః – మంకెనపువ్వువలె నెఱ్ఱనైన పువ్వులు గలది. ౪. ప్రీణాతీతి ప్రియకః ప్రీఞ్ తర్పణే. ప్రీతిని జేయునది. ౫. కుష్ఠరోగిణం జీవయతీతి జీవకః. జీవప్రాణధారణే. కుష్ఠరోగులను బ్రతికించునది. ఈ ౬. వేగి చెట్టుపేళ్లు.

**సాలే తు సర్జ కార్శ్యాకర్ణకా స్సస్యసంపరః,** 44

స్యతికుష్ఠరోగమితిసాలః, షో ఽన్తకర్మణి. కుష్ఠరోగమును జెఱచునది. ౧. సృజతి నిర్యాసం సర్జః. సృజ విసర్గే. బంకను బుట్టించునది. ౨. కృశయతి కుష్ఠాదీ౯కార్శ్యః కృశ తనూకరణే. కుష్ఠాదులను కృశముగాఁ జేయునది. పా.కార్ష్య, 3. అశ్వకర్ణాభాని పత్రాణ్యస్య అశ్వకర్ణకః – గుఱ్ఱపు చెవులవంటి ఆకులుగలది. ౪ సస్యం ఫలం సంవృణోతీతి సస్యసంవరః, వృఞ్ వరణే. సస్యమనఁగా ఫలము; దానిని గప్పుకొనియుండునది. ఈ ౫ మద్దిచెట్టుపేళ్లు.

**నదీసర్జో వీరతరు రిన్ద్రద్రుః కకుభో ఽర్జునః,**

నద్యాం భవః సరోజ నదీసర్జః – నదియందుఁ బుట్టిన మద్ది. ౧. వీరో ఽర్జునః తన్నామకత్వాద్వీరతరుః. ఉ.పు. వీరుఁడనఁగా అర్జునుఁడు; అతనిపేరు గలది. ౨. ఇంద్రస్యప్రియో ద్రుః ఇంద్రద్రుః–అర్జున నామకమవుటచేత నింద్రునికి ప్రియమైన వృక్షము. ౩. శాఖాభిః కకుబో దిశః వ్యాప్నోతీతికకుభః– కొమ్మలచేత దిక్కులను వ్యాపించునది. కం శీతం కుభ్నాతీతివా కకుభః – శీతము నడ్డగించునది. ౪. శుక్లత్వాదర్జునః– తెల్లనైయుండునది. ఈ ౫ ఏఱుమద్దిపేళ్లు.

**రాజాదనః ఫలాధ్యక్షః క్షీరికాయామ్**

రాజభి రద్యతే రాజాదనః – రాజులచేత భక్షింపఁబడునది. ౧. అధ్యక్షాని శ్రేష్ఠాని ఫలాన్యస్య ఫలాధ్యక్షః–శ్రేష్ఠమైన ఫలములు గలది. ౨. క్షీరవన్మధురాణి ఫలాన్యస్యాః క్షీరికా – పాలవలె తియ్యనైన పండ్లుగలది. ఈ ౩ పాలచెట్టు పేళ్లు.

**అథ ద్వయోః** 45

**ఇఙ్గుదీ తాపసతరుః-**

ఇఙ్గత్యూర్ధ్వం గచ్ఛతీతి ఇఙ్గుదీ. ఈ. సీ. ఇగి లిగి గత్యర్థాః. ఊర్ధ్వముగాఁ బోవునది. పా. ఇఙ్గుదః. ౧. తపస్విజనోపయుజ్యమానత్వాత్తా పసతరుః– తాపసుల కుపయోగించు ఫలములు గలది. ఈ ౨ గారచెట్టు పేళ్లు.

**భూర్జే చర్మి మృదుత్వచౌ,**

భూ రిత్యవ్యయం. భూః భూమౌ జాయత ఇతి భూర్జః జనీ ప్రాదుర్భావే. భూమియందుఁ బుట్టునది. ౧. చర్మాకారపత్ర యోగాచ్చర్మీ. న. పు. చర్మమువంటి ఆకులుగలది. ౨. మృద్వీ త్వ గస్య మృదుత్వక్. చ. పు. మెత్తని చర్మము వంటి ఆకులు గలది. ఈ ౩ భుజపత్రపు చెట్టు పేళ్లు.

**పిచ్ఛిలా పూరణీ మోచా చిరాయు శ్శాల్మలిర్ద్వయోః.** 46

పిచ్ఛాస్యా ఇతి పిచ్ఛిలా – బంక గలిగినది. ౧. పూరయతి తూలేన ఫలానీతి పూరణీ. ఈ. సీ. పూరీ ఆప్యాయనే. దూదిచేత ఫలములు నిండించునది. ౨. రసం ముంచతీతి మోచా, ముచ్ ౠమోక్షణే. రసమును విడచునది. ౩. చిరమాయుర్యస్య చిరాయుః. స. పు. చిరకాలముండునది. తథాచ. “షష్టి ర్వర్ష సహస్రాణి వనే జీవతి శాల్మలి”రితి. పా. స్థిరమాయు ర్యస్య చిరజీవిత్వాత్ స్థిరాయుః – అనేక కాల ముండునది. ౪. విటపైశ్శాల్యతే శాల్మలిః. ఇ.పు. శాఖా విస్తారముచేత కొనియాడఁబడునది. పా. శల్మలీ. ఈ ౫ బూరుగుచెట్టు పేళ్లు.

**పిచ్ఛాతు శాల్మలీవేష్టే**

పరాఙ్గుళిసంగాత్ పిచ్ఛా – వ్రేలికి అంటుకొనునది. ౧. శాల్మలిం వేష్టయతీతి శాల్మలీవేష్టః – బూరుగును చుట్టువాటి యుండునది. ఈ ౨ బూరుగుబంక పేళ్లు.

**రోచనః కూటశాల్మలీ,**

రోచతే రోచనః. రుచ దీప్తౌ. ప్రకాశించునది. ౧. కూటా కుత్సితా చాసౌ శాల్మలీ చ కూటశాల్మలీ – కుత్సితమైన బూరుగు. ఈ ౨ కొండబూరుగు పేళ్లు.

**చిరిబిల్వో నక్తమాలః కరజశ్చ కరఞ్జకే.** 47

చిరేణ రోగం బిలతీతి చిరిబిల్వః. బిల భేదనే. చిరకాల రోగమును భేదించినది. ౧. నక్తమలతి మండయతీతి నక్తమాలః. అలభూషణాదౌ. రాత్రి నలంకరించునది. నక్తం రాత్రౌ భూతాశ్రయత్వాదల మనర్థో ఉ స్మాదితివా నక్తమాలః – భూతాశ్రయము గనుక రాత్రి దీనివలన అనర్థము గలుగును. పా. నక్తమారః. ౨. కం జలం రంజయ తీతి కరజః. కరఞ్జశ్చ. రఞ్జరాగే. జలము నెఱ్ఱఁగాఁ జేయునది. ఈ ౪ కానుగుచెట్టు పేళ్లు.

**ప్రకీర్యః పూతికరజః పూతికః కలిమారకః,**

ప్రకీర్యతే కలహస్థానే ప్రకీర్యః. కౄ విక్షేపే. కలహస్థానమందు చల్లఁబడునది. పా. ప్రకిరః. ౧. పూతిగంధః కరజః పూతికరజః– దుర్గంధముగల కానుగు. ౨. దుర్గంధత్వాత్ పూతికః – దుర్గంధము గలది.

౩. కలేః. కలహస్య మారకః నాశకః కలిమారకః–కలహమును చెఱుచునది. పా. కలింకరోతీతి కలికారకః – కలహమును జేయునది. ఈ ౪. నెమలియడుగుచెట్టు పేళ్లు.

**కరఞ్జభేదా ష్షడ్రన్థో మర్కట్యఙ్గారవల్లరీ.** 48

షడ్గ్రంథయో ఽ స్య షడ్గ్రంథః–ఆఱు కనుపులుగలది షడ్గ్రంథము, అఱు కనుపులుగల కానుగ. ౧. మర్కటవర్ణత్వా న్మర్కటీ. ఈ. సీ. కోఁతివన్నె గలది. ఇది తీఁగెకానుగ. ౧. అంగారవర్ణాః వల్ల ర్యో ఽ స్యాస్సంతీ త్యఙ్గారవల్లరీ. ఈ. సీ. నిప్పువన్నెగల పూగుత్తులు గలకానుగ. ఈ ౪. కానుగయొక్క భేదములు.

**రోహీ రోహితకః ప్లీహశత్రు ర్దాడిమ పుష్పకః,**

ఛిన్నో ఽ పి ప్రరూడో రోహతీతి రోహీ. న.పు. రోహితకశ్చ. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ. నఱకఁబడియు మొలచునది. రోహి, రోహితకమును. ౧, ౨ ప్లీహాఖ్యస్య రోగస్యశత్రుః, –ప్లీహమనెడు రోగమునకు శత్రువు. ౩. దాడిమస్యేవ పుష్పాణ్యస్య దాడిమపుష్పకః– దాడిమపువ్వులవంటి పువ్వులుగలది. ఈ ౪ ముల్లుమోదుగపేళ్లు.

**గాయత్రీ బాలతనయః ఖదిరో దన్తధావనః.** 49

గాయంతం వైద్యం త్రాయత ఇతి గాయత్రీ. త్రైజ్ పాలనే. ఈ.సీ. గాయంతు లనఁగా వైద్యులు; వారిని రక్షించునది. ౧. బాలా స్సూక్ష్మాః పత్రాత్మకా స్తనయా యస్యసః బాలతనయః – సూక్ష్మములైన పత్రరూపములైన కొమాళ్లు గలది. ౨. ఖదతి స్థిరీభవతీతి ఖదిరః. ఖదస్థైర్యే. స్థిరమైయుండునది. ౩. దంతాన్ ధావయన్త్యనేన దంతధావనః. ధావు గతిశుద్ధ్యోః, దంతములను దీనిచేత పవిత్రముచేయుదురు. ఈ ౪. చంద్రచెట్టుపేళ్లు.

**అరిమేదో విట్ఖదిరే -**

అరిరివ దుస్సహో మేదఃస్రావో ఽ స్య అరిమేదః – దుస్సహమైన మెదడు వాసనగలది. ౧. విడ్గంధీ ఖదిరో విట్ఖదిరః – విష్ఠవంటి కంపుగలది. ఈ ౨ దుర్గంధముగల చంద్ర చెట్టువేళ్లు. వెలితుమ్మవేళ్లని కొందఱు.

**కదరః ఖదిరేసితే,**

సోమవల్కో உపి.

కుత్సితం రోగం దృణాతీతి కదరః. దౄ విదారణే. కుత్సితమైన రోగమును గొట్టివేయునది. ౧ సోమవత్ చంద్రవత్సితం వల్కం వల్కలమస్య సోమవల్కః– చంద్రునివలె తెల్లనైన పట్టగలది. ఈ ౨ వెలిచంద్ర పేళ్లు.

**అథ వ్యాఘ్రపుచ్ఛ గన్ధర్వహస్తకౌ.** 50

**ఏరణ్డ ఉరుబూకశ్చ రుచకశ్చిత్రకశ్చ సః,**

**చఞ్చుః పఞ్చాఙ్గులో మణ్డ వర్ధమాన వ్యడమ్బకాః.** 51

వ్యాఘ్రపుచ్ఛాకారశాఖాయోగా ద్వ్యాఘ్రపుచ్ఛః–పులితోఁకల వంటి కొమ్మలు గలది. ౧ గంధర్వస్య మృగవిశేషస్య భూతవిశేషస్య వా హస్త ఇవ పత్రమస్య గంధర్వహస్తకః – గంధర్వమనఁగా మృగ విశేషముగాని భూతవిశేషముగాని, దానిచేతివలెనుండెడు ఆకులుగలది. ౨ ఈరయతి వాతం ఏరండః. ఈర క్షేపే. వాతమును బోఁగొట్టునది. ౩. ఊరుభృశం వాతంవాతి నాశయతీతి ఉరుబూకః. వా గతిగంధనయోః. వబయోరభేదః, మిక్కిలి వాతమును బోఁగొట్టునది. ౪ రోచతే పర్ణైః రుచకః. రుచ దీప్తౌ, ఆకులచేఁ బ్రకాశించునది. పా. రుబుకః. ౫. చిత్ర వర్ణత్వాచ్చిత్రకః – చిత్రమైన వర్ణముకలది. ౬. చంచతివాయునాచంచుః. ఉ. పు. చంచగతౌ. వాయువుచేత కదలునది. ౭. పఞ్చ అంగుళయః పత్రాత్మకే హస్తే అన్యేతి పంచాంగుళః – ఆకు లనెడు హస్తమందు అయిదు అంగుళములు గలది. ౮. మండయతి స్వప్రదేశంమండః. మడిభూషాయాం. తన ప్రదేశము నలంకరించునది. అమండః; ఆమండః అనియు గలదు. "గంధర్వహస్తకోమండ అమండోవ్యాఘ్రపర్ణక" ఇతి తారపాలః ౯. యత్ర క్వాపి వర్ధతే వర్థమానః. వృధు వృద్ధౌ. ఎక్కడనైన వృద్ధిఁ బొందునది. ౧౦. వ్యడతి రోగం హంతుం వ్యడంబకః. అడ ఉద్యమనే రోగమును బోఁగొట్టుటకొఱకు విశేషముగా నుద్యోగించునది. ఈ ౧౧ ఆముదపుచెట్టు పేళ్లు.

**అల్పా శమీ శమీర స్స్యాత్ -**

అల్పా శమీ శమీరః – చిన్నదైన జమ్మి. ఈ ౧ పిన్న జమ్మి పేరు.

**శమీసక్తుఫలా శివా,**

శమయతి దోషా౯ శమీ. ఈ.సీ. శము ఉపరమే. దోషము

లను శమింపఁజేయునది. ౧. సక్తువత్స్వాదూని ఫలాన్యస్య సక్తుఫలా – సక్తువువలె స్వాదువైన ఫలములు గలది. ౨. దోషశమనాచ్ఛివా – దోషశమనమువలన శుభస్వరూపమైనది. ఈ ౩ జమ్మిచెట్టు పేళ్లు.

**పిణ్డీతకో మరువకః శ్వసనః కరహాటకః** 52

**శల్యశ్చ మదనే -**

స్వల్పం పిండీభావ మితః ప్రాప్తః పిండీతకః. ఇణ్ గతౌ. దీనిఫలము కొంచెము పిండీభావము పొందును. ౧. విషపుష్పత్వాత్ మ్రియం తే ఽనేన మరువకః, మృఙ్ ప్రాణత్యాగే. విషపుష్పము గనుక జనులు దీనిచేత మృతు లౌదురు. ౨. శ్వాసంత్యనేక రోగహరత్వాత్ శ్వసనః. శ్వస ప్రాణనే. రోగహరముగనుక దీనిచేత బ్రతుకుదురు. ౩. దుస్స్పర్శత్వాత్ కరంహంతీతి కరహాటకః. హన హింసాగత్యోః, దుష్టమైన స్పర్శము గలది గనుక కరమును బీడించునది. ౪. శల్యం కంటకమస్యాస్తీతి శల్యః– ముండ్లుగలది. ౫. మదయతీతి మదనః. మదీ హర్షగ్లేపనయోః. హర్షింపఁ జేయునది. ఈ ౬. మంగచెట్టు పేళ్లు.

**శక్రపాదపః పారిభద్రకః,** 53

**భద్రదారు ద్రుకలిమం పీతదారు చ దారు చ.**

**పూతికాష్ఠం చ సప్త స్యుర్దేవదారుణి-**

శక్రస్య ప్రియః పాదపః శక్ర పాదపః–ఇంద్రునికి ప్రియమైన వృక్షము. ౧. పారి నిష్ఠాం ప్రాప్తం భద్రమస్య పారిభద్రకః. అంతట పూర్ణమైన శుభముగలది. ౨. భద్రం చ తత్ దారుచ భద్రదారు. ఉ. న. శుభమైన దారువు. ౩. ద్రౌ స్కంధే కిలిమం నిర్యాసో ఽ స్య ద్రుకిలిమం– కొమ్మలయందు బంకగలది. ద్రు, కిలిమమ్ ఇతి నామద్వయమితికేచిత్, “దేవదారు స్మృతం దారు సురాహ్వం కిలిమం చత” దితి ధన్వంతరిః. ౪ పీతవర్ణందారు పీతదారు – పచ్చని దారువు. పా. పూతిదారు. ౫ దీర్యత ఇతి దారు. దౄ విదారణే. చీల్చఁబడునది. ౬ పూతి ఉగ్రగన్ధం కాష్ఠమస్యేతి పూతికాష్ఠం–ఉగ్రగంధముగల కాష్ఠము ౭. దేవానాందారు దేవదారు – దేవతలయొక్క వృక్షము. అయం పుంలింగే ఽపి. “అముంపురః పశ్యసి దేవదారు” మితి రఘువంశే కాళిదాసః. ఈ ౮ దేవదారు వృక్షముపేళ్లు.

**అథ ద్వయోః,** 54

**పాటలిః పాటలా మోఘా కాలాస్థాలీ ఫలేరుహా.**

**కృష్ణవృన్తా కుబేరాక్షీ-**

పాటలవర్ణ పుష్పత్వాత్పాటలిః. ఇ. ప్స. పాటలా చ.ఎఱుపు తెలుపునుగల పువ్వులు గలది. ౧,౨. ఉపయోగిపుష్పత్వా దమోఘా- మిక్కిలి యుపయోగమైన పువ్వులుగల దౌటవలన వ్యర్థముకానిది. ప.మోఘా. "మోఘా స్త్రీ పాటలా వృక్షే మోఘం త్రీషు నిరర్థక" ఇతి రభసః. ౩. కాలవృంతత్వాత్ కాళా - నల్లని తొడిమగలది. ౪. రసాధార కుంభత్వాత్ స్థాలీ. ఈ.సీ. పుష్పరసమునకు కుండవలె నాథారమైనది. పా. కాచస్థాలీ. కాళస్థాలీ. ౫. సాంకుర ఫలత్వాత్ ఫలే రోహ తీతి ఫలేరుహా. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. మొలకతోఁగూడిన ఫలములుగల దౌట వలన ఫలములయందు మొలుచునది. ౬. కృష్ణంవృన్తమస్యాః కృష్ణ వృన్తా- నల్లని తొడిమగలది. ౭. యక్షాక్షి తుల్య పుష్పత్వాత్కుబేరాక్షి-కుబేరనయన సదృశమైన పుష్పములు గలది. ఈ ౮ కలిగొట్టుచెట్టు పేళ్లు.

**శ్యామాతు మహిలాహ్వయా,** 55

**లతా గోవన్దినీ గున్ద్రా ప్రియఙ్గుః ఫలినీ ఫలీ.**

**విష్వక్సేనా గన్ధఫలీ కారమ్భా ప్రియకశ్చ సః,**

శ్యామవర్ణత్వాత్ శ్యామా - నల్లనిది. ౧. మహిళాయాః స్త్రియః ఆహ్వయః నామా యస్యాఃసా మహిళాహ్వయా-స్త్రీ నామధేయము గలది. ౨. లతా రూపత్వాల్లతా-లతారూపమైనది. ౩. గవి భూమౌవన్ద్యతే స్తూయత ఇతి గోవన్దినీ. ఈ. సీ. భూమియందు స్తోత్రము చేయఁబడునది. ౪. గుద్యతే క్రీడ్యతే అనయా గుంద్రా. గుద క్రీడాయాం. దీనిచేత క్రీడింతురు. ౫. ప్రీణాతిరోగహరణేన ప్రియఙ్గుః ఉ.సీ. ప్రీఞ్ తర్పణే. రోగహరణముచేత సంతోషపెట్టునది. ౬. ఫలతి విశీర్యత ఇతి ఫలినీ; ఫలీ. ఈసీ. ఞి ఫలా విశరణే. పగులునది. ౭, ౮. విష్వక్ సినోతి బధ్నా తీతి విష్వక్సేనా. షిఞ్ బంధనే. అంతట వ్యాపించునది. ౯. గంధప్రధానం ఫలమస్యా ఇతి గంధఫలీ. పా. గండఫలీ - గంధమే ప్రధానముగాఁ గల ఫలములు గలది. ౧౦. ఈషద్రంభాకారా కారంభా - కొంచెముగా నరఁటిని

బోలియుండునది. ౧౧. ప్రియ ఏవ ప్రియకః-ప్రియమైనది. ఈ ౧౨ ప్రేంకణపు చెట్టు పేళ్లు.

**మణ్డూకపర్ణ పత్రోర్ణ నట కట్వఙ్గ డుణ్డుకాః.** 56
**శ్యోనాక శుకనా స ర్క్ష దీర్ఘవృన్త కుటన్నటాః,**
**శోణక శ్చారళౌ-**

మండూకాకారాణి పర్ణాన్యస్య మండూకపర్ణః-కప్పవంటి ఆకారముగల ఆకులు గలది. ౧. పత్రేషూర్ణాస్య పత్రోర్ణః - ఆకులయందు నూఁగుగలది. ౨. నటతి వా తేన నటః - వాయువుచేత నటించునది. ౩. కటూన్యంగాన్యస్య కట్వంగః - కారమైన అవయవములు గలది. ౪. డుండు ఇతి శబ్దంకాయతీతి డుండుకః. కైశబ్దే. డుండు అను శబ్దమును బలుకునది. ౫. శ్యాయతే శ్యోనాకః. శ్యైఙ్ గతౌ. వ్యాపించునది. ౬. శంకనాసేవ పుష్పాణ్యస్య శుకనాసః- చిలుకముక్కువంటి పుష్పములు గలది. ౭. ఋక్ణోతి హినస్తిరోగం ఋక్షః, ఋక్ష హింసాయాం. రోగములను బోఁగొట్టునది. ౮. దీర్ఘంవృన్తమస్య దీర్ఘవృన్తః - నిడుపైన తొడిమగలది. ౯. కుటన్ వక్రీభవన్ నటతీతి కుటన్నటః. కుటకౌటిల్యే; నటవృత్తౌ. వక్రమై నటించునది. ౧౦ శోణాతీతి శోణకః. శోణృ వర్ణ గత్యోః. ఎఱ్ఱనైనది. పా. శవతివ్యాప్నోతీతి శోనకః వ్యాపించునది. ౧౧. ఇయర్త్యరళుః. ఉ.పు. వ్యాపించునది. పా. అరుళుః. ఈ౧౨ దుండిగపు చెట్టువేళ్లు. పెద్దమానుపేళ్లని కొందఱు.

**తిష్యఫలా త్వామలకీ త్రిషు.** 57
**అమృతా చ వయస్థా చ-**

తిష్యవచ్ఛుభఫలత్వాత్తిష్యఫలా - తిష్యనక్షత్రమువలె శుభప్రదమైన ఫలములు గలది. తిష్యనక్షత్రయుక్తేకాలే ఫలం కరోతీతివా తిష్యఫలా- పుష్య నక్షత్రకాలమందు ఫలించునది. ౧. ఆమలతే గుణానామలకీ. త్రి. మల మల్ల ధారణే. గుణములను ధరించునది. ౨. రసాయనత్వాదమృతా - అమృతమువంటి రసము గలది. ౩. వయో యౌవనం తిష్ఠతిస్థిరీభ వత్యనయేతి వయస్థా. ష్ఠా గతినివృత్తౌ. యౌవనము దీని చేత స్థిరమగును. ఈ ౪ ఉసిరిక చెట్టు పేళ్లు.

**త్రివిఙ్గస్తు విభీతకః,**

**అక్ష స్తుషః కర్షఫలో భూతావాసః కలిద్రుమః.** 58

బిభ్యత్యస్మాద్విభీతకః.అ. త్రి. ఞి. బీ భయే. విశేషముగా దీనివల్ల భయపడుదురు. ౧. అక్ష్ణోతీత్యక్షః. అక్షూ వ్యాప్తౌ. వ్యాపించునది. ౨. తుష్యతి స్వల్పవారిణా తుషః. తషతుష్టౌ. కొంచెము నీటిచేతనే తుష్టిఁబొందునది. ౩. కర్షమాత్రం ఫలాన్యస్య కర్షఫలః – కర్షమనఁగా ఫలములో నాల్గపాలు, అంత తూనికెగల ఫలములు గలది. ౪. భూతా నామావాసో భూతావాసః – భూతములకు స్థానమైనది. ౫. కలేరా శ్రయోద్రుమః కలిద్రుమః–కలికి ఆశ్రయమైనది. ఈ ౬ తాండ్రచెట్టుపేళ్లు.

**అభయా త్వవ్యథా పథ్యా కాయస్థా పూతనా ౨ మృతా,**
**హరీతకీ హైమవతీ రేచకీ శ్రేయసీ శివా.** 59

నాస్తి రోగ భయమస్యా ఇత్యభయా – రోగభయము దీనివలన లేదు. ౧. నాస్తి రోగవ్యథా అస్యా ఇత్యవ్యథా – రోగపీడ దీనివలన లేదు. ౨. నిరామయేపథి సాధ్వీ పథ్యా–రోగములేని మార్గమందు మంచిది. ౩. కాయస్తిష్ఠత్యనయేతి కాయస్థా – శరీరము దీనివలన నిలుచును. పా. వయస్థా. ౪. పునాతి దేహం పూతనా. పూఞ్ పవనే. దేహమును బవిత్రముగాఁ జేయునది. ౫. నాస్తి మృతిః మరణ మస్యా ఇత్యమృతా – దీనివలన మరణము లేదు, ౬. రోగం హన్తీతి హరీతకీ. హృఞ్ హరణే. రోగమును హరించునది. ౭. హిమవద్గిరౌ ప్రచురా హైమవతీ–హిమవత్పర్వతమందుఁ బ్రచురమైనది. ౮. రేచయతిరేచనం కరోతీతి రేచకీ, ఈ. సీ. రిచిర్ పృథగ్భావే. విరేచనమును జేయునది. పా. చేతకీ. ౯. శ్రేయస్కరోతీతి శ్రేయసీ. ఈ. సీ. శ్రేయస్సు జేయునది. ౧౦. దోషశమనాచ్ఛివా– దోష శమనమువలన శుభ స్వరూపమైనది. ఈ ౧౧ కరకచెట్టు పేళ్లు.

**పీతద్రు స్సరలః పూతికాష్ఠం చ.**

పీతవర్ణో ద్రుః పీతద్రుః – పచ్చనివన్నెగల వృక్షము. ౧. సరతివిస్తారం ప్రాప్నోతీతి సరళః–విస్తారమును బొందునది. ఋజుత్వాత్సరళః–చక్కనైయుండునది. ౨. పూతిగంధి కాష్ఠం–దుర్గంధముగల కాష్ఠము. ఈ ౩ సరళపుచెట్లు పేళ్లు.

**అథ ద్రుమోత్పలః,**

**కర్ణికారః పరివ్యాధే.**

అస్య ద్రుమస్య ఉత్పలానీవ పుష్పాణీతి ద్రుమోత్పలః – ఈవృక్షమునకు కలువలవంటి పువ్వులు గలవు. ౧. కర్ణికా మియర్తీతి కర్ణికారః – కర్ణిక యనఁగా దుద్దు; దానిని బొందియుండునది. కర్ణి కాంకర్ణ భూషణత్వమియ ర్తీతివా కర్ణికారః. ఋ గతౌ. కర్ణ భూషణత్వమును బొందునది. ౨. వాయునా పరివిధ్యతే పరివ్యాధః. వ్యధ తాడనే. వాయువుచేఁ గొట్టఁబడునది. ఈ ౩ కొండగోఁగు పేళ్లు.

**లకుచో లికుచో డహుః.** 60

లక్యతే ఆస్వాద్యత ఇతి లకుచః; లికుచశ్చ. లకి ఆస్వాదనే. ఆస్వాదింపఁ బడునది గనుక లకుచము, లికుచము. ౧, ౨. దహతి తోహతివా డహుః. ఉ. పు. డదయోరభేదః. దహ భస్మీకరణే. తుహెర్ అర్దనే. కాల్చునది లేక పీడించునది. ఈ ౩ కమ్మరేఁగు (గజనిమ్మ) పేళ్లు.

**పనసః కణ్టకి ఫలః-**

పన్యతే స్తూయత ఇతి పనసః, పణ వ్యవహారే స్తుతౌ. స్తోత్రము చేయఁ బడునది. పా. పణసః. ౧. కంటకయుక్తాని ఫలాన్యస్య కంటకి ఫలః – ముండ్లు గల పండ్లు గలది. ఈ ౨. పనసచెట్టు పేళ్లు.

**నిచులో హిజ్జలో ౨ మ్బుజః,**

నిచోల్యతే అంబునా నిచులః. చల నిమజ్జనే. జలముచేత నిండింపఁబడునది. ౧. హితం జల మస్య హిజ్జలః – హితమైన జలము గలది. పా. ఇజ్జలః. ౨. అంబుని జాయత ఇత్యంబుజః. జనీ ప్రాదుర్భావే. జలమందుఁ బుట్టునది. ఈ 3 ఎఱ్ఱగన్నేరు పేళ్లు.

**కాకోదుమ్బరికా ఫల్గుర్మల పూర్జ ఘనేఫలా.** 61

కాకప్రియా ఉదుంబరీ కాకోదుంబరికా – కాకులకుఁ బ్రియమైనది. ౧. నిస్సారత్వా త్ఫలతి ఫల్గుః. ఞి ఫలావిశరణే. నిస్సారమౌటచేత వ్రక్కలౌనది. ౨. మలాత్ శ్విత్రాదికాత్ పునాతీత మలపూః. పూఞ్ పావనే. శ్విత్రము మొదలైన కల్మషములనుండి శుద్ధి చేయునది. ఊ. సీ. పా. మలయూః. ౩. జఘనే స్కంధే ఫలాన్యస్యేతి జఘనేఫలా–జఘన మనఁగా కొమ్మ, కొమ్మలయందు ఫలములు గలది. ఈ ౪. కుక్క మేడి పేళ్లు.

**అరిష్ట స్సర్వతోభద్ర హిఙ్గ నిర్యాస మాలకాః,**

**పిచుమన్దశ్చ నిమ్బే-**

నరిష్యతే రోగిజనో ఽనేనేతి అరిష్టః రిష హింసాయాం. రోగము గల జనుఁడు దీనిచేత హింసింపఁబడఁడు. ౧ సర్వతోభద్రమస్య సర్వతో భద్రః- అంతట శుభముగలది. ౨ హింగునో నిర్యాసివ నిర్యాసో ఽస్య హింగునిర్యాసః- ఇంగువవంటి యాకారముగల బంక గలది. ౩. మలతే కాకసమూహం మాలకః. మల మల్ల ధారణే. కాకసమూహమును ధరించునది. ౪ పిచుం కుష్ఠం మన్దయతీతి పిచుమన్దః. మదీ హర్షగ్లేపనయోః. పిచు వనఁగా కుష్ఠము, దానిని మందము చేయునది. పా. పిచు మృద్నాతీతి పిచుమర్ధః. మృద క్షొదే. కుష్ఠమును మర్ధించునది. ౫ ఆరోగ్యం నయతీతి నింబః. ణీఞ్ ప్రాపణే. ఆరోగ్యమును బొందించునది. ఈ ౬ వేపచెట్టు పేళ్లు.

**అథ పిచ్ఛిలా ఽ గురుశింశుపా.** 62

పిచ్ఛాస్యా అస్తీతి పిచ్ఛిలా - బంక గలది. ౧. న గురు అగురు. ఉ. న. బరువులేనిది. ౨. రోగం శినోతి శింశుపా. పా. శింశపా. శిఞ్ నిశాతనే. రోగమును కృశముగాఁజేయునది. ఈ ౩ ఇరుగుడుమ్రాని పేళ్లు.

**కపిలా భస్మగర్భా సా**

కామ్యత ఇతి కపిలా. కము కాంతౌ. కోరఁబడునది. ౧. భస్మతుల్యా మజ్జా అత్రేతి భస్మగర్భా-బూడిదవంటి చేవ గలది. ఈ ౨. కంపుగల యిరుగుడు పేళ్లు. పిచ్ఛిలాదులు ౫. ఇరుగుడు చెట్టుపేళ్ళనియే కొందఱు.

**శిరీషస్తు కపీతనః**

**భణ్డిలో ఽపి.**

శీర్యతే సౌకుమార్యా చ్ఛిరీషః. శౄ హింసాయాం. కోమల మౌటచేత వ్రక్కలౌనది. ౧. కపీ≡ తనోతీతి కపీతనః. తను విస్తారే. కోఁతులను విస్తరింపఁ జేయునది. ౨. భణ్డతీతి భణ్డిలః. భడి కల్యాణే. పా. భణ్డిరః-శుభకరమైనది. ఈ ౩ దిరిసెనపుచెట్టు పేళ్లు.

**అథ చామ్పేయ శ్చమ్పకో హేమపుష్పకః.** 63

చంపాఖ్యదేశే భవః చాంపేయః-చంపయను దేశమందుఁ బుట్టినది. ౧. చమ్యతే అళిభిరితి చంపకః. చము అదనే. తుమ్మెదలచే నాస్వాదింపఁబడునది. ౨. హేమవర్ణం పుష్పమస్యేతి హేమ పుష్పకః - బంగారు వన్నెగల పువ్వులు గలది. ఈ ౩ సంపెఁగ చెట్టు పేళ్లు.

**ఏతస్య కలికా గన్ధఫలీ స్యాత్ -**

గంధ ఏవ ఫల మస్యా ఇతి గంధఫలీ-గంధమే ఫలముగాఁ గలది. ఈ ౧ సంపంగిమొగ్గవేరు.

**అథ కేసరే,**

**వకుళ :**

ప్రశస్తాః కేసరా స్సన్త్యస్య కేసరః - మంచియాకరువులు గలది. కే శిరసి సరతి గంధసారత్వాద్వా కేసరః. సృగతౌః, మంచిగంధము గలిగి శిరస్సు యందుండునది. ౧ ఉచ్యతే రోగమత్త్రీతి వకుళః- రోగమును బోఁగొట్టనది యని చెప్పఁబడునది. ఈ ౨ పొగడచెట్టు పేళ్లు.

**వఞ్జులో ఽ శోకే**

వన్యతే యాచ్యతే వఞ్జుళః. వను యాచనే. అడుగఁబడునది. ౧. అశ్నుతే అశోకః. అశూ వ్యాప్తౌ. వ్యాపించునది. శోకనాశకత్వాద్వా అశోకః-శోకమును చెఱుచునది. ఈ ౨ అశోకపుచెట్టు పేళ్లు.

**సమౌ కరక దాడిమౌ.** 64

కరోతి దోషాభావ మితి కరకః- దోష శుద్ధిని జేయునది. ౧. పక్వా వస్థాయాం దళ్యతే దాడిమః. దళ విశరణే. పక్వావస్థయందు వ్రక్కలౌనట్టిది. ఈ ౨ దానిమ్మచెట్టు పేళ్లు.

**చామ్పేయః కేసరో నాగకేసరః కాఞ్చనాహ్వయః,**

చంపాఖ్యదేశే భవత్వాచ్చాంపేయః - చంపయను దేశమందుఁ బుట్టినది. ౧. కే శిరసి సరతీతి కేసరః, సృ గతౌ. శిరస్సును బొందునది. ౨. నాగప్రియాణి కేసరవన్తి పుష్పాణ్యస్య నాగకేసరః- ఏనుఁగులకుఁ బ్రియమైన ఆకరువులు గల పుష్పములు గలది. నాగోహస్తీ తన్నామకేసరో ఽ స్యనాగకేసరః- ఏనుఁగుపేరు గల ఆకరువు గలది. ౩ కాంచనస్య స్వర్ణస్య ఆహ్వయో యస్య కాంచనాహ్వయః- బంగారుయొక్క పేరుగలది. ఈ ౪ నాగకేసరము పేళ్లు.

**జయా జయ న్తీ తర్కారీ నాదేయీ వైజయన్తికా.** 65

జయతి రోగాన్ జయా, జయన్తీచ. ఈ.సీ. రోగములను జయించునది. ౧, ౨. తర్కమియర్త్రీతి తర్కారీ. ఈ. సీ. ఋ గతౌ. ఊహను బొందించునది. ౩. నద్యాం భవా నాదేయీ, ఈ. సీ. నది యందుఁ బుట్టి

నది. ౪. విజయతి శోభాదిక మితి వైజయంతికా – శోభాదులను గెలుచునది. ఈ ౫ తక్కిలిచెట్టు పేళ్లు.

**శ్రీపర్ణ మగ్ని మన్థ స్స్యా త్కణికా గణికారికా,**

**జయా-**

శ్రీ శ్శోభా పర్ణేష్వస్య శ్రీపర్ణం–ఒప్పిదము ఆకులయందుఁ గలది. అగ్నయే మధ్యతే అగ్నిమనః– అగ్ని కొఱకు మథింపఁబడునది. ౨. కణాస్సంత్యస్యామితి కణికా–అగ్ని కణములు దీనియందుఁ గలవు. ౩. గణికావ న్మోహనతా మియర్తీతి గణికారికా – వేశ్యవలె మోహమును బొందించునది. ౪. జయతి రోగానితి జయా. జి జయే. రోగములను జయించునది. ఈ ౫ కూరనెల్లి చెట్టు పేళ్లు.

**అథ కుటజ శ్శక్రో వత్సకో గిరిమల్లికా.** 66

కుటిలో జాయతే కుటజః. జనీ ప్రాదుర్భావే. కుటిలముగాఁ బుట్టునది. ౧. శక్రవృక్షత్వాచ్ఛక్రః – ఇంద్రసంబంధమైన వృక్షము. ౨. వస్తే త్వచ మితి వత్సకః. వస ఆచ్ఛాదనే – పట్టను గప్పుకొనియుండునది. ౩. గిరౌ మల్లికావ త్తిష్ఠతీతి గిరిమల్లి కా–పర్వతమందు మల్లికవలె నుండునది. ఈ కోడిసెచెట్టు పేళ్లు.

**ఏతస్యైవ కళిం గేన్ద్రయన భద్రయవం ఫలే,**

కళిఙ్గదేశేజాతం కళిఙ్గం–కళింగదేశమందుఁ బుట్టునది. పా. కళింగా. ౧. ఇంద్రవృక్షఫలత్వా ద్యవబీజాకృతిత్వాచ్చ ఇంద్రయవం – ఇంద్రమనఁగా కొడిశచెట్టు; దానిఫలములు యవలవలె నుండును. ౨. దీపనాది కళ్యాణకారిత్వా ద్యవాకృతి త్వాచ్చ భద్రయవం – దీపనము మొదలైన శుభమును జేయునది; యవలవలె నుండునది. ఈ 3 కొడిసెపండు పేళ్లు.

**కృష్ణపాకఫలావిగ్న సుషేణాః కరమర్దకే.** 67

కృష్ణవర్ణపాకం ఫలమస్య కృష్ణపాకఫలః– పరిపాకమునందు నల్లనగుపండ్లు గలది. కృష్ణపాకఫల శబ్దస్య కృష్ణపాకః, పాకకృష్ణః, ఫలకృష్ణః, కృష్ణఫలః, ఇత్యాది రూపాణి. “కృష్ణపాకఫలః కృష్ణఫలపాకో వనాళకః, కృష్ణపాకః పాకకృష్ణః ఫలకృష్ణో వరాళకః పాకకృష్ణఫలః పాక ఫలకృష్ణః కరాంబుజః, ఫలపాకః పాకఫలః, కృష్ణఫల”

ఇతి శబ్దార్ణవే. ౧. అవిజతే ఆస్మాదితి అవిగ్నః. ఓ విజీ భయచలనయోః. దీనివలన రోగి భయపడును. ౨. సుషేణాఖ్య కపిముఖాకృతిత్వా త్సుషేణః–సుషేణుం దను కపిముఖమువలె నుండునది. ౩. కరేణ మర్ద్యతే కరమర్దకః. మృదుమర్దనే. హస్తముచేత మర్దింపఁబడునది. ఈ ౪ కలివెచెట్టు పేళ్లు.

**కాలస్కన్ధస్తమాల స్స్యా త్తాపిచ్ఛో ఽ పి-**

కాలవర్ణః స్కంధో ఽ స్య కాలస్కంధః – నల్లని మొదలు గలది. ౧. తామ్యతీతి తమాలః. తము గ్లానౌ. వాడునది. ౨. తాపినం ఛాదయతీతి తాపిచ్ఛః. ఛద అపవారణే. తాపము గలవానిఁ గప్పునది. ఈ 3 సముద్ర సమీపమునందలి నల్లని యాకులు గల చీఁకటిమ్రాఁకు పేళ్లు.

**అథ సిన్దుకః,**

**సిన్దువా రేన్ద్రసురసౌ నిర్గు ణ్డీన్ద్రాణి కేత్యపి.** 68

రసం స్యన్దతే సిన్దుకః. స్యన్దూ ప్రస్రవణే. రసమును స్రవించునది. ౧. సిన్దుం స్యన్దనం త్వగాదినా వృణోతీతి సిన్దువారః. వృఞ్ వరణే. స్రవించుటను పట్ట మొదలైనవానిచేతఁ గప్పునది. ౨. ఇంద్రస్యసురసః ప్రియః ఇంద్రసురసః – ఇంద్రునికి ప్రియమైనది. ౩. గుడాత్పరివేష్టనాన్నిష్క్రాంతా నిర్గుండీ. గుడవేష్టనే. గుడమనఁగాఁ జుట్టుకొనుట; అందువలనఁ బాసినది. ౪. ఇంద్రస్య ప్రియా ఇంద్రాణికా– ఇంద్రునికిఁ బ్రియమైనది. ఈ ౫ వావిలిచెట్టు పేళ్లు.

**వేణీ గరాగరీ దేవతాళో జీమూత ఇత్యపి,**

వేణివత్తిష్ఠతీతి వేనీ. ఈ. సీ. జడవలె నుండునది. ౧. గరం మూసికవిష మాగిరతీతి గరాగరీ. గౄ నిగరణే. ఎలికె విషమును హరించునది. పా. ఖరాగరీ. ఖరా, గరీ అని ఛిన్నము లని కొందఱు. ౨. దేవం ఇంద్రియం తాడయతీతి దేవతాళః. తడ ఆఘాతే. ఇంద్రియమును బీడించునది. పా. దేవతాడః. ౩. జీమూతవ దాహ్లాదకత్వా జ్జీమూతః– మేఘమువలె ఆహ్లాదకరమైనది. ఈ ౪. దేవతాడి (డావరడంగి) పేళ్లు.

**శ్రీహస్తినీ తు భూరుణ్డీ-**

శోభాన్వితహస్తి కర్ణాభపత్త్రయోగాత్ శ్రీహస్తినీ. ఈ. సీ. ఒప్పిదముగల యేనుఁగు చెవివంటి ఆకారముగల యాకులు గలది. ౧. భువిరోహతీతి భూరుండీ. ఈ. సీ. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ – భూమియందు మొలచునది. ఈ ౨. గురుగుచెట్టు పేళ్లు.

**తృణశూల్యం తు మల్లికా** 69

**భూపదీ శీతభీరుశ్చ-**

తృణశూలే వాతగుల్మే సాధు తృణశూల్యం - తృణశూలమనగా వాతగుల్మము. అందుకు మంచిది. పా. తృణశూన్యం, త్రుణశూన్యా, తృణశూల్యా. ౧.మల్యతే మూర్ధ్నిమల్లికా - శిరస్సునందు ధరింపఁబడునది. ౨. భువి పద మస్యాః భూపదీ. ఈ. సీ. భూమియందు స్థానముగలది. ౩. శీతాద్బిభేతి గ్రీష్మజత్వా చ్ఛీతభీరుః. ఉ.సీ. గ్రీష్మ కాలమందుఁ బూచునది గానఁ జలికి వెఱచునది. ఈ ౪ మల్లెచెట్టు పేళ్లు.

**సై వాస్ఫోటా వనోద్భవా,**

ఆస్ఫోటతి ఈషద్వికసతీతి ఆస్ఫోటా - కొంచెముగా వికసించునది. పా. ఆస్ఫోతా. ౧. అడవిమల్లె పేరు.

**శేఫాలికా తు సువహా నిర్గుణ్డీ నీలికా చ సా.** 70

శేరత ఇతిశేఫాః నిద్రాణాః అళయో ఽత్రేతి శేఫాలికా-నిద్రించుచున్న తుమ్మెదలు గలది. ౧. సుష్ఠు వహత్యామోదం సువహా. వహ ప్రాపణే. లెస్సగా పరిమళమును వహించునది. ౨. గుడా ద్వేష్టనాన్నిర్గ్కాం తా నిర్గుండీ. గుడ వేష్టనే. చుట్టుకొనియుండుట లేనిది. 3. నీలపుష్పత్వాన్నీలికా - నల్లని పువ్వులు గలది. ఈ ౪ నల్లవావిలి పేళ్లు.

**సితాసౌ శ్వేత సురసా భూతవేశీ-**

శ్వేతః శోభనో రసో యస్యాస్సా శ్వేతసురసా - తెల్లనైన మంచి రసముగలది. ౧. భూతాని విశతి ఆహ్లాద యతీతి భూతవేశీ. ఈ. సీ. విశ ఆహ్లాదనే. భూతములను సంతోషపెట్టునది. ఈ ౨ తెల్లవావిలి పేళ్లు.

**అథ మాగధీ,**

**గణికా యూథి కామ్బష్ఠా-**

మగధదేశే ప్రచురా మాగధీ. మగధదేశమందు ప్రచురమైనది. ౧. గణికావచ్చిత్తకర్షణాద్గణికా - వేశ్యవలె మనస్సును హరించునది. ౨. యూథోజాల మస్యా ఇతి యూథికా - గుంపుగలిగియుండునది. ౩. అంబః భ్రమరాణాం ధ్వని; సో ఽత్ర తిష్ఠతీతి అంబష్ఠా, ష్ఠా గతినివృత్తౌ. తుమ్మెదలమ్రోఁత దీనియం దుండును. ఈ ౪ అడవి మొల్ల పేళ్లు.

**సా పీతా హేమపుష్పికా.** 71

హేమవర్ణాని పుష్పాణి యస్యాస్సా హేమపుష్పికా – బంగారు చాయ పువ్వులు గలది. ఈ ౧ పచ్చపూవుల మొల్ల పేరు.

**అతిముక్తః పుణ్డ్రక స్స్యాద్వాసన్తీ మాధవీలతా,**

అతిక్రాంతో ముక్తాఀ విరక్తా నిత్యతిముక్తః – విరక్తుల నతిక్రమించినది. ౧. పుండ్రదేశే భవః పుండ్రకః – పుండ్రమను దేశమందుఁ బుట్టినది. ౨. వసంతే పుష్ప్యతీతి వాసంతీ. ఈ. సీ. వసంతకాలమందుఁ బుష్పించునది. ౩. మధౌ చైత్రే పుష్పతీతి మాధవీ. ఈ. సీ. చైత్ర మాసమందుఁ బుష్పించునది. ౪. లాతి ఆదత్తే జనమనాంసి సుగంధిత్వాల్లతా. లా ఆదానే. మంచి పరిమళము గలది గనుక జనుల మనస్సుల నాకర్షించునది. ఈ ౫ పూవుల గురువింద పేళ్లు.

**సుమనా మాలతీ జాతిః**

సుష్ఠు మన్యతే సుమనాః, స. సీ. మన జ్ఞానే. లెస్సగా తలంపఁబడునది.౧. మల్యతే ఆమోదైర్మాలతీ, మల మల్ల ధారణే. పరిమళములచేత ధరింపఁబడునది. ౨. జాయతే అనయా సుఖం జాతిః. ఇ. సీ. జనీ ప్రాదుర్భావే. సుఖము దీనిచేతఁ బుట్టును. ఈ 3 జాజి పేళ్లు.

**సప్తలా నవమాలికా.** 72

సప్తమనోబుద్ధ్యంతానీంద్రియాణి లాతీతి సప్తలా. లా ఆదానే. మనో బుద్ధులతోఁ గూడిన పంచేంద్రియములను అనఁగా నేడింటిని పరిమళముచేత స్వవశముగాఁ జేసికొనునది. ౧. నవాస్తుత్యామాలా అస్యా ఇతి నవమాలికా– స్తోత్రము చేయఁదగిన దండ గలది. ఈ 3 విరజాజి పేళ్లు.

**మాఘ్యం కున్దమ్-**

మాఘే మాసి భవం మాఘ్యం – మాఘమాసమందుఁ బుట్టినది. ఈ ౧ కుంభవం ద్యతి ఉద్భవకాలేకుందం. దో అవఖండనే. పుట్టునప్పుడు భూమిని ప్రక్కలించునది. ఈ ౨ మొల్ల పేళ్లు.

**రక్తకస్తు బన్ధూకో బన్ధుజీవకః,**

రక్తవత్పుష్పతయా రక్తకః–ఎఱ్ఱని పువ్వులు గలది. ౧. సుకుమారత్వాత్ బధ్నాతి చిత్తం బంధూకః. బంధ బంధనే. సుకుమారమౌట వలన మనస్సులు బంధించునది. ౨. బంధూఀ జీవయతి బంధుజీవకః, జీవప్రాణ ధారణే. తనకు బంధువులైయుండు తుమ్మెదలను బ్రతికించునది.

ఈ 3 మంకెన పేళ్లు.

**సహా కుమారీ తరణిః**

సహతే పరిమళం సహా. షహ మర్షణే. పరిమళమును సహించునది. ౧. కుం భూమిస్థాన్ మారయతీతి కుమారీ – భూమియందుండు జంతువులను జంపునది. కుత్సితాన్ రోగా న్మారయతీతి వా కుమారీ. మృజ్ ప్రాణత్యాగే. కుత్సితములైన రోగములను సంహరించునది. ౨ తరంత్యనయా రోగ జనితదుఃఖ మితి తరణిః. సీ. తౄ ప్లవనతరణయోః. దీనిచేత రోగజనితమైన దుఃఖమును దరింతురు. ఈ 3 పిన్నగోరింటపేళ్లు.

**అమ్లానస్తు మహాసహా** 73

ఆశు అమ్లానం పుష్పమస్యేతి అమ్లానః–గొబ్బున వాడని పువ్వులు గలది. న విద్యతే మ్లానషస్మాద్వా అమ్లానః–దీనివలన బడలిక లేదు. ౧. మహతీం పీడాం సంమర్దం సహతే మహాసహా – అధికమైన సమ్మర్దమును సహించునది. మహతీ చ సా సహా చ మహాసహా. ఈ ౨ పెద్దగోరింటపేళ్లు.

**తత్ర శోణే కురవకః**

కౌ రూయతే సాధురితి కురవకః. కు శబ్దే. భూమియందు మంచిదని పలుకఁబడునది. ఈ ౧ ఎఱ్ఱపూవుల పెద్దగోరింటపేరు.

**తత్ర పీతే కురణ్టకః,**

కౌ రమ్యతే కురణ్టకః. రము క్రీడాయాం. భూమి యందు రమింపఁబడునది. ఈ ౧ పచ్చపూవుల గోరింటపేరు.

**నీలీ ఝింటీ ద్వయో ర్బాణా దాసీ చార్తగళశ్చ సా.** 74

నీలపుష్పత్వాన్నీ లీ. ఈ. సీ. నల్లని పూలుగలది. ౧. ఝుమితిశబ్దం కరోతి శుష్కదశాయాంఝింటీ. ఈ. సీ. ఎండినప్పుడు ఝుమ్మను శబ్దమును జేయునది. ౨. బణతిశుష్కదశాయాం బాణా. ప్స. బణశబ్దే. ఎండినప్పుడు మ్రోయునది. 3. దస్యతి క్షీయతే కాలేన దాసీ. ఈ. సీ దసు ఉపక్షయే. కాలవశమున క్షయించునది. ౪. ఆర్తః క్షీణస్సన్ గళతీతి ఆర్తగళః, గళ అవస్రంసనే. క్షీణమైనదై జాఱునది. ఈ ౫ నల్లపూవులగోరింట పేళ్లు.

**సై రేయకస్తు ఝింటీ స్యాత్ -**

సై రదేసే భవః సై రేయకః – సైరదేశమందుఁ బుట్టినది. ౧. ఝు మితిశబ్దం కరోతీతి ఝింటీ, ఝుమ్మను శబ్దమును జేయునది. ఈ ౨ ములు

గోరింట పేళ్లు.

**తస్మిన్ కురవకో ఒ రుణే,** 75

కురవకశబ్ద ఉక్తః. ౧. ఎఱ్ఱపూవుల ములుగోరింట.

**పీతా కురణ్టకో ఝింటీ తస్మిన్ సహచరీ ద్వయోః.**

కురణ్టక ఉక్తః. ౧. భ్రమరీభిస్సహ భ్రమరాశ్చరంత్యస్యా మితి సహచరీ. ప్స. చర గతౌ. ఆఁడుతుమ్మెదలతోఁ గూడి తుమ్మెదలు దీనియందు చరించును. ఈ ౨. పచ్చపువ్వుల ములుగోరింట పేళ్లు.

**ఉడుపుష్పం జపా -**

ఉడుదేశే భవం పుష్పం ఉడుపుష్పం – ఉడుదేశమందుఁ బుట్టిన పుష్పము. పా. ఓఁద్రపుష్పం. ౧. జలమధ్యే జపతీవ తిష్ఠ తీతి జపా. జప వ్యక్తాయాం వాచి. నీళ్లనడుమ జపముసేయుదానివలె నుండునది. ఈ ౨ దాసానిచెట్టుపేళ్లు.

**వజ్రపుష్పం పుష్పం తిలస్యయత్**

వజ్రమివ విదారకం పుష్పం వజ్రపుష్పం – వజ్రమువలె తీవ్రమైన పుష్పము. ఈ ౧ నువ్వుపూవు పేరు.

**ప్రతిహాస శతప్రాస చణ్డాత హయమారకాః** 76

**కరవీరే -**

పుష్పైః ప్రతిహసతీవ తిష్ఠతీతి ప్రతిహాసః – పువ్వులచే నవ్వునట్లుండునది. ౧. శతం ప్రాసా ఇవ తీక్ష్ణాని కుట్మలాన్యస్య శతప్రాసః– అనేకములైన ఖడ్గములవలె తీక్ష్ణములైన మొగ్గలు గలది. ౨. చండం తీక్ష్ణమతతీతి చండాతకః. అత సాతత్యగమనే. ఉష్ణమైనది గనుక తీవ్రముగాఁ బోవునది. ౨. కశాసాదృశ్య శాఖత్వాద్ధయమారకః – కశవంటి కొమ్మలచేత గుఱ్ఱములను పీడించునది. ౪. కరవీరవత్ ఖడ్గవత్ మారకత్వాత్ రసపానేన కరవీరః–తనరసపానముచేత ఖడ్గమువలెఁ జంపునది. ఈ ౫. గన్నేరుపేళ్లు. కొందఱు మొదటి ౨ తెల్లగన్నేరు, తక్కిన ఈ 3 ను ఎఱ్ఱగన్నేరు పేళ్లందురు.

**కరీరేతు క్రకర గ్రన్థిలా వుభౌ,** 41

కరిణం ఈరయతి కంటకైః కరీరః. ఈర క్షేపే. ముండ్లచేత నేనుఁ గును బీడించునది. ౧. తీక్ష్ణత్వాత్ క్ర ఇతి శబ్దం కరోతీతి క్రకరః డు

కృశ్ కరణే. తీక్ష్ణమైనది గనుక క్ర యను శబ్దమును జేయునది. ౨. గ్రంథయస్సంత్యస్య గ్రంధిలః–బుడుపులు గలది. 3. కరీరాది శబ్దములు 3 వెణుతురుచెట్టు పేళ్లు.

**ఉన్మత్తః కితవో ధూర్తో ధుత్తూరః కనకాహ్వయః** 77

మాతులో మదనశ్చ

ఉన్మాదయతీత్యున్మత్తః తథైవ కితవశ్చ. మదీ హర్షగ్లేపనయోః. ఉన్మాదమును జేయునది. ౧, ౨. ధూర్వతి ఉన్మాదేన హిన స్తీతి ధూర్తః. దుర్వీ హింసాయాం. ఉన్మాదముచేత హింసించునది. ౩. వాతాదిరోగాన్ ధువతీతి ధుత్తూరః. ధూ విధూననే. వాతాది రోగములను కంపింపఁ జేయునది. పా. ధుస్తూరః. ౪. కనకస్య ఆహ్వాయోయస్య కనకాహ్వయః–బంగారు యొక్క పేరుగలది. ౫ ఉన్మాదకద్ర వ్యేషు మానా స్తితు లాస్యేతి మాతులః– ఉన్మాదకద్రవ్యములలో సాటిలేనిది. ౬. మదయతీతి మదనః. మదీహర్షగ్లేపనయోః. మదింపఁ జేయునది. ఈ ౭ ఉమ్మెత్త పేళ్లు.

**అస్య ఫలే మాతులపుత్రకః,**

మాతులస్య పుత్రః ఫలం మాతుల పుత్రకః – మాతుల మనఁగా ఉమ్మెత్త; అందుఁ బుట్టినది. ఈ ౧ ఉమ్మెతకాయ పేళ్లు.

**ఫలపూరో బీజపూరో రుచకో మాతులుఙ్గకే.** 78

ఫలైః పూర్యతే ఫలపూరః, పౄ పాలన పూరణయోః ఫలములచేఁ బూర్ణమై యుండునది. ౧. బీజైః పూర్యతే బీజపూరః– విత్తులచేత పూర్ణమైయుండునది. ౨. రోచతే రుచకః. రుచ దీప్తావభిప్రీతౌచ. జనులకు నిష్టమైనది. ౩. రుచ్య వస్తుష్వనేన మా తులాం గచ్ఛతీతి మాతులుంగకః–రుచి గల వస్తువులలో దీనితో సరియైన రుచిగల వస్తువు లేదు. ఈ ౪ మాదీఫలపు చెట్టు పేళ్లు.

**సమీరణో మరువకః ప్రస్థపుష్పః ఫణిర్జకః,**

**జంబీరో ౭ పి**

సమీరయత్యామోదం సమీరణః.ఈ ర్క్షే పే. పరిమళమునంతట ప్రేరేపించునది. ౧. మరౌ దేశే వాతివర్తత ఇతి మరువకః–నిర్జల భూమియందు వర్తించునది. ౨. ప్రస్థే సానౌ పుష్ప్యతీతి ప్రస్థపుష్పః. పుష్ప వికసనే. చటియయందుఁ బుష్పించునది. ౩.తీక్ష్ణ త్వేన ఫణీవ

ఆర్జకః ఫణిర్జకః - సర్పమువలె తీక్ష్ణత్వము నార్జించునది. పా. ఫణిజ్జకః. ౪. జమ్యతే ఆస్వాద్యత ఇతి జంబీరః జము అదనే. ఆస్వాదింపఁబడునది. ఈ ౫ మరువము పేళ్లు.

**అథ పర్ణాసే కఠింజర కుఠేరకౌ.** 79

పురాణాని పర్ణాన్యస్యతి క్షిపతీతి పర్ణాసః. అసుక్షేపణే. పండుటా కులను బోఁగొట్టునది. ౧. కఠినం జరయతీతి కఠింజరః. జౄష్వయోహానౌ. కఠినమును జీర్ణముచేయునది. ౨. కుణ్ఠతి మశకాదిగతిం ప్రబధ్నాతీతి కుఠేరకః. కుఠ ప్రతీఘాతే. మశకాదిగతి నడ్డగించునది. ఈ ౩ నల్లగగ్గెర పేళ్లు.

**సితే ఽ ర్జకో ఽ త్ర**

అర్జయత్యారోగ్యమర్జకః. అర్జ ఆర్జనే. ఆరోగ్యము నార్జించునది. ౧. తెల్లగగ్గెర.

**పాఠీ తు చిత్రకో వహ్నిసంజ్ఞకః,**

వహ్నిపర్యాయే పాఠో ఽ స్యాస్తీతి పాఠీ. న.పు. అగ్నిపర్యాయ శబ్దముల యందుఁ బాఠము గలది. చేతంతీతి చితః జంతవస్తాన్ వ్యాధిత స్త్రాయత ఇతి చిత్రకః. త్రైజ్ పాలనే. చిత్తులనఁగా జంతువులు; వానిని వ్యాధివలన రక్షించునది. నానారూపత్వా ద్వాచిత్రకః-నానారూపమై యుండునది. ౨ దీపనత్వాద్వహ్నేః సంజ్ఞానామాస్యాస్తీతి వహ్నిసంజ్ఞకః- దీపనమౌటవలన నగ్నియొక్క పేరుగలది. ఈ ౩ చిత్రమూలము పేళ్లు.

**అర్కాహ్వ వసు కాస్ఫోట గణరూప వికీరణాః.** 80

**మన్దార శ్చార్కపర్ణే.**

అర్కస్య ఆహ్వానామాస్యా స్తీతి అర్కాహ్వః-సూర్యుని యొక్క పేరుగలది. ౧. వసత్యస్మిన్ తేజ ఇతి వసుకః. వస నివాసే. దీనియందు తేజస్సుండును. ౨. ఆ స్ఫుట త్యాస్ఫోటః. స్ఫుట వికసనే. వికాసము గలిగినది. పా. ఆస్ఫోతః. ౩. గణరూపాణి బహురూపాణ్యస్య గణరూపః- కాలక్రమమున ననేక రూపములు గలది. ౪. పుష్పాణి వికిరతీతి వికీరణః. కౄ విక్షేపే. పువ్వులఁ జల్లునది. ౫. మందాన్ క్షుద్ర వ్యాధీన్ ఔషధత్వేన ఇయర్తీతి మందారః - క్షుద్రవ్యాధులను బోఁగొట్టునది. ౬. అర్కాభాని పర్ణా న్యస్య అర్కపర్ణః - సూర్యునివలె వేఁడిమిగల యాకులు గలది. ఈ ౭ జిల్లేడుచెట్టు పేళ్లు.

**అత్ర శుక్లే ఽ లర్క ప్రతాపసౌ,**

అలతి భూషయతీతి అలః, అలశ్చాసౌ అర్కశ్చ అలర్కః. అలభూషణే. భూషించెడు జిల్లేడు. ౧. ప్రకృష్టాః తాపసాః అనేనేతి ప్రతాపసః–దీనిచేత తాపసులు ప్రకృష్టులౌదురు. ఈ ౨ తెల్లపువ్వుల జిల్లేడు పేళ్లు.

**శివమల్లీ పాశుపత ఏకాష్ఠీలో బకో వసుః.** 81

శివేన మల్యత ఇతి శివమల్లీ. ఈ. సీ. మల మల్ల ధారణే. శివుని చేత ధరింపఁబడునది. ౧. పశుపతే రయం ప్రియః పాశుపతః – శివునికి ప్రియమైనది. ౨. ఏకో ఽ ష్ఠీలో మజ్జా అస్య ఏకాష్ఠీలః – ముఖ్యమైన సారముగలది. ౩. వాతీతి బకః వా గతిగంధనయోః. పరిమళించునది. పా. బుకః. ౩. వస్తి భూమి మాచ్ఛాదయతీతి వసుః. వస ఆచ్ఛాదనే. భూమిని గప్పియుండునది. ౫ ఒక పుష్పము పేళ్లు.

**వన్దా వృక్షాదనీ వృక్షరుహా జీవ న్తి కేత్యపి,**

వన్ద్యతే స్తూయతే ఔషధత్వేవన వన్దా. వది అభివాదనస్తుత్యోః. ఔషధమౌటచేత స్తోత్రము చేయఁబడునది. ౧. వృక్షమత్తి పీడయతీతి వృక్షాదనీ. ఈ. సీ. అద భక్షణే. వృక్షమును బీడించునది. ౨. వృక్షేరోహతీతి వృక్షరుహా. రుమబీజజన్మని ప్రాదుర్భావేచ. వృక్షమందు మొలచునది. ౩. జీవయతీతి జీవంతికా. జీవ ప్రాణధారణే. బ్రతికించునది. ఈ ౪ బదినిక పేళ్లు.

**వత్సాదనీ ఛిన్నరుహా గుడూచీ తన్త్రికా ఽ మృతా** 82
**జీవన్తికా సోమవల్లీ విశల్యా మధుపర్ణ్యపి,**

వత్సానాం బాలానాం అదనం వత్సాదనీ. ఈ. సీ. అద భక్షణే. బాలురకు భక్ష్యమైనది. ౧. ఛిన్నాపి రోహతీతి ఛిన్నరుహా. రుహబీజజన్మని ప్రాదుర్భావేచ. నఱకఁబడియు మరల మొలచునది. ౨. గుడతి రక్షతి గుడూచీ – జ్వరితులను రక్షించునది. ౩. తంత్రయత్యాయురితి తంత్రికా. తంత్రి ధారణే. ఆయుస్సును ధరించునది. ౪. న మ్రియత ఇత్యమృతా, మృజ్ ప్రాణత్యాగే. నాశములేనిది. ౫ జీవయతీతి జీవంతికా. జీవ ప్రాణధారణే. బ్రతికించునది. ౬ సోమస్య అంశభూతా వల్లీ సోమవల్లీ – సోమమునకు అవయవమయిన తీఁగె. ౭ విగతం శల్య మస్యా ఇతి విశల్యా–ముండ్లు లేనిది. ౮ మధురాణి పర్ణాన్యస్యా ఇతి మదుపర్ణీ. ఈ. సీ. తియ్యనియాకులు

గలది. ఈ ౯ తిప్పతీఁగె పేళ్లు.

**మూర్వా దేవీ మధురసా మోరటా తేజనీ స్రవా.** 83
**మధూలికా మధుశ్రేణీ గోకర్ణీ పీలుపర్ణ్యపి,**

మూర్వతి యష్ట్యాదికంమూర్వా. మూర్వబంధనే. కొయ్యను జట్టుకొనునది. ౧ దివ్యతీతి దేవి. ఈ. సీ. దివుక్రీ డాదౌ. ప్రకాశించునది. ౨ మధురసో ఽ స్యా అస్తీతి మధురసా – మధురమైన రసముగలది. విరుద్ధ లక్షణచేత నని కొందఱు. అనఁగా చేదు. ౩. మురతి వేష్టతీతి మోరటా. ముర వేష్టనే. చుట్టుకొనునది. ౪. తేజయ త్యగ్నిం తేజనీ, ఈ. సీ. తిజ నిశాతనే. అగ్నిని బ్రకాశింపఁజేయునది. ౫. స్రవతి రసం స్రవా–రసమును స్రవించునది. ౬. మధు ఆస్యా అస్తీతి మధూలికా – తేనెగలది. ౭. మధునఃశ్రేణిః పఙ్క్తిః అస్యాః మధుశ్రేణి – తేనెయొక్క పఙ్క్తిగలది. పా. ధనుశ్శ్రేణి. ౮. గోకర్ణాభపత్రత్వాత్ గోకర్ణీ. ఈ. సీ. ఆవుచెవులవంటి యాకులు గలది. ౯. పీలోః పర్ణానీవ పర్ణాన్యస్య పీలుపర్ణీ. ఈ. సీ. పీలు వనఁగా గోఁగుచెట్టు; అట్టి యాకులు గలది. ఈ ౧౦ చాఁగచెట్టుపేళ్లు.

**పాఠామ్బష్ఠా విద్ధకర్ణీ స్థాపనీ శ్రేయసీ శివా.** 84
**ఏకాష్ఠీలా పాపచేలీ ప్రాచీనావనతిక్తకా,**

బహుయోగేషు పఠ్యత ఇతి పాఠా, పఠవ్యక్తాయాంవాచి. అనేక యోగముల యందుఁ బఠింపఁబడునది. ౧. అంబే శబ్దే తిష్ఠతీతి అంబష్ఠా– శబ్దమందుండునది. అంబేవ తిషతీత్యంబష్ఠా – తల్లివలె నుపకారిణియై యుండునది. ౨. శాస్త్రే శ్రూయమాణత్వాత్ విద్ధౌ కర్ణావనయేతి విద్ధకర్ణీ. ఈ.సీ. శాస్త్రములయందు కర్ణ తాడితమై యుండునది. ౩. జనాన్స్థాపయతీతి స్థాపనీ. ఈ. సీ. ష్ఠా గతి నివృత్తౌ. జనులను నిలుపునది. శ్రేయస్కరత్వాత్ శ్రేయసీ. ఈ.సీ. శ్రేయస్సును గలిగించునది. దోషశమనాచ్ఛి వా. దోషశమనముచేత శుభస్వరూపమైనది. పా.రసా ౬. ఏకోఽష్ఠీలో మజ్జా స్యా ఇతి ఏకాష్ఠీలా – ముఖ్యమైన సారము గలది. ౭. పాపం చలయతీతి పాపచేలీ. ఈ.సీ.చల సంచలనే. పాపమును చలింపఁజేయునది. ౮. ప్రాచ్యాం భవా ప్రాచీనా – ప్రాచియందుఁ బుట్టినది. ౯. వనేతి క్తరసా వసతి క్తకా–వనమందు చేదైన రసము గలది. ఈ ౧౦ అగురుసొంటి పేళ్లు.

**కటుః కటుమ్భరా ఽ శోకా రోహిణీ కటురోహిణీ.** 85

**మత్స్యపిత్తా కృష్ణభేదీ చక్రాఙ్గీ శకులాదనీ,**

కటత్యావృణోతి రోగం కటుః. ఉ. సీ. కటే వర్షావరణయోః. రోగము నడ్డగించునది. ౧. కటుం బిభ ర్తీతి కటుంభరా – కారమును భరించునది. పా. కటంభరా. ౨. న విద్యతే శోకో౽స్యా ఇత్యశోకా. శోకము దీనివలన లేదు. ౩. రోహత్యంగాని వ్యాప్నోతి రోహిణీ. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ. అంగములను వ్యాపించునది. ౪. కటుశ్చాసౌ రోహిణీ చ కటురోహిణీ – కటువైనరోహిణీ. ౫. మత్స్యానాం పిత్తం జీవనం మత్స్యపిత్తా–మత్స్యములకు జీవనమైనది. ౬. కృష్ణః భేదః ఛేదో౽స్యా ఇతి కృష్ణభేదీ – నల్లని తునకలు గలది. ౭. వక్రమంగమస్య వక్రాంగీ – వక్రమైన అంగముగలది. ౮. శకులానాం అదనం శకులాదనీ – మత్స్యములకు భక్షణమైనది. ఈ ౯ కటుకరోహిణి పేళ్లు. అశోకరోహిణి యనియుఁ జెప్పుదురు.

**ఆత్మగుప్తా జహా౽వ్యణ్డా కణ్డూరా ప్రావృషాయణీ.** 86
**ఋశ్యప్రోక్తా శూకశమ్బిః కపికచ్ఛూశ్చ మర్కటీ,**

ఆత్మా గుప్యతే౽స్యా ఇతి ఆత్మగుప్తా. గుపూ రక్షణే. దీనివలన శరీరము దాఁచఁబడును. 3. జిహీయతే జహా. ఓ హాక్ త్యాగే. విడువఁబడునది. ౨. కండూకరణాయ వ్యడయతి ఉద్యచ్ఛతీతి వ్యండా. అడఉద్యమనే. తీఁటను గలిగింపఁజూచునది. పా. అవ్యండా. ౩. కడూం రాతీతి కండూరా. రాదానే. తీఁట నిచ్చునది. ౪. ప్రాయేణ ప్రావృషి భవా ప్రావృషాయణీ–తఱుచుగా వర్షాకాలమందుఁ బుట్టునది. ౫. ఋశ్యైఃమృగైః ప్రోక్తా దర్శితా ఋశ్యప్రోక్తా. ఋశ్యము లనఁగా మృగములు; వానిచేతఁ జూపఁబడునది. పా. ఋష్యప్రోక్తా. ౬. శూక ప్రధానా శింబిః త్వగస్యా ఇతి శూకశింబిః సీ. ముండ్లు తఱుచుగాఁ గలది. ౭. కపీ౯ కషతీతి కపికచ్ఛూః. ఈ. సీ. కష హింసాయాం. కోఁతులను బీడించునది. ౮ మర్కటరోమాభఫలత్వాత్ మర్కటీ. ఈ.సీ. మర్కటరోమములవంటి ముండ్లుగలది. ఈ ౯ దురదగొండి పేళ్లు. దూలగోవెల యనియుఁ జెప్పుదురు.

**చిత్రోపచిత్రాన్యగ్రోధీ ద్రవన్తీ శమ్బరీ వృషా.** 87
**ప్రత్యక్శ్రేణి సుతశ్రేణి రణ్డా మూషికపర్ణ్యపి,**

నానావర్ణత్వా చ్చిత్రా; ఉపచిత్రా చ – నానావర్ణములైన ఆకులు

గలది. ౧,౨. న్యక్ తిర్యక్ రుణద్ధి న్యగ్రోధీ. రుధిర్ ఆవరణే. అడ్డముగాఁ బ్రాఁకునది. ౩. ద్రవతి విగళతీతి ద్రవంతీ. ఈ. సీ. ద్రుగతౌ. ద్రవరూపమై యుండునది. ౪. శం సుఖం వృణోతీతి శంబరీ. సీ. వృఞ్ వరణే. వబయోర భేదః సుఖమును గప్పునది. పా.సంబరీ. ౫. వర్షతి సుఖం వృషా. వృషు సేచనే. సుఖమును వర్షించునది. ౬. ప్రత్యక్ ప్రతీచీ పర్ణావళిరస్యా ఇతి ప్రత్యక్శ్రేణి–విముఖమైన ఆకులయొక్క పంక్తిగలది. ౭. సుతానాం పర్ణాదీనాం శ్రేణిరస్యా ఇతి సుతశ్రేణి–సుతులనఁగా ఆకులు మొదలగునవి; వానియొక్క పంక్తి గలది. ౮. రమయతీతి రండా. రము క్రీడాయాం. క్రీడింపఁజేయునది. ౯. మూషక కర్ణాభపత్రత్వాత్ మూషకపర్ణీ–ఎలుక చెవులవంటి ఆకులుగలది. ఈ ౧౦ ఎలుకచెవిచెట్టు పేళ్లు.

**అపామార్గ శ్శైఖరికో ధామార్గవ మయూరకౌ.** 88
**ప్రత్యక్పర్ణీ కీశవల్లీ కిణిహీ ఖరమఞ్జరీ,**

అపకృష్టః ఆ సమంతా న్మార్గో౽ న్యేతి అపామార్గః – అంతట ఈడువఁబడి మార్గము గలది. ౧. శిఖరే భవతీతి శైఖరికః – పర్వతశిఖరమందుఁ బుట్టునది. ౨. ధామ్నో౽ర్గః ధామార్గః, ధామార్గం వాతీతి ధామార్గవః. పా. అధామార్గవః. గేహావరణమును బొందునది. ౩. మయూరచూడా ప్రతికృతిత్వాత్ మయూరకః– నెమిలిచుంచునకుఁ బ్రతికృతియైనది. ౪ ప్రత్యక్ విముఖం పర్ణమస్యా ఇతి ప్రత్యక్పర్ణీ – విముఖమైయుండునాకులు గలది. పా. ప్రత్యక్పుష్పీ. ౫. కీశస్య కపేః రోమాభాః వల్ల్యో౽స్యా ఇతి కీశవల్లీ–కపి రోమములవంటి తీఁగెలు గలది. పా. కీశపర్ణీ. ౬. కిణినో దద్రురోగిణ ఔషధత్వేన జిహీతే యాతి కిణిహీ. సీ. ఓ హాఙ్ గతౌ. కిణులనఁగా దద్రురోగముగలవారు; వారిని ఔషధమై పొందునది. ౭. ఖరా స్తీక్ష్ణా మంజర్యో౽స్యా ఇతి ఖరమంజరీ – తీక్ష్ణములైన పూగుత్తులుగలది. ఈ ౮ ఉత్తరేణి పేళ్లు.

**హఞ్జికా బ్రాహ్మణీ పద్మా భార్గీ బ్రాహ్మణయష్టికా.** 89
**అఙ్గారవల్లీ బాలేయశాక బర్బర వర్ధకాః**

హన్తి రోగం హఞ్జికా. హన హింసాగత్యోః. రోగమును బోఁగొట్టునది. పా. భనక్తిరోగం భఞ్జికా. ఇతి కేచిత్ భఞ్జో ఆమర్దనే. రోగమును బోఁగొట్టునది. ౧. బ్రాహ్మణవత్పవిత్రతాత్ బ్రాహ్మణీ.

సీ. బ్రాహ్మణునివలెఁ బవిత్రమైనది. ౨. పద్మాభపుష్పత్వా త్పద్మాపద్మములవంటి పుష్పములుగలది. ౩. భ్రజ్జతి కఫాదికమితి భార్గీ. భ్రస్జపాకే. శ్లేష్మాదులఁ బోఁ గొట్టునది. ౪. బ్రాహ్మణరీతిత్వాత్ బ్రాహ్మణ యష్టికా – బ్రాహ్మణులరీతి గలది. ౫. అంగారాభాః వల్ల్యో ఽస్యా ఇతి అంగారవల్లీ–నిప్పువంటి తీఁగెలు గలది. ౬. బాలేయస్య గర్దభస్య భోజ్యః శాకో బాలేయశాకః – గర్దభ ప్రియమైన కాయలుగలది. ౭. శాఖాభిఃపునః పునః వృణోతీతి బర్బరః వృఞ్ వరణే. వబయోరభేదః కొమ్మలచేత పలుమాఱు వ్యాపించునది. ౮. వైద్యైః వన్ద్యతే స్తూయత ఇతి వన్దకః. వది అభివాదనస్తుత్యోః, వైద్యులచేత స్తోత్రము చేయఁబడునది. పా వర్ధకః. ఈ ౯ గంటుబారంగి పేళ్లు. చిరుతే కని కొందఱు.

**మఞ్జిష్ఠా వికసా జిఙ్గీ సమఙ్గా కాలమేషికా.** 90

**మణ్డూకపర్ణీ భణ్డీరీ భణ్డీ యోజనవల్ల్యపి,**

మఞ్జని మనోజ్ఞేవర్ణే తిష్ఠతీతి మఞ్జిష్ఠా – మనోహరవర్ణమందుండునది. ౧. వికసతీతి వికసా. కస గతౌ. వికసించునది. ౨. జిఙ్గతి ప్రసతి జిఙ్గీ. జిగిగతౌ. వ్యాపించునది. ౩. సమంతాదఙ్గతీతి సమఙ్గా. అగిగతౌ. అంతట వ్యాపించునది. ౪. కాలే మిష్యతే శబ్ద్యతే కాలమేషికా. మిషశబ్దే. కాలమందు పలుకఁబడునది. ౫. మండూక ఇవ పర్ణాన్యస్య మండూకపర్ణీ – కప్పవంటి ఆకులు గలది. ౬. భణ్డత ఇతి భణ్డీరీ. సీ. భాణ్డీ సీ. భడి పరిభాషణే. వర్ణద్రవ్యములలోఁ బేర్కొనఁబడునది. ౭, ౮. దీర్ఘ వల్లీ త్వాద్యోజనవల్లీ–నిడుపైన తీఁగెగలది ఈ ౯ మంజిష్ఠ పేళ్లు.

**యాసో యవాసో దుస్స్పర్శో ధన్వయాసః కునాశకః.** 91

**రోదనీ కచ్ఛురా ఽ నన్తా సముద్రాన్తా దురాలభా,**

యాతి ప్రసరతి, యౌతి చ యాసః; యవాసశ్చ యాప్రాపణే; యుమిశ్రణే. వ్యాపించునది యాసము; చేరునది యవాసము. ౧,౨. కంటకాచి తత్వాత్ దుః ఖేనస్పృశ్యతే దుస్స్పర్శః. స్పృశ స్పర్శనే. ముండ్లవలనఁ బ్రయాసముచేత స్పృశింపఁ బడునది. ౩. ధన్వని మరుదేశే యాసో ధన్వయాసః–మరుదేశమందుఁ బుట్టునది. ౪. కుంనాశయతి కణ్టకత్వేన కునా శకః – ముండ్లచేత భూమిని జెఱుచునది. ౫. స్పృశ న్తం రోదయతీతి రోదనీ సీ. రుదిర్ అశ్రువిమోచనే, తనను దాఁకినవానిని దుఃఖపెట్టు

నది. ౬. కచ్ఛురోగం రాతీతి కచ్ఛురా. రాదానే. కచ్ఛువను రోగము నిచ్చునది. ౭. దీర్ఘమూలతయా అనంతా, సముద్రాన్తాచ - నిడుపులైన వ్రేళ్లు గలది. ౮, ౯. దుఃఖేన లభ్యతే స్పృశ్యత ఇతి దురాలభా. డులభష్ ప్రాప్తౌ. ప్రయాసముచేఁ దాఁకఁబడునది. ఈ ౧౦ తీఁటకసింద పేళ్లు.

**పృశ్నిపర్ణీ పృథక్పర్ణీ చిత్రపర్ణ్యఙ్ఘ్రిపర్ణికా.** 92
**పృశ్నీని అల్పాని పర్ణాన్యస్యాః పృశ్నిపర్ణీ -**

సన్ననియాకులు గలది. ౧. పృథక్ భిన్నాని పర్ణా న్యస్యాః పృథక్పర్ణీ – ఒకదానితో నొకటి కలియని యాకులు గలది. ౨. చిత్రరూపాణి పర్ణాన్యస్యాశ్చిత్రపర్ణీ– చిత్రములైన ఆకులు గలది. ౩. అంఘ్రేర్బుధ్నాదారభ్య పర్ణాన్యస్యా అంఘ్రిపర్ణికా చెట్టు మొదటనుండి ఆకులు గలది. పా. అంఘ్రివల్లికా. ఈ ౪ కోలపొన్న పేళ్లు.

**క్రోష్టువిన్నా సింహపుచ్ఛీ కలశీ ధావనీ గుహా,**

క్రోష్టుభిర్విన్నా ఆదతేవ భాతి తత్పుచ్ఛ సామ్యాత్ క్రోష్టు విన్నా–నక్కలచేతఁ బొందఁబడినదానివలెనుండి తత్పుచ్ఛసామ్యముగలదై యుండునది. ౧. సింహపుచ్ఛాకృతి మంజరీత్వాత్ సింహపుచ్ఛీ. సీ. సింహపుతోఁకవంటి కొమ్మలుగలది. ౨. రసాధారత్వాత్ కించిత్కలశ సామ్యమ స్తీతి కలశీ. సీ. రసాధారమౌటచే నించుక కలశసామ్యము గలది. ౩. ధావతి ప్రసరతీతి ధావనీ. ధావు గతి శుద్ధ్యో. వ్యాపించునది. ౪. గూహతి రసం గుహా. గుహూ సంవరణే. రసమును గప్పియుండునది. ఈ ౫ నక్కతోఁక కసవుపేళ్లు. నక్కతోఁక పొన్న యని కొందఱు.

**నిదిగ్ధికా స్పృశీ వ్యాఘ్రీ బృహతీ కణ్టకారికా,** 93
**ప్రచోదనీ కులీ క్షుద్రా దుస్స్పర్శా రాష్ట్రికేత్యపి,**

నిదిహ్యతే అంగోపాంగై రుపచీయతే నిదిగ్ధికా. దిహ ఉపచయే. అవయవములచే వృద్ధిఁబొందునది. ౧. స్పృశతీతి స్పృశీ. సీ. స్పృశ స్పర్శనే. స్పృశించునది. ౨. వ్యాఘ్ర నఖ రసమాన కంటకత్వాత్ వ్యాఘ్రీ – పులిగోళ్లవంటి ముండ్లుగలది. ౩. కంటకైర్బృహతీతి బృహతీ.సీ. బృహ వృద్ధౌ.ముండ్లచే నధికమై యుండునది. ౩. కంటకా నియర్తీతి కంటకారికా. ఋ గతౌ. ముండ్లను బొంది యుండునది. ౪. కంటకైః చోదయతి ప్రేరయతి ప్రచోదనీ. చుద ప్రేరణే. ముండ్ల

చేతఁ బ్రేరేపించునది. ౬. కోలతి సంఘీభవతీతి కులీ. సీ. కులంసంస్త్యానే. దట్టమైయుండునది. ౭. వార్తాకాదిక మపేక్ష్య క్షుద్ర త్వాత్ క్షుద్రా. వంగమొదలైన వానికంటె నీచమైనది. ౮. దుఃఖేనస్పృశ్యత ఇతి దుస్స్పర్శా-ప్రయాసముచేత స్పృశింపఁబడునది. ౯. రాష్ట్రేభవా రాష్ట్రికా. దేశమందుఁ బుట్టినది. ఈ ౧౦ వాఁకుడుచెట్టు పేళ్లు.

**నీలి కాలా క్రీతకికా గ్రామీణా మధుపర్ణికా.** 94

**రఞ్జనీ శ్రీఫలీ తుత్థా ద్రోణీ డోలా చ నీలినీ,**

నీలవర్ణత్వాన్నీలీ. సీ. కాలా చ-నల్లనివన్నె గలది. ౧, ౨. క్రీత కం వినిమయో ఽ స్యా ఇతి క్రీతకికా. డు క్రీఞ్ ద్రవ్యవినిమయే. వినిమయము గలిగినది. ౩. గ్రామే భవా గ్రామీణా - గ్రామమందుఁ బుట్టినది. ౪. మధుమాసే పర్ణ్యానస్యాః మధుపర్ణికా - చైత్రమాసమందు వర్ణములు గలది. ౫. వస్త్రాదికం రఞ్జయతీతి రఞ్జనీ. సీ. రఞ్జ రాగే. వస్త్రాదుల నల్లగాఁ జేయునది. ౬. రమ్యఫలత్వాచ్ఛ్రీఫలీ. సీ. మంచి పండ్లు గలది. ౭. తుద్యతే తుత్థా. తుద వ్యథనే. పీడింపఁబడునది. ౮. ద్రవం త్యస్యాః జనాః అస్పృశ్యత్వాత్ ద్రోణీ.సీ.ద్రుగతౌ. అస్పృశ్యమౌట చేత సుజనులు దీనిం జేరక పాఱిపోవుదురు. ౯. డోల్యతే వాతేన డోలా. డుల ఉత్క్షేపే. వాయువుచేతఁ గొట్టఁబడునది. పా. దోలా. ౧౦. నీలవర్ణో ఽ స్యా అ స్తీతి నీలినీ. సీ. నీలవర్ణముగలది. ఈ ౧౧ నీలిచెట్టు పేళ్లు.

**అవల్గుజ స్సోమరాజీ సువల్లీ సోమవల్లికా.** 95

**కాలమేషీ కృష్ణఫలా వాకూచీ పూతిఫల్యపి,**

పూతిగంధత్వాత్ అవల్గోః అరమ్యా ద్బీజాజ్జాతః అవల్గుజః-రమ్యముగాని దుర్గంధము గల విత్తుల వలనఁ బుట్టునది. ౧. సోమేన ఆహ్లాదేన రాజతే సోమరాజీ. సీ. రాజృ దీప్తౌ. సంతోషముచేతఁ బ్రకాశించునది. ౨. శోభనావల్ల్యః అస్యాః సువల్లీ. సీ. మంచితీఁగెలు గలది. ౩. సోమా ఆహ్లాదకారిణీ వల్లీ అస్యా ఇతి సోమవల్లికా. ఆహ్లాదమును జేయు తీఁగెలుగలది. ౪. కాలవర్ణేన మిష్యతే కాలమేషీ. సీ. మిషశబ్దే. నీలవర్ణముచేతఁ బలుకఁబడినది. ౫. కృష్ణవర్ణాని ఫలాన్యస్యాః కృష్ణ ఫలా - నల్లని పండ్లుగలది. ౬. వాతం కోచయతీతి వాకూచీ. కుచ శబ్దేతారే. గాలికి మ్రోయునది. పా. వాగుజీ ౭. పూతిగంధః ఫలేష్వ

స్యాః పూతిఫలీ. సీ. దుర్గంధపు పండ్లు గలది. ఈ ౮. కారుగచ్చ పేళ్లు.

**కృష్ణోపకుల్యా వైదేహీ మాగధీ చపలా కణా.** 96

**ఊషణా పిప్పలీ శౌణ్డీ కోలా**

కర్షతి రోగాన్ కృష్ణవర్ణత్వాద్వా కృష్ణా. కృష విలేఖనే. రోగములను సంహరించునది. లేక నీలవర్ణముగలది. కృష్ణా. ౧. ఉపగతాకుల్యా జన్మభూమిత్వే నానయేత్యుపకుల్యా – జన్మభూమియౌటచేత పొందఁబడిన కాలువఁగలది. ౨. విదేహదేశేభవా వైదేహీ. సీ. విదేహదేశ మందుఁ బుట్టినది. ౩. మగధదేశే భవామాగధీ. సీ. మగధదేశమందుఁ బుట్టినది. ౪. చపలః ఉష్ణో రసః తద్యోగా చ్చపలా – చపలమనఁగా ఉష్ణరసము; అది గలిగినది. ౫. కణాస్సన్త్యస్యాః కణా – సూక్ష్మమైన అవయవములు గలది. ౬. రోగానూషతి ఊషణా. ఊష రుజాయాం. రోగములఁ బోఁగొట్టునది. ౭. పిపర్తి పాలయతీతి పిప్పలీ. సీ. పౄ పాలన పూరణయోః. పాలించునది. ౮. రోగాపనోదనే శ క్తత్వాత్ శౌండీ.సీ. రోగములఁ బోఁగొట్టుటయందు సమర్థమైనది. ౯. కోలతి సంస్త్యాయతీతి కోలా. కుల సంస్త్యానే. కూడుకొనియుండునది. ఈ ౧౦ పిప్పలితీఁగె పేళ్లు.

**అథ కరిపిప్పలీ,** 97

**కపివల్లీ కోలవల్లీ శ్రేయసీ వసిరః పుమాన్.**

కరియోగ్యా పిప్పలీ కరిపిప్పలీ. సీ. ఏనుఁగునకు యోగ్యమైన పిప్పలి. ౧. కపిరోమా భావయవత్వా త్కపివల్లీ. సీ. కపిరోమములవంటి అవయవములు గలది. ౨. కోలరోమాభావయవత్వాత్కోలవల్లీ – పంది రోమములవంటి అవయవములు గలది. ౩. శ్రేయస్కరత్వాత్ శ్రేయసీ. సీ.శ్రేయస్సు నిచ్చునది. ౪. వస్యతే రోమభి రాచ్ఛాద్యతే వసిరః. వస ఆచ్ఛాదనే.రోమములచేఁ గప్పఁబడునది. పా. వశిరః. ఈ ౫ గజపిప్పలి పేళ్లు.

**చవ్యం తు చవికమ్**

చర్వ్యతే చవ్యం, చవికం, చవికా చ. చర్వ అదనే. భక్షింపఁబడునది. ఈ ౨ చవ్యము పేళ్లు.

**కాకచించీ గుఞ్జేతు కృష్ణలా,**

కాకవర్ణే చిఞ్చా ప్రాంతో ఽ స్యాః కాకచిఞ్చి. సీ. కాకివన్నె గల కడలుగలది. పా. కాకచిఞ్చా. ౧. శుష్కదశాయాం గుఞ్జతీతి గుఞ్జా,

గుజి అవ్యక్తే శబ్దే. ఎండినప్పు డించుక మ్రోయునది. ౨. ప్రాంతే కృష్ణవర్ణం లాతీతి కృష్ణలా. లా ఆదానే. చుట్టును కృష్ణవర్ణమును బుచ్చుకొనునది. ఈ 3 పూసల గురివెంద పేళ్లు.

**పలం కషా త్విక్షగన్ధా శ్వదంష్ట్రా స్వాదుకణ్టకః,** 98
**గోకణ్టకో గోక్షురకో వనశృఙ్గాట ఇత్యపి,**

పలం మాంసం కంటకముఖేన కషతీతి పలంకషా, కష హింసాయాం, మాంసమును ముండ్లచేత గీఱునది. ౧. ఇక్షోర్గంధ ఇవ గంధో ఽ స్యాః ఇక్షుగంధా – చెఱుకువంటి పరిమళముగలది. ౨. శున ఇవదంష్ట్రా కంటకాత్మా అస్యా ఇతి శ్వదంష్ట్రా – శునకముయొక్క పండ్ల వంటి ముండ్లుగలది. ౩. మృదుకంట కత్వాత్స్వాదుకంటకః – మృదువైన ముండ్లు గలది. ౩. గవాం కంటకోబాధకో గోకంటకః– గోవులకు బాధకమైన ముండ్లు గలది. ౪. గవి భువి క్షుర ఇవ దుఃఖహేతుత్వాత్ గోక్షురకః – భూమియందు కత్తివలె దుఃఖహేతువైనది. ౬. వనే శృంగమివ దుఃఖకరత్వమటతీతి వనశృంగాటః – వనమందు కొమ్మువలె దుఃఖకరత్వమును బొందియుండునది. ఈ ౭ పల్లేరు పేళ్లు.

**విశ్వా విషా ప్రతిషాతి షోష విషారుణా.** 99
**శృఙ్గీ మహౌషధం చ**

విశతి రోగిణః హృదయే విశ్వా. విశ ప్రవేశనే. రోగిహృదయమందు ప్రవేశించునది. ౧. శరీరం వేష్టతీతి విసా. విష్ ౙ వ్యాప్తౌ. శరీరమును వ్యాపించునది. ౨. విషస్య ప్రతి ప్రతివిషా–విషమునకు విరోధియైనది. ౩. విషమతి క్రాంతా అతివిషా – విషము నతిక్రమించునది. ౪. అపగతం విషమస్యా అపవిషా–అపగతమైన విషముగలది. పా. ఉపగతా విషం ఉపవిషా – విషమును బొందునది. ౫. అరుణవర్ణత్వాదరుణా – ఎఱ్ఱనివన్నెగలది. ౬. శృంగయు క్తత్వాత్ శృఙ్గీ. సీ. కొమ్ములు గలది. ౭. మహచ్చ తత్ ఔషధం మహౌషధం – గొప్ప యౌషధము. ఈ ౮ అతివస పేళ్లు.

**అథ క్షీరావీ దుగ్ధికా సమే,**

క్షీర మవతి క్షీరావీ. సీ పాలను రక్షించునది. ౧. దుగ్ధమస్యా ఇతి దుగ్ధికా– పాలుగలది. ఈ ౨ చిఱుపాలచెట్టుపేళ్లు.

**శతమూలీ బహుసుతా భీరు రిన్దీవరీ వరీ.** 100
**ఋశ్యప్రోక్తా భీరుపత్రీ నారాయణ్యశ్శతావరీ,**
**అహేరుః -**

శతం బహూని మూలాన్యస్యా శ్శతమూలీ. సీ. అనేకములైన వేళ్లుగలది. బహవస్సుతాః మూలాన్యస్యాః బహుసుతా – అనేకములైన వేళ్లు గలది. ౨. న భీరుః అభీరుః. సీ. స్థిరమైన ఆకులు గలది గనుక వెఱపులేనిది. పా. భీరుః. ౩. ఉత్పలాభపత్రత్వా దిందీవరీ. సీ. నల్లకలువ వంటి పువ్వులుగలది. ౪. భువం మూలై ర్వృణోతీతవరీ.సీ. వృఞ్ వరణే. వేళ్లచేత భూమిని గప్పునది. ౫. ఋశ్యైః ప్రోక్తా ఆశ్రితా ఋశ్యప్రోక్తా.పా. ఋష్యప్రోక్తా – వ్యాఘ్రుశత్రువౌటవలన మృగములచేత నాశ్రయింపఁబడునది. ౬. అభీరూణి దృఢత్వేన భయరహితాని పత్రాణ్యస్యాః అభీరుపత్రీ. సీ. దృఢమవుటచేత వాయువువలన భయములేని ఆకులు గలది. ౭. నారాయణాజ్జాతా నారాయణీ – నారాయణునివలనఁ బుట్టినది. ౮ శతమూలై ర్భువం ఆవృణోతీతి శతావరీ. సీ. వృఞ్వరణే. అనేకములైన వేళ్ల చేత భూమిని నావరించునది. ౯. న హినో తీత్యహేరుః. సీ. హి గతౌ వృద్ధౌచ. పోవనిది. పా. అహీరుః. ఈ ౧౦ పిల్లపిచ్చర పేళ్లు. చల్లగడ్డ.

**అథ పీతద్రు కాలేయక హరిద్రవః.** 101
**దార్వీ పచంపచా దారుహరిద్రా పర్జనీత్యపి,**

పీతః ద్రుః స్కంధో ఽస్య పీత ద్రుః పచ్చనికొమ్మలు గలది. ౧. కాలయతి దోషా౯ కాలేయకః. కల కిల క్షేపే. దోషములను బోఁగొట్టునది. ౨. హరిశ్చా సౌద్రుశ్చ హరిద్రుః. పు. పచ్చనివన్నెగల చెట్టు. ౩. దారుసంబంధినీ దార్వీ . సీ. దారుసంబంధమైన పసుపు. ౪. అత్యర్థం రోగా౯ పచతీతి పచంపచా.డు పచ్ష్ పాకే. రోగములను మిక్కిలి పాకముఁబొందించునది. పా. పత్రంపచా. ౫. దారుసంబంధినీ హరిద్రా దారుహరిద్రా – మ్రానిసంబంధమైన పసుపు. ౬. కుష్ఠాది రోగేభ్యః పిప ర్తీతి పర్జనీ.సీ. పౄపాలన పూరణయోః. కుష్ఠాదిరోగములవలన రక్షించునది. ఈ ౭ మ్రానిపసుపు పేళ్లు.

**వచోగ్ర గన్ధాషడ్గంథా గోలోమీ శతపర్వికా.** 102

వక్తీతి వచా. వచ పరిభాషణే. పలుకునది. ౧. ఉగ్రోగంధో ౽స్యా ఇతి ఉగ్రగన్ధా – ఉగ్రమైన గంధముగలది. ౨. షట్ గ్రంథయః పర్వాణ్యస్య షడ్గ్రంథా – ఆఱు కనుపులు గలది. ౩. గోరివ లోమాన్యస్య గోలోమీ.సీ. ఆవు రోమములవంటి రోమముల గలది. ౪. శతం బహూని పర్వాణ్యస్య శతపర్వికా – అనేకములైన గణుపులుగలది. ఈ ౫. వస పేళ్లు.

**శుక్లాహైమవతీ -**

ప్రాయో హిమవతి భవతీతి హైమవతీ–తఱుచుగా హిమవత్పర్వతమందుఁ బుట్టునది. ఈ ౧. తెల్వవస పేళ్లు.

**వైద్యమాతృ సింహ్యౌతు వాశికా,** 103

**వృషో ౽టరూష స్సింహాస్యో వాసికో వాజిదన్తకః.**

వైద్యానాం మాతా హితకారిత్వాద్వైద్యమాతా. ఋ. సీ. వైద్యులకు తల్లివలె హితకారిణియైనది. ౧. హినస్తి రోగాన్ సింహీ. సీ. రోగములను హింసించునది. ౨. నాశ్యత ఇతి వాశికా. వాశృశబ్దే. శబ్దముచేయునది. ౩. మధు వర్ష తీతి వృష. వృషు సేచనే. తేనెను వర్షించునది. ౪. అటాన్ వ్యాప్తాన్ రోగాన్ రోషతీత్యటరూషః. పా. అటరుషః. రుష హింసాయాం. వ్యాప్తములైన రోగముల నణఁచునది. ౫. సింహాస్యాకారపుష్పత్వా త్సింహాస్యః – సింహమునోరువంటి పువ్వులుగలది. ౬. వాసయతీతి వాసికః. వస్తే ఆచ్ఛాదయతి వాసికః – కప్పుకొనునది. ౭. వాజిదంతా కారకేసరత్వాద్వాజిదంతకః – గుఱ్ఱపుపండ్లవంటి అకరువులు గలది. ఈ ౮ అడ్డసరపు చెట్టుపేళ్లు.

**ఆస్ఫోటా గిరికర్ణీ స్యా ద్విష్ణుక్రాన్తా ౽పరాజితా,**

ఆస్ఫోట తీత్యాస్ఫోటా, స్ఫుట వికసనే. అంతట వికాసము గలది. పా. ఆస్ఫోతా. ౧. గిరేః కర్ణసాదృశ్యాద్గిరికర్ణీ. సీ. పర్వతమునకు చెవివలె నుండునది. ౨. విష్ణోరివ క్రాంతి రస్యాః విష్ణుక్రాంతా – విష్ణువువంటి శక్తిగలది. రక్షాహేతు త్వా ద్విష్ణునా క్రాంతా విష్ణుక్రాంతా – రక్షా హేతువైనదౌటవలన విష్ణువుచేత నాక్రమింపఁబడినది. ౩. (అతఏవ) అపరాజితా భూతైరతిరస్కృతా – కనుకనే భూతములచేత తిరస్కరింపఁబడినది. ఈ ౪. విష్ణుక్రాంతము పేళ్లు. ఆస్ఫోటా గిరికర్ణీ శబ్దములు గంటెన వేళ్లని కొందఱు.

**ఇక్షుగన్ధా తు కాణ్డేక్షు కోకిలా క్షేక్షుర క్షురాః.** 104

ఇక్షోర్గంధ ఇవ గంధో ఽ స్యా ఇక్షుగంధా–చెఱుకువంటి గంధము గలది. ౧. కాండేన ఇక్షురివ కాండేక్షుః – కాఁడచేత చెఱకువంటిది. ౨. కోకిలస్య అక్షిణీ ఇవ పుష్పాణ్యస్య కోకిలాక్షః–కోవెలకండ్ల వంటి పువ్వులు గలది. ౩. ఇక్షుం రాతి సాదృశ్యాత్ ఇక్షురః. రా ఆదానే. సాదృశ్యముచేత చెఱకును బుచ్చుకొనునది. ౪. పారుష్యా త్క్షుర ఇవక్షురః–పారుష్యముచేత కత్తివలెనుండునది. ఈ ౫ గొలిమిడి పేళ్లు. కాకి చెఱకుపేళ్ళని కొందఱు.

**శాలేయ స్స్యా చ్ఛీతశివా ఛత్రా మధురికా మిసిః,**

**మిశ్రేయా ఽ పి-**

శాల్యతే శ్లాఘ్యతే శాకాయ భవతీతి శాలేయః. శాల శ్లాఘాయాం. శాకార్థమౌనని కొనియాడఁబడునది. ౧. శీతవీర్యత్వాచ్ఛివా భద్రా శీతశివా–చలవగలదౌటవలన శుభమును జేయునది. ౨. ఛాదయతి భువనం ఛత్రా. ఛద అపవారణే. భూమిని గప్పియుండునది. ౩. మధురరసయోగా న్మధురికా – మధురసముగలది. ౪. మస్యతి పరిణమతే తిక్తత్వేనేతి మిసిః. సీ. మస పరిణామే. చేఁదై పరిణమించునది. ౫. మిశ్రయితుం యోగ్యా మిశ్రేయా – ఔషధములలోఁ గూర్చుటకు యోగ్యమైనది. ఈ ౬ సదాప పేళ్లు.

**అథ సింహుణ్డో వజ్రద్రుః స్నుక్స్నుహీ గుడా.** 105

**సమన్తదుగ్ధా -**

సింహతుణ్డాభ శాఖత్వాత్సింహుండః–సింహముఖముతో సమానమైన కొమ్మలు గలది. పా. సీహుండః. ౧. వజ్రమివ భేదకత్వా ద్వజ్రద్రుః. పు. వజ్రమువలె ప్లీహము మొదలైన రోగములను హింసించునది. వజ్ర ఇవ స్కంధో ఽస్య వా వజ్రద్రుః –వజ్రమువంటి కొమ్మలు గలది. ౨ స్నుహ్యతి క్షీరం స్నుక్. హ–సీ. స్నుహీ. ఈ.సీ. ష్ణుహ ఉద్గిరణే. పాలను వెళ్ళించునది. ౩, ౪. గుడతిప్లీహాదిరోగేభ్యో గుడా. గుడ రక్షాయాం. ప్లీహాదిరోగములవలన రక్షించునది. ౫. సమంతాద్దుగ్ధం క్షీర మస్యా ఇతి సమంతదుగ్ధా – అంతటను పాలుగలది. ఈ ౬ జెముడు పేళ్లు.

**అథో వేల్ల మమోఘ చిత్రతణ్డులా,** 106

**తణ్డుల శ్చ క్రిమిఘ్న శ్చ విడఙ్గం పుంనపుంసకమ్.**

వేల్లతే వేల్లం. వేల్ల సంచలనే. చులకనై చలించునది. ౧. సుప్రయోజనత్వాదమోఘా - వ్యర్థముగానిది. ౨. చిత్రాస్తండులాస్సూక్ష్మ బీజా న్యస్యాశ్చిత్రతండులా - నానావిధములైన సన్నవిత్తులుగలది. ౩. తండులా స్సంత్యస్యేతి తండులః- విత్తులు గలది. ౪. క్రిమీ౯ ౬ హన్తీతి క్రిమిఘ్నః హన హింసాగత్యోః పురుగులఁజంపునది. ౫. విడతి రోగం విడఙ్గః. విడ భేదనే. రోగమును జెఱుచునది. ఈ ౬ వాయువిళంగము పేళ్లు.

**బలా వాట్యాలకః-**

బలంత్యనయా బలా. బల ప్రాణనే. దీనిచేత బ్రతుకుదురు. ౧. వటతి వేష్టయతీతి వాట్యాలకః. వట వేష్టనే. పఱచుకొనియుండునది. వాటమలతీతి వాట్యాలకః. అల భూషణాదౌ. వృక్షవాటిక నలంకరించునది. ఈ ౨ చిట్టాముదపు చెట్టు పేళ్లు.

**ఘణ్టారవా తు శణపుష్పికా,**

ఘంటాయాః రవో ౽ స్యా ఇతి ఘంటారవా - ఎండినప్పుడు ఘుంటవంటి శబ్దము గలది. ౧. శణస్యేవ పుష్పాణ్యస్యాః శణపుష్పికా - జనుము వంటి పువ్వులుగలది. ఈ ౨ గిలకచెట్టుపేళ్లు.

**మృద్వీకా గో స్తనీ ద్రాక్షా స్వాద్వీ మధురసేతి చ.** 107

మృద్యత ఇతి మృద్వీకా - మెదుపఁబడినది. ౧. గో స్తనాభ ఫలత్వాద్గోస్తనీ. సీ. ఆవుచన్నులవంటి పండ్లు గలది. ౨. ద్రాతి దాహాదికంద్రాక్షా. ద్రాకుత్సాయాంగతౌ. దాహాదికమును బోఁగొట్టునది. ౩. స్వాదుత్వా త్స్వాద్వీ.సీ. రుచియైనది. ౪. మధురసయోగా న్మధురసా-మాధుర్యముగలది. ఈ ౫. ద్రాక్ష పేళ్లు.

**సర్వానుభూతి స్సరళా త్రిపుటా త్రివృతా త్రివృత్,**

**త్రిభణ్డీ రేచనీ -**

మధు రతిక్తాదీనాం సర్వరసానా మనుభూతిరత్రేతి సర్వానుభూతిః. సీ. తీఁపు చేఁదు మొదలైన సర్వరసముల యొక్క అనుభవము దీని యందుఁ గలదు. ౧. సరతీతి సరళా వెళ్లునది. ౨. త్రయః పుటాఅస్య ఇతి త్రిపుటా - మూఁడుపుటములు గలది. ౩. త్రిభిః పుటై ర్వియతే ఆచ్ఛా

ద్యత ఇతి త్రివృతా. వృఙ్ వరణే. మూఁడుపుటములచేతఁ గప్పఁబడునది. ౪. కఫహరణ పిత్తహరణ రేచకత్వరూపాణాం త్రయాణాం గుణానాం వృతిర్వర్తన మత్రేతి త్రివృత్. త. సీ. వృతు వర్తనే. శ్లేష్మహరణ పిత్తహరణ రేచకత్వముల నెడు మూఁడు గుణములయొక్క వర్తనము దీని యందుఁగలదు. ౫. త్రిభిర్గుణైర్భణ్య తేశబ్ద్యత ఇతి త్రిభండీ. సి. శ్లేష్మహరాదులైన 3 గుణములచేతఁ బలుకఁబడునది. ౬. రేచయతీతి రేచనీ. సీ. రిచిర్ పృథగ్భావే. భిన్నముఁ జేయునది. ఈ ౭ తెల్ల తెగడ పేళ్లు.

**శ్యామాపాళిన్ద్వా తు సుషేణికా.** 108

**కాలా మసూరవిద ళార్ధచన్ద్రా కాలమేషి కా,**

కృష్ణవర్ణత్వాత్ శ్యామా – నల్లనిది. ౧. పాలయతి రోగేభ్యపాళిన్దీ. సీ. పాల రక్షణే. రోగములవలన రక్షించునది. పా. పాలినీ. ౨. సుష్ఠు సినోతి క్రిమీ౯ సుషేణికా, షిఙ్ బంధనే. పురుగులను మిక్కిలి నిలుపునది. ౩. కాలవర్ణత్వా త్కాలా నల్లనిది. ౩. మసూర ఇవ విదళామసూరవిదళా – చిఱుసెనగలవలె వ్రక్కలై యుండునిది. పా. మయూర విదళా. ౫. కథంచిత్ అర్ధచంద్రసదృశదళత్వాదర్ధచంద్రా – అర్ధచంద్ర సదృశములైన ఆకులుగలది. ౬. కాలేన వర్ణేన మిష్యతే కాలమేషికా. మిష శబ్దే. నల్లవన్నె చేతఁ జెప్పఁబడునది. ఈ ౭ నల్ల తెగడపేళ్లు.

**మధుకం క్లీతకం యష్టిమధుకం మధుయష్టికా.** 109

మధుకరత్వేన మధుసమత్వా న్మధుకం – తీఁపుచేత తేనెకు సరియైనది. ౧. క్లీబత్వం తకతి ప్రతిహంతి క్లీతకం. తక ప్రతిఘాతే. నపుంసకత్వమును జెఱుచునది. ౨. యష్టిరూపం మధుకం యష్టిమధుకం – కోలవంటి మధుకము. ౩. మధునా తుల్యా యష్టిర్మధుయష్టికా – తేనెతో సరియైనయష్టి. ఈ ౪ అతి మధురము పేళ్లు.

**విదారి క్షీరశుక్లేక్షుగన్ధా క్రోష్టీచ యా సితా,**

విదారయతి భూమిం విదారీ. సీ. దౄ విదారణే. భూమిని వ్రక్కలించునది. విదార్యతే పచ్యతే విదారీ – పక్వము చేయఁబడునది. ౧. క్షీరేణ శుక్లేవ క్షీరశుక్లా– పాలచేత తెల్లనైనదానివలె నుండునది. ౨. ఇక్షోర్గంధ ఇవ గంధో ౽స్యా ఇక్షుగంధా– చెఱకువంటి గంధము గలది. ౩. మధురత్వాత్ వృష్యాదిప్రయోగేషు సమర్థాహమితి క్రోశతీతి

క్రోష్టీ. సీ. క్రుశ ఆహ్వానే రోదనే చ. ధాతువర్ధనమందు సమర్థమని మొఱఁ బెట్టునది. ఈ ४ నల్లనేలగుమ్ముడు పేళ్లు.

**అన్యా క్షీరవిదారీ స్యా న్మహాశ్వే త ర్క్ష గన్ధికా.** 110

క్షీరవద్విదారీ క్షీరవిదారీ.సీ. పాలుగల గుమ్ముడు. ౧. క్షీరతః శ్వేతత్వాత్ మహాశ్వేతా–పాలచేత మిక్కిలి తెల్లనైయుండునది. ౨. ఋక్షసదృశాౝ హింస్రాౝ పిత్తాదిరోగాౝ గంధయతి నాశయతీతి ఋక్షగంధికా. గంధ అర్దనే. ఎలుగుగొడ్డువలె క్రూరములైన పైత్యాది రోగములఁ జెఱుచునది. ఈ 3 తెల్లనేల (పాల) గుమ్ముడు పేళ్లు.

**లాఙ్గలీ శారదీ తోయపిప్పలీ శకులాదనీ,**

లాఙ్గలాకారత్వాత్ లాఙ్గలీ. సీ. నాఁగేలువలె నుండునది. ౧. శరది భవా శారదీ–శరత్కాలమునందుఁ బుట్టునది. ౨. తోయజా పిప్పలితో యపిప్పలీ - నీళ్ల యందుఁ బుట్టిన పిప్పలి. ३. శకులైర్మత్స్యైరద్యతే శకులాదనీ. సీ. అద భక్షణే. మత్స్యములచేత భక్షింపఁబడునది. ఈ ४ నీరుపిప్పలి పేళ్లు.

**ఖరాశ్వా కారవీ దీప్యో మయూరో లోచమస్తకః** 111

ఖరత్వ ముష్ణత్వ మశ్నుత ఇతి ఖరాశ్వా. అశూఙ్ వ్యాప్తౌ. ఉష్ణత్వమును బొందునది. ౧. కేన జలేన రౌతి కరవః మయూరః, కరవస్యేయం కారవీ. రు శబ్దే. ఉదకముచేతఁ గూయునది నెమలి, దానిసంబంధమైనది. ౨. దీప్యతే అనే నేతి దీప్యః, దీపి దీప్తౌ. దీనిచేత దీపనాగ్ని ప్రకాశింపఁజేయఁబడును. ३. మీనాత్యగ్ని మాన్ద్యం మయూరః. మీఙ్ హింసాయాం. అగ్ని మాంద్యమును జెఱుచునది. ४. లోచ ముపనీతం మస్తకమస్య లోచమస్తకః–పొందింపఁబడిన శిరస్సుగలది. ఈ ౫ ఓమము పేళ్లు.

**గోపీ శ్యామా శారిబా స్యా చ్చన్ద నోత్పల శారిబా,**

అతిసారరోగిణం గోపయతీతి గోపీ. సీ. గుపూ రక్షణే. అతిసారరోగము గలవానిని రక్షించునది. ౧. శ్యామవర్ణత్వాత్ శ్యామా. నల్లనైనది. ౨. శీర్యంతే అనయాదోషా ఇతి శారిబా శౄ హింసాయాం. దోషములు దీనిచేత సంహరింపబడును. ३. చందయతి సుగంధేన ఆహ్లాదయతీతి చందనా. చది ఆహ్లాదనే. పరిమళముచేత సంతోషింపఁ

జేయునది. పా. అనంతా. ౪. ఉత్పలాభ పుష్పత్వా దుత్పలశారిబా – నల్లకలువలవంటి పువ్వులు గలది. ఈ ౫ మామెన (సుగంధిపాల) పేళ్లు.

**యోగ్య మృద్ధి స్సిద్ధిలక్ష్మ్యౌ వృద్ధేరప్యాహ్వయా ఇమే.** 112

ఔషధయోగే సాధు యోగ్యం – ఔషధయోగములయందు మంచిది. ౧. ఋధ్నోత్యనయేతి ఋద్ధిః. సీ. ఋతు వృద్ధౌ. దీనిచేత వృద్ధిఁబొందును. ౨. సిద్ధ్యత్యారోగ్యమనేయేతి సిద్ధిః. సీ. ఆరోగ్యము దీనిచేత సిద్ధించును. ౩. అష్టవర్గయోగే లక్ష్యత ఇతి లక్ష్మీః. సీ. లక్ష దర్శనాంకనయోః. అష్టవర్గయోగ మందుఁ గనఁబడునది. ఈ ౪ ఋద్ధి యను గంధద్రవ్యము పేళ్లు. వృద్ధియనుదానికిని బేళ్లు.

**కదళీ వారణబుసా రమ్భా మో చాంశుమత్ఫలా,**

**కాష్ఠీలా –**

కేన వాయునా దళతీతి కదళీ. సీ. దళ విశరణే. వాయువుచేఁ బగులునది. ౧. వారణేన బుస్యత ఇతి వారణబుసా. బుస ఉత్సర్గే. ఏనుఁగుచేఁ బెల్లగింపఁ బడునది. ౨. రమంతే అస్యాం రంభా. రము క్రీడాయాం. దీనియందు రమింతురు. ౩. ముఞ్చతి త్వచం మోచా. ముచ్ ౡ మోక్షణే. పట్టలను విడుచునది. ౪. అంశుమంతి ఫలాన్యస్యా ఇతి అంశుమత్ఫలా – కాంతియుక్తములైన ఫలములు గలది. ౫. కా ఈషదష్ఠీలం మజ్జాస్యా ఇతి కాష్ఠీలా – ఇంచుకంత సారము గలది. ఈ ౬ అరఁటిచెట్టు పేళ్లు.

**ముద్గపర్ణీ తు కాకముద్గా సహేత్యపి.** 113

ముద్గస్యేవ పర్ణాన్యస్యా ఇతి ముద్గపర్ణీ – పెసరాకులవంటి ఆకులు గలది. ౧. హీనముద్గత్వా త్కాకముద్గా – హీనమైన పెసలు గలది. ౨. సహతే వాతరోగం సహా – వాతరోగమును సహించునది. ఈ 3 పిల్లపెసర పేళ్లు.

**వార్తాకీ హింగుళీ సింహీ భణ్టాకీ దుష్ప్రధర్షణీ.**

ఆరోగ్యాయ వర్తత ఇతి వార్తాకీ. సీ. వృతువర్తనే. ఆరోగ్యము కొఱకు వర్తించునది. వార్తం నిరామయం కరోతీతి వార్తాకీ – వ్యాధి రహితునిఁ జేయునది. పా. వార్తాకూః ఊ. సీ. ౧. హినోతి వరతే హింగులీ. సీ. హిగతౌ వృద్ధౌ చ. వృద్ధిని బొందునది. ౨. హినస్తి

కంటకైః సింహీ. సీ. హిసి హింసాయాం. ముండ్లచేతఁ బీడించునది. ౩. భటతి బిభర్త్యనయా దీపనాగ్ని మితి భంటాకీ. సీ. భట భృతౌ. జనుఁడు దీనిచేత దీపనాగ్నిని భరించును. ౪. కంటకైః దుఃఖేన ప్రధృష్యత ఇతి దుష్ప్రధర్షిణీ. సీ. ఞి ధృషాప్రాగల్భ్యే. ముండ్లచేత ప్రయాసమునఁ బట్టుకోఁబడునది. ఈ ౫ ములకచెట్టు పేళ్లు.

**నాకులీ సురసా నాగసుగన్ధా గన్ధనాకులీ.** 114
**నకులేష్టా భుజఙ్గాక్షీ ఛత్రాకీ సువహా చ సా,**

నకులానా మియం ప్రియా నాకులీ.సీ. ముంగిసలకు ప్రియమైనది. ౧. శోభనో రసో ఽ స్యా ఇతి సురసా – మంచిరము గలది. ౨. నాగానాం సర్పాణామివ సుగంధో ఽ స్యా ఇతి నాగసుగంధా సర్పముల వంటి పరిమళము గలది. ౩. "నాగసుగంధా" అనుచోట 'రాస్నా, సుగంధా' అని రెండు నామములుగాఁ గొందఱు. గంధేన నకులానా మిష్టాగంధనాకులీ. సీ. గంధముచేత ముంగిసలకు సంతోషమును జేయునది. ౪. నకులానామిష్టా నకులేష్టా – ముంగిసలకుఁ బ్రియమైనది. ౫. సర్పనయన సదృశపుష్పవత్వాత్ భుజఙ్గాక్షీ. సీ. పాముకన్నులవంటి పువ్వులు గలది. ౬.ఛత్రాభాని పర్ణాన్యకతీతి ఛత్రాకీ.సీ. అక కుటిలాయాం గతౌ. గొడుగులవంటి ఆకులను బొందియుండునది. ౭. సుష్ఠుగంధం వహతీతి సువహా. వహ ప్రాపణే. పరిమళమును వహించునది. ఈ ౮ సర్పాక్షి పేళ్లు.

**విదారి గన్ధాంశుమతీ సాలపర్ణీ స్థిరా ధ్రువా.** 115

విదార్యా ఇవ గంధో ఽ స్యా ఇతి విదారగంధా – నేలగుమ్మడివాసన గలది. ౧. దీర్ఘమూలరూపా అంశవస్సంత్యస్యా అంశుమతీ – నిడుపైన వేళ్లను కిరణములు గలది. ౨. సాలస్యేవ పర్ణాన్యస్యా స్సాలపర్ణీ – మద్దియాకులవంటి యాకులు గలది. ౩. తిష్ఠతీఈతి స్థిరా. ష్ఠా గతినివృత్తౌ. ధ్రువాచ. ధ్రువస్థైర్యే. స్థిరమైనది. ఈ ౫ ముయ్యాకుపొన్న పేళ్లు.

**తుణ్డికేరీ సముద్రాన్తా కార్పాసీ బదరేతిచ,**

తుండికాన్ వదనగతరోగాన్ ఈరయతి ప్రేరయతీతి తుండికేరీ. సీ.ఈర క్షేపే. ముఖగతములైన రోగములను బోఁగొట్టునది. ౧.దూర ప్రసరాత్సముద్రాంతా – దవ్వుగాఁ బోవునది. ౨. జనోపకారాయ కల్పతే

కార్పాసీ. సీ. కృపూ సామర్థ్యే. జనోపకారముకొఱకు సమర్థమైనది. పా. కర్పాసీ. ౩. బదరాభఫలత్వాద్బదరా – రేఁగుపండువంటి పండ్లు గలది. ఈ ౪ ప్రత్తిచెట్టుపేళ్లు.

**భారద్వాజీ తు సా వన్యా-**

భరద్వాజ సృష్టత్వాత్ భారద్వాజీ. సీ. భరద్వాజమునిచేఁ బుట్టింపఁబడినది. ఈ ౧ అడవిప్రత్తి.

**శృఙ్గీతు వృషభో వృషః** 116

శృంగాకారావయవత్వాత్ శృంగీ. న.పు. అత ఏవ వృషభసామ్యాద్వృషభః. పా. ఋషభః. వృషశ్చ కొమ్మువంటి అవయవములు గలదిగనుక శృంగి. వృషభమువలె నుండునది, గనుక వృషభము, ఋషభము, వృషమును. ఈ 3 వృషభమహౌషధము పేళ్లు.

**గాఙ్గేరుకీ నాగబలా ఝుషా హ్రస్వగ వేధుకా,**

గాంగ మీరయతి పవిత్రత్వా ద్గాంగేరుకీ – పవిత్రమౌటచేత గంగా సంబంధమైన జలమును దిరస్కరించునది. ౧. నాగానాం గజానాం బలకృన్నాగబలా – ఏనుఁగులకు బలమును జేయునది. ౨. ఝుషతి రోగం ఝుషా. ఝుష హింసాయాం. రోగమును జెఱుచునది. ౩. హ్రస్వే గవి జలే ఏధత ఇతి హ్రస్వగవేధుకా. ఏధ వృద్ధౌ. కొంచెము నీళ్లలో వృద్ధిఁబొందునది. ఈ ౪ బీర (జిబిలిక) చెట్టు పేళ్లు.

**ధామార్గవో ఘోషక స్స్యాత్ -**

ధామ ఆర్జయతీతి ధామార్గవః. అర్జ అర్జనే. కాన్తి నార్జించునది ౧. శుష్కదశాయాం ఘోషయతీతి ఘోషకః. ఘుషిర్ శబ్దే. ఎండినప్పుడు ఘోషించునది. ఈ ౨ తెల్లపూవులు గల ఆవడచెట్టు పేళ్లు.

**మహాజాలీ సపీతకః.** 117

మహజ్జాలం వితాన మస్యా ఇతి మహాజాలీ. మహత్తైన విస్తారముగలది. ఈ ౨ పచ్చపూవుల యావడచెట్టు పేళ్లు.

**జ్యోత్స్నీ పటోలికా జాలీ -**

జోత్స్నిరాత్రావేవ భాసనాత్ జోత్స్నీ. సీ. వెన్నెలగల రాత్రి యందు లెస్సగాఁ బ్రకాశించునది. ౧. పటతి విస్తీర్యత ఇతి పటోలికా. పటం పటస దృశం పుష్ప సమూహం ఉలత్యావృణోతీతి వా పటో

లికా. ఉల ఆవరణే. విస్తరించునది. కోకవలెఁ దెల్లగానుండు పువ్వులు గలది గనుక పటోలిక. ౨. పుష్పే జాలసదృశత్వాజ్జాలీ. సీ. పుష్పముల యందు వలవలె సూక్ష్మమై తేలికగా నుండునది. ఈ 3 పొట్లచెట్టు పేళ్లు.

**నాదేయీ భూమిజమ్బుకా,**

నద్యాం భవానాదేయీ. సీ. నదియందుఁ బుట్టినది. ౧. భూమౌ జంబూః భూమిజంబుకా – భూమియందుఁ బుట్టిన నేరేడు. ఈ ౨ నేల నేరేడు పేళ్లు.

**స్యా ల్లాఙ్గలీ త్వగ్ని శిఖా -**

లాంగలివ గర్భభేదనా ల్లాంగలీ.సీ. నాఁగేలువలె గర్భమును భేదించునది. ౧. ఉష్ణవీర్యత్వాదగ్నిశిఖా – ఉష్ణమైనది. ఈ ౨ తరిగొట్టు చెట్టుపేళ్లు. చిన్న చెఱకని కొందఱు.

**కాకాఙ్గీ కాకనాసికా.** 118

కాకస్యేవాఙ్గం ఫలమస్యా ఇతి కాకాఙ్గీ. సీ. కాకివంటి ఫలములు గలది. ౧. కాకనాసికాసదృశ ఫలత్వా త్కాకనాసికా – కాకి ముక్కువంటి ఫలములు గలది. ఈ ౨ కాకిదొండ పేళ్లు.

**గోధాపదీ తు సువహా-**

గోధా ఇవ పదోఽస్యా ఇతి గోధాపదీ. సీ. ఉడుముకాళ్లవంటి అడుగులు గలది. ౧. సుష్ఠు వహత్యారోగ్యం సువహా. వహ ప్రాపణే – లెస్సగా నారోగ్యమును వహించునది. ఈ ౨ చెప్పుతట్టచెట్టు పేళ్లు.

**ముసలీ తాళమూలికా,**

ముస్యతి రోగాన్ ముసలీ. సీ. ముస ఖండనే. రోగములను ఖండించునది. ౧. తాళస్యేవ మూల మస్యా ఇతి తాళమూలికా – తాటి చెట్టువంటి మొదలుగలది. ఈ ౨ నేలతాటి పేళ్లు.

**అజశృఙ్గీ విషాణీ స్యాత్ -**

అజశృంగాభఫలయోగా దజశృంగీ. సీ. అతేవ విషాణీ చ.సీ. మేక కొమ్ముల వంటి ఫలములు గలది. కనుక అజశృంగి, విషాణియు. ఈ ౨ దుష్టపుతీగె పేళ్లు.

**గోజిహ్వా దార్వికే సమే.** 119

గోజిహ్వాభపత్రత్వాద్గోజిహ్వా–ఆవు నాలుకవంటి యాకులుగలది.

౧. దారయతి రోగా౯ దార్వికా. దృ విదారణే. రోగములను హరించునది. ఈ ౨ బెండచెట్టుపేళ్లు. ఎద్దునాలుకచెట్టు పేళ్లు.

**తాంబూవల్లీ తామ్బూలీ నాగవల్ల్యపి-**

తాంబూలార్థం వల్లీ తాంబూలవల్లీ – తాంబూలముకొఱకైన తీఁగె. ౧. తామ్యతి వివశోభవ త్యనయా జన ఇతి తాంబూలీ. సీ. తము గ్లానౌ. దీనిచేత నరుఁడు వివశుఁ డగుచున్నాఁడు. ౨. నాగస్యైరావణస్యాలానే జాతత్వాన్నాగవల్లీ. సీ. ఐరావతముయొక్క కట్టుకంబమందుఁ బుట్టినది. "నాగాలానే యతోజాతా నాగవల్లీ భవిష్య''తీతి స్కాందవచనం. నాగలోకాదానీతా వా వల్లీ నాగవల్లీ–నాగలోకము నుండి తేఁబడిన తీఁగె. ఈ 3 తమలపాకుతీఁగె పేళ్లు.

**అథ ద్విజా,** 120

**హరేణూ రేణుకా కౌన్తీ కపిలా భస్మగన్ధినీ.**

ద్విర్జాయతే ద్విజా – రెండుమార్లు పుట్టునది. ౧. హరతి రోగా౯ హరేణూ. సీ. హృఞ్ హరణే. రోగములు హరించునది. ౨. రేణు యోగాద్రేణుకా – ధూళి గలది. ౩. కుంత్యై దుర్వాసనా దత్తా కౌంతీ. సీ. కుంతికొఱకు దుర్వాసునిచే నియ్యఁబడినది. ౪. కపిలవర్ణత్వాత్కపిలా – కపిలవర్ణముగలది. ౫. భస్మనా గంధయతి భస్మగంధినీ. సీ. గంధ అర్దనే. ధూళిచేఁ బీడించునది. ఈ ౬ రేణుక యనుగంధ ద్రవ్యము పేళ్లు. తక్కోలము.

**ఏలావాలుక మైలేయం సుగన్ధి హరివాలుకమ్,**

**వాలుకం చ -**

ఏలావ ద్వలతే ఏలావాలుకం. వల సంచలనే. ఏలకతీఁగెవలెఁ జలించునది. పా. ఏలివాలుకం. ౧. ఇలాయాం భవ మైలేయం – భూమి యందుఁ బుట్టినది. ౨. శోభనో గంధో యస్యేతి సుగంధీ న. ప్న. మంచి పరిమళముగలది. ౩. హరి కపిలవర్ణం వాలుకం హరివాలుకం – కపిలవర్ణమైన వాలుకము. ౩. వలతే వాలుకం – చలించునది. ఈ ౫ కూఁతురు బుడమ పేళ్లు. నూఁగుదోసచెట్టు.

**అథ పాలఙ్క్యా ముకున్దః కున్దుకున్దురూ.** 121

పాలేన రక్షణేన అంక్యత ఇతి పాలంక్యా. అకి. గతౌ. రక్షణము

చేతఁ బొందఁబడునది. పా. పాలుక్యా. ౧. ముఖాత్కుంద ఇవ ప్రతిభాతి ముకుందః – ముఖమువలన మొల్లవలెఁ దోఁచునది. ముఖ మునక్తీతి ముకుందః–ముఖమును తడిగలదానిఁగాఁ జేయునది. ౨. కుంద ఇవ ప్రతిభాతీతి కుందః. పా. కుందుః. పు. మొల్లవలె బ్రకాశించునది. ౩. కుంద్యతి మూలైరితి కుందురుః. పు. దో. అవఖండనే. భూమిని వేళ్లచేఁ బీడించునది. ఈ ౪ కుందురుష్క మనుగంధద్రవ్యము పేళ్లు.

**బాలం హ్రీబేర బర్హిష్ఠోదీచ్యం కేశామ్బునామ చ,**

వలతే భువనం మూలబాహుళ్యా ద్బాలం. వబయోరభేదః. వలసంవరణే. భూమిని వేళ్లచేతఁ జుట్టుకొనునది. ౧. నిగూఢత్వేన హ్రీ యుక్తమివ బేరమన్యేతి హ్రీబేరం – గూఢమైయుండునది గనుక సిగ్గుతోఁ గూడిన శరీరముగలదానివలె నుండునది. ౨. బర్హతే వర్ధతే బర్హిష్ఠం. బృహ వృద్ధౌ. వృద్ధిఁ బొందునది. ౩. ఉదగ్దేశే భవ ముదీచ్యం. ఉత్తరదేశమందుఁ బుట్టినది. ౪. కేశస్యాంబునశ్చ పర్యాయనామాన్యస్యేతి కేశాంబునామ న. న. వెంద్రుకలయొక్కయు నీళ్లయొక్కయు పర్యాయనామముగలది. ఈ ౫ కురువేరు పేళ్లు.

**కాలానుసార్య వృద్ధాశ్మ పుష్పశీతశివాని తు.** 122

**శైలేయమ్.**

శీతోష్ణాభ్యాం కాలో ఽ నుసార్యతే ఽ నేనేతి కాలానుసార్యం. శీతోష్ణముల వలన కాలము దీనిచేత ననురింపఁబడును. ౧. చిరస్థాయిత్వాద్వృద్ధం–అనేక కాలముండునది. ౨. అశ్మనః పుష్పం అశ్మపుష్పం–ఱాతి పువ్వు. ౩. శీతవీర్యేణ శివం శీతశివం–చలువచేత శుభస్వరూపమైనది. ౪. శిలాయాం భవం శైలేయం– శిలయందుఁ బుట్టినది. ఈ ౫ ఱాతిపువ్వు పేళ్లు.

**తాలపర్ణీ తు దైత్యా గన్ధకుటీ మురా,**

**గన్ధినీ -**

తాళస్యేవ పర్ణాన్యస్యా ఇతి తాళపర్ణీ. సీ. తాళపర్ణమువంటి ఆకులు గలది. తలభవం పర్ణమస్యా ఇతి తాలపర్ణీ–భూతలమందుఁ బుట్టునట్టి యాకులుగలది. ౧. మురదైత్యనామయోగాత్ దైత్యా–మురుఁ డనెడు రాక్షసునిపేరుగలది. ౨. గంధస్య కుటీ గృహం గంధకుటీ. సీ. గంధమునకు ఉనికిపట్టు. ౩.మురతీతి మురా.మురవేష్టనే.

చుట్టుకొనునది. ౪. గంధో ఽ స్యా అస్తీతి గంధినీ. సీ. గంధము గలది. ఈ ౫ మురయనుగంధద్రవ్యము పేళ్లు.

**గజభక్ష్యా తు సువహా సురభీ రసా.** 123

**మహేరణా కున్దురుకీ సల్లకీ హ్రాదినీతి చ,**

గజైర్భక్ష్యత ఇతి గజభక్ష్యా – గజములచేత భక్షింపఁబడునది. ౧. సుష్ఠు వహ త్యామోదం సువహా. వహ ప్రాపణే. పరిమళమును లెస్సగా వహించునది. ౨. ఘ్రాణతర్పణగంధత్వా త్సురభిః. సీ. ఘ్రాణమునకు నిష్టమైన గంధము గలది. ౩. రస్యత ఇతి రసా. రస ఆస్వాదనే. చప్పఁటింపఁబడునది. ౪. మహత్ ఈరణం ప్రేరణం గజానాం భక్షణే అస్యా ఇతి మహేరణా. ఈర ప్రేరణే. ఏనుఁగులకు భక్షణార్థమై మహత్తైన ప్రేరణము దీనియెడఁ గలదు. ౫. కుంద్యతే మూలైరితి కుందురుకీ. సీ.దో. అవఖండనే. వేళ్లచేత భూమిని బీడించునది. ౬. సత్కృత్య లక్యతే ఆస్వాద్యతే గజైరితి సల్లకీ. సీ. లకి ఆస్వాదనే. ఏనుఁగులచేత లెస్సగా నాస్వాదింపఁబడునది. ౭. హ్రాదో ఽ స్యా ఇతి హ్రాదినీ–అవ్యక్తశబ్దముగలది. ఈ ౮ అందుగుచెట్టు పేళ్లు.

**అగ్నిజ్వాలా సుభిక్షా తు ధాతకీ ధాతుపుష్పికా.** 124

అగ్నిజ్వాలాభపుష్పత్వాదగ్ని జ్వాలా–అగ్ని జ్వాలలవంటి పువ్వులు గలది. ౧. శోభనా భిక్షా ప్రార్థనాస్యామితి సుభిక్షా – మంచిప్రార్థన దీనియందుఁ గలదు. ౨. దధాతి పుష్పాణీతి ధాతకీ. సీ. డు ధాఞ్ ధారణపోషణయోః. పుష్పములను ధరించునది. ౩. ధాతువద్రక్తాని పుష్పాణ్యస్యా ఇతి ధాతుపుష్పికా–జేగురువలె నెఱ్ఱనైన పువ్వులు గలది. ఈ ౪ ధాతకీకుసుమమనెడి గంధద్రవ్యము పేళ్లు.

**పృథ్వీకా చన్ద్ర బాలైలా నిష్కుటి ర్బహులా -**

బహుఫల యోగాత్పృథ్వీకా – అనేక ఫలములుగలదౌటచేత ఘనమైనది. ౧. చంద్రస్య బాలేవ పుత్రికేవ చంద్రబాలా–కర్పూరమునకు కూఁతురివలె నుండునది. ౨. ఏలయతి ప్రేరయతి ముఖదౌర్గంధ్యమితి ఏలా. ఇల స్వప్న ప్రేరణయోః. ముఖమందలి దుర్వాసనను బోఁగొట్టునది. ౩. నిష్క్రాంతా కుటేః కోశా న్నిష్కుటిః. సీ. మొగ్గలను బాసియుండునది. ౪. బహూని ఫలాని లాతీతి బహులా. లా దానే.

బహుఫలముల నిచ్చునది. ఈ ౫ పెద్దయేలకుల పేళ్లు.

**అథ సా,** 125

**సూక్ష్మోపకుఞ్చికా తుత్థాకోరఙ్గీ త్రిపుటా త్రుటిః.**

ఉపకుంచతి అల్పీభవతీ త్యుపకుంచికా. కుంచ గతికౌటిల్యాల్పీ భావయో. కొంచెమైయుండునది. ౧. తుదతి తాపం తుత్థా. తుద వ్యథనే. తాపమును బోఁ గొట్టునది. పా. తుచ్ఛా. ౨. కురతి శబ్దాయతే కోరంగీ. సీ. కుర శబ్దే. మ్రోయునది. ౩. త్రిపుటాకారత్వా త్త్రిపుటా. మూఁడుపుటలు గలది. ౪. సూక్ష్మత్వాత్రుట్యతీతి త్రుటి. సీ. త్రుటఛేదనే. సూక్ష్మమగుటచేఁ ద్రుంచఁబడునది. ఈ ౫ సన్న యేలకుల పేళ్లు.

**వ్యాధిః కుష్ఠం పారిభావ్యం వాప్యం పాకల ముత్పలమ్,**

కుష్ఠవ్యాధినామా న్యస్య సంతీతి వ్యాధిః. పు. కుష్ఠవ్యాధి యొక్క పేళ్లు గలది. ౧. కౌతిష్ఠతీతి కుష్ఠం. ష్ఠా గతినివృత్తౌ. భూమి యందుండునది. ౨. పారిషు తోయేషు భవతీతి పారిభావ్యం – నీళ్లుండెడు స్థలమందుఁ బుట్టునది. ౩. వాప్యాం భవం వాప్యం – బావులయందుఁ బుట్టునది. పా. వ్యాప్యం. ౪. కోష్ణం పాకం లాతీతి పాకలం. లా ఆదానే. ఇంచుకంత ఉష్ణపాకమును గ్రహించునది. వ్యాధిపర్యాయత్వాద్వా పాకలం – వ్యాధిపర్యాయముగలది. ౫ ఉత్పలాభ పుష్పత్వాదుత్పలం–కలువలవంటి పువ్వులుగలది. ఈ ౬ చెంగల్వకోష్టుపేళ్లు.

**శఙ్ఖినీ చోరపుష్పీ స్యా త్కేశినీ –**

శంఖాభపుష్ప యోగాత్ శంఖినీ. సీ. శంఖమువంటి పువ్వులుగలది. ౧. రాత్రావేవ పుష్ప్యతీతి చోరపుష్పీ. సీ. రాత్రియందుఁ బూచునది. ౨. కేశప్రరోహత్వాత్కేశా స్స్యంత్యస్యా ఇతి కేశినీ. సీ. వెంద్రుకలు దీని వలన మొలచును. ఈ 3 కడిలచెట్టు పేళ్లు. పద్మపుతీఁగెపేళ్లని కొందఱు.

**అథ వితున్నకః.** 126

**ఝటామలా జ్ఝటా తాలీ శివా తామలకీతి చ,**

వితుద్యతే పి త్తశ్లేష్మాదిక మనేనేతి వితున్నకః. తుద వ్యథనే. దీనిచేత పిత్తశ్లేష్మాదులు పీడింపఁబడును. ఝుటఃఫలసంఘాతో ఽస్యా ఇతిఝటా– ఫల సమూహముగలది. ౨. రోగహరత్వాదమలా – రోగమును హరించునది. ౩. అత్ ఆశ్చర్యకారీఝటః సంఘాతో ఽస్యా ఇత్య జ్ఝటా –

ఆశ్చర్యమును జేయు సమూహము గలది. ౪. తాడయతి రోగానితితాళీ. సీ. తడ ఆఘాతే. ళడయోరభేదః - రోగమును బోఁగొట్టునది. ౫. ఆరోగ్యరూపమంగళ హేతుత్వాత్ శివా - ఆరోగ్యరూపమైన శుభమునకు హేతువైనది. ౬. తామ్యతేకాంక్ష్యత ఇతి తామలకీ. తము కాంక్షాయాం. కాంక్షింపఁబడునది. ఈ ౭ నేలయుసిరిక పేళ్లు.

**ప్రపౌణ్డరీకం పౌణ్డర్యమ్-**

ప్రకర్షేణ పుండరీకస్యేదం రూపాంతరం దాహహరత్వాత్ప్ర పౌండరీకం- దాహమును హరించునదిగనుక తెల్లదామరకు రూపాంతరమైనది. ౧. అస్యైక దేశానుసారిత్వాత్పౌండర్యమితి దేశీయం - ప్రపౌండరీకమనెడు శబ్దమునకు పౌండర్యమనునది దేశీయము. పా. పుండర్యం. ఈ ౨ పుండరీకమను గ్రంథి ద్రవ్యము పేళ్లు.

**అథ తున్నః కుబేరకః.** 127

**కుణిః కచ్ఛః కాన్తలకో నన్దివృక్షః -**

తుద్యతే హస్త్యాదిభిరితి తున్నః. తుద వ్యథనే. గజాదులచేఁ బీడింపఁబడునది. ౧. కుత్సితంబేరమస్యాస్తీతి కుబేరకః - కుత్సితమైన శరీరముగలది. ౨. శాఖాభంగాత్కౌతీతి కుణిః పు. కు శబ్దే. కొమ్మలు విరుగునప్పుడు మ్రోయునది. ౩. కష్యతే గజైః కచ్ఛః కష హింసాయాం. గజములచేఁ బీడింపఁబడునది. ౪. కస్య జలస్య అంతం గచ్ఛంతీతి కాంతాగజాః తైర్లక్యత ఇతి కాంతలకః. లకి ఆస్వాదనే. జలసమీపమును బొందునవి గనుక కాంతము లనఁగా గజములు; వానిచేత నాస్వాదింపఁబడునది. ౫. నన్దయతీతి నన్దీ, నన్దిసంజ్ఞకో వృక్షః నన్దివృక్షః - సంతోషపెట్టునది గనుక నన్ది; నందియను పేరు గల వృక్షము. ఈ ౬ నందివృక్షము పేళ్లు.

**అథ రాక్షసీ,** 128

**చణ్డా ధనహరీ క్షేమ దుష్పత్ర గణహాసకాః.**

రక్ష్యంతే అస్యా ఇతి రాక్షసీ. సీ. రక్ష పాలనే. దీనివలన రక్షింపఁబడును. తీక్ష్ణత్వాత్ చండా-తీవ్రమైనది. ౨.బహుమూల్యత్వేన ధనం హరతీతి ధనహరీ. సీ.హృఞ్ హరణే. బహుమూల్యమౌటచేత ధనమును హరించునది. ౩. క్షియతి వసత్యస్మిన్ గన్ధ ఇతి క్షేమః.

క్షినివాసగత్యోః. గంధము దీనియం దుండును. ౪. దుష్టాని పత్రాణ్యస్య దుష్పత్రః –దుష్టమైన ఆకులు గలది. ౫. గణం హాసయతీతి గణహాసకః. హసే హసనే. సమూహమును సంతోషపెట్టునది. ఈ ౬ నల్లకచోరము పేళ్లు. బలరక్కసి పేళ్లని కొందఱు.

**వ్యాళాయుధం వ్యాఘ్రనఖం కరజ్ఞం చక్రకారకమ్,**

వ్యాళస్య వ్యాఘ్రస్య ఆయుధం నఖమివ తిష్ఠతీతి వ్యాళాయుధం పా. వ్యాడాయుధం. వాఘ్రనఖం చ–పులిగోరువలె నుండునది. ౧, ౨. కం ఉదకం రజ్జయతీతి కరజ్ఞం. రంజ రాగే. ఉదకమును రాగమును బొందించునది. పా. కరజం. ౩. చక్రం ధూపద్రవ్యమేళనం కరోతీతి చక్రకారకం–ధూపద్రవ్యమేళనమును జేయునది. ఈ ౪ నఖమను గంధద్రవ్యము పేళ్లు. పులిగోరుచెట్టు.

**సుషిరా విద్రుమలతా కపోతాఙ్ఘ్రిర్నటీ నలీ.** 129

**ధమన్య ఞ్జన కేశచ**

సుషిః రన్ధ్రం అస్యా అ స్తీతి సుషిరా – రంధ్రముగలది. పా. శుషిరా. ౧. విద్రుమవద్రక్తత్వాద్వి ద్రుమలతా–పగడపుతీఁగెవలె నెఱ్ఱనైయుండునది. ౨. కపోతాఙ్ఘ్రిసదృశమూలత్వాత్కపోతాఙ్ఘ్రిః. స్త్రీ. గువ్వకాళ్లవంటి వేళ్లు గలది. ౩. వాయువశాన్నటతి చలతీతి నటి. స్త్రీ. నటస్పన్దనే. వాయువశమున నటించునది. ౪. నలం ఛిద్రమస్యా అస్తీతి నలీ. స్త్రీ. నలమనఁగా రంధ్రము; అది గలది. ౫. సుషిరవత్త్వాద్ధమ్యత ఇతి ధమనీ. ధ్మాశబ్ధాగ్నిసంయోగయోః. రంధ్రయుక్తమై యూదఁబడునది. ౬. అంజన సదృశాః కేశాః సూక్ష్మమూలాన్యస్యా ఇత్యంజనకేశీ. స్త్రీ. కాటుకవలె సూక్ష్మమైన పేళ్లు గలది. ఈ ౭ నళి యనుగంధద్రవ్యము (గువ్వగుత్తిక) పేళ్లు.

**హను ర్హట్ట విలాసినీ,**

**శుక్తిశ్శఙ్ఖః ఖురః కోలదళం నఖమ్ -**

హంత్యామయం హనుః. హన హింసాగత్యోః. రోగమును బోఁగొట్టునది. ౧. హట్టవీధ్యాం విలసతీతి హట్టవిలాసినీ. స్త్రీ. హట్టమనెడు పట్టణపువీధియం దొప్పునది. ౨. శుక్త్యాకారత్వాచ్ఛుక్తిః. స్త్రీ. ముత్తెపుచిప్పవలె నుండునది. ౩. శంఖసామ్యాచ్ఛంఖః – శంఖసామ్యము

గలది. ౪. ఖురతి భూతాని హంతీతి ఖురః. ఖుర విలేఖనే. భూతములను సంహరించునది. ౫. బదరీ పత్రాఖ్యత్వాత్కోలదళం - రేఁగాకుపేరు గలది. ౬. నఖతి కుష్ఠాదీ౯ గృహీత్వా గచ్ఛతీతి నఖం - కుష్ఠాదులను హరించునది. ఈ ౭ శంఖు మనుగంధద్రవ్యము పేళ్లు. సుషిరాదులు ౫. నళికిని, ధమని మొదలు ౪ బెత్తమునకును, భక్తిమొదలు ౫ నఖమునకును బేళ్లని కొందఱు.

**అథాఢకీ.** 130

**కాక్షీమృత్స్నా తువరికా మృతాలక సురాష్ట్రజే,**

తువరీవాచకత్వాదాఢకీ - ధాన్యవాచకమైన తువరియను పేరు గలది. ౧. కషతి కండ్వాది రోగానితి కాక్షీ. సీ. కష హింసాయాం. తీఁట మొదలైన రోగములను హరించునది. ౨. ప్రశస్తామృత్ మృత్స్నా - ప్రశస్తమైన మృత్తిక. ౩. తువరః కషాయః తద్యోగా త్తువరికా-వగరు గలది. ౩. మ్రియతే నిలీయతే హేమ అనేనేతి మృతాలకం. మృజ్ ప్రాణత్యాగే. బంగారు దీనిచేత కరఁగును. పా. మృత్తాలకం మృత్ తాలకమితి కేచిత్. మృద్యత ఇతి మృత్. మృదక్షోదే. మర్దింపఁబడునది. తలంతి ప్రతిష్ఠంతి అనే నేతి తాలకం - దీనిచేత ప్రతిష్ఠను బొందుదురు. ౫. సురాష్ట్రదేశే భవం సురాష్ట్రజం-సురాష్ట్ర దేశమందుఁబుట్టునది. ఈ ౬ తౌవరిమన్ను పేళ్లు.

**కుటన్నటం దాశపురం వానేయం పరిపేలవమ్.** 131

**ప్లవ గోపుర గోనర్ద కైవర్తీ ముస్తకానిచ,**

కుట౯ వక్రీభవ న్నటతీతి కుటన్నటం, నట స్పన్దనే. వక్రమై నటనముఁ జేయునది. ౧. దశపురాఖ్యదేశే భవం దాశపురం - దశపుర దేశమందుఁ బుట్టినది. ౨. వనే జలే జాతం వానేయం - జలమందుఁ బుట్టినది. ౩. కోమలత్వా త్పరితః పేలవం పరివేలవం - అంతటను బేలవమైనది. ౪. లఘుత్వాత్ ప్లవత ఇతి పల్వం. ప్లజ్ గతౌ. లఘువౌటచేత తెలునది. ౫. గౌ ర్జలం పురం సంస్థాన మస్యేతి గోపురం - నీరు ఉనికి పట్టుగాఁగలది. ౬. గాః నర్దయతి రుచికరత్వేన గోనర్దం. నర్ద శబ్దే. రుచి కరమౌటచేత గోవులను అంకెవేయించునది. ౭. కేవర్తానాం మత్స్యానాం అశనం కైవర్తీ-మత్స్యములకు భక్ష్యము కైవర్తి. ముస్యతే వరా

హైరితి ముస్తకం. ముస ఖండనే. వరాహములచేత ఖండింపఁబడునది ముస్తకము. కైవర్త్యాఖ్యం ముస్తకం కైవర్తీముస్తకం, కైవర్తియను పేరుగల ముస్తకము. ఈ ౮ తుంగము స్తల పేళు.

**గ్రన్థిపర్ణం శుకం బర్హం పుష్పం స్థౌణేయ కుక్కురే.** 132

గ్రంథిషు పర్ణాన్యస్య గ్రంథిపర్ణం – బుడుపులయందు ఆకులు గలది. ౧. శుకవర్ణత్వాచ్ఛుకం–చిలుకవన్నె గలది. ౨. బర్హతుల్యపుష్పత్వాద్బర్హం – నెమలిపించెమువంటి పువ్వులు గలది. ౩. పుష్ప్యతీతి పుష్పం. పుష్ప వికసనే. వికసించునది. పా. బర్హపుష్పం; బర్హిపుష్పం. ౪. స్థూణస్యేవ రూపం స్థౌణేయం. స్తంభాకారమైయుండునది. ౫ శునకాకారత్వా త్కుక్కురం–శునకాకారముగలది. ఈ ౯ స్థౌణేయమను గంధద్రవ్యముపేళ్లు. పచ్చాకు మాచిపత్రి.

**మరున్మాలా తు పిశునా స్పృక్కా దేవీ లతా లఘుః,** 133
**సముద్రాన్తా వధూః కోటివర్షా లఙ్కోపికేత్యపి.**

మరుతః మాలా అస్యాఇతి మరున్మాలా – వాయుపం క్తిగలది. పా. మరుత్; మాలేతినామద్వయం. "పృక్కా సృగ్బ్రాహ్మణీ దేవీ మాలాలంకోయికా మరు" దితి కోశాంతరే. ౧. గంధసూచకత్వాత్పిశునా. పరిమళము నెఱిఁగించునది. ౨. స్పృశించునది. పా. పృక్కా. ౩. దేవపుత్రీసంజ్ఞకత్వాద్దేవీ. సీ. దేవపుత్రి యను పేరుగలది. ౪. లతారూపత్వాల్లతా. తీఁగెయై యుండునది. ౫. లఘుత్వాల్లఘుః. సీ. చులకనిది. ౬. దూరప్రసరత్వాత్సముద్రాంతా – దవ్వుగా వ్యాపించునది. ౭. ఊహ్యతే పరిమళేన వధూః. సీ. వహప్రాపణే. పరిమళముచేత వహింపఁబడునది. ౮. కోటిభిర్నే మిభిః స్వరసం వర్షతీతి కోటివర్షా. వృషు నేచనే, కొనలచేత రసమును వర్షించునది. ౯. లంకాయాముప్యత ఇతి లంకోపికా – లంకయందు విత్తఁబడునది. ఈ ౧౦ స్పృక్కయను గంధ ద్రవ్యముపేళ్లు.

**తపస్వినీ జటా మాంసీ జటిలా లోమశా మిసీ,**

జటాయోగ సామ్యాత్తపస్వినీ. సీ. జడలసామ్యముచేత తపస్విని. ౧. జటాస్సంత్యస్యా ఇతిజటా; జటిలాచ – జడలవంటి అవయవములు గలది. ౨, ౩. మాంససామ్యావయవత్వా న్మాంసీ – మాంసము వంటి అవయవ

ములు గలది. ౪. లోమయోగా ల్లోమశా - వెంట్రుకలవంటి పీcచుగలది. ౫. మస్యతీతి మిసీ. మసీ పరిణామే. మాఱునది. ఈ ౬ జటామాంసిపేళ్లు.

**త్వక్పత్ర ముత్కటం భృఙ్గం త్వచం చోదం వరాఙ్గకమ్.** 134

త్వగ్భ్రాయస్యాత్త్వక్. చ. సీ. త్వచంచ - పట్టలు తఱుచుగాc గలది. ౧, ౨. పత్రమిశ్రత్వాత్పత్రం. ఉపయోగమైన ఆకులుగలది. ౩. అతితీక్ష్ణత్వాదుత్కటం - మిక్కిలి తీక్ష్ణమైనది. ౪. కృష్ణవర్ణత్వాద్భృంగం-నల్లనైనది. ౫. అగ్నిం చోదయతీతి చోదం. చుదప్రేరణే. దీపనాగ్నిని ప్రేరేపించునది. పా. చోచం ౬. వరం శ్రేష్ఠ మంగమస్యేతి వరాంగకం - శ్రేష్ఠమైన అంగము గలది. ఈ ౭ లవంగపుచెట్టు పేళ్లు.

**కర్చూరకో ద్రావిడకః కాల్యకో వేధముఖ్యకః,**

కర్జతి రోగానితి కర్చూరకః కర్జ వ్యథనే. రోగముల బాధించునది. పా. కచ్చూరకః. ౧. ద్రావయతి రోగాన్ ద్రావిడకః. ద్రు గతిహింసా కౌటిల్యేషు. రోగములను సంహరించునది. ప్రాయోద్రవిడదేశే భవతీతి ద్రావిడకః-తఱచుగా ద్రవిడదేశమందుc బుట్టినది. ౨. కల్యం నిరామయం కరోతీతి కాల్యకః - వ్యాధిలేనివానిcగా జేయునది. ౩. వేధేముఖ్యత్వాద్వేధ ముఖ్యకః-రోగమును బీడింపc జాలినది. ఈ ౪ గంధకచోరము పేళ్లు.

**ఓషధ్యో జాతిమాత్రే స్యు రజాతౌ సర్వ మౌషధమ్.** 135

లతాదిజాతయః ఓషధ్యః, నతు త్రిఫలాదయః అజాతావితిలతాది జాతేరన్యత్ర యత్కిమపి రోగాపనయనకరం తదౌషధం - ఓషధిశబ్దము అకారభేదముచేత ప్రత్యేకముగాc దెలియcబడుచున్న లతాదిజాతుల యందు వర్తించును. త్రిఫలాదులయందు వర్తింపదు. ఔషధశబ్దము జాతివ్యతిరిక్తమై రోగహరములైన వానియందెల్ల వర్తించును.

**శాకాఖ్యం పత్రపుష్పాది -**

పత్రపుష్పాది శాకాఖ్యం శాకనామకం. ఆదినా అగ్రమధ్యాదీనాం గ్రహణం. తదుక్తం. "మూలపత్రకరీరాగ్రఫలకాండాధి రూఢకం, త్వక్పుష్పం కవచం చేతిశాకం దశవిధం స్మృత"మితి. భోజనార్హములైన ఆకులు, పువ్వులు, కాయలు, వేళ్లు, కాcడలు, కొమ్మలు, పండ్లు మొదలైనవి శాకము లనంబడును. శక్యతే భోక్తుమనే నేతి శాకం - దీనిచేత భోజనము చేయుటకు శక్యమగును.

**తణ్డులీయో ఽ ల్పమారిషః**

లఘుతండులాభాని బీజాన్యత్ర తండులీయ – సన్నబియ్యము వంటి విత్తులు గలది. రోగాన్ తాడయతీతివా తండులీయః–రోగములను బోఁగొట్టునది. ౧. అల్పామపి మారీం వ్యాధిం స్యతీతి అల్పమారిషః. షో ఽన్తకర్మణి. అల్పమైన వ్యాధిని జెఱుచునది. ఈ ౨ చిట్టికూర పేళ్లు.

**విశల్యా ఽ గ్ని శిఖా ఽ నన్తా ఫలినీ శక్ర పుష్ప్యపి.** 136

విశల్యం కరోతీతి విశల్యా – నొప్పిని దొలఁగించునది. ౧. దీపన కారిత్వాదగ్ని శిఖా – దీపనకారి గనుక అగ్ని శిఖవలె నుండునది. ౨. బహుదేశ వ్యాపిత్వా దనంతా – అనేక దేశములయందుఁ బ్రచురమైనది. ౩. ఫలాన్యస్య సంతీతిఫలినీ. సీ. ఫలములుగలది. పా. హలపర్యాయ సంజ్ఞికత్వాత్ హలినీ. సీ. నాఁగేలుయొక్క పేరుగలది. ౪. శక్రప్రియ పుష్పత్వాత్ శక్రపుష్పీ. సీ. ఇంద్రునికిఁ బ్రియమైన పుష్పములు గలది. ఈ ౫ నాఁగేటి చాలుకూరపేళ్లు. వెన్న వెదురుకూర. తరిగొఱ్ఱకూర యనియుఁ గొందఱు.

**స్యా దృక్షగన్ధా ఛగలా ణ్ద్యావేగీ వృద్ధదారకః,**

**జుఙ్గః –**

ఋక్షవత్క్రిమీన్ గంధయతి అర్దయతి ఋక్షగంధా–ఎలుఁగువలె క్రిములను బీడించునది. ౧. ఛగలస్యాజస్యాండా నీవావయవా అస్యా ఇతి ఛగలాండీ. సీ. గొఱ్ఱె వృషణములవంటి అవయవములుగలది. పా.ఛగలాన్త్రీ. ౨. ధాతువృద్ధికరత్వా దావేగో ఽస్యా ఇతి ఆవేగీ. సీ. ధాతువృద్ధికరమై యావేగమును జేయునది. ౩. వృద్ధత్వం దారయతీతి వృద్ధదారకః. దౄ విదారణే. వృద్ధత్వమును బోఁగొట్టునది. ౪. జుంగతివర్జయతి రోగాన్ జుంగః. జుగి వర్జనే. రోగజనిత దోషములను వర్జించునది. ఈ ౫ బొద్దికూర పేళ్లు.

**బ్రాహ్మీతు మత్స్యాక్షీ వయస్థా సోమవల్లరీ.** 137

పావనత్వాత్ బ్రాహ్మీ. సీ. పావనమైనది. పా. బ్రహ్మీ. ౧. మత్స్యాక్షితుల్య పుష్పత్వా న్మత్స్యాక్షీ. సీ. చేఁపకండ్లవంటి పువ్వులు గలది. ౨. వయః స్థాపయతి వయస్థా. ష్ఠా గతినివృత్తౌ. వయస్సును నిలుపునది. ౩. సోమవచ్ఛీతవీర్యత్వా త్సోమవల్లరీ. సీ. చంద్రునివలెఁ జల్లనైయుండునది. ఈ ౪ పొన్న గంటికూర పేళ్లు.

**పటుపర్ణీ హైమవతీ స్వర్ణక్షీరీ హిమావతీ,**

పటూని శ్రేష్ఠాని పర్ణాన్యస్యా ఇతి పటుపర్ణీ, సీ. మంచియాకులు గలది. ౧. హిమవద్గిరౌ ప్రచురత్వాత్ హైమవతీ. సీ. హిమవత్పర్వతమందుఁ బ్రచురమైనది. ౨. స్వర్ణవర్ణం క్షీరమస్యా ఇతి స్వర్ణక్షీరి. సీ. బంగారువన్నె పాలు గలది. ౩. హిమం శీతలత్వ మస్యా ఇతి హిమావతీ. సీ. మంచువంటి చలి గలది. ఈ ౪ కంకోష్టువు పేళ్లు.

**హయపుచ్ఛీతు కామ్భోజీ మాషపర్ణీ మహాసహా.** 138

హయపుచ్ఛాకారత్వాత్ హయపుచ్ఛీ. సీ. గుఱ్ఱపుతోఁకవంటి యాకారము గలది. ౧. కాంభోజదేశే భవా కాంభోజీ. సీ. కాంభోజ దేశమందుఁ బుట్టినది. పా. కాంబోజీ. ౨. మాషస్యేవ పర్ణాన్యస్యామాషపర్ణీ. సీ. మినుముయొక్క ఆకుల వంటి ఆకులు గలది. ౩. మహారోగాఽ సహత ఇతి మహాసహా – మహారోగములను సహించునది. ఈ ౪ కాఱుమినుము పేళ్లు.

**తుణ్డికేరీ రక్తఫలా బిమ్బికా పీలుపర్ణ్యపి,**

తుండం వదనమాశ్రయత్వే నాస్యేతి తుణ్డికమోష్ఠః; తమియర్తి అనుకరోతీతి తుండికేరీ. సీ. తుండమనఁగా ముఖము. అది ఆశ్రయముగాఁ గలది. గనుక తుండిక మనఁగాఁ బెదవి. దాని ననుకరించునది. ౧. రక్తం ఫలమస్యా ఇతి రక్తఫలా – ఎఱ్ఱని పండ్లుగలది. ౨. ఓష్ఠస్య బింబం ఆకృతిరివ ఫల మస్యా ఇతి బింబికా – ఓష్ఠమువంటి ఆకారము గల ఫలములు గలది. ౩. పీలోరివ పర్ణాన్యస్యాః పీలుపర్ణీ. గోఁగాకులవంటి యాకులు గలది. ఈ ౪ దొండచెట్టు పేళ్లు.

**బర్బరా కబరీ తుఙ్గీ ఖరపుష్పా జగన్ధికా,** 139

పరుషపర్ణత్వాద్బర్బరా – పరుషమైన పర్ణములుగలది. ౧. కేశసామ్యాత్కబరీ. సీ. వెండ్రుకల పోలిక గలది. ౨. అతితీక్ష్ణత్వాత్తుంగీ. సీ. అతితీక్ష్ణమైనది. ౩. తీక్ష్ణ పుష్పత్వా త్ఖరపుష్పా – తీక్ష్ణమైన పువ్వులు గలది. ౪. అజస్యేవ గంధో ఽస్యా ఇతి అజగంధికా – గొఱ్ఱెయొక్క వాసన గలది. ఈ ౫ వాయింట చెట్టుపేళ్లు.

**ఏలాపర్ణీ తు సువహా రాస్నా యు క్తరసా చ సా,**

ఏలాయా ఇవ పర్ణాన్యస్యా ఇతి ఏలాపర్ణీ. సీ. ఏలకియాకుల వంటి యాకులు గలది. ౧. సుష్ఠు రసం వహతీతి సువహా - మంచి రసమును వహించునది. ౨. రస్యత ఇతి రాస్నా. రస ఆస్వాదే. ఆస్వాదింపఁబడునది. ౩. రసేనయుక్తాయుక్త రసా-రసముతోఁ గూడినది. ఈ ౪ సన్న రాస్నముపేళ్లు.

**చాఙ్గేరీ చుక్రికా దన్తశఠా ఽ మ్బష్ఠా ఽ మ్లలోణికా** 140

చంగో దక్షః తస్య భావః చాంగం, దంతానాం చాంగం పటుత్వ మీరయతీతి చాంగేరీ. సీ. చాంగ మనఁగా పటుత్వము. దంతముల యొక్క పటుత్వమును బోఁగొట్టునది. ౧. చకంత్యనేనేతి చుక్రః అమ్లః; తద్యోగాచ్చుక్రికా. చక తృప్తౌ. దీనిచేఁ దృప్తిని బొందుదురు గనుక చుక్రమనఁగా పులుసు. అది గలిగినది. ౨. ఆమ్లత్వాద్దంతానాం శఠం కరోతీతి దంతశఠా-దంతములను శఠత్వమును జేయునది. ౩. అంబేవ తిష్ఠతీతి అంబష్ఠా-తల్లివలె నుండునది. ౪. ఆమ్లరసేన దంతాన్ లునా తీతి ఆమ్లలోణికా. లూఞ్ ఛేదనే. ఆమ్లరసముచేత దంతముల నూడఁ బీఁకునది. ఈ ౫ పులిచింతపేళ్లు.

**సహస్రవేధీ చుక్రో ఽ మ్లవేతస శ్శతవేధ్యపి,**

సహస్రం రోగాన్ విధ్యతీతి సహస్రవేధీ. న.పు. వ్యథతాడనే. వేయి రోగములను బోఁగొట్టునది. ౧. చక్యం తేవ్యథంతేదంతా అనేనేతి చుక్రః. చక్ర ప్రతీఘాతే. దంతములు దీనిచేత వ్యథపెట్టఁబడుచున్నవి. ౨.అమ్లరససంయుక్తో వేతసః అమ్లవేతసః - పులుసుతోఁగూడిన ప్రబ్బలి. ౩. శతంరోగాన్ విధ్యతీతి శతవేధీ. న.పు. నూఱురోగములఁ బోఁగొట్టునది. ఈ ౪ పుల్లప్రబ్బలి పేళ్లు.

**నమస్కారీ గణ్డకాలీ సమఙ్గా ఖదిరేత్యపి.** 141

అంజలిరూపత్వా న్నమస్కరోతీవ నమస్కారీ. సీ. అంజలిరూపముగలదౌటఁ జేసి నమస్కారముఁ జేయుదానివలె నుండునది. ౧. గణ్డేషు గ్రన్థిషు కాలీ గణ్డకాలీ - బుడుపులయందు నల్లగా నుండునది. ౨. సంకుచితాని పత్రరూపా ణ్యంగాన్యస్యా ఇతి సమంగా - సంకుచితములైన పత్రములు గలది. ౩. ఖదిర ఇవ సూక్ష్మపత్రత్వా త్ఖదిరా - ఖదిరమువలె సూక్ష్మపత్రములు గలది. ఈ ౫ మునుఁగుఁదామర పేళ్లు.

**జీవన్తీ జీవనీ జీవా జీవనీయా మధుస్రవా,**

జీవం త్యనయా జీవంతీ, జీవనీ, జీవా, జీవనీయా, సీ. జీవప్రాణధారణే. దీనిచేత బ్రతుకుదురు గనుక, జీవంతి. జీవని. జీవ. జీవనీయ. ౧, ౨, ౩, ౪ మధు స్రవతీతి మధుస్రవా. స్రు స్రవణే. తేనె గాఱునది. పా, మధుఃస్రవా. ఈ ౫ పాలకూరపేళ్లు.

**కూర్చశీర్షో మధురకః శృఙ్గ హ్రస్వాఙ్గ జీవకాః.** 142

కూర్చవత్ శ్మశ్రువత్సమశీర్షత్వా త్కూర్చశీర్షః–కూర్చమనఁగా (గడ్డము) మీసము దానితో సమానమైన కోనగలది. ౧. మధురత్వాన్మధురకః– మధురమైనది. ౨. శృంగయోగచ్ఛృంగః – కొమ్ముగలది. ౩. హ్రస్వావయత్వాత్ హ్రస్వాంగః– హ్రస్వములైన అవయవములు గలది. ౪. జీవయతీతి జీవకః – బ్రతికించునది. ఈ ౫ జీవకమను గంధద్రవ్యము పేళ్లు.

**కిరాతతిక్తో భూనిమ్బో ఽ నార్యతిక్తః-**

తిక్తరసయోగాత్తిక్తః, కిరాతదేశే భవస్తిక్తః కిరాతతిక్తః– చేఁదుగలది గనుక తిక్తము;కిరాతదేశమునందుఁ బుట్టిన తిక్తము కిరాతతిక్తము. ౧. భువి నింబో భూనింబః– నేలవేము. ౨. అనార్యాః కిరాతాః తద్దేశే భవస్తిక్తః అనార్యతిక్తః– కిరాతదేశమునందుఁ బుట్టిన వేము. ఈ 3 నేలవేము పేళ్లు.

**అథ సప్తలా,** 143

**విమలా సాతలా భూరిఫేనా చర్మకషేత్యపి.**

సవతి స్వావయవేషు సమేతా సప్తలా, షన సమవాయే. దట్టమై కూడుకొని యుండునది. ౧. విగతం మలమనయేతి విమలా – దీనిచేతఁ గల్మషము పోవును. ౨. సాతం సుఖం లాతీతి సాతలా – సుఖము నిచ్చునది. ౩. భూరయఃఫేనాః అస్యా ఇతి భూరిఫేనా – తఱుచైన నురుఁగులు గలది. ౪ చర్మ కషతీతి చర్మకషా. కష హింసాయాం. పూయఁబడినదై దుష్టచర్మమును జెఱుచునది. ఈ ౫ సంబరేని పేళ్లు.

**వాయసోలీ స్వాదురసా వయస్థా-**

వాయసన దులతి చలతి వాయసోలీ. సీ. ఉల సంచలనే. కాకి వలెఁ జలించునది. ౧. స్వాదుః రసః అస్యా ఇతి స్వాదురసా – స్వాదువైన రసముగలది. ౨. వయసి స్థీయతే అనయా వయస్థా– వయస్సున నుండునది. పా. కాయస్థా. ఈ 3 కాకోలిపేళ్లు. కారుగొలిమి.

అథ మకూలకః

**నికుమ్భోదన్తికా ప్రత్యక్శ్రేణ్యుదుమ్బరపర్ణ్యపి.** 144

మంక్యతే చిత్రత్వాత్ మకూలకః. మకి మండనే. చిత్రమై యొప్పునది. పా. ముకూలకః. ౧. రసాధారత్వేన నిశ్చితః కుంభో నికుంభః – రసమునకు ఆధారమైన కుంభము. ౨. దమ్యంతే అనయా దోషా ఇతి దంతికా. దము ఉపశమనే. రోగములు దీనిచేత ఉపశమింపఁబడును. ౩. ప్రత్యగ్భవతీ ప్రత్యక్ శ్రేణి రస్యా ఇతి ప్రత్యక్శ్రేణీ. సీ. బోరగిలియుండు ఆకులయొక్క పఙ్క్తి గలది. ౪. ఉదుంబరస్య పర్ణానీవ పర్ణాన్యస్యా ఇతి ఉదుంబరపర్ణీ. సీ. అత్తియాకులవంటి యాకులు గలది. ఈ ౫ దంతిచెట్టు పేళ్లు.

**అజమోదా తూగ్రగన్ధా బ్రహ్మదర్భా యవానికా**

అజస్యేవ మోదో గంధో అస్యాస్తీతి అజమోదా – గొఱ్ఱెకంపువంటి కంపు గలది. ౧. ఉగ్రో గంధో ఽస్యా ఇతి ఉగ్రగంధా–ఉగ్రమైన గంధముగలది. ౨. బ్రహ్మసంబంధిత్వా ద్దర్భాకారత్వాచ్ఛ బ్రహ్మదర్భా – బ్రహ్మసంబంధమై దర్భాకారమై యుండునది. ౩. యువసాదృశ్యాద్యవానికా – యవలవలె నుండునది. ఈ ౪ అజమోద మనునోమము పేళ్లు.

**మూలే పుష్కర కాశ్మీర పద్మపత్రాణి పౌష్కరే.** 145

స్థలపద్మినీ మూలత్వేన పుష్కరస్య మూల మిదం పుష్కరం. నేలతామర దుంప. ౧. కాశ్మీరదేశే భవం కాశ్మీరం – కాశ్మీరదేశమందుఁ బుట్టినది. ౨. పద్మస్యేవ పత్రాణ్యస్య పద్మపత్రం – తామరపాకులవంటి ఆకులు గలది. ఈ 3 పుష్కరమూలము పేళ్లు. కాశ్మీరదేశమునందలి మెట్టతామరదుంప.

**అవ్యథా ఽ తిచరా పద్మాచారటీ పద్మచారిణీ**

న వ్యథతే అనయేత్యవ్యథా, వ్యథ భయచలనయోః. దీనిచేత వ్యథను బొందరు. ౧. అత్యర్థం చరతి వ్యాప్నోతీతి అతిచరా. చర గతి భక్షణయోః. మిక్కిలి వ్యాపించునది. ౨. పద్మాసాదృశ్యాత్పద్మా. పద్మమువంటిది. ౩. చరతి వ్యాప్నోతీతి చారటీ. సీ. వ్యాపించునది. ౪. పద్మమివ చరతీతి పద్మచారిణీ–పద్మమువలె వ్యాపించునది. ఈ ౫ మెట్ట (కాశ్మీరదేశపు) తామర పేళ్లు.





**కాంపిల్ల్యః కర్కశశ్చన్ద్రోరక్తాఙ్గో రోచనీత్యపి** 146

కంపిల్ల్యాఖ్యదేశే భవః కాంపిల్ల్యః - కంపిల్ల్యదేశమందుఁ బుట్టినది. ౧. కఠినత్వాత్కర్కశః - కఠినమైనది. ౨. రోగహరణేన చందయతి ఆహ్లాదయతీతి చంద్రః. చది ఆహ్లాదనే. రోగహరణముచేత సంతోష పెట్టునది. ౩. రక్తమంగమన్యేతి రక్తాంగః-ఎఱ్ఱనిది. ౪. రోచత ఇతిరోచనీ. సీ. రుచదీప్తౌ. ప్రకాశించునది. ఈ ౫ కంపిల్లముపేళ్లు (రోచనియను నౌషధము).

**ప్రపున్నాట స్త్వేడగజో దద్రుఘ్న శ్చక్రమర్దకః**
**పద్మాట ఉరణాక్షశ్చ**

ప్రకర్షేణ పుమాంసం నాటయతీతి ప్రపున్నాటః - ప్రకృష్టముగాఁ బురుషుని నటింపఁజేయునది. ప్రకర్షేణ పునాతీతి వా ప్రపున్నాటః - మిక్కిలి పవిత్రమును జేయునది. పా. ప్రపునాటః. ౧. మేషాక్షి సదృశ పుష్పత్వాత్ ఏడః; శ్రేష్ఠత్వాత్ గజ. ఏడశ్చాసౌ గజశ్చ ఏడగజః-మేఁకకండ్లవంటి పువ్వులుగలిగి శ్రేష్ఠమైనది. ౨. దద్రుం హంతీతి దద్రుఘ్నః. హన హింసాగత్యోః. దద్దురోగమును జెఱుచునది. ౩. చక్రాణి దద్రుమండలాని మృద్నాతీతి చక్రమర్దకః. మృద క్షోదే. దద్రు మండలములను మర్దించునది. ౪. పద్మవ దటతీతి పద్మాటః ఆట పటగతౌ. పద్మమువలెఁ జలించునది. ౫. ఉరణో మేషస్త దక్షిసదృశపుష్ప త్వాదురణాక్షః -మేఁకకండ్లవంటి పువ్వులుగలది. పా. ఉరణాఖ్యః. ఈ ౬ తగిరిసచెట్టు పేళ్లు.

**పలాణ్డుస్తు సుకన్దకః** 147

కఫం పిపర్తి పూరయతీతి పలాండుః. పూ. పౄ పాలనపూరణయోః. శ్లేష్మమును బూరించునది. పలాండుశబ్దము ఊదంతము గలదని కొందఱు. ౧. శోభనః కందో ఽ స్య సుకందకః-మంచిగడలుగలది. ఈ ౨ నీరుల్లి పేరు. ఎఱ్ఱయుల్లి.

**లతార్క దుర్ద్రుమౌ తత్ర హరితే**

లతాభిః శాఖాభిః అర్చ్యత ఇతి లతార్కః. అర్చపూజాయాం. లతారూపములైన కొమ్మలచేత నర్చింపఁబడునది. ౧. దుష్టం క్షయాదికంద్రవ త్యస్మాదితి దుర్ద్రుమః. ద్రుగతౌః . దీనివలన దుష్టమైన క్షయాదులు పారిపోవును. ఈ ౨ పచ్చని నీరుల్లి పేళ్లు.

## అథ మహౌషధమ్ 148

**లశునం గృఞ్జ నారిష్ట మహాకన్ద రసోనకాః**

మహచ్చ తదౌషధంచ మహౌధం - మహత్తైన ఔషధము. ౧. అశ్యతే భుజ్యత ఇతి లశునం. అశ భోజనే. భుజింపఁబడునది. ౨. గృఞ్జ్యతే శబ్ద్యతే గృఞ్జనః. గృజి శబ్దే. కుత్సితమని తలంపఁబడునది. ౩. నాస్తి రిష్టం హింసా అస్మాదితి అరిష్టః. రిష హింసాయాం. దీనివలనఁ జావులేదు. ౪. మహాన్ కందో ఽస్య మహాకందః - పెద్దగడ్డలు గలది. షట్సు రసేషు ఏకేన అమ్లరసేన ఊనః రసోనకః - షడ్రసములలో పులుసనెడియొక్క రసములేనిది. ఈ౬ వెల్లుల్లి పేళ్లు. తెల్లయుల్లి.

**పునర్నవా తు శోథఘ్ని**

ఛిన్నాపి పునర్జాయత ఇతి పునర్నవా - నఱికినను తిరిగి పుట్టునది. ౧. శోథం హన్తీతి శోథఘ్నీ. సీ. శోథను గొట్టివేయునది. ఈ ౨ గలిజేరు పేళ్లు.

**వితున్నం సునిషణ్ణకమ్**

విశేషేణ తుద్యతే ఛిద్యతే వితున్నం. తుద వ్యథనే. విశేషముగాఁ గోయఁబడునది. ౧. సుష్ఠు నిషీదంతి గుణా అత్రేతి సునిషణ్ణకం. షద్ ౡవిశరణ గత్యవసాదనేషు. లెస్సగుణములు దీనియందు గలవు. ఈ ౨ నీరు చెంచలి పేళ్లు.

**స్వాద్వాతక శ్శీతలో ఽ పరాజితా కణపర్ణ్యపి** 149

వాతం కరోతీతి వాతకః. అత ఏవ శీతలః - వాతమును జేయునది గనుక వాతకము. శీతలము. పా. వాతకీ. శీతలా. ౧, ౨ రోగైర పరాజితత్వా దపరాజితా - రోగములచేత తిరస్కరింపఁబడనది. ౩. శణస్యేవ పర్ణాన్యస్యా శ్శణపర్ణీ - జనుము ఆకులవంటి ఆకులు గలది. పా. ఆసనపర్ణీ ఈ ౨ సోమెదపు చెట్టు పేళ్లు.

**పారావతాఙ్ఘ్రిః కటభీ పణ్యా జ్యోతిష్మతీ లతా**

రక్తత్వేన పారావతాంఘ్రి సదృశత్వాత్ పారావతాంఘ్రిః. సీ. పావురము కాళ్లవలె నెఱ్ఱనై యుండునది. ౧. కటత్యావృణోతీతిః కటభీః. సీ. కటే వర్షావరణయోః. అంతట వ్యాపించునది. ౨. పణ్యతే స్తూ యత ఇతితి పణ్యా. పణ వ్యవహారే స్తుతౌచ. స్తోత్రము చేయఁబడునది. ౩. జ్యోతిః ఉష్ణమస్యాఅస్తీతి జ్యోతిష్మతీ. సీ. ఉష్ణముగలది. ౪.దూరప్రస

రాల్లతా - దూరముగా వ్యాపించునది. ఈ ౫ ఎక్కుడుదీఁగెపేళ్లు. మానేరుతీఁగె. మెఱుపుఁదీఁగె.

**వార్షికం త్రాయమాణా స్యా త్త్రాయన్తీ బలభద్రికా** 150

వర్షాసు భవతీతి వార్షికం-వర్ష ఋతువునందుఁ బుట్టినది. ౧. రోగేభ్యః త్రాయత ఇతి త్రాయమాణా, త్రాయంతీచ. త్రైఙ్ పాలనే. రోగము వలన రక్షించునది. ౨, ౩. బలేనభద్రికా బలభద్రికా - బలముచేత భద్రమైనది. ఈ ౪ కలుగానుగుపేళ్లు.

**విష్వక్సేనప్రియా ఘృష్టి ర్వారాహీ బదరేత్యపి**

విష్వక్సేనప్రియత్వా ద్విష్వక్సేన ప్రియా - విష్ణువునకుఁ బ్రియమైనది. ౧. వరాహైః ఘృష్యత ఇతి ఘృష్టిః. సీ.ఘృషు సంఘర్షణే. వరాహములచేత నొరయఁ బడునది. ౨. వరాహైరాక్రాంతా వారాహీ. అడవిపందులచేత నాక్రమింపఁ బడునది. ౩. బదతి స్థిరీభవతీతి బదరా. బడస్థైర్యే. స్థిరమైయుండునది. ఈ 3 పాఁచితీఁ గెపేళ్లు.

**మార్కవో భృఙ్గరాజస్స్యాత్**

మార్కః సంపర్కః ఔషధేషు తం వాతీతి మార్కవః. వా గతి గంధనయోః. ఔషధములయందు సంపర్కమును బొందునది. ౧. భృంగవద్రాజతే భృంగరాజ. రాజృదీప్తౌ. తుమ్మెదవలెఁ బ్రకాశించునది. ఈ ౨ గుంటగలగరపేళ్లు.

**కాకమాచీతు వాయసీ** 151

కాకాఞ్ మఞ్చత ఇతి కాకమాచీ. మచి ధారణోచ్ఛ్రాయపూజనేషు. కాకులను ధరించునది. కాకమాచి. ౧. వాయసానా మియంవాయసీ-కాకుల సంబంధమైనది. ఈ ౨ కాఁచిచెట్టుపేళ్లు.

**శతపుష్పా సితచ్ఛత్రా ఽ తిచ్ఛత్రా మధురా మిసిః**
**అవాక్పుష్పీ కారవీచ**

బహుపుష్పత్వా చ్ఛతపుష్పా - బహుళమైన పువ్వులుగలది. ౧. సితచ్ఛత్రాభాని పుష్పాణ్యస్యా ఇతి సితచ్ఛత్రా - తెల్లగొడుగువంటి పువ్వులుగలది. ౨. ఛత్ర మతిక్రాంతా అతిచ్ఛత్రా-ఛత్రము నతిక్రమించినది. ౩. కటుతిక్తరసత్వే ఽ పి విరుద్ధ లక్షణయా మధురా - కారము చేఁదునైనను విరుద్ధలక్షణచేత మధుర యనంబడును. ౪. మస్యతి పరి

ణమతీతి మిసిః. సీ. మస పరిణామే. కాలక్రమమున రూపాంతరమును బొందునది. ౫. అవాంచ్యధోముఖాని పుష్పాణ్యస్యా ఇతి అవాక్పుష్పీ. సీ.అధోముఖములై యుండు పుష్పములు గలది. ౬. కరోతీతికారుః; తస్యేయం కారవీ – కారువున కుపయోగించునది. ఈ 3 పెద్దసదాప పేళ్లు. అడవిసదాప.

**సారణీతు ప్రసారిణీ** 152

**తస్యాం కటంభరా రాజబలా భద్రబలేతిచ,**

సార్యంతే వాతసంకుచితా న్యంగాన్య నయేతి సారణీ. ప్రసారణీ చ. సృ గతౌ. వాతముచే ముడుచుకొన్న యంగములు దీనిచేత చాఁచఁబడును. పా. సారణా. ౧, ౨. కటిం శ్రోణాద్యవయవం బిభర్తి పుష్ణాతి వాతహరణేన కటంభరా. భృఞ్ భరణే. పిరుఁదు మొదలైన అవయవములను వాతహరణముచేతఁ బోషించునది. ౩. బలప్రదవస్తుషు రాజేవ ముఖ్యత్వా ద్రాజబలా – బలప్రదమైన వస్తువులయందు రాజువలె ముఖ్యమైనది. ౪. భద్రం బలమస్యా అ స్తీతి భద్రబలా– శుభస్వరూపమైన బలము గలది. ఈ ౫ గొంతెమగోరుచెట్టు పేళ్లు.

**జనీ జతూకా జననీ జతుకృ చ్చక్రవర్తినీ** 153

**సంస్పర్శా -**

జనయతి శైత్యాదికం జనీ. జననీచ. సీ. శైత్యాదులను బుట్టించునది. జనయతి లక్షాంవా జీన. జననీ చ. జనీ ప్రాదుర్భావే. లక్కను బుట్టించునది. పా. రజనీ. ౧, ౨. జతు కరోతీతి జతూకా. లక్కను జేయునది. పా. జతుకా. జనూకా. ౩. జతు కరోతీతి జతుకృత్. త.సీ. లక్కను చేయునది. పా. జంతుకృత్. ౪. చక్రే శాకగణే వర్తత ఇతి చక్రవర్తినీ – శాకసమూహమందు వర్తించునది. ౫. సమీచీనః స్పర్శో ఽస్యా అస్తీతిసంస్పర్శా – చల్లనైన స్పర్శము గలది. ఈ ౬ కోరిందచెట్టు పేళ్లు.

**అథ శటీ గన్ధమూలీ షడ్గ్రన్థికేత్యపి**

**కర్చూరో ఽపి పలాశః.**

శటతి కఫాదిరోగాన్ శటీ. శట రూజావిశరణగత్యవసాదనేషు. కఫాది రోగములను నశింపఁజేయునది. ౧. గంధయుక్తం మూల మస్యా ఇతీ గంధమూలీ – గంధయుక్తమైన పేళ్లు గలది. షట్ గ్రంథయో ఽస్యా

ఇతి షడ్గ్రంథికా – ఆఱుగంట్లుగలది. ౩. కర్బ్చూం చూర్యతే దహతీతి కర్చూరః. చురదాహే. తీఁటను బోఁగొట్టునది. పా. కర్బురః. ౪. పృథు పలాశత్వాత్పలాశః – పెద్దయాకులు గలది. ఈ ౫ గండ్లకచోరము పేళ్లు.

**అథ కారవేల్లః కటిల్లకః.** 154

**సుషవీ చ -**

కారేణ ప్రయత్నేన వేల్లతి చలతీతి కారవేల్లః. వేల చలనే ప్రయత్నముచేత చలించునది. ౧. కటత్యా వృణోతీతి కటిల్లకః. కటే వర్షావరణయోః. వ్యాపించునది. పా. కఠిల్లకః. ౨. సుష్ఠు సూయతే ఫలాని సుషవీ. సీ. షూఞ్ ప్రాణీప్రసవే. లెస్సగాఁ గాయలు కాఁచునది. ౩ కాఁకరచెట్టు పేళ్లు.

**అథ కులకం పటోల స్తిక్తకః పటుః**

కులతీతి కులకం–గుంపై యుండునది. ౧. పటతి సరతీతి పటోలః. అట పట గతౌ. వ్యాపించునది. ౨. తిక్తరసయోగాత్తిక్తకః – చేఁదు గలది. ౩. దేహపటుత్వ యోగాత్పటుః. ౪. దేహపటుత్వమును జేయునది. ఈ ౪ చేఁదుపొట్ల పేళ్లు.

**కూశ్మాణ్డకస్తు కర్కారుః**

కు ఈషత్ ఊష్మా అండేషు బీజేష్వస్యేతి కూశ్మాండకః – కుత్సితమైన ఉష్ణము బీజములయందుఁ గలది. పా. కూష్మాండః. ౧. తృప్తింకరోతీతి కర్కః; ఇయర్తీతి అరుః; కర్కశ్చాసౌ అరుశ్చ కర్కారుః. ౪. తృప్తిని జేయునదియును వ్యాపించునదియును గనుక కర్కారువు. ఈ ౨ గుమ్మడి పేళ్లు.

**ఉర్వారుః కర్కటీ స్త్రియౌ** 155

ఉరు మూత్రం ఆరయతి నిస్సారయతితి ఉర్వారుః. ఋ గతౌ. మిక్కిలి మూత్రమును వెళ్లించునది. ౧. పా. ఈర్వారుః. ఏర్వారుః. కరోతివర్షమితి కర్కటీ – వర్షమును జేయునది. ఈ ౨ దోసచెట్టు పేళ్లు.

**ఇక్ష్వాకుః కటుతుమ్బీ స్యాత్ -**

ఇక్షుమప్యకయతి కుటిలయతి తిక్తత్వేన ఇక్ష్వాకుః. సీ. అకకుటిలాయాం గతౌ. చేఁదగుటచేతఁ జెఱకును గూడ జెఱుచునది. ౧. తుంబ్యతే భక్ష్యత ఇతితుంబీ; కటుః తిక్తా తుంబీ కటుతుంబీ. సీ.తుబి

అదనే. చేఁదైన సొర. ఈ ౨ చేఁదు సొర పేళ్లు. వదరుచెట్టు.

**తు మ్బ్యలాబూ రుభే సమే,**

తుంబ్యతే భక్ష్యత ఇతి తుంబీ. సీ. తుబి అదనే. భక్షింపఁబడునది. ౧. న లంబతే జలే అధోనగచ్ఛతి శుష్కదశాయామి త్యలాబూః. ఊ.సీ. పా. అలాబుః. ఉ. సీ. ఎండినప్పుడు నీళ్ళలో మునుఁగకుండునది. మంచిసొర పేళ్లు. ఆనుగపుచెట్టు.

**చిత్రా గవాక్షీ గోతుమ్బా -**

చిత్రరూపఫలత్వా చ్చిత్రా-నానావర్ణములైన ఫలములు గలది. ౧. వృషభాక్షితుల్య పుష్పత్వాత్ గవాక్షీ - ఎద్దుకండ్లవంటి పువ్వులు గలది. ౨. గోభి స్తుంబ్యత ఇతి గోతుంబా - గోవులచేత భక్షింపఁబడునది. ఈ ౩ పిన్న పాపరపేళ్లు. బుడమ.

**విశాలా త్విన్ద్రవారుణీ.** 156

విశాలఫలత్వా ద్విశాలా - పెద్దపండ్లుగలది. ౧. ఇంద్రవన్నేత్రాభైః పుష్పైః వ్రియత ఇతి ఇంద్రవారుణీ. సీ. వృఞ్ వరణే. ఇంద్రుని వలె నేత్ర సమానములైన పుష్పములచేతఁ గప్పఁబడునది. ఈ ౨ పెద్దపాపర.

**అర్శోఘ్న స్సూరణః కన్దః-**

అర్శో హంతీతి అర్శోఘ్నః. హన హింసాగత్యోః. మూలవ్యాధిని హరించునది. ౧. సూర్యత ఇతి సూరణః-భక్షించఁబడునది. సూరీ హింసాయాం. పా. శూరణః. ౨. కంద్యతే రోగో உనేనేతి కందః. కది ఆహ్వానే రోదనే చ. దీనిచేత రోగము పీడింపఁబడును. కంద్యతే రోగి భిరన్విక్ష్యత ఇతి వా కందః- రోగులచేత వెదుకఁ బడునది. ఈ ౩ కంద పేళ్లు.

**గణ్డీరస్తు సమష్ఠిలా,**

గండీ౯ గ్రంథీ౯ ఈరయతీతి గండీరః. ఈర గండీరః. ఈర గతౌ, పుండ్లను బోఁగొట్టునది. ఈ ౧. సమ్య గష్ఠిలా బీజం యస్యాః సమష్ఠిలా-మంచివిత్తులుగలది. ఈ ౨ ఏఱువంగ పేళ్లు. గురుజకూరయునని కొందఱు.

**కల మ్బ్యుపోదకా உ స్త్రీతు మూలకం హిలమోచికా.** 157

**వాస్తుకం శాకభేదా స్స్యుః -**

కే జలే లంబతే కలంబీ. సీ. లబి లంబనే. జలమందుండునది. తీఁగెబచ్చలి పేరు. ౧. ఉపశబ్ద అధికార్థః. అధికముదకమస్యా ఇత్యుపోద

కా. ఆ. సీ. పా. ఉపోదకీ – అధికమైన ఉదకముగలది. ఉపగత ముదక మస్యా ఇతి ఉపోదకీ – సమీపమందు ఉదకముగలది. దుంపబచ్చలి. ౧. ప్రశస్తాని మూలాన్యస్యేతి మూలకం – మంచిదుంపలుగలది. ముల్లంగి ౧. హేలయారోగాన్ మోచయతీతి హిలమోచికా. ముచ్ ౹౹మోక్షణే. అనాయాసముగా రోగములను బోఁగొట్టునది. చిలుకకూర. ౧. వసంతి గుణా అత్రేతి వాస్తుకం. పా. వాస్తూకం – దీని యందు మంచి గుణము లుండును. చక్రవర్తికూర. ఈ ౨ ప్రత్యేకశాక విశేషము పేళ్లు.

**దూర్వా తు శతపర్వికా,**

**సహస్ర వీర్యా భార్గవ్యౌరుహా ౩ నన్తా -**

దూర్వ్యతే పశుభి రితి దూర్వా. దుర్వీ హింసాయాం. పశువులచేఁ బీఁకఁ బడునది. ౧. శతం పర్వాణ్యస్యామితి శతపర్వికా – నూఱు కనుపులుగలది. ౨. మహాప్రభావత్వాత్సహస్రవీర్యా–మంచిశక్తిగలది. ౩. భృగోరియం భార్గవీ భృగుసంబంధమైనది. ౪. ఛిన్నాపి రోహతీతి రుహా. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. నఱికినను మరల మొలచునది. ౫. దూర ప్రసరత్వాదనంతా దవ్వుగా నల్లుకొనునది. ఈ ౬ గఱిక పేళ్లు.

**అథ సా సితా.** 158

**గోలోమీ శతవీర్యాచ -**

గోరివలోమా న్యస్యా ఇతి గోలోమీ. సీ. గోవులయొక్క రోమములవలె నుండునది. ౧. శతం వీర్యాణి ప్రసర రూపాణ్యస్యా ఇతి శత వీర్యా – నూఱు విధములుగాఁ బ్రాఁకునది. ఈ ౨ తెల్లగఱిక పేళ్లు.

**గణ్డాలీ శకులాక్షకః,**

గండైః గ్రంథిభిరల్యతే భూష్యత ఇతి గండాలీ.సీ. అల భూషణాదౌ. బుడుపులచేత నలంకరింపఁబడునది. ౧. మత్స్యనయనతుల్య గ్రంథి యోగాచ్ఛ కులాక్షకః – చేఁపకండ్లవంటి కనుపులు గలది. ౨. తీఁగె గఱికపేళ్లు. ఈ 3 ను తెల్లగఱికయని కొందఱు.

**కురువిన్దో మేఘనామౌ ముస్తాముస్తక మస్త్రియామ్.** 159

కురుదేశ మాశ్రయత్వేన విందతీతి కురువిందః. విద్ ౹౹లాభే. కురు దేశము నాశ్రయముగాఁ బొందునది. ౧. మేఘస్య నామాన్యస్యేతి మేఘనామా. న. పు. మేఘముయొక్క పేళ్లు గలది. ౨. ముస్యతి ఖండయతి

రోగాన్ ముస్తా. ముస్తకం చ. అ. పు. ముస ఖండనే. రోగములను బోఁగొట్టునది. ఈ ४ నిడపుగల తుంగము స్తలపేళ్లు.

**స్యా ద్భద్రముస్తకో గున్ద్రా -**

భద్రశ్చాసౌ ముస్తశ్చ భద్రముస్తకః – శుభస్వరూపమైన ముస్తకము. ౧. గుణాన్ ద్రాతీతి గుంద్రా. ద్రాకుత్సాయాంగతౌ. గుణములను బాధించునది. ఈ ౨ నాగ ముస్తలపేళ్లు. భద్రముస్తలు.

**చూడాలా చక్రలోచ్చటా,**

చూడాంలాతీతి చూడాలా, లాదానే. వెంద్రుకలను వృద్ధిఁజేయునది. ౧. చక్రాకారం లాతీతి చక్రలా – చక్రాకారమును బొందియుండునది. ౨ ఉచ్చటతి రోగా నిత్యుచ్చటా. చట భేదనే. రోగములను భేదించునది. ఈ 3 వట్రువ ముస్తలపేళ్లు.

**వంశే త్వక్సార కర్మార త్వచిసార తృణధ్వజాః.** 160
**శతపర్వా యవఫలో వేణు మస్కర తేజనాః,**

వన్యతే సేవ్యత ఇతి వంశః. వన షణ సంభక్తౌ. అందఱిచేత నాశ్రయింపఁబడునది. ౧. త్వచి సారో దార్ఢ్య మస్యేతిత్వక్సారః; త్వచి సారశ్చ – మీఁదిచర్మమందు సారము గలది గనుక త్వక్సారము, త్వచిసారమును. ౨, ౩. కర్మ ఇయర్తి కర్మారః. ఋ గతః. క్రియను బొందునది. ४. తృణానాం మధ్యే ముఖ్యత్వాత్ తృణధ్వజః – తృణవిశేషములలో ముఖ్యమైనది. ౫. శతం అనేకాని పర్వాణ్యస్యేతి శతపర్వా న.పు. అనేకములైన కనుపులు గలది. ౬. యవసదృశాని ఫలాన్యస్యేతి యవఫలః – యవలవంటి బియ్యము గలది. ౭. వయంత్యనేన వేణుః. పు. వేఞ్ తంతుసంతానే. దీనిచేత నల్లుదురు. ౮. మా క్రియతే ప్రతిషిధ్యతే అనే నేతి మస్కరః – దీనిచేత ప్రతిషేధింపఁబడును. ౯. తేజయత్యగ్నిం తేజనః. తిజ నిశాతనే. అగ్నిని బ్రజ్వలింపఁజేయునది. ఈ ౧౦ వెదురుపేళ్లు.

**వేణవః కీచకాస్తే స్యు ర్యే స్వనంత్య నిలోద్ధతాః.** 161

కీచేతి కాయంతి శబ్దాయంత ఇతి కీచకాః. కైశబ్దే. కీచ్ అని మ్రోయునవి. ఈ ౧ (గాలిఁబోసికొని 'కీచ్' అని మ్రోయు) బొంగువెదుళ్ల పేరు.

**గ్రన్థి ర్నా పర్వ పరుషీ -**

గ్రంథ్యతే సంధిరూపేణ బద్ధ్యత ఇతి గ్రంథిః. పు. గ్రంథిరూపమున బంధింపఁబడునది. ౧. పర్వతి స్థూలో భవతీతి పర్వ. న. న. పర్వ పూరణే. అధికమౌనట్టిది. ౨. పిప ర్తీతి పరుః స. న. పౄ పాలనపూరణయోః. పూరించునది. పా. పరుః. ఉ. పు. 'మజ్జాసారో గ్రంథిః పరుః పరాగః కుసుమరేణు'రితి రత్నకోశే పుంస్కాణ్డే. ఈ 3 వెదురుగణుపుల పేళ్లు.

**గున్ద్ర స్తేజనక శ్శరః,**

గూయత ఇతి గుంద్రః. గూజ్‌శబ్దే. వాయువశమున మ్రోయునది. ౧. తేజయతి పిత్తాదిరోగానితి తేజనకః. తిజ నిశాతనే. పిత్తాది రోగములను కృశముగాఁ జేయునది. ౨. శృణాతి రోగం శరః. శౄహింసాయాం. రోగమును హింసించునది. ఈ 3 కాకివెదురుపేళ్లు. కాకిచెఱకు. కనుము.

**నడస్తు ధమనః పోటగళః -**

నలతి విధ్యతీతి నడః. నల బంధనే పీడించునది. ౧. సుషిరవత్త్వాద్ధ్మాయతే పూర్వత ఇతి ధమనః. ధ్మా శబ్దాగ్ని సంయోగయోః. రంధ్రముగల దౌటచేత నూదఁబడునది. ౨. పుటతి గళతి చేతి పోటగళః. పుటసంశ్లేషణే. గళ సంక్షరణే. కూడికొని జాఱునది. ఈ 3 కిక్కసకసపు పేళ్లు. గనుపదంటు.

**అథో కాశ మస్త్రియామ్.** 162

**ఇక్షుగన్ధా పోటగళః-**

కాశత ఇతి కాశం.అ.ప్న. కాశృ దీప్తౌ. ప్రకాశించునది. ౧. ఇక్షోరివగంధో௨స్యా ఇతి ఇక్షుగంధా – చెఱకు పరిమళమువంటి పరిమళముగలది. ౨. పుటతిగళతి చేతి, పోటగళః–కూడికొని జాఱునది. ఈ 3 ఱెల్లుకసవుపేళ్లు.

**పుంభూమని తు బల్బజాః,**

వలంతే సంవృణ్యంతే స్తంబబాహుళ్యాద్భువ మితి బల్బజాః. వబయో రభేదః. వృఞ్ వరణే. స్తంబబాహుళ్యముచేత భూమిని గప్పియుండునది. ఈ శబ్దము పుల్లింగ బహువచనమందే వర్తించును. మోదయపు కసపుపేళ్లు. ఈ ౪ శబ్దములును ఱెల్లుకసపుపేళ్లే యని కొందఱు.

**రసాల ఇక్షుః-**

రస్యతే రసాలః. రస ఆస్వాదనే. ఆస్వాదింపఁబడునది. రసేన అలత ఇతి వా రసాలః. అల భూషణాదౌ. రసముచేత నలంకరింపఁబడునది.

౧. ఇష్యతే సర్వైరితి ఇక్షుః. ఇషు ఇచ్ఛాయాం. అందఱిచేత కోరఁబడునది. ఈ ౨ చెఱకుపేళ్లు.

**తద్భేదాః పుణ్డ్రకాన్తారకాదయః.** 163

పుణతీతి పుండ్రః. పుణ శుభకర్మణీ చ. శుభమును జేయునది. ౧. కామ్యత ఇతి కాంతారకః. కము కాంతౌ. కాంక్షింపఁబడునది. ౨. ఆది శబ్దముచేత కోశకారశబ్దము గ్రహింపఁబడును. ఈ 3 చెఱకులలోఁ గల భేదములు.

**స్యా ద్వీరణం వీరతరమ్-**

వీరయతి విక్రమతి తీక్ష్ణత్వేన వీరణం. వీరతరం చ-మిక్కిలి వేఁడియౌటచేత విక్రమించునది గనుక వీరణము. వీరతరమును. ఈ ౨ అవురుకసవుపేళ్లు.

**మూలే ఽ స్యోశీర మస్త్రియామ్,** 164

**అభయం నళదం సేవ్య మమృణాళం జలాశయమ్.**

**లామజ్జకం లఘు లయ మవదాహేష్టకాపథే,**

ఉశ్యత ఇతి ఉశీరం. అ. ప్న వశ కాంతౌ. కాంక్షింపఁబడునది. ౧. న విద్యతే భయ మనేనేత్య భయం -దీన భయము లేదు. ౨. నలత్యర్ధ యతీతి నలం పిత్తాదికం. తద్ద్యతీతి నలదం. నల గంధనే. దో అవఖండనే. పీడించునవి గనుక నల మనఁగా బిత్తాదులు, వానిని ఖండించునది. ౩. సేవ్యతే పిత్తాదిశమనార్థమితి సేవ్యమ్. షేవృ సేవాయం. రోగహరణార్థమై సేవింపఁబడునది. ౪. మృణతి హినస్తీతి మృణాళం హింస్రం; తన్న భవతీత్యమృణాళం. మృణ హింసాయాం. హింసించునది. ౫. జలే శేత ఇతి జలాశయం. శీఙ్ స్వప్నే. జలమందుండునది. ౬. రక్తదోషం లాతి నా శయతీతి లా, మజ్జా సారో ఽ న్యేతి లామజ్జకం - రక్తదోషమును జెఱుచు సారముగలది. ౭. గురుత్వాభావాల్లఘు. న. చులకనైయుండునది. ౮. జఠరాగ్నౌ లీయత ఇతి లయం. లీఙ్ శ్లేషణే. జఠరాగ్నియందు నణఁగునది. లఘులయమని యేకపదముగాను జెప్పుదురు. ౯. అవనశ్యతి దాహో ఽ నే నే త్యవదాహం - దీనిచేత దాహ మణఁగును. ౧౦. వాతవత్త్వేన గమన నిరోధ కత్వాదిష్టం కాపథమన్యేతి ఇష్లకాపథం - వాతకారియై గమనమును నిరోధించుటచేత నిష్టమైన కుత్సిత మార్గము గలది. ఈ ౧౧ అవురువేరు పేళ్లు.

వట్టివేరు. కొందఱు ఉశీరాభయ శబ్దములు తెల్ల వేరు పేళ్లనియు, అభయ శబ్దము మొదలు అమృణాళ శబద్దపర్యమతము సామాన్యముగా వట్టివేరు పేళ్ళనియు జలాశయాది శబ్దములు పొడి గల వట్టివేరు పేళ్లనియు జెప్పుదురు.

**నడాదయ స్తృణం గర్ము చ్ఛ్యామాక ప్రముఖా అపి.** 165

నడాదయః నడకాశాదయః గర్ముచ్ఛ్యామాకప్రముఖాశ్చ తృణం తృణభేదా ఇత్యుచ్యంతే. నడశబ్దము మొదలు ఇంతవఱకు చెప్పఁబడినవన్నియు, గర్ముచ్ఛ్యామాకాదులును తృణములని చెప్పఁబడును. గిర్యతే అన్య ధాన్యం జనైరితి గర్ముత్. త.పూ. గౄనిగరణే. జనులచేత దీని ధాన్యము భక్షింపఁబడును. ఊదరలు, శ్యామవర్ణ మకతి ప్రాప్నోతీతి శ్యామాకః. అక కుటిలాయాం గతౌ. శ్యామవర్ణమును బొందునది. చామలు. తృణ్యతే అద్యతే పశుభిరితి తృణం తృణహింసాయాం. పశువులచేత భక్షింపఁబడునది. ప్రముఖ శబ్దముచేత నీవారము మొదలైన తృణధాన్య విశేషములును తృణ మనంబడును.

**అస్త్రీ కుశం కుథో దర్భః పవిత్రం-**

కౌశతే కుం శ్యతి నా కుశం. అ.ప్న శీజ్ స్వప్నే; శోతసూకరణే. భూమియం దుండునది. లేక భూమి నల్పముగాఁ జేయునది కుశము. ౧. విప్రపాణిషు కుథ్యత ఇతి కుథః. కుథ శ్లేషణే. బ్రాహ్మణ హస్తముల యందుఁ గూర్పఁబడునది. ౨. దృణాతి కరాదికమితి దర్భః. దౄ విదారణే.కరాదులను జీల్చునది. ౩. పూయతే ఉ నేనేతి పవిత్రం. పూఞ్ పవనే. దీనిచేతఁ బవిత్రము చేయఁబడును. ఈ ౪ దర్భపేళ్లు.

**అథక త్తృణమ్,** 166

**పౌర సౌగన్ధిక ధ్యామ దేవజగ్ధక రౌషిషమ్,**

పశూనా మభక్ష్యత్వేన కుత్సితం తృణం కత్తృణం–పశువులకు తినరానిదౌట చేత కుత్సితమైన తృణము ౧. పురే భవం పౌరం – పురమందుఁ బుట్టినది. ౨. శోభనః గంధః ప్రయోజనమస్యేతి సౌగంధికం – మంచిపరిమళము ప్రయోజనముగాఁ గలిగినది. ౩. ధ్యాయతే పశుభిరప్రియత్వా దితి ధ్యామం. ధ్యై చింతాయాం. తృణ భక్షణమందుఁ బశువులచేత అప్రియమౌటవలన విచారింపఁబడునది. ౪. దేవేన అగ్ని నా జగ్ధం దేవజగ్ధం.జక్ష భక్షహననయోః, అగ్నిచేతభక్షింపఁబడు

నది. ౫. రోహతీతి రౌహిషం. రుహ బీజ జన్మని ప్రాదుర్భావే. మొలచునది. ఈ ౬ కామంచిపూరిపేళ్లు.

**ఛత్త్రాఛత్త్రపాలఘ్నౌ -**

ఛత్త్రాకారత్వా చ్ఛత్త్రా - గొడుగువలె నుండునది. ౧. అత ఏవ ఛత్త్ర మతిక్రాంతా అతిచ్ఛత్త్రా - ఛత్త్రము నతిక్రమించినది. ఛత్త్రాతిచ్ఛత్త్రా అని యొక్క పేరుగాఁ గొందఱు చెప్పుదురు. ౨. పలం మాంసం హన్తి తైక్ష్ణ్యాదితి పలఘ్నః; పలఘ్న ఏవ పాలఘ్నః - తీక్ష్ణమౌటచేత మాంసమును బీడించునది గనుక పలఘ్నము ; పలఘ్నమే పాలఘ్నము. ఈ 3 ఛత్త్రాకారమైన తృణము పేళ్లు.

**మాలాతృణక భూస్తృణౌ,**

మాలారూపాణి తృణా న్యత్ర మాలాతృణకం - పఙ్క్తిరూపమున నుండు తృణము. ౧. భువం సంస్తృణాతీతి భూస్తృణం. స్తృఞ్ ఆచ్ఛాదనే. భూమిని గప్పియుండునది. ౨. చిప్పకసవు పేళ్లు.

**శష్పం బాలతృణమ్ -**

శస్యతే హింస్యతే పశుభి రితి శష్పం. శసు హింసాయాం. పశువులచే హింసింపఁబడునది. ౧. బాలం చ తత్ తృణం చ బాలతృణం. లేఁతకసవు. ఈ ౨ లేఁతకసవు పేళ్లు.

**ఘాసో యవసమ్ -**

ఘస్యతే పశుభి రితి ఘాసః. ఘస్ ౢ అదనే. పశువులచేఁ దినఁబడునది. ౧. యౌతీతి యవసః. యు మిశ్రణే. కూడియుండునది. ఈ ౨ పశువులు మొదలైనవి తినునట్టి కసవు పేళ్లు.

**తృణ మర్జునమ్.** 167

తృణ్యతే పశుభిరితి తృణం. తృణ హింసాయాం. పశువులచేత హింసింపఁ బడునది. ౧. అర్జతే అర్జనం. పా. అర్జునం. అర్జ అర్జనే. అర్జింపఁబడునది. ఈ ౨ సామాన్యముగా కసవు పేళ్లు.

**తృణానాం సంహతి స్తృణ్యా -**

తృణానాం సమూహస్తృణ్యా - తృణముల యొక్క సమూహము. ఈ ౧ గడ్డికుప్ప (వామి).

**నడ్యా తు నడసంహతిః,**

నడానాం సమూహో నడ్యా – నడమనఁగా 3 క్కసపుకసవు. (గనుపకసవు). దాని యొక్క సమూహము. ఈ ౧ కిక్కసపు కసవు కుప్ప.

**తృణరాజాహ్వాయ స్తాళః-**

తృణానాం రాజా ముఖ్యః తృణరాజః. తృణరాజ ఇత్యాహ్వాయో యస్యేతి తృణరాజాహ్వాయః. తృణములలో ముఖ్యమైనది తృణరాజము. తృణరాజమను పేరుగలది తృణరాజాహ్వాయము. ౧. తలతి ప్రతిష్ఠతే దృఢమూలత్వాత్తాళః. తలప్రతిష్ఠాయాం. దృఢమైన మొదలు గలదౌటచేత ప్రతిష్ఠ గలది. ఈ ౨ తాటిచెట్టుపేళ్లు.

**నాళికేరస్తు లాఙ్గలీ.** 168

నాళ్యాక ముదక మీరయతీతి నాళికేరః. ఈరక్షేపే. రంధ్రములచేత ఉదకములను బీల్చునది. నాళీకాని నాళ యుక్తాని పుష్పఫలాని ఈరయతీతి వా నాళికేరః – కాఁడలతోఁ గూడిన పుష్పఫలాదులఁ బ్రేరేపించునది. పా. నారికేళః. ౧ లాంటలాకారపత్రత్వాల్లాగలీ. న.పు. నాఁగేఁటివంటి యాకులుగలది. ఈ ౨ నాళికేరవృక్షము (టెంకాయ చెట్టు).

**ఘోణ్టా తు పూగః క్రముకో గువాకః ఖపురః-**

ఘుణంతి భ్రమంత్యనయా జనా ఇతి ఘోంటా. ఘుణ భ్రమణే. దీనిచేత జనులు భ్రమింతురు. ౧. పునాతి ముఖ మితి పూగః. పూఞ్ పవనే ముఖమును బవిత్రముగాఁ జేయునది. ౨. క్రామంత్యస్మిన్ ఫలార్థిన ఇతి క్రముకః. క్రము పాదవిక్షేపే. దీనియందు ఫలార్థు లెక్కుదురు. ౩. గువతిమలం నిస్సారయతీతి గువాకః. గుపురీషోత్సర్గే. మలనిస్సరణమును జేయునది. పా. గూవాకః. ౪. ఖాని ఇంద్రియాణి వృణోతి వ్యాప్నోతీతి ఖపురః. వృఞ్ వరణే. ఇంద్రియములను వ్యాపించునది. ఖాని పృణోతీతిఖపురః. పృప్రీతౌ. ఇంద్రియములఁ బ్రీతి నొందించునది. ఈ ౫ పోఁక చెట్టు పేళ్లు.

**అస్య తు,**

**ఫల ముద్వేగమ్ -**

ఉద్గతో వేగో உస్య ఉద్వేగం – ఉద్గతమైన వేగముగలది. ఈ ౧ పోఁకపండు.

**ఏతే చ హింతాల సహితా స్త్రయః.** 169

**ఖర్జూరః కేతకీ తాళీ ఖర్జూరీ చ తృణద్రుమాః,**

హినోతి వర్ధతే తలతి ప్రతిష్ఠతీతి హింతాలః. హిగతౌ వృద్ధౌ చ. వృద్ధిఁ బొందునది; ప్రతిష్ఠ గలది. హింతాళము– గిఱకతాటి పేరు. ౧. ఖర్జయతి రక్తపిత్తమితి ఖర్జూరః. ఖర్జ వ్యథనే. రక్తపిత్తాదులను బోఁగొట్టునది. ఖర్జూరము పేరు. ౧. కిత్యతే జ్ఞాయతే గంధో ఽనేనేతి కేతకీ. సీ. కితజ్ఞానే. దీనిచేత పరిమళము తెలియఁ బడును. మొగలిచెట్టు పేరు. ౧. తలతి ప్రతిష్ఠతే తాళీ. సీ. తల ప్రతిష్ఠాయాం. ప్రతిష్ఠ గలది. శ్రీతాళము పేరు. ౧. ఖర్జయతి రోగం ఖర్జూరీ. సీ. ఖర్జ వ్యథనే. రోగమును బోఁగొట్టునది. చిట్టీఁదు పేరు. ఈఁతచెట్టు. ౧. ఈ చెప్పఁబడిన తాళ నాళికేర క్రముకములును, హింతాలంబును, ఖర్జూరము మొదలైన నాలుగును ఈ ౮ తృణవృక్షము లనంబడును.

## సింహాది వర్గము

ఇట్టు వనౌషధివర్గము నందు స్థావరములైన వృక్షాదులను జెప్పి, తరువాత వనమందుండు సింహాది మృగములఁ జెప్పుచున్నాఁడు______

**సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః,**

(కణ్ఠీరవో గజరిపుః పిఙ్గదృష్టి ర్మృగాధిపః)

హినస్తి హస్త్యాదికమితి సింహః. హిసి హింసాయాం. ఏనుఁగులు మొదలైన మృగముల హింసించునది. ౧. మృగాణా మింద్రః శ్రేష్ఠః మృగేన్ద్రః – మృగములలో శ్రేష్ఠమైనది. ౨. పంచ ఇతి పంచం. పచి విస్తారే. పంచం విస్తృమాస్యమస్యేతి పంచాస్యః–విస్తీర్ణమైన ముఖము గలది. ౩. హరిణీ కపిలవర్ణే అక్షిణీ అస్య. హర్యక్షః – కపిలవర్ణములైన కన్నులుగలది. ౪. కే శిరసి సరంతీతి కేసరాః సటాః, తా అస్యసంతీతి కేసరీ. న.పు. జూలుగలది. ౫. హరతి గజాదికం హరిః. పు. హృఞ్ హరణే. గజాదులను హరించునది. ౬. (కంఠే రవో యస్య సః కంఠీరవః – కంఠమందు ధ్వనిగలది. గజానాం రిపుః. పు ఏనుఁగులకు శత్రువు పింగే దృష్టీ యస్య సః పింగదృష్టిః పు. పచ్చనిచూపులు గలది మృగాణామధిపః మృగాధిపః –మృగములకు దొర. ఈ ౪ అధిక నామములు) సింహము పేళ్లు.

**శార్దూల ద్వీపినౌ వ్యాఘ్రే.**

శృణాతీతి శార్దూలః. శౄ హింసాయాం. హింసించునది. ౧. నివాసత్వేన ద్వీపమస్యేతి ద్వీపీ. న. పు. ద్వీప మునికిపట్టుగాఁ గలది. ద్వీప శ్చర్మాస్యా స్తీతి వా ద్వీపీ – ద్వీపమనఁగా చర్మము; అది గలది. ౨. వ్యాజిఘ్రతీతి వ్యాఘ్రః. ఘ్రా గంధోపాదానే. చంపునప్పుడు వాసనఁ జూచునది. ౩. (అధికపాఠము. పుండరీకః పఞ్చనఖశ్చిత్ర కాయ మృగద్విషౌ, పుండం మాంసం రీకతి హరతీతి పుండరీకః –మాంసమును హరించునది. పంచ నఖాః యస్య సః పంచనఖః – ఐదుగోళ్లు గలది. చిత్రః కాయః యస్య చిత్రకాయః – పొడలచేత నానావర్ణములగల శరీరము గలిగినది. మృగాణాం ద్విట్ మృగద్విట్. ష. పు. మృగములకు శత్రువు. ఈ ౪ పెద్దపులి పేళ్లు.

**తరక్షుస్తు మృగాదనః.** 1

తరఙ్ప్లవఙ్ క్షిణోతీతి తరక్షుః. పు. క్షిణు హింసాయాం. దుమికి చంపునది. మృగా నత్తీతి. ౧. మృగాదనః. అద భక్షణే. మృగముల భక్షించునది. ఈ ౨ సివంగి పేళ్లు.

**వరాహ స్సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః,** 2
**దంష్ట్రీ ఘోణీ స్తబ్ధరోమా క్రోడోభూదార ఇత్యపి.**

పరం శ్రేష్ఠం సస్యం ఆహంతీతి వరాహః. హన హింసాగత్యోః. శ్రేష్ఠమైన సస్యమును జెఱుచునది. ౧. బహూ న్యపత్యాని సూతే సూకరః. షూఙ్ ప్రాణిప్రసవే. అనేకములైన పిల్లల నీనునది. పా. శుచః కరః శూకరః – దుఃఖమును జేయునది. ౨. కులాదీఙ్ ఘర్షతీతి ఘృష్టిః. పు. ఘృష సంఘర్షణే ఉన్నత ప్రదేశాదుల నొరయునది. ౩. కోలతి సంహతాంగో భవతీతి కోలః. కుల సంస్త్యానే. ఘనమైన శరీరము గలది. ౪. దీర్ఘం పోత్రం ముఖాగ్రమస్యేతి పోత్రీ. న. పు. అధికమైన మోరగలది. ౫. క్షితిం కిరతీతి కిరిః. పు. కౄ విక్షేపే. ముఖముచేత భూమిని ద్రవ్వునది. పా. కిరః. 'వరాహశ్చకిరః కిరి' రితి యాదవః, ౬. కిటతి స్వైరం కిటిః. కిటగతౌ. ఇచ్చకొలఁదిఁ జరించునది. ౭. ప్రశస్తాః దంష్ట్రా అస్య సంతీతి దంష్ట్రీ. న. పు. వాఁడికోఱలు గలది. ౮. స్థూలా ఘోణాస్యాస్తీతి ఘోణీ. న. పు. పెద్ద మోర గలది. ౯. స్తబ్ధాని రోమాణ్యస్యాస్తీతి స్తబ్ధరోమా. న. పు. బిరుసయిన వెండ్రుకలు గలది. ౧౦. క్రోడ

తీతి క్రోడః క్రుడ ఘనత్వే – ఘనమైనది. ౧౧. భువం దారయతీతి భూదారః. దృావిదారణే. భూమిని వ్రక్కలించునది. ఈ ౧౨ అడవిపంది పేళ్లు.

**కపి ప్లవంగ ప్లవగ శాఖామృగ వలీముఖాః-**
**మర్కటో వానరః కీశో వనౌకాః**

కంపతే చలతీతి కపిః. పు. కపి చలనే చలించునది. ౧. ప్లవో లంఘనం తేన గచ్ఛతి ప్లవంగః. ప్లవగశ్చ. గమ్ ౢగతౌ. దాఁటునది. ౨, ౩. శాఖాచారీ మృగః శాఖామృగః – కొమ్మలయందుఁ జరించు మృగము. ౪. శ్లథం చర్మవలీ, సా ముఖే ఽ స్య వలీముఖః – తఱులు గల ముఖము గలది. లళయోద భేదః ౫. మర్కతి గచ్ఛతీతి మర్కటః – పోవునది. మ్రియతే శ్లిష్టశాఖాసంకటే మర్కటః – దాఁటునపుడు కొమ్మల సందునఁ జచ్చునది. ౬. నర ఇవ వానరః – నరునివలె నుండునది. ౭. కితి శబ్దేన ఈష్టే కీశః. ఈశ ఐశ్వర్యే. కి యను శబ్దముచే నధికమైనది. కోవాయుః తదపత్యం కిః హనుమాన్ స ఈశో ఽ స్య వా కీశః –వాయువునకు పుత్రుఁడు గనుక కి యనఁగా హనుమంతుఁడు. అతఁడు ఈశుఁ డుగాఁ గలది. ౮. వన మోకః స్థానం అస్య వనౌకాః. స. పు. వనము నివాసముగాఁ గలది. ఈ ౯ కోఁతి పేళ్లు.

**అథ భల్లుకే.** 3

**ఋక్షాచ్ఛభల్ల భాలూకాః-**

భల్లతి హినస్తి క్రిమీ నితి భల్లుకః. భల భల్ల పరిభాషణ హింసాదానేషు. పురుగులను జంపునది. పా. భల్లూకః. ౧. ఋష్యతే అనేన గహనమితి ఋక్షః. ఋష గతౌ. దీనిచేత వనము పొందఁబడును. ౨. అచ్ఛేన ఆభిముఖ్యేన భల్లతి అచ్ఛభల్లః–ఆభిముఖ్యముచేత హింసించునది. ఆత్మీయాన్ అఛ్యతి పరాన్ భల్లతి హీనస్తీతి వా అచ్ఛభల్లః. ఛో ఛేదనే. భల్లహింసాయాం. తన సంబంధమైనవారిని ఛేదింపక పరులను హింసించునది. అచ్ఛః భల్లః అని రెండు పేళ్లని కొందఱు. "ఆచ్ఛో నిర్మల భల్లూకా" విత్యజయః "భల్లౌ భాలూకబాణౌ స్త ఇతిమేదినీ. ౩. భలతీతి భాలూకః–హింసించునది. ఈ ౪ ఎలుఁగుగొడ్డు పేళ్లు.

**గణ్డకే ఖడ్గ ఖడ్గినౌ,**

ప్రశస్తో గండో ఽ స్యాస్తీతి గండకః – శ్రేష్ఠమైన గండ స్థలము

గలది. ౧. ఖండయతి తీక్ష్ణత్వాత్ ఖడ్గః శృంగం తద్యోగాత్ ఖడ్గః. ఖడ్గీ చ. న. పు. ఖండించునట్టి కొమ్ము గలది. ఈ 3 ఖడ్గమృగము పేళ్లు.

**లులాయో మహిషో వాహద్విష త్కాసర సైరిభాః.** 4

లోలనం లులస్తమ యతీతి లులాయః. అయ గతౌ. లులమనఁగా చలించుట దానిని బొందునది. లుల త్యప్సు లులాయః. లుల సంశ్లేషణే నీళ్లయందు మునుఁగునది. ౧. సత్వవత్త్వాత్ మహ్యత ఇతి మహిషః. మహ పూజాయాం. బలము గలదౌటవలన నాదిరింపఁబడునది. ౨. వాహస్య హయస్య ద్విషత్ శత్రుః వాహద్విషత్. త. పు. గుఱ్ఱమునకు శత్రువు. ౩. కం ఉదకం ఆసరతీతి కాసరః. సృగతౌ. ఉదకమును బొందునది. కా ఈష త్సరతి గచ్ఛతి మహాకాయత్వాద్వా కాసరః–గొప్పదైన శరీరముగలది గనుక మందముగ నడచునది. ౪. సీరిభిః హలయుక్తైః పశుభిః భాంతీతి సీరిభాః కర్షకాః తేషామయం సైరిభః–నాఁగేలుగలవి గనుక సీరు లనఁగాఁ బశువులు. వానిచేత ప్రకాశించువారు గనుక సీరిభులనఁగా కర్షకులు; వారి సంబంధమైనది. ఈ ౫ కారెనుపోతుపేళ్లు.

**స్త్రియాం శివా భూరిమాయు గోమాయు మృగధూర్తకాః,**
**సృగాల వఞ్చక క్రోష్టు ఫేరు ఫేరవ జమ్బుకాః.** 5

శకునేన మోదహేతుత్వాచ్ఛివా – శకునముచేత సంతోషపెట్టునది. ఈశబ్దము మొగ నక్కను జెప్పునపుడును స్త్రీలింగమే. ౧. భూరయో మాయా అస్యేతి భూరిమాయుః. ఉ. పు. పా. భూరిమాయః–అనేకమాయలుగలది. భూరి మాయుః పిత్తమస్యేతి భూరిమాయుః అధికమైన పిత్తముగలది. ౨. గాః మినోతి క్షిపతీతి గోమాయుః. డు మిఞ్ ప్రక్షేపణే. గోవులను బోఁదోలునది. ౩.మృగేషు దూర్తః మృగధూర్తక. మృగములయందు ధూర్తమైనది. ౪. అసృక్ ఆలతీతి సృగాలః. లా ఆదానే. మాంసమును దినునది. ౫. పా. శృగాలః. అని తాలవ్యాదియుఁ గలదు. ౬. వంచయతీతి వంచకః. వఞ్చ కౌటిల్యే. వంచించునది. ౭. క్రోశతి క్రోష్టుః. ఉ. పు. క్రోష్టా. ఋ క్రుశ ఆహ్వానే రోదనేచ. మొఱుఁగునది. ౮. ఫే ఇతి రౌతి ఫేరుః. ఉ. పు. రు. శబ్దే. ఫే యని కూయునది. ౯. ఫే ఇతి రవో ఽ స్య ఫేరవః–ఫే యను ధ్వని గలది.౧౦ జమతి

మాంసమత్తీతి జంబుకః. జము అదనే. మాంసమును భక్షించునది ఈ ౧౧ నక్కపేళ్లు.

**ఓతు ర్బిడాలో మార్జారో వృషదంశక ఆఖుభుక్.**

అవతి మూషకబాధాయాః ఓతుః. పు. అవరక్షణాదౌ. మూషక బాధవలన రక్షించునది. ౧. బిడతి మూషికాన్ బిడాలః. బిడ భేదనే. మూషికములను భేదించునది. ౨. ఆఖుగ్ర హణేన గృహం మార్టీతి మార్జారః. పా. మార్జాలః. మృజూ శుద్ధౌ. మూషక గ్రహణముచేత గృహమును శుద్ధిచేయునది. ౩. వృషాన్ మూషకాన్ దంశతీతి వృషదంశకః. దంశ దంశనే. మూషకమును గొఱుకునది. పా. పృషదంశకః. ౪. ఆఖూన్ భుఙ్క్తే ఆఖుభుక్. జ. పు. భుజ పాలనాభ్యవహారయోః. ఎలుకలను భక్షించునది. ఈ ౫ పిల్లి పేళ్లు.

**త్రయో గౌధేర గౌధార గౌధేయా గోధికాత్మజే.** 6

గోధాయా అపత్యం గౌధేరః, గౌధారః, గౌధేయశ్చ–గోధయనఁగా ఉడుము; దానిపిల్ల గనుక గౌధేరము, గౌధారము, గౌధేయము. ఈ 3 ఉడుముపిల్ల పేళ్లు.

**శ్వావిత్తు శల్యః-**

శ్వానం విధ్యతీతి శ్వావిత్. ధ. పు. వ్యధ తాడనే. శునకమును వ్యధపెట్టునది. ౧. శలతీతి శల్యః. శలచలనే. తిరుగునది. ఈ ౨ ఏదుపంది పేళ్లు.

**తల్లోమ్ని శలలీ శలలం శలమ్,**

శలతీతి శలలీ, శలలం, శలం చ. శల గతౌ. వేగముగాఁ బోవునది గనుక శలలి, శలలము, శలము. ఈ 3 ఏదుపంది ముండ్లపేళ్లు.

**వాతప్రమీ ర్వాతమృగః-**

వాతం ప్రమిమీతే అభిముఖ్యేన ప్రతిపద్యతే వాతప్రమీః. ఈ పు. మాఙ్ మానే వర్తనేచ. వాయువున కభిముఖముగాఁ బోవునది. అయం స్త్రీలింగే ఉ పి. లక్ష్మీశబ్దవద్రూపం. ౧. వాతం మృగయతీతి వాత మృగః. మృగ అన్వేషణే. వాయువును వెదకునది. ఈ ౨ గాలి కెదురుగా నడచు మృగముపేళ్లు.

**కోక స్త్వీహా మృగో వృకః.** 7

కోకతే వృకతేచ మాంసాదికం కోకః, వృకశ్చ. కుక వృకఆదానే.

మాంసాదులను బుచ్చుకొనునది కోకము, వృకము. ౧, ౨. మృగానీహతే ఈహామృగః. ఈహ చేష్టాయాం. మృగముల నిచ్ఛయించునది. ఈ 3 తోఁడేలు పేళ్లు.

**మృగే కురఙ్గ వాతాయు మరిణాజినయోనయః,**

మృగ్యతే లుబ్ధకైరితి మృగః, మృగ అన్వేషణే. వేఁటకాండ్రచే వెదకఁబడునది. ౧. కౌరఙ్గతీతి కురంగః. రగి గతౌ. భూమియందుఁ జరించునది. ౨. వాతం అయతే వాతాయుః. ఉ. పు. అయ గతౌ. వాయువును బొందునది. ౩. హ్రియతే హరిణః. హృఞ్ హరణే. హరింపఁబడునది. ౪. అజిసస్య చర్మణః యోనిః కారణం అజినయోనిః. పు. చర్మమునకుఁ గారణమైనది. పా. జినో బుద్ధః రురూపః యోనిరుత్పత్తి స్థాన మేషామితి జినయోనయ ఇతి కశ్చిత్. ఇట్టి రూపముగల బుద్ధదేవుఁడు ఉత్పత్తిస్థానముగా గలది. ఈ ౫ ఇట్టి పేళ్లు.

**ఐణేయ మేణ్యా శ్చర్మాద్య మేణ స్యైణ ముభే త్రిషు.** 8

ఏణ్యా ఇదం ఐణేయం – ఆఁడులేడి సంబంధమైనది ఐణేయము. ఏణస్య ఇదం ఐణం – మొగదుప్పి సంబంధమైనది ఐణము. ఐణేయ ఐణశబ్దములు మూఁడులింగములయందును వర్తించును. ఆఁడు లేడియొక్కయు మొగదుప్పి యొక్కయు తోలు మాంసము మొదలయినవాని పేళ్లు.

**కదళీ కన్దళీ చీన శ్చమూరు ప్రియకావపి,** 9

**సమూరు శ్చేతి హరిణా అమీ అజినయోనయః.**

కేన వాయునా దళ్యతే కదళీ. ఈ. సీ. పా. న. పు. దళవిశరణే. వాయువుచేఁ గొట్టఁ బడునది. బొల్లి చాయ మెడచారలు గలిగి, బలముతో నుండు మృగము. ౧. కన్దాని కన్దతీతి కన్దళీ. ఈ. సీ. పా. న. పు. కందమూలాదులయందుఁ గూడి యుండునది. దొడ్డకడుపును నల్లని ముందరి కాళ్లును గల మృగము. ౧. చీయతే వ్యాధైః చీనః. చిఞ్ చయనే. బోయలచేఁ బొడవఁబడునది. గువ్వవన్నె గలిగి 30 అంగుళముల పొడవు గల మృగము. ౧. చమ్యతే చమూరుః, ఉ. పు. చము అదనే. భక్షింపఁబడునది. సంశయాస్పదమైన తోఁక గలిగి, తెలుపుగాని నలుపుగాని నానావర్ణములుగాని కలిగిన మృగము. ౧. ప్రియతివాతం ప్రియకః. ప్రియ గతౌ. వాతము నొందునది. దట్టమై ఎఱ్ఱనైన నల్లని రోమ

ములు గల మృగము. ౧. సంగతౌ ఊరూ అస్యేతి సమూరు. ఉ. పు. పరస్పరము కూడుకొనియుండు తొడలు గలది. తెల్లని కొనవెండ్రుకల తోఁగూడి దొడ్డమెడ గలిగి మెఱుఁగుగలిగి నిడుపులయిన వెండ్రుకలు గలిగి గోధూమవర్ణముగాని కృష్ణవర్ణముగాని కలిగిన మృగము. ౧. ఈ ౯ ఆస్తరణాదుల కుపయోగించు చర్మమునకు కారణములైన యిఱ్ఱిజాతి విశేషముల పేళ్లు.

**కృష్ణసార రురు న్యఙ్కు శమ్బర రౌహిషాః,**

**గోకర్ణ పృష త్తై ణర్శ్య రోహితా శ్చమరో మృగాః** 10

కృష్ణేన నీలవర్ణేన సారః కృష్ణసారః–నల్లనివన్నె చేత శ్రేష్ఠమైనది. కృష్ణశారమని కొందఱు. ౧. నల్లకప్పున విచిత్రమైన యిఱ్ఱి. రౌతి ప్రాయేణ రురుః. ఉ. పు. రు శబ్దే. తఱుచుఁగా గూఁతలు పెట్టునది. నల్లచారల దుప్పి. ౧. న్యఞ్చత్యధోముఖతయా న్యఙ్కుః. ఉ. పు. అఞ్చు గతిపూజనయోః తలవంచుకొని పోవునది. జింకపోతు. ౧. రఞ్జయతిరఙ్కుః. ఉ. పు. రఞ్జ రాగే. రాగమును బొందించునది. మృదువైన తెల్లరోమములుగల యిఱ్ఱి. ౧. శం సుఖం వృణోతీతి శంబరః. వృఞ్ వరణే. సుఖమును గప్పునది. వబయోరభేదః. సకారాదియుఁ గలదు. ఎఱ్ఱని వన్నె గల సన్నపుజింక. ౧. రోహతీతి రౌహిషః తృణవిశేషః. సః భక్ష్యమనేతి రౌషిషః. పా. రోహిషః – మొలచునది గనుక రౌహిషమనఁగాఁ దృణవిశేషము. దానిని భక్షించునది రౌహిషము. దోహిషమని దకారాదిగాఁ గొందఱు. కొండగొఱ్ఱె. ౧. గో రివ కర్ణా వస్యేతి గోకర్ణః – ఆవుచెవులవంటి చెవులు గలది. కణితి యను మృగము. ౧. పృషతాః బిన్దవో ఽ స్యేతి పృషతః – చుక్కలు గలిగినది. దుప్పి. ౧. ఏతీత్యేణః . ఇణ్ గతౌ. పోవునది. పొడలతో నల్లనై పెద్దకండ్లుగల యిఱ్ఱి. ౧. ఇయర్తి వనం ఋశ్యః. ఋ గతౌ. వనమును బొందునది. మనుఁబోతు. పా. ఋష్యః ౧. రక్తవర్ణత్వేన రోహితః. ఎఱ్ఱని వన్నెగలది, కేసరి యను మృగము. ౧. చమతి తృణం చమరః. చము అదనే. తృణమును భక్షించునది. చమరీమృగము. ఈ ౧, ౨. తమతమపేళ్లచేఁ బ్రసిద్ధములగు మృగముల పేళ్లు.

**గన్ధర్వ శ్శరభో రామ స్సృమరో గవయ శ్శశః,**

గన్ధయతి అర్ధయతీతి గన్ధర్వః. గన్ధ అర్దనే. పీడించునది. వట్రువ తోఁకయు దొడ్డకడుపునుగల మృగము. ౧. శృణాతి సింహం శరభః. శౄ హింసాయాం. సింహమును జంపునది. ఎనిమిదికాళ్లు గలిగి సింహమును జంపెడు మృగము. తథాచోక్తం మహాభారతే___ "అష్టపాదూర్ధ్వనయనః శరభో వనగోచర" ఇతి. ౧. వ్యాధాః అస్మిన్ దృష్టే రమంతే రామః. రము క్రీడాయాం. బోయలు దీనిఁ జూచి సంతోషింతురు. పెద్దదుప్పి. ౧. వనే సర్వత్ర సరతీతి సృమరః. సృగతౌ. వనము నందంతటఁ దిరుగునది. పెద్దసవరపు మృగము. ౧. గా మయతే సదృశత్వాత్ గవయః. అయ గతౌ. గోవును బోలునది. గురుపోతు. ౧. శశతి ప్లుతేన గచ్ఛతీతి శశః. శశ ప్లుతగతౌ. దాఁటుచుఁ బోవునది. కుందేలు పేరు.

**ఇత్యాదయో మృగేన్ద్రాద్యా గవాద్యాః పశుజాతయః.** 11

ఇత్యాదయః = గంధర్వ శబ్దము మొదలుకొని యీ ఒను, మృగేంద్రాద్యాః = సింహశబ్దము మొదలు చమర శబ్దమువఱకును, గవాద్యాః = వైశ్యవర్గయందు చెప్పఁబడు గోవులు మొదలైనవియు, పశుజాతయః = పశువులని చెప్పఁబడును. పశ్యంతే పాశైః పశవః పశ బంధనే. కట్టఁబడునవి.

**ఉన్దురు ర్మూషికో ఒ ప్యాఖుః -**

ఉదయతి ముఖస్పృష్టం వస్త్విత్యుందురుః. ఉ. పు. ఉందీ క్లేదనే. తన ముఖముచేత ముట్టఁబడిన వస్తువును ద్రవింపఁజేయునది. అకారాంతమును గలదు. ౧. ముష్ణాత్యన్నాదికం మూషికః. పా. మూషకః. ముష స్తేయే. అన్నము మొదలైనవానిని దొంగిలించునది. ౨. ఆ సమంతాత్ ఖనతీ త్యాఖుః ఉ. పు. ఖను అవదారణే. అంతట త్రవ్వునది. ఈ 3 ఎలుక పేళ్లు.

**గిరికా బాలమూషికా,**

గిరతి ధాన్యాదికం గిరికా, గౄ నిగరణే. ధాన్యాదులను మ్రింగునది. ౧. బాలా చ సా మూషికాచ బాలమూషికా – చిన్న యెలుక. ఈ ౨. చిట్టెలుక పేళ్లు.

**చుచున్దరీ గన్ధమూషీ -**

ఛ్యతీతి చుచుందరీ. సీ. ఛో చ్ఛేదనే. ధాన్యములను ఛేదించునది. ౧. గంధవతీ మూషీ గంధమూషీ – వాసన గల యెలుక. ఈ ౨ చుంచుపేళ్లు.

**దీర్ఘదేహీ తు మూషికా**

దీర్ఘో దేహో ఽస్యా ఇతి దీర్ఘ దేహీ. సీ. నిడుపైన శరీరము గలది. ౧. ముష్ణాతి ధాన్యాదికం మూషికా. ధాన్యాదులను ముచ్చిలించునది. ఈ ౨ చుచుందరి అనెడు అర్ధపాదము ప్రక్షిప్తమని కొందఱు. పందికొక్కుపేళ్లు.

**సరటః కృకలాస స్స్యాత్ -**

సరతీతి సరటః సృ గతౌ. చరించునది. ౧. కృకేన గళేన లసతీతి కృకలాసః. లస శ్లేషణ క్రీడనయోః. కంఠముతో నాడునది. ఈ ౨ తొండ పేళ్లు.

**ముసలీ గృహగోధికా** 12

ముస్యతి క్రిమీనితి ముసలీ. సీ. ముస ఖండనే. పురుగులను ఖండించునది. పా. ముషలీ. ౧. గృహే గోధికేవ తిష్ఠతీతి గృహగోధి కా. గృహమందు ఉడుమువలె నుండునది. ఈ ౨ బల్లిపేళ్లు.

**లూతా స్త్రీ తన్తువాయోర్ణనాభ మర్కటకా స్సమాః,**

లూయతే లూతా. లూఞ్ ఛేదనే. ఛేదింపఁబడునది. ౧. తంతూన్వయతి తంతువాయః. వేఞ్ తంతుసంతానే. నూలును నేయునది. ౨. ఊర్ణ నాభావస్య ఊర్ణనాభః–ఊర్ణమనఁగా నూలు; అది నాభియందుఁ గలది. ౩. తంతుమవలంబ్య మర్కటవ దారోహణా న్మర్కటః – నూలు పట్టుకొని మర్కటమువలె నెక్కునది. ఈ ౪ సాలెపురుగు పేళ్లు.

**నీలఙ్గుస్తు క్రిమిః-**

నీలతిమందం నీలంగుః. పు. నీల వర్ణగత్యోః మెల్లఁగాఁ బోవునది. ౧. మందం క్రామతి క్రిమిః. పు. క్రము పాదవిక్షేపే. మెల్లఁగా నడచునది. ఈ ౨ సామాన్యముగా పురుగుపేళ్లు. మ్రానిమీఁద గల పురుగులని కొందఱు.

**కర్ణజలౌకా శతపద్యుభే.** 13

కర్ణప్రవేశయోగ్యత్వాత్ దీర్ఘత్వేన జలూకాసదృ శత్వాచ్చ

కర్ణజలూకా. చెవిని జొచ్చుటకు తగిన శరీరము గలిగి జెలగవలె నుండునది. ౧. శతం పాదా అస్యేతి శతపదీ. సీ. నూఱు కాళ్లు గలది. ఈ ౨ జెఱ్ఱి పేళ్లు. చెవిదూఱు పామును, రోఁకటిబండయునని కొందఱు.

**వృశ్చిక శ్శూక కీట స్స్యాత్**

వ్రశ్చతి శూకాగ్రేణ వృశ్చికః – మొనచేత కుట్టునది. ౧. శూకయుక్తః కీటః శూకకీటః. ముల్లుగల పురుగు. ఈ ౨ నల్లతేలు పేళ్లు. కణుఁదురని కొందఱు.

**అళి ద్రోణౌ తు వృశ్చికే,**

అలయోగాత్ అళీ. న. పు. అలమనఁగా దోఁక. అది గలది. పా. ఆళీ. న. పు. ఆళిః, "అలం వృశ్చికలాంగూల ద్రోణ ఆలీ తు వృశ్చిక" ఇతి హలాయుధః. "భృంగవృశ్చికయోరళి" రితి రభసశ్చ. ౧. ద్రుణతీతి ద్రోణః. ద్రుణ హింసాగతి కౌటిల్యేషు. హింసించునది. ద్రూణమని కొందఱు. ౨. వృశ్చిక శబ్దమునకు పూర్వమువలె వ్యుత్పత్తి. ఈ 3 ఎఱ్ఱతేలు పేళ్లు. సామాన్యముగా తేలు పేళ్లని కొందఱు.

**పారావతః కలరవః కపోతః-**

పారేణ బలేన అవతీతి పారావతః. అవ రక్షణాదౌ. పారమనఁగా బలము. దానిచేతఁ బోవునది. ౧. కలః రవః అస్యేతి కలరవః – అవ్యక్త మధురమైన ధ్వని గలది. ౨.శీఘ్రగామిత్వేన కస్య వాయోః పోత ఇవ కపోతః – వేగముచేత వాయువుకొదమవలె నుండునది. ఈ 3 పావురము పేళ్లు. గువ్వ పేళ్లని కొందఱు కపోతశబ్దము మాత్రమే గువ్వపేరని కొందఱు.

**అథ శశాదనః.** 14

పత్త్రీ శ్యేనః–

శశం అత్తీతి శశాదనః. అదభక్షణే. కుందేటిని భక్షించునది. ౧. ప్రశస్తం పత్త్రం పక్షో ఽ స్యాస్తీతి పత్త్రీ. న. పు. మంచిఱెక్కలు గలది. ౨. శ్యాయతే శ్యేనః. శ్యైజ్ గతౌ. తీవ్రముగాఁ బోవునది. ఈ 3 డేగపేళ్లు.

**ఉలూకేతు వాయసారాతిపేచకౌ,**

(దివాన్ధః కౌశికో ఘూకో దివాభీతో నిశాటనః)

ఉలతి నేత్ర జ్యోతిషా కాకా౯ దహతీ త్యులూకః ఉల దాహే. నేత్ర తేజస్సుచేత కాకులను దహించునది. ౧. వాయసానామరాతిః వాయసారాతిః. పు. కాకులకు శత్రువు. ౨. పచతి కాకా౯ పేచకః. డుపచ్ష్ పాకే. కాకులను హింసించునది. 3. (దివా అంధః దివాంధః. పగలు గ్రుడ్డిగా నుండునది. కౌ భూమౌ శేరతే ఇతి కుశాః వృక్షాః, తేషు చరతీతి కౌశికః – వృక్షములయందు చరించునది. ఘూ ఇతి రవం కరోతీతి ఘూకః. ఘూ యని కూయునది. దివా భీతః దివాభీతః – పగలు భయపడునది. నిశాయామటతీతి నిశాటనః. అటగతౌ. రాత్రి యందుఁ దిరుగునది) ఈ 3 గూబపేళ్లు.

**వ్యాఘ్రాటస్తు భరద్వాజః-**

వ్యాఘ్రవ దటతీతి వ్యాఘ్రాటః. అట గతౌ. పులివలె తిరుగునది. వ్యాజిఘ్రన్నటతీతి వ్యాఘ్రాటః. ఘ్రాగంధోపాదానే. ఆఘ్రాణించుచుఁ బోవునది. ౧. భరద్వాజేన సృష్టః భరద్వాజః. భరద్వాజులచేత సృజింపఁబడినది. ఈ ౨ భరద్వాజము. ఏట్రింత.

**ఖఞ్జరీటస్తు ఖఞ్జనః** 15

ఖం ఆకాశం అఞ్జసా ఏటతి ఖఞ్జరీటః. ఇట కిట గతౌ. ఆకాశమును శీఘ్రముగాఁ బొందునది. ౧. ఖఞ్జతీతి ఖఞ్జనః; భాద్రపదమాసాది షట్కే అదృశ్యగతిత్వాత్. ఖజి గతివైక్లబ్యే. భాద్రపదమాసము మొద లాఱునెలలు కనిపించక తిరుగునది. ఈ ౨ మందపిచ్చిక పేళ్లు. రువ్వపులుఁగు కొఁజు. కాటుకపిట్ట యనియు గొందఱు.

**లోహపృష్ఠస్తు కఙ్కః స్స్యాత్-**

దృఢత్వాల్లోహమివ పృష్ఠో ఉస్యేతి వా లోహపృష్ఠః–గట్టిపిఱుఁదులు గలది. లోహవర్ణపృష్ఠో ఉస్యేతి వా లోహపృష్ఠః– ఎఱ్ఱనివన్నె గల పృష్ఠముగలది. ౧. కఙ్కతే కఙ్కః కకి గతౌ పోవునది. ఈ ౨ రాఁబులుఁగు పేళ్లు మల్లెజేగుఱు.

**అథ చాషః కికీదివిః,**

చషతీతి చాషః. చష భక్షణే. భక్షింపఁబడునది. ౧. కికీతి దీవ్యతి భాషతే కికీదివిః. దివు క్రీ డాదౌ. కికి యని కూయునది. ౨. పా. కీతి కాయతీతి కికీ. న. పు. కై శబ్దే. కీయని పలుకునది. ౩. దీవ్యతీతి

దివిః. పు. క్రీడించునది. ఈ 3 పాలపక్షిపేళ్లు.

**కళిఙ్గ భృఙ్గ ధూమ్యాటాః-**

కే శిరసి లింగం రేఖా రూపమస్యేతి కళింగః – శిరస్సునందు చుంచు అనెడు చిహ్నము గలది. ౧. భృఙ్గవర్ణసామ్యాత్ భృఙ్గః– తుమ్మెదలవలె నల్లనైనది. పు. వర్ణతః దూమ్యే వాటతి ధూమ్యాటః అటపటగతౌ. ధూమసమూహమువలె నల్లనై యుండునది. ఈ ౨ కూఁకటి మూఁగ యనుపక్షి పేళ్లు.

**అథ స్యా చ్ఛతపత్రకః.** 16

**దార్వాఘాటః -**

బహుపక్షత్వాత్ శతపత్రకః–అనేకములైన ఱెక్కలుగలది. ౧. దార్వాహంతి దార్వాఘాటః. హన హింసాగత్యోః. కొయ్యను దొలఁచునది. ఈ ౨ మానుగోయిల పులుఁగు పేళ్లు. బెగ్గురుపులుఁగు.

**అథ సారఙ్గః స్తోకక శ్చాతక స్సమాః,**

సంహత్య అరం గచ్ఛతీతి సారంగః – తన జాతిపక్షులతోఁగూడి త్వరగాఁ బోవునది. పా. శారంగః ౧. స్తోకం అల్పం కాయతీతి స్తోకకః. కై శబ్దే. మెల్లగాఁ గూయునది. స్తోక మల్పం కం శిరో ఽ స్యేతివా స్తోకకః. అల్పమైన శిరస్సు గలది. ౨. వర్షోదకం చతతీతి చాతకః. చతే యాచనే. వర్షోదకమును యాచించునది. ఈ 3 వానకోయిలపేళ్లు (చాతకము).

**కృకవాకు స్తామ్రచూడః కుక్కుట శ్చరణాయుధః.** 17

కృకేన శిరోగ్రేణవక్తీతి కృకవాకుః. ఉ పు. వచ పరిభాషణే. తలయెత్తి కూయునది. ౧. తామ్రవర్ణా చూడాస్యేతి తామ్రచూడః– తామ్రవర్ణమైన చుంచుగలది. ౨. కుకు ఇతి శబ్ద ముచ్చారయన్ కుటతీతి కుక్కుటః. కుట కౌటిల్యే. కుకు అను శబ్దమును బలుకుచు వక్రముగాఁ బోవునది. ౩. చరణా వే వాయుధం యస్య సః చరణాయుధః–కాళ్లే ఆయుధముగాఁ గలది. ఈ ౪ కోడి పేళ్లు.

**చటకః కలవిఙ్కస్స్యాత్ -**

చటతి ధాన్యాదికమితి చటకః. చట భేదనే. ధాన్యాదులను బొడిచి తినునది. ౧. సుఖం యథా భవతితథా లపతి కలవింకః. లప వ్యక్తాయాంవాచి. సుఖముగాఁ బలుకునది. ఈ ౨ పిచ్చుక పేళ్లు.

**తస్య స్త్రీ చటకా-**

చటకస్య స్త్రీ చటకా. ఈ ౧ ఆఁడుపిచ్చుక పేరు.

**తయోః**

**పుమపత్యే చాటకైరః స్త్ర్యపత్యే చటకైవహి.** 18

చటకయోః అపత్యంపుమాన్ చాటకైరః - పిచ్చుకలయొక్క మొగపిల్ల. ౧. చటకయోః అపత్యం స్త్రీ చటకా - పిచ్చుకలయొక్క ఆఁడుపిల్ల. ఈ ౨ ఆ యాఁడు మగపిచ్చుక పేళ్లు. మగపిల్ల చాటకైరము. ఆఁడుపిల్ల చటక.

**కర్కరేటుః కరేటు స్స్యాత్ -**

కర్కః సితాశ్వఇవ రేటతీతి కర్కరేటుః. ఉ. ప్స. రేట్ఱ పరిభాషణే. తెల్లగుఱ్ఱమువలె శబ్దించునది. కర్క ఇతి రేటతి కర్కరేటుః- కర్కయని పలుకునది. ౧. కే వృక్షాదీనాంశిరసి రేటతీతి కరేటుః. ఉ. ప్స. వృక్షాదులకొనయందుఁ బలుకునది. ఈ ౨ పెద్దకొక్కెర పేళ్లు.

**కృకణ క్రకరౌ సమౌ,**

కృ ఇతి క్వణతి శబ్దాయతే కృకణః. క్వణ శబ్దే. కృ అనుధ్వనిఁ జేయునది. కృకం శిరోగ్రం పార్శ్వ కండూయనాయ నయతీతి కృకణః. ణీఞ్ ప్రాపణే. శిరోగ్రమును పార్శ్వ కండూయనము కొఱకు పొందించునది. ౧. క్ర ఇతి శబ్దం కరోతీతి క్రకరః. డుకృఞ్ కరణే. క్ర యనెడు శబ్దమును జేయునది. ఈ ౨ కొక్కెర పేళ్లు.

**వనప్రియః పరభృతః కోకిలః పిక ఇత్యపి.** 19

వనం ప్రియమస్య వనప్రియః-వనమే ప్రియముగాఁగలది. ౧. పరైః కాకైః భృతః పరభృతః. భృఞ్భరణే. పరుల (కాకుల) చేతఁ బెంచఁబడునది. ౨. కోకతో శ్రోతృచిత్తం గృహ్ణాతీతి కోకిలః. కుక వృక ఆదానే. తన పలుకులు వినువారి మనస్సుల నాకర్షించునది. ౩. అపికాయతీతి పికః. కైగైశబ్దే. చాటుననుండి కూయునది. అపిరంతర్ధౌ. ఈ ౪ కోయిల పేళ్లు.

**కాకేతు కర టారిష్ట బలిపుష్ట సకృత్ప్రజాః,**

**ధ్వాఙ్క్షాత్మ ఘోష పరభృ ద్బలిభు గ్వాయసా అపి.** 20

(చిరజీవీ చైకదృష్టి ర్మౌకలిః పికవర్ధనః)

కా ఇతికాయతికాకః. కైశబ్దే. కాయని యఱచునది. ౧. క ఇతి రటతీతి కరటః. రట పరిభూషణే. క యని పలుకునది. ౨. న. రిష్యతేరోగైరి

త్యరిష్టః. రిషహింసాయాం. రోగములచే హింసింపఁబడనిది. రిష్టం మరణ లక్షణం తదస్యనా స్తీతి అరిష్టః. (త్వరగా) మరణములేనిది. ౩. బలినా పుష్టః బలిపుష్టః. పుష పుష్టౌ. బలిచేఁ బోషింపబడునది. ౪. సకృత్ప్రజా అస్యేతి సకృత్ప్రజః–ఒక్కసారి పిల్లఁగనునది. ౫. ధ్వాంక్షతి కాంక్షతి ఆమిషమితి ధ్వాంక్షః. ధ్వాక్షి కాంక్షాయాం. మాంసమును గాంక్షించునది. ౬. ఆత్మానమేవ ఘోషతికాకేతి ఆత్మఘోషః – కా కా అని తన పేరును బలుకునది. ౭. పరంకోకిలం బిభర్తీతి పరభృత్. త.పు. భృఞ్ భరణే. కోయిల పిల్లను పోషించునది. ౮. బలింభుఙ్క్తే బలిభుక్. జ. పు. బుజ పాలనా భ్యవహారయోః. బలిని భుజించునది. ౯. వయఏవ వాయసః – పక్షి గనుక వాయసము ౧౦. (చిరంజీవతీతి చిరజీవీ. న. పు. జీవ ప్రాణధారణే. చాలకాలము బ్రతుకునది. ఏకైవ దృష్టి రస్య ఏకదృష్టిః. ఇ. పు. ఒక్కచూపుగలది. మూకలస్య యమస్యాయం మౌకళిః – మూకలుఁడనఁగా యముఁడు; అతని సంబంధమైనది. “మూకలః ప్రేతభర్తా స్యాన్మూకులః కాననే చర” ఇతి శబ్దార్ణవే. పికం వర్ధయతి పికవర్ధనః. వృధు వృద్ధౌ. కోవెలలను వృద్ధిపొందించునది) కాకి పేళ్లు.

**ద్రోణకాకస్తు కాకోలో -**

ద్రుణాతీతి ద్రోణః, ద్రోణశ్చాసౌ కాకశ్చ ద్రోణకాకః. ద్రూ హింసాయాం. హింసించెడు కాకి. ౧. కాకేషు కోలతి స్థూలో భవతీతి కాకోలః. కుల సంస్త్యానే. కాకులలో గొప్పది. ఈ ౨ మాలకాకి పేళ్లు.

**దాత్యూహః కాలకణ్ఠకః,**

దాన్తిం ప్లవనం ఊహతే దాత్యూహః. ఊహ వితర్కే. దాంతి యనఁగా తేలుట, దాని నభ్యసించునది.౧. కాలవర్ణః కణ్ఠో ఽ స్యేతి కాలకణ్ఠః– నల్లని మెడగలది. కల ఏవ కాలః అవ్యక్తధ్వనిః; స కణ్ఠే ఽ స్యేతి వా కాలకణ్ఠకః – అవ్యక్త మధురమైన ధ్వని కంఠమందుఁ గలది. పా. కాలవర్ణః కంటకోరోమోద్గమో ఽ స్యేతి కాలకంటకోవా – నల్లని రోమరాజిగలది. ఈ ౨ కూఁకురుగుడ్డంగి పిట్టపేళ్లు. భరత పక్షి.

**ఆతాపి చిల్లౌ -**

ఆతాపయతి పరజాతి మిత్యాతాపీ. న. పు. తప సంతాపే. ఇతర జాతిని తపింపఁజేయునది. పా. ఆతాయీ. న. పు. ౧. చిల్లయతి

శిథిలీకరోతి పరానితి చిల్లః. చిల్ల శైథిల్యే. ఇతర పక్షులను శిథిలముగాఁ జేయునది. ఈ ౨ పిన్న గ్రద్ద పేళ్లు. జెముదు కాకి. చీరపిట్టయు.

**దాక్షాయ్య గృధ్రౌ-**

దక్షతే శీఘ్రం గచ్ఛతి దాక్షాయ్యః. దక్షవృద్ధౌ శీఘ్రార్థే చ. శీఘ్రముగాఁ బోవునది. ౧. గధ్నోతి మాంసమితి గృధ్రః. గృధు అభికాంక్షాయాం. మాంసమును గాంక్షించునది. ఈ ౨ గ్రద్ధ పేళ్లు. బోరువ.

**కీరశుకౌ సమౌ.** 21

కీతి శబ్దం రాతి కీరః. రా ఆదానే. కీ యను శబ్దమును గ్రహించునది. ౧. వుకతీతి శుకః. శుక గతః. చరించునది. ఈ ౨ చిలుక పేళ్లు.

**క్రుఙ్ క్రౌఞ్చః-**

క్రుఞ్చతి పఙ్క్తి రూపేణ గచ్ఛతీతి క్రుఙ్. చ. పు. క్రౌంచశ్చ. క్రుఞ్చ గతికౌటిల్యాల్పీ భావయోః. పంక్తిరూపముగాఁ బోవునది. లేక కుటిలమైయుండునది. ఈ ౨ కొంగ పేళ్లు.

**అథ బకః కహ్వః-**

వక్తీతి బకః. వచ పరిభాషణే. వబయోర భేదః. పలుకునది. బకతి కుటిలో భవతీతి వా బకః. బక కౌటిల్యే. కుటిలమై యుండునది. ౧. కే జలే హ్వాయతే కహ్వః. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ. జలమందుఁ బలుకునది. ఈ ౨ వక్కుపులుగు పేళ్లు. వక్కుకొంగ.

**పుష్కరాహ్వాస్తు సారసః,**

పుష్కరస్య ఆహ్వా అస్యేతి పుష్కరాహ్వః – తామరలయొక్క పర్యాయపదములు పేళ్లుగాఁ గలిగినది. ౧. సరసి భవ స్సారసః – సరస్సు నందుఁ బుట్టినది. ఈ ౨ బెగ్గురు పేళ్లు.

**కోక శ్చక్ర శ్చక్రవాకో రథాఙ్గా హ్వాయ నామకః.** 22

తపతే ప్రియా వియోగాత్ రాత్రావితి కోకః. కుజ్ శబ్దే. ప్రియా వియోగము చేత రాత్రియందు మొఱపెట్టుచుండునది. ౧. చకతే తర్పయతి ప్రియామితి చక్రః. చకతృప్తౌ. ప్రియురాలిని బ్రీతినొందించునది. ౨. చక్రేణ చక్రశబ్దేన ఉచ్యత ఇతి చక్రవాకః – చక్ర శబ్దముచేతఁ జెప్పఁబడునది. ౩. రథాంగం చక్రం. తస్యాహ్వాయో నామాస్యేతి

రథాంగాహ్వయ నామకః - రథాంగము చక్రము దాని పేళ్లు గలది. ౪ జక్కవపిట్ట పేళ్లు.

**కాదమ్బః కలహంస స్స్యాత్ -**

కదంబస్య స్వసంఘస్య సహచారిత్వాత్ కాదంబః - కదంబమనఁగా తన సమూహము; ఆ సంఘముతోఁ గూడియుండునది. ౧. కలో మధురాస్ఫుటధ్వని, తద్వాన్ హంసః కలహంసః - అవ్యక్తమధురధ్వనిగల హంస. ఈ ౨ ధూమ్రవర్ణములైన ముక్కు కాళ్లు ఱెక్కలు గలిగిన హంస పేళ్లు.

**ఉత్క్రోశ కురరౌ సమౌ,**

ఉచ్చైః క్రోశతి ఉత్క్రోశః. క్రుశ ఆహ్వానే రోదనేచ. గట్టిగా నఱచునది. ౧. కురతీతి కురరః. కురశబ్దే. మ్రోయునది. ఈ ౨ పెన్నడ పులుఁగు పేళ్లు.

**హంసాస్తు శ్వేతగరుత శ్చక్రాఙ్గా మానసౌకసః.** 23

హంతి గచ్ఛతీతి హంసః. హన హింసాగత్యోః. చరించునది. ౧. శ్వేతీః గరుతః పక్షా అస్యేతి శ్వేతగరుత్. త. పు. తెల్లని ఱెక్కలు గలది. ౨. చక్రవత్ వృత్తమంగ మస్యేతి చక్రాంగః - చక్రము వలె వట్రువయైన అంగముగలది. ౩. మానససరః ఓకః స్థానమస్య మాన సౌకాః. స. పు. మానససరస్సు స్థానముగాఁ గలది. ౩. సామాన్యముగా హంసల పేళ్లు.

**రాజహంసాస్తుతే చఞ్చుచరణై రోహితై స్సితాః,**

యేలోహితై శ్చంచుచరణై ర్లక్షితా స్సితాశ్చ శరీరేణ తే రాజహంసా ఇత్యుచ్యంతే - ఎఱ్ఱనైన ముక్కు కాళ్లతోఁ గూడి తెల్లనై యుండు హంసలు రాజహంస లనంబడును. హంసేషు శ్రేష్ఠత్వా ద్రాజహంసః - హంసలలో శ్రేష్ఠమైనది.

**మలినైర్మల్లికాఖ్యాస్తే -**

మలినైః కించిద్ధూమ్రైః చంచుచరణై రుపలక్షితాస్తే హంసామల్లికా ఇత్యుచ్యంతే -మాసినముక్కు కాళ్లతోఁ గూడి తెల్లనై యుండెడు హంసలు మల్లికము లనంబడును. మలతే మల్లికః మల మల్లధారణే. మంచిశరీరము ధరించినది. పా. మల్లికాక్షః. "మల్లికో

హంసభేదే నా తృణశూన్యే తు మల్లికే" తి అర్ధనారీశ్వరః. భూషితే పరితో యస్య లోచనే కృష్ణరాజిభిః, కృష్ణం చ తారకామాత్రం మల్లికాక్ష స్స పర్యత" ఇతి శబ్దార్ణవః . "ఏతస్మిౕ మదకలమల్లి కాక్షపక్ష" ఇతి భవభూతిః.

**ధార్తరాష్ట్రాస్సి తేతరైః.** 24

సితేతరైః కృష్ణైః చంచుచరణై రుపలక్షితా హంసాః ధార్తరాష్ట్రా ఇత్యుచ్యంతే – నల్లనిముక్కు కాళ్లతోఁ గూడిన తెల్లని హంసలు ధార్తరాష్ట్రము లనంబడును. ధృతరాష్ట్రదేశేభవో ధార్తరాష్ట్రః–ధృతరాష్ట్రదేశమందుఁ బుట్టినది.

**శరారి రాటి రాతిశ్చ-**

శరం నీరం హింసాం వా ఋచ్ఛతి శరారిః – నీటిని గాని హింసనుగాని పొందునది. ఋ గతౌ. ౧. అటతీత్యాటిః. సీ. అట గతౌ. చరించునది. ౨. అతతీత్యాతిః. సీ. అత సాతత్యగమనే. ఎల్లప్పుడు తిరుగునది. ఈ 3 ఆఁడేలనుపక్షి పేళ్లు.

**బలాకా బిసకణ్ఠికా,**

బలేన మేఘమాలా మకతి బలాకా. అక కుటిలాయాం గతౌ. బలముచే మేఘపంక్తిని బొందునది. ౧. బిసవత్ కంఠో ఽస్యా ఇతి బిస కంఠికా – తామరతూఁడువంటి మెడగలది. ఈ ౨ తెల్లకొక్కెర పేళ్లు.

**హంసస్య యోషి ద్వరటా -**

వృణీతే హంసమితి వరటా. వృఞ్ వరే. హంసను వరించునది. వరం శ్రేష్ఠం అటనం అస్యా ఇతి వరటా – శ్రేష్ఠమైన నడుపు గలది. ఈ ౧ ఆఁడుహంస పేరు.

**సారసస్య తు లక్ష్మణా.** 25

లక్ష్మీరస్యా అస్తీతి లక్ష్మణా – ఒప్పిదము గలది. పా. లక్షణా. "వాల్మీకే రరహిత రామలక్ష్మణానా" మితి మాఘః. "మహాపురుషమివ ప్రకటమీన మకరశంఖ లక్షణ" మిత్యచ్ఛోద వర్ణనాయాం కాదంబరీ. ఈ ౧ ఆఁడుబెగ్గురు పేరు.

**జతుకా ఽజినపత్రాస్యాత్ -**

జతువత్ కృష్ణపింగళత్వాత్ జతుకా – లక్కవలె కృష్ణపింగళ వర్ణ

ములు గలది. పా. జతూకా. ౧. అజినవత్పత్రాణి పక్షా అస్యేతి అజినపత్రా – తోలువంటి ఱెక్కలు గలది. ఈ ౨ చీఁకురువాయి పేళ్లు.

**పరోష్ణీ తైలపాయికా,**

శీతాసహత్వేన పరముష్ణమస్యా ఇతి పరోష్ణీ.సీ. చలి నోర్వనిది గనుక కేవల ముష్ణమే కలది. ౧. సర్వదా వివృతాస్యత్వేన తైలం పిబతీవ తిష్ఠతీతి తైలపాయికా. పా. పానే. ఎపుడును నోరు తెఱచుకొని తైలపానముఁ జేయుదానివలె నుండునది. ఈ ౨ గబ్బిలాయి పేళ్లు. జతుకాది శబ్దములు ౪ పర్యాయములని కొందఱు.

**చర్వణా మక్షికా నీలి-**

ప్రాణినాం త్వచం చర్వతీతి చర్వణా. చర్వ అదనే. ప్రాణుల యొక్క చర్మమును దినునది. ౧. మక్ష్యంతే అస్మైజనా ఇతి మక్షికా. మక్షరోషే. దీనియెడఁ గోపింతురు. ఈ ౨. నల్లని యీఁగ పేళ్లు.

**సరఘా మధుమక్షికా.** 26

సరంతీతిసరాః స్వవిషయం ప్రాప్తాః, తాన్. హంతీతి సరఘా. హన హింసాగత్యోః. తననుగూర్చి వచ్చినవారిని హింసించునది. ౧. మధుని సక్తా మక్షికా మధుమక్షికా – తేనెయం దాసక్తమైన యీఁగె. ఈ ౨ జుంటీఁగ పేళ్లు. తేనెటీఁగ.

**పతఙ్గి కా పుత్తికా స్యాత్ -**

పతతీతి పతంగికా. పత్ ౹గతౌ. పడునది. ౧. పుత్ కుత్సితం తాయతే పుత్తికా –కుత్సితమును జేయునది. తాయృ సంతానపాలనయోః. ఈ ౨ తెర యీఁగపేళ్లు. గొప్ప తేనె యీఁగ.

**దంశస్తు వనమక్షికా,**

దంశతీతి దంశః. దంశ దశనే. కఱచునది. ౧. వనే మక్షికా వనమక్షికా – అడవియందలి యీఁగ. ఈ ౨ అడవి యీఁగ పేళ్లు.

**దంశీ తజ్జాతి రల్పా స్యాత్**

అల్పా దంశజాతిః దంశీ. సీ. ఈ ౧ అల్పమైన అడవిజాతి యీఁగ. అడవిదోమ.

**గణ్డోలీ వరటా ద్వయోః.** 27

గణ్డం కపోలం ఉలతి ఆవృణోతీతి గణ్డోలీ. ప్స. ఉల సంవరణే.

చెక్కిలి మీఁద ముసరునది. పా. గన్ధయ త్యర్దయతి గన్ధోలీ. గన్ధ అర్దనే. పీడించునది. ౧. వృణోతీతి వరటా. ప్స. వృఞ్ వరణే. అంతట వ్యాపించునది. ఈ ౨ ఎఱ్ఱ తుమ్మెద పేళ్లు. కణుఁదురీఁగ.

**భృఙ్గారీ చీరుకా చీరీ ఝిల్లికా చ సమా ఇమాః,**

ఆకృత్యా భృఙ్గ మియర్తీతి భృఙ్గారీ. సీ. ఋ గతౌ. ఆకృతిచేత తుమ్మెదను పొందునది. ౧. ఇతి రౌతీతి చీరుకా – చీ యని కూయునది. పా. చిరుకా. ఝీరుకా. ౨. ఇతి శబ్దేన రిణాతి గచ్ఛతీతి చీరీ. సీ. రీ గతిరేషణయోః. చీ యని పలుకుచుఁ బోవునది. ౩. ఝిల్లాఖ్య వాద్య విశేషవత్ కాయతీతి ఝిల్లికా. కై శబ్దే. ఝిల్లి యనెడు వాద్య విశేషమువలెఁ బలుకునది. ఈ ౪ చిమటపేళ్లు. ఈలపురుగు.

**సమౌ పతఙ్గ శతభౌ-**

పత త్యగ్నౌ పతఙ్గః. పత్ ౨ గతౌ. అగ్నియందుఁ బడునది. ౧ శలత్యాశు గచ్ఛ త్యగ్నిం శలభః. శల ఆశుగమనే. అగ్నిని గూర్చి శీఘ్రముగాఁ బోవునది. ఈ ౨ మిడతపేళ్లు. దివ్యాఋపుఁ బ్రువ్వ అని కొందఱు.

**ఖద్యోతో జ్యోతి రిఙ్గణః.** 28

ఖేద్యోతత ఇతి ఖద్యోతః. ద్యుత దీప్తౌ. ఆకాశమందుఁ బ్రకాశించునది. ౧. జ్యోతిషా ప్రకాశేన ఉపలక్షితస్సన్ రిఙ్గతి గచ్ఛతీతి జ్యోతిరిఙ్గణః. రిగి గతౌ. ప్రకాశముచేతఁ బోవునది. ఈ ౨ మిణుఁగురు పురుగు పేళ్లు.

**మధువ్రతో మధుకరో మధులిణ్మధు పాలినః,**

**ద్విరేఫ పుష్పలి ఢ్భృఙ్గ షట్పద భ్రమ రాళయః.** 29

(ఇన్దిన్దిర శఞ్చరీకో రోలమ్బో బమ్భరశ్చసః.)

మధు పుష్పర సం వ్రతయతి భుఙ్క్తే మధువ్రతః. వృతు వర్తనే. పూఁదేనెను భుజించునది. ౧. మధు కరోతీతి మధుకరః. డు కృఞ్ కరణే. పూఁదేనెను జేయునది. ౨. మధు లేఢీతి మధు లిట్. హ. పు. లిహ ఆస్వాదనే. పూఁదేనెను ఆస్వాదించునది. ౩. మధు పిబతీతి మధుపః. పా పానే. పూఁదేనెను బానము సేయునది. ౪. అలతి భూషయతి పద్మాదిక మితి అళీ. న. పు. అల భూషణాదౌ. పద్మాదుల నలంక

రించునది. ౫. అస్య భ్రమర ఇతి నామ్ని ద్వౌ రేఫౌ స్త ఇతి ద్విరేఫః– భ్రమర మను తన పేరునందు రెండు రేఫములు గలది. ౬. పుష్పం లేఢి ఆస్వాదయతీతి పుష్పలిట్. హ. పు. లిహ ఆస్వాదనే. పుష్పము నాస్వాదించునది. ౭. కార్ష్ణ్యం భరతీతి భృంగః. భృఞ్ భరణే. నలుపును భరించునది. ౮. షట్పదా న్యస్యేతి షట్పదః – ఆఱుకాళ్ళుగలది. ౯. భ్రమతీతి భ్రమరః. భ్రము అనవస్థానే. తిరుగుచుండునది. ౧౦. ఆలతి పుష్పాణి ఆళి. ఇ. పు. అల భూషణాదౌ. పుష్పముల నలంకరించునది. ౧౧. (ఇందతి ఇందిరయా ఇందిందిరః. ఇది పరమైశ్వర్యే. పద్మ సంపదతోఁ గూడినది. చరతీతి చంచరీకః. చర గతి భక్షణయోః. చరించుచుండునది. రౌతీతి రోలంబః. రు శబ్దే. మ్రోయునది. పా. రలయోర భేదా ల్లోలంబః. బమితి శబ్దం బిభర్తీతి బంభరః – బం అనెడు శబ్దమును భరించునది. ౧౧ తుమ్మెదపేళ్లు. ఇందిందిరాదులు ౪ అధికనామములు).

**మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్,**
**శిఖావల శ్శిఖీకేకీ మేఘనాదానులాస్యపి.** 30

మీనాతి సర్పాన్ మయూరః. మీఞ్ హింసాయాం. సర్పములను హింసించునది. ౧. బర్హమస్యాస్తీతి బర్హిణః. బర్హీ చ. న. పు. పింఛము కలది. ౨, ౩. నీలః కంఠో ఽస్య నీలకంఠః – నల్లనిమెడ గలది. ౪. భుజంగాన్ బుఙ్క్తే భుజంగభుక్. జ. పు. భుజపాలనాభ్య వహారయోః. సర్పములను భుజించునది. ౫. శిఖాచూడా అస్యాస్తీతి శిఖావళః, శిఖీ చ. న. పు. చుంచుగలది గనుక శిఖావళము, శిఖియును. ౬.౭. కేకారవో ఽస్యాస్తీతి కేకీ. న. పు. కేకారవముగలది. ౮. మేఘనాద మనుల సతీతి మేఘనాదానులాసీ. న. పు. లస శ్లేషణక్రీడనయోః. మేఘ ధ్వనినిఁగూర్చి క్రీడించునది. ఈ ౯ నెమిలిపేళ్లు.

**కేకా వాణీ మయూరస్య-**

కే శిరసి కాయతే అభివ్యజ్యత ఇతి కేకా. శిరస్సు నెత్తి పలుకఁబడునది. ఈ ౧ నెమిలికూఁత.

**సమౌ చన్ద్రక మేచకౌ,**

చంద్ర ఇవ చంద్రకః – చంద్రాకారమై యుండునది. ౧. హరిత మిశ్రవర్ణత్వాత్ మేచకః – పచ్చవన్నెయు నల్లవన్నెయుఁ గలది. ఈ ౨

నెమిలిపురికన్ను పేళ్లు.

**శిఖా చూడా-**

శిరసి ఖేలతీతి శిఖా. ఖేలృ చలనే. శిరస్సునందుఁ జలించునది. ౧. చుద్యతే వాయునేతి చూడా. చుద ప్రేరణే. వాయువుచేఁ గదలింపఁబడునది. ఈ ౨ నెమిలికూఁకటి పేళ్లు.

**శిఖణ్డశ్చ పిఞ్ఛ బర్హే నపుంసకే.** 31

శిఖాభి రగ్రభాగై ర్డీయతే చలతీతి శిఖండః. డీఙ్ విహాయసాగతౌ. అగ్రభాగములచేత కదలుచుండునది. ౧. పింఛయతీతి పింఛం. పింఛ దీప్తౌ. ప్రకాశించునది. ౨. బర్హ్యతే నృత్తేన బర్హం. బృహవృద్ధౌ. నృత్యము చేత వృద్ధిఁ బొందునది. పింఛబర్హ శబ్ధములు నపుంసకములు. ఈ ౩ నెమిలిపురి పేళ్లు.

**ఖగే విహంగ విహగ విహంగమ విహాయసః,**
**శకున్తి పక్షి శకుని శకున్త శకున ద్విజాః.** 32
**పతత్రి పత్రి పతగ పత త్పత్త్ర రథాణ్డజాః,**
**నగౌకో వాజి వికిర వి విష్కిర పతత్రయః.** 33
**నీడోద్భవా గరుత్మన్తః పిత్సన్తో నభసంగమాః,**

ఖే గచ్ఛతీతి ఖగః. గమ్ ౯ గతౌ. ఆకాశమందుఁ బోవునది. ౧. విహాయసా గచ్ఛతీతి విహంగః, విహగః, విహంగమశ్చ – ఆకాశమునఁ బోవునది. ౨, ౩, ౪ వివిధంజిహితే గచ్ఛతీతి విహాయాః. స. పు. ఓ హాఙ్ గతౌ. వివిధగతులచేతఁ బోవునది. ౫. గంతుం శక్నోతీతి శకుంతిః శకునిః, శకుంతః, శకునశ్చ. శక్ ౯ శక్తౌ. పోవుటకొఱకు సమర్థమయినది. ౬, ౭, ౮, ౧౦ పక్ష్యా వస్యస్త ఇతి పక్షీ. న. పు. ఱెక్కలు గలిగినది. ౯. అండరూపేణ పక్షిరూపేణ చ ద్విర్జాయతితి ద్విజః. జనీ ప్రాదుర్భావే. గ్రుడ్డుగాను పక్షిగాను రెండుమార్లుగాఁ బుట్టునది. ౧౧. పతత్రే పత్రే చ అస్యస్త ఇతి పతత్రీ, పత్రీచ. న. పు ఱెక్కలు గలది. ౧౨, ౧౩, పతన్ గచ్ఛతీతి పతగః – ఎగురుచుఁ బోవునది. ౧౪. పతతీతి పతత్. త. పు. పత్ ౯ గతౌ. పోవునది. ౧౫. పత్త్రానిరథః గమనసాధనమస్యేతి పత్త్రరథః–ఱెక్కలే రథముగాఁ గలది. ౧౬. అండాజ్జాయతే అండజః. జనీ ప్రాదుర్భావే. గుడ్డువలనఁ బుట్టునది. ౧, ౭ నగో వృక్షః ఓకః

స్థానమస్యేతి నగౌ కాః. స. పు. వృక్షము స్థానముగాఁ గలది. ౧౮. వాజః పక్షో వా వేగో వా, తద్యోగాత్ వాజీ. న. పు. ఱెక్కలుగాని వేగముగాని వాజము, అది గలిగినది. ౧౯. వికిరతి భక్ష్యమితి వికిరః. విష్కిరశ్చ. కౄవిక్షేపే. మేతఁకు యోగ్యమైన పదార్థములను జల్లునది. ౨౦, ౨౧ వయతి తృణాదినా నీడమితి విః. ఇ. పు. వేఞ్ తంతుసంతానే. తృణాదులచేత గూడుగట్టునది. ౨౨. పతతీతి పతత్రిః. ఇ. పు. పోవునది. ౨౩. నీడాత్ ఉద్భవతీతి నీడోద్భవః – గూడువలనఁ బుట్టునది. ౨౪. గరుతః పక్షా యేషాం తే గరుత్మంతః. త. పు. ఱెక్కలుగలవి. ౨౫. పతితు మిచ్ఛంతః పిత్సంతః త. పు. పోవ నిచ్ఛయించునవి. ౨౬. నభసి గచ్ఛంతీతి నభసంగమాః – ఆకాశమునఁ బోవునవి. ఈ ౨౭ సామాన్యముగాఁ బక్షుల పేళ్లు.

**తేషాం విశేషా హారీతో మద్గుః కారణ్డవః ప్లవః** 34
**తిత్తిరిః కుక్కుభో లావో జీవంజీవ శ్చకోరకః,**
**కోయష్టిక ష్టిట్టిభకో వర్తకో వర్తికాదయః.** 35

హరితవర్ణయోగాత్ హారీతః. పచ్చనివన్నె గలది. పచ్చని పిట్ట. ౧. మజ్జతి జలే మద్గుః. ఉ–పు. టుమస్జో శుద్ధౌ – నీళ్లయందు మునుఁగునది. నీరుకాకి. కరండే భవః కారండః తం వాతి గచ్ఛతీతి కారండవః. వాగతిగంధనయోః. కరండము పంజరము; తత్సంబంధమైనది కారండవము. దానిని బొంది యుండునది. కన్నెలేడు. ౧. ప్లవతే ప్లవః. నీళ్లలోఁ దేలునది. నీరుకోడి. ౧. తిత్తీతి రౌతీతి తిత్తిరిః–తిత్తియని పలుకునది. తీతువు. ౧. కుగితికుభతితి శబ్దాయత ఇతి కుక్కుభః. కుభిస్సౌత్రో ధాతుః. కుక్కు అని పలుకునది. గంపపులుఁగు, బెళగువ్వ. ౧. లూయతే లావః. లూఞ్ ఛేదనే. ఛేదింపఁబడునది. లావుక. ౧. జీవేన సహచరేణ క్రీడన్ జీవతి జీవంజీవః –జీవమనఁగా సహచరము; దానితోఁగూడ క్రీడించుచు బ్రతుకునది. వన్నెపులుఁగు. ౧. చకతి తృప్యతి జ్యోత్స్నయా చకోరకః. చకతృప్తౌ. వెన్నెలఁ జూచి తృప్తిఁ బొందునది. వెన్నెలపులుఁగు. ౧. జీవంజీవ చకోరక శబ్దములు ౨. చకోరపక్షిపేళ్లని కొందఱు. ఓకసా స్థానేన యజతే సంగచ్ఛతే కోయష్టికః. యజ దేవపూజాదౌ. స్థానముతో సంగతమై యుండునది. చీఁకుకొక్కెర. గుడ్డికొంగ. ౧. టిట్టీతి నిష్ఠురం భాషతే

టిట్టిభకః – టిట్టి యని నిష్ఠురముగాఁ బలుకునది. టిట్టీతి శబ్దేన భాతీతి టిట్టిభకః. భా దీప్తౌ. టిట్టి యనెడు శబ్దముచేత నొప్పునది. లకుముకి పిట్ట. ౧. వర్తతే స్వేచ్ఛయావర్తకః. వృతు వర్తనే. స్వేచ్ఛచేత వర్తించునది. వెలిచెపిట్ట. దొట్టపులుఁగు. ౧. వర్తికా శబ్దమునకు వర్తక శబ్దమునకు వలె వ్యుత్పత్తి. మీలవల్లంకి. ౧. ఇచ్చట కొందఱు వర్తక శబ్దమును స్త్రీలింగముగాఁ బఠించి వర్తకా వర్తికా శబ్దములు పర్యాయములందురు. ప్రత్యేకపక్షి విశేషములు.

**గరు త్పక్షి చ్ఛదాః పత్త్రం పతత్త్రంచ తనూరుహమ్,**

గిరతి గగన మనేనేతి గరుత్. త. పు. గౄనిగరణే. దీనిచేత పక్షి ఆకాశమును గ్రసించును. ౧. పక్షతి గగనమనే నేతి పక్షః. పక్ష పరిగ్రహే. దీనిచేత పక్షి ఆకాశమును బరిగ్రహించును. ౨. ఛాద్యతే అనేన అంగమితి ఛదః.–ఛద అపవారణే. దీనిచేత నంగము కప్పఁబడును. ౩. పతత్యనేన పత్త్రం. పత్ ౡగతౌ. దీనిచేత పక్షి పోవును. ౪. పతంతం త్రాయత ఇతి పతత్త్రం. త్రైజ్ పాలనే. పడుదానిని రక్షించునది. ౫. తన్వాం రోహతీతి తనూరుహం. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. శరీరమందు మొలచునది. ఈ ౬ ఱెక్కల పేళ్లు.

**స్త్రీ పక్షతిః పక్షమూలమ్.**

పక్షస్య మూలం పక్షతిః. సీ. పక్షమూలం చ – ఱెక్కలయొక్క మొదలు. ఈ ౨ ఱెక్క మొదలు.

**చఞ్చుస్త్రోటి రుభేస్త్రియౌ.** 36

చంచతి చలతి ఆహారగ్రహణే చంచుః. ఉ. సీ. చంచు గతౌ. అహారగ్రహణమందు కదలునది. ౧. త్రుట్యతి మాంసాదికమితి త్రోటిః. సీ. త్రుట ఛేదనే. మాంసాదులను ద్రుంచునది. ౨. పక్షులముక్కు పేళ్లు.

**ప్రడీ నోడ్డీన సండీనా న్యేతాః ఖగగతి క్రియాః,**

ప్రకృష్టం డయనం ప్రడీనమ్. వేగిరముగా పాఱుట. ౧. ఉత్ ఊర్ధ్వం డయనం ఉడ్డీనమ్ – మీఁదికిఁ బాఱుట. ౧. సంహతం డయనం సండీనమ్. ౧. డీజ్ విహాయసాగతౌ. కలసిపాఱుట, ఎగయుట, పాఱుట. పక్షులగతి విశేష నామములు. వ్రాలుట యని కొందఱు.

**వేశీ కోశో ద్విహీనే ఉ ణ్డమ్.**

వేశయతి గర్భమితి వేశీ. పిశ అవయవే. దీనియందు గర్భం బవయవ యుక్తమవును. ౧. గర్భస్య కోశత్వా త్కోశః–గర్భమున కాధారమైనది. పేశీనాం మాంసఖండానాం కోశః పేశీకోశః – మాంసఖండముల యొక్క సమూహము అని యేకనామముగాఁ గొందఱు. ౨. అమతి నిస్సరత్యస్మాచ్ఛిశు రిత్యండం. అమ గతౌ. దీనివలనఁ బిల్ల వెడలును. ఈ 3 గ్రుడ్డు పేళ్లు.

**కులయో నీడ మస్త్రియామ్.** 37

సాయంకాలే పక్షికుల మయతపన మితి కులాయః. అయ గతౌ. సాయంకాలమందుఁ బక్షి సమూహము దీనిని బొందును. ౧. నీయతే తృణాదిక మత్రేతి నీడం. అ. ప్న. ణీఞ్ ప్రాపణే. తృణాదులు దీనియందుంచఁ బడును. ఈ ౨ గూఁటి పేళ్లు.

**పోతః పాకో ఽ ర్భకో డిమ్భః పృథుక శ్శాబక శ్శిశుః,**

పునాతి నీడం పోతః పూఞ్ పవనే. గూఁటిని పవిత్రము సేయునది. విరుద్ధ లక్షణ–అనగాఁ జెఱుచునది. ౧. పాయతే రక్ష్యతే పాకః. పా. రక్షణే. రక్షింపఁ బడునది. పచ్యతే గర్భక్లేశేన వాపాకః. డుపచ్ష్పాకే. గర్భక్లేశముచేఁ బీడింపఁ బడునది. ౨. జననీమవలంబ్య ఋచ్ఛతీ త్యర్భకః. ఋగతౌ. తల్లి నాధారము చేసికొని పోవునది. ౩. డయతే డింభః. డీఙ్ విహాయసాగతౌ. కాలక్రమమున నెగయునది. ౪. పృథుతురం యథాభవతి తథాకాయతి పృథుకః. కైశబ్దే. అధికముగా మొఱపెట్టునది. ౫. శ్యతి పిత్రోః దుఃఖమితి శాబకః. శో తనూకరణే. తల్లిదండ్రుల దుఃఖము నల్పముగాఁ జేయునది. ౬. శేతే ఽ త్యర్థం శిశుః. ఉ. పు. శీఙ్స్వప్నే. మిక్కిలినిద్రపోవునది. ఈ ౭ బిడ్డపేళ్లు. సర్వజంతు సామాన్య శిశుమాత్రమునకును బేళ్లు.

**స్త్రీపుంసౌ మిథునం ద్వన్ద్వం-**

మేథతే సంగచ్ఛ ఇతి మిథునం. మేథృ సంగమే. కూడియుండునది. ౧. ద్వౌ సహవర్తేతే ద్వంద్వం. రెండును గలసియుండునది. ఈ స్త్రీపురుషులజంట పేళ్లు.

**యుగ్మంతు యుగళం యుగమ్.** 38

యుజ్యతే యుగ్మం, యుగళం, యుగం చ. యుజిర్ యోగే. పరస్పరము కూడుకొని యుండునది యుగ్మము, యుగళము, యుగము,

ఈ 3 సామాన్యముగా రెండు జోడై యుండుటకు పేళ్లు.

**సమూహ నివహ వ్యూహ సందోహ విసర వ్రజాః,**
**స్తో మౌఘ నికర వ్రాత వార సంఘాత సంచయాః.** 39
**సముదాయ స్సముదయ స్సమవాయ శ్చయో గణః,**
**స్త్రియాం తు సంహతి ర్బృన్దం నికురుమ్బం కదమ్బకమ్.** 40
(పూగో వితానం ప్రకరో మణ్డలం చక్రవాళకమ్,
పటలం పేటికా స్త్రీ స్యా చ్చక్రం జాలం చ జాలకమ్)

సమ్య గూహ్యతే ఏకత్రేతి సమూహః. ఊహ వితర్కే. ఒకదిక్కున నన్నియు లెస్సగా నూహింపఁబడును. ౧. నితరాం వహతి ప్రాపయతి స్వసంబంధినా మేకత్వమితి నివహః. వహ ప్రాపణే. తన సంబంధమైన వస్తువులను మిక్కిలి యేకత్వమును బొందించునది. ౨. విశేషేణ ఊహ్యత ఇతి వ్యూహః. మిక్కిలి యూహింపఁబడునది. ౩. సందుహ్యతే ప్రపూర్యత ఇతి సందోహః. దుహ ప్రపూరణే. మిక్కిలి పూరింపఁబడునది. ౪. విస్రీయత ఇతి విసరః. సృ గతౌ. విశేషముగా పదార్థముచేత పొందఁబడునది. ౫. వ్రజ్యత ఇతి వ్రజః. వ్రజగతౌ. పొందఁబడునది. ౬. స్తూయత ఇతి స్తోమః. ష్టుఞ్ స్తుతౌ. స్తోత్రము చేయఁబడునది. ౭. ఉచ్యతే సంఘీభూయతే ఓఘః. ఉచ సమవాయే. కూర్పఁబడునది. నికీర్యత ఇతి నికరః. కౄ విక్షేపే. అంతటఁ జల్లినట్లు వ్యాప్తమైయుండునది. ౯. వ్రియత ఇతివ్రాతః. వారశ్చ. వృఞ్ సంభక్తౌ. కూర్పఁబడునది. ౧౦. ౧౧. సంహన్యత ఇతి సంఘాతః. హన హింసాగత్యోః. లెస్సగాఁ బొందింపఁబడునది. ౧౨. సంచీయతే సంచయః. చిఞ్ చయనే. కూర్చఁబడునది. ౧౩. సముదయంత్యత్ర సముదాయః. ఇణ్ గతౌ. లెస్సగా దీనియందుఁ గనిపింతురు. ౧౪. సముద్యంత్యత్ర సముదయః. ఇణ్ గతౌ. లెస్సగా దీనియందుఁ బొందుదురు. ౧౫. సమవయంతి ప్రాప్నువం త్యత్రేతి సమవాయః. ఇణ్ గతౌ. దీనిని బొందుదురు. ౧౬. చీయతే చయః. చిఞ్ చయనే. కూర్పఁబడునది. ౧౭. గణ్యతే గణః. గణ సంఖ్యానే. లెక్క పెట్టఁబడునది. ౧౮. సంహన్యత ఇతి సంహతిః. సీ. హన హింసాగత్యోః. పొందఁబడునది. ౧౯. వ్రియతేబృందం. వృఞ్ సంభక్తౌ. వబయోరభేదః. కూర్చఁబడునది. ౨౦. నితరాం కురతి శబ్దాయతే నికురుంబం. కుర శబ్దే. మిక్కిలి రొదచేయు

నది. ౨౧. కోలాహల రూపేణ కుత్సిత మంబతే కదంబంకం. అబి శబ్దే. కోలాహల రూపమునఁ గుత్సితముగా మ్రోయునది. ఈ ౨౨ గుంపుపేళ్లు.

**బృన్దభేదాః-**

ఇఁకమీఁదఁ జెప్పఁబడునవి సమూహ భేదములు.

**సమైర్వర్గః-**

వృజ్యతే విజాతీయైరితి వర్గః. వర్జనే. విజాతీయులచేత వర్జింపఁబడునది. ప్రాణులుగాని అ ప్రాణులుగాని తమ సజాతీయ వస్తువు యొక్క కూటమి వర్గము. ఉ___ ప్రాణివర్గము, కవర్గము ఇత్యాదులు.

**సఙ్ఘ సార్థౌతు జన్తుభిః,**

సంహన్య తే పరస్పర జాతీయ విజాతీయైరితి సంఘః. హన హింసాగత్యోః. అన్యోన్య సజాతీయ విజాతీయులచేతఁ గూర్చఁబడునది. ౧. సరతీతిసార్థః. సృ గతౌ. పోవునది. ఈ ౨ సజాతీయములుగానీ విజాతీయములుగానీ జంతువుల గుంపు పేళ్లు. ఉ___ పక్షిసంఘము, వణిక్సార్థము.

**సజాతీయైః కులమ్-**

కోలతి సంఘీభవతీతి కులం. కుల సంస్త్యానే. కూడుకొనియుండునది. ఈ ౨ సజాతీయమైన ప్రాణుల గుంపు. ఉ.___ బ్రాహ్మణకులము.

**యూథం తిరశ్చాం పున్నపుంసకమ్.** 41

యౌతి మిశ్రీభవతీతి యూథం. అ. పు. యు మిశ్రణే. కూడు కొనియుండునది. ఉ.___ గజయూథము, వరాహయథము, తిర్యగ్జంతువుల గుంపు.

**పశూనాం సమజః-**

సమజంత్యత్ర సమజః. అజ గతిక్షేపణయోః. దీనియందుఁ బశువులు కలసికొనును. పవువులమంద పేరు.

**అన్యేషాం సమాజః-**

సమజంత్యత్ర సమాజః. అజ గతిక్షేపణయోః. దీనియందుఁగూడుదురు. పశువులగాక తక్కినవానిగుంపు పేరు.

**అథ సధర్మిణామ్,**

**స్యాన్ని కాయః -**

నిచీయతే నికాయః. చిఞ్ చయనే. లెస్సగాఁ గూర్చఁబడునది.

ఒకే విధమైన నడవడిగలవారియొక్క సమూహము.

**పుఞ్జ రాశీ తూత్కరః కూట మస్త్రియామ్.** 42

పుంజ్యతే సమూహ్యత ఇతి పుంజః – కూర్పఁబడునది. పుంసోజాయత ఇతివా పుంజః – పురుషునివలనఁ బుట్టునది. అశ్నుత ఇతి రాశిః. పు. అశూ వ్యాప్తౌ. వ్యాపించునది. ౨. ఉత్కీర్యత ఇతి ఉత్కరః. కౄ విక్షేపే. పొడవగునది. ౩. కూటవత్ శిఖరవత్ స్థితంకూటం. అ. ప్న. పర్వతశిఖరమువలె నుండునది. ఈ ౪ ధాన్యాదుల రాశిపేళ్లు.

**కాపోత శౌక మాయూర తైత్తిరాదీని తద్గణే,**

కపోతానాం సమూహః కాపోతం – గువ్వలయొక్క సమూహము. ౧. శుకానాం సమూహః శౌకం – చిలుకల యొక్క సమూహము. ౧. మయూరాణాం సమూహో మాయూరం – నెమళ్లయొక్క గుంపు. ౧. తిత్తిరీణాం సమూహః తైత్తిరం–తీతువుల గుంపు. ౧. ఆదిశబ్దముచేత బాకాదులు గ్రహింపఁ బడును.

**గృహాసక్తాః పక్షిమృగా శ్ఛేకా స్స్యుర్గృహ్యకాశ్చతే.** 43

ఛీయంతే ఛిద్యంతే పక్షాదిషు ఛేకాః. ఛో చ్ఛేదనే. ఱెక్కలు మొదలైన వానియందు ఛేదింపఁబడునవి. పా. స్థేకాః. ౧. గృహ్యంత ఇతి గృహ్యకాః. గ్రహ ఉపాదనే. పట్టువడునవి. ఈ ౨ క్రీడార్థమై పెంచఁబడి యిల్లు మరగిన చిలుక మొదలైన పక్షులకును, ఇఱ్ఱి మొదలైన మృగములకును పేళ్లు.

# మనుష్య వర్గము

గృహనిరుద్ధపక్షి మృగ ప్రసంగాత్ తద్వర్తి మనుష్యాణాం నా మాని వివక్షుః ఇదానీం సాంగోపాంగం మనుష్యవర్గమాహ. మనుష్యా ఇత్యాదినా ___ గృహమునఁ బెంచఁబడిన పక్షిమృగములఁ జెప్పి, ఆ ప్రసంగమువలన గృహమందుండు మనుష్యులపేళ్లను జెప్పఁదలఁచినవాఁడై సాంగోపాంగముగా మనుష్య వర్గమును జెప్పుచున్నాఁడు ___.

**మనష్యా మానుషా మర్త్యా మనుజా మానవా నరాః,**

మనోరపత్యాని మనుష్యాః, మానుషాశ్చ – మనువుకొడుకులు గనుక మనుష్యులు, మానుషులు. ౧, ౨. మ్రియంత ఇతి మర్త్యాః. మృజ్

ప్రాణత్యాగే. మృతిని బొందువారు. మర్త్తో భూలోకః తత్రభవాః మర్త్యాః. మర్త మనఁగా భూలోకము, అచ్చటఁ బుట్టినవారు. ౩. మనోర్జాతా మనుజాః. జనీ ప్రాదుర్భావే. మనువువలనఁ బుట్టినవారు. ౪. మనోరిమే మానవాః–మనువు సంబంధమైనవారు. ౫. నృణంతి నయంతి సర్వం స్వవశమితి నరాః. నృనయే. అన్నియుఁ దమ వశముఁ బొందించుకొనువారు. ఈ ౬ మనుష్యమాత్రునిపేళ్లు.

**స్యుః పుమాంసః పఞ్చజనాః పురుషాః పూరుషా నరః.** 1

పాంతి స్త్ర్యాదికమితి పుమాంసః. పా రక్షణే. స్త్రీలు మొదలైనవారిని రక్షించువారు. ౨. పంచభిః పృథివ్యాదిభిర్జాయంత ఇతి పంచజనాః– పృథివి మొదలైన పంచభూతములచేఁ బుట్టువారు. ౮. పురంతి ప్రాణినామగ్రే గచ్ఛంతీతి పురుషా, పూరుషాశ్చ. పుర అగ్రగమనే. ప్రాణులకెల్ల అగ్రేసరులు గనుక పురుషులు, పూరుషులు. ౯, ౧౦. నయంతతి నరః. ఋ. పు. ణీఞ్. ప్రాపణే. అన్నిటిని స్వవశముఁ బొందించుకొనువారు. ఈ ౧౧ మనుష్యజాతిలోఁ బురుషుల పేళ్లు.

**స్త్రీయోషి దబలా యోషా నారీ సీమన్తినీ వధూః,**
**ప్రతీపదర్శినీ వామా వనితా మహిళా తథా.** 2

స్త్యాయతి సంఘాతో భవత్యస్యాం గర్భ ఇతి స్త్రీ. స్త్యై ష్ట్యై శబ్దసంఘాతయో. దీనియందు గర్భము కూర్పఁబడును. ౧. యౌతి పుంసా యోషిత్. త. సీ. యోషా చ. యు మిశ్రణే. పురుషునితోఁ గూడుకొనునది. పా. యోషితా; జోషా. "స్త్రీ వధూ ర్యోషితా రామా" ఇతి త్రికాండశేషః. ౨, ౪. అల్పం బలమస్యాః అబలా. అల్పార్థేనఞ్. అల్పమైన బలము గలిగినది. ౩. నృణాతి నయతి స్వవశం పురుషమితి నారీ. సీ. నృ నయే. పురుషుని వశము చేసికొనునది. ౫. సీమంతం కేశవీథీ అస్యా ఇతి సీమ న్తినీ. సీ. సీమంతమనఁగాఁ బాపట; అది గలిగినది. ౬. ఊహ్యతే భర్త్రేతి వధూః. ఊ. సీ. వహ ప్రాపణే. పురుషునిచేత వహింపఁబడునది. ౭. ప్రతీపం వక్రం ద్రుష్టుం శీలమస్యా ఇతి ప్రతీపదర్శినీ. సీ. వక్రముగా నాలోచించునది. ౮. వామత్వేన వక్రస్వభావత్వేన రమ్యత్వేన వా వామా – వక్రశీలమైనదిగాని రమ్యమైనదిగానివామ. ౯. వనతి పురుషమితి వనితా. వన షణ సంభక్తౌ.

పురుషునిఁ బొందునది. ౧౦. మహ్యత ఇతి మహిళా. మహపూజాయాం. ఆదరింపఁ బడునది. ఈ ౧౧ సామాన్యముగా స్త్రీల పేళ్లు.

**విశేషా స్త్వఙ్గనా భీరూః కామినీ వామలోచనా,** 3
**ప్రమదా మానినీ కాన్తా లలనా చ నితమ్బినీ.**
**సున్దరీ రమణీ రామా -**

ప్రశస్తాన్యంగా న్యస్యా ఇతి అంగనా – మంచి యవయవములు గలది. భయం శీలమస్యా ఇతి భీరూః – వెఱపు స్వభావముగాఁ గలది. అతిశయేన కామో౽ స్యా ఇతి కామినీ. సీ. అతిశయమైన కామము గలది. వామే రుచిరే లోచనే అస్యా ఇతి వామలోచనా – మంచి కన్నులు గలది. ప్రకృష్టో మదశ్చేతో వికారో౽ స్యా ఇతి ప్రమాదా – మిక్కిలి మదము గలది. మానో౽ స్యా ఇతి మానినీ. సీ. ప్రణయ కోపము గలది. పా. భావశ్శృంగారచేష్టా సో౽ స్యా అస్తీతి భావినీ – శృంగారచేష్టగలది. కామ్యత ఇతి కాంతా. కము కాంతౌ. కోరఁ బడునది. మిగులఁ జక్కనిది. లలతి విలసతీతి లలనా. లల క్రీడాయామ్. విలాసయుక్తయైనది. పృథు ర్నితంబః కటిపశ్చాద్భాగః సో౽ స్యా అస్తీతి నితంబినీ. సీ. గొప్ప పిఱుఁదులు గలది. సుష్ఠు ఆద్రియతే సున్దరీ. సీ. దృఙ్ ఆదరణే. లెస్సగా నాదరింపఁ బడునది. రూపలావణ్యములు గలది. ౧. రమయతి నాయక మితి రమణీ. సీ. రము క్రీడాయాం. నాయకుని రమింపఁజేయునది. .౧. రమతే కామశాస్త్రానుసారేణ కళాభిరితి రామా. రము క్రీడాయాం. గీతకళాదులు నేర్చి రమించునది. ఈ ౧౨ స్త్రీ విశేషముల పేళ్లు.

**కోపనా సైవ భామినీ,**

కోపశీలా కోపనా–కోపమే స్వభావముగాఁ గలిగినది. ౧. భామ్యత్యవశ్యం కుప్యతి భామినీ. భామక్రోధే. అవశ్యము కోపగించుకొనునది. ఈ ౨ కోపముగల స్త్రీపేళ్లు.

**వరారోహా మత్తకాశి న్యుత్తమా వరవర్ణినీ.** 4

పుంసా ఆరుహ్యత ఇతి ఆరోహః కటిః, వరః శ్రేష్ఠః ఆరోహో౽ స్యా ఇతి వరారోహా – పురుషునిచేత ఆరోహింపఁబడునది గనుక ఆరోహ మనఁగాఁ బిఱుఁదు. శ్రేష్ఠమైన పిఱుఁదులు గలిగినది. ౧. మధుపానం

వినా మత్తేవ కాశత ఇతిమత్తకాశినీ. సీ. కాశృ దీప్తౌ. మధుపానము లేకయే మత్తురాలివలెఁ బ్రకాశించునది. పా. శ్రోణీగౌరవత్ మత్తగజవత్ మందం కసతీతి మత్తకాసినీ. సీ. కసగతౌ. గొప్ప పిఱుఁదులు గలదౌటవలన మదపుటేనుఁగువలె మెల్లఁగా నడచునది. ౨. రూపశీలా రిభిరుత్కృష్టత్వా దుత్తమా – రూపశీలాదులచేత ఉత్కృష్టయైనది. ౩. వరశ్శ్రేష్ఠో వర్ణో రూపమస్యా ఇతి వరవర్ణినీ – శ్రేష్ఠమైన రూపము గలది. "శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మే తు సుఖశీతలా, భర్తృరక్తాచ యానారీ సా భవేద్వరవర్ణినీ" ఇతి రుద్రః. ఈ ౪ ఉత్తమ స్త్రీ పేళ్లు.

**కృతాభిషేకా మహిషీ-**

మహ్యతే పూజ్యత ఇతి మహిషీ. సీ. మహ పూజాయాం. పూజింపఁబడునది. ఈ ౧ రాజుపట్టపుదేవి పేరు.

**భోగిన్యో ఽ న్యా నృపస్త్రియః,**

భోగః సంభోగో యాస్వితి భోగిన్యః ఎవ్వరియందు సంభోగము గలదో వారు భోగినులు. ఈ ౧ తక్కిన రాజభార్యలు.

**పత్నీ పాణిగృహీతీ చ ద్వితీయా సహధర్మిణీ.** 5

**భార్యా జాయాథ పుంభూమ్ని దారాః -**

పత్యురనయా సహ యజ్ఞయోగ స్సంపద్యత ఇతి పత్నీ. సీ. పతికి నీమెతోఁ గూడ యజ్ఞ యోగము గలది. ౧. పాణిః గృహీతో ఽ స్యా ఇతి పాణిగృహీతీ. సీ. దీనిహస్తము గ్రహింపఁబడును. ౨. యజ్ఞాధికారఫలభాగినో ర్జాయాపత్యో రన్యతరత్వేన ద్వితీయా – యజ్ఞాధికారమందు ఫలమును బొందునప్పుడు పతితోఁ గూడ తాను రెండవది. ౩. పత్యాభర్త్రా సహ ధర్మః దాన యజ్ఞాది రస్యా ఇతి సహధర్మిణీ. సీ. పతితోఁ గూడ దానయజ్ఞాది ధర్మములు గలిగినది. ౪. భ్రియత ఇతి భార్యా. భృఞ్ భరణే. భరింపఁబడునది. ౫. జాయతే ఽ స్యాం పతిః పుత్రరూపేణేతి జాయా. జనీ ప్రాదుర్భావే. ఈమెయందు పతి పుత్రరూపమున జనించును. ౬. దారయంతి ఉద్వేజయంతి పతీనితి దారాః. దౄ భయే. పతులను భయపెట్టువారు. ఈశబ్దము అకారాంతపుంలింగ నిత్య బహువచనము. ఆయం స్త్రీలింగే ఽ పి. 'క్రోడా హోరా తథాదారా త్రయ ఏతే యథాక్రమం, క్రోడే హోరే చ దారేషు త్రయః ప్రోక్తా మనీషిభి' రితి భట్టచం

ద్రః. ఈ ౭ ను అగ్నిసాక్షికముగాఁ బెండ్లాడిన పెండ్లాము పేళ్లు. మొదటి ౪ శబ్దములు (పత్నీ–ర్మిణీ) యజ్ఞాధికారము గల పెండ్లామునకును, తక్కిన 3 శబ్దములు సామాన్యమైన పెండ్లామునకును బేళ్లని కొందఱు.

**స్యాత్తు కుటుమ్బినీ,**

**పురంధ్రీ-**

కుటుంబం పుత్రభృత్యాదికం అస్యా ఇతి కుటుంబినీ. సీ. పోషింపఁదగిన పుత్రభృత్యాదులు గలది. ౧. పురం గృహం ధరతీతి పురంధ్రీ. సీ. ధృఞ్ ధరణే. పురమనఁగా గృహము, దానిని భరించునది. ఈ ౨ బిడ్డలు సేవకులు మొదలగు కుటుంబము గల స్త్రీ పేళ్లు.

**సుచరిత్రాతు సతీ సాధ్వీ పతివ్రతా.** 6

శోభనం చరిత్ర మస్యా ఇతి సుచరిత్రా – శుభకరమైన చరిత్రము గలది. ౧. దర్శనాదేవ పాపం స్యతీతి సతీ. సీ.షో అన్తకర్మణి. దర్శన మాత్రముననే పాపమును బోఁగొట్టునది. ౨. సాధుగుణయోగాత్సాధ్వీ. సీ. మంచిగుణములు గలది. ౩. పతిసేవైవ వ్రత మస్యా ఇతిపతి వ్రతా – పతిసేవయే వ్రతముగాఁ గలది. ఈ ౪ పతివ్రతపేళ్లు.

**కృతసాపత్ని కాధ్యూఢాధివిన్నా -**

సపత్న్యాభావః సాపత్న్యం, కృతం సాపత్న్యమస్యా ఇతి కృతసాపత్నికా – సవతియొక్క భావము సాపత్న్యము. చేయఁబడిన సాపత్న్యము గలది గనుక కృతసాపత్నిక. ౧. అధిస్యోపరి ఊఢాప్రాప్తా విన్నాలబ్ధా చ జయా అస్యా ఇత్యధ్యూఢా అధివిన్నాచ. వహప్రాపణే. విద్ ౡలాభే. తనమీఁద పొందఁబడిన మఱియొక స్త్రీగలది అధ్యూఢ, అధివిన్న. అధిప్రాక్ ఊఢా విన్నా, అధ్యూఢా, అధివిన్నా చ. అధిశబ్దః ప్రాగర్థకః ముందు పెండ్లాడఁబడినది. ౨౩. పెద్దపెడ్లాము.

**అథ స్వయంవరా,**

**పతింవరా చ వర్యా -**

స్వయం వృణుతే పతి మితి స్వయంవరా. వృఞ్ వరణే. తానే మగని గోరుకొనునది. ౧. పతిం వృణుత ఇతి పతింవరా – పతిని వరించునది. ౨. వరణం వరః తత్ర నిపుణా వర్యా – వరించుటయందు నేర్పు గలది. ఈ 3 తనంతటనే పురుషుని వరించు స్త్రీ పేళ్లు.

**అథ కులస్త్రీ కులపాలికా.** 7

కులేన అవ్యభిచారేణ రక్షితాస్త్రీ కులస్త్రీ - ఒచ్చెములేని కులముచేత రక్షితయైనది. ౧. కులం పాలయతీతి కులపాలికా. పాల రక్షణే. కులమును రక్షించునది. ౨. వ్యభిచారముఁ జేయక కులమును మానమును గాపాడుకొను స్త్రీ పేళ్లు.

**కన్యాకుమారీ-**

కన్యతే కామ్యత ఇతి కన్యా. కన దీప్తికాంతిగతిషు. కోరఁబడునది. ౧. కుమారయతి క్రీడయతీతి కుమారీ. సీ. కుమార క్రీడాయాం. క్రీడించునది. కుత్సితో మారో ఽస్యా ఇతి కుమారీ–మన్మథుని దిరస్కరించునది. ఈ ౨ మొదటివయస్సున నున్న పెండ్లికాని పడుచు పేళ్లు.

**స్త్రీ గౌరీ తు నగ్నికానాగతార్తవాః,**

గురతే వివాహాయ ఉద్యతతే గౌరీ. సీ. గురీ ఉద్యమనే. వివాహమున కుద్యోగించునది. ౧. నజతే నగ్నికా. ఓ నజీ వ్రీడే. లజ్జించునది. ౨. అనాగతమార్తవం పుష్పమస్యా ఇత్య నాగతార్తవా - సమర్తాడనిది. ఈ 3 సమర్తాడని పడుచు పేళ్లు.

**స్యాన్మధ్యమా దృష్టరజాః -**

మధ్యే వయసి తిష్ఠతీతి మధ్యమా. ష్ఠా గతినివృత్తౌ. మధ్యమ వయస్సునం దుండునది. ౧. దృష్టం రజో ఽస్యా ఇతిదృష్టరజాః. స. సీ. కానంబడిన రజస్సు గలిగినది. ఈ ౨ క్రొత్తగా సమర్తాడినపడుచు పేళ్లు.

**తరుణీ యువతిస్సమే.** 8

కన్యావస్థాం తరతీతి తరుణీ. సీ. తౄప్లవనతరణయోః. కన్యావస్థను దాఁటినది. పా. తలునీ. ౧. పుంసా యౌతీతి యువతిః. యు మిశ్రణే. పురుషునితోఁ గూడునది. ఈ ౨. జవ్వనిపేళ్లు. 30. ఏండ్లకులోఁ బడిన వయస్సు గలిగినది.

**సమాః స్నుషా జనీ వధ్వాః -**

గృహవ్యాపారాయ జలంస్నౌతీతి స్నుషా. స్ను ప్రస్రవణే. గృహవ్యాపారము కొఱకు నీల్లు చల్లునది. ౧. జాయతే ఽస్యాం పౌత్ర ఇతిజనీ. సీ. జనీ ప్రాదుర్భావే. దీనియందు పౌత్రుఁడు పుట్టును. ౨. ఊహ్యతే పుత్రేణేతి వధూః. ఊ. సీ. పుత్రునిచేత వహింపఁబడునది. ఈ ౩ కోడలి పేళ్లు.

**చిరణ్టీ తు సువాసినీ,**

చిరేణాటతి పితృగేహాద్భర్తృ గేహం చిరంటీ – చాలకాలమునకు నత్తింటికిఁ బోవునది. పా. చిరిణోతి హినస్తి అమంగళాని చిరింటీ. సీ.చిరి హింసాయాం. అమంగళములను జెఱుచునది. ౧. చరతీతి చరణ్టీత్యేకే–తిరుగునది. సుష్ఠువసతీతిసువాసినీ. సీ. వస నివాసే. లెస్సగా వసించియుండునది. ౨. పా. స్వేషు వస్తుం శీల మస్యా ఇతి సువాసినీ – తన పుట్టినింటివారిలో నుండు స్వభావము గలది. ఈ ౨ ప్రాప్తయౌవనయై పుట్టినింట నున్న స్త్రీ పేళ్లు. పేరంటాలు.

**ఇచ్ఛావతీ కాముకా స్యాత్ -**

పుష్పాదిషు ఇచ్ఛా అస్యా ఇతి ఇచ్ఛావతీ – పుష్పాదులయం దభిలాషగలది. ౧. సురతవ్యతిరిక్తవస్తూని కామయతీతి కాముకా. కముకాంతౌ. సురతవ్యతిరిక్త వస్తువులను గోరునది. ఈ ౨ సురతవ్యతిరిక్తములైన పుష్పాదులయందు నిచ్ఛగల స్త్రీ పేళ్లు.

**వృషస్యన్తీతు కాముకీ.** 9

అసకృద్బీజనిషేక సమర్థో వృషః శుక్రలః తమాత్మన ఇచ్ఛతీతి వృషస్యంతీ – వీర్యాధికుఁడైనవానిని గోరునది. ౧. సురతం కామయత ఇతి కాముకీ. సీ. కము కాంతౌ. సురతమును గోరునది. ఈ ౨ సురతమును గోరు స్త్రీ పేళ్లు.

**కాన్తార్థినీ తు యా యాతి సంకేతం సాభిసారికా,**

అభిసారయతే కాంతమభిసారికా. సృగతౌ. ప్రియునిగూర్చి పోవునది గనుక అభిసారిక. ఈ ౧. ప్రియునిగూర్చి సంకేతస్థానమునకుఁ బోవునది.

**పుంశ్చలీ ధర్షణీ బన్ధ కృసతీ కుల టేత్వరీ.** 10

**స్వైరిణీ పాంసులా చ స్యాత్ -**

పుమాంసం ప్రలోభ్య చలతి గచ్ఛతి పుంశ్చలీ. సీ. చల గతౌ. పురుషుని మోహింపఁజేసి పొందునది. పుంసః పరిణేతుః చలతీతి పుంశ్చలీ–తన భర్తను విడచి కదలునది. ౧. ధర్షయతి ప్రగల్భతే దర్షణీ. సీ. ఞి ధృషాప్రాగల్భ్యే. దిట్టతనము గలిగియుండునది. పా. కామోద్దీపనాత్ పుమాంసం దూరం వ్యాకర్షతీతి కర్షణీ. కృష విలేఖనే. కామోద్దీ పనము వలనఁ బురుషుని దూరమున కీడ్చుకొనిపోవునది. ౨. బధ్నాతి ఉదాసీనమపి పురుషంస్వ

వశం కరోతీతి బంధకీ. సీ. ఉదాసీనుఁడైన పురుషునిగూడ స్వవశము చేసికొనునది. ౩. నసతీ అసతీ. సీ. పతివ్రత కానిది. ౪. విటకులమటతి కులటా. ఆటపటగతౌ. విటసమూహముగూర్చి పోవునది. ౫. ఏతి అసాధుజనస్థానంతాచ్ఛీల్యే నేతి ఇత్వరీ.సీ. ఇణ్ గతౌ. అసాదుజనస్థానమును గూర్చి పోవునది. ౬. స్వైరగమనమస్యా అస్తీతిస్వైరిణీ–యథేచ్ఛ గమనముగలది. ౭. పాంసుదుశ్చరితమస్యా అస్తీతిపాంసులా – దుశ్చరితముగలది. ఈ ౮ అంకులాడిపేళ్లు.

**అశిశ్వీ శిశునా వినా,**

శిశవో న సంత్యస్యా ఇతి అశిశ్వీ. ౧. బిడ్డలు లేని స్త్రీ పేరు.

**అవీరా నిష్పతిసుతా -**

వీరః పతిః పుత్రశ్చసన విద్యతే ఽస్యా ఇత్యవీరా–వీరుఁడనఁగాఁ బతి, పుత్రుఁడును; వారు లేనిది. ౧ మగఁడు బిడ్డలును లేని స్త్రీ పేరు.

**విశ్వస్తా విధవే సమే.** 11

విశ్వసితి విగతశ్వసనేవ తిష్ఠతి మృతప్రాయత్వాదితి విశ్వస్తా. శ్వస ప్రాణనే. మృతప్రాయయైనదిగనుక ప్రాణము లేనిదానివలె నుండునది. ౧. విగతో ధవః పతి ర్యస్యాస్సా విధవా – చనిపోయిన పెనిమిటి గలది. ఈ ౨ పెనిమిటిలేని స్త్రీ పేళ్లు.

**ఆళి స్సఖీ వయస్యా చ -**

అలతి అనురూప సంబంధినీవ భూషయతి ఆళిః – అనురూపసంబంధిని వలె భూషించునది. ౧. గుణాదినా సమానా ఖ్యాతి రస్యా ఇతి సఖీ – గుణాదులచేత సమానమైన ఖ్యాతి గలది. ౨. వయసా తుల్యా వయస్యా – వయస్సుచేత సమానయైనది. ఈ 3 చెలికత్తె పేళ్లు.

**పతివత్నీ సభర్తృకా,**

జీవత్ పతి రస్యా అస్తీతి పతివత్నీ, భర్త్రా సహితా సభర్తృకా – బ్రతికియుండు పెనిమిటిగలది. ఈ ౨ మగనాలి పేళ్లు.

**వృద్ధాపలిక్నీ -**

గతవయస్కా వృద్ధా – పోయిన యౌవనము గలది. ౧. పలితరోమయోగా త్పలిక్నీ.సీ. నెరసిన వెండ్రుకలు గలది. ఈ ౨ ముదిసిన మగువ పేళ్లు.

**ప్రాజ్ఞీ తు ప్రజ్ఞా -**

ప్రకర్షేణ జానాతీతి ప్రాజ్ఞీ. ప్రజ్ఞా చ. జ్ఞా అవబోధనే. లెస్సగాఁ దెలిసినది. ఈ ౨ లౌకిక వ్యవహారమందు మిగుల నెఱుకగల స్త్రీ పేళ్లు.

**ప్రాజ్ఞాతు ధీమతీ.** 12

ప్రశస్తా ప్రజ్ఞా అస్యా ఇతి ప్రాజ్ఞా – మంచిప్రజ్ఞ గలది. ౧. ధీః అస్యా ఇతి ధీమతీ. సీ. మంచి బుద్ధిగలది. ఈ ౨ మిగులబుద్ధిగల స్త్రీ పేళ్లు.

**శూద్రీ శూద్రస్య భార్యాస్యాత్-**

శూద్రస్య స్త్రీ శూద్రీ – శూద్రుని భార్య. ౧. శూద్రజాతిదియైనను గాకపోయినను శూద్రునకు భార్యయైనదాని పేరు.

**శూద్రాతజ్జాతి రజ్గనా,**

శూద్రజాతౌ భవాస్త్రీ శూద్రా – శూద్రజాతియందుఁ బుట్టినది. శూద్రజాతి యందుఁ బుట్టి శూద్రునికిఁగాని మఱియొకనికిఁగాని పెండ్లామైనది.

**ఆభీరీతు మహాశూద్రీ జాతిపుంయోగయోస్సమే.** 13

ఆభీరస్య గోపస్య భార్యా తజ్జాతీయా వా ఆభీరీ. ఆభీరుఁడనఁగా గొల్లవాఁడు. వాని భార్యయు, ఆ గొల్లజాతి స్త్రీయును. ౧. మహాశూద్రస్య భార్యా తజ్జాతీయా వా మహాశూద్రీ. సీ. మహాశూద్రుఁడనఁగా గొల్లవాఁడు. వానిభార్యయు, తజ్జాతీయము. ౧. గొల్లవాని భార్యకును, తజ్జాతి స్త్రీకిని బేళ్లు.

**అర్యాణీ స్వయ మర్యా స్యాత్-**

అర్యకులే జాతా ఆర్యాణీ, ఆర్యా చ–వైశ్యాకులమందుఁ బుట్టినది. ఈ ౨ వైశ్యకులమందుఁ బుట్టి వైశ్యునికిఁగానీ యితరునికిఁగానీ పెండ్లామైన మగువ.

**క్షత్రియా క్షత్త్రియాణ్యపి,**

క్షత్త్రియకులే జాతా క్షత్రియా క్షత్రియాణీ చ. సీ. క్షత్త్రకుల మందుఁ బుట్టినది. ఈ ౨ క్షత్త్రియజాతియందుఁ బుట్టి క్షత్రియునికిఁగాని మఱియొకనికిఁగాని పెండ్లామైనదాని పేళ్లు.

**ఉపాధ్యాయా ప్యుపాధ్యాయీ -**

ఉపేత్య అధీయతే అస్యాస్సకాశాదిత్యుపాధ్యాయా; ఉపాధ్యాయీ చ. ఇఙ్ అధ్యయనే. ఈమె సమీపమునకు వచ్చి చదువుదురు.

ఈ ౨ తనంతటనే చదువుచెప్పునట్టి స్త్రీ పేళ్లు.

**స్యా దాచార్యాపి చ స్వతః.** 14

స్వత ఏవ మంత్రోపదేశ మాచరతి ఆచార్యా. చర గతిభక్షణయోః. తానే మంత్రోపదేశము చేయునది. ౧. తనంతట మంత్ర వ్యాఖ్యానము చేయుస్త్రీ.

**ఆచార్యానీ తు పుం యోగే -**

ఆచార్యస్య పత్నీ ఆచార్యానీ. ౧. ఆచార్యుని భార్య.

**స్యా దర్యీ-**

అర్యస్య పత్నీ అర్యీ. ౧. వైశ్యుని భార్య.

**క్షత్త్రియీ తథా,**

క్షత్త్రియస్య పత్నీ క్షత్రియీ. సీ. ౧. క్షత్రియుని పెండ్లాము.

**ఉపాధ్యాయా న్యుపాధ్యాయీ-**

ఉపాధ్యాయస్య పత్నీ ఉపాధ్యాయానీ, ఉపాధ్యాయీ చ- ఉపాధ్యాయుని పత్ని. ఈ ౨ ఉపాధ్యాయుని పెండ్లాముపేళ్లు.

**పోటా స్త్రీ పుంస లక్షణా.** 15

స్త్రీ పుంసలక్షణైః పుటతి సంశ్లిష్యతి పోటా. పుట సంశ్లేషణే. ౧. స్త్రీ పురుష లక్షణములతోఁ గూడినదాని పేరు.

**వీరపత్నీ వీరభార్యా -**

వీరః పతిర్యస్యాస్సా వీరపత్నీ–వీరుడు పతిగాఁగలది. ౧. వీరస్య భార్యా వీరభార్యా. వీరుని పెండ్లాము. ఈ ౨ వీరుని పెండ్లాముపేళ్లు.

**వీరామాతా తు వీరసూః,**

వీరస్య మాతా వీరమాతా. ఋ. సీ. వీరుని తల్లి. ౧. వీరం సూతే వీరసూః. షూఙ్ ప్రాణిప్రసవే. వీరునిఁగన్నది. ఈ ౨ వీరుని తల్లి పేళ్లు.

**జాతాపత్యా ప్రజాతా చ ప్రసూతా చ ప్రసూతికా.** 16

జాతమపత్య మస్యాః జాతాపత్యా –పుట్టిన బిడ్డ గలది. ౧. ప్రకర్షేణ జాయంతే అపత్యా న్యస్యాః ప్రజాతా – మిక్కిలి బిడ్డలు దీని యందుఁ బుట్టుదురు. ౨. ప్రసూయతే పుత్రాౝ ప్రసూతా; ప్రసూతికా చ–బిడ్డలను గనునది. ఈ ౪ బిడ్డలఁ గనుదాని పేళ్లు.

**స్త్రీ నగ్నికా కోటవీ స్యాత్ -**

నజతే నగ్ని కా. ఓనజీ వ్రీడే. లజ్జించునది. ౧. కుటేన కౌటిల్యేన వేతి యాతీతి కోటవీ. సీ. వీ గతిప్రజనన కాంత్యసన ఖాదనేషు. కౌటిల్యముచేత పోవునది. ఈ ౨ దిసమొలతో నుండు స్త్రీ పేళ్లు.

**దూతీ సంచారికే సమే,**

దూయతేస్త్రీవా పుమాన్ వా అనయేతి దూతీ. సీ. దూఙ్ పరితాపే. దీనిచేత పురుషుఁడుగాని స్త్రీగాని అన్యోన్య విషయమై పరితపింపఁజేయఁబడును. ౧. సంచారయతి ప్రాపయతి పుమాంసం స్త్రియ మితి సంచారికా. చర గతౌ. పురుషుని స్త్రీని గూర్చునది. ఈ ౨ దూతిక పేళ్లు.

**కాత్యాయన్యర్ధవృద్ధా యా కాషాయవసనాథవా.** 17

యా అర్ధజరతీ కాషాయవసనా విధవాచ సా కాత్యాయనీత్యుచ్యతే – సగము ముదిసి కావిచీరఁ గట్టి విధవయైన స్త్రీ కాత్యాయని యనంబడును. కత్యస్య ఋషే రపత్యమివ వర్తతే కాత్యాయనీ. సీ. కత్యుఁడను ఋషి కూఁతురివలె నుండునది.

**సైరంధ్రీ పరవేశ్మస్థా స్వవశా శిల్పకారికా,**

పరగృహస్థా స్వతంత్రా, ప్రసాధనదర్పణాది శిల్పకర్త్రీ సైరంధ్రీత్యుచ్యతే – స్వతంత్రురాలై పరగృహమున నుండి గంధలేపనము తిలక నిర్మాణము మొదలైన పనులు చేసెడు స్త్రీ సైరంధ్రి యనంబడును. స్వైరం స్వచ్ఛందం వర్తనం దధాతి సైరంధ్రీ. డుధాఞ్ ధారణ పోషణయోః. స్వేచ్ఛావిహారమును ధరించునది.

**అసిక్నీ స్యాదవృద్ధా యా ప్రేష్యాంతఃపురచారిణీ.** 18

అవృద్ధా అంతఃపురచారిణి రాజస్త్రీభిః కార్యార్థంయా ప్రేష్యతే సా అసిక్నీత్యుచ్యతే – ముదుసలిగాక రాజస్త్రీలు చెప్పిన పనులు చేయుచు నంతః పురమందు సంచరించు మగువ అసిక్ని యనంబడును. అసితకేశ యోగాదసిక్నీ – నెరియని వెండ్రుకలు గలది.

**వారస్త్రీ గణికా వేశ్యా రూపాజీవా -**

వార స్సమూహః, తస్య స్త్రీ వార స్త్రీ – అందఱికి స్వాధీనురాలు. వారం వారం రాజసేవార్థమాగతా వా – రాజసేవార్థమై పలుమాఱు వచ్చునది. ౧. విటగణో ఽస్యా అస్తీతి గణికా–విట సమూహము గలది. గణయతి ధనికా నితి గణికా. గణసంఖ్యానే. ధనికులు నెంచునది. ౨. వేశే

భవా వేశ్యా–వేశమనఁగా వేశ్యావాటిక. దానియందుఁ బుట్టియుండునది. వేశో నైపథ్యం తేన శోభతే వేశ్యా – అలంకారముచేత ప్రకాశించునది. ౩. రూపమేవ ఆజీవో జీవికా అస్యా ఇతి రూపాజీవా – రూపమే జీవనోపాయముగాఁ గలది. ఈ ౪ లంజె పేళ్లు.

**అథసా జనైః,**

**సత్కృతా వారముఖ్యా స్యాత్ -**

వారే వేశ్యా సమూహే ముఖ్యా వారముఖ్యా–వేశ్యా సమూహమునందు ముఖ్యురాలు, గుణాతిశయము వలన సత్కరింపఁబడెడు వేశ్య.

**కుట్టనీ శమ్భళీ సమే.** 19

విటస్య కుటుంబం అర్థమరణేన కుట్టయతి నాశయతీతి కుట్టనీ. కుట్ట ఛేదన భర్త్సనయోః. విటుని కుటుంబము నర్థహరణముచేతఁ జెఱుచునది. ౧. శంశ్రేయః భాలయతి హినస్తి శంభళీ. భల భల్ల పరిభాషణ హింసాదానేషు. శ్రేయస్సును జెఱుచునది. ఈ ౨ కుంటెనకత్తె పేళ్లు. లంజను విటునికిఁ దార్చునది.

**విప్రశ్నికా త్వీక్షణీకా దైవజ్ఞా -**

శుభాశుభ విషయే విశేషతః ప్రశ్నో ఽ స్యా ఇతి విప్రశ్నికా–శుభా శుభ విషయమై విశేషముగా జనులచేతఁ జేయఁబడిన ప్రశ్న గలది. ౧. ఈక్షణం శుభాశుభ దర్శనం. తదస్యా ఇతి ఈక్షణికా. ఈక్ష దర్శనే. శుభాశుభములను జూచునది. ౨. దైవం శుభాశుభం జానాతి దైవజ్ఞా. జ్ఞా అవబోధనే. దైవమనగా శుభాశుభము. దాని నెఱిఁగినది. ఈ 3 వేల్పుల సానిపేళ్లు. సోదెకత్తె.

**అథ రజస్వలా,** 20

**స్త్రీధర్మిణ్య వి రాత్రేయీ మలినీ పుష్పవత్యపి.**

**ఋతుమత్య ప్యుదక్యాపి -**

రజో ఽ స్త్యస్యా ఇతి రజస్వలా–రజస్సు గలిగినది. ౧.రజోరూపః స్త్రీ ధర్మో ఽ స్యా అస్తీతి స్త్రీధర్మిణీ–రజోరూపమైన స్త్రీ ధర్మము గలిగినది. ౨. అవ్యతే అస్మిౝ కాలే రక్షో భయాదితి అవిః. ఇ. సీ. అవరక్షణే. ఆ కాలమందు భూతాది భయమువలన రక్షింపఁ బడును. ౩. అత్రేరపత్యమివ ఆత్రేయీ–అత్రికూఁతురు ఆత్రేయి; దానివలె పొందరానిది. ౪.

మలినమార్తవ మస్యా ఇతి మలినీ – మలిన మనఁగా ఆర్తవము; ఆది దీని యందుఁ గలదు. ౫. పుష్పమార్తవ మస్యాః పుష్పవతీ–పుష్పమనఁగా ఆర్తవము; అది దీనికిఁ గలదు. ౬. ఋతురస్యా అస్తీతి ఋతుమతీ – ఋతువు దీనికిఁ గలదు. ౭. చతుర్థే௨హని ఉదకమర్హతి ఉదక్యా – నాలవదినము నుదకమున కర్హురాలు. ఈ ౮ బహిష్ఠయయిన దానిపేళ్లు.

**స్యా ద్రజః పుష్ప మా ర్తవమ్.**

రజ్యతే రజః. స. న. ఎఱ్ఱగాఁజేయునది. ౧. పుత్రాఖ్య ఫలహేతు త్వాత్పుష్పం – పుత్రాఖ్య ఫలమునకు హేతువయినది. పుష్ప్యతే వికసతి యోని రనేనేతి పుష్పం. పుష్ప వికసనే. దీనిచేత యోని వికసించును. ౨. ఋతౌ భవ మార్తవం – ఋతువు నందుఁ బుట్టినది. ఈ 3 రజోబిందువుపేళ్లు.

**శ్రద్ధాలు ర్దోహదవతీ -**

పాయసాపూపాదిషు శ్రద్ధా ఇచ్ఛా అస్యా ఇతి శ్రద్ధాలుః. ఉ. సీ. పాయసాపూపాదులయందు ఆశ గలిగినది. ౧. దోహదో௨స్యా అస్తీతి దోహదవతీ – వేవిళ్లుగలది. ఈ ౨ గర్భవశమున మంచి వస్తువులఁ గోరెడుదాని పేళ్లు.

**నిష్కళా విగతార్తవా.** 21

నిర్గతం కళం శుక్రమస్యా ఇతి నిష్కళా – శుక్రమువలనఁ బాసినది. పా. నిష్కళీ. ౧. విగతమార్తవమస్యా ఇతి విగతార్తవా–పోయిన ముట్టుగలది. ఈ ౨ ముట్టుడిగిన వనిత పేళ్లు.

**ఆపన్నసత్వా స్యా ద్గుర్విణ్యన్తర్వత్నీ చ గర్భిణీ,**

ఆపన్నం గృహీతం సత్వం గర్భో௨నయే త్యాపన్నసత్వా–గ్రహింపఁబడిన గర్భముగలది. ౧. గురు గర్భ శరీర మస్త్యస్యా మితి గుర్విణీ – బలువైన గర్భ శరీరము గలది. ౨. ఉదరాంతర్గర్భో௨స్యా అంతర్వత్నీ–కడుపులో గర్భము గలది. ౩. గర్భో௨స్యా ఇతి గర్భిణీ–గర్భము గలది. ఆపన్న సత్వా గుర్వీస్యాదితి పాఠ ఇతి కేచిత్. ఈ ౪ గర్భిణీ స్త్రీ పేళ్లు.

**గణికాదేస్తు గాణిక్యం గార్భిణం యౌవతం గణే.** 22

గణికాదేర్గణే గాణిక్యాదీని వర్తంతే – గణికాది సమూహమందు గాణిక్యాది శబ్దములు వర్తించును. గణికానాం సమూహో గాణిక్యం – వేశ్యల యొక్క సమూహము. ౧. గర్భిణీనాం సమూహః గార్భిణం – చూ

లాంఁడ్ర యొక్క గుంపు. యువతీనాం సమూహః యౌవతం. పా. యౌవనం. యువతుల యొక్క సమూహము. "సురోప మతినైపథ్యం కళాకుశలయౌవనం, యస్య పుణ్యకృతః ప్రేష్యం సఫలం తస్య యౌవన" మితి.

**పునర్భూర్దిధిషూ రూఢా ద్విః -**

ప్రథమ మేకస్య జాయా భూత్వా పునః అన్యస్య జాయా భవతీతి పునర్భూః. ఊ. సీ. ముందొకనికి పెండ్లామై యుండి మరల మఱియొకనికి పెండ్లామగునది. ౧. పూర్వమేకేన ధృతా పునరన్యేన ధీయత ఇతి దిధిషూః. ఊ. సీ. డు ధాఞ్ ధారణ పోషణయోః. ముందొకని చేత ధరింపఁబడి మరల మఱొకనిచేత ధరింపఁ బడునది. ఈ ౨ మాఱుమనువుదాని పేళ్లు. రెండుమార్లు పెండ్లాడినది.

**తస్యా దిధిషుః పతిః,**

దిధిషా మాత్మన ఇచ్ఛతీతి దిధిషుః. ఉ. పు. పునర్భువు నిచ్ఛయించువాఁడు. ౧. మాఱుమనువుదాని రెండవ మగఁడు.

**స తు ద్విజో ౾గ్రేదిధిషుస్సైన యస్య కుటుమ్బినీ.** 23

సా పునర్భూరేవ యస్య కుటుంబినీ పుత్రపౌత్ర ప్రతిష్ఠితా, సఃద్విజః అగ్రేదిధిషు రిత్యుచ్యతే. ద్విజశబ్దగ్రహణ ముపలక్షణార్థం. ఆ మాఱుమనువుదానిఁ బెండ్లాడి దానియందు బిడ్డలఁ గన్న ద్విజుఁడు అగ్రే దిధిషు మనంబడును. అగ్రే పూర్వకాలే దిధిషూః భార్యాత్వేనాస్యే త్య గ్రేదిధిషుః. ౧. ఆ మాఱుమనువుదానినే ప్రధాన భార్య (ఇల్లాలు) గాఁ జేసికొన్నవాని పేరు.

**కానీనః కన్యకాజాత స్సుతః -**

కన్యాయాః పుత్రః కానీనః–కన్యక కొడుకు. ౧. పెండ్లిగాని పడుచుకొడుకు.

**అథ సుభగాసుతః,**

**సౌభాగినేయః -**

సుభగాయా స్సుతః సుభగాసుతః. ౧. సుభగాయా అపత్యం సౌభాగినేయః –భాగ్యవంతురాలి కొడుకు. ఈ ౨ భాగ్యవంతురాలి కొడుకు పేళ్లు.

**స్యా త్పారస్త్రైణేయస్తు పరస్త్రియాః.** 24

పరస్త్రియా అపత్యం పారస్త్రైణేయః – పరస్త్రీ కొడుకు. ౧.

పరస్త్రీకిఁ బుట్టిన కొడుకు పేళ్లు.

**పైతృష్వసేయ స్స్యా త్పైతృష్వస్రీయశ్చ పితృష్వసుః,**
**సుతః -**

పితృష్వసుః పుత్రః పైతృష్వసేయః, పైతృష్వస్రీయశ్చ–పితృష్వస యనఁగా తండ్రితోడఁబుట్టినది, ఆమె కొడుకు. ఈ ౨ మేనత్త కొడుకుపేళ్లు.

**మాతృష్వసుశ్చైవమ్-**

మాతృష్వసుః పుత్రః మాతృష్వసేయః, మాతృష్వస్రీయశ్చ. మాతృష్వసకు పుత్రుఁడు. ఈ ౨ తల్లితోడఁబుట్టినదాని కొడుకుపేళ్లు.

**వైమాత్రేయో విమాతృజః.** 25

విగతా విభిన్నావా మాతా విమాతా, తస్యా అపత్యం వైమాత్రేయః–విమాత యనఁగా సవతితల్లి, ఆమె కొడుకు. పా. ద్వేమాతరౌ యస్య ద్వైమాత్రేయః–ఇద్దఱు తల్లులుగలవాఁడు. ౧. విమాతుర్జాతః విమాతృజః–సవతి తల్లి వలనఁ బుట్టినవాఁడు. పా. ద్వాభ్యాం మాతృభ్యాం జాయత ఇతి ద్విమాతృజః. జనీ ప్రాదుర్భావే. ఇద్దఱు తల్లులవలనఁ బుట్టినవాఁడు. ఈ ౨ మాఱుఁదల్లి కొడుకు పేళ్లు.

**అథ బాన్ధకినేయ స్స్యాద్బన్ధుల శ్చాసతీసుతః,**
**కౌలటేయః కౌల టేర -**

బంధక్యాః అపత్యం బాంధకినేయః–ఱంకులాడియొక్క కొడుకు. ౧. స్వకుల పరిణాహాయ బంధూ౯ లాతి స్వీయా౯ కరోతీతి బంధులః. లా ఆదానే. స్వకులమును విస్తరింపఁజేయుటకొఱకు బంధువులను చేరఁదీయువాఁడు. స్వనిందా పరిహారాయ బంధూ౯ లాతి ఆత్మీయా౯ కరోతీతి బంధులః – తననింద పోవుటకొఱకు బంధువులఁ దనవారిఁగాఁ జేసికొనువాఁడు. ౨. అసత్యాస్సుతః అసతీసుతః – వ్యభిచారిణి యొక్క కొడుకు. ౩. కులటాయాః అపత్యం కౌలటేయః, కౌలటేశరశ్చ–కులట యొక్క పుత్రుఁడు. ఈ ౫ ఱంకులాడి కొడుకు పేళ్లు.

**భిక్షుకీ తు సతీ యది.** 26

తదా కౌలటినేయో ఽ స్యాః కౌలటేయో ఽ పి చాత్మజే,

భిక్షార్థం కులా న్యటతి కులటా, తస్యాః పుత్రః కౌలటినేయః,

కౌలటేయశ్చ. భిక్షార్థమై గృహములయందు సంచరించునది కులట, దానియొక్క పుత్రుఁడు కౌలటినేయుఁడు, కౌలటేయుఁడు. ఈ ౨ భిక్షార్థమై చరించు పతివ్రత కొడుకు పేళ్లు.

**ఆత్మజ స్తనయ స్సూను స్సుతః పుత్రః-**

ఆత్మనః జాయతే ఆత్మజః. జనీ ప్రాదుర్భావే. తనవలనఁ బుట్టిన వాఁడు. ఆత్మైవ పుత్రత్వేన జాయత ఇత్యాత్మజః – తానే పుత్రరూపముగా జనించువాఁడు. ౧. కులం ముదం వా తనోతీతి తనయః. తను విస్తారే. కులముగాని సంతోషమునుగాని విస్తరింపఁజేయువాఁడు. ౨. మాతా ఏనం సూయతే సూనుః. పు. షూఙ్ ప్రాణిప్రసవే. తల్లి వీనిని గనును. ౩. సౌత్యేనం మాతా సుతః. షుప్రసవైశ్వర్యయోః. తల్లి వీనిని ప్రసవించును. ౪. పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః. త్రైఙ్‌పాలనే. పుంఅనెడి నరకముల వలన రక్షించువాఁడు. ఈ ౫ కొడుకుపేళ్లు.

**స్త్రియాం త్వమీ.** 27

**ఆహు ర్దుహితరం సర్వే -**

అమీ ఆత్మజాదయః పంచస్త్రీ ప్రత్యయాన్తాః దుహితరమాహుః – ఇవి స్త్రీలింగములైనచోఁ గొమార్తెను జెప్పుచున్నవి. అపుడు ఆత్మజా తనయా, సూనుః సుతా, పుత్రీ అని రూపములు. కొమార్తె దుహిత యనంబడును. దోగ్ధి ధనహరణేన రిక్తీకరోతి పితరౌ దుహితా. ఋ. సీ. దుహ ప్రపూరణే. తల్లిదండ్రులను ధనహరణముచేత రిక్తులుగాఁ జేయునది. కూఁతురిపేరు.

**అపత్యం తోకం తయోస్సమే,**

న పత త్యనేన పితా నరకమితి అపత్యం. పత్ ౯ గతౌ. దీనిచేత తండ్రి నరకమునఁ బడఁడు. ౧. తౌతి కుల మనేన తోకం. తు ఇతి సౌత్రో ధాతు ర్గతి వృద్ధిహింసాను. వీనిచేత కులము వృద్ధిఁ బొందును. ఈ ౨ కొడుకునకును కూఁతురికిని పేళ్లు.

**స్వజాతే త్వౌర సౌరస్యౌ -**

ఉరసా నిర్మితః ఔరసశ్చ – తనయురస్సుచేత పుట్టినవాఁడు. స్వజాతే అను పదముచేత దత్తక్షేత్రజాది నిరాసము. ఈ ౨ సవర్ణస్త్రీయందు తనవలనఁ బుట్టిన కొడుకు పేళ్లు.

**తాతస్తు జనకః పితా.** 28

తనోతి కులం తాతః. తను విస్తారే. కులమును విస్తరింపఁజేయువాఁడు. ౧. జనయతీతి జనకః. జనీ ప్రాదుర్భావే. పుట్టించువాఁడు. ౨. పాతీతి పితా. ఋ. పు. పా రక్షణే. రక్షించువాఁడు. ఈ 3 తండ్రి పేళ్లు.

**జనయిత్రీ ప్రసూర్మాతా జననీ -**

జనయతీతి జనయిత్రీ; జననీ చ. సీ. జనీప్రాదుర్భావే. కొడుకులఁ గనునది. ౧, ౨. ప్రసూతే ప్రసూః. ఊ. సీ. షూఙ్ ప్రాణి ప్రసవే. కొడుకులను గనునది. ౩. మాతి వర్తతే గర్భో ఽత్ర మాతా. ఋ. సీ. మామానేవర్తనే చ-గర్భ మీమెయం దిమిడియుండును. ఈ ౪ తల్లి పేళ్లు.

**భగినీ స్వసా,**

భగః కల్యాణం శ్రేయః వివాహే ఽస్యా ఇతి భగినీ - వివాహ మందిలి శ్రేయస్సుగలది. ౧. సుష్ఠు అస్య సోద రాయాసమితి స్వసా. ఋ. సీ. అసు క్షేపణే. సోదరుని యాయాసమును బోఁగొట్టునది. ఈ ౨ తోడఁ బుట్టిన స్త్రీ పేళ్లు.

**ననన్దా తు స్వసా పత్యుః -**

న నన్దయతీతి ననన్దా. ఋ. సీ. టు నది సమృద్ధౌ. సంతోషింపఁ జేయనిది. దీర్ఘ మధ్యమంబును హ్రస్వమధ్యంబును గలదు. "నవన్దాతు స్వసాపత్యుర్న నాన్దా నన్దినీచ" నేతి శబ్దార్ణవే. మగనితోడఁ బుట్టిన స్త్రీ పేరు. ఆఁడుబిడ్డ.

**నప్త్రీ పౌత్రీ సుతాత్మజా.** 29

న పత త్యనయా కులమితి నప్త్రీ. ఈ. సీ. పత్ ౯ గతౌ. కులము దీనిచేత పడదు. ఋకారాంతము గలదు. 'నప్తా నప్త్రీ చ పౌత్రికే' తి రభసః. ౧. పుత్రస్య పుత్ర్యావా అపత్యం పౌత్రీ-కొడుకునకైనను కూఁతునకైనను కూఁతురు. ఈ ౨ మనుమరాలి పేళ్లు.

**భార్యాస్తు భ్రాతృవర్గస్య యాతర స్స్యుః పరస్పరమ్,**

యతన్తే గృహకృత్యే యాతరః ఋ. సీ. యతీ ప్రయత్నే. గృహకృత్యమందు కలసి యత్నము చేయువారు. బహువచనము. తోడికోడండ్రు.

**ప్రజావతీ భ్రాతృజాయా -**

దేవరాదయః ప్రజాస్సన్త్యస్యా ఇతి ప్రజావతీ.సీ.మఱంది మొదలైన ప్రజలు గలది. ౧. భ్రాతుః జాయా భ్రాతృజాయా–తోడఁబుట్టినవాని పెండ్లాము. ఈ ౨ సోదరుని పెండ్లాము. అన్న భార్యయని కొందఱు.

**మాతులానీ తు మాతులీ.** 30

మాతులస్య పత్నీ మాతులానీ. మాతులీ చ. సీ. మేనమామ పెండ్లాము. ఈ ౨ మేనమామ పెండ్లాము పేళ్లు.

**పతిపత్న్యోః ప్రసూః శ్వశ్రూః-**

పత్యుః భర్తుః పత్న్యాః భార్యాయాశ్చ ప్రసూర్మాతా, శ్వశ్రూరిత్యుచ్యతే– మగనియొక్కయు, ఆలియొక్కయు తల్లి శ్వశ్రువు. అత్త. శ్వశురస్య పత్నీ శ్వశ్రూః ఊ. సీ. ఈ. ౧ మామపెండ్లాము అత్త.

**శ్వశురస్తు పితా తయోః,**

తయోః పతిపత్న్యోః పితా శ్వశుర ఇత్యుచ్యతే–పెనిమిటి యొక్కయు పెండ్లాము యొక్కయు తండ్రి శ్వశురుఁ డనంబడును. శం సుఖం అశ్నుతే జామాతరం స్నుషాం చ లబ్ధ్వా శ్వశురః. అశూవ్యాప్తౌ. అల్లునిఁగాని కోడలినిగాని పొంది సుఖము ననుభవించువాఁడు. మగని తండ్రికిని, ఆలి తండ్రికిని పేరు. మామ.

**పితుర్భ్రాతా పితృవ్యస్స్యాత్ -**

పితుః భ్రాతా పితృవ్యః. ౧. తండ్రి తోడఁబుట్టినవాఁడు. ౧. పెత్తండ్రియు, పినతండ్రియు.

**మాతుర్భ్రాతాతు మాతులః.** 31

మాతుః భ్రాతామాతులః – తల్లితోడఁ బుట్టినవాఁడు. ఈ ౧. మేనమామపేరు.

**స్యాలా స్స్యు ...తరః పత్న్యాః-**

స్యామయన్తి వితర్కయన్తి పరిహాసవచన మితి స్యాలః.పా. శ్యాలః. స్యము వితర్కే. పరిహాసము చేయువాఁడు. ఈ ౧ పెండ్లాముతోఁ బుట్టినవారిపేరు. బావమఱఁదులు.

**స్వామినో దేవృదేవరౌ,**

భ్రాతృజాయాభిస్సహ పరిహాసేన దీవ్యతి క్రీడతే దేవా. ఋ. పు. దేవరవ్చ – అన్నదమ్ములభార్యలతో పరిహాసముచేఁ గ్రీడించువాఁడు. ఈ

౨. మగనితోఁ బుట్టినవారు. బావలు, మఱఁదులును.

**స్వస్రీయో భాగినేయ స్స్యాత్-**

స్వసుః అపత్యం పుమాన్ స్వస్రీయః. ౧. భగిన్యాః అపత్యం పుమాన్ భాగినేయః–తోడఁబుట్టిన యామె కొడుకు. ఈ ౨ తోడఁబుట్టిన దాని కొడుకుపేళ్లు. మేనల్లుఁడు.

**జామాతా దుహితుః పతిః.** 32

జాయాం మిమాతే జామాతా. ఋ. పు. మాఙ్ మానే. పెండ్లామును వివాహార్థమై కొలుచువాఁడు. ౧. దుహితుః పతిః దుహితుఃపతిః–కూఁతురిమగఁడు. అలుక్సమాసము. ఈ ౨ కూఁతురు మగనిపేళ్లు. అల్లుఁడు.

**పితామహః పితృపితా-**

పితుః పితా పితామహః. ఈ ౧ తండ్రితండ్రి–తాత.

**తత్పితా ప్రితామహః,**

పితామహస్య పితాప్రకర్షేణ ప్రపితామహః. ఈ ౧ తాతతండ్రి. ముత్తాత.

**మాతు ర్మాతా మహో ద్యేవమ్ -**

మాతుః పితా మాతామహః–తల్లికి తండ్రి. ౧. మాతామహాత్ప్రకృష్టః ప్రమాతామహః. ఈ ౧ మాతామహుని (తండ్రి పేరు).

**సపిణ్డాస్తు సనాభయః.** 33

సమానః ఏకః పిండః పిండప్రదాన మేషామితి సపిండాః–సమానమైన పిండప్రదానము గలవారు. సమానః ఏకః పిండః శరీరమేషామితి వా సపిండాః–ఒక్కటైన శరీరము గలవారు. ౧. సమాన నాభిః మూలకారణం కూటస్థపురుషో యేషామితి సనాభయః. ఇ.పు.సమానమైనకూటస్థ పురుషుఁడు గలవారు. ఈ ౨ ఏడుతరములకు లోఁబడిన జ్ఞాతులపేళ్లు.

**సమానోదర్య సోదర్య సగర్భ్య సహజా స్సమాః,**

సమానే ఉదరే శయితః సమానోదర్యః, సోదర్యశ్చ–ఒక గర్భమం దున్నవాఁడు. ౧, ౨. సమానే గర్భేభవ స్సగర్భ్యః–ఒక గర్భమునఁబుట్టినవాఁడు. ౩ సహ జాయత ఇతి సహజః. జనీ ప్రాదుర్భావే. కూడఁబుట్టినవాఁడు. ఈ ౪ ఒకతల్లి బిడ్డలపేళ్లు.

**సగోత్రబాన్ధవ జ్ఞాతి బన్ధు స్వ స్వజనా స్సమాః.** 34

సమానం గోత్రంయేషాంతే సగోత్రాః – సమానమైన గోత్రముగల

వారు. ౧. బధ్నాతి ప్రీతిమితి - బన్ధుః. పు. బన్ధురేవ బాన్ధవః. బంధ బంధనే. ప్రీతిని బొందించువాఁడు. ౨, ౩. అంతరంగతయా జ్ఞాయత ఇతి జ్ఞాతిః. పు.జ్ఞా అవబోధనే. తనవాఁడని యెఱుఁగఁబడువాఁడు. ౪. స్వధనసంబంధిత్వాత్స్వః-తన ధన సంబంధము గలవాఁడు. ౫. స్వసంబంధీజనః స్వజనః-తన సంబంధమైన జనుఁడు. ఈ ౬ ఒక గోత్రము గల జ్ఞాతుల పేళ్లు.

**జ్ఞాతేయం బన్ధుతా తేషాం క్రమాద్భావ సమూహయోః,**

జ్ఞాతేర్భావో జ్ఞాతేయం - జ్ఞాతియొక్క భావము. ౧. బంధూనాం సమూహోబంధుతా-బంధువులయొక్క సముదాయము. ఈ ౨ వరుసగా జ్ఞాతి భావమునకును, బంధుసమూహమునకును బేళ్లు.

**ధవః ప్రియః పతిర్భర్తా-**

ధునోతి స్త్రియం దవః. ధూఞ్ కంపనే. స్త్రీని కంపించువాఁడు. ౧. ప్రీణాతి ప్రియః. ప్రీఞ్ ప్రీణనే. ప్రేమించువాఁడు. ౨. పాతీతి పతిః. పా రక్షణే. రక్షించువాఁడు. ౩. బిభర్తీతి భర్తా. ఋ. పు. డు భృఞ్ ధారణపోషణయోః. భరించువాఃడు. ఈ ౪ మగనిపేళ్లు.

**జార స్తూపపతి స్సమా.** 35

జరయతి పరస్త్రియమితి జారః. జౄష్ వయోహానౌ. పరస్త్రీని శిథిలముగాఁ జేయువాఁడు. ౧. పత్యా ఉపమితః ఉపపతిః. పు. పతితో సరిపోల్పఁబడువాఁడు. ఈ ౨ ఱంకుమగని పేళ్లు.

**అమృతె జారజః కుణ్డః -**

కుండయతి క్షేత్రిజః కులంః కుండః. కుడి దాహే. పెండ్లాము గల వారికులమును దహించువాఁడు. మగఁడు బ్రతికియుండఁగా మఱియొకనికిఁ గన్నకొడుకు.

**మృతే భర్తరి గోళకః,**

గుల్యతే అప్రకాశత్వేనేతి గోళకః. గుడ రక్షణే. అప్రకాశముగా రక్షింపఁ బడువాఁడు. మగఁడు చచ్చినవెనుక జారునికిఁ గన్నకొడుకు.

**భ్రాత్రీయో భ్రాతృజః -**

భ్రాతురపత్యం భ్రాత్రీయః-తోడఁబుట్టినవాని కొడుకు. ౧. భ్రాతుర్జాతో భ్రాతృజః. జనీ ప్రాదుర్భావే. తోడఁబుట్టినవానికొడుకు. ఈ ౨ తోడఁబుట్టినవాని కొడుకు పేళ్లు.

**భ్రాతృ భగిన్యౌ భ్రాతరా వుభౌ.** 36

భ్రాతా చ భగినీ చ భ్రాతరౌ. ఋ. పు. తోడఁబుట్టినవారు. అన్నదమ్ములు. అక్కసెలియండ్రు.

**మాతాపితరౌ పితరౌ మాతరపితరౌ ప్రసూజనయితారౌ.**

మాతా చ పితా చ మాతాపితరౌ. పితరౌ. మాతరపితరౌచ. ఋ. పు. ప్రసూశ్చ జనయితా చ ప్రసూజనయితారః. ఋ. పు. తల్లిదండ్రులు మాతాపితలు, పితలు, మాతరపితరులు, ప్రసూజనయితలు ననంబడుదురు. మాతరపితర శబ్దము అకారాంతం బని కొందఱు. తల్లిదండ్రులపేళ్లు.

**శ్వశ్రూశ్వశురౌ శ్వశురౌ-**

శ్వశ్రూశ్చ శ్వశురశ్చ శ్వశ్రూశ్వశురౌ, శ్వశురౌ చ. అ. పు. అత్తమామలకు పేళ్లు.

**పుత్రౌ పుత్రశ్చ దుహితా చ.** 37

పుత్రశ్చ దుహితా చ పుత్రౌ – కొడుకును గూఁతురును.

**దంపతీ జంపతీ జాయాపతీ భార్యాపతీ చ తౌ,**

దమితి జమితి మాంత మవ్యయద్వయం జాయాశబ్దపర్యాయం. జాయా చ పతిశ్చ దంపతీ, జంపతీ, జాయాపతీ చ. భార్యా చ పతిశ్చ భార్యాపతి – ఆలుమగలు దంపతులు, జంపతులు, జాయాపతులు, భార్యాపతులు ననం బడుదురు. ఈ ౪ ఆలుమగలు.

**గర్భాశయో జరాయుః స్యాత్ -**

గర్భః ఆశేతే ఽత్ర గర్భాశయః. శీఙ్ స్వప్నే. గర్భము దీని యందుండును. ౧. గర్భనిష్క్రమణానన్తరం జరాం జీర్ణతా మేతి జరాయుః. ఉ. పు. ఇణ్. గతౌ. గర్భము వెళ్ళినపిమ్మట జీర్ణత్వమును బొందునది. స. జరాయుః. ఈ ౨ మావిపేళ్లు.

**ఉల్బం చ కలలో ఽస్త్రియామ్.** 38

ఉల త్యావృణోతి గర్భమిత్యుల్బం. ఉల సంవరణే. గర్భమును గప్పి యుండునది. ౧. కలతః యోగాత్ శుక్ల శోణితే మిథస్సంగచ్ఛేతే అత్రేతి కలలః. అ. ప్న. కల సంఖ్యానే. శుక్లశోణితముల దీనియందు కూడుకొని యుండును. ఈ ౨ శుక్లశోణితములు గూడిన గర్భపిండము

పేళ్లు. గర్భాశయశబ్దము మొదలు ౪ శబ్దములును పర్యా పదములే యని కొందఱు.

**సూతిమాసో వైజననః-**

సూతిహేతుర్మాసస్సూతిమాసః–బిడ్డను గను నెల. ౧. విజననం గర్భమోచనం త దస్మిన్న స్తీతివైజననః – విజనన మనఁగా గర్భోత్పత్తి; అది దీనియందుఁ గలదు. ఈ ౨ బిడ్డను గను నెల పేళ్లు.

**గర్భో భ్రూణ ఇమౌ సమౌ,**

మాతృభుక్తాన్న రసం గిరతీతి గర్భః. గౄ నిగరణే. తల్లి భుజించిన యన్నపానాదుల మ్రింగునది. ౧. భ్రామ్యతి కుక్షావితి భ్రూణః. భ్రము అనవస్థానే. కడుపులోఁ దిరుగునది. భ్రియతే మాత్రేతి వా భ్రూణః. భృఞ్ బరణే. తల్లిచే భరింపఁబడుని. ఈ ౨ గర్భము పేళ్లు.

**తృతీయా ప్రకృతి ష్షణ్డః క్లీబః పణ్డో నపుంసకమ్.** 39

స్త్రీపుంసాపేక్షయా తృతీయః ప్రకారః తృతీయా ప్రకృతిః. సీ. ప్రథమా ప్రకృతిః స్త్రీ, ద్వితీయా ప్రకృతిః పుమాన్ స్త్రీ పురుషులను గూర్చి మూఁడవ ప్రకృతి గనుక తృతీయాప్రకృతి. ఈశబ్దము సమానమయ్యెనేని తృతీయ ప్రకృతియని పుంభావము కావలెఁ గనుక వ్యస్తపదమని కొందఱు. పుంవద్భావమునకుఁ బ్రతషేధముగలదు గనుక సమస్తపదమని కొందఱు. ౧. సనోతిస్వస్యాపఖ్యాతి నివారణార్థమితి షండః. షణు దానే. తనయపఖ్యాతి పోవుకొఱకు ధనాదుల నిచ్చువాఁడు. పా. శ్యామతి ప్రజావిచ్ఛేదేన శండః. శము ఉపశమే. సంతతి విచ్ఛేదముచేత శమియించి యుండువాఁడు. ౨. క్లీబతే అధీరో భవతి క్లీబః. క్లీబృ అథార్ష్ట్యే. అధీరుఁడైనవాఁడు. ౩. పణ్డతే లజ్జయా ప్రదేశాన్తరం గచ్ఛతి పండః. పడి గతౌ. లజ్జచేత దేశాంతరమును గూర్చి పోవువాఁడు. ౪. న స్త్రీపుంసౌ నపుంసకః. స్త్రీపురుషులు కానివాఁడు. ఈ ౫ నపుంసకుని పేళ్లు.

**శిశుత్వం శైశవం బాల్యమ్-**

శిశో ర్భావశ్శివుత్వం, శైశవంచ– శిశువు యొక్క భావము శిశుత్వము, శైశవము. ౧, ౨. బాలస్య భావః బాల్యం–బాలునియొక్క భావము. ఈ 3 పదియాఱేండ్లకు లోఁబడిన వయస్సు.

**తారుణ్యం యౌవనం సమే,**

తరుణస్య భావః తారుణ్యం. యూనో భావః యౌవనం. పిన్న వయస్సువాని యొక్క భావము తారుణ్యము, యౌవనము. ఈ ౨ మంచి నడిమి వయస్సు పేళ్లు.

**స్యాత్ స్థావిరం తు వృద్ధత్వమ్-**

స్థవిరస్య భావః స్థావిరం; వృద్ధస్య భావః వృద్ధత్వం - వృద్ధుని యొక్క భావము స్థావిరము, వృద్ధ్వము. ఈ ౨ ఏఁబదియేండ్లకు మీఁది ముదిమివయస్సు పేళ్లు.

**వృద్ధసంఘే ఽ పి వార్ధకమ్.** 40

"వృద్ధసంఘే ఽ పి" అని అపిశబ్దము చేత వృద్ధునియొక్క భావము క్రియము వార్ధక మనంబడును. వృద్ధస్య భావ స్సమూహః కర్తవా వార్ధకం–వృద్ధభావముగాని వృద్ధ సమూహముగాని వృద్ధకర్మగాని వార్ధకమనంబడును. తథాచోక్తం–"భావే కర్మణి వృద్ధస్య వార్ధకం నికురుంబక" ఇతి. ఈ ౧ వృద్ధుల సమూహమునకును అపిశబ్దమువలన ముదిమికిని పేరు.

**పలితం జరసా శౌక్ల్యం కేశాదౌ-**

పలతి గచ్ఛత్యనేన శరీరసౌన్దర్యమితి పలితం. పలగతౌ. దీనిచే శరీర సౌందర్యము పోవును. ముదిమివలన వెంట్రుకలు మొదలగునవి తెల్లనగుట.

**విస్రసాజరా,**

విస్రంసతే అధఃపతతి శరీర మనయేతి విస్రసా. స్రంసు అధఃపతనే. శరీరము దీనిచేత దిగువఁబడును. ౧. జీర్యంత్యనయా అఙ్గానీతి జరా. జౄష్వయోహానౌ. దీనిచేత అంగములు వయోహాని నొందును. చాలముదిమి.

**స్యా దుత్తానశయా డిమ్భా స్తనపాచ స్తనంధయీ.** 41

ఉత్తానే శేత ఇతి ఉత్తానశయా. శీఙ్ స్వప్నే. వెలికిలఁ బండుకొని యుండునది. ౧. డయతే గమనాయ డింభా. డీఙ్ విహాయసాగతౌ. గమనము కొఱకు నెగయునది. ౨. స్తనౌ పిబతీతి స్తనపా. స్తనౌ ధయతీతి స్తనంధయీ. పా పానే; ధేట్ పానే. చన్నుగుడుచునది. ౩. ఉత్తానశయాదిశబ్దములు త్రిలింగముల యందు వర్తించును. ఇక్కడ స్త్రీలింగ నిర్దేశము లింగ విశేషము నెఱిఁగించుటకొఱకు (సింహాదివర్గే పోతసామాన్యే పఠితస్యాపి డింభశబ్దస్య పునర్మనుష్యవర్గే ఽ భిధానం

ఉత్తానశయఏవ మనుష్యశిశా వస్య ప్రవృత్తిః, అన్యత్రప్రౌఢే మాభూదితి. ఈ ౪ చన్నుగుడుచు చిన్న పాప పేళ్లు.

**బాలస్తు స్యా న్మాణవకః-**

"ఆ షోడశాద్భవే ద్బాలస్తత స్తరుణ ఉచ్యత" ఇతి మనుః. బలతి అల్పాయాసేన బాలః. బలప్రాణనే. అల్పాయాసముచేత బ్రతుకువాఁడు. ౧. మనోరల్పమపత్యం మాణవకః – మనువుయొక్క అల్పమైన అపత్యము. ఈ ౨ పదియాఱేండ్లకు లోఁబడిన వయస్సు గలవాని పేళ్లు.

**వయఃస్థస్తరుణో యువా,**

వయసి యౌవ్వనే తిష్ఠతీతి వయస్థః. ష్ఠా గతినివృత్తౌ. యౌవ్వనమందుండువాఁడు. ౧. తరతి దుస్తరమపి తరుణః. తౄప్లవనతరణయోః. దుస్తరమైనదానిని తరించువాఁడు. ౨. యౌతి స్త్రీభిః యువా, న. పు. యు మిశ్రణే. స్త్రీలలోఁగూడువాఁడు. ఈ 3 ప్రాయపువాని పేళ్లు.

**ప్రవయా స్థవిరో వృద్ధో జీనో జీర్ణో జరన్నపి.** 42

ప్రగతం యౌవనాఖ్యం వయో ఽస్యేతి ప్రవయాః. స. పు. పోయిన యౌవనము గలవాఁడు. ౧. బహుకాలం తిష్ఠతీతి స్థవిరః. ష్ఠా గతినివృత్తౌ. బహుకాలముగా నుండెడువాఁడు. ౨. వర్ధతే వృద్ధః. వృధు వృద్ధౌ. వృద్ధిఁబొందినవాఁడు. ౩. జినాతి వయసో హీయతే జీనః. జ్యా వయోహానౌ. వయస్సువల్లఁ బాసినవాఁడు. ౪. జీర్యతే జీర్ణః, జరంశ్చ. త. పు. జౄష్ వయోహానౌ. వయో హానిగలవాఁడు. ఈ ౬ ముసలివాని పేళ్లు.

**వర్షీయాన్ దశమీ జ్యాయాన్.**

అతిశయేన వృద్ధో వర్షీయాన్ స.పు. మిక్కిలివృద్ధు. ౧. నవతే రూర్ధ్వం దశమః అవస్థావిశేషో ఽస్యాస్తీతి దశమీ. న. పు. తొంబదియేండ్ల మీఁద పదియవదైన యవస్థావిశేషము గలవాఁడు. ౨. అతిశయేన వృద్ధో జ్యాయాన్ స. మిక్కిలి వృద్ధుఁడు. ఈ 3 మిక్కిలి ముదసినవాని పేళ్లు.

**పూర్వజ స్త్వగ్రియో ఽగ్రజః.**

పూర్వస్మిన్ కాలే జాతః పూర్వజః. ౧. అగ్రే భవః అగ్రియః. ౨. అగ్రేజాత అగ్రజః. జనీప్రాదుర్భావే. తనకంటె ముందరఁ బుట్టినవాఁడు. ఈ 3 పెద్దయన్న పేళ్లు.

**జఘన్యజేస్యుః కనిష్ఠ యవీయో ౨ వర జానుజాః.** 43

జఘన్యే పశ్చాత్కాలే జాతః జఘన్యజః – తనకంటె వెనుకటి కాలమందుఁ బుట్టినవాఁడు. ౧. అత్యల్పో వయసా కనిష్ఠః–వయస్సు చేత మిక్కిలి తక్కువైనవాఁడు. ౨. అతిశయేన యువా యవీయాన్ స. మిక్కిలి పిన్నవాఁడు ౩. అవరస్మిన్ కాలే జాతః అవరజః – తరువాతి కాలమందుఁ బుట్టినవాఁడు. ౪. అను పశ్చాజ్జాతః అనుజః – వెనుకఁ బుట్టినవాఁడు. ఈ ౫ తమ్ముని పేళ్లు.

**అమాంసో దుర్బల శ్ఛాతః-**

అల్పం మాంసమస్య అమాంసః–అల్పమైన మాంసము గలవాఁడు. ౧. దుర్నిందితం బలమస్యదుర్బలః – నిందితమైన బలము గలవాఁడు. ౨. కృశత్వేన ఛిన్న ఇవాస్థానాత్ ఛాతః. ఛో చ్ఛేదనే. కృశుఁడౌటచేత చెక్కఁబడినవానివలె నుండువాఁడు. పా. శాత ఇవ తనూ కృత ఇవ తిష్ఠతీతి శాతః. శో తనూకరణే. అల్పముగాఁ జేయఁబడిన వానివలె నుండువాఁడు. ఈ 3 బక్కవాని పేళ్లు.

**బలవా న్మాసంలో ౨ ంసలః.**

బలం స్థౌల్యమస్యాస్తీతి బలవాన్ త. స్థూలత్వముగలవాఁడు. ౧. బహుమాంసమాస్యస్తీతి మాంసలః – బహుమాంసముగలవాఁడు. ౨. పీనా వంసావస్య స్తఇతి అంసలః – ఘనమైన భుజశిరస్సులు గలవాఁడు. ఈ 3 బలిసినవాని పేళ్లు.

**తున్దిల స్తున్దిభ స్తున్దీ బృహత్కుక్షిః పిచణ్డిలః.** 44

తుంది పిచండశబ్దౌ కుక్షిపర్యాయౌ తద్యోగాత్ తుందిలః, తుందిభః. పా. తుందికః; తుందీ.న్. పిచండిలశ్చ – తుంది పిచండశబ్దములు కుక్షివాచకములు; అది గలిగినవాఁడు. అనఁగా దొడ్డకడపు గలవాఁడు. ౧, ౨, ౩. బృహత్కుక్షిరస్యేతి బృహత్కుక్షిః. ఇ. దొడ్డకడుపుగలవాఁడు. ఈ ౫ పెద్దకడుపుగలవాని పేళ్లు.

**అవటిటో ౨ వనాట శ్చావభ్రటో నతనాసికే,**

అవనతా నాసికాస్యేతి అవటీటః, అవనాటః, అవభ్రటః, నత నాసికశ్చ– వంగిన ముక్కుగలవాఁడు. ఈ ౪ చప్పిడిముక్కుగలవాని పేళ్లు.

**కేశవః కేశికః కేశీ.**

ప్రశస్తాః కేశా స్సన్త్యస్య కేశవః, కేశికః, కేశీ. న్. మంచి వెంద్రుకలుగలవాడు. ఈ 3 మంచివెంద్రుకలుగలవాని పేళ్లు.

**వలినో వలిభ స్సమౌ,** 45

వళయః అస్య సంతీతి వలినః, వలిభశ్చ – తఋలు గలవాఁడు. ఈ ౨ తఋలుగలవాని పేళ్లు. ముదిమిచేత వదిలి ముడతలుపడిన చర్మము గలవాఁడు.

**వికలాఙ్గస్తు పోగణ్డః-**

వికలాన్యఙ్గాన్యస్య వికలాఙ్గః–వికలమైన అంగములు గలవాఁడు. ౧. అపకృష్టో గణ్యత ఇతి పోగండః. గణ సంఖ్యానే. అపకృష్టుఁడుగా లెక్కపెట్టఁబడువాఁడు. పా. అపోగండః “పోగండో వికలాఙ్గస్స్యాత్” అని హలాయుధుఁడు. “వికలాఙ్గస్త్వపోగణ్డః” అని అకారాదిగాను కొందఱు “అపోగండస్తువళిభిర్వ్యాప్తదేహ ఉదాహృతః, శిశుర్దశ సమాయావదపోగణ్డఃస్మృతో బుధైః” అని ధరణి. ఈ ౨ అంగహీనుని పేళ్లు.

**ఖర్వో హ్రస్వశ్చ వామనః,**

ఖర్వతి వికలాఙ్గాపేక్షయా శ్రేష్ఠత్వేన దృప్యతి ఖర్వః. కర్వ ఖర్వ గర్వ దర్పే. వికలాంగునికంటె శ్రేష్ఠుఁ డౌటచేత గర్వించువాఁడు. ౧. హ్రస్యతే హ్రస్వః. హ్రసశబ్దే నవ్వఁబడువాఁడు. ౨. వామత్వమస్యాస్తీతి వామనః – కుటిలత్వముగలవాఁడు. ఈ 3 పొట్టివానిపేళ్లు.

**ఖరణా స్స్యా త్ఖరణసః -**

ఖరా తీక్ష్ణా అగ్రనాసికా అస్యేతి ఖరణాః. స. ఖరణసశ్చ. ఈ ౨ వాఁడిముక్కుగలవాని పేళ్లు.

**విగ్రో విగతనాసికః.** 46

విగతా నాసికా అస్యేతి విగ్రః, విగతానాసికశ్చ – ముక్కుపోయినవాఁడు విగ్రుఁడు విగతనాసికుఁడు. పా. విఖ్యః. ఈ ౨ ముక్కుపోయినవానిపేళ్లు. గాడిదముక్కువంటి ముక్కుగలవాఁడని కొందఱు.

**ఖురణా స్స్యాత్ఖురణసః-**

ఖురాకారా నాసికా అస్యేతి ఖురణాః. స. ఖురణసశ్చ – గొరిసె వంటి ముక్కుగలవాఁడు. ఈ ౨ బుఱ్ఱముక్కు గలవాని పేళ్లు.

**ప్రజ్ఞుః ప్రగతజానుకః,**

ప్రగతే విరళే జానునీ యస్య సః ప్రజ్ఞుః. ఉ. ప్రగతజానుకశ్చ. నడుమ నెడముగలమోఁకాళ్లు గలవాఁడు. పా. ప్రజ్ఞః. అని కొందఱు. ఈ ౨ దొడ్డికాళ్ల (పంగటికాళ్ల) వానిపేర్లు.

**ఊర్ధ్వజ్ఞు రూర్ధ్వజాను స్స్యాత్-**

ఊర్ధ్వంగతే జానునీ అస్యేతి ఊర్ధ్వజ్ఞు. ఊర్ధ్వజానుశ్చ. ఉ. పొడవైన మోఁకాళ్లు గలవాఁడు. ఊర్ధ్వజ్ఞః. ఈ ౨ పొడవైన మోఁకాళ్లుగలవాని పేళ్లు.

**సంజ్ఞు స్సంహతజానుకః.** 47

సంహతే జానునీ యస్య సః సంజ్ఞుః. ఉ. కదిసిన మోఁకాళ్లుగల వాఁడు. పా. సంజ్ఞః. "సంప్రాభ్యాం జానునోర్జ్ఞు జ్ఞా వూర్ధ్వాత్తు స్యాద్విభాషయా, సంహతే జానునీ యస్య సంజ్ఞుస్సంజ్ఞస్స ఉచ్చత" ఇతి తంత్రటీకా. ఈ ౨ ముట్టి మోఁకాళ్లవానిపేళ్లు.

**స్యా దేడే బధిరః -**

శ్రుతిహీనతయా భారతాది శ్రవణహీనతయా మేషసదృశత్వాత్ ఏడ ఇవ ఏడః-భారతాది పుణ్యకథాశ్ర ణహీనుఁ డౌటచేత మేఁకవలె నుండువాఁడు. ౧. బధ్యతే వాతాదినా శ్రవణ సామర్థ్య మస్యేతి బధిరః. బధ బంధనే. ఇతనికి శ్రవణ సామర్థ్యము బంధింపఁబడును. ఈ ౨ చెవిటి వానిపేళ్లు.

**కుబ్జే గడులః -**

కుత్సితం ఉబ్జతీతి కుబ్జః. ఉబ్జ ఆర్జవే. కుత్సితమైన ఋజుత్వము గలవాఁడు. ౧. గడుర్మాంసగ్రంథిరస్యేతి గడులః - గడు వనఁగా కణితి; వీఁపునఁగాని ఱొమ్మునగాని ఘనమైన కణితిగలవాఁడు. ఈ ౨ మఱుగుజ్జు వానిపేళ్లు. ఱొమ్మునగాని వీఁపునగాని కణితి గలవాఁడు.

**కుకరే కుణిః,**

కుత్సితః కరో ఽస్య కుకరః - కుత్సితమైన చెయిగలవాఁడు. ౧. కుణ్యతే కుత్సిత ఇతి కుణిః. ఇ. కుణీ శబ్దోపకరణయోః. కుత్సితుఁ డని పలుకఁబడువాఁడు. పా. కూణిః. 'కూణం బాహుయుగ' మితి భాసకవిః. ఈ ౨ ఈచఁబోయిన చేతులు గలవాని పేళ్లు.

**పృశ్ని రల్పతనౌ-**

శిరసి ప్రాంశుభిః స్పృశ్యత ఇతి పృశ్నిః. ఇ. పొడవైనవారిచేత తలమీఁద స్పృశింపఁ (మొట్టఁ) బడువాఁడు. ౧. అల్పాతను ర్యస్య సః అల్పతనుః. ఉ. అల్పమైన తనువు గలవాఁడు. ఈ ౨ కుఱుమట్టపు అలిపిరివాని పేళ్లు.

**శ్రోణః పఙ్గూ -**

శ్రోణతి సంహతో భవతి శ్రోణః. శోణృ సంఘాతే. కరచరణాదులచేత ముద్దయయి యుండువాఁడు. ౧. పసతి పంగుః. ఉ. పస గతౌ. మెల్లఁగా బోవువాఁడు. ఈ ౨ పిచ్చుకుంటువాని పేళ్లు.

**ముణ్డస్తుముణ్డితే.** 48

ముణ్డ్యతే క్షురేణ శిరో உ స్యేతి ముణ్డః, ముండితశ్చ. ముడి ఖండనే. గొఱగఁ బడిన తల గలవాఁడు. ఈ ౨ బోడితలవాని పేళ్లు.

**వళిరః కేకరే -**

వలతే విషయగ్రహణ వేళాయాం అపాఙ్గదేశం ప్రతీతి వళిర్గోళకం; తద్యోగాత్ వళిరం నేత్రం; తద్యోగాత్ పురుషో உ పి వళిరః – పదార్థముల గ్రహించునప్పుడు కడకంటికివచ్చు చూపు గలవాఁడు. ౧. కే శిరస్సమీపే అక్షిసఞ్చారం కరోతీతి కేకరః. శిరస్సమీపమందు నేత్రసంచారముఁ జేయువాఁడు. ఈ ౨ మెల్లకంటివాని పేళ్లు.

**ఖోడే ఖఞ్జః -**

ఖోడతి హతగతిర్భవతి ఖోడః. ఖుడ ప్రతిఘాతే. కొట్టుపడిన గమనము గలవాఁడు. ౧. ఖంజతి గతివైకల్యం ప్రాప్నోతి ఖంజః. ఖజిగతివైక్లబ్యే. నడకలేమిని బొందినవాఁడు. ఈ ౨ కుంటికాలివాని పేళ్లు.

**త్రిషు జరావరాః,**

త్రిషు జరావరాః – జరాశబ్దముకంటె వెనుకఁ జెప్పిన ఉత్తానశ యాశబ్దము మొదలు ఖంజపర్యంత శబ్దములు మూఁడు లింగములయందును వర్తించును.

**జడులః కాలకః పిప్లుస్తిలక స్తిలకాలకః.** 49

జడంతి రోమాణ్యత్ర జడులః. జడ ఘనత్వే. దీనియందు రోమములు జడీభూతములై యుండును. పా. జటన్తి సంఘీభవన్తి రోమాణ్యత్ర

జటుల. జట సంఘాతే. దీనియందు రోమములు సంహతములై యుండును. ౧. కాలయతి కృష్ణయతి స్వప్రదేశమితి కాలకః–తన స్థలమును నల్లఁగాఁ జేయునది. ౨. నిజవర్ణేన పరిప్లవతే వ్యాప్నోతీతి పిప్లుః. ఉ. పు. ప్లుఙ్ గతౌ. వ్యాపించునది. ౩. తిల ఇవ తిష్ఠతీతి తిలకః – నువ్వులవలె నుండునది. ౪. తిల ఇవ కాలవర్ణత్వాత్ తిలకాలకః – నువ్వులవలె నల్లఁగా నుండునది. ఈ ౫ పుట్టుమచ్చ పేళ్లు.

**అనామయం స్యా దారోగ్యమ్-**

ఆమయస్య వ్యాధేరభావః అనామయం–రోగము లేకయుండుట. ౧. అరోగస్య భావః ఆరోగ్యం. రోగము లేనివానియొక్క భావము. ఈ ౨ ఆరోగ్యము పేళ్లు.

**చికిత్సారుక్ప్రతిక్రియా,**

చికిత్స్యన్యనయా చికిత్సా. కిత నివాసే. దీనిచేత వ్యాధికి ప్రతీకారము చేయుదురు. ౧. రుజః ప్రతిక్రియా రుక్ప్రతిక్రియా–వ్యాధికి ప్రతిక్రియ. ఈ ౨ వ్యాధికిఁ బ్రతిక్రియ చేయుటపేళ్లు.

**భేష ఔషధ భైషజ్యాన్యగదో జాయు రిత్యపి.** 50

భిషజ్యన్తి చికిత్సన్త్య నేనేతి భేషజం. భైషజ్యంచ. భిఝుజ్ చికిత్సాయాం. దీనిచేత చికిత్స చేయుదురు. ౧, ౨. ఓషధ్యాః భవం ఔషధం. ఓషధివలనఁ బుట్టినది. ఓషం దాహం ధయతీతి ఔషధం. ధేట్ పానే. జ్వరమువలని దాహమును నశింపఁజేయునది. ౩. అవిద్యమానో గదః అనేనేతి అగదః–దీనిచే వ్యాధి లేదు. ౪. జయతి రోగాన్ జాయుః. ఉ. పు. జి జయే. రోగములను గెలుచునది. ఈ ౫ ఔషధము పేళ్లు.

**స్త్రీ రుగ్రుజా చోపతాప రోగ వ్యాధి గదామయాః,**

రుజ్యంతే సంతప్యన్తే అనయేతి రుక్. జ. స్త్రీ. రుజా. ఆ. స్త్రీ. రోగశ్చ–దీనిచేత తపింపఁజేయఁబడుదురు. ౧, ౨, ౩. ఉపతప్యంతే ఽనేనేతి ఉపతాపః. తప సంతాపే. దీనిచేత తపింపఁజేయఁబడుదురు. ౪. వివిధా ఆధయః మనఃపీడాః యస్మిన్ సః వ్యాధిః. ఇ. పు. వివిధములైన మనః పీడలు దీనియందుఁ గలవు. ౫. గద్యంత నేనేతి గదః. గద వ్యక్తాయాం వాచి. దీనిచేత మొఱపెట్టుదురు. ౬. ఆ మీనాతీతి ఆమయః. మీఙ్ హింసాయాం. అంతట హింసించునది. ఈ ౭ రోగము పేళ్లు.

**పుమాౕ యక్ష్మా క్షయ శ్శోషః -**

యక్ష్యతే రోగేషు యక్ష్మా. న. పు. యక్ష పూజాయాం. రోగములయందు రాజవుటవలనఁ బూజింపఁబడునది. ౧. క్షీయన్తే ఽ నేనేతి క్షయః. క్షి క్షయే. దీనిచేత క్షయింతురు. శుషన్తే ఽ నేనేతి శోషః. శుష శోషణే. దీనిచేత శోషింతురు. ఈ 3 క్షయరోగము పేళ్లు.

**ప్రతిశ్యాయస్తు పీనసః.** 51

ప్రతిక్షణం శ్యాయయతి ప్రాపయతి శ్లేష్మజలమితి ప్రతిశ్యాయః. శ్యైఙ్గతౌ. ప్రతిక్షణమును శ్లేష్మజలమును వెళ్లించునది. ౧. పీనం ప్రవృద్ధమప్యఙ్గం స్యతీతి పీనసః. షో అంతకర్మణి. ఘనమైన శరీరమునైనను నశింపఁజేయునది. పా.పీనశః. ఈ ౨ పీననపడిసెము పేళ్లు. (వైద్యశాస్త్రమందు ప్రతిశ్యాయ పీనసములు ప్రత్యేకరోగములు).

**స్త్రీ క్షు త్క్షుతం క్షవః పుంసి -**

క్షవణం క్షుత్. త. సీ. క్షుతం, క్షవశ్చ. టు క్షు శబ్దే. ధ్వని చేయుట. ఈ 3 తుమ్ము పేళ్లు.

**కాసస్తు క్షవథుః పుమాౕ,**

కాసతే ఽ నేన కాసః. కాసృ శబ్దకుత్సాయాం. దీనిచేత కుత్సిత ధ్వని నేయుదురు. ౧.క్షౌత్యనేన క్షవథుః. ఉ. పు. టు క్షు శబ్దే. దీని చేత ధ్వనిసేయుదురు. ఈ ౨ దగ్గుపేళ్లు.

**శోఫ స్తుశ్వయథు శ్శోదః-**

శవతి వ్యాప్నోతీతి శోఫః. శు గతౌ. వ్యాపించునది. ౧. శ్వయతి వర్ధతే శ్వయథుః. ఉ. పు. శోథశ్చ.టు ఓశ్వి గతివృద్ధ్యోః. వృద్ధిఁబొందునది. ఈ 3 వాఁపుపేళ్లు.

**పాదస్ఫోటో విపాదికా.** 52

పాదాఃస్ఫుటన్త్యనేన పాదస్ఫోటః. స్ఫుట భేదనే. దీనిచేత కాళ్లు పగులును. ౧. విపద్యంతే అనయేతి విపాదికా. పద్ ఇ గతౌ. దీని చేత ఆపదను బొందుదురు. ఈ ౨ కుష్ఠభేదము పేళ్లు.

**కిలాసం సిధ్మ-**

కుత్సితం లస్యతే శ్లిష్యతే అనే నేతి కిలాసం. లస శ్లేషణ క్రీడనయో. దీనిచేత జనులు కుత్సితముగాఁ బొందఁబడుదురు. ౧. సిధ్యతి

భేషజేన ఆశు గచ్ఛతీతి సిధ్మ. న. న. షిధు గత్యాం. చికిత్సచేఁ బోవునది. పా. సిధ్మం. అ. న. ఈ ౨ సిబ్బెము పేళ్లు.

**కచ్ఛ్వాం తు పామ పామా విచర్చికా,**

కషతి కచ్ఛూః. ఊ. స్త్రీ. కష హింసాయాం. హింసించునది. ౧. పాతి పిబతి అంగసౌష్ఠవమితి పామ. న. పు. పామా చ. ఆ. స్త్రీ. పాపానే. శరీరసౌష్ఠవమును బానము సేయునది. ౨, ౩. విచర్చయత్యఙ్గం స్రావేణ లిమ్పతి విచర్చికా. చర్చ అధ్యయనే. అంగమును స్రవించుట చేత పూయునది. ధాతూనా మనేకార్థత్వాత్ అత్ర చర్చధాతో ర్విలేపన మర్థః. ఈ ౪ గజ్జి పేళ్లు.

**కణ్డూః ఖర్జూశ్చ కణ్డూయా-**

కణ్డ్యతే నఖై రితి కణ్డూః. ఊ. స్త్రీ. కణ్డూయా చ. కడి ఖండనే. నఖములచేత గోఁకఁబడునది. ౧, ౨. ఖర్జయతి వ్యథయతి ఖర్జూః. ఖర్జవ్యథనే. వ్యథపెట్టునది. ఈ ౩ తీఁటపేళ్లు.

**విస్ఫోటః పిటక స్త్రిషు.** 53

విస్ఫుటతి విస్ఫోటః. స్ఫుట భేదనే. వ్రక్కలౌనది. ౧. పిటతి సంశ్లిష్యతి పిటకః. అ. త్రి. పిట సంశ్లేషణే. వ్రక్కలై కూడుకొనునది. ఈ ౨ పొక్కులపేళ్లు. బొబ్బలు.

**వ్రణో ఽ స్త్రియా మీర్మ మరుఃక్లీబే-**

వ్రణయతి వ్రణః. అ.పు. వ్రణ గాత్రసంచూర్ణనే. దేహమును నొప్పించునది. ౧. ఈరయత్యఙ్గం ఈర్మం. ఈర ప్రేరణే. అంగమును ప్రేరేపించునది. ౨. ఇయర్తి వృద్ధిం అరుః. స. న. ఋ గతౌ. వృద్ధిని బొందునది. ఈ ౩ పుంటిపేళ్లు.

**నాడీవ్రణః పుమాన్**

నాడీయుక్తో వ్రణో నాడీవ్రణః. రంధ్రముగల వ్రణము. ఈ ౧ నెల వేసిన పుంటిపేరు.

**కోఠో మణ్డలకమ్**

కోఠ త్యనేన కోఠః. కుఠ ఆలస్యే. దీనిచేత ఆలస్యముక్తుఁడౌను. ౧. మణ్డలా కృతి త్వేన మణ్డలకం – మండలాకారమైయుండునది. ఈ ౨ మండలాకారమైన కుష్ఠుపేళ్లు. ఎఱ్ఱపులుము.

**కుష్ఠశ్విత్రే-**

కుత్సితే తిష్ఠతీతి కుష్ఠం. ష్ఠా గతి నివృత్తౌ. కుత్సితునియందుండునది. ౧. శ్వేతతే త్వ గనేనేతి శ్విత్రం. శ్వితావర్ణే. దీనిచేత చర్మము తెలుపౌను. ఈ ౨. తెల్లకుష్ఠు పేళ్లు. తెల్లపులుము.

**దుర్నామకార్శసీ** 54

పాపరోగత్వేన ప్రసిద్ధతయా దుష్టం నామాస్యేతి దుర్నామకం–ప్రసిద్ధమైన పాపరోగ మౌటచేత దుష్టమైన పేరు గలది. ౧. అరివత్ ప్రాణినం శృతి తనూకరోతీతి అర్శః. స. న. శోతనూకరణే. శత్రువు వలె ప్రాణి నల్పముగాఁ జేయునది. రూపమిమర్తి ఉద్గచ్ఛతీతి అర్శః–రూపమును జెఱుచునది. ఈ ౨ మూలవ్యాధి పేళ్లు.

**ఆనామన్తు నిబంధ స్స్యాత్ -**

ఆనహ్యతే నిబధ్యతే విణ్మూత్రమనేనేతి ఆనాహః. నిబంధశ్చ. ణహ బంధనే; బధ బంధనే. మలమూత్రములు దీనిచేత కట్టఁబడను. పా. నిబంధః. ఈ ౨ మలమూత్ర నిర్బంధము పేళ్లు. ఇరువాయిగట్టుట.

**గ్రహణీరుక్ప్రవాహికా,**

దీపనాగ్ని మాంద్యకరత్వేన భుక్తాన్నాదికం గృహ్ణాతి స్థాపయతీతి గ్రహణీ, గ్రహణీ చ సా రుక్చ గ్రహణీరుక్. గ్రహ ఉపాదానే. అగ్ని మాంద్యకరమైన భుజించిన యన్నపానాదుల నట్లే నిలుపునది. ౧. మలం ప్రవహతి ప్రవాహికా. వహ ప్రాపణే. మలమును బ్రవహింపఁజేయునది. ఈ ౨ గ్రహణి పేళ్లు.

**ప్రచ్ఛర్దికా వమిశ్చ స్త్రీ పుమాంస్తు వమథు స్సమాః.** 55

ప్రచ్ఛర్ద త్యనయా ప్రచ్ఛర్దికా. వమ త్యనయా వమిః. ఇ. సీ. పా. వమీ. ఈ. సీ. వమథుశ్చ. ఉ. పు. ఛర్ద వమనే; టు వము ఉద్గిరణే. దీనిచేత భుజించిన యన్నాదులు వాంతియగును. ఈ ౩ క్రక్కుట.

**వ్యాధిభేదా విద్రధిః స్త్రీ జ్వర మేహ భగన్దరాః,**

(శ్రీపదం పాదవల్మీకం కేశఘ్నం త్విన్ద్రలుప్తకమ్)

విద్రాతి కుత్సాం గచ్ఛతి పుమా నితి విద్రధిః. సీ. ద్రాకుత్సాయాంగతౌ. దీనిచేత పురుషుడు కుత్సితత్వమును బొందును. వివిధో ద్రవో ధీయతే అస్మిన్నితి విద్రధిః. డు ధాఞ్

ధారణపోషణయోః. దీనియందు నానావిధమైన ద్రవము ధరింపఁబడును. కడుపులోపలఁ బుట్టు బల్లగడ్డ. "దోషా అస్థిగతా ధాతూ౯ దూషయిత్వా త్వగాదికా౯ జనయన్తి దృఢం శేషం వృత్తం వాప్యథవాయతమ్. సావిద్రధి రితి ఖ్యాతా దుశ్చికిత్సామహారు" జేతి. ౧. జ్వరయతీతిజ్వరః. జ్వరరోగే. పీడించునది. ఇది జ్వరము. ౧. మేహయతే మూత్రయతే భృశమనేనేతి మేహః. మిహ సేచనే. దీనిచేత మిక్కిలి మూత్రము గలుగును. ఇది ప్రమేహము. ౧. భగం గుదసమీపదేశం దారయతి భగం దరః. దౄవిదారణే గుదసమీపమును జీల్చునది. చూడరానిచోటఁ బుట్ట భగందర మనువ్రణము. వ్యాధిభేదములపేళ్లు.

**అశ్మరీ మూత్రకృచ్ఛ్రం స్యాత్ -**

శుక్లమూత్రాదికమేవ ఘనీభూతత్వేన అశ్మవ దవస్థానా దశ్మేత్యుచ్యతే. అశ్మానం రాతి దదాతీతి అశ్మరీ. ఈ. సీ. రా దానే. శుక్రమూత్రములే ఘనీభూతములై రాయివలె నుండును గనుక అశ్మయనంబడును. అశ్మ నిచ్చునది అశ్మరి. ౧. మూత్రవిస్రవణకాలే కృచ్ఛ్రం కష్టమస్యేతి మూత్రకృచ్ఛ్రం–మూత్రము విడుచునప్పుడు ప్రయాసము దీనియందుఁ గలదు. ఈ ౨ మూత్రకృచ్ఛ్రముపేళ్లు. కొందఱు అశ్మరి యనఁగా మూత్రద్వారమందు ఱాయి పెరుగుట. మూత్రకృచ్ఛ్రమనఁగా మూత్రనిర్బంధమాత్రము. అని ప్రత్యేకవ్యాదులందురు.

**పూర్వే శుక్రావధే స్త్రిషు.** 56

ఇతఃపరం పక్ష్యమాణశుక్రశబ్దా త్పూర్వే రోగహార్యాదిశబ్దాః అభిధేయాను సారేణ త్రిషు లింగేషువర్తంతే – ఇఁకమీఁద శుక్రశబ్దము వఱకుగల శబ్దములన్నియు ౩ లింగములయందును వర్తించును.

**రోగహా ర్యగద్కారో భిషగ్వైద్య శ్చికిత్సకే,**

రోగం హరతి తాచ్ఛీల్యేన రోగహారీ. న. త్రి. హృఞ్ హరణే. రోగమును హరించు స్వభావముగలవాఁడు. ౧. అగద మరోగం కరోతి ప్రాణినమి త్యగదంకారః – ప్రాణిని రోగము లేనివానిఁగాఁ జేయువాఁడు. ౨. భిషజ్యతి భిషక్. జ. భిషజ్ చికిత్సాయాం. చికిత్ససేయువాఁడు ౩. విద్యామాయుర్వేదమధీతే వేత్తివా వైద్యః–ఆయుర్వేదమును జదివిన వాఁడుగాని యెఱిఁగినవాఁడుగాని వైద్యుఁడు. ౪. చికిత్సతి చికిత్సకః.

చికిత్స చేయువాఁడు. ఈ ౫ వైద్యుని పేళ్లు.

**వార్తో నిరామయః కల్య ఉల్లాఘో నిర్గతో గదాత్.** 57

వృత్తిః పునర్జీవనమస్యాస్తీతి వార్తః. వృత్తియనఁగా మరల బ్రతుకుట; అదిగలవాఁడు. ౧. నిర్గతః ఆమయాదితి నిరామయః. వ్యాధి వలనఁ బాసినవాఁడు. ౨. అరోగతయా కలాసు సాధుః కల్యః. రోగము లేకపోవుటచేత కళలయం దొప్పెడువాఁడు. ౩. ఉల్లాఘతి సమర్థోభవతి ఉల్లాఘః. లాఘృ సామర్థ్యే. సమర్థుఁడైనవాఁడు. ఈ ౪ రోగము తీఱిన వానిపేళ్లు. మొదటి 3 రోగములేనివాని పేళ్లని కొందఱు.

**గ్లాన గ్లాస్నూ ఆమయావీ వికృతో వ్యాధితో ఽ పటుః,**
**ఆతురో ఽ భ్యమితో ఽ భ్యాన్తః -**

గ్లాయతి స్మగ్లానః. గ్లాస్నుశ్చ. ఉ. పు. గ్లైహర్షక్షయే. గ్లాని నొందినవాఁడు. ౧, ౨. ఆమయో ఽ స్యాస్తీత్యామయావీ. న. పు. వ్యాధిగలవాఁడు. ౩. కార్శ్యాదినా పూర్వావస్థాపేక్షయా విరుద్ధః వికృతః. కార్శ్యాదులచేత పూర్వావస్థకంటె వికృతమైయుండువాఁడు. ౪. వ్యాధిస్సంజాతో ఽ స్య వ్యాధితః. వ్యాధి గలవాఁడు. ౫. న పటుః అపటుః. పటువుగానివాఁడు. ౬. ఆతుర స్సంభ్రమో ఽ స్యాస్తీత్యాతురః. ఆతిత్వరా సంభ్రమే. అంతట వేగిరముగలవాఁడు. ౭. అభిత స్సర్వతః అమతి రోగేణ అభ్యమితః, అభ్యాంతశ్చ. అమరోగే. రోగము చేతఁ బీడింపఁబడువాఁడు. ఈ ౯ తెవులు గలవానిపేళ్లు. గ్లానగ్లాస్ను శబ్దములు ౨ చిక్కిన వాని పేళ్లని కొందఱు.

**సమౌ పామన కచ్ఛురౌ.** 58

పామాస్యాస్తీతి పామనః. కచ్ఛూరస్యాస్తీతి కచ్ఛురః. పామయన్నను కచ్ఛువన్నను గజ్జి; అది గలిగినవాఁడు పామనుఁడు, కచ్ఛురుఁడు. ఈ ౨ గజ్జిగలవాని పేళ్లు.

**దద్రుణో దద్రురోగీ స్యాత్ -**

దరిద్రయతి దద్రుః. సా స్యాస్తీతి దద్రుణః. దద్రురోగీ చ. న. పు. దుర్గతిని బొందించునది. గనుక దద్రువనఁగా కుష్ఠభేదము; అది గలవాఁడు. ఈ ౨ దద్రువను కుష్ఠరోగము గలవాని పేళ్లు.

**అర్శోరోగయుతో ఽ ర్శసః,**

అర్శోరోగయుతః అర్శస ఇత్యుచ్యతే. మూలవ్యాధితోఁ గూడినవాఁడు అర్శసుఁ డనంబడును. అర్శో ఽ స్యాస్తీతి అర్శసః. ఈ ౧ మూల వ్యాధిగలవాని పేరు.

**వాతకీ వాతరోగీ స్యాత్ -**

వాతసంజ్ఞి కోరోగో ఽ స్యాస్తీతి వాతకీ. న. పు. వాతరోగీ చ. న. పు. వాతరోగము గలవాఁడు. ఈ ౨ వాతరోగము గలవాని పేళ్లు.

**సాతిసారో ఽ తిసారకీ,** 59

అతిసార్యతే అనేనేత్యతిసారః. తేన సహవర్తత ఇతి సాతిసారః, అతిసారరోగో ఽ స్యాస్తీత్యతిసారకీ. న. పు. మలమును మిక్కిలి వెళ్లించునది గనుక అతిసారమనఁ గా రోగవిశేషము; దానితోఁ గూడినవాఁడు. ఈ ౨ అతిసారవ్యాధి గలవాని పేళ్లు.

**స్యుః క్లిన్నాక్షే చుల్ల చిల్ల పిల్లాః క్లిన్నే ఽ క్ష్ణి చాప్యమీ,**

క్లిన్న మక్షి యస్య సః క్లిన్నాక్షః చుల్లః, చిల్లః, పిల్లః. ౧, ౨, ౩. చుల్లాది శబ్దములు మూఁడును అక్షిరోగముచేతఁగాని, స్వభావముచేతఁగాని తడియైయుండు కన్నులు గలవానియందు వర్తించును. అమీ = ఈ చుల్లాదిశబ్దములు 3 ను, క్లిన్నే అక్ష్ణిచ = తడిసిన కంటియందును వర్తించును. తడిసిన కంటియందు ముఖ్యవృత్తిచేతను, తడిసిన కన్నులు గలవానియందు ఉపచారముచేతను వర్తించును.

**ఉన్మత్త ఉన్మాదవతి -**

ఉన్మద్యతే ఉన్మత్తః. మదీ హర్షగ్లపనయోః. మిక్కిలి మదించినవాఁడు. ఈ ౧ వెఱ్ఱియెత్తినవానిపేరు.

**శ్లేష్మలః శ్లేష్మణః కఫీ.** 60

శ్లేష్మాస్యా స్తీతి శ్లేష్మలః, శ్లేష్మణశ్చ. శ్లేష్మము గలవాఁడు. ౧, ౨. కఫో ఽ స్యాస్తీతి కఫీ. న. పు. కఫముగలవాఁడు. ఈ 3 శ్లేష్మవాధిగల వానిపేళ్లు. తేమడతెవులు.

**న్యుబ్జో భుగ్నే రుజా -**

న్యుబ్జతే వక్రీభవతీతి న్యుబ్జః. ఉబ్జ ఆర్జవే. వక్రమైనవాఁడు. ౧. రుజా భుగ్నే. వాతము మొదలైన వ్యాధిచేత వక్రమైనవానికిఁబేరు.

**వృద్ధనాభౌ తుణ్డిల తుణ్డిభౌ,**

వృద్ధో నాభిరస్యేతి వృద్ధనాభిః. పు. పొడవైన బొడ్డు గలవాఁడు. ౧. తుండి రున్నతనాభి స్తద్యోగాత్తుండిలః, తుండిభశ్చ. తుండి యనఁగా పొడవైన బొడ్డు; అది గలవాఁడు. ఈ 3 పొడవైన బొడ్డుగలవాని పేళ్లు.

**కిలాసీ సిధ్మలః -**

కిలాసమస్యాస్తీతి కిలాసీ. న. పు. సిధ్మమస్యాస్తీతి సిధ్మలః. కిలా సముసిధ్మము అనఁగా సిబ్బెము; అది గలవాఁడు. ఈ ౨ సిబ్బెముగలవాని పేళ్లు.

**అంధో ౨ దృక్ -**

అంధ్యతే వికలీక్రియత ఇతి అంధం, చక్షుః, తద్యోగాత్ అంధః, అంధ దృష్ట్యుపఘాతే - వికలత్వము పొందినది గనుక అంధమనఁగా గ్రుడ్డికన్ను; అదిగలవాఁడు. ౧. అవిద్యమానా దృగస్య అదృక్. శ. పు. చూపులేనివాఁడు. ఈ ౨ గ్రుడ్డివాని పేళ్లు.

**మూర్ఛాలే మూర్త మూర్ఛితౌ.** 61

మూర్ఛాస్యాస్తీతి మూర్ఛాలః. మూర్ఛగలవాఁడు. ౧. మూర్ఛతిస్తమూర్తః. మూర్ఛామోహ సముచ్ఛ్రాయయోః. మోహమును బొందువాఁడు. ౨. మూర్ఛాస్య సంజాతా మూర్ఛితః. మూర్ఛగలవాఁడు. "మూర్ఛాలే కఠినేమూర్త" ఇతివిశ్వప్రకాశః. ఈ 3 మూర్ఛగలవాని పేళ్లు.

**శుక్రం తేజో రేతసీ చ బీజవీర్యేన్ద్రియాణి చ,**

స్త్రీ సందర్శనాదినా శోకతి స్రవతి శుక్రం, శుక గతౌ. స్త్రీ సందర్శనాదులచేత జాఱునది. ౧. తేజయతి తనూకరోతి స్రవణానంతరం తేజః. స. న తిజ నిశాతనే. జాఱినమీఁదట కృశునిగాఁ జేయునది. ౨. రియతి స్రవతి రేతః. స. న. రి గతౌ. స్రవించునది. ౩. విశేషేణ జాయతే బీజం, జనీ ప్రాదుర్భావే. వబయోరభేదః. విశేషముగాఁ బుట్టునది. ౪. వీరే అక్లీ బే సాధు వీర్యం నపుంసకుఁడు కానివానియందుఁ బుట్టునది. ౫. ఇంద్రస్య ఆత్మన ఇద మింద్రియం. ఇంద్రుఁ డనఁగా ఆత్మ; తత్సంబంధమైనది. ఇంద్ర దైవత్యమితివా ఇంద్రియం. ఇంద్రుఁడే దేవతగాఁ గలది. ఈ ౬ రేతస్సుపేళ్లు.

**మాయుః పిత్తమ్**

మీనోతి శిరో భ్రమణేన భువి క్షేపయతీతి మాయుః. ఉ. పు. డు మిఞ్ ప్రక్షేపణే. శిరోభ్రమణముచేత జనమును బడఁద్రొబ్బునది. ౧. పతతి పిత్తం. పత్ ౡ గతౌ. ద్రవరూపమై పడునది. ఈ ౨ పైత్యము పేళ్లు.

**కఫః శ్లేష్మా -**

కే శిరసి, కేన జలేన వా ఫలతి కఫః. ఫల నిష్పత్తౌ. శిరస్సునందుఁగాని జలముచేతఁగాని పుట్టునది. ౧. శ్లిష్యతి హృదయాదౌ శ్లేష్మా. న. పు శ్లిష ఆలింగనే. హృదయము మొదలైనదానిం బొందునది కఫము.

**స్త్రియాం తు త్వగసృగ్ధరా.** 62

త్వచతి మాంసం వేష్టయతి త్వక్. చ. సీ. త్వచ సంవరణే. మాంసమును గప్పునది. అకారాంతంబును గలదు. "త్వచవేష్టిత మస్థిపంజరం యది కాయం సమవైషి యోషితాం" అని యశ్వఘోషుఁడు. ౧. అసృజం రక్తం వృణోతీతి అసృగ్వరా. నెత్తురును గప్పియుండునది. పా. అసృగ్ధరా. ఈ ౨ చర్మము.

**పిశితం తరసం మాంసం పలలం క్రవ్య మామిషమ్,**

పింశతి శరీరావయవో భవతీతి పిశితం. పిశ అవయవే. శరీరమునకు అవయవ మగునట్టిది. ౧. తరంత్యేతేన కార్శ్యమితి తరసం. తౄప్లవ నతరణయోః. కార్శ్యమును దీనిచేఁ దరింతురు. ౨. మన్యతే బలకరమితి మాంసం. మనజ్ఞానే. బలకరమని యెఁఱుంగఁబడునది. ౩. పాల్యతే దేహమనేనేతి పలలం. పాలరక్షణే. దీనిచేత దేహము రక్షింపఁబడును. ౪. క్లవ్యతే ఽస్మాత్ క్రవ్యం. దీనికి భయపడుదురు. క్లవ భయే. ౫. అమతి రోగయతి ఆమిషం. ఆమ రోగే రోగమును జేయునది. ౬. మాంసామిష శబ్దములు పుంలింగ నపుంసకములయందుఁ గలవని చాంద్రలిఙ్గానుశాసనము. మాంసము పేళ్లు.

**ఉత్తప్తం శుష్కమాంసం స్యాత్త ద్వల్లూరం త్రిలిఙ్గకమ్.** 63

ఊర్ధ్వం తప్యతే అగ్ని నా అతపేన వా ఉత్తప్తం. తప సంతాపే. అగ్నిచేతఁగాని ఎండచేతఁగాని పొడవునఁ గాల్పఁబడునది. ౧. శుష్య తే శుష్కం శుష్కం చ తత్ మాంసం చ శుష్కమాంసం. శుష శోషణే. శోషింపఁబడిన మాంసము. ౨. వల్యతే శోషణార్థ మితి వల్లూరం.

అ. త్రి. వల సంవరణే. ఎండించుకొఱకు ఆవరింపఁబడునది. ఈ ౩ ఎండిన మాంసము.

**రుధిరే౨ సృగ్లోహితాస్ర రక్త క్షతజ శోణితమ్,**

రుద్యతే త్వచా రుధిరం. రుధిర్ ఆవరణే. చర్మముచేత కప్పఁబడునది. ౧. ఆస్యతే త్వగ్భేదేన అసృక్. జ. న. అస్రంచ. అసుక్షేపణే. చర్మము తెగినమాత్రమునఁ బ్రవహించునది. ౨, ౩. లోహితవర్ణత్వాత్ లోహితం. రక్తం చ. ఎఱ్ఱని వన్నె గలది. లోహితము రక్తము. ౪, ౫. క్షతా జ్జాయత ఇతి క్షతజం. గండివలనఁ బుట్టునది. ౬. శోణితవర్ణత్వాత్ శోణితం. శోణృ వర్ణగత్యోః. ఎఱ్ఱనివన్నె గలది. ఈ ౭ నెత్తురుపేళ్లు.

**వృక్కాగ్రమాంసమ్ -**

వృక్యంతే అద్యంత ఇతి వృకాని భక్షాణి. తత్రసాదురిత వృక్కా. వృక ఆదానే. వృకము లనఁగా భక్షింపఁదగిన వస్తువులు; అందులో మంచిది. పా. వృక్యా. ఆ. సీ. వృక్కః. వృక్యః. అ. పు. వృక్కా. న. పు. వృక్యా. న. పు. బుక్క్యతే స్వాదురస ఇతి బుక్కః. అ. పు. బుక్కా. న. పు. బుక్క పరిభాషణే. స్వాదురసమని పలుకఁ బడునది. 'అగ్రమాంసేద్వయోర్వ్రృక్య' ఇత్యమరశేషకారః. 'శోణితాస్రే స్త్రియాం వృక్కా వృక్కా' ఇతి రభసః. 'బుక్కో నరాగ్రమాంసే స్యా' దితి వోపాలితః. ౧. అగ్రం చ తత్ మాంసం చ అగ్రమాంసం. శ్రేష్ఠమైన మాంసము. ౨. పెద్దయుసిరిక పండు ప్రమాణము గలిగి కొంచెము కోలగాననుండి పార్శ్వముననుండు శ్రౌతమందు ప్రసిద్ధమైన వృక్క యనుమాంసము.

**హృదయం హృత్ -**

హ్రియత ఇతి హృదయం హృచ్చ. ద. స. హృఞ్ హరణే. హరింపఁ బడునది. ౧, ౨. హృదయములో పద్మాకారమైయుండు మాంస విశేషముపేళ్లు. గుండెకాయ. ఇదే హృదయకమలమందురు. వృక్కాదులు ౪ గుండెకాయవేళ్లని కొందఱు.

**మేదస్తు వపా వసా.** 64

మిద్యతే స్నిహ్యతే మేదః. సన. న. ఞి మిదా స్నేహనే. మెఱుఁగైయుండునది. ౧. ఉప్యతే నాభి సమీపే వపా. టు వప్ బీజసంతానే. నాభి సమీప మందు మొలవఁబడినటు లుండునది. ౧. మాంసమనయా స్నిగ్ధం

వసతి వసా. వస నివాసే. దీనిచేత మాంసము మెఱుఁగైయుండును. ౧. హృదయ మందుండు మాంసవిశేషముల పేళ్లు. గ్రంథాంతరమున వీనికి ప్రత్యేక భేదములు గలవు ___ "మేదో హి సర్వభూతానాం హృదయే ఉ స్థిషు చ స్థితం, నాభేః సమీపదేశే తు శరీరాంతరవర్తినీ. హస్తమా త్రా పటీరూపా వపాం తాం పరిచక్షతే, శుద్ధమాంసస్య య స్స్నేహః సా వసా పరికీర్తి" తేతి. మేద స్సనఁగా నస్థుల యందుండు మెదడు. వప యనఁగా నాభి క్రింద గుడ్డవలె నుండు మాంసపుపొర. వస యనఁగా నన్నిమాంసములలో మేలైన క్రొవ్వు. ఈ 3 ను పర్యాయములని కొందఱు.

**పశ్చాద్గ్రీవాసిరా మన్యా -**

పశ్చాద్గ్రీవాసిరా మన్యేత్యుచ్యతే. పెడతల నుండెడు నరము మన్య యనఁ బడును. మన్యత ఇతి మన్యా. మన అవబోధనే. ఎఱుఁగఁబడునది. పెడతలనున్న బోలునరము.

**నాడీ తు ధమని స్సిరా,**

అంతస్సుషిరవత్త్వాత్ నడాఖ్యతృణవ త్తిష్ఠతీతి నాడీ. సీ. నడుమరంధ్రము గలిగి నడమను కసవువలె నుండునది. ౧. ధమనీసామ్యాత్ ధమనిః. పా. ధమనీ. సీ. గొట్టమువలె నుండునది. ౨. సినోతి కాయంబధ్నాతి సిరా. షిఞ్ బంధనే. శరీరమును బంధించునది. పా. శిరా. ఈ 3 బోలు నరము పేళ్లు.

**తిలకం క్లోమ -**

తిలతీతి తిలకం. తిల స్నేహనే. మెఱుఁగై యుండునది. ౧. క్లామ్యతి క్లోమ. న. న. క్లము గ్లానౌ. వాడునది. పా. క్లోమం. ఈ ౨ కడుపులో నొక ప్రక్క నెఱ్ఱనైయుండు మాంస విశేషము పేళ్లు. నీరుతిత్తియని కొందఱు.

**మస్తిష్కం గోర్దమ్ -**

మస్తం శిరోదేశ మిష్యతి మస్తిష్కం. ఇష గతౌ. శిరస్సును బొంది యుండునది. ౧. గూర్యతే గురతేవా గోర్దం. గురీ ఉద్యమనే. యత్నించునది. ఈ ౨ మెదడు పేళ్లు.

**కిట్టం మలో ఉ స్త్రియామ్.** 65

కిటతి నిర్గచ్ఛతీతి కిట్టం. కిట గతౌ. నవద్వారముల నుండి వెడలు

నది. ౧. మలతే ధారయతి దేహం మలః. అ. ప్న. మల మల్ల ధారణే. దేహమును ధరించునది. ఈ ౨ విణ్మూత్రములు మొదలైన దేహ మలము పేళ్లు. తే ద్వాదశ. తదుక్తం – "వసా శుక్ర మసృజ్మజ్జా కర్ణ విణ్మూత్ర విణ్ణఖాః, శ్లేష్మాశ్రు దూషికా స్వేదా ద్వాదశైతే మలా నృణా" మితి. క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, గులిమి, మూత్రము, విష్ఠ, చీమిడి, తెమడ, కన్నీరు, కంటిపుసి, చెమట అని మలములు పండ్రెండు.

**అన్త్రం పురీతత్-**

అమ్యతే సంభజ్యతే భుక్తాన్నాదిక మనేనేతి అంత్రం. అమగత్యాదిషు. భుజించిన యన్నాదులు దీనిచేత నేర్పఱచఁబడును. పా. అంత్రం. ౧. పురీం దేహం తనోతి పురీతత్. త. స్న. తను విస్తారే. పురియనఁగా శరీరము; దానిని విస్తరింపఁజేయునది. ఈ శబ్దము స్త్రీలింగమని కొందఱు. ఈ ౨ పేగుల పేళ్లు.

**గుల్మస్తు ప్లీహా పుంసి-**

గుద్యతే ప్రకోపాదినా రక్ష్యత ఇతి గుల్మః. గుడ రక్షణే. ప్రకోపాదులచేత రక్షింపఁబడునది. ౧. ప్లీహతి కదాచి దుద్రిక్తః ప్రదేశాంతరం గచ్ఛతి ప్లీహా. న. పు. ప్లీహ గతౌ. ఒకానొకప్పుడు ఉద్రిక్తమై మఱియొకచోటికిఁ బోవునది. ఈ ౨ హృదయములో నెడమదిక్కునఁ బచ్చనైయుండు మాంసవిశేషము పేళ్లు.

**అథ వస్న సా,**

**స్నాయుః స్త్రియామ్ -**

వస్తేఛాదయతి దేహం వస్నసా. వస ఆచ్ఛాదనే. దేహమును గప్పుకొని యుండునది. పా. స్నసా. "స్నసా స్నాయుశ్చ కథితా" ఇత్య మరమాలాయాం. ౧. స్నాతి సదా ఆర్ద్రీభవతి స్నాయుః. సీ. ష్ణా శౌచే. ఎప్పుడును ఆర్ద్రమైయుండునది. ఈ ౨ సన్నపు నరముల పేళ్లు.

**కాలఖణ్డ యకృతీ తు సమే ఇమే.** 66

ఖండం మాంసఖండం. కాలంచ తత్ ఖండంచ కాలఖండం. నల్లని మాంసఖండము. ౧. క్లోమ్నోద్వితీయమాత్మానం కరోతీతి యకృత్. త. న. క్లోమమనెడు మాంసము కంటె తన్ను రెండవదానిఁగాఁ జేసికొనునది. ఈ ౨ కడుపులో కుడిదిక్కున నల్లనైయుండు మాంసవిశేషము పేళ్లు.

**సృణికా స్యన్దినీ లాలా-**

సరతి స్రవతి సృణికా. పా. సృణీకా. ౧. స్యందతీతి స్యందినీ. సీ. స్యందూ ప్రస్రవణే. జాఱునది. ౨. విరుద్ధ లక్షణయా లలతి లాలా విలాసే. విరుద్ధ లక్షణచే నింపైనది. ఈ ౩ నోటి జొల్లు పేళ్లు. చొంగ.

**దూషికా నేత్ర యోర్మలమ్,**

నేత్రే దూషయతీతి దూషికా. దుష వైకృత్యే. కన్నులను వికృతముగాఁ జేయునది. పా. దూషీకా – "దూషీకాపటల నిరుద్ధలోచనాంతా దుర్గంధా బహుళమలోప లిప్తగాత్రే" తి గోపదత్తః– "ఆః కీదృగత్రి మునిలోచన దూషికాయాం పీయూషదీధితిరితి గ్రథితో ఽ నురాగ" ఇతి మురారిః– "నాసామలం తు శింఘాణం శింజూషం కర్ణయోర్మల" మిత్యధికపాఠః. ఈ ౧ కంటిపుసి పేరు.

**మూత్రం ప్రస్రావః-**

మూత్రయతి ప్రస్రవతి మూత్రం, ప్రస్రావశ్చ. మూత్ర ప్రస్రవణే. స్రు స్రవణే. జాఱునది. ఈ ౨ మూత్రము పేళ్లు.

**ఉచ్చారావస్కరౌ శమలం శకృత్.** 67

**పురీషగూథే వర్చస్క మస్త్రీ విష్ఠా విషా స్త్రియౌ,**

ఉచ్చార్యతే త్యజ్యత ఇతి ఉచ్చారః. చర గతౌ. విడువఁబడునది. ౧. అవఅధః క్రియత ఇత్యవస్కరః. డుకృఞ్ కరణే. క్రిందుగాఁ జేయఁబడినది. ౨. శ్యామతి శమలం. శము ఉపరమే. నశించునది. ౩. శక్నోతి అనేనకృత్. త. న. శక్ ఌ శక్తౌ. దీనిచేత శక్తుఁడౌను. ౪ పూర్యతే అనేక ఉదరమితి పురీషం. పౄ పాలనపూరణయోః దీనిచేత నుదరము నిండింపఁబడును. ౫. గూయతే ఉత్సృ జ్యత ఇతిగూథం. గు పురీషోత్సర్గే. విడువఁబడునది. ౬. వృజ్యత ఇతి వర్చస్కం. అ. ప్న. వృజీ వర్జనే. విడువఁబడునది. ౭ వితిష్ఠతి నాభేరధః విష్ఠా. ష్ఠాగతి నివృత్తౌ. నాభిక్రింద నుండునది. ౮ విశతి నాభేరధౌ విట్. ష. సీ. విశ. ప్రవేశనే. నాభిక్రిందఁ బ్రవేశించునది. శకారాంత స్త్రీలింగమును గలదు. ఈ ౯ అమేధ్యము పేళ్లు.

**స్యా త్కర్పరః కపాలో ఽ స్త్రీ-**

భారధారణాయ కల్పతే సమర్థో భవతి కర్పరః. కృపూ సామర్థ్యే. భారమును ధరించుట కొఱకు సమర్థమైనది. ౧. కం శిరః పాలయతి

కపాలః. అప్న. శిరస్సును రక్షించునది. ఈ ౨ తలయెముక తునకపేళ్లు.

**కీకసం కుల్యమస్థి చ.** 68

కీతిశబ్దం కుర్వ౯ కుసతి చలతీతి కీకసం. కసగతౌ. కి యనెడు శబ్దమును జేయుచు చలించునది. ౧. కోలతి సంస్త్యాయతి కుల్యం. కుల సంస్త్యానే. కూడుకొనయుండునది. ౨. అస్యతే త్యజ్యత ఇత్యస్థి. ఇ. స. అసు క్షేపణే. విడువఁబడునది. ఈ ౩ ఎముక పేళ్లు.

**స్యా చ్ఛరీరాస్థ్ని కఙ్కాలః -**

కం జలం స్వాభ్యన్తరేణ కాలయతి ప్రేరయతి కంకాళః. కల కిల క్షేపే. జలమును తనలోనికిఁ బ్రేరేపించునది. డొక్క పేరు. ౧. చర్మమాంస రహితమై ఒకటితో నొకటి కూడుకొనియున్న ఒడలియెముకల సముదాయము.

**పృష్ఠాస్థ్ని తు కశేరుకా,**

కో వాయుశ్శేతే ఽత్ర కశేరుకా. శీఙ్ స్వప్నే. వాయువు దీనియందుండును. ఈ ౧ వెన్నెముక పేరు.

**శిరోస్థని కరోటిః స్త్రీ-**

కం వాయుం రోటతే కరోటిః. రుట దీప్తౌ, ప్రతిఘాతే. వాయువు నడ్డపెట్టునది. ఈ ౧ తలపుఱ్ఱె.

**పార్శ్వాస్థని తు పర్శుకా.** 69

స్పృశ్యతే వయనాదినేతి పర్శుకా. స్పృశసంస్పర్శనే. శయనాదులచేత స్పృశింపఁబడునది. ౧. "జంఘాస్థని నళం ప్రోక్తం నళకంచద్వయోరుభా" విత్యధికపాఠః. ప్రక్కయెముక.

**అఙ్గం ప్రతీకో ఽవయవో ఽపఘనః -**

అఙ్గతి చలతి అఙ్గం. అగి గతౌ. చలించునది. ౧. ప్రత్యేత్య న్యోన్యమాభీముఖ్యేన గచ్ఛతీతి ప్రతీకః. ఇణ్ గతౌ. అన్యోన్యమభి ముఖముగా నుండునది. ౨. అవయౌతి మిథో మిశ్రీభవతి అవయవః. యుమిశ్రణే. అన్యోన్యము కూడియుండునది. ౩. అపహన్యత ఇత్యపఘనః. హన హింసాగత్యోః. పీడింపఁబడునది. ౪. కరచరణా ద్యవయవముల పేళ్లు.

**అథ కళేబరమ్,**

**గాత్రం వపుః సంహననం శరీరం వర్ష్మ విగ్రహః.** 30

**కాయో దేహః క్లీబపుంసోః స్త్రియాంమూర్తి స్తను స్తమాః,**

ఆదానాద్యుపయోగితయా కళే కరేబరం వరం కళేబరం. రళయోర్వ బయోశ్చాభేదః- పుచ్చుకొనుట మొదలైన క్రియల కుపయోగించుటచేత హస్తమందు శ్రేష్ఠమైనది. కల్యతే ఆద్రియత ఇతి వా కళేబరం. కల సంఖ్యానే. ఆదరింపఁ బడునది. ౧. గాతే గచ్ఛతీతి గాత్రం. గాఙ్ గతౌ. పోవునది. ౨. ఉప్యతే ప్రాక్కర్మభిరితి వపుః. టు వప్ బీజసంతానే. పూర్వకర్మముల చేతఁ బుట్టింపఁబడునది. ౩. సంహన్యన్తే సంబధ్యన్తే అఙ్గాన్యత్రేతి సంహననం. హన హింసాగత్యోః. అవయవములు దీనియందుఁ గూడియుండును. పృథివ్యాదిపంచభూతాని సంఘ్నన్తి సంహతాసి భవన్త్యత్రేతి సంహననం. పృథివ్యాదిపంచ భూతములు దీనియందుఁ గూడియుండును. ౪. శీర్యత ఇతి శరీరం. శౄ హింసాయాం. నశించునది. ౫. వృష్యత ఇతి వర్ష్మ. న. న. వృషు సేచనే. తడుపఁబడినది. ౬. విశేషముగా ఆత్మచేత గ్రహింపఁబడినది. ౭. చీయతే అవయవైరితి కాయః. చిఞ్ చయనే. అవయవములచేత కూర్చఁబడునది. ౮. దిహ్యతే అన్నరసేనేతి దేహః. అ. పు. దిహ ఉపచయే. అన్న రసాదులచేత వృద్ధిబొందింపఁబడునది. ౯. మూర్ఛతి సముచ్ఛ్రితో భవతీతి మూర్తిః. సీ. మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః. ఉన్నతమగునది. ౧౦. తన్యతే ఆహారేణ తనుః. ఉ. సీ. తనూశ్చ. ఊ. సీ. తనువిస్తారే. ఆహారముచేత విస్తారము చేయఁబడునది. తను శబ్దము నకారాంత నపుంసకంబును గలదు. 'తను షేతనుషేక' మితి వాసవదత్తా. ఈ ౧౨ శరీరముపేళ్లు.

**పాదాగ్రం ప్రపదమ్-**

పాదస్య అగ్రం పాదాగ్రం - పాదముకొన. ౧. పదస్య ప్రారంభః. ప్రపదం. పదముయొక్క ప్రారంభము. ఈ ౨ మీఁగాళ్లు.

**పాదః పదఙ్ఘ్రిశ్చరణో౽స్త్రియామ్.** 71

పద్యతే అనేనేతి పాదః. పచ్చ. ద. పు. పద గతౌ. దీనిచేతఁ బోదురు. ౧, ౨. అఙ్గతి గచ్ఛత్యనేన అంఘ్రిః. పు. అఘి గతౌ. దీనిచేఁ

బోవుదురు. ౩. చరత్యనేన చరణః. అ. ప్న. చర గతిభక్షణయోః. దీని చేత సంచరింతురు. ఈ ౪ పాదముపేళ్లు.

**తత్గ్రంథీ ఘుటికే గుల్ఫౌ-**

ఘోటతే పరివర్తతే ఘుటికా. ఘుట పరివర్తనే. చుట్టువాఱియుండునది. ౧. అభిఘాతాద్గుల్యతే రక్ష్యత ఇతి గుల్ఫః. గుడ రక్షాయాం. అభిఘాతము వలన రక్షింపఁబడునది. ఈ ౨ పాదముల పార్శ్వముల యందలి బుడుపులపేళ్లు. చీలమండ.

**పుమా న్పార్ష్ణి స్తయోరధః,**

పారయతి గమనం పార్ష్ణిః. పు. పార తీర కర్మసమాప్తౌ. గమనమును నెఱవేర్చునది. పార్ష్ణి అని స్త్రీలింగంబును గలదు. 'పార్ష్ణ్యైవ ప్రోషితాసుం దనుసుత మవతా త్కుర్వతీ పార్వతీ నః' పార్ష్ణిః స్త్రీపుంసయోః 'పాదమూలే స్యా' దితి నిఘంటు. ఈ ౧ మడమ.

**జఙ్ఘాతు ప్రసృతా-**

జాయత ఇతి జంఘా. జనీ ప్రాదుర్భావే. పుట్టునది. ౧. ప్రసరతీతి ప్రసృతా-సృగతౌ. వృద్ధిఁబొందునది. ఈ ౨ పిక్క పేళ్లు.

**జానూ రుప ర్వ్యాష్ఠీవ దస్త్రియామ్.** 72

జాయతే జంఘోరుసంధిభాగ ఇతి జాను. ఉ. న. ప. పుం. జనీ ప్రాదుర్భావే. తొడపిక్కలసందునఁ బుట్టునది. 'జాను మప్యస్య మృద్నియాత్.' అని సుశ్రుతప్రయోగము. ౧. ఊర్వోః పర్వ ఊరుపర్వ. న. స. తొడల యొక్క కనుపు. ౨. అస్థ్యత్రాస్తీతి అష్ఠీవత్. త. ప్న. ఎముకగలది. ఈ 3 మోఁకాలి పేళ్లు.

**సక్థి క్లీబే పుమా నూరుః -**

సజతే సంగచ్ఛతీతి సక్థి. షంజ సంగే. కూడుకొనియుండునది. ౧. ఊర్ణూయతే వస్త్రేణేతి ఊరుః. పు. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే. వస్త్రముచేఁ గప్పఁబడునది. ఈ ౨ తొడ పేళ్లు.

**తత్సంధిః పుంసి వ్ష ణః,**

వంకతే ఉపవేశసమయే కించిత్కుటిల మాపద్యత ఇతి వంక్షణః.

వకి కౌటిల్యే. కూర్చుండునపు డించుక కుటిలత్వమును బొందునది. ఈ ౧ తొడలు పిఱుఁదులు వీనియొక్కసంధి. గజ్జలు.

**గుదం త్వపానం పాయు ర్నా-**

గువతి పురీషముత్సృజతీతి గుదం. గు పురీషోత్సర్గే. మలమును విడుచునది. ౧. అపానతి అధోవాయు ముత్సృజతి అపానం. అన ప్రాణనే. అధోవాయువును విడుచునది. ౨. పాతి మలోత్సర్జనేన పాయుః. ఉ. పు. పా. రక్షణే. మలమును విడుచుటచేత రక్షించునది. ఈ 3 గుద స్థానము పేళ్లు.

**వస్తి ర్నాభే రధో ద్వయోః.** 73

వసతి మూత్రాదికమత్రేతి వస్తిః. ఇ. ప్స. వస నివాసే. మూత్రాదికము దీనియందుండును. ఈ ౧ బొడ్డు క్రింది పొత్తికడుపు.

**కటో నాశ్రోణి ఫలకమ్ -**

కట్యతే ఆవ్రియతే వస్త్రాదినేతి కటః. కటే వర్షావరణయోః. వస్త్రాదులచేఁ గప్పఁబడునది. ౧. ఫలకాకృతిః శ్రోణిః శ్రోణిఫలకం. పలకవలె నుండెడు శ్రోణి. ఈ ౨ మొలపేళ్లు.

**కటిశ్శ్రోణిః కకుద్మతీ,**

కట్యతే కటిః. స్త్రీ. పా. కటీ. స్త్రీ. కప్పఁబడునది. ౧. శ్రోణతి సంగచ్ఛతే శ్రోణిః. స్త్రీ. పా. శ్రోణీ. స్త్రీ. శ్రోణృ సంఘాతే. సంహతమైయుండునది. ౨. శ్రోణిపార్శ్వదేశో మాంసలతయా కకుదాకారత్వాత్ కకు దిత్యుచ్యతే. తద్యోగాత్ కకుద్మతీ. స్త్రీ. మూఁపురమువలె బలిసియుండు శ్రోణిపార్శ్వముగలది. ఈ ౩ పిఱుఁదులపేళ్లు. ఈ ౫ ను మొలపేళ్లని కొందఱు.

**పశ్చాన్నితంబః స్త్రీ కట్యాః-**

సురతసమ్మర్దేన నితరాం తామ్యతి నితంబః. తము గ్లానౌ. సురత సమ్మర్దముచేత మిక్కిలి గాసిఁబొందునది. ఈ ౧ స్త్రీల మొలకు వెనుక నున్న ప్రదేశము. పిఱుఁదు.

**క్లీ బే తు జఘనం పురః.** 74

హన్యతే పురుషేణ తాడ్యత ఇతి జఘనం. హన హింసాగత్యోః. పురుషునిచేత పీడింపఁబడునది. ౧ స్త్రీల మొలముందరి చోటు. మడికట్టు.

**కూపకౌ తు నితమ్బస్థౌ ద్వయహీనే కుకున్దరే,**

యౌ కూపకో పృష్ఠవంశాదధోగతౌతే కుకుందరే ఇత్యుచ్యేతే. పిఱుదులమీఁద నుండు గుంటలు కుకుందరము లనంబడును. కు ఈషత్ కుం నితంబభూమిం దృణీత ఇతి కుకుందరే. అ. న. ద్వివచనము. ఇంచుకంత నితంబభూమిని భిన్నముగాఁ జేయునది. ఆఁడుదాని పిఱుదులమీఁది గుంటలు.

**స్త్రియాం స్ఫిచౌ కటిప్రోథౌ -**

స్ఫాయేతే స్ఫిచౌ. చ. సీ. ప. జ. సీ. స్ఫాయీ వృద్ధౌ. వృద్ధిఁబొందునది. కట్యాః ప్రోథౌ మాంసపిండౌ కటిప్రోథౌ. అ. పు. కటియొక్క మాంసపిండములు. ఈ ౨ పిఱుఁదులమీఁది యున్నత ప్రదేశముల పేళ్లు.

**ఉపస్థో వక్ష్యమాణయోః.** 75

ఉప సమీపే తిష్ఠతీత్యుపస్థః. ష్ఠా గతినివృత్తౌ. పరస్పరము సమీపమందుండునది. ౧. ముందరఁ జెప్పఁబడు రెంటియందును ఉపస్థశబ్దము వర్తించును.

**భగో యోనిర్ద్వయోః-**

భజ్యతే పురుషైరితి భగః. భజి సేవాయాం. పురుషులచే నాశ్రయింపఁ బడునది. ౧. యౌతి శిశ్నేన యోనిః. అ. ప్స. యు మిశ్రణే. శిశ్నముతోఁ గూడుకొనినది. ఈ ౨ యోని (స్త్రీ యువ స్థము) పేళ్లు.

**శిశ్నో మేఢ్రో మేహన శేఫసీ,**

శ్లిష్యతి భగేన శిశ్నః. శ్లిష ఆలింగనే. భగముతోఁ గూడినది. ౧. రేతసా భగం మేహతి మేఢ్రః. మేహనం చ. మిహ సేచనే. రేతస్సుచేత భగమును దడపునది. ౨, ౩. రేతసః స్రా వేణ శేతే శేఫః. స. న. శీఙ్ స్వప్నే. రేతస్సుపడినమీఁదట నిద్రించునది. అకారాంతంబును గలదు. శిశ్నము పేళ్లు.

**ముష్కోఽణ్డకోశో వృషణః-**

ముష్ణాతి గోపాయతి రేత ఇతి ముష్కః. ముషస్తేయే. రేతస్సును దాఁచునది. ౧. అండయోః కోశః అండకోశః. అండములయొక్క కూటమి. అండః. కోశః. అని రెండు పేళ్లని కొందఱు. ౨. వర్షతి రేత ఇతి వృషణః. వృషు సేచనే. రేతస్సును గురియునది. ఈ 3 వృషణముల పేళ్లు.

**పృష్ఠవంశాధరే త్రికమ్.** 76

పృష్ఠవంశాధరే త్రికం. పృష్ఠవంశమనఁగా వీఁపు యెముక. దానికి దిగువనున్న ప్రదేశము త్రికమనంబడును. త్రయాణాం ఊరుద్వయపృష్ఠా స్థినాం సమాహారస్త్రికం. తొడలు రెండును వీఁపు యెముకయు నీమూఁటి యొక్క కూటమిగనుక త్రికము. ౧. వెన్నెముక దిగువనున్న చోటు.

**పిచణ్డకుక్షీ జఠరోదరంతున్దమ్ -**

పచతి అన్నం స్వగతాగ్నినా పిచండః. తనయందుండెడు అగ్నిచేత అన్నమును బక్వము సేయునది. అపిచమత్యాహార మితివా పిచండః. చము అదనే. ఆహారమును భక్షించునది. ౧. కుష్యతే బహిర్నిష్క్రియతే మలమస్మాదితి కుక్షిః. పు. కుష నిష్కర్షే. దీనివలన మలము బయలు వెళ్లింపఁబడును. ౨. జన్యతే గర్భో ఽ స్మిన్నితి జఠరం. జనీ ప్రాదుర్భావే. దీని యందు గర్భము పుట్టింపఁబడును. ౩. ఉదయర్తిగర్భో ఽ స్మాదితి ఉదరం. ఋ గతౌ. దీనివలన గర్భము ప్రకాశమౌను. ౪. తుద్యతే అజీర్ణాదినాతుందం. తుద వ్యథనే. అజీర్ణాదులచేత వ్యథ పెట్టఁబడునది. ౫. జఠరాది శబ్దములు 3 ను సమాహార ద్వంద్వము కడుపు పేళ్లు.

**స్తనౌ కుచౌ,**

స్తనతి బాల ఆభ్యా మితి స్తనౌ. అ. పు. స్తన శబ్దే. వీనికొఱకు బాలుఁడు మెఱపెట్టును. ౧. కుచ్యతే కామినా నఖైః కుచౌ. అ. పు. నాయకునిగోళ్లచే గిల్లఁ బడునవి. ఈ ౨ చన్నుల పేళ్లు.

**చూచుకం తు కుచాగ్రం స్యాత్ -**

చూచు ఇతి కాయతి బాలేన పీయమానమితి చూచుకం. కైశబ్దే. బాలునిచేత పానము చేయఁబడుచున్నదై చూచు అని పలుకునది. ౧. కుచయోరగ్రం కుచాగ్రం. కుచములయొక్క అగ్రము. ఈ ౨ చను మొనలు.

**న నా క్రోడం భుజాన్తరమ్.** 77

క్రోడతీతి క్రోడం. అ. న్న. క్రుడ ఘనత్వే. ఘనమైనది. ౧. భుజయో రంతరం భుజాంతరం. భుజములయొక్కనడుము. ఈ ౨ చేతుల నడుము పేళ్లు.

**ఉరో వత్సం చ వక్షశ్చ -**

స్థైర్యమృచ్ఛత్యురః స. న. ఋ గతౌ. స్థైర్యమును బొందునది. ౧.

వస్యతే వస్త్రేణ వత్సం. వస ఆచ్ఛాదనే వస్త్రముచేఁ గప్పఁబడునది. ౨. నక్షతే సురతాదౌ వక్షః. స. న. వక్ష సంఘాతే. సురతాదులయందుఁ గొట్టఁబడినది. ఈ ౩ ఱొమ్ము పేళ్లు.

**పృష్ఠం తు చరమం తనోః,**

తనోశ్చరమం పృష్ఠ మిత్యుచ్యతే. శరీరముయొక్క వెనుకటి భాగము పృష్ఠ మనంబడును. పృష్యతే కేశోదకై రితి పృష్ఠః. పృషు సేచనే. తలవెండ్రుకల నీళ్లచేఁ దడుపఁబడునది.

**స్కన్ధో భుజశిరో ఽంసో ఽస్త్రీ-**

కం శిరో దధాతీతి స్కంధః. డు ధాఞ్ ధారణపోణయోః. శిరస్సును ధరించునది. ౧. భుజస్య శిరో ఽగ్రం భుజశిరః. స. న. భుజము యొక్కకొన. ౨. అమ్యతే భారేణ అంసః. అ. ప్న. అమరోగే. భారముచేఁ బీడింపఁబడునది. ఈ ౩ మూఁపు పేళ్లు.

**సంధీ తస్యైవ జత్రుణీ.** 78

జాయతే బాహురస్మాత్ జత్రు. ఉ. న. జనీ ప్రాదుర్భావే. దీని నుండి బాహువు పుట్టును. ౧. మూఁపు సంధులు. ఆ మూఁపుయొక్కయు ఱొమ్ముయొక్కయు సంధులని కొందఱు.

**బాహుమూలే ఉభే కక్షౌ-**

బాహ్వోర్మూలే బాహుమూలే. అ. న. చేతులయొక్క మొదళ్లు. ౧. కష్యేతే స్వేదేన కక్షౌ. అ. పు. కష హింసాయాం. చెమటచేఁ బీడింపఁబడునవి. ఈ ౨ చంకల పేళ్లు.

**పార్శ్వమస్త్రీ తయో రధః,**

పూర్యతే అస్థిభి రితి పార్శ్వం. అ. ప్న. పౄ పాలనపూరణయోః. ఎముకలచేత పూర్ణమైయుండునది. ౧. చంకల క్రింది భాగము. ప్రక్క.

**మధ్యమం చావలగ్నం చ మ ధ్యో ఽస్త్రీ**

మధ్యేభవం మధ్యం, మధ్యమం చ. శరీరము నడుమఁ బుట్టినది. అవలగ్యత ఇతి అవలగ్నం లగే సఙ్గే. పూర్వాపరములతోఁ గలియునది. ఈ ౩ నడుము పేళ్లు.

**ద్వౌ పరౌ ద్వయోః.** 79

**భుజబాహూ ప్రవేష్టో దోః స్యాత్ -**

ద్వౌ పరౌ ద్వయోః. ఈముందు చెప్పఁబడు భుజబాహు శబ్దములు రెండును స్త్రీలింగ పుంలింగములయందు వర్తించును. భుజ్యతే అన్నాదికమనేనేతి భుజః. భుజపాలనాభ్యవహారయోః. దీనిచేత భుజింపఁబడును. ౧. బాహతే అనేన పురుషో వస్తూ పాదనాయ ప్రయత్నం కరోతీతి బాహూః. ఉ.పు. బాహృప్రయత్నే. దీనిచేత పురుషుఁడు వస్తువును గ్రహించుటకు యత్నము చేయును. బాధత ఇతి బాహుః బాధించునది. స్త్రీలింగమైనప్పుడు ఆకారాంతము. ౨. ప్రవేష్ట్యతే ఉనేన ప్రవేష్టః. వేష్ట వేష్టనే. దీనిచేత చుట్టఁబడును. ౩. దమ్యతే అనేన దోః. న. పు. దీనిచేత శిక్షింపబడును. దోః దోషౌ దోషః. సకారాంత నపుంసకము గలదు. దోః, దోషీ, దోంషి, దోషా. 'అకారాంత స్త్రీలింగము. "దోర్షోషాచ భుజోబాహు"రితి ధనంజయః. "భాహో దోషా ప్రవేష్ట" శ్చేతి మంజరీ. "దక్షిణం దోర్నిశాచర" ఇతి కాళిదాసశ్చ. నకారాంతంబును గలదని కొందఱు. ఈ ౪ చేతులపేళ్లు.

**కపోణిస్తు కూర్పరః,**

కం సుఖం పుణతి కరోతి కపోణిః. ఇ. పు. పుణ శుభకర్మణి చ. సుఖమును జేయునది. పా. కపోణీ. సీ. 'కపోణిరనపుంసకం' అని రభసుఁడు. కపోణిశబ్దము నుకారమధ్యముగాఁ గొందఱు చెప్పుదురు. ౧. పదార్థకర్షణే హఠాత్ కురతి కూర్పరః. కుర శబ్దే. పదార్థములను గొబ్బునతీయునపు డించుక ధ్వనించునది. ఋ. కుర్పరః. మోఁచేతిపేళ్లు.

**అస్యోపరి ప్రగణ్డ స్స్యాత్**

ప్రగణ్యతే సువృత్తతయా ప్రగండః. గణ సంఖ్యానే. వట్రువౌటచే లెక్కపెట్టఁబడునది. ఈ ౧ మోఁచేతి మీఁద భుజ మూలమువఱకుఁ గల భాగము.

**ప్రకోష్ఠస్తస్య చా ప్యధః.** 80

ప్రకృష్యతే ప్రావరణా ద్బహి ర్నిస్సార్యత ఇతి ప్రకోష్ఠః. కుషనిష్కర్షే. కప్పునకు వెలుపలగాఁ దీయఁబడునది. మణికట్టువఱకుఁ గల మోఁచేతి క్రింద ప్రదేశము పేరు. ఈ ౧ ముంజేయి పేరు.

**మణిబన్ధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః,**

మణిబన్ధో హస్తగ్రంధిః. తమారభ్య కనిష్ఠపర్యన్తం హస్తబ

హిర్భాగః కరభ ఇత్యుచ్యతే. మణికట్టునుండి చిటికెనవ్రేలి దనుక చేతి యొక్క వెలుపలి పార్శ్వము కరభ మనఁబడును. కరేభాతి. కరభః. కరమందుఁ బ్రకాశించునది. ఈ ౧ మణికట్టుమొదలు చిటికెనవ్రేలివఱకు గల చేతి వెలుపలి భాగము.

**పఞ్చశాఖశ్శయః పాణిః -**

పఞ్చ శాఖా – అఙ్గుళీరూపా అస్యేతి పఞ్చశాఖః. వ్రేళ్లనెడి యయిదు కొమ్మలు గలది. ౧. స్వకీయ ధనమత్ర శేతే తిష్ఠతీతి శయః. శీఙ్–స్వప్నే. తన ధనము దీనియం దుండును. ౨. పణతి వ్యవహరత్యనేన పాణిః. ఇ. పు. పణ వ్యవహారే స్తుతౌ చ. దీనిచేత నరుఁడు వ్యవహరించును. ఈ ३ మణికట్టునుండి వ్రేళ్లతోఁగూడిన చేతి పేళ్లు.

**తర్జనీ స్యా త్ప్రదేశినీ.** 81

తర్జయం త్యనయా తర్జనీ. సీ. తర్జ భర్జ సంతర్జనే. దీనిచేత భయపెట్టుదురు. ౧. ప్రదిశతి నిర్దిశత్యనయా ప్రదేశినీ. పా. ప్రదేశనీ. సీ. దిశ అతిసర్జనే. దీనిచేత నిర్దేశింతురు. ఈ ౨ జుట్టున వ్రేలి పేళ్లు.

**అఙ్గుళ్యః కరశాఖా స్స్యుః-**

అఙ్గన్తి అన్యోన్యం అఙ్గళ్యః. ఈ.సీ. బహువచనము. అగిగతౌ–పరస్పరము కలసియుండునవి. ఇకారాంతమును గలదు. అకారాంత న పుంసకమును గలదు. కరస్య శాఖా ఇవ కరశాఖాః. హస్తమునకు కొమ్మలవలె నుండునవి. ఈ ౨ సామాన్యముగా వ్రేళ్ల పేళ్లు.

**పుం స్యఙ్గుష్ఠః ప్రదేశినీ,**

మధ్య మానామికా చాపి కనిష్ఠా చేతితాః క్రమాత్. 82

అఙ్గే తిష్ఠతీత్యఙ్గుష్ఠః. ష్ఠా గతినివృత్తౌ. అంగమం దుండునది. బొటనవ్రేలు. ౧. ప్రదేశినిముందు చెప్పఁబడినది. ౧. మధ్యేభవా మధ్య మా. నడుమ నుండునది. నడిమివ్రేలు. ౧. వాస్తి ప్రసిద్ధనామాస్య అనామికా. ప్రసిద్ధమైన నామము దీనికి లేదు. దర్భవ్రేలు. ౧. అతిశయేన అల్పా కనిష్ఠా. మిక్కిలి చిన్నది. చిటికెనవ్రేలు. ఈ ౧ వరుసగా బొటనవ్రేలి దగ్గఱనుండి అయిదు వ్రేళ్లకును పేళ్లు.

**పునర్భవః కరరుహో నఖో ఽ స్త్రీ నఖరో ఽ స్త్రియామ్,**

ఛినో ఽపి పునర్భవతీతి పునర్భవః. ఛిన్నమైనను మరల మొలచు

నది. ౧. కరే రోహతీతి కరరుహః. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. చేతియందు మొలచునది. ౨. న విద్యతేఖ మింద్రియం స్పర్శజ్ఞాపక మత్ర నఖః. అ. పు. స్పర్శజ్ఞాపకమైన యింద్రియము దీనికి లేదు. ౩. నఖిశబ్దో నఖైకదేశే ఉ. పి. సో ఉ స్యాస్తీతి నఖరః. అ.పు. నఖశబ్దము నఖైక దేశమందు వర్తించును. ఆనఖైక దేశము గలది. ౪. అరుణునిచేత నఖరశబ్దము త్రిలింగమని చెప్పఁబడెను. ఈ ౪ గోళ్ల పేళ్లు.

**ప్రాదేశ తాల గోకర్ణాస్తర్జన్యాదియుతే తతే.** 83

ప్రదస్యతే పరిమీయతే ప్రాదేశః. దిశ అతిసర్జనే. పెనువ్రేలు జుట్టునవ్రేళ్ల నడిమి కొలత. జుత్తెడు. ౧. తలతి ప్రతిష్ఠితే పరిమేయ మస్మిన్నితి తాలః. తల ప్రతిష్ఠాయాం – కొలవఁదగిన వస్తువు దీనియందు ప్రతిష్ఠ గలిగియుండును. పెనువ్రేలునడిమి వ్రేళ్ల నడిమి కొలత. ౧. గోకర్ణా కృతిరత్రా స్తీతి గోకర్ణః – ఆవు చెవులవంటి ఆకారము గలది. పెనువ్రేలు దర్భవ్రేళ్ల నడిమి కొలత. ౧. వరుసగా జుట్టనవ్రేలు, నడిమివ్రేలు, దర్భవ్రేలు వీనితోఁగూడి చాఁచబడిన బొటిమనవ్రేలిచేతఁ గొలిచిన 3 కొలతల పేళ్లు. దుత్తెళ్లు.

**అఙ్గుష్ఠే సకనిష్ఠే స్యా ద్వితస్తిర్ద్వాదశాఙ్గుళః,**

వితస్యతి హస్తాపేక్షయా ఉపక్షయతే వితస్తిః, తను ఉపక్షయే. హస్తముగూర్చి తక్కువైనది. ఈ శబ్దము సాహచర్యమునఁ బుంలింగము. స్త్రీలింగంబును గలదు. "వితస్తిః స్త్రీ కనిష్ఠా చ' అని యమరమాల. ౧. ద్వాదశ అఙ్గుళయః ప్రమాణ మస్య ద్వాదశాఙ్గుళః. పంద్రెండంగుళముల ప్రమాణము గలది. ఈ ౨ చిటికెన వ్రేలితోఁగూడి పఱచఁబడిన పెనువ్రేలిచేతఁ గొలిచిన కొలత పేళ్లు. జానెడు.

**పాణౌచపేట ప్రతల ప్రహస్తా విస్తృతాఙ్గుళౌ.** 84

విస్తృతాఙ్గుళౌ పాణౌ చపేటాదిత్రయం వర్తతే – చప్యతే–పుత్రాదిస్సాంత్వ్యతే అనేన చపేటః. చప సాన్త్వనే. దీనిచేత పుత్రాదులు ఊరడింపఁబడుదురు. ౧. ప్రసృతం తలమస్యాస్తీతి ప్రతలః–విస్తృతమైన ప్రదేశముగలది. ౧. విస్తృతో హస్తః ప్రహస్తః. విస్తృతమైన హస్తము. ఈ 3 చాఁచిన ప్రేళ్లు గల యఱచేతి పేళ్లు.

**ద్వౌ సంహతౌ సంహతల ప్రతలౌ వామదక్షిణౌ,**

సంహతం సంఘట్టం లాతీతి సంహతలః. పా. సింహతలః.లా ఆదానే. సంఘట్టమును బొందునది. ౧. ప్రతతే తలే అత్ర ప్రతలః– చాఁచిన యఱచేతులు గలది. ౨. ఈ ౨ చాఁచిన వ్రేళ్లు గలిగి కలుపఁబడిన యెడమ యఱచేతుల పేళ్లు.

**పాణి ర్ని కుబ్జః ప్రసృతిః-**

కుంచితః పాణిః ప్రసృతి రుచ్యతే. వంచఁబడిన యఱచేయి ప్రసృతి యనంబడును. నితరాం కుబ్జా ప్రకృతిరస్య నికుబ్జః. మిగుల నిఱికియుండు నలవాటు గలది. ౨. ప్రసార్యతే విరుద్ధలక్షణయా సంకుచ్యత ఇతి ప్రసృతిః. చాఁచఁబడినది. అనఁగా విరుద్ధలక్షణచేత ముడువఁబడినది యనుట. ౨. ఈ ౨ చేర, పుడిసిలిపేళ్లు.

**తౌ యుతా వఞ్జలిః పుమాణ్.** 85

అఞ్జ్యతే వ్యజ్యతే భక్తిరనేనేతి అఞ్జలిః. ఇ. పు. అఞ్జూ వ్యక్తిశ్ల క్ష్ణకాన్తిగతిషు. దీనిచేత భక్తి వ్యక్తముగాఁ జేయఁబడును. దోసిలి.

**ప్రకోష్ఠే విస్తృతకరే హస్తో-**

కఫోణేరధః ప్రకోష్ఠః. తత్ర విస్తృతకరే సతి హస్త ఇత్యుచ్యతే–చాఁచఁబడిన అరచెయ్యిగల మోఁచేతికి దిగువనున్న ప్రదేశము హస్తమనంబడును. హన్యతే అంశుకాదిరనేన హస్తః. హన హింసాగత్యోః. దీనిచేత వస్త్రాదులు కొట్టఁబడును. అనఁగా కొలవఁబడుననుట. ౧. మూర.

**ముష్ట్యా తు బద్ధయా,**

**స రత్ని స్స్యాత్ -**

బద్ధయా ముష్ట్యా ఉపలక్షితః సహస్తో రత్ని రుచ్యతే. ముడువఁబడిన యఱచేయిగల యా హస్తము రత్ని యనంబడును. రమన్తే వ్యవహారిణో ఽనేనేతి రత్నిః. రము క్రీడాయాం. దీనిచేత వ్యవహారులు క్రీడింతురు. ఈ ౧. పిడిమూరపేరు.

**అరత్నిస్తు నిష్కనిష్ఠేన ముష్టినా.** 86

నిష్కనిష్ఠేన నిర్గకనిష్ఠాఙ్గుళినా ముష్టినా ఉపలక్షితో హస్త అరత్నిరిత్యుచ్యతే – చాఁచిన చిటికెన వ్రేలు గల పిడికిలితోఁ గూడిన మూర అరత్ని యనంబడును. ఋచ్ఛతి మానసంజ్ఞా మిత్యరత్నిః. ఇ. పు. ఋ

గతౌ. ప్రమాణసంజ్ఞను బొందునది. రత్న్యరత్ని శబ్దములు హస్తశబ్ద సాహచర్యమువలనఁ బుల్లింగములు. 'నారత్నిః కఫణౌ హస్తే సప్రకోష్ఠేతతాఙ్గులే' అని రుద్రుఁడు. స్త్రీలింగమును గలదు. 'రత్న్యరత్నీ స్త్రి యౌహస్తౌ బద్ధముష్టితలాంగుళౌ' అని యమరమాల. 'ముష్ట్యాముష్టినా' అని రూపభేదములచేత ముష్టిశబ్దము పుంస్త్రీలింగములయందు వర్తించును.

**వ్యామో బాహ్వోస్సకరయో స్తతయో స్తిర్యగన్తరమ్,**

సకరయోః పాణీసహితయోః తిర్యక్తతయోః తిర్యక్ ప్రసారితయో ర్బాహ్వో రనర్తరం వ్యామ ఇత్యుచ్యతే. అఱచేతులతోఁ గూడ నడ్డముగా చాఁచఁబడిన బాహువుల యొక్క నడుము వ్యామ మనంబడును. వ్యామీయతే రజ్జ్వాదిక మనేనేతి వ్యామః. మాఙ్ మానే. త్రాఁడు మొదలైనవి దీనిచేత కొలవఁబడును. ౧. బార.

**ఊర్ధ్వవిస్తృతదోః పాణిర్నృమానే పౌరుషం త్రిషు.** 87

ఊర్ధ్వం విస్తృతః ప్రసారితః దోస్సహితః పాణి ర్యస్య తస్య పురుషస్య మానం పౌరుష మిత్యుచ్యతే. మీఁదికి చాఁచఁబడిన బాహువులతోఁగూడిన అఱచేయిగల పురుషుని యొక్క ప్రమాణము పౌరుషమనంబడును. పుషస్యేదం మానం పః రుషం. త్రి. పురుషునియొక్క ప్రమాణము. పౌరుషం జలం. పౌరుషస్సేతుః. పౌరుషీ యష్టిః మానిసిచే యెత్తుపొడవు.

**కణ్ఠో గళః -**

కణతి ధ్వనతి కణ్ఠః కణ శబ్దే. పలుకునది. ౧. గళ త్యనేన గళః. గళ అదనే. దీనిచేత మ్రింగుదురు. ఈ ౨ కుత్తుకపేళ్లు.

**అథ గ్రీవాయాం శిరోధిః కంధరేత్యపి,**

గిరన్త్యనయా ఉన్నాదికమితి గ్రీవా. గౄ నిగరణే. దీనిచేత నన్నాదుల మ్రింగుదురు. ౧. శిరో ధీయతే ఉస్యామితి శిరోధిః. సీ. దుధాఞ్ ధారణ పోషణయో. దీనియందు శిరస్సు ధరింపఁబడును. ౨. కం శిరోధారయతి కంధరా. ధృఞ్ ధారణే. శిరస్సును ధరించునది. ఈ 3 మెడ పేళ్లు.

**కమ్బుగ్రీవా త్రిరేఖా సా -**

సాత్రిరేఖా రేఖాత్రయయుక్తాచే త్కమ్బుగ్రీ వేత్యుచ్యతే–ఆ మెడ మూఁడురేఖలు గలదైన కంబుగ్రీవ మనంబడును. కమ్బుతుల్యాగ్రీవా కమ్బుగ్రీవా–శంఖసమమైన మెడ. ౧. మూఁడు రేఖలుగల మెడ.

**అవటు ర్ఘాటా కృకాటికా.** 88

న వటతి న వేష్టతే అవటుః. వట వేష్టనే. చుట్టువాఱియుండనిది. పుంలింగము. 'అవటుః పురుషే కృకాటికా' అని రత్నకోశము. ౧. శరీరమ స్తకయోస్సంధిం ఘటతే ఘాటా. ఘట చేష్టాయాం. శరీరమస్త కములయొక్క సంధిని ఘటించునది. ౨. కృశం శిరోగ్రీవే అటతి వ్యాప్నోతి కృకాటికా. అట గతౌ. శిరస్సును మెడను పొందియుండునది. ఈ 3 పెడతల పేళ్లు.

**వక్త్రాస్యే వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్,**

ఉచ్యతే ఽ నేన వక్త్రం. వచ పరిభాషణే. దీనిచేత పలుకఁబడును. ౧. అస్యతే క్షిప్యతే భక్ష్యమత్రేతి ఆస్యం. ఆసు క్షేపణే. దీనియందు భక్ష్యవస్తువులు వేయఁబడును. ౨. వదన్త్యనేన వదనం. వద వ్యక్తాయాం వాచి. దీనిచేత పలుకుదురు. ౩. తుద్యతే హింస్యతే ఖాద్యమనే నేతి తుణ్డం. తుడి తోడనే. భక్ష్య వస్తువు దీనిచేత పీడింపఁబడును. ౪. అనితి శ్వసత్యనేన ఆననం. అన ప్రాణనే. దీనిచేత బ్రతుకుదురు. ౫. లపంత్యనేన లపనం. లప వ్యక్తాయాం వాచి. దీనిచేతఁ బలుకుదురు. ౬. ఖన్యతే భక్ష్యమనేనేతి ముఖం. ఖను అవదారణే. దీనిచేత భక్ష్యము పీడింపఁబడును. ఈ ౭ ముఖము పేళ్లు. నోరు.

**క్లీబే ఘ్రాణం గన్ధ వహా ఘోణా నాసా చ నాసికా.** 89

జిఘ్రతి అనేన ఘ్రాణం. న. ఘ్రా గన్ధోపాదానే. దీనిచేత వాసన గ్రహింతురు. ౧. గంధం వహతీతి. గంధవహా. వహ ప్రాపణే. గంధమును వహించునది. ౨. ఘుణతి భ్రమతి గంధగ్రహణాయ ఘోణా. ఘుణభ్రమణే. భ్రమించునది. ౭. నాసతే శబ్దాయతే నాసా. నాసికా చ. నాసృశబ్దే. ధ్వనిచేయునది. ఈ ౫ ముక్కు పేళ్లు.

**ఓష్ఠాధరౌ తు రదనచ్ఛదౌ దశనవాససీ,**

ఉష్ణాహారేణ ఉష్యతే ఓష్ఠః ఉష ప్లుష దాహే. ఉష్ణాహారము చేత వ్యథ పెట్టఁబడునది. ౧. అధోభవత్వాదధరః. ముఖము యొక్క అధో

భాగమం దుండునది. ౨. రదనాః ఛాద్యంతే అనేన రదనచ్ఛదః. ఛదఅపవారణే. దంతములు దీనిచేఁ గప్పఁబడియుండును. ౩. దశనాచ్ఛాదకత్వేన వాసస్సామ్యా ద్దశనవాసః. స. న. దంతములకు వస్త్రమువలె నుండునది. ఈ ౪ పెదవుల పేళ్లు.

**అధస్తాచ్చిబుకమ్-**

ఓష్ఠా దధఃప్రదేశశ్చిబుక మిత్యుచ్యతే. పెదవియొక్క క్రిందటి ప్రదేశము చిబుకమనంబడును. చీపతి చేవ్య తే వా చిబుకం – కమ్ముకొనియుండునది లేక పట్టుకోఁబడినది. చీవృ ఆదాన సంవరణయోః. ౧. గడ్డము.

**గణ్డౌ కపోలౌ-**

గణ్డతీతి గండః. గడి వదనైక దేశే. కూడుకొనియుండునది. ౧. భక్షణసమయే కంపత ఇతి కపోలం. కపి కిఞ్చిచ్చలనే. భక్షించు సమయమందుఁ జలించునది. ఈ ౨ చెక్కిళ్ల పేళ్లు.

**తత్పరో హనుః.** 90

తాభ్యాం కపోలాభ్యాం పరః ఉపరిభాగః మనురిత్యుచ్యతే. ఆ చెక్కిళ్ల మీఁదటిపార్శ్వముగాని వెనుకటి పార్శ్వముగాని మను వనంబడును. హంతి భక్ష్యం హనుః. ప్స. హన హింసాగత్యోః, భక్ష్యమును నమలునది. వెలిదౌడలు (కటమరలు).

**రదనా దశనా దన్తా రదాః -**

రద్యన్తే భక్ష్యా ణ్యేభి రితి రదనాః, రదాశ్చ–రద విలేఖనే. నీనిచేత భక్ష్యములు తునకలుగాఁ జేయఁబడును. ౧, ౪ .దంశంతిస్త్ర్య ధరమేభిరితి దశనాః. దంశ దశనే. వీనిచేత వనితలయధరమును గొఱుకుదురు. ౨. దమ్యతే భక్ష్య మేభి రితి దన్తాః. దము ఉపశమే – భక్ష్య వస్తువు వీనిచేత భక్షింపఁబడును. ౩. ఈ ౪ పుల్లింగములు. పండ్లపేళ్లు.

**తాలు తు కాకుదమ్,**

తలతి ప్రతిష్ఠతి దగ్ధశేషమత్రేతి తాలు. ఉ. న. తల ప్రతిష్ఠాయాం–భు క్తశేషము దీనియందు నిలుచును. నకారాంతంబును గలదు. ౧. కాకు ధ్వని విశేషం దదాతీతి కాకుదం. దా దానే. కాకుధ్వని నిచ్చునది. ఈ ౨ దౌడ పేళ్లు.

**రసజ్ఞా రసనా జిహ్వా -**

రసం జానాతీతి రసజ్ఞా. జ్ఞా అవబోధనే. రసము నెఱుఁగునది. ౧. రస్యతే అనయా రసనా. రస ఆస్వాదనే. దీనిచేత నాస్వాదింపఁబడును. ౨. హ్వాయతి రసవద్వస్తు జిహ్వా. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ. రసయుక్తమైన వస్తువుల నిచ్ఛయించునది. ఈ 3 నాలుక పేళ్లు.

**ప్రాన్తా వోష్ఠస్య సృక్విణీ.** 91

ఓష్ఠస్య ప్రాంతౌ సృక్విణి ఇత్యుచ్యేతే. పెదవులయొక్క కడపటి భాగములు సృక్వు లనంబడును. సృజతో లాలాం సృక్విణీ. జొల్లును బుట్టించునవి. ఇకారాంత నపుంసక ద్వివచనము. అకారోపధమైన నకారాంతన పుంసక ద్వివచన మని కొందఱు. "వామం లిహ ఉ సృక్వ పరాపూర్ణే" ఇతివసంత రాజీయే. 'సక్థ్యస్థిదధి సృక్వ్య' క్షీతి శబరస్వామీ. ౧ సెలవులు.

**లలాట మలికం గోధిః -**

లలంత శ్చలంతః ఆటం త్యలకా అత్రేతి లలాటః అట గతౌ. దీనియందు ముంగురులు చలింపుచు నటించును. ౧. అల్యతే భూష్యతే అనే నేత్యలికం. అల భూషణే. అలంకరింపఁబడునది. పా. అలీకం "తేదృష్ట మాత్రపతితా అలికస్య నామక్ష్ణో భాయ పక్ష్మలదృశామలకాః కలాశ్చ, నీచాస్సదైవ సవిలా సమలీకమగ్నా." ఇతి కావ్యప్రకాశికా. ౨. గావౌ నేత్రే ధీయేతే అస్మిన్నితి గోధిః. గోశబ్దము నేత్రవాచకము. నేత్రములు దీనియందు ధరింపఁబడును. పుల్లింగము. "పాలో గోధిర్నరా వుభౌ" అని యాదవుఁడు. ఈ 3 నుదురు పేళ్లు.

**ఊర్ధ్వే దృగ్భ్యాం భ్రువౌ స్త్రియౌ,**

దృగ్భ్యామూర్ధ్వేస్థానేభ్రువా విత్యుచ్యేతే. నయనములకంటె మీఁదటి భాగములు భ్రూవు లనఁబడును. భ్రమత ఇతి భ్రువౌ. భ్రము అనవస్థానే. చలించునవి. ఊ. సీ. ద్వి. కనుబొమలు.

**కూర్చమస్త్రీ భ్రువో ర్మధ్యమ్ -**

భ్రువోర్మధ్యం కూర్చమిత్యుచ్యతే. కనుబొమలనడుము కూర్చమనంబడును. కోచతి భ్రూరోమాణీ కుటిలాని కరోతి కూర్చం. కుచ సంకోచనే. కనుబొమ్మ వెండ్రుకలను కుటిలముగాఁ జేయునది. ౧. కనుబొమల నడిమి ప్రదేశము.

**తార కాక్ష్ణః కనీనికా.** 92

తారయతి తమః. తారకా. తౄ ప్లవనతరణయోః. అంధకారమును దాఁటించునది. ౧. కనతి ప్రకాశయతి సర్వం కనీనినికా. కనదీప్తౌ. అన్నిటినిఁ బ్రకాశింపఁజేయునది. ఈ ౨ కంటి నల్లగ్రుడ్డు పేళ్లు.

**లోచనం నయనం నేత్ర మీక్షణం చక్షు రక్షిణీ,**

**దృగ్దృష్టీచ -**

లోచ్యతే అనేనేతి లోచనం. లోచృ దర్శనే. దీనిచేత చూడఁబడును. ౧. నీయతే అనేన నయనం. నేత్రం చ. ణీఞ్ ప్రాపణే. దీనిచేత అర్థములు పొందింపఁబడును. ౨, ౩. ఈక్ష్యతే అనేనేతి ఈక్షణం. ఈక్షదర్శనే. దీనిచేత చూడఁబడును. ౪. చష్టే వస్తు స్వరూపం వక్తి చక్షుః. స. న. చక్షిఙ్ వ్యక్తాయాం వాచి. వస్తు స్వరూపమును చెప్పునది. ౫. అక్ష్ణోతి దూరమిత్యక్షి. అక్షూ వ్యాప్తౌ. దూరముగా వ్యాపించునది. ఇ. న. ద్వి. ౬. పశ్యంతి అనయా దృక్. శ. సీ. దృష్టిశ్చ. సీ. దృశిర్ ప్రేక్షణే. దీనిచేతఁ జూతురు. ఈ ౮ నేత్రముల పేళ్లు.

**అశ్రు నేత్రామ్బురోదనం చాస్ర మస్రుచ.** 93

అశ్నుతే కపోలం అశ్రు. ఉ. న. అశూ వ్యాప్తౌ–కపోలముల యందు వ్యాపించునది. ౧. నేత్రయో రంబు నేత్రాంబు. కన్నీరు. ౨. రుద్యతే ఽనేన రోదనం. రుదిర్ అశ్రువిమోచనే. దీనిచే దుఃఖింతురు. ౩. అస్యతే అస్రం. అస్రుచ. ఉ. న. అసు క్షేపణే. చేత మీటఁబడునది. పా. అశ్రం. ప్రావర్తయన్నదీర స్త్రైర్ద్విషతాం యోషితాం చ సః' అని మాఘమందు రుధిర వాచకముతోఁ గూడ శ్లేషగాఁ జెప్పుట వలన సకారయుక్తము. 'శమశ్శీలే ఽజగరే చాశ్రమశ్రుణి' అనిశాంతమున రుద్రుఁడు. ఈ ౫ కన్నీరు పేళ్లు.

**అపాఙ్గౌ నేత్రయో రన్తౌ-**

నేత్రయోరన్తౌ అపాఙ్గౌ విత్యుచ్యేతే. రెండుకన్నుల కడలు అపాంగములనంబడును. కడకన్నులు. అఙ్గా న్నాసికాయా అపకృష్టౌ అపాఙ్గౌ. అంగము కంటె అపకృష్టములైనవి. ఈ ౧ కడగన్నుల పేరు.

**కటాక్షో ఽ పాఙ్గదర్శనే,**

అపాంగదర్శనే కటాక్షోవర్తతే. కడకంటిచూపు కటాక్ష మనం

బడును. కటేనేత్ర దేశే అక్ష్ణోతీతి కటాక్షః అక్షూ వ్యాప్తౌ. కటమనఁగా నేత్రములయొక్క వెలుపలి భాగము. దానియందు వ్యాపించునది. ౧. కడగంటిచూపు.

**కర్ణ శబ్దగ్రహౌ శ్రోత్రం శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః.** 94

కరోతి శబ్దగ్రహణం కర్ణః డుకృఞ్ కరణే. శబ్దగ్రహణమును జేయునది. కీర్యతే శబ్దో௨త్రేతి వాకర్ణః. కౄ విక్షేపే. శబ్దము దీనియందుఁ జల్లఁబడును. ౧. గృహ్యతే అనేన గ్రహః. శబ్దస్య గ్రహః. శబ్దగ్రహః. గ్రహ ఉపాదానే. శబ్దము దీనిచేతఁ గ్రహింపఁబడును. ౧. శృణోత్యనేన శ్రోత్రం. శ్రుతిః. సీ. శ్రవణం శ్రవశ్చ. స. న. శ్రు శ్రవణే. దీని చేత విందురు. కనుక శ్రోత్రము, శ్రుతి, శ్రవణము, శ్రవస్సు. ౩, ౪, ౫, ౬ ఈ చెవుల పేళ్లు.

**ఉత్తమాఙ్గం శిర శ్శీర్షం మూర్ధా నా మ స్తకో௨ స్త్రీయామ్,**

ఉత్తమం చ తత్ అంగం ఉత్తమాంగం. ఉత్తమమైన అంగము. ౧. జరయా శీర్యతే శిరః. స. న. శీర్షం చ. శౄ హింసాయాం. జరచేఁ బీడింపఁబడునది. గనుక శిరము, శీర్షము. శిరశబ్దము అకారాంతపుంలింగము గలదు. అలాగే రజశ్శబ్దంబును. 'విచకర్త శిరాన్ ద్రౌణి రథః పాదరజోపమాన్' అని కందభూషణాలంకారము. ౨, ౩. మూర్ఛత్యున్నతో భవతిమూర్ధా. న. పు. మూర్ఛామోహ సముచ్ఛ్రాయయోః. ఉన్నతమైనది. ౪. మస్యతి కఠినత్వేన పరిణమతి మస్తః. మస్తఏవ మస్తకః. ప్న. మస పరిణామే. కఠినమౌటచేత పరిణమించునది. మస్తము; మస్తమే మస్తకము. ౫. ఉత్తమాంగ శబ్దము మొదలు ౫ తలపేళ్లు.

**చికురః కున్తలో వాలః చకః కేశ శ్శిరోరుహః.** 95

చిన్వన్ వర్ధమానః కుర్యతే ఛిద్యత ఇతి చికురః. చిఞ్ చయనే-కుర ఛేదనే. వృద్ధిఁబొందుచు ఖండింపఁబడునది. ౧. దైర్ఘ్యాత్ కున్తాకారం లాతీతి కుంతలః. లా ఆదానే. దైర్ఘ్యముచే కుంతమను నాయుధాకృతిని ధరించునది. ౨. వల్యతే వస్త్రేణ వాలః వల సంవరణే. వస్త్రముచేతఁ జుట్టఁబడునది. ౩. కచ్యతే కచః. కచ బంధనే. ముడవఁబడునది. ౪. కే శిరసి వేతే వర్తతే కేశః. శీఙ్ స్వప్నే. శిరస్సున నుండునది. ౫. శిరసి రోహతీతి శిరోరుహః. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ. శిరస్సున

మొలచునది. ఈ ౬ తలవెంట్రుకల పేళ్లు.

**తద్బృన్దే కైశికం కైశ్యమ్-**

కేశానాం సమూహః కైశికం. కైశ్యం చ. కేశముల సమూహము కైశికము కైశ్యము. ఈ ౨ తలవెంట్రుకల సమూహము పేళ్లు.

**అలకా శ్చూర్ణకున్తలాః,**

అల్యంతే భూష్యంత ఇత్యలకాః. అ. పు. ప. న. అల భూషణే. అలంకరింపఁబడునవి. 'అలకా యక్షనగరే ఉలకో ఉ స్త్రీచూర్ణకుంతలే' అని రత్నమాలిక. 'స్వభావవక్రాణ్యకాని యోషితాం' అని ప్రయోగంబును. ౧. చూర్ణాః కుటిలాః కుంతలాః చూర్ణకుంతలాః. కుటిలములైన వెంట్రుకలు. 'చూర్ణః క్షోదే చ కుటిలే' అని రభసుఁడు. ఈ ౨ ముంగురుల పేళ్లు.

**తే లలాటే భ్రమరకాః -**

తే అలకాః లలాటోపరి పతితా శ్చేత్ భ్రమరకా ఇత్యుచ్యంతే. ఆ కురులు నొసటిమీఁదఁబడినవైనచో భ్రమరకము లనంబడును. భ్రమరాకృతిత్వాత్ భ్రమరకాః. తుమ్మెదలవలె నుండునవి. పున్నపుంసకములుం గలవు. 'త్రిషు భ్రమరకో భ్రాన్తేన స్త్రీ ఫాలాలకే భవే'దితి రభసః. ౧. నెఱికురులు.

**కాకపక్ష శ్శిఖణ్డకః.** 96

కార్ష్ణ్యచాఞ్చల్యాభ్యాం కాకపక్షసాదృశ్యాత్కాకపక్షః. నలుపుచేతను కదలుటచేతను, కాకిఱెక్కలవలె నుండునది. ౧. శిరసి ఖండత్వేన వర్తమానత్వాచ్ఛిఖండకః. శిరస్సునఁ బిలకగా నుండునది. ఈ ౨ కూఁకటిపేళ్లు. చిప్పకూఁకటి నెఱులు.

**కబరీ కేశవేశః -**

కం శిరః వృణోతీతి కబరీ. సీ. వృఞ్ వరణే. శిరస్సును జుట్టియుండునది. ఈ ౧ కేశావిశం త్యస్తిన్మితి కేశవేశః. విశ ప్రవేశనే. కేశములు దీనియందుండును. తుఱుము వేళ్లు. కొప్పు.

**అథ ధమ్మిల్ల స్సంయంతాః కచాః,**

సంయుతా, బద్ధాః కేశా ధమ్మిల్ల ఇత్యుచ్యతే. కట్టఁబడిన వెంట్రుకలు ధమ్మిల్ల మనంబడును. ధ మిత్యవ్యయం మూర్ధాధః ఊర్ధ్వం వా

మిల్యతే ధమ్మిలః. మిల శ్లేషణే. శిరస్సుయొక్క అధోభాగమందుఁగాని ఊర్ధ్వభాగమందుఁగాని కూడి యుండునది. ఈ ౧ కీలుగంటు పేరు.

**శిఖా చూడా కేశపాశీ-**

శిరసి శేతే శిఖా. శీఙ్ స్వప్నే. శిరస్సునం దుండునది. ౧. చుల్యతే ఛాద్యత ఇతి చూడా. చుల ఆచ్ఛాదనే. కప్పఁబడునది. ౨. కేశపాశః కేశసమూహో ఽత్రాస్తీతి కేశపాశీ. ఈ. సీ. కేశసమూహము గలది. ఈ 3 సిగపేళ్లు.

**వ్రతినస్తు జటా సటా.** 97

జటతి సంఘీభవతీతి జటా. జట ఝట సంఘాతే. కూడుకొనియుండునది. ౧. సటతీతి సటా. షట అవయవే. వ్రతమునకు అంగమగునది. ఈ ౨ వ్రతియొక్క జడపేళ్లు.

**వేణీ ప్రవేణీ -**

వేణతీతి వేణీ. ప్రవేణీ చ. అణగియుండునది. వేణృ నిశామన వాదిత్రాదాన గమన జ్ఞాన చిన్తాసు. పా. వేణిః ప్రవేణిః. ఈ ౨ (మగఁ డూరలేని మగువలు మున్నగువారు) అల్లిన జడ పేళ్లు.

**శీర్షణ్య శిరస్యా విశదేకచే,**

శిరసి భవః శీర్షణ్యః. శిరస్యశ్చ. శిరస్సునందుఁ బుట్టినది శీర్షణ్యము, శిరస్యము. ౧, ౨. ఒకటితో నొకటి కూడక గరగరిక (నిర్మలము)లైన వెంట్రుకలు.

**పాశః పక్షశ్చ హస్తశ్చ జలపార్థాః కచా త్పరే.** 98

కచాత్పరే కచపర్యాశబ్దా త్పరతః ప్రయుజ్యమానాః పాశాదయస్త్రయః కలపార్థా స్సమూహవాచకా భవంతి. కచ శబ్ద పర్యాయములైన శబ్దముల మీఁదఁ బ్రయోగింపఁబడిన పాశాది శబ్దములు. 3. సమూహ వాచకములు. ఉ.___ కేశపాశము, కేశపక్షము, కేశహస్తము, పాశ్యత ఇతి పాశః. పశ బన్ధే. కట్టఁబడునది. ౧. పక్ష్యతే పరిగృహ్యతే పక్షః. పక్ష పరిగ్రమే. పరిగ్రహింపఁబడునది. ౨. శ్లిష్యతే హస్తః. కూడుకొనియుండునది.

**తనూరుహం రోమ లోమ -**

తన్వాం రోహతీతి తనూరుహం. శరీరమందుఁ బుట్టునది. పా. తను

రుహం. ౧. రోహతీతి రోమ, లోమ చ. న. రుహ బీజ జన్మని ప్రాదుర్భావేద. మొలచునది రోమము, లోమము. ఈ 3 శరీరమందుఁ బుట్టిన వెండ్రుకల పేళ్లు.

**తద్వృద్ధౌ శ్మశ్రు పుంముఖే,**

పుంముఖే తద్వృద్ధౌ రోమవృద్ధౌ శ్మశ్రు శబ్దోవర్తతే. పురుష ముఖమందలి యారోమముల వృద్ధియందు శ్మశ్రుశబ్దము వర్తించును. శ్మ౯ శబ్దో ముఖవాచీ శ్మని ముఖేశ్రియత ఇతిశ్మశ్రు. ఉ. న. శ్రిఞ్ సేవాయం. ముఖము నాశ్రయించునది. గడ్డమును, మీసమును.

**ఆకల్ప వేషౌ నైపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్.** 99

ఆ సమంతా త్కల్ప్యత ఇత్యాకల్పః, అంతట కల్పింపఁబడునది. ౧. వేష్టి తత్తదంగమితి వేషః. విష్ ఌ వ్యాప్తౌ. ఆయా యంగములను వ్యాపించునది. 'వేషోవ్యాప్తౌ విప్రయోగే నైపథ్యే' చేతి మూర్ధన్యాం తే రుద్రః. శవర్ణోపధముగాఁ గొందఱు చెప్పుదురు. "నైపథ్యే గృహమాత్రే చ వేశో వేశ్యాగృహేఽ పి చ" ఇతి తాలవ్యాంతే రభసః. ౨. నేత్రయోః పథ్యం నైపథ్యం. నేత్రములకు హితమైనది. ౩. ప్రతి గతం అంగప్రాప్తం కర్మ. ప్రతికర్మ. న. న. ప్రత్యంగమును బొందెడు క్రియ. ౪. ప్రసాధ్యతే అలం క్రియతే ఽనేనాంగమితి ప్రసాధనం. రాధసాధ సంసిద్ధౌ. దీనిచేత అంగ మలంకరింపఁబడును. ౫. వస్త్రమాల్యాదులచేతనైన యొప్పిదము పేళ్లు. ప్రతికర్మ ప్రసాధన శబ్దములు తిలక పత్త్ర రచనాదుల పేళ్లని కొందఱు.

**దశైతే త్రిషు -**

ఈముందరఁ జెప్పఁబడు నలంకర్తృ శబ్దము మొదలు రోచిష్ణు శబ్ద పర్యంతముగల పదిశబ్దములు మూఁడు లింగములందును వర్తించును.

**అలంకర్తాలంకరిష్ణుశ్చ -**

అలం కరోతీతి అలంకర్తా. ఋ.అలకరించువాఁడు. ౧. అంలకర్తుం శీలమస్య అలంకరిష్ణుః. ఉ. అలకరించునట్టి స్వభావము గలవాఁడు. ఈ ౨ అలంకరించువానిపేళ్లు.

**మణ్డితః,**

ప్రసాధితో ఽలంకృతశ్చ భూషితశ్చ పరిష్కృతః. 100

మణ్డ్యతేస్మ మణ్డితః. మడి భూషాయాం. అలంకరింపఁబడినవాఁడు. ౧. ప్రసాధతే స్మప్రసాధితః. రాధ సాధ సంసిద్ధౌ. అలంకరించఁబడినవాఁడు. ౨. అలం క్రియతేస్మ అలంకృతః. డు కృఞ్ కరణే. అలంకరింపఁబడినవాఁడు. ౩. భూష్యతేస్మ భూషితః. భూషఅలంకారే. భూషింపఁబడినవాఁడు. ౪. పరిష్క్రియతేస్మ పరిష్కృతః. అలంకరింపఁబడినవాఁడు. ఈ ౫ అలంకరింపఁబడినవానిపేళ్లు.

**విభ్రాడ్భ్రాజిష్ణు రోచిష్ణూ -**

తాచ్ఛీల్యేన విభ్రాజతే విభ్రాట్. జ. భ్రాజిష్ణుశ్చ. ఉ. రోచతే రోచిష్ణుః. భ్రాజిర్ దీప్తౌ. రుచ దీప్తౌ. ప్రకాశించు స్వభావము గలవాఁడు. ౧. ఉ. ౨. ౩. భూషణాదులచేఁ బ్రకాశించువాఁడు.

**భూషణం స్యా దలంక్రియా,**

భూషా భూషణం. ౧. అలంకరణ మలంక్రియా. ౨. అలంకరించుట భూషణము, అలంక్రియ. ఈ ౨ అలంకరించుట పేళ్లు.

**అలఙ్కార స్త్వాభరణం పరిష్కారో విభూషణమ్.** 101

**మణ్డనం చ -**

అలంక్రియతే అనేన అలఙ్కారః. దీనిచేత అలంకరింపఁబడును. ౧. ఆ సమంతాత్ భ్రియతే ఆభరణం. భృఞ్ భరణే. అంతట భరింపఁబడునది. ౨. పరిష్క్రియతే అనేన పరిష్కారః. డు కృఞ్కరణే. దీనిచేత అలంకరింపఁబడును. ౩. విశేషేణ భూష్యతే అనేనేతి విభూషణం. భూష అలంకారే. దీనిచేత నలంకరింపఁబడును. ౪. మండ్యతే అనేన మండనం. మడిభూషాయం. దీనిచేత నలంకరింపఁబడును. ఈ ౫ సొమ్ముల పేళ్లు.

**అథ మకుటం కిరీటం పుంనపుంసకమ్,**

మంక్యతే అనేన మకుటం. మకి మండనే. దీనిచేత నలంకరింపఁబడును. పా. ముకుటం. ౧. కీర్యతే లలాటోపరిక్షిప్యత ఇతి కిరీటం. అ ప్న. కౄ విక్షేపే. నొసటిమీఁదఁ బెట్టఁబడునది. ఈ ౨ కిరీటము పేళ్లు.

**చూడామణి శ్శిరోరత్నమ్ -**

చూడాయాం మణిః చూడామణిః పు. శిరసి రత్నం శిరోరత్నం. శిరస్సున నుండు రత్నము. ఈ ౨ తలమానికము పేళ్లు.

**తరలో హారమధ్యగః.** 102

హారమధ్యగో విశిష్టమణి స్తరళ ఇత్యుచ్యతే. కంఠమాల నడుమ నుండు నాయకమణి తరళమనంబడును. ప్రభయా తరతి తమ ఇతి తరళః. తౄ ప్లవన తరణయోః. కాంతిచేత అంధకారము ధరించునది. ఈ ౧ నాయకమణి పేరు.

**వాలపాశ్యా పారితథ్యా -**

వాలపాశే కేశపాశే సాధ్వీ వాలపాశ్యా. కేశపాశమందుఁ జక్కఁగా నుండునది. కేశపాశస్య పరితస్సర్వత స్థతా భవతి శోషతే పారితథ్యా. కేకపాశమం దంతటఁ బ్రకాశించునది. ఈ ౨ కొప్పున నలంకారార్థమై పెట్టెడి సువర్ణ ముక్తాది రచితమైన వలయము పేళ్లు. జడబిల్ల మొదలైనది.

**పత్త్రపశ్యా లలాటికా,**

పత్రవల్లలాటే పశ్యతే పత్రపాశ్యా. పశ బంధనే. పత్రమువలె నొసటియందుఁ గట్టఁబడునది. ౧. లలాటే భవా లలాటికా. లలాట మందుండునది. ఈ ౨ నొసటఁ గట్టెడు ముత్యపు బాసికము పేళ్లు. పాపటబొట్టు.

**కర్ణికాతాళపత్త్రం స్యాత్ -**

కర్ణయోః అలంకారః కర్ణికా – చెవులకు నలంకారమైనది. ౧. తాళస్య పత్త్రం తాళపత్త్రం. తాటాకు. ఈ ౨ చెవులకమ్మల పేళ్లు.

**కుణ్డలం కర్ణవేష్టనమ్.** 103

కుండవద్వృత్తత్వాత్ కుండలం. కుండమువలె వట్రువగానుండునది. ౧. కర్ణౌ వేష్టతే కర్ణవేష్టనం. వేష్ట వేష్టనే. కర్ణమును బరివేష్టించునది. ఈ ౨ స్త్రీ పురుషులు పెట్టుకొను కర్ణభూషణముల పేళ్లు. పోఁగులు.

**గ్రైవేయకం కణ్ఠభూషా -**

గ్రీవాయాం భవో ఉలంకారో గ్రైవేయకం. పా. గ్రైవేయం. మెడయం దుండెడు అలంకారము. ౧. కంఠస్య భూషా కంఠభూషా. కంఠము యొక్క భూషణము. ౨. మెడయందు గుత్తమైన కంటె మొదలైనవి.

**లమ్బనం స్యాల్లలన్తికా,**

లంబతే లంబనం. పా. లంబమానం. లబి అవస్రంసనే. వ్రేలు

చుండునది. ౧. లలతి విలసతి లలంతికా. లల విలాసే. ఒప్పునది. ౨. మెడయందు కొంచెము వ్రేలుచున్న పేరుల పేళ్లు.

**స్వర్ణైః ప్రాలమ్బికా-**

స్వర్ణైఃకృతా లలంతికా ప్రాలంబి కేత్యుచ్యతే. బంగారు నాణెములచేఁ జేయఁబడిన యాహారము ప్రాలంబిక యనంబడును. ప్రకర్షేణ లంబతే ప్రాలంబికా. మిక్కిలి వ్రేలుచుండునది. ఈ ౧. కాసులపేరు, సవర (నిష్కము)ల దండ మొదలైనది.

**అథోరసూ్సత్రికా మౌక్తికైః కృతా.** 104

సీవ్యతే అనేన ముక్తాదికమితి సూత్రికా. షివు తంతు సంతానే. ఉరసి సూత్రికా ఉరసూ్సత్రికా. ముత్యములచేఁ గూర్పఁబడునది. గనుక సూత్రిక. ఉరస్సునందలి సూత్రిక ఉరసూ్సత్రిక. ౧. ముత్యములచేఁ జేయఁబడిన మౌలిక.

**హారో ముక్తావళీ -**

హ్రియతే చిత్తమనేన హారః. హృఞ్ హరణే. దీనిచేత మనస్సు హరింపఁబడును. ౧. ముక్తానాం ఆవళీ. ముక్తావళీ. ఈసీ. పా. ముక్తావళిః ఇ. సీ. ముత్యములయొక్క పంక్తి. ఈ ౨ ముత్యములదండ పేళ్లు.

**దేవచ్ఛన్దో ౭ సౌ శతయష్టికః,**

అసౌ హారశ్శత యష్టికశ్శతసరశ్చేద్దేవచ్ఛంద ఇత్యుచ్యతే. ఈ కంఠమాల నూఱుసరములు గలదైనచో దేవచ్ఛంద మనంబడును. 'శతయష్టియుతో హారో దేవచ్ఛందో నిగద్యత' ఇతి వరాహః. 'లతికా దండికా యష్టికా సరికా' ఇతి సమానార్థాః. నూటయెనిమిది సరములుగల దండ యని కొందఱు. దేవానపి చందయతి ఆహ్లాదయతి దేవచ్ఛందః. అ. పు. చది ఆహ్లాదనే. దేవతలను సైతమాహ్లాదపెట్టునది. నూఱు పేటల ముత్యాలహారము.

**హారభేదా యష్టిభేదా ద్గుచ్ఛ గుచ్ఛార్ధగోస్తనాః.** 105
**అర్ధహారో మాణవక ఏకావళ్యేక యష్టికా,**
**సైవ నక్షత్రమాలా స్యాత్సప్తవింశతి మౌక్తికైః.** 106

యష్టిసంఖ్యా భేదాద్గుచ్ఛాదయోహార భేదా భవంతి. గుచ్ఛశబ్దము

మొదలు ౫. ప్రత్యేకముగా సరముల యెన్నికవలననైన హార భేదముల పేళ్లు. గూయతే సాధురితి గుచ్ఛః. పా.గుత్సః. గుశబ్దే–మంచిదని పలుకఁబడునది. ముప్పదిరెండు సరముల ముత్యముల దండ. ౧. గుచ్ఛస్యార్థో గుచ్ఛార్ధః. పా. గుత్సార్ధః. గుచ్ఛములో సగము. పదియాఱు సరముల ముత్యాల దండ. ౧. గోస్తనవత్ నాభేరధో వర్తమానత్వాత్ గోస్తనః. గోస్తనమువలె నాభియొక్క యధోభాగమం దుండునది. నలువది సరముల ముత్యాలదండ. ౧. దేవచ్ఛంద స్యార్ధత్వాత్ అర్ధహారః. దేవచ్ఛందములో సగమైన హారము. ఏఁబదినాలుగు సరముల ముత్యాలదండ. ౧. మయాలక్ష్మ్యానవక అభినవః మాణవకః. ఒప్పిదముచేత నూతనమైనది. ఇరువది నాలుగు సరముల ముత్యముల దండ. ఏకయష్టికా ఏకసరా ఏకావళీత్యుచ్యతే. ఒంటిసరముగల హారము ఏకావళి యనంబడును. భూషణానాం మధ్యే ఏకైవ ఆవలతే ఏకావళీ. సీ. వల సంచలనే. సొమ్ములలో ముఖ్యమై చలించుచుండునది. ౧. "ఏకావళీ నాయ యథేష్ట సంఖ్యా హస్త ప్రమాణా మనిభిః ప్రయుక్తా, సంయోజితా మా మణి నా తు మధ్యే యష్టీతి సా భూషణవిద్భి రుక్తే" తి వరాహః. సైవ ఏకావళీ సప్తవింశతిమౌ క్తికా చేత్ నక్షత్రమూలేత్యుచ్యతే. ఆయొంటి సరపు కంఠమాల యిరువదియేడు ముత్యాలుగలదైనచో నక్షత్రమాల యనంబడును. నక్షత్రమాలేవ భాతీతి నక్షత్రమాలా. నక్షత్రపఙ్క్తివలెఁ బ్రకాశించునది. "ద్వాత్రింశద్యష్టికో గుచ్ఛస్తదర్ధేనార్ధగుచ్ఛకః, చత్వారింశత్సరో ఉ స్త్రీస్యాద్గోపుచ్ఛోగోస్తనో ఉ పిచ. అర్ధహారస్తు విజ్ఞేయశ్చతుః పంచాశతస్సరైః వింశత్యా యష్టిభి ర్యుక్తోహారో మాణవకః స్మృతః" అని ప్రతాపుఁడు.

**ఆవాపకః పారిహార్యః కటకం వలయో ఉ స్త్రియామ్,**

ఉప్యతే క్షిప్యతే మణిబంధోపరి ఆవాపకః టు వప్ బీజసంతానే. ముంజేతియందుఁ బెట్టఁబడునది. పా. ఆవాయకః. ౧. పరితో హరంత్య నేనేతి పరిహారో హస్తః. తత్ర భవః పారిహార్యః. పరిహార మనఁగా హస్తము. దానియం దుండునది. "పరిహారః పరిహృతౌ హస్తేచ" అని రభసుఁడు. ౨. కట త్యావృణోతి హస్తమితి కటకం. కటే వర్షావరణయోః. హస్తమును జుట్టియుండునది. ౩. వలతే వలయః. అ.

ప్న. వల సంవరణే. చుట్టుకొనియుండునది. ఈ ౪ కడియము పేళ్లు. ఆవాపక పారిహార్య శబ్దములు సూడిగము పేళ్లు. కటకవలయ శబ్దములు కడియము పేళ్లని కొందఱు.

**కేయూర మఙ్గదం తుల్యే -**

కే భుజశిరసి యౌతీతి కేయూరం. యు మిశ్రణే. భుజాగ్రమందుఁ గూడియుండునది. ౧. అంగం దయతే అంగదం. దేజ్ రక్షణే. అంగమును రక్షించునది. ౨ బాహుపురి పేళ్లు.

**అఙ్గుళీయక మూర్మికా,** 107

అంగుళీషు భవం అంగుళీయకం. వ్రేళ్లయం దుండునది. రూపభేదమున నపుంసకము పుంలింగంబును గలదు. "అయం మైథిల్యాభి జ్ఞానం కాకుత్స్థ స్యాఙ్గుళీయకః" అని భట్టి ప్రయోగము. ౧. అంగుళేరుపరి ఊర్మివ ద్వర్తతే ఊర్మికా. వ్రేళ్లమీఁద కరుడువలె నుండునది. ఈ ౨ ఉంగరము పేళ్లు.

**సాక్షరాఙ్గుళి ముద్రా సా -**

మోదయతీతి ముద్రా. ముద హర్షే. అంగుళిసంబంధినీ ముద్రా అంగుళి ముద్రా. అంగుళి సంబంధమైన ముద్ర అంగుళిముద్ర. ముద్రా విశ్వాసస్థానం తద్యోగ్యాన్యక్షరాణ్యత్ర సంతీతి అంగుళిముద్రా. ముద్రయనఁగా విశ్వాసస్థానము; దానికి యోగ్యమైనయక్షరములు గలది. ఈ ౧ అక్షరములు చెక్కిన ముద్దుటుంగరము పేరు.

**కఙ్కణం కరభూషణమ్,**

కమితి క్వణతి కంకణం. క్వణశబ్దే. మ్రోయునది. మస్తమండన సూత్రే ఉ ప్యయం. "కంకణో నాప్రతిసర" ఇత్యమరమాలా. ౧. కరయోర్భూషణం. కరభూషణం. హస్తముల భూషణము. ఈ ౨ మౌక్తి కాదులతోఁ గూడిన కడియము పేళ్లు.

**స్త్రీ కట్యాం మేఖలా కాఞ్చీ సప్తకీ రశనా తథా.** 108
**క్లీబే సారసనం చ -**

మీయతే ప్రక్షిప్యతే కట్యామితి మేఖలా. డుమిఞ్ ప్రక్షేపణే. మొలయం దుంచఁబడునది. ఎనిమిది సరములు గలది. ౧. కచ్యతే బధ్యతే కాంచీ. సీ. కచ దీప్తిబంధన దేవనేషు. కట్టఁబడునది. ఒంటి సరము గలది.

౧. సపతి సమవైతి కట్యామితి సప్తకీ. సీ. షప సమవాయే. మొలయందుఁ గూడియుండునది. ఏడుసరములు గలది. ౧. అశ్నోతి కటీమితి రశనా. అశూవ్యాప్తౌ. స్త్రీలయొక్క మొలయందు వ్యాపించునది. సా. రసనా. "క్షుభితసింధురశనైశ్శనైః" అని భారవియందు యమకము. సకారమధ్యమమునకు "రసనాబంధో రతికలహేషు" అని వాసవదత్తయందు జిహ్వతోఁగూడ శ్లేషగాఁ జెప్పఁబడియున్నది. పదియాఱు సరములు గలది. ౧. సారం సనోతి సారసనం. షణు దానే. ఉత్కర్షము నిచ్చునది. ౧. మూడుసరములు గలది. "ఏకయష్టిర్భవేత్కాంచీ మేఖలా త్వష్టయష్టికా, రసనా షోడశసరా కలాపః పంచవింశకః, సప్తకీ సప్తయష్టిస్స్యా త్త్రిభి స్సారసనం సరై" రితి. స్త్రీలయొక్క ౫ విధములైన మొలనూళ్ల పేళ్లు.

**అథ పుంస్కట్యాం శృఙ్ఖలం త్రిషు,**

శృంగైః ప్రధానమణిభిః ఖలతీతి శృంఖలం. త్రి. ఖల సంచలనే. శృంగము లనఁగాఁ బ్రధానమణులు; వానిచేఁ జలించుచుండునది. పురుషుని మొలనూలు.

**పాదాఙ్గదం తులా కోటి ర్మఞ్జీరో నూపురో౽ స్త్రియామ్.** 109

**హంసకః పాదకటకః -**

పాదే అంగదమివ పాదాంగదం. పాదమందు బాహుపురివలె నుండునది. ౧. తులతి ఆకుటతీతి చ తులాకోటిః. ఇ. పు. తుల ఉన్మానే. కుటి కౌటిల్యే. అధికమైన తూనికగలిగి వక్రమైయుండునది. ౨. మంజు మనోహరం ఈరయతి ధ్వనతీతి మంజీరః. మనోహరముగా మ్రోయునది. ౩. నూయతే నూపురః. అ. ప్న. ణు స్తుతౌ. స్తోత్రము చేయఁబడునది. ౪. హంసవత్కాయతీతి హంసకః. కైశబ్దే. హంసవలెఁ బలుకునది. 'అస్త్రియాం' అనుదానికి దీనితోడను సంబంధము గలదు గనుక దీనికి పుల్లింగ నపుంసకములు గలవు. 'హంసకం పాదకటకం' అని యమరమాలయందు నపుంసక కాండమునందుఁ జెప్పియున్నాఁడు. ౫. పాదస్య కటకః పాదకటకః. పాదము యొక్క కటకము. ౬. అందెపేళ్లు. పాదాంగద తులాకోటి శబ్దములు పెండెరము పేళ్లు. హంసకపాద కటకశబ్దములు కాలిసొమ్ము పేళ్లని కొందఱు.

**కింకిణీ క్షుద్ర ఘణ్టికా,**

కించిత్క్వణతి కింకిణీ. సీ. క్వణ శబ్దే. ఇంచుకంత పలుకునది. ౧. క్షుద్రా అల్పా ఘంటా అస్యా ఇతి క్షుద్ర ఘంటికా. సన్నమైన గంటలు గలది. ఈ ౨ చిఱుగంటలకును, గజ్జెలకును పేళ్లు.

**త్వ క్ఫల క్రిమి రోమాణి వస్త్రయోనిః-**

త్వక్ = నార, ఫల = కాయ, క్రిమి = పురుగు, రోమ = వెంద్రుకలు, ఈ నాలుగును వస్త్రమున కుత్పత్తి స్థానములు.

**దశ త్రిషు.** 110

వాల్కాదీని తన్త్ర కాంతాని దశ త్రిషు. వాల్కశబ్దము మొదలు తన్త్రక శబ్దము వఱకు గల ౧౦ శబ్దములు మూఁడు లింగములయందును వర్తించును.

**వాల్కం క్షౌమాది -**

క్షుమాయాః అతస్యా వికారః క్షౌమం. క్షుమ యనఁగా నల్లయగిసె. దానియొక్క నారచేతఁ జేయఁబడినది. ఇది మొదలైనది వాల్క మనంబడును. వల్కస్య వికారః వాల్కం. వల్క మనఁగా నార. దాని చేతఁ జేయఁబడినది నారచీర.

**ఫాలం తు కార్పాసం బాదరం చ తత్,**

కార్పాసీఫలతంతు నిర్మితం వస్త్రం ఫలవికారత్వా త్ఫాలమిత్యుచ్యతే. పత్తికాయ దూదియొక్క నూలుచేతఁ జేయఁబడినది గనుక కోక ఫలవికారమవుట వలన ఫాలము. ౧ కార్పాస్యాః ఫలం కార్పాసం. బదరాయాః ఫలం బాదరం. ఏతయోర్వికారః కార్పాసం. బాదరం చ.కార్పాసము బాదరము ననఁగా ప్రత్తి; దానిచేతఁ జేయఁబడిన చీర కార్పాసము బాదరము. ఈ 3 నూలుచీర పేళ్లు.

**కౌశేయం క్రిమికో శోత్థమ్-**

క్రిమికోశ భవతంతు నిర్మితం వస్త్రం కౌశేయ మిత్యుచ్యతే. పురుగులచేతఁ గలిగిన బుఱ్ఱలవలనఁ బుట్టిన నూలుచేతనైన పట్టుచీర మొదలైనవి కౌశేయ మనంబడును. కోశనిర్మిత తత్వాత్కౌశేయం. కోశ మనఁగా క్రిములచేతనైన బుఱ్ఱ; అందువలనఁ బుట్టిన నూలుచేత నైన చీర. ౧.

**రాఙ్కవం మృగరోమజమ్.** 111

రంక్వాఖ్య మృగరోమ వికారః రాంకవం. రంకు వనఁగా తెల్లయిఱ్ఱి. దాని రోమములచేతఁ జేయఁబడినది. ౧. మృగరోమభిః జాతం మృగరోమజం. మృగరోమములచేతఁ బుట్టునది. ౨. మృగరోమములచేతఁ జేయఁబడిన శాలువ మొదలైనవి.

**అనాహతం నిష్ప్రవాణి తన్త్రకంచ నవామ్బరే,**

ఆహతాః క్షాళనభోగచ్ఛేదాః. తద్రహితత్వాత్ అనాహతం. ఉతుకుట, భోగించుట, చించుట ఇవి మూఁడును ఆహతములు. అవి లేనిది యనాహతము. ౧. నిర్గతా ప్రవాణిః యస్యతత్ నిష్ప్రవాణి ప్రవాణి యనఁగా సాలెవానినాడె మొదలైనది. నిర్గతమైన ప్రవాణి గలిగినది. ౨. తంత్రాత్ తంతువాయశలాకాదే రచిరా దపహృతం. తంత్రకం. తంత్రమనఁగా నేసెడివానికట్టె మొదలైనవి. అందువలన నప్పుడే తేఁబడినది. ౩. నవం చ తదంబరం చ నవాంబరం. క్రొత్తచీర. ఈ 3 క్రొత్తచీరపేళ్లు.

**తత్స్యా దుద్గమనీయం యద్ధౌతయోర్వస్త్రయో ర్యుగమ్.** 112

**పత్త్రోర్ణం ధౌతకౌశేయం బహుమూల్యం మహాధనమ్,**

ధౌతం ప్రక్షాళితం య ద్వస్త్రయుగ్మం తదుద్గమనీయ మిత్యుచ్యతే. ఉతుకఁ బడిన వస్త్రములజోడు ఉద్గమనీయ మనంబడును. పరిధానార్థం ఉత్తరాసంగార్థం చ ఉద్ధమ్యత ఇతి ఉద్గమనీయం. కట్టుకొనుటకును మీఁద వేసికొనుటకు నెత్తఁ బడునది. ౧. ధౌతకౌశేయం పత్త్రోర్ణమిత్యుచ్యతే. ఉదికిన పొత్తిచీర పట్టుచీర మొదలయినది పత్త్రోర్ణ మనంబడును. పత్త్రైః పటాదిభిః ఊర్ణూయత ఇతి పత్త్రోర్ణం. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే. కోకలు మొదలయినదానిచేఁ గప్పబడునది. ౧. బహుమూల్యం వస్త్రం మహా ధన మిత్యుచ్యతే. గొప్పవెలగల చీర మహాధన మనంబడును. దొడ్డవెల గల వస్తువులును. ౧. మహాధన మత్రాస్తిమహాధనం, అధికమైన ధనము గలిగినది. "పురాధిరూఢశ్శయనం మహాధన" మితి భారవిః. ౨.

**క్షౌమం దుకూలం స్యాత్ -**

క్షూయతే శోభనమితి క్షౌమం. టు క్షు శబ్దే. శుద్ధత్వముచేత మంచిదని పలుకఁబడునది. పా. క్షోమం. "క్షోమపట్టీ దుకూలే ఉ స్త్రీ" ఇతి మేదినీ. ౧. ప్రావారోత్తరాసంగ రూపేణ ద్విధా కూల్యత ఇది దుకూలం. కూల అవరణే. కట్టుకొనుటకును మీఁద వేసికొనుటకును రెండు విధ

ములుగాఁ గప్పఁడునది. ఈ ౨ వెలిపట్టుచీరపేళ్లు. తెల్లని వలువలయును.

**ద్వే తు నివీతం ప్రావృతం త్రిషు.** 113

నివీయత ఇతి నివీతం. త్రి. వ్యేఞ్ సంవరణే. ప్రాప్రియత ఇతి. ప్రావృతం. త్రి. వృఞ్ ఆచ్ఛాదనే. కప్పుకొనఁబడునది. నివీతము ప్రావృతమును. ఈ ౨ కప్పుకొను కోక పేళ్లు.

**స్త్రియాం బహుత్వే వస్త్రస్య దశాస్స్యుర్వస్తయో ర్ద్వయోః,**

దంశ్యంతే కంటకాదిభి రితి దశాః. ముండ్లు మొదలైనవానిచేఁ బట్టఁబడునది. స్త్రీలింగ నిత్య బహువచనము, పుల్లింగ బహువచనంబును గలదు. "దశావర్త్యా మవస్థాయాం వస్త్రాంతే భూమ్ని పుంస్త్రియోః" అని రభసుఁడు. ౧. వస్యంతే శిష్టైరితివస్తయః. ఇ. ప్స. వస ఆచ్ఛాదనే. బద్దెలతో కూడిన కోక. కట్టయోగ్యము గనుక శిష్టులైనవారిచేత ధరింపఁబడునది. దీనికి వచన నియమము లేదు. ఈ ౨ వస్త్రముల యొక్క కొనపేళ్లు. బద్దె.

**దైర్ఘ్యమాయామ ఆరోహః -**

దీర్ఘస్య భావోదైర్ఘ్యం. దీర్ఘ వస్తువు యొక్క భావము దైర్ఘ్యము. ౧. ఆయమ్యతే హస్తాదినా ఆయామః. యమ ఉపరమే. హస్తాదులచేత నియమింపఁబడునది. ౧. ఆరుహ్యత ఇత్యారోహః. పొందఁబడునది. పా. ఆనహ్యతే ౨ నేనేత్యానాహః. ణహ బందనే. దీనిచేత బంధింపఁబడును. ఈ 3 నిడుపు పేళ్లు.

**పరిణాహో విశాలతా,** 114

పరితః నహ్యతే పరిణాహః ణహ బంధనే. అంతట బంధింపఁబడునది. ౧. విశాలస్య భావః విశాలతా. విశాలముయొక్క భావము. ఈ ౨ వెడలుపు పేళ్లు.

**పటచ్చరం జీర్ణవస్త్రమ్ -**

పటదితిచరతి స్ఫుటతీతి పటచ్చరం. పట్టని చినుఁగునది. పూర్వంపటభూతం పటచ్చరం పూర్వము మంచికోకయై యుండినది. ౧. జీర్ణంచతత్ వస్త్రంచజీర్ణ వస్త్రం. చినిఁగిన కోక. ఈ ౨ చినిఁగిన చీర పేళ్లు. పాఁతవస్త్రము.

**సమౌ నక్తక కర్పటౌ,**

మంచునజతే లజ్జతే నక్తకః. ణజ వ్రీడే. మంచి కోకలలో సిగ్గుపడునది. ౧. లజ్జాయై కల్పతే కర్పటః కృపూసామర్థ్యే. లజ్జకొఱకు సమర్థమైనది.

౨. "పటో౽ స్త్రీ కర్పటశ్చాటః సిచయః పోతనక్తకౌః" అని రభసుఁడు. ఆ పక్షమందు "సమోనక్తక కర్పటౌ" అనుచోట సమశబ్దము సమలింగవాచకము. చెమట మొదలైనది తుడుచుకొను చేతితుండుగుడ్డ పేళ్లు. జీర్ణమై మాసిన చెడుపేలిక యని కొందఱు. తడిని తుడుచు గుడ్డయని కొందఱు.

**వస్త్ర మాచ్ఛాదనం వాస శ్చేలం వసన మంశుకమ్.** 115

వస్యతే అనేనాంగమితి వస్త్రం. వాసః. స. న. వసనం చ.వస ఆచ్ఛాదనే. దీనిచేత అంగము కప్పఁబడును గనుక వస్త్రము, వాసస్సు, వసనము. ౧, ౨, ౩. అచ్ఛాద్యతే అనేన ఆచ్ఛాదనం. ఛద ఆపవారణే. దీనిచేత కప్పఁబడును. ౪. చిల్యతే చేలం. చిల వసనే. కట్టు కొనఁబడునది. ౫. అంశుభిస్తంతుభిః కాయతి అంశుకం. కై శబ్దే. తంతువులచేత ఇంచుకంత పలుకునది. ఈ ౬ కోకపేళ్లు. నక్త కది శబ్దములు ౮ కోకపేళ్లని కొందఱు.

**సుచేలకః పటో౽ స్త్రీ స్యాత్-**

శోభనశ్చాసౌ చేలకశ్చ సుచేలకః. మంచివలువ. ౧. పటతి వాయునా పటః. అ.పు. పట గతౌ. వాయువుచేత కదలునది. పటయతి దేహం పటః. పట వట గ్రంథే. గ్రంథో వేష్టనం, దేహమును గప్పునది. ఈ ౨ మంచికోక పేళ్లు.

**వరాశిః స్థూలశాటకః,**

వరం శ్రేష్ఠం వరణం వా అశ్నుతే వరాశిః. శ్రేష్ఠని బొందునది. లేక వారిచేఁ గోరఁబడునది. పా. వరాసిః. "వరాసి రుత్తమే ఖడ్గే వరాసిః స్థూలశాటక" ఇతి రత్నకోశః. ౧. స్థూలశ్చాసౌ శాటకశ్చ స్థూలశాటకః. ముదుగైన కోక. ఈ ౨ ముదుగుకోక పేళ్లు.

**నిశోళః ప్రచ్ఛదపటః -**

నితరాం చుల్యతే ఆచ్ఛాద్యతే శయ్యాదికం నిచోళః. దీనిచేత పఱుపు మొదలైనవి కప్పఁబడును. ౧. ప్రచ్ఛాద్యతే౽ నేనేతి ప్రచ్ఛదః. సచాసౌ పటశ్చ ప్రచ్ఛదపటః. దీనిచేత కప్పఁబడును. ఈ ౨ పఱుపుచీర పేళ్లు. గవిసెన.

**సమౌ రల్లక కమ్బళౌ.** 116

రమంతే అస్మిన్నితి రల్లకః. రము క్రీడాయాం. దీనియందు క్రీడింతురు. ౧. కామ్యతే శీతాళుభిరితి కంబళః కము కాంతౌ. చలిగలవారిచేత కోరఁబడునది. ఈ ౨ కంబళిపేళ్లు.

**అన్తరీ యోపసంవ్యాన పరిధానా న్యధో ఽంశుకే,**

నాభే రంతరే భవం అంతరీయం. నాభియొక్కయు పిక్క యొక్కయు నడుమనుండునది. ౧. ఉపసంవీయతే అనేనేతి ఉపసంవ్యానం. వ్యేఞ్ సంవరణే. చుట్టఁబడునది. ౨. పరిధీయతే అనేనేతి పరిధానం డుధాఞ్ ధారణపోషణయోః. ధరింపఁబడునది. ౩. అధస్థితం అంశుకం అధోంశుకం. క్రిందనుండు కోక. ఈ ౪ కట్టుచీర పేళ్లు.

**ద్వౌ ప్రావా రోత్తరాసఙ్గౌ సమౌ బృహతికా తథా.** 117

**సంవ్యాన ముత్తరీయం చ -**

ప్రవ్రియతే అనేనేతి ప్రావారః. వృఞ్ వరణే. దీనిచేత మిక్కిలి కప్పఁబడును. ౧. ఉత్తరే ఊర్ధ్వాంగే ఆసజ్యత ఇతి ఉత్తరాసంగః. షఞ్జసంగే. మీఁది యవయవమందు పొందఁబడునది. ౨. బర్హతీతి బృహతికా. బృహవృద్ధౌ. వృద్ధిఁ బొందునది. ౩. సంవీయతే అనేనేతి సంవ్యానం. వ్యేఞ్ సంవరణే. దీనిచేత కప్పఁ బడును. ౪. ఉత్తరాంగే భవం ఉత్తరీయం. ఊర్ధ్వాంగమునందుండునది. ఈ ౫ ఉత్తరీయము పేళ్లు.

**చోళః కూర్పాసకో ఽ స్త్రియామ్,**

చుల్యతే అనేన చోళః. చుల ఆచ్ఛాదనే. దీనిచేత దేహము కప్పఁబడును. ౧. కూర్పరే కపోణౌ అస్యతే కూర్పాసకః.అ. ప్న. అసుక్షేపణే. మోఁచేతియందు పెట్టఁబడునది. ౨. స్త్రీపురుషుల కుబుసము. రవిక, చొక్కాయ. స్త్రీలయొక్క రవికెకు పేళ్లని కొందఱు. గొంతు మొదలు పాదములదాఁక వేసికొను చొక్కా యని కొందఱు.

**నీశారస్స్యాత్ప్రావరణే హిమానిల నివారణే.** 118

హిమానిలనివారణే శీతవాయు నివారకే ప్రావరణే నీశారశబ్దో వర్తతే. మంచును గాలిని నివారించునట్టి చీర మొదలయినది నిశార మనంబడును. నిశీర్యతే శీతాదిక మనేనేతి నిశారః. శౄ హింసాయాం. మంచు మొదలయినవి దీనిచేత పోఁగొట్టఁబడును. పచ్చడము, దుప్పటి.

**అర్ధోరుకం వరస్త్రీణాం స్యాచ్చణ్డాతక మంశుకమ్,**

వరస్త్రీణా మర్ధోరుకం ఊర్వోరర్ధాచ్ఛాదకం అంశుకం చండాతక మిత్యుచ్యతే. వారవనితలయొక్క కాడలను సగము గప్పియుండెడు కోక చండాతక మనఁబడును. చల్లడము. చండం గుహ్యస్థాన మతతీతి చండాతకం. అత సాతత్యగమనే. గుహ్యస్థానము నెల్లప్పుడు పొందియుండునది. పుంలింగంబును గలదు. "అర్ధోరుకం వరస్త్రీణాం వాసశ్చండాతకః పుమాన్" అని యమరమాల. ౧.

**స్యాత్త్రిష్వాప్రపధీనం తత్ప్రాపప్నోత్యా ప్రపదం హియత్.** 119

యద్వస్త్రం స్త్రీణాం ఆప్రపదం పాదాగ్రపర్యంతం వ్యాప్నోతి. తత్ ఆప్రపదీన మిత్యుచ్యతే. ఏకోక వనితలయొక్క మీఁగాలిమీఁదఁబడునో ఆ కోక ఆప్రపదీన మనంబడును. పావడ మొదలైనది. అంగియు, ఆప్రపదం ప్రాప్నోతీ త్యాప్రపదీనం– త్రి కాళ్లకొనదనుక వ్యాపించునది. ౧.

**అస్త్రీవితాన ముల్లోచః -**

ఊర్ధ్వదేశే వితన్యతే వితానం. అ. ప్న. తను విస్తారే. మీఁది ప్రదేశమందు విస్తరింపఁబడునది. ౧. ఉపరి లోచ్యతే ఉల్లోచః. లోచృదర్శనే. మీఁదఁ గానఁ బడునది. ఉల్లాభ మని కొందఱందురు. ఈ ౨ మేలుకట్టు పేళ్లు. చందువ.

**దూష్యాద్యం వస్త్రవేశ్మని,**

వస్త్రవేశ్మని దూష్యాద్యం వర్తతే. ఆద్యశబ్దేన పటవాదయో గృహ్యంతే. దూష్యాదులయిన శబ్దములు గుడారమందు వర్తించును. దూష్యతే స్వతో బహిర్దేశో ఽనేనేతి దూష్యం. దుషవైకృత్యే. తన కంటె వెలుపలి ప్రదేశము దీనిచేత దూషింపఁ బడును. ఆద్యశబ్దముచేత పటకుటీరాది శబ్దములు చెప్పఁబడును. "స్థూలం పటగృహం దూష్యం పటవాపట కుట్యపి, త్రిషు దూష్యం దూషణీయే క్లీబే వస్త్ర గృహాంతర" ఇతి రుద్రః.

**ప్రతిసీరా యవనికా స్యా త్తిరస్కరణీ చ సా.** 120

ప్రతిసీయతే ప్రతిబధ్యత ఇతి ప్రతిసీరా. షిఞ్ బంధనే. అడ్డముగాఁ గట్టఁబడునది. ౧. యువంత్యత్ర జనా ఇతి యవనికా. యు మిశ్రణే. జనులు దీని యందుఁ గూడుదురు. పా. జవనికా. ౨. తిరస్కరోతి

ఆచ్ఛాదయతీతి తిరస్కరణీ. ఈ. సీ. కప్పునది. ఈ 3 తెరచీర పేళ్లు.

**పరికర్మాఙ్గ సంస్కారః-**

మాలిన్యపరిమార్జనార్థం కర్మ పరికర్మ. న. న. మాలిన్యమును బోఁగొట్టునట్టి క్రియ. ౧. అంగాని సంస్క్రియంతే అనేనేతి అంగసంస్కారః. దీనిచేత అంగములు లెస్సగాఁ జేయఁబడును. ఈ ౨ దేహమందు మఱికిని బోఁగొట్టుట పేళ్లు.

**స్యాన్మార్ష్టిర్మార్జనా మృజా,**

మృజ్యతే అనయా మార్ష్టిః. ఇ. సీ. ౧. మార్జనా. ౨. మృజా చ. మృజూ శుద్ధౌ. ౩. దీనిచేత శుద్ధి చేయఁబడును. ఈ 3 చందనకుంకుమాదులచేత దేహమునందలి మఱికిని బోఁగొట్టుట పేళ్లు.

**ఉద్వర్త నోత్సాదనే ద్వేసమే -**

ఉద్వర్తతే అనేనాంగమితి ఉద్వర్తనం. వృత్తువర్తనే. దీనిచేత దేహము తోమఁ బడును. ౧. ఉత్సాద్యతే అనేన శరీరమాలిన్యమితి ఉత్సాదనం షద్ ౯ విశరణ గత్యవసాదునేషు. దీనిచేత శరీర మలము పోఁగొట్టఁబడును. ఈ ౨ నాలుఁగు పేళ్లు.

**ఆప్లావ ఆప్లవః.**        121

**స్నానమ్ -**

ఆప్లవతి శరీర మల మనేనేతి ఆప్లావః, ఆప్లవశ్చ. ప్లుఙ్. గతౌ. శరీర మలము దీనిచేతఁ బోవును. ౧, ౨. స్నాత్యనేన స్నానం. ష్ణాశౌచే. దీనిచేత శుచియౌను. ఈ 3 స్నానము పేళ్లు.

**చర్చాతు చర్చిక్యం స్థాసకః -**

చర్చనం చర్చా. చర్చ అధ్యయనే. పూయుట. ౧. చర్చికాయాం సాధు చర్చిక్యం. పూయుటయందు మంచిది. పా. చార్చిక్యం. ౨. శరీరాదౌ తిష్ఠతీతి స్థాసకః ష్ఠా గతి నివృత్తౌ. శరీరాదులయం దుండునది. ఈ 3 కుంకుమ మొదలగు వాని పూఁత.

**అథ ప్రబోధనమ్,**

**అనుబోధః -**

ప్రబోధ్యతే కుంకుమాది గంధో ఽనేనేతి ప్రబోధనం. అనుబుధ్య

తే అనే నేత్యనుబోధః. బుధ అవగమనే. దీనిచేతఁ గుంకుమాదుల గంధం బెఱుఁగఁబడును. ఈ ౨ సుగంధ ద్రవ్యములయందు నణఁగియున్న పరిమళమును బ్రకాశింపఁజేయు తైలాది ద్రవ్యము పేళ్లు.

**పత్ర రేఖా పత్రాఙ్గుళిరిమే సమే.** 122

పత్రాకారా రేఖా పత్ర రేఖా. పత్రరూపమైన రేఖ. ౧. పత్రాద్యాకృతి లేఖనే అంగుళ్యాకృతిరపి కపోలాదౌ భవతీతి పత్రాంగుళిః. ఇ. సీ. పత్రాదిరూపమును వ్రాయునపుడు కపోలాదులయందు వ్రేళ్లరూపము గలుగును గనుక పత్రాంగుళి. పా. పత్రాకారేణ వలతే పత్రావళిః. వల సంవరణే. పత్రరూపముగా వ్యాపించియుండునది. స్త్రీ స్తనాదులందు కస్తూరికాదులచే వ్రాయఁబడు మకరికాపత్రాదుల పేళ్లు.

**తమాలపత్ర తిలక చిత్రకాణి విశేషకమ్,**
**ద్వితీయం చ తురీయం చ న స్త్రియామ్ -**

తమాలపత్రకృతిత్వాత్. తమాలపత్రం. తమాలపత్రమువలె నుండునది. ౧. తిలతి స్నిహ్యతీతి తిలకం. తిల స్నేహనే. మెఱుఁగై యుండునది. ౨. చిత్రయతి చిత్రకం చిత్రమైయుండునది. ౩. విశినష్టి శోభాదినా విశేషకం. శిష్ ౡ విశేషణే. ఒప్పిదముతోఁ గూడియుండునది. ౪. ద్వితీయ మనఁగా తిలకశబ్దము తురీయ మనఁగా విశేషకశబ్దము. ఈ రెండును స్త్రీలింగమందు లేవు. పుం నపుంసకముల యందుఁ గల వనుట. నొసటిబొట్టు పేళ్లు.

**అథ కుఙ్కుమమ్.** 123

**కాశ్మీరజన్మాగ్నిశిఖం బాహ్లిక పీతనమ్,**
**రక్తం సంకోచపిశునం ధీర లోహిత చన్దనమ్.** 124

శుష్కదశాయాం కుమితి కుయతే కుంకుమం. కు శబ్దే. ఎండినప్పుడు కుమని పలుకునది. ౧. కాశ్మీరే జన్మాస్య కాశ్మీరజన్మ. న. న. కాశ్మీరదేశమందుఁ బుట్టినది. ౨. అగ్నిరివ పింగళవర్ణాః శిఖాః కేసరాః అస్యేతి అగ్నిశిఖం. అగ్నివంటి వర్ణము గల యాకరులు గలది. ౩. ప్రియతేజ నైరితి వరం వృఞ్ సంభక్తౌ. జనులచేత ఆశ్రయింపఁబడునది. ౪. బాహ్లికదేశే భవత్వాత్ బాహ్లికం. బాహ్లిక దేశమందుఁ బుట్టినది. దీర్ఘ మధ్యమని కొందఱు. ౫.పీతియతి చందనా దికం పీతనం. చందనా

దులఁ బచ్చుగాఁ జేయునది. ౬. రక్తవర్ణత్వాత్ రక్తం. ఎఱ్ఱనివన్నెగలది. ౭. ఆత్మనః సంకోచం పిశతి సూచయతి సంకోచపిశునం. తన యొక్క అణఁకువను చూపించునది. సంకోచము, పిశునము అని రెండు పేళ్లుగాఁ గొందఱు చెప్పుదురు. 'బాహ్లికం పీతనం కాంతం పిశునం రుధిరాహ్వయం, కాశ్మీరం చ గుడం రక్తం రథా కాలేయకం చ తత్' అని ప్రతాపుఁడు. ౮. దధాతి ధీయతే వాధీరం. ధరించునది. లేక ధరింపఁబడునది. డు ధాఞ్ ధారణాదౌ. ౯. లోహితవర్ణత్వాత్. లోహితం. ఎఱ్ఱనివన్నె గలది. ౧౦. చందయత్యాహ్లాదయతీతి చందనం. చది ఆహ్లాదనే. సంతోషమును జేయునది. ఈ ౧౧ లోహితచందనమని యొక్కపేరుగాఁ గొందఱు. కుంకుమపువ్వు పేళ్లు.

**లాక్షా రాక్షా జతు క్లీ బే యావో ౽ లక్తో ద్రుమామయః,**

లక్ష్యతే లాక్షా, లక్ష దర్శనాంకనయోః. కానఁబడియుండునది. ౧. రక్షతి వ్రణీనమితి రాక్షా. రక్షపాలనే. వ్రణము గలిగినవాని రక్షించునది. పా. రక్షా. 'రక్షా రక్షణలాక్షయోః' అని నానార్థము. ౨. జాయతే వృక్షే జతు. ఉ. న. జనీప్రాదుర్భావే. వృక్షములయందుఁ బుట్టునది. 3. యౌతి వస్త్రాదినా. యావః. యు మిశ్రణే. వస్త్రాదులతోఁ గూడునది. ౪. అలతి పాదాదికం అలః. అనక్తివస్త్రాదికం అక్తః. అలశ్చాసావక్తశ్చ అలక్తః. అల. భూషణాదౌ. అంజూవ్యక్తిశ్లక్ష్ణ కాంతి గతిషు. పాదాదుల నలంకరించునది గనుకను, వస్త్రాదులఁ బ్రకాశింపఁ జేయునది గనుకను అలక్తము. ౫. నిర్యాసత్వాత్ ద్రుమాణాం ఆమయః ద్రుమామయః వృక్షములయొక్క బంక. ఈ ౬ లక్క పేళ్లు.

**లవఙ్గం దేవకుసుమం శ్రీసంజ్ఞమ్-**

లూయతే ఛిద్యతే లవంగః. లూఞ్ ఛ్ఛేదనే. కోయఁబడునది. ౧. దేవానాం ప్రియం కుసుమం. దేవకుసుమం దేవతలకుఁ బ్రియమైన కుసుమము. ౨. శ్రియస్సంజ్ఞా అస్య శ్రీసంజ్ఞ శ్రీమహాలక్ష్మి పేళ్లు గలది. ఈ 3 కరాంబువు పేళ్లు. లవంగము.

**అథ జాయకమ్.** 125

**కాలేయకం చ కాలానుసార్యం చ -**

జయతి గన్ధా న్తరమతి జాయకం-ఇతర వాసనలను జయించునది.

పా. జాప (ష)కం. ౧. కాలవర్ణసారత్వాత్కాలేయకం. నల్లవన్నె చేవ గలది. ౨. పా. కాలీయకం. కాలవర్ణేనానుసార్యం కాలానుసార్యం. నల్లనివన్నెచేత ననుసరింపఁ దగినది. ఈ 3 పచ్చవంటి గంధము పేళ్లు. నల్లని గంధద్రవ్యమని కొందఱు.

**అథ సమార్థకమ్,**

**వంశ కాగురు రాజార్హ లోహ క్రిమిజ జోఙ్గకమ్.** 126

వన్యతే యాచ్యతే వంశకం. వసు యాచనే. ప్రార్థింపఁబడునది. వశ్యతే కామ్యత ఇతి వా వంశకం. వశ కాంతౌ. కామింపఁబడునది. పా. వంశికం. ౧. న గురు అగురు. చులకనైయుండునది. పుంలింగమును గలదు. 'శీతకృత్తే ఽగురోర్మదః' ఇతి ప్రయోగః. ౨. రాజ్ఞాం అర్హం రాజార్హం. రాజులకు యోగ్యమైనది. ౩. దృఢసారత్వాత్ లోహం. దృఢమైన చేవగలది. లోహవర్ణత్వా ల్లోహం. లోహమువలె నుండునది. ౪. క్రిమిభిర్జన్యతే క్రిమిజం, జను అదనే. క్రిములచేఁ దినఁబడును. ౫. జోంగకాఖ్యగిరిభవం జోంగకం. జోంగక మనెడు పర్వతమందుఁ బుట్టినది. ౬. వంశకశబ్దము మొదలు ఈశబ్ద పర్యంతము సమాహార ద్వంద్వము. అన్నియు నపుంసకములు. అగురుపేళ్లు.

**కాలాగు ర్వగురుః -**

కాలం చ తత్ అగురు చ కాలాగురు. ఉ. న. నల్లని అగురువు. ౧. కాలాగుర్వేవ. అగురు. ఉ. పు. ఆ కాలాగురువే అగురువు. ఈ ౨ నల్లని యగురుపేళ్లు.

**స్యా త్తన్మంగళ్యం మల్లిగన్ధియత్,**

యత్ కాలాగురుమల్లికాగంధి తన్మంగళ్యమిత్యుచ్యతే. ఏకాలా గురువు మల్లెపువ్వుల పరిమళము గలిగియుండునో అది మంగళ్య మనంబడును. మంగళే సాదు మంగళ్యం. న. ప. సీ. శుభమందు మంచిది. మల్లెపూవులవాసన గల కృష్ణాగురు.

**యక్షధూప స్సర్జరసో ఽ రాళ సర్వరసావపి.** 127

**బహురూపో ఽ పి -**

యక్షప్రియో ధూపః యక్షధూపః యక్షులకుఁ బ్రియమైన ధూపము. ౧. సర్జవృక్షస్య రసః సర్జరసః సర్జ మను వృక్షము యొక్క

రసము. ౨. అర్యతే ప్రీత్యా అరాళః ఋ గతౌ ప్రీతితోఁ గూడియుండునది. పా. రాతి ప్రీతిం రాళః. ప్రీతి నిచ్చునది. ౩. సర్వో రసోగంధో ఽత్ర సర్వరసః. రస మనఁగాఁ బరిమళము. సర్వమైన పరిమళము గలది. ౪. బహువిధం రూపం స్వభావో ఽస్య బహురూపః. బహువిధమైన రూపము గలది. ఈ ౫ సజ్జరసము పేళ్లు.

**అథ వృకధూప కృత్రిమ ధూపకౌ,**

వృణోతి విశ్వమితి వృకస్సూర్యః తత్ప్రియో ధూపః వృకధూపః. విశ్వమును వ్యాపించువాఁడు గనుక వృకుఁ డనఁగా సూర్యుఁడు, ఆయనకుఁ బ్రియమైన ధూపము. ౧. కరణేన నిర్వృత్తః కృత్రిమః సచాసౌ ధూపశ్చ కృత్రిమధూపకః. పాకాది క్రియలవలనైన ధూపము. ఈ ౨ అనేక పరిమళ వస్తువులఁ గూర్చి చేయఁబడిన ధూప ద్రవ్యము పేళ్లు.

**తరుష్కః పిణ్డక స్సిల్హో యావనో ఽపి-**

తురుష్కదేశే భవః తురుష్కః. తురుష్కదేశమందుఁ బుట్టినది. ౧. పిండాకారత్వాత్పిండకః. ముద్దగా నుండునది. ౨. సిల్యతే ఉచ్ఛ్రీయతే సిల్హః షిల ఉంఛే. ఉంఛ ఉచ్చయనం. అందుగుమ్రాఁకువలనఁ గూర్పఁబడునది. ౩. యవనదేశే భవః యావనః. తరుష్కదేశమందుఁ బుట్టినది. ఈ ౪ తురుష్కదేశమందుఁ బుట్టినయందుగు బంకతోఁ జేసిన ధూప ద్రవ్యము పేళ్లు.

**అథ పాయసః.** 128

**శ్రీవాసో వృక్షధూపో ఽపి శ్రీవేష్ట సరళద్రవౌ,**

సరళదేవదారు పయోవికారా త్పాయసః. సరళదేవదారువుల యొక్క పాలవలనఁ బుట్టినది. ౧. సౌభాగ్యహేతుత్వేన శ్రియః వాసః శ్రీవాసః. సౌభాగ్యకారణ మగుటచేత లక్ష్మికి స్థానమైనది. ౨. వృక్షాజ్జాతో ధూపః వృక్షధూపః. వృక్షమువలనఁ బుట్టిన ధూపము. ౩. శ్రియా వేష్ట్యతే శ్రీవేష్టః వేష్ట. వేష్టనే. శ్రీమహాలక్ష్మిచేత చుట్టఁబడునది. ౪. సరళవృక్షస్యద్రవో నిర్యాసః సరళద్రవః. సరళ వృక్షము యొక్క బంక. ఈ ౫ దేవదారుబంకతోఁ జేసిన ధూపద్రవ్యము పేళ్లు.

**మృగనాభిర్మృగమదః కస్తూరీ చ -**

మృగనాభిభవత్వా న్మృగనాభిః. ఇ. పు. మృగము యొక్క నాభి

వలనఁ బుట్టునది. "ముఖ్యరాట్ క్షత్రయోః పుంసి నాభిః ప్రాణ్యం గకేద్వయోః" అను త్రికాండశేష వచనము వలన స్త్రీలింగంబును గలదు. ౧. మృగస్య మదో మృగమదః. మృగము యొక్క మదము. ౨. కేస్తూ యతే కస్తూరీ. సీ. ష్టుఞ్ స్తుతౌ. శిరస్సునందు స్తోత్రము చేయఁబడునది. ఈ 3 కస్తూరి పేళ్లు.

**అథ కోలకమ్.** 129

**కక్కోలకం కోశఫలమ్ -**

కోలం బదరీఫలం. తత్సదృశత్వా త్కోలకం. కోల మనఁగా రేఁగుపండు. అట్టియాకారము గలది. ౧. కకన్తే ఉత్రే ఉతి కక్కోలం. దీనియం దాశతో నుందురు. కకలౌల్యే. పా. కర్కోలకం. తక్కోలకం. గింజను జుట్టియుండునది. ౨. కోశే శింబ్యాం ఫలాని బీజా న్యస్య కోశ ఫలం. కోశమనఁగా విత్తులకు ఆధారము. అందు విత్తులు గలది. ఈ 3 తక్కోలపు చెట్టు పేళ్లు. దానిఫల మని కొందఱు.

**అథ కర్పూర మస్త్రియామ్,**

**ఘనసార శ్చన్ద్రసంజ్ఞ స్సితాభ్రో హిమవాలుకా.** 130

కల్పతే సుఖాయ కర్పూరం. అ. ప్న. కృపూసామర్థ్యే. సుఖము కలుగ చేయుటకొఱకు సమర్థమైనది. ౧. శీతలత్వేన ఘనతుల్యసారత్వాద్ఘనసారః. శీతలమౌటచేత ఘనము వంటి సారము గలది. ౨. ఆహ్లాదకత్వేన చంద్రస్య సంజ్ఞాయస్య సః చంద్రసంజ్ఞః. ఆహ్లాదకర మౌటచేత చంద్రునియొక్క పేళ్లు తనకు పేళ్లుగాఁ గలది. ౩. సితాభ్ర సదృశత్వాత్సితాభ్రః. తెల్లని మేఘమువలె నుండునది. పా. సితాభః. ౪. వాలుకా సదృశత్వాద్వాలుకా. హిమా చ సా వాలూకా చ హిమవాలూకా. మంచువలెఁ జల్లనై యుసుకవంటి యాకారము గలది. ఈ ౫ కర్పూరము పేళ్లు.

**గన్ధసారో మలయజో భద్రశ్రీ శ్చన్దనో ఽ స్త్రియామ్,**

గంధేనసారః గంధసారః. పరిమళముచేత నుత్కృష్టమైనది. ౧. మలయశైలే జాతః మలజయః. జనీ ప్రాదుర్భావే. మలయపర్వతము నందుఁ బుట్టినది. ౨. భద్రా శ్రీ శ్శోభా ఽస్య భద్రశ్రీః. ఈ. పు. శుభ స్వరూపమైన యొప్పిదము గలది. ౩. చందయతీతి చందనః. ప్న. చది ఆహ్లాదనే. ఆహ్లాదమును జేయునది. ఈ ౪ చందనము పేళ్లు.

**తైలపర్ణిక గోశీర్షే హరిచన్దన మస్త్రియామ్.** 131

మలయైక దేశేతైలపర్ణాఖ్యగిరౌ భవం తైలపర్ణికం. మలయమున కవయవమైన తైలవర్ణమను పర్వతమందుఁ బుట్టినది. మిక్కిలి చల్లనైన తెల్లచందనము. ౧. గోశీర్షాకారే మలయశృంగే భవం గోశీర్షం. గోవు శిరస్సువంటి మలయశృంగమందుఁ బుట్టినది. మిక్కిలి వాసనగల చందనము. ౨. హరివర్ణం చందనం హరిచందనం. అ. ప్న. కపిలవర్ణము గల చందనము. మామిడిపండు వాసన గల పసుపువన్నె గల చందనము. ఈ 3 ను పసుపు చాయగల శ్రీగంధము పేళ్ళని కొందఱు.

**తిలపర్ణీ తు పత్త్రాఙ్గం రఞ్జనం రక్తచన్దనమ్,**

**కుచందనం చ -**

తిలస్యేవ పర్ణాన్యస్యా స్తిలపర్ణీ. ఈ. సీ. న కారాంతపుల్లింగమని కొందఱు. నువ్వులవంటి యాకులు గలది. ౧. పత్త్రే మకరికాపత్త్రే అంగతి పత్త్రాంగం. మకరిపత్త్రాదులను బొందునది. ౨. రంజయతీతి రంజనం. రంజ రాగే. రక్తిమను జేయునని. 3. రక్తం చ తచ్చందనం చ రక్త చందనం. ఎఱ్ఱనిచందనము. ౪. నిర్గంధత్వేన కుత్సితం చందనం కుచందనం నిర్గంధమౌటచేత కుత్సితమైన చందనము. కౌ భువి జాతం చందనం వాకు చందనమ్. భూమియందుఁ బుట్టిన చందనము. ఈ ౫ ఎఱ్ఱని చందనము పేళ్లు.

**అథ జాతీకోశ జాతీఫలే సమే.** 132

జాత్యాః లతావివేషస్య కోశం జాతీకోశం. జాత్యాః ఫలం జాతీఫలం. జాతీలత యొక్క ఫలము ౧, ౨. జాజికాయ పేళ్లు.

**కర్పూరాగరు కస్తూరీ తక్కోలై ర్యక్షకర్దమః,**

కర్పూరాగరు కస్తూరీ తక్కోలైః కృతః యక్షకర్దమ ఇత్యుచ్యతే. కర్పూరము, అగరువు, కస్తూరి, తక్కోలము వీనితోడఁగూడిన గంధము యక్షకర్దమ మనంబడును. యక్షప్రియత్వా దార్ద్రత్వేన కర్దమతుల్యత్వాచ్చ యక్షకర్దమః. యక్షప్రియమై ఆర్ద్రత్వము చేత పంకతుల్యమై యుండునది. "కర్పూ రాగరు కస్తూరీ తక్కోల ఘుసృణాని చ, ఏకకృతమిదం సర్వం యక్షకర్దమ ఉచ్యతే."

**గాత్రానులేపనీ వర్తిః -**

గాత్ర మనులిప్యతే అనయా గాత్రానులేపనీ. ఈ. సీ. లిప ఉపదేహే. దీనిచేత పూయఁబడును. ౧. వర్త్యతే శ్లక్ష్ణ క్రియతే శరీరమనయేతి వర్తిః. ఇ. సీ. వృతు వర్తనే. దీనిచేత శరీరము నునుపుగాఁ జేయఁబడును. ఈ ౨ కలుపఁబడిన చాల సుగంధ ద్రవ్యముల ముద్ద (వడియము) పేళ్లు.

**వర్ణకం స్యా ద్విలేపనమ్** 133

వర్ణాంతరం కరోతీతి వర్ణకం. వర్ణాంతరమును జేయునది. ౧. విలిప్యతే గాత్రమనేనేతి విలేపనం. లిప ఉపదేహే. దీనిచే దేహము పూయఁబడును. ఈ ౨ మైపూఁతకొఱకు మెదిపిన గంధాదుల పేళ్లు. ఈ ౪ ను మైపూఁత పేళ్లని కొందఱు.

**చూర్ణాని వాసయోగా స్స్యుః -**

చూర్ణ్యంత ఇతి చూర్ణాని. అ. న. చూర్ణ పేషణే. నూఱఁబడునవి. ౧. వాసాయ సురభీకరణాయ యుజ్యంత ఇతి వాసయోగాః. అ. పు. యుజిర్యోగే. వాసనకొఱకుఁ గూర్పఁబడునది. ఈ ౨ గంధపుఁబొడి పేళ్లు.

**భావితం వాసితం త్రిషు,**

భావ్యతే సురభిద్రవ్యైరితి భావితం. భువో అవకల్కనే. సురభి ద్రవ్యములఁ చేతఁ జేయఁబడినది. ౧. వాస్యతే గంధద్రవ్యైరితి వాసితం. గంధద్రవ్యములచేత వాసింపఁబడునది. ఈ ౨ ను త్రి. వాసన కట్టిన వస్తువు.

**సంస్కారో గన్ధమాల్యాద్త్యైర్యః స్యాత్త దధివాసనమ్.** 134

గంధమాల్య ధూపాద్త్యెః వస్త్రతాంబూలాదీనాం యస్సంస్కారః. తత్ అధివాసన మిత్యుచ్యతే. గంధమాల్యాదులచేత వస్త్రతాంబూలాదులయొక్క సంస్కారము అధివాసన మనంబడును. అధివాస్యత ఇత్యధివాసనం.

**మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని -**

మల్యతే ధార్యత ఇతి మాల్యం. మల మల్ల ధారణే. ధరింపఁబడునది. ౧. మాం లక్ష్మీం లాతీతి మాలా. లా దానే. ఒప్పిదము నిచ్చునది. ౩. సృజ్యతే స్రక్. జ. సీ. సృజ విసర్గే. విడువఁబడునది. ౩. శిరస్సు నందలి పువ్వులదండ పేళ్లు. కంఠాదుల యందలి పువ్వులదండయును.

**కేశమధ్యే తు గర్భకః,**





కేశమధ్యే ప్రచ్ఛన్నత్వేన స్థాపితం మాల్యం గర్భక ఇత్యుచ్యతే. వెండ్రుకల యందు కానరాకుండునట్లు ముడిచిన దండ గర్భక మనంబడును. గర్భేక్రియత ఇతి గర్భకః. వెండ్రుకలలోపల చేయఁబడునది.

**ప్రభ్రష్టకం శిఖాలమ్బి -**

శిఖాలంబి మాల్యం ప్రభ్రష్టక మిత్యుచ్యతే. జుట్టున వ్రేలాడెడు దండ ప్రభ్రష్టక మనంబడును. కేశమధ్యాత్ ప్రభ్రష్టం ప్రభ్రష్టకం. వెండ్రుకలవలన జాఱినది.

**పురో న్యస్తం లలామకమ్.** 135

పురో న్యస్తం లలాటోపరిగతం మాల్యం లలామక మిత్యుచ్యతే. నొసటిమీఁదఁ బడునట్లు ముందరి భాగమునఁ గట్టఁబడిన దండ లలామక మనంబడును. బాసికము. లలం విలాస మమతి లలామకం. అమ గత్యాదిషు. విలాసములు బొందియుండునది.

**ప్రాలమ్బ మృజులమ్బి స్యా త్కణ్ఠాత్ -**

కంఠాదార్జవేనోరసి లంబమానం మాల్యం ప్రాలంబ మిత్యుచ్యతే. మెడనుండి చక్కఁగా నురస్సు నందు వ్రేలుచుండు దండ ప్రాలంబ మనంబడును. ప్రలంబతే. ప్రాలంబం. లబి లంబనే. మిక్కిలి వ్రేలాడునది.

**వైకక్షకం తు తత్,**

**యత్తిర్యక్ క్షిప్తమురసి -**

ఉరసి యజ్ఞోపవీతాకారేణ యత్తిర్యక్ క్షిప్తంతన్మాల్యం వైకక్షక మిత్యుచ్యతే. ఉరస్సునందు జన్నిదమువలె నడ్డముగా వేసుకొన్న దండ వైకక్షక మనంబడును. కక్షాద్విగతం వికక్షం వక్షః పృష్ఠభాగం చ. తత్రభవం వైకక్షకం. కక్షమువలనఁ బాసినది గనుక వికక్ష మనఁగా ఱొమ్ము, వీఁపును; అందుండునది. పా. వైకక్ష్యకమ్.

**శిఖా స్వాపీడ శేఖరౌ.** 136

ఆపీడ్యతే దృఢం బంధే నేత్యాపీడః. పీడ అవగామనే. లెస్సగాఁ జుట్టుటచేఁ బీడింపబడునది. శిఖరం శిరో ఉగ్రం తస్యాయమితి శేఖరః. శిరస్సుమీఁద నుండునది. శిఖమీఁదఁ జుట్టఁబడిన దండ పేళ్లు.

**రచనా స్యా త్పరిస్పన్దః -**

రచ్యతే రచనా. రచ ప్రయత్నే. మునుపటి శృంగారమందు

యత్నము చేయఁబడినది. పరితః స్పందః శరీర వ్యాపారః. పరిస్పందః స్పది కించిచ్చలనే. అంతట ఇంచుకంత శరీరచలనము పరిస్పందము. వస్త్రమాల్యాదులచేతనైన శృంగారమునందు విశేషమును బుట్టించుట పేళ్లు.

**ఆభోగః పరిపూర్ణతా,**

వస్తునః గుణాదేర్వా పరిపూర్ణతా సమగ్రత్వం ఆభోగ ఇత్యుచ్యతే, వస్తువుల యొక్కగాని గుణాదులయొక్కగాని నిండుకొనియుండుట ఆభోగ మనంబడును. ఆభుజ్యతే అనేన ఆభోగః. భుజపాలనాభ్య వహారయోః. దీనిచేత భుజింపఁబడును.

**ఉపధానం తూపబర్హః -**

ఉపధీయతే శిరో உత్రేతి ఉపధానం. డు ధాఞ్ ధారణ షోషణయోః. దీనియందు శిరస్సు పెట్టఁబడును. ఉపబృహ్యతే ఉన్నమ్యతే శిరో உత్రేతి ఉపబర్హః. బృహ వృద్ధౌ. దీనియందు శిరస్సు ఎత్తఁబడును తలగడ పేళ్లు.

**శయ్యాయాం శయనీయవత్** 137

**శయనమ్ -**

శేతే అస్యామితి శయ్యా. శయనీయం శయనం చ. శీఙ్ స్వప్నే. యథా శయ్యాయాం శయనీయశబ్దః తథా శయనశబ్దో உపీతి వతి ప్రత్యయార్థః. దీని యందు నిద్రింతురు. పానుపు పేళ్లు. పఱుపు.

**మఞ్చ పర్యఙ్క పల్యఙ్కాః ఖట్వయా సమాః,**

మఞ్చ్యతే సరో உనేన మఞ్చః. మచి ధారణోచ్ఛ్రాయపూజనేషు. దీనిచేత నరుఁడు ధరింపఁబడును. పరితః అఙ్క్యతే ఉపభోగాది నా లక్ష్యత ఇతి పర్యంకః. పల్యంకశ్చ. అకి లక్షణే. దీనియందు ఉపభోగాదులచేత నరుఁడు కానఁబడును. ఖట్యతే కాఙ్క్ష్యతే ఖట్వా. ఖట కాంక్షాయాం. కాంక్షింపఁబడునది. ఈ ౪ మంచము పేళ్లు.

**గేన్దుకః కన్దుకః -**

గాతే గేందుకః. గాఙ్ గతౌ. రివ్వునఁ బోవునది. గే గగనే ఇందురివ గేందుకః. గగనమందు చంద్రునివలె నుండును. ౧. స్కంద్యతే పీడ్యత ఇతి కందుకః. పా. కందుకః. స్కందిర్ గతిశోషణయోః. పీడింపఁబడునది. చెండు పేళ్లు. బంతి.

**దీపః ప్రదీపః**

దీప్యతే అనేన దీపః, ప్రదీపశ్చ. దీపీ దీప్తౌ. దీనిచేఁ బ్రకాశింపఁజేయఁబడును. ఈ ౨ దీపము పేళ్లు.

**పీఠ మాసనమ్.** 138

పీఠ్యతే సంశ్లిష్యతే పీఠం. పీఠ సంశ్లేషణే. పొందఁబడునది. ౧. ఆస్తే ఽత్రేత్యాసనం. ఆస ఉపవేశనే. దీనియందుఁ గూర్చుందురు. ఈ ౨ పీఁట పేళ్లు.

**సముద్గక స్సంపుటకః -**

సమ్య గుద్గచ్ఛతీతి సముద్గకః. గమ్ ౢగతౌ. లెస్సగా నున్న తత్వమును బొందునది. ౧. సంపుట్యతే. సంశ్లిష్యతే పిధానేనేతి సంపుటకః. పుట సంశ్లేషణే. మూఁతతోడఁ గూడియుండునది. ఈ ౨ కరాటము పేళ్లు.

**ప్రతిగ్రాహః పతద్గ్రహః**

చర్వితం తాంబూలాదికం ప్రతిగృహ్ణాతీతి ప్రతిగ్రాహః. భక్షితమైన తాంబూలాదులు గ్రహించునది. పతత్తాంబూలరసాదికం గృహ్ణాతీతి పతద్గ్రహః. గ్రహ ఉపాదానే. పడుచుండెడు తాంబూలరసాదుల గ్రహించునది. తమ్మపడిగెము పేళ్లు.

**ప్రసాధనీ కఙ్కతికా -**

ప్రసాధ్యంతే కేశాః అనయేతి ప్రసాధనీ. ఈ. సీ. గాధ సాధ సంసిద్ధౌ. దీనిచేత వెండ్రుకలు లెస్సగాఁ జేయఁబడును. ౧. కఙ్కతేకేశాౕ కంకతికా. కకిగతౌ. కేశములను బొందునది. ఈ ౨ దువ్వెన పేళ్లు. చిక్కంటియును.

**పిష్టాతః పటవాసకః.** 139

పిష్టం పిష్టత్వం అతతి పిష్టాతః అత సాతత్యగమనే. చూర్ణరూపమును బొందియుండునది. ౧. పటాః వాస్యంతే అనేన పటవాసకః. కోకలు దీనిచేత వాసన కట్టఁబడును. ఈ ౨ వస్త్రములకు వాసనకట్టు వస్తువు.

**దర్పణేముకు రాదర్శౌ -**

దృప్యతే అనేన సువేషాభిమానా దితి దర్పణః దృప దృప్తౌ. దీనిచేత మంచి వేషాభిమానము వలన గర్వింతురు. ముకుర సాహచర్యము చేత పుంలింగము. ౧. మంక్యతే అనేన ముకురః. మకిమండనే. దీనిచేత నలంకరింపఁబడుదురు. షా. మకురః. ౨. ఆదృశ్యతే ఽస్మి న్నాత్తనః ప్రతిబింబమితి

ఆదర్శ. దృశిర్ ప్రేక్షణే. దీనియందు తన నీడ కానఁబడును. 3 అద్దము పేళ్లు.

**వ్యజనం తాళవృన్తకమ్,**

వ్యజ్యతే శ్రమో ఽ పనీయతే అనేనేతి వ్యజనం. అజగతిక్షేపణయోః. దీనిచేత బడలిక పోఁగొట్టఁబడును. ౧ తాళవృంత వద్వృంతమస్యేతి తాళవృన్తకం. తాటితొడిమెవంటి తొడిమగలది. ఈ ౨ విసనకఱ్ఱ పేళ్లు.

# బ్రహ్మా వర్గము

**సంతతిర్గోత్ర జనన కులా న్యభిజ నాన్వయౌ,**
**వంశో ఽన్వవాయ స్సంతానః -**

సంతన్యతే ఽ అనయాసంతతిః. సీ. తను విస్తారే. దీనిచేత విస్తరింపఁబడును. ౧. గూయతే శబ్ద్యతే గార్గ్యోవసిష్ఠ ఇతిగోత్రం. గుఙ్‌శబ్దే. గార్గ్యుఁడు వసిష్ఠుఁడు అని పలుకఁబడునది. ౨. జన్యతే ఉత్తరోత్తరమనేనేతి జననం. జనీ ప్రాదుర్భావే. ఉత్తరోత్తరము దీనివలనఁ బుట్టుదురు. ౩. కుల్యతే బంధువర్గో ఽ నేనేతి కులం, కుల సంస్త్యానే. బంధువర్గము దీనిచేఁ గూర్చఁబడును. ౪. అభిజన్యతే అనేనేతి అభిజనః. దీనిచేఁ బుట్టుదురు. ౫. అన్వీయతే అనేనేతి అన్వయః. ఇణ్ గతౌ. దీనిచేత సంబంధింపఁబడును. ౬. వన్యతే యాచ్యతే వంశః. వను యాచనే. అడుగఁబడునది. ౭. అన్వీయతే పూర్వః పరశ్చేతి అన్వవాయః. ఇణ్ గతౌ. పూర్వము పరము అని అన్వయింపఁబడునది. ౮. సంతన్యతే సంతానః తను విస్తారే. విస్తరింపఁబడునది. ఈ ౯ వంశము పేళ్లు.

**వర్ణా స్స్యుర్బ్రాహ్మణాదయః.** 1

వర్ణ్యంతే కపిలారుణ పీతకృష్ణవర్ణైః నిరూప్యన్త ఇతి వర్ణాః. వర్ణ స్తుతౌ. కపిలారుణ పీత నీలవర్ణములచేత స్తోత్రముచేయఁబడునవి. "కపిలాశ్చారుణాః పీతాః కృష్ణా శ్చేతి పృథక్పృథక్, బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాశ్శూద్రా శ్చేతి వివక్షితాః" ఇతి శ్రీవిష్ణుపురాణే. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతులు.

**(విప్ర క్షతియవిట్ఛూద్రా శ్చాతుర్వర్ణ్యమితి స్మృతమ్)**

(బ్రహ్మక్షత్రవిట్ఛూద్ర వర్ణములు గూడి చాతుర్వర్ణ్య మనం

బడును. చత్వారో వర్ణాః చాతుర్వర్ణ్యం. నాలుగు జాతులు గనుక చాతుర్వర్ణ్యము).

**రాజబీజీ రాజవంశ్యః -**

రాజ్ఞాం బీజమస్యేతి రాజబీజీ. న. పు. రాజవీర్యము గలవాఁడు. ౧. రాజవంశేభవో రాజవంశ్యః. రాజవంశమందుఁ బుట్టినవాఁడు. ఈ ౨ రాజవంశమునఁ బుట్టినవాని పేళ్లు.

**బీజ్యస్తు కులసమ్భవః.** 2

బీజే కులేజాతో బీజ్యః. ౧. కులే సంభవో ఽస్య కులసంభవః. ౧. కులమందుఁ బుట్టినవాఁడు గనుక బీజ్యుఁడు, కులసంభవుఁడు. ఈ ౨ ఏదైన నొక కులమందుఁ బుట్టినవాని పేళ్లు.

**మాహాకుల కులీ నార్య సభ్య సజ్జన సాధవః,**

మహాకులే జాతో మాహాకులః. మహాకులమందుఁ బుట్టినవాఁడు. పా. మహాకులః. ౧. కుల స్యాపత్యం కులీనః. మంచికులమందుఁ బుట్టినవాఁడు. ౨. పాపకర్మభ్యః ఆగాద్దూరా ద్యాతః ఆర్యః. పాప కర్మములనుండి దూరముగాఁ బోవువాఁడు. అరణీయః అభిగమ్యోవా ఆర్యః. ఋ గతౌ. పొందఁదగినవాఁడు. ౩. సభాయాం సాధుః సభ్యః. సభయందు మంచివాఁడు. ౪. సంశ్చాసౌ జనశ్చ సజ్జనః మంచిజనుఁడు. ౫. సాధ్నోతి పరకార్యం సాధుః. ఉ. పు. రాధ సాధ సంసిద్ధౌ. పరుని కార్యమును సాధించువాఁడు. ఈ ౬ మంచికులమందుఁ బుట్టినవాని పేళ్లు.

**బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో భిక్షు శ్చతుష్టయే.** 3
**ఆశ్రమో ఽస్త్రీ.**

బ్రహ్మ వేదః తదధ్యయనార్థం వ్రతమపి బ్రహ్మ. తచ్చరతీతి బ్రహ్మచారీ. న. పు. బ్రహ్మ మనఁగా వేదము. తదధ్యయనార్థమైన వ్రతంబును బ్రహ్మము. దాని నాచరించువాఁడు. ఆ బ్రహ్మచారి నాలుగు విధములు గలవాఁడు. గాయత్రీబ్రహ్మచారి, ప్రాజాపత్యబ్రహ్మచారి, వైదికబ్రహ్మచారి, నైష్ఠిక బ్రహ్మచారి. గృహం భార్యా సాస్యాస్తీతి గృహీ. న. పు. గృహమనఁగా భార్య; అది గలవాఁడు. ఆ గృహస్థుఁడు వార్తావృత్తి, శాలినవృత్తి, యాయావరుఁడు, ఘోరసన్యాసి అని ౪

తెఱఁగులు. వనప్రస్థే వనైకదేశే భవో వానప్రస్థః–వనైకదేశమందుండువాఁడు. ఆ వానప్రస్థుఁడు ఔదుంబరుఁడు, ఖేనసుఁడు, సంప్రక్షాళి, పౌర్ణముఁడును అని నాలుగుభేదములు గలవాఁడు. భిక్షతేయాచతే భిక్షుః. ఉ. పు. భిక్ష భిక్షాయాం. యాచించువాఁడు. సన్న్యాసి. ఆ సన్న్యాసి కుటీచకుఁడు, బహూదకుఁడు, హంసకుఁడు, పరమహంసకుఁడు అని నాలుగు తెఱఁగులు గలవాఁడు. ఇట్లీ నాలుగు శబ్దములును క్రమముగా బ్రహ్మచారికి, గృహస్థునికి, తపస్వికి, సన్న్యాసికిని పేళ్లు. ఈ బ్రహ్మచర్యాదులు ౪ ఆశ్రమము లందురు. ఆశ్రామన్త్యస్మిన్నితి ఆశ్రమః. అ.ప్న. శ్రమ తపసి ఖేదే చ. దీనియందుఁ దపోయుక్తులగుదురు.

**ద్విజా త్యగ్రజన్మ భూదేవ బాడబాః,**

**విప్రశ్చ బ్రాహ్మణః -**

దేహోత్పత్త్యుపనయనాది లక్షణే ద్వే జాతీ జన్మనీ అస్యేతి ద్విజాతిః. ఇ. పు. దేహోత్పత్త్యుపనయనాది సంస్కారము లనెడు రెండు జన్మములు గలవాఁడు. ౧. బ్రహ్మణో ముఖే అగ్రే జన్మాస్యేతి అగ్రజన్మా. న. పు. బ్రహ్మయొక్క ముఖమందు మొదటి జన్మము గలవాడు. ౨. భువి దివ్యతి బ్రహ్మవర్చసా భూదేవః. దివు క్రీడాదౌ. బ్రహ్మవర్చస్సుచేత భూమి యందుఁ బ్రకాశించువాఁడు. ౩. బాడబాగ్నిరివాతృప్తో బాడబః. బడబాగ్ని వలెఁ దృప్తిలేనివాఁడు. బడబా బ్రాహ్మణీ. తస్యా అపత్య మితివా బాడబః. బడబ యనఁగా బ్రాహ్మణస్త్రీ; దానివలనఁ బుట్టినవాఁడు. "బడబా కుంభదాస్యశ్వా స్త్రీవిశేషా ద్విజాంగనా" అని రభసుఁడు. ౪. విశేషేణ పాపేభ్యః ఆత్మానం పరం చ పాతీతి విప్రః. పా. రక్షణే. తన్నును పరునిని విశేషముగాఁ బాపమునుండి రక్షించువాఁడు. ౫. బ్రహ్మణి పరబ్రహ్మణి నిష్ఠావత్త్వాత్ బ్రాహ్మణః. పరబ్రహ్మయందు నిష్ఠగలవాఁడు. బ్రహ్మణః కులే భవత్వాద్వా బ్రాహ్మణః. బ్రహ్మకుల మందుఁ బుట్టినవాఁడు. ఈ ౬ బ్రాహ్మణుని పేళ్లు.

**అసౌ షట్కర్మా యాగాదిభి ర్యుతః** 4

అసౌ బ్రాహ్మణః యాగాది భిర్యుతశ్చేత్ షట్కర్మేత్యుచ్యతే. ఈ బ్రాహ్మణుఁడు యాగాదులైన యాఱుకర్మలతోఁ గూడినవాఁ డగునేని షట్కర్మ యనంబడును. షట్ కర్మాణ్యస్యేతి షట్కర్మా. న. పు. యజన

యాజనాధ్యయనాధ్యాపకదాన ప్రతిగ్రహము లనెడి షట్కర్మములు గలవాఁడు. ౧. "యజనం యాజనం దానం విశిష్టాచ్చప్రతిగ్రహః, అధ్యాపనం చాధ్యయనం విప్రకర్మ ప్రకీర్తిత" మితిస్మృతిః.

**విద్వాన్విపశ్చి ద్దోషజ్ఞ స్సన్సుధీః కోవిదో బుధః,**
**ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞ స్సంఖ్యావాౝ పణ్డితః కవిః.**
**ధీమాంత్సూరిః కృతీ కృష్టి ర్లబ్ధవర్ణో విచక్షణః,**

వేత్తి సర్వం విద్వాౝ. స. పు. సర్వము నెఱింగినవాఁడు. ౧. విశేషేణ పశ్యౝ చేతతీతి విపశ్చిత్. త. పు. చితీ సంజ్ఞానే. విశేషముగాఁ జూచుచు నెఱుంగువాఁడు. ౨. దోషం జానాతీతి దోషజ్ఞః జ్ఞా అవబోధనే. దోషము నెఱిఁగినవాఁడు. ౩. పాపం శ్యతీతి సౝ. త. పు. షో అన్తకర్మణి. పాపము జెఱుచువాఁడు. ౪. శోభనం ధ్యాయతీతి సుధీః. ఈ. పు. ధ్యై చింతాయాం. లెస్సగా విచారించువాఁడు. ౫. కిం నామ న వేత్తీతి కోవిదః. విద జ్ఞానే. ఇది అది యను నియమములేక సర్వము నెఱిఁగినవాఁడు. ౬. సర్వం బుధ్యతే బుధః బుధ అవగమనే. అన్నిటి నెఱిఁగినవాఁడు. ౭. ప్రశస్తాం ధియం రాతీతి ధీరః. రా ఆదానే. మంచి బుద్ధి నిగ్రహించువాఁడు. ౮. మనీషా ఽ స్యాస్తీతి మనీషీ. న. పు. బుద్ధి గలవాఁడు. ౯. జానాతీతిజ్ఞః. ఎఱుఁగువాఁడు. ౧౦. ప్రకర్షేణ జానాతీతి ప్రజ్ఞః ప్రజ్ఞఏవ ప్రాజ్ఞః. జ్ఞా అవబోధనే. మిగుల నెఱుఁగువాఁడు. ౧౧. ప్రశస్తాసంఖ్యా విచారణా ఽ స్యాస్తీతి సంఖ్యావాౝ. త. పు. మంచి విచారము గలవాఁడు. ౧౨. పండతే జానాతి పండితః పడి గతౌ ఎఱుఁగువాఁడు. సర్వే గత్యర్థాః. జ్ఞానార్థాః పండాధీరస్య సంజాతా వా పండితః. పండ యనఁగా బుద్ధి; అది గలవాఁడు. ౧౩. కవతే చాతుర్యేణ కవిః కబృవర్ణే. వబయో రభేదః. చాతుర్యముచేత వర్ణించువాఁడు. ౧౪. ధీరస్యాస్తీతి ధీమాౝ. త. పు. బుద్ధిగలవాఁడు. ౧౫. సువతిప్రేరయతి సత్కర్మణితి సూరిః. ఇ. పు. షూప్రేరణే. సత్కర్మమునందుఁ బ్రేరేపించువాఁడు. పా. సూరీ. న. పు. "సూరీ విచక్షణః." అని అభిధానమాలయందు నకారాంతము. ౧౬. కృతం జ్ఞాన మనేన కృతీ. న. పు. జ్ఞానము వీనిచేతఁ జేయఁబడును. ౧౭. కర్షతి నిష్కర్షతి కృష్టిః ఇ. పు. కృష విలేఖనే. సర్వమైన యర్థమును నిష్కర్షించుఁవాడు.

౧౮. లబ్ధః వర్ణః స్తుతి ర్యేన లబ్ధవర్ణః. వర్ణ స్తుతౌ. పొందఁబడిన స్తుతిగలవాఁడు. ౧౯. విశేషేణ చష్టే విచక్షణః. చక్షిఙ్ వ్యక్తాయాం వాచి. విశేషముగాఁ బలుకువాఁడు. ఈ ౨౦ విద్వాంసుని పేళ్లు.

**దూరదర్శీ దీర్ఘ దర్శీ-**

అప్రత్యక్షమపి ఊహేన పశ్యతీతి దూరదర్శీన. పు. దీర్ఘంపశ్యతీతి దీర్ఘదర్శీ. న. పు. ప్రత్యక్షముగాని దూరమైన యర్థములను బుద్ధిచేతఁ జూచువాఁడు. ౧, ౨. దేశకాల వ్యవహితములైన యర్థములను బుద్ధిచేతఁ జూచువానిపేళ్లు. ఇవియును విద్వాంసునిపేళ్లు యని కొందఱు.

**శ్రోత్రియ చ్ఛాన్దసౌ సమౌ.** 6

శ్రుతిం అధీతే శ్రోత్రియః. ౧. ఛందో ఽ ధీతే ఛాందసః. వేదాధ్యయనము చేసినవాఁడు. ఈ ౨ వేదముఁ జదివినవాని పేళ్లు.

**ఉపాధ్యాయో ఽ ధ్యాపకః-**

ఉపేత్యాధీయతే అస్మాదితి ఉపాధ్యాయః. సమీపమును బొంది యీతనివలన నధ్యయనము చేయుదురు. ౧. అధ్యాపయతి అధ్యాపకః. ఇఙ్. అధ్యయనే. అధ్యయనము చేయించువాఁడు. ఈ ౨ వేదముఁ జదివించువాని పేళ్లు.

**అథ స్యాన్నిషేకాదికృద్గురుః,**

నిషేక మనఁగా గర్భాధానము; అది మొదలగు కర్మములను జేయు తండ్రి గురు వనంబడును. ఆది శబ్దముచేత సీమంతోపనయనాదులు గ్రహింపఁ బడుచున్నవి. గృణాతి ఉపదిశతి గాయత్ర్యాదికం గురుః. ఉ. పు. గృశబ్దే. గాయత్ర్యాదుల నుపదేశించువాఁడు.

**మన్త్రవ్యాఖ్యా కృదాచార్యః -**

మంత్ర మనఁగా కల్పసూత్రాది సహితమైన వేదము. దాని నధ్యయనము చేయించి యర్థమును దెలియఁజెప్పువాఁడు ఆచార్యుఁ డనంబడును. ఆచారం గ్రాహయతీతి ఆచార్యః. సంప్రదాయమును గ్రహింపఁజేయువాఁడు. "ఉపనీయ తు యః పూర్వం వేద మధ్యాపయే ద్ద్విజః, సారంగం చ సరహస్యం చ త మాచార్యం విదుర్బుధాః" ఇతి మనుః.

**ఆదేష్టా త్వధ్వరే వ్రతీ.** 7

**యష్టా చ యజమానశ్చ -**

అధ్వర మనఁగా యజ్ఞము. తద్విషయమైన యుపదేశము చేయువాఁడు ఆదేష్ట యనంబడును. ఆదిశత్యాదేష్టా. ఋ. పు. దిశ అతిసర్జనే. అధ్వర విషయమైన ప్రక్రియను బోధించువాఁడు. ౧. బ్రహ్మచారిణః వ్రతమస్యాస్తీతి వ్రతీ. న. పు. బ్రహ్మచారి వ్రతముగలవాఁడు. ౨. యజతే యష్టా. ఋ. పు. యజమానశ్చ యజ దేవపూజాసంగతికరణ దానేషు. యాగము చేయువాఁడు. ఈ ౪ యజ్ఞకర్తపేళ్లు. ౪. యజ్ఞకర్త పేళ్లని కొందఱు. అప్పుడు ఆదిశత్యృత్విజో యాగే స్వేష్ట సంపాదనాయ ప్రేరయతి ఆదేష్టా. దిశ అతిసర్జనే తన యాగకార్యములలో ఋత్విజులను నియమించువాఁడు అని వ్యుత్పత్తి.

**స సోమవతి దీక్షితః,**

దీక్షా ఉస్య సంజాతా దీక్షితః దీక్ష గలిగినవాఁడు. ఈ ౧ సోమము గల యజ్ఞమందు కర్తయైనవాఁడు.

**ఇజ్యాశీలో యాయజూకః -**

యజన మిజ్యా తదేవ శీలం యస్య సః ఇజ్యాశీలః. ౧. పునః పునః యాగకరణశీలో యాయజూక ఇత్యుచ్యతే. ౨. ఇజ్య యనఁగా యాగము. పలుమాఱు యజ్ఞము సేయుటయే స్వభావముగాఁ గలవాఁడు యాయజూకుఁ డనంబడును. పౌనః పున్యేన యజతే యాయజూకః. యజ దేవపూజాదౌ. పలుమాఱు యాగము సేయువాఁడు. ౧, ౨.

**యజ్వాతు విధినేష్టవాౝ.** 8

విధినా యథాశాస్త్రం నివర్తితయాగో యజ్వేత్యుచ్యతే. శాస్త్రోక్తప్రకారముగా యజ్ఞము చేసినవాఁడు యజ్వ యనంబడును. యజతేస్మ యజ్వా. న. పు. యాగము చేసినవాఁడు.

**స గీష్పతీష్ట్యా స్థపతిః -**

బృహస్పతి సవనామ్నాయాగేన ఇష్టవాౝ స్థపతి రిత్యుచ్యతే. బృహస్పతిసవ మనుపేరు గల ఇష్టిచేత యజ్ఞము చేసినవాఁడు స్థపతియనంబడును. బృహస్పతి మేధేన సమాపకాంగేన యాగం స్థాపయతి స్థపతిః ఇ. పు. ష్ఠా గతి నివృత్తౌ. సమాపకమైన బృహస్పతీష్టిచేత యజ్ఞమును స్థాపించువాఁడు. ౧.

**సోమపీథీ తు సోమపాః,**

సోమపీథ స్సోమపాన మస్యాస్తీతి సోమపీథీ. న. పు. సోమపానము గలవాఁడు. పా. సోమం పీతమనేనేతి సోమపీతి. న. పు. వీనిచేత సోమపానము చేయఁబడును. సోమం పిబతీతి సోమపాః. ఆ. పు. పా. పానే. సోమమును విధిచేత పానము చేసినవాఁడు. ఈ ౨. యజ్ఞము చేసి యవశిష్టమైన సోమమును పానము చేసినవాని పేళ్లు.

**సర్వవేదా స్స యేనేష్టో యాగ స్సర్వ స్వదక్షిణః** 9

యేన సర్వస్వ దక్షిణో యాగో విశ్వజిదాది రిష్ట స్స సర్వవేదా ఇత్యుచ్యతే. సర్వము దక్షిణగాఁ గల విశ్వజిదాదియాగము ఎవనిచేతఁ జేయఁబడునో వాఁడు సర్వవేదస్సు ఆనంబడును. సర్వస్వం వేదయతి లంభయతి ఋత్విజ ఇతి సర్వవేదాః. స.పు. విద్ ౨ లాభే. సర్వస్వమును ఋత్విజులఁ బొందించువాఁడు.

**అనూచానః ప్రవచనే సాఙ్గే ౨ ధీతీ.**

సాంగే శిక్షాద్యంగషట్కే ప్రవచనే వేదే గురో స్సకాశాత్ ఆధీతీ కృతాధ్యయనో యః సః అనూచాన ఇత్యుచ్యతే. అధీతీశబ్దోనాంతః. గురువు వలన శిక్షాదిషడంగ యుక్తమైన వేదమండలి యధ్యయనము ఎవనికిఁ గలదో వాఁడు అనూచానుఁడనంబడును. సాంగం వేద మధీత్య తమేవ అనుపశ్చా దుక్తవాౝ అనూచానః. వచ పరిభాషణే. అంగయుక్తమైన వేదమును అధ్యయనముచేసి, వెనుకను దానినే పఠించువాఁడు. ౧

**గురోస్తు యః,**

**లబ్ధానుజ్ఞ స్సమావృత్తః -**

వ్రత మాచరితం ఇదానీం గృహీ భవేతి గురో ర్లబ్ధానుజ్ఞ స్సమావృత్త ఇత్యుచ్యతే. "నీచేత వ్రతం బాచరింపఁబడెను. ఇంక గృహస్థుఁడవుగ'మ్మని వేదాధ్యయనానంతరమందు గురువువలనఁ బొందఁబడిన యనుజ్ఞగలవాఁడు సమావృత్తుఁడనంబడును. గురుకులాద్గృహం ప్రతి సమావర్తతే స్మ సమావృత్తః. వృతు వర్తనే. గురు గృహమున నుండి తన గృహమును గూర్చి మరల వచ్చినవాఁడు. ౧.

**సుత్వా త్వభిషవే కృతే.** 10

అభిషవః స్నానం ప్రస్తావా ద్యాగ సంబంధిసానం యః కృత

వాక్ సః సుత్వేత్యుచ్యతే. అభిషవ మనఁగా యజ్ఞసంబంధమైన స్నానము; అది చేసినవాఁడు సుత్వ యనంబడును. సునోతి సోమమితి సుత్వా. న. పు. షుఞ్ అభిషవే. సోమలతను గొట్టి పిడిచినవాఁడు. ౧.

**ఛాత్త్రాన్తేవాసినౌ శిష్యే -**

గురోరసచ్చరిత్రం ఛాదయతీతి ఛాత్రః. ఛద అపవారణే. గురువుయొక్క అసచ్చరిత్రమును గప్పువాఁడు. ౧.గురోరన్తే నికటే వసతీ త్యన్తేవాసీ. స. పు. వస నివాసే. గురువు యొక్క సమీపమందుండెడువాఁడు. ౨. శాసనీయః శిష్యః. శాసు అనుశిష్టౌ. శిక్షింపఁదగినవాఁడు. ఈ 3 శిష్యుని పేళ్లు.

**శైక్షాః ప్రాథమ కల్పికాః,**

శిక్షా మధీయతే శైక్షాః. శిక్షాగ్రంథము నధ్యయనము చేయువారు. శిక్షాయోగ్యా వా శైక్షాః శిక్షింప యోగ్యమైనవారు. ౧. ప్రథమః కల్పః ఆద్యారంభః ప్రయోజనం యేషాం తే ప్రాథమకల్పికాః ౨. ప్రథమారంభము ప్రయోజనముగాఁ గలవారు. ఈ ౨ అప్పుడు వేదాధ్యయనము చేయ నారంభించిన శిష్యుల పేళ్లు.

**ఏకబ్రహ్మవత్రాచారా మిథ స్సబ్రహ్మచారిణః.** 11

ఏకస్మాద్గురో రేకం వేద మధ్యేతుం బ్రహవ్రత మాచరంతః అన్యోన్యంస బ్రహ్మచారిణ ఉచ్యంతే. ఒక గురువు నొద్ద నొక వేదము నధ్యయనము చేయుట కొఱకు నొకవ్రతమునే ఆచరించువారు అన్యోన్యము సబ్రహ్మచారు లనంబడుదురు. ఏకం సమానం బ్రహ్మవ్రతం చరంతీతి సబ్రహ్మచారిణః. న. పు. చర గతిభక్షణయోః. బ్రహ్మవ్రత మనఁగా వేదవ్రతము. సమానమయిన వేదాధ్యయనవ్రతము నాచరించువారు. ౧.

**సతీర్థ్యాస్త్వేక గురవః -**

పావనహేతుత్వాత్తీర్థమివ తీర్థం గురుః. సమానే తీర్థే భావావర్తమానాః సతీర్థ్యాః, పావనహేతువైనవాఁడు గనుక తీర్థ మనఁగా గురువు; సమాన గురువునందు వర్తించువారు. ౧. ఏకోగురుర్యేషాంతే ఏకగురువః. ఉ. పు. ఒకగురువుగలవారు. ౨. ఒక గురువు నొద్ద వేదముగాని మఱియొక విద్యగాని యధ్యయనము చేయువారు.

**చితవా నగ్ని మగ్నిచిత్,**

అగ్నిం చితవాన్ అగ్నిచిత్ త. పు. చిఞ్ చయనే. అగ్ని చయనము చేసినవాడు. ౧. అగ్ని చయనము చేసినవానిపేరు. ఆహితాగ్ని.

**పారమ్పర్యోపదేశే స్యా దైతిహ్య మితి హావ్యయమ్.** 12

ఇత్యేవం కిము పారంపర్య మస్తీతి ఇతిహ, అవ్యయము. ఇతి హైవ ఐతిహ్యం. అ. న. ఇట్లని గదా పారంపర్యము గలదనుట ఇతిహ శబ్దార్థము. ఆ యర్థముగలదే ఐతిహ్యము. ఈ ౨ పారంపర్యముచేతనైన యుపదేశము పేళ్లు.

**ఉపజ్ఞా జ్ఞాన మాద్యం స్యాత్ -**

ఉపజ్ఞాయత ఇత్యుపజ్ఞా. అవబోధనే. మొదట నెఱుఁగఁబడుట ఉపజ్ఞ. ౧. ఉపదేశము లేక తనంతటనే మొదటఁ బుట్టిన జ్ఞానము వాల్మీకి శ్లోక జ్ఞానమువంటిది.

**జ్ఞాత్వారమ్భ ఉపక్రమః**

ఇది యీప్రకారముగా సిద్ధించునని యుపాయము నెఱిఁగి ప్రారంభించుట ఉపక్రమ మనంబడును. ఉపక్రమణం ఉపక్రమః ౧.

**యజ్ఞస్సవో ఽ ధ్వరో యాగస్సప్తతన్తుర్మఖః క్రతుః.** 13

యజతే యజ్ఞః. యజ దేవపూజాసంగతి కరణదానేషు. పూజించుట. ౧. సూయతే సోమో ఽ స్మిన్నితి సవః. షుఞ్ అభిషవే. దీనియందు సోమము తడపబడును. ౨. అధ్వానం వైదికమార్గం రాతి అధ్వరః. రా దానే. వైదిక మార్గము నిచ్చునది. ౩. యజనం యాగః. యజదేవ పూజాదౌ పూజించుట. ౪. సప్తభిశ్ఛందోభిస్తన్యత ఇతి సప్తతంతుః. ఉ. పు. తను విస్తారే. ఏడు ఛందస్సులచేత విస్తరింపఁబడునది. ౫. మఖన్తి దేవా అత్రేతి మఖః. మఖి గతౌ. దీనికి దేవతలు వత్తురు. ౬. క్రియతే బ్రాహ్మణాదిభిరితి క్రతుః. ఉ. పు. డుకృఞ్ కరణే. బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులచేతఁ జేయఁబడునది. ఈ ౭ యజ్ఞము పేళ్లు.

**పాఠో హోమ శ్చాతి థీనాం సపర్యా తర్పణం బలిః,**
**ఏతే పఞ్చ మహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకాః.** 14

పాఠాదయః బ్రహ్మయజ్ఞాదినామకాః పంచ మహాయజ్ఞాస్స్యుః. వేదపాఠము, వైశ్వదేవాది హోమము, అతిథిపూజ, పితృతర్పణము, భూతబలి అను నీ ౫ ను పంచమహా యజ్ఞము లనంబడును. మహాఫలయజ్ఞ

త్యాన్మహాయజ్ఞాః. పంచచ తే మహాయజ్ఞాశ్చ పంచమహాయజ్ఞాః. గొప్ప ఫలముగలవి పంచమహాయజ్ఞములు 'పూజా, సప, ర్యాధ్యయనం, బ్రహ్మ, యజ్ఞస్తు, తర్పణమ్, హోమో, దైవోబలి, ర్భౌతో, నృ యజ్ఞో ఒతిథిపూజన' మితి స్మృతిః. ఇవి పంచమహాయజ్ఞములు – వేదపాఠము, బ్రహ్మయజ్ఞము, హోమము, దేవయజ్ఞము, అతిథిపూజనము, మనుష్యయజ్ఞము, పితృతర్పణము, పితృయజ్ఞము, భూతబలి, భూతయజ్ఞము ఇవి.

**సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః,**
**ఆస్థానీ క్లీబ మాస్థానం స్త్రీ నపుంసకయో స్సదః.** 15

సమజన్తిమిళన్త్యత్ర సమజ్యా. అజ గతిక్షేపణయోః. లెస్సగా దీనియందు కూడుదురు. ౨. పరిత స్సీదంత్యత్ర పరిషద్. ద.సీ.షద్ ౡవిశరణగత్యవసాదనేషు. అంతట దీనియందుఁ బొందియుందురు. ౨. గావో నానావిధా వాచస్తిష్ఠన్త్యత్రేతి గోష్ఠి. ఈ. సీ. ష్ఠాగతి నివృత్తౌ. నానావిధములయిన వాక్కులు దీనియందుండును. ౩. సహభాన్తి అత్రేతి సభా. భాదీప్తౌ. కూడుకొని దీనియందుఁ బ్రకాశింతురు. ౪. సంయన్తిమిళన్త్య స్యామితి సమితిః. ఇ. సీ. ఇణ్ గతౌ. దీనియందు లెస్సగాఁ బొందియుందురు. ౫. సీదన్త్యస్యాం సంసత్, ద. సీ. షద్ ౡవిశరణగత్యవసాద నేషు దీనియందుందురు. ౬. ఆసమన్తాత్తిష్ఠంత్యత్ర ఆస్థానీ. ఈ. సీ. ఆస్తానం చ. ష్ఠా గతినివృత్తౌ. అంతట దీనియందుందురు. ౭,౮ సీదన్త్యస్యాం సదః. స.స్న. షద్ ౡవిశరణాదౌ. దీనియందుందురు. ఈ ౯ సభపేళ్లు. ఆస్థానీ శబ్దము మొదలు ఈ 3ను దొరలున్న సభపేళ్లని కొందఱు.

**ప్రాగ్వంశః ప్రాగ్ఘవిర్గేహాత్ -**

యత్ర గృహే హవ్యాదికం స్థాప్యతే తతః పూర్వం యజమాన సదస్యాదీనాం వాసాయ కల్పితం గృహం ప్రాగ్వంశ ఇత్యుచ్యతే. ఏగృహమందు హవిరాదులు నియమముచేత నుంచఁబడునో ఆ గృహము కంటె పూర్వభాగమునందు యజమానులు సదస్యులు మొదలైనవారుండుటకొఱకు నిర్మింపఁబడిన గృహము ప్రాగ్వంశమనంబడును. వన్యతే ఆశ్రయత ఇతి వంశః. ప్రాగగ్రే వంశః ప్రాగ్వంశః. వన షణ సంభక్తౌ. ప్రాగ్భాగమందు యజమానాదులచేత నాశ్రయింపఁబడునది.౧.

**సదస్యా విధి దర్శినః,**

సదసి సాధవః సదస్యాః, సభయందు మంచివారు. ౧. విధిం విధివిహితం పశ్యన్తీతి విధి దర్శినః. న. పు. దృశిర్ ప్రేక్షణే. విధివిహితమును జూచువారు. ౨. యాగవిధియందు న్యూనాతిరిక్తములు రాకుండఁ జూచుటయందు తత్పరులయిన ఋత్విజుల పేళ్లు.

**సభాసద స్సభాస్తారా స్సభ్యా స్సామాజికాశ్చ తే.** 16

సభాయాం సీద న్తీతి సభాసదః. ద. పు. సభయందుండువారు. ౧. సభాం స్తృణన్తి ఆఛ్ఛాదయన్తీతి సభాస్తారాః. అ. పు. స్తృఞ్ ఆచ్ఛాదనే. సభను గప్పి యుండువారు. ౨. సభాయాం సాధవః సభ్యాః. అ. పు. సభయందు మంచివారు. ౩. సమాజం సమూహం సమవయం తీతి సామాజికాః. సమూహమును బొంది యుండువారు. ఈ ౪ సభయం దుండువారి పేళ్లు.

**అధ్వర్యూద్గాతృ హోతారో యజుస్సామర్గ్విదః క్రమాత్,**

అధ్వరం యాతి అధ్వర్యుః. ఉ. పు. యాప్రాపణే. యజ్ఞమును బొందువాడు. ౧. ఉద్గాయతి దేవాదీన్ స్తౌతి ఉద్గాతా. ఋ. పు. గైగానే దేవతలను బెట్టుగా స్తోత్రము చేయువాఁడు. ౧. జుహోతి హోతా. ఋ. పు. హు దానాదనయోః. హోమము చేయువాఁడు. ఈ ౧ వరుసగా యజుర్వేదమును, సామవేదమును, ఋగ్వేదమును నెఱిఁగినవాని పేళ్లు.

**అగ్నీధ్రాద్యా ధనైర్వార్యా ఋత్విజో యాజకాశ్చతే.** 17

యజ్ఞస్వామినాధనై ర్వార్యాః అగ్నీద్ధ్రాదయష్షోడశయాజక ఋత్విక్ఛబ్దవాచ్యాః. తే చ బ్రహ్మా, ఉద్గాతా, హోతా, అధ్వర్యుః, బ్రహ్మణాచ్ఛంసీ, ప్రస్తోతా, మైత్రావరుణః, ప్రతిప్రస్థాతా, పోతా, ప్రతిహర్తా, అచ్ఛావాకః, నేష్టా, అగ్నీధ్రః, సుబ్రహ్మణ్యః, గ్రావస్తుత్, ఉన్నేతాచేతి. యజ్ఞకర్తచేత ధనములచే వరింపఁదగిన అగ్నీధ్రుఁడు మొదలయిన పదియార్వురు ఋత్విజులు యాజకులు ననంబడుదురు. ఆద్యశబ్దముచేత బ్రహ్మ, ఉద్గాత, హోత మొదలయినవారు. అగ్నినిన్ధే అగ్నీధ్రః. ఞి ఇన్ధీ దీప్తౌ. అగ్నిని బ్రకాశింపఁజేయువాఁడు. ఋతౌ వసంతాదౌ యాజయన్తి ఋత్విజః. జ. పు. యాజకాశ్చ. యజ దేవపూజాదౌ. వసంతాది ఋతువులయందు యాగము చేయించువారు. ౧, ౨.

**వేదిః పరిష్కృతా భూమిః -**

పూజాదికం విన్దతీతి వేదిః. ఇ. సీ. విద్ ౡలాభే. పూజాదికమును బొందునది. ఈకారాంతముం గలదు. ఈ ౧ యాగార్థమై చతురశ్రముగా భూషింపఁబడిన భూమి పేరు.

**సమే స్థణ్డిల చత్వరే,**

తిష్ఠన్త్యగ్న యో ఽస్మిన్నితి స్థండిలం ష్ఠా గతినివృత్తౌ. అగ్నులు దీని యందుండును. ౧. చతన్తే యాగఫలమత్రేతి చత్వరం. చతే యాచనే. దీని యందు యాగఫలము నడుగుదురు. ఈ ౨ అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరింపఁబడిన స్థానము పేళ్లు.

**చషాలో యూపకటకః -**

కటకాకృతిత్వేన చష్యతే చషాలః. చష భక్షణే. వలయాకారముగాఁ జెక్కఁ బడునది. యూపస్తంభాగ్రమున వేయఁబడు దారుమయమైన కడియము.

**కుమ్బా సుగహనా వృతిః** 18

కుంబయతి ఆచ్ఛాదయతి కుంబా. కుబి ఆచ్ఛాదనే. యజ్ఞశాలను గప్పుకొని యుండునది. ౧. యజ్ఞశాలకుఁ జుట్టుపెట్టఁబడిన అతిగహనమైన వెలుఁగు.

**యూపాగ్రం తర్మ -**

తరతి చషాలమితి తర్మ. న. న. తౄ ప్లవనతరణయోః. యూపవలయమును తరించునది. ఈ ౧ యూపము కొనపేరు.

**నిర్మన్థ్యదారుణి త్వరణిర్ద్వయోః,**

అగ్న్యుత్పాదనార్థం నిర్మన్థ్యదారుణి అరణి శబ్దోవర్తతే. అగ్నిఁ బుట్టించుకొఱకు కాష్ఠాంతరముచేత మథింపయోగ్యమైన దారుపునందు అరణిశబ్దము వర్తించును. ఇయర్తి అగ్నిరస్యామిత్యరణిః. ఇ. పు. ఋ గతౌ. దీనియం దగ్ని పుట్టును.

**దక్షిణాగ్నిర్గార్హపత్యా హవనీయౌ త్రయో ఽగ్నయః.** 19

దక్షిణాగ్న్యాదిత్రయంః పృథక్ స్వనామప్రసిద్ధే అగ్నిత్రయే వర్తతే. దక్షిణాగ్ని శబ్దము మొదలైన 3 శబ్దములు ప్రత్యేకముగాఁ దమతమ నామములచేతఁ బ్రసిద్ధములైన మూఁడగ్నుల పేళ్లు. వేద్యా

దక్షిణో ఽ గ్నిః దక్షిణాగ్నిః పు. వేదికి దక్షిణమైన యగ్ని దక్షిణాగ్ని. ౧. గృహపతినా ఇతరాగ్నిభ్యాం పూర్వం సంస్కృతో ఽ గ్నిః గార్హపత్యః యజమానునిచే నితరాగ్నులకంటెఁ బూర్వమందు సంస్కరింపఁబడిన యగ్ని గార్హపత్యము. ౧. ఆ కర్మసమాప్తేః. హోతవ్యః ఆహవనీయః. హు దానాదనయోః. క్రియాపరిసమాప్తి పర్యంతము హోమము చేయఁదగినది గనుక ఆహవనీయము. ౧.

**అగ్నిత్రయమిదం త్రేతా -**

ఇదం శ్రౌతాగ్నిత్రయం ఏకోక్త్యాత్రేతే త్యుచ్యతే. ఈ మూఁడు నొక వాక్యముచేత త్రేయని చెప్పఁబడును. త్రాణం త్రా; సదాత్రాం రక్షణం ఇతా ప్రాప్తా. త్రేతా. ఆ. సీ. త్రైజ్‌పాలనే. ఇణ్‌గతౌ. సదా రక్షణమును బొందియుండునది. ఈ ౧ అగ్నిత్రయము పేరు.

**ప్రణీత స్సంస్కృతో ఽ నలః.**

మన్త్రేణ సంస్కృతో ఽగ్నిః ప్రణీతః మంత్రముచేత సంస్కరింపఁబడిన యగ్ని ప్రణీత మనంబడును. ప్రణీయతే సంస్క్రియతే ప్రణీతః. ణీఞ్ ప్రాపణే. సంస్కరింపఁ బడునది. ఈ ౧ సంస్కృతమైన యగ్ని పేరు.

**సమూహ్య పరిచా య్యోపచాయ్యా అగ్నౌ ప్రయోగిణః.** 20

సమూహ్యాదయస్త్రయః అగ్నౌ యగవహ్నౌ ప్రయోగిణః ప్రయోక్తవ్యా ఇత్యర్థః. సమూహ్యాదులైన 3 శబ్దములు యాగాగ్నియందుఁ బ్రయోగింపఁదగిన నామ ధేయములు. సమూహ్యతే సమూహ్యః. ఊహ వితర్కే సమముగా నూహింపఁ దగినది. ౧. పరిచీయతే పరిచాయ్యః. ఉప చీయతే ఉపచాయ్యః. చిఞ్ చయనే. కూల్పఁబడునది ౨, ౩.

**యో గార్హపత్యాదానీయ దక్షిణాగ్నౌ ప్రణీయతే,**

**తస్మి న్నానాయ్యః -**

గార్హ పత్యాదానీయ యః దక్షిణాగ్నౌ ప్రణీయతే తస్మిన్ ఆనాయ్యశబ్దో వర్తతే. గార్హపత్యమున నుండి దక్షిణాగ్నియందుఁ బెట్టఁబడిన యగ్నియం దానాయ్య శబ్దము వర్తించును. గార్హపత్యాదగ్నే రానీ యత ఇతి ఆనాయ్యః. ణీఞ్ ప్రాపణే. గార్హపత్యమునుండి తేఁబడినది. ౧.

**అ థాగ్నాయీ స్వాహా చ హుతభుక్ప్రియా.** 21

అగ్నేః స్త్రీ ఆగ్నాయీ. ఈ. సీ. అగ్నియొక్క పెండ్లాము. ౧.

సుష్ఠు ఆహూయంతే దేవాః అనయేతి స్వాహా. లెస్సగా దీనిచేత దేవతలు పిలువఁబడుదురు. ౨ హుతభుజః ప్రియ హుతభుక్ప్రియా. అగ్ని యొక్క పెండ్లాము. ఈ 3 అగ్నిహోత్రుని పెండ్లాము పేళ్లు.

**ఋక్సామిధేనీ ధాయ్యా చ యా స్యాదగ్ని సమిన్ధనే,**

అగ్నిసమింధనే అగ్ని ప్రజ్వలనే యా ఋక్ తస్యాం సామిధేనీద్వయం వర్తతే. అగ్నిని బ్రజ్వలింపఁజేయు ఋక్కు సామిధేని, థాయ్య అనంబడును. సమిధామియ మాధానీ సామిధేనీ. సమిధలను బెట్టించునది. ౧. ధీయతే సమి దనయేతి ధాయ్యా. డు ధాఞ్ ధారణ పోషణయోః. ౨. దీనిచేత సమిత్తు ధరింపఁబడును. ఈ ౨ అగ్నిప్రజ్వలనము సేయు ఋక్కు పేళ్లు.

**గాయత్త్రీ ప్రముఖం ఛన్దః -**

గాయత్రీ ప్రముఖం గాయత్ర్యాద్యం ఛన్ద ఇత్యుచ్యతే. ఆదినా ఉష్ణిక్, అనుష్టుప్ బృహత్యాదీనాం గ్రహణం. గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, ఉద్ధృతి మొదలైన యిరువదియాఱును ఛందస్సు లనంబడును. అందు గాయత్రి ఆఱక్షరముల పాదము గలది. కడమ ఛందస్సులు ఆమీఁద నొక్క యక్షరము అధికముగాఁ గల పాదములు గలవి. గాయంతం త్రాయత ఇతి గాయత్రీ. త్రైజ్ పాలనే. తనను జపించువానిని రక్షించునది. ఛన్దయత్యాహ్లాదయతీతి ఛందః. స. న. ౧. ఛది ఆహ్లానే. సంతోషపెట్టునది. గాయత్ర్యాది. ఈ ౨౬ ఛందస్సుల పేళ్లు.

**హవ్యపాకే చరుః పుమాన్.** 22

హవ్యపాకే అగ్నియందు వేల్వఁదగిన పక్వాన్నమందు చరుశబ్దము వర్తించును. దాని కాధారమైన పాత్రంబును చరు వినంబడును. చరన్తి దేవా ఇమ మితి చరుః. ఉ. పు. చర గతిభక్షణయోః. దేవతలు దీనిని భక్షింతురు. ౧. అగ్నిలో వేల్వఁదగిన పక్వాన్నము.

**ఆమిక్షా సా శృతోష్ణే యా క్షీరే స్యాద్దధియోగతః**

శృతోష్ణే తప్తే ఉష్ణే చక్షీరేపయసి దధియోగతః దధిసంబంధాత్ యా వికృతిః సా ఆమిక్షేత్యుచ్యతే. కాఁచఁబడి వేఁడియైన పాలలో

పెరుఁగు పోయుటవలన నైన వికారము ఆమిక్ష యనంబడును. ఆమాయతే క్షిప్యతే దధ్యత్రేతి ఆమిక్షా. డు మిఞ్ ప్రక్షేపణే. దీనియందు పెరుఁగు పోయఁబడును. పా. ఆమీక్షా. ౧.

**ధవిత్రం వ్యజనం తద్యద్రచితం మృగచర్మణా.** 23

యాగే అగ్ని ప్రజ్వలనాయ మృగచర్మణా రచితం యద్వ్యజనం తత్ ధవిత్ర మిత్యుచ్యతే. యాగమందు అగ్నిని ప్రజ్వలింపఁజేయుట కొఱకు మృగచర్మముచేఁ జేయఁబడిన విసనకఱ్ఱ ధవిత్ర మనంబడును. ధూయతే అగ్ని రనేన ధవిత్రం. ధూఞ్ కమ్పనే. దీనిచేత అగ్ని కంపింపఁజేయఁబడును. ౧.

**పృషదాజ్యం సదధ్యాజ్యే -**

సదధ్యాజ్యే దధిసహితాజ్యే వృషదాజ్యశబ్దో వర్తతే. పెరుఁగుతోఁ గూడిన నెయ్యి పృషదాజ్య మనంబడును. పృషద్భిః దధిబిందుభిః అన్వితమాజ్యం పృషదాజ్యం. దధిబిందువులతోఁగూడిన యాజ్యము. ౧.

**పరమాన్నం తు పాయసమ్,**

పరమ మన్నం పరమాన్నం. శ్రేష్ఠమైన యన్నము. ౧. పయసా సంస్కృతం పాయసం, పాలచేతఁ బక్వము చేయఁబడినది. ఈ ౨ పాయసము పేళ్లు.

**హవ్య కవ్యే దైవ పైత్రే అన్నే -**

దేవయోగ్యము హవ్యము, పితృయోగ్యము కవ్యము. హూయతే హవ్యం. హూదానాదనయోః. వేల్వఁబడునది. ౧. కూయతే పితృభిః స్తూయత ఇతి కవ్యం. కు శబ్దే. పితృదేవతలచేత స్తోత్రము చేయఁబడునది. ౧. వరుసగా దేవతలకును బితృదేవతలకును యోగ్యమైన అన్నము పేళ్లు.

**పాత్రం స్రువాదికమ్.** 24

పాతీతి పాత్రం. పా రక్షణే. రక్షించునది. ౧. స్రువము మొదలైన యజ్ఞపాత్రల పేళ్లు.

**ధ్రువో పభృజ్జుమూర్నా తు స్రువో భేదా స్స్రుచః స్త్రియః,**

ధ్రువాదయః స్రుచో భేదాః. తే చ స్త్రియః స్త్రీలింగాః. స్రువస్తునా. పుల్లింగః. ధ్రువాది శబ్దములు ౪ స్రుక్కుయొక్క భేదముల పేళ్లు. ధ్రువతీతి ధ్రువా ధ్రువ స్థైర్యే. స్థిరమై యుండునది. ౧. ఉపభ్రియతే హూమార్థ మిత్యుపభృత్. త. సీ. భృఞ్ భరణే. హోమార్థమై భరింపఁ

బడునది. ౧. హూయతే అనయా జుహూః. ఈ సీ. హు దానా దనయోః. దీనిచేత వేల్వంబడును. ౧. స్రవత్యాజ్య మస్మాదితి స్రువః. అ. పు. స్రువణే. దీనివలన నాజ్యము స్రవించును. ౧.

**ఉపాకృతః పశురసౌ యో ఉ భిమన్త్ర్య క్రతౌ హతః.** 25

క్రతౌ యః పశుః అభిమంత్ర్య హతః స పశుః ఉపాకృత ఇత్యుచ్యతే. యజ్ఞమందు అభిమంత్రించి యే పశువు హింసింపఁబడునో, ఆ పశువు ఉపాకృత మనంబడును. ఉపామంత్ర్యక్రియత ఇతి ఉపాకృతః. కృఞ్ హింసాయాం. అభిమంత్రించి హింసింపఁబడునది. ౧

**పరమ్పరాకం శసనం ప్రోక్షణం చ వధార్థకమ్,**

పరంపరాం ప్రాణానాం అకతీతి పరంపరాకం అక కుటిలాయాం గతౌ. ప్రాణపరంపరను కుటిలముగాఁ బొందునది. ౧ శస్యతే శసనం. శసు హింసాయాం. హింసించుట శసనము. పా. శమనం. ౧. ప్రోక్ష్యతే ప్రోక్షణం. ప్రోక్షించుట ప్రోక్షణము. వధకంటెఁ బూర్వము ప్రోక్షింపఁబడును ఈ 3 యజ్ఞమందలి పశువధ పేళ్లు.

**వాచ్యలిఙ్గాః ప్రమీతోప సంపన్న ప్రోక్షితా హతే.** 26

ప్రమియత ఇతి ప్రమీతః. మీఙ్ హింసాయాం. హింసంపఁబడునది. ౧. ఉపసంపద్యతే హననార్థ ముపసంపన్నః పద్ ౙగతౌ. హింసార్థమై పొందఁబడునది. ౨. ప్రోక్షణ మితః ప్రోక్షితః. ప్రోక్షణమును పొందునది. ఈ 3 ను విశేష్యలింగములు. యాగార్థమై హింసింపఁబడిన పశువు మొదలైనదాని పేళ్లు.

**సాంనాయ్యం హవిః -**

సన్నీయతే సాంనాయ్యం. ణీఞ్ ప్రాపణే. లెస్సగా నగ్నియందు పొందింపఁబడునది. ౧ హూయత ఇతి హవిః. స. న. హు దానాదనయోః. అగ్నియందు వేల్వఁబడునది. ఈ ౨ హవిస్సు పేళ్లు. దధిసయో రూపమైన హవిస్సని కొందఱు.

**అగ్నౌ తు హుతం త్రిషు వషట్కృతమ్,**

అగ్నౌ హుతం వషట్కృత మిత్యుచ్యతే. అగ్నియందు వేల్వఁబడినది వషట్కృత మనంబడును. వషట్ క్రియత ఇతి వషట్కృతం. త్రి. వషట్కారయుక్తముగాఁ జేయఁబడునది. ౧.

**దీక్షాన్తో ౽ వభృథో య(జ్ఞ)జ్ఞే -**

దీక్షాఖ్యస్య కర్మణః అన్తో దీక్షాన్తః. యజ్ఞ దీక్షయొక్క అంతము దీక్షాంతము. ౧. అవభ్రీయతే దీక్షావ్రతం పూర్యతే అనేనే త్యవ భృథః. భృఞ్ భరణే. దీనిచేత దీక్షావ్రతము నిర్వహింపఁబడును. ఈ ౨ యజ్ఞాంతమందలి న్యూనాతిరిక్త దోష పరిహారము కొఱకుఁ జేయు నిష్టిపేళ్లు. అవభృథస్నానము.

**తత్కర్మార్హంతు యజ్ఞియమ్.** 27

**త్రిషు -**

యజ్ఞార్హం యజ్ఞియం. త్రి. ఈ ౧ యజ్ఞమునకు నర్హమైన వస్తువు పేరు.

**అథ క్రతుకర్మేష్టమ్-**

క్రతుకర్మయత్ తదిష్ట మిత్యుచ్యతే. యజ్ఞమందలి హోమదానాదిక్రియ ఇష్ట మనంబడును. "ఏకాగ్నికర్మహవనం త్రేతాయాం యచ్చహూయతే, అంతర్వేద్యాం చ యద్దాన మిష్టం త దభిధీయత" ఇతి స్మృతిః ఇజ్యతేస్మ ఇష్టం, యజ దేవపూజాదౌ. వేల్వఁబడునది. (ఇయ్యఁబడునది) ఇష్టము. ౧.

**పూర్తం ఖాతాదికర్మ యత్,**

ఖాతాదికర్మయత్తత్పూర్త మిత్యుచ్యతే. ఖాత మనఁగా తటాకము. ఆదిశబ్దముచేత దేవాలయా రామాదులును పూర్తమని చెప్పఁబడును. "పుష్కరిణ్య స్సభా వాపీ దేవస్యాయతనాని చ, ఆరామశ్చ విశేషేణ పూర్తం కర్మ వినిర్దిశే" దితి స్మృతిః. పిపర్తిపాలయతి పశు దేవ బ్రాహ్మణాదీ నితి పూర్తం. పృా పాలన పూరణయోః. పశుదేవ బ్రాహ్మణాదుల రక్షించునది. ౧.

**అమృతం విఘసో యజ్ఞ శేషభోజన శేషయోః.** 28

నమ్రియంతే అనేనేత్యమృతం. మృఙ్ ప్రాణత్యాగే. దీనిచేతఁజెడరు. ౧. విఘస్యతే విఘసః. ఘస్ ఌఅదనే. విశేషముగా భక్షింపఁబడునది. ఈ ౨ వరుసగా యజ్ఞమందు వేల్వఁగా మిగిలిన యాజ్యము మొదలయినవానికిని, దేవతలును, అతిథులును భుజింపఁగా మిగిలిన యన్నాదులకును పేళ్లు.

**త్యాగో విహాపితం దాన ముత్సర్జన విసర్జనే,** 29

**విశ్రాణనం వితరణం స్పర్శనం ప్రతిపాదనమ్.**

**ప్రాదేశనం నిర్వపణ మపవర్జన మంహతిః,**

త్యజ్యతే త్యాగః. త్యజ హానౌ. ఇచ్చుట. ౧. విహీయతే విహాపితం. ఓ హాక్ త్యాగే విడువఁబడునది. పా. విహాయితం. ౨. దీయతే దానం. దాఞ్ దానే. ఇచ్చుట. ౩. ఉత్సృజ్యతే ఉత్సర్జనం. విసృజ్యతే విసర్జనం. సృజ విసర్గే. ధనాదుల విడుచుట. ౪, ౫. విశ్రాయతే విశ్రాణనం. శ్రణదానే. ఇచ్చుట. ౬. వితరంత్యనేన వితరణం. తౄ ప్లవనతరణయోః. దీనిచేత నరకమును తరింతురు. ౭. స్పృశ్యతే ఉ సేన స్పర్శనం. స్పృశ స్పర్శే. దానమందు వస్తువు స్పృశింపఁబడును గనుక ఉపచారమున దానమును స్పర్శనము. ౮. ప్రతిపాద్యతే అనేన ప్రతిపాదనం. పద్ ౯గతౌ. దీనిచేత పుణ్యము ప్రతిపాదింపఁబడును. ౯. ప్రాదిశ్యతే ప్రాదేశనం. దిశ అతిసర్జనే. ఇచ్చుట. ౧౦. నిర్వాప్యతే నిర్వపణం. టు వప్ బీజసంతానే. మీఁది జన్మమునకు మొలవఁబెట్టఁబడునది. ౧౧. అపవర్జ్యతే పాప మనేనే త్యపవర్జనం. వృజీ వర్జనే. దీనిచేతఁ బాపము వర్జింపఁబడును. పా. అపసర్జనం. ౧౨. హంతి పాపమి త్యంహతిః. ఇ.సీ. హన హింసాగత్యోః. పాపమును జెఱుచునది. ఈ ౧౨ దానము పేళ్లు.

**మృతార్థం తదహర్దానం త్రిషు స్యాదౌర్ధ్వ దైహికమ్.** 30

మృతార్థం తదహర్దానం మృతాహే పిండాది దానం ఔర్ధ్వదైహిక మిత్యుచ్యతే. మృతులైనవారి కొఱకు మృతాహస్సులయందుఁ జేయు పిండదానాదులు ఔర్ధ్వదైహిక మనంబడును. దేహాదూర్ధ్వే భవమౌర్ధ్వ దైహికం. దేహమున కంటె మీఁదఁ గలుగునది. ఊర్ధ్వ దేహే భవ మౌర్ధ్వదైహికం. ఊర్ధ్వదేహమందుఁ గలుగునది. ౧.

**పితృదానం నివాపస్స్యాత్ -**

నివాప్యతే నివాపః. టు వఫ్ బీజసంతానే. పితృదేవతలను గూర్చి చేయఁ బడునది. ఉపసర్గ వశమున నీ ధాతువు పితృదానార్థకము. ౧. ప్రేతత్వమును విడిచి పితృత్వమును బొందినవారినిఁగూర్చి చేయుజలాం జల్యాది దానము.

**శ్రాద్ధం తత్కర్మ శాస్త్రతః,**

శ్రద్ధయా దీయతే శ్రాద్ధం. శ్రద్ధచేత నియ్యఁబడునది. ఈ ౧ శాస్త్రోక్తమైన దేశకాలపాత్రాది నియమముచేత నా పితృదేవతలను గూర్చి చేయఁబడు బ్రాహ్మణ భోజనాదికము. తద్దినము.

**అన్వాహార్యం మాసికః**

పితృయజ్ఞా దన్వాహార్యత ఇతి అన్వాహార్యం. పితృయజ్ఞమునకు వెనుక చేయఁబడునది. ౧. మాసే మాసే క్రియత ఇతి మాసికం, నెల నెలకు చేయఁ బడునది. ఈ ౨ నెలనెలకు చేయు పిండతృయజ్ఞము పేళ్లు. దర్శశ్రాద్ధము.

**అంశో ఽ ష్టమో ఽ హ్నః కుతపో ఽ స్త్రియామ్.** 31

పంచదశాంశీకృతస్య అహ్నః ద్విఘటికాత్మకః అష్టమో భాగః కుతప ఇత్యుచ్యతే. తథా చస్మృతిః___ "రౌద్ర శ్శ్వేతశ్చ మైత్రశ్చ తథా శారభటః స్మృతః, సావిత్రో విజయశ్చైవ గాన్ధర్వః కుతపస్తథా. రౌహిణేయో విరించశ్చ సోమో ఽ థ నిరృతిస్తథా, మాహేన్ద్రో వరుణశ్చైవ భటః పంచదశః స్మృత" ఇతి. పగటిని పదునేనుపాళ్లు చేసి అందేడుపాళ్లు పోఁగా నెనిమిదవపాలు కుతప మనంబడును. సూర్యోస్మిన్ కుం భువం తపతీతి కుతపః. అ. పు. తపసంతాపే. సూర్యుఁడు దీని యందు భూమిని దపింపఁజేయును. "కుం యత్రగోపతి ర్గోభిః కార్త్స్న్యే న తపతి క్షణే, స కాలః కుతపో నామశ్రాద్ధం తత్ర ప్రదీయత"ఇతి. ౧.

**పర్యేషణా పరీష్టిశ్చాన్వేషణా చ గవేషణా**

పర్యేష్యతే ఽ నయా పర్యేషణా, పరీష్టిశ్చ. ఇషగతౌ. దీనిచేత అంతట తిరుగఁ బడును. ౧, ౨. అన్విష్యతే అనయా అన్వేషణా. దీనిచేత వెంటఁ దిరుగఁబడును. ౩. గవేషణం. గవేషణా గవేష మార్గణే. వెదుకుట. ఈ ౪ శ్రాద్ధాదులయందు బ్రాహ్మణుని వెదుకుట పేళ్లు.

**సనిస్త్వధ్యేషణా -**

సన్యతే ఽ స్మిన్నితి సనిః. ఇ. సీ. షణు దానే. దీనిచేత నియ్యఁబడును. ౧. అధ్యేష్యతే అధ్యేషణా. ఇషగతౌ. పూజ్యులను సత్కరించుట అధ్యేషణ. ఈ ౨ గురువులు మొదలైన పూజ్యులను సత్కార పూర్వకముగా నొక ప్రయోజనమందు నియోగించుట పేళ్లు.

**యాచ్ఞాభిశస్తి ర్యాచనార్థనా.** 32

యాచనం యాచ్ఞా, యాచనా. టు యాచృ యాచ్ఞాయాం. అడుగుట. ౧, ౨. అభిశంసనం అభిశస్తిః. ఇ. సీ. శంసు స్తుతౌ. స్తోత్రముచేయుట. ౩. అర్థన మర్థనా. అర్థ ఉపయాచ్ఞాయాం. అడుగుట. ఈ ౪ అడుగుట పేళ్లు.

**షట్తు త్రిషు -**

ఇఁకమీఁద నాగంతు శబ్దముదాక ౬ శబ్దములు త్రిలింగములు.ఆర్ఘ్యమర్ఘార్థే పాద్యం పాదాయవారిణి,అర్ఘార్థం వారి అర్ఘ్యం పూజకొఱకైన జలము. ౧. అర్ఘ మనఁగా పూజ; తదర్థమైన జలాదులు అర్ఘ్య మనంబడును.

**క్రమా దాతిథ్యాతిథేయే అతిథ్యర్థే ౨ త్రసాధుని.** 33

అతిథ్యర్థేభక్తాదౌ అతిథౌ సాధుని కర్మాదౌ యథాక్రమం అతిథ్యాతిథేయశబ్దౌ వర్తేతే. ఆతిథ్యాతిథేయ శబ్దములు వరుసగా నతిథుల కొఱకైన యన్నాదులయందును, అతిథులయందు యుక్తమైన యాహ్వానాది క్రియలయందును వర్తించును. అతిథిభ్యః పరికల్పిత మాతిథ్యం. అతిథులకొఱకు చేయఁబడినది. ౧. అతిథీషు సాధు ఆతిథేయం. అతిథులయందుఁ దగినది.

**స్యా దావేశిక ఆగన్తు రతిథి ర్నా గృహాగతే,**

ఆవేశాత్ స్వగృహాత్ ఆగతః ఆవేశికః తన యింట నుండి వచ్చినవాఁడు. ౧. ఆగచ్ఛతీత్యాగన్తుః. ఉ. పు. వచ్చినవాఁడు. ౨. అతతి సతతం గచ్ఛతీ త్యతిథిః. ఇ. పు. అత సాతత్యగమనే. ఎప్పుడు తిరుగువాఁడు. ఈ 3 అతిథులపేళ్లు.

**పూజా నమస్యాపచితి స్సర్యార్చార్హణాస్సమాః.** 34

పూజనం పూజా. పూజ పూజాయాం. పూజించుట. ౧. నమనం నమస్యా. నమస్కరించుట. ౨. అపచాయనం అపచితిః. ఇ. సీ. చాయ్ఋ పూజాని శామనయోః. పూజించుట. ౩. పరేణ సహవర్తతే సపరః. సపరే సాధ్వీ సపర్యా. ఉత్తమ గుణసహితునియందు మంచిది. ౪. అర్చన మర్చా. అర్చ పూజాయాం. అర్చించుట. ౫. అర్హణం అర్హా.అర్హ పూజాయాం పూజించుట. ఈ ౬ పూజించుట పేళ్లు.

**వరివస్యా తు శుశ్రూషా పరిచర్యా ప్యుపాసనా,**

వరివసనం వరివస్యా. పరిచర్యసేయుట. ౧. శ్రోతు మిచ్ఛా శు శ్రూషా. శ్రు శ్రవణే. విన నిచ్ఛయించుట. ౨. పరిచరణం పరిచర్యా. చు గతిభక్షణయోః. సమీపమందు చరించుట. ౩. ఉప సమీపే ఆసనం ఉపాసనా. ఆస ఉపవేశనే. సమీపమందుండుట ఉపాసనము. ఈ ౪ శుశ్రూష పేళ్లు. చెప్పినట్లు మెలఁగుట.

**వ్రజ్యాటాట్యా పర్యటనమ్ -**

వ్రజనం వ్రజ్యా వ్రజ గతౌ. తిరుగుట. ౧. పునఃపునరటనం అటాట్యా. పలుమాఱు దిరుగుట. ౨. పరితః అటనం పర్యటనం. అటగతౌ. అంతటఁ దిరుగుట. ఈ 3 భిక్షాద్యర్థమై పలుమాఱు తిరుగుట పేళ్లు.

**చర్యా త్వీర్యాపథస్థితిః.** 35

చరణం చర్యా. చర గతిభక్షణయోః. చరించుట. ౧. ఈర్యతే జ్ఞాయతే ఈర్యా. ఈర గతౌ. ఈర్యాయాః పన్థాః ఈర్యాపథః ధ్యానాద్యుపాయః, తస్మిన్ స్థితిః ఈర్యాపథస్థితిః. ధ్యానమౌనాది వ్రతముల యందు చాంచల్యము లేక స్థిరముగా నుండుట పేళ్లు. యతులు నడచుట నిలుచుట కూర్చుండుట పరుండుట మొదలగునవి యీర్యలు; వాని మార్గమం దుండుట యని కొందఱు.

**ఉపస్పర్శస్త్వాచమనమ్ -**

ఉపస్పృశ్యంతే అఙ్గా న్యత్రేతి ఉపస్పర్శః. స్పృశ సంస్పర్శనే. దీనియం దంగములు స్పృశింపఁబడును. ౧. ఆచమ్యతే ఉదక మత్రేతి ఆచమనం. చము అదనే. ఉదకము దీనియందు పానము చేయఁబడును. ఈ ౨ శుద్ధాచమనము పేళ్లు.

**అథ మౌన మభాషణమ్,**

మునేర్భావో మౌనం, మునియొక్క భావము. మౌనము. ౧. అభాషణం = వ్రతముల యందు మాటలాడకయుండుట.

**ఆనుపూర్వీ స్త్రియాం వావృత్పరిపాటీ అనుక్రమః.** 36

**పర్యాయశ్చ -**

పూర్వము క్రమ్య తిష్ఠత్యను పూర్వం. తస్య భావః అనుపూర్వీ. స్త్రీ. పూర్వమును తప్పక అనుసరించి యుండుట అనుపూర్వము. దాని భావము అనుపూర్వి. ౧. ఆవర్తనమావృత్ త. సీ. వృతు వర్తనే. ౨.

పరిపాటనం పరిపాటీ. సీ. ఆట పట గతౌ. క్రమము. ఉపసర్గవశమున నీధాతువునకు క్రమార్థత్వము. ౩. అనుక్రమణ మనుక్రమః. క్రముపాదవిక్షేపే. పూర్వము ననుసరించిపోవుట. ౪. పర్యయనం పర్యాయః. ఇణ్ గతౌ. ఈ ౫ స్వాధ్యాయక్రమము పేళ్లు.

**అతిపాతస్తు స్యాత్పర్యయ ఉపాత్యయః,**

అతిక్రమ్య పతనం అతిపాతః. పత్ ౯ గతౌ. అతిక్రమించిపోవుట అతిపాతము. ౧. ప్రాప్తం పరిత్యజ్య అయనం పర్యయః. ఇణ్ గతౌ. ప్రాప్తమును బరిత్యజించిపోవుట పర్యయము. ౨. ఉప సమీపస్థ మతి క్రమ్య అయనం ఉపాత్యయః. ఇణ్ గతౌ. సమీపమందుండుదాని నతిక్రమించిపోవుట ఉపాత్యయము. ౩. క్రమము తప్పుట. విడివడుట.

**నియమో వ్రత మస్త్రీ తచ్చోపవాసాది పుణ్యకమ్.** 37

నియమ్యత ఇతి నియమః. యము ఉపరమే. శాస్త్రముచేత నియమింపఁబడునది. ౧. వ్రత్యతే అన్నాదిక మనేనేతి వ్రతం. అ. ప్న. వ్రతీ వర్జనే. అన్నాదులు దీనిచేత విడువఁబడును. ౨. పుణ్యహేతుత్వాత్ పుణ్యం. పుణ్యహేతువు. ౩. శాస్త్రవిహితమైన నియమము వ్రతమనఁబడును. ఉపవాసాది రూపమైన యావ్రతము పుణ్యకమనంబడును.

**ఉపవస్తం తూపవాసః**

ఉప సమీపే వసనం ఉపవస్తం. ఉపవాసశ్చ. అగ్నిసమీపమం దుండుట ఉపవస్తము. ఉపవాసము. పా. ఔపవస్తం. ౧, ౨. యజమానుఁ డగ్ని సమీపమం దాచరించు ననశనవ్రతము పేళ్లు. ఉపవాస మాత్రమునకును పేళ్లు.

**వివేకః పృథగాత్మతా,**

పృథగాత్మతా ప్రకృతి పురుషయోర్విభాగేన జ్ఞానం వివేక ఇత్యుచ్యతే, ప్రకృతి పురుషులు వేఱని యెఱుఁగుట. వివేచనం వివేకః. విచిర్ పృథగ్భావే ప్రకృతి పురుషుల నేర్పఱచుట.

**స్యా ద్బ్రహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధిః**

౧. వృత్తాధ్యయ నర్ధిః. వృత్త = మంచియనుష్ఠానము యొక్కయు, అధ్యయన = వేదపాఠము యొక్కయు, ఋద్ధిః = సమృద్ధి బ్రహ్మవర్చస మనంబడును. బ్రహ్మణః తపస్స్వాధ్యాయాదే ర్వర్చః తేజో బ్రహ్మవర్చసం.

బ్రహ్మ మనఁగా అనుష్ఠానము, స్వాధ్యాయంబును. అందువల్లనైన తేజస్సు బ్రహ్మవర్చసము.

**అథాఞ్జలిః.** 38

**పాఠే బ్రహ్మాఞ్జలిః -**

బ్రహ్మణే వేదా యాంజలిః బ్రహ్మాఞ్జలిః. బ్రహ్మ మనఁగా వేదము. దాని కొఱకుఁ జేసిన యంజలి. ఈ ౧ వేదపాఠమందు మ్రొక్కుటకై మోడ్చిన యంజలి పేరు.

**పాఠే విప్రుషో బ్రహ్మబిన్దవః,**

బ్రహ్మణి వేదపాఠే బిందవః బ్రహ్మబిందవః ఉ.పు. వేదపాఠ మందలి తుంపురులు. ఈ ౧ వేదము చదువునప్పుడు నోట వెడలెడు తుఁపురులు పేరు.

**ధ్యానయోగాసనే బ్రహ్మాసనమ్ -**

బ్రహ్మణే ఆసనం బ్రహ్మాసనం. బ్రహ్మకొఱకైన యాసనము. ౧. ధ్యాన మందును యోగమందును జేయఁబడు స్వస్తికము. పద్మకము మొదలైన యాసనముల పేళ్లు.

**కల్పే విధి క్రమౌ.** 39

కల్ప్యతే ఽ నేన కల్పః. క్లప క్లప్తౌ. దీనిచేత విధింపఁబడును. ౧. విధీయతే అనేన విధిః. ఇ. పు. విధ విధానే. దీనిచేత విధింపఁబడును. ౨. క్రమ్యతే ఽ నేనేతి క్రమః. దీనిచేత ప్రక్రమింపఁబడును. 3. ఇది యీప్రకారముగాఁ జేయవలె నను వేదోక్త విధానము పేళ్లు.

**ముఖ్య స్స్యాత్ప్రథమః కల్పః -**

ముఖమివ ప్రధానత్వాత్ ముఖ్యః. ప్రధానమైన విధి. ప్రథమః ఆద్యః కల్పః విధిః. 'వడ్లతో వేల్చుము' ఈ మొదలగు విధముగా మొదటఁ జెప్పిన విధి పేరు.

**అనుకల్ప స్తతో ఽ ధమః,**

అను పశ్చాత్కల్ప్యత ఇతి అనుకల్పః. వెనుక విధింపఁబడునది. తతః = ఆ మొదటిదానికంటె, అధమః = తక్కువైనది. 'వడ్లు దొరకవేని నీవారాదులైనఁ జాలును' అనునట్లు వెనుకఁజెప్పిన విధి పేరు.

**సంస్కారపూర్వం గ్రహణం స్యాదుపాకరణం శ్రుతేః.** 40

సంస్కారః ఉపనయః తత్పూర్వకం శ్రుతే ర్వేదస్య గ్రహణం ఉపాకరణ మిత్యుచ్యతే. సంస్కార మనఁగా నుపనయనము; అది మొదలుగా వేదముఁ జదువదొరకొనుట ఉపాకరణ మనంబడును. ఉపాక్రియతే స్వీక్రియతే శ్రుతి రనే నే త్యుపాకరణం డుకృఞ్ కరణే. వేదము దీనిచేత స్వీకరింపఁబడును. ౧. సంస్కారపూర్వకమైన వేద గ్రహణము.

**సమే తు పాదగ్రహణ మభివాదన మిత్యుభే,**

పాదయోర్గ్రహణం పాదగ్రహణం. గ్రహ ఉపాదానే. పాదములఁ బట్టుకొనుట. ౧. అభివాద్యతే ఆశీర్వాదః క్రియతే అనేనే త్యభివాదనం. వది అభివాదనస్తుత్యోః దీనిచేత ఆశీర్వదింపఁబడును. ఈ ౨ గోత్రనామములఁ జెప్పి మ్రొక్కుట పేళ్లు.

**భిక్షుః పరీవ్రాట్కర్మన్దీ పారాశర్యపి మస్కరీ.** 41

భిక్షతే భిక్షుః ఉ. పు. భిక్ష భిక్షాయాం. అడుగువాఁడు. ౧. పరిత్యజ్య సర్వం వ్రజతీతి పరివ్రాట్. జ. పు. వ్రజగతౌ. అన్నిటిని బరిత్యజించి పోవువాఁడు. ౨. కర్మంద ఋషిప్రోక్తసూత్రమధీత ఇతి కర్మందీ. న. పు. కర్మందుఁడను ఋషి చెప్పిన సూత్రముల నధ్యయనము చేయువాఁడు. 3. పారాశర్యప్రోక్తసూత్ర మధీతే పారాశరీ న. పు. వేదవ్యాసులు చెప్పిన సూత్రముల నధ్యయనము సేయువాఁడు. ౪. మస్కరో వేణుదండః. సో ఽస్యాస్తీతి మస్కరీ. న. పు. మస్కర మనఁగా వెదురుగడ; అది గలవాఁడు. మా కరణశీలః కామకర్మప్రతిషేధపరోవా మస్కరీ. కామ్యకర్మములను బ్రతిషేధించు స్వభావముగలవాఁడు. ఈ ౫ సన్న్యాసి పేళ్లు.

**తపస్వీ తాపసః పారికాఙ్క్షీ –**

తపో ఽస్యాస్తీతి తపస్వీ. న.పు. తాపసశ్చ. తపస్సుగలవాఁడు. ౧. పరం బ్రహ్మజ్ఞానం కాంక్షత ఇతి పారికాంక్షీ. న. పు. పర మనఁగా బ్రహ్మజ్ఞానము. దానిని గోరువాఁడు. ఈ 3 తపస్సుగలవాని పేళ్లు.

**వాచంయమో మునిః,**

వాచం నియచ్ఛతీతి వాచంయమః. యమ ఉపరమే. వాక్కును నిలుపువాఁడు. ౧. మన్యతే మునిః. ఇ. పు. మనజ్ఞానే. జ్ఞానము గలవాఁడు. ౨. మౌనవ్రతము గలవాని పేళ్లు. ఈ ౧౦ యు సన్న్యాసిపేళ్లని కొందఱు.

**తపఃక్లేశు సహోదాన్తః –**

దామ్యతి ఇంద్రియేభ్య ఇతి దాంతః. దము ఉపశమే. ఇంద్రియములవలన నుపశమించువాఁడు. తపమువలని కష్టము నోర్చువాఁడు.

**వర్ణినో బ్రహ్మచారిణః.** 42

వర్ణా ఏషాం సంతీతి వర్ణినః. న. పు. స్తుతులు (బ్రాహ్మణాది వర్ణములు) గలవారు. ౧. బ్రహ్మవేదాధ్యయనవ్రతం చరంతీతి బ్రహ్మచారిణః. న. పు. చర గతిభక్షణయోః. బ్రహ్మ మనఁగా వేదాధ్యయనవ్రతము; దాని నాచరించువారు. ఈ ౨ బ్రహ్మచారి పేళ్లు.

**ఋషయస్సత్యవచసః -**

జ్ఞానస్య పారగమాత్ ఋషిః ఇ.పు.ఋ గతౌ. జ్ఞానముయొక్క పారమును బొందినవాఁడు. ౧. సత్యం వచో యేషాం తే సత్యవచనః. స.పు. సత్యమైన వాక్కులు గలవారు. ౨. ఋషుల పేళ్లు.

**స్నాతక స్త్వాప్లుతో వ్రతీ,**

వ్రతార్థం స్నాతీతి స్నాతకః. ష్ణాశౌచే. వ్రతము కొఱకు స్నానము చేయువాడు. ౧. గంగాది పుణ్యతీర్థేషు ఆప్లవణే ఆప్లుతః. ప్లుజ్ గతౌ గంగాది పుణ్యతీర్థములయందు స్నానము చేయువాఁడు. ఈ ౨ వేదాధ్యయనము చేసిన పిమ్మట ఆశ్ర మాంతరమునకుఁ బోక వ్రతయుక్తుఁడై తీర్థస్నానశీలుఁడై యుండు బ్రహ్మచారి పేళ్లు.

**యే నిర్జితేన్ద్రియగ్రామా యతినో యతయశ్చ తే.** 43

యతం ఇంద్రియసంయమః ఏషా మస్తీతి యతినః. న. పు. ఇంద్రియ నియమము గలవారు. ౧. యచ్ఛంతి ఇంద్రియేభ్య ఇతి యతయః. ఇ. పు. యమ ఉపరమే. ఇంద్రియములవలనఁ జాలించినవారు. ఈ ౨ జయింపఁబడిన యింద్రియ సమూహము గలవారి పేళ్లు.

**యః స్థణ్డిలే వ్రతవశా చ్ఛేతే స్థణ్డిలశా య్యసౌ,**
**స్థాణ్డిలశ్చ -**

స్థండిలే శేతే స్థండిలశాయీ. న. పు. స్థాండిలశ్చ. స్థండిల మనఁగా తృణాదులచేఁ గప్పఁబడిన భూమి; దానియందుఁ బరుండువాఁడు. ఈ ౨ వ్రత వశమున భూమిపై బరుండువాని పేళ్లు.

**అథ విరజ స్తమ సస్స్వర్ద్వయాతిగాః.** 44

రజస్తమో గుణములు లేక కేవల సాత్త్వికులయినవారు ద్వయా

తిగు లనంబడుదురు. ద్వయం రజ స్తమోగుణా వతీత్య గచ్ఛంతీతి ద్వయాతిగాః అ. పు రజస్తమోగుణములు రెండి నతిక్రమించినవారు. ౧.

**పవిత్రః ప్రయతః పూతః**

పూయతే ఽనేన పవిత్రః. పూతశ్చ. పూఙ్ పవనే. వీనిచేతఁ బవిత్రము చేయఁబడును. ౧, ౨.ప్రయచ్ఛతి ఉపరమతీంద్రియేభ్య ఇతి ప్రయతః. యమ ఉపరమే. ఇంద్రియములవలన మరలినవాఁడు. ఈ 3ను శుచియైనవాని పేళ్లు.

**పాషణ్డా స్సర్వలిఙ్గినః,**

(కౌపీనం ఖణ్డితం వాస స్త్రిషు కక్ష్యా పుటీ తథా,
ప్రవ్రజ్యా తు పరివ్రజ్యా తపస్వీ తు తపస్వితః.)

పాశాణ్ సంసృతిబంధహేతుభూతాని అసచ్ఛాస్త్రాణి అణంతి వదంతీతి పాషండాః. అ. పు అణ శబ్దే. సంసార బంధహేతుభూతములైన యసచ్ఛాస్త్రములను పలుకువారు. ౧. సర్వేషా మాశ్రమాణాం లింగాని భజంత ఇతి సర్వలింగినః. న. పు. సర్వాశ్రమ చిహ్నములు గలవారు. ఈ ౨ వేదబాహ్యులైన బౌద్ధకాపాలిక క్షపణకాదుల పేళ్లు.

**పాలశోదణ్డ ఆషాఢో వ్రతే -**

ఆషాఢాసు జాతః ఆషాఢః. పూర్వాషాఢాది నక్షత్రములయందగునట్టిది. ౧. పాలాశః. దణ్డః. బ్రహ్మచర్యాదివ్రతమందుఁ బట్టు మోదుగు కోల.

**రామ్భస్తు వైణవః.** 45

రంభాశబ్దేన వంశో బోధ్యతే రంభాయా వికారో రాంభః. రంభయనఁగా వెదురు. దాని చేతనైనది రాంభము. వ్రతమందలి వెదురుకోల.

**అస్త్రీ కమణ్డలుః కుణ్డీ -**

కం జలం అండే మధ్యే లాతీతి కమండలుః. ఉ.పు. లా ఆదానే. ఉదకమును మధ్యమందు గ్రహించునది. ౧. కుండవద్వృత్తత్వాత్ కుండీ. ఈ. సీ. కుండవలె వట్రువగా నుండునది. ఈ ౨ కమండలువు పేళ్లు.

**వ్రతినా మాసనం బృసీ,**

బ్రువంతో ఽస్యాం సీదంతీతి బృసీ. ఈ. సీ. బ్రూఞ్ వ్యక్తాయాం వాచి. షద్ ౙ విశరణగత్యవసాదనేషు. చదువుచు దీనియందుఁ గూర్చుం

దురు. పా. బ్రుషీ. "వసా తసీ బ్రుసీమాంసీ" అని దంత్యాంతములయందు చంద్రగోమి. "గండుషా మంజుషాబ్రుషీ" అని మూర్ధన్యాంతములయందు కోరిక. ఈ ౧ వ్రతస్థులు కూర్చుండు దర్భాద్యాసనము పేరు.

**అజినం చర్మ కృతిః స్త్రీ-**

అజ్యతే క్షిప్యత ఇతి అజినం. అజ గతిక్షేపణయోః. వేయఁబడునది. ౧. చరతి కటిప్రదేశమితి చర్మ. న. న. చరగతి భక్షణయోః. కటి ప్రదేశమును బొందునది. ౨. కృత్యతే కృత్తిః. ఇ. సీ. కృతీచ్ఛేదనే. కోయఁబడునది. ఈ 3 మృగచర్మ మొదలగుదాని పేళ్లు.

**భైక్షం భిక్షాకమదమ్బుకమ్** 46

భిక్షాణాం సమూహో భైక్షం. భిక్ష మెత్తిన పదార్థములగుంపు భైక్షము. ఈ ౧ భిక్షాద్రవ్యము పేరు.

**స్వాధ్యాయ స్స్యాజ్జపః-**

స్వవేదాధ్యయనం స్వాధ్యాయః. తమ వేదము నధ్యయనము సేయుట స్వాధ్యాయము. ౧. జపనం. జపః. జప వ్యక్తాయాం వాచి. జపించుట. పా. జాపః. ౨. తానే శాఖలోనివాఁడో ఆ వేదము యొక్క యధ్యయనము పేరు. పలుమాఱు వేదముఁ జదువుట యని కొందఱు.

**సుత్యాభిషవస్సవనం చ సా,**

సున్వన్త్యస్యాం సోమలతా మితి సుత్యా, అభిషవః, సవనం చ. షుఞ్ అభిషవే. దీనియందు సోమలతను బిండుదురు. ఈ 3 స్నానమునకును, సోమలతను దంచుటకును పేళ్లు.

**సర్వైన సామపధ్వంసి జప్యం త్రిష్వఘమర్షణమ్.** 47

అఘం మృష్యతే అనేన అఘమర్షణం. త్రి. మృష హింసాయాం. దీనిచేత పాపము చెఱుపఁబడును. అఘమర్షణీ ఋక్. అఘమర్షణో మంత్రః. ఈ ౧ సర్వపాపములను బోఁగొట్టుటకు జపించు మంత్రము.

**దర్శశ్చ పౌర్ణమాసశ్చ యాగౌ పక్షాన్తయోః పృథక్,** 48

పక్షాంతయోః = పక్షాంతము లైన యమావాస్యా పూర్ణిమలయందుఁ జేయఁబడు యాగములు. పృథక్ = వేఱుగా. దర్శనము, పౌర్ణమాసము అనంబడును. దర్శే విహితో యాగః దర్శః. అమావాస్యందుఁ జేయఁ బడు యాగము దర్శము. ౧. పౌర్ణమాస్యాం విహితో యాగః పౌ

ర్ణమాసః. పూర్ణిమయందు విహితమైన యాగము పౌర్ణమాసము. ౧.

**శరీరసాదనాపేక్షం నిత్యం యత్కర్మ తద్యమః.**

యమ్యతే చిత్తమనేన యమః. యమ ఉపరమే. దీనిచేత మనస్సు నిలుపఁబడును. ౧. శరీరమాత్రమునే సాధనముగా నపేక్షించుచు యావజ్జీవము చేయఁదగిన సత్యాహింసా సంధ్యాదులు.

**నియమస్తు స యత్కర్మా నిత్య మాగన్తు సాధనమ్,**

నియమ్యతే పురుషో ఽనే నేతి నియమః. యమ ఉపరమే. పురుషుఁడు దీనిచేత నియమింపఁబడును. ౧. శరీరముకంటె బాహ్యములైన మృజ్జలాదులు సాధనముగాఁ గలిగి నిత్యము సేయవలయు నను నిర్బంధము లేని శౌచ తపస్స్వాధ్యాయ దేవతా నమస్కారాదులు. (కొంద ఱిచట "క్షౌరంతు భద్రాకరణం ముండనం వపనం తథా" అనుదానిం జదివెదరు. ఇది లింగాభట్టీయ టీకా సర్వస్వాదులయం దెచ్చటను వ్యాఖ్యాతము కాకుండుటచేఁ బ్రక్షిప్తమని తోఁచుచున్నది).

**ఉపవీతం యజ్ఞసూత్రం ప్రోద్ధృతే దక్షిణే కరే.** 49

ఉపవీయతే వామస్కంధో ఽనేనేతి ఉపవీతం. వ్యేఞ్ సంవరణే. ఎడమ భుజము దీనిచేతఁ గప్పఁబడును. ౧. కుడిచేయి తొడగఁబడుచుండఁగా నెడమభుజముమీఁద నుండు జన్నిదము.

**ప్రాచీనావీత మన్యస్మిన్-**

ఆవీయతే ఆవీతం ప్రాచీనం చ త దావీతం చ ప్రాచీనావీతం. వ్యేఞ్ సంవరణే. ప్రాచీనమై దక్షిణభుజమందుఁ గప్పఁబడునది. ౧. ఎడమ చేయి తొడగఁబడుచుండఁగా కుడి భుజము మీఁద నుండు జన్నిదము.

**నివీతం కణ్ఠలమ్బితమ్,**

నియతం వీయతేస్మ నివీతం. నియతముగాఁగప్పఁబడునది. ౧. కణ్ఠేలమ్బితం. మెడలోఁ బూసలదండవలె వ్రేలాడు జన్నిదము.

**అఙ్గుల్యగ్రే దైవం తీర్థమ్.**

వ్రేళ్లకొనలయందు దేవసంబంధమైన తీర్థ ముండును. దానిచే దేవతర్పణము సేయవలె ననుట. తీర్యతే పాప మనేనేతి తీర్థం. తౄప్లవనతరణయోః. దీనిచేఁ బాపము తరింపఁబడును. దేవానా మిదం దైవం. దేవతల సంబంధమైన తీర్థము.

**స్వల్పాఙ్గుళ్యోర్మూలే కాయమ్.** 50

స్వల్పాంగుళ్యోర్మూలే = చిటికెనవ్రేలు దర్భవ్రేలు వీని మొదట, కాయం = ఋషితీర్థ ముండును. కః ప్రజాపతిర్దేవతా ఽస్యకాయం. పులస్త్యాది ప్రజాపతులు దేవతలుగాఁ గలిగినది. పులస్త్యాదిప్రజాపతులు ఋషులు గనుక ఆ ప్రదేశముల వలననే ఋషితర్పణము సేయవలె ననుట. ౧.

**మధ్యే ఽ ఙ్గుష్ఠాఙ్గుళ్యోః పైత్రమ్ -**

అంగుష్ఠాంగుళ్యోర్మధ్యే = పెద్దవ్రేలు జుట్టనవ్రేళ్ల నడుమ పైత్రం = పిత్ర్యమైన తీర్థముండును. దానిచేత పితృతర్పణము సేయవలెననుట, పితౄణా మిదం పైత్రం. పితృసంబంధమైనది పైత్రము. ౧.

**మూలే హ్యఙ్గుష్ఠస్య బ్రాహ్మమ్,**

అంగుష్ఠస్యమూలే = పెద్దవ్రేలిమొదట, బ్రాహ్మం = బ్రహ్మసంబంధమైన తీర్థ ముండును. బ్రహ్మణ ఇదం బ్రాహ్మం. బ్రహ్మసంబంధమైనది. దానిచేతనే బ్రహ్మతర్పణము సేయవలెననుట. ౧.

**స్యాద్బ్రహ్మభూయం బ్రహ్మత్వం బ్రహ్మసాయుజ్య మిత్యపి.** 51

బ్రహ్మణో భావః బ్రహ్మభూయం, బ్రహ్మత్వం చ. బ్రహ్మమౌట బ్రహ్మ భూయము, బ్రహ్మత్వము. ౧, ౨. సయుక్ సంబంధీ తస్య భావః సాయుజ్యం. బ్రహ్మణః సాయుజ్యం బ్రహ్మసాయుజ్యం. బ్రహ్మమునఁ గలయుట బ్రహ్మ సాయుజ్యము. ఈ 3 బ్రహ్మభావము నొందుట పేళ్లు.

**దేవభూయాదికం తద్వత్ -**

ఈ ప్రకారముగానే దేవభూయము, దేవత్వము, దేవసాయుజ్యము. దేవతలయందుఁ గలియుట పేళ్లు. ఆదిశబ్దముచేత రాజభూయ, రాజత్వ, రాజసాయుజ్యాదులు గ్రహింపఁబడుచున్నవి.

**కృచ్ఛ్రం సాంతపనాదికమ్,**

"త్ర్యహం ప్రాత స్త్ర్యహం సాయంత్ర్యహ మధ్యాదయాచితం, త్ర్యహం పరం చ నాశ్నీయాత్ కృచ్ఛ్రం సాంతపనం స్మృతం" మూఁడు దినములు పగలు భోజనము చేసి, మూఁడు దినములు రాత్రులయందే భోజనము చేసి, మూఁడు దినములు అడుగకవచ్చిన పదార్థమును భుజించి, మూఁడు దినములు కేవలము ఉపవాస ముండిన నా వ్రతము సాంతపనమనంబడును. అది మొదలగు చాంద్రాయణ ప్రాజాపత్యాదులైన

వ్రతములు కృచ్ఛ్ర మనంబడును. సంతపనే భవం సాంతపనం. సంతాపము వలననైనది గనుక సాంతపనము. కృనతి పాప మితీ కృచ్ఛ్రం. కృతీచ్ఛేదనే. పాపమును బోఁగొట్టునది. ౧.

**సంన్యాసవ త్యనశనే పుమాన్ప్రాయః -**

ప్రకృష్ట మేతి పుణ్యలోక మనే నేతి ప్రాయః. అ. పు. ఇణ్ గతౌ. దీనిచేఁ బ్రకృష్టముగాఁ బుణ్యలోకమును బొందుదురు. ౧. 'ప్రాయః' అని సకారాంత నపుంసక మను సందేహము గలుగకుండుటకై 'పుమాన్' అనుట. "ప్రాయోపవేశ నమతిర్నృపతిర్బభూవ" అని రఘువంశమందు అకారాంత ప్రయోగము ఈ ౧ సంగపరిత్యాగము చేసి ప్రాణపరిత్యాగ పర్యంతము ఆహారము లేకుండనుండుట.

**అథ వీరహా.** 52

**నష్టాగ్నిః -**

వీర మగ్నిం హతవాన్ వీరహా. న. పు. హన హింసాగత్యోః. వీరుఁ డనగా నగ్ని. అగ్నిని విడిచినవాఁడు. ౧. నష్టో ఽగ్నిర్యస్యసః నష్టాగ్నిః. ఇ. పు. నష్టమైన యగ్ని గలవాఁడు. ౨. ప్రమాదాదులచే నశించిన యగ్ని గలవానిపేరు. ఉత్సర్గేష్టిఁ జేసి గార్హపత్యాగ్నిని విడిచినవాఁడని కొందఱు.

**కుహనా లోభాన్మిథ్యేర్యా పథకల్పనా.**

లోభాత్ = అన్నాదికాంక్షవలన, మిథ్యేర్యాపథకల్పనా = అసత్యమైన యీర్య యనెడు భిక్షు ధర్మముయొక్క మార్గమును కల్పించుకొనుట కుహన యనంబడును. కుహతీతి కుహనా. కుహ విస్మాపనే మోసపుచ్చునది. ౧. అన్నాదులకొఱకై డంబముగా ధ్యానమౌనవ్రతాదుల ధరించి వేసముతోఁ దిరుగు టక్కరి సన్న్యాసి.

**వ్రాత్య స్సంస్కారహీన స్స్యాత్-**

వ్రాత స్తోమమర్హతీతి వ్రాత్యః. ప్రాయశ్చిత్తార్థమై సమూహమున గూర్ప నర్హమైనవాఁడు. వ్రతం ప్రాయశ్చిత్త మర్హతీతి వ్రాత్యః, వ్రత మనఁగాఁ బ్రాయ శ్చిత్తము. దాని కర్హుఁడైనవాఁడు. ఈ ౧ ఉపనయనాది సంస్కారహీనుఁడైనవాని పేరు.

**అస్వాధ్యాయో నిరాకృతిః.** 53

న విద్యతే స్వాధ్యాయో యస్య సః అస్వాధ్యాయః. వేదాధ్య

యనము లేనివాఁడు. ౧. నిరాక్రియత ఇతి నిరాకృతిః. ఇ. పు. వేదశూన్యుఁడని నిరాకరింపఁబడువాఁడు. ఈ ౨ వేదము చదువనివానిపేళ్లు.

**ధర్మధ్వజే లిఙ్గవృత్తిః -**

ధర్మస్య ధ్వజ శ్చిహ్నం మస్యేతి ధర్మధ్వజీ. న. పు. ధర్మము యొక్క చిహ్నము గలవాఁడు. ౧. లింగం చిహ్నం వీత్తిర్జీవన మస్యేతి లింగవృత్తిః. ఇ. పు. చిహ్నమే జీవనముగాఁ గలవాఁడు. ఈ ౧ దంభార్థమై జటాదిచిహ్నములు ధరించుకొని దానివలన బ్రతుకువానిపేళ్లు.

**అవకీర్ణీ క్షతవ్రతః,**

అవకీర్ణం వ్రత మస్యాస్తీతి అవకీర్ణి. న. పు. కౄ విక్షేపే. జాఱిన వ్రతముగలవాఁడు. ఈ ౧ పరస్త్రీగమనాదులచేత నష్టమైన బ్రహ్మచర్యాది వ్రతము గలవాఁడు.

**సుప్తే యస్మిన్నస్త మేతి సుప్తే యస్మి న్ను దేతి చ.** 54
**అంశుమా నభి నిర్ముక్తాభ్యుదితౌ యథాక్రమమ్,**

యస్మిన్ ద్విజే సుప్తేసతి అంశుమానస్తమేతి, యస్మిన్ ద్విజేసుప్తే సతి అంశుమా నుదేతి చ, తౌ యథాక్రమం అభినిర్ముక్తాభ్యుదిత నామానౌ భవతః. ఏద్విజుఁడు నిద్రపోవుచుండఁగా సూర్యుఁడస్తమించునో ఆ ద్విజుఁడు 'అభినిర్ముక్తుఁ' డనంబడును. ఏద్విజుఁడు నిద్రపోవుచుండఁగా సూర్యుఁడు ఉదయించునో వాఁడు 'అభ్యుదితుఁ' డనంబడును. యం సుప్త మభిభూయ నిర్మఇ్చతి సూర్య స్సో ఽ భినిర్ముక్తః. ఏ నిద్రించువాని తిరస్కరించి సూర్యుఁడ స్తమించునో వాఁడు అభినిర్ముక్తుఁడు. ౧. యం సుప్తమభిభూయ ఉదేతి సూర్యః సో ఽ భ్యుదితః. ఎవ్వని దిరస్కరించి సూర్యుఁడుదయించునో వాఁ డభ్యుదితుఁడు.

**పరివేత్తానుజో ఽ నూఢే జ్యేష్ఠే దారపరిగ్రహాత్.** 55

జ్యేష్ఠ అనూఢే = తోడఁబుట్టిన యన్న పెండ్లాడకుండఁగా, అనుజః = తమ్ముఁడు, దారపరిగ్రహాత్ = పెండ్లాడుటవలన, పరివేత్తా = పరివేత్తయనంబడును. పరిత్యజ్య జ్యేష్ఠం వధూం విందతీతి పరివేత్తా. ఋ. పు. విద్ ఌలాభే. అన్నను విడిచి అనఁగా అన్నకంటె ముందుగా పెండ్లాడిన వాఁడు. ౧.

**పరివిత్తి స్తు తజ్జ్యాయాన్.**

పరివృత్త్యతే శ్రాద్ధాదౌ పరివిత్తిః. ఇ. పు. శ్రాద్ధాదులయందుఁ బరిత్యజింపఁ బడువాఁడు. పరిత్యజ్య యం వధూం విందతి యస్య అనుజః పరివిత్తిః. ఎవని విడచి తమ్ముఁడు పెండ్లాడునో వాఁడు పరివిత్తి. అన్నను విడిచి పెండ్లాడినవాని యాయన్న పేరు.

**వివా హోపయమౌ సమౌ,**

**తథా పరిణయోద్వాహోపయామాః పాణిపీడనమ్.** 56

విశేషేణ వహనం వివాహః. ౧. వహ ప్రాపణే. ఉపయమనం ఉపయమః. ౨. పరిణయనం పరిణయః. ణీఞ్ ప్రాపణే. ౩. ఉద్వహనం ఉద్వాహః. వహ ప్రాపణే. ౪. ఉపయమనం ఉపయామః. యమ ఉపరమే. ౫. వరపాణినా వధూపాణేః పీడనం గ్రహణం పాణీపీడనం. వరుని హస్తముచేత వధూహస్తమును బట్టుట పాణీపీడనము. ఈ ౬ పెండ్లి పేళ్లు.

**వ్యవాయో గ్రామ్యధర్మో మైథునం నిధువనం రతమ్,**

వ్యవాయనం వ్యవాయః. ఇణ్ గతౌ–స్త్రీని బొందుట వ్యవాయము. ౧. గ్రామ్యాణాం పామరాణాం ధర్మో గ్రామ్యధర్మః–గ్రామ్యజనుల ధర్మము. ౨. మిథున స్యేదం మైథునం. మిథున సంబంధమైనది. ౩. నిధూయంతే అఙ్గాన్యత్రేతి నిధువనం. ధూఞ్ కంపనే. దీనియందు అంగములు కదలును. ౪. రమణం రతం. రము క్రీడాయాం. రమించుట. ఈ ౫ స్త్రీసంగము పేళ్లు.

**త్రివర్గో ధర్మ కామార్థైః -**

త్రయాణాంవర్గః త్రివర్గః. ధర్మ కామార్థములయొక్క సమూహము త్రివర్గము. ౧. ధర్మ కామార్థములు మూఁడును.

**చతుర్వర్గ స్సమోక్షకైః.** 57

చతుర్ణాం వర్గః చతుర్వర్గః. ధర్మార్థకామ మోక్షములను నాలిగింటియొక్క సమూహము చతుర్వర్గము. ౧. మోక్షముతోఁ గూడిన యా ధర్మ కామార్థములు చతుర్వర్గ మనంబడును.

**సబలై స్తై శ్చతుర్భద్రమ్-**

చతుర్ణాం భద్రాణాం సమూహ శ్చతుర్భద్రం. శుభస్వరూపములైన నాలిగింటికూటమి చతుర్భద్రము. ౧. తుల్యబలములైన యీధర్మార్థ కామ మోక్షములు చతుర్భద్ర మనంబడును.

**జన్యా స్స్నిగ్ధా వరస్య యే,**

జనీం వధూం వరం నయంతీతి జన్యాః. పు. వరుని, కన్యను గూర్చువారు జన్యలు. ఈ ౧ పెండ్లికొడుకు చెలికాండ్ర పేరు.

# క్షత్త్ర వర్గము

**మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్త్రియో విరాట్,**

రాజ్యారోపణకాలే మూర్ధ్ని అభిషిక్తో మూర్ధాభిషిక్తః ప్రథమః క్షత్త్రియః. తత్ప్రభవతయా అనభిషిక్తా అపి మూర్ధాభిషిక్తాఖ్యాః. యథా బ్రహ్మబాహుజస్య వంశ్యా బాహుజా స్తథై వేతి జ్ఞేయం. రాజ్యమున బట్టముఁ గట్టునప్పుడు శిరస్సున నభిషేకము చేయఁబడు పట్టభద్రుఁడు మూర్ధాభిషిక్తుఁడు. ఇది ఆ వంశమందుఁ బుట్టిన మూర్ధాభిషిక్తుఁడు కాని క్షత్త్రియమాత్రునియందును వర్తించును. ఏప్రకారముగా బ్రహ్మ బాహుజుని వంశమందుఁ బుట్టినవారు బాహుజు లనంబడుదురో, అలాగుననేయని తెలియఁదగినది. ౧. రాజ్ఞ క్షత్త్రియ స్యాపత్యం పుమాన్ రాజన్యః. జనీ ప్రాదుర్భావే. రాజుయొక్క అపత్యము రాజన్యుఁడు. ౨. బ్రహ్మణః బాహ్వోర్జాతః బాహుజః. బ్రహ్మయొక్క బాహువులయందుఁ బుట్టినవాడు. ౩. క్షతాత్త్రాయతే క్షత్త్రః తస్యాపత్యం క్షత్త్రియః. క్షతమువలన రక్షించువాఁడు గనుక క్షత్త్రుఁడు రాజు. వాని యపత్యము గనుక క్షత్రియుఁడు. ౪. విరాజతే విరాట్. జ. పు. రాజృ దీప్తౌ. విశేషముగాఁ బ్రకాశించువాఁడు. ఈ ౫ క్షత్త్రియుని పేళ్లు.

**రాజ్ఞి రాట్పార్థివ క్ష్మాభృన్నృప భూప మహీక్షితః.** 1

ప్రజాః రంజయతీతి రాజా. న. పు. రాజృదీప్తౌ. ప్రజలను రంజింపఁ జేయువాఁడు. ౧. రాజతే రాట్. జ. పు. ప్రకాశించువాఁడు. ౨. పృథి వ్యా ఈశ్వరః పార్థివః. భూమికిఁ బ్రభువు. ౩. క్ష్మాం భువం బిభ ర్తీతి క్ష్మాభృత్ త. పు. భృఞ్ భరణే. భూమిని భరించువాఁడు. ౪. నౄన్ పాతీతి నృపః. పా రక్షణే. నరులను బాలించువాఁడు. ౫. భువం పాతీతి భూపః. భూమిని బాలించువాఁడు. ౬. మహీంక్షియతి అధివసతి మహీక్షిత్. త. పు. క్షి నివాసగత్యోః భూమి నధివసించినవాఁడు. ౭. (క్షత్రియుఁడైనను కాకపోయినను) జనులను భూమిని రక్షించువాని పేళ్లు.

**రాజా తు ప్రణతాశేష సామన్తస్స్యా దధీశ్వరః,**

సంసక్త స్సమంతా త్సంలగ్నః అంతౌ యస్యాస్సా సామంతా స్వవిషయా దనంతరా భూమిః. సమంతాయా ఇమేసామంతాః. తన దేశము పొలిమేరను దగిలియుండు భూమి సమంత. దానికి రాజులైనవారు సామంతులు. అనఁగా తన దేశము చుట్టు నుండు రాజులు. నమస్కరింపఁబడిన సామంతులు గలరాజు అధీశ్వరుఁ డనంబడును. అధి = సర్వసామంతానాముపరి ఈష్టే అధీశ్వరః. ఈశ ఐశ్వర్యే. సర్వసామంతుల మీఁద నైశ్వర్యయుక్తుఁడైనవాఁడు. ౧. తన చుట్టుపట్ల రాజులను వశము చేసికొన్న వానిపేరు.

**చక్రవర్తీ సార్వభౌమః -**

చక్రం రాష్ట్రం స్వామిత్వేన వర్తయతీతి చక్రవర్తీ. న. పు. వృతువర్తనే. స్వామిత్వము చేత భూచక్రమును వర్తింపఁజేయువాఁడు. ౧ సర్వభూమే రీశ్వరః సార్వభౌమః. సమస్త భూమికి నీశ్వరుఁడు. ఈ ౨ చక్రవర్తి సార్వభౌమ శబ్దములు సమస్తమైన భూమి నేలు రాజుపేళ్లు.

**నృషో ఒ న్యో మణ్డలేశ్వరః.** 2

సార్వభౌమునికంటె నన్యుఁడైన కొంతభూమి నేలెడువాఁడు మండలేశ్వరుఁ డనఁబడును. అన్యో నృపః మండలేశ్వర ఇత్యుచ్యతే. మండల స్యేశ్వరో మండలేశ్వర. కొంత భూఖండము నేలువాఁడు.

**యేనేష్టం రాజసూయేన మణ్డలస్యేశ్వరశ్చ యః,**
**శాస్తియ శ్చాజ్ఞయా రాజ్ఞ స్స సమ్రాట్**

యేన రాజ్ఞా రాజసూయనామ్నా యాగేన ఇష్టం యో రాజా మండలస్య హిమవత్సేతుమధ్యే సహస్ర యోజన పరిమాణస్య భూమండలస్య (ద్వాదశ రాజమణ్డలస్య) ఈశ్వరః పాలయితా యశ్చ రాజ్ఞః హిమవత్సము ద్రాభ్యన్తర వర్తినో నృపాః శాస్తి విధేయీకరోతి. ఏతే త్రయ స్సమ్రాట్ఛబ్దవాచ్యా ఇతి కేచిత్. పూర్వోక్త ధర్మత్రయ విశిష్ట ఏక ఏవరాజా సమ్రాడితి కేచిత్. రాజసూయ యాగము చేసినవాఁడును, హిమవత్సేతు మధ్యమందుఁగల సహస్రయోజన పరిమితమైన సకల భూమండలమునకు (ద్వాదశరాజమండలమునకు) నీశ్వరుఁడైవాఁడును, హిమవత్సేతు మధ్య మందలి రాజులను దన యాజ్ఞచేత వశపఱచకొను వాఁడును ఈ మూఁడు విధములవారును సమ్రాట్టులనంబడుదురని కొందఱు.

ఈ మూడు విధములు గలిగిన యొకఁడే సమ్రాట్టని కొందఱు. ప్రేత్య దేవేషు ఇహ చ అతివిలక్షణతయా రాజసు మధ్యే సమ్యక్ రాజత ఇతి సమ్రాట్. జ. పు. రాజృ దీప్తౌ. స్వర్గస్థుఁడై దేవతలయందును పుడమిని రాజులయందును లెస్సగాఁ బ్రకాశించువాఁడు. ౧.

**అథ రాజకమ్.** 3

**రాజన్యకం చ నృపతి క్షత్త్రియాణాం గణే క్రమాత్,**

రాజ్ఞాం సమూహో రాజకం. రాజులయొక్క సమూహము. ౧. రాజన్యానాం సమూహో రాజన్యకం. క్షత్రియులయొక్క సమూహము. ౧. రాజక రాజన్య శబ్దములు వరుసగా ప్రజల నేలెడు రాజుల సమూహమునకును, క్షత్రియజాతివారి సమూహమునకును పేళ్లు.

**మన్త్రీ ధీ సచివో ఽ మాత్యః-**

మన్త్రో గుప్తవాదః, ఇతి కర్తవ్యతాధారణం వా. సో ఽ స్యాస్తీతి మన్త్రీ. న. పు. మన్త్ర మనఁగా రహస్యవాదము, లేక ఇది సేయఁదగినది యను నిశ్చయము. అది గలవాఁడు. ౧. ధీయా సచతి సమవేతి ధీ సచిసః. షచ సమవాయే. బుద్ధితోఁ గూడియుండువాఁడు. ౨. అమాశబ్దస్సహార్థే నిపాతః అమా మంత్రేణ సహ వర్తత ఇతి అమాత్యః. మంత్రముతోఁగూడియుండువాఁడు. ఈ 3 ఆలోచన సెప్పు మంత్రి పేళ్లు.

**అన్యే కర్మ సచివాస్తతః.** 4

తతో ఽన్యే = ఆ ధీ సచివునికంటె నన్యులై చిల్లరపనులయందు నియుక్తులైన వారు, కర్మసచివాః = కర్మసచివు లనంబడుదురు. కర్మసచంతీతి కర్మసచివాః అ. పు. పచ సమవాయే. చిల్లరపనులయందుఁ జేరువారు.

**మహామాత్రాః ప్రధానాని -**

మహానతిమాత్రః పరిచ్ఛదః యేషాం తే మహామాత్రాః. అ. పు. అధికమైన సేన గలవారు. ౧. ప్రథంతే ప్రధానాని. ప్రథ ప్రఖ్యానే. ప్రకృష్టముగా భరించువారు. రూపభేదమున నపుంసకము. పుంలింగముం గలదు. “మహామాత్రః ప్రధానస్స్యాత్” అని పుంస్కాండమందు వోపాలితుఁడు. ౨. ఉత్కృష్టులు హీనులుంగాక మధ్యమాధి కారముల యందు వ్యవస్థితులైన దళవాయి మొదలయినవారి పేళ్లు.

**పురోధాస్తు పురోహితః,**

శాంతిక పౌష్టికాది కర్మసు పురో ధీయత ఇతి పురోధాః. స. పు. పురోహితశ్చ. డు ధాఞ్ ధారణ పోషణయోః. శాంతికపౌష్టికాది క్రియల యందు ముందర నుంచఁబడువాఁడు. ఈ ౧ పురోహితుని పేళ్లు.

**ద్రష్టరి వ్యవహారాణాం ప్రాడ్వివాకాక్ష దర్శకౌ.** 5

ధర్మాధర్మౌ పృచ్ఛతీతిప్రాట్. వివక్తీతి వివాకః. ప్రాట్చాసౌవివాకశ్చ ప్రాడ్వివాకః. ప్రచ్ఛజ్ఞీప్సాయాం, వచ పరిభాషణే. వ్యవహారముల నడిగి విచారించి పలుకువాఁడు. ౧. అక్షా౯ వ్యవహారా౯ పశ్యతీతి అక్షదర్శకః. దృశిర్ ప్రేక్షణే. వ్యవహారములను జూచువాఁడు. తదుక్తం___ "వివాదానుగతం పృష్ట్వా పూర్వం వాక్యం ప్రయత్నతష్వాః, విచారయతి యేనాసౌ ప్రాడ్వివాక స్తతః స్మృతః" ఇతి. ఈ ౨ ఋణాదానము, దాయము మొదలైన వ్యవహారములను విచారించు ధర్మాధికారి పేళ్లు.

**ప్రతీహారే ద్వారపాల ద్వార్థ్స ద్వార్థిత దర్శికాః,**

ప్రతిహరతి నూతనజనా౯ ప్రతీహారః. నూతన జనులను పరిహరించువాఁడు. ౧. ద్వారం పాలయతీతి ద్వారపాలః. పాల రక్షణే వాకిలిని గాచియుండువాఁడు. ౨. ద్వారి తిష్ఠతీతి ద్వార్థ్సః, ద్వార్థితశ్చ. ష్ఠా గతి నివృత్తౌ. ద్వారమందుండువాఁడు ద్వార్థ్సుఁడు, ద్వార్థితుఁడు. ౩, ౪. దర్శయతి జనా౯ దర్శికః. జనులను రాజునకుఁ జూపించువాఁడు. ౫. వాకిట నున్న వారిని రాజునకుఁ జూపించువాఁడు గనుక ద్వార్థిత దర్శకుండని యొకపేరని కొందఱు. ఈ ౬ వాకిటికావలివాని పేళ్లు.

**రక్షివర్గ స్త్వనీకస్థః -**

రక్షిణాం వర్గో రక్షివర్గః. రక్షకులయొక్క సమూహము ౧. అనీకేన బృందేన తిష్ఠతీతి అనీకస్థః. మూఁకతోఁ గూడియుండునది. ఈ ౨ అంగరక్షకులయొక్క సమూహము పేళ్లు.

**అథాధ్యక్షాధికృతౌ సమౌ.** 6

అధ్యుపరి అక్ష్ణోతి అధ్యక్షః. అక్షూ వ్యాప్తౌ. అందఱిమీఁదను వ్యాపించువాఁడు. ౧. అధిక్రియతే ఉపరి నియుజ్యతేస్మ అధికృతః. డు కృఞ్ కరణే. అందఱిమీఁద నియోగింపఁబడినవాఁడు. అధికారం కరోతీతి అధికృతః. అధికారముఁ జేయువాఁడు. ఈ ౨ సామాన్యముగా నెందైన నొకదానియం దధికారము గలవాని పేళ్లు.

**స్థాయుకో ఽ ధికృతో గ్రామే-**

గ్రామే స్థాతుం శీల మస్యేతి స్థాయుకః. గ్రామమం దుండునట్టి స్వభావము గలవాఁడు. ఈ ౧ ఒకగ్రామ మందధికారము గలవాఁడు.

**గోపో గ్రామేషు భూరిషు.**

గాం భూమిం పాతీతి గోపః. పా రక్షణే. భూమిని బాలించువాఁడు. ఈ ౧ అనేక గ్రామములయం దధికారము గలవాఁడు.

**భౌరికః కనకాధ్యక్షః-**

భూరి సువర్ణం పాలయతీతి భౌరికః. భూరి యనఁగా బంగారు. దానిఁ బాలించువాఁడు. "భూరి ప్రాజ్య సువర్ణయో" రితి ధరణిః. ఈ ౧ బంగారుమునం దధికారము గలవాని పేరు.

**రూప్యాధ్యక్షస్తు నైష్కికః.** 7

ప్రశస్తం రూప మత్రేతి రూప్యం ఆహతస్వర్ణరజతే రజితంచ, తస్య అధ్యక్షః రూప్యాధ్యక్షః. రూప్యమనఁగా కరగించి యచ్చుపోసిన వెండిబంగారు నాణెములను అచ్చుపు వెండియు; వానికి అధికారి. నిష్కేహేమ్ని నియుక్తః నైష్కికః. బంగారమందు నియోగింపఁబడినవాఁడు. టంకసాల యధికారి పేళ్లు.

**అన్తఃపురే త్వధికృత స్స్యాదన్తర్వంశికో జనః,**

అన్తః అభ్యన్తరో వంశో గృహం తస్మిన్ నియుక్తః అంతర్వం శికః అన్తఃపురే అధికృతః. ఈ ౧ అంతఃపురాధికారి పేరు.

**సౌవిదల్లాః కఞ్చుకిన స్థాపత్యా స్సౌవిదాశ్చ తే.** 8

సుష్ఠు వేత్తీతి సువిత్–రసికః. తం లాన్తి వల్లభత్వేన స్వీకుర్వన్తీతి సువిదల్లాః స్త్రియః. తాః పాలయన్తీతి సౌవిదల్లాః. లెస్సగా నెఱిఁగినవానిఁ దమకు నాయకునిఁగా స్వీకరించువారు గనుక సువిదల్లనఁగా స్త్రీలు; వారిని గాచుకొనియుండువారు సౌవిదల్లులు. ౧. కంచుకాస్సన్తి వినీతవేషార్థం ఏషా మితి కంచుకినః. న. పు. వినీతవేషార్థమై కుబుసము గలవారు. ౨. స్త్రీణాం వ్యవస్థాం స్థాపయ న్తీతి స్థాపత్యాః స్త్రీల వ్యవస్థను నిలపువారు. ౩. సుష్ఠు విదన్తీతి సువిదః ప్రగల్భాః స్త్రియః; తాః రక్షన్తీతి సౌవిదాః. లెస్సగా నెఱుంగువారు గనుక సువిద

లనగా ప్రౌఢస్త్రీలు; వారిని గాచువారు. ఈ ४ అంతఃపురమందలి కావలి వారల పేళ్లు.

**షణ్డో వర్షవర స్తుల్యౌ -**

శామ్యతి శిశ్నాభావాత్ షణ్డః. శిశ్నము లేనందున లొంగియుండువాఁడు. వర్షం రేతస్సేకం వృణోతీతి వర్షవరః. వృఞ్ వరణే. రేతస్సేకము నాచ్ఛాదించువాఁడు. వర్షస్య రేతఃపాతస్య వరః వర్షవరః. రేతః పాతము గోరువాఁడు తదుక్తం. "యే త్వల్పసత్త్వాః ప్రథమాః క్లీబాశ్చ స్త్రీ స్వభావినః, జాత్యా న దుష్టాః కార్యేషు తేవై వర్షవరాః స్మృతాః"ఇతి. ఈ ౨ అంతఃపురపాలకు లయిన యెగ్గళ్లపేళ్లు. ఎగ్గళ్లనఁగా వృషణ హీనులుగాని యన్యులుగాని స్త్రీ స్వభావము గలవారు నపుంసకులు.

**సేవ కార్థ్యను జీవినః,**

సేవతే సేవకః. షేవృ సేవనే. సేవించువాఁడు. ౧. అర్థనమర్థః. సో ౽ స్యాస్తీతి అర్థీ. న. పు. అడుగుట గలవాఁడు. ౨. ప్రభుమనుసృత్య జీవతీతి అనుజీవీ. న. పు. ప్రభువు ననుసరించి బ్రతుకువాఁడు. ౩. కొలువువాఁడు.

**విషయాన న్తరో రాజా శత్రుర్మిత్ర మతఃపరమ్.** 9

**ఉదాసీనః పరతరః -**

సమన్తతః మణ్డలీభూతస్య స్వదేశస్య భూమ్యనన్తరో రాజా శత్రుః. ఏకార్థాభినివేశాత్. తతఃపరం భూమ్యేకాన్తరితో రాజామిత్త్రం. ఉపకారిత్వాత్. శత్రుదేశాత్పరతః బలాధికో యో రాజా ఉపకారాపకారౌ వకరోతి స ఉదాసీనః. ఒకరాజునకు తన దేశమున కంటె నావల దేశమున నుండెడు రాజు శత్రువు. సదా బాధ యొనర్చువాఁడు. ఆ శత్రు దేశమునకంటె నావలిదేశమందుంఁడురాజు సహాయము చేయువాఁడు. గనుక మిత్రుఁడు. ఆ మిత్రుని దేశమున కావలిదేశమున నుండు రాజు ఉపకారాపకారములు చేయనివాఁ డౌటవలన నుదాసీనుఁడు. శాదయతీతి శత్రుః ఉ. పు. శద్ ౹౸ శాతనే. పీడించువాఁడు. ౧. మేదతే స్నిహ్యతీతి మిత్త్రం. ఞి మిదా స్నేహనే. స్నేహయుక్తుఁడైనవాఁడు. ౧. ఊర్ధ్వమాస్తే తిష్ఠతీతి ఉదాసీనః. శత్రుమిత్ర దేశములకు మీఁద నుపకారాపకారములు చేయక యూరకుండువాఁడు. ౧.

**పార్ష్ణిగ్రాహస్తు పృష్ఠతః,**

శత్రు మభియుఞ్జానస్య శత్రుహననాయ విజిగీషోః రాజ్ఞః పార్ష్ణిం పృష్ఠభాగం యో గృహ్ణాతి స పార్ష్ణిగ్రాహః. ఒక్క దిక్కును గెలువఁబోవు రాజునకు వెనుక నుండు శత్రువు పార్ష్ణిగ్రాహుఁ డనంబడును. పార్ష్ణిం గృహ్ణాతి పృష్ఠత స్తిష్ఠతీతి పార్ష్ణిగ్రాహః. గ్రహ ఉపాదానే. వెనుకదిక్కున మడమఁ ద్రొక్కుచు నుండువాఁడు. "సంపన్నస్తు ప్రకృతిభిర్మహోత్సాహః కృతశ్రమః, శత్రుశిక్షణ శీలశ్చ విజిగీషు రితి స్మృతః" ఇతి విజిగీషు లక్షణమ్.

**రిపౌ వైరి సపత్నారి ద్విష ద్ద్వేషణ దుర్హృదః.** 10
**ద్విడ్విపక్షాహితామిత్ర దస్యు శాత్రవ శత్రవః,**
**అభియాతి పరారాతి ప్రత్యర్థి పరిపన్థినః.**
**(భ్రాతృవ్యాసహనద్వేషి జిఘాంసు ప్రత్యనీకినః,**
**అసుహృత్ప్రత్యవస్థాతృ ప్రతిపక్ష విరోధినః.)**

రప త్యపకీర్తిం రిపుః. ఉ. పు. రప లప వ్యక్తాయాం వాచి. అపకీర్తిని బలుకువాఁడు. రేవయతీతి వా రిపుః. రేవృ గతౌ. మూఁకను గూర్చుకొనివచ్చువాఁడు. ౧. వైరమస్యాస్తీతి వైరీ. న. పు. వైరము గలవాఁడు. ౨. సపత్నీవ దుఃఖ హేతుత్వాత్ సపత్నః. సవతివలె దుఃఖహేతువైనవాఁడు. సమానపతిత్వాద్వా సపత్నః. సమానపతిత్వగలవాఁడు. ౩. ఇయర్తి అరిః. ఇ. పు. ఋ గతౌ. యుద్ధార్థమై వచ్చువాఁడు. ౪. ద్వేష్టీతి ద్విషత్. త. పు. ద్వేషణశ్చ. ద్విష అప్రీతౌ. ద్వేషించువాఁడు. ౫, ౬. దుష్టం హృదయమస్య దుర్హృద్. ద. పు. దుష్టమైన హృదయము గలవాఁడు. ౭. ద్వేష్టి ద్విట్. ష. పు. ద్వేషించువాఁడు. ౮. విరుద్ధః పక్షో ౽స్యేతి విపక్షః. విరుద్ధమైన పక్షము గలవాడు. ౯. న హితః అహితః. హితుఁడు గానివాఁడు. ౧౦. న మిత్రం అమిత్రః. మిత్రుఁడు గానివాఁడు. ౧౧. దస్యతి ఉపక్షయం కరోతీతి దస్యుః. ఉ.పు. దసు ఉపక్షయే. ఉపక్షయమును జేయువాఁడు. ౧౨. శాదయతీతి శత్రుః. ఉ. పు. శత్రురేవ శాత్రవః శద్ ఌశాతనే. కృశముగాఁ జేయువాఁడు శత్రువు. శత్రువే శాత్రవుఁడు. ౧౩. ౧౪. అభి అభిముఖం యాతీతి అభియాతిః. ఇ. పు. యా ప్రాపణే. అభిముఖమై వచ్చువాఁడు.

పా. అభిమన్యతే శత్రురిత్యేవ అభామానీ. న. పు. మన జ్ఞానే. శత్రువని తలఁపఁబడువాఁడు. పా అభిముఖం హన్తీతి అభిఘాతీ. న.పు. అభిముఖముగాఁ జంపువాఁడు. ౧౫. ప్రియతే హన్తుమితి పరః. పృజ్ వ్యాయామే. హింసించుటకై తిరుగువాఁడు. ౧౬. ఇయర్తి ఆరాతిః. ఇ. పు. ఋ గతౌ. సంహరించువాఁడు. ౧౭. ప్రతికూలమర్థయతే ప్రత్యర్థీ. న. పు. ప్రతికూలముగాఁ గోరువాఁడు. ౧౮. పరిపంథయతీతి పరిపంథీ. న. పు. బంధించువాఁడు. ఈ ౧౯ శత్రువు పేళ్లు.

**స్నిగ్ధో వయస్య స్సవయాః**

స్నిహ్యతీతి స్నిగ్ధః. ష్ణిహ ప్రీతౌ. స్నేహించువాఁడు. ౧. వయసాతుల్యో వయస్యః. వయస్సుచేత సమానుఁడైనవాఁడు. ౨. సమానం వయో యస్య సః సవయాః. స. పు. సరియైన వయస్సు గలవాఁడు. ౩. సమాన వయస్సు గల చెలికాని పేళ్లు.

**అథ మిత్రం సఖా సుహృత్,**

మేద్యతీతి మిత్రం. ఞి మిదా స్నేహనే. స్నేహించువాఁడు. ౧. సమానః ఖ్యాతః సఖా. ఇ. పు. ఖ్యా ప్రకథనే. సమానముగాఁ బలుకఁబడినవాఁడు. ౨. శోభనం హృదయమస్యేతి సుహృద్. ద. పు. మంచి హృదయము గలవాఁడు. ౩. స్వభావముననే స్నేహితుఁడైనవాని పేళ్లు.

**సఖ్యం సాప్తపదీనం స్యాత్ -**

సఖ్యుః భావః సఖ్యం. సఖునియొక్క భావము సఖ్యము. ౧. సప్తభిః పదైః ప్రాప్యతే సాప్తపదీనం. ఏడడుగు (ఏడుమాట) లచేతఁ బొందఁబడునది. ఈ ౧ చెలిమి పేళ్లు.

**అనురోధో ఽనువర్తనమ్.** 12

అనురోధనం అనురోధః. రుధిర్ ఆవరణే. అనుకూలముగాఁ దిరుగుట. ౧. అనుకూలం వర్తనం అనువర్తనం. వృతువర్తనే. అనుకూలముగా వర్తించుట. ఈ ౨ పూజ్యులు మొదలగువారికి ననుకూలముగా నుండి సాయపడుట పేళ్లు.

**యథార్హవర్ణః ప్రణిధి రపసర్ప శ్చరః స్పశః,**
**చారశ్చ గూఢపురుషశ్చ -**

యథార్హో యోగ్యో వర్ణః ప్రకారో ఽస్యాస్తీతి యథార్హ వర్ణః.

యేన ప్రకారణ పరచక్రం జ్ఞాతుం శక్నోతి తత్ప్రకారవా నిత్యర్థః. ఏ ప్రకారమున పరచక్ర మెఱుఁగ నలవి యగునో అట్టి ప్రకారముగలవాఁడు. ౧. ప్రకర్షేణ నిధీయతే జ్ఞేయమస్మిన్నితి ప్రణిధిః. ఇ. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః. ఎఱుఁగఁదగిన వస్తువు వీనియందు ధరింపఁబడును. ౨. అపకృష్టం సర్పతీ త్యపసర్పః. సృప్ ౹గతౌ. ప్రచ్ఛన్నుఁడు గాఁ దిరుగువాఁడు. ౩. చరతీతి చరః చర గతౌ. చరించువాఁడు. ౪. స్పశతి బాధ తేపరానితి స్పశః. తాలవ్యాంతో రేఫశూన్యశ్చ. స్పశ బాధన స్పర్శనయోః. పరులను బాధించువాఁడు. ౫. చరతి జానాతి పరబలమితి చారః. చర గతౌ. గత్యర్థత్వాత్ జ్ఞానార్థత్వం. పరబలము నెఱిఁగినవాఁడు. ౬. గూఢశ్చాసౌ పురుషశ్చ గూఢ పురుషః. గూఢమైన పురుషుఁడు. ఈ ౭ వేఁగులవాని పేళ్లు. మొదటి ౨ వణిక్కృషీవల భిక్షుకాది రూపముగల చారుఁడని కొందఱు.

**ఆప్తప్రత్యయితౌ సమౌ.** 13

ఆప్నోతి రహస్య మిత్యాప్తః. ఆప్ ౹వ్యాప్తౌ. రహస్యమును బొందువాఁడు. ౧. పు.ప. త్రి. ప్రత్య విశ్వాసో ౭స్య సంజాతః. ప్రత్యయితః. విశ్వాసము ఇతనియందుఁ బుట్టును. ఈ ౨ ఆప్తునిపేళ్లు.

**సాంవత్సరో జ్యౌతిషికో దైవజ్ఞ గణకావపి,**
**స్యుర్మౌహూర్తిక మౌహూర్త జ్ఞాని కార్తాంతికా అపి.** 14

సంవత్సర కాలం వేత్తీతి సాంవత్సరః. కాలము నెఱిఁగినవాఁడు. ౧. జ్యోతీంషి నక్షత్రాణ్యధికృత్య కృతో గ్రంథో జ్యోతిషం; తద్వేత్తీతి జ్యౌతిషికః. (ఔ కారాది.) జ్యోతిస్సు లనఁగా నక్షత్రములు. వాని నధికరించి చేయఁబడిన గ్రంథము జ్యోతిషము. దాని నెఱిఁగినవాఁడు. ౨. దైవం శుభాశుభం జానాతీతి దైవజ్ఞః. జ్ఞా అవబోధనే. దైవమనఁగా శుభాశుభములు; దాని నెఱిఁగినవాఁడు. ౩. గణయతి కాలం గణకః. గణ సుఖ్యానే. కాలమును లెక్కఁబెట్టువాఁడు. ౪. ముహూర్తం కాలం వేత్తీతి మౌహూర్తికో మౌహూర్తశ్చ. ముహూర్తము నెఱిఁగినవాఁడు. ౫, ౬. జ్ఞానమస్యాస్తీతి జ్ఞానీ. న. పు. కాలజ్ఞానము గలవాఁడు. ౭. కృతాన్తో దైవం. తద్వేత్తీతి కార్తాన్తికః కృతాంత మనఁగా దైవము; దాని నెఱిఁగినవాఁడు. ఈ ౮ జోస్యుని పేళ్లు.

**తాన్త్రికో జ్ఞాతసిద్ధాన్తః -**

తన్యతే అనేన మతధర్మ ఇతి తన్త్రం తద్వేదీ తాంత్రికః. దీనిచేత మతధర్మము విస్తరింపఁబడును. గనుక తన్త్రము; దాని నెఱిఁగినవాఁడు తాంత్రికుఁడు. ౧. జ్ఞాతస్సిద్ధాంతో ఽ నేనేతి జ్ఞాతసిద్ధాంతః. ఎఱుఁగఁబడిన సిద్ధాంతము గలవాఁడు. ఏదైన నొక శాస్త్రతత్త్వము నెఱిఁగినవానిపేళ్లు.

**సత్త్రీ గృహపతిస్సమౌ,**

సత్త్రం సదాదానమస్యాస్తీతి సత్త్రీ. న. పు. సత్త్రమనగా సదా దానము; అది గలిగినాఁడు. "సత్రం యజ్ఞే సదా దానే ఛాదనారణ్య యోరపి" అని ధరణి. ౧. గృహస్య పతిః గృహపతిః. గృహమునకుఁ బ్రభువు. ఈ ౨ సదా దానము చేయువాని పేళ్లు.

**లిపికారో ఽ క్షరచణో ఽ క్షరచుఞ్చుశ్చ లేఖకే.** 15

లిపిం కరోతీతి లిపికారః. లిపిని జేయువాఁడు. పా. లిపింకరః. లిపికారః. లిపికరః. ౧. అక్షరైః విత్తః అక్షరచణః, అక్షరచుంచుశ్చ. అక్షరములచేతఁ బ్రసిద్ధుఁడు, ౨, ౩. లిఖతీతి లేఖకః. లిఖ అక్షరవిన్యాసే వ్రాయువాఁడు. ఈ ౪ లేఖకుని పేళ్లు.

**లిఖితాక్షర సంస్థానే లిపిర్లిభి రుభే స్త్రియౌ,**

ఇచ్చట లిఖితం అక్షరసంస్థానం అని విభాగించి, ఈ ౪ శబ్దములు లిపికే పేళ్లని కొందఱు. లిఖితాక్షరవిన్యాసే అనుపాఠమందు లిఖితా. లిపిః లిభిః. ఈ 3 ను వ్రాఁతపేళ్లు. లిప్యతే ఽ నయా పత్త్రం లిపిః. లిభిశ్చ. ఇ. సీ. లిపి ఉపదేహే. దీనిచేత పత్రము పూయఁబడును. గనుక లిపి. పా. లిపీ. లిబి. ఈ. సీ. ఈ ౧౨ వ్రాయఁబడిన యక్షరముల యాకారముపేళ్లు (వ్రాఁత).

**స్యా త్సందేశహరో దూతః -**

సందేశం హరతితి సందేశ హరః. సందేశ మనఁగా నోటిమాట. దానిని గొనిపోవువాఁడు. ౧. దూయతే ఽ నేన పర ఇతి దూతః. దూఙ్ పరితాపే–వీనిచేత శత్రువు తపింపఁజేయఁబడును. ౨. దూత పేళ్లు.

**దూత్యం తద్భావ కర్మణోః.** 16

దూతస్య భావః కర్మవా దూత్యం–దూతయొక్క భావము, క్రియయును దూత్యము. పా. దౌత్యం–దూతయొక్క భావమును, కర్మమును.

**అధ్వనీనో ఽ ధ్వగో ఽ ధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి,**

అధ్వానం గచ్ఛతీత్యధ్వనీనః, అధ్వగః, అధ్వన్యశ్చ. పంథా నంగచ్ఛతీతి పాంథః, పథికశ్చ, త్రోవనడచువాఁడు, అధ్వనీనుఁడు, అధ్వగుఁడు, అధ్వన్యుఁడు, పాంథుఁడు, పథికుఁడును. ఈ ౫ తెరువరి పేళ్లు. త్రోవనడుచువాఁడు.

**స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలాని చ.** 17

**రాజ్యాఙ్గాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయో ఽ పి చ,**

స్వామి యనఁగా రాజు; అమాత్యుఁడు మంత్రి; సుహృత్తు చెలికాఁడు; కోశము భండారము; రాష్ట్రము దేశములతోఁ గూడిన పట్టణము; దుర్గము పర్వతోదక వృక్షములచేతఁ బోవ శక్యముగాని పట్టణము; బలము సైన్యము; ఒకఁడు ముఖ్యుఁడుగాఁ గలవారును సజాతీయులునునైన పురజనుల సమూహములు పౌరశ్రేణులు. స్వం విద్యతే అస్యేతి స్వామీ. న. పు. ధనముగలవాఃడు. ౧. అమా సమీపే భవః అమాత్యః. సమీపమందుండువాఁడు. ౧. శోభనం హృదయమస్యేతి సుహృత్. ద. పు. మంచి హృదయము గలవాఁడు. ౧. కూయతే ఉత్కృష్ట ఇతికోశః. కోషమని మూర్ధన్యాంతముగా గొందఱు. కుశబ్దే– ఉత్కృష్టమని పలుకఁబడునది. ౧. రాజత ఇతి రాష్ట్రం–ప్రకాశించునది. ౧. దుఃఖేన గమ్యత ఇతి దుర్గం –ప్రయాసముచేతఁ బొందఁబడునది. ౧. బలన్త్యనేన బలం, బల ప్రాణనే దీనిచేత బ్రదుకుదురు. ౧. ప్రక్రియతే రాజ్యమాభి రితి ప్రకృతయః ఇ. సీ. వీనిచేత రాజ్యము ప్రకృష్టముగాఁ జేయఁబడును. ౧. శ్రయన్తే పరస్పర మితి శ్రేణయః. ఇ. సీ. శ్రిఞ్ సేవాయాం. పౌరాణాం శ్రేణయః పౌరశ్రేణయః. పరస్పరము ఆశ్రయించునవి గనుక శ్రేణులు. పౌరులయొక్క శ్రేణులు పౌరశ్రేణులు. స్వామిన్ శబ్దము మొదలు ౭ ను రాజ్యాంగములనంబడును. ఈ సప్తాంగములే ప్రకృతులనంబడును. పౌరశ్రేణులును ప్రకృతులనంబడును. "అమాత్యాశ్చైవ పౌరాశ్చషడ్భిః ప్రకృతయస్మ్రృతాః" అని కార్యుఁడు.

**సంధి ర్నా విగ్రహోయాన మాసనంద్వైధ మాశ్రయః.** 18

**షడ్గుణాః -**

సంధాన మేకత్వం సంధిః – ఒకటౌట సంధి. అనఁగా శత్రువుతో జేరుట. ఆ సంధి కోశ ప్రధాన హేతుకము, దండ ప్రధాన హేతు

కము, భూమి ప్రధాన హేతుకము. అని మూఁడు విధములు. శత్రుమండల మందు ఆహవోపాధిరూపమైన యపకారము విగ్రహ మనంబడును. అది ప్రకాశయుద్ధము, కూటయుద్ధము, పార్ష్ణి యుద్ధము అని మూఁడు విధములు. స్వశక్త్యాధిక్యము గలిగినప్పుడు గాని పరునికి వ్యసనము గలయప్పుడుగాని పరుని గెలువవలయునను నిచ్ఛచేత కదలిపోవుట యాన మనంబడును. అది విగృహ్యయానము, సంధానయానము, సంభూయయానము, ప్రసంగయానము, ఉపేక్షయానము అని యయిదు విధములు. పరుని కేవలము సంహరింపవలయునని కదలిపోవుట విగృహ్యయానము. పరుని తన వశము జేసికొని ధనదుర్గాదుల గ్రహింపవలయునని పోవుట సంధాన యానము. తనకు శత్రువు గెలుప శక్యముగానివాఁడై యున్నప్పుడు తనకు సమానమైన రాజులను గూర్చుకొని కదలిపోవుట సంభూయయానము. ఒక దిక్కునకు కదలిపోవలసి యుండఁగాఁ బ్రసంగమున మఱియొక దిక్కునకు కదలిపోవుట ప్రసంగయానము. పరుని నేను సంహరింపఁగలను. నన్నుఁ బరుఁడు గెలువలేఁడను బుద్ధిచేత దేశకాలాదులను జూడక కదలిపోవుట ఉపేక్ష్యయానము. దేశకాలాద్యపేక్ష చేత దుర్గాదులను భరించుకొని ప్రయాణ పరాఙ్ముఖుఁడై యుండుట ఆసనము. అదియు మునుపటివలె విగృహ్యాసనాదరూపమున నయిదు విధములు. తన మీఁద నిద్దఱు శత్రువులు దండెత్తి వచ్చినపు డొకనితో సంధిచేసి యొకనితో విరోధపడుట ద్వైధము. బలవంతులైన యిద్దఱు శత్రువులలో నొకనికిఁ దెలియక యొకనితో మంచిమాట లాడుచుండుటయైనను ద్వైధము. "బలినోర్ద్విషతోర్మధ్యే వాచా దానం సమర్పయేత్, ద్వైధీభావేన వర్తేత కాకాక్షి వదలక్షితః" అని మనువు. అశక్తిచేత బలవంతుని ఆశ్రయించుట ఆశ్రయము. బలవంతుఁడైన శత్రువును ధన ప్రదానాదులచేత ఆశ్రయించుటయైనను ఆశ్రయము. రాజ్యమునకు ఉపకారములైన సంధ్యాదులు ౬. గుణములు.

**శక్తయ స్తిస్రః ప్రభా వోత్సాహమన్త్ర జాః,**

శక్యన్తే జేతుం వత్రవో ఉ మీభి రితి శక్తయః. ఇ. సీ. శక్ల్ శక్తౌ – వీనిచేత శత్రువులు గెలువఁబడుదురు. గనుక శక్తులు. కోశదండాదుల వలన వచ్చిన బలము ప్రభావశక్తి. అత్యధికమైన విక్రమచేష్ట ఉత్సాహ

శక్తి. సంధివిగ్రహాదులచేతను సామాదులచేతను యథార్థముగాఁ బ్రయోగించు నెఱుక మంత్రశక్తి ప్రభావమువలనను, ఉత్సాహమువలనను, మంత్రమువలనను బుట్టిన త్రిశక్తులు.

**క్షయః స్థానం చ వృద్ధిశ్చ త్రివర్గో నీతివేదినామ్.** 19

శత్రువ్యాపారాధిక్యము నిమిత్తముగాఁ గల యాత్మాపచయమే క్షయము. స్వోపచయ నిమిత్తమైన పరాచయమే వృద్ధి. ఈరెంటి యొక్క సామ్యము స్థానము "పరకర్మోదయే నేతుః క్షయో వృద్ధి ర్విపర్యయే, తుల్య కర్మఫలే స్థానం కర్మ సుజ్ఞేయ మాత్మన" ఇతి. "కృషి ర్వణిక్పథో దుర్గం సేతుః కుంజరబంధనం, ఖన్యాకరబలాదానం శూన్యానాంచ వివేచనం" అను నీయిష్టవర్గములయొక్క అపచయోపచయ సామ్యములవలన క్షయాది త్రివర్గము గలుగును. ఇతి నీతి వేదులకు త్రివర్గమనంబడును. ఇతరులకు ధర్మార్థకామములు త్రివర్గము.

**స ప్రతాపః ప్రభావశ్చ యత్తేజః కోశ దణ్డజమ్,**

ప్రతపన్త్యనేన శత్రూనితి ప్రతాపః. తప సంతాపే. దీనిచేత శత్రువులను దపింపఁజేయుదురు. ౧. ప్రభవంత్యనేన శాసితుం జగదితి ప్రభావః. దీనిచేత జగత్తు నేలుటకు సమర్థులగుదురు. భండారమువలనను, దండు (గ) ల వలనను గలిగిన తేజస్సు ప్రతాపము, ప్రభావము ననంబడును.

**సామ దానే భేద దణ్డా విత్యుపాయా శ్చతుష్టయమ్.** 20

ఉపైతి వాంఛిత మనే నేత్యుపాయః ఇణ్‌గతౌ. దీనిచేత వాంఛితమును బొందుదురు. ౧. అనుకూలముగా వర్తించుట సామము. అది, పరస్పరోపకారముఁ గనుపింపఁజేయుటయు, మంచితనము సేయుటయు, గుణములను గొని యాడుటయు, చుట్టఱికమును దెలుపుటయు, నేను నీవాఁడనని మంచిమాట లాడుటయునని యైదు విధములు. దానమనఁగా నిచ్చుట; అది తనకుఁగల ధనమంతయు సమర్పించుటయు, ఎక్కడనైన ధనముతీసికొన్న యెడల నందుకు ననుకూలుఁడై సంతోషించుటయు, అపూర్వములైన వస్తువుల నిచ్చుటయు, వీని ధనము పుచ్చుకొనుము అది నీ సొమ్మని యొకని సొమ్ముమీఁదఁ దానే ప్రవర్తింపఁ జేయుటయు, ఋణ ప్రమోచనంబును అని యైదు విధములు. తనమీఁద నిద్దఱు శత్రువులు గూడివచ్చినపుడు, ఒకరినొకరిని వేఱుపఱచుట భేదము. అది ఒకనినొకని

స్నేహము చెఱుచుటయు, పరస్పరము సంఘర్షణము పుట్టించుటయు సంతర్జనము అని మూఁడు విధములు. "స్నేహరాగాపనయనం సంఘర్షోత్పాదనం తథా, సంతర్జనంచ భేదజ్ఞైర్భేదస్తు త్రివిధః స్మృతః" అని పీడించుట దండము. అది చంపుట, ధనమును హరించుట, బాధపెట్టుట అని మూఁడు విధములు. "వధో ఽ ర్థహరణం చైవ పరిక్లేశ స్తథైవచ" అని. "సామ దానం చ భేదశ్చ దణ్డశ్చేతి చతుష్టయం, మాయోపేక్షేంద్రజాలం చ సప్తోపాయాః ప్రకీర్తితా" అని కొందఱి మతమున సప్తోపాయములు గలిగినను మాయోపేక్షలకు దండమందును, ఇంద్రజాలమునకు భేదమందును అంతర్భావము గనుక ప్రత్యేకముగాఁ జెప్పఁ బడలేదు. నామమాత్రమున సామాన్యముగాఁ జెప్పఁబడిన యీ శబ్దములకుఁ బ్రత్యేకముగాఁ బర్యాయములఁ జెప్పుచున్నాడు. నాలుగుపాయముల పేళ్లు.

**సాహసం తు దమో దణ్డః -**

సహో బలం తత్రభవం సాహసం. సహ స్సనఁగాఁ బలము; అందుఁ బుట్టినది. ౧. దమనం దమః. దండశ్చ–శిక్షించుట దమము. దండము. ఈ ౨ దండోపాయము పేళ్లు.

**సామ సాన్త్వమ్ -**

స్యతి వైరం సామ. న. న. షో అన్తకర్మణి. వైరమును జెఱుచునది. ౧. సాంత్వయంత్యనేన సాంత్వం. సాంత్వ సామప్రయోగే. దీని చేత నూరడింతురు. ఈ ౨ సామోపాయము పేళ్లు.

**అథో సమౌ,**

**భేదోపజాపౌ -**

సంహతయోర్భేదనం భేదః. భిదిర్ విదారణే. కూడియున్నవారి నెడఁబాపుట భేదము. ౧. ఉపాంశు జపనం ఉపజాపః. జప వ్యక్తాయాం వాచి. మెల్లగాఁ బలుకుట. ఈ ౨ భేదోపాయము పేళ్లు.

**ఉపధా ధర్మా ద్యైర్యత్పరీక్షణమ్.** 21

ఉపధీయతే శుద్ధి జ్ఞాన మత్ర ఉపధా. డు ధాఞ్ ధారణ పోషణయోః. దీనిచేత శుద్ధిజ్ఞానము గలుగును. ౧. రాజు మంత్రి మొదలగు వారిని ధర్మార్థకామ భయములచేఁ బరిశీలించుట.

**పఞ్చ త్రిషు-**

ఇఁకమీఁద నిశ్శలాక శబ్దపర్యంతము ౫ శబ్దములు త్రిలింగములు.

**అషడక్షీణో య స్తృతీయాద్య గోచరః,**

న విద్యంతే షడక్షీణి యస్మిన్నితి అషడక్షీణః–దీనియం దాఱు కన్నులు లేవు. షడక్షాణి శ్రోత్రాదీంద్రియాణి న విద్యంతే ఽ స్మిన్నితి ఆషడక్షీణః. ఆఱుచెవులుగాని యితరేంద్రియములుగాని దీనియందు లేవు గనుక ఆషడక్షీణము. ౧. మూఁడవ వానికిఁ దెలియక యిద్దఱాడుకొనునట్టి యేకాంతము.

**వివిక్త విజనచ్ఛన్న నిశ్శలాకా స్తథా రహః.** 22

**రహశ్చో పాంశు చాలిఙ్గే –**

వివిచ్యతే పృథక్ నీయతే వివిక్తః. విచిర్ పృథగ్భాగే. వేఱుపఱచఁబడునది. ౧. విగతో జనో ఽ స్మాదితి విజనః–జనులు లేనిది. ౨. ఛాద్యతే గోప్యతేఛన్నః. ఛద అపవారణే. గుప్తముచేయఁబడునది. ౩. నిర్గతాశ్శలాకాశ్శారికా అస్తిన్నితికా నిశ్శలాకః. శలాకము లనఁగా గొరవంకలు; అవిగూడ లేనిది 'శన్యశ్శా విట్ఛలాకా స్యాచ్ఛా రామదనశారికా' అని తాలవ్యాదులయందు రభసుఁడు. ౪. రహ్యంతే అనుపయోగినో జనా అత్రేతి రహః. స. వ. రహ త్యాగే. అనుపయుక్తులైన జనులు దీనియందు విడువఁబడుదురు. రమంతే ఽ త్రేతి వా రహః. రము క్రీడాయాం. దీనియందు రమింతురు. ౫. రహః అవ్యయము. ౬. ఉపాంశు వాక్యం జాత మస్మిన్నితి ఉపాంశు అవ్యయము. మెల్లని మాటలు దీనియందుఁ బుట్టును. ఈ ౭ ఏకాంతమునకు నర్హమయిన విజనస్థలము పేళ్లు.

**రహస్యం తద్భవే త్రిషు,**

రహసి భవం రహస్యం. త్రి. ఏకాంతస్థలమందుఁ బుట్టినది. ఈ ౧ అవిజనస్థలమందుఁ బుట్టిన మాట పేరు.

**సమౌ విస్రమ్భ విశ్వాసౌ –**

విస్రంభనం విస్రంభః. స్రమ్భు విశ్వాసే. విశ్వసించుట. ౧. విశ్వసన్త్యనేనేతి విశ్వాసః. శ్వస ప్రాణనే. దీనిచే నూరడిల్లుదురు. ఈ ౨ విశ్వాసము పేళ్లు. నమ్మిక.

**భ్రేషో భ్రంశో యథోచితాత్.** 23

యథోచితా ద్యథాప్రాప్తా ద్ధర్మాత్ భ్రంశ శ్చలనం భ్రేష

ఇత్యుచ్యతే – తనకు నుచితమైన ధర్మమువలనఁ జలించుట భ్రేష మనంబడును. భ్రేషణం భ్రేషః. భ్రేష చలనే. ఈ ౨ చలించుట పేళ్లు.

**అభ్రేష న్యాయ కల్పాస్తు దేశరూపం సమఞ్జసమ్,**

న భ్రేషః అభ్రేషః – చలించకుండుట. ౧. నియతమీయతే న్యాయః. ఇణ్ గతౌ. నియతముగాఁ బొందఁబడునది. ౨. యథోచిత సంకల్పనం కల్పః. కృపూ సామర్థ్యే. యథోచితమై సామర్థ్యము కల్పము. ౨. దిశ్యమానస్యోచితస్య రూపం దేశరూపం–తన కుచితమైన ధర్మమున కనురూపమైనది దేశరూపము. ౪. సంగత మంజః సమంజసం–సత్యము దీనియందుఁ గూడియుండును. ఈ ౫ తన కుచితమైన ధర్మము వలనఁ జలింపకుండుట పేళ్లు.

**యుక్తమౌపయికం లభ్యం భజమానాభినీతవత్.** 24

**న్యాయ్యం చ త్రిషు షట్ -**

న్యాయేన యుజ్యతే యు క్తం. ఉజిర్ యోగే. న్యాయముతోఁ గూడినది. ౧. ఉపాయ ఏవ ఔపయికం–ఉపాయమే ఔపయికము. ౨. లబ్ధుం యోగ్యం లభ్యం–పొందుటకు యోగ్యమైనది. ౩. న్యాయం భజతే భజమానం. భ సేవాయాం. న్యాయమును బొందునది. ౪. అభినీయతే అభినీతం–అభిముఖముగాఁ బొందింపఁ బడునది. ౫. భజమానాభినీత శబ్దములును యుక్తార్థబోధకములే యని వతిప్రత్యయార్థము. న్యాయాదనపేతం న్యాయ్యం–న్యాయమువలనఁ బాయనది. ఈ ౬ న్యాయముతోఁ గూడినదాని పేళ్లు. ఈ ౬ శబ్దములు త్రిలింగములు.

**సంప్రధారణా తు సమర్థనమ్,**

సంప్రధార్యతే ఇదమేవ శ్రేయ ఇతి నిశ్చీయతే అనయేతి సంప్రధారణా– ఇదియే శ్రేయస్కరమని దీనిచేత నిశ్చయింపఁబడును. యుక్తాయుక్తములయందు నిది యుక్తమని సమర్థించుట.

**అపవాస్తు నిర్దేశో నిదేశ శ్శాసనం చ సః.** 25

**శిష్టి శ్చాజ్ఞా చ -**

అపవదన మపవాదః. పా. అవవాదః. వద వ్యక్తాయాం వాచి. పనిఁబూని చెప్పుట. ౧. నిర్దిశ్యతే ఆదిశ్యతే నిర్దేశః; నిదేశశ్చ. దిశ అతిసర్జనే. ఉపదేశింపఁబడునది. ౨, ౩. శాస్యతే అనేన శాసనం, శిష్టిశ్చ. ఇ.

సీ. శాసు అనుశిష్టౌ. దీనిచేత శిక్షింపఁబడును. ౪,౫. ఆజ్ఞాపనం ఆజ్ఞా–ఆజ్ఞాపించుట. ఈ ౬ ఆజ్ఞపేళ్లు.

**సంస్థా తు మర్యాదా ధారణా స్థితిః,**

సంతిష్ఠతే అనయా సంస్థా. ష్ఠా గతినివృత్తౌ. దీనిచేత లోకము లెస్సయై యుండును. ౧. మర్యేతి సీమార్థే ఽవ్యయం; తత్రదీయత ఇతి మర్యాదా. డుదాఞ్ దానే. మర్య యనఁగా సీమ; అందు ఇయ్యఁబడునది. ౨. మేర దప్పకయుండుట. ధార్యతే అనయా ధారణా–దీని చేత ధరింపఁబడును. ౩. తిష్ఠం త్యస్యామితి స్థితిః. ఇ. సీ. దీనియందు స్థిరులైయుందురు. ఈ ౪ మర్యాద పేళ్లు.

**ఆగో ఽపరాధో మంతుశ్చ-**

అగతికుటిలం గచ్ఛతీ త్యాగః. స.న. అగ కుటిలాయాం గతౌ. కుటిలముగా బొందునది. ౧. అపరాధ్యంతే అనే నేత్యపరాధః. రాధ హింసాయాం. దీనిచేత హింసింపఁబడుదురు. ౨. మన్యతే కష్టమితి మంతుః. ఉ. పు. మన జ్ఞానే. కష్టమని తలంపఁబడునది. ఈ 3 అపరాధము పేళ్లు.

**సమే తూద్దాన బన్ధనే.** 26

ఉద్దీయతే ఖంద్యతే రక్ష్యతే వా ఉద్దానం. దో అవఖండనే. దేఙ్ రక్షణే. దీనియందు ఖండింపఁబడును, లేక రక్షింపఁబడును గనుక ఉద్దానము. ౧. బధ్యత ఇతి బంధనం. బధబంధనే. కట్టివేయుట. ఈ ౨ కట్టివేయుట పేళ్లు.

**ద్విపాద్యో ద్విగుణో దణ్డః -**

ద్వౌ పాదౌ ప్రమాణమస్మిన్నితి ద్విపాద్యః– రెండుభాగములు ప్రమాణముగాఁ గలది. ౧. ద్విగుణః దణ్డః–రెట్టింపు దండుగ. ఉచితమైనదానికంటె నినుమడిగా దండుగఁ గొనుట.

**భాగధేయః కరో బలిః,**

భాగ ఏవ భాగ ధేయః–భాగమే భాగధేయము. ౧. కీర్యతే ప్రత్యేకం కరః. కౄ విక్షేపే. ప్రత్యేకము ప్రజలచేతఁ జల్లఁబడునది. ౨. బలంత్య నేన బలిః. ఇ. పు. బలప్రాణనే. దీనిచేత రాజులు బ్రతుకుదురు. ఈ 3 వ్యవసాయదారులచే రాజునకుఁ గట్టఁదగిన యప్పనము పేళ్లు.

**ఘట్టాదిదేయం శుల్కో ఽస్త్రీ-**

శలన్తి సుఖేన గచ్ఛంత్యత్ర శుల్కః. అ. ప్న. శల ఆశుగమనే. దీని

నిచ్చుటచేత సుఖముగాఁ బోవుదురు. ౧. ఘట్టమనఁగా సుంకముగొను చావిడి. ఆదిశబ్దము చేత నదీతరణము మొదలైనవి. అందు రాజునకు నీయఁదగిన ద్రవ్యము శుల్కమనంబడును. సుంకము పేరు.

**ప్రాభృతం తు ప్రదేశనమ్,** 27

**ఉపాయన ముపగ్రాహ్య ముపహార స్తథోపదా,**

ప్రకర్షేణభ్రియతే ప్రాభృతం. భృఞ్ భరణే. ఎచ్చుగా భరింపఁబడునది. ౧. ప్రదిశ్యతే దీయతే రాజ్ఞే ప్రదేశనం. దిశ అతిసర్జనే. ప్రకృష్టముగా రాజుకొఱ కియ్యఁబడునది. ౨. రాజ్ఞస్సమీప మయతే ఉ నేనేత్యుపాయనం. అయగతౌ. దీనిచేత రాజ సమీపమును బొందుదురు. ౩. ఉపగృహ్యతే రాజ్ఞా ఉపగ్రాహ్యం. గ్రహ ఉపదానే. రాజుచే గ్రహింపఁబడునది. ౪. ఉపహ్రియతే రాజ్ఞా ఉపహారః. హృఞ్ హరణే. రాజుచేత హరింపఁబడునది. ౫. ఉపదీయత ఇతి ఉపదా. దా దానే. రాజసమీపమందీయఁబడునది. ఈ ౬ రాజదర్శనార్థమై తెచ్చు కానుక పేళ్లు.

**యౌతకాది తు యద్దేయం సుదాయో హరణం చ తత్.** 28

యుతయోస్సంగతయోః స్త్రీ పుంసయోరిదం యౌతుకం–వివాహ మందు కూడికొనియున్న వధూవరుల సంబంధమైనది. ౧. సుష్ఠు దీయత ఇతి సుదాయః –లెస్సగా నియ్యఁబడునది. ౨. హ్రియతే స్త్రియా స్వాతంత్ర్యేణేతి హరణం. హృఞ్ హరణే. స్త్రీచేత స్వాతంత్ర్యమున హరింపఁబడునది. ఈ 3 వివాహమందు నల్లునికిని ఆఁడుబిడ్డకును ఇచ్చు వస్తువు.

**తత్కాలస్తు తదాత్వం స్యాత్ -**

నచాసౌ కాలశ్చ తత్కాలః, తదేత్యస్యభావః తదాత్వం–అప్పుడున్న కాలము తత్కాలము, తదాత్వమును. ఈ ౨ వర్తమానకాలము పేళ్లు.

**ఉత్తరః కాల ఆయతిః,**

ఏష్యతీత్యాయతిః ఇ. సీ. ఇణ్. గతౌ. ఈ ౧ రాఁగల కాలము.

**సాందృష్టికం ఫలం సద్యః -**

సందృష్టం ప్రత్యక్షప్రయోజనమస్య సాందృష్టికం–ప్రత్యక్ష ప్రయోజనము గలది సాందృష్టికము. సద్యఃఫలం = తాత్కాలికమైన ఫలము. ఈ ౧ కృషి చేసిన వెంటనే దొరకు ఫలము.

**ఉదర్కః ఫల ముత్తరమ్.** 29

ఉదర్చ్యత ఇతి ఉదర్కః. అర్చ పూజాయాం. మిగుల సమ్మానింపఁబడునది. ఉత్తరం ఫలం = మీఁద రాఁగల ఫలము. ఈ ౧ ముందు రాఁగల ఫలము పేరు.

**అదృష్టం వహ్నితోయాది -**

న దృష్టం అదృష్టం దైవకృతత్వాత్ – దైవకృత మగుటవలన కానఁబడనిది. వహ్నితోయాది = అగ్ని జలాదులవలనఁ బుట్టిన భయము. ఆదిశబ్దముచేత వ్యాధి దుర్భిక్ష మూషిక శలభాదులవలనఁ బుట్టిన భయంబును అదృష్టమనంబడును.

**దృష్టం స్వపరచక్రజమ్,**

దృశ్యత ఇతి దృష్టం–కానఁబడునది. స్వపరచక్రజం = రాజులకుఁ దన బలమువలనను పగవారి బలమువలనను బుట్టిన భయము.

**మహీభుజామహి భయం స్వపక్ష ప్రభవం భయమ్.** 30

రాజులకు మూలబలము మొదలగు నేడు విధములైన స్వపక్షముల వలనఁ బుట్టిన భయము అహిభయ మనంబడును. అహేరివ భయం అహిభయం– సర్ప భయమువంటి భయము. ౧. పక్షశబ్దము చేత మూలబలము మొదలైన యేడు విధములును జెప్పఁబడును. “నిజో ఉ ధమైత్రశ్చ సమాశ్రితశ్చ సంబంధజః కార్యసముద్భవశ్చ, భృత్యో గృహీతో వివిధోపచారైః పక్షం బుధా స్సప్తవిధం వదంతి” నిజ మనఁగా మూలబలము. మిత్రబలము మైత్రబలము. తన్ను రక్షించుకొనుటకై వచ్చి యాశ్రయించినవాఁడు సమాశ్రితుఁడు. తల్లిదండ్రుల దిక్కువాఁడు సంబంధజుఁడు. పరస్పరోపకారముచేత వచ్చికూడినవాఁడు కార్యసముద్భవుఁడు. జీతగాఁడు భృత్యుఁడు. ఉపచారముచేత స్వవశముగాఁ జేసికొనఁబడినవాఁడు ఉపచార గృహీతుఁడు. ఈయేడును స్వపక్షము లనంబడును.

**ప్రక్రియా త్వధికార స్స్యాత్-**

ప్రకర్షేణ క్రియత ఇతి ప్రక్రియా–ప్రకర్షముగాఁ జేయఁబడునది. ౧ కర్మవిశేష మధికృత్యకర్తృభిః క్రియత ఇత్యధికారః–కర్మ విశేషము నధికరించి కర్తలచేఁ జేయఁ బడునది. ఈ ౨ అధికారము పేళ్లు.

**చామరం తు ప్రకీర్ణకమ్,**

చమరమృగ సంబంధి చామరం – చమరమృగ సంబంధమైనది. ౧

ప్రకీర్యతే రాజసమీప ఇతి ప్రకీర్ణకం. కౄ విక్షేపే. రాజ సమీపమందు విసరఁబడునది. ఈ ౨ వింజామరపేళ్లు.

**నృపాసనం తు యద్భద్రాసనం సింహాసనం తు తత్.** 31

**హైమమ్ -**

భద్రం చ తత్ ఆసనం చ భద్రాసనం–శుభమైన యాసనము. ౧. నృపస్యాసనం నృపాసనం–రాజుయొక్క యాసనము నృపాసనము. సింహాకృతి యుక్తమాసనం సింహాసనం–సింహాకృతితోఁ గూడిన యాసనము సింహాసనము. మణులు మొదలగువానితోఁ జేసిన రాజాసనము భద్రాసనము. బంగారుతోఁ జేసినది సింహాసనము.

**ఛత్రం త్వాతపత్రమ్ -**

ఛాద్యతే పురుషో உనేనేతి ఛత్రం. ఛద అపవారణే. దీనిచేతఁ బురుషుఁడు కప్పఁబడును. ౧ ఆతపాత్ త్రాయత ఉతి ఆతపత్రం. త్రైజ్ పాలనే. ఎండవలన రక్షించునది. ఈ ౨ గొడుగు పేళ్లు.

**రాజ్ఞస్తు నృపలక్ష్మతత్,**

నృపాణాం లక్ష్మ నృపలక్ష్మ. న. న. రాజులకు చిహ్నమైనది. ఈ ౧ రాజునకుఁ బట్టునట్టి గొడుగు పేరు.

**భద్రకుమ్భః పూర్ణకుమ్భః -**

భద్రార్థం కుంభః భద్రకుంభః–మంగళార్థమైన కుంభము. ౧. పూర్ణశ్చాసౌ కుంభశ్చ పూర్ణకుంభః–పూర్ణమైన కుంభము. ఈ ౨ రాజద్వారాదులయందుఁ బెట్టఁబడిన పూర్ణ కలశముపేళ్లు.

**భృఙ్గారః కనకాలుకా.** 32

భ్రియతే జలమనేనేతి భృంగారః–దీనిచేత జలము భరింపఁబడును. ౧. కనకమయీ చ సా ఆలుకా చ కనకాలుకా–సువర్ణమయమైన గిండి. ఈ ౨ బంగారుగిండి పేళ్లు.

**నివేశ శ్శిబిరం షణ్డే -**

నివిశ్యత ఇతి నివేశః. నిశ ప్రవేశనే. ప్రవేశింపఁబడునది. ౧. శేరతే உత్ర శిబిరం. శీఙ్ స్వప్నే. దీనియందు నిద్రింతురు. ఈ ౨ దండు విడిసిన పాళెము పేళ్లు.

**సజ్జనం తూపరక్షణమ్,**

సత్ స్వాస్థ్యం జన్యతే ఽ నేనేతి సజ్జనం-శిబిరమునకు స్వాస్థ్యము దీనిచేతఁ బుట్టింపఁబడును. ౧. ఉపరక్ష్యతే ఽ నేనేతి ఉపరక్షణం-దీని చేత శిబిరము రక్షింపఁ బడును. ఈ ౨ శిబిర రక్షార్థమై చుట్టును బెట్టిన వెలుఁగు మొదలయినదాని పేళ్లు.

**హస్త్యశ్వరథ పాదాతం సేనాఙ్గం స్యాచ్చ తుష్టయమ్.** 33

పదాతీనాం సమూహః పాదాతం హస్తినశ్చ అశ్వాశ్చ రథాశ్చ పాదాతం చ హస్త్యశ్వరథపాదాతం. ద్వంద్వైకవద్భావః. ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాలుబంటులును అను నీ నాలుగు సేనాంగము లనంబడును. సేనాయా అంగం సేనాంగం-సేనకు అంగము. ఈ ౧ సేనాంగము పేరు.

**దన్తీ దన్తావళో హస్తీ ద్విరదో ఽ నేకపో ద్విపః,**
(సిన్ధుర స్సామజః కుమ్భీ మాతఙ్గశ్చ మదావళః)
**మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ.** 34
**ఇభః స్తమ్బేరమః పద్మీ -**

దంతావస్యస్త ఇతి దంతీ. న. పు. దంతావళశ్చ-దంతములు గలది. ౧, ౨. హస్తో ఽస్యాస్తీతి హ స్తీ.న.పు. తొండముగలది. ౩. ద్వౌరదావస్యద్విరదః -రెండు కొమ్ములు గలది. ౪. అనేకేన-హస్తేన వక్త్రేణ చ పిబతీతి అనేకపః. ద్వాభ్యాం పిబతీతిద్విపః. పా. పానే. తొండము నోరు అను నీ రెంటిచేతను పానము చేయునది. ౫, ౬. మతంగాదృషేర్జాతో మతంగజః- మతంగుఁడను ఋషివలనఁ బుట్టినది. ౭. గజతి మాద్యతీతి గజః. గజమదే. మదించునది. ౮. నగేగిరౌ భవోనాగః-పర్వతమందుఁ బుట్టినది. ౯. కుంజౌ కుంభాధో గర్తావస్యస్త ఇతి కుంజరః - కుంజము లనఁగా కుంభస్థలములకు దిగువనుండు గుంతలు; అవి గలిగినది. ౧౦. పరబలం వారయతీతి వారణః. వృఞ్ వరణే. పరబలము నడ్డపెట్టునది. ౧౧. కరో ఽ స్యాస్తీతి కరీ. న. పు. తొండము గలది. ౧, ౨. ఏతిమదమితి ఇభః ఇణ్గతౌ. మదమును బొందునది. ౧౩. స్తంబే తృణగుల్మే రమత ఇతి స్తంబేరమః. రముక్రీడాయాం. పొదలయందుఁ గ్రీడించునది. ౧౪. పద్మం బిందుజాలక మస్యాస్తీతి పద్మీ.న. పు. పద్మమనఁగా దేహమందలి బొట్లు; అవి గలిగినది. ఈ ౧౫ ఏనుఁగు పేళ్లు.

**యూథనాథస్తు యూథపః,**

యూథస్య నాథో యూథనాథః–యూథమనఁగా సమూహము; దానికి నాథుఁడు. ౧. యూథం పాతీతి యూథపః. పా రక్షణే. సమూహమును పాలించునది. ఈ ౨ ఏనుఁగుమూఁకలో ముఖ్యమైన యేనుఁగు పేళ్లు.

**మదోత్కటో మదకలః -**

మదేన ఉత్కటో మదోత్కటః–మదముచేత వ్యాప్తమైనది. ౧. మదేన కలో మనోజ్ఞః మదకలః– మదముచేత మనోజ్ఞమైనది. ఈ ౨ మదముపట్టిన యేనుఁగు పేళ్లు.

**కలభః కరిశాబకః** 35

కం ఉదకం లభతే కలభః. డులభష్ ప్రాప్తౌ. ఉదకమును బొందునది. ౧. కరిణః శాబకః కరిశాబకః–ఏనుఁగుపిల్ల. పా. కరిపోతకః. ౨. "పంచవర్ష గజోబాలః పోతస్తు దశవార్షికః, వికోవింశతివర్షస్తు కలభస్త్రీం శదబ్దకః." ఈ ౨ ఏనుఁగుగున్న పేళ్లు.

**ప్రభిన్నో గర్జితో మత్తః -**

ప్రకర్షేణ భిన్నః ప్రభిన్నః–మిక్కిలి మదస్రావము నొందినది. ౧. గర్జన మస్య సంజాతమితి గర్జితః–గర్జించునది. ౨. మాద్యతీతి మత్తః. మదీ హర్షగ్లేపనయోః. మదించునది. ఈ 3 మదము కాఱుచున్న యేనుఁగుపేళ్లు. మదము నిలకడగానున్న యేనుఁగని కొందఱు.

**సమావుద్వాన్త నిర్మదౌ,**

మద ముద్వమతీతి ఉద్వాంతః. టు వము ఉద్గిరణే. మదమును వెళ్ళించునది. ౧. నిర్గతో మదాత్ నిర్మదః. మదమువలనఁ బాసినది. ఈ ౨ (రాజవాహ్యస్త్వౌపవాహ్యా స్సాన్నాహ్య స్సమరోచితః) మదము విడిచిన యేనుఁగు పేళ్లు.

**హాస్తికం గజతా బృన్దే -**

హస్తినాం సమూహో హాస్తికం. గజానాం సమూహో గజతా–ఏనుఁగుల గుంపు. ఈ ౨ ఏనుఁగుమూఁక పేళ్లు.

**కరిణీ ధేనుకా వశా.** 36

కరో ఽ స్యా అస్తీతి కరిణీ. ఈ. సీ. తొండము గలది. ౧. ధయత్యేనాం గజశిశురితి ధేనుకా. ధేట్ పానే. ఏనుఁగుపిల్ల దీని చన్ను గుడుచును. ౨. వష్టి కామయతే గజమితి వశా. వశకాంతౌ. ఏనుఁగును కామించు

నది. ఈ 3 ఆఁడుఏనుఁగు పేళ్లు.

**గణ్డః కటః-**

గండ్యత ఇతి గండః. గడి వదనైకదేశే. ముఖైక దేశమైనది. ౧. కటతి మదం కటః. కటే వర్షావరణయోః. మదమును వర్షించునది. ఈ ౨ ఏనుఁగు చెక్కిలి పేళ్లు.

**మదో దానమ్ -**

మాద్యతే ऽ నేనేతి మదః. మదీ హర్షగ్లేపనయోః. దీనిచేత మదించును. ౧. ద్యతి ఖండయతీతి దానం. దో అవఖండనే. ఏనుఁగును బీడించునది. ఈ ౨ మదము పేళ్లు.

**వమథుః కరశీకరః,**

వమ్యత ఇతి వమథుః. ఉ. పు. టు వము ఉద్గిరణే. వెళ్లింపఁబడునది. ఏనుఁగు తొండమువలనఁ బుట్టిన తుంపురులు.

**కుమ్భౌ తు శిరసః పిణ్డౌ -**

కుంభాకృతి యోగాత్కుంభౌ. అ. పు. కుంభములవంటి యాకారము గలవి. ౧. శిరసః పిణ్డౌ = ఏనుఁగుతల మీఁద నుండు మాంసపుంజములు రెండును కుంభము లనంబడును. కుంభస్థలము.

**తయోర్మధ్యే విదుః పుమాన్.** 37

వేత్త్యస్మిన్ అంకుశఘాత మితి విదుః. ఉ. పు. విదజ్ఞానే. దీనియందంకుశ ఘాతము నెఱుఁగును. ౧ ఆరెంటి నడుము పేరు.

**అవగ్రహో లలాటం స్యాత్ -**

అంకుశే నావగృహ్యత ఇత్యవగ్రహః. గ్రహ ఉపాదానే. అంకుశముచేఁ దాఁకఁబడునది. ఈ ౧ ఏనుఁగు నొసలు పేరు.

**ఈషికా త్వక్షికూటకమ్,**

ఈషా లాంగలికేవ ఈషికా. పా. ఇషీ కా-నాఁగేలువలె నిడివియైనది. ౧. అక్షికూటక మక్షిగోళకం. ఏనుఁగుకనుగ్రుడ్డుపేరు.

**అపాఙ్గదేశో నిర్యాణమ్ -**

నిర్యాతి నేత్రజల మస్మాదితి నిర్యాణం. యా ప్రాపణే. కన్నీళ్లు దీనివలన జాఱును. ౧ ఏనుఁగు కడగన్ను పేరు.

**కర్ణమూలం తు చూలికా.** 38

చుల్యతే అంకుశేన ప్రేర్యత ఇతి చూలికా. చుల ప్రేరణే. అంకుశముచేతఁ బ్రేరేపింపఁబడునది. ఈ ౧ ఏనుఁగు చెవి మొదలు.

**అధః కుమ్భస్య వాహిత్థమ్ -**

మదవాహిని స్థానే తిష్ఠతీతి వాహిత్థం-మదప్రవాహస్థానమందుండునది. ౧ ఏనుఁగు కుంభ స్థలమునకు దిగువ నున్న ప్రదేశము.

**ప్రతిమాన మధో ఽ స్య యత్,**

ప్రతిమీయతే అనేన ప్రతిమానం. డు మిఞ్ ప్రక్షేపణే. దీని చేత నెత్తివేయఁ బడును. ఈ ౧ ఈవాహిత్థమునకు దిగువ నున్న ప్రదేశము.

**ఆసనం స్కన్ధదేశ స్స్యాత్ -**

ఆస్యతే అస్మి న్నిత్యాసనం. ఆస ఉపవేశనే. దీనియం దుండఁబడును. ఈ ౧ ఏనుఁగుయొక్క మూఁపుపేరు.

**పద్మకం బిన్దుజాలకమ్.** 39

పద్మవర్ణసామ్యాత్ పద్మకం. పద్మమువన్నె గలది. ఈ ౧ ఏనుఁగునకు యౌవనమందు దేహమునఁ బుట్టిన బొట్లు. ఏనుఁగు సిబ్బెము.

**పక్షభాగః పార్శ్వభాగః -**

పక్షయోర్భాగః పక్షభాగః – పక్షములయొక్క భాగము. ౧. పార్శ్వయో ర్భాగః పార్శ్వభాగః. ఈ ౨ ఏనుఁగుయొక్క యుభయపార్శ్వములును.

**దన్తభాగస్తు యో ఽ గ్రతః**

దన్త సన్నిహితో భాగో దన్తభాగః – దంతములకు సమీపమైన భాగము. ఈ ౧ ఏనుఁగుయొక్క ముందటి భాగము.

**ద్వౌ పూర్వ పశ్చాజ్జఙ్ఘాది దేశౌ గాత్రావరే క్రమాత్.** 40

గాత్రస్య ప్రధానాంగత్వాత్ గాత్రం-గాత్రమునకు ప్రధానాంగము. ౧. అప్రధానాఙ్గత్వాత్ అవరం-అప్రధానమైన అంగము అవరము. పా. అపరం. ఈ ౧ ఏనుఁగుయొక్క ముందరికాళ్లు మొదలుగాఁగల భాగము గాత్ర మనంబడును. వెనుకటికాళ్లు మొదలుగాఁ గల భాగము అవరమనంబడును.

**తోత్రం వైణుకమ్ -**

తుద్యతే ఽ నేన గజ ఇతి తోత్రం. తుద వ్యథనే. దీనిచేత నేనుఁగు

వ్యథ పెట్టఁబడును. ౧. వేణునా నిర్వృత్తం వైణుకం. వెదురుచేతఁ జేయఁబడినది. ౨ పా. వేణుకం. ఈ ౨ ఏనుఁగును శిక్షించునట్టి కోల పేళ్లు.

**ఆలానం బన్ధస్తమ్భే -**

ఆలాయతే గజో ఽస్మిన్ని త్యాలానం. లా ఆదానే. దీనియం దేనుఁగు తెచ్చి కట్టఁబడును. ఈ ౧ ఏనుఁగును గట్టు స్తంభము పేరు.

**అథ శృఙ్ఖలా,**

అన్దుకో నిగళో ఽస్త్రీ స్యాత్.

శృణాతి బన్ధనేన గజ మితి శృంఖలా. ఆ. సీ. ప్న. త్రి. శౄ హింసాయాం. గజమును బీడించునది. "స్త్రీ కటీవస్త్రబన్ధే ఽపి నిగళే శృంఖలా త్రిషు" అని తాలవ్యాదులయందు రభసుఁడు. ౧. అన్దతి బధ్నాత్యనే నేత్యందుకః. అది బంధనే. దీనిచేత కట్టివేయుదురు. ౨. నిగళ్యతే మదేనేతి నిగళః గళ సేచనే. మదముచేతఁ దడుపఁబడునది. పా. నిగడః. ఈ 3 ఏనుఁగును గట్టు గొలుసు పేళ్లు.

**అఙ్కుశో ఽస్త్రీ సృణిః స్త్రియామ్.** 41

అంక్యతే ఽనేనేత్యఙ్కుశః. అ. ప్న. అకి లక్షణే. దీనిచేత నేనుఁగునకు గుఱుతుపడును. ౧. సర త్యనయా సృణిః. ఇ. సీ. సృ గతౌ. ఏనుఁగు దీనిచేత పోవును. "ఆరక్షమగ్న మవమత్య సృణిం శితాగ్ర మేకః పలాయితయవేన కృతార్తనాదః" అని మాఘమందుఁ బుల్లింగప్రయోగము గలదు. సృణిశబ్దము స్త్రీలింగముగాన నిది యాయన ప్రమాదమువలనఁ బడినదే. ఈ ౨ అంకుశము పేళ్లు.

ఽ **దూష్యా కక్ష్యావరత్రా స్యాత్ -**

దూయతే అనయా దూష్యా. దూఙ్ పరితాపే. దీనిచేతఁ దపింపఁజేయఁబడును. పా. చూషా. ౧. కక్షాయాం గజమధ్యభాగే భవాకక్ష్యా–గజమధ్య భాగమందుండునది. 'కక్ష్యాకక్షా' అనిక్షాంతమని విశ్వప్రకాశిక. యాంతమని అజయుఁడు. ౨. వ్రియతే గజమధ్యమనయేతి వరత్రా. వృఙ్ వరణే. దీనిచేత గజమధ్యము కప్పఁబడును. ఈ 3 ఏనుఁగు నడుమునఁ గట్టు తోలుమోఁకు పేళ్లు.

**కల్పనా సజ్జనా సమే,**

కల్ప్యతే కల్పనా. కృపూ సామర్థ్యే. కల్పింపఁబడునది. ౧. సజ్జ్య

తే అనయా సజ్జనా. షస్జగతౌ. గతిః జ్ఞానార్థః. దీనిచేత నెఱుఁగఁబడును. ఈ ౨ రాజరోహణార్థమై యేనుఁగును శృంగారించుట పేళ్లు.

**ప్రవేణ్యాస్తరణం వర్ణః పరిస్తోమః కుథో ద్వయోః.** 42

ప్రకర్షేణవయన్త్యేనామితి ప్రవేణీ. ఈ. సీ. వ్యేఞ్ తంతుసంతానే. మిక్కిలి దీని నేయుదురు. ౧. ఆస్తీర్యత ఇత్యాస్తరణం. స్తృఞ్ ఆచ్ఛాదనే. కప్పఁబడునది. ౨. వర్ణ్యతే చిత్రవర్ణత్వేనేతి వర్ణః వర్ణస్తుతౌ. చిత్రమౌటచేత స్తోత్రము చేయఁబడునది. ౩. పరిస్తూయతే పరిస్తోమః. ష్టుఞ్ స్తుతౌ. స్తోత్రము చేయఁబడునది. ౪. గజపృష్ఠే కుథ్నాతీతి కుథః. కుథ శ్లేషణే. ఏనుఁగువీఁపున నుండునది. అ. ప్స. మూఁడులింగముల యందుఁ గలదని కొందఱు. "స్త్రియాంవేణీ కుథం త్రిషు" అని వోపాలితుఁడు. ఈ ౫ ఏనుఁగుమీఁదఁ బఱచు రత్నకంబళి పేళ్లు.

**వీతం త్వసారం హస్త్యశ్వమ్-**

వేతి యుద్ధాదికర్మణ ఇతి వీతం. వీ గత్యాదౌ. వెళ్లునది. ౧. అసారం = బలములేనిది. యుద్ధమునకు సమర్థము కాని యేనుఁగు, గుఱ్ఱము వీత మనంబడును.

**వారీ తు గజబన్ధనీ,**

వార్యతేగజో ఽ నయేతి వారీ. ఈ. సీ. దీనిచేత నేనుఁగు నిలుపఁబడును. ఈ ౧ ఏనుఁగును బట్టుటకొఱకు చేయఁబడిన యోదము మొదలయినది.

**ఘోటకే వీతి తురగ తురంగాశ్వ తురంగమాః.** 43

**వాజి వాహార్వ గన్ధర్వ హయ సైన్ధవ సప్తయః,**

భూమౌ ఘుటతి పరివర్తత ఇతి ఘోటః. సఏవ ఘోటకః. ఘుటపరివర్తనే. భూమియందు పొర్లాడునది. ౧. వేతి గచ్ఛతీతి వీతిః. ఇ. పు. నీ గత్యాదౌ. వేగముగాఁ బోవునది. పా. పీతిః. 'పానేస్త్రీ పీతి రశ్వేనా' అని రుద్రుఁడు. ౨. తురం త్వరితం గచ్ఛతీతి తురగః. తురఙ్గః. తురఙ్గమశ్చ. వేగిరముగాఁ బోవునది. ౩, ౪, ౫. అశ్నుతే గమనేనే త్యశ్వః. అశూ వ్యాప్తౌ. గమనముచేత వ్యాపించునది. ౬. వాజో వేగస్తద్యోగా ద్వాజీ. న. పు. వజ గతౌ. వాజ మనఁగా వేగము; అది గలది. ౭. వహతి నరంవాహః. వహప్రాపణే. నరుని వహించునది. ౮. అర్వతియాతి అర్వా. న. పు. అర్వగతౌ. వేగముగాఁ బోవునది. తకారాంతరంబును గలదు.

"శ్లథీకృతప్రగ్రహ మర్వతాం వ్రజాః" అని మాఘము. ౯. గంధ్యతే కశాదినాపీడ్యత ఇతి గంధర్వః. గంధ అర్దనే. కశాదులచేత పీడింపఁబడునది. ౧౦. హయతి గచ్ఛతీతి హయః. హయ గతౌ. శీఘ్రముగాఁ బోవునది. ౧౧. సింధుదేశే భవః సైంధవః-సింధు దేశమందుఁ బుట్టినది. ౧౨. సపతిసేవాదిధర్మేణ సప్తిః. ఇ. పు. షప సమవాయే. సేవాదిధర్మములతోఁగూడినది. ఈ ౧౩ గుఱ్ఱము పేళ్లు.

**ఆజానేయాః కులీనా స్స్యుః -**

అజేన వేగేన ఆనేయాః ఆజానేయాః. అజ గతిక్షేపణయోః. వేగముచేఁ దేఁదగినవి. ఈ ౧ మంచిజాతి గుఱ్ఱములు.

**వినీతా స్సాధువాహినః.** 44

వినీయన్త ఇతి వినీతాః. నీఞ్ ప్రాపణే. లెస్సగా శిక్షింపఁబడునవి. ఈ ౧ మనుష్యుని లెస్సగా మోయ నేర్చిన గుఱ్ఱములు.

**వనాయుజాః పారసీకాః కామ్భోజా బాహ్లికా హయాః,**

వనాయుదేశే భవా వనాయుజాః - వనాయు దేశమందుఁ బుట్టినవి. "పారశీకా వనాయుజాః" అని యుత్పలిని. దీర్ఘాదియును గలదు. "శ్వేతం కర్కాఖ్యం వానాయుజమపి పారసీకం తు" అని నామమాల. ౧. పారసీకదేశే భవాః పారసీకాః -పారసీక దేశమందుఁ బుట్టినవి. ౧. కాంభోజ దేశే భవాః కాంభోజాః - కాంభోజ దేశమందుఁ బుట్టినవి. ౧. బాహ్లిక దేశే భవాః బాహ్లికాః - బాహ్లిక దేశమందుఁ బుట్టినవి. ఈ ౧ ఆయాదేశములయందుఁ బుట్టిన యశ్వముల పేళ్లు.

**యయు రశ్వో ఽ శ్వమేధీయః-**

విసృష్టో దేశే దేశే యాతీతి యయుః. ఉ.పు. యా ప్రాపణే. విడువఁబడినదై ప్రతి దేశమునకుఁ బోవునది. ఈ ౧ అశ్వమేధమునకు నర్హమైన యశ్వము.

**జవనస్తు జవాధికః.** 45

జవతి వేగేన జవనః. జు గతౌ. వేగముగాఁ బోవునది. అధికమైన వేగముగల యశ్వము.

**పృష్ఠ్య స్థౌరీ-**

పృష్ఠేన వోఢుం క్షమః పృష్ఠ్యః - వీఁపున మోయుటకు సమర్థ

మైనది. ౧. స్థూలస్య పృష్ఠభాగస్యేదం స్థౌరం బలం, తదస్యాస్తీతి స్థౌరీ. న. పు. రలయోరభేద. అధికమయిన వీఁపు సత్తువ గలది. స్థూరియని కొందఱు. ఈ ౨ మోఁపుమో యునశ్వము పేళ్లు.

**సితః కర్కః రథ్యోవోఢా రథస్య యః,**

కరోతి కౌతుకం కర్కః. డు కృఞ్ కరణే. కౌతుకమును జేయునది. ౧. సితః–తెల్లగుఱ్ఱము. రథం వహతీతి రథ్యః–రథమును వహించునది. ౧. యః రథస్య వోఢా–రథమును మోయు గుఱ్ఱము.

**బాలః కిశోరః**

కశ్యత ఇతి కిశోరః. కశ గతిశాతనయోః. శిక్షింపఁబడునది. ఈ ౧ గుఱ్ఱపుపిల్ల పేరు.

**వా మ్యశ్వా బడబా-**

వమతి గర్భం వామీ. ఈ. సీ. టు వము ఉద్గిరణే. గర్భమును వెళ్లించునది. ౧. అశ్వజాతిస్త్రీ అశ్వా–ఆఁడుగుఱ్ఱము. ౨. వలతే బడబా. వల సంచలనే. వబయోర్లళయోశ్చైకత్వం. చలించునది. ఈ 3 గోడిగె పేళ్లు. ఆఁడుగుఱ్ఱము.

**బాడబం గణే.** 46

బడబానాం సమూహో బాడబం. గోడిగల మూఁక.

**త్రిష్వాశ్వీనం య దశ్వేన దినే నైకేన గమ్యతే,**

అశ్వేన ఏకేన దినేన యద్వర్త్మ గమ్యతే తదాశ్వీన మిత్యుచ్యతే–గుఱ్ఱముచేత నొకదినంబునఁ బోఁదగిన తెరువు అశ్వీన మనంబడును. అశ్వేన దినేన ఏకేన గమ్యత ఇత్యాశ్వీనం–గుఱ్ఱముచేత నొకదినంబునఁ బోఁదగిన త్రోవ.

**కశ్యం తు మధ్య మశ్వానామ్ -**

అశ్వానాం మధ్యం కశ్యమి త్యుచ్యతే–గుఱ్ఱము నడుము కశ్య మనంబడును. కశా మర్హతీతి కశ్యం–తఱటున (కొరడా) కుఁ దగినది.

**హేషా హ్రేషా చ నిస్వనః.** 47

హేషణం హేషా. హ్రేషాచ. హేషృ హ్రేషృ అవ్యక్తేశబ్దే. అవ్యక్తముగా మ్రోయుట. ఈ ౨ గుఱ్ఱము సకిలించుట పేళ్లు.

**నిగాళస్తు గళోదేశే -**

నిగళత్యనేన కబళ మితి నిగాళః. గళ అదనే. దీనిచేత నాహారమును మ్రింగును. "ఘంటాబంధ సమీపస్థో నిగాళః కీర్తితో బుధైః, తస్మిౕ దేవమణిర్నామ సశుభః కీర్తితో మతః". ౧. గుఱ్ఱపు మెడదగ్గఱి ప్రదేశము.

**బృన్దే త్వాశ్వీయ మాశ్వవత్,**

అశ్వానాం సమూహః ఆశ్వీయం. ఆశ్వం చ – అశ్వసమూహము అశ్వీయము, అశ్వము. ఈ ౨ గుఱ్ఱపుమూక పేళ్లు.

**ఆస్కన్దితం ధోరితకం రేచితం వల్గితం ప్లుతమ్.** 48

**గతయో ఽ మూః పఞ్చధారాః-**

ధార్యతే తురగైరితి ధారా–అశ్వములచేత ధరింపఁబడునది. ౧. ఆస్కందనం ఆస్కందితం. స్కందిర్ గతిశోషణయోః. చాతుర్యేణాధోరణం ధోరితకం. ధోర్వ గతిచాతుర్యే. రేచనం రేచితం. రిచిర్ పృథగ్భావే. వలనం వలితం. వల సంచలనే. పా. వల్గితం. ప్లవనం పుతం. ప్లుజ్ గతౌ. నిశ్చలమై అతివేగము అతిమందమునుగాక సమమైన గతి ఆస్కందితము. అంతకంటె నధికమయి చతురమైన గతి ధోరితకము. తాళగతితో పేరెముగాఁ దిరుగుట రేచితము. వేగముచేత విడువఁబడినదై మీఁదికి కాళ్లు కదిలించుట వల్గితము. వేగమున నంతట సమముగాఁ బోవుట ప్లుతము. ఈ ౫ గుఱ్ఱముయొక్క గతి విశేషములు. ఇవి ధారలనంబడును.

**ఘోణా తు ప్రోథ మస్త్రియామ్,**

ప్రోథతీతి ప్రోథః. అ. పు. ప్రోథృ పర్యాప్తౌ. దట్టమైయుండునది. ఘోణా. ఈ ౨ గుఱ్ఱపుముక్కు పేళ్లు.

**కవికాతు ఖలీనో ఽ స్త్రీ-**

కవతి భక్షణ సమయే కవికా. కు శబ్దే. భక్షణ సమయమందు మ్రోయునది. ౧. ఖలతి చలతీతి ఖలీనః. అ. పు. ఖల చలనే. కదలునది. ఖే ముఖవివరే లీనో వా ఖలీనః–ముఖ వివరమందు లీనమై యుండునది. హ్రస్వమధ్యమమును గలదు. "ప్రోత్సేధైః స్కంధదేశైః ఖరఖలిన కళాకర్కశాద్యాతముగ్రైః" అని విశాఖదత్తుఁడు. ఈ ౨ కళ్లెము పేళ్లు.

**శఫం క్లీబే ఖురః పుమాౕ.** 49

శాయతే భువా శఫం. వో తనూకరణే. భూమిచేత నల్పముగాఁ

జేయఁబడునది. ౧. ఖురతి భువం ఖురః. ఖుర ఛేదనే. భూమిని ఛేదించునది. ఈ ౨ గొరిసెల పేళ్లు.

**పుచ్ఛో౽ స్త్రీ లూమలాఙ్గూలే వాలహ స్తశ్చ వాలధిః,**

పూయతే దంశాదీ నుత్సారయతీతి పుచ్ఛః. అ. ప్న. పూయీ విశరణే. ఈగలు మొదలయినవానిని బోఁగొట్టునది. ౧. లూయన్తే రోమాణ్యత్రేతి లూమ. లూఞ్ ఛేదనే. రోమములు దీనియందు కోయఁబడును. న. న. పా. అ. న. ౨. లఙ్గతి చలతీతి లాంగూలం. లగిగతౌ. కదులునది. ౩. వాలసమూహయోగాత్ వాలహస్తః–వాలసమూహము గలది. ౪. వాలా ధీయంతే ౽స్మిన్నితి వాలధిః ఇ. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః. వాలము దీనియందు ధరింపఁబడును. ఈ ౫ (గుఱ్ఱము మొదలైనవాని) తోఁక పేళ్లు. వాలహస్తవాలధి శబ్దములు కేశయుక్తమైన తోకపేళ్లని కొందఱు.

**త్రిషూపావృత్త లురితౌ పరావృత్తే ముహుర్భువి.** 50

ఉపావర్తతే స్మ ఉపావృత్తః. వృతువర్తనే. లురతిస్మ లురితః. లుర ప్రతీఘాతే. పొర్లాడినది. ౧, ౨. త్రి. భూమియందు పలుమాఱు పొర్లాడిన యశ్వము పేళ్లు.

**యానే చక్రిణీ యుద్ధార్థే శతాఙ్గ స్స్యన్దనో రథః,**

శతం అఙ్గాన్యస్యేతి శతాఙ్గః–నూఱవయవములు గలది. ౧. స్యన్దతే యాతీతి స్యన్దనః. స్యన్దూ ప్రస్రవణే. పోవునది. ౨. రమన్తే ౽త్ర రథః. రము క్రీడాయాం. దీని యందు క్రీడింతురు. ఈ 3 బండికండ్లతోఁగూడిన యుద్ధార్థమైన వాహనము పేళ్లు.

**అసౌ పుష్యరథశ్చ క్రయానం న సమరాయ యత్.** 51

పుష్యే ఉత్సవాదౌ విహితో రథః పుష్యరథః–పుష్యము మంగళప్రదము గనుక తత్సామ్యమున నుత్సవాదు లుపలక్షింపఁబడును. ఆయుత్సవాదులయందు విహితమయినది పుష్యరథము. "మహారథః పుష్యరథం రథాంగీ క్షిప్రం క్షపానాథ ఇవాధిరూఢః" అని మాఘమందు నక్షత్రముతోఁగూడ శ్లేషగాఁ జెప్పినాఁడు. బండికన్నులు గలిగి యుద్ధార్థముగాక విహారార్థమైన రథము.

**కర్ణీరథః ప్రవహణం డయనం చ సమం త్రయమ్,**

కంఠేషు స్కంధే షూహ్యమానో రథః కంఠీరథః–మూఁపులయందు వహింపఁ బడు రథము. పా. కర్ణీరథము. ౧. ప్రవహతి నరశ్రేష్ఠమితి ప్రవహణం–శ్రేష్ఠమయినవాని వహించునది. ౨. డయతే డయనం. డీఙ్ విహాయసా గతౌ. ఆకాశమందుఁ బోవునది. ఈ మూఁడును సమానార్థకములు. మనుష్యులు మోయు విమానమనుయాన విశేషము.

**క్లీబేఽన శ్శకటో ఽ స్త్రీ స్యాత్ -**

అనతి రథో ఽ నేనేత్యనః. స. న. అన ప్రాణనే. దీనిచేత రథము బ్రతకును. శక్నోతి భార మితి శకటః. అ. ప్న. శక్ ౯ శక్తౌ. భారమును వహించుటకు సమర్థమైనది.

**గన్త్రీ కమ్బళివాహ్యకమ్.** 52

గచ్ఛతీతిగన్త్రీ. ఈ. సీ. గమ్ ౯ సృప్ ౯ గతౌ. పోవునది. కంబళ స్సాస్నా; తద్యోగాత్కంబళినో బలీవర్దాః; తైర్వాహ్యత ఇతి కంబళి వాహ్యకం. కంబళ మనఁగా గంగడోలు; అది గలవి గనుక కంబళులనఁగా నెద్దులు; వానిచేత వహింపఁ బడునది. "ప్రావారే ఽ ప్యుత్తరాసంగే సాస్నాయామపి కంబళః" అని రుద్రుఁడు. దిద్దినయెద్దులు దీయు బండిపేళ్లు.

**శిబికా యాప్యయానం స్యాత్ -**

శివా మంగళప్రదా. శివైన శిబికా. వబయోరభేదః. మంగళప్రదమైనది. యాప్యై రథమై ర్యాయత ఇతి యాప్యయానం. యాప్రాపణే. యాప్యులనఁగా నధములు; వారిచేత వహింపఁబడునది. అందలము పేళ్లు. పల్లకియు.

**డోలా ప్రేఙ్ఖాదికా స్త్రియామ్,**

దుల్యతే ఉత్క్షిప్యతే డోలా. దుల ఉత్క్షేపే. ఊఁచఁబడునది. ప్రేఙ్ఖతే ఇతస్తతః ప్రేంఖా. ఇఖి గతౌ. ఇట్టటుపోవునది. పుంలింగముం గలదు. "డోలా ప్రేంఖః పుమాన్ ప్రేంఖా" అని రత్నకోశము. ఈ ౨ ఉయ్యాలపేళ్లు. ఆదిశబ్దముచేత మంచాదులును డోలాశబ్ద వాచ్యములు.

**ఉభౌ తు ద్వైపవైయా ఘ్రౌ ద్వీపిచర్మావృతే రథే.** 53

ద్వీపిచర్మవృతో రథః ద్వైపః. ద్వీపి యనఃగా పులి; దానితోలు

చేతఁ గప్పఁబడినది. ౧. వ్యాఘ్రచర్మణా వృతో రథః వైయాఘ్రః-పులితోలుచేతఁ గప్పఁబడిన రథము వైయాఘ్రము. ఈ ౨ పులితోలు గప్పిన రథము పేళ్లు.

**పాణ్డుకమ్బళసంవీతః స్యన్దనః పాణ్డుకమ్బళీ,**

పాణ్డు కంబళేన సంవీతః రథః పాణ్డుకంబళీ. నాన్తః. తెల్లకంబళిచేఁ గప్పఁబడిన రథము పాండుకంబళి.

**రథే కామ్బళ వాస్త్రాద్యాః కమ్బళాదిభి రావృతే.** 54

కంబళే నావృతో రథః కాంబళః-కంబళిచేతఁ గప్పఁబడునది. వస్త్రేణావృతో రథః వాస్త్రః-వస్త్రముచేతఁ గప్పఁబడిన రథము. ఆదిశబ్దముచేత క్షౌమాదులును గ్రహింపఁబడును. కంబళి మొదలగువానిచేఁ గప్పిన రథము.

**త్రిషు ద్వైపాదయః -**

ద్వైపశబ్దము మొదలు వాస్త్రశబ్ద పర్యంతము గల శబ్దములు మూఁడు లింగములయందు వర్తించును.

**రథ్యా రథకడ్యా రథవ్రజే,**

రథానాం సమూహో రథ్యా. రథకడ్యా చ-రథములయొక్క సమూహము రథ్య, రథకడ్యయును, ఈ ౨ రథ సమూహము పేళ్లు.

**ధూః స్త్రీక్లీ బే యానముఖమ్ -**

ధూర్వతి హిన స్తీతి ధూః. ర. సీ. ధుర్వీ హింసాయాం. పరులను హింసించునది. యానస్య ముఖం యానముఖం. యానమనఁగా రథాదులు; వానియొక్క ముఖము. ఈ ౨ రథములు మొదలైనవాని ముందు దిక్కు పేళ్లు.

**స్యాద్రథాంగ మవస్కరః.** 55

అవస్కీర్యతే తరుచితస్థానే విక్షిప్యత ఇతి అవస్కరః పా. అవస్కరః. కౄ విక్షేపే. ఆయాయుచిత స్థానములయందుఁ బెట్టఁబడునది. బండికన్నులు, కాఁడి, నొగ మొదలయిన రథావయవములు.

**చక్రం రథాఙ్గమ్ -**

కరోతి రథగమన మితి చక్రం. డు కృఞ్ కరణే. రథగమనమును జేయునది. రథస్యాఙ్గం రథాఙ్గం-రథమునకు అంగము. ఈ ౨ బండికంటి పేళ్లు.

**తస్యాన్తే నేమిః స్త్రీ స్యాత్ప్రధిః పుమాన్,**

నమతి శబ్దాయతే గమనసమయే నేమిః. ఇ. స్త్రీ. ణము ప్రహ్వత్వే శబ్దే చ. గమనమందు మ్రోయునది. నయతి రథ మితి నేమిః. ణీఞ్ ప్రాపణే. రథమును నడిపించునది. ప్రాన్తే ధీయతే విక్ష ప్యత ఇతి ప్రధిః. ఇ. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః. కడను బెట్టఁబడునది. ఈ ౨ బండికంటి కమ్మి పేళ్లు.

**పిణ్డికా నాభిః -**

పిణ్డ్యతే సర్వాణ్యగ్రాణ్యస్యామితి పిణ్డికా. పిడి సంఘాతే. కొని లన్నియు దీనియందుఁ గూర్పఁబడును. నభ్యతే హింస్యతే అక్షేణేతినాభిః. ణభ హింసాయాం. ఇరుసులచేతఁ బీడింపఁబడునది. ఈ ౨ బండికంటి నడిమితూము పేళ్లు.

**అక్షాగ్ర కీలకే తు ద్వయోరణిః -** 56

అణతి శబ్దాయత ఇత్యణిః. ఇ. ప్స. అణశబ్దే. గమన సమయమందు మ్రోయునది. పా. ఆణీః. "సీమావృక్షాగ్ర కీలేషు ద్వయో రాణి రాణి స్తథా" అని రుద్రుఁడు. అక్షమనఁగా ఇరుసు చివరయందు బండికండ్లు జాఱకుండుటకై వేయు చీల.

**రథగుప్తిర్వరూథో నా -**

రథో గుప్యతే ఽనేనేతి రథగుప్తిః. ఇ. స్త్రీ. గుపూ రక్షణే. రథము దీనిచేత రక్షింపఁబడును. వ్రియతే రథో ఽనేనేతి వరూథః. వృఞ్ వరణే. రథము దీనిచేత రక్షింపఁబడును. శస్త్రాదులవలన వికలముగాకుండ రథమునకుఁ గప్పు వ్యాఘ్ర చర్మము మొదలైన ప్రావరణముపేళ్లు. రథిక రక్షణార్థమై రథమందుఁ జేయఁ బడిన స్థాన విశేషము పేళ్లని కొందఱు.

**కూబరస్తు యుగంధరః,**

కవతే శబ్దాయతే కూబరః. కూఙ్ శబ్దే. మ్రోయునది. కుం మహీం వృణోతి ఆచ్ఛాదయతీతి వా కూబరః. వృఞ్ వరణే. భూమిని గప్పియుండునది. యుగం ధరతీతి యుగంధరః. ధృ ధారణే. యుగ మనఁగా కాఁడి; దాని ధరించునది. ఈ ౨ కాఁడిని గట్టుటకుఁ జేసిన మ్రాని పేళ్లు, నొగ.

**అనుకర్షో దార్వధస్థమ్ -**

అక్షం అనుకృష్యత ఇ త్యనుకర్షః. కృష విలేఖనే. ఇరుసువెనుక

తీయఁబడునది. నొగ దిగువ నుండు కొయ్య. కోడిపీఁట.

**ప్రాసఙ్గో నా యుగాన్తరమ్.** 57

ప్రాసజ్యతే బలీవర్దకం తేష్వితిప్రాసంగః. షంజ సంగే. ఎద్దులమెడల మీఁద కూర్చఁబడునది. యుగాన్తరం = రెండవకాఁడి పేరు.

**సర్వం స్యాద్వాహనం యానం యుగ్యం పత్త్రంచ ధోరణమ్,**

యాత్యనేన యానం. యా ప్రాపణే. దీనిచేత నరుఁడు పోవును. యుగం వహతీతి యుగ్యం. కాడిని వహించునది. పతంత్య నేన పత్రం. పత్ ౯ గతౌ. దీనిచేత పొందుదురు. ధోరతి చాతుర్యేణ గచ్ఛత్యనేనేతి ధోరణం. ధౌర్భగతిచాతుర్యే. దీనిచేత చాతుర్యముగా పోవుదురు. ఈ 3 ఏనుఁగు మొదలగు సర్వ వాహనములకును పేళ్లు.

**పరమ్పరా వాహనం యత్తద్వైనీతక మస్త్రియామ్.** 58

వోఢృభిః పరంపరయా వాహ్యత ఇతి పరంపరావాహనం-గుఱ్ఱములు మొదలయినవాని పరంపరంచేత వహింపబడునది. వినీతానామిదం వైనీతకం. అ. ప్న. శిక్షితములయిన గుఱ్ఱములు మొదలయినవాని సంబంధమైనది. తేరుమోకు పేళ్లు. పలువురు మోయఁదగిన యందలము మొదలగునది యని కొందఱు.

**ఆధోరణా హస్తిపకా హస్త్యారోహా నిషాదినః,**

ఆధోరంతి హస్తిన ఏభిరితి ఆధోరణాః. ధోర్భ గతిచాతుర్యే. వీరి చేత నేనుఁగులు చాతుర్యముగా నడచును. హస్తినః పాంతీతిహస్తిపకాః. పా రక్షణే. ఏనుఁగులను రక్షించువారు. హస్తినః ఆరోహంతీతి హస్త్యా రోహాః-ఏనుఁగు నెక్కువారు. హస్తిషు నిషాదంతీతి నిషాదినః. న. పు. షద్ ౯ విశరణగత్యవసాదనేషు. ఏనుఁగు నెక్కువారు. ఈ ౪ ఏనుఁగు మావటివానిపేళ్లు. ఏనుఁగునెక్కు దొరలును.

**నియన్తాప్రాజితా యన్తాసూతః క్షత్తా చ సారథిః.** 59

**సవ్యేష్ఠ దక్షిణస్థా చ సంజ్ఞా రథ కుటుమ్బినః,**

నియచ్ఛత్యశ్వానితి నియంతా. ఋ. పు. యంతా చ. ఋ. పు. యమ ఉపరమే. అశ్వముల నియమించువాఁడు గనుక నియంత, యంతయును. ౧, ౨. ప్రాజతి ప్రేరయత్యశ్వానితి ప్రాజితా. ౩. ఋ. పు. అజగతిక్షేపణయోః, గుఱ్ఱములను బ్రేరేపించువాఁడు. సుపత్యశ్యానితి సూ

తః ఘ్ర ప్రేరణే. గుఱ్ఱములను దోలువాఁడు. ౪. క్షదతి తాడయత్యశ్వానితి క్షత్తా. ఋ. పు. క్షద గతిహింసనయోః. గుఱ్ఱములను గొట్టువాఁడు. ౫. సారయ త్యశ్వానితి సారథిః. ఇ. పు. సృ గతౌ. గుఱ్ఱములను నడిపించువాఁడు. ౬. అశ్వాన్ ప్రేరయితుం కదాచి త్సవ్యే. కదాచి ద్దక్షిణే చ తిష్ఠతీతి సవ్యేష్ఠః. దక్షిణస్థశ్చ. ష్ఠా గతినివృత్తౌ. గుఱ్ఱములను దోలునప్పుడు కొంతసేపు ఎడమదిక్కునను, గొంతసేపు కుడిదిక్కున నుండు వాఁడు గనుక సవ్యేష్ఠుఁడు, దక్షిణస్థుఁడును. ౭, ౮. సవ్యేష్ఠశబ్దము నకారాంతమనియు ఋకారాంతమనియు కొందఱు. "సవ్యేష్ఠా దక్షిణస్థశ్చ" అని త్రికాండశేషము. అకారాంతమని కొందఱు. "సూతఃక్షత్తా నియంతా చ యంతా సవ్యేష్ఠ ఏవ చ" అని యమరమాల. రథకుటుమ్బినః = ఈ ౮ సారథికి పేళ్లు.

**రథిన స్స్యన్ద నారోహాః -**

రథాః యేషాం సంతీతి రథినః. న. పు- రథములు గలవారు. స్యందనా నారోహ న్తీతి స్యంద నారోహాః-రథముల నెక్కువారు. ఈ ౨ రథికుల పేళ్లు.

**అశ్వారోహాస్తు సాదినః.** 60

అశ్వా నారోహన్తీతి అశ్వారోహాః-గుఱ్ఱముల నెక్కువారు. సీ దంత్య వశ్యం పరబలం నాశయన్తీతి సాదినః. న. పు. షద్ ౡ విశరణగత్య వసాదనేషు. పరబలము నవశ్యముగా నాశముచేయువారు. ఈ ౨ గుఱ్ఱపు రౌతులపేళ్లు.

**భటా యోధాశ్చ యోద్ధారః -**

భటన్తే కాంక్షన్తే యుద్ధం భటాః. భట కాంక్షాయాం. యుద్ధమును గాంక్షించువారు. భటంతే పరస్పరం తిష్ఠతిష్ఠేతి భాషంత ఇతి వాభటాః. భట పరిభాషణే. పరస్పరము ఉండుండుమని భాషించువారు. యుద్ధ్యంత ఇతి యోధాః, యోద్ధారశ్చ. ఋ. పు. యుద్ధ సంప్రహారే. యుద్ధముచేయువారు గనుక యోధులు, యోద్ధలు. ఈ 3 యుద్ధము చేయువారి పేళ్లు.

**సేనారక్షాస్తు సైనికాః,**

సేనాం రక్ష న్తీతి సేనారక్షాః, సైనికాశ్చ. రక్షపాలనే. సేనను

రక్షించువారు సేనారక్షులు, సైనికులును. దండుగాచు తలారుల పేళ్లు.

**సేనాయాం సమవేతా యే సైన్యాస్తే సైనికాశ్చతే.** 61

సేనాయాం సమవేతాః సైన్యాః, సైనికాశ్చ–సేనయందుఁ గూడినవారు గనుక సైన్యులు, సైనికులు. ఈ ౨ సేనయందుఁ గూడిన చతురంగబలము పేళ్లు.

**బలినో యే సహస్రేణ సాహస్రాస్తే సహస్రిణః,**

సహస్రం బల మస్తీతి సాహస్రాః, సహస్రిణశ్చ.న.పు. వేయింటి లెక్కగల బలముగలవారు. ఈ ౨ వేయింటి లెక్కగల గుల్మము మొదలైన బలమునకు నాథులైనవారి పేళ్లు.

**పరిధిస్థః పరిచరః -**

పరిధౌ సేనాప్రత్యన్తే తిష్ఠతీతి పరిధిస్థః. ష్ఠా గతి నివృత్తౌ. సేనచుట్టు నుండువాఁడు. పరితశ్చరతీతి పరిచరః. చర గతి భక్షణయోః. సేన చుట్టును దిరుగువాఁడు. ఈ ౨ సేన చుట్టును గాచువాని పేళ్లు.

**సేనానీ ర్వాహినీపతిః.** 62

సేనాం నయతీతి సేనానీః. ఈ. పు. ణీఞ్ ప్రాపణే. సేనను నడిపించువాఁడు. వాహిన్యాః పతిః వాహినీపతిః. ఇ. పు. వాహిని యనఁగా దండు; దానికి దొర. ఈ ౨ దళవాయి పేళ్లు.

**కఞ్చుకో వారవాణో ౽ స్త్రీ -**

కఞ్చ్యతే బధ్యత ఇతి కంచుకః. కచి దీప్తిబంధనయోః. కట్టఁబడునది. బాణాన్ వారయతీతి వారవాణః. అ. ప్న. బాణముల నడ్డపెట్టునది. ౨ బొందళముపేళ్లు. కుబుసమువలె మేనికి మఱువైన చొక్కాయ.

**యత్తు మధ్యే సకఞ్చుకాః,**

**బధ్నన్తి తత్సారసన మధికాఙ్గః-**

సారం బలం సనోతీతి సారసనం–షణు దానే. బలము నిచ్చునది. అంగాదధికం అధికాంగం. అంగముకంటె నధికమైనది. కవచముఁ దొడుగుగొని దానిమీఁద దృఢార్థమై కట్టుత్రాడు పేళ్లు.

**అథ శీర్షకమ్.** 63

**శీర్షణ్యం చ శిరస్త్రే -**

శీర్షం రక్షతీతి శీర్షకం–శిరస్సును రక్షించునది. శిరసి హితం శీర్ష

ణ్యం– శిరస్సునందు హితమైనది. శిరః త్రాయత ఇతి శిరస్త్రం. త్రైజ్‌పాలనే. శిరస్సును రక్షించునది. ఈ 3 తలబొమిడికము పేళ్లు.

**అథ తనుత్రం వర్మ దంశనమ్,** 64

**ఉరశ్ఛదః కఙ్కటకో జగరః కవచో ౽ స్త్రియమ్.**

తనుం త్రాయత ఇతి తనుత్రం. త్రైజ్ పాలనే. శరీరమును రక్షించునది. వృణోతి శరీరంవర్మ. న. న. వృఞ్ వరణే. శరీరమును గప్పునది. దశతి శరీర మితి దంశనం. దంశ దశనే. పా. దంశనం. శరీరమును కదిసియుండునది. ఉరశ్ఛాదయతీత్యురశ్ఛద. ఛద అపవారణే. ఉరస్సును గప్పునది. కం వక్షః కటతీతి కంకటకః. కటే వర్షావరణయోః. వక్షస్సును గప్పునది. జగతా గృహ్యతే జగరః –జగముచే గ్రహింపఁబడునది. కంవాతం వంచయతీతి కవచః. అ. పు. వఞ్చుగతౌ. గాలిని బట్టునది. ఈ ౭ జోడుపేళ్లు. జీరాపేళ్లును.

**ఆముక్తః ప్రతిముక్తశ్చ పినద్ధ శ్చాపినద్ధవత్,**

ఆముచ్యతేస్మ ఆముక్తః; ప్రతిముచ్యతే స్మ ప్రతిముక్తః. ముచ్ ౯ మోక్షణే. ఉపసర్గవశమున బంధనార్థకము కట్టఁబడినది గనుక ఆముక్తము, ప్రతిముక్తమును. అపినహ్యత ఇతి పినద్ధః, అపినద్ధశ్చ. ణహబంధనే. బంధింపఁబడునది. అపినద్ధశబ్ద మెట్లు బద్ధవస్త్రాదివాచకమో, అట్లే పినద్ధ శబ్దము నని వచ్ఛబ్దార్థము. ౪ కట్టఁ బడిన వస్త్రము మొదలైనవాని పేళ్లు.

**సంనద్ధో వర్మిత స్సజ్జో దంశితో వ్యూఢకఙ్కటః.** 65

సన్నహ్యతే స్మ సన్నద్ధః. ణహ బంధనే. జోడుచేత బంధింపఁబడిన వాఁడు. వర్మసంజాత మస్యేతి వర్మితః–జోడు వీనికిఁ గలదు. సజ్జతేస్మసజ్జః. షస్జగతౌ. జోడును బొందినవాఁడు. దంశనం దంశస్తదస్య సంజాతమితిదం శితః – దంశము జోడు, అది వీనికిఁ గలదు. వ్యూఢః కంకటో ౽ నేనేతి వ్యూఢకంకటః – వహింపఁబడినజోడు గలవాఁడు. ఈ ౫ జోడు దొడిగినవాని పేళ్లు.

**త్రిష్వా ముక్తాదయః -**

ఆముక్త శబ్దము మొదలు ౯ శబ్దములు త్రిలింగములు.

**వర్మభృతాం కావచికం గణే,**

కవచినాం సమూహః కావచికం–కవచము గలవారి సమూహము కావచికము. జోడు దొడిగినవారి సమూహము.

**పదాతి పత్తి పదగ పాదాతిక పదా జయః.** 66

**పద్గశ్చ పదికశ్చ -**

పదాభ్యా మతతీతి పదాతిః. ఇ. పు. అతసాతత్యగమనే. అడుగులతో నెల్లప్పుడు నడచువాఁడు. పతత్యరీ౯ ప్రతిపత్తిః. పత్ ౹౭ గతౌ. శత్రువులను గూర్చి పోవువాఁడు. పదాభ్యాం గచ్ఛతీతి పదగః. గమ్ ౹౭ గతౌ. పదములచేతఁ బోవువాఁడు. పాదాత మస్యాస్తీతి పాదాతికః– పదాతి సమూహము గలవాఁడు. పదాభ్యా మజతీతి పదాజిః. ఇ. పు. అజగతి క్షేపణయోః. పద్భ్యాం గచ్ఛతీతి పద్గ; పదాభ్యాం చరతీతి పదికః– పాదములచేత చరించువాఁడు. ఈ ౭ కాలిబంటుపేళ్లు.

**అథ పాదాతం పత్తి సంహతిః,**

పదాతీనాం సమూహః పాదాతం–పదాతుల సమూహము పాదాతము. పత్తీనాం సంహతిః పత్తిసంహతిః–కాలిబంట్ల సమూహము.

**శస్త్రాజీవే కాణ్డపృష్ఠాయుధీ యాయుధికాస్సమాః.** 67

శస్త్రేణ ఆజీవతి శస్త్రాజీవః–శస్త్రముచేత బ్రతుకువాఁడు. కాండాః బాణాః పృష్ఠే యస్య సః కాండపృష్ఠః–బాణములు వీఁపునఁ గలవాఁడు. పా కాండస్పృష్ఠః, స్పృష్ఠకాండః. ఆయుధేన జీవతీత్యాయుధీయః, ఆయుధికశ్చ–ఆయుధముచేత బ్రతుకువాఁడు. ఈ ౪ ఆయుధమును ధరించి బ్రతుకువానిపేళ్లు.

**కృతహస్తస్సు ప్రయోగ విశిఖః కృత పుఙ్ఖవత్,**

కృతౌ శిక్షితౌ హస్తౌ యస్య సః కృతహస్తః–శిక్షితములయిన హస్తములు గలవాఁడు. సుష్ఠు ప్రయుజ్యంతే సుప్రయోగాః విశిఖాః యస్య సః సుప్రయోగవిశిఖః –లెస్సగా వేయఁబడు బాణములు గలవాఁడు. కృతోగృహీతః పుంఖోయేన సః కృతపుంఖః–లెస్సగా పట్టఁబడిన పింజలు (పిడులు) గలవాఁడు. ఈ 3 అమ్ములు గుఱిదప్పక వేయనేర్చినవాని వేళ్లు.

**అపరాద్ధపృషత్కో౭సౌ లక్ష్యాద్యశ్చ్యుత సాయకః.** 68

అపరాద్ధః అలబ్ధలక్ష్యః పృషత్కో యస్యసః అపరాద్ధపృషత్కః–గుఱితాఁకని బాణములు గలవాఁడు. గుఱితప్పిన యమ్ములు గలవాఁడు.

**ధన్వీ ధనుష్మా౯ ధానుష్కో నిషఙ్గ్య ధనుర్ధరః,**

ధన్వాస్యాస్తీతి ధన్వీ. న. పు. ౧. ధను రస్యాస్తీతి ధనుష్మా౯. త.

విల్లు గలవాఁడు. ౨. ధనుః ప్రహరణమస్యేతి ధానుష్కః-విల్లే ఆయుధముగాఁ గలవాఁడు.౩. నిషంగో ౽స్యాస్తీతి నిషంగీ. న. పు. నిషంగమనగా అమ్ములపొది; అది గలవాఁడు. ౪. అస్త్రం మంత్రప్రయుక్తాయుధం; త దస్యాస్తీతి అస్త్రీ. నాంతః. మంత్ర ప్రయుక్తాయుధము గలవాఁడు. "అస్త్రం చాపః తదస్యాస్తీతి అస్త్రీ-అస్త్రమనఁగా విల్లు; అది గలవాఁడు. "అస్త్రం చాపాయుధయోః" అని రభసుఁడు. ౫. దనుర్ధరతీతి ధనుర్ధరః. ధృఞ్ధారణే. విల్లును బట్టినవాఁడు. ఈ ౬ విలుకాని పేళ్లు.

**స్యాత్కాణ్డవాంస్తు కాణ్డీరః -**

కాండాః బాణాః అస్య సంతీతి కాండవాన్. త. కాండీరశ్చ-కాండములనఁగా బాణములు; అవి గలవాఁడు. ౨ అమ్ము పట్టినవానిపేళ్లు.

**శాక్తిక శ్శక్తిహేతికః.** 69

శక్తిః ప్రహరణ మస్యేతి శాక్తికః. శక్తిః హేతిః ఆయుధమస్య శక్తిహేతికః - శక్తియను నాయుధము గలవాఁడు శాక్తికుఁడును, శక్తి హేతికుఁడును. ఈ ౨ శక్తియను నాయుధ విశేషము గలవాని పేళ్లు.

**యాష్టీక పారశ్వధికౌ యష్టిపర్శ్వధ హేతికౌ,**

యష్టిః ప్రహరణ మస్యేతి యాష్టీకః-యష్టియనఁగా లగుడము; అది యాయుధముగాఁ గలవాఁడు. పరశ్వధః ప్రహరణమస్య పారశ్వధికః-పరశ్వధ మనఁగా గండ్రగొడ్డలి; అది యాయుధముగాఁ గలవాఁడు. ఈ ౨ ను, యష్టిపర్శ్వధహేతికౌ = వరుసగా దుడ్డుకట్టెయు, గండ్రగొడ్డలియు నాయుధముగాఁ గలవాని పేళ్లు.

**నైస్త్రింశికో ౽సిహేతి స్స్యాత్ -**

నిస్త్రింశః ప్రహరణమస్య నైస్త్రింశికః-నిస్త్రింశ మనఁగా ఖడ్గము; అది ఆయుధముగాఁ గలవాఁడు. అసిః హేతిరస్య అసిహేతిః-కత్తి యాయుధముగాఁ గలవాఁడు. ఈ ౨ అడ్డకత్తి యాయుధముగాఁ గలవాని పేళ్లు.

**సమౌ ప్రాసిక కౌన్తికౌ.** 70

ప్రాసః ప్రహరణ మస్య ప్రాసికః; కుంతః ప్రహరణమస్య కౌంతికః-ఈఁటె యాయుధముగాఁ గలవాఁడు గనుక ప్రాసికుఁడు, కౌంతికుఁడును. ఈ ౨ ఈఁటెగలవాని పేళ్లు.

**చర్మీ ఫలకపాణిస్స్యాత్ -**

నీళ్ళచేఁ దడుపఁబడునది. ఈ ౨ ఆళ్ళపేళ్లు.

**మఙ్గళ్యకో మసూరః -**

మంగళ మస్మాద్భవతి మంగళ్యకః–దీనివలన సౌఖ్యము గలుగును. మస్యతి పరిణమతి మసూరః. మస పరిణామే. పరిపక్వమగునది. హ్రస్వ మధ్యమును గలదు. "మసూరోమసురశ్చాపి" అని ద్విరూపకోశము. ఈ ౨ చిఱుసెనగలపేళ్లు.

**అథ మకుష్ఠక మయుష్ఠకౌ,**

**వనముద్గే -**

మంక్యతే ఫలైరితి మకుష్ఠకః. మకిమండనే. పండినప్పు డలంకృతమై యుండునది. పా. ముకుష్ఠకః. మినోతి కృమీనితి మయుష్ఠకః. డుమిఞ్ ప్రక్షేపణే. పురుగులను జెఱుచునది. పా. మయష్ట్రకః పా. మపుష్టకః. వనే ముద్గః వనముద్గః –అడవియందుండు పెసలు. ఈ 3 అడవి పెసల పేళ్లు.

**సర్షపే తు ద్వౌ తున్దుభ కదమ్బకౌ.** 17

సరతి దేహం వ్యాప్నోతీతి సర్షపః. సృగతౌ. దేహమును వ్యాపించునది. పా. సరిషపః. "సర్షపస్స్యాత్సరిషపః కుటస్నేహశ్చ తంతుభః" ఇతి త్రికాండశేషః. తుదతివ్యథయతి తుందుభః. తుదవ్యథనే. వ్యథపెట్టునది. పా. తంతుభః. శుష్కదశాయాం కుత్సిత మంబతే కదంబకః. అబిశబ్దే ఎండునప్పుడు కుత్సితముగా మ్రోయునది. ఈ 3 ఆవాల పేళ్లు.

**సిద్ధార్థస్త్వేష ధవళః -**

సిద్ధః అర్థః ప్రయోజనం యస్య సిద్ధార్థః–రక్షాకరమౌటచేత సిద్ధమైన ప్రయోజనము గలది. తెల్లని యావాలు.

**గోధూమ స్సుమన స్సమౌ,**

గుధ్యతే పరివేష్ట్యత ఇతి గోధూమః. గుధ పరివేష్టనే. విసరఁబడునది. శోభనం మన్యతే సుమనః. అ. పు. మనజ్ఞానే. మంచిదిగాఁదలఁపఁబడునది. గోదుముల పేళ్లు.

**స్యా ద్యావకస్తు కుల్మాషః -**

యౌతీతి యావకః. యు మిశ్రణే. కలిసియుండునది. యవకమని కొందఱు. కుత్సితో మాషః కుల్మాషః–కుత్సితమైన మాషము కుల్మాషము. పా. కుల్సాసః. ఈ ౨ అలచందల పేళ్లు. కాఱుమినుములును.

**చణకో హరిమన్థకః.** 18

చణ్యతే దీయత ఇతి చణకః. చణ దానే. ఇయ్యఁబడునది. "ధాతుప్రదీపాదౌ చనక స్సాధితః చణకస్తు చింత్యః" ఇటి టీకాసర్వస్వకారః. హరిభిర్మథ్యత ఇతి హరిమన్థకః మన్థ విలోడనే. గుఱ్ఱములచేఁ దినఁబడునది. ఈ ౨ సెనగలు.

**ద్వౌతిలే తిలపఞ్జశ్చ తిలపేజశ్చ నిష్ఫలే,**

నిష్ఫలస్తిల స్తిలపిఞ్జః, తిలపేజశ్చ-పొల్లయిన నువ్వులు గనుక తిలపింజము, తిలపేజమును. ఈ ౨ పొల్లునువ్వుల పేళ్లు.

**క్షవః క్షుతాభిజననో రాజికా కృష్ణికాసురీ.** 19

క్షౌత్యనేన క్షవః. టు క్షు శబ్దే. దీనిచేత తుమ్ముదురు. క్షుత మభిజనయతీతి క్షుతాభిజననః. జనీ ప్రాదుర్భావే. తుమ్మును బుట్టించునది. పా. క్షుధాభిజననః. రాజతే కృష్ణవర్ణపుష్పైరితి రాజికా. రాజృదీప్తౌ. నల్లనిపువ్వులచేతఁ బ్రకాశించునది. కృష్ణవర్ణయోగాత్ కృష్ణికా-నల్లవన్నె గలది. కటురసేన అసుర స్త్రీవ దనిష్టా ఆసురీ. ఈ. సీ. కారముచేత నసురస్త్రీవలె నసహ్యమైనది. ఈ ౪ నల్లనియావాల పేళ్లు.

**స్త్రియౌ కఙ్గు ప్రియఙ్గూద్వే-**

కేన జలేన గచ్ఛ త్యృద్గచ్ఛతీతి కంగుః. ఉ. సీ. గమ్ ౯గతౌ. ఉదకముచేత నెదుగునది. ప్రియాణ్యఙ్గాన్యస్య ప్రియఙ్గుః ఉ. సీ. ప్రియమైన యంగములు గలిగినది. ఈ ౨ కొఱ్ఱలపేళ్లు.

**అతసీ స్యా దుమా క్షుమా,**

అతతీత్యతసీ. ఈ. సీ. అత సాతత్యగమనే. ఏకాలమునైనను పైరగునది. ఉమతి శుష్కదశాయామిత్యుమా; క్షౌతీతి క్షుమా. ఉమ శబ్దే, టు క్షు శబ్దే. ఎండినప్పుడు గలగలయని మ్రోయునది. ఈ 3 నల్లయగిసెపేళ్లు.

**మాతులానీ తు భఙ్గాయామ్ -**

ఉపయోగివస్తుషు మా తులా ఽ స్యా ఇతి మాతులానీ. ఈ. సీ. ఉపయుక్త వస్తువులయందు దీనికి సరిలేదు. భజ్యత ఇతి భఙ్గా. భఞ్జో ఆమర్దనే. మెదపఁ బడునది. ఈ ౨ జనుముపేళ్లు.

**వ్రీహిఃఖేద స్త్వణుః పుమాన్.** 20

అణుత్వా దణుః. ఉ. పు. సూక్ష్మమైనది. కొఱ్ఱలకంటె నించుకంత గొప్పయైన వ్రీహిభేదము. చిఱువడ్లు.

**కింశారు స్సస్యశూకం స్యాత్ -**

హస్తాదికం కుత్సితం శృణాతీతి కింశారుః. ఉ. పు. శౄ హింసాయాం. హస్తాదులను కుత్సితముగాఁ బీడించునది. సస్యస్య శూకం సస్యశూకం-ధాన్యము యొక్క ముల్లు. ఈ ౨ ధాన్యముయొక్క ముంటిపేళ్లు.

**కణిశం సస్యమఞ్జరీ,**

కణా స్సన్త్యత్ర కణిశం. కణములు దీనియందుఁ గలవు. సస్యానాం మఞ్జరీ సస్యమఞ్జరీ. పైర్ల యొక్క గుత్తి. ఈ ౨ ఎన్నుపేళ్లు.

**ధాన్యం వ్రీహి స్తమ్బకరిః -**

దధాతి దేహ మితి ధాన్యం. డు ధాఞ్ ధారణ పోషణయోః. దేహమును బోషించునది. ౨. వ్రీహి శబ్ద వ్యుత్పత్తి చెప్పఁబడెను. స్తంబం కరోతీతి స్తంబకరిః. ఇ. పు. స్తంబమనఁగా గంట, దానిని జేయునది. ఈ 3 ధాన్యముపేళ్లు.

**స్తమ్బోగుత్స స్తృణాదినః.** 21

గుధ్యతి పరివేష్టయతి భువ మితి గుత్సః. పా. గుచ్ఛః. గుధ పరివేష్టవే. భూమిని గప్పియుండునది. స్తంబశబ్ద వ్యుత్పత్తి చెప్పఁబడెను. తృణాదులయొక్క గుత్సము స్తంబమని కొందఱు. స్తంబగుత్సముల లక్షణము. "హస్తన్యూనాధికం యస్య ప్రమాణం న తతః పరం, నాతి మాత్రశ్చ విస్తారో గుత్సస్స ఇతి కథ్యతే. పత్రాణి యేషా మాకాశేసారో భూమౌతు వర్తతే, తే ఽపి గుత్సా ఇతి ప్రోక్తా యథా స్యుర్మూల కాదయః. ఏకస్మా దేవ మూలాత్తులతా పుంజాద్వినిర్గతః, ఏకో ఽపిచ ప్రరోహైస్తు బహుభిః స్తంబ ఉచ్యతే" అని నిగమాభిధానము. ఈ ౨ తృణాదులయొక్క గంటపేళ్లు.

**నాళీ నాళం చ కాణ్డో ఽ స్య.**

నళతి బధ్నాతీతి నాళీ. ఈ. స్త్రీ. నాళంచ. నళ బంధనే. తృణమును బంధించునది. ఈ 3 తృణాదుల యొక్క కాఁడపేళ్లు. ఊఁచ.

**పలాలో ఽ స్త్రీ స నిష్ఫలః,**

పలతి పల్యతే వా పలాలః. పల గతౌ. పోవునది. నిష్ఫలః = గింజ

లు రాలిబోయిన, సః = ఆ కాఁడ. ఈ ౧ (గింజలు రాలిన) పోరికట్టు పేరు.

**కడఙ్గరో బుసం క్లీబే -**

కటతి ఖలమా వృణోతీతి కట్. తచ్చాఙ్గం రూపం యస్య సః కడంగరః. కటే వర్షావరణయోః. కళ్లమును వ్యాపించియుండునది బుస్యతే ఉత్సృజ్యత ఇతి బుసం. బుస ఉత్సర్గే. విడువఁబడునది. దంత్య సకారము. మూర్ధన్యషకారమని కొందఱు. "బుషవేషతుషారోషాః" అని మూర్ధన్యభేద గ్రంథమందు, పొల్లుపేళ్లు. కసవును.

**ధాన్యత్వచి తుషః పుమాన్.** 22

తుష్యతే உనేనాగ్ని రితి తుషః. తుష తుష్టౌ. దీనిచేత నగ్నితుష్టిని బొందును. ఉమకపేరు.

**శూకో உస్త్రీ శ్లక్ష్ణతీక్ష్ణాగ్రే-**

శ్యతి స్వాపగమేన ధాన్యం తనూకరోతీతి శూకః. ష్న. శోతనూకరణే. తాఁబోయిన వెనుక ధాన్యమును సూక్ష్మముగాఁ జేయునది. ఈ ౧ సన్నముక్కు గల ధాన్యముపేరు. సూక్ష్మమై వాఁడియునైన వరిముల్లు తేలుముల్లు మొదలైనది.

**శమీ శిమ్బా -**

శామ్యతి సస్యవృద్ధి రస్యాం సత్యాం శమీ. ఈ. సీ. శము ఉపశమే. ఇది కలుగఁగా సస్యవృద్ధి శమించును. శినోతి తనూకరోతి స్వగత బీజద్వారేణ కఫం పిత్తం చేతి శింబా. శిఞ్ నిశాతనే. తమలో నుండు గింజలచేత కఫమును పిత్తమును బోఁగొట్టునది. ఈ ౧ పెసలు మొదలగు కాయధాన్యములు నురిచిన పొట్టుపేళ్లు.

**త్రిషూత్తరే,**

ముందరఁ జెప్పఁబోవు బుద్ధశబ్దము మొదలుకొని బహులీకృత శబ్ద పర్యంతములైన శబ్దములు మూఁడు లింగములంయందును వర్తించును.

**ఋద్ధ మావసితం ధాన్యమ్ -**

అవైగుణ్యేన సంపన్నం ఫలం ఋద్ధం. ఋధు వృద్ధౌ. తృణాదులు లేక చక్కఁ బెట్టఁబడినది. ఆవస్యత ఇతి ఆవసితం. వన ఆచ్ఛాదనే. రక్షణార్థమై కప్పఁ బడునది. హ్రస్వాదియుఁ గలదు. "అవసానం గతేజ్ఞాతే ఋద్ధే உప్యవసితం త్రి" ష్వితి హ్రస్వాదౌ రభసః. ఈ ౨ నురిచిన ధాన్యము పేళ్లు.

**పూతం తు బహులీకృతమ్.** 23

బుసాపకరణేన శుద్ధత్వాత్ పూతం. పూఙ్ పవనే. పొల్లుపోవుటచేత శుద్ధమైనది. బహుమూల్యం లాతీతి బహుళం. తథా కృతం బహులీకృతం. లా ఆదానే. అధికమూల్యమును దీసికొనునట్లు చేయఁబడునది. తూర్పెత్తిన ధాన్యము పేళ్లు.

**మాషాదయ శ్శమీధాన్యే -**

శమీసహితం ధాన్యం శమీధాన్యం–పొట్టుగలిగిన ధాన్యము. ఆది శబ్దముచేత ముద్గకుళత్థ చణకతిలాదులు గ్రహింపఁబడును. మినుములు, పెసలు మొదలైన ధాన్యములు.

**శూకధాన్యే యవాదయః,**

శూకసహితం ధాన్యం శూకధాన్యం–ముండ్లు గలిగిన ధాన్యము. యవాదయ= యవలు మొదలైనవి. ఆదిశబ్దముచేత గోధూమాదులు గ్రహింపఁబడును. యవలు, గోధుమలు మొదలైనవి శూకధాన్యములనంబడును.

**శాలయః కలమాద్యాశ్చ షష్టి కాద్యాశ్చ పుంస్యమీ.** 24

శాల్యన్తే శ్లాఘ్యన్తే జనైరితి శాలయః. ఇ. పు. శాల శ్లాఘాయాం. జనులచేత పొగడఁబడునది. 'కలమాద్యాః' అనుచోట నుండు ఆదిశబ్దముచేత నెఱ్ఱరాజనములు దొడ్డరాజనములు మొదలైనవియును. షష్టికాద్యాః అనుచోట నుండు ఆదిశబ్దముచేత కలమాదులకంటె కొంచె మపకృష్టములైన ధాన్యములును గ్రహింపఁబడును. కలమము లనఁగా రాజనములు. షష్టికము లనఁగా నఱువది దినములకుఁ బండు ధాన్యములు. ఇవి శాలిధాన్యము లనంబడును. అమీ పుంసి = ఈ మాషయవశాలిక షష్టిక శబ్దములు పుంలింగమందు వర్తించును.

**తృణధాన్యాని నీవారాః -**

నితరాం వ్రియంతే నీవారాః. వృఙ్ వరణే. మిక్కిలి వరింపఁబడునవి. ఒకఁడు విత్తకయే పడి మొలచి పండెడు గునుకువరి, దూసర్లు మొదలైన తృణధాన్యములు.

**స్త్రీ గవేధు ర్గవేధుకా,**

గవి అభసి ఏధత ఇతి గవేధుః. ఉ. సి. గ వేధుకా. చ. ఏధ వృద్ధౌ.

నీళ్లలో వృద్ధిఁబొందునది గనుక గవేదువు, గవేధుకయును. పుల్లింగంబును గలదు. 'గవేధుర్నా గవేదుకః' అని రత్నకోశము. ఈ ౨ అడవిగోధుమలు.

**అయోగ్రం ముసలో ౽ స్త్రీ స్యాత్ -**

అయః అగ్రే అస్య అయోగ్రం. ప్న. ఇనుము అగ్రమందుఁ గలది. ముస్యతే ధాన్య మనేన ముసలః. ప్న. ముస ఖండనే. దీనిచేత ధాన్యము దంచఁబడును. ఈ ౨ రోఁకలిపేళ్లు.

**ఉదూఖల ములాఖలమ్.** 25

ఊర్ధ్వం ఖ మాకాశ మస్య ఉదూఖలం. ఉలూఖలం చ–మీద బయలై యుండునది. ఇక్కడ ఉదూఖల మనుపాఠము యుక్తము. ఉదూఖలపాఠ మపపాఠ మని టీకాసర్వస్వకారుఁడు. ఈ ౨ ఱోటిపేళ్లు.

**ప్రస్ఫోటనం శూర్ప మస్త్రీ -**

ప్రస్ఫోట్యతే బహిర్నిష్క్రియతే తుషాది రనేనేతి ప్రస్ఫోటనం. స్ఫుటిర్ విశరణే. దీనిచేత పొట్టు మొదలయినవి నిరసింపఁబడును. శీర్యతే తుషాది రనేనేతి శూర్పం. అ. ప్న. శౄ హింసాయాం. దీనిచేత పొట్టు మొదలైనవి చెరుగఁబడును. శూర్ప్యతే అనేన శూర్పం. శూర్పమానే. దీనిచేత కొలవఁబడును. ఈ ౨ చేటపేళ్లు.

**చాలనీ తితిఉః పుమాౝ,**

చాల్యతే అనయా చాలనీ. చల కంపనే. దీనిచేత ధాన్యాదులు త్రిప్పఁబడును. తనోత్యధస్తాత్పిష్టసారమితి తితఉః. తను విస్తారే. మిక్కిలి పొడియైనదానిని క్రిందికిఁగార్చునది. ఈ ౨ జల్లెడ పేళ్లు.

**స్యూత ప్రసేవౌ -**

సివ్యతే వేణుదళైరితి స్యూతః. పా. ప్యోనః, ప్రసేవశ్చ. షివు తంతుసంతానే. వెదురుబద్దలచేత నల్లఁబడునది. ఈ ౨ పళ్లికపేళ్లు.

**కణ్డోల పిటౌ -**

కంద్యతే మూషికైరితి కండలోః. కడి భేదనే. ఎలుకలచేఁ గొఱుకఁబడునది. ౧. పిట్యతే వేణుదళైరితి పిటః. పిటశబ్ద సంఘాతయోః. వెదురుబద్దలచేతఁ గూర్పఁబడునది. ఈ ౨ గంపపేళ్లు.

**కట కిలిఞ్జకౌ.** 26

కటత్యంగణదేశ మితి కటః. కటే వర్షావరణయోః. వాఁకిటి

ముందరి చోటును గప్పియుండునది. కిల్యతే ధాన్య మస్మిన్నితి కిలింజకః. కిలక్షేపే. దీనియందు ధాన్యము పోయఁబడును. ఈ ౨ చాఁపపేళ్లు.

**సమానౌ -**

పై మూఁడుజతలు సమానార్థలింగములు గలవి.

**రసవత్యాంతు పాకస్థానం మహానసమ్,**

రస స్సంస్క్రియమాణో ఽ స్యామస్తీతి రసవతీ. ఈ. సీ. సంస్కరింపఁబడు రసములు గలిగినది పాకస్య స్థానం పాకస్థానం–పాకమునకు స్థానమైనది. అనోవత్ శకటవ దుపకారకత్వాత్ అనః ఉపకరణం, మహత్ అనః ఉపకరణమస్య మహానసం–అధికమైన ఉపకరణము గలిగినది. ఈ 3 వంటయింటి పేళ్లు.

**పౌరోగవ స్తదధ్యక్షః-**

పురోగౌః జలమత్రాస్తీతి పురోగుః పాకస్థానం, తస్యాయ మధ్యక్షః పౌరోగవః. దీనిముందర నీల్లుండును గనుక పాకస్థానము పురోగువు అనంబడును; దానికి నధ్యక్షుఁడు పౌరోగవుఁడు. ౧. వంటయింటి యధికారి పేరు.

**సూపకారాస్తు వల్లవాః.** 27

**ఆరాళికా ఆన్ధసికా స్సూదా ఔదనికా గుణాః,**

సూపం వ్యఞ్జనం కుర్వన్తీతి సూపకారాః. డు కృఞ్ కరణే. కూరలు చేయువారు. ౧ వల్లన్తి భోక్తుః ప్రీతి ముత్పాదయంతీతి వల్లవాః. వల్లప్రీతౌ. భోజనము చేయువానికి ప్రీతిగలుగఁజేయువారు. పా. వర్ణవాః. ౨. అరాళంకుటిలం చరంతీతి ఆరాళికాః–కుటిలముగా సంచరించువారు. అంధః అన్నం తత్సాధనం శిల్పమేషాంతే ఆంధసికాః. అంధస్సనఁగా నన్నము; దానిఁ జేయు నేర్పుగలవారు. సూదయంతి తండులానితి సూదాః. షూద క్షరణే. తండులములను పక్వముచేయువారు. ఓదనం ప్రయోజనమేషాం తే ఔదనికాః–అన్నము ప్రయోజనముగాఁ గలవారు. గుణయంతి పాకం పునరావర్తయంతీతి గుణాః. గుణ అభ్యాసే. పాకమైనదానిని తిరుగఁబోసి వండువారు. ఈ ౭ వంటవాని పేళ్లు.

**ఆపూపికః కాన్దవికో భక్షకార ఇమే త్రిషు.** 28

అపూపః ప్రజోయన మస్య ఆపూపికః. కందుః స్వేదనీ తత్ర సం

స్కృత పిష్టాదికమపి ఉపచారాత్కందుః సపణ్యమస్యేతి కాందవికః–అపూపములు వండు పెనము కందు వనంబడును; దానియందు వండఁబడినదియు నుపచారము వలన కందువు; అది ప్రయోజనముగాఁ గలవాఁడు. భక్షం కరోతీతి భక్షకారః –కఠినమై విశదమై భక్షింపఁదగిన పదార్థము భక్షము. దానిని జేయువాఁడు. పిండివంటలు వండువానికిఁగాని అమ్మువానికిఁగాని పేళ్లు. పౌరోగవ శబ్దము మొదలు భక్షకారశబ్దము వఱకు ౧౧ శబ్దములు మూఁడు లింగములయందును వర్తించును.

**అశ్మన్త ముద్ధాన మధిశ్రయణీ చుల్లి రన్తికా,**
**అశ్మనో ఽ ప్యంతో ఽ త్రేతి అశ్మంతం -**

దీనియందు ఱాతికఁ గూడ నాశము గలుగును. ఉద్ధీయతే ఽ గ్నిరనేనేతి ఉద్ధానం. డు ధాఞ్ ధారణ పోషణయోః. దీనిచేత నగ్ని ధరింపఁబడును. పా. "ధ్మా శబ్దాగ్ని సంయోగయోః" అను ధాతువుమీద ఉధ్మానమని కొందఱు. అధిశ్రియతే అనయేత్యధిశ్రయణీ. ఈ. సీ. శ్రీఞ్ పాకే. దీనిచేత పాకము సేయఁబడును. చుల్ల్యతే ఽ గ్నిరస్యామతి చుల్లిః. చుల్ల భావకరణే. దీనియందు అగ్ని ప్రేరేపింపఁబడును. ఈకారాంతమును గలదు. అంతోనాశో ఽ స్యామస్తీతి అంతికా–దీనియందు పదార్థములకు నాశము గలుగును. ౫ ప్రొయ్యిపేళ్లు.

**అఙ్గారధాని కాఙ్గార శకట్యపి హసన్త్యపి.** 29
**హసన్యపి -**

అంగారా ధీయంతే ఽ స్యామితి అంగారధానికా–నిప్పులు దీనియందు ధరింపఁబడును. అంగారాణాం శకటీ అంగారశకటీ–నిప్పులకు శకటము. అంగారైర్హసతీవాస్తే హసంతీ. హసనీచ. ఈ. సీ. హసే హసనే. నిప్పులచే నవ్వుదానివలె నుండునది. ఈ ౪ అగ్నిష్ఠపేళ్లు. కుంపటి.

**అథ న స్త్రీ స్యా దఙ్గారః-**

అంగతి గచ్ఛంత్యంగారః. అ. ప్న. అగిగతౌ. పోవునది. "అంగార చుంబితమివ వ్యథమాన మాస్తే" అని నిప్పునందు ప్రయోగము. "కళఙ్కస్తత్రత్యో వ్రజతి మలినాంగారతులనాం" అని బొగ్గులయందు ప్రయోగము. నిప్పుపేరు. బొగ్గుపేరని కొందఱు.

**అలాత ముల్ముకమ్,**

దమనభయా న్నలాంతి ఏతన్న స్వీకుర్వంతీ త్యలాతం. లా ఆదా

నే. దహన భయమువలన దీనిం దాఁకరు. ఉచతి సమవైత్యత్నినేతి ఉల్మకం. ఉచ సమవాయే. అగ్నితోఁ గూడియుండునది. ఈ ౨ కొఱవిపేళ్లు. అంగారశబ్దము మొదలు 3 ను కొఱవికే పేళ్లని కొందఱు.

**క్లీబే ౭ మ్బరీషం భ్రాష్ట్రః-**

అంబతే(భజ్య మానలాజాదిభి రిత్యంబరీషం. అబి శబ్దే. వేఁచఁ బడులాజాది వస్తువులచేత మ్రోయునది. భ్రజ్యతే ౭స్మి న్నితి భ్రాష్ట్రం. భ్రస్జ పాకే. దీనియందు వేఁచఁబడును. ఈ ౨ మంగలము పేళ్లు.

**నా కన్దు ర్వా స్వేదనీ స్త్రియామ్.** 30

స్కందత్య పూపాదిక మితి కన్దుః. స్కందిర్ గతిశోషణయోః. అపూపాదులను శోషింపఁజేయునది. ఇది వికల్పమునఁ బుంలింగము, ఒక పక్షమందు స్వేదనీ సాహచర్యము వలన స్త్రీలింగమును. స్వేదతే అగ్ని తాపేనేతి స్వేదనీ. ఈ. సీ. ఞి స్విదా గాత్రప్రక్షరణే. అగ్ని తాపముచేఁ జెమ్మగిల్లునది. ఈ ౨ పెనముపేళ్లు.

**అలింజర స్స్యాన్మణికః -**

అలిం జీర్యతీ త్యలింజరః. జౄష్ వయోహానౌ. బలమును నశింపఁ జేయునది. మణతి గంభీరం ధ్వనతీతి మణికః. మణ శబ్దే. గంభీరముగా మ్రోయునది. పా. మణికం. ఈ ౭ కాఁగుపేళ్లు.

**కర్కర్యాలూ ర్గలన్తికా,**

కిరతి జలధారామితి కర్కరీ. ఈ. సీ. కౄ విక్షేపే. జలదారను జల్లునది. ఆ ఈష దుదకం లాతీ త్యాలుః. ఉ. సీ. లా ఆదానే. నీళ్లు కొంచెముగాఁ బట్టునది. పా. ఆలూః. ఊ. సీ. గళత్యంభో ౭స్యా ఇతి గళంతికా. గళక్షరణే. దీనివలన నీల్లు కాఱును. గరిగపేళ్లు. గిండివంటికుండ.

**పిఠరః స్థాల్యుఖా కుణ్డమ్ -**

పచ్యతే ౭న్నమత్రేతి పిఠరః. డు పచ్ష్ పాకే. దీనియం దన్నము వండఁ బడును. తిష్ఠన్తి పదార్థా అస్మిన్నితి స్థాలీ. ఈ. సీ. ష్ఠా గతి నివృత్తౌ. పదార్థములు దీనియందుండును. ఓఖతీ భోజనస్థానం గచ్ఛతీత్యుఖా. ఉఖ గతౌ. భోజనస్థానమును బొందునది. కుణ్యతే ౭స్మిన్నితి కుండం. కుడిదాహే. దీనియందు వండఁబడును. ఈ ౪ కుండపేళ్లు.

**కలశస్తు త్రిషు ద్వయోః.** 31

**ఘటః కుట నిపా -**

కం జలం లాతీతి కలశః. త్రి. లా ఆదానే. ఉదకమును దీసికొనునది. తాలవ్యాంతము. "సుక్షేత్రమివ సకలశాలికం స్నానాగారమ్" అని యాశ్చర్య మంజరియందు. "కలసః కలశో ఽపి చ" అని దంత్యాంతముగా రభసుఁడు. ఘటతే జలాహరణాయేతి ఘటః. ప్న. ఘట చేష్టాయాం. జలాహరణము కొఱకు ఘటించునది. కుటతీతి కుటః. కుట కౌటిల్యే. కుటిలమైనది. నితరాం పిబన్త్యనేనేతి నిపః. పా పానే. దీనిచేత మిక్కిలి పానముసేయుదురు. ఈ ౪ కడవపేళ్లు.

**అస్త్రీ శరావో వర్ధమానకః,**

శరం పతదుదకాదిక మవతీతి వరావః అ. ప్న. అవ రక్షణే. పడునట్టినీళ్లు మొదలయినదానిని రక్షించునది. శీర్యత ఇతి శరావః. శ్రూ హింసాయాం. నశించునది. వర్ధతే అనేన ఉదకాదికం వర్ధమానకః. దీనిచేత నీళ్లు మొదలగునవి పొంగును. వర్ధ్యతే ఛిద్యతే మహతః కర్మణ ఇతి వర్ధమానకః. వర్ధ ఛేదన పూరణయోః. గొప్పక్రియవలనఁ బగలునది. మూఁకుడుపేళ్లు.

**ఋజీషం పిష్టపచనమ్-**

ఆర్జయ త్యపూపాదిక మితి ఋజీషం. అర్జ అర్జనే. అపూపములు గలిగించునది. పిష్టం పచ్యతే ఽస్మిన్నితి పిష్టవ చనం. డు పచ్ష్పాకే. దీనియందు పిండి పక్వము చేయఁబడును. ఈ ౨ బూరెలమూఁకుడుపేళ్లు.

**కంసో ఽ స్త్రీ పానభాజనమ్.** 32

కామ్యతే పానార్థమితి కలసః. అ. ప్న. కము కాంతౌ. పానార్థమై కాంక్షింపఁ బడునది. పానస్య భాజనం పానభాజనం–పానము యొక్క పాత్రము. ఈ ౨ గిన్నెపేళ్లు.

**కుతూః కృత్తిస్నేహపాత్రే -**

కుత్సితం తన్యతే కుతూః. ఊ. సీ. తను విస్తారే. కుత్సితముగాఁ జేయఁ బడునది. కృత్తిస్నేహపాత్రే = తోలుతోఁ జేసిన తైలపాత్రము. కుతూః అనంబడును. పెద్దసిద్దె.

**సై వాల్పా కుతుపః పుమాన్,**

అల్పా కుతూః కుతుపః పు. సైవ= ఆ చిన్న సిద్దె పేరు.

**సర్వ మావపనం భాణ్డం పా త్రామత్రే చ భాజనమ్.** 33

ఆసమంతాత్ ఉప్యతే న్యస్యతే ధాన్యాదిక మత్రేతి ఆవపనం. ఆఙ్ పూర్వో వపి ర్న్యసనే. దీనియందు ధాన్యాది వస్తువులు పెట్టఁబడును గనుక ఆవపనమనఁగా గోనె కడవ గంప మొదలైన సర్వవస్త్వాధారములు. ౧ భణ్డ త్యాధేయస్య భాండం. భడి కల్యాణే. ఆధేయ వస్తువునకు శుభమును జేయునది. ౨. పాత్యాధేయ మితి పాత్రం. పారక్షణే. ఆధేయవస్తువును రక్షించునది. ౩. అమత్యాధేయ మత్రేతి అమత్రం. అమ గత్యాదౌ. ఆధేయ వస్తువు దీనియందుండును. ౪. భజ్యతే ఆధేయేనేతి భాజనం. భజ సేవాయాం. ఆధేయముచేత పొందఁబడునది. ఈ ౫ కడవ గంప మొదలైనదాని పేరు.

**దర్విః కమ్బిః ఖజాకా చ -**

దృణా త్యన్నాదిక మితి దర్వీ. ఈ. సీ. దృూ విదారణే. అన్నము మొదలయినదాని ఎనుపునది. కామ్యతే ఉష్ణపరిహారాయేతి కంబిః. కముకాంతౌ. ఉష్ణపరిహారార్థమై కాంక్షింపఁబడునది. ఖజతి మథ్నాతి శాకాదికమితి ఖజాకా. ఖజ మన్థే. శాకాదికమును మథించునది. ఈ 3 తెడ్డుపేళ్లు. గరిటె.

**స్యా త్తణ్డూ ర్దారు హస్తకః,**

తరన్త్యనయా ఉష్ణభయమితి తణ్డూః. ఊ.సీ. తౄ ప్లవనతరణయోః. దీనిచేత నుష్ణ భయమును తరింతురు. పా. తండు. ఉ. సీ. పా. తన్యతే విస్తీర్యత ఇతి తణ్డూః. తను విస్తారే. విస్తృతమైయుండునది. పా. తర్దూః. దారుమయీ హస్తప్రతికృతిః దారుహస్తకః–హస్తాకారమైన దారువు. ఈ ౨ చట్టువముపేళ్లు. కొయ్యతెడ్డు.

**అస్త్రీ శాకం హరితకం శిగ్రు -**

శక్యతే భోక్తుమనేన శాకం. శక్ ౫ శక్తౌ. దీనిచేత భోజనము చేయ శక్యమౌను. హరితవర్ణత్వాద్ధరితకం–పచ్చనైయుండునది. శినోత్యరుచి మితిశిగ్రు. శీఞ్ నిశాతనే. అరుచిని జెఱుచునది. ఈ 3 కూరపేళ్లు.

**రస్యతు నాడికా.** 34

**కడమ్బశ్చ కలమ్బశ్చ**

కద్యతే భుజ్యత ఇతి కడంబః, కలంబశ్చ. కద అదనే. భక్షింపఁ

బడునది గనుక కడంబము, కలంబమును. ఈ 3 కూర కాఁడపేళ్లు.

**వేశవార ఉపస్కరః.**

వేశం శాకస్యవ్యాప్తిం వృణోతీతి వేశవారః. విశప్రవేశనే. వృఞ్వరణే. శాకవ్యాప్తిని వరించునది. వేసవార మనిదంత్య సకారముగాఁ గొందఱు చెప్పుదురు. ఉపస్కరోతి శాక మిత్యుపస్కరః. డు కృఞ్కరణే. శాకమును లెస్సగాఁ జేయునది. ఇంగువ జీలకఱ్ఱ మొదలయిన సంబారముల పేళ్లు.

**తిన్త్రిడీకం చ చుక్రం వృక్షామ్లమ్ -**

తింత్రిడీ వృక్షజాతత్వాత్ తింత్రిడీకం–తింత్రిడీ వృక్షమునఁ బుట్టునది. పా. తింత్రిణీకం; తింతిడీకం. ౧. చకతి తర్పయతీతి చుక్రం. చుకతృప్తౌ–తృప్తిని జేయునది. ౨. వృక్షస్య ఆమ్లం వృక్షామ్లం–తింత్రిడీ వృక్షముయొక్క ఆమ్లము, చింతపండుపేళ్లు.

**అథ వేల్లజమ్.** 35

**మరీచం కోలకం కృష్ణ మూషణం ధార్మపత్తనమ్,**

వేల్లే సముద్ర వేలాతటే ప్రాయేణ జాయత ఇతి వేల్లజం. జనీ ప్రాదుర్భావే. సముద్రపుదరిని తఱుచుగాఁ బుట్టునది. మ్రియతే వ్యథతే జిహ్వాగ్రమనేనేతి మరీచం. మృజ్ ప్రాణత్యాగే. జిహ్వాగ్రము దీనిచేత వ్యథపడును. దీర్ఘ మధ్యమమును హ్రస్వమధ్యమమును గలదు. "మరీచం కోలకం ధార్మపత్తనం మరిచం సమ" మితి రభసః. కోలతి సంఘీభవతీతి కోలః. కుల సంఘాతే. సంఘమైయుండునది. కృష్ణవర్ణత్వాత్కృష్ణం. నల్లవన్నె గలది. ఉషతి తాపయతీతి ఊషణం. ఉషదాహే. తపించునది. హ్రస్వాదియు దీర్ఘాదియును గలదు. ధర్మపత్తనే భవం ధార్మపత్తనం. ధర్మపత్తనమను దేశమందుఁ బుట్టునది. ఈ ౬ మిరియాలపేళ్లు.

**జీరకో జీరణో ౨ జాజీ కణా -**

జీర్యతే అన్నమనేన జీరకః, జీరణశ్చ. జౄష్ వయోహానౌ. దీనిచేత నన్నము జీర్ణమౌను గనుక జీరకము, జీరణమును. ౧. ౨. అజంస్వాభావికమందాగ్ని మజతీతి అజాజీ. అజ గతిక్షేపణయోః. స్వాభావికమైన మందాగ్నినిఁ బోఁగొట్టునది. ఈకారాంతస్త్రీలింగము.

''స్తృజాజీజీరణౌ జీర'' ఇతి వోపాలితః. కణా స్సంత్యస్యా ఇతి కణా. సూక్ష్మావయవముల గలిగినది. ఈ ౪ జీలకఱ్ఱపేళ్లు.

**కృష్ణే తు జీరకే.** 36

**సుషవీ కారవీ పృథ్వీ పృథుః కాలోపకుఞ్చికా,**

సుష్ఠు సువతి ప్రేరయతీతి సుషవీ. ఈ. సీ. షూ ప్రేరణే. లెస్సగా మందాగ్నిని బోఁగొట్టునది. పా. సుశవీ. ౧. కారువ దగ్ని దీపనకర్మణి నిపుణత్వాత్ కారవీ. ఈ. సీ. అగ్నిదీపనమందు అగసాలవానివలె నేర్పరియైనది. బృహత్కరణయోగాత్ పృథ్వీ. ఈ. సీ. పృథుశ్చ. ఉ. సీ. దొడ్డ ప్రయోజనమును జేయునది గనుక పృథ్వి, పృథువును. కాలవర్ణత్వాత్ కాలా-నల్లనిది. ఉపకుంచయతి-వాతాదిక మల్పీకరోతీతి ఉపకుంచికా. కుంచగతి కౌటిల్యాల్పీభావయోః. వాతాదుల నల్పముగాఁ జేయునది. ఈ ౬ నల్లజీలకఱ్ఱపేళ్లు.

**ఆర్ద్రకం శృఙ్గబేరం స్యాత్ -**

ఆర్ద్రాయాం భవం ఆర్ద్రకం-ఆర్ద్రానక్షత్రమందుఁ బుట్టినది. శృంగవద్బేరం వపు రస్య శృంగబేరం-కొమ్ములవంటి యాకృతి గలిగినది. ఈ ౨ అల్లముపేళ్లు.

**అథ ఛత్త్రా వితున్నకమ్.** 37

**కుస్తుమ్బురు చ ధాన్యాకమ్ -**

ఛాదయతి పిత్తాదిదోషా నభిభవతీతి ఛత్రా. ఛద అపవారణే. పిత్తాది దోషములఁ జెఱుచునది. ౧. విశేషేణ పిత్తాదిరోగాన్ తుదతీతి వితున్నకం. తుద వ్యథనే. పిత్తాదిరోగములను విశేషముగాఁ బోఁగొట్టునది. కుత్సితం దాహాది రోగం తుమ్పతీతి కుస్తుంబురు. ఉ. న. తుబి అర్దనే. కుత్సితమైన దాహాదిరోగములఁ జెఱుచునది. ధాన్యసాదృశ్యమకతీతి ధాన్యాకం. అక కుటిలాయాం గతౌ. ధాన్య సాదృశ్యమును బొందునది. ఈ ౪ కొతిమిరిపేళ్లు. ధనియాలు.

**అథ శుణ్ఠీ మహౌషధమ్,**

**స్త్రీనపుంసకయో ర్విశ్వం నాగరం విశ్వభేషజమ్.** 38

శుణ్ఠతి శుష్యతీతి శుణ్ఠీ. ఈ. సీ. శుఠిశోషణే. ఎండినది. మహచ్చత దౌషధం. మహౌషధం - దొడ్డయౌషధము. విశ్వదోషజిత్త్వాత్

విశ్వం. స్న. సమస్తదోషములఁ జెఱుచునది. నగరాఖ్యదేశే భవం నాగరం–నగరదేశమందు ప్రచురమైనది. విశ్వాఖ్యభేషజత్వాత్ విశ్వభేషజం–విశ్వమనుపేరుగల యౌషధము. ఈ ౫ సొంటిపేళ్లు.

**ఆరనాళక సౌవీర కుల్మాషాభిషుతాని చ,**

**అవన్తీసోమ ధాన్యామ్ల కుఞ్జలానిచ కాఞ్జి కే.** 39

అరనాళ మన్నం తన్నిస్సృతత్వాత్ ఆరనాళకం. ఆరనాళమనఁగా నన్నము; అందువలనఁ బుట్టినది. సువీరాఖ్యదేశే ప్రాయేణ భవతీతి సౌవీరం– సువీరాఖ్య దేశమందు తఱుచుగాఁ గల్గునది. కుల్మాషైరభిషూయతే పరివాస్యత ఇతి కుల్మాభిషుతం. షుఞ్ అభిషవే. అడవిమినుములచేత నూరఁబెట్టఁబడునది. కుల్మాషము, అభిషుతము అని రెండుపేళ్లుగాఁ గొందఱు చెప్పుదురు. అవంత్యాఖ్యదేశే ప్రాయేణ సూయత ఇతి అవంతీసోమం. షూఙ్ ప్రాణిప్రసవే. అవంతి దేశమందు తఱుచుగాఁ బుట్టునది. అమ్లీభూత ధాన్యత్వాత్ ధాన్యామ్లం–పులిసిన ధాన్య జలము. కుత్సితం జలం కుంజలం–కుత్సితమైన జలము. కేన జలేన అంజికా అభివ్యక్తి రస్యేతికాంజికం–జలముచేత నభివ్యక్తి గలది. పా. కాంచికం. ఈ ౯ కలిపేళ్లు. పులియఁబెట్టిన కడుగునీళ్లు.

**సహస్రవేధి జతుకం బాహ్లీకం హిఙ్గు రామఠమ్.**

సహస్రం బహుతరమపి శాకాదికం విధ్యతి స్వగంధేన పరివాసయ తీతి సహస్రవేధి. ఇ. న. అనేకములైన శాకాదులను తన పరిమళముచేత వాసింపఁ జేయునది. సహస్రమపి విధ్యతి రోగానితివా సహస్రవేధి. వ్యధతాడనే. అనేక రోగములను జెఱుచునది. వృక్షవిశేషాజ్జాయత ఇతి జతుకం. జనీ ప్రాదుర్భావే. వృక్ష విశేషమువలనఁ బుట్టునది. బాహ్లీకదేశేభవత్వాత్ బాహ్లీకం. బాహ్లికదేశ మందుఁ బుట్టునది. పా. బాహ్లికం. హినోతిగంధేన గృహాంతరంగచ్ఛతీతి హింగు. ఉ. న. హిగతౌ. పరిమళముచేత గృహాంతరమును బొందునది. నస్త్రీహింగుః– అనునన్య తంత్రమువలనఁ బుంలింగమును. రమఠదేశేభవత్వాత్ రామఠం– రమఠమను దేశమందుఁ బుట్టునది. ఈ ౫ ఇంగువపేళ్లు.

**తత్పత్రీ కారవీ పృథ్వీ బాష్పికా కబరీ పృథుః.** 40

కారువత్కర్మణి నిపుణత్వాత్ కారవీ. ఈ. సీ. శిల్పివలె కార్యమందు సమర్థమైనది. బహుకార్యకరత్వాత్ పృథ్వీ. ఈ. సీ. పృథుశ్చ. ఉ. సీ. అనేక ప్రయోజనములను జేయునది గనుక పృథ్వి, పృథువును. బాష్పం నిర్యాసం ముంచతీతి బాష్పికా–బంకను విడుచునది. కథం కించిత్కబరీ సామ్యాత్ కబరీ–ఒకానొక విధమున కొప్పుపోలికగలది. ఈ ౫ ఇంగువప్రాని పేళ్లు.

**నిశాఖ్యా కాఞ్చనీ పీతా హరిద్రా వరవర్ణినీ,**

నిశాయాః ఆఖ్యా యస్యాస్సా నిశాఖ్యా–రాత్రి కేపేళ్లు గలవో ఆపేళ్లు దీనికిఁ గలవు గనుక నిశాఖ్య. కాంచనవర్ణత్వాత్ కాంచనీ, ఈ. సీ. బంగారువన్నెగలది. పీతవర్ణత్వాత్ పీతా–పచ్చని వన్నెగలది. హరిద్వర్ణం ద్రాతీతి హరిద్రా. ద్రా కుత్సాయాం గతౌ. పచ్చనివన్నె గలది. శ్రేష్ఠవర్ణత్వాత్ వరవర్ణినీ. ఈ. సీ. మంచివన్నె గలది. ఈ ౫ పసుపు పేళ్లు.

**సాముద్రం యత్తు లవణ మక్షీబం వశిరం చ తత్.** 41

అక్ష్ణోతి వ్యాప్నోతీతి అక్షీబం. అక్షూ వ్యాప్తౌ. శాకాదులను వ్యాపించునది. వష్టికామయతే రసాభివ్యంజకత్వాదేతదితి వశిరం. వశకాంతౌ. రసమును దెలియఁ జేయునది గనుక దీని నిచ్ఛయింతురు. పా. వసిరం. ఈ ౨ సముద్రమందుఁ బుట్టిన యుప్పు పేళ్లు.

**సైన్ధవో ౽ స్త్రీ శీతశివం మాణిబన్థం చ సిన్ధుజే,**

సింధుదేశేభవః సైంధవః ఆ. ప్న. సింధు దేశమందుఁ బుట్టునది. శీంశినోతి ఉష్ణవీర్యత్వాదితి శీతశివం. శిఞ్ నిశాతనే. ఉష్ణవీర్యమౌట వలన శైత్యములు బోఁ గొట్టునది. పా. సితంశుభ్రం శివం శుభంచతత్ సితశివం. తెల్లనై శుభప్రదమై యుండునది యని దంత్యసకారయుక్త హ్రస్వాదిగాఁ గొందఱు చెప్పుదురు. మణిబంధశైలేభవం మాణిబంధం–మణిబంధమను పర్వతమందుఁ బుట్టినది. పా. మాణిమన్థం. ఈ ౪ సైంధవలవణము పేళ్లు.

**రౌమకే బస్తకమ్ -**

రుమాఖ్యాకరేభవం రౌమకం–రుమ యను గనియందుఁ బుట్టునది. బస్తః అజః తద్గంధయోగాత్ బస్తకం–మేఁక కంపువంటి కింపుగలది. పా. వసుకం. సంభరిదేశమందు రుమ యను నుప్పుగని గలదు; అందు వేసిన

కాష్టము కొన్ని దినములకు ఉప్పగును. దానియందుఁ బుట్టిన యుప్పునందు రౌడకబస్తక శబ్దములు వర్తించును. చౌటుప్పని కొందఱు.

**పాక్యం బిడం చ కృతకే ద్వయమ్.** 42

పక్తవ్యం పాక్యం–వండఁదగినది. బిడతిభిందతి గుల్మాదికమితిబిడం. బిడభేదనే. గుల్మాదులను బోఁగొట్టునది. అంటుప్పుపేళ్లు.

**సౌవర్చలే ౽ క్షరుచకే -**

సౌవర్చలాకరోద్భవత్వాత్ సౌవర్చలం–సౌవర్చలమను గనియందుఁ బుట్టునది. అక్ష్ణోతిబహ్వౌషదాదికమితి అక్షం. అక్షూవ్యాప్తౌ. అనేకములైన యౌషధాదులలోఁ గలయునది. రోచతే అన్నమనేనేతి రుచకం. రుచదీప్తౌ అభిప్రీతౌ చ. దీనిచేత నన్నము రుచించును. ఈ 3 సౌవర్చలవణము పేళ్లు.

**తిలకం తత్ర మేచకే,**

తిలతి స్నిహ్యతీతి తిలకం. తిల స్నేహనే. జిడ్డు గలిగియుండునది. ఈ ౧ నల్లని సౌవర్చలవణము పేరు.

**మత్స్యన్డీ ఫాణితం ఖణ్డవికారౌ-**

సారభూతమై ఘుటికయగునట్లు కాఁచిన చెఱకుపాగు మత్స్యంది యనంబడును. అర్ధపాకముగాఁ గాఁచిన పాగు ఫాణిత మనంబడును. మందం స్యందత ఇతి మత్స్యందీ. ఈ. సీ. స్యందూ ప్రస్రవణే ఇంచుకంత కరఁగునది. పా. మత్సండీ. ఫణతి ద్రవత్వాదితి ఫాణితం. ఫణగతౌ. ద్రవరూపమై జాఱునది. ఈ ౨ శర్కరా వికారములు.

**శర్కరా సితా.** 43

శీర్యత ఇతి శర్కరా. శౄ విశరణే. కరఁగిపోవునది. ధవళవర్ణ త్వాత్ సితా – తెల్లనివన్నె గలది. పంచదార.

**కూర్చికా క్షీర వికృతి స్స్యాత్ -**

కూర్చం క్షీరమస్తు త దస్యా మస్తీతి కూర్చికా, కూర్చమనఁగా పాల మీఁగడ; అది దీనియందుఁ గలదు. ౨. జున్ను పేరు. "దధ్నాసహపయః పక్వం యత్తత్స్యాద్దధికూర్చికా, తక్రేణ పక్వం యత్క్షీరం సా భవేత్తక్రకూర్చికా" అని దీనికి దధికూర్చిక, తక్రకూర్చిక యని భేదములు గలవు.

**రసాలా తు మార్జితా,**

"అర్ధోదకం సుచిరపర్యుషితస్య దధ్నః ఖండస్య షోడశపలాని శశిప్రభస్య, సర్పిః పలం మరిచసర్షపయోః పలే ద్వే శుంఠ్యాః పలార్ధమపి వార్ధపలం చతుర్ణాం. శ్లక్ష్ణాసరోజనయనా మృదుపాణిఘృష్టా కర్పూర ధూళి సురభీకృత భాండసంస్థా, దివ్యా వృకోదరకృతా సరసా రసాలా చాస్వాదితా భగవాతా మధుసూదనేన" అని సూదశాస్త్రము రసాꣳ ఆలాతీతి రసాలా. లాదానే. నానావిధములైన రసములు గలది. మార్జ్యతే శోధ్యత ఇతి మార్జికా. మృజూశుద్ధౌ. శోధింపఁబడునది. సిగరిపేళ్లు. దధిశర్కరామరీచ్యాది కృతమైన లేహ్యము పేళ్లని కొందఱు.

**స్యాత్తేమనం తు నిష్ఠానమ్ -**

తిమత్యార్ద్రీభవతీతి తేమనం. తిమష్ఠిమి ఆర్ద్రీభావే. ఆర్ద్రమై యుండునది. తిష్ఠంత్యస్మిꣳ రసా ఇతి నిష్ఠానం–దీనియందు రసములుండును. తిమ్మనము పేళ్లు. మజ్జిగపులుసు (పాలు, పిండి, బెల్లము వేసి వండినది).

**త్రిలిఙ్గా వాశితావధేః.** 44

శూలాకృతశబ్దము మొదలు వాశితశబ్దమువఱకు ముందు చెప్పఁగల శబ్దములు త్రిలింగములు.

**శూలాకృతం భటిత్రం చ శూల్యమ్**

శూలే నోద్భధ్యతే పచ్యతే శూలాకృతం, శూల్యంచ. ఇనుప సలాకకు గ్రుచ్చి పక్వము చేయఁబడునది గనుక శూలాకృతము, శూల్యమును, భటతీతి భటిత్రం. భటభృతౌ. పోషించునది. కఱకుట్లపేళ్లు.

**ఉఖ్యం తు పైఠరమ్,**

ఉఖాయాం సంస్కృతం ఉఖ్యం. పిఠరే సంస్కృతం పైఠరం–ఉఖమనినను పిఠరమనినను కుండ; దానియందుఁ బక్వము చేయఁబడునది గనుక ఉఖ్యము; పైఠరమును. కుండయందు వండిన పిండి మొదలైనదాని పేళ్లు.

**ప్రణీత ముపసంపన్నమ్ -**

రసాదినా ప్రకర్షం నీతం ప్రణీతం. ణీఞ్ప్రాపణే. రసాదులచేత నతిశయమును బొందింపఁబడినది. రసాధిభిరుపసంపద్యత ఇతి ఉప

సంపన్నం. షద్ ౯గతౌ. రసాదులచేత సమగ్రమైనది. పాకముచేతను రసముచేతను సమగ్రమైన శాకాదులపేళ్లు.

**ప్రశస్తంస్యా త్సు సంస్కృతమ్,** 45

ప్రశస్యత ఇతి ప్రశస్తం. శంసుస్తుతౌ. స్తోత్రము చేయఁబడునది. పా. ప్రయస్తం. హింగుజీరకాదులచేత తిరగఁబోసిన పదార్థము పేరు.

**స్యా త్పిచ్ఛిలం తు విజిలమ్ -**

పిచ్ఛాస్య సంజాతా పిచ్ఛిలం–పిచ్ఛ యనఁగా బంక; అది గలిగినది. నిజతే సద్రవత్వేన చలతి విజిలం. ఓవిజీ భయచలనయోః. ద్రవముగల దౌటచేత కదలునది. ఈ ౨ జిడ్డుగల వస్తువు పేళ్లు.

**సంమృష్టం శోధితం సమే,**

సంమృజ్యత ఇతి సంమృష్టం. మృజూశుద్ధౌ. శోధ్యతి ఇతి శోధితం. శుధశౌచే. శోధింపఁబడునది గనుక సంమృష్టము, శోధితమును, గడ్డిఱాళ్లు మొదలగునవి లేకుండునట్లు శోధింపఁబడిన వస్తువుపేళ్లు. గాలించినది.

**చిక్కనం మసృణం స్నిగ్ధమ్ -**

చిక్కత ఇతి చిక్కణం. చితీసంజ్ఞానే. ఎఱుఁగఁబడునది. మస్యతిద్రవత్వేన పరిణమతీతి మసృణం. మస పరిణామే. ద్రవముగాఁ బరిణమించునది. స్నిహ్యతీతి స్నిగ్ధం. ష్ణిహప్రీతౌ. మిసిమిగలది. ఈ 3 మిసిమి (నిగ్గు)గల వస్తువుపేళ్లు. దట్టమును.

**తుల్యే భావిత వాసితే.** 46

భావ్యత ఇతి భావితం. భువో ఽవకల్కనే. వాస్యత ఇతి వాసితం. వస నివాసే. వాసింపఁబడునది గనుక భావితము, వాసితమును. ఈ ౨ వాసింపఁబడిన వస్తువు పేళ్లు.

**ఆపక్వం పౌలి రభ్యూషః.**

ఈషత్పక్వ మాపక్వం–ఇంచుకంత పక్వమైనది. పులతి మహద్భవతీతిపౌళిః. పు. పులమహత్వే. ఉబ్బునది. అభ్యూష్యత ఇత్యభ్యూషః. ఊష రుజాయాం. ఉడుకఁ బెట్టఁబడునది. ఈ 3 గుగ్గిళ్ల పేళ్లు.

**లాజాః పుంభూమ్ని చాక్షతాః,**

లాజ్యంతిఇతి లాజాః. లాజభర్జనే. వేఁచబడునది. నక్షణ్యంత ఇత్యక్షతాః. క్షణహింసాయాం. క్షతములేనివి. లాజాక్షతశబ్దములు పుంలింగ

బహువచనములు. లాజశబ్దము స్త్రీలింగంబును, ఏకవచనాంతంబును గలదు. అక్షతశబ్దము నపుంసకంబును, ఏకవచనాంతంబును గలదు. "లాజాః పుంసి బహుత్వే నా స్త్రియాం లాజాపి చాక్షత" మితి సంపారావర్తః. ఈ ౨ లాజలపేరు. అక్షతలపేరు.

**పృథుక స్స్యాచ్చి పిటకః -**

పృథుత్వాత్ పృథుకః–దంచఁబడినదై పెద్దదగునది. నితరాంభవ తీతిచిపిటకః –ఘనమౌనట్టిది. పా. చిపుటకః "చిపిటస్స్యాచ్చిపుటక" ఇతి రభసః. అడుకులు.

**ధానా భృష్టయవే స్త్రియామ్.** 47

ధనతి పుష్ణంతీతి ధానాః. ధనధాన్యే. పోషించునది. స్త్రీలింగము నిత్యబహు వచనాంతము. ఈ ౨ బొరుగుల పేళ్లు.

**పూపో ఽ పూపః పిష్టకస్స్యాత్-**

పునాతీతి పూపః. పూఙ్ పవనే. పవిత్రము సేయునది. నపూయతే నవిశీర్యత ఇత్యపూపః. పూయీవిశరణే. జీర్ణముగానిది. పిష్టవికారత్వాత్ పిష్టకః–పిండిచేతఁ జేయఁబడునది. ఈ 3 పిండివంట పేళ్లు.

**కరమ్భో దధిసక్తవః,**

కీర్యతే దధ్యత్రేతి కరంభః. కౄవిక్షేపే. దీనియందుఁ బెరుఁగు చిలుకఁ బడును. ఇక్కడ పవర్గచతుర్థము. "సాంభఃకుంభం కరంభ" మని బాణానుప్రాసము. మిశ్ర వాచియైన వర్గతృతీయము. "కరేటుకోకకురర కలహంసకరంబితే" యని విదగ్ధముఖమండనము. పెరుఁగు కలిపిన వేఁపుడు పిండిపేరు.

**భిస్సా స్త్రీ భక్త మన్ధో ఽ న్న మోదనో్ఽ స్త్రీ స దీదివిః.** 48

భస్యతే భక్ష్యత ఇతి భిస్సా. సీ. భసభక్షణదీప్త్యోః. భక్షింపఁబడునది. భజ్యత ఇతి భక్తం. భజసేవాయాం. ఆశ్రయింపఁబడునది. అద్యత ఇత్యంధః. స. న. అదభక్షణే. భక్షింపఁబడునది. అనంత్యనేనేత్యన్నం. అనప్రాణనే. దీనిచేత బ్రతుకుదురు. ఉందతిక్లిద్యతీత్యోదనః. అ. పు. ఉందీక్లేదనే. పాసినప్పుడు నీళ్లు కాఱునది. దీవ్యంత్యనేనేతి దీదివిః. ఇ.పు. దివు క్రీడాదౌ. దీనిచేతఁ బ్రకాశింతురు. ఈ ౬ వంటకముపేళ్లు.

**భిస్కటా దగ్ధికా -**

కుత్సితా భిస్సా భిస్సటా–కుత్సితమైన యన్నము. దగ్ధైవ దగ్ధికా–మాడినది. ఈ ౨ మాడిన వంటకముపేళ్లు.

**సర్వరసాగ్రే మణ్ణ మస్త్రియామ్,**

మండయతి రసమితి మండం. అ. ప్న. మఢిభూషాయాం. రసము నలంకరించునది. నెయ్యి నూనె మొదలైన సకల రసములయొక్క పైతేటపేరు.

**మాసరా చామనిస్రావా మణ్డే భక్త సముద్భవే.** 49

మస్యతి ఘనీభావేన పరిణమతీతి మాసరః. మస పరిణామే. పేరుకొనునది. ఆచమ్యతే పీయత ఇత్యాచామః. చము అదనే. పానము చేయఁబడునది. మూత్రం నిస్రావయతి నిస్రావః. స్రుగతౌ. మూత్రమును వెళ్లించునది. ఈ 3 వార్చిన గంజి పేళ్లు.

**యవాగూ రుష్ణికా శ్రాణా విలేపీ తరలా చ సా,**

యూయతే తండులాదినేతియ వాగూః. సీ. యుమిశ్రణే. బియ్యము మొదలైనదానితోఁ గూర్పఁబడునది. ఉష్ణత్వాదుష్ణికా–ఉష్ణమైనది. శ్రాయత ఇతి శ్రాణా. శ్రాపాకే. కాఁచఁబడునది. విలింపతి దర్వీమితి విలేపీ. ఈ. సీ. లిప ఉపదేహే. గరిటెతోఁ గూడియుండునది. తరళత్వాత్తరళా–పలచనిది. ఈ ౫ కాఁపుడుగంజి పేళ్లు.

**గవ్యం త్రిషు గవాం సర్వమ్ -**

గోరిదం గవ్యం. త్రి. గో సంబంధమైనది. ఆవు పాలు మొదలైనవియును, దాని యవయవములను.

**గోవి డ్గోమయ మస్త్రియామ్.** 50

గోః విట్పురీషం గోవిట్. ష. సీ. గోమయంచ. అ. ప్న. ఆవుపేఁడ గోవిట్టు, గోమయమును. ఈ ౨ ఆవుపేఁడపేళ్లు.

**తత్తు శుష్కం కరీషో ఽ స్త్రీ -**

కీర్యత ఇతి కరీషః. అ. ప్న. కౄవిక్షేపే. చల్లఁబడునది. ఎండినపేడ పేరు. (ఏఱు పిడక).

**దుగ్ధం క్షీరం పయ స్సమమ్,**

దుహ్యత ఇతిదుగ్ధం. దుహప్రపూరణే. పితుకఁబడునది. ఘస్యత

ఇతి క్షీరం. ఘస్ ౙ అదనే. త్రాగఁబడునది. పీయత ఇతిపయః స. న. పాపానే. పానము చేయఁబడునది. ఈ 3 పాలపేళ్లు.

**పయస్య మాజ్య దధ్యాది -**

పయసో వికారః పయస్యం–పాలయొక్క వికారము. నెయ్యి, పెరుఁగు, వెన్న, మజ్జిగ మొదలైనది.

**ద్రప్సం దధి ఘనేతరత్.** 51

ద్రవతీతి ద్రప్సం. ద్రుగతౌ. ద్రవరూపమైనది. నడిమి పెరుఁగు ఘన మనంబడును. మీఁది పెరుఁగు శర మనంబడును. ఇందులో ఘనము తప్పఁ దక్కిన రెండు విధములును ద్రప్స మనంబడును. కొందఱు శరమనుదానినే ద్రప్సమని వాడెదరు.

**ఘృత మాజ్యం హవి స్సర్పిః -**

జిఘర్తీతి ఘృతం. ఘృక్షరణదీప్త్యోః. కరఁగునది. ౧. అంజనీయ మోదనాదౌ సేచనీయ మిత్యాజ్యం. అంజూ వ్యక్తి శ్లక్ష్ణ కాంతిగతిషు. శ్లక్ష్ణం సేచనం–అన్నాదులయందుఁ బోయఁదగినది. ౨. హూయత ఇతి హవిః. స. న. హుదానా దనయోః. వేల్వఁబడునది. ౩. సర్పతీతి సర్పిః. సృప్ ౙగతౌ. వ్యాపించునది. ఈ ౪ నేతి పేళ్లు.

**నవనీతం నవోద్ధృతమ్,**

నవాద్దధ్నో నీతం నవనీతం; నవాద్దధ్న ఉద్ధృతం నవోద్ధృతం. ణీఞ్ ప్రాపణే; హృఞ్ హరణే. నూతనమైన పెరుఁగువలనఁ దీయఁబడినది గనుక నవనీతము. నవోద్ధృతమును. ఈ ౨ వెన్నపేళ్లు.

**తత్తు హైయఙ్గవీనం యద్హ్యో తోదోహోద్భవం ఘృతమ్.** 52

హ్యో గోదోహోద్భవం ఘృతం హయ్యంగవీనం–తొలినాఁటి పాలవలనఁ బుట్టినది హయ్యంగవీనము. తొలినాఁడు పితికిన పాలవలనఁ బుట్టిన నేతిపేరు. వెన్నపేరు నని కొందఱు.

**దణ్డాహతం కాలశేయ మరిష్టమపి గోరసః,**

దండేన మఁథదండే నాహతం దండాహతం – కవ్వముచేతఁ జిలుకఁ బడునది. ౧. కలశ్యాం భవం కాలశేయం – కలశమందు ఁబుట్టినది. ౨. నరిష్యతి నహినస్తి సర్వరోగజిత్వాదితి అరిష్టం. రిషహింసాయాం. సర్వ రోగహరమైనది గనుక మనుష్యుల నొప్పించనిది. ౩. గోఃరసః గోరసః.

గో సంబంధమైన రసము. ఈ ౪ మజ్జిగమాత్రమునకు పేళ్లు.

**తక్రం హ్యుదశ్విన్మథితం పాదామ్బ్వర్ధామ్బు నిర్జలమ్.** 53

తచ్యతే ఉదశ్విదపేక్షయా సంకుచ్య ఇతి తక్రం. తంచు సంకోచనే. ఉదశ్విత్తుకంటె నీళ్లచేత సంకోచింపఁబడునది. ౧. ఉదకేనశ్వయతి వర్ధత ఇతి ఉదశ్విత్. త. న. టు ఓశ్విగతివృద్ధ్యోః. నీళ్లచేత వృద్ధిఁబొందునది. ౨. మథనమాత్ర నిష్పన్నత్వాన్మథితం. మంథవిలోడనే. త్రచ్చిన మాత్రమున నౌనది. ౩. వరుసగా నాలవపాలు నీళ్లు గలసిన మజ్జిగకును, సగము నీళ్లు గలసిన మజ్జిగకును, నీళ్లు గలియని మజ్జిగకును పేళ్లు.

**మణ్డం దధిభవం మస్తు -**

మస్యతి పరిమణతీతి మస్తు. ఉ. న. మసపరిణామే. పులుసై పరిణమించునది. దధిభవం మండం–పెరుఁగుమీఁది తేట (పరక) పేరు. మీఁగడయని కొందఱు.

**పీయూషో ౨ భినవం పయః,**

పీయతే వత్సైరితి పీయూషః పీఙ్పానే. దూడలచేతఁ బానముచేయఁ బడునది. ఈనిన యేఁడు దినములలోని యావుపాల పేరు జున్నుపాలు.

**అశనాయా బుభుక్షా క్షుత్ -**

అశనేచ్ఛా అశనాయా–అశనమందలి యిచ్ఛ అశనాయ. భోక్తుమిచ్ఛా బుభుక్షా–భోజనము చేయ నిచ్ఛ బుభుక్ష. క్షుధ్యత్యనయాక్షుత్. ధ.సీ. క్షుధ బుభుక్షాయాం. దీనిచేత బుభుక్షితులౌదురు. ఈ 3 ఆఁకలి పేరు.

**గ్రాసస్తు కబళః పుమాన్.** 54

గ్రస్యత ఇతి గ్రాసః. గ్రసు అదనే. భక్షింపఁబడునది. భక్షణ సమయేకే తాలుని వలత ఇతి కబళః. వలసంచలనే. భక్షణ సమయమందు దౌడయందు కదలునది. ౧. గ్రాసశబ్దము కబళము యొక్క అర్థము గలది గనుక కబళార్థకము. రెండును పర్యాయములు. ఈ ౨ కడిపేరు.

**సపీతిః స్త్రీ తుల్యపానమ్ -**

సమానాపీతిః పానం సపీతిః ఇ. సీ. పాపానే. సమానమైన పానము సపీతి. కూడి పానము చేయుట పేరు.

**సగ్ధిః స్త్రీ సహభోజనమ్,**

సమానా జగ్ధిస్సగ్ధిః. ఇ. సీ. అద భక్షణే. సమానమైన భోజనము.

పా. సజగ్ధిః. పొత్తునఁ గుడుచుటకుఁగాని, ఒక బంతియందుఁ గుడుచుటకుఁగాని పేరు.

**ఉదన్యాతు పిపాసా తృట్తర్షః -**

ఉదకేచ్ఛా ఉదన్యా-ఉదకమందలి యిచ్ఛ ఉదన్య. పాతు మిచ్ఛా పిపాసా. పాపానే. తర్షణం తృట్. ష. సీ. తర్షశ్చ. తృషపిపాసాయాం. పానముసేయు నిచ్ఛ పిపాస, తృట్టు, తర్షము. ఈ ౪ దప్పిపేళ్లు.

**జగ్ధిస్తు భోజనమ్.** 55

**జేమనం లేప ఆహారో నిఘసో న్యాద ఇత్యపి,**

అదనంజగ్ధిః ఇ. సీ. అదభక్షణే. భక్షించుట. ౧ భుక్తిః భోజనం. బుజపాల నాభ్యవహారయోః. ౨. అదనంజేమనం. జముఅదనే-ఇత్యత్ర జిమిరవ్యూహ్యః భక్షించుట భోజనము, జేమనము, లిప్యతే ఉపచీయతే దేహో ౭నేనేతి లేపః. ౩. లిప ఉపదేహే. దీనిచేత దేహము వృద్ధిఁబొందును. పా. లేహః. ౪. ఆహరణ మాహారః. ఆజ్ పూర్వో "హృఞ్ హరణే" ఇతి ధాతుర్భోజనే. భుజించుట ఆహారము. ౫. నితరా మదనం నిఘసః; న్యాదశ్చ. అపభక్షణే. మిక్కిలి భక్షించుట నిఘసము, న్యాదమును. ఈ ౭ భోజనముపేళ్లు.

**సౌహిత్యం తర్పణం తృప్తిః**

సుహిత స్సుతృప్త భావః సౌహిత్యం-సుహితుఁడనఁగా తృప్తుఁడు; వాని యొక్క భావము. ౧. తృప్యత ఇతి తర్పణం. తృప్తిశ్చ. ఇ. సీ. తృపప్రీణనే. తనియుట తర్పణము, తృప్తియును. ఈ 3 తనివి పేళ్లు.

**ఫేలా భుక్తసముజ్ఝితమ్.** 56

ఫేలతి భోజనా చ్చలతీతి ఫేలా. ఫేలృగతౌ. భోజనమువలనఁ బాయునది. ఈ ౧ భోజనముచేయఁగా మిగిలిన యెంగిలి పేరు.

**కామం ప్రకామం పర్యాప్తం నికామేష్టం యథేప్సితమ్,**

కామ్యతే సర్వైరితికామం, ప్రకామం, నికామంచ. కము కాంతౌ. అందఱిచేత కోరఁబడునది కామము, ప్రకామము, నికామమును. పర్యాప్యతే ఇచ్ఛాయా అంతః సమ్యగాప్యతే ౭నేనేతి పర్యాప్తం. ఆప్ ౯వ్యాప్తౌ. దీనిచేత కోరిక తుదముట్టును. ౪. ఇష్యత ఇతీష్టం. ఇషు ఇచ్ఛాయాం. ఇచ్ఛయింపఁబడునది. ౫. ఈప్సిత మనతి క్రాంతం యథేప్సితం-ఇష్టమైన

దాని నతిక్రమించనది. న. అవ్య. ౬. తక్కిన శబ్దములు తఱుచుగా క్రియా విశేణములు గనుక నపుంసకములు. ఈ ౬ యథేష్టమైనదాని పేళ్లు.

**గోపే గోపాల గోసంఖ్య గోధు గాభీర వల్లవాః.** 57

గాః పాతీతి గోపః; గాః పాలయతీతి గోపాలః. పా రక్షణే; పాలరక్షణే. ఆవులను రక్షించువాఁడు. ౧, ౨.గా స్సంచష్టే గోసంఖ్యః. చక్షిఙ్ వ్యక్తాయాం వాచి. ఆవులను విచారించువాఁడు. ౩. గాః దోగ్ధీతి గోధుక్. హ. పు. దుహ ప్రపూరణే. ఆవులను బితుకువాఁడు. ౪. ఆసమంతాత్ భియం రాతీతి అభీరః. రా ఆదానే. అంతట భయము గలవాఁడు. ౫. గాః అభితః ఈరయతీతి ఆభీరః. ఈర ప్రేరణే. అంతట నావులఁ దోలువాఁడు. ౬. బల్ స్థైర్యం లునాతీతి లవః. బదః స్థైర్యస్యలవో వల్లవః. బద స్థైర్యే. లూఞ్ ఛేదనే. వబయోరభేదః. భయము నొంది మనస్థైర్యము వీడినవాఁడు. గోమహిస్యాదికం వలమానాః సంవృణ్వంతో వాంతి గచ్ఛంతీతి వల్లవాః. వల సంవరణే. వా గతిగంధనయోః. గోమహిష్యాదులను జుట్టుకొని పోవువాఁడు. ఈ ౬ గొల్లవానిపేళ్లు.

**గోమహిష్యాదికం పాదబన్ధనమ్ -**

పాదే బంధనమస్య పాదబంధనం–పాదమందు బంధనము గలది. యాదవం ధనమను పాఠమందు గోమహిష్యాదికం ధనం యాదవం అని యోజన. యదూనామిదం యాదవం. యాదవులసంబంధమైన ధనము. ఆవులు మొదలైన పసుల పేరు.

**ద్వౌ గవీశ్వరే,**

**గోమాౕ గోమీ -**

గావస్సన్త్యస్య గోమాౕ. త. పు. గోమీ చ. న. పు. ఆవులు గలవాఁడు గనుక గోమంతుఁడు, గోమియును. ఈ ౨ ఆవులు గలవాని పేళ్లు.

**గోకులం తు గోధనం స్యా ద్గవాం వ్రజే.** 58

గవాం కులం సంఘాతః గోకులం, గోధనం చ–ఆవుల యొక్క మంద గోకులుము, గోధనమును. ఈ ౨ ఆవులమంద పేళ్లు.

**త్రిష్వాశితం గవీనం త ద్గావో య త్రాశితాః పురా,**

గావః ఆశితా అస్మిన్నితి ఆశితం. గవీనం చ. త్రి. అశ భోజనే.

ఆవులు దీనియందు ముందు మేఁపఁబడెను గనుక ఆశితము, గవీనము, 'గావో యత్రోషితాః పురా' అనుపాఠమందు ఆవులు ముందున్న స్థలము. అపుడు ఆసితం అని దంత్యసకారము. పూర్వ మావుల మేఁసిన చోటు పేళ్లు.

**ఉక్షా భద్రో బలీవర్ద ఋషభో వృషభో వృషః.** 59

**అనడ్వాన్ సౌరభేయో గౌః -**

ఉక్షతి రేత స్సించతీతి ఉక్షా. న. పు. ఉక్షసేచనే. ఆవులయందు రేతస్సును విడుచునది. ౧. భన్దత ఇతి భద్రః. భది కల్యాణే. కల్యాణ స్వరూపమైనది. ౨. వలీః కంఠప్రదేశేస్త్ర వృణుతే స్వీకరోతీతి బలీవర్దః. వృఞ్ వరణే. వబయోరభేదః. కంఠమందు వళులు గలది. ౩. ఋష తిగాం ప్రతి గచ్ఛతీతి ఋషభః. ఋషగతౌ. ఆవును గూర్చి పోవునది. ౪. వర్షతి రేతస్సించతీతి వృషభః, వృషశ్చ. వృషు సేచనే. రేతస్సును విడుచునది గనుక వృషభము, వృషము. ౫, ౬. అనో వహతీ త్యనడ్వాన్. హ. పు. బండిని వహించునది. ౩. సురభే రపత్యం సౌరభేయః-ఆవునకుఁ బుట్టినది. ౮. గచ్ఛతి సుచిరమితి గౌః. ఓ.పు. తిన్నగా నడచునది. ౯. అనడుహ్, సౌరభేయ గోశబ్దములు ఆవులకును పేళ్లు. అప్పుడు అనడుహీ, సౌరభేయీ అని యీకారాంతములుగా నుండును. గోశబ్దమునకు రూపము తుల్యము. ఈ ౯ ఎద్దుపేళ్లు.

**ఉక్ష్ణాం సంహతి రౌక్షకమ్,**

ఉక్ష్ణాం సమూహః ఔక్షకం-ఎద్దులయొక్క సమూహము. ఈ ౧ ఎద్దులకదుపు పేరు.

**గవ్యా గోత్రా గవామ్ -**

గవాం సమూహః గవ్యా, గోత్రాచ-ఆవుల యొక్క సమూహము గవ్య, గోత్రమును. ఈ ౨ ఆవులకదుపు పేళ్లు.

**వత్సధేన్వో ర్వాత్సక ధైనుకే.** 60

వత్సానాం సమూహో వాత్సకం-దూడలగుంపు. ధేనూనాం సమూహో ధైనుకం-లేఁగటియావులగుంపు. ఈ ౨ ను వరుసగా దూడలకదుపునకును, లేఁగటియావుల కదుపునకును పేళ్లు.

**ఉక్షా మహాన్ మహోక్ష స్స్యాత్ -**

మహాంశ్చాసౌ వుక్షా చ మహోక్షః–దొడ్డయెద్దు.

**వృద్ధోక్షస్తు జరద్గవః,**

వృద్ధశ్చాసౌ వుక్షా వృద్ధోక్షః; జరంశ్చాసౌ గౌశ్చ జరద్గవః–ముదిసినయెద్దు వృద్ధోక్షము, పరద్గవమును. ఈ ౨ ముసలియెద్దుపేళ్లు.

**ఉత్పన్న ఉక్షా జాతోక్షః -**

జాతశ్చాసౌ వుక్షా చ జాతోక్షః–పుట్టినయెద్దు. మోయఁదగిన వయస్సు గలిగి బడుగుగొట్టని (చిక్కిపోని) కోడె పేళ్లు.

**సద్యో జాతస్తు తర్ణకః** 61

తృణోతీతి తర్ణకః. తృణు అదనే. భక్షించునది. ౧. సద్యోజాతః–అప్పుడు పుట్టిన దూడ పేరు.

**శకృత్కరిస్తు వత్స స్స్యాత్ -**

శకృత్కరీతీతి శకృత్కరిః. ఇ. పు. డుకృఞ్ కరణే. పేఁడఁ బెట్టునది. ౧. ప్రథమే వయసి వసతీతి వత్సః. వస నివాసే. మొదటి వయస్సునం దుండునది. ఈ ౨ ఏఁడాదిలోని దూడపేళ్లు.

**దమ్య వత్సతరౌ సమౌ,**

దమనార్హో దమ్యః. దము దాంతౌ. శిక్షింపఁదగినది. ౧. ద్వితీయ వయస్తమత్వం ప్రాప్తోవత్సో వత్సతరః. రెండవ వయస్సు అల్పముగాఁ గలిగిన వత్సము. ఈ ౨ మోయుటకును, దున్నుటకును పనుపఱుచఁదగిన వయస్సు గల కోడెపేళ్లు.

**ఆర్షభ్యష్షణ్డాతా యోగ్యః -**

ఋషభస్య ప్రకృతి రార్షభ్యః–ఋషభమునకు కారణమైనది. షండమనగా నాఁబోతు. ఈ ౧ ముందు ఆఁబోతు కాఁదగిన కోడెపేరు.

**షణ్డో గోపతి రిట్చరః.** 62

సన్యతే ఉత్సృజ్యత ఇతి షండః. షణు దానే. విడువఁబడునది. ౧. గవాం పతివద్గర్భాధానకారిత్వాద్గోపతిః. ఇ. పు. ఆవులకు పతివలె గర్భాధానముఁ జేయునది. ౨. ఇషా స్వేచ్ఛయా చరతీతి ఇట్చరః–స్వేచ్ఛ చేతఁ జరించునది. ఈ 3 ఆఁబోతు పేళ్లు.

**స్కన్ధప్రదేశో ఽ స్య వహః -**

వహత్యసేన శకటాదికమితి వహః. వహప్రాపణే. శకటాదులను

దీనిచేత వహించును. ఎద్దుమూఁపు పేరు.

**సాస్నా తు గళకమ్బళః,**

సస్తీవ తిష్ఠతీతి సాస్నా. షస స్వప్నే. వ్యాపారము లేక నిద్రపోవుదానివలె నుండునది. గళే కంబళవత్తిష్ఠతీతి గళకంబళః–మెడను కంబళివలె నుండునది. ఈ ౨ గంగడోలుపేళ్లు.

**స్యాన్నస్తితస్తున స్యోతః -**

నస్తా నాసికావయవ విశేషః, తస్మిన్ విద్ధో నస్తితః. నస్తయనఁగా ముక్కు దూలము; దానియందు గ్రుచ్చఁబడినది. ౧. నస్యే నాసికారంధ్రే ఊతః నస్యోతః –నస్యమనఁగా ముక్కురంధ్రము; అందుఁ గ్రుచ్చఁబడినది. ఈ ౨ ముక్కు త్రాడుగట్టిన యెద్దు పేళ్లు.

**ప్రష్ఠవాడ్యుగ పార్శ్వగః.** 63

ప్రష్ఠం అగ్రగామినం వహతీతి ప్రష్ఠవాట్. మ. పు. వహప్రాపణే. ముందరి యెద్దు ననుసరించి పోవునది. యుగపార్శ్వే గచ్ఛతీతి యుగపార్శ్వగః–కాఁడియొక్క పార్శ్వమందుఁ బోవునది. ౨. కాఁడిమోయు నెద్దులదాపున పనుపఱచుటకు గట్టిన యెద్దు పేళ్లు.

**యుగాదీనాం తు వోఢారో యుగ్య ప్రాసఙ్గ్య శాకటాః,**

యుగం వహతీతి యుగ్యః–కాఁడిమోయునది. ౧. ప్రాసంగం వహతీతి ప్రాసంగ్యః–తలకాఁడి మోయునది. ౨. శకటం వహతీతి శాకటః–బండిని లాగునది. ఈ 3 ను వరుసగా కాఁడిమోయు నెద్దునకును, తల కాఁడిమోయు నెద్దునకును, బండినీడ్చు నెద్దునకును పేళ్లు.

**ఖన త్యనేన తద్వోఢా ఉ స్యేదం హాలిక సైరికౌ.** 64

హలేన ఖనతి, హలం వహతి, హల స్యాయంవా హాలికః. ౧. సీరేణ ఖనతి, సీరం వహతి, సీరస్యాయం వాసైరికః. ౨. హలమనినను, సీరమనినను నాఁగేలు. ఆ హలసీరములచేతఁ దున్నువాఁడును, హలసీరముల మోయువాఁడును, హలసీరముల సంబంధమైనవాఁడును గనుక హాలికుఁడు. సైరికుఁడును. ఈ ౨ ను నాఁగేలుచేత దున్నువానికిని, నాఁగేలు మోయువానికిని, నాఁగేటి సంబంధమైన (వా) దానికిని పేళ్లు.

**ధూర్వహే ధుర్య ధౌరేయ ధురీణా స్సధురంధరాః,**

ధురం వహతీతి ధూర్వహః. ౧. ధుర్యః, ౨. ధౌరేయః, ౩. ధురీ

ణః, ౪. ధురంధరశ్చ, ౫. వహ(ప్రాపణే. భారమును వహించునది. ధూర్వహము, ధుర్యము, ధౌరేయము, ధురీణము, దురంధరము. ఈ ౫ బండి, నాఁగేలు మొదలైన భారమును వహించు నెద్దు మొదలుగుదాని పేళ్లు.

**ఉభా వేకధురీ ణైకధురా వేకధురావహే.** 65

ఏకా చాసౌ ధూశ్చ ఏకధురా, ఏకధురాం వహతీతి ఏకధురీణః, ఏకధురః, ఏకధురావహశ్చ. ఒక భారమునే వహించునది గనుక ఏకధురీణము, ఏకధురము, ఏకధురావహమును. ఈ 3 బండి నాఁగేలు మొదలైన భారములలో నొక్క భారమునే మోయుదాని పేళ్లు.

**స తు సర్వధురీణో యో భద్రస్సర్వ ధురావహః,**

సర్వధురాం వహతీతి సర్వధురీణః–సర్వమైన భారమును వహించునది. ౧ బండి నాఁగేలు మొదలైన సకల భారములను వహించునట్టి యెద్దు పేరు.

**మాహేయీ సౌరభేయీ గౌ రుస్రా మాహా చ శృఙ్గిణీ.** 66

**అర్జు న్యఘ్నా రోహిణీ స్యాత్ -**

మాహాగౌః, తస్యా అపత్యం మాహేయీ. ఈ. సీ. మాహయనఁగా ఆవు. దానికి పుట్టినది. ౧. సురభే ర్గోత్రాపత్యం స్త్రీ సౌరభేయీ. ఈ. సీ. సురభి యనఁ గా కామధేనువు; దాని వంశమందుఁ బుట్టినది. ౨. గచ్ఛతి స్వస్థానమితిగోః. ఓ. సీ. ఉనికిపట్టునకుఁ బోవునది. ౩. వసత్యస్మిన్ క్షీరమితి ఉస్రా. వస నివాసే. దీనియందు పాలుండును. ౪. మహ్యత ఇతి మాహా. మహ పూజాయాం. పూజింపఁ బడునది. ౫. శృంగయోగాత్ శృంగిణీ. ఈ. సీ. కొమ్ములు గలది. ౬. ప్రాయేణ ధవళత్వా దర్జునీ. ఈ. సీ. తఱుచుగా తెల్లనై యుండునది. ౭. నహన్యత ఇత్యఘ్నా. హన హింసాగత్యోః. హింసింపఁబడనిది. ౮. రోహిణీనక్షత్ర వదభ్యుదయ హేతుత్వాత్. రోహిణీ. ఈ. సీ. రోహిణీ నక్షత్రమువలె శుభహేతువైనది. ఈ ౯ ఆవుపేళ్లు.

**ఉత్తమా గోషు నైచికీ,**

నీచైః స్వరేణాపి చరతీతి నైచికీ. ఈ. సీ. చర గతిభక్షణయోః. సన్నపు టెలుఁగునఁ బిలిచినను వచ్చునది. గోషు ఉత్తమా. ఈ ౧ ఆవులలో చాల పాలుగలిగి మంచి లక్షణములు గల యావు పేరు.

**వర్ణాదిభేదా త్సంజ్ఞాస్స్యు శ్శబలీ ధవళాదయః.** 67

ఆయావర్ణ భేదములవలన ఆవులును, ఆయా పేళ్లు గలవౌను. శబళ వర్ణత్వాత్ శబళీ–నానావర్ణములు గలది. ధవళత్వాత్ ధవళా–తెల్లని వెన్న గలది. ఆదిశబ్దము వలన ప్రమాణావయవ భేదములవలనను, వామనికా, వక్రశృంగా అనునివి మొదలయిన పేళ్లును గలుగును.

**ద్విహాయనీ ద్వివర్షా గౌః -**

ద్వౌ హాయనౌ వయః ప్రమాణమస్యా ఇతి ద్విహాయనీ, ఈ. సీ. ద్వే వర్షే అస్యా ఇతి ద్వివర్షా–రెండేండ్లు గలిగినది గనుక ద్విహాయని, ద్వివర్షయును. ఈ ౨ రెండేండ్ల వయస్సు గల యావు పేళ్లు.

**ఏకాబ్దా త్వేకహాయనీ,**

ఏకో ఉబ్దః ప్రమాణమస్యా ఇత్యేకాబ్దా, ఏకో హాయనః ప్రమాణమస్యా ఇత్యేక హాయనీ–ఒకయేఁడు వయస్సు గల యావు ఏకాబ్ద, ఏకహాయనియును. ఈ ౨ ఏడాది వయస్సు గల యావుపేళ్లు.

**చతురబ్దా చతుర్హాయణీ -**

చత్వారః అబ్దాః ప్రమాణ మస్యాః చతురబ్దా; చత్వారోహాయనాః ప్రమాణ మస్యాః చతుర్హాయణీ. ఈ. సీ. నాలుగేండ్లు ప్రమాణముగాఁ గలిగినది గనుక చతురబ్ద, చతుర్హాయణియును, ఈ ౨ నాలుగేండ్ల వయస్సు గల యావు పేళ్లు.

**ఏవం త్ర్యబ్దా త్రిహాయణీ.** 68

త్రయః అబ్దాః ప్రమాణమస్యా ఇతి త్ర్యబ్దా; త్రయోహాయనాః ప్రమాణ మస్యా ఇది త్రిహాయణీ.సీ. మూఁడేండ్ల వయస్సు గలది గనుక త్ర్యబ్ద, త్రిహాయణియును. (ఈ యర్థము ప్రక్షిప్తమందురు).

**వశా వన్ధ్యా -**

వష్టి కామయతే వంధ్యాత్వాపగమ హేతుభూత మౌషధమితివశా. వశకాంతౌ. గొడ్డుతనమును బోఁగొట్టు నౌషధమును కోరునది. ౧. బధ్నాతి స్వగతదోషేణ గర్భమితి వంధ్యా. బంధ బంధనే. వబయో రభేదః. తనయం దుండు దోషముచేత గర్భమును బ్రతిబంధించునది. ఈ ౨ గొడ్డుటావు పేళ్లు.

**అపతోకాతు స్రవద్గర్భా -**

అపగతం తోక మపత్యమస్యా ఇత్యపతో కా – పోయినదూడ గలది.

స్రవ≣ గర్భో యస్యాస్సా స్రవద్గర్భా-జాఱిపోయిన గర్భపిండము గలది. దైవికమున నీచుకొనిపోయిన యావు పేళ్లు.

**అథ సంధినీ.**

**ఆక్రాన్తా వృషభేణ -**

గర్భ స్సంధీయతే ఽ స్యామితి సంధినీ. ఈ. సీ. గర్భము దీనియందు ధరింపఁబడును. వెదయై యాఁబోతుచేత వెంటాడఁబడిన యావు పేరు.

**అథ వేహద్గర్భోపఘాతినీ** 69

గర్భోపఘాతం వహతీతి వేహత్. త. సీ. వహప్రాపణే. గర్భోపఘాతమును వహించునది. గర్భోపఘాతో ఽ స్యాస్తీతి గర్భోపఘాతినీ. సీ. గర్భోపఘాతము గలది. ఈ ౨ కట్టిన తర్వాత నాఁబోతు పొఱఁగా నీచుకొన్నయావు పేళ్లు.

**కాల్యోపసర్యా ప్రజనే -**

వృషభేణోపసర్తుంయోగ్యా ఉపసర్యా. సృగతౌ. ఆఁబోతుచేత వెంటాడఁ దగినది. ప్రజనే = గర్భము ధరించుటయందు, కాల్యా = ప్రాప్త కాలము కలయావు. ఈ ౧ కట్టుటకు నీడు వచ్చిన యావు పేరు.

**ప్రష్ఠౌహీ బాలగర్భిణీ,**

ప్రష్ఠమగ్ర గర్భం వహతీతి ప్రష్ఠౌహీ. వహప్రాపణే. ప్రథమగర్భమును వహించునది పా. పష్ఠౌహీ-బాల్యమందే తొలిచూలు పెయ్య పేరు.

**స్యా దచణ్డీ తు సుకరా -**

న చండతే న కుప్యతీ త్యచండీ. ఈ. సీ. చడి కోపే. కోపించనిది. ౧. సుఖం కరోతీతి సుకరా. డు కృఞ్ కరణే. సుఖమును జేయునది. ఈ ౨ సాధువైన యావు పేళ్లు.

**బహుసూతిః పరేష్టుకా.** 70

బహ్వ్యస్సూతయః ప్రసవా యస్యాస్సా బహుసూతిః ఇ. సీ. పెక్కుఈఁతలు గలది. ఉత్పన్నాపత్యేభ్యః పరమన్య దపత్య మిచ్ఛతీతి పరేష్టుకా- మునుపటి దూడలకంటె వేఱైన దూడ నిచ్ఛయించునది. ఈ ౨ పెక్కు యీఁత లీనిన యావు పేళ్లు.

**చిరసూతా బష్కయణీ -**

చిరం సూతా చిరసూతా. షూఙ్ ప్రాణిప్రసవే. చాల కాలము

నకు ముం దీనినది. బష్కయస్త్వేకహాయనో వత్స ఇతి శాకటాయనః; తద్యోగా ద్బష్కయణీ. ఈ. సీ. బష్కయ మనఁగా నేఁడాది దూడ; అది గలిగినది. ఈ ౨ తఱిపియావు పేళ్లు.

**ధేను స్స్యా న్న వసూతికా,**

ధయ త్యేనాం వత్స ఇతి ధేనుః. ఉ. సీ. ధేట్ పానే. దూడ దీని చన్నుఁ గుడుచును. ౧. నవం సూతా నవసూతికా–క్రొత్తగా నీనినది. ఈ ౨ లేఁగటియావు పేళ్లు.

**సువ్రతా సుఖసందోహ్యా -**

సుష్ఠు వ్రతం శీల మస్యా ఇతి సువ్రతా–మంచి స్వభావము గలది. సుఖేన సందోహ్యా సుఖసంద్యోహ్యా. దుహ ప్రపూరణే. సులభముగాఁ బితుకఁదగినది. సులభముగాఁ బితుకనిచ్చు నావు పేళ్లు.

**పీనోఘ్నీ పీవర స్తనీ.** 71

పీన మూధోయస్యాస్సా పీనోఘ్నీ. ఈ. సీ. పెద్ద పొదుగు గలది. పీవరాః స్తనాః యస్యాస్సా పీవర స్తనీ. ఈ. సీ. పెద్ద చన్ను గలది. ఈ ౨ పెద్ద పొదుగు గలయావు పేళ్లు.

**ద్రోణక్షీరా ద్రోణదుఘా -**

ద్రోణపరిమితం క్షీరమస్యా ఇతి ద్రోణక్షీరా–ఇద్దుము పాలు గలది. ౧. ద్రోణపరిమితం క్షీరం దోగ్ధీతి ద్రోణదుఘా. దుహప్రపూరణే. ఇద్దుముపాలు పితుకునది. ఈ ౨ ఇద్దుము పాలు పిండు నావు పేళ్లు.

**ధేనుష్యా బన్ధకే స్థితా,**

ధేనురేవ దేనుష్యా; ధేనవే ధేనుష్య. ఈ ౧ బంధకే స్థితా = కుదువలో నున్న యావుపేరు.

**సమాంసమీనా సా యైవ ప్రతివర్షం ప్రసూయతే.** 72

సమాయాం సమాయాం విజాయత ఇతి సమాంసమీనా–ఏఁటేఁటను ఈనునది. యా ప్రతివర్షం ప్రసూయతే సా = ఏదీ యేఁటేఁట నీనునో అది. ఈ ౧ ఏఁటేఁట నీనునట్టి యావు పేళ్లు.

**ఊధస్తు క్లీబ మాపీనమ్ -**

ఉనత్తి క్షీరేణేతి ఊధః. స. న. ఉందీ క్లేదనే. పాలచేత తడుపునది. ఆప్యాయతే క్షీరేణే. త్యాపీనం. ఓ ప్యాయీ వృద్ధౌ. పాలచేత

నిండియుండునది. ఈ ౨ పొదుగు పేళ్లు.

**సమౌ శివక కీలకౌ,**

దౌష్ట్యశమనేన శివకరత్వాత్ శివకః–పసుల దుష్టత్వమును మాన్పుటవలన శుభకరమైనది. కీల్యతే పశ్వాదిక మత్రేతి కీలకః. కీలబంధనే. పసులు దీనియందుఁ గట్టఁబడును. ఈ ౨ పసులఁ గట్టు కొయ్యపేళ్లు. గూటము.

**న పుంసి దామ సందానమ్ -**

ద్యతి పశుదౌష్ట్య మితి దామ.న. స్న. దో అవఖండనే. పసుల పొగరు బోతుతనమును బోఁగొట్టునది. సందీయతే బధ్యంతే అనేనేతి సందానం. డు దాఞ్ దానే. సంపూర్వో బంధనార్థః. దీనిచేతఁ గట్టఁబడును. ఈ ౨ ఉఱ్ఱుకట్టు (దాయఁ గట్టు) త్రాడుపేళ్లు.

**పశురజ్జుస్తు దామనీ.** 73

బహుదామయోగాత్ దామనీ–పెక్కుతలుగులు గలది. పా. పశురజ్జుస్తు బంధనీ–పసులఁ గట్టు దామెన పేరు.

**వైశాఖ మన్థ మన్థాన మన్థానో మన్థదణ్డకే,**

విశాఖాయాం భవో వైశాఖః–విశాఖయందుఁ బుట్టినది. విశాఖస్య కాష్ఠ స్యాయమితి వైశాఖః–కొమ్మ సంబంధమైనది. ౧. మథ్యతే అనేనేతి మంథః, మంథాన. అ. పు. మంథాశ్చ. న. పు. మంథ విలోడనే. దీనిచేత మథింపఁ బడును. ౨, ౩, ౪. మంథనార్థం దండః మంథదండకః–మంథనార్థమైన దండము. ఈ ౫ కవ్వము పేళ్లు.

**కుటరో దణ్డవిష్కమ్భౌ -**

కుటతి భ్రమత్యనేన మంథదండ ఇతి కుటరః. కుట కౌటిల్యే. దీనిచేత కవ్వము తిరుగును. పా. కుఠరః. దండం విష్కభ్నాతీతి దండవిష్కంభః. స్కమ్భ రోధనే. కవ్వమును నిలుపునది. ఈ ౨ తరికంబము పేళ్లు.

**మన్థనీ గర్గరీ సమే.** 74

మథ్యతే ఽ స్యామితి మన్థనీ. ఈ. సీ. మంథవిలోడనే. దీనియందు పెరుఁగు ద్రచ్చఁబడును. గిరతి దధీతి గర్గరీ. గౄ నిగరణే. తనలో పెరుఁగు నణఁచుకొనునది. ఈ ౨ పెరుఁగుద్రచ్చు కడవపేళ్లు.

**ఉష్ట్రే క్రమేళక మయ మహాఙ్గాః -**

ఉష్యతే సదా ఆతపేనేతి ఉష్ట్రః. ఉష దాహే. ఎల్లప్పుడు నెండచేఁ దపింపఁ బడునది. క్రమైః ఏళతీతి క్రమేళకః. ఇళ గతౌ. పాదవిక్షేపములచేతఁ బోవునది. మయతి దూరం గచ్ఛతీతి మయః. మయ గతౌ. దూరముగాఁ బోవునది. మహాన్త్యఙ్గా న్యస్యేతి మహాఙ్గః–ఘనమైన అంగములు గలది. ఈ ౪ లొటిపిట పేళ్లు. ఒంటె.

**కరభ శ్శిశుః,**

కిరతి విక్షిపతి ధూళి మితి కరభః. కౄ విక్షేపే. ధూళిని జల్లునది. కం శిరః రభతే ఉన్నమయతీతి వా కరభః. రభ రాభస్యే. తల యెత్తుకొని యుండునది. ఈ ౧ లొటిపిటపిల్ల పేరు.

**కరభా స్స్యు శ్శృఙ్ఖలకా దారవైః పాదబన్ధనైః.** 75

శృంఖలం బంధన మేషా మితి శృంఖులకాః–ప్రానిసంకెలలు బందములుగాఁ గలవి. ఈ ౧ కాళ్లయందు ప్రానిబందము గల యొంటె పిల్లపేరు.

**అజా ఛాగీ -**

అజతీ త్యజా. అజ గతిక్షేపణయోః. తిరుగునది. ఛ్యతి రోగానితి ఛాగీ. ఈ. సీ. ఛో ఛేదనే. రోగములఁ జెఱుచునది. మేఁకపేళ్లు.

**తుభ చ్ఛాగ బస్తచ్ఛగలకా అజే,**

తోభతే హినస్తి పర్ణానీతి తుభః. తుభ హింసాయాం. భక్షణార్థమై ఆకులను బీడించునది. ౧. ఛాగ ఛగల శబ్దములకు ఛాగీశబ్దము వలె వ్యుత్పత్తి. బస్యతే హింస్యత ఇతి బస్తః. బస్త అర్దనే. హింసింపఁబడునది. ౩. అజ శబ్దమునకు అజాశబ్దమువలె వ్యుత్పత్తి. ఈ ౪ మేఁకపోతు పేళ్లు.

**మేణ్డోరభ్రోరణోర్ణాయు మేషవృష్ణయ ఏడకే.** 76

మేహతి రేత స్సిఇచ్ఛతీతి మేణ్డః. పా. మేఢ్రః. మిహ సేచనే. రేతస్సును విడుచునది. ౧. ఉరో భ్రమయతీ త్యురభ్రః. భ్రము చలనే. ఉరమును ద్రిప్పునది. ౨. ఉచ్చైః రణ త్యురణః. రణ శబ్దే. బిగ్గరగా మొరఁ బెట్టునది. ౩. ఊర్ణా మేషరోమ తదస్యాస్తీతి ఊర్ణాయుః. ఉ. పు. ఊర్ణయనఁగా గొఱ్ఱె వెంట్రుకలు; అవి గలిగినది. ౪. మిషతి స్పర్ధత ఇతి మేషః. మిష స్పర్ధాయాం. ఎదటి పొట్టేలితోఁ బోరునది. ౫. వర్షతి

రేత ఇతి వృష్ణిః. వృష సేచనే. రేతస్సును వర్షించునది. ౬. ఇలతి గచ్ఛతీ త్యేడకః. ఇల గతౌ. సంచరించునది. ఈ ౭ గొఱ్ఱె పేళ్లు.

**ఉష్ట్రోర భ్రాజబృన్దే స్యాదౌష్ట్ర కౌరభ్రకాజకమ్,**

ఉష్ట్రాణాం సమూహః ఔష్ట్రకం–లొటిపిటల యొక్క సమూహము. ఉరభ్రాణాం సమూహః ఔరభ్రకం–గొఱ్ఱెలయొక్క సమూహము. అజానాం సమూహః ఆజకం–మేఁకలయొక్క సమూహము. ఈ 3 ను వరుసగా లొటిపిటల యొక్కయు, గొఱ్ఱెలయొక్కయు, మేఁకల యొక్కయు సమూహములకు పేళ్లు.

**చక్రీవన్తస్తు బాలేయా రాసభా గర్దభాః ఖరాః.** 77

చక్రం సమూహ స్తద్వంతః చక్రీవంతః. త. పు. గుంపైయుండునవి. ౧. బాలేభ్యో వత్సేభ్యోహితాః బాలేయాః– తమ పిల్లలకు హితములైనవి. ౨. రాసంతే ఉచ్చైరితి రాసభాః. రాసృశబ్దే ౩. గర్దంత్యుచ్చైరితి గర్దభాః. గర్దశబ్దే. ౪. బెట్టెగా మొఱపెట్టునవి కనుక రాసభములు, గర్దభములును. ఖం ముకాంతర్వర్తి మహదాకాశ మేషామస్తీతి ఖరాః–పెద్ద నోళ్లు గలుగుటచేత ముఖములో గొప్ప బయలుగలవి. ఈ ౫ గాడిదలపేళ్లు.

**వైదేహక స్సార్థవాహో నైగమో వాణిజో వణిక్,**
**పణ్యాజీవో ౭ ప్యాపణికః క్రమవిక్రయ కశ్చసః.** 78

విదేహస్య రాజ్ఞశ్శిష్యః వైదేహకః. వసిష్ఠుఁడు నిమియను రాజును ఋత్వి జ్నిమిత్తమై విదేహుండవు గమ్మని శపించఁగా నారాజు విదేహుండను పేరుగలవాఁడై వణిక్శాస్త్రమును జేసెను. ఆ శాస్త్రమును జదివి, ఆ విదేహునికి శిష్యులైరి గనుక వైదేహకులు. సార్థం వణిక్సంఘాతం వహతి దేశాంతరం ప్రాపయతీతి సార్థవాహః. వహప్రాపణే. బేరులమూఁకను దేశాంతరమును జేర్చువాఁడు. నిగమః పత్తనం తత్రభవో నైగమః–పట్టణమునం దుండువాఁడు. ౩. పణతే వ్యవహరతీతి వణిక్. జ. పు పణ వ్యవహారేస్తుతౌ చ. బేరమాడువాఁడు. వణిగేవ వాణిజః. వణిజుఁడే వాణిజుఁడు. ౪, ౫. వణ్యేన ఆజీవతీతి పణ్యాజీవః. జీవ ప్రాణధారణే. అంగడిసరకుచేత బ్రతుకువాఁడు. ౬. ఆపణత ఇత్యాపణికః. పణ వ్యవహారేస్తుతౌ చ. బేరమాడువాఁడు. ౭. క్రమవిక్రయాభ్యాం జీవతీతి క్రయవిక్రయకః –క్రయవిక్రయములచేత బ్రతుకువాఁడు. ఈ ౮ వర్తకునిపేళ్లు.

**విక్రేతా స్యా ద్విక్రయికః -**

విక్రీణాతీతి విక్రేతా. ఋ. పు. డుక్రీఞ్ ద్రవ్యవినిమయే- అమ్మువాఁడు. విక్రయేణ జీవతీతి విక్రయికః-అమ్మకముచేత బ్రతుకువాఁడు. ఈ ౨ వస్తువుల అమ్మువాని పేళ్లు.

**క్రాయకః క్రయిక స్సమౌ,**

క్రీణాతీతి క్రాయకః, క్రయికశ్చ-కొనువాఁడు గనుక క్రాయకుఁడు, క్రయికుడును. ఈ ౨ కొనువాని పేళ్లు.

**వాణిజ్యం తు వణిజ్యా స్యాత్ -**

వణిజః కర్మ వాణిజ్యం, వణిజ్యా చ - వణిజులయొక్క కృత్యము వాణిజ్యము, వణిజ్యమును. ఈ ౨ వర్తకము పేళ్లు. బేరము.

**మూల్యం వస్నో ఒ ప్యవక్రయః** 79

మూలేన అనామ్య మనభిభవనీయం మూల్యం-మొదటిసొమ్ము చేత క్రిందుపడనిది. వసత్యనేన వణ్యాదికమితి వస్నః. పు. న. వసనివాసే. దీనిచేత పణ్యమైనవస్తువు నిలుచును. అవక్రీయతే అనేనే త్యవక్రయః. డు క్రీఞ్ ద్రవ్య వినిమయే. దీనిచేత పదార్థము కొనఁబడును. ఈ 3 వెల పేళ్లు.

**నీవీ పరిపణో మూలధనమ్ -**

నితరాం వీయత ఇతి నీవీ. ఈ. సీ. వ్యేఞ్ సంవరణే. మిక్కిలి రక్షింపఁబడునది. ౧. పరిపణ్యతే లాభార్థం ప్రయుజ్యత ఇతి పరిపణః. పణవ్యవహారేస్తుతౌ చ. లాభార్థమై వ్యవహరింపఁబడునది. ౨. మూలం చ తత్ ధనం చ మూలధనం మొదటిసొమ్ము. ఈ 3 మొదలిసొమ్ముపేళ్లు.

**లాభో ఒ ధికం ఫలమ్,**

లభ్యతే అధికత్వేనేతి లాభః. డు లభ్ష్ ప్రాప్తౌ. అధికముగా పొందఁబడునది. ౧. అధ్యారూఢం అధికం - పెట్టిన సొమ్మును మించి వచ్చినది. ౨. ఫలతీతి ఫలం. ఫల నిష్పత్తౌ. లాభించునది. ఈ 3 బేరమాడఁగా మిగిలిన సొమ్ము పేళ్లు.

**పరిదానం పరీవర్తో నైమేయ నిమయావపి.** 80

పరివృత్య దానం పరిదానం. డు దాఞ్ దానే. పరివర్తనముచేత నిచ్చుట. పా. ప్రతిదానం. ౧. పరివర్తనం పరీవర్తః వృతువర్తనే.

మార్చుకొనుట. ౨. నిమాతుం యోగ్యో నిమేయః. తత్ర భవో నైమేయః. మేఙ్ ప్రణిదానే. మార్చుకొనఁదగిన వస్తువు నిమేయము; దాని యందుఁ బుట్టినది. ౩. నిమయనం నిమయః. డు మిఞ్ ప్రక్షేపణే. ఒక వస్తువును బుచ్చుకొని మఱియొక వస్తువు నిచ్చుట. ఈ ౪ ఒకపదార్థము నిచ్చి మఱియొక పదార్థమును మార్చుకొనుట పేళ్లు.

**పుమా నుపనిధి ర్న్యాసః -**

ఉప సమీపే నిధాన ముపనిధిః. ఇ. పు. డుధాఞ్ ధారణపోషణయోః. ఒకనియొద్ద పెట్టుట ఉపనిధి. న్యసనం న్యాసః. అసు క్షేపణే. పెట్టుట న్యాసము. ఈ ౨ దాఁచఁబెట్టుట పేళ్లు.

**ప్రతిదానం తదర్పణమ్,**

ప్రత్యర్పణం ప్రతిదానం. డు దాఞ్ దానే. మరల నిచ్చుట ప్రతిదానము. ఈ ౧ దాచఁబెట్టిన వస్తువును మరల నిచ్చుట పేరు.

**క్రయే ప్రసారితం క్రయ్యమ్ -**

క్రయార్థం ప్రసారితం క్రయ్యం. డు క్రీఞ్ ద్రవ్యవినిమయే. అమ్ముటకై పెట్టఁబడినది. ఈ ౧ అమ్ముటకై మళిగలోఁ బెట్టిన సరకుపేరు.

**క్రేయం క్రేతవ్యమాత్రకే.** 81

క్రేతుం యోగ్యం క్రేయం. డు క్రీఞ్ ద్రవ్యవినిమయే. అమ్మఁదగినది. ఈ ౧ కొనుట కుపరించఁబడని కొనఁదగిన వస్తుమాత్రమునకు పేరు.

**విక్రేయం పణితవ్యం చ పణ్యమ్ -**

విక్రేతుం యోగ్యం విక్రేయం–అమ్మఁదగినది. ౧. పణితుం వ్యవహర్తుం యోగ్యం పణితవ్యం; పణ్యం ద. పణ వ్యవహారే స్తుతౌ. వ్యవహరించఁదగినది పణితవ్యము, పణ్యమును. ఈ 3 అమ్మఁదగిన వస్తువు పేళ్లు.

**క్రయ్యాదయ స్త్రిషు,**

క్రయ్యశబ్దము మొదలు పణ్యశబ్దమువఱకు నుండు శబ్దములు మూఁడు లింగములయందును వర్తించును.

**క్లీబే సత్యాపనం సత్యంకారస్సత్యాకృతి స్త్రియామ్.** 82

సత్యస్య కరణం సత్యాపనం, సత్యంకారః, సత్యాకృతిశ్చ. ఇ. సీ. ప. త్రి. సత్యము సేయుట సత్యాపనము, సత్యంకారము, సత్యాకృతియును. గట్టిగా నొకవస్తువు నమ్మెద నని గాని కొనియెద నని గాని

దృఢముగా వెళ్లనాడుట పేళ్లు. సంచకరువు నిచ్చుట.

**విపణో విక్రయః -**

విపణనం విపణః, విక్రయణం విక్రయః. పణ వ్యవహారే స్తుతౌ. డు క్రీఞ్ ద్రవ్యవినిమయే. అమ్మట విపణము, విక్రయము. ఈ ౨ అమ్మటపేళ్లు.

**సంఖ్యా స్సంఖ్యే యేష్వాదశ త్రిషు,**

ఆ దశ దశశ్రుతిపర్యంతం అష్టాదశభ్య ఇతి యావత్. ఏకాది సంఖ్యాశబ్దాః సంఖ్యేయే వస్తుని వర్తమానా స్త్రిషు. ఏతేషాం సంఖ్యా సంఖ్యేయయో స్సామానాధి కరణ్యం భవతి. యథాః– ఏకో బ్రాహ్మణ ఇత్యాది. ఆ దశ = దశశబ్ద శ్రుతిపర్యంతము. అనఁగా ఏకశబ్దము మొదలు అష్టాదశ శబ్ద పర్యంతములైన సంఖ్యావాచక శబ్దములు, లెక్క పెట్టఁదగిన వస్తువునందే వర్తించును. ఆ లెక్క పెట్టఁదగిన వస్తువు ఏలింగము గలదో ఆలింగముగల వౌను గనుక, మూఁడులింగముల యందు వర్తించును. "ఏకోబ్రాహ్మణః. ఏకా స్త్రీ. ఏకం బ్రాహ్మణకులం. అష్టాదశ బ్రాహ్మణాః. అష్టాదశ స్త్రియః. అష్టాదశ బ్రాహ్మణకులాని" అని యీలాగున తక్కిన శబ్దము లూహ్యంబులు.

**వింశత్యాద్యాస్సదైకత్వే సర్వాస్సంఖ్యే యసంఖ్యయోః.** 83

వింశతిశబ్దేన ఏకోనవింశతిశబ్దో ఉపిజ్ఞేయః. వింశత్యాద్యాః ఏకోన వింశత్యాద్యాః సర్వా స్సంఖ్యాః సఖ్యేయసంఖ్యయోః–సంఖ్యేయేషు బహుషు ఘటాదిషు సంఖ్యాయాం చ వర్తమానా అపి సతః ఏకత్వే ఏకవచనే వర్తంతే = ఏకోనవింశతి శబ్దము మొదలు కడమ సంఖ్యా వాచకశబ్దము లన్నియు సంఖ్యయందును, సంఖ్యేయములైన వస్తువుల యందును వర్తించును. అపుడా శబ్దములు బహువస్తువులఁ జెప్పునవియైనను ఏకవచనాంతములై యుండును. ఉదా– వింశతి ర్గావః; గవాం వింశతిః.

**సంఖ్యార్థే ద్విబముత్వే స్తః -**

యదా సంఖ్యార్థే సంఖ్యాంతరస్య అభిధేయే వింశత్యాదయో వర్తంతే; తదా ద్వివచనబహువచనే స్తః – వింశత్యాదులు సంఖ్యాంతరమునకు వాచ్యములైనప్పుడు ద్వివచన బహువచనాంతములు నగును. 'గవాంద్వే వింశతీ, గవాం తిస్రో వింశతయః' అని యుదాహరణములు.

**తాసు చానవతేః స్త్రియః,**

తాసు వింశత్యాదిషు ఆనవతేః నవతిం వ్యాప్య వింశత్యాదయో నవతి శబ్దాంతాః భిన్నలింగేన సమానాధికరణా అపిస్త్రియః స్త్రీలింగాః. వింశత్యా పురుషైరిత్యాది. ఆ వింశత్యాదులయందు నవతి శబ్దపర్యంతమైన వింశతి త్రింశ చ్చత్వారింశ త్పంచాశ త్షష్టి సప్తత్యశీతి నవతిశబ్దములు భిన్నలింగములు. విశేష్యము లైనప్పుడును స్త్రీలింగములే. 'వింశత్యాపురుషైః, వింశత్యాస్త్రీభిః, వింశత్యా బ్రాహ్మకులైః' అని యుదాహరణములు.

**పఙ్క్తేశ్శత సహస్రాది క్రమాద్దశ గుణోత్తరమ్.** 84

పఙ్క్తిశబ్దేన దశసంఖ్యోచ్యతే. పఙ్క్తేః ప్రభృతి దశగుణోత్తరం క్రమేణ శతసహస్రాది. తద్యథా___ దశ దశగుణం శతం. శతం దశగుణం సహస్రం. సహస్రం దశగుణ మయుత మిత్యాది. పఙ్క్తి యనఁగా పది. పది మొదలుకొని పదింట గుణించిన శతము, సహస్రము మొదలైన సంఖ్య లగును. పదిపదులు శతము. పదిశతములు సహస్రము. పదిసహస్రములు అయుతము. పది అయుతములు లక్ష అని.

**పౌతవం ద్రువయం పాయ్యమితి మానార్థకం త్రయమ్,**

స్వర్ణాదులు తూఁచుటకును వస్త్రాదులు కొలుచుటకును ధాన్యాదులు కొలుచుటకును సాధనములైన తులా, హస్త, ప్రస్థాదులకు సామాన్యముగా మానశబ్దము వాచకము. ఆ యర్థమునందు పౌతవశబ్దము మొదలు 3 శబ్దములను వర్తించును. పునాతి ధాన్యాదిమానం శోధయతీతిపోతుః, తస్యేదం పౌతవం. పూఞ్ పవనే. ధాన్యాదిమానములను శోధించువాఁడు గనుక పోతు వనఁగా నధికారి (కొలగాఁడు); వాని సంబంధమైనది పౌతవము. పా. యౌతవం. ద్రోర్వృక్షస్య వికారః ద్రువయం–వృక్షవికారము. మీయతే అనే నేతిపాయ్యం. మాఙ్మానే. దీనిచేత కొలువఁబడును.

**మానం తులాఙ్గులి ప్రస్థైః-**

ఆమానము త్రాసు, అంగుళము, తూము మొదలైన వానిచేత మూఁడు విధములై యుండును. తులాదులు ఉన్మానము; అంగుళ్యాదులు ప్రమాణము; ప్రస్థాదులు పరిమాణము అని చెప్పఁబడును. "ఊర్ధ్వ మానం కిలోన్మానం పరిమాణం తు సర్వతః, ఆయామస్తు ప్రమాణం

స్యా త్సంఖ్యా బాహ్యే తు సర్వతః"అని.

**గుఞ్జాః పఞ్చాద్యమాషకః.** 85

మాషాకృతిత్వాన్మాషకః, ఆద్యశ్చాసౌ మాషకశ్చ ఆద్యమాషకః– మాషాకారమైనది. గనుక మాషకము, శాస్త్రీయము గనుక ప్రథమమైన మాషకము. ఆద్యమాషక శబ్దము వెండి గాక తక్కిన అయిదు గురిగింజలయెత్తు గల బంగారు మొదలయినదాని పేళ్లు.

**తే షోడశాక్షః కర్షో ౽ స్త్రీ-**

అక్ష్ణోతి వ్యాప్నోతీ త్యక్షః. అక్షూ వ్యాప్తౌ. తూcచునట్టి వస్తువులయందు వ్యాపించునది. కర్షతీతి కర్షః. అ. ప్న. కృష విలేఖనే. తూcచcదగిన వస్తువులను నిష్కర్షించునది. ఈ ౨ పదునాఱు మాషముల యెత్తు గలదాని పేరు.

**పలం కర్షచతుష్టయమ్,**

పలతి తులాకోటిం గచ్ఛతీతి పలం. పల గతౌ. త్రాసును బొందునది. నాలుగు కర్షములయెత్తుగలదానిపేరు.

**సువర్ణబిస్తౌ హేమ్నో ౽ క్షే-**

సువర్ణమత్రాస్తీతి సువర్ణః–సువర్ణము దీనియందుc గలదు. బిస్యతి తులాకోటిం నీచైః ప్రేరయతీతి బిస్తః. బిసప్రేరణే. త్రాసును క్రిందికి వంచునది. పా. విస్తః. అక్షమెత్తు బంగారుపేళ్లు.

**కురుబిస్తస్తు తత్పలే.** 86

కురుదేశేబిస్త ఇతి ప్రసిద్ధత్వాత్ కురుబిస్తః–కురుదేశమందు బిస్తమని ప్రసిద్ధమైనది. పా. కురువిస్తః. ౧ పలమెత్తు బంగారము పేరు.

**తులా స్త్రియాం పలశతమ్.**

తుల్యత ఇతి తులా. తుల ఉన్మానే. తూcచcబడునది. నూఱుపలములయెత్తు గలదానిపేరు.

**భార స్స్యా ద్వింశతి స్తులాః,**

భ్రియత ఇతి భారః, భృఞ్ భరణే. మనుష్యులచేత భరింపcబడునది. భరశబ్దంబును గలదు. "భరో ౽ తిశయ భారయోః" అని రుద్రుcడు. ఇరువది తులము యెత్తు గలదాని పేరు.

**ఆచితో దశ భారా స్స్యుః -**

ఆ చీయతే రాశీక్రియత ఇతి ఆచితః. ప్ర. చిఞ్ చయనే. రాశిగాఁ గూర్చఁబడునది ఆచిత మనంబడును. పదిబారువుల పేరు.

**శాకటో భార ఆచితః.** 87

శకటేన ఊహ్యతే శాకటః-బండిచే మోయఁదగినది. ఆచితః = ప్రోవుచేయఁబడిన, భారః = బరువు, బండిచేత మోయఁదగిన బరువుపేరు.

**కార్షాపణః కార్షిక స్స్యాత్ -**

"ద్వే కృష్ణలే సమధృతే విజ్ఞేయో రూప్యమాషకః" అను మనువచన ప్రకారమున రెండుగురిగింజల యెత్తుగల వెండి మాషక మనంబడును. పదియాఱు మాషకముల యెత్తు కర్షకము. కర్షమెత్తు గల వెండిచేతఁ జేయఁబడిన టంకమందు కార్షాపణ కార్షికశబ్దములు వర్తించును. కర్ష సంబంధినా రూప్యేణ పణ్యతే వ్యవహ్రియత ఇతి కార్షాపణః. పణ వ్యవహారే స్తుతౌ. కర్ష మెత్తు వెండిచేత వ్యవహరింపఁబడునది. కర్షః ప్రమాణమస్య కార్షికః-కర్షమెత్తు ప్రమాణము గలది.

**కార్షికే తామ్రికే పణః,**

పణ్యతే వ్యవహ్రియత ఇతి పణః. పణ వ్యవహారే స్తుతౌ. వ్యవహరింపఁబడునది. కర్షమెత్తు రాగిముద్ర పేరు.

**అస్త్రియా మాఢక ద్రోణౌ ఖారీవాహో నికుఞ్చకః.** 88

**కుడవః ప్రస్థ ఇత్యాద్యాః పరిమాణార్థకాః పృథక్,**

ఆ సమంతాత్ ఢౌకతే గచ్ఛతీ త్యాఢకః. ఢౌకృ గత్యాం. తిర్య గూర్ధ్వాకారముగా నంతటవ్యాపించియుండునది. తూము. ద్రవతి ధాన్యపరిమాణాయ సర్వతో గచ్ఛతీతి ద్రోణః. ద్రుగతౌ. ధాన్యమును కొలుచుకొఱకు నన్నిదిక్కులఁ బోవునది. నలుతుము. (ఇది తూమునకు ఇద్దుమునకుఁ గూడ పేరు). ఖం మహదాకాశ మస్యా ఇతి ఖారీ. లోపల మిక్కిలి బయలుగలది. పుట్టి. వహతి ధాన్యాదిక మితి వాహః. వహప్రాపనే. ధాన్యాదులను వహించునది. ఇరువది పుట్లు. నికుంచత్యల్పీభవతీతి నికుంచకః. కుంచగతి కౌటిల్యాల్పీ భావయోః. కొంచెమైనది. సోల. కుల్యతే సంస్త్యాయతే ధాన్యమితి కుడువః. పా. కుడుపః. కుల సంస్త్యానే. లడయోరభేదః. దీనియందు ధాన్యము కూర్చఁబడును. మానెడు, ప్రతిష్ఠతే ధాన్యమత్రేతి ప్రస్థః. ష్ఠా గతి నివృత్తౌ. దీనియందు ధాన్యముండును.

కుంచెడు. ఆదిశబ్దమువలన మానప్రవర్తికాదులు గ్రహింపఁబడును. ఆఢకాది శబ్దములకు ఆయా దేశములకుఁ దగినట్లు సంజ్ఞను గలిగియుండును. వరుసగా తూమెడు, నలుతుము, పుట్టెడు, ఇరువదిపుట్లు, సోలెడు, మానెడు, కుంచెడు. ఈ కొలతలకు పేళ్లు.

**భాగ స్తురీయః పాద స్స్యాత్ -**

పద్యత ఇతి పాదః–విభాగమును బొందునది. ౧. నాలవపాలుపేరు.

**అంశ భాగౌ తు వణ్టకః.** 89

అశ్యత ఇత్యంశః. అంశ విభాగే. విభజింపఁబడునది. ౧. భజ్యతే క్రమేణేతి భాగః. భజసేవాయాం. క్రమముగా పొందఁబడునది. ౨. వంట్యతే విభజ్యత ఇతి వంటకః. వటివిభాజనే. విభజింపఁబడునది. ఈ 3 పాలిపేళ్లు.

**ద్రవ్యం విత్తం స్వాపతేయం రిక్థ మృక్థం ధనం వసు,**
**హిరణ్యం ద్రవిణం ద్యుమ్న మర్థ రై విభవా అపి.** 90

ద్రవణీయ మితి ద్రవ్యం. ద్రుగతౌ. పొందఁదగినది. ౧. విద్యతే లభ్యత ఇతి విత్తం. విద్ ౯ లాభే. పొందఁబడునది. ౨. స్వపతౌ స్వస్వామిని సాధు స్వాపతేయం–తనస్వామియందు మంచిది. ౩. రిచ్యతే విభజ్యత ఇతి రిక్థం. రిచిర్ పృథగ్భావే. విభజింపఁబడునది. ౪. ఋచ్యతే స్తూయత ఇతి ఋక్థం. ఋచ స్తుతౌ. స్తోత్రము చేయఁబడునది. ౫. ధినోతి ప్రీణయతీతి ధనం. ధిని ప్రీణనే. సంతోష పెట్టునది. 'ధన ధాన్యే' అను ధాతువు మీఁద వ్యుత్పన్నమైనదని కొందఱు. ౬. వసతి ప్రభూణాం గృహే వసు. ఉ. న. వస నివాసే. ప్రభు గృహముల యందుండునది. ౭. హయ్యతి గచ్ఛతీతి హిరణ్యం. హయ్య గతికాంత్యోః. పోవునది. ౮. ద్రవతి గచ్ఛతీతి ద్రవిణం. ద్రు గతౌ. వెచ్చ పోవునది. ౯. ద్యూయతే అభిగమ్యత ఇతి ద్యుమ్నం. ద్యుఅభిగమనే. పొందఁబడునది. ౯. దివి మ్నాయత ఇతి ద్యుమ్నం. మ్నా అభ్యాసే. స్వర్గమందును గోరఁబడునది. ౧౦. అర్థ్యత ఇత్యర్థః. అర్థ ఉపయాచ్ఞాయాం. ప్రార్థింపబడునది. ౧౧. రాన్త్యేన మితి రాః. ఐ. పు. రా ఆదానే. దీనిఁబుచ్చుకొందురు. ౧౨. విభవతి కార్యసిద్ధౌ సమర్థో భవతీతి విభవః. భూ సత్తాయాం. కార్యసిద్ధియందు సమర్థమైనది. ఈ ౧౩ ధనముపేళ్లు.

**స్యాత్కోశశ్చ హిరణ్యం చ హేమరూప్యే కృతాకృతే,**

పూదెగాఁ గరఁగినదియును, సొమ్ముగాఁ జేయఁబడినదియును

కృతము. గనియందుఁ బుట్టిన నిచ్చలమైన పొడి అకృతము. ఈకృతాకృతము లయిన బంగారునందును వెండియందును కోశ హిరణ్యశబ్దములు వర్తించును. కూయుతే స్తూయుత ఇతి కోశ (ష)ః. కు శబ్దే. కొనియాడఁబడునది. హిరణ్యశబ్దమునకు ముందు చెప్పినట్లే వ్యుత్పత్తి.

**తాభ్యాం య దన్య త్తత్కుప్యమ్ -**

ఆ వెండి బంగారముకంటె నితరమైన రాగి, కంచు మొదలయిన లోహము కుప్య మనంబడును. గోపనీయం కుప్యం. గుపూ రక్షణే. రక్షింపఁదగినది.

**రూప్యం తద్ద్వయమాహతమ్.** 91

ఆహతం రూపమస్యేతి రూప్యం. కొట్టఁబడిన రూపము గలది. ఈ ౧ ముద్రవేయఁబడిన యా వెండి బంగారముల పేరు.

**గారుత్మతం మరకత మశ్మగర్భో మరిన్మణిః,**

గరుత్మతో జాతం గారుత్మతం–గరుత్మంతునివలనఁ బుట్టినది. ౧. మరం మరణం తకత్యనేనేతి మరకతం. తక హసనయోః. విషహరమైనది గనుక దీనిచేత మరణమును గెలుతురు. ౨. అశ్మా గర్భో ఉ స్య అశ్మగర్భః–ఱాయి ఉత్పత్తి స్థానముగాఁ గలది. హరిద్వర్ణో మణిః హరిన్మణిః–పచ్చనిమణి. ఈ ౪ పచ్చల పేళ్లు.

**శోణరత్నం లోహితకః పద్మరాగః -**

శోణవర్ణం రత్నం శోణరత్నం–ఎఱ్ఱనిరత్నము. ౧. లోహితవర్ణత్వా ల్లోహితకః – ఎఱ్ఱనైనది. ౨. పద్మవద్రాగో యస్య పద్మరాగః– తామరపువ్వువంటి యెఱుపుగలది. ఈ 3 కెంపుపేళ్లు.

**అథ మౌక్తికమ్,** 92

**ముక్తా -**

ముచ్యతే శుక్తి సంపుటాదితి ముక్తా, ముక్తైవమౌక్తికం. ముచ్ ౡ మోక్షణే. ముత్యపుచిప్పల వలన విడువఁబడునది గనుక ముక్త; ముక్తయే మౌక్తికము. ఈ ౨ ముత్యముపేళ్లు.

**అథ విద్రుమః పుంసి ప్రవాళం పుంనపుంసకమ్,**

విశిష్టో ద్రుమో విద్రుమః – విశేషమైన చెట్టు. ౧. ప్రకృష్టం వలతే ప్రవాళం. అ. ప్న. వల సంచలనే. లతారూపమై యుండునప్పుడు

ప్రకృష్టముగా చలించునది. ఈ ౨ పగడము పేళ్లు.

**రత్నం మణిర్ద్వయో రశ్మజాతౌ ముక్తాదికే ఽ పి చ.** 93

రమతే ఽస్మి౯ మన ఇతి రత్నం. రము క్రీడాయాం. దీనియందు మనస్సు రమించును. మణ్యతే స్తూయత ఇతి మణిః. ఇ. ప్స. మణి శబ్దే స్తోత్రము చేయఁబడునది. శిలాజాతు లయిన పద్మరాగ మరకత స్ఫటికాదులకును, మౌక్తిక విద్రుమాదులకును సామాన్యముగా పేళ్లు.

**స్వర్ణం సువర్ణం హిరణ్యం హేమ హాటకమ్,**
**తపనీయం శాతకుమ్భం గాంగేయం భర్మ కర్బురమ్.** 94
**చామీకరం జాతరూపం మహారజత కాఞ్చనే,**
**రుక్మం కార్తస్వరం జామ్బూనద మష్టాపదో ఽ స్త్రియామ్.** 95

సుష్ఠు ఋణోతి దీప్యత ఇతి స్వర్ణం. ఋణ దీప్తౌ. లెస్సగాఁ బ్రకాశించునది. ౧. శోభనో వర్ణో యస్య తత్ సువర్ణం–మంచివర్ణము గలది. ౨. కనతి దీప్యత ఇతి కనకం. కన దీప్తౌ. ప్రకాశించునది. ౩. హిరణ్యశబ్ద వ్యుత్పత్తి చెప్పఁబడెను. ౪. హినోతి వర్ధత ఇతి హేమ. న. న. హి గతౌ వృద్ధౌ చ. లోహాంతరమును గూడి వృద్ధిఁబొందునది. ౫. హటతి దీప్యత ఇతి హాటకం. హట దీప్తౌ. ప్రకాశించునది. ౬. తాప మర్హతీతి తపనీయం. తప సంతాపే. కాఁచుటకు యోగ్యమైనది. ౭. శతకుంభాఖ్యే పర్వతే భవం శాతకుంభం–శతకుంభమను పర్వతమునఁ బుట్టినది. ౮. గఙ్గాయాం అగ్నినా న్యస్తస్య మాహేశ్వరవీర్యస్య హిరణ్యత్వేన భూతత్వాత్ గాంగేయం–గంగయందు ఈశ్వరుని వీర్యము నగ్నిహోత్రుఁడు విడువఁగా సువర్ణరూపమాయెను గనుక గాంగేయము. ౯. భ్రియతే ఆభరణరూపేణేతి భర్మ. న. న. భృఙ్ భరణే. ఆభరణ రూపమయి భరింపఁబడునది. ౧౦. కర్వతి లోహమధ్యే శ్రేష్ఠత్వా త్కర్బురం. కర్వ గర్వ దర్పే. వబయో రభేదః. లోహములలో శ్రేష్ఠమౌట చేత గర్వించునది. ౧౧. చామీకరాఖ్యా కరోద్భవత్వా చ్చామీకరం– చామీకరమను గనియందుఁ బుట్టినది. ౧౩. జాతం ప్రశస్తం రూపం యస్య జాతరూపం–ప్రశస్తమైన రూపము గలది. రజ్యతె తామ్రాదిక మనేనేతి రజతం; మహచ్చతద్రజతం చమహారజతం. తామ్రము మొదలైనది దీనిచేత రజింపఁబడును గనుక రజతము; మహత్తైన రజతము మహారజతము.

౧౪. కచతి దీప్యత ఇతి కాఞ్చనం. కచి దీప్తి బంధనయోః. ప్రకాశించునది. ౧౫. రోచత ఇతి రుక్మం. రుచ దీప్తౌ. ప్రకాశించునది. ౧౬. కృతస్వరాఖ్యా కరోద్భవత్వాత్కార్తస్వరం. కృతస్వరమను గని యందుఁ బుట్టినది. ౧౭. జంబూఫల రసోత్పన్ననదీభవత్వా జ్జాంబూనదం–మేరు సమీపమందున్న నేరేడుపండ్ల రసముచేతఁ బాఱిన నదియందుఁ బుట్టినది. ౧౮. అష్టసు లోహేషు పదం ప్రతిష్ఠా అస్యేతి అష్టాపదం. అ. ప్న. అష్టలోహములయందు ఉనికి గలది. "సువర్ణం రజతం తామ్రంరీతిః కాంస్యం తథా త్రపుః, సీసం చ ధీవరం చైవ అష్టలోహాని చక్షతే" అని అష్ట లోహములు. అష్టౌ పదా న్యుత్పత్తిస్థానాన్యస్యేతి వా అష్టాపదం–ఎనిమిది యుత్పత్తి స్థానములు గలది. ఈ ౧౮ బంగారముపేళ్లు.

**అలంకారసువర్ణం య చ్ఛృఙ్గీ కనక మిత్యదః,**

శృంగ్యాం అలంకారే ఉపాదేయం కనకం శృంగీకనకం. పా. శృంగికనకం. అలంకారమందు గ్రహింపఁదగిన కనకము. "స్త్రీ శృంగీ మండనం స్వర్ణం" అని రత్నకోశమందుఁ జెప్పియున్నాఁడు గనుక శృంగీ, కనకం అని ప్రత్యేక నామంబులును గలవు. అప్పుడు శృంగీశబ్దము ఈ. సీ. "వర్షసమూహమివాం తస్థితాపరిమాణశృంగి హేమకూటం రాజకులం" అని కాదంబరియందు ప్రయోగము. ఈ ౧ సొమ్ముగాఁ జేసిన బంగారము పేరు.

**దుర్వర్ణం రజతం రూప్యం ఖర్జూరం శ్వేత మిత్యపి.** 96

కనకాపేక్షయా నికృష్టవర్ణత్వా దుర్వర్ణం బంగారముకంటె నికృష్టమైన వర్ణము గలది. రజ్యతే తామ్రాదిక మనేనేతి రజతం. రంజరాగే. తామ్రము మొదలైనది దీనిచేత రంజింపఁజేయఁబడును. ప్రశస్తం రూపమస్యేతి రూప్యం–ప్రశస్తమైన రూపముగలది. ఖర్జ్యతే పీడ్యత ఇతి ఖర్జూరం. ఖర్జ వ్యథనే. అగ్నిసంతాపాదులచేతఁ బీడింపఁబడునది. శ్వేతవర్ణత్వాత్ శ్వేతం–తెల్లనివన్నె గలది. ఈ ౫ వెండిపేళ్లు.

**రీతిః స్త్రియా మారకూటో న స్త్రియామ్ -**

రీయతే స్రవత్యగ్ని సమయోగాదితి రీతిః. ఈ. సీ. రి. గతౌ. అగ్ని సంయోగము వలనఁ గరఁగునది. ౧. ఆరస్య సువర్ణస్య కూటః మాయా రూపమివ భాసత ఇతి ఆరకూటః. అ. ప్న. ఆర మనఁగా బంగారు;

దాని మాయారూపమువలె నుండునది. ఈ ౨ ఇత్తడి పేళ్లు.

**అథ తామ్రకమ్,**

**శుల్బం మ్లేచ్ఛముఖం ద్వ్యష్టవరిష్ఠోదుమ్బరాణి చ.** 97

తామ్యతి వ్యథతే అగ్నిసంయోగాదితి తామ్రకం. తముగ్లానౌ. అగ్ని సంయోగమువలన వ్యథ నొందునది అనఁగా కరఁగునది. ౧. శలతి అశుగచ్ఛతి ద్రవావస్థాయామితి శుల్బం. శల ఆశుగమనే. కరఁగినప్పుడు జాఱునది. ౨. మ్లేచ్ఛదేశే ముఖ్యత్వాత్ మ్లేచ్ఛముఖం–మ్లేచ్ఛదేశ మందు ముఖ్యమైనది. ౩. ద్వేహేమరూప్యే అశ్నుతే ద్వ్యష్టం. అశూవ్యాప్తౌ. వెండి బంగారములను రెంటిని వ్యాపించునది. ౪. శ్రేష్ఠత్వాత్ వరిష్ఠం–లోహములలో శ్రేష్ఠమైనది. ౫. ఉదుంబరాభత్వా దుదుంబరం–మేడివంటి వన్నె గలది. "ఔదుంబరం చ తామ్రం" అని యమర మాలయం దార్యావృత్తమునఁ జెప్పినాఁడు గనుక ఔదుంబరం మని ఔకారాదియుఁ గలదు. ఈ ౬ రాగిపేళ్లు.

**లోహో౽ స్త్రీ శస్త్రకం తీక్ష్ణం పిణ్డం కాలాయసాయసీ,**

**అశ్మసారః -**

లునాతీతి లోహః. అ. ప్న. లూఞ్ ఛేదనే. శస్త్రరూపమై కోయునది. ౧. శస్యతే హింస్యతే అనేనేతి శస్త్రకం. శసు హింసాయాం. దీనిచేత హింసింపఁబడును. ౨. తిజ్యత ఇతి తీక్ష్ణం. తిజ నిశాతనే. వాఁడిగాఁ జేయఁబడునది. ౩. పింద్యతే సంహన్యత ఇతి పిండం. పిడి సంఘాతే. ముద్దగాఁ జేయఁబడునది. ౪. కాలం చ తత్ అయశ్చ కాలాయసం–అయస్సనఁగా నినుము. నల్లనైన యినుము కాలాయసము. ౫. ఇయంత్యేత దితి అయః. స. న. ఇణ్ గతౌ. కార్యార్థులు దీనిఁ బొందుదురు. ౬. అశ్మనస్సారః అశ్మసారః–ఱాతియొక్క సారము. ఈ ౭ ఇనుముపేళ్లు.

**అథ మణ్డూరం సింహాణమపి తన్మలే.** 98

మండ్యతే అయఃపిండా ద్విభజ్యత ఇతి మండూరం. మడి విభాజనే. ఇనుపముద్దవలన విభజింపఁబడినది. హినస్తి పాండురోగమితి సింహాణం. పా. శిఙ్ఘాణం. హిసి హింసాయాం. పాండురోగమును జెఱుచునది. ఈ ౨ ఆయిను పచిట్టెము పేళ్లు.

**సర్వం చ తైజసం లోహమ్ -**

తేజోయుక్తమైనవి గనుక బంగారు, వెండి, రాగి, ఇత్తడి, కంచు, సీసము, తగరము, ధీవరము. ఈ ౮ తైజసములు లోహములును. లోహశబ్దమునకు వృత్పత్తి వెనుకఁ జెప్పఁబడెను. ౧ సర్వధాతువు (లోహము) లకును పేళ్లు.

**వికార స్త్వయశః కుశీ,**

కుత్సితం శ్యతీతి కుశీ. ఈ. సీ. శో తనూకరణే. కుత్సితముగా ఛేదించునది. 'కుశా రజ్జుః కుశీ ఫాలః కుశో దర్భః కుశం జలం' ని వ్యాడి. ౧. ఇనుముతోఁ జేసినవాని కన్నిటికిని పేరు. కఱ్ఱునకే పేరని కొందఱు.

**క్షారః కాచః -**

క్షరతి చలతీతి క్షారః. క్షర సంచలనే. కదలునది. ౧. కచ్యతే బధ్యతే సూత్రేణేతి కాచః. కచ బంధనే. సూత్రముచేత బంధింపఁబడునది. ఈ ౨ గాజు పేళ్లు.

**అథ చపలో రస స్సూతశ్చ పారదే.** 99

అస్థిరత్వాచ్చపలః–ఒక దిక్కున నిలువనిది. రస్యతే ఔషధత్వేనేతి రసః. రస ఆస్వాదనే. ఔషధమౌటచేత నాస్వాదింపఁబడునది. సూతే హేమాదిక మితి సూతః. షూఙ్ ప్రాణిప్రసవే. బంగారు మొదలయిన దానిఁ గలిగించునది. రోగస్య పారం దదాతీతి పారదః. డు దాఞ్ దానే. రోగముయొక్క తుద నిచ్చునది. పా. పారతః. "రసేంద్రః సారతః ప్రోక్తః పారదశ్చనిగద్యతే" అని తారపాలుఁడు. కొందఱు పారద పారతములకు భేదమును జెప్పుదురు. "పారతస్తు మనాక్పాండు స్సూతస్తురహితో మలాత్, పారదస్తు మనాక్పీత స్సర్వే తుల్యగుణాస్స్మృతాః" అని శబ్దార్ణవము. ఈ ౪ పాదరసము పేళ్లు.

**గవలం మాహిషం శృఙ్గమ్ -**

గాః అలతి వారయతీతి గవలః. అల భూషణ పర్యాప్తివారణేషు. ఆవుల నడ్డగించునది. ఈ ౧ ఎనుపకొమ్ము పేరు.

**అభ్రకం గిరిజామలే,**

అభ్రసదృశత్వాత్ అభ్రకం–మేఘంమువంటి వర్ణము గలది. ౧. గిరౌజాయత ఇతి గిరిజం. జనీ ప్రాదుర్భావే. పర్వతమునఁ బుట్టునది. ౨. న విద్యతే మల మత్రేతి అమలం–దీనియందు కల్మషము లేదు. ౩. గిరి

జామలమని యొకపేరుగాఁ గొందఱు చెప్పుదురు. ఈ 3 అభ్రకము పేళ్లు.

**స్రోతోఞ్జనం తు సౌవీరం కాపోతాఞ్జన యామునే.** 100

యమునా స్రోతసి జాతమంజనం స్రోతోంజనం–యమునా ప్రవాహము నందుఁ బుట్టిన యంజనము. ౧. సువీరాఖ్యదేశే భవత్వాత్ సౌవీరం – సువీరదేశమందుఁ బుట్టినది. ౨. కపోతవర్ణ మంజనం కాపోతాంజనం –పావురము వన్నెగల యంజనము. ౩. యమునాయాం భవంయామునం –యమునయందుఁ బుట్టినది. ఈ ౪ సౌవీరాంజనము పేళ్లు.

**తుత్థాఞ్జనం శిఖిగ్రీవం వితున్నక మయూరకే,**
**కర్పరీ -**

తుద త్యక్షిరోగానితి తుత్థం. తుద వ్యథనే. తుత్థం చ త దంజనంచ తుత్థాంజనం–అక్షిరోగములను జెఱుచునది. శిఖిగ్రీవాభత్వాత్ శిఖిగ్రీవం–నెమలి మెడవంటి వన్నె గలది. విశేషేణ తుదతి రోగా నితి వితున్నకం. తుద వ్యథనే. విశేషముగా రోగములను జెఱుచునది. మయూర సదృశత్వాత్ మయూరకం–నెమలివంటి వర్ణము గలది. కల్పతే అక్షిరోగాౝ జేతుం కర్పరీ. ఈ. సీ. కృపూ సామర్థ్యే. నేత్రరోగములఁ బోఁగొట్టుటకు సమర్థమైనది. ఈ ౫ తుత్థాంజనము పేళ్లు, మైలుతుత్తము.

**దార్వికా క్యాథోద్భవం తుత్థం రసాఞ్జనమ్,** 101
**రసగర్భం తార్క్ష్యశైలమ్ -**

దార్వీ హరిద్రా తస్యాః క్వాథోద్భవ మంజనం దార్వికా. ౧. క్వాథోద్భవం చ. మానిపసుపు పాకమువలనఁ బుట్టినయంజనము. ౨. తుత్థ శబ్దమునకు మునుపటివలె వ్యుత్పత్తి. ౩. దార్వ్యాః రసోద్భవ మంజనం రసాంజనం–మానిపసుపు రసమువలనఁ బుట్టినది. ౪. దార్వీరసోగర్భ ఉత్పత్తి స్థానమస్యేతి రసగర్భం. ౫. మానిపసుపు రసమే యుత్పత్తి స్థానముగాఁ గలిగినది. తార్క్ష్యస్య గరుడస్య శిలాయం భవం తార్క్ష్యశైలం–గరుడపచ్చరాళ్ల వలనఁ బుట్టినది. ఈ ౬ రసాంజనము పేళ్లు. తుత్థాంజనశబ్దము మొదలు ౪ మైలుతుత్తమునకును, కర్పరీదార్వికా శబ్దములు ౨ మానిపసుపు కషాయమున వండిన యంజనమునకును, రసాంజనాది శబ్దములు 3 రసాంజనమునకును పేళ్లని కొందఱు.

**గన్ధాశ్మని తు గన్ధకః.**

**సౌగన్ధికశ్చ -**

గంధ ప్రధానో ఉ శ్మా గంధాశ్మా. న. పు. కంపుగలిగిన ఱాయి. ౧. గంధో ఉస్యాస్తీతి గంధకః-కంపుగలిగినది. పా. గంధికః. ౨. శోభనో గంధో ఉస్య సుగంధి, సుగంధి రేవ సౌగంధికః-రోగములను జెఱుచుటకు మంచిదైన కంపు గలది గనుక సుగంధి, సుగంధియే సౌగంధికము. ఈ 3 గంధకముపేళ్లు.

**చక్షుష్యా కులాల్యౌ తు కుళుత్థికా.** 102

చక్షుషే హితా చక్షుష్యా-కండ్లకు హితమైనది. ౧. కులం పాషాణకుల మలతీతి కులాలీ. ఈ. సీ. అల భూషణ పర్యాప్తి వారణేషు. పాషాణము నలంకరించునది. కులాలి యని యర్థగ్రహణము. అందువలన కుంభకారి యనియుఁ గలదు. 'చక్షుష్యా కుంభకారీచ కులాలీ చ కుళుత్థికా' అని రత్నమాల. ౨. కుళుత్థ సదృశత్వాత్ కుళుత్థికా-ఉలవలవలె నుండునది. ఈ 3 కుళుత్థాంజనము పేళ్లు.

**రీతిపుష్పం పుష్పకేతుః పౌష్పకం కుసుమాఞ్జనమ్,**

రీతేర్ధ్మాయమానాయాః పుష్పవర్ణం మలం రీతిపుష్పం-ఇత్తడి కరఁగి యూఁదుచుండఁగా నందువలనఁ బుట్టిన పుష్పవర్ణమైన చిట్టెము రీతి పుష్పము. ౧. పుష్పస్యకేతుః పరిపంథిభూతం పుష్పకేతుః. ఉ. పు. సాదృశ్యమునఁ బుష్పమును ప్రతిఘటించునది. ౨. పుష్పసదృశత్వాత్ పౌష్పకం. పా. పుష్పకం-పూవువంటిది. ౩. కుసుమసదృశ మంజనం కుసుమాంజనం-పుష్పమునకు సరియైన యంజనము. ఈ ౪ కుసుమాంజనము పేళ్లు.

**పిఞ్జరం పీతనం తాల మాలం చ హరితాలకే.** 103

పీతవర్ణత్వాత్ పింజరం, పీతనం చ-పచ్చని వన్నె గలది గనుక పింజరము, పీతనమును. ౧, ౨. తలతి ప్రతిష్ఠతే వర్ణో ఉత్రేతి తాలం. తల ప్రతిష్ఠాయాం. దీనియందు వర్ణముండును. ౩. అలతి భూషయతి చిత్రాదికమితి ఆలం. అలభూషణాదౌ. చిత్తరువు మొదలైనదాని నలంకరించునది. ౪. హరి వర్ణం తాళం హరితాళకం-పచ్చనివన్నగలతాళము. ఈ ౫ హరిదళము పేళ్లు.

**గైరేయ మర్థ్యం గిరిజ మశ్మజం చ శిలాజతు,**

గిరౌ భవం గైరేయం, గిరిజం చ-పర్వతమందుఁ బుట్టినది గనుక గైరేయము, గిరిజమును. ౧, ౨. అర్థ్యతే ఔషధార్థిభిరితి అర్థ్యం. అర్థ

ఉపయాచ్ఞాయాం. ఔషధార్థులచేత కోరఁబడునది. ౩. అశ్మని జాయత ఇత్యశ్మజం. శిలాయాం జాయత ఇతి శిలాజతు. ఉ.న. జనీ ప్రాదుర్భావే. ఱాతియందుఁ బుట్టునది. ఈ ౫ శిలాజిత్తు పేళ్లు.

**బోల గన్ధ రస ప్రాణ పిణ్డ గోప రసా స్సమాః.** 104

బోల్యతే నిమజ్జతే ఔషధేష్వితి బోలం–ఔషధములలో వేయఁబడునది. ౧. గంధప్రధానో రసో ఽ స్య గంధరసః–గంధము గల రసము గలది. ౨. ప్రాణంత్యనేన ప్రాణః. అన ప్రాణనే. దీనిచేత బ్రతుకుదురు. ౩. పిండ్యతే పిండీక్రియత ఇతి పిండం. పిడి సంఘాతే. ముద్దగాఁ జేయఁబడునది. ౪. గోప్యతే ఔషధార్థమితి గోపః. గుపూ రక్షణే. ఔషధార్థమై రక్షింపఁబడునది. పా. గోసః. ౫. రస్యతే ఆస్వాద్యత ఇతి రస. పా. శశః. రస ఆస్వాదనే. ఆస్వాదింపఁబడునది. ఈ ౬ బోళముపేళ్లు. గోపరసమని యొకపేరుగా కొందఱు చెప్పుదురు.

**డిణ్డీరో ఽ బ్ధికఫః ఫేనః -**

డిండిశబ్దమీరయతీతి డిండీరః. ఈర ప్రేరణే. డిండి యను శబ్దమును బుట్టించునది. పా. ఖి(హి)ణ్డీరః. ౧. అబ్ధేః కఫ ఇవ భాతీతి అబ్ధికఫః–సముద్రమునకు శ్లేష్మమువలె కనిపించునది. ౨. స్ఫాయతే వర్ధత ఇతి ఫేనః. స్ఫాయీ వీద్ధౌ. ఉప్పొంగునది. ఈ 3 సముద్రపు నురుఁగుపేళ్లు.

**సిన్దూరం నాగసంభవమ్,**

స్యందతే ప్రస్రవతి సూక్ష్మత్వాదితి సిందూరం. స్యందూ ప్రస్రవణే. సూక్ష్మ మౌటచేత జాఱునది. నాగాత్ సీసా త్సంభవో ఽ స్య నాగసంభవం–సీసమువలనఁ బుట్టునది. ఈ ౨ సిందూరము పేళ్లు.

**నాగ సీసక యోగేష్ట వప్రాణి -**

న గచ్ఛతీ త్యగం. తన్నభవతి చలత్వాదితి నాగం. గమ్ ౢగతౌ. మెత్తనౌటచేత కదలునది. ౧. సినోతి బధ్నాతి పారదమితి సీసకం. పాదరసమును బంధించునది. ౨. సువర్ణకరణయోగే ఇష్టం భవతీతి యోగేష్టం. బంగారు చేయు యోగమం దిష్టమైనది. ౪. ఉప్యతే సువర్ణ యోగ ఇతి వప్రం. టు వప్ బీజసంతానే. బంగారు చేయు యోగమందుఁ బెట్టఁబడునది. ఈ ౪ సీసము పేళ్లు.

**త్రపు పిచ్చటమ్,** 105

**రఙ్గవఙ్గే -**

త్రపతే అగ్ని సన్నిధౌ ద్రవతీతి త్రపుః ఉ.పు త్రపూష్ లజ్జాయాం. అగ్ని సమీపమందు సిగ్గుపడునది. అనఁగా కరఁగునది. ౧. పిచ్యతే కుట్యత ఇతి పిచ్చటం. పిచ్చ కుట్టనే. కొట్టఁబడునది. ౨. రంగతి ద్రవతి రంగం. రగి గతౌ. వంగతి ద్రవతి వంగం. వగిగతౌ. కరఁగునది గనుక రంగము, వంగమును, త్రపుశబ్దము సీసమునకును పేరు. "రంగసీసకయోస్త్రపు" అని రుద్రుడు. ఈ ౪ తగరము పేళ్లు.

**అథ పిచు స్తూలః -**

పిచ్యతే మర్ద్యత ఇతి పిచుః. ఉ. పు. పిచుమర్దనే. ఏకఁబడునది. ౧. తోల్యతే అనేనేతి తూలః. తుల ఉన్మానే. తూఁచఁబడునది. తూలతే నిష్కోష్యత ఇతి వా తూలః. తూల నిష్కోషణే. తచ్చ అంత ర్గతస్య బహిర్నిస్సరణం. విప్పఁ బడునది. పిచుతూలమని యొకపేరుగాఁ గొందఱు చెప్పుదురు. ఈ ౨ దూదిపేళ్లు.

**అథ కమలోత్తరమ్,**

**స్యాత్కుసుమ్భం వహ్ని శిఖం మహారజన మిత్యపి.** 106

వర్ణాధిక్యాత్కమలేభ్య ఉత్కృష్టమితి కమలోత్తరం–వర్ణాధిక్యమువలన కమలములకంటె నుత్కృష్టమైనది. ౧. కుశ్యతి సంశ్లిష్యతి వస్త్రాదావితి కుసుంభం. కుస సంశ్లేషణే. వస్త్రాదులయందు కూడునది. ౨. వహ్నేః శిఖేవ శిఖా కాంతిర్యస్య వహ్ని శిఖం–అగ్ని జ్వాలవంటి కాంతి గలది. ౨. రజతే వస్త్రాదిక మనేనేతి రజనం, మహచ్చ తత్ రజనంచ మహారజనం. రంజ రాగే. దీనిచేత వస్త్రాదు లెఱ్ఱ నౌను కనుక రజనము. మహత్తయిన రజనము గనుక మహారజనము. ఈ ౪ కుసుమ పువ్వుపేళ్లు.

**మేషకమ్బళ ఊర్ణాయుః -**

కామ్యతే శీతార్తైరితి కంబళః, మేషస్య కంబళః మేషకంబళః. కముకాంతౌ. శీతార్తులచేత కాంక్షింపఁబడునది గనుక కంబళము. గొఱ్ఱె వెంద్రుకలచేత నేసిన కంబళము. ఊర్ణా మేషరోమ త దస్యాస్తీతి ఊర్ణాయుః. ఉ. పు. ఊర్ణయనఁగా గొఱ్ఱెవెంద్రుక, అది దీనియందుఁ గలదు. ఈ ౨ గొఱ్ఱెవెంద్రుకలచేత నేసిన కంబళి పేళ్లు.

**శశోర్ణం శశలోమని,**

శశస్య ఊర్ణం శశోర్ణం–కుందేటియొక్క వెంట్రుక. ౧ కుందేటి వెంట్రుకల పేరు.

**మధు క్షౌద్రం మాక్షికాది -**

మన్యతే అభిలష్యత ఇతి మధు. ఉ. న. మన జ్ఞానే. అభిలాషచేఁ దలఁచఁబడునది. ౧. క్షుద్రాభిర్మక్షికాభిః కృతం క్షౌద్రం–క్షుద్రము లనఁగా జుంటీఁగలు; వానిచేఁ గూర్పఁబడినది. ౨. జుంటీఁగలచేతఁ గూర్పబడిన తేనె మొదలయినవాని పేళ్లు. ఆదిశబ్దముచేత భ్రామర పౌత్తికములు మొదలైన తేనెలును చెప్పఁబడును. మధుశబ్దము క్షౌద్రమునకును మాక్షికమునకును ఆదిశబ్దముచేత భ్రామరపౌత్తికాదులకును సామాన్యముగా పేరని కొందఱు. క్షౌద్రము మొదలయిన నాలిగింటికిని లక్షణము. "మాక్షికం తైలవర్ణం స్యాత్ ఘృతవర్ణం తు పౌత్తికం, విజ్ఞేయం భ్రామరం శ్వేతం క్షౌద్రం తు కపిలం మతం" అని.

**మధూచ్ఛిష్టం తుసిక్థకమ్.** 107

మధునా ఉచ్ఛిష్యతే త్యజ్యత ఇతి మధూచ్ఛిష్టం. శిష అసర్వోపయోగే. తేనెచేత విడువఁబడునది. ౧. సించ త్యగ్ని సంయోగాదితి సిక్థకం. షిచిర్ క్షరణే. అగ్ని సంయోగమువలన కరఁగునది. ఈ ౨ మైనము పేళ్లు.

**మనశ్శిలా మనోగుప్తా మనోహ్వా నాగజిహ్వికా,**

మనశ్శబ్దవాచ్యా శిలా మనశ్శిలా–మనశ్శబ్దముచేతఁ జెప్పఁదగిన శిల. ౧. మనశ్శబ్దేన గోప్యత ఇతి మనోగుప్తా. గుపూ రక్షణే. మనశ్శబ్దము చేత రక్షింపఁబడునది. ౨. మనశ్శబ్దేన హూయత ఇతి మనోహ్వా. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దేచ. మనశ్శబ్దముచేత రక్షింపఁబడునది. ౩. నాగజిహ్వా ప్రతికృతిః నాగజిహ్వికా – పాము నాలికవలె నుండునది. ౪. మణిశిల పేళ్లు.

**నైపాళీ కునటీ గోళా -**

నేపాళదేశే భవత్వాత్ నైపాళీ. ఈ. సీ. నేపాళదేశమందుఁ బుట్టినది. ౧. కౌ నేపాళభూమౌ నటతీతి కునటీ. ఈ. సీ. ణట నృత్తే. నేపాళభూమియందు నటించునది. ౨. నేపాళభూమిం లాతి జన్మభూమిత్వేనేతి గోళా. లా ఆదానే. నేపాళభూమిని జన్మభూమిగా స్వీకరించునది. ౩. నేపాళదేశమందుఁ బుట్టిన మణిశిల పేళ్లు. "మనశ్శిలా మనోహ్వా చనైపాళీ కునటీశిలా" అని శ్లోకార్థ పర్యాయమునందు

మాధవుఁడు. ఈ ౭ ను మణిశిలకే పేళ్లని కొందఱు.

**యవక్షారో యవాగ్రజః** 108

**పాక్యః -**

యవస్య క్షారో యవక్షారః-యవలవలనఁ బుట్టిన క్షారము. ౧. యవాగ్రైర్జన్యత ఇతి యవాగ్రజః. జనీ ప్రాదుర్భావే. యవాగ్రముల చేతఁ బుట్టింపఁబడునది. ౨. పచనీయః పాక్యః. డు పచ్ష్ పాకే. వండఁ దగినది. ఈ 3 యవక్షారము పేళ్లు.

**అత సర్జి కాక్షారః కాపోతస్సుఖవర్చకః,**

**సౌవర్చలం స్యాద్రుచకమ్ -**

సర్జికాదికృతః క్షార స్సర్జికాక్షారః-సర్జకవృక్షములచేతఁ జేయఁబడినది. ౧. కపోతవర్ణత్వాత్ కాపోతః-పావురపు వన్నె గలది. ౨. సుఖేన దీపనాగ్నిం వర్చయతీతి సుఖవర్చకః. వర్చ దీప్తౌ. సులభముగా దీపనాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేయునది. ౩. సువర్చలాఖ్యా కరోద్భూతత్వాత్సౌవర్చలం-సువర్చలమను గనియందుఁ బుట్టినది. ౪. రుచ్యతే దీప్యతే జాఠరాగ్ని రనేనేతి రుచకం. రుచ దీప్తౌ. దీనిచేత జాఠరాగ్ని దీపింపఁబడును. ఈ ౫. సజ్జాక్షారము పేళ్లు. సౌవర్చల రుచక శబ్దములు సౌవర్చలవణము పేళ్ళని కొందఱు. సౌవర్చలవణము ముందు చెప్పినాఁడు గనుక పౌనరుక్త్యముగావున నివియును సద్యక్షారము పేళ్లని కొందఱు. "కపోత సర్జికాసర్జిః సూస్ని కా చ సువర్చకా, రుచకం కృష్ణలవణ మక్షం సౌవర్చలం తథా." అని శ్లోకపర్యాములయందు మాధవుఁడు.

**త్వక్ క్షీరా వంశరోచనా.** 109

త్వచః వేణోః సకాశాత్ స్రవత్ క్షీర మస్యా ఇతి త్వక్ క్షీరా-వెదురువలనఁ బుట్టిన పాలు గలిగినది. పా. త్వక్క్షీరీ, త్వక్ క్షీరం. ౧. రుచ్యతే దీపనాగ్ని రనయేతి రోచనా. వంశోత్థా రోచనా వంశరోచనా. రుచ దీప్తౌ. దీనిచేత జాఠరాగ్ని దీపింపఁ బడును గనుక రోచన. వెదురువలనఁ బుట్టిన రోచన వంశరోచన. ఈ ౨ తవక్షీరి పేళ్లు.

**శిగ్రుజం శ్వేతమరిచమ్ -**

శిగ్రో ర్జాయత ఇతి శిగ్రుజం. జనీ ప్రాదుర్భావే. మునగ వలనఁ బుట్టినది. ౧. శ్వేతమరిచ గుణయోగాత్ శ్వేతమరిచం - తెల్లనిమిరియాల

గుణముగలది. ఈ ౨ మునగవిత్తుల పేళ్లు.

**మోరటం మూల మైక్షవమ్,**

మురతి భువం వేష్టయతీతి మోరటం. ముర వేష్టనే. భూమిని జుట్టి యుండునది. చెఱకువేళ్ళ పేరు.

**గ్రన్థికం పిప్పలీమూలం చటకాశిర ఇత్యపి.** 110

గ్రంథి ప్రకృతిత్వాత్ గ్రంథికం–ముడివలె నుండునది. ౧. పిప్పల్యాః మూలం పిప్పలిమూలం–పిప్పలివేరు. చటకాశిరో రూపత్వాత్ చటకాశిర.–పిచ్చుకతలవలె నుండునది. ౩. చటకా, శిరః. అని రెండు పేళ్లుగాఁ గొందఱు చెప్పుదురు. అప్పుడు శిరశబ్దము అకారాంత పుంలింగము. తాలవ్యాది, దంత్యాదియును. “సిరోనా పిప్పలీమూలే స్యాద్ధమన్యాంచ యోషితి” అని రభసుఁడు. ఈ 3 పిప్పలీమూలము పేళ్లు.

**గోలోమీ భూతకేశో నా -**

గోరివ లోమా న్యస్య గోలోమీ. ఈ. సీ. ఆవు వెంట్రుకలవంటి పీఁచు గలది. ౧. భూతస్య కేశా ఇవ కేశా యస్య భూతకేశః–భూతపు వెంట్రుకలవంటి పీఁచుగలది. ఈ ౨ జటామాంసి వేళ్లు. భూతకేశ మను తృణము పేళ్లని కొందఱు.

**పత్త్రాఙ్గం రక్తచన్దనమ్,**

పత్రాణ్యంగే అస్యపత్రాంగం–ఆకులు అవయవమందుఁ గలది. ౧. రక్తచందన సదృవత్వాత్ రక్తచందనం–రక్తచందనమువలె నుండునది. ఈ ౨ రక్తచందనము పేళ్లు.

**త్రికటు త్ర్యూషణం వ్యోషమ్ -**

త్రయాణాం కటూనాం సమాహారః త్రికటుః ఉ. న. మూఁడు కారముల సమూహము. ఊష్యంతే రోగా ఏభిరితి ఊషణాని. త్రీణి ఊషణాని యస్య త్రూష్యణం. ఊష రుజాయాం. దీనిచే రోగములు బాధింపఁబడును గనుక ఊషణములనఁగా కటువులు; మూఁడు కారములు దీనియందుఁ గలవు గనుక త్ర్యూషణము. దీర్ఘాది. “అయస్తిలత్ర్యూషణ కోలభాగైః” అని యోగశతకమందు ప్రయోగము. హ్రస్వాదియుఁ గలదు. “త్రికటు త్ర్యుషణం వ్యోషం రుషక స్సౌవర్చలః పుంసి” అని రత్నకోశమందు ఆర్యావృత్తమునఁ జెప్పినాఁడు. ౨. విశేషేణ

వోషతి రోగానితి వ్యోషం. ఉష దాహే. విశేషముగా రోగములను జెఱుచునది. విశేషేణ ఓషతి జిహ్వా మితి వావ్యోషం. ఉష దాహే. విశేషముగా నాలుకకు దప్పి పుట్టించునది. ఈ ౩. సొంటి, పిప్పలి, మిరియాలు వీని కూటమి పేళ్లు.

**త్రిఫలా తు ఫలత్రికమ్** 111

త్రయాణాం ఫలానాం సమాహారః త్రిఫలా–మూఁడు కాయల యొక్క సమూహము. పా. తృఫలా. 'తృఫలా. త్రిఫలా చేతి' అని త్రికాండశేషము. ఈ ౧ కరక, తాడి, ఉసిరికల కూటమి పేరు.

# శూద్ర వర్గము

అథ క్రమప్రాప్తం శూద్రవర్గ ముపక్రమతే–బ్రహ్మవర్గము మొదలు మూఁడువర్గములను జెప్పి క్రమప్రాప్తమైన శూద్రవర్గమును జెప్పుచున్నాఁడు.___

**శూద్రాశ్చా వర వర్ణాశ్చ వృషలాశ్చ జఘన్యజాః,**

శోచంతి ఖద్యన్త ఇతి శూద్రాః. శుచ శోకే. క్లేశపడువారు. ౧. అవరః అధమః వర్ణో యేషాం తే అవరవర్ణాః–అధమమైన వర్ణము గలవారు. ౨. వృషం ధర్మం లునన్తీతి వృషలాః. లూఞ్ ఛేదనే. ధర్మమును జెఱుచువారు. ౩. బ్రహ్మణః జఘన్యాఙ్గేజాతాః జఘన్యజాః. జనీ ప్రాదుర్భావే. బ్రహ్మయొక్క జఘన్యాంగమందుఁ బుట్టినవారు. ఈ ౪ శూద్రులపేళ్లు.

**ఆచణ్డాలాత్తు సంకీర్ణా అమ్బష్ఠ కరణాదయః.** 1

విజాతీయ మాతాపితృకత్వాత్ ఉభయవర్ణాభ్యాం సంకీర్యన్త ఇతి సంకీర్ణాః –విజాతీయులైన తల్లిదండ్రులు గలిగినవై రెండు జాతులతోఁ గలయునవి గనుక సంకీర్ణములు. ఇది మొదలు చండాల శబ్దపర్యంతము ముందు చెప్పఁగల అంబష్ఠ కరణాదిజాతులు సంకీర్ణజాతులనంబడును.

**శూద్రావిశోస్తు కరణః -**

"శూద్రావిశోస్తు" అను నిది మొదలైన ముందు చెప్పఁగల షష్ఠ్యంతముల కెల్లను "క్షత్త్రార్యాశూద్ర యోస్సుతః" అనుచోట నున్న సుత శబ్దముతో నన్వయము. కరణశబ్దము శూద్రస్త్రీకిని వైశ్యునికిఁ

బుట్టినవాని పేరు. కరోతి లేఖన కర్మేతి కరణః. డు కృఞ్ కరణే. ఈ ౧ లేఖన కర్మను జేయువానిపేరు.

**అమ్బష్ఠో వైశ్యాద్విజన్మనోః,**

అంబ సమీపే తిష్ఠతి చికిత్సార్థమితి అంబష్ఠః. ష్ఠా గతినివృత్తౌ. చికిత్సార్థము సమీపమం దుండువాఁడు. ఈ ౧ వైశ్యస్త్రీకిని బ్రాహ్మణునికిని బుట్టినవాని పేరు.

**శూద్రా క్షత్రియ యోరుగ్రః -**

ఉచతి సమవైతి వర్ణద్వయమితి ఉగ్రః ఉచ సమవాయే. రెండు జాతుల యందు కూడువాఁడు. ఈ ౧ శూద్రస్త్రీకిని క్షత్రియునికిని బుట్టినవాని పేరు.

**మాగధః క్షత్రియావిశోః.** 2

మగధదేశే ప్రాయేణ భవన్తి తిష్ఠన్తీ మాగధాః–మగధదేశ మందు తఱుచుగా నుండువారు. ఈ ౧ క్షత్రియస్త్రీకిని వైశ్యునికిని బుట్టిన వానిపేరు.

**మాహిష్యో ఽ ర్యా క్షత్రియయోః -**

మహిషి రక్షణే సాధుః మాహిష్యః–అంతఃపుర స్త్రీలను రక్షించుటయందు సమర్థుఁడు. ౧ వైశ్యస్త్రీకిని క్షత్రియునికిని బుట్టినవాని పేరు.

**క్షత్తార్యా శూద్రయో స్సుతః,**

అర్యాశబ్దము స్వామివాచకము గనుక నిక్కడ భూమికి స్వామియైన క్షత్రియుని స్త్రీ యందు వర్తించును; వైశ్యస్త్రీ యందు వర్తింపదు. క్షత్రియ స్త్రీకిని, శూద్రునికిని బుట్టినవాఁడు "క్షత్తా శూద్రాత్ క్షత్రియజే సారథి ప్రతిహారయోః" అని రుద్రుఁడు. క్షదతి ద్వారస్థత్వాత్ జనా న్పీడయతీతి క్షత్తా. ఋ. పు. క్షద గతిహింసనయోః. వాకిలిఁ గాచువాఁడు గనుక జనులను బీడించువాఁడు.

**బ్రాహ్మణ్యాం క్షత్రియాత్సూతః -**

సువత్యశ్వాన్ ప్రేరయతీతి సూతః. షూ ప్రేరణే. గుఱ్ఱములను దోలువాఁడు. బ్రాహ్మణ్యాం క్షత్రియాజ్జాతః–క్షత్రియునివలన బ్రాహ్మణ స్త్రీకిఁ బుట్టినవానిపేరు. ఈ ౧ సూతుఁడు.

**తస్యాం వై దేహకో నిశః.** 3

విదేహేన పణ్యస్య వివిధోపచయేన వర్తత ఇతి వైదేహకః. దిహ ఉపచయే. బేరమాడువాఁడు గనుక అంగడిసరకుయొక్క నానావిధ సమృద్ధిచేత వర్తించువాఁడు. "వైదేహకం తు శూద్రా జ్జాతం వైశ్యాసుతం బ్రువతే" అని నామమాల. ౧. వైశ్యునివలన బ్రాహ్మణ స్త్రీయందుఁ బుట్టినవానిపేరు. వైశ్యస్త్రీకిని శూద్రునకును బుట్టినవాని పేరని కొందఱు.

**రథకారస్తు మాహిష్యా త్కరణ్యాం యస్య సంభవః,**

వైశ్యస్త్రీకిని క్షత్రియునికిని బుట్టినవాఁడు మాహిష్యుఁడు. శూద్రస్త్రీకిని వైశ్యునికిఁ బుట్టినవాఁడు కరణుఁడు. ఇట్టి కరణ స్త్రీకిని, మాహిష్యునికిని బుట్టినవాఁడు రథకారుఁ డనంబడును. రథం కరోతీతి రథకారః. డుకృఞ్కరణే. ఈ ౧ రథమును జేయువానిపేరు.

**స్యాచ్చణ్డాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేన యః.** 4

చండతే కుప్యతి క్రూరకర్మవత్త్వేనేతి చండాలః. చడి కోపే. క్రూరకర్ముఁ డౌటచేత కోపగించుకొనువాఁడు. ఈ ౧ శూద్రుని వలన బ్రాహ్మణ స్త్రీయందుఁ బుట్టినవాని పేరు.

**కారుశ్శిల్పీ -**

"తక్షా చ తంతువాయశ్చ నాపితో రజక స్తథా, పంచమశ్చర్మకారశ్చ కారవ శ్శిల్పినో మతాః" కరోతీతి కారుః. ఉ. పు. డు కృఞ్ కరణే. చేయువాఁడు. శిల్పం నిపుణ కర్మాస్యాస్తీతి శిల్పీ. న. పు. నేర్పుగలవాఁడు. ఈ ౨ కంసాలవానికిని, సాలెవానికిని, మంగలవానికిని, చాకలివానికిని, ముచ్చివానికిని పేళ్లు.

**సంహతై స్తైర్ద్వయోః శ్రేణి స్సజాతిభిః,**

శ్రియత ఇతి శ్రేణిః. ఇ. ప్స. శ్రిఞ్ సేవాయాం. ఆశ్రయింపఁబడునది. స్త్రీలింగమైనప్పుడు ఈకారాంతమును గలదు. ఈ ౧ సజాతీయులై కూడుకొనిన శిల్పుల సమూహము పేరు.

**కులిక స్స్యాత్కులశ్రేష్ఠీ -**

కుల మస్యాస్తీతి కులికః-కులము గలవాఁడు. పా. కులకః. కులేశ్రేష్ఠత్వ మస్యేతి కులశ్రేష్ఠీ. న. పు. కులమందు శ్రేష్ఠముగలవాఁడు. ఈ ౨ శిల్పికులములోఁ బ్రధానుఁడైనవానిపేళ్లు.

**మాలాకార స్తుమాలికః.** 5

మాలాం కరోతీతి మాలాకారః. డు కృఞ్ కరణే. పువ్వులదండలను గట్టువాఁడు. ౧. మాలానిర్మాణం శిల్పమస్య మాలికః–పువ్వుల దండలఁ గట్టుట పనిగాఁ గలవాఁడు. ఈ ౨ పువ్వులుగట్టి యమ్మువానిపేళ్లు.

**కుమ్భకారః కులాల స్స్యాత్ -**

కుంభం కరోతీతి కుంభకారః. డు కృఞ్ కరణే. కడవలు చేయువాఁడు. ౧. కుం భూమిం లడతి మృదర్థ మితికులాలః. లడ మర్దనే. లడయో రభేదః. మంటికొఱకు భూమిని మర్దించువాఁడు. ఈ ౨ కుమ్మరవానిపేళ్లు.

**పలగణ్డస్తు లేపకః,**

పలేన మాంసేనేవ గండతి సుధాదినా భిత్త్యాదికమితి పలగండః. గడి సేచనే. మాంసము చేతంబలె సున్నము మొదలైనవానిచేత గోడ మొదలైనవానిని మెత్తువాఁడు. ౧. లింపతి సుధాదినా ప్రాసాదాదిక మితి లేపకః. లిప ఉపదేహే. సున్నము మొదలైనదానితో మేడలు మొదలైనదానికి పూఁత పూయువాఁడు. ఈ ౨ సున్నపుగార చేయువానిపేళ్లు.

**తన్తువాయః కువిన్దస్స్యాత్ -**

తంతూ౯ వయతీతి తుంతువాయః. వేఞ్ తంతుసంతానే. నూలును నేయువాఁడు. ౧. పటనిర్మాణే కుప్యతీతి కువిందః. కుపకోపే. కోక నేయునపుడు కోపగించుకొనువాఁడు. కుం భువం విందతి పటాది రచనార్థమితి వా కువిందః. విద్ ఌలాభే. కోకనేయుటకై భూమిని బొందియుండువాఁడు. ఈ ౨ సాలెవాని పేళ్లు.

**తున్న వాయస్తు సౌచికః** 6

తున్నం త్రుటితం పయతీతి తున్న వాయః. వేఞ్ తంతుసంతానే. చినిఁగినదానిఁ గూర్చువాఁడు. సూచీకర్మ శిల్ప మస్యేతి సౌచికః–సూది పని శిల్పముగాఁ గలవాఁడు. ఈ ౨ కుట్రపువాని పేళ్లు చెప్పేవాఁడు.

**రఙ్గాజీవ శ్చిత్రకరః -**

రజ్యతే ధవళం రక్తామాపద్యతే ఽస్మిన్నితి రంగః హరితాళాదిః. రంగేన ఆజీవతీతి రంగాజీవః –తెలుపు దీనిచే వర్ణాంతరమును బొందును గనుక రంగమనగా హరిదళము మొదలయినవి. వానిచేత బ్రతుకువాఁడు. ౧. చిత్రం కరోతీతి చిత్రకరః. డు కృఞ్ కరణే. చిత్తరువును

రచించువాఁడు. ఈ ౨ చిత్తరువు వ్రాయువానిపేళ్లు.

**శస్త్రమార్జో ౽ సిధావకః,**

శస్త్రాణి మార్ష్టీతి శస్త్రమార్జః. అసిం ధావయతీతి అసిధావకః. మృజూ శుద్ధౌ. ధావు గతి శుద్ధ్యోః. ఆయుధములను (సానపట్టి) వాఁడి చేయువాఁడు. ఈ ౨ ఆయుధములు చికిలిచేయువాని పేళ్లు.

**పాదూకృ చ్చర్మకార స్స్యాత్ -**

పాదూం కరోతీతి పాదూకృత్. త. పు. ముచ్చెలు సేయువాఁడు. పా. పాదుకృత్. చర్మ కరోతి వికారతా మాపాదయతీతి చర్మకారః–తోళ్లను పాదరక్షాది వికారమును బొందించువాఁడు. ఈ ౨ గొడగర వానిపేళ్లు. (తోళ్లని) చెప్పులు గుట్టువాఁడు.

**వ్యోకారో లోహకారకః.** 7

వ్యో అయః కరోతీతి వ్యోకారః వ్యో అనఁగా నినుము; దానిఁ జేయువాఁడు. ౧. లోహం కరోతీతి లోహకారకః. డు కృఞ్ కరణే. ఇనుమును జేయువాఁడు. ఈ ౨ కరమలవానిపేళ్లు. గనిలో నినుముఁదెచ్చి శుద్ధలోహము చేయు కోసలాది దేశమందుండు ప్రసిద్ధమైన లోహకార జాతివిశేషము పేళ్లని కొందఱు. అట్లు హర్షచరితమందలి వింధ్యాటవీ వర్ణనమందు ప్రయోగము. "ఊష్మాణం క్వచి దన్యత్ర గ్రాహయంతు మివాంగారీయ దారుసంగ్రహై ర్వ్యోకారైః" అని.

**నాడింధమ స్స్వర్ణకారః కలాదో రుక్మకారకే,**

అగ్ని సందీపనార్థం నాడిం ధమతీతి నాడింధమః. ధ్మాశబ్దాగ్ని సంయోగయోః. అగ్ని ప్రజ్వలించుకొఱకు కొలిమి నూఁదువాఁడు. ౧. స్వర్ణం కరోతీతి స్వర్ణకారః. డు కృఞ్ కరణే. బంగారుఁజేయువాఁడు. ౨. కలాం స్వర్ణశిల్ప మాదత్త ఇతి కలాదః. డుదాఞ్ దానే. బంగారు చేయు విద్యను స్వీకరించువాఁడు. ౩. రుక్మం కరోతీతి రుక్మకారకః–బంగారును సొమ్ముగాఁ చేయువాఁడు. ఈ ౪ అగసాలవాని పేళ్లు.

**స్యాచ్ఛాఙ్ఖిక కాబ్బవికః -**

శంఖస్య వికారః శాంఖం, తత్పణ్యమస్య శాంఖికః. కంబో ర్వికాడః కాంబవః, తత్పణ్యమస్య కాంబవికః శంఖముచేతఁ జేసిన కడియములు మొదలైనవి అమ్మకపు సరకులుగాఁ గలవాఁడు. ఈ ౨ శంఖముచేత

కడియములు మొదలైనవి చేసి యమ్ముువానిపేళ్లు.

**శౌల్బిక స్తామ్రకుట్టకః** 8

శుల్బం తామ్రనిర్మాణం శిల్ప మస్యేతి శౌల్బికః–శుల్బమనఁగా రాగిచేయుట; అది పనిగాఁ గలవాఁడు. ౧. తామ్రం కుట్టయతి ఛేదయతీతి తామ్రకుట్టకః. కుట్ట ఛేదన కుత్సనయోః. పనికొఱకు రాగిని నఱుకువాఁడు. ఈ ౨ రాగిపనిఁ జేయువానిపేళ్లు.

**తక్షా తు వర్ధకి స్త్వష్టా రథకారశ్చ కాష్ఠతట్,**

తక్ష్ణోతి త్వక్ష్ణోతి చ కాష్ఠాని తనూకరోతీతి తక్షా. న. పు త్వష్టా చ. ఋ. పు. తక్షూ త్వక్షూ తనూకరణే. కొయ్యలు చెక్కువాఁడు. ౧, ౨. వర్ధయతి ఛేదయతి కాష్ఠానీతి వర్ధకిః. ఇ. పు. వర్ధ ఛేదనే. కొయ్యలు నఱుకువాఁడు. ౩. రథం కరోతీతి రథకారః–రథమును జేయువాఁడు. ౪. కాష్ఠాని తక్షతీతి కాష్ఠతట్. ష. పు. తక్షూ తనూకరణే. కొయ్యలు చెక్కువాఁడు. ఈ ౫ వడ్లవాని పేళ్లు.

**గ్రామాధీనో గ్రామతక్షః -**

గ్రామాధీన స్తక్షాగ్రామతక్షః–గ్రామమునకు అధీనుఁడైన వడ్రంగి. ఈ ౧ గ్రామమునకు నధీనుఁడైన కాణాచివడ్రంగి పేరు.

**కౌటతక్షో ఽ నధీనకః.** 9

కుట్యాం స్వగృహే వర్తమానః కౌటః, కౌటశ్చాసౌ తక్షాచ కౌటతక్షః–తనయింట నుండు వడ్రంగి ఒకరికి నధీనుఁడుగాక తనయింట నుండి కూలి చేయు వడ్రంగి పేరు.

**క్షురీ ముణ్డీ దివాకీర్తినాపి తాన్తావసాయినః,**

క్షుర మస్యాస్తీతి క్షురీ. న. పు. కత్తి గలవాఁడు. ౧. ముండయతి కేశానితి ముండీ. న. పు. ముండి ఖండనే. వెండ్రుకలు గొఱుగువాఁడు. ౨. దివైవకీర్త్యతే రాత్రౌ క్షురకర్మ నిషేధాదితి దివాకీర్తిః. ఇ. పు. కృత సంశబ్దనే. రాత్రి క్షౌరము నిషిద్ధమౌట వలన పగలే పిలువఁబడువాఁడు. నాప్నోతి అస్పృశ్యత్వాదితి నాపితః ఆప్ ౯ వ్యాప్తౌ. అస్పృశ్యుండౌట వలన నంతట వ్యాపింపనివాఁడు. ౪. అంతే అవస్థాతుం శీలమస్య అంతావసాయీ. న. పు. షో ఽన్తకర్మణి. అవపూర్వః అర్థాంతరేవర్తతే. కడపట నుండు స్వభావముగలవాఁడు. ఈ ౫ మంగలవానిపేళ్లు.

**నిర్ణేజనక స్స్యాద్రజకః -**

నేనేక్తి క్షాళయతి వస్త్రాణీతి నిర్ణేజకః. ణిజిర్ శౌచపోషణయోః. కోకల నుదుకువాఁడు. రంజయతి వస్త్రాణి రజకః. రంజ రాగే. కోకలకు వన్నె గలుగఁ జేయువాఁడు. ఈ ౨ చాకలివానిపేళ్లు.

**శౌణ్డికో మణ్డహారకః.** 10

శుండా పానస్థానం తాత్స్థ్యాత్ సురాపిశుండా; సా పణ్యమస్యేతి శౌండికః. శుండ యనఁగా పానస్థానము; అందుండునది గనుక సురయుశుండ యనిపించు కొనును. దాని నమ్మువాఁడు. ౧. మండ మచ్ఛసురాంహరతీతి మండహారకః. హృఞ్ హరణే. కల్లుమీఁది తేటను అమ్ముటకై తీయువాఁడు. ఈ ౨ కల్లమ్మువానిపేళ్లు.

**జాబాల స్స్యాదజాజీవీ -**

అజాః పాలయతీతి జాబాలః. పాలరక్షణే. మేఁకలఁ గాచువాఁడు. ౧. అజాభి ర్జీవతీ త్యజాజీవీ. న. పు. జీవ ప్రాణధారణే. మేఁకలచేత బ్రతుకువాఁ డు. పా. అజాజీవః. 'అజాపాల మజాజీవ' మని రత్నమాల. ఈ ౨ మేఁకలఁ గాచువానిపేళ్లు.

**దేవాజీవస్తు దేవలః,**

దేవేన జీవతీతి దేవాజీవః. జీవ ప్రాణధారణే. దేవరచేత బ్రతకువాఁడు. దేవాన్ లాతి పూజార్థమితి దేవలః. లా ఆదానే. పూజించు నిమిత్తమై దేవరను స్వీకరించువాఁడు. ఈ ౨ కూలికి దేవరను బూజించువానిపేళ్లు.

**స్యా న్మాయా శామ్బరీ -**

మాత్యస్యాం విశ్వమితి మాయా. మా మానే. దీనియందు జగత్తు మితమై యుండును. మయస్యేయ మితి వామాయా-మయుఁడను రాక్షసుని సంబంధమైనది. ౧. శంబరస్యేయం శాంబరీ. ఈ. సీ. శంబరుఁ డను రాక్షసుని సంబంధమైనది. ఈ ౨ ఇంద్రజాలము మొదలైన మాయపేళ్లు.

**మాయాకారస్తు ప్రాతిహారకః.** 11

మాయాం కరోతీతి మాయాకారః - మాయ చేయువాఁడు. ౧. ప్రతిహరతి నయనే ఇతి ప్రాతిహారకః - కనుకట్టుచేత దృష్టిని హరించువాఁడు. పా. ప్రతిహారకః; ప్రతిహారికః. 'మాయాకారకసంజ్ఞః ప్యాత్ప్ర

తిహారక ఇరంమదో దభ్రాక్' అని వరరుచి ఆర్యయందుఁ జెప్పినాఁడు. ఈ ౨ మాయచేయువానిపేళ్లు.

**శైలాలినస్తు శైలూషా జాయాజీవాః కృశాశ్వినః,**

**భారతా ఇత్యపి నటాః -**

శిలాలినా ప్రోక్తం నటసూత్ర మధీయత ఇతి శైలాలినః. న. పు. శిలాలిచేతఁ జెప్పఁబడిన నటసూత్రము నధ్యయనము చేయువారు. ౧. శిలూషస్య ఋషే ర్గోత్రాపత్యాని శైలూషాః–శిలూషుఁడను ఋషి యొక్క సంతతియందుఁ బుట్టినవారు. ౨. జాయయా జీవన్తీతి జాయాజీవాః. జీవ ప్రాణధారణే. పెండ్లాముచేత జీవించువారు. ౩. కృశాశ్వేన ప్రోక్తం నటసూత్ర మధీయత ఇతి కృశాశ్వినః. న. పు. కృశాశ్వునిచేతఁ జెప్పఁబడిన నటసూత్రముల నధ్యయనము చేయువారు. ౪. భరతస్య గోత్రాపత్యాని భారతాః–భరతుఁడను ఋషి యొక్క గోత్రమునందుఁ బుట్టినవారు. ౫. నటంతీతి నటాః. నట నృత్తౌ. ఆడువారు. ఈ ౬ నట్టువవారి పేళ్లు.

**చారణాస్తు కుశీలవాః.** 12

దిగంతేషు కీర్తిం చారయంతీతి చారణాః. చర గతిభక్షణయోః. దిగంతముల యందు కీర్తిని నెగడఁ జేయువారు. ౧. కుత్సితం శీల మేషామితి కుశీలవాః –కుత్సితమైన నడవడి కలవారు. ఈ ౨ దిక్కులయందు సంచరించు బట్టువారికిగాని నట్టువవారికిఁగాని పేళ్లు.

**మార్దఙ్గికా మౌరజికాః -**

మృదంగవాదనం శిల్ప మేషామితి మార్దంగికాః. మురజవాదనం శిల్ప మేషా మితి మౌరజికాః–మద్దెలవాయించుట పనిగాఁ గలవారు. ఈ ౨ మద్దెలవాయించువారి పేళ్లు.

**పాణివాదాస్తు పాణిఘాః,**

పాణీ వాదయన్తీతి పాణివాదాః. వద వ్యక్తాయాం వాచి. చేతుల వాయించు వారు. పాణిం ఘ్నన్తీతి పాణిఘాః. మన హింసాగత్యోః. చేతులతో తాళముఁ దట్టువారు. ఈ ౨ చేతుల తాళముఁ గొట్టువారిపేళ్లు.

**వేణుధ్మా స్స్యు ర్వైణవికాః -**

వేణుం ధమన్తీతి వేణుధ్మాః. అ. పు. ధ్మా శబ్దాగ్ని సంయోగయోః. పిల్లంగ్రోవి నూఁదువారు. ౧. వేణో ర్వికారః వైణవం. తద్వా

దనం శిల్ప మేషామితి వైనవికాః-వెదురుతోఁ జేసిన పిల్లంగ్రోవి నూఁదుటయే పనిగాఁ గలవారు. ఈ ౨ పిల్లనగ్రోవి నూఁదువారిపేళ్లు.

**వీణావాదాస్తు వైణికాః.** 13

వీణాం వాదయంతీతి వీణావాదాః. వద వ్యక్తాయాం వాచి. వీణను వాయించువారు. ౧. వీణావాదనం శిల్పమేషా మితి వైణికాః. వీణ వాయించుట పనిగాఁ గలవారు. ఈ ౨ వీణ వాయించువారిపేళ్లు.

**జీవాన్తక శ్శాకునికః -**

జీవానాం పక్షిణా మంతకో జీవాంతకః-పక్షి రూపములైన జీవములకు అంతకుఁడు. ౧. శకునా౯ పక్షిణో హన్తీతి శాకునికః-పక్షులఁ జంపువాఁడు. ఈ ౨ పక్షుల వేఁటాడువాని పేళ్లు.

**ద్వౌ వాగురిక జాలికౌ,**

వాగురయా చరతి వాగురికః. జాలేన చరతి జాలికః-వలచేత చరించువాఁడు. ఈ ౨ ను వలవేఁట కాని పేళ్లు.

**వైతంసికః కౌటికశ మాంసికశ్చ సమంత్రయమ్.** 14

మృగపక్ష్యాదే ర్బంధనోపాయో వితంసః; తేన చరతీతి వైతం సికః-మృగపక్ష్యాదులను బట్టుటకు సాధనములైన త్రాళ్లు మొదలైనవి వితంసము; వానితోడ సంచరించువాఁడు. ౧. మృగపక్ష్యాది బంధనయస్త్రం కూటః; తేన చరతీతి కౌటికః -మృగపక్ష్యాదులను బట్టుట కుపయోగించు గాలము, ఉరులు మొదలైనవి కూటము; అందుచేత చరించువాఁడు కౌటికుఁడు. ౨. మాంసం పణ్యమస్య మాంసికః. మాంసము అమ్ముడు సరకుగాఁ గలవాఁడు. ఈ మూఁడు శబ్దములు పర్యాయములు. ఈ 3 మాంసమమ్మువానిపేళ్లు.

**భృతకో భృతి భుక్కర్మకరో వైతనికశ్చసః,**

బ్రియత ఇతి భృతః అనుకంపనీయో భృతో భృతకః. భృఞ్ భరణే. దయకు పాత్రుఁడై భరింపఁబడువాఁడు. ౧. భృతిం భుఙ్క్త ఇతి భృతిభుక్. జ. పు. భుజ పాలనాభ్యవహారయోః. కూలిని భుజించువాఁడు. ౨. కర్మకరోతీతి కర్మకరః. డు కృఞ్ కరణే. చెప్పినపనిఁ జేయువాఁడు. ౩. వేతనేన జీవతీతి వైతనికః-కూలిచేత బ్రతుకువాఁడు. ఈ ౪ కూలివానిపేళ్లు.

**వార్తావహో వైవధికః -**

వార్తా వాణిజ్యాది జీవికా. తాదర్థ్యాద్ధాన్యాది నరపి వార్తా, తాంవహతీతి వార్తావహః. వహప్రాపణే. వార్త యనఁగా బేరము మొదలైన జీవనోపాయము; తదర్థములైన ధాన్యాదులను వార్త యనఁబడును. ఆ ధాన్యాదుల మోయువాఁడు గనుక వార్తావహుఁడు. ౧. వివధేన హరతీతి వైవధికః-కావడిచేత ధాన్యము మొదలైనవానిని గొనిపోవువాఁడు. ఈ ౨ కావడి మోయువానిపేళ్లు.

**భారవాహస్తు భారికః.** 15

భారం వహతీతి భారవాహః, భారికశ్చ. వహప్రాపణే. బరువును మోయువాఁడు. మోఁపు మోయువానిపేళ్లు.

**వివర్ణః పామరో నీచః ప్రాకృతశ్చ పృథగ్జనః**
**నిహీనో ఽ పశదో జాల్మః క్షుల్లక శ్చేతరశ్చ సః.** 16

విరుద్ధో వర్ణో జాతి గ్యశో వాస్య వివర్ణః-విరుద్ధమైన జాతిగాని కీర్తిగాని కలవాఁడు. ౧. పాప్మానం పామానం వారాతీతి పామరః. రా ఆదానే. పాపమునుగాని తీఁటను గాని పుచ్చుకొనువాఁడు. ౨. నికర్షమఞ్చతీతి నీచః. అంచు గతి పూజనయోః. తక్కువను బొందువాఁడు. ౩. ప్రకృతౌ యథాజాతభావే వర్తమానోన వ్యుత్పన్న ఇతి ప్రాకృతః-విశేషజ్ఞానములేక పుట్టినప్పటివలె నుండువాఁడు. ౪. సజ్జనేభ్యః పృథగ్భూతో జనః పృథగ్జనః-లోకములోని సజ్జను కంటె నితరమైన జనుఁడు. ౫. నితరాం హీయతే జనై రితి నిహీనః. ఓ హాక్ త్యాగే. మిక్కిలి జనులచేత విడువఁబడువాఁడు. ౬. అపశీయత ఇ త్యపశదః. శద్ ౯ శాతనే. అపకృష్టుఁడై చెడువాఁడు. పా. అపసదః. ౭. జలతి జడీభవతి జాల్మః. జల శూన్యే. జడుఁడై యుండువాఁడు. ౮. క్షుదంలాతీతి క్షుల్లకః-క్షుద్రుఁడై ఆకఁలి గొనియుండువాఁడు. సా. ఖులకః. "ఖులకస్త్రి షు నీచే ఽ ల్పే" అని ఖకారాదుల యందు రభసుఁడు. ౯. ఇతం క్షుద్రవృత్తిం రా తీతి ఇతరః. ఇణ్ గతౌ. రా ఆదానే. క్షుద్రమైన నడవడిని బొందువాఁడు. ఈ ౧౦ అల్పునిపేళ్లు.

**భృత్యే దాసేర దాసేయ దాస గోప్యక చేటకాః,**
**నియోజ్య కింకర ప్రేష్య భుజిష్య పరిచారకాః.** 17

భరణీయో భృత్యః. డు భృఞ్ ధారణ పోషణయోః. పోషింపఁదగినవాఁడు. ౧. దాస్యా అపత్యం దాసేరః, దాసేయశ్చ. దాసీపుత్రుఁడు. ౨, ౩. దంసయతే స్వామికార్యాణి సావధానేనేతి దాసః. దపి దంశ దర్శనయోః. స్వామికార్యములను సావధానముగాఁ జూచువాఁడు. ౪. గోపనీయో గోప్యకః. గుపూ రక్షణే. రక్షింపఁ దగినవాఁడు. ౫. చిట్యతే ప్రేష్యత ఇతి చేటకః. చిట పరప్రేష్యే. పనుల కంపఁ బడువాఁడు. ౬. నియోక్తుంశక్యో నియోజ్యః. యుజిర్ యోగే. నియోగింప శక్యమైనవాఁడు. ౭. కిమపి కరోతీతి కింకరః. డు కృఞ్ కరణే. దేనినైనను చేయువాఁడు. ౮. ప్రేషితుం యోగ్యః ప్రేష్యః. ఇష గతౌ. పనులకుఁ బంపఁదగినవాఁడు. ౯. భుఙ్క్తే వేతన మితి భుజిష్యః–కూలిని భుజించువాఁడు. ౧౦. పరిచరతీతి పరిచారకః. చర గతి భక్షణయోః. పరిచర్యఁ జేయువాఁడు. ఈ ౧౧ బంటుపేళ్లు.

**పరాచిత పరిస్కన్ద పరజాత పరైధితాః,**

పరై రాచిత ఇతి పరాచితః. చిఞ్ చయనే. పరులచేఁ బెంపఁబడువాఁడు. ౧. పరితః స్కందతీతి పరిస్కందః. స్కందిర్ గతిశోషణయోః. అంతటఁ దిరుగువాఁడు. ౨. పరస్మాజ్జాత ఇవ వర్తత ఇతి పరజాతః. జనీ ప్రాదుర్భావే. పరులచేఁ బెంచఁబడి వారికిఁ బుట్టిన బిడ్డవలె నుండువాఁడు. ౩. పరైరేధితో వర్తత ఇతి పరైధితః. ఏధ వృద్ధౌ. పరులచేఁ బెంచఁబడియుండువాఁడు. ఈ ౪ పెంపుడుబంటుపేళ్లు.

**మన్దస్తు తున్ద పరిమృజ ఆలస్య శ్శీతకో ఽ లసో ఽ నుష్ణః.** 18

ఆలస్యేన మందతే–స్వపితీవేతి మందః. మది స్తుత్యాదౌ. ఆలస్యముచేత నిద్రపోవువానివలె నుండువాఁడు. ౧. పునః పునస్తుందం పరిమార్ష్టీతి తుందపరిమృజః. మృజూ శుద్ధౌ. పలుమాఱు కడుపు నిమురుకొనువాఁడు. ౨.న లసతీ త్యలసః అలస ఏవాలస్యః–ప్రకాశించువాఁడు కాఁడు గనుక అలసుఁడు, అలసుఁడే ఆలస్యుఁడు. ౩. శీతం మందం కరోతీతి శీతకః–మందముగా కార్యమును జేయువాఁడు. ౪. అలసః ఉక్తః. ౫. నవిద్యతే ఉష్ణం తేజో ఽ స్యేతి అనుష్ణః–ప్రకాశము లేనివాఁడు. ఈ ౬ అలసుని పేళ్లు.

**దక్షే తు చతుర పేశల పటవ స్సూత్థాన ఉష్ణశ్చ,**

దక్షతే కార్యం శీఘ్రం కరోతీతి దక్షః. దక్ష వృద్ధౌ శీఘ్రార్థేచ. కార్యమును గొబ్బునఁ జేయువాఁడు. ౧ చతతే కాంక్షతే ప్రయోజనమితి చతురః. చతే చదే యాచనే చ. ప్రయోజనమును గాంక్షించువాఁడు. ౨. పింశతి అవయవో భవతి కార్యేష్వితి పేశలః. పిశ అవయవే. అన్ని ప్రయోజనములందు నవయవభూతుఁడై యుండువాఁడు. ౩. పాటయతి ప్రయోజనానీతి పటుః. ఉ.పు. పట గతౌ. ప్రయోజనముల నడపించువాఁడు. ౪. సుష్ఠు ఉత్థాన ముద్యోగోయస్య సూత్థానః. మంచి యుద్యోగము గలవాఁడు. ౫. ఓషత్య కార్య మిత్యుష్ణః. ఉష దాహే. అకార్యమును జెఱుచువాఁడు. ఈ ౬ నేర్పరిపేళ్లు.

**చణ్డాల ప్లవ మాతఙ్గ దివాకీర్తి జనంగమాః** 19
**నిషాద శ్వపచా వన్తేవాసి చాణ్డాల పుల్కసాః,**

చండతే కుప్యతీతి చండాలః. చడి కోపే. కోపగించుకొనువాఁడు. ౧. ప్లవతే ఉగ్రకర్మణ ఇతి ప్లవః. ప్లుఙ్ గతౌ. క్రూరకర్మ కొఱకు పోవువాఁడు. ౨. మా తంగతి న గచ్ఛతి గ్రామమధ్య మితి మాతంగః తగిగతౌ. గ్రామమధ్యమును బొందనివాఁడు. మతంగసంతతి కాఁగా మాతంగులని పౌరాణికులు చెప్పుదురు. ౩. దివసస్య పుణ్యకాలత్వాత్ దివా అకీర్తన మస్యేతి దివాకీర్తిః. కృత సంశబ్దే. పగలు పుణ్యకాలము గనుక అందుచ్చారణలేనివాఁడు. ౪. జనాద్గచ్ఛతీతి జనంగమః గమ్ ౡ గతౌ. జనుల నుండి తొలఁగిపోవువాఁడు. నిషీదతి పాప మస్మిన్నితి నిషాదః. షద్ ౡ విశరణ గత్యవసాదనేషు. వీనియందు పాప ముండును. ౬. శ్వానం పచతీతి శ్వపచః. డు పచ్ష్ పాకే. కుక్కను వండుకొనువాఁడు. ౭. అన్తేగ్రామాన్తే వసతీతి–అంతేవాసీ. న. పు. వస నివాసే. గ్రామము కడపట నుండువాఁడు. ౮. చండాల ఏవ చాణ్డాలః–చండాలుఁడే చాండాలుఁడు. ౯. పులంతీతి పులాః మహాంతః, తాన్ స్పర్శనేనక్త శాతయతీతి పుల్కసః. పుల మహత్త్వే. కసగతి శాతనయోః. పెద్దలను స్పర్శచేతఁ జెఱుచువాఁడు. ఈ ౧౦ మాలవానిపేళ్లు.

**భేదాః కిరాత శబర పుళిన్దా మ్లేచ్ఛజాతయః.** 20

"గోమాంసభక్షకో యస్తులోకబాహ్యం చ భాషతే, సర్వాచార విహీనో ఽసౌ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే" అనురీతిని మ్లేచ్ఛంతే అవ్యక్తం

భాషంత ఇతి మ్లేఛ్ఛాః. మ్లేచ్ఛ అవ్యక్తే శబ్దే. వ్యక్తముగాకుండఁ బలుకువారు గనుక మ్లేచ్ఛులు. మ్లేచ్ఛజాతులలో నెమలిపింఛము మొదలైనవి కట్టుకొనువారు కిరాతులు. ౧. ఆకులు కట్టుకొనువాండ్రు శబరులు. తమ భాషయేకాని యొకరిభాష నెఱుఁగనివారు పుళిందులు. కీతి శబ్దం రాతీతి కిరాతః. రా ఆదానే. కీయను శబ్దమును బలుకువాఁడు. శవతి గచ్ఛతి వన మితి శబరః. శు గతౌ. అడవిని దిరుగువాఁడు. ౧. పులంతీతి పుళిందాః. పుల మహత్త్వే. ప్రబలమైయుండువారు. ఈ 3 చండాలభేదములైన మ్లేచ్ఛజాతుల పేళ్లు.

**వ్యాధో మృగవధాజీవో మృతయు ర్లుబ్ధకశ్చ సః,**

విధ్యతి మృగానితి వ్యాధః. వ్యధ తాడనే. మృగములను జంపువాఁడు. ౧. మృగవధే నాజీవతీతి మృగవధాజీవః. జీవ ప్రాణధారణే. మృగవధచేత బ్రతుకువాడు. ౨. మృగాణ్ వధార్థం యాతీతి మృగయుః. ఉ. పు. యా ప్రాపణే. వధార్థమయి మృగములను దఱుముకొనిపోవువాఁడు. ౩. లుభ్యతి మృగేష్వితి లుబ్ధకః . లుభ గార్ధ్యే. మృగముల యం దాసగొనువాఁడు. ఈ ౪ బోయవానిపేళ్లు.

**కౌలేయక స్సారమేయః కుక్కురో మృగదంశకః.** 21

**శునకో భషక శ్శ్వా స్యాత్ -**

కులే గృహే భవః కౌలేయకః–ఇంట నుండునది. ౧. సరమాశునీ; తస్యా అపత్యం సారమేయః–సరమ యనఁగా నాఁడుకుక్క; దానికిఁబుట్టినది. ౨. కోకతే అస్థ్యాదిక మాదత్త ఇతి కుక్కురః. కుక వృక ఆదానే. ముడుసు (ఎముక)లు మొదలయినవానిని దెచ్చుకొనునది. మృగాణ్ దశతీతి మృగదంశకః. దంశ దంశనే. మృగములను గొఱుకునది. ౩. శునతి ఇతస్తతో గచ్ఛతీతి శునకః. శునగతౌ. ఇట్టటుఁ దిరుగునది. భషతీతి భషకః. భష భషణే. భషణం శ్వరవః. మొఱుగునది. ౪.శ్వయతి గచ్ఛతీతిశ్వా. న. పు. టుఓశ్వి గతివృద్ధ్యోః. తిరుగుచుండునది. ఈ ౭ కుక్కపేళ్లు.

**అలర్కస్తు సయోగితః,**

అల్యతే వార్యతే దంశభయా దిత్యలర్కః. అలవారణే. కఱుచునను భయము వలన నడ్డగింపఁబడునది. ఈ ౧ ఔషధ ప్రయోగమువలన వెఱ్ఱిపట్టిన కుక్క పేరు.

**శ్వా విశ్వకద్రుర్మృగయాకుశలః -**

విశ్వాన్ మృగాన్ కందయతీతి విశ్వకద్రుః. ఉ. పు. కదిరోదనే. సకలమైన మృగములను మొఱపెట్టించునది. ఈ ౧ వేఁటయందు నేర్పుగల కుక్కపేరు.

**సరమా శునీ.** 22

సరతి శ్వానం ప్రతీతి సరమా. సృ గతౌ. మొగకుక్కను గూర్చి పోవునది. ౧. శునః స్త్రీ శునీ. ఈ. సీ. ఈ ౨ ఆఁడుకుక్కపేళ్లు.

**విట్చర స్సూకరో గ్రామ్యో -**

విషం విష్ఠాం చరతీతి విట్చరః. చరగతి భక్షణయోః. విష్ఠను తినునది. ఈ ౧ ఊరఁబందిపేరు.

**బర్కర స్తరుణః పశుః,**

వర్కతే తృణాదికమితి బర్కరః. వృక ఆదానే. కసవు మొదలైనవి తినునది. ఈ ౧. ప్రాయపువయస్సుగల పశుమాత్రమునకు పేరు.

**ఆచ్ఛోదనం మృగవ్యం స్యాదాఖేటో మృగయా స్త్రియామ్.** 23

ఆ సమంతా చ్ఛోద్యంతే మృగా అత్రేతి ఆచ్ఛోదనం. చుదప్రేరణే. మృగములు దీనియందు తఱుమఁబడును. ౧. మృగా విధ్యంతే అస్మిన్నితి మృగవ్యం. వ్యధ తాడనే. దీనియందు మృగములు సంహరింపఁబడును. ౨. ఆఖేట్యంతే మృగా అత్రేతి ఆఖేటః. ఖట త్రాసే. దీనియందు మృగములు వెఱపింపఁబడును. ౩. మృగాణా మన్వేషణం మృగయా. మృగ అన్వేషణే. మృగములను వెదకుట. ఈ ౪ వేఁట పేళ్లు.

**దక్షిణారు ర్లుబ్ధయోగా ద్దక్షిణేర్మా కురఙ్గకః,**

దక్షిణే దక్షిణభాగే ఈర్మం వ్రణమస్య దక్షిణేర్మా. న. పు. కుడిదిక్కున గాయము తగిలినది. ఈ ౧ వేఁటకానిచేతి కుడిదిక్కున గాయము చేయఁబడిన మృగముపేరు.

**చోరైకాగారిక స్తేన దస్యు తస్కర మోషకాః.** 24

**ప్రతిరోధి పరాస్కన్ది పాటచ్చర మలిమ్లుచాః,**

చోరయతీతి చోరః. చురస్తేయే. దొంగిలించువాఁడు. పా. చురాచౌర్యం శీలమస్యేతి చౌరః-దొంగిలించుట స్వభావముగాఁ గలవాఁడు. ౧. ఏక మసంబాధం గృహం ప్రయోజన మస్యేతి ఐకాగారికః - దొంగిలిం

చుటకొఱకు జనసమ్మర్దము లేని యిల్లు ప్రయోజనముగాఁ గలవాఁడు. ౨. సేనయతిస్తేనః. స్తేనచౌర్యే. మ్రుచ్చిలించువాఁడు. ౩. దస్యత్యు పక్షిణోతి కదాచిదితి దస్యుః. ఉ. పు. దసు ఉపక్షయే. ఒకానొకప్పుడు చెడిపోవువాఁడు. ౪. తత్ చోరకర్మ కరోతీతి తస్కరః. డు కృఞ్ కరణే. దొంగతనముఁ జేయువాఁడు. ౫. ముష్ణాతీతి మోషకః. ముష స్తేయే. దొంగిలించువాఁడు. ౬. ప్రతిరుణద్ధీతి ప్రతిరోధీ. న. పు. రుధిర్ ఆవరణే. అడ్డగించువాఁడు. ౭. పరా నాస్కందయతీతి పరాస్కందీ. న. పు. స్కందిర్ గతిశోషణయోః. పరుల శోషింపఁజేయువాఁడు. ౮. పాటయన్ విదళయన్ చరతీతి పాటచ్చరః. చరగతి భక్షణయోః. పీడించుచుఁ జరించువాఁడు. పటచ్చర మపి గృహ్ణాతీతి పాటచ్చరః–చినిఁగిన కోకనైనను దీసికొనువాఁడు. ౯. మలినం యథాతథా మ్లోచతి గచ్ఛతీతి మలిమ్లుచః. మ్లుచు గత్యాం. మలినముగాఁ జరించువాఁడు. ఈ ౧౦ దొంగపేళ్లు.

**చౌరికా స్తైన్య చౌర్యే చ స్తేయమ్ -**

చోరస్య కర్మ చౌరికా, చౌర్యం చ–చోరునియొక్క కర్మము గనుక చౌరిక, చౌర్యమును. స్తేనస్య కర్మ స్తైన్యం, స్తేయం చ –స్తేనుఁడనఁగా దొంగ; వానియొక్క కర్మ. ఈ ౪ దొంగతనము పేళ్లు.

**లోప్త్రం తు తద్ధనమ్.** 25

లుప్యత ఇతి లోప్త్రం. లుప్ ౢ ఛేదనే. అపహరింపఁబడునది. ఈ ౧ దొంగిలించిన సొమ్ము పేరు.

**వితంస స్తూపకరణం బన్ధనే మృగపక్షిణామ్,**

వితంస్యత ఇతి వితంసః. తసి భూష అలంకారే. చక్కఁజేయఁబడునది. పా. వీతంసః. మృగములను పక్షులను బట్టుటకు సాధనమైన యురులు మొదలయినవాని పేరు.

**ఉన్మాథః కూటయన్త్రం స్యాత్ -**

ఉన్మథ్యంతే మృగాదయో నేనే త్యున్మాథః. మంథ విలోడనే. మృగములు దీనిచేతఁ బీడింపఁబడును. కూటేన కృతం యంత్రం కూటయంత్రం. కపటమునఁ జేయఁబడిన యంత్రము. బోనుపేళ్లు. గాలమని కొందఱు.

**వాగురా మృగబన్ధనీ.** 26

మృగబంధనే అవగురతే వాగురా. గురీ ఉద్యమనే. మృగబంధన మందుద్యోగించునది. ౧. మృగా బధ్యంతే అనయేతి మృగబంధనీ. ఈ. స్త్రీ. బంధ బంధనే. మృగములు దీనిచేత బంధింపఁబడును. ఈ ౨ మృగములఁబట్టు వలపేళ్లు.

**శుల్బం వటారకః -స్త్రీతు రజ్జు స్త్రిషు వటీ గుణః.**

శోచంత్యనేన మృగాదయ ఇతి శుల్బం. శుచ శోకే. మృగాదులు దీనిచేత దుఃఖించును. పా. శుమ్బం. ౧. వట్యతే వేష్ట్యత ఇతి వటారకః. వట వేష్టనే. చుట్టఁబడునది. పా. వరాటకః. ౨. సృజ్యత ఇతి రజ్జు. ఉ. స్త్రీ. సృజవిసర్గే. సృజింపఁబడునది. ౩. వట్యతే వేష్ట్యత ఇతి వటీ. వటవేష్టనే. త్రి. చుట్టఁబడునది. ౪. గుణ్యతే అభ్యస్యతే బంధనాయేతి గుణః. గుణఅభ్యాసే. బంధనము కొర కభ్యసింపఁబడునది. ఈ ౫ త్రాడుపేళ్లు.

**ఉద్ఘాటనం ఘటీయన్త్రం సలిలోద్వాహనం ప్రహేః.** 27

ఉద్ఘాట్యతే జల మనేనే త్యుద్ఘాటనం. ఘట సంఘాతే. దీనిచేత నీళ్లు కూర్చఁ బడును. ౧. ఘటీభిః కృతం యంత్రం ఘటీయంత్రం–కడవలచేతఁ జేయఁబడిన యంత్రము. ఈ ౨ నూతినుండి నీళ్లెత్తెడు రాట్నము (ఏతము) మొదలయినదాని పేళ్లు.

**పుంసి వేమా వాయదణ్డః -**

వయంత్యనేనేతి వేమా. న. పు. వేఞ్ తంతుసంతానే. దీనిచేత నేయుదురు. వయనం వాయః, వాయస్య దండో వాయదండః. పా. వాపదండః. వాయమనగా నేయుట, నేయునట్టి పలక వాయదండము. ఈ ౨ కోకలు నేయు తాఁకుడుపలక పేళ్లు.

**సూత్రాణి నరి తన్తవః,**

సీవ్యంత్యేభిరితి సూత్రాణి. షివ్ తంతుసంతానే. వీనిచేత నేయుదురు. ౧. తన్యతే వస్త్ర మేభిరితి తంతవః. ఉ. పు. తను విస్తారే. వీనిచేత వస్త్రము విస్తరింపఁబడును. ఈ ౨ నూలిపేళ్లు.

**వాణి ర్వ్యూతిః స్త్రియౌ తుల్యే -**

వయన వాణిః; వ్యూతిశ్చ. ఇ. స్త్రీ. వేఞ్ తంతుసంతానే. నేయుట. ఈ ౨ నేయుట వేళ్లు.

**పుస్తం లేప్యాది కర్మణి.** 28

పుస్త్యతే ఆద్రియత ఇతి పుస్తం. పుస్తబుస్త ఆదరానాదరయోః. చేయువానిచేత నాదరింపఁబడునది. ఆది శబ్దముచేత మృత్తికా కాష్ఠాదులచేఁ జేయఁబడినవియును జెప్పఁబడును. "మృదా వా దారుణానాథ వస్త్రేణా ప్యథ చర్మణా, లోహరత్నైః కృతం వాపి పుస్తమిత్యభిధీయతే" అని. లెప్పపుపని మొదలైనదానిపేరు. సాలెవాఁడు పడుగుచేయుపని పేరని కొందఱు.

**పాఞ్చాలికా పుత్త్రికా స్యా ద్వస్త్రదన్తాదిభిః కృతా,**

పాంచాలదేశే భవా పాంచాలికా–పాంచాలదేశమందుఁ బుట్టినది. కృత్రిమా పుత్రీ పుత్రికా–పుత్రికవలె నుండునది. (అధి. జతుత్రపువికారే తు జాతుషం త్రాపుషం త్రిషు). ఈ ౨ వస్త్రదంతకాష్ఠాదులచేతఁ జేయఁబడిన బొమ్మల పేళ్లు.

**పిటకః పేటకః -**

వేటతీతి పిటకః, పేటకశ్చ. పిట సంఘాతే. కూడుకొనియుండునది పిటకము, పేటకమును. ఈ ౨ పెట్టె పేళ్లు.

**పేటా మఞ్జూషా-**

పేటతి వస్తుభిరితి పేటా. పిట సంఘాతే. వస్తువులతోఁ గూడు కొని యుండునది. ౧. మజ్జన్తి వస్తూ న్యత్రేతి మఞ్జూషా. టు మస్జోశుద్ధౌ. దీనియందు వస్తువు లణఁగియుండును. ఈ ౨ మందసము పేళ్లు. ఈ ౪ ను పర్యాయములని కొందఱు.

**అథ విహఙ్గికా.**　　29

**భారయష్టిః -**

విహఙ్గ సదృశత్వాత్ విహఙ్గికా–పక్షివలె నంతటఁ బోవునది. పా. విహఙ్గమా. భారవహనార్థం యష్టిః భారయష్టిః. ఇ. సీ. భారము మోయుటకొఱకైన బ్రద్ద. ఈ ౨ కావడిబద్దపేళ్లు.

**తదాలమ్బి శిక్యం కాచః -**

శక్నోతి భారం వోఢు మితి శిక్యం. శక్ ౹౩ శక్తౌ. భారమును వహించుటకు సమర్థమైనది. కచ్యతే బధ్యత ఇతి కాచః. కచ బంధనే. కట్టుఁబడునది. కావడిబద్దయందు వ్రేలు ఉట్టిపేళ్లు. (కావడిమట్టు).

**అథ పాదుకా,**

టుః-మాటల యొక్క యుక్తియందు సమర్థుఁడైనవాఁడు. ౧. ప్రశస్తావా గస్యేతి వాగ్మీ. నాంతః. మంచివాక్కు గలవాఁడు. ౨. వావద్యతే భృశం వదతీతి వావదూకః. వద వ్యక్తాయాం వాచి. లెస్సగాఁ బలుకువాఁడు. 'వావదూకశ్చవక్తరి' యని కొందఱు. ౪. తాఁ బలుక నిచ్ఛయించిన యర్థమును యుక్తివలన లెస్సగా నిర్వహించి మాటలాడువాని పేళ్లు.

**స్యాజ్జల్పాకస్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్.** 36

జల్పతి కుత్సితం వదతీతి జల్పాకః. జల్ప వ్యక్తాయాం వాచి. కుత్సితముగాఁ బలుకువాఁడు. ౧. కుత్సితా వాచ స్సంత్యస్యేతి వాచాలః; వా చాటశ్చ-కుత్సితములైన పెక్కుమాటలాడును గనుక వాచాలుఁడు, వాచాటుఁడును. ౨, ౩. బహ్వ్యః గర్హ్యవాచో యస్యేతి బహుగర్హ్యవాక్. చ. కుత్సితమైన పెక్కుమాటలు గలవాఁడు. ౪. ప్రకృతోపయుక్తములు గాక దోషయుక్తముగాఁ బెక్కు మాటలాడువాని పేళ్లు.

**దుర్ముఖే ముఖరాబద్ధముఖౌ -**

దుష్టం ముఖం వచన మస్యేతి దుర్ముఖః, ముఖరశ్చ-అప్రియమైన మాటలు గలవాఁడు దుర్ముఖుఁడు, ముఖరుఁడును. ౧, ౨. అబద్ధమని యంత్రితం ముఖ మస్యే త్యబద్ధముఖః-అప్రియవాక్కులచేత నియమములేని ముఖము గలవాఁడు. ఈ 3 అప్రియముగాఁ బలుకువాని పేళ్లు.

**శ్లక్ష్ణః ప్రియంవదే,**

శ్లిష్యతే సర్వైరితి శ్లక్ష్ణః. శ్లిష ఆలింగనే. అందఱిచేత నాలింగనము చేయఁ బడువాఁడు. పా. శక్నోతి ప్రియమేవ వక్తుమితిశ్లక్ష్ణః. శక్ ౡ శక్తౌ. ప్రియమును బలుకనేర్చినవాఁడు. ౧. ప్రియం వదతీతి ప్రియంవదః. వద వ్యక్తాయాం వాచి. ప్రియముగాఁ బలుకువాఁడు. ఈ ౨ ప్రియముగాఁ బలుకువాని పేళ్లు.

**లోహల స్స్యాదస్ఫుటవాక్ -**

లోహతి స్థానప్రయత్నవైకల్యం కరోతీతి లోహలః. లుహ కత్థనాదౌ ఉచ్చారణమందు వైకల్యము గలవాఁడు. లునాతి వాక్యం మధ్యే ఛినత్తీతి లోహలః. లూఞ్ ఛేదనే. మాటను నడుమ నిలుపువాఁడు. లోహః అతికాఠిన్యేన లోహసదృశం రసనాతాల్వాదికం; తం లాతీతి లోహలః-దట్టమైయుండుటచేత నినుమువంటి కాఠిన్యముగల నాలుక

మొదలైనది లోహము; అది గలవాఁడు. ౧. అస్ఫుటా వా గ్యస్యేత్య స్ఫుటవాక్. చ. వ్యక్తముగాని వాక్కు గలవాఁడు. ఈ ౨ వ్యక్తము కాకుండ మాటలాడువాని పేళ్లు.

**గర్హ్యవాదీ తు కద్వదః.** 37

గర్హ్యం వదతీతి గర్హ్యవాదీ. నాంతః. నిందార్థముగాఁ బలుకువాఁడు. ౧. కుత్సితం వదతీతి కద్వదః. వద వ్యక్తాయాం వాచి. కుత్సితముగాఁ బలుకువాడు. నిందార్థముగా మాటలాడువాని పేళ్లు. వాచాలుఁడు నింద్యములైన పెక్కుమాట లాడును. కద్వదుఁడు నింద్యములైన కొంచెము మాటలాడునని వారిద్దఱికిఁ గల భేదము.

**సమౌ కువాద కుచరౌ -**

కుత్సితః పరదోష ప్రఖ్యాపనశీలః వాదః భాషణం యస్యేతి కువాదః–పరదోష ప్రకాశములైన మాటలు గలవాఁడు. పా. కుత్సితం వదతీతి కువదః. వద వ్యక్తాయాం వాచి. కీడును బలుకువాఁడు. కుత్సితం చరతి భాషతే గచ్ఛతి వా కుచరః. చర గతి భక్షణయోః. కుత్సితముగాఁ బలుకువాఁడుగాని చరించువాఁడుగాని కుచరుడు. ఈ ౨ పరుల దోషమును బలుకువాని పేళ్లు.

**స్యా దసౌమ్య స్వరో ఽ స్వరః,**

విరుద్ధః శ్రమణకటుః స్వరో యస్యే త్యస్వరః–విన నింపుగాని స్వరము గలవాఁడు. ఈ ౧ చెవులకింపుగాని స్వరమును బలుకువాని పేరు.

**రవణ శ్శబ్దనః -**

రౌతి తాచ్ఛీల్యేనేతి రవణః. శబ్దాయతే తాచ్ఛీల్యేనేతి శబ్దనః. రుశబ్దే; శబ్ద శబ్దే. స్వభావముననే మ్రోయువాఁడు. ఈ ౨ మ్రోయు స్వభావము గలవాని పేళ్లు.

**నాన్దీవాదీ నాన్దీకర స్సమౌ.** 38

నాందీం వదతీతి నాందీవాదీ. నాంతః. వద వ్యక్తాయాం వాచి. 'దేవద్విజ నృపాదీనాం స్తుతి ర్యస్మాత్ప్రవర్తతే, ఆశీర్వచనసంయుక్తా సా నాందీ పరికీర్తితా, సాస్యాత్పదైర్ద్వాద శభిగష్టభిర్వాప్యలంకృతా' ఇత్యాదినా కోహలాదిభిరుక్తలక్షణః పద్యవిశేషో నాందీత్యుచ్యతే. యత్కించి మంగళసూచకం వచోమాత్రం –ఆశీర్వచనయుక్తమయిన దేవద్విజ

నృపాదులయొక్క స్తుతిగాని, మంగళ సూచకమయిన వచనముగాని నాంది యనంబడును. అట్టినాందిని జేయువాఁడు. ౧. నాందీం కరోతీతి నాందీకరః. డు కృఞ్ కరణే. నాందిని జేయువా డు. ఈ ౨ ఆశీర్వాదముతోఁ గూడిన దేవతాదులయొక్క స్తోత్రము చేయు మంగళ పాఠకునిపేళ్లు.

**జడో ఽజ్ఞే -**

"ఇష్టంవానిష్టం వా సుఖ మితరద్వాన వేత్తియో మోహాత్, తూష్ణీకః పరవశగ స్స భవతి జడసంజ్ఞకః పురుషః" అని. జలతి జడీభవతీతి జడః. జల ఘాన్యే. స్తబ్ధుడై యుండువాఁడు. ౧. న జానాతీత్యజ్ఞః. జ్ఞా అవబోధనే. ఎఱుఁగనివాఁడు. ఈ ౨ ఇస్టానిష్ట సుఖదుఃఖముల నెఱుంగక పరవశుఁడై యూరకుండువాని పేళ్లు.

**అనేడమూకస్తు వక్తుం శ్రోతు మశిక్షితే,**

ఏడమూక సదృశో ఽనేడమూకః. అత్ర నఞ్ సాదృశ్యే. తదుక్తం. "తత్సాదృశ్య మభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థా షట్ ప్రకీర్తితాః" ఇతి. చెవిటివానికిని మూఁగవానికిని సరియైనవాఁడు. "నఖ ల్వనేడమూకా వా సర్వ ఏతే మహర్షయః" అని శ్రీహర్ష ప్రయోగము. కొందఱు ఏడమూకః అనుపాఠము సంగీకరించి చెవుడును మూఁగతనమును గలిగినవానికి పేరని చెప్పుదురు. సంస్కృతభాషాదౌ కృతబుద్ధిషు వ్యవహరత్సు యః స్వయ మవ్యుత్పన్నతయా తదీయవాక్యాని శ్రోతుం ప్రతివక్తుంచ సమర్థోన భవతి, స ఏడమూక ఉచ్యతే. ఏడో బధిరః; మూకో వాగింద్రియ రహితః ఏడశ్చాసౌ మూకశ్చేతి విశేషణ సమాసః. సంస్కృతభాషాదులయందు పండితులు వ్యవహరించుచుండగా వినుటకును ప్రతివచనముఁ జెప్పుటకును శక్తుఁడు గానివాఁడు ఏడమూకుఁడని కొందఱు. ఈ ౧ మాటలాడుటకును వినుటకును సమర్థుఁడుకానివాని పేరు.

**తూష్ణీంశీలస్తు తూష్ణీకః -**

తూష్ణీం శీల మస్య తూష్ణీంశీలః, తూష్ణీకశ్చ- ఊరకుండు స్వభావము గలవాఁడు తూష్ణీంశీలుఁడు, తూష్ణీకుఁడును. ఈ ౨ మాటలాడక యూరకుండు స్వభావము గలవాని పేళ్లు.

**నగ్నో ఽవాసా దిగమ్బరః.** 39

న లజ్జత ఇతి నగ్నః. ఓ లస్జీ వ్రీడే. సిగ్గులేనివాఁడు. ౧. న విద్యతే వాసో యస్యేత్యవాసాః. స. బట్టలేనివాఁడు. ౨. దిక్ అంబరం యస్యేతి దిగంబరః –బయలే బట్టగాఁ గలవాఁడు. ఈ 3 దిసమొలవాని పేళ్లు.

**నిష్కాసితో ఒ వకృష్ట స్స్యాత్ -**

నిష్కాస్యత ఇతి నిష్కాసితః. కస గతౌ. వెళ్లఁగొట్టcబడినవాఁడు. ౧. అవకృష్యతే బలాత్కారేణే త్యవకృష్టః. కృష విలేఖనే. బలిమిచేఁ ద్రోయఁబడినవాఁ డు. ఈ ౨ వెళ్లఁగొట్టఁబడినవాని పేళ్లు.

**అపధ్వస్తస్తు ధిక్కృతః,**

అపధ్వస్యతేస్మ అపధ్వస్తః. స్రంసు ధ్వంసు అవస్రంసనే. దిగఁద్రోయఁ బడినవాఁడు. ౧. ధిగితి కృతః ఉచ్చారిత ఇతి ధిక్కృతః. డు కృఞ్ కరణే. కరోతి రత్ర ఉచ్చారణే. చోరంకార మాక్రోశతీతి వత్. చెడ్డవాఁడని పలుకఁబడినవాఁడు. ఈ ౨ తిరస్కరింపఁబడినవాని పేళ్లు.

**ఆత్తగన్ధో ఒ భిభూత స్స్యాత్ -**

ఆత్మః స్వీకృతః గంధః గర్వో యేన సః ఆత్తగంధః గంధ అర్దనే. పొందఁ బడిన గర్వము గలవాఁడు. పా. ఆత్తగర్వః. అభిభూయతే స్మ అభిభూతః. భూ సత్తాయాం. పరిభవింపఁబడువాఁడు. ఈ ౨ గర్వితుఁడై రాజుచేతఁగాని శత్రువులచేతఁగాని గర్వభంగముఁ బొందినవాని పేళ్లు. ఆపధ్వయస్త శబ్దము మొదలు ౪ పర్యాయములని కొందఱు.

**దాపిత స్సాధిత స్సమౌ.** 40

రాజ్ఞా వివాదాస్పదీభూతం ధనం ధనినే దాప్యతే అస్మాదితిదాపితః. డు దాఞ్ దానే. రాజుచేత వివాదగ్రస్తమైన ధనమును ధనస్వామికొఱ కిప్పించఁ బడినవాడు. పా. దాయితః ౧. ప్రతివాదినా సాక్షిలేఖ్యాదిభి స్సాధ్యతే స్మసాధితః. రాధసాధ సంసిద్ధౌ. ప్రతివాదిచేత సాక్షిలేఖ్యాదులవలన సాధింపఁబడినవాఁడు. ఈ ౨ దండుగ గొనఁబడిన వానిపేళ్లు.

**ప్రత్యాదిష్టో నిరస్తస్స్యాత్ప్రత్యాఖ్యాతో నిరాకృతః,**

ప్రత్యాదిశ్యతే నిరాక్రియత ఇతి ప్రత్యాదిష్టః. దిశ అతిసర్జనే. నిరాకరింపఁబడినవాఁడు. ౧. నిరస్యతే స్మనిరస్తః. అసు క్షేపణే. నిరసింపఁ బడినవాఁడు. ౨. ప్రత్యాఖ్యాయతే స్మ ప్రత్యాఖ్యాతః. ఖ్యా ప్ర

కథనే. ధిక్కరింపఁబడినవాఁడు. ౩. నిరాక్రియతే స్మ నిరాకృతః. డు కృఞ్ కరణే. నిరాకరింపఁబడినవాఁడు. ఈ ౪ న్యాయముచేఁ బరిహరింపఁబడినవాని పేళ్లు.

**నికృత స్స్యా ద్విప్రకృతః -**

నితరాం దుఃఖితః క్రియతే స్మ నికృతః, విప్రకృతశ్చ. డు కృఞ్ కరణే. మిక్కిలి పీడింపఁబడినవాఁడు. గనుక నికృతుఁడు, విప్రకృతుఁడును. "తస్మిఁ విప్రకృతాః కాలే తారకేణ దివౌకసః" ఇతి కుమారసంభవే కాళిదాసః. ఈ ౨ పరకృత తిరస్కారముచేఁ బీడింపఁబడినవాని పేళ్లు.

**విప్రలబ్ధస్తు వఞ్చితః.** 41

విప్రలభ్యతేస్మ విప్రలబ్ధః; వంచ్యతేస్మ వంచితః. డు లభ్ష్ ప్రాప్తౌ; వంచు విప్రలంభనే. మోసపుచ్చఁబడినవాఁడు విప్రలబ్ధుఁడు, వంచితుఁడును. ఈ ౨ బడినవాని పేళ్లు.

**మనోహతః ప్రతిహతః ప్రతిబద్ధో హతశ్చ సః,**

మనసి హతో మనోహతః; మనసి ప్రతిహన్యతేస్మ ప్రతిహతః. హన హింసాగత్యోః. మనస్సు నందలి యుత్సాహము చెడినవాఁడు మనోహతుఁడు, ప్రతిహతుఁడును. ౧, ౨. మనసి ప్రతిబధ్యతే స్మ ప్రతిబద్ధః. బధ బంధనే. మనస్సు నందు కట్టఁబడియుండువాఁడు. ౩. నిశ్చేష్టత్వేన హత సదృశతయా హతః–నిశ్చేష్టుఁ డౌటవలనఁ జచ్చినవానివలె నుండువాఁడు. ఈ ౪ కార్యవిఘాతము, విరుద్ధ కార్యోత్పత్తి మొదలగుదానివలన మనస్సున నుత్సాహము చెడినవాని పేళ్లు. 'ప్రత్యాదిష్టో నిరస్తస్స్యాత్' అనునది మొదలు ఒకటిన్నర శ్లోకము ప్రక్షిప్తమని కొందఱు.

**అధిక్షిప్తః ప్రతిక్షిప్తే -**

అధిక్షిప్యతే స్మ అధిక్షిప్తః; ప్రతిక్షిప్యతే స్మ ప్రతిక్షిప్తః. క్షిపప్రేరణే. ఆక్షేపించఁ బడినవాఁడు అధిక్షిప్తుఁడు, ప్రతిక్షిపుఁడును. ఈ ౨ కౌట సాక్ష్యాదులవలన సభ్యులచేత నిందింపఁబడినవాని పేళ్లు.

**బద్ధే కీలిత సంయతౌ** 42

కీల్యతే స్మ కీలితః; సంయమ్యతే స్మ సంయతః. కీల బంధనే, యమ ఉపరమే. కట్టఁబడువాఃడు కీలితుఁడు, సంయతుఁడును. ఈ ౨ చౌర్యాద్యపరాధమున బొండకొయ్య మొదలగుదానిచేతఁ గట్టుపడినవాని పేళ్లు.

**ఆపన్న ఆపత్ప్రాప్తస్స్యాత్ -**

ఆపద్యతే స్మ ఆపన్నః; ఆపదం ప్రాప్తః ఆపత్ప్రాప్తః. పత్ ౙగతౌ; ఆప్ ౙ వ్యాప్తౌ. ఆపదఁబొందినవాఁడు ఆపన్నుఁడు, ఆపత్ప్రాప్తుఁడును. ఈ ౨ ఆపదఁ బొందినవాని పేళ్లు.

**కాన్దిశీకో భయద్రుతః,**

కాం దిశం గచ్ఛామీతి చింతయన్ పలాయితః కాదిశీకః-ఏ దిక్కునఁ బోవుదునని చింతించుచుఁ బరుగెత్తువాఁడు. భయేన ద్రుతః భయద్రుతః. ద్రు గతౌ. భయముచేతఁ బోవువాఁడు. ఈ ౨ శత్రువు మొదలైనవారికి భయపడి పాఱిపోవువాని పేళ్లు.

**ఆక్షారితః క్షారితో ౽ భిశస్తే-**

ఆక్షార్యతే స్వరూపాచ్చాల్యత ఇత్యాక్షారితః, క్షారితశ్చ. క్షర సంచలనే. స్వరూపమునుండి చలింపఁబడినవాఁడు ఆక్షారితుఁడు, క్షారితుఁడును. ౧, ౨. అభిశస్యతే వాగ్బాణైరిత్యభిశస్తః. శసు హింసాయాం. తీక్ష్ణవాక్యాదులచేతఁ బీడింపఁ బడినవాఁడు. ఈ 3 పరస్త్రీగమన, బ్రహ్మహత్యాది దోషములచేత దూష్యుఁడని వాడఁబడినవానిపేళ్లు.

**సంకసుకో ౽ స్థిరే.** 43

సమ్యక్కసతి ఇతస్తతో గచ్ఛతీతి సంకసుకః. కస గతౌ ఇట్టటుఁబోవువాడు. ౧. స్థిరో న భవతీత్యస్థిరః-స్థిరుఁడు గానివాఃడు. ఈ ౨ దేనియందును నిలుకడ లేనివాని పేళ్లు.

**వ్యసనార్తో పరక్తౌ ద్వౌ -**

వ్యసనేన ఋతో వ్యసనార్తః. ఋ గతౌ. వ్యసనముచేతఁ బొందఁబడినవాడు. ౧. ఉపరజ్యతే స్మ ఉపరక్తః. రంజ రాగే. వ్యసనముచేఁ గప్పఁబడినవాఁడు. ఈ ౨ దైవకృతమునఁగాని మనుష్యకృతమునగాని శరీరపీడ గలవాని పేళ్లు. ద్యూతాది వ్యసనములు గలవాఁడని కొందఱు.

**విహస్త వ్యాకులౌ సమౌ,**

విగతౌ వ్యాపారశూన్యౌ హస్తౌ యస్యేతి విహస్తః. వ్యాపారములేని హస్తములు గలవాఁడు. ౧. వ్యాకుల్యతే మనో యస్యేతి వ్యాకులః. కుల సంస్త్యానే. శోకాదులచేత మందముగాఁ జేయఁబడిన మనస్సు గలవాఁడు. ఈ ౨ శోకాదుల వలన నిది సేయ వలయునని యెఱుఁగక ఱిచ్చ

వడినవాని పేళ్లు.

**విక్లబో విహ్వలః -**

విక్లబతే శక్తో న భవతీతి విక్లబః. క్లబ కాతర్యే. "ధాతుపాఠేష్వ పఠితో ఽపి విక్లబధాతురున్నేయః. పాఠస్య ప్రదర్శనార్థత్వా" దితి సుబోధినీకారః. విక్లబ ఇతి అవ్యుత్పన్న ప్రాతిపదికమితి కేచిత్. శక్తుఁడు గానివాఁడు. ౧. విరుద్ధం హ్వలతీతి విహ్వలః. హ్వల సంచలనే. విరుద్ధముగాఁ జలించువాఁడు. ఈ ౨ భయ శోకాదులచేఁ దన యవయవములను ధరింప శక్తిలేనివాని పేళ్లు.

**స్యాత్తు వివశో ఽరిష్టదుష్టధీః.** 44

విరుద్ధం వష్టీతి వివశః. వశ కాంతౌ. విరుద్ధమైనదానిఁ గోరువాఁడు. ౧. అరిష్టమనఁగా నాసన్న మరణము; దానిచేత దూషితమైన బుద్ధిగలవాఁడు వివశు డనంబడును.

**కశ్యః కశార్హే**

కశామర్హతీతి కశ్యః, కశార్హశ్చ. చబుకుపెట్ల కర్హమైనవాఁడు శశ్యుఁడు, కశార్హుడును. ఈ ౧ అపరాధమువలన చబుకుపెట్లకుఁ దగినవానిపేళ్లు.

**సన్నద్ధే త్వాతతాయీ వధోద్యతే,**

ఆతతమధికం పాపమేతీ త్యాతతాయీ. నాంతః. ఇణ్ గతౌ. అధికమైన పాపమును బొందినవాఁడు. ఆతం పలాయమానం తయతే జిఘాంసయా గచ్ఛతీతి ఆతతాయీ. తయ గతౌ. పరుగెత్తువానిని జంపనిచ్ఛచేఁ దఱుముకొనిపోవువాఁ డు. ౧. అత్రవధోద్యతపదే. "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహా, క్షేత్రదార హరశ్చైవ షడేతే హ్యాతతాయిన". ఇతి స్మృత్యుక్తాః పరానిష్టకారిణో గృహ్యంతే. చంపెద నని యుద్యోగించి సన్నాహపడినవాని పేరు.

**ద్వేష్యే త్వక్షిగతః -**

ద్వేష్టుం యోగ్యో ద్వేష్యః. ద్విష అప్రీతౌ. ద్వేషింపఁదగినవాఁడు. ౧. అక్షిగత శూక సికతాదివత్పీ డాకత్వాదక్షితగః–కంటనున్న నెఱసు, ఇసుక మొదలైనదానివలెఁ బీడించువాఁడు. ఈ ౨ ద్వేషింపఁదగినవాని పేళ్లు.

**వధ్య శ్శీర్షచ్ఛేద్య ఇమౌ సమౌ.** 45

వధమర్హతీతి వధ్యః–చంపఁదగినవాఁడు. ౧. శీర్షచ్ఛేద మర్హతీతి శీర్షచ్ఛేద్యః –తలఁగొట్టఁదగినవాడు. ఈ ౨ చంపఁదగినవాని పేళ్లు.

**విష్యో విషేణ యో వధ్యః -**

విషేణ వధ్యో విష్యః–విషముచేతఁ జంపఁదగినవాఁడు. ఈ ౧ విషముచేఁ జంపఁదగినవాని పేరు.

**ముసల్యో ముసలేన యః,**

ముసలేన వధ్యో ముసల్యః–రోఁకటిచేఁ జంపఁదగినవాఁడు. ఈ ౧ సువర్ణస్తేయాది ప్రాయశ్చిత్తార్థమై రోఁకటిచేఁ జంపఁదగినవాని పేరు.

**శిశ్విదానో ఽ కృష్ణకర్మా-**

శ్విందతే కర్మణా శుద్ధోభవతీతి శిశ్విదానః. శ్విది శ్వైత్యే. నడవడికచేఁ బరిశుద్ధుఁడైనవాఁడు. పా. శ్వేతతే పాపవిశేషాద్వైవర్ణ్యం ప్రాప్నోతీతి వా, పుణ్యవిశేషా ద్విశుద్ధిం ప్రాప్నోతీతి వా శిశ్వితానః. శ్వితా వర్ణే. పాపవిశేషమువలన వైవర్ణ్యముగాని పుణ్యవిశేషమువలన శుద్ధినిగాని పొందువాఁడు. ౧. అకృష్ణం శుద్ధం కర్మ యస్యేత్యకృష్ణ కర్మా. నాంతః. పరిశుద్ధమయిన నడవడిగలవాఁడు. ఈ ౨ మంచియాచారము గలవాని పేళ్లు. శిశ్విదానః కృష్ణకర్మా అనుపాఠము నంగీకరించి పాపాచారుని పేళ్లని కొందఱు. శిశ్వితానః కృష్ణకర్మేతి సర్వానంద సుభూతి చంద్రౌ. శిశ్వితానః అకృష్ణకర్మేతి సుబోధినీకారః. పక్షద్వయే ఽపి చిరంతన ప్రయోగ దర్శనాత్ నిఘంట్వంతర గవేషణాచ్చ శ్వితాన శబ్దార్థో నిశ్చేతవ్యః. అత వా అరిష్టశబ్దస్య మిథో విరుద్ధ శుభాశుభ రూపార్థద్వయవత్ శిశ్వితాన శబ్దస్యాపి పుణ్యాపుణ్య కృల్లక్షణో భయార్థ వాచకత్వ మిత్యవధేయం.

**చపల శ్చికుర స్సమౌ.** 46

"అవిమృశ్యతు యః కార్యం పురుషో వధబంధనాదికం కుర్యాత్, అవినిశ్చిత కారిత్వాత్సతు ఖలు చపలో బుధై ర్జ్ఞేయః" అని. చోపతీతి చపలః. చుప మందాయాం గతౌ. మందమయిన జ్ఞానము గలవాడు. ౧.చకతి తృప్యతి స్వకర్మణేతి చికురః–తాఁ జేసిన ప్రయోజనముచేత తృప్తిఁబొందువాఁడు. ఈ ౨ దోషము విచారించక వధబంధనాదులఁ

నాదులఁ జేయువాని పేళ్లు.

**దోషైక దృక్పురోభాగీ -**

దోషమేకం పశ్యతి దోషైకదృక్. శ. దృశిర్ ప్రేక్షణే. కేవలము దోషమునే చూచువాఁడు. ౧. పురో దోషం భజతి గృహ్ణాతి తాచ్ఛీల్యేనేతి పురోభాగీ. నాంతః. భజ సేవాయాం. ముందు దోషమును స్వభావమున గ్రహించువాఁడు. ఈ ౨ దోషమునే వెదుకువాని పేళ్లు.

**నికృత స్త్వనృజు శ్శఠః,**

నికృణోతి హినస్తి నికృతః. కృఞ్ హింసాయాం. పీడించువాఁడు. ౧. అనృజు హృదయత్వా దనృజుః-కుటిలహృదయము గలవాఁడు. ౨. శఠతీతి శఠ. శఠ కైతవే. కపటము గలవాఁడు. "గూఢ విప్రియ కృచ్ఛఠః" అని యాలంకారికులు. ఈ 3 కుత్సితుని పేళ్లు.

**కర్ణేజప స్సూచక స్స్యాత్ పిశునో -**

రాజాదీనాం కర్ణేజపతి వ్యక్తం వదతి పరకీయదోషా నితి కర్ణే జపః జప వ్యక్తాయాం వాచి. రాజాదులయొక్క చెవియందు ఇతరుల దోషములను జెప్పువాఁడు. ౧. సూచయతీతి సూచకః. సూచ పైశున్యే. సూచించువాఁడు. ౨. పింశత్యనృతస్యావయవో భవతీతి పిశునః. పిశ అవయవే. అసత్యమునకు అవయవమయినవాఁడు. ఈ 3 కొండెముఁ జెప్పువాని పేళ్లు.

**దుర్జనః ఖలః.** 47

దుష్టో జనః దుర్జనః-దుష్టుఁడయిన జనుఁడు. ౧. ఖలతి ధర్మాదితి ఖలః. కల సంచలనే. ధర్మమువలనఁ జలించువాఁడు. ఈ ౨ దుష్టుఁడయినవాని పేళ్లు. కర్ణేజన శబ్దము మొదలు ౫ పరదోష ప్రకాశకుని పేళ్లని కొందఱు. పిశున దుర్జనఖల శబ్దములు 3 ను జనులలో నొకని కొకనికి తగువు పెట్టువానిపేళ్లని కొందఱు.

**నృశంసో ఘాతుకః క్రూరః పాపః-**

నౄన్ శసతి శంసతి చ నృశంసః. శసు హింసాయాం; శంసు స్తుతౌ దుర్గతౌ చ. మనుష్యులను బీడించువాఁడు. ౧. హంతీతి ఘాతుకః హనహింసాగత్యోః. హింసించువాఁడు. ౨. కృంతతీతి క్రూరః. కృతీ ఛేదనే. వ్యథ పెట్టువాఁడు. 3. పాపమస్యేతి పాపః - పాపముగలవాఁడు. ఈ ౪

పరులకు బాధచేయు స్వభావము గలవాని పేళ్లు.

**ధూర్తస్తు వఞ్చకః,**

ధూర్వతి హినస్తీతి ధూర్తః. ధుర్వీ హింసాయాం. పీడించువాఁడు. ౧. వఞ్చయతీతి వఞ్చకః. వఞ్చు విప్రలంభే. మోసపుచ్చువాఁడు. ఈ ౨ మోసపుచ్చువానిపేళ్లు.

**అజ్ఞేమూఢ యథాజాత మూర్ఖ వైధేయ బాలిశాః.** 48

న జానాతీ త్యజ్ఞః–ఎఱుకలేనివాఁడు. ౧. ముహతీతి మూఢః, మూర్ఖశ్చ. ముహ వైచిత్యే. మోహమును బొందువాఁడు. ౨, ౩. జాత ఇవ వివేకశూన్యత్వా దితి యథాజాతః–వివేకశూన్యుఁ డౌటవలన పుట్టిననాఁటివలె నెల్లప్పుడు నుండువాఁడు. ౪. విధాతుం యోగ్యో ధేవియః; విధేయ ఏవ వైధేయః–శిక్షింపఁదగినవాఁడు వైధేయుఁడు. ౫. పరదత్తం బలిం పూజాంశ్యతీతి బలిశః; బలిశ ఏవ బాలిశః –తనకుఁ జేసిన సన్మానమును జెఱుచుకొనువాఁడు బాలిశుఁడు. దేవతార్థం దత్తమపూపాది బలిం శ్యతి భక్షణేన తనూకరోతీతి బలిశః; బలిశ ఏవబాలిశః –దేవతార్థమై యుంచఁబడిన యపూపాదులను భక్షించి స్వల్పముగాఁ జేయువాడు. ఈ ౬ ఎఱుకలేని వాని పేళ్లు.

**కదర్యే కృపణ క్షుద్ర కింపచాన మితపంచాః,**

కుత్సితః–అర్యః కదర్యః. కుత్సితుఁడైన ధనికుఁడు. ౧. కల్పతే కుటుంబ పీడనేవాపి జీవనాయ సమర్థో భవతీతి కృపణః కృపూ సామర్థ్యే. కుటుంబమును బీడించియైనను బ్రతకనేర్చినవాఁడు. ౨. క్షుద్నాతి కుటుంబం పీడయతీతి క్షుద్రః. క్షుదిర్ సంపేషణే. కుటుంబమును పీడించువాఁడు. ౩. కించి దన్నం పచతీతి కింపచానః – ఇంచుకంత వంటకమును వండుకొనువాఁడు. పచా పాకః, కిం కించిత్ పచయా అత్యల్పపాకేన అనితి జీవతీతి కింపచానః. అన ప్రాణనే. ఇంచుక వంటచేత బ్రతుకువాఁడు. ౪. మితం అత్యల్పం పచతీది మితంపచః. డు పచ్ష్ పాకే. కొద్దిగా వండుకొనువాఁడు. ఈ ౫ ఒకనికిఁ బెట్టక తాను భక్షింపక ధనమును గూడఁబెట్టువాని పేళ్లు.

**నిస్స్వస్తు దుర్విధో దీనో దరిద్రో దుర్గతో౾ పి సః.** 49

నిర్గతః స్వాదితి నిస్స్వః–ధనమువలనఁ బాసినవాఁడు. ౧. దుష్టా జీర్ణ

వస్త్రధారణకదన్న భోజనాదిరూపా విధా ప్రకారో యస్యేతి దుర్విధః– చినిఁగినగుడ్డ కట్టుకొనుట, కుత్సితమైన యన్నమును భుజించుట మొదలైన ప్రకారము గలవాఁడు. ౨. దీయత ఇతి దీనః. దీఙ్ క్షయే. క్షయించువాఁడు. ౩. దరిద్రాతి దుర్గతిం ప్రాప్నోతీతి దరిద్రః. దరిద్రా దుర్గతౌ. దుర్గతిని బొందినవాఁడు. ౪. దురవస్థాం గతో దుర్గతః. గమ్ ౯ గతౌ. దురవస్థను బొందినవాఁడు. ఈ ౫ దరిద్రుని పేళ్లు.

**వనీపకో యాచనకో మార్గణో యాచకార్థినౌ,**

వనతీతి వనీపకః. యాచత ఇతి యాచనకః, యాచకశ్చ. అర్థయతీత్యర్థీ. నాంతః. వను యాచనే. టు యాచృ యాచ్ఞాయాం. అర్థ ఉపయాచ్ఞాయాం. అడుగువాఁడు గనుక వనీపకుఁడు, యాచనకుఁడు, యాచకుఁడు, అర్థియును. వనీ యాచ్ఞా, తాం పాతి రక్షతీతి వనీపకః. పా రక్షణే. అడుగుటను రక్షించువాడు. పా. వనీం యాచ్ఞామాత్మన ఇచ్ఛతీతి వనీపకః–అడుగుటను తనకు నిచ్ఛయించువాఁడు. యాచ్యతే అనేనేతి యాచనం దేహీత్యాదిపదం, తత్కాయతీతి యాచనకః. కైశబ్దే. ఇమ్మని యడుగువాఁడు, ౧. ౨, ౪, ౫. మార్గయతి దాతారమితి మార్గణః. మార్గ అన్వేషణే. దాతను వెదకువాఁడు. 3 ఈ ౫ అడుగువాని పేళ్లు.

**అహంయు స్స్యా దహంకారీ -**

అహమితి మాంతమవ్యయమ్. అహంకారోఽస్యేతి అహంయుః. అహంకారో ఽస్యాస్తీత్య హంకారీ. నాంతః. అహంకారముగలవాఁడు అహంయువు, అహంకారియును. ఈ ౨ అహంకారము గలవాని పేళ్లు.

**శుభంయుస్తు శుభాన్వితః.** 50

శుభమితి మాంతమవ్యయం మంగళార్థే. శుభమస్యేతి శుభంయుః–శుభము గలవాఁడు. ౧. శుభేనాన్వితః శుభాన్వితః. శుభముతోఁ గూడుకొన్నవాఁడు. ఈ ౨ శుభము గలవాని పేళ్లు.

**దివ్యోపపాదుకా దేవాః -**

దివి భవాః దివ్యాః, మాత్రాది నిరపేక్షేణ ధర్మవిశేషాదేవ ఉత్పద్యంత ఇత్యుప పాదుకాః; దివ్యాశ్చతే ఉపపాదుకాశ్చ దివ్యోపపాదుకాః – స్వర్గ మందుండువారు దివ్యులు తల్లి మొదలైనవారు లేకయే అయోనిజులై

పుట్టువారు ఉపపాదుకులు. దివ్యులైన ఉపపాదుకులు దివ్యోపపాదుకులు. ఈ ౧ అయోనిజులై స్వర్గమందున్న దేవతల పేరు.

**నృగవాద్యా జరాయుజాః,**

ఉత్పత్తిసమయే జరాయో ర్జాయంత ఇతి జరాయుజాః. జనీ ప్రాదుర్భావే. పుట్టునప్పుడు మావివలనఁ బుట్టువారు. ఈ ౧ మావివలనఁ బుట్టిన మనుష్యులు పశువులు మొదలైనవాని పేరు.

**స్వేదజాః కృమి దంశాద్యాః -**

స్వేదాత్ భౌమోష్మణో జాతా స్వేదజాః–ఉక్కవలనఁ బుట్టినవి. ౧. పురుగులు ఈఁగలు మొదలైనవాని పేరు. ఆది శబ్దము వలన ఉసుళ్లు దోమలు మొదలైన వానికిని పేరు.

**పక్షిసర్పాదయో ఽ ణ్డజాః.** 51

అండాజ్జాయంత ఇత్యండజాః. జనీ ప్రాదుర్భావే. గ్రుడ్డువలనఁ బుట్టునవి. ౧. పక్షులు పాములు మొదలైనవాని పేరు. ఆదిశబ్దముచేత పిపీలికాదులకును పేరు.

**(ఇంతవఱకు ప్రాణి వర్గము)**

**ఉద్భిద స్తరు గుల్మాద్యాః -**

ఉద్భినద్దన్తి భువమిత్యుద్భిదః. ద. భిదిర్ విదారణే. పుట్టునపుడు భూమిని వ్రక్కలించునవి గనుక ఉద్భిత్తులు. ౧. తరుగుల్మలతాదుల పేరు. ఆదిశబ్దముచేత గడ్డిపోఁచలు, ఓషధులు, తీఁగలు మొదలగునవియు.

**ఉద్భి దుద్భిజ్జ ముద్భిదమ్,**

ఉద్భిత్ వ్యాఖ్యాతమ్. భూమేరుద్భేదన ముద్భిత్. తతోజాత ముద్భిజ్జం. జనీ ప్రాదుర్భావే. భూమిని వ్రక్కలించి పుట్టినది. ౨. ఉద్భినత్తీత్యుద్భిదం–భూమిని వ్రక్కలించునది. ఈ 3 ఆ తరుగుల్మాదులకే పేళ్లు.

**సున్దరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్.** 52
**కాంతం మనోహరం రుచ్యం మనోజ్ఞం మఞ్జుమఞ్జుళమ్,**
**(వల్గు వామం హారి శాలి రమణీయం మనోరమమ్).**

సుతరాం ఆద్రియుత ఇతి సుందరం. దృఙ్ ఆదరే. మిక్కిలి సంతోషపెట్టునది. ౧. రోచత ఇతి రుచిరం. రుచ దీప్తౌ. ప్రకాశించునది. ౨. చరతి మనో ఽ స్మిన్నితిచారు. చరగతి భక్షణయోః. దీనియందు మనస్సు సంచరించును. ౩. సుష్ఠు సమం సర్వస్య అభిలాష విషయత్వేనేతి సుషమం.

సర్వమైనవారికి అభిలాష విషయమౌటచేత సమమైయుండునది. ४. సాధ్నోతి శుభమితి సాధు. రాధ సాధ సంసిద్ధౌ. శుభమును సాధించునది. ౫. శోభత ఇతి శోభనం. శుభ శుంభ శోభార్థే. ఒప్పునది. ౬.కామ్యత ఇతి కాంతం. కము కాంతౌ. కాంక్షింపఁబడునది. కస్య సుఖస్య అంతో నిశ్చయో ఽత్రేతివా కాంతం-సుఖముయొక్క నిశ్చయము దీనియందుఁ గలదు. ౭. మనోహరతీతి మనోహరం. హృఞ్ హరణే. మనస్సును హరించునది. పా. మనోరమం. ౮. రోచత ఇతి రుచ్యం. రుచ దీప్తౌ. ప్రకాశించునది. ౯. మనసా జ్ఞేయం మనోజ్ఞం. జ్ఞా అవబోధనే. మనస్సుచేత నెఱుగఁదగినది. ౧౦. మన్యతే సర్వైరితి మంజు. మన జ్ఞానే. అందఱిచేత దలంపఁబడునది. ౧౧. మంజుత్వ మస్త్వేతి మంజులం. మంజుత్వము గలది. ఈ ౧౨ మంజుశబ్దము శ్యామాది శబ్దములవలెనే ధర్మపరమునుగలదు గనుక మత్వర్థమందు శ్యామలాది శబ్దములవలె మంజుల శబ్దమును. చక్కని వస్తువుపేళ్లు.

**త దాసేచనకం తృప్తే ర్నాస్త్యన్తో యస్య దర్శనాత్.** 53

ఆసిచ్యతే ఆపూర్యతే దృగాదిక మనేనేతి అసేచనకం. షిచిర్ క్షరణే. దీనిచేత నేత్రాదీంద్రియములు నిండింపఁబడును. పా. న సించతి న క్షరతి దృగస్మాదిత్యాసేచనకం-ఎంతసేపు చూచినను తనవితీఱని సుందరవస్తువు పేరు.

**అభీష్టే ఽ భీప్సితం హృద్యం దయితం వల్లభం ప్రియమ్,**

అభిముఖ్యేన ఇష్యతే అభీష్టం. ఇషు ఇచ్ఛాయాం. అభిముఖముగా నిశ్చయింపఁబడునది. ౧. అభిత ఆప్తుమిష్ట మభీప్సితం. ఆప్ ౢవ్యాప్తౌ. అంతట పొంద నిచ్ఛయింపఁబడునది. ౨. హృదయస్య ప్రియం హృద్యం-హృదయమునకు ప్రియమైనది. ౩. దయతే చిత్తమాదత్త ఇతి దయితం. దయ దానగతి రక్షణ హింసా దానేషు. మనస్సు నాకర్షించునది. ४. వల్లతి ప్రీణాతీతి వల్లభం. వల్ల ప్రీతౌ. ప్రీతిని గలుగఁజేయునది. ౫. ప్రీణాతీతి ప్రియం. ప్రీఞ్ తర్పణే. తృప్తిని జేయునది. ఈ ౬ మనస్సునకుఁ బ్రియమైన వస్తువు పేళ్లు.

**నికృష్ట ప్రతికృ ష్టార్వ రేఫ యా ప్యావ మాధమాః.** 54
**కుపూయ కుత్సితావద్య ఖేట గర్హ్యాణకా స్సమాః**

నికృష్యతే స్మ ప్రతికృష్యతే స్మ తిరస్కృత ఇతి నికృష్ట ; ప్రతి

కృష్టశ్చ. కృష విలేఖనే. తిరస్కరింపఁబడువాఁడు. ౧, ౨. అర్వ త్యపకర్షమి త్యర్వా. న. పు. అర్వ గతౌ. అవకర్షమును బొందినవాఁడు. ౩. రేఫతి హీన స్తి వర్తనమితి రేఫః. అ. పు. రిఫ కత్థన యుద్ధనిందా హింసా దానేషు. నడకను జెఱుచువాఁడు. "రవర్ణే పుంసి రేఫ స్స్యాత్కుత్సి తేవాచ్య లింగవత్" అని రభసుఁడు. పా. రేఫాః. స. పు. "రేఫా స్స్యా దధమే క్రూరే కృపణేఽ ప్యభిధేయవత్" అని మేదిని. ౪. యాపనీయో యాప్యః. యాప్రాపణే. ద్రొబ్బఁ దగినవాఁడు. ౫. అవస్ అదస్ ఇత్యేతౌ నికర్షార్థౌ నిపాతౌ. అవః అస్యాస్తీతి అవమః; అధః అస్యాస్తీతి అధమః –క్రిందైయుండువాఁడు గనుక అవముఁడు, అధముఁడును. ౬, ౭. కుత్సితం పూయతే కుపూయః. పూయా విశరణే. కుత్సితముగా నశించువాఁడు. ౮. కుత్సా ఽస్య సంజాతేతి కుత్సితః. నిందఁగలవాఁడు. ౯. అవదనీయ అవద్యః. వద వ్యక్తాయాం వాచి. ఉచ్చరింపఁదగనివాఁడు. ౧౦. ఖిట్యతే సర్వైతి ఖేటః. ఖిట త్రాసే. అందఱిచేతను వెఱపింపఁబడువాఁడు. ౧౧. గర్హితుం యోగ్యో గర్హ్యః. గర్హ కుత్సాయాం. నిందింపఁదగినవాఁడు. ౧౨. అణతి బహు జల్పతీ త్యణకః. అణ శబ్దే. వదరువాఁడు. ఈ ౧౩ జాత్యాచారాదులచేత నిందితుఁడైనవాని పేళ్లు.

**మలీమసం తు మలినం కచ్చరం మలదూషితమ్.** 55

మల మస్యాస్తీతి మలీమసం, మలినం చ–ముఱికి గలిగినది మలీమసము, మలినమును. ౧, ౨. కుత్సితం చరతీతి కచ్చరం. చర గతి భక్షణయోః. కుత్సితమైయుండునది. ౩. మలేన దూషితం మలదూషితం–మలముచేత దూషితమైనది. ఈ ౪ మాసిన వస్తువు పేళ్లు.

**పూతం పవిత్రం మేధ్యం చ.**

పునాతి దేహాదికమితి పూతం–దేహాదులను బరిశుద్ధముగాఁ జేయునది. ౧. పూయతే ఽనేనేతి పవిత్రం. పూఞ్ పవనే. దీనిచేత శుద్ధముగాఁ జేయఁబడును. ౨. మేధనీయం మేధ్యం. మేధృ సంగమే. పొందఁదగినది. ఈ 3 పవిత్రమైన వస్తువు పేళ్లు.

**వీధ్రం తు విమలార్థకమ్,**

విశేషేణ ఇన్ధే వీధ్రం. ఞి ఇంధీ దీప్తౌ. విశేషముగాఁ బ్రకాశించునది. పా. విమలాత్మకం. స్వభావముననే నిర్మలమయిన స్ఫటికాదుల పేరు.

**నిర్ణిక్తం శోధితం మృష్టం నిశ్శోధ్య మనవస్కరమ్.** 56

నిర్ణిజ్యతే స్మ నిర్ణిక్తం. శోధ్యతే స్మ శోధితం. మార్జ్యతే స్మ మృష్టం. ణిజిర్. శౌచపోషణయోః. శుధ శౌచే. మృజూ శుద్ధౌ. శోధింపఁబడినది. గనుక నిర్ణిక్తము, శోధితము, మృష్టమును. ౧, ౨, ౩. నిర్గతం శోధ్యాత్పరిత్యాజ్యాంశాదితి నిశ్శోధ్యం– పరిత్యజింపఁదగిన యంశము వలనఁ బాసినది. ౪. న విద్యతే అవస్కరః పరిత్యాజ్యాంశో యస్యే త్యనవస్కరం–చెత్తలేనిది. ఈ ౫ కల్మషము లేకుండ శోధింపఁ బడిన వస్తువు పేళ్లు.

**అసారం ఫల్గు -**

న విద్యతే సారో ఽ స్యేత్యసారం–సారములేనిది. ౧. ఫలతి శీఘ్రమేవేతి ఫల్గు. ఞి ఫలా విశరణే. శీఘ్రముగా నశించునది. ఈ ౨ సారము లేని దూది మొదలైన వస్తువు పేళ్లు.

**శూన్యం తు వశికం తుచ్ఛ రిక్తకే,**

నివారకాభావాత్ శునే హితం శూన్యం–అడ్డ పెట్టువాఁడు లేకుండుటవలన శునకమునకు హితమైనది. ౧. వశ్యతే కామ్యతే భూతాదిభిరితి వశికం. వశ కాంతౌ. భూతాదులచేఁ గాంక్షింపఁబడునది. ౨. తుదతి మనఃక్లేశ యతీతి తుచ్ఛం. తుద వ్యథనే. మనస్సును వ్యథపెట్టునది. రిచ్యతే వస్తుభి రితి రిక్తం. రిచిర్ పృథగ్భావే. వస్తువులచేత విడువఁబడునది. ఈ ౪ రిత్తయైన యిల్లు మొదలైనదాని పేళ్లు.

**క్లీబే ప్రధానం ప్రముఖం ప్రవే కానుత్తమోత్తమాః** 57
**ముఖ్య వర్య వరేణ్యాశ్చ ప్రబర్హాన వరార్థ్యవత్,**
**పరార్థ్యాగ్ర ప్రాగ్రహర ప్రాగ్ర్యా గ్ర్యాగ్రీయ మగ్రియమ్.** 58

ప్రకర్షేణ దత్తే ఉపసర్జనం పుష్ణాతీతి ప్రధానం. డు ధాఞ్ ధారణ పోషణయో. అప్రధానుని బోషించువాఁడు. నియత నపుంసకము. గుణేషు వినయః ప్రధానం; విద్వత్సు వైయాకరణః ప్రధానం అని యుదాహరణములు. ౧. ప్రకృష్టం ముఖ మారంభో ఽ స్యేతి ప్రముఖః–ప్రకృష్టమయిన యుద్యోగము గలవాఁడు. ౨. ప్రకృష్టో వేకః పృథగ్భావో యస్యేతి ప్రవేకః. విచిర్ పృథగ్భావే. అప్రధానులలోఁ బ్రకృష్టమైన యేర్పాటు గలవాఁడు. ౩. న విద్యతే అస్మాదుత్తమ ఇత్యనుత్తమః– వీనికంటె

నుత్తముఁడు మఱియొకఁడు లేఁడు. ౪. అతిశయేన ఉత్కృష్టః ఉత్తమః–మిక్కిలి యుత్కృష్టమైనవాఁడు. ౫. ముఖమివ ప్రధానం ముఖ్యః–ముఖమువలె ప్రధానమైనవాఁడు. ౬. వరణీయః స్వాశ్రితైర్భజనీయ ఇతి వర్యః, వరేణ్యశ్చ. వర ఇచ్ఛాయాం. వృఙ్ వరణే. కోరఁదగినవాఁడు గనుక వర్యుఁడు, వరేణ్యుఁడును. 'మహేంద్ర నాగమభితః కరేణువర్యాః' అను భారవి మొదలైనవారి ప్రయోగముల వలనఁ దఱుచుగా సమాసోత్తర పదమై యుండును. ౭, ౮. ప్రకృష్టో బర్హ ఉద్యమో యస్య ప్రబర్హః. బృహ ఉద్యమనే. ప్రకృష్టమైన యుద్యోగము గలవాఁడు. ౯. అవరార్ధే భవః అవరార్ధ్యః జఘన్యః, స న భవతీతి అనవరార్ధ్యః–నికృష్టమైన భాగమందుండువాఁడు గనుక అవరార్ధ్యుఁ డనఁగా తుచ్ఛుఁడు; అట్టివాఁడు కాఁడు గనుక అనవరార్ధ్యుఁడు. పా. అనపరార్ధ్యః. ౧౦. పరార్ధే ముఖ్యాంశే భవః పరార్ధ్యః ముఖ్యభాగమం దుండువాఁడు. ౧౧. అంగ త్యుత్కర్ష మిత్యగ్రః. అగి గతౌ. ఉత్కర్షమును బొందువాఁడు. ౧౨. ప్రకర్షేణ అగ్రం శ్రేష్ఠం రత్నకుండలాదికం హరతీతి ప్రాగ్రహరః–మిక్కిలి శ్రేష్ఠమయిన రత్నకుండలాదులను బుచ్చుకొనువాఁడు. ౧౩. ప్రాగ్రే ముఖ్యేస్థానే భవః ప్రాగ్ర్యః –ముఖ్యమయిన స్థానమందుండువాఁడు. ౧౪. అగ్రేభవ ఇత్యగ్ర్యః, అగ్రీయః, అగ్రియశ్చ– అగ్రస్థానమం దుండువాఁడు గనుక అగ్ర్యుఁడు, అగ్రీయుఁడు, అగ్రియుఁడును. విశేష్యనిఘ్న శబ్దములు గనుక ఛందోనుసారమున నపుంసకలింగముగాఁ జెప్పినాఁడు. ఈ ౧౭ ప్రధానుఁడైనవాని పేళ్లు.

**శ్రేయాన్ శ్రేష్ఠః పుష్కల స్స్యాత్సత్త మశ్చాతి లోభనే,**

అతిశయేన ప్రశస్తః శ్రేయాన్ స. పు. శ్రేష్ఠశ్చ–మిక్కిలి కొనయాడఁదగినవాడు. పుష్ణాతి మహిమ్నేతి పుష్కలః. పుష పుష్టౌ; మహిమచేత పుష్టిని బొందువాఁడు. అతిశయేన సన్ సత్తమః–మిక్కిలి మంచివాఁడు. అత్యన్తం శోభనః అతిశోభనః –మిగుల మంచివాఁడు. ఈ ౫ మిక్కిలి శ్రేష్ఠుని పేళ్లు. "అగ్రం ప్రాగ్రహరం శ్రేష్ఠం ముఖ్యం వర్యం ప్రబర్హణమ్" అని త్రికాండశేషమందు అగ్రాది శబ్దములకే శ్రేష్ఠ శబ్దమును పర్యాయముగాఁ జెప్పినాఁడు గనుక ప్రధాన శబ్దము మొదలు ఈ శబ్దము పర్యంతము శ్రేష్ఠుని పేళ్లని కొందఱు.

**స్యు రుత్తరపదే వ్యాఘ్ర పుంగ వర్షభ కుఞ్జరాః.** 59
**సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థ గోచరాః**

వ్యాఘ్రాదిశబ్దములు ౭ ను, సమాసమునం దుత్తరపదములై పూర్వపదార్థము యొక్క శ్రేష్ఠత్వమును జెప్పును. అప్పుడు పుంలింగములగును. పురుషవ్యాఘ్రః, మునిపుంగవః, రాజర్షభః, నృపకుంజరః, పురుషసింహః, మునిశార్దూలః, గోనాగః ఇత్యాదులు. ఆదిశబ్దముచేత పురుషచంద్రః, రాజవృషభః ఇత్యాదు లూహ్యంబులు. పుంసి యనుట వలన స్త్రీ నపుంసకలింగ శబ్దముల కుత్తరపదములైనను పుంలింగములే యగును. యోషిద్వ్యాఘ్రః. అపత్యసింహః ఇత్యాదులు.

**అప్రాగ్ర్యం ద్వయహీనే ద్వే అప్రధా నోపసర్జనే.** 60

ప్రాగ్ర్యం న భవతీ త్యప్రాగ్ర్యం; ప్రధానం న భవతీ త్యప్రధానం–ప్రధానముగా నిది గనుక అప్రాగ్ర్యము, అప్రధానము. ౧, ౨. ఉపసృజ్యతే నియుజ్యతే ప్రధానభూతేనే త్యుపసర్జనం. సృజ విసర్గే. ప్రధానమైన వానిచేత నియోగింప బడునది. ౩. అప్రధానోప సర్జనశబ్దములు నియత నపుంసకములు. ఈ 3 ప్రధానము కానిదాని పేళ్లు.

**విశఙ్కటం పృథు బృహ ద్విశాలం పృథులం మహత్,**
**రు న్ద్రోరు విపులమ్ -**

విస్తీర్యత ఇతి విశంకటం, విశాలం చ–విస్తరింపఁబడునది గనుక విశంకటము, విశాలమును. ౧, ౨. ప్రథత ఇతి పృథు. ప్రథ ప్రఖ్యానే. ప్రసిద్ధమైనది. ౩. బర్హతీతి బృహత్. బృహవృద్ధౌ. వృద్ధిఁబొందునది. ౪. పృథు పృథుత్వమస్తీతి పృథులం–పృథుత్వము గలిగినది. ౫. మహ్యతే పూజ్యత ఇతి మహత్. త. మహ పూజాయాం. పూజింపఁబడునది. ౬. రవతే వ్యాప్నోతీతి రుంద్రం. రుజ్ గతౌ. వ్యాపించియుండునది. భూయోవయవతయా సర్వతో రుంధత్ ద్రాతీతి రుంద్రం– అధికావయువములు గలదగుటచేత నంతటఁ బోవునది. పా. వద్రం. ౭. ఊర్ణోతీత్యురు–వస్తువులను గప్పియుండునది. ౮. విశేషేణపోలతి మహద్భవతీతి విపులం. పులమహత్త్వే. గొప్పదైయుండునది. ఈ ౯ ఎడము గలదాని పేళ్లు.

**పీన పీవ్నీ తు స్థూల పీవరే.** 61

తప్యాయ ఇతి పీనం, పీవం, పీవరం చ. ఓ ప్యాయీ వృద్ధౌ. వృద్ధిఁ

బొందునది గనుక పీనము, పీవము, పీవరమును. పీవశ్శబ్దము నకారాంతము. స్త్రీలింగమైనప్పుడు పీవరీ యనంబడును. ౧, ౨, ౩. స్థూలయతీతి స్థూలం. స్థూల పరిబృంహణే. వర్ధిల్లునది. ఈ ౪ బలిసినదాని పేళ్లు.

**స్తోకాల్పక్షుల్లకా స్సూక్ష్మం శ్లక్ష్ణం దభ్రం కృశం తను,**

స్తూయత ఇతి స్తోకః. ష్టుఞ్ స్తుతౌ. కొనియాడఁబడునది. విరుద్ధ లక్షణచేత కొనియాడఁదగని దనుట. ౧. అల్యతే వార్యత ఇత్యల్పః. అలభూషణపర్యాప్తి వారణేషు. దొడ్డవస్తువులలో నుండి తీసివేయఁబడునది. క్షుద్యతే పీడ్యత ఇది క్షుల్లక. క్షుధిర్ సంపేషణే. పీడింపఁబడునది. ౩. సూచ్యత ఇతి సూక్ష్మం. సూచపైశున్యే. లెస్సఁగా కానఁబడుకుండుటచేత సూచింపఁబడునది. ౪. శ్లిష్యతి మహద్వస్తుషు శ్లక్ష్ణం–దొడ్డ వస్తువులయందుఁ దగిలియుండునది. ౫. దభ్యతే నివార్యత ఇతి దభ్రం. దంభురోధనే. అడ్డగింపఁబడునది. ౬. కృశ్యతీతి కృశం. కృశ తనూకరణే. సన్నమైయుండునది. ౭. తన్యత ఇతి తను. విస్తరింపఁబడునది. ౮. సన్నపు నూలిపోగు మొదలైనదాని పేళ్లు.

**స్త్రియాం మాత్రా త్రుటిః పుంసి లవ లేశ కణాణవః.** 62

మాతీతి మాత్రా. మా మానే. అణఁగియుండునది. మాత్రా త్రుటిశబ్దములు నియత స్త్రీలింగములు. ౧. త్రుట్యత ఇతి త్రుటిః. లూయతే లవః. త్రుటీ ఛేదనే. లూఞ్ ఛేదనే. త్రుంచఁబడునది గనుక త్రుటి, లవమును. ౨, ౩. లిశ్య త్యల్పీభవతీతి లేశః. లిశ అల్పీభావే. కొంచమైయుండునది. ౪. కణతి నిమీలతీతి కణః. కణ నిమీలనే. సంకోచమైయుండునది. ౫. అణయతి కాంస్యాదిక మిత్యణుః. అణశబ్దే. కంచు మొదలైనదానిని మ్రోయించునది. లవాదిశబ్దములు ౪ నియత పుంలింగములు. ఈ ౬ కొంచమైన దానిపేళ్లు. స్తోకాదులు ౧౪ కొంచమైనదానికే పేళ్లని కొందఱు.

**అత్యల్పే ఽ ల్పిష్ఠ మల్పీయః కనీయో ఽ ణీయ ఇత్యపి,**

అతిశయే నాల్పమల్పిష్ఠం, అల్పీయః, స. కనీయశ్చ. స. అతిశయే నాణు రణీయః. స. మిక్కిలి కొంచమైనది. ౧, ౨ అపిశబ్దమువలన కనిష్ఠాణిష్ఠ శబ్దములు చెప్పఁబడును. మిక్కిలి కొంచమైనదాని పేళ్లు.

**ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహులం బహు.** 63

**పురుభూః పురు భూయిష్ఠం స్ఫీతం భూయశ్చ భూరి చ,**

ప్రభవతి కార్యం సంపాదయితుమితి ప్రభూతం. భూ సత్తాయాం. కార్యమును జేయ సమర్థమైనది. ౧. ప్రకర్షేణ చీయత ఇతి ప్రచురం. చిఞ్ చయనే. మిక్కిలి కూర్పఁబడునది. ౨. ప్రక్షరేణాజ్యతే క్షిప్యత ఇతి ప్రాజ్యం. అజి గతిక్షేపణయోః. మిక్కిలి యొక దిక్కునఁ గూర్చుట కొఱకుఁ బెట్టఁబడునది. ౩. దభ్ర మల్పం న భవతీ త్యదభ్రం–కొంచెముగానిది. ౪. బంహతే వర్ధత ఇతి బహు; బహు బహుత్వ మస్త్య స్యేతి బహుళం. బహి వృద్ధౌ. వృద్ధిఁబొందునది గనుక బహువు; బహుత్వము గలిగినది బహుళము. ౫, ౬. పూర్యత ఇతి పురు; పుర్వితి సంజ్ఞయా భవతీతి పురుభూః. ౭. భూ సత్తాయాం. పూరింపఁబడునది పురువు; పురు వను సంజ్ఞచేత నగునది గనుక పురుభువు. పా. పురుహూః, పురుహం. ౭, ౮. అతిశయేన బహు భూయిష్టం, భూయశ్చ. స. మిక్కిలి బహుళమైనది భూయిష్ఠము, భూయస్సును. ౯, ౧౦. స్ఫాయత ఇతి స్ఫీతం. స్ఫాయీ వృద్ధౌ. వృద్ధిఁ బొందునది. పా. స్ఫిరం. ౧౧. భవత్య నల్పమితి భూరి. భూ సత్తాయాం. అధికముగా నౌనది. ఈ ౧౨ విస్తారమైన దానిపేళ్లు.

**పరశ్శతాద్యాస్తే యేషాం పరా సంఖ్యా శతాధికాత్.** 64

శతాత్పరా యేషాంతే పరశ్శతాః–నూటికంటె నధికమైన సంఖ్యగలది. ఆద్యశబ్దముచేత వేయికంటె నధికమైన సంఖ్యగలది పరస్సహస్రము. పదివేలకంటె నధికమైన సంఖ్యగలది పరోయుతము అనునివి మొదలైన శబ్దము లూహింపఁ దగినవి. "నిజస్య తేజశ్శిఖినః పరశ్శతా వితేను రింగాల మివాయశః పరే" ఇతి నైషధే–"ఆలోకయామాస హరిర్మహీధరా నధిశ్రయంతీ ర్గజతాః పరశ్శతా" ఇతి మాఘకావ్యేద్వాదశసర్గే–"బ్రహ్మాదయో బ్రహ్మహితాయ తప్త్వా పరస్సహస్రం శరదస్తపాంసి" ఇతి భవభూతిః. సంఖ్యామాత్ర వాచకములైనపుడు నపుంసకములు. "గవాం పరశ్శతం పరసహస్రం" అనునివి మొదలైనవి. నూఱు, వేయి మొదలగు సంఖ్యలకు మించినవాని పేళ్లు.

**గణనీయే గాణేయమ్ -**

గణయితుం శక్యం గణనీయం ; గాణేయం చ. గణ సంఖ్యానే.

లెక్కపెట్ట శక్యమైనది గణనీయము, గాణేయమును. పా. గణేయం. ఈ ౨ లెక్కపెట్టఁ దగిన దాని పేళ్లు.

**సంఖ్యాతే గణితమ్ -**

సంఖ్యాయతేస్మ సంఖ్యాతం, గణ్యతే స్మ గణితం. ఖ్యా ప్రకథనే; గణ సంఖ్యానే. లెక్కపెట్టఁబడినది. ఈ ౨ లెక్కపెట్టఁబడినదాని పేళ్లు.

**అథ సమం సర్వమ్,**

**విశ్వ మశేషం కృత్స్నం సమస్త నిఖిలాఖిలాని నిశ్శేషమ్.** 65

**సమగ్ర సకలాఖణ్డ పూర్ణాదీన్య ప్యనూనకే,**

సమతి న్యూనత్వం న ప్రాప్నోతీతి సమం. షమ ష్టమ వైక్లబ్యే. విరుద్ధలక్షణచేత వైక్లబ్యము లేని దనుట. న్యూనత్వమును బొందనిది. ౧. శ్రియతే సజాతీయై రితి సర్వం. సృ గతౌ. సజాతీయ వస్తువులచేత పొందఁబడునది. ౨. విశతి సర్వత్ర విశ్వం. విశ ప్రవేశనే. అంతటఁ బ్రవేశించునది. ౩. నాస్తి శేషో ఽ స్యేత్య శేషం–శేషము లేనిది. ౪. కృత్యతే వ్యాప్రియతే ఽ నేనేతి కృత్స్నం. కీతీ వేష్టనే. దీనిచేత వ్యాపింపఁబడును. ౫. సమస్యతే ఏకీక్రియత ఇతి సమస్తం. అసు క్షేపణే. ఒకటిగాఁ గూర్చఁబడునది. ౬. నివృత్తం ఖిలా చ్ఛూన్యాదితి నిఖిలం–ఖిలమైన దానివలనఁ బాసినది. ౭. న విద్యతే ఖిల మస్యేత్యఖిలం–ఖిలముగానిది. ౮. శేసాన్నిర్గతమితి నిశ్శేషం– శేషమైనదాని వలనఁ బాసినది. ౯. సంగతమగ్రేణేతి సమగ్రం–అగ్రముతోఁ గూఁడుకొన్నది. ౧౦. కలాభిర్భాగై స్సహవర్తత ఇతి సకలం–భాగములతోఁ గూడుకొన్నది. ౧౧. ఖండం న భవతీ త్యఖండం–ఖండముగానిది. ౧౨. పూర్యత ఇతి పూర్ణం. పూరీ ఆప్యాయనే. నిండింపఁబడునది. ౧౩. నూనం న భవతీత్యనూనం–కొదువగానిది. ౧౪. ఆదిశబ్దముచేత సంపూర్ణ, అవికల, అభిన్న, పుష్కలాది శబ్దంబు లూహ్యములు. ఈ ౧౪ అంతయునను దాని పేళ్లు.

**ఘనం నిరన్తరం సాన్ద్రమ్ -**

హన్యతే వాయుజలాదినేతి ఘనం. హన హింసాగత్యోః. వాయు జలాదుల చేతఁ గొట్టఁబడునది. ౧. నిర్గత మన్తరమస్యేతి నిరంతరం–ఎడలేనిది. ౨. సహ అంద్యతే బధ్యత ఇతి సాంద్రం. అది బంధనే.

కూడఁగట్టఁబడియుండునది. ఈ 3 దట్టమైనదాని పేళ్లు.

**పేలవం విరళం తను.** 66

పిల్యతే క్షిప్యత ఇతి పేలవం. పిల క్షేపే. త్రొబ్బఁబడునది. ౧. విశేషేణ రాత్యంతరమితి విరళం. రా ఆదానే. విశేషముగా నవకాశము నంగీకరించునది. ౨. తన్యతే విస్తీర్యత ఇతి తను. తను విస్తారే. విస్తరింపఁబడునది. ఈ 3 పలుచనిదాని పేళ్లు.

**సమీపే నిక టాసన్న సంనికృష్ట సనీడవత్,**
**సదే శాభ్యాస సవిధ సమర్యాద సవేశవత్.** 67
**ఉపకణ్ఠాన్తి కాభ్యర్ణాభ్యగ్రా అప్యభితో ఽ వ్యయమ్,**

సంగతా ఆపో ఽ స్మిన్నితి సమీపః-సమగతమైన జలమును గలది. లక్షణచేత సమీపమందు వర్తించును. ౧. నికటతి నిబధ్నాతీతి నికటః. కటే వర్షావరణయోః తగిలియుండునది. ౨. ఆసీదతి ఆసన్నః. షద్ ౡవిశరణాదౌ. పొందియుండునది. ౩. సంనికృష్యత ఇతి సంనికృష్టః. కృషవిలేఖనే. మిగుల నొరయఁబడునది. ౪. సమానం నీడమస్యేతి సనీడః. సమానమైన ఉనికిపట్టు గలిగినది. ౫. సమానో దేశో ఽ స్యేతి సదేశః. సమానమైన దేశము గలిగినది. ౬. అభితః అశ్యతే వ్యాప్యత ఇత్యభ్యాశః. అశూ వ్యాప్తౌ. అంతట వ్యాపింపఁబడునది. పా. అభితః అస్యతే పరిచీయత ఇత్యభ్యాసః. అసు క్షేపణే. అంతట పరిచయముచేయఁబడునది. 'సమీపే ఽభ్యసనేభ్యాసః' అని దంత్యాంతములయందు రభసుఁడు. ౭. సమానా విధా ప్రకారో ఽ స్యేతి సవిధః-సమానమైన ప్రకారముగలది. ౮. సమాన మర్యాదాస్యేతి సమర్యాదః-సమానమైన మర్యాదగలది. ౯ సమానోవేశః ప్రవేశో ఽ స్యేతి సవేశః సమానమైన ప్రవేశముగలది. ౧౦. కంఠసమీపంగత ఉపకంఠః-కంఠసమీపమును బొందినది. ౧౧. అంతే ఽ స్త్యసా విత్యంతికః-కడ నుండునది. ౧౨. అభ్యర్ద్యత ఇత్యభ్యర్ణః. అర్ద గతౌ యాచనేచ. పొందఁబడునది. ౧౩. అభిముఖ మగ్ర మస్యే త్యభ్యగ్రం-అభిముఖమైన యగ్రభాగము గలిగినది. ౧౪. అభిగచ్ఛతీత్యభితః. అవ్యయము. పొందియుండునది. ఈ ౧౫ దాపుపేళ్లు.

**సంసక్తే త్వవ్యవహిత మపదాన్తర మిత్యపి.** 68

సంసజ్యత ఇతి సంసక్తః. షంజసంగే. కదియునది. ౧. న వ్యవధీ

యత ఇత్య వ్యవహితం. డుధాఞ్ ధారణ పోషణయోః. వ్యవధానము లేక యుండునది. ౨. నాస్తిపదేనాంతరం వ్యవధాన మస్యేత్యపదాంతరం. పదముచేతఁ గూడ వ్యవధానము లేనిది. పా. అపటాన్తరం. ఈ 3 కదిసినదాని పేళ్లు.

**నేదిష్ఠ మన్తికతమమ్ -**

అతిశయేనాంతికం నేదిష్ఠం, అంతికతమం చ-మిక్కిలి సమీపమైనది నేదిష్ఠము, అంతికతమమును. ఈ ౨ మిక్కిలి సమీపమైనదాని పేళ్లు.

**స్యా ద్దూరం విప్రకృష్టకమ్,**

దుఃఖేన ఈయతేప్రాప్యత ఇతి దూరం. ఇణ్ గతౌ. ప్రయాసచేతఁ బొందఁ బడునది. ౧. విప్రకృష్యతే సమీపా దితి విప్రకృష్టకం. కృషవిలేఖనే. సమీపముననుండి లాగఁబడునది. ఈ ౨ దవ్వైనదాని పేళ్లు.

**దవీయశ్చ దవిష్ఠం చ సుదూరం-**

అతిశయేన దూరం దవీయః. స. దవిష్ఠం చ. సుతరాం దూరం సుదూరం-మిక్కిలి దూరమైనది గనుక దవీయస్సు, దవిష్ఠము, సుదూరమును. ఈ 3 మిక్కిలి దవ్వైనదాని పేళ్లు.

**దీర్ఘ మాయతమ్.** 69

దృణాతి దూరస్థితత్వా దితి దీర్ఘం. దౄ విదారణే. దవ్వున నునికిచేతఁ బీడించునది. ౧ ఆయమ్యతే విస్తీర్యత ఇత్యాయతం. యమ ఉపరమే. విస్తరింపఁ బడునది. ఈ ౨ నిడుపైనదాని పేళ్లు.

**వర్తులం నిస్తలం వృత్తమ్ -**

వర్తతే భువి పరివర్తత ఇతి వర్తులం; వృత్తం చ. వృతువర్తనే. నేలమీఁదనే పొఱలునది. ౧, ౩. నిర్గతం తల మస్యేతి నిస్తలం । నిలుకడలేనిది. ఈ 3 వట్రువైనదాని పేళ్లు.

**బన్ధురం తూన్న తానతమ్,**

బధ్నాత్యున్నతత్వేన సహానతత్వ మితి బంధురం. బంధ బంధనే. ఉన్నతత్వముతోఁ గూడ నానతత్వమును బొందునది. పా. బంధూరం. 'బంధూరబంధురౌ రమ్యేనమ్రే హంసే చ బంధురః' అని రభసుఁడు. ఈ ౧ స్వభావముచేత పొడవై ఉపాధివశమున నించుక వంగినదాని పేరు.

**ఉచ్చ ప్రాం శూన్న తోదగ్రోచ్ఛ్రితా స్తుఙ్గే-**

ఉచ్చినోతీత్యుచ్చః, చిఞ్ చయనే. మీఁదికిఁ బెరుగునది. ౧. ప్రకర్షేణ అశ్నుత ఇతి ప్రాంశుః. అశూవ్యాప్తౌ. ఊర్ధ్వముగా వ్యాపించునది. ప్రకృష్టా ఉన్నతాః అంశవః అవయవా అస్యేతి ప్రాంశుః–ఉన్నతములైన యవయవములు గలది. ౨. ఉన్న మత్యూర్ధ్వం గచ్ఛతీత్యున్నతం. ణము ప్రహ్వత్వే శబ్దే చ. ఊర్ధ్వముగాఁ బోవునది. ౩. ఉద్గతమగ్రం యస్యేత్యుదగ్రం–ఊర్ధ్వముఁబొందిన కొనగలిగినది. ౪. ఊర్ధ్వం శ్రిత ఇత్యుచ్ఛ్రితః శ్రిఞ్ సేవాయాం. ఊర్ధ్వభాగము నాశ్రయించునది. ౫. తుట్యతే వాయ్వాదినేతి తుంగః. తుట హింసాయాం. వాయ్వాదులచేతఁ బీడింపఁబడునది. ఈ ౬ పొడవైనదాని పేళ్లు.

**అథ వామనే.** 70

**న్య ఙ్నీ చ ఖర్వ హ్రస్వా స్స్యుః -**

వామో వల్గుత్వ మస్యాస్తీతి వామనః–ఒప్పిదముగలది. ౧. నిమ్నమంచతీతి న్యఙ్. చ. నీచశ్చ. అఞ్చుగతిపూజనయోః దిగువఁబొందునది. ౨, ౩. ఖర్వత్యవయ పదార్ఢ్యేనేతి ఖర్వః. ఖర్వ గర్వ దర్పే. అవయవ దార్ఢ్యముచేత గర్వించునది. ౪. హ్రసతీతి హ్రస్వః. హ్రస హ్రాసే. కొంచెమైయుండునది. ఈ ౫ కుఱుచైనదాని పేళ్లు.

**అవాగ్రే ఽ వన తానతమ్,**

అవనతమగ్రం యస్యే త్యవాగ్రం–వంగిన కొనగలది. ౧. అవనతమ త్యవనతం. ఆ ఈష న్నతం ఆనతం. ణము ప్రహ్వత్వే శబ్దే చ. వంగినదిగనుక అవనతమును, ఆనతమును. పా. అవనతాననం అని సుభూతి చంద్రుఁడు. ఈ 3 వంగినదాని పేళ్లు.

**అరాళం వృజినం జిహ్మ మూర్మిమ త్కుఞ్చితం నతమ్.** 71

**ఆవిద్ధం కుమలం భుగ్నం వేల్లితం వక్ర మిత్యపి,**

అరాః వేష్టనాని సంత్యస్యే త్యరాళం–చుట్లు గలది. ౧. వృజ్యత ఇతి వృజినం. వృజీ వర్జనే. విడువఁబడునది. ౨. జహాత్యార్జవమితి జిహ్మం. ఓ హాక్ త్యాగే. చక్కఁదనమును విడుచునది. ౩. ఊర్మయో భంగా అస్యసంతీ త్యూర్మిమత్. త. కరుళ్లుగలది. ౪. కుంచతి వక్రతయా అల్పీభవతీతి కుంచితం. కుచ గతికౌటిల్యాల్పీ భావయోః. వంకరదొౖటచేత కొంచెమై యుండునది. ౫. సమతీతి నతం. ణము ప్రహ్వత్వే శబ్దే చ. వంకరయె

డునది. ౬. ఆవిధ్యత ఇత్యావిద్ధం. వ్యధతాడనే. కొట్టఁబడునది. ౭. కుటతీతి కుటిలం; భుజతీతి భుగ్నం. కుట కౌటిల్యే; భుజో కౌటిల్యే. వంకరయై యుండును గనుక కుటిలము, భుగ్నమును. ౮, ౯. వేల్లతి చలతి కుటిలతయేతి వేల్లితం. వేల్ల చలనే. వంకరౌటచేత కుదరైయుండక కదలునది. ౧౦. వంచతి కౌటిల్యం ప్రాప్నోతీతి వక్రం. వంచుగతౌ. కుటిలత్వమును బొందునది. ఈ ౧౧ వంకరయైనదాని పేళ్లు.

**ఋజా వజిహ్మ ప్రగుణౌ -**

ఋజ్యతే ఆదరేణ సంపాద్యత ఇతి ఋజుః. ఋజు గతిస్థానార్జనాసార్జనేషు. ఆదరముచేత సంపాదింపఁబడునది. ౧. జిహ్మః న భవతీత్యజిహ్మః-వంకరగానిది. ౨. ప్రకృష్టః అవక్రః గుణో ఽ స్యేతి ప్రగుణః-ప్రకృష్టమైన చక్కఁదనమను గుణము గలది. ఈ 3 చక్కనై యుండుదాని పేళ్లు.

**వ్యస్తే త్వప్రగుణాకులౌ.** 72

వ్యస్యత ఇతి వ్యస్తః. అసు క్షేపణే. వివిధముగా నెఱపఁబడునది. ౧. న విద్యతే ప్రకృష్టగుణో ఽ స్యేత్యప్రగుణః-మంకుగుణము లేనిది. ౨. ఆ కోలతి ఈషత్సంస్త్యానో భవతీ త్యాకులః. కుల సంస్త్యానే. ఇంచుకంత కూడియుండునది. ఈ 3 చెదరినదాని పేళ్లు.

**శాశ్వతస్తు ధ్రువో నిత్య సదాతన సనాతనాః,**

శశ్వద్వర్తమాన శ్శాశ్వతః-ఎప్పుడునుండునది. ౧. ధ్రువ తీతి ధ్రువః ధ్రువస్థైర్యే. స్థిరమైయుండునది. ౨. నియతం భవతీతి నిత్యః-నియతమై యుండునది. ౩. సదాభవః సదాతనః, సనాతనశ్చ-ఎప్పుడును గలిగియుండునది గనుక సదాతనము, సనాతనమును. ఈ ౫ నాశనము లేక ఎల్లప్పుడు నుండు దాని పేళ్లు.

**స్థాస్నుః స్థిరతరః స్థేయాన్**

తిష్ఠతి చిరకాలం తాచ్ఛీల్యేనేతి స్థాస్నుః. ష్ఠా గతినివృత్తౌ. అనేక కాలము స్వభావమున నుండునది. ౧. అతిశయేన స్థిరః స్థిరతరః; స్థేయాం శ్చ. స. మిక్కిలి స్థిరమైనది గనుక స్థిరతరము; స్థేయస్సును. ఈ 3 పెక్కుకాల ముండుదానిపేళ్లు. శాశ్వతాదులు. ౮ పర్యాయములని కొందఱు.

**ఏకరూపతయా తు యః.** 73

**కాలవ్యాపీ స కూటస్థః -**

కూటేన నిశ్చలత్వేన తిష్ఠతీతి కూటస్థః. ష్ఠా గతి నివృత్తౌ. వికారములేక నిశ్చలుఁడై యుండువాఁడు. ఈ ౧ వికారములేక యొకలాగుననే నిరవధికకాల ముండు నాత్మాదులపేరు.

**స్థావరో జఙ్గమేతరః,**

తిష్ఠతి తాచ్ఛీల్యేనేతి స్థావరః. ష్ఠా గతినివృత్తౌ. స్వభావముననే కదల కుండునది. ఈ ౧ ప్రణివ్యతిరిక్తమై కదలకుండు గిరి వృక్షాదుల పేరు.

**చరిష్ణు జఙ్గమ చరం త్రస మిఙ్గం చరాచరమ్.** 74

చరతి తాచ్ఛీల్యేనేతి చరిష్ణు. చర గతి భక్షణయోః. చరించు స్వభావము గలది. ౧. భృశం గచ్ఛతీతి జంగమం. గమ్ ఌ గతౌ. మిక్కిలి తిరుగునది. ౨. చరతీతి చరం. చర గతౌ. నడుచునది. ౩. త్రస్యతీతి త్రసం. త్రసీ ఉద్వేగే. భయపడునది. ౪. ఇంగతీ తీంగం. ఇగి గతౌ. చరించునది. ౫. భృశం చరతీతి చరాచరం. చర గతి భక్షణయోః. సంచరించునది. ఈ ౬ తిరుగు స్వభావముగల మనుష్యాదుల పేళ్లు.

**చలనం కమ్పనం కమ్ప్రం చలం లోలం చలాచలమ్,**
**చఞ్చలం తరళం చైవ పారిప్లవ పరిప్లవే.** 75

చలతి తాచ్ఛీల్యేనేతి చలనం. చల కంపనే. కంపతే తాచ్ఛీల్యేనేతి కంపనం; కంప్రం చ. కపి చలనే. స్వభావమునే చలించునది. ౧, ౨, ౩. చలతీతి చలం; చలాచలం చ. చల కంపనే. కదలునది గనుక చలము, చలాచలమును. ౪, ౬. లుడ్యతే వాయ్వాదినేతి లోలం. లుడవిలోడనే. లడయోరభేదః. వాయువు మొదలయిన దానిచేత కదలింపఁబడునది. ౫. చంచతి చలతీతి చంచలం. చంచ గతౌ. తరతీతి తరళం. తౄప్లవనతరణయోః. పరిప్లవత ఇతి పారిప్లవం; పరిప్లవం చ. ప్లుఙ్ గతౌ. కదలునది గనుక చంచలము, తరళము, పాప్లవము, పరిప్లవమును. ఈ ౧౦ కదలుదాని పేళ్లు.

**అతిరిక్తస్సమధికః.**

అతిరిచ్యతేస్మ అతిరిక్తః. రిచిర్ విరేచనే. ఏర్పఱచఁబడునది. ౧. సమ్య గధికస్సమధికః – మిక్కిలి యధికమైనది. ఈ ౨. మిగుల నధికమైనదాని పేళ్లు.

**దృఢసంధిస్తు సంహతః,**

దృఢ స్సంధిర్యస్యేతి దృఢసంధిః–దృఢమయిన సంధి గలిగినది. ౧. సంహన్యతే సంశ్లిష్యత ఇతి సంహతః. హన హింసాగత్యోః. లెస్సగా నదుకఁబడునది. ఈ ౨ దృఢమైన కీలుగల హస్త్రాద్యవయవముల పేళ్లు.

**కర్కశం కఠినం క్రూరం కఠోరం నిష్ఠురం దృఢమ్.** 76

**జఠరం మూర్తిమన్మూర్తమ్ -**

కృణోతి పీడయతీతి కర్కశం. కృఞ్ హింసాయాం. పీడించునది. పా. కక్ఖటం. ౧. కఠతి క్లేశేన జీవతీతికఠినం; కఠోరం చ–క్లేశముచేత బ్రతుకునది గనుక కఠినము, కఠోరమును. ౨, ౩. కృంతతి క్రూరం. కృతీ ఛేదనే. నొప్పించునది. ౪. నితరాం తిష్ఠతీతి నిష్ఠురం. ష్ఠా గతినివృత్తౌ. మిక్కిలి యుండునది. ౫. దృహతీతి దృఢం. దృహ వృద్ధౌ. బలమైయుండునది. ౬ జీర్యతే௨నేనేతి జఠరం. జౄష్ వయోహానౌ. దీనిచేత మృదువస్తువులు అరుగును. పా. జఠరం. ౭. మూర్తిః కాఠిన్య మస్యాస్తీతి మూర్తిమత్. ౮. మూర్తం చ–గట్టితనము గలది మూర్తిమత్తు, మూర్తమును. ఈ ౯ బిరుసైనదానిపేళ్లు గట్టిది.

**ప్రవృద్ధం ప్రౌఢ మేధితమ్,**

ప్రవర్ధతేస్మ ఇతి ప్రవృద్ధం. వృధు వృద్ధౌ. ఏధతే స్మ ఏధితం. ఏధ వృద్ధౌ. వృద్ధిఁబొందునది గనుక ప్రవృద్ధము. ఏధితమును, ౧, ౩. ప్రకర్షేణ ఊఢం ప్రౌఢం. వహ ప్రాపణే. ప్రకర్షముగా వహింపఁబడునది. ఈ 3 పెరిగినదాని పేళ్లు.

**పురాణ ప్రతన ప్రత్న పురాతన చిరంతనాః.** 77

పురా భవతీతి పురాణః, పురాతనశ్చ. ప్రాగ్భవ ఇతి ప్రతనః. ప్రత్నశ్చ. చిరంభవతీతి చిరంతనః–పూర్వమందుఁ బుట్టినది గనుక పురాణము, పురాతనము, ప్రతనము, ప్రత్నము, చిరంతనము. ఈ ౫ ప్రాఁతదాని పేళ్లు.

**ప్రత్యగ్రో௨భినవో నవ్యో నవీనో నూతనో నవః,**

**నూత్నశ్చ -**

ప్రతిగతమగ్రమస్యేతి ప్రత్యగ్రః–పొందఁబడిన కొన గలిగినది. ౧. అభినూయత ఇ త్యభినవో, నవశ్చ, నవ ఏవ నవ్యో, నవీనో, నూతనో, నూత్నశ్చ ణు స్తుతౌ. కొనియాడఁబడునది గనుక అభినవము, నవ్యము,

నవీనము, నూతనము, నవము, నూత్నమును. ఈ ౭ క్రొత్తదాని పేళ్లు.

**సుకుమారం తు కోమలం మృదులం మృదు.** 78

సుష్ఠు కుమారయంత్యనేనేతి సుకుమారం. కుమార క్రీడాయాం. దీనిచేత లెస్సగాఁ గ్రీడింతురు. ౧. కామ్యతే జనైరితి కోమలం. కముకాంతౌ. జనులచేత కోరఁబడునది. ౨. మృద్యత ఇతి మృదు. మృదక్షోదే. మెదుపఁబడునది. ౩. మృదు మృదుత్వ మస్యాస్తీతి మృదులం. మృదుత్వము గలిగినది. ఈ ౪ మెత్తనిదాని పేళ్లు.

**అన్వ గన్వక్ష మనుగో ఽనుపదం క్లీబ మవ్యయమ్,**

అను అంచతి పశ్చాద్గచ్ఛతీ త్యన్వక్. చ. అంచు గతిపూజనయోః. వెనుక పోవునది. స్త్రీలింగమైనపుడు 'అనూచీ' అని రూపము. ౧. అనుగత మక్షం పాదరూపం కర్మేంద్రియమస్యే త్యన్వక్షం–వెనుక ననుసరించిన పాదములు గలిగినది. ౨ అను పశ్చాద్గచ్ఛతీత్యనుగః–వెనకఁబోవునది. ౩. అనుగతం పశ్చాద్భూతం పదమస్యే త్యనుపదం–వెనుకఁబోవునట్టి పాదము గలవాఁడు. నిత్య నపుంసకము. గురో రనుపద మంతేవాసీ. భర్తురనుపదం పత్నీ అని. పదస్య పశ్చాదిత్యనుపదం–పాదమునకు వెనుక. ఈయర్థమం దవ్యయము. ఈ ౪ వెనుకపోవువాని పేళ్లు.

**ప్రత్యక్షం స్యా దైన్ద్రియకమ్ -**

ప్రతిగతం అక్ష మింద్రియం ప్రత్యక్షం–ఇంద్రియమును బొందునది. ౧. ఇంద్రియాదాగత మైంద్రియకం–ఇంద్రియమువలన గ్రహింపఁబడునది. ఈ ౨ నేత్రాది పంచేంద్రియములచేత నెఱుఁగఁబడు రూపరసాదుల పేళ్లు.

**అప్రత్యక్ష మతీన్ద్రియమ్.** 79

ప్రత్యక్షం న భవతీ త్యప్రత్యక్షం–ప్రత్యక్షము కానిది. పా. అత్యధ్యక్షం. ఇంద్రియాణ్యతిక్రాంత మతీంద్రియం–ఇంద్రియముల నతిక్రమించినది. ఈ ౨ నేత్రాదీంద్రియములచే నెఱుఁగరానిదాని పేళ్లు.

**ఏకతానో ఽ నన్యవృత్తి రేకా గ్రైకాయనా వపి,**
**అ ప్యేకసర్గ ఏకాగ్రో ఽ ప్యే కాయనగతో ఽ పిచ.** 80

ఏకస్మిన్ విషయే తానో బుద్ధివిస్తారో యస్యే త్యేకతానః – ఒక పదార్థమందే బుద్ధి విస్తారము గలవాఁడు. ౧. న విద్యతే అన్యావృత్తిర్యా

పారో యస్యేత్య నన్యవృత్తిః- మఱియొక వ్యాపారము లేనివాఁడు. ౨. ఏకమగ్ర మగ్ర దేశ సంజ్ఞేయమస్యే త్యేకాగ్రః-ఎఱుఁగఁదగిన వస్తువు ఒకటి గలవాఁడు. ౩. ఏకస్మిన్నేవ విషయే అయనం జ్ఞానమస్యే త్యేకాయనః-ఒక విషయమందే జ్ఞానము గలవాఁడు. ౪. ఏకస్మిన్నేవ సర్గో నిశ్చయో యస్యేత్యేక సర్గః- ఒక పదార్థమందే యుందు నిశ్చయము గలవాఁడు. ౫. ఏకాగ్ర ఏవైకాగ్రః-ఏకాగ్రుఁడే ఐకాగ్రుఁడు. ౬. ఏకాయన మేకజ్ఞానంగత  ఇ త్యేకాయనగతః-ఒక జ్ఞానమునే పొందినవాఁడు ఈ ౭ ఏకాగ్రచిత్తుని పేళ్లు.

**పుం స్యాదిః పూర్వ పౌరస్త్య ప్రథమాద్యాః -**

ఆదీయతే ప్రారంభసమయ ఏవ వ్యవహ్రియత ఇతి ఆదిః. డు దాఞ్ దానే. ముందుగా వ్యవహరింపఁబడునది. నియతపుంలింగము. ౧. పూర్వతీతి పూర్వః. పూర్వ పూరణే. పూరించునది. ౨. పురో భవతీతి పౌరస్త్యః-ముందరఁ బుట్టినది. ౩. ప్రథత ఇతి ప్రథమః. ప్రథ ప్రఖ్యానే. ప్రసిద్ధమగునది. ౪. ఆదౌ భవ ఇత్యాద్యః -మొదటఁ బుట్టినది ఈ ౫ మొదటిదాని పేళ్లు.

**అథాస్త్రియామ్,**

**అన్తో జఘన్యం చరమ మన్త్య పాశ్చాత్య పశ్చిమమ్.** 81

అమతినాశం గచ్ఛతీత్యన్తః. అమ గత్యాదౌ. నాశమును బొందునది. నియతపుం నపుంసకలింగము. ౧. జఘనే అంత్యభాగే భవం జఘన్యం-కడపటఁ బుట్టినది. ౨. చర త్యన్తం గచ్ఛతీతి చరమం. చరగతి భక్షణయోః. కడను బొందునది. ౩. అన్తేభవ మన్త్యం-కడపటఁ బుట్టునది. ౪. పశ్చాద్భవం పాశ్చాత్యం, పశ్చిమం చ- వెనుకఁబుట్టినది కనుక పాశ్చాత్యము, పశ్చిమమును. ఈ ౬ తుదయైన దానిపేళ్లు.

**మోఘం నిరర్థకమ్ -**

ముహ్య త్యత్ర పురుషో భ్రాన్తి వశాదితి మోఘం. ముహ వైచిత్యే. దీనియందు పురుషుఁడు భ్రమించును. ౧. నిష్క్రాన్తః అర్థః ప్రయోజన మస్మాదితి నిరర్థకం- ప్రయోజనములేనిది. ఈ ౨ ప్రయోజనము లేనిదాని పేళ్లు.

**స్పష్టం స్ఫుటం ప్రవ్యక్త ముల్బణమ్,**

స్పశత్యజ్ఞానం బాధత ఇతి స్పష్టం. స్పశ బాధన స్పర్శనయోః. అజ్ఞానమును బోఁగొట్టునది. ౧. స్ఫుటతి ప్రకాశత ఇతి స్ఫుటం. స్ఫుటవికసనే. ప్రకాశించునది. ౧. ప్రకృష్టం వ్యజ్యతే స్మ ప్రవ్యక్తం. అంజూవ్యక్తిమ్రక్షణకాంతిగతిషు. లెస్సగా నెఱుఁగఁబడునది. ౩. ఉత్కృష్టత్వేన బణ్యతే శబ్ద్యత ఇత్యుల్బణం. బణ శబ్దే. ఉత్కృష్టముగాఁ జెప్పఁబడునది. ఈ ౪ ప్రకటమైనదాని పేళ్లు.

**సాధారణం తు సామాన్యమ్ -**

సమాన మాధారణ మాధారో యస్యేతి సాధారణం–సమానమైన యాధారము గలది. ౧. సదృశం మానమస్యేతి సమానం, సమానమేవ సామాన్యం–సమానమే సామాన్యము. ఈ ౨ అనేకులకు పొత్తైన దానిపేళ్లు.

**ఏకాకీ త్వేక ఏకకః.** 82

ఏతి కార్యం కర్తుం స్వయమేవ గచ్ఛతీతి ఏకః, ఏక ఏవ ఏకాకీ. నాంతః. ఏకకశ్చ కార్యమును తానే చేయునది ఏకము. ఏకమే ఏకాకి. ఏకకమును. ఈ 3 సజాతీయ సహాయము లేనిదాని పేళ్లు.

**భిన్నార్థకా అన్యతర ఏక త్వా న్యేతరా అపి,**

అనితి పృథగేవ ప్రాణితీత్యన్యః, అన్య ఏవాన్యతరః. అన ప్రాణనే. వేఱుగానుండి బ్రతుకునది గనుక అన్యము; అన్యమే అన్యతరము. పా. ఏకతరః. ఏతి పృథగ్గచ్ఛతీ త్యేకః, ఇతరశ్చ. ఇణ్ గతౌ. వేఱుగాఁ బాసిపోవునది గనుక ఏకము, ఇతరము. ౨. ౫. త్విషతి పృథగ్భాసత ఇతి త్వః. త్విష దీప్తౌ. వేఱై ప్రకాశించునది. ౩. ఇవి ౫ సర్వనామములు. ప్రకృతార్థముకంటె వేఱైనదాని పేళ్లు.

**ఉచ్చావచం నైకభేదమ్ -**

ఉచ్చం చ తత్ అవాక్చ ఉచ్చావచం–మీఁదను క్రిందను వ్యాపించునది. ౧. నైకే అనేకేభేదా అస్యాస్తీతి నైకభేదం–అనేక భేదములు గలది. ఈ ౨ అనేక ప్రకారములైన చిత్రాదుల పేళ్లు.

**ఉచ్చణ్డ మవిలమ్బితమ్.** 83

ఉచ్చండతి కోపేనాశు సవతీ త్యుచ్చణ్డం. చడి కోపే. ఆగ్రహముచేత వేగిరపడునది. ౧. న విద్యతే విలంబితమస్యే త్యవిలంబితం – విలం

బములేనిది. ఈ ౨ త్వరగలదాని పేళ్లు.

**అరుంతుదం తు మర్మస్పృక్ -**

అరూంషి తుదతీ త్యరుంతుదం. తుద వ్యథనే. ఆయమును వ్యథ పెట్టునది. ౧. మర్మాణి స్పృశతీతి మర్మస్పృక్. శ. స్పృశ సంస్పర్శనే. ఆయములను సోఁకునది. ఈ ౨ ఆయమును నొప్పించునట్టి మాటలు మొదలయినదాని పేళ్లు.

**అబాధం తు నిరర్గళమ్,**

న విద్యతే బాధా నిరోధః అస్యే త్యబాధం–బాధ లేనిది. ౧. నిష్క్రాంత మర్గళా దితి నిరర్గళం–అడ్డుపాటువలనఁ బాపినది. ఈ ౨ అడ్డులేనిదాని పేళ్లు.

**ప్రసవ్యం ప్రతికూల స్స్యా దపసవ్య మపష్ఠు చ.** 84

ప్రగతం సవ్యాదితి ప్రసవ్యం; అపగతం సవ్యాది త్యపసవ్యం–దక్షిణ భాగమువలనఁ బాసినది గనుక ప్రసవ్యము, అపసవ్యము. ౧, ౩. ప్రతిస్పర్ధి కూలమస్యేతి ప్రతికూలం–ప్రతిస్పర్ధియైన తీరము గలది. ౩. అపతిష్ఠతి ఆనుకూల్యం వర్జయిత్వాతిష్ఠతీ త్యపష్ఠు. ష్ఠా గతినివృత్తౌ. ఆనుకూల్యమును వర్జించియుండునది. ఈ ౪ ప్రతికూలమైన (వాటముతప్పిన) దాని పేళ్లు.

**వామం శరీరే సవ్యం స్యాత్ -**

వమతి యజ్ఞసూత్ర మితి వామం. టు వము ఉద్గిరణే. యజ్ఞోపవీతమును విడిపించునది. ౧ సూయతే యజ్ఞసూత్రమత్రేతి సవ్యం. షుఙ్ అభిషవే. యజ్ఞోపవీతము దీనియందు తడపఁబడును. ఈ ౨ శరీరమున నెడమ పార్శ్వము పేళ్లు.

**అపసవ్యం తు దక్షిణే,**

సవ్యా దపక్రాంత మపసవ్యం–ఎడమదిక్కువలనఁ బాసినది. ౧. దక్షతే బలవత్తయా వర్ధత ఇతి దక్షిణం. దక్ష వృద్ధౌ శీఘ్రార్థే చ. బలము గలిగినదగుటచేత వృద్ధిఁ బొందునది. ఈ ౨ కుడిదిక్కు పేళ్లు.

**సంకటం నా తు సంబాధః -**

సంకుచతీతి సంకటం. సంకోచమై యుండునది. ౧. సంబాధ్యం తే జనాఅత్రేతి సంబాధః. బాధృవిలోడనే. దీనియందు మిక్కిలి జనులు బాధింపఁ బడుదురు. నియత పుంలింగము. ఈ ౨ ఇరకటపుఁజోటు పేళ్లు.

**కలిలం గహనం సమే.** 85

కల్యతే క్షిప్యతే మతి రత్రేతి కలిలం. కల కిల క్షేపే. దీనియందు బుద్ధి వెళ్లఁద్రోయఁబడును. ౧. గాహతే మతి రత్రేతి గహనం. గాహూ విలోడనే. దీని యందు బుద్ధి యణఁగును. ఈ ౨ చొరరాని దానికిని, ఎఱుఁగరాని దానికిని పేళ్లు.

**సంకీర్ణే సంకులా కీర్ణే -**

సంకీర్యతే నైరంత ర్యేణేతి సంకీర్ణం, ఆకీర్యత ఇ త్యాకీర్ణం. కౄ విక్షేపే. ఒకటికొకటి యెడము లేకుండునట్లు కలపఁబడునది. ౧, ౨. సంకోలతి నిరంతరీ భవతీతి సంకులం. కులసంస్త్యానే. ఎడలేక ఎల్లప్పుడు కలిసికొని యుండునది. ఈ 3 ఒకటికొకటి కలిసియున్నదాని పేళ్లు.

**ముణ్డితం పరివాపితమ్,**

ముండ్యతే ఖండ్యతే స్మ ముండితం. ముడి ఖండనే. గొఱుగఁబడినది. ౧. పరిత శ్శిరసి వాపః కేశఖండనం జాతో ౽స్యేతి పరివాపితం. టు వప్ బీజసంతానే. వపే రనేకార్థత్వాత్ ముండనే ౽పి వృత్తిః. కేశఖండనము గలిగినది. ఈ ౨ గొఱుగఁబడినదాని పేళ్లు.

**గ్రథితం గ్రంథితం దృబ్ధమ్ -**

గ్రథ్యతేస్మ గ్రథితం; గ్రంథ్యతేస్మ గ్రంథితం; దృభ్యతే స్మదృబ్ధం. గ్రంథ సందర్భే; గ్రథి కౌటిల్యే; దృభి గ్రంథే. కూర్పఁబడునది గనుక గ్రథితము, గ్రంథితము, దృబ్ధమును. ఈ 3 కూర్చఁబడిన పుష్పమాలికాదుల పేళ్లు. పా. గ్రథితే గుమ్భితం (సందితం) దృబ్ధం.

**విసృతం విస్తృతం తతమ్.** 86

విస్రియతే స్మ విసృతం. సృగతౌ. వ్యాపించునది. ౧. విస్తీర్యతేస్మ విస్తృం, తాయతే స్మ తతం. స్తృఞ్ ఆచ్ఛాదనే, తను విస్తారే. విస్తరింపఁబడునది గనుక విస్తృతము, తతమును. ఈ 3 వ్యాపించిన దానిపేళ్లు.

**అన్తర్గతం విస్మృతం స్యాత్-**

అంతరేవ గచ్ఛతి స్మ అంతర్గతం. గమ్ ౢ గతౌ. లోపల నణఁగి యుండునది. ౧. విస్మర్యతే స్మ విస్మృ తం. స్మృ ఆధ్యానే. మఱవఁబడినది. ఈ ౨ మఱవఁబడిన దాని పేళ్లు.

**ప్రాప్త ప్రణిహితే సమే,**

ప్రకర్షేణ ఆప్తం ప్రాప్తం. ఆప్ ౙ వ్యాప్తౌ. మిక్కిలి పొందcబడినది. ౧. ప్రకర్షేణ నిహితం సన్నిధౌ స్థాపితం ప్రణిహితం. డు ధాఞ్ ధారణపోషణయోః. మిగుల దగ్గర నుంచcబడినది. ఈ ౨ పొందcబడిన (చేరువనున్న) దాని పేళ్లు.

**వేల్లిత ప్రేఙ్ఖి తాధూత చలి తాకమ్పితా ధుతే.** 87

వేల్యతే స్త వేల్లితః. వేల్ఱ చలనే. ప్రేంఖ్యతేస్మ ప్రేంఖితః. ఇఖిగతౌ. ఆధూయతే స్మ ఆధూతః. ధూ విధూననే. చాల్యతే స్మ చలితః. చల కంపనే. ఆకంప్యతే స్మ ఆకంపితః. కపి చలనే. ధూయతే స్మ ధుతః. ధుఞ్ కంపనే. కదలింపcబడినది గనుక వేల్లితము, ప్రేంఖితము, ఆధూతము, చలితము, ఆకంపితము, ధుతము. ఈ ౬ కదలింపcబడిన దానిపేళ్లు.

**నుత్త నున్నాస్త నిష్ఠ్యూత విద్ధ క్షి ప్తేరితా స్సమాః,**

నుద్యతే స్మ నుత్తః. నున్నశ్చ. ణుద ప్రేరణే. ప్రేరేపింపcబడునది గనుక నుత్తము, నున్నమును. ౧, ౨. అస్యతే స్మ అస్తః. అసు క్షేపణే. త్రోయcబడునది. ౩. నిష్ఠీవ్యతేస్మ నిష్ఠ్యూతః. ష్ఠివు నిరసనే. నిరసింపcబడునది. ౪. విధ్యతే స్మ విద్ధః. వ్యధ తాడనే. పీడింపcబడునది. ౫. క్షిప్యతేస్మ క్షిప్తః, ఈర్యతే ప్రేర్యతే స్మ ఈరితః. క్షిప ప్రేరణే. ఈర ప్రేరణే. నెట్టcబడినది గనుక క్షిప్తము, ఈరితము. ౬. ఇవన్నియు సమానార్థములు. త్రోయcబడినదాని పేళ్లు.

**పరిక్షి ప్తంతు నివృతమ్-**

పరితః క్షిప్యతే సమంతా ద్వేష్ట్యతేస్మ పరిక్షిప్తం. క్షిప ప్రేరణే. అంతటc జుట్టcబడినది. ౧. నితరాం వ్రియతే స్మ నివృతం. వృఞ్వరణే. మిక్కిలి ఆవరింపc బడినది. ఈ ౨ కోట మొదలైనదానిచేతc జుట్టcబడినదాని పేళ్లు.

**మూషితం ముషితార్థకమ్.** 88

మూష్యతే స్మ మూషితం. ము ష్యతే స్మ మూషితం. మూషస్తేయే, ముషస్తేయే. దొంగలింపcబడినది. గనుక మూషితము, ముషితము. ఈ ౨ దొంగిలింపc బడినదాని పేళ్లు.

**ప్రవృద్ధ ప్రసృతే -**

ప్రవర్ధ తేస్మ ప్రవృద్ధం. వృధు వృద్ధౌ. వృద్ధిఁ బొందినది. ౧. ప్రసరతిస్మ ప్రసృతం. సృగతౌ. న్యాపించినది. ౨ కొనసాగి పెరుగుదాని పేళ్లు.

**న్యస్త నిసృష్టే-**

న్యస్యతే స్మ న్యస్తం; నిసృజ్యతే స్మ నిసృష్టం. అసు క్షేపణే; సృజ విసర్గే. పెట్టఁబడినది గనుక న్యస్తము, నిసృష్టమును. ఈ ౨ ఉంచఁబడినదానిపేళ్లు.

**గుణితాహతే,**

గుణ్యతేస్మ గుణితం. గుణ అభ్యాసే. గుణింపఁబడునది. ౧. ఆహన్యతే సంఖ్యాంత రేణేత్యాహతం. హన హింసాగత్యోః.సంఖ్యాంతరముచేతఁ జెఱుపఁ బడినది. ఈ ౨ గుణింపఁబడిన సంఖ్య పేళ్లు.

**నిది గ్ధోపచితే -**

నిదిహ్యత ఇతి నిదిగ్ధం; ఉపచీయత ఇత్యుపచితం. దిహ ఉపచయే; చిఞ్ చయనే. వర్ధిల్లఁజేయఁబడినది గనుక నిదిగ్ధము, ఉపచితమును. ఈ ౨ కొలఁత హెచ్చిన ధాన్యాదుల పేళ్లు. 'హరితాల సుధాహింగులాదిలిపస్య కుడ్యా దేర్నామని' అని టీకా సర్వస్వకారుఁడు.

**గూఢ గుప్తే -**

గుహ్యతే స్మ గూఢం. గుహూ సంవరణే. దాఁచఁబడినది. ౧. గుప్యతే స్మ గుప్తం. గుపూ రక్షణే. రక్షింపఁబడినది. ఈ ౨ దాఁచబడినదాని పేళ్లు.

**గుణ్ఠిత రూషితే.** 89

గుంఠ్యతే ధూళ్యాదినేతి గుంఠితం. గుఠి వేష్టవే. ధూళ్యాదులచేతఁ గప్పబడినది. ౧ రూష్యతితి రూషితం. రూష వ్యాప్తౌ. మాఁగురువడినది. ఈ ౨ ధూళ్యాదులచేతఁ గప్పఁబడినదాని పేళ్లు.

**ద్రు తాపదీర్ణే -**

ద్రూయతేస్మ ద్రుతం. ద్రు గతౌ. కరఁగింపఁబడినది. అవదీర్యత ఇతి అవదీర్ణం. దౄ విదారణే. అవయింపఁబడినది. ఈ ౨ కరఁగింపఁబడినదాని పేళ్లు. అవయింపఁబడినదాని వెళ్లని కొందఱు.

**ఉద్గూ ర్ణోద్యతే -**

ఉద్గూర్యతే స్మ ఉద్గూర్ణం; ఉద్యమ్యతే స్మ ఉద్యతం. గురీ ఉద్యమనే. యమ ఉపరమే. ఎత్తఁబడినది గనుక ఉద్గూర్ణము, ఉద్యతమును. ఈ ౨ పొడవుగా నెత్తఁ బడిన శస్త్రాదులపేళ్లు.

**కాచిత శిక్యితే,**

కాచమారోపితం కాచితం. శిక్య మారోపితం శిక్యితం. ఉట్టి యందుఁ బెట్టఁబడినది. గనుక కాచితము, శిక్యితమును. ౧, ౨. టీ. స. కారిత శిక్షిత శబ్దౌ లౌకికే వైదికే కర్మణి కృతాభ్యాసస్య నామనీ. శిక్షాంకార్యతే స్మ కారితం. శిక్ష్యతే స్మ శిక్షితం. శిక్ష విద్యోపాదానే. ఉట్టియందుఁ బెట్టఁబడినదాని పేళ్లు.

**ఘ్రాణ ఘ్రాతే -**

ఘ్రాయతే స్మ ఘ్రాణం, ఘ్రాతం చ. ఘ్రా గంధోపాదానే. మూర్కొనఁ బడినది గనుక ఘ్రాణము, ఘ్రాతమును. ఈ ౨ మూర్కొనఁబడిన దాని పేళ్లు.

**దిగ్ధలిప్తే -**

దిహ్యతే స్మ దిగ్ధం, లిప్యతే స్మలిప్తం. దిహ ఉపచయే, లిపు ఉపదేహే. పూయఁబడినది. గనుక లిప్తము, దిగ్ధమును. ఈ ౨ పూయఁబడినదాని పేళ్లు.

**సముదక్తోద్ధృతే సమే.** 90

సముదచ్యతే స్మ సముదక్తం, ఉద్ధ్రియతే స్మ ఉద్ధృతం. అఞ్చుగతి పూజనయోః. హృఞ్ హరణే. ఎత్తఁబడినది గనుక సముదక్తము, ఉద్ధృతమును. ౧, ౨. 'ప్రవృద్ధ ప్రసృతే' అనునది మొద లింతవఱకు, సమే = సమార్థకములు, అని యన్ని చోటుల నన్వయము. ఈ ౨ చేఁదఁబడిన దానిపేళ్లు.

**వేష్టితం స్యా ద్వలయితం సంవీతం రుద్ధ మావృతమ్,**

వేష్ట్యతే స్మ వేష్టితం - చుట్టఁబడినది. ౧. వలయమాకారస్సంజా తో ఽ స్యేతి వలయితం - వలయాకారము గలది. ౨. సంవియతే స్మ సంవీతం. రుధ్యతే స్మరుద్ధం ; ఆవ్రియతే స్మ ఆవృతం. వ్యేఞ్ సంవరణే ; రుధిర్ ఆవరణే. కప్పఁబడినది గనుక సంవీతము, రుద్ధము, ఆవృతమును. ఈ ౫ నదీ ప్రాకారాదులచేతఁ జుట్టఁబడిన పట్టణాదుల పేళ్లు. వేష్టిత

క్రమణ మతిక్రమః. క్రము పాదవిక్షేపే. అతిక్రమించుట. ౨. అతిక్రమ్యపతన మతిపాతః. పత్ ఌగతౌ. అతిక్రమించిపోవుట. ౩. ఉపపన్నస్యాత్యయన ముపాత్యయః. ఇణ్ గతౌ. దగ్గరనున్న దాని నతిక్రమించిపోవుట. ౪. క్రమముతప్పి ఆవలికిఁ బోవుట పేళ్లు. ఈపర్యయాదిశబ్దములు బ్రహ్మవర్గయందు పర్యాయప్రస్తావమునఁ దప్పిపోవుటకు పేళ్లుగాఁ జెప్పినాఁడు. ఇక్కడ విపర్యా ప్రస్తావమునఁ దప్పిపోవుటను జెప్పినాఁడు గనుక విధిభేదము.

**ప్రేషణం యత్సమాహూయ తత్ర స్యాత్ప్రతి శాసనమ్,**

భృత్యాన్ప్రతి శాసనం ప్రతిశాసనం. శాసు అనుశిష్టౌ. భృత్యులను గూర్చి యాజ్ఞాపించుట. ౧ భృత్యాదులను బిలిచి పనులలోఁ బంచుట పేళ్లు.

**స సంస్తావః క్రతుషు యా స్తుతిభూమి ర్ద్విజన్మనామ్.** 34

సంస్తువం త్యుద్గాత్రాదయ ఇంద్రాదీ నత్రేతీ సంస్తావః. ష్టుఞ్ స్తుతౌ. దీనియందు ఉద్గా మొదలైనవారు ఇంద్రాదులను స్తోత్రము సేయుదురు. ౧ యజ్ఞాదులయందు ఉద్గాత మొదలైన బ్రాహ్మణులు స్త్రోత్రము చేయు భూమిపేరు. బ్రాహ్మణులు కూడి స్తోత్రము చేయుట యని కొందఱు.

**నిధాయ తక్ష్యతే యత్ర కాష్ఠే కాష్ఠం స ఉద్ఘనః,**

ఉద్ధన్యతే కాష్ఠ మత్రేతి ఉద్ఘనః. హన హింసాగత్యోః. దీని యందు కొయ్య చెక్కఁబడును. ఈ ౧ ఏకొయ్యమీఁద మఱియొక కొయ్యనుబెట్టి చెక్కుదురో యాలాటి మ్రానిపేరు దాత్రిమ్రాను.

**స్తమ్బఘ్నస్తు స్తమ్బఘనః స్తమ్బో యేన నిహన్యతే.** 35

స్తమ్బో హన్యతే అనేన స్తంబఘ్నః, స్తంబహనశ్చ. హన హింసాగత్యోః. దీనిచేత కసువుగంటలు కోయఁబడును గనుక స్తంబఘ్నము, స్తంబఘనమును. ఈ ౨ కసవుగంటను పెకలించు గుద్దలి మొదలగుదాని పేళ్లు.

**ఆవిధో విధ్యతే యేన తత్ర -**

ఆవిధ్యతే అనేనే త్యావిధః. వ్యధ తాడనే. దీనిచేత తొలువఁబడును. ఈ ౧ రత్నాదులకు బెజ్జము వేయు వజ్రపుపోగరు మొదలైనదాని పేరు.

**విష్వ క్సమే నిఘః,**

నియతం హన్యతే నిఘః. హన హింసాగత్యోః. నియతముగాఁ గొట్టబడునది. ఈ ౧ వెడల్పు నిడుపులు సరియైన వేదికాదుల పేరు.

**ఉత్కారశ్చ నికారశ్చ ద్వౌ ధాన్యోత్క్షేపణార్థకౌ.** 36

ఉత్కరణముత్కారః, నికరణం నికారః. కౄవిక్షేపే. మీఁదికిఁజల్లుట గనుక ఉత్కారము, నికారమును. ఈ ౨ ధాన్యము పొడవుగాఁ గుప్పఁబోయుటకుఁగాని, మీఁదికి తూర్పెత్తుటకుఁగాని పేళ్లు.

**నిగా రోద్గార విక్షా వోద్గ్రాహా నిగరణాదిషు,**

నిగరణం నిగారః – మ్రింగుట నిగారము. ౧. ఉద్గరణ ముద్గారః. గౄ నిగరణే. వెళ్లించుట ఉద్గారము. ౧. విరుద్ధం క్షవో విక్షావః. టు క్షు శబ్దే. విరుద్ధమైన శబ్దము. ౧. ఊర్ధ్వీకృత్య గ్రహణ ముద్గ్రాహః. గ్రహ ఉపాదానే. ఎగురవేసి పట్టుకొనుట. ౧. 'గీర్ణిర్గిరౌ' అని మునుపు మ్రింగుటను జెప్పినను, ఇక్కడ 'నిగాటనుః' అని శబ్ద భేదముచేతను, ఉద్గార శబ్ద ప్రస్తావముచేతను మఱలఁ జెప్పినాఁడు. ఈ ౪ ను వరుసగా మ్రింగుటకును, క్రక్కుటకును, క్రాయుటకును, ఎగురవేసి పట్టుకొనుటకును పేళ్లు. ఉద్గారశబ్దము త్రేఁపు పేరని కొందఱు.

**ఆరత్యుపరతి విరతయ ఉపరామే -**

ఆరమణ మారతిః, ఉపరమణ ముపరతిః. పా. అవరతిః. సీ. ఉపరామశ్చ. పా. ఉపరమః. విరమణం విరతిః. సీ. రు క్రీడాయాం. మానుట గనుక ఆరతి, ఉపరతి, ఉపరామము, విరతియు. ఈ ౪ చాలించుట పేళ్లు.

**వాస్త్రియాం తు నిష్ఠేవః.** 37

నిష్ఠ్యూతి ర్నిష్ఠీవన నిష్ఠేవన మిత్యభిన్నాని,

నితరాం ష్ఠేవః నిష్ఠేవః. పు. నిష్ఠ్యూతిః. సీ. నిష్ఠీవనం, నిష్ఠేవనంచ. ష్ఠివు నిరసనే. మిక్కిలి శ్లేష్మాదుల నిరసించుట గనుక నిష్ఠేవము, నిష్ఠ్యూతి, నిష్ఠీవము, నిష్ఠేవనము. "వా అస్త్రియామ్" అని యోజించి నిష్ఠీవ శబ్దము నపుంసకలింగమును గలదని కొందఱు. ఈ ౪ ఉమియుట పేళ్లు.

**జవనే జూతిః -**

జవో జవనం, జూతిశ్చ. సీ. జు గతౌ. వేగము గలిగినది గనుక జవనము, జూతియును. ఈ ౨ వేగిరముగాఁ బోవుట పేళ్లు.

**సాతి స్త్వవసానే స్యాత్ -**

సాయ స్సాతిః. సీ. అవసానం చ. షో ఉ_న్తకర్మణి. క్రియ ముగియుటసాతి, అవసానము. ఈ ౨ క్రియాంతము పేళ్లు.

**అథ జ్వరే జూర్తిః.** 38

జ్వరణం జ్వరః, జూర్తిశ్చ. సీ. జ్వర రోగే. వ్యధపడుట జ్వరము, జూర్తియు. ఈ ౨ జ్వరము పేళ్లు.

**ఉదజస్తు పశుప్రేరణమ్ -**

ఉదజన ముదజః. అజ గతిక్షేపణయోః. పసులఁ దోలుట ఉదజము. ఈ ౧ పసులఁ దోలుట పేరు.

**అకరణి రిత్యాదయ శ్శాపే,**

అకరణిస్తే వృషల భూయాత్-ఓరివృషలుఁడా నీకు కృష్యాది కర్మఫలము లేకపోవుఁగాక యని యర్థము. ఆదిశబ్దముచేత "తస్యాజననిరేవాస్తు జననీ క్లేశకారిణః" అని మాఘుఁడు. అవగ్రాహస్తే వృషల భూయాత్; నిగ్రాహస్తే వృషల భూయాత్. అనునివి మొదలగునవి గ్రహింపఁబడును. శపించుటయందు వర్తించును.

**గోత్రాన్తేభ్య స్తస్య బృన్ద మిత్యౌపగవకాదికమ్.** 39

ఔపగవకాది శబ్దములు గోత్రప్రత్యయాంతములైన ఔపగవాదులయొక్క సమూహమందు వర్తించును. అది యెట్లనిన, ఉపగోరపత్యాని ఔపగవాః; ఔపగవానాం సమూహః ఔపగవకం-ఉపగుల యొక్క ఆపత్యములు. ఔపగవములు; ఔపగవములయొక్క సమూహము ఔపగవక మని ఆదిశబ్దముచేత 'గార్గకం, వాత్సకం, దాక్షకం అనునవి మొదలైనవియును.

**ఆపూపికం శాష్కులిక మేవ మాద్య మచేతసామ్,**

అపూపానాం సమూహః ఆపూపికం-ఆపూపముల సమూహము. ౧. శష్కులీనాం సమూహః శాష్కులికం-చక్కిలాలయొక్క సమూహము. ౧. ఈ ౨ ను వరుసగా అపూపములయొక్కయు, చక్కిలముల యొక్కయు సమూహమునకు పేళ్లు. ఆద్యశబ్దముచేత నీలాటి యచేతనములైన వేణువు మొదలైనవానియొక్క సమూహములయందు వేణుకాది శబ్దములు వర్తించును.

**మాణవానాం తు మాణవ్యమ్ -**

మాణవా బాలాః తేషాం సమూహో మాణవ్యం-బాలుర యొక్క సమూహము. పిన్నవాండ్ర సమూహము పేరు.

**సహాయానాం సహాయతా.** 40

సహాయానాం సమూహః సహాయతా. ఈ ౧ తోడువచ్చినవారల సమూహము పేరు.

**హల్యా హలానామ్ -**

హలానాం సమూహో హల్యా. ఈ ౧ నాఁగేళ్ల గుంపు పేరు.

**బ్రాహ్మణ్య బాడబ్యే తు ద్విజన్మనామ్,**

బ్రాహ్మణానాం సమూహో బ్రాహ్మణ్యం; బాడబానాం సమూహో బాడబ్యం-బ్రాహ్మణులయొక్క సమూహము బ్రాహ్మణ్యము, బాడబ్యమును. ఈ ౨ బ్రాహ్మణుల సమూహము పేళ్లు.

**ద్వే పర్శుకానాం పృష్ఠానాం పార్శ్వం పృష్ఠ్యమనుక్రమాత్.** 41

పర్శుకాః పార్శ్వాస్థీని, తేషాం సమూహః పార్శ్వం-పర్శుకములనఁగా ప్రక్కయెముకలు, వానియొక్క సముదాయము. పృష్ఠానాం యజ్ఞసంబంధి స్తోత్ర విశేషాణాం సమూహః పృష్ఠ్యం-పృష్ఠములనఁగా యజ్ఞ సంబంధములైన స్తోత్ర విశేషములు, వాని సమూహము. ఈ ౧ వరుసగా ప్రక్కయెముకల సమూహమునకును, పృష్ఠములను యజ్ఞసంబంధములైన స్తోత్ర విశేషముల సమూహమునకును పేళ్లు.

**ఖలానాం ఖలినీ ఖల్యాపి -**

ఖలానాం సమూహః ఖలినీ, ఖల్యా చ- కళ్లములయొక్క సమూహము ఖలిని, ఖల్యయు. ఈ ౨ కళ్లముల సమూహము పేళ్లు.

**అథ మానుష్యకం నృణామ్,**

మనుష్యాణాం సమూహో మానుష్యకం-మనుష్యులయొక్క సమూహము. ఈ ౧ మనుష్యుల యొక్క సమూహము పేరు.

**గ్రామతా జనతా ధూమ్యా పాశ్యాగళ్యా ప్రథక్పృథక్.** 42

గ్రామాణాం సమూహో గ్రామతా-గ్రామములయొక్క సమూహము. ౧. జనానాం సమూహో జనతా-జనులయొక్క సమూహము. ౧. ధూమానాం సమూహో ధూమ్యా-ధూమములయొక్క సమూహము. ౧. పాశానాం సమూహః పాశ్యా-త్రాళ్లయొక్క

సమూహము. ౧. గళానాం సమూహో గళ్యా– ఔల్లుకసవుల యొక్క సమూహము. ఈ ౫ ప్రత్యేకముగా నాయా సమూహముల పేళ్లు.

**అపి సాహస్ర కారీష వార్మణాధర్వణాదికమ్,**

సహస్రానాం సమూహ స్సాహస్రం – సహస్రములయొక్క సమూహము. ౧. కరీషః శుష్కగోమయః, తేసాం సమూహః కారీషం – కరీష మనఁగా నెండినపేఁడ. దానియొక్క ప్రోగు. ౧. వర్మణాం సమూహో వార్మణం–జోళ్ల యొక్క మొత్తము. అధర్వణాం సమూహః ఆధర్వణం– అధర్వమంత్రముల యొక్క మొత్తము ఆది శబ్దముచేత అంగారముల సమూహము ఆంగారము. చర్మములయొక్క సమూహము చార్మణము. ఇవి మొదలైన శబ్దములు దెలిసికొనఁదగినవి. ఈ ४ వరుసగా నాయా సమూహముల పేళ్లు.

## నానార్థ వర్గము

అవ. ఏకార్థానేక పర్యాయాః ప్రథమం ప్రతిపాదితాః, పద మేకమనేకార్థం సంప్రతి ప్రతిపాద్యతే. గ్రంథకర్త పూర్వవర్గములలో నేకార్థముగల యనేక పర్యాయపదములఁ జెప్పి, యిప్పు డీ నానార్థవర్గమందు అనేకార్థముగల శబ్దములను జెప్పఁబోవుచు మున్ముందుగా నివి పూర్వ వర్గములలోఁ జెప్పినవో చెప్పనివో యనుశంకను దీర్చుచున్నాఁడు.___

**నానార్థాః కే ఽ పి కాన్తాది వర్గేష్వేవాత్ర కీర్తితాః,**
**భూరిప్రయోగా యే యేషు పర్యాయేష్వపి తేషు తే.** 1

నానార్థాః = అనేకార్థములు గల, కే ఽ పి = (ఏయర్థమందును బ్రసిద్ధ ప్రయోగములేని) కొన్ని కాదిశబ్దములు, అత్ర = ఈనానార్థవర్గమందలి, కాన్తాదివర్గేష్వేవ = కాంత ఖాంతాది వర్గములయందే, కీర్తితాః = చెప్పఁబడినవి, (ఇట్టివి పర్యాయ పదవర్గములలోఁ జెప్పఁబడలేదు). యే = ఏకాంతాదివర్గగత శబ్దములు, యేషు = ఏయర్థములలో, భూరి ప్రయోగాః = ప్రయోగబాహుళ్యము గలవో, తే = ఆలాటినాకాది పదములు, తేషు = ఆయర్థమునకు బోధకములైన, పర్యాయేష్వపి = పర్యాయములయందును, (అపిశబ్దమువలన అప్రసిద్ధార్థబోధకొఱకు నీకాంతాది వర్గముల యందును) కీర్తితాః = చెప్పఁబడినవి. ఇందువలనఁ బునరుక్తి దోషము

లేదు. అనఁగా నీవర్గమునఁ జెప్పఁబడు శబ్దములు కొన్ని పర్యాయ పదవర్గములలోఁ జెప్పినవియు కొన్ని చెప్పనివియుఁ గలవని తెలియునది.

## కాంత వర్గము

**ఆకాశే త్రిదివే నాకః -**

నాకశబ్దము ఆకాశమందును, స్వర్గమందును వర్తించును. నవిద్యతే అకం దుఃఖ మత్ర నాకః.

**లోకస్తు భువనే జనే,**

లోకశబ్దము స్వర్గాదిలోకములయందును, జనులయందును వర్తించును. లోక్యతే ఆలోక్యత ఇతి లోకః. లోకృ దర్శనే. చూడఁబడునది. టీ. స. జనశబ్దేన శిరః పాణ్యాద్యంగ సంస్థాన విశేషయుక్తం తిర్యగ్వ్యతిరిక్తం మనుష్యాదిపాణిమాత్ర ముచ్యతే. యథా ___ 'అయంజనః ప్రష్టుమనా స్తపోధనే' 'జనాయ శుద్ధాంతచరాయ శంసతే' 'సుజనోదుర్జన' ఇత్యాదిప్రయోగదర్శనాత్. క్వచిత్తు సముదాయే ఉపి ప్రయుజ్యతే. యథా ___ 'సఖీజనోద్వీక్షణ కౌముదీముఖం' 'అప్సరోజన సంకీర్ణే' ఇత్యాది. ఇహ తు జనశబ్ద స్సమూహార్థః. తత్ర లోకశబ్దః. 'స్త్రీ లోకః పరికలయాంచకార త్యులం' రాజలోక ఇత్యాది.

**పద్యే యశసి చ శ్లోకః -**

శ్లోకశబ్దము ఛందోబద్ధమైన వృత్తమందును, కీర్తియందును వర్తించును. శ్లోక్యత ఇతి శ్లోకః. శ్లోకృ సంఘాతే. కూర్చఁబడునది. టీ. స. యశసి యథా ___ పుణ్యశ్లోక ఇత్యాది.

**శరే ఖడ్గే చ సాయకః.** 2

సాయకశబ్దము బాణమందును, ఖడ్గమందును వర్తించును. స్యతి ప్రతిపక్షం నాశయతీతి సాయకః. షో ఉన్తకర్మణి. శత్రువును నశింపఁజేయునది. టీ. స. చకారసూచిత మర్థాంతరం శేషకారేణ దర్శితం "సాయకౌ క్షేతృ సాతారౌ త్రిలింగా" వితి.

**జమ్బుకః క్రోష్టు వరుణౌ**

జంబుశబ్దము నక్కకును, వరుణదేవునికిని పేరు. జమతీతి జంబుకః. జము అదనే. భక్షించునది. దుష్టుల హింసించువాఁడు గనుక

జంబుకము, జంబుకుండును.

**పృథుకౌ చిపి టార్భకౌ,**

పృథుకశబ్దము అటుకులకును, కుఱ్ఱవానికిని పేరు. పృథుత్వాత్, పృథుకాయతీతి చ పృథుకః. కైశబ్దే. ఉబికినది. మిక్కిలి మొఱపెట్టువాఁడు గనుక పృథుకము, పృథుకుఁడును.

**ఆలోకౌ దర్శనోద్యోతౌ -**

ఆలోకశబ్దము చూచుటకును ప్రకాశమునకును పేరు. ఆలోకనం–ఆలోక. ఆలోక్యతే ఉనేనేతిచ ఆలోకః. లోకృ దర్శనే. చూచుటయు, చూడఁబడుటయు ఆలోకము. 'ఆలోకశబ్దం వయసాం విరావై' రితి రఘువంశే. 'సరాజికకుదవ్య గ్రపాణిభిః పార్శ్వ వ్రవర్తిభిః' 'యయా వుదీరి తాలోక' ఇతి గ్రంథాంతరేచ.

**భేరీపటహ మానకౌ.** 3

ఆనకశబ్దము భేరికిని, తప్పటకును పేరు. ఆసమంతాదనతి శబ్దాయత ఇత్యానకః. అన శబ్దే. అంతట మ్రోయునది. పా. ఆణకః. 'మృదంగే స్వనదంబుదే, అనక' ఇతి శేషః. 'ఆనకః పటేహే భేర్యాం మృదంగే స్వనదంబుద' ఇతి విశ్వప్రకాశశ్చ.

**ఉత్సఙ్గ చిహ్నయో రఙ్కః –**

అంకశబ్దము తొడయందును, అడియాలమందును వర్తించును. అమంతా బాలా అత్రేతి; అంక్యతే ఉనేనేతి చ అంకః. అమ గత్యాదౌ, అకి లక్షణే. దీనియందు బాలురుందురు; దీనిచేత గుఱుతుపడును గనుక అంకము. 'అంకశ్చిత్రయుద్ధే భూషాంతికపరిచ్ఛిది, స్థానే చ రూపకే క్రోడ' ఇతి శేషే. 'అంకః స్థానాంతిక క్రోడభూషణోత్సంగ లక్ష్మసు, నాటకాదిపరిచ్ఛేదే చిత్ర యుద్ధేచ రూపకే' ఇతి విశ్వప్రకాశః.

**కళఙ్కో ఉఙ్కాపవాదయోః,**

కళంకశబ్దము గుఱుతునందును, నిందయందును వర్తించును. కల్యతే క్షిప్యతే కళంకః. కల కిల క్షేపే. త్రోయఁబడునది. టీ. స. కల్యతే క్షిప్యత ఇతి కలః, అంక్యత ఇతి అంకః, కలశ్చాసా వంకశ్చ కలంకః. 'కలంకో లోహకిట్టక' ఇతి శేషః.

**తక్షకో నాగ వర్ధక్యోః -**

తక్షకశబ్దము తక్షకుం డను సర్పమందును, వడ్లవానియందును వర్తించును. తక్ష్ణోతీతి తక్షకః. తక్షూ తనూకరణే. కృశముగాఁ జేయువాఁడు.

**అర్కస్స్ఫటిక సూర్యయోః.** 4

అర్కశబ్దము స్ఫటికమందును, సూర్యునియందును వర్తించును. అర్చ్యత ఇత్యర్కః. అర్చ పూజాయాంః. అర్చ పూజాయాం. పూజింపఁబడును. 'అర్కో ఽ ర్కపర్ణే స్ఫూటికే రవౌ తామ్రే దివస్పతా' వితి విశ్వప్రకాశః.

**మారుతే వేధసి బ్రధ్నే పుంసి కః కం శిరో ఽ మ్బునోః;**

కశబ్దము వాయుదేవునియందును, బ్రహ్మదేవునియందును, సూర్యుని యందును, ఆత్మయందును వర్తించునపుడు. పు. శిరస్సునందును, ఉదకమందును వర్తించునపుడు. న. ఇక్కడ పుంశబ్దము ఆత్మ వాచకము. కాయతే స్తూయతి ఇతికః, కంచ. కైశబ్దే. స్తోత్రము చేయఁబడును. "కోబ్రహ్మాత్మా నిలార్కేషు సుఖశీర్షజలేషుక" మితి విశ్వప్రకాశః.

**స్యాత్పులాక స్తుచ్ఛధాన్యే సంక్షేపే భక్తిసిక్థకే.** 5

పులాకశబ్దము క్షుద్ర (పొల్లు) ధాన్యమందును, సంక్షేపమందును, అన్నపు మెతుకునందును వర్తించును. పులతి మహద్భవతీతి పులాకః. పులమహత్వే. గొప్పదియౌనది. టీ. సం. సంక్షేపార్థే బుద్ధచరితే ప్రయోగః. "నిబోధ కించిత్తు పులాకమాత్రం వాక్యం మునేర్వాక్యవిశారద" స్యేతి.

**ఉలూకే కరిణః పుచ్ఛమూలోపాన్తే చ పేచకః,**

పేచకశబ్దము గుడ్లగూబయందును, ఏనుఁగుతోఁక మొదట నుండు గుదాచ్ఛాదకమైన మాంసమందును వర్తించును. వేచతి గచ్ఛతీతి పేచకః. పిచ గతౌ. పోవునది. "పేచకో గజలాంగూల మూలపర్యంత ఘూకయో" రితి విశ్వప్రకాశ. టీ. స. కేచిత్తు పుచ్ఛమూలే పుచ్ఛప్రాంతే చేత్యర్థద్వయపరత్వేన వ్యాచక్షతే. తథా చ ప్రతాపః___ "ఉలూకే గజలాంగూలమూల పర్యంతయోర" పీతి.

**కమణ్డలౌ చ కరకః -**

కరక శబ్దము కమండలువునందును, చకారమువలన వడగండ్ల యందును, కొక్కెరపక్షి యందును, దానిమ్మయందును వర్తించును. కరోత్యానందమితి కరకః. డు కృఞ్ కరణే. ఆనందమును జేయు

నది. "కరకః పక్షిభేదే స్యాత్ కమండలు కరంకయోః, కరదాడి మయోః పుంసి స్త్రియామపి ఘనోపల" ఇతి విశ్వప్రకాశః.

**సుగతే చ వినాయకః** 6

వినాయకశబ్దము బుద్ధదేవునియందును, చకారమువలన గణాధిపతి యందును, గరుత్మంతునియందును, గురువునందును వర్తించును. వినయతి శిక్షయతీతి వినాయకః. ణీఞ్ ప్రాపణే. శిక్షించువాఁడు. "వినాయకస్తు హేరంబే గరుత్మతి గురావ" పీతి శేషః.

**కిష్కుర్హస్తే వితస్తౌ చ -**

కిష్కు శబ్దము మూరయందును, జేనయందును, చకారమువలన ముంజేతి యందును, కుత్సితునియందును వర్తించును. కించిదితి కూయతే కిష్కుః. పు. కు శబ్దే. కించిత్తని చెప్పఁబడునది. "ప్రకోష్ఠే కుత్సితే కిష్కుః ద్విచత్వారింశ దంగుళే ఇతి" శేషః. కిష్కుర్హస్తే వితస్తౌ నా ప్రకోష్ఠే పుంనపుంసక" మితి రుద్రశ్చ.

**శూకకీటే చ వృశ్చికః,**

వృశ్చిక శబ్దము కణుఁదురునందును, చకారమువలన తేలునందును, తేలుమందు చెట్టునందును, వృశ్చికరాశియందును వర్తించును. వ్రశ్చతీతి వృశ్చికః. ఓవ్రశ్చూ చ్ఛేదనే. పీడించునది. "వృచ్ఛిక స్త్వౌషధేరాశా" వితి శేషః.

**ప్రతికూలే ప్రతీక స్త్రిష్వేకదేశే తు పుంస్యయమ్.** 7

ప్రతీకశబ్దము ప్రతికూలమునకుఁ బేరైనప్పుడు 3 లింగముల యందు వర్తించును. ఏకదేశమనఁగా అవయవము; దానికి పేరైనప్పుడు పుంలింగము. ప్రత్యేతి ప్రతీకః. ఇణ్ గతౌ. ప్రతిగానుండునది.

**స్యాద్భూతికం తు భూనిమ్బే కత్తృణే భూస్తృణే ఽపి చ,**

భూతికశబ్దము నేలవేమునందును, కామంచి కసవునందును, చిప్పకసవు నందును వర్తించును. భువి ఊతిః సంబంధో ఽస్యాస్తీతి భూతికం. పా. భూతీకం. వేఞ్ తంతు సంతానే. భూమియందు సంబంధముగలది. "భూతీకమపి భూనింబే కర్పూర తృణదీవ్యయో" రితి విశ్వప్రకాశః.

**జ్యోత్స్నికాయాం చ ఘోషే చ కోశాతకీ-**

కోశాతకీ శబ్దము పొట్లచెట్టునందును, ఉత్తరేణిచెట్టునందును వర్తించును. కోశం కోశాఖ్యం జాలాకారం బీజపిధాన మతతీతి కోశాతకీ. సీ. అత సాతత్యగమనే. కోశమను పేరుగల బీజావరణమును బొందియుండునది. ఘోషమనఁగా ఆవడచెట్టని కొందఱు.

**అథ కట్ఫలే.** 8

**సితే చ ఖదిరే సోమవల్కస్స్యాత్ -**

సోమవల్క శబ్దము గుమ్మడు చెట్టునందును, తెల్లచంద్రచెట్టు నందును వర్తించును. సోమవ ద్ధవళం వల్క మస్యేతి సోమవల్కః–చంద్రునివలె తెల్లనైన పట్ట గలది.

**అథ సిల్హకే,**

**తిలకల్కే చ పిన్యాకః -**

పిణ్యాక శబ్దము అందుగుబంక మొదలైన సుగంధ ద్రవ్యములచేతఁ జేసిన ధూపమునకును, గానుగుపిండికిని పేరు. పిణ్యం పిండాకర మకతీతి పిణ్యాకః. అక కుటిలాయాం గతౌ. పిడుచగట్టియుండునది. 'పిణ్యాకో హింగుకుంకుమే' ఇతి శేషః. 'పిణ్యాక స్సిల్హకే హింగౌ తిలచూర్ణేచ కుంకుమే' ఇతి విశ్వప్రకాశః.

**బాహ్లికం రామఠే ఽపిచ.** 9

బాహ్లికశబ్దము ఇంగువకును, అపిశబ్దమువలన బాహ్లికదేశమందుఁ బుట్టిన గుఱ్ఱమునకును, కుంకుమపువ్వునకును పేరు. ప్రాయేణ బాహ్లికదేశ జత్వాత్ బాహ్లికః –బాహ్లికదేశమందుఁ బుట్టినది. పా. బాహ్లీకం. "బాహ్లీకో విషయాశ్వయోః, నకుంకుమే చ వీరే చ బాహ్లీకు బాహ్లికం సమ" మితి శేషః. వీర ముశీరం.

**మహేన్ద్ర గుగ్గు లూలూక వ్యాళగ్రాహిషు కౌశికః,**

కౌశికశబ్దము దేవేంద్రునికిని, గుగ్గిలపుచెట్టునకును, గుడ్లగూబకును, పాములవానికిని పేరు. కుశికస్యాపత్యం కౌశికః–కుశికునికొడుకు. కడమ యర్థములయందు ఆయా యర్థములకుఁ దగినట్టు వ్యుత్పత్తి యూహించుకొనునది. టీ.స. కోశోధనమృద్ధిః ప్రయోజనమస్యేతి కౌశికః = ఇంద్రః, ఇంద్రేణ కేనచిత్కారణవశేన కదాచి దులూకవేషః పరిగృహీత ఇతి ఘూకో ఽపి కౌశికః కోశేన సర్పగ్రహణపేటికయా వ్యవహరతీతి

కౌశికో వ్యాళగ్రాహీ. “కౌశికో మునిభేదే చ నకులే కోశవత్యపి, ఉద్గాతరి కుశాజీవే గౌరీనద్యోస్తు కౌశికీ” ఇతి శేషః.

**రుక్తాప శఙ్కా స్వాతఙ్కః -**

ఆతంకశబ్దము తెలుపు రోగమునకును, తాపమునకును, భయమునకును పేరు. ఆతంకంతి అనేనేత్యాతంకః. తకి కృచ్ఛ్రజీవనే. దీనిచేత ప్రయాసమున బ్రతుకుదురు. “ఆతంచనే స్యాదాతంక” ఇతి శేషః. క్షీరస్వరూప పరి ణామహేతు భూతం క్షీరావాప్యం దధ్యాధిక మాతం చన ముచ్యతే.

**స్వల్పే ఽ పి క్షుల్లక స్త్రిషు.** 10

క్షుల్లక శబ్దము కొంచెమైనదానికిని, అపిశబ్దమువలన చులకని దానికిని దరిద్రునికిని పేరు. ఇది మూఁడు లింగములయందును వర్తించును. క్షుధం లాతీతి క్షుల్లకః. లా ఆదానే. కొంచెపుఁదనమును, ఆఁకలిని బొందువాఁడు క్షుల్లకుడు.

**జైవాతృక శ్శశాఙ్కే ఽ పి -**

జైవాతృకశబ్దము చంద్రునికిని, అపిశబ్దమువలన ఆయుష్మంతునికిని పేరు. జీవతీతి జైవాతృకః. జీవ ప్రాణధారణే. బ్రతుకువాఁడు. “జై వాతృకః కృషే చంద్రే భైషజ్యా యుష్మతోరపి” ఇతి విశ్వప్రకాశః. కృషః = కృషకః.

**ఖురే ఽ ప్యశ్వస్యవర్తకః,**

వర్తకశబ్దము గుఱ్ఱపుగొరిజకును, అపిశబ్దమువలన మీలవల్లంకి పులుఁగునకును పేరు. భువి వర్తత ఇతి వర్తకః. వృతు వర్తనే. భూమి యందు వర్తించునది.

**వ్యాఘ్రే ఽ పి పుణ్డరీకో నా -**

పుండరీక శబ్దము పులికిని, అపి శబ్దమువలన దిగ్గజమునకును పేరైనపుడు పుంలింగము. తెల్లదామరకును, తెల్లగొడుగునకును పేరైనపుడు నపుంసకము. పుణతీతి పుండరీకః. పుణ శుభకర్మణి. శుభకర్మమును జేయునది. ‘పుండరీకం సితచ్ఛత్రే సితాంభోజే ఽపి కీర్తితం, పుండరీకో వ్యాఘ్రభేదే దిగ్గజే క్షుద్ర భేదయో’రి త్యజయః.

**యవాన్యామపి దీపకః.** 11

దీపకశబ్దము ఓమమునకును, అపి శబ్దమువలన జీలకఱ్ఱకును పేరు. దీపయతీతి దీపకః. దీపి దీప్తౌ. దీపనముఁ బుట్టించునది. "దీపక స్స్యాదలంకారే యవానీ బర్హచూడయో" రితి శేషః. అలంకారో దీపకాఖ్య అర్థాలంకారేషు ప్రసిద్ధః. బర్హీ చూడా–మయూరశిఖాఖ్య ఓషధి వికారః.

**సాలావృకాః కపి క్రోష్టు శ్వానః -**

సాలావృకశబ్దము కోఁతికిని, నక్కకును, కుక్కకును పేరు. స్యంతివర్కంతే చ సాలావృకాః షో ఽన్తకర్మణి. వృక ఆదానే. హింసించి పుచ్చుకొనునవి. టీ. స. సాలాన్ వృక్షాది వర్తినో జీవాన్ ఆవర్కంతే భక్షయంతీతి సాలావృకాః. తాలవ్యాదిరితి సూభూతిచంద్రః.

**స్వర్ణే ఽపి గైరికమ్,**

గైరిక శబ్దము బంగారునకును, అపి శబ్దమువలన జేగురునకును పేరు. గిరౌ భవం గైరికం. గిరియందుఁ బుట్టినది.

**పీడార్థే ఽపి వ్యళీకం స్యాత్-**

వ్యళీకశబ్దము దుఃఖమునకును, ఆపి శబ్దమువలన అప్రియమునకును, అకార్యమునకును, సిగ్గునకును, కామినీజనాపరాధమునకును పేరు. విశేషేణ అల్యతే వార్యత ఇతి వ్యళీకం–విశేషముగా వారింపఁబడునది. "వ్యళీక మప్రియా కార్యవైలక్ష్యానృత కామజే" ఇతి శేషః. కామజః కామావేశ కృతో ఽపరాధః. లజ్జాయాం. "వ్యళీక నిశ్వాసమివోత్ససర్జ" ఇతి "సత్రాంతే సచివసఖః పురస్త్రియాభిః గుర్వీభిశ్శమిత పరాజయవ్యళికా" ఇతి. కుమారసంభవే, రఘువంశే చ ప్రయోగః.

**అళీకం త్వప్రియే ఽనృతే.** 12

అళీక శబ్దము అప్రియమునకును, అసత్యమునకును పేరు. అల్యతే వార్యత ఇత్యళీకం. అల భూషణాదౌ. వారింపఁబడునది. "ఆళీకం తు లలాటే స్యా" దితి శేషః.

**శీలాన్వయావనూకే ద్వే -**

అనూక శబ్దము స్వభావమునకును, వంశమునకును పేరు. అనూచ్యతి సమవైతీత్యనూకం. ఉచ సమవాయే. పాయకుండునది. "అనూకం గత జన్మ" నీతి శేషః.

**శల్కే శకల వల్కలే,**

శల్కశబ్దము తునుకకును, నారకును పేరు. శలతి పృథగ్గచ్ఛతీతి శల్కం. శల ఆశు గమనే. వేఱుగాఁ బోవునది. "సామ్యంగతే నాశనినా మఘోనః శశాంక శల్కాకృతి పాండురే" ఽతీ శల్కశబ్దస్య ఖండవాచిత్వే భార విప్రయోగః. టీ.స. మత్స్యానాం కవచ ప్రాయాత్వక్ శకల మిత్యుచ్యతే. "తథా పాఠీన రాజీవ సశల్కాశ్చ ద్విజాతిభి" రితి శల్కశబ్దస్య మత్స్యచర్మ వాచిత్వే ప్రయోగః.

**సాష్టే శతే సువర్ణానాం హేమ్న్యురో భూషణే పలే.** 13

**దీనారే ఽపి చ నిష్కో ఽ స్త్రీ-**

నిష్కశబ్దము నూటయెనిమిది సువర్ణములకును, బంగారుమాత్రమునకును, ఉరస్థులమందుండు భూషణమునకును, పలమునకును, పైడిటంకమునకును పేరు. సువర్ణమనఁగా నిరువది రూకలయెత్తు గల బంగారము. ౮౦ గురిగింజయెత్తు పల మనఁగా నెనుబదిరూకల యెత్తు. ౩౨౦ గురిగింజల యెత్తు. నితరాం కాయతే స్తూయత ఇతి నిష్కః. అ. ప్న. కైశబ్దే. మిక్కిలి స్తోత్రము చేయఁబడునది.

**కల్కో స్త్రీ శమలైనసోః,**

**దమ్భే ఽపి -**

కల్కశబ్దము విష్ఠకును, పాపమునకును, దంభమునకును వేరు కల్యతే క్షిప్యత ఇతి కల్కః. అ. ప్న. కల కిల క్షేపే. త్రోయఁబడునది. టీ. స. మలేన సహ వర్తత ఇతి సమలః. "పాపాశయః ఇతి దంత్యాదిత్వేన వ్యాచష్ట. తథాచ రుద్రః. "త్రిషు పాపాశయే కల్కో ఽస్త్రీ విట్కిట్టస దంభయో" రితి.

**అథ పినాకో ఽ స్త్రీ శూలశంకరధన్వనోః.** 14

పినాకశబ్దము శూలమునకును, ఈశ్వరుని వింటికిని పేరు. పాతీతి పినాకః. అ. ప్న. పా రక్షణే. రక్షించునది.

**ధేనుకా తు కరేణ్వాం చ -**

ధేనుకా శబ్దము ఆఁడుఏనుఁగునకును, చకారమువలన క్రొత్తగా నీనిన యావునకును పేరు. దయంత్యేనా మితి ధేనుః, ధేనురేవ ధేనుకా. ధేట్ పానే. దీని క్షీరమును ద్రాగుదురు. "ధేనుకా త్వశ్వయోషితి, భవాన్యాం చ కృపాణ్యాం చ ప్రసూతాయాం పశౌ గవి" ఇతి శేషః.

**మేఘజాలే చ కాళికా,**

కాళికాశబ్దము మేఘ సమూహమునకును, చకారమువలన పార్వతీదేవికిని, యోగినికిని, మర్యాదకును, నలుపునకును పేరు. కాళవర్ణత్వాత్ కాళికా–నల్లనిది. "దోషే స్వర్ణాది ధాతూనాం కృష్ణావృద్ధిసురాసు చ, క్రమదేయే వస్తుమూల్యే యోగి న్యంబికయోరపి. పటోల శాఖాలో మాళిమాంసీకాకీషు కాళికే"తి శేషః.

**కారికా యాతనాకృత్యోః -**

కారికాశబ్దము తీవ్ర వేదనకును, చేయుటకును పేరు. 'యాతనావృత్త్యోః' అను పాఠమందు వృత్తియనఁగా సూత్రాది వివరణ శ్లోకము. కృణోతి కరోతీతి కారికా. కృా హింసాయాం; డుకృఞ్ కరణే. హింసించునది; చేయునది గనుక కారిక. "కారికా నటయోషాయాం దివా కీర్త్యాదిశిల్పక" ఇతి శేషః.

**కర్ణికా కర్ణభూషణే.** 15

**కరిహస్తాఙ్గుళౌ పద్మబీజకోశ్యామ్-**

కర్ణికాశబ్దము కర్ణభూషణమునకును, ఏనుఁగు తొండము కొనకును, తామరపువ్వులోని దుద్దునకును పేరు. కర్ణస్యాలంకారః కర్ణికా. కర్ణమున కలంకారమైనది. టీ. స. అంచుళి రగ్రభాగః తత్ర కిరతి జలమితి కర్ణికా. కృా విక్షేపే. పరాటకే కర్ణికాసదృశాకారత్వా త్కర్ణికా.

**త్రిషూత్తరే,**

ఇఁకమీఁద ఖాంతవర్గమువఱకుఁ గల శబ్దములు త్రిలింగములు.

**బృన్దారకా రూపి ముఖ్యౌ -**

బృందారక శబ్దము చక్కనిదానికిని, మూఁకకుఁ గర్తయైన వానికిని పేరు. ప్రశస్తం బృంద మస్య బృందారకః–ప్రశస్తమైన సమూహము గలవాఁడు.

**ఏకే ముఖ్యాన్య కేవలాః.** 16

ఏకశబ్దము ప్రధానమైనదానికిని, ప్రకృతమైనదానికంటె వేఱైన దానికిని, సహాయము లేక యొకటైనదానికిని పేరు. ఏతి ప్రాధాన్యం గచ్ఛతీత్యేకః ఇణ్ గతౌ. ప్రాధాన్యమును బొందునది. టీ. స. ముఖ్యే యథా— సర్వసత్త్వైకబంధుః. అన్యార్థే — ఇత్యేకే ప్రాహుః.

కేవలే___ 'ఏకో ఽజయద్రిపుపురాణి హరః ఖరాదీ'నితి.

**స్యాద్దాంభికః కౌక్కుటికో య శ్చాదూరేరి తేక్షణః,**

కౌక్కుటిక శబ్దము దంభము గలవానికిని, సమీపమున నడుగు పెట్టుతావున పదిలముగాఁ జూచుకొనిపోవు భిక్షుకునికిని పేరు. కుక్కుటిం మాయాం పశ్యతి, కుక్కుటవన్మందం చరతీతి కౌక్కుటికః–మాయను నేర్చినవాఁడు; కోడివలె మెల్లగాఁ బోవువాఁడు.

**లాలాటికః ప్రభో ర్భా(ల)వదర్శీ కార్యాక్ష మశ్చయః.** 17

లాలాటికశబ్దము ప్రభువుభావమున దెలిసికొనువానికిని, స్వామి కార్యముల యందసమర్థుఁ డయినవానికిని పేరు. కోపప్రసాద పరిజ్ఞానాయ ప్రభోర్ల లాటం పశ్యతి. కార్యేష్వలిప్తః దూరే స్థితస్సౕ ప్రభోర్లలాటం పశ్యతీతి లాలాటికః– కోపప్రసాదము లెఱుంగుటకొఱకు ప్రభువు లలాటమును జూచువాఁడు; కార్యముల యందుఁ జొరక దవ్వున నుండి ప్రభువులలాటమే చూచువాఁడును లాలాటికుడు.

**భూభృన్ని తమ్బవలయ చక్రేషు కటకో ఽ స్త్రియామ్,**

కటకశబ్దము పర్వతమధ్యప్రదేశమునకును, కంకణమునకును, రాష్ట్రమునకును పేరు. చక్ర మనఁగా సైన్యము గనుక సైన్యముపేరును. కటతీతి కటకః. కటే వర్షావరణయోః. చుట్టుకొనియుండునది.

**సూచ్యగ్రే క్షుద్రశత్రౌ చ రోమహర్షే చ కణ్టకః.** 18

కంటకశబ్దము సూదిమొనకును, క్షుద్రశత్రువునకును, రోమాంచమునకును పేరు. కణంత్యనేన కంటకః. కణ శబ్దే. దీనిచేత మొఱపెట్టుదురు. (ఈశ్లోకము ప్రక్షిప్తము).

## ఖాంత వర్గము

**మయూఖ స్త్విట్కర జ్వాలాసు -**

మయూఖశబ్దము కాంతికిని, కిరణమునకును, అగ్నిజ్వాలకును పేరు. మినో త్యంధకారమితి మయూఖః. డు మిఞ్ ప్రక్షేపణే. అంధకారమును బోఁగొట్టునది.

**ఆళిబాణౌ శిలీముఖౌ,**

శిలీముఖశబ్దము తుమ్మెదకును అమ్ములకును పేరు. శిలీ శల్యం ముఖే అస్య శిలీముఖః. అ. ప్న. ములికి ముఖమందుఁ గలిగినది.

**శఙ్ఖో నిధౌ లలాటాస్థ్ని కమ్బౌన స్త్రీ-**

శంఖశబ్దము నిధి విశేషమునకును, నొసటి యెముకకును, శంఖమునకును పేరు. శమయతి దుఃఖమితి శంఖః. శము ఉపశమే. దుఃఖమును శమింపఁ జేయునది.

**ఇన్ద్రియే ఒ పిఖమ్.** 19

ఖశబ్దము ఇంద్రియమునకును, అపిశబ్దమువలన ఆకాశమునకును పేరు. ఖనతి వ్యథయతీతి ఖం. ఖను అవదారణే. వ్యథ పెట్టునది. "స్వర్నభశ్చ ఖ" మితి త్రికాండశేషః.

**ఘృణిజ్వాలే అపి శిఖే-**

శిఖా శబ్దము కిరణమునకును, అగ్నిజ్వాలకును, అపి శబ్దమువలన సిగకును పేరు. శేతే ఇతి శిఖా. శీఙ్ స్వప్నే. ధాతూనా మనే కార్థత్వాదత్ర వ్యాప్తిరర్థః. వ్యాపించునది.

## గాంత వర్ణము

**శైలవృక్షౌ నగా వగౌ,**

నగావగ శబ్దములు ౨ ను ఒక్కొక్కటి పర్వతమునకును వృక్షమునకునుగూడ పేళ్లు. న గచ్ఛత ఇతి నగౌ, అగౌ చ. గమ్ ౯ గతౌ. ఎక్కడికిని కదలనేరనివి గనుక నగములు, అగములు.

**ఆశుగౌ వాయు విశిఖౌ -**

ఆశుగశబ్దము వాయువునకును, బాణమునకును పేరు. ఆశు గచ్ఛతీ త్యాశుగః. గమ్ ౯ గతౌ. వేగిరముగాఁ బోవునది.

**శరార్క విహగాః ఖగాః.** 20

ఖగశబ్దము బాణమునకును, సూర్యునికిని, పక్షికిని పేరు. ఖేగచ్ఛతీతి ఖగ. గమ్ ౯ గతౌ. ఆకాశమందుఁ బోవునది.

**పతఙ్గౌ పక్షి సూర్యౌ చ -**

పతంగ శబ్దము పక్షికిని, సూర్యునకును, చకారమువలన మిడుతకును పేరు. పతతీతి పతంగః. పత్ ౯ గతౌ. పోవునది.

**పూగః క్రముక బృన్దయోః,**

పూగశబ్దము పోఁకచెట్టునకును, సమూహమునకును పేరు. పునాతీతి పూగః. పూఞ్ పవనే. పవిత్రముఁ జేయునది గనుక పూగము.

**పశవో ఽ పి మృగాః -**

మృగశబ్దము పసులకును, అపిశబ్ధమువలన లేళ్లకును, మృగశీర్ష నక్షత్రమునకును, ఏనుఁగుజాతి విశేషమునకును, వెదకుటకును పేరు. మృగ్యంత ఇతి మృగాః. మృగ అన్వేషణే. వెదకఁబడునవి.

**వేగః ప్రవాహ జవయో రపి.** 21

వేగశబ్దము ప్రవాహమునకును, వేగిరమునకును, అపి శబ్దమువలన మలమూత్రాది ప్రవృత్తికిని పేరు. విజతి చలతి వేగః. ఓ విజీ భయచలనయోః. కదలునది.

**పరాగః కౌసుమే రేణౌ స్నానీయాదౌ రజస్యపి,**

పరాగశబ్దము పుప్పొడికిని, స్నానసాధనమైన పిండి మొదలైన దానికిని, ధూళికిని పేరు. పరాగచ్ఛతి వాయునేతి పరాగః. గమ్ ౢ గతౌ. గాలి కెగిరిపోవునది గనుక పరాగము.

**గజే ఽ పి నాగ మాతఙ్గా -**

నాగశబ్దము ఏనుఁగునకున, అపిశబ్దమువలన పామునకును, సీసమునకును పేరు. మాతంగశబ్దము ఏనుఁగునకును, అపిశబ్దమువలన చండాలునకును పేరు. నగే భవో నాగః-పర్వమందుఁ బుట్టినది. మతంగాదృషేర్జాతో మాతంగః-మతంగుఁ డను ఋషివలనఁ బుట్టెను గనుక మాతంగము, మాతంగుఁడును.

**అపాఙ్గ స్తిలకే ఽ పి చ.** 22

అపాంగశబ్దము బొట్టునకును, అపిశబ్దమువలన కడకంటికిని పేరు. అపగచ్ఛత్యంగాదిత్యపాంగః - అంగమునుండి జాఱునది. అంగముకొన నుండునది.

**సర్గస్స్వభావ నిర్మోక నిశ్చయాధ్యాయ సృష్టిషు,**

సర్గశబ్దము స్వభావమునకును, విడుచుటకును, నిశ్చయమునకును, కావ్యపరిచ్ఛేదమునకును, నిర్మాణమునకును పేరు. సృజ్యత ఇతి సర్గః. సృజ విసర్గే. సృజింపఁబడునది. టీ. స. అనాగంతుకో ధర్మః స్వభావః. యథా జలస్య శైత్యం; నిర్మోక స్త్యాగః. యథా-బాణనిసర్గః. నిశ్చయో ఽ ధ్యవసాయః. యథా-"గృహాణ శస్త్రం యది సర్గ ఏష తే" అధ్యాయో నామ రామాయణాది కావ్యేషు కథానాం విశ్రాంతి స్థా

నం. యథా – సర్గబంధో మహాకావ్యం' సృష్టి రుత్పాదనం. యథా. "సర్గస్థిత్యంతకారణ" మితి. సృజ విసర్గ ఇతి ధాతోః యథాయథం కర్మణి, కరణే, భావ చ ఘఞ్ సర్గః.

**యోగసన్నహనోపాయ ధ్యాన సంగతి యుక్తిషు.** 23

యోగశబ్దము కవచాదులకును, సామాద్యుపాయములకును, ధ్యానమునకును, కూటమికిని, కూర్చుటకును పేరు. యుజ్యత ఇతి యోగః. యుజిర్ యోగే. కూర్చఁబడునది. టీ. స. మహాకర్మసు సంభృత సంభారస్య తదేకతానత్వం సన్నహనం. యథా – 'సేతుబంధే కృతోద్యోగః', 'సన్నహినం కవచాదిక' మితి కేచిత్. ఉపాయ స్సామ దానాదిః. యథా___ 'తంత్రావాప విదాయోగై ర్మండలా న్యధితిష్ఠతా' ఇతి మాఘః. ధ్యానం చిత్తవృత్తినిరోధః. యథా___ 'యోగేనాంతే తనుత్యజా' మితి కాళిదాసః. సంగతిస్సంశ్లేషః. యథా___ 'రత్నయోగః కాంచనస్య' యుక్తి–ర్యోగ్యతా. యథా 'యోగమితరేషా' మితి. యుజిర్ ధాతోః పూర్వవత్ప్రత్యయః. 'యోగ స్సూత్రే ద్రవ్యలాభే విష్కంభాదౌ చ భేషజే' ఇతి శేషః.

**భోగస్సుఖే స్త్ర్యాదిభృతా వహేశ్చ ఫణకాయయోః,**

భోగశబ్దము సుఖమునకును, స్త్రీలు మొదలయినవారియొక్క పోషణమునకును, పాముపడగకును, ఒడలునకును పేరు. భుజ్యత ఇతి భోగః. భుజ పాలనాభ్యవహారయోః.అనుభవింపఁబడునది. టీ. స. "పణ్య స్త్రీణాం రిరంసుభిర్దేయం ధనాదిమూల్యం స్త్ర్యాదిభృతిః" 'ఆది శబ్దేన స్వకీయ ధాన్యాది ప్రాపణార్థం పరకీయానాం ఘోటకబలీ వర్దాదీనాం అధ్వయోజనానుసారేణ కల్పితం మూల్యం గృహ్యతే.' 'కౌటిల్యే పాలనే ఉపిస్యా దదనే ద్రవిణే ఉపి చ' ఇతి శేషః.

**చాతకే హరిణే పుంసి సారఙ్గ శ్శబలే త్రిషు.** 24

సారంగశబ్దము చాతకపక్షికిని, ఇఱ్ఱికిని పేరైనప్పుడు పు. నానా వర్ణములు గల వస్తువునకు పేరైనపుడు త్రి. సారాణ్యంగాని యస్య సః సారంగః – మంచి యవయవములు గలది. టీ. స. సజాతీయైస్సహ అరం అత్యర్థం గచ్ఛతీతి సారంగ. 'హస్తిభృంగౌ చ సారంగా' వితి శేషః.

**కపౌ చ ప్లవగః.**

ప్లవగశబ్దము కోఁతికిని, చకారమువలన కప్పకును పేరు. ప్లవైర్లం ఘనైర్గచ్ఛతీతి ప్లవగః. గమ్ ౡ గతౌ. దాఁటుచుఁ బోవునది.

**శాపే త్వభిషఙ్గః పరాభవే,**

అభిషంగశబ్దము శాపమునకును, తిరస్కారమునకును పేరు. శాపమనగా నపకారి కనిష్టమును జెప్పుట. లేని యపవాద మని కొందఱు. అభిషజ్యత ఇ త్యభిషంగః. షంజ సాంగే. పొందఁబడునది. "ఆక్రోశేశపథే ఉపి స్యా దభిషంగః పరాభవ" ఇతి రుద్రః.

**యానాద్యఙ్గే యుగః పుంసి యుగం యుగ్మే కృతాదిషు.** 25

యుగశబ్దము కాఁడికిఁ బేరైనపుడు పు. జతకును, కృతత్రేతా ద్వాపర కలియుగములకును పేరైనపుడు న. యుజ్యత ఇతియుగః, యుగం చ. యుజిర్ యోగే. కూర్చఁబడునది. "యుగంహస్త చతుష్కే స్యా దౌషధే వర్షపంచక" ఇతిశేషః.

**స్వర్గేషు పశు వా గ్వజ్ర దిఙ్నేత్ర ఘృణి భూ జలే,**
**లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి గౌః-**

గోశబ్దము స్వర్గమునకు, బాణమునకు, పశువునకు, వాక్కునకును, వజ్రాయుధమునకును, దిక్కునకును, నేత్రమునకును, కిరణమునకును, భూమికిని, నీళ్లకును పేరు. ఈగోశబ్దము లక్ష్యదృష్ట్యా = ప్రయోగానుసారమున, స్త్రియాం = స్త్రీలింగమందును, పుంసి = పులింగమందును వర్తించును. ఎట్లనిన ___ "స్వర్గే వజ్రేచ రశ్మౌచ బలీవర్దేచ గౌః పుమాఙ్ స్త్రీబాణరోహిణీ దృగ్దిగ్వాగ్భూమ్నిచ" అని త్రికాండశేషమందు లింగ నిర్ణయముం జెప్పియున్నాఁడు. గచ్ఛతి గమ్యత ఇతి వా గౌః. గమ్ ౡ గతౌ. పోవునది గనుకనైనను, పొందఁబడునది గనుకనైనను గోవు. ఓకారాంతము.

**లిఙ్గం చిహ్న శేఫసోః.** 26

లింగశబ్దము గుఱుతునకును, శిశ్నమునకు పేరు. లింగ్యతే జ్ఞాయతే అనేనేతి లింగం. లిగి గతౌ. దీనిచేత నెఱుఁగఁబడును. సర్వేగత్యర్థా జ్ఞానార్థాః.

**శృఙ్గం ప్రాధాన్యసాన్వోశ్చ -**

శృంగశబ్దము ప్రభుత్వమునకును, పర్వతశిఖరమునకును, చకా

రముచేత కొమ్మకును, జీవకమనుగంధ ద్రవ్యమునకును పేరు. శృణాతీతి శృంగం. శౄ హింసాయాం. హింసించునది. టీ. స. ప్రాధాన్యేయథా___ 'శృంగం సదృప్త విన యాధికృతః పరేషా మత్యుచ్ఛ్రితం నమమృషే నతుదీర్ఘమాయు' రితి. శృంగశబ్దః పుల్లింగో ఒ వ్యస్తి. తథా చ వైజయంత్యాం___"క్రీడాంబుయంత్రే శంగో ఒస్త్రీ పర్వతాగ్ర ప్రభుత్వయోః, పశ్వంగే" చేతి. కూర్చశీర్షే పుంలింగః ప్రాగుక్తః. మద్గురస్య ప్రియాయాం జీబంత ఉక్తః.

**వరాఙ్గం మూర్ధగుహ్యయోః.**

వరాంగశబ్దము శిరస్సునకును, యోనికిని పేరు. పరంచ తదంగం వరాంగం – శ్రేష్ఠమైన యంగము. 'గుడత్వచివరాంగంస్యాత్ యోనౌమూర్ధ్ని గజే తునా' ఇతి రభసః.

**భగశ్శ్రీ కామమాహాత్మ్య వీర్య యత్నార్క కీర్తిషు.** 27

భగశబ్దము ఐశ్వర్యమునకును, ఇచ్ఛకును, దొడ్డతనమునకును, శక్తికిని, ప్రయత్నమునకును, సూర్యునికిని, కీర్తికిని పేరు. భజ్యత ఇతి భగః. భజసేవాయాం. ఆశ్రయింపఁబడునది. 'భగంశ్రీయోనివీర్యేషు జ్ఞానవైరాగ్యధర్మయో' రితి రభసః. జ్ఞానవైరాగ్యయోర్యోనౌ భగమస్త్రీ రవౌతునా' ఇతి రుద్రః.

## ఘాంత వర్గము

**పరిఘః పరిఘాతే ఒస్త్రే ఒపి -**

పరిఘశబ్దము హింసకును, ఇనుపకట్లగుదియకును, అపిశబ్దముచేత పరిఘయోగమునకును పేరు. పరిహననం, పరిహన్యతే ఒనేనేతి పరిఘః. హన హింసాగత్యోః. హింసించుటయు, హింసించునదియు పరిఘము, 'పరిఘః కాచకలశేఘట్టే ప్రాకాగోపురే, పరిఘాతే యోగభేదే ముద్గరార్గళయో ర' పీతి నానార్థ సంగ్రహః.

**ఓఘో బృన్దే ఒమ్భసాం రయే,**

ఓఘ శబ్దము సముహమునకును, జలవేగమునకును పేరు. వహతి పంరంపరా రూపేణ గచ్ఛతీతి ఓఘః. వహ ప్రాపణే. పరంపరారూపముగాఁ బోవునది.

**మూల్యే పూజావిధా వర్ఘః -**

అర్ఘశబ్దము వెలకును, పూజచేయుటకును పేరు. అర్ఘతీత్యర్ఘః. అర్ఘ పూజాయాం. తగినది. టీ. స. మూల్యే___ మహార్ఘః పట ఇతి.

**అంహో దుఃఖవ్యసనే ష్వఘమ్.** 28

అఘశబ్దము పాపమునకు, దుఃఖమునకు, దూతాది వ్యసనమునకును పేరు. నహంతి ధన్య మిత్యఘం. హన హింసాగత్యోః. ధన్యుఁడైనవానిఁ జెఱచనిది.

**త్రిష్విష్టే ఒ ల్పే లఘుః -**

లఘుశబ్దము ఇష్టమైనదానికిని, చులకనైనదానికిని పేరు. లంఘ్యతే, లంఘతిచ లఘుః. త్రి. లఘి గతౌ. పొందఁబడునది, పోవునదియు గనుక లఘువు. టీ. స. ఇష్టేయథా ___ "దర్శనేన లఘునా. యథాతయోః ప్రీతి మాపు రుభయో స్తపస్విన" ఇతి. అల్పే యథా___ లఘ్వాహార ఇతి. "కృష్ణాగరుణి శ్రీఘ్రుత్వేక్లీబే లఘ్వ గురౌత్రిషు, నిస్సారేచ మనోజ్ఞేచ స్పృక్కాయాం చ లఘుః స్త్రియా" మితి.

## చాంత వర్గము

**కాచా శ్శిక్య మృద్భేద దృగ్రుజః,**

కాచశబ్దము ఉట్టికిని, గాజునకును, కండ్లవ్యాధికిని పేరు. కచ్యతే బధ్యత ఇతి కాచః. కచ దీప్తి బంధనయోః. కట్టఁబడునది.

**విపర్యాసే విస్తరే చ ప్రపఞ్చః -**

ప్రపంచశబ్దము వైపరీత్యమునకును, విరివికిని పేరు. ప్రపంచ్యత ఇతి ప్రపంచః పచ విస్తారే. విస్తరింపఁబడునది, విస్తరించుటగనుక ప్రపంచము.

**పావకే శుచిః.** 29

**మాస్యమాత్యే చాత్యుపధే పుంసి మధ్యే సితే త్రిషు.**

శుచిశబ్దము అగ్నికిని, ఆషాఢమాసమునకు, ధర్మాదిపరీక్షలచేతఁ బరిశుద్ధుఁడైన యమాత్యునకును పేరైనపుడు పు. పవిత్రమైనదానికిని, తెల్లని వస్తువునకును పేరైనపుడు త్రి. శోచంత్యనేనేతి శుచిః. శుచశోకే. దీనిచేత వ్యథనొందుదురు.

**అభిష్వఙ్గే స్పృహాయాం చ గభస్తౌ చ రుచిః స్త్రియామ్.** 30

రుచిశబ్దము అత్యాసక్తికిని, ఇచ్ఛకును, కాంతికిని పేరు. రోచత ఇతి రుచిః. రుచి దీప్తౌ. ప్రకాశించునది. టీ. స. అభిషంగే___ వేదాభ్యాస

రుచిః. స్పృహాయాం___ భిన్నరుచిర్లోకః. గభస్తౌ___ తిగ్మరుచిః. 'ప్రసన్నేభల్లుకే ఽ పృచ్ఛో- గుచ్ఛః స్తబకహారయోః, పరిధానాంచలే కచ్ఛోజలప్రాంతే త్రిలింగక' ఇత్యధిక పాఠః.

టీ. స. అచ్ఛకచ్ఛతుచ్ఛాది శబ్దానాం సద్భావే ఽ పి తేషాం నానార్థే ప్రయోగ ప్రాచుర్యాభావాత్ తానుపేక్ష్య జాంతానాహ.

## జాంత వర్గము

**కేకి తార్క్ష్యా వహిభుజౌ -**

అహిభుక్ఛశబ్దము నెమలికిని, గరుత్మంతునకును పేరు. అహీ౯ భుఙ్క్తే అహిభుక్. జ. పు. భుజ పాలనాభ్య వహారయోః. పాములఁ దినునది.

**దన్తవిప్రాణ్డజా ద్విజాః,**

ద్విజశబ్దము దంతమునకును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును, పక్షి సర్పాదులకును పేరు. విప్రశబ్దము ఉపలక్షణార్థము. ద్విర్జాయంత ఇతి ద్విజాః. జనీ ప్రాదుర్భావే. రెండుసారులు పుట్టునవి; రెండుసారులు పుట్టువారు.

**అజా విష్ణు హర చ్ఛాగాః -**

అజశబ్దము విష్ణువునకు, శివునికిని, మేఁకకును పేరు. న జాయతే, అజతీతి చ అజః. జనీ ప్రాదుర్భావే; అజగతౌ. పుట్టుకలేనివాఁడును, పోవునదియు అజుడు, అజమును. "విధీశ విష్ణుకామేషు పుం స్యజః ప్రకృతౌ స్త్రియా" మితి నానార్థసంగ్రహః రఘుపుత్రే ఽ పి.

**గో ష్ఠాధ్వ నివహా వ్రజాః.** 31

వ్రజశబ్దము పసులమందకు, తెరువునకు, సమూహమునకు పేరు. వ్రజం త్యస్మిన్నితి వ్రజః. వ్రజ గతౌ. దీనియందుఁ బోవుదురు.

**ధర్మరాజౌ జినయమౌ -**

ధర్మ రాజశబ్దము బుద్ధదేవతకును, యమునికిని, యుధిష్ఠిరునకును పేరు. ధర్మస్య రాజా ధర్మరాజః–ధర్మమునకు రాజు.

**కుఞ్జో దన్తే ఽ పిన స్త్రియామ్,**

కుంజశబ్దము ఏనుఁగు కొమ్మునకును, అపిశబ్దముచేత పొదరింటికిని పేరు. కౌ జాయత ఇతి కుఞ్జః – భూమియందు మొలచునది. కేచిత్తు కుంజం త్యనేన, అస్మిన్నితి కుంజః. కుంజ శబ్దే. దీనిచేతను, దీనియందును

మ్రోయుదురు. టీ. స. కుంజ త్యావృణోతి స్వస్థానమితి కుంజః. కుజిర్లౌకికో ఉ ధాతు రావరణార్థః.

**వలజే క్షేత్ర పూర్ద్వారే వలజా వల్గుదర్శనా.** 32

వలజశబ్దము క్షేత్రమునకును, పట్టణపువాకిలికిని పేరైనపుడు న. మంచి చూపుగల స్త్రీకి పేరైనపుడు సీ. వలేన సంచలనేన జాయత ఇతి వలజం, వలజా చ. జనీ ప్రాదుర్భావే. సంచలనముచేత నగునది వలజము, వలజయును. "వలజం గోపురే క్షేత్రే సస్యసంగతయోరపి, వలజా పరయోషాయాం వసుమత్యామపి స్మృ" తేతి విశ్వప్రకాశః. 'వలజం ధాన్యరాశౌ స్యా' దితి వైజయంతీ. ధాన్యరాశౌ మాఘప్రయోగః___ "కర్షకేణవలజం పుపూషతా" ఇతి.

**సమక్ష్మాం శే రణే ఉ ప్యాజిః -**

ఆజిశబ్దము చదరమైన నేలకును, యుద్ధమునకును, అపిశబ్దమువలన క్షణరూపమైన కాలమునకును పేరు. అజంత్యత్రే త్యాజిః. పు. అజగతి క్షేపణయోః. దీనియందు సంచరింతురు. 'యుద్భూభాగక్షణేష్వాజి' రితి.

**ప్రజా స్యా త్సంతతౌ జనే,**

ప్రజాశబ్దము సంతానమునకును, జనులకును పేరు. ప్రజాయత ఇతి ప్రజా. జనీ ప్రాదుర్భావే పుట్టునది. టీ. స. సంతతౌ యథా___ "ప్రజయా హి మనుష్య ఇత్యసా" వితి చంపూభారతే. జనేయథా___ "అథప్రజానా మధిపః ప్రభాత" ఇతి రఘువంశే.

**అబ్జౌ శఙ్ఖ శశాఙ్కౌ చ -**

అబ్జశబ్దము శంఖమునకును, చంద్రునికిని, చకారమువలన తామరకును, ధన్వంతరికిని పేరు. అద్భ్యః జాయత ఇత్యబ్జః, అబ్జం చ. జనీ ప్రాదుర్భావే. నీళ్ల వలనఁ బుట్టునది. "శంఖే ధన్వంతరౌ చంద్రే పుం స్యబ్జః క్లీబమంబుజ" ఇతి నానార్థ సంగ్రహః.

**స్వకే నిత్యే నిజం త్రిషు.** 33

నిజశబ్దము తన వస్తువునకును, నిత్యమైనదానికిని పేరు. నియతంజాయత ఇతి నిజం. జనీ ప్రాదుర్భావే. నియతముగా నగునది. టీ. స. ఝాన్తానాం క్లిష్టకల్ప్యతయా తా నుపేక్ష్య ఞాంతానాహ.

## ఞాంత వర్గము

**పుం స్యాత్మని ప్రవీణే చ క్షేత్రజ్ఞో వాచ్యలిఙ్గకః,**

క్షేత్రజ్ఞ శబ్దము ఆత్మకు పేరైనపుడు పు. నేర్పరికి పేరైనపుడు త్రి. ఆత్మపక్షే ___ క్షేత్రం శరీరం స్వభోగసాధనత్వేన జానాతీతి క్షేత్రజ్ఞః. జ్ఞా అవబోధనే. శరీరమును తనకు భోగసాధనముగా నెఱుఁగువాఁడు. నిపుణపక్షే___ క్షేత్రం స్థాన విశేషం జానాతీతి క్షేత్రజ్ఞః. స్థాన విశేషము నెఱుఁగువాఁడు ('సర్వజ్ఞస్సు గతేభానౌ కాలజ్ఞౌజ్ఞానికుక్కుటా' విత్యధికపాఠః).

**సంజ్ఞా స్యా చ్చేతనా నామ హస్తాద్యై శ్చార్థ సూచనా.** 34

సంజ్ఞాశబ్దము బుద్ధికిని, పేరునకును, హస్తాదులచేత నర్థమును సూచించుటకును పేరు. సమ్యక్ జ్ఞానం జ్ఞాయతే అనయేతిచ సంజ్ఞా – లెస్సగా నెఱుఁగుటయును. దీనిచేత లెస్సగా నెఱుఁగఁబడును. గనుకు సంజ్ఞ. "సంజ్ఞా స్యా ద్భానుభార్యాయాం గాయత్ర్యాం చైవ నామని, చేతనాయాంచ హస్తాద్యై స్సూచనాయాం చ వస్తునః" ఇతి నానార్థసంగ్రహః. ('దోషజ్ఞౌ వైద్యవిద్వాంసౌ జ్ఞో విద్వాన్ సోమజో ఽపిచే' త్యధికపాఠః).

## టాంత వర్గము

**కాకే భగణ్డౌ కరటౌ -**

కరటశబ్దము కాకికిని, ఏనుఁగు గండస్థలమునకును పేరు. కేతి రటతి కరోతి మదమితిచ కరటః. రట పరిభాషణే. కా యని కూయునదియును, మదజలమును జేయునదియును గనుక కరటము. "కరటో వాద్యభేదేస్యాత్ కుసుంభకరిగండయో, ఏకాదశే చ శ్రాద్ధే వాయసే నింద్యజీవన" ఇతి ప్రతాపః.

**గజగణ్డ కటీ కటౌ,**

కటశబ్దము ఏనుఁగుచెక్కిలికిని, మొలకును పేరు. కటతి కట్యత ఇతి చ కటః. కటే వర్షావరణయోః. మదజలమును గురియునది. కప్పఁబడునది గనుక కటము. "కటో ఽతిరేక శవయోః క్రియాకారి శ్మశానయోః, కిలింజే సమయే నస్త్రీ కటిః శ్రోణ్యాం కటీ చ సే" తి శేషః.

**శిపివిష్టస్తు ఖలతౌ దుశ్చర్మణి మహేశ్వరే.** 35

శిపివిష్టశబ్దము బట్టతలవానికి, పులుముపట్టినవానికి, శివునకును పేరు. శిపో చర్మణివిష్టం దోషవ్యాప్తిరస్యేతి శిపిషు పశుషు విష్టోవ్యాప్త ఇతి

చ శిపివిష్టః–చర్మమందు దోషవ్యాప్తిగలవాఁడుగనుకను, పశువులయందు వ్యాపించినవాఁడు గనుకను శిపివిష్టుఁడు. "శిపివిష్టాస్తు దుశ్చర్మఖల్వాట హరిశంకరా" ఇతి నానార్థసంగ్రహః. టీ.స. మహేశ్వరే యథా___ పశవశ్శిపిరితి దర్శనాత్ శిపిశబ్దేన పశవ ఉచ్యంతే తైర్విష్టో వ్యాప్తస్సేవితః తత్పతిరితి యావత్. తదుక్తం స్కాందే ___ "ఆత్మానః పశవః ప్రోక్తాః సర్వే సంసారవర్తినః, తేషాం పతిత్వాద్విశ్వేశో భవః పశుపతిః స్మృత" ఇతి. విష్ణౌ యథా___ శిపయో రశ్మయః తైర్విష్టో వ్యాప్త ఇతి శిపివిష్టో విష్ణు రితి సహస్రనామభాష్యే వ్యాఖ్యాతమ్.

**దేవశిల్పిన్యపి త్వష్టా -**

త్వష్టృశబ్దము విశ్వకర్మకును, అపిశబ్దమువలన వడ్లవానికిని పేరు. త్వక్షతి త్వష్టా. ఋ. పు. త్వక్షూ తనూకరణే. చెక్కువాఁడు.

**దిష్టం దైవే ఽపి న ద్వయోః,**

దిష్టశబ్దము పురాకృతకర్మమునకు పేరైనపుడు న. అపిశబ్దము వలన కాలమునకు పేరైనపుడు పు. దిశతి శుభాశుభ ఫలమితి దిష్టం. దిశ అతిసర్జనే. శుభాశుభఫలముల నిచ్చునది.

**రసే కటుః కట్వకార్యే త్రిషు మత్సర తీక్ష్ణయోః.** 36

కటుశబ్దము కారమునకు పేరైనపుడు పు. చేయరానిదానికి పేరైనపుడు న. మచ్చరము గలవానికిని, తీక్ష్ణమైన వస్తువునకును పేరైనపుడు త్రి. కటతి వర్షతి దుఃఖమితి, కటత్యావృణోతి పరోత్కర్షమితి చ కటుః. కటేవర్షావరణయోః. దుఃఖమును గలుగఁజేయునది గనుకను పరోత్కర్షము నావరించునది గనుకను కటువు. 'అకార్యాప్రియయోః కటు' రితివోపాలితః 'క్షవేప్రియంగౌ రోహిణ్యాం స్త్రియాం గంధే పుమాన్ కటు' రితి శేషః.

**రిష్టం క్షేమా శుభాభావేషు -**

రిష్టశబ్దము క్షేమమునకును, అశుభమునకును, వినాశమునకును పేరు. రిషతి అశుభాని, శుభాని చేతి రిష్టం. రిష హింసాయాం. అశుభములను శభములను జెఱుచునది.

**అరిష్టే తు శుభాశుభే,**

అరిష్టశబ్దము శుభమునకును, అశుభమునకును పేరు. న విద్య

తే రిష్ట మశుభం, శుభం చాత్రే త్యరిష్టం–దీనియందు శుభమును అశుభమును లేదు గనుక అరిష్టము. 'క్లీబం శుభే ఽశుభేతక్రే సూత్యగా రాంతచిహ్నయోః, అరిష్టోఽపిశునే నాకే నింబఫేనిలయో ర' పీతి రభసః. అంతచిహ్నం = మరణచిహ్నం.

**మాయా నిశ్చల యన్త్రేషు కైత వానృతరాశిషు.** 37

**అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గేకూట మస్త్రియామ్,** 38

కూటశబ్దము ఇంద్రజాలము మొదలైన మాయకును, కదలని యాకాశాదులకును, మృగాదులను హింసించు నురులు మొదలైనవానికిని, కపటమునకును, బొంకునకును, రాశికిని, సమ్మెటకును, పర్వతశిఖరమునకును, నాఁగేటికఱ్ఱుకును పేరు. యంత్ర + ఇషు అని విడఁదీసి ప్రత్యేకముగా బాణమునకును పేరని కొందఱు. కూటయతికూట్యత ఇతిచ కూటం. ష్న. కూట పరిదాహే. కాల్చునదిగనుకను, కాల్పఁబడునదిగనుకను కూటము.

**సూక్ష్మైలాయాం త్రుటిః స్త్రీ స్యాత్కాలే ఽల్పే సంశయే ఽపి సా.**

త్రుటిశబ్దము సన్నయేలకులకును, అల్పకాలమునకును, సందేహమునకును పేరు. కొందఱు అల్పే యని విడఁదీసి లేశమునకును, త్రుటి శబ్దము వేరని చెప్పుదురు. సంశయ మనఁగా మరణసంశయ మని కొందఱు. త్రుట్యతీతి త్రుటిః సీ. త్రుటీ చ్ఛేదనే. నశించునది. 'త్రుటిః స్త్రీసంశయే లేశే సూక్ష్మైలాకాలభేదయోః'.

**అత్యుత్కర్షాశ్రయః కోట్యః -**

కోటిశబ్దము వింటికొప్పునకు, ఉత్కర్షమునకు, అంచునకును పేరు. కుటతీతి కోటిః సీ. కుట కౌటిల్యే. వక్రమై యుండునది.

**మూలే లగ్నకచే జటా,**

జటాశబ్దము ఊడకు, జడకును పేరు. జటతీతి జటా. జట సంఘాతే. గుంపై యుండునది.

**వ్యుష్టిః ఫలే సమృద్ధౌ చ -**

వ్యుష్టిశబ్దము ప్రయోజనమునకు, సమృద్ధికిని పేరు. విగతాఽఉష్టిః వ్యథా అస్యా ఇతి వ్యుష్టిః. ఉష దాహే. వ్యథలేనిది. టీ. స. ఫలే యథా___ 'తస్యైవ తపసో వ్యుష్ట్యాప్రసాదాచ్చ స్వయంభువః, నాసురేభ్యో న దేవేభ్యో భయం మమ కదాచ' నేతి. చకారాత్ స్తోత్రే ఽపీతి స్వామీ.

**దృష్టి ర్జ్ఞానే ఽక్ష్ణి దర్శనే.** 39

దష్టిశబ్దము జ్ఞానమునకును, కంటికిని, చూపునకును పేరు. దృశ్యతే అనయా దర్శనం చేతి దృష్టిః. సీ. దృశిర్ ప్రేక్షణే. దీనిచేత చూడఁబడును గనుకను, చూచుట గనుకను దృష్టి.

**ఇష్టి ర్యాగేచ్ఛయోః -**

ఇష్టిశబ్దము యాగమునకును ఇచ్ఛకును పేరు. ఇజ్యత ఇతి ఇచ్ఛాచ ఇష్టిః. సీ. యజ దేవపూజాసంగతికరణదానేషు. ఇషు ఇచ్ఛాయాం. యజించుటయును, ఇచ్ఛయించుటయు గనుక ఇష్టి.

**సృష్టం నిశ్చితే బహులే త్రిషు,**

సృష్టశబ్దము నిశ్చయింపఁబడినదానికిని, బహుళమైన దానికిని పేరు. సృజ్యతే స్మ సృష్టం. పా. సృష్టిః. త్రి. సృజ విసర్గే. సృజింపఁబడునది. "సృష్టంతు నిశ్చితే ప్రాజ్యే ముక్తనిర్మితయోస్త్రి" ష్వితి రుద్రః.

**కష్టే తు కృచ్ఛ్రగహనే -**

కష్టశబ్దము క్లేశమునకును, చొరరానిదానికిని పేరు. కషతీతి కష్టం. కష హింసాయాం. హింసించునది. టీ. స. కషిష్యతి పీడయతీతి కష్టం. కష్టం భవిష్యతీత్యాహురితి మహాభాష్యకారేణ భవిష్యదర్థేక్త ప్రత్యయాంత శబ్దప్రయోగాత్ భవిష్యదర్థే క్త ప్రత్యయః.

**దక్షామన్దాగదేషు తు.** 40

**పటు ర్ద్వౌ వాచ్యలిఙ్గౌ చ -**

పటుశబ్దము నేర్పరికిని, దిట్టయైనవానికిని, రోగములేనివానికిని పేరు. కష్టపటుశబ్దములు ౨ ను త్రిలింగములు. పాటయతి జాడ్యాదికమితి పటుః. త్రి. పటు గతౌ. జాడ్యాదులను బాపుకొనువాఁడు.

## ఠాంతములు

**నీలకణ్ఠశ్శివే ఽపి చ,**

నీలకంఠశబ్దము శివునికిని, అపిశబ్దమువలన నెమిలికిని పేరు. నీలః కంఠో యస్య నీలకంఠః – నల్లనిమెడ గలవాఁడు.

**పుంసి కోష్ఠో ఽన్తర్జఠరం కుసూలో ఽన్తర్గృహం తథా.** 41

కోష్ఠ శబ్దములోని కడుపునకును, గాదెకును, లోపలియింటికిని

పేరు. కుష్యతే ఽస్మిన్ని తికోష్ఠః. కుషనిష్కర్షే. దీనియందుఁ గూర్చఁబడును.

**నిష్ఠా నిష్పత్తి నాశాన్తాః -**

నిష్ఠాశబ్దము కార్యమౌటకును, కానరాకుండుటకును, చెడుటకును పేరు. నియతా స్థితి ర్నిష్ఠా. ష్ఠా గతినివృత్తౌ. నియతమైన స్థితి.

**కా ష్ఠోత్కర్షే స్థితౌ దిశి,**

కాష్ఠాశబ్దము ఉత్కర్షకును, మర్యాదకును, దిక్కునకును పేరు. కాశత ఇతి కాష్ఠా. కాశృదీప్తౌ. ప్రకాశించునది.

**త్రిషు జ్యేష్ఠో ఽ తిశస్తే ఽ పి-**

జ్యేష్ఠశబ్దము మిక్కిలి శ్రేష్ఠమైనదానికిని, అపిశబ్దమువలన తోడఁబుట్టిన యన్నకును, వృద్ధునకును పేరు. అతిశయేన ప్రశస్యః వృద్ధశ్చ జ్యేష్ఠః–మిక్కిలి పొగడఁదగినవాఁడును మిక్కిలి వృద్ధుఁడును గనుక జ్యేష్ఠుఁడు. 'జ్యేష్ఠో ఽగ్రజే స్త్రియాం జ్యేష్ఠో దేవీ నక్షత్ర భేదయో'రితి శేషః.

**కనిష్ఠో ఽ తియువాల్పయోః.** 42

కనిష్ఠశబ్దము మిక్కిలి కొంచెమైన వయస్సు గలవానికిని, అల్పుఁడైనవానికిని పేరు. అతిశయేన యువా, అల్పశ్చ కనిష్ఠః – మిక్కిలి కొంచెవు వయస్సు గలవాడు, మిక్కిలి అల్పుఁడును గనుక కనిష్ఠుఁడు.

## డాంతములు

**దణ్డో ఽస్త్రీ లగుడే ఽ పి స్యాత్ -**

దండశబ్దము దుడ్డుకోలకు, అపిశబ్దమువలన సూర్యపార్శ్వవర్తికిని, చతుర్థోపాయమునకును, కప్పమునకును, ఆజ్ఞకును పేరు. దమ్యతే అనేనేతి దండః. దము ఉపశమే. దీనిచేత శిక్షింపఁబడును. 'దండస్తు మానభేదే స్యా త్సైన్యో పాదయమేషు' చేతి శేషః. 'దండోలగు డమంథాన సైన్యోపాయదమేషు చ, వ్యూహభేదే మాన శేదే చండాంశోః పారిపార్శ్వికః' ఇతి ధరణిః.

**గుడో గో ళేక్షుపాకయోః,**

గుడశబ్దము మృత్తికాదులచేతఁ జేయఁబడినయుంటకును, బెల్లమునకును పేరు. గుడతీతి గుడః. గుడ రక్షాయాం. రక్షించునది. "గుడస్స్యాద్గోళకే హస్తేసన్నా హేక్షు వికారయో" రితి విశ్వప్రకాశః.

**సర్ప మాంసాత్పశూ వ్యాడౌ -**

వ్యాడశబ్దము పామునకును, మాంసముఁ దిను క్రూరమృగమునకును పేరు. విశేషేణ అడతి ప్రాణివధార్థ మద్యుఙ్క్తే ఇతి వ్యాడః. ఆడ ఉద్యమనే. ప్రాణివధకొఱకు మిగుల నుద్యోగించునది.

**గో భూ వాచ స్త్విడా ఇళాః.** 43

ఇడా ఇళా శబ్దములు భూమికిని, ఆవునకును, వాక్కునకును పేరు. ఇలంతి స్వపంత్యత్రేతి ఇడా భూః–దీనియందు నిద్రింతురు. ఇల్యతే క్షిప్యతే ఇడా, ఇలాచ. ఇల స్వప్న క్షేపణయోః ప్రేరేపింపఁబడునది గనుక ఇడ, ఇలయును. ఇళాశబ్దో బుధభార్యాయామపి. యస్యాఃపుత్రః పురూరవాః. "ఊర్వశిసంభవ స్యాయమైళ సూనోర్ధనుర్భృత" ఇతి విక్రమోర్వశీయే.

**క్ష్వేడా వంశశలాకాపి -**

క్ష్వేడాశబ్దము వెదురుచివ్వకును, అపిశబ్దమువలన సింహనాదమునకును పేరు. క్ష్వేడతి క్ష్వేడనం చ క్ష్వేడా. క్ష్వేద అవ్యక్తే శబ్దే. మ్రోయునదియు, మ్రోయుటయు క్ష్వేడ. "దంతోష్టవాద్యే క్ష్వేడా స్త్రీ పుంసి కర్ణమలే" ఇది శేషః.

**నాడీ కాలే ఽ పి షట్ క్షణే,**

నాడీశబ్దము ఆఱుక్షణములు గల కాలమునకును, అపిశబ్దమువలన క్రోవినరములకును, కూరకాఁడ మొదలయినవానికిని పేరు. ఆఱుక్షణములనగా నొక్కగడియ. నళతీతి నాడీ. సీ. నళ గతౌ. పోవునది.

**కాణ్డో ఽ స్త్రీ దణ్డ బా ణార్వ వర్గావసరవారిషు.** 44

కాండశబ్దము కోలకును, అమ్మునకును, కుత్సితునికిని, కావ్యములయందలి పరిచ్ఛేదమునకును, అవసరమునకును, ఉదకమునకును పేరు. వర్గ మనఁగా సమూహమని కొందఱు. కామ్యత ఇతి కాండః. అ. ప్న. కము కాంతౌ. కోరఁబడునది. టీ. స. దండే యథా___ కదళీకాండః. బాణే___ కాండై రపాతయ దధః కరిమండలానా' మితి చంపూ భారతే. 'అర్వా కుత్సిత' ఇతి సుబోధినీకారాదయః. వర్గే ___ సప్తకాండం రామాయణం. అవసరే ___ అకాండే తాండవం. వారిణి ___ రామాయణ కథేవ వివిక్తకాండశర దితి నళచరితే శ్లేషార్థే.

**స్యాద్భాణ్డ మశ్వాభరణే ఽ మత్రే మూలవణిగ్ధనే,**

భాండశబ్దము గుఱ్ఱముల సొమ్మునకు పాత్రమునకును, వర్తకుని

చేత లాభము కొఱకై ఉంచఁబడిన మూలధనమునకును పేరు. భండయతీతి భాండం. భడి కల్యాణే. శుభమును జేయునది. కొందఱు అమత్రే అనుచోట మంత్రే అని చెప్పి, 'ప్రకీర్ణభాండ మనపేక్ష్య కారిణి' అను ప్రయోగమును జూపిరి. మూలవణిగ్ధనే యథా___ "కరీషు తత్రత్యమఫల్గుభాండం సాంయాత్రికా నాపతతో ఽ భ్యనంద"దితి మాఘః.

## ఢాంతములు

**భృశప్రతిజ్ఞయోర్బాఢమ్ -**

బాఢశబ్దము మిక్కిలి యనుటకును, అంగీకారమునకును పేరు. బాహత ఇతి బాఢం. త్రి. బాహృ ప్రయత్నే. యత్నముచేయునది.

**ప్రగాఢం భృశకృచ్ఛ్రయోః.** 45

ప్రగాఢ శబ్దము మిక్కిలి యనుటకును, దుఃఖమునకును పేరు. చొరరానిదానికిని పేరని కొందఱు. ప్రగాహత ఇతి ప్రగాఢం. త్రి. గాహూ విలోడనే. కలఁచునది.

**శక్తిస్థూలౌ త్రిషు దృఢౌ -**

దృఢశబ్దము లావు గలవానికిని, బలిసినవానికిని పేరు. దృహతీతి దృఢః. దృహ వృద్ధౌ. వృద్ధిఁబొందినవాఁడు.

**వ్యూఢౌ విన్యస్త సంహతౌ,**

వ్యూఢ శబ్దము రచనావిశేషముచేత నుంచఁబడిన సేనా విశేషమునకును, దట్టమైనదానికిని పేరు. విశేషేణ ఊహ్యత ఇతి వ్యూఢః. వహప్రాపణే. విశేషముగా వహింపఁబడునది. 'వ్యూఢస్తు పృథులేత్రి' ష్వితిశేషః.

## ణాంతములు

**భ్రూణో ఽ ర్భకేస్త్రైణగర్భే -**

భ్రూణశబ్దము పిన్నవానికిని, స్త్రీలగర్భమునకు పేరు. భ్రూణయతి ఇచ్ఛతీతి భ్రూణః. భ్రూణ ఆశాయాం. ఇచ్ఛయించునది.

**బాణో బలిసుతే శరే.** 46

బాణశబ్దము బాణాసురునికిని, అమ్మునకును పేరు. వణతీతిబాణః. వణ క్వణ శబ్దే. వబయోరభేదః. మ్రోయును గనుక బాణము, బాణుఁడు.

**కణో ఽ తిసూక్ష్మే ధాన్యాంశే -**

కణశబ్దము కొంచెమైనదానికిని, నూకలకును పేరు. కణతీతి కణః. కణ శబ్దే. మ్రోయునది.

**సంఘాతే ప్రమథే గణః,**

గణశబ్దము సమూహమునకు ప్రమథులకును పేరు. గణ్యత ఇతి గణః. గణ సంఖ్యానే. లెక్క పెట్టఁబడునది.

**పణో ద్యూతాది ఘూత్సృష్టే భృతౌ మూల్యే ధనే ఽపి చ.** 47

పణశబ్దము జూదము, కోడిపందెము మొదలైనవానియందు నొడ్డు పందెమునకును, కూలికిని, వెలకును, ధనమునకును, అపిశబ్దమువలన కర్షమెత్తు రాగికిని ముద్రకును పేరు. కర్షమనగా ముప్పదిరెండు గురిగింజలయెత్తు. పణ్యతే వ్యవహ్రియత ఇతి పణః. పణవ్యవహారే స్తుతౌ చ. వ్యవహరింపఁబడునది.

**మౌర్వ్యాం ద్రవ్యాశ్రితే సత్వ శుక్ల సంధ్యాదికే గుణః,**

గుణశబ్దము వింటినారికిని, ద్రవ్యాశ్రితములయిన రూపరసాదులకును, త్యాగశౌర్యాదులకును సత్వరజస్తమస్సులకును, శుక్లనీల పీతాదులకును, సంధి విగ్రహ యానాదులకును పేరు. గుణ్యతితి గుణః. గుణ అభ్యాసే. అభ్యసింపఁ బడునది. "గుణో ఽభ్యాస ప్రధానయో" రితి శేషః. ఔదనికే రజ్జ్వాదిషు ప్రా గుక్తః.

**నిర్వ్యాపారస్థితౌ కాలవిశేషోత్సవయోః క్షణః.** 48

క్షణశబ్దము వ్యాపారములేక యూరకుండుటకును, గడియలో నాఱవ భాగమైన కాలవిశేషమునకును, ఉత్సవమునకును  పేరు. క్షణోతి దుఃఖమితి క్షణః. క్షణ హింసాయాం. దుఃఖమును బోఁగొట్టునది. టీ. స. కుత్రచిత్కర్మణ్యే కతానత్వం నిర్వ్యాపారస్థితిః.

**వర్ణో ద్విజాదౌ శుక్లాదౌ స్తుతౌ వర్ణం తు వాక్షరే,**

వర్ణశబ్దము బ్రహ్మక్షత్ర వైశ్యశూద్ర జాతులకును, తెలుపు నలుపు మొదలైన వన్నెలకును, స్తోత్రమునకును పేరైనపుడు పు. అక్షరమునకు పేరైనపుడు ప్న. వర్ణ్యతే, వర్ణయతి వర్ణం. వర్ణ స్తుతౌ. కొనియాడఁ బడునది, కొనియాడునది గనుక వర్ణము. "వర్ణస్తాల విశేషేస్యాద్ బ్రహ్మచర్యే విశేషణే, విలేపనే కుధాయాం" చేతి శేషః.

**అరుణో భాస్కరే ఽపి స్యా ద్వర్ణభేదే ఽపి చ త్రిషు.** 49

అరుణశబ్దము సూర్యునకును, అపిశబ్దమువలన అనూరునికిని పేరైన పుడు పు. ఎఱుపునకు పేరైనపుడు త్రి. ఇయర్తీ త్యరుణః. ఋ గతౌ. పోవునది గనుక అరుణుఁడు, అరుణము. "అరుణః కపిలేకుష్ఠే సంధ్యారాగే ఽ ర్కసారథౌ, అవ్యక్తరాగే నిశ్శబ్దే ద్రవ్యే త్రిషు నిరూపిత" ఇతి ప్రతాపః.

**స్థాణు శ్శర్వే ఽ పి చ-**

స్థాణుశబ్దము శివునకును, అపిశబ్దమువలన మొద్దునకును పేరు. తిష్ఠతీతి స్థాణుః. పు. ష్ఠా గతి నివృత్తౌ. స్థిరమైయుండునది.

**ద్రోణః కాకే ఽ పి చ-**

ద్రోణశబ్దము నల్లకాకికిని, అపిశబ్దమువలన నలుతుమునకును పేరు. ద్రవతీతి ద్రోణః. ద్రు గతౌ. పోవునది. "ద్రోణః కృపీపతౌ కృష్ణవాయసే పర్వతే ఽ పి చ, ఆఢకానాం చతుష్కే ఽ పి ద్రోణస్స్యా న్నీ వృదంతరే, ద్రోణకాష్ఠాంబు వాహిన్యాం గవాంఘాసపరిస్థిలే" ఇతి విశ్వప్రకాశః.

**రవే రణః,**

రణశబ్దము ధ్వనికిని, వెనుకనుండి సంబంధించిన యపిశబ్దమువలన యుద్ధమునకును పేరు. రణనం, రణతీతి చ రణః. రణ శబ్దే. మ్రోయుట, మ్రోయునదియుఁ గనుక రణము. "రణఃకోణక్వణాదిషు" ఇతి విశ్వప్రకాశః.

**గ్రామణీ ర్నాపితే పుంసి శ్రేష్ఠే గ్రామాధిపే త్రిషు.** 50

గ్రామణీశబ్దము మంగలవానికి పేరైనపుడు పు. శ్రేష్ఠునికిని, గ్రామాధిపతికిని పేరైనప్పుడు త్రి. గ్రామం స్వవశం నయతీతి గ్రామణీః. ఈ. పు. గ్రామమును తన వశము చేసికొనువాఁడు.

**ఊర్ణా మేషాదిలోమ్ని స్యా దావర్తే చాన్తరా భ్రువౌ,**

ఊర్ణాశబ్దము గొఱ్ఱె కుందేలు ఎలుక మొదలయినవాని రోమములకును, కనుబొమ్మలనడుమనుండు మహాపురుషలక్షణమైన సుడికిని పేరు. ఊర్ణోతీ త్యూర్ణా. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే. కప్పియుండునది.

**హరిణీ స్యా న్మృగీ హేమప్రతిమా హరితా చ యా.** 51

హరిణీశబ్దము లేడికిని, బంగారు ప్రతిమకును, పచ్చవన్నె గలదానికిని పేరు. హరతి మన ఇతి హరిణీ. స్త్రీ. హృఞ్ హరణే. మనస్సును హరిం

చునది. “హరిణీవృత్తభేదే ఽ పి యూథికాసురయోషితో” రితి శేషః.

**త్రిషు పాణ్డౌ చ హరిణః-**

హరిణశబ్దము తెలుపు పసుపులు గూడిన వస్తువునకు పేరైనపుడు త్రి. చకారమువలన ఇఱ్ఱికి పేరైనపుడు పు. హరతి మన ఇతి హరిణః–మనస్సును హరించునది.

**స్థూణా స్తమ్భే ఽ పి వేశ్మనః,**

స్థూణాశబ్దము ఇంటికంబమునకును, అపిశబ్దమువలన లోహ ప్రతిమకును పేరు. చిరం తిష్ఠతీతి స్థూణా. ష్ఠా గతి నివృత్తౌ. చాలాకాలముండునది.

**తృష్ణే స్పృహా పిపాసే ద్వే-**

తృష్ణాశబ్దము ఆశకును, దప్పికిని పేరు. తర్షణం తృష్ణా. తృష పిపాసాయామ్. పానముచేయు కోరిక.

**జుగుప్సా కృణే ఘృణే.** 52

ఘృణాశబ్దము రోఁతకు, దయకును పేరు. జిఘర్తి క్షరతి మనో ఽ నయేతి ఘృణా. ఘృ క్షరణదీప్త్యోః. దీనిచేత మనస్సు కరఁగును.

**వణిక్పథే చ విపణిః -**

విపణి శబ్దము అంగడివీథికిని, చకారముచేత అంగడికిని పేరు. విపణ్యతే ఽ త్రేతి విపణిః. స్త్రీ. దీనియందు వ్యవహరింపఁబడును. “ఆపణే పణ్యవీథ్యాం చ పణ్యే చ విపణిః స్త్రియా” మితి రుద్రః.

**సురా ప్రత్యక్చ వారుణీ,**

వారుణీశబ్దము మద్యమునకును, పడమటిదిక్కునకును పేరు. వరుణా జ్జాతా, వరుణస్యేయ మితి చ వారుణీ. స్త్రీ. వరుణునివలనఁ బుట్టినది. వరుణుని సంబంధమయినది గనుక వారుణి.

**కరేణు రిభ్యాం స్త్రీ నేభే -**

కరేణుశబ్దము ఆఁడు ఏనుఁగునకు పేరైనపుడు స్త్రీ. మగయేనుఁగునకు పేరైనపుడు పు. కే మూర్ధ్ని రేణరస్యేతి కరేణుః – తల మీఁద ధూళి గలిగినది. “మాద్ర్యా కరేణురివ సాక మసౌ కరేణ్వా గూఢం యయౌ కురవకద్రులతా నికుంజమ్” ఇతి చంపూభారతే.

**ద్రవిణం తు బలం ధనమ్.** 53

ద్రవిణశబ్దము బలిమికిని, ధనమునకును పేరు. ద్రవంత్యసేన, ద్రవతీతి చ ద్రవిణం. ద్రు గతౌ. దీనిచేత యుద్ధాదులకుఁ బోవుదురు గనుకను, కరఁగునది గనుకను ద్రవిణము.

**శరణం గృహరక్షిత్రోః -**

శరణశబ్దము ఇంటికిని, రక్షించువానికిని పేరు. శీర్యతే శృణాతి దుఃఖాదికమితి శరణం. శౄ హింసాయాం. నశించునది. దుఃఖాదులను జెఱుచువాఁడును గనుక శరణము. "ప్రతిశరణమశీర్ణ జ్యోతిరగ్న్యాహితానా" మితి గృహే ప్రయోగః. 'శరణం తరుణేందుశేఖర' ఇతి రక్షకే ప్రయోగః. "శరణం రక్షణే వధ" ఇతి విశ్వప్రకాశః.

**శ్రీపర్ణం కమలే ఽపి చ,**

శ్రీపర్ణశబ్దము తామరపువ్వునకును, అపిశబ్దమువలన నెల్లి చెట్టునకును పేరు. శ్రీయుక్తాని పర్ణాన్యస్యేతి శ్రీపర్ణం-ఒప్పిదము గల పర్ణములు గలిగినది.

**విషాభిమరలోహేషు తీక్ష్ణం క్లీబే ఖరే త్రిషు.** 54

తీక్ష్ణశబ్దము విషమునకును, యుద్ధమునకును, లోహమునకును పేరైనపుడు న. వాఁడియైనదానికి పేరైనపుడు త్రి. తేజయతీతి తీక్ష్ణం. తిజ నిశాతనే. హింసించునది.

**ప్రమాణం హేతు మర్యాదా శాస్త్రేయత్తా ప్రమాతృషు,**

ప్రమాణశబ్దము అగ్ని మొదలయినదాని జ్ఞానమునకు, హేతువైన ధూమాదులకును, మేరకును, శాస్త్రమునకును, కొలఁత తూనిక మొదలయిన మానమునకును, వానిని దెలిసికొనువానికిని పేరు. ప్రమీయతే ఽనేనేతి ప్రమాణం. మాఙ్ మానే. దీనిచేత నెఱుఁగఁబడును. మఱియును సత్యవాదికిని, సత్యమైన దానికిని, ఏకత్వమునకును పేరు. ఇందుకు రభసుఁడు "ఇయత్తాహేతు శాస్త్రేషు ప్రమాణం సత్యవాదిని, మర్యాదానిత్యయోశ్చ స్యా దేకతాయాం ప్రమాతరి"

**కరణం సాధకతమ క్షేత్రగాత్రేన్ద్రియేష్వపి.** 55

కరణశబ్దము ఛేదనాది క్రియలయందు మిక్కిలి యుపయోగించునట్టి కుఠారాదులకును, క్షేత్రమునకును, శరీరమునకును, చక్షు రాదీంద్రియములకును పేరు. క్రియతే అనేనేతి కరణం. డు కృఞ్ కరణే. దీనిచేత

చేయఁబడును. మఱియును కారణమునకును, క్రియకును, గణకునికిని, రథబంధమునకును, నాట్యగీత భేదములకును పేరు. "కరణం కారణేకాయే సాధనేంద్రియకర్మసు, కాయస్థే రథబంధే చ నాట్యగీతప్రభేదయోః" అని అజయుఁడు. "కరణం రతిబంధేషు నృత్త సంస్థానకర్మణోః" రితి శేషః. టీ. స. రతిబంధాః కామశాస్త్రప్రసిద్ధాః నాగబంధ జృంభితాదయః. సంగీతసారే___"నృత్తవాదిత్ర గీతానాం ప్రయోగవశ భేదినామ్, సంస్థానభేదాన్నాట్యజ్ఞాః కరణాని ప్రచక్షత" ఇతి. అస్మిన్నర్థే కుమారసంభవే ప్రయోగః. "శిఖరాసక్తమేఘానాం విద్యంతే యత్ర వేశ్మనామ్, అను గర్జిత సందిగ్ధాః కరణైర్మురజస్వనా" ఇతి.

**ప్రాణ్యుత్పాదే సంసరణ మసంభాధే చమూగతౌ,**
**ఘణ్టాపథే -**

సంసరణశబ్దము ప్రాణులయొక్క ఉత్పత్తిరూపమైన సంసారమునకును, ఇరకటములేక సేనలు నడుచుటకును, పెద్దవీధికిని పేరు. సంసృతిః, సంసరంత్యస్మిన్నితి చ సంసరణం. సృ గతౌ. ఎడతెగక యుండునది గనుకను, దీనియందు లెస్సగా నడుతురు గనుకను సంసరణము. "రణారంభే సంసరణం గోపురే పురనిర్గమే" ఇతి శేషః.

**అథ వాన్తాన్నే సముద్ధరణ మున్నయే.** 56

సముద్ధరణ శబ్దము వాంతిచేసిన యన్నమునకును, ఎత్తుటకును పేరు. సముద్ధ్రియతే కుక్షికుహరా దూర్ధ్వం నీయతే, సముద్ధృతిశ్చ సముద్ధరణం. హృఞ్ హరణే. కడుపులోనుండి మీఁదికి తేఁబడునది గనుకను, ఎత్తుట గనుకను సముద్ధరణము.

**అథ త్రిషు -**

ఇఁకమీఁద వచ్చుణాంతము లన్నియుఁ ద్రిలింగములు.

**విషాణం స్యా త్పశు శృఙ్గేభదన్తయోః,**

విషాణశబ్దము పసరపుకొమ్మునకును, ఏనుఁగుదంతమునకును పేరు. వేష్టీతి విషాణం. విష్ ఌ వ్యాప్తౌ. వ్యాపించునది. విషాణశబ్దము స్వభావముననే మూఁడులింగములయందును వర్తించును. స్త్రీలింగమైనప్పుడు 'విషాణీ, విషాణా' అని యుండును. "విషాణా తు క్రోడద్విరద దంష్ట్రయో" రితి శేషః.

**ప్రవణః క్రమ నిమ్నోర్వ్యాం ప్రహ్వే నా తు చతుష్పథే.** 57

ప్రవణశబ్దము వాటముగా పల్లమైన నేలకును, నమ్రుఁ డైనవానికిని, నాలుగు తెరువులగూడిన దిక్కునకును పేరు. ప్రవస్యతే ఆశ్రియత ఇతి ప్రవణః. వన సంభక్తౌ. ఆశ్రయింపఁబడును. చతుష్పథ వాచకమైనపుడు పుంలింగము, కడమయర్థముల యందు త్రిలింగము. 'పూర్వప్రవణాభూః' 'పూర్వప్రవణో దేశః' 'పూర్వప్రవణం స్థలం' అని.

**సంకీర్ణౌ నిచితాశుద్ధౌ-**

సంకీర్ణశబ్దము నెఱసినదానికిని, మఱియొకటితోఁ గలిసినదానికిని పేరు. సమ్యక్కీర్ణోవ్యాప్తః సంకీర్ణః. కౄ విక్షేపే. లెస్సగా నెఱసినది.

**ఇరిణం శూన్య మూషరమ్,**

(సేతౌ చ చరణో వేణీ పదీవాసః కచోచ్చయే)

ఇరిణశబ్దము పాడైనదానికిని, చౌటినేలకును పేరు. ఇయర్తినాశం గచ్ఛతీతి ఇరిణం. పా. ఈరిణం. ఋ గతౌ. నాశనమును బొందునది. "ఈరిణం శూన్య మూషరం" అని దీర్ఘాదులయందు రభసుఁడు.

## తాంతములు

**దేవ సూర్యౌ వివస్వన్తౌ-**

వివస్వచ్ఛబ్దము దేవతలకును, సూర్యునకు పేరు. వివస్తేజః; తదస్యాస్తీతి వివస్వాన్. త. పు. వస ఆచ్ఛాదనే. తేజస్సుగలవాఁడు.

**సరస్వన్తౌ నదార్ణవౌ.** 58

సరస్వచ్ఛబ్దము సరస్వంతమను నదమునకును, సముద్రమునకును పేరు. సరో ఽస్యాస్తీతి సరస్వాన్. త. పు. సరస్సు గలిగినది. (సరస్సనఁగా నదపక్షమందు మడుఁగును, సముద్రపక్షమందు నీళ్లును. "సరో నీరే తటాకే చ" అని రుద్రుడు). సరస్వతీశబ్దము మంచిస్త్రీకిని, నదీమాత్రమునకును, నదీ విశేషమునకును, ఆవునకును పేరు. "సరస్వతీ స్యాత్ స్త్రీరత్నే నద్యాం నద్యంతరే గవి" యని అజయుడు. "సరస్వతీ నదీ భేదే" అని ప్రతాపుఁడు.

**పక్షి తార్క్ష్యాగరుత్మన్తౌ -**

గరుత్మచ్ఛబ్దము పక్షిమాత్రమునకు, గరుడునకును పేరు. గరు

తః పక్షా స్సంత్యస్యేతి గరుత్మాన్. త. పు. ఱెక్కలు గలిగినది.

**శకున్తౌ భాసపక్షిణౌ,**

శకుంతశబ్దము చమురుకాకికిని, పక్షిమాత్రమునకును పేరు. శక్నోతి గంతుమితి శకుంతః. శక్ ౯ శక్తౌ. పోవుటకును సమర్థమైనది.

**అగ్న్యుత్పాతౌ ధూమకేతూ -**

ధూమకేతుశబ్దము అగ్నికి, ఉత్పాతమునకును పేరు. ధూమః కేతు శ్చిహ్నమస్యేతి, ధూమప్రధానం కేతు రుత్పాత ఇతి చ ధూమ–కేతుః – ధూమము చిహ్నముగాఁ గలవాఁడు గనుకను, ధూమప్రధానమైన యుత్పాతము గనుకను ధూమకేతువు.

**జీమూతౌ మేఘపర్వతౌ.** 59

జీమూతశబ్దము మేఘమునకును, పర్వతమునకును పేరు. జీవనం ముఞ్చతీతి జీమూతః. జీవనమును (నీళ్లను) ఇచ్చును.

**హస్తౌ తు పాణినక్షత్రే -**

హస్తశబ్దము చేతికిని, నక్షత్ర విశేషమునకును పేరు. హసతీతి హస్తః. హసే హసనే. ప్రకాశించునది.

**మరుతౌ పవనామరౌ,**

మరుచ్ఛబ్దము వాయువునకును, దేవతలకును పేరు. మ్రియతే అనేనేతి మరుత్. త. పు. మృజ్ ప్రాణత్యాగే. దీనిచేత చత్తురు.

**యన్తా హస్తిపకే సూతే -**

యన్తృశబ్దము ఏనుఁగు మావటివానికిని, సారథికిని పేరు. యచ్ఛతీతి యన్తా. ఋ. పు. యమ ఉపరమే. నియమించువాఁడు.

**భర్తా ధాతరి పోష్టరి.** 60

భర్తృశబ్దము మోయువానికిని, పోషించువానికిని, మగనికిని పేరు. బిభర్తీతి భర్తా. ఋ. పు. డు భృఞ్ ధారణపోషణయోః. భరించువాఁడు.

**యానపాత్రే శిశౌ పోతః -**

పోతశబ్దము ఏఱుదాఁటునట్టి యోడకును, శిశువునకును పేరు. పునాతీతి పోతః. పూఞ్ పవనే. పవిత్రము చేయునది. "దశవర్షే గజేపోత" ఇతి శేషః.

**ప్రేతః ప్రాణ్యన్తరే మృతే,**

ప్రేతశబ్దము నరకమందుండు జంతువునకును, చచ్చినవానికిని పేరు. ప్రైతి ప్రియతేస్మ ప్రేతః. ఇణ్ గతౌ. మృతిఁబొందినవాఁడు.

**గ్రహభేదే ధ్వజే కేతుః -**

కేతుశబ్దము కేతుగ్రహమునకును, టెక్కెమునకును పేరు. కిత్యతే అనేనేతి కేతుః. కిత జ్ఞానే. దీనిచేత నెఱుఁగఁబడును. కేతుశబ్దము కాంత్యుత్పాత చిహ్నములకును పేరు. "పతాకాయాం ద్యుతౌ కేతుః గ్రహోత్పాతాదిలక్ష్మసు" అని రుద్రుఁడు.

**పార్థివే తనయే సుతః.** 61

సుతశబ్దము రాజునకును, కొడుకునకును పేరు. సౌతీతి సుతః. షుప్రసవై శ్వర్యయోః. ఐశ్వర్యమును బొందినవాఁడు, పుట్టినవాఁడును గనుక సుతుడు.

**స్థపతిః కారుభేదే** ఉ **పి-**

స్థపతిశబ్దము శిల్పికిని, అపిశబ్దమువలన బృహస్పతియాగముఁ జేసిన వానికిని పేరు. తిష్ఠన్త్యస్మి న్నర్థా ఇతి స్థః, స్థ శ్చాసౌ పతిశ్చస్థపతిః– అన్ని యర్థములు తనయందుండు పతిగనుక స్థపతి. "స్థపతిః కంచుకినపి" ఇతి శేషః.

**భూభృద్భూమిధరే నృపే,**

భూభృచ్ఛబ్దము పర్వతమునకును రాజునకును పేరు. భువం బిభర్తీతి భూభృత్. త. పు. డు భృఞ్ ధారణ పోషణయోః. భూమిని భరించును.

**మూర్ధాభిషిక్తో భూపే** ఉ **పి -**

మూర్ధాభిషి క్త శబ్దము రాజమాత్రునకును, అపిశబ్దమువలన పట్టాభిషిక్తునికిని పేరు. మూర్ధ్ని అభిషిచ్యతే స్మ మూర్ధాభిషిక్తః. షిచిర్ క్షరణే. శిరస్సునందు అభిషేకము చేయఁబడువాఁడు.

**ఋతుః స్త్రీకుసుమే** ఉ **పి చ.** 62

ఋతుశబ్దము స్త్రీల రజస్సునకును, వసంతాది ఋతువులకును పేరు. ఇయర్తీతి ఋతుః. ఋ గతౌ. పోవునది.

**విష్ణావ ప్యజితావ్యక్తౌ -**

అజితశబ్దము విష్ణువునకు పేరైనపుడు పు. అపిశబ్దమువలన గెలువఁబడనివానికి పేరైనపుడు త్రి. అవ్యక్తశబ్దము విష్ణువునకు పేరైనపుడు పు. అపి శబ్దమువలన స్ఫుటముగా నేర్పడనివానికి పేరైనపుడు త్రి. జితోన భవతీ త్యజితః –గెలునఁబడనివాఁడు. ౧. వ్యక్తో న భవతీ త్యవ్యక్తః. వ్యక్తముగానివాఁడు. "అవ్యక్త శ్శంకరే విష్ణావవ్యక్తం మహాదాదికే, ఆత్మన్యపి స్యా దవ్యక్త మస్ఫుటే త్వభిధేయవ" దితి శాశ్వతః.

**సూత స్త్వష్టరి సారథౌ,**

సూతశబ్దము వడ్లవానికిని, సారథికిని పేరు. సూతే రథాదికమితి; సువతి ప్రేరయతీతి చ సూతః. షూఙ్ ప్రాణిప్రసవే; షూ ప్రేరణే. రథాదులను జేయువాఁడు. అశ్వాదులను బ్రేరేపించువాఁడు గనుక సూతుఁడు. "సూతో రసే జాతిభేదే వందిసుష్ఠూతయోరపి" ఇతి శేషః.

**వ్యక్తః ప్రాజ్ఞే ౭ పి -**

వ్యక్తశబ్దము ప్రాజ్ఞునికి పేరైనపుడు పు. అపిశబ్దమువలన స్పష్టమైనదానికి పేరైనపుడు త్రి. వ్యజతే స్మ వ్యక్తః. అంజూ వ్యక్తిశ్లక్ష్ణ కాంతిగతిషు. ప్రకటమైనవాఁడు; ప్రకటమైనది.

**దృష్టాన్తావుభే శాస్త్ర నిదర్శనే.** 63

దృష్టాంతశబ్దము శాస్త్రమునకును, ప్రకృతార్థమునకు ప్రతిగాఁజూపి చెప్పుటకును పేరు. దృష్టః అంతో నిశ్చయో యత్ర దృష్టాంతః–చూడఁబడిన నిశ్చయము గలది.

**క్షత్తా స్యాత్సారథౌ ద్వార్స్థే క్షత్రియాయాం చ శూద్ర జే,** 64

క్షత్తృశబ్దము సారథికిని, వాకిలిఁ గాచువానికిని, శూద్రుని వలన క్షత్రియ స్త్రీ యందుఁ బుట్టినవానికిని పేరు. క్షదతీతి క్షత్తా. ఋ. పు. క్షద గతిహింసనయోః. పీడించువాఁడు.

**వృత్తాన్తస్స్యాత్ప్రకరణే ప్రకారే కార్త్స్న్యవార్తయోః.**

వృత్తాంతశబ్దము ప్రస్తావమునకును, విశేషమునకును, అంతయునను నర్థమునకును, వార్తకును పేరు. వృత్తః అంతో నిశ్చయోయస్య వృత్తాంతః –సిద్ధమయిన నిశ్చయము గలది.

**ఆనర్తస్సమరే నృత్యస్థాన నీవృద్విశేషయోః,**

ఆనర్తశబ్దము యుద్ధమునకును, నాట్య మాడుచోటునకును, పడ

మటి సముద్రతీరమందు ద్వారకకు సమీపస్థమైన దేశ విశేషమునకును పేరు. ఆనృత్యంత్యత్రే త్యానర్తః. నృతీ గాత్రవిక్షేపే. దీనియందు నర్తింతురు.

**కృతాన్తో యమ సిద్ధాన్త దైవా కుశల కర్మసు.** 65

కృతాంతశబ్దము యమునకును, సిద్ధాంతమునకును, పురాకృత శుభాశుభ కర్మములకును, పాపకర్మమునకును పేరు. కృతః అంతః అనేనేతి కృతాంతః– దీనిచేత అంతము చేయఁబడును.

**శ్లేష్మాది రసరక్తాది మహాభూతాని తద్గుణాః,**

**ఇంద్రియాణ్యశ్మ వికృతిశ్శబ్దయో నిశ్చ ధాతవః.** 66

ధాతుశబ్దము శ్లేష్మ వాతపిత్తమునకును, వసాసృఙ్మాంస మేదోస్థి మజ్జా శుక్లములకును, పృథివ్యప్తేజో వాయ్వాకాశములకును, శబ్దస్పర్శ రూపరస గంధములకును, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములకును, జేగురు మొదలైన శిలావికారములకును, శబ్దములకు కారణములైన 'భూసత్తాయాం' అనునది మొదలగు క్రియలకును పేరు. 'రసరక్తాది' అనుచోట రసాది యనినం జాలదా రక్తశబ్ద మేటికిఁ జెప్పవలె ననిన, రసశబ్ద మనేకార్థము గనుక భ్రమ రాకుండుటకై చెప్పినాడు. అయినచో రక్తాది యనినఁ జాలునే రసశబ్ద మెందుల కనిన సప్తధాతువులలోను రసము ప్రధానముగనుక దానిని ముందుగాఁ జెప్పవలెనని చెప్పినాఁడు. దధాతీతి ధాతుః. డు ధాఞ్ ధారణ పోషణయోః. ధరించునది గనుకనైన, పోషించునది గనుకనైనను ధాతువు. 'సువర్ణం రజతం తామ్ర మారకూటం తథైవ చ, లోహం త్రపు తథా సీసంధాతవ స్సప్తకీర్తితా' ఇత్యుక్తా ధాతవశ్చ శబ్దేన సూచితాః.

**కక్ష్యాన్తరే ௨పి శుద్ధాన్తో నృపస్యా సర్వగోచరే,**

శుద్ధాంతశబ్దము రాజులయంతఃపురమునకును అపిశబ్దమువలన అంతః పుర స్త్రీలకును పేరు. శుద్ధః రక్షితః అన్తః ప్రాంతో యస్య స ఇతి శుద్ధాంతః – రక్షింపఁబడిన ప్రాంతములు గలది.

**కాసూ సామర్థ్యయో శ్శక్తిః -**

శక్తిశబ్దము భల్లమను నాయుధ విశేషమునకును, ప్రభుత్వాది శక్తులకును, లేక అన్ని వస్తువులయం దుండు నొకానొక ధర్మమునకును

పేరు. శక్యతే అనయా జేతు మితి శక్తిః. సీ. శక్ ౹౹ శక్తౌ. దీనిచేత గెలువ శక్యమౌను.

**మూర్తిః కాఠిన్య కాయయోః.** 67

మూర్తిశబ్దము గట్టితనమునకును, శరీరమునకును పేరు. మూర్ఛయతీతి మూర్తిః. సీ. ముర్ఛామోహ సముచ్ఛ్రాయయోః. ఆధిక్యమును బొందునది. "ఉచ్ఛ్రాయమోహబంధేషు మూర్తిః పరిమితా వపి" ఇతి శేషః.

**విస్తారవల్ల్యోః ప్రతతిః -**

ప్రతతిశబ్దము విరివికిని, తీఁగెకును పేరు. ప్రకృష్టాతతిః, ప్రకృష్టాతతిరస్యేతి చ ప్రతతిః. సీ. తను విస్తారే. ప్రకృష్టమైన విస్తారము గనుకను, ప్రకృష్టమైన విస్తారముగలది గనుకను ప్రతతి. ప్రతతిశబ్దము పకారాది. 'విస్తారే ప్రతతి ర్వల్ల్యాం' అని రభసుఁడు. 'ప్రస్థస్సానుని మానే చ ప్రతతి స్తతివీరుధోః' అని పవర్గ ప్రథమాదులయం దజయుఁడును. "వకారాదిగాని పకారాది గా"దనియు పకారాదియైనచోఁ బూర్వమైన 'తను విస్తారే' అనుధాతువుమీఁద క్తిన్ప్రత్యయ మని చెప్పవలెను. అప్పుడు క్తిన్ప్రత్యయాంతముమీఁద ఙీష్షురాదు. "ధరాధరేంద్రం ప్రతతీతతీరివ" అని మాఘమందు ఙీషంత ప్రయోగమున్నది. "వ్రతవ్రాతవ్రతత్యర్థం వ్రతిధాతురున్నేయః" అని శ్రీ భోజుఁడును జెప్పినాఁడు గనుక వకారాదియే యనియుఁ గొందఱు చెప్పుదురు.

**వసతీ రాత్రి వేశ్మనోః,**

వసతిశబ్దము రాత్రికిని, ఇంటికిని పేరు. వసంత్యస్యామితి వసతిః. సీ. వసనివాసే. దీనియందుందురు గనుక వసతి. 'వసతిస్స్యా దవస్థాన' ఇతి శేషః.

**క్షయార్చయో రపచితిః -**

అపచితిశబ్దము హానికి, పూజకును పేరు. అపచయనం అపచాయనం చ అపచితిః. సీ. చిఞ్ చయన. చాయృ పూజానిశామనయోః. నశించుటయు. పూజించుటయును గనుక అపచితి.

**సాతి ర్దానావసానయోః.** 68

సాతిశబ్దము దానమునకు ముగియుటకును పేరు. సననం సానం

చ సాతిః. సీ. షణు దానే. షో ఽన్తకర్మణి. ఇచ్చుటయు, ముగియుటయును గనుక సాతి.

**ఆర్తిః పీడా ధనుష్కోట్యోః -**

ఆర్తిశబ్దము పీడకును, వింటికొప్పునకును పేరు. అర్దనం అర్ద్యతే అనయా చేతి ఆర్తిః. సీ. అర్దపీడాయాం – ఆఙ్ పూర్వః. దీనిచేత పీడింపఁబడును గనుక ఆర్తిః. పా. అర్తిః పీడా. "శిరోర్తిం నాశయత్యాశురసో ఽయం ముచుకుందకః" "అనుశోచతి యః కృత్వా సో ఽర్తిం ప్రాప్నోతి కేవలాం" అనియును ప్రయోగములు.

**జాతి స్సామాన్యజన్మనోః,**

జాతిశబ్దము గోత్వాదిజాతులకును, పుట్టుటకును పేరు. జాయేతేభిన్నే ష్వభిన్నాభిధాన ప్రత్యయా వనయేతి, జననం చ జాతిః. సీ. జనీ ప్రాదుర్భావే. భిన్నము లయిన వస్తువులయందు అభిన్నములైన నామ జ్ఞానములు దీనిచేతఁ బుట్టును గనుకను, పుట్టుట గనుకను జాతి.

**ప్రచార్య స్యన్దయో రీతిః -**

రీతిశబ్దము వ్యవహారమునకును, జాఱుటకును పేరు. రయణం రీతిః. సీ. రి గతౌ; రిజ్ ప్రస్రవణే. నడతయును, జాఱుటయును గనుక రీతి. టీ.స. వ్యవహారే యథా___ "సతాం రీతి మనుస్మర" న్నితి. ప్రకారస్యందయోరితి కేచిత్పఠంతి. ప్రకారః స్వభావః యథా___ 'చాపలం యోషితాం రీతిః' "ప్రచారస్స్యందయో రీతి ర్లోహకట్టార కూటయో" రితి రుద్రః.

**ఈతి ర్డిమ్బ ప్రవాసయోః.** 69

ఈతిశబ్దము "అతివృష్టి రనావృష్టిః శలభా మూషికా శుకాః, అత్యాసన్నాశ్చ రాజానష్షడేతా ఈతయః స్మృతాః." అను నాఱువిధములైన యుపద్రవములకును, ప్రవాసమునకును పేరు. అయన మీతిః. సీ. ఈజ్ గతౌ. పోవుట గనుక ఈతి.

**ఉదయే ఽధిగమే ప్రాప్తిః -**

ప్రాప్తిశబ్దము పుట్టుటకును, లాభమునకును పేరు. ప్రాపణం ప్రాప్తిః. సీ. ఆప్ ॡవ్యాప్తౌ. పొందుట ప్రాప్తి.

**త్రేతా త్వగ్నిత్రయే యుగే,**

త్రేతాశబ్దము గార్హపత్యము మొదలైన మూఁడగ్నులకును, యుగమునకును పేరు. త్రిత్వమితా ప్రాప్తా త్రేతా. ఇణ్‌గతౌ. త్రిత్వ సంఖ్యను బొందినది. టీ. స. త్రీన్ ధర్మపాదాన్ ఇతా త్రేతా. తదుక్తం. "త్రేతాయుగే తు సంప్రాప్తే దర్మః పాదోనతాం గత" ఇతి.

**వీణాభేదే ఽపి మహతీ -**

మహతీశబ్దము నారదుని వీణకును, అపిశబ్దము వలన అధికమైన దానికిని పేరు. మహ్యత ఇతి మహతీ. సీ.మహ పూజాయాం. పూజింపఁబడునది.

**భూతి ర్భస్మని సంపది.** 70

భూతిశబ్దము భస్మమునకును, సంపదకును పేరు. భూయతే భూతిః. సీ. భూ ప్రాప్తావాత్తనేపదీ. పొందఁబడునది. 'భూతిర్మాతంగ శృంగారే సత్తాయామపి జన్మని' ఇతి.

**నదీ నగర్యో ర్నాగానాం భోగవతీ -**

భోగవతీశబ్దము సర్పములయొక్క నదీపత్తనములకు పేరు. భోగాః సర్పకాయా ఉపభోగావా సంత్యస్యామితి భోగవతీ. సీ. దీనియందు సర్ప శరీరములు గాని సుఖములుగాని కలవు గనుక భోగవతి.

**అథ సంగరే,**

**సజ్గే సభాయాం సమితిః-**

సమితిశబ్దము యుద్ధమునకును, కూటమికిని, సభకును పేరు. సంభూయ ఇయంతి గచ్ఛం త్యత్రేతి సమితిః. సీ. ఇణ్ గతౌ. దీనియందుఁ గూడుదురు గనుకను, కూడుట గనుకను సమితి.

**క్షయ వాసావపి క్షితిః.** 71

క్షితిశబ్దము నాశమునకును, ఉనికికిని, అపిశబ్దమువలన భూమికిని పేరు. క్షయః క్షియంతి నివసంత్యస్యామితి చ క్షితిః. క్షి క్షయే, క్షి నివాసగత్యోః. నశించుటయు, ఉండుటయు దీనియందుందురు గనుకను క్షితి.

**రవేరర్చి శ్చ శస్త్రం చ వహ్నిర్జ్వాలా చ హేతయః,**

హేతిశబ్దము సూర్యుని కిరణములకు, ఆయుధమునకు, అగ్నిజ్వాలకును పేరు. హంతి తమ ఇతి, హన్యతే ఽ నయేతి చ హేతిః. సీ. హన హింసాగత్యోః. చీఁకటిని బోఁగొట్టునది. దీనిచేత హింసింపఁబడును గనుక హేతి. శస్త్ర వాచియైనప్పుడు పుంలింగమును గలదు. 'నిమార్ష్య

సౌ నీతి మయేనహేతి' నేతి కప్ఫిణాభ్యుదయః. 'మేతిభిశ్చేతనావద్భి రుదీరిత జయస్వన'మితి రఘువంశ దశమసర్గే కాళిదాసః.

**జగతీ జగతిచ్ఛన్దో వశేషే ఽ పి క్షితావపి.** 72

జగతీశబ్దము లోకమునకును, పంద్రెండక్షరముల పాదముగల ఛందస్సునకును. భూమికిని పేరు. గచ్ఛతీతి జగతీ. గమ్ ౙగతౌ. పోవునది.

**పఙ్క్తి శ్ఛన్దో ఽ పి దశమమ్ -**

పఙ్క్తి శబ్దము పదియక్షరముల పాదముగల ఛందస్సునకును, అపిశబ్దము వలన శ్రేణికిని, పది యను సంఖ్యకును పేరు. పంచత ఇతి పఙ్క్తిః. సీ. పచి విస్తారే. విరివియైనది.

**స్యాత్ప్రభావే ఽ పి చాయతిః,**

ఆయతిశబ్దము ప్రభావమునకును, అపిశబ్దమువలన భవిష్యత్కాలమునకును పేరు. ఆయచ్ఛతే, ఆయమనం చ ఆయతిః సీ. యమ ఉపరమే. ఆజ్ పూర్వోవిస్తారే. విరివియైనది; విరివియౌటయును గనుక ఆయతి. 'ఆయతి స్తూత్తరేకాలే స్యాద్దీర్ఘత్వ ప్రభుత్వయో' రి త్యజయః.

**పత్తిర్గతౌ చ -**

పత్తిశబ్దము గమనమునకును, చకారమువలన సేనాభేదమునకును పేరగునపుడు సీ. కాలిబంటునకు పేరగునపుడు పు. పతతీతి పతనంచపత్తిః. పత్ ౙగతౌ. పోవునదియు, పోవుటయును గనుక పత్తి. 'పత్తిః పదాతౌ పుంసి స్యాత్సైన్య భేదేగతౌ స్త్రియా' మితి నానార్థసంగ్రహః.

**మూలే తు పక్షతిః పక్ష భేదయోః.** 73

పక్ష భేదము లనఃగా శుక్ల కృష్ణపక్షములును, పక్షిఱెక్కలును; వాని యొక్క మూలమనఁగా పాడ్యమియును, ఱెక్కలమొదలును. ఈ రెంటికిని పక్షతి యని పేరు. పక్షయో ర్మూలం పక్షతిః. సీ. పక్షముల మొదలు గనుక పక్షతిః.

**ప్రకృతీ యోని లిఙ్గే చ -**

ప్రకృతిశబ్దము ఉపాదానకారణమునకును, స్త్రీపుంనపుంసక లింగములకును, చకారము వలన స్వామ్యమాత్యాది సప్తాంగములకును, పౌరశ్రేణులకును పేరు. స్వభావమునకును, భగమునకును. సత్త్వరజస్తమో గుణముల యొక్క సామ్యా వస్థకును పేరని కొందఱు. ప్రక్రియతే అనయా

కార్యమితి ప్రకృతిః. సీ. డుకృఞ్ కరణే. దీనిచేత కార్యము చేయఁబడును.

**కైశిక్యాద్యాశ్చ వృత్తయః,**

వృత్తిశబ్దము కైశిక్యారభటీ సాత్వతీభారతు లను రస వ్యంజకములైన వృత్తులకును, చకారమువలన కృషి మొదలైన జీవనోపాయములకును, సూత్రాదివివరణ గ్రంథములకును పేరు. వర్తతే అనయావృత్తిః. సీ. వృతువర్తనే. దీనిచేత వర్తించును.

**సికతా స్స్యు ర్వాలుకాపి -**

సికతాశబ్దము ఇసుకకును, అపిశబ్దమువలన ఇసుకనేలకును పేరు. సిచ్యంత ఇతి సికతాః. షిచిర్ క్షరణే. తడుపఁబడునది. సికతాశబ్దము నిత్య బహువచనము. 'బహవశ్చసమా స్సికతాః' అని వామనుఁడు చెప్పినాఁడు.

**వేదే శ్రవసి చ శ్రుతిః.** 74

శ్రుతిశబ్దము వేదములకును, చెవికిని, చకారమువలన వినుటకును, వార్తకును పేరు. శ్రూయతే, శృణో త్యనయా–శ్రవణం చ శ్రుతిః సీ.శ్రు శ్రవణే. వినఁబడునది. దీనిచేత విందురు, వినుటయును గనుక శ్రుతి.

**వనితా జనితాత్యర్థానురాగాయాం చ యోషితి.**

వనితాశబ్దము మిక్కిలి యనురాగము పుట్టించునట్టి స్త్రీకిని, చకారమువలన స్త్రీమాత్రమునకును పేరు. వన్యత ఇతి వనితా. వనుయాచనే. వన షణ సంభక్తౌ. అడుగఁబడునది గనుకనైన, కూడఁబడునది గనుకనైనను వనిత.

**గుప్తిః క్షితివ్యుదాసే౽పి -**

గుప్తిశబ్దము నేలగుంటకును, అపిశబ్దమువలన రక్షించుటకును, చెఱ సాలకును పేరు. "గుప్తికారా చ రక్షా చ దీర్ఘం చ వివరం భువః" అని శాశ్వతుడు. గోప్యతే గోపనం చ గుప్తిః. గుపూ రక్షణే. రక్షింపఁబడునది, రక్షించుటయు గనుక గుప్తి.

**ధృతి ర్ధారణ ధైర్యయోః.** 75

ధృతిశబ్దము ధరించుటకును, ధైర్యమునకును పేరు. ధరణం, ధ్రియతే అనయాచ ధృతిః. సీ. ధృఞ్ ధారణే. ధరించుట, దీనిచేత ధరింపఁబడును గనుకను ధృతి. "ధృతిః స్త్రియాం యోగభేదే చందో

భేదే సుఖే ఉద్ధ్వర" ఇతి శేషః.

**బృహతీ క్షుద్ర వార్తాకీ ఛన్దోభేదే మహత్యపి,**

బృహతీశబ్దము వాఁకుడుచెట్టునకును, తొమ్మిదక్షరములపాదము గల ఛందస్సునకును, అధికమైనదానికిని, అపిశబ్దమువలన నుత్తరీయమునకును పేరు. ములకచెట్టునకును పేరని కొందఱు. బర్హత ఇతి బృహతీ. సీ. బృహ వృద్ధౌ. వృద్ధిఁ బొందునది.

**వాసితా స్త్రీ కరిణ్యోశ్చ -**

వాసితాశబ్దము స్త్రీకిని, ఆఁడఏనుఁగునకును పేరు. వాస్యత ఇతి వాసితా. వస నివాసే. శృంగారింపఁబడునది. "స్త్రియాం స్త్రీమాత్ర హస్తిన్యోర్వాసితా భావితేత్రి" ష్వితి రుద్రః. 'వాసితం కృతవాసే స్యాచ్ఛాదితే స్తంభితేత్రి" ష్వితి శేషశ్చ. పా. వాశితా.

**వార్తా వృత్తౌ జనశ్రుతౌ.** 76

**వార్త్తం ఫల్గు న్యరోగే చ త్రిషు -**

వార్తాశబ్దము జీవనోపాయమునకును, లోకవార్తకును పేరైనపుడు సీ. తుచ్ఛమునకు పేరైనపుడు న. రోగములేనివానికి పేరైనపుడు త్రి. వర్తతే అనయా, వర్తతేచేతి వర్తనం చ వార్తా. వృతు వర్తనే. దీనిచేత వర్తింతురుగనుక, వర్తించునది గనుక, వర్తనముగనుకను వార్త.

**అప్సుచ ఘృతామృతే,**

ఘృతామృతశబ్దములు నీళ్లకును, చకారమువలన ఘృతశబ్దము నేతికిని, ప్రకాశముగలదానికిని, అమృతశబ్దము అమృతమునకును, యజ్ఞశేషమునకును, అయాచితమునకును, మోక్షమునకును పేరు. జిఘర్తీతి ఘృతం ఘృ క్షరణదీప్త్యోః జాఱునది. న విద్యతే మృతం మరణ మస్మాదిత్య మృతం. దీనివలన మరణములేదు. "అమృతం వారి సురయోర్నిర్వాణే చాతిసుందరే, అయాచితే యజ్ఞశేషే పుంసి ధన్వంతరౌభవే" దితి వ్యాడిః.

**కలధౌతం రూప్య హేమ్నోః -**

కలధౌతశబ్దము వెండికిని, బంగారమునకును పేరు. కలం కాలుష్యం ధౌత మస్యేతి కలధౌతం. ధావు గతిశుద్ధ్యోః. పోఁగొట్టఁబడిన కాలుష్యము గలది.

**నిమిత్తం హేతు లక్ష్మణోః.** 77

నిమిత్తశబ్దము కారణమునకును, చిహ్నమునకును పేరు. నిమేద్యత ఇతి నిమిత్తం. ఞి మిదా స్నేహనే. కూడుకొని యుండునది. టీ. స. హేతులక్ష్యయోరితి పాఠే లక్ష్యం శరవ్యం. లక్ష్యేయథా___ "నిమిత్తాదపరాద్ధేష్యో ర్ధానుష్కస్యేవ వల్గిత" మితి మాఘే ద్వితీయసర్గే. "వేధ్యం లక్ష్యం శరవ్యం చ నిమిత్తం చ సమం విదు" రితి రంగరాజః.

**శ్రుతం శాస్త్రావ ధృతయోః -**

శ్రుతశబ్దము శాస్త్రమునకు పేరైనపుడు న. వినఁబడినదానికి పేరైనపుడు త్రి. శ్రూయత ఇతి శ్రుతం. శ్రు శ్రవణే. వినఁబడునది.

**యుగ పర్యాప్తయోః కృతమ్,**

కృతశబ్దము యుగవిశేషమునకును, నివారణమునకును పేరు. క్రియత ఇతి కృతం. డు కృఞ్ కరణే. చేయఁబడునది. "కృతం ఫలే క్రియాయాంచ వాచ్యవ ద్విహితే ఫలే" ఇతి శేషః.

**అత్యాహితం మహాభీతిః కర్మజీవా నపేక్షి చ.** 78

అత్యాహితశబ్దము మహాభయమునకును, సాహసకర్మమునకును పేరు. అత్యంతదుఃఖ మాధీయత ఇత్యత్యాహితం. డు ధాఞ్ ధారణ పోషణయోః. మిక్కిలి దీనిచేత దుఃఖము చేయఁబడును. "అత్యాహిత ముపశ్లిష్ట" ఇతి శేషః.

**యుక్తే క్ష్మాదావృతే భూతం ప్రాణ్యతీతే సమే త్రిషు,**

భూతశబ్దము యోగ్యమైనదానికిని, పృథివ్యాది పంచమహాభూతములకును, సత్యమునకును, ప్రాణిమాత్రమునకును, అతీతకాలమునకును పేరైనపుడు న. సదృశవస్తువుకు పేరైనపుడు ఉత్తరపదమై మూఁడు లింగములయందును వర్తించును. మాతృభూతః, పితృభూతః అని. భూయతే, భవతీతి చ భూతం. భూప్రాప్తౌ, భూ సత్తాయాం. పొందఁబడునది. కలుగునదియును గనుక భూతము. టి. స. యుక్తేయథా___ 'విద్వాంసోభూత కారిణః'. క్ష్మాదౌ___ 'పంచానామపి భూతానా' మితి. సత్తే ___ 'భూతమప్యనుపన్యస్తం హీయతే వ్యవహారత'ఇతి. ప్రాణ్యతీత ఇతి ద్వంద్వైకవద్భావః. అత్ర ప్రాణిశబ్దేన పిశాచాదయో వివక్షితాః. అతీతే ___ భూతో ఘటః. "భూతో దేవలకే పుంసి త్రిషు ప్రాప్తే ఉపకల్కిత" ఇతి

శేషః. "భూతం క్ష్మాదౌ పిశాచాదౌ న్యాయ్యే సత్యోపమానయోః, భూతో దేవలకే ప్రాప్తే తథా వృత్తే ఉ_భిధేయవ" దితి విశ్వప్రకాశశ్చ.

**వృత్తం పద్యే చరిత్రే త్రి ష్వతీతే దృఢని స్తలే.** 79

వృత్తశబ్దము పద్యమునకును, చరిత్రమునకును పేరైనపుడు న. పోయినదానికిని, గట్టియైనదానికిని, వట్రువైనదానికిని పేరైనపుడు త్రి. వర్తతే స్మ వృత్తం. వృతువర్తనే. వర్తించునది.

**మహద్రాజ్యం చ -**

మహచ్ఛబ్దము రాజ్యమునకు పేరైనపుడు న. చకారమువలన దొడ్డదానికి పేరైనపుడు త్రి. మహ్యత ఇతి మహత్. త. మహ పూజాయాం. పూజింపఁబడునది.

**అవగీతం జన్యే స్యాద్గర్హితే త్రిషు,**

అవగీతశబ్దము జనాపవాదమునకు పేరైనపుడు న. నిందిపఁబడినవానికి పేరైనపుడు త్రి. ఇది యుద్ధమునకు పేరని కొందఱు. అవవిరుద్ధం గీయత ఇత్యవగీతం. గై శబ్దే. విరుద్ధముగాఁ బలుకఁబడునది. టీ. స. జనస్య జల్పోజన్యం, నిందేతి యావత్. యథా___ "ఆత్మ వ్యాపాదనం శ్లాఘ్య మవగీతేన జీవనా" దితి.

**శ్వేతం రూప్యే ఉ_పి -**

శ్వేతశబ్దము వెండికి పేరైనపుడు న. అపిశబ్దమువలన తెల్లని వస్తువునకు పేరైనపుడు త్రి. శ్వేతత ఇతి శ్వేతం. శ్వితా వర్ణే. తెల్లనిది. "ద్వీపాద్రి కుష్ఠనాగేషు శ్వేతో నాస్త్రీ వరాటకే" ఇతి శేషః.

**రజతం హేమ్ని రూప్యే సితే త్రిషు.** 80

రజతశబ్దము బంగారమునకును, వెండికిని పేరైనపుడు న. తెల్లని వస్తువునకు పేరైనపుడు త్రి. రజ్యతే తామ్రాదిక మనేనేతి రజతం. రంజరాగే. దీనిచేత తామ్రము మొదలయినవి రంజింపఁ జేయఁబడును. "రజతం విశదే దన్తిదన్తే తారకహారయో" రితి విశ్వప్రకాశః.

**త్రి ష్వథో -**

ఇఁకముందు వచ్చు తా న్తశబ్దము లన్నియుఁ త్రిలింగములు.

**జగ దిఙ్గే ఉ_పి -**

జగచ్ఛబ్దము జంగమమునకును, అపిశబ్దము వలన లోకమునకును

పేరు. గచ్ఛతీతి జగత్ గమ్ ఌగతౌ. పోవునది. "స్యాజ్జగ ద్విష్టపే క్లీబం వాయౌ నా జంగమే త్రి ష్వి"తి రుద్రః.

**రక్తం నీల్యాది రాగి చ,**

రక్తశబ్దము నీలి మంజిష్ఠ మొదలైనదానిచేత చాయవేయఁబడిన వస్త్రాదులకును, చకారమువలన అనురక్తునికిని, ఎఱ్ఱనైన వస్తువునకును పేరైనపుడు త్రి. కుంకుమమునకును, నెత్తుటికిని పేరైనపుడు న. రజ్యతే స్మ రక్తం. రంజ రాగే. రంజింపఁ జేయఁబడునది. "అసృక్కుంకుమయోః క్లీబం రక్తం త్రి ష్వనురాగిణి" ఇతి శేషః.

**అవదాత స్సితే పీ తే శుద్ధే -**

అవదాతశబ్దము తెల్లనిదానికి, పసుపుపచ్చనిదానికి, పరిశుద్ధమైన దానికిని పేరు. అవదాయతే స్మ అవదాతః. దైవ్ శోధనే. శుద్ధమైనది.

**బద్ధార్జునౌ సితౌ.** 81

సితశబ్దము కట్టఁబడినదానికిని, తెల్లని వస్తువునకును పేరు. సీయత ఇతి సితం. షిఞ్ బంధనే. కట్టఁబడునది. "శ్విత్రే సితం భార్గవే నా శర్కరాయాం సితా స్త్రియా" మితి శేషః.

**యుక్తే ఽ తి సంస్కృతే మర్షిణ్యభినీతః -**

అభినీతశబ్దము యోగ్యమైనదానికిని, మిక్కిలి శుద్ధిచేయఁబడిన దానికిని, ఓరిమి గలదానికిని పేరు. అభినీయత ఇత్యభినీతః. ణీఞ్ ప్రాపణే. అంతటఁ బొందింపఁబడినది.

**అథ సంస్కృతమ్,**

**కృత్రిమే లక్షణోపేతే** ఽ పి -

సంస్కృతశబ్దము చేయఁబడిన ఘటాదులకును, వ్యాకరణలక్షణయుక్తమైన శబ్దమునకును, అపిశబ్దమువలన లెస్సగాఁ జేయఁబడిన వస్తువునకును పేరు. సమ్యక్క్రియత ఇతి సంస్కృతం. డు కృఞ్కరణే. లెస్సగాఁ జేయఁబడినది.

**అనన్తో ఽ నవధావపి.** 82

అనంతశబ్దము అవధిలేనిదానికి పేరైనపుడు త్రి. అపిశబ్దమువలన శేషునికిని, విష్ణువునకును పేరైనపుడు పు. ఆకాశమునకు పేరైనపుడు న. భూమికి పేరైనపుడు సీ. న విద్యతే అంతో యస్యే త్యనంతః కడలేనిది.

"అనంత శ్శేషవిష్ణ్వోస్స్యా దనంతం సురవర్త్మని, అనంతా శారిబా దూర్వా విశల్యా లాంలీషుచ, అనంతా హైమవత్యాం చ గుడూచ్యాం చావనావ" పీతి విశ్వప్రకాశః.

**ఖ్యాతే హృష్టే ప్రతీతః -**

ప్రతితశబ్దము ప్రసిద్ధునకును, సంతోషించినవానికిని పేరు. ప్రతీయతే ప్రత్యేతి చ ప్రతీతః. ఇణ్ గతౌ. ఎఱుఁగఁబడువాఁడును, సంతసించినవాఁడును గనుక ప్రతీతుఁడు.

**అభిజాతస్తు కులజే బుధే,**

అభిజాతశబ్దము మంచికులము గలవానికిని, పండితునికిని పేరు. అభిజాయత ఇత్యభిజాతః. జనీ ప్రాదుర్భావే. మంచి జన్మము గలవాఁడు.

**వివిక్తౌ పూత విజనౌ -**

వివిక్తశబ్దము పవిత్రమైనదానికిని, ఏకాంతస్థలమునకును పేరు. వివిచ్యత ఇతి వివిక్తః. విచ్ ృ పృథగ్భావే. లెస్సగా నేర్పఱచఁబడునది.

**మూర్ఛితౌ మూఢ సోచ్ఛ్రయౌ.** 83

మూర్ఛితశబ్దము మూర్ఛపోయినవానికిని, వృద్ధిఁబొందినవానికిని పేరు. మూర్ఛతి స్మ మూర్ఛితః. మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః. మూర్ఛఁబొందినవాఁడును, వృద్ధిఁబొందినవాఁడును గనుక మూర్ఛితుఁడు.

**ద్వౌ చామ్లు పరుషౌ శుక్తౌ -**

శుక్తశబ్దము ఆమ్లవిశేషమునకును, నిష్ఠురమైనదానికిని పేరు. ఆమ్లవిశేష మనఁగా "మృణ్మయాదిశుచౌ భాండే సక్షౌద్రగుడకాంజికం" అనురీతిగ మంటికుండ మొదలైన భాండమందు తేనె, బెల్లము, కలి ఈ మూఁడును గూర్చి ధాన్యరాశియందు మూఁడు రాత్రులు పెట్టిన పులుసు. శుచయతీతి శుక్తం. శుచ శోకే. దుఃఖపెట్టునది.

**శితీ ధవళ మేచకౌ,**

శితిశబ్దము తెల్లనిదానికిని, నల్లనిదానికిని పేరు. శ్యతి వర్ణాంతరం తనూ కరోతీతి శితిః. శో తనూకరణే. వర్ణాంతరమును గొంచెముగాఁ జేయునది. శీయత ఇతి శితిః. శి శోధనే. శోధింపఁబడునది.

**సత్యే సాధౌ విద్యమానే ప్రశస్తే ఽ భ్యర్హితే చ సత్.** 84

సచ్ఛబ్దము, సత్యమునకును, సాధువునకును, కలిగియున్నదానికిని, శ్రేష్ఠమైనదానికిని, పూజ్యమైనదానికిని పేరు. అ స్త్రీతి సత్. త. అసభువి. కలిగినది. "భవాన్యాం తు సతీ స్త్రీ స్యా న్నక్షత్రే తు నపుంసక" మితి శేషః.

**పురస్కృతః పూజితే ఽరాత్యభియు క్తే ఽ గ్రతః కృతే,**

పురస్కృతశబ్దము పూజితునకును, శత్రువులచేత నాక్రమింపఁబడినవానికిని, ముందర నిలుపఁబడినవానికిని పేరు. పురః క్రియత ఇతి పురస్కృతః. డు కృఞ్ కరణే. ముందుగాఁ జేయఁబడినవాఁడు.

**నివాతావాశ్రయావాతౌ శస్త్రాభేద్యం చ వర్మ యత్.** 85

నివాతశబ్దము ఉండునట్టి స్థలమునకును, గాలిలేని చోటునకును, శస్త్రములచేత భేదింపరాని చోటునకును పేరు. నివాయతే గమ్యతే, నివృత్తో వాతో ఽ త్రేతి చ నివాతః. వా గతిగంధనయోః. పొందఁబడునది గనుకను, గాలి దూఱనిదిగనుకను నివాతము.

**జాతోన్నత ప్రవృద్ధాస్స్యురుచ్ఛ్రితాః-**

ఉచ్ఛ్రితశబ్దము పుట్టినదానికిని, పొడవైన వస్తువునకును, బహుళమైనదానికిని పేరు. ఉచ్ఛ్రీయత ఇతి ఉచ్ఛ్రితః. శ్రిఞ్ సేవాయాం. పొందఁబడునది.

**ఉత్థితాస్త్వమీ,**

వృద్ధిమత్ప్రోద్యతోత్పన్నాః ఉత్థితశబ్దము వృద్ధిఁబొందినవానికిని, ఉద్యోగము గలవానికిని, పుట్టిన వానికిని పేరు. ఉత్తిష్ఠతి స్మ ఉత్థితః ష్ఠా గతినివృత్తౌ. లేచినవాఁడు.

**ఆదృతౌ సాదరార్చితౌ.** 86

ఆదృతశబ్దము ఆదరించువానికిని, ఆదరింపఁబడినవానికిని పేరు. ఆద్రియత ఇ త్యాదృతః – ఆదరించువాఁడు, ఆదరింపఁబడినవాఁడును ఆదృతుఁడు.

## ధాంతములు

**అర్థో ఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు,**

అర్థశబ్దము శబ్దమునకును, వాచ్యమైనదానికిని, ధనమునకును, వస్తువునకును, ప్రయోజనమునకును, పోవుటకును పేరు. అర్థ్యత ఇత్యర్థః.

అర్థ ఉపయాచ్ఞాయాం. కోరఁబడునది. టీ. స. అభిధేయః = శబ్దప్రత్యాయ్యః యథా ___ శబ్దార్థౌ కావ్యమితి. రాః = ధనం యథా ___ 'న్యాయే నార్జనమర్థానా'మితి. వస్తుప్రమాణసిద్ధం స్వరూపం యథా ___ 'షట్పదార్థాః షోడశపదార్థా' ఇతి. ప్రయోజన ముద్దేశ్యం యథా ___ 'ఓదనార్థాస్తండులాః' 'ధర్మార్థా పత్నీ' నివృత్తౌ ___ 'మశకార్థో ధూమః' 'తస్కరార్థో ఉర్గళాబంధ' ఇతి.

**నిపానాగమయో స్తీర్థ మృషిజుష్టజలే గురౌ.** 87

తీర్థశబ్దము నూతియొద్ద నీళ్లతొట్టికిని, శాస్త్రమునకును, ఋషుల చేత సేవింపఁబడిన జలాశయమునకును, గురువునకును పేరు. కొందఱు నిపాన మనుటకు నిదాన మని చదివి యాదికారణమని యర్థము చెప్పిరి. తరంత్యనేనేతి తీర్థం. తౄ ప్లవనతరణయోః. దీనిచేత తరింతురు. 'తీర్థం శస్త్రాధ్వర క్షేత్రోపా యోపాధ్యాయమంత్రిషు, అవతారర్షి జుష్టాంభః స్త్రీరజస్సు చ' ఇతి విశ్వః. 'తీర్థంసత్రిణి పాత్రేచ' ఇతి స్వామీ. అత్రమంత్రి గ్రహణం సేనాపతి పురోహితాదీనా మప్యుపలక్షణమ్.

**సమర్థస్త్రిషు శక్తిస్థే సంబద్ధార్థే హితే ఉపి చ,**

సమర్థశబ్దము మిక్కిలి సామర్థ్యముగలవానికిని, అన్వయయోగ్యమైన యర్థముగలదానికిని, హితమైనవానికిని పేరు. సమర్థయతే సమర్థః. త్రి. అర్థ ఉపయాచ్ఞాయాం. సమర్థించువాఁడు.

**దశమీస్థా క్షీణరాగ వృద్ధౌ -**

దశమీస్థ శబ్దము నష్టవీర్యునకును, వృద్ధునకును పేరు. దశమ్యామవస్థాయాం తిష్ఠతీతి దశమీస్థః. స్థా గతినివృత్తౌ. పదియవ యవస్థ యందుండువాఁడు.

**వీథీ పదవ్యపి.** 88

వీథీశబ్దము మార్గమునకును, అపిశబ్దమువలన పఙ్క్తికిని పేరు. విథ్యతే ఉనయా వీథీ. సీ. విథృ యాచనే. దీనియందు యాచింతురు. 'వీథీ పఙ్క్త్యా వశ్యగతౌ నాట్యభేదే గృహాంగణే' ఇతి శేషః.

**ఆస్థానీ యత్నయో రాస్థా**

ఆస్థాశబ్దము ఆస్థానమునకును, యత్నమునకును పేరు. ఆతిష్ఠన్త్యస్యా మిత్యాస్థా ష్ఠా గతి నివృత్తౌ. దీనియందుందురు.

**ప్రస్థో உస్త్రీ సానుమానయోః**

ప్రస్థశబ్దము కొండనెత్తమునకును, కుంచమునకును పేరు. ప్రతిష్ఠతే உస్మిన్నితి ప్రస్థః. అ. ప్న. ష్ఠా గతినివృత్తౌ. దీనియందు ధాన్యాదులుండును.

## దాంతములు

**అభిప్రాయవశౌ ఛన్దౌ -**

ఛందశబ్దము అభిప్రాయమునకు, అధీనునికిని పేరు. ఛన్ద్యత ఇతి ఛందః. ఛది సంవరణే. ఆహ్లాదమును జేయునది.

**అబ్దౌ జీమూత వత్సరౌ.** 89

అబ్దశబ్దము మేఘమునకును, సంవత్సరమునకును పేరు. పా. అబ్దౌ జీమూతపర్వతౌ. ఆపో దదాతీతి, ఆప్నోతీతి చ అబ్దః. డు దాఞ్ దానే. ఆప్ ౡ వ్యాప్తౌ. జలము నిచ్చునదియు, పొందినదియు అబ్దము. “గిరిదర్పణయో రబ్ద”ఇతి శేషః.

**అపవాదౌ తు నిన్దాజ్ఞే -**

అపవాదశబ్దము నిందకును, ఆజ్ఞకును పేరు. అపవదనం అపవాదః. వద వ్యక్తాయాం వాచి. నిక్కృష్టముగాఁ బలుకుట.

**దాయాదౌ సుత బాన్ధవౌ,**

దాయాదశబ్దము కొడుకునకును, జ్ఞాతికిని పేరు. దాయం విభజనీయం ధన మత్తీతి, ఆదత్త ఇతి వా దాయాదః. అద భక్షణే, డు దాఞ్దానే. పాలిసొమ్మును భుజించువాఁడుగాని, పుచ్చుకొనువాఁడుగాని దాయాదుఁడు.

**పాదా రశ్మ్యఙ్ఘ్రి తుర్యాంశాః-**

పాదశబ్దము కిరణమునకును, కాలికిని, నాలవపాలికిని పేరు. పద్యంతే అనేనేతి పాదః పద గతౌ. దీనిచేత పొందుదురు. “పాదస్స్యాద్బుధ్నపూజ్యయో” రితిశేషః.

**చన్ద్రాగ్న్యర్కాస్తమోనుదః.** 90

తమోనుచ్ఛబ్దము చంద్రునికిని, అగ్నికిని, సూర్యునికిని పేరు. తమో నుదంతీతి తమోనుదః. ద. పు. ణుద ప్రేరణే. అంధకారమును బోఁగొట్టువారు.

**నిర్వాదో జనవాదే ఽపి -**

నిర్వాదశబ్దము నిందకును, అపిశబ్దమువలన నిశ్చితమైన వాదమునకును, వాదము లేకుండుటకును పేరు. నికృష్టోవాదో, నిశ్చితో వాదో, వాదాభావశ్చ నిర్వాదః. వద వ్యక్తాయాం వాచి. నికృష్టమైన వాదము, నిశ్చితమైన వాదము, వాదము లేకుండుటయు గనుక నిర్వాదము. "నిర్వాదో నిశ్చితే వాదే వాదాభావే నఞ వ్యయ"మితి శేషః.

**శాదో జమ్బాల శష్పయోః,**

శాదశబ్దము అడుసునకును, లేఁత కసవునకును పేరు. శీయతే పాదో ఽనేనేతి శాదః. శద్ ౯ శాతనే. దీనిచేత అడుగు కృశించును.

**సారావే రుదితే త్రాతర్యాక్రన్దో దారుణే రణే.** 91

ఆక్రందశబ్దము ఆర్తధ్వనితోఁగూడిన రోదనమునకును, రక్షించువానికిని, భయంకరమైన యుద్ధమునకు పేరు. ఆక్రందనం, ఆక్రంద్యతే అస్మై, అస్మిన్నితి చ ఆక్రందః. క్రిది ఆహ్వానే రోదనే చ. మొఱపెట్టుట. వీనికొఱకు దీనియందును మొఱపెట్టఁబడును.

**స్యాత్ప్రసాదో ఽనురోధే ఽపి -**

ప్రసాదశబ్దము అనుసరించుటకును, అపిశబ్దమువలన నైర్మల్యమునకును, ప్రీతికిని పేరు. ప్రసీదం త్యనేన, ప్రసదనమితి చ ప్రసాదః. షద్ ౯ విశరణ గత్యవసాదనేషు. దీనిచేత ప్రసన్ను లౌదురు, ప్రసన్న మౌట గనుకను ప్రసాదము. "స్వాస్థ్యే ప్రసాదః కావ్యస్య ప్రాణే నైర్మల్యహర్షయో" రితి శేషః.

**సూదస్స్యాద్వ్యఞ్జనే త్రిషు,**

సూదశబ్దము పప్పు మొదలైన వ్యంజనములకును, వండువానికిని పేరు. సూదయతి క్షుదాదికమితి సూదః. త్రి. షూద హింసాయాం. ఆఁకలి మొదలయిన దానిని పోమొత్తును.

**గోష్ఠాధ్యక్షే ఽపి గోవిన్దః -**

గోవిందశబ్దము ఆవుల నేలువానికిని, అపిశబ్దమువలన శ్రీకృష్ణునికిని, బృహస్పతికిని పేరు. గాః విందీతి గోవిందః. విద్ ౯ లాభే. ఆవులను బొందినవాడు, వాక్కులను బొందినవాఁడును గనుక గోవిందుఁడు.

**హర్షే ఽప్యామోదవన్మదః.** 92

ఆమోద మద శబ్దములు హర్షమునకును, అపిశబ్దమువలన ఆమోదశబ్దము పరిమళమునకును, మదశబ్దము గర్వమునకు పేరు. ఆమోదన మామోదః, మాద్యతే మదః. ముద హర్షే, మదీ హర్షగ్లేపనయోః. హర్షించుట గనుక ఆమోదము, ముదమును. 'మదో రేతసి కస్తూర్యాం గర్వే హర్షేభదానయో" రితి శేషః.

**ప్రాధాన్యే రాజలిఙ్గేచ వృషాఙ్గే కకుదో ఽ స్త్రియామ్,**

కకుదశబ్దము ప్రధానమైనదానికిని, రాజచిహ్నమునకును, ఆఁబోతుమూఁపురమునకును పేరు. కు అప్పం కః శిర ఇవ తిష్ఠతీతి కకుదః– అల్పమైన శిరస్సువలె నుండునది. దకారాంతమును గలదు. టీ. స. ప్రధానమేవ ప్రాధాన్యం. తత్రయథా ___ "ఇక్ష్వాకువంశ్యః కకుదో నృపాణాం కకుత్స్థ ఇత్యాహిత లక్షణో___భూ" దితి. రాజచిహ్నే ___ 'నృపతి కకుదందత్వాయునేసితాతపవారణ' మితి. వృషాంగే___ 'కకుదేవృషస్యకృతబాహు' మితి. "స్త్రీ కకుత్కకుదో ఽ స్త్రీరాట్చి హ్నే ప్రష్ఠవృషాంగయో" రితి రుద్రః.

**స్త్రీసంవిద్జ్ఞాన సంభాషా క్రియాకా రాజి నామసు.** 93

సంవిచ్ఛబ్దము జ్ఞానమునకును, సంకేతమునకును ప. సంభాషణమునకును, క్రియానిశ్చయమునకుమ, యుద్ధమునకును, నామధేయమునకును పేరు. సంవేదనం, సంవిదం త్యనయా చేతి సంవిత్. ద. సీ. లెస్సగా నెఱుఁగుటయు, దీనిచేత లెస్సగా నెఱుఁగుదురు గనుకను సంవిత్తు. "సంవిజ్జ్ఞానే ప్రతిజ్ఞాయాం సంకేతాచార నామసు, సంభాషణే తోషణే చ క్రియాకారే చ సంగర" ఇతి ప్రతాపః.

**ధర్మే రహ స్యుపనిషత్ -**

ఉపనిషచ్ఛబ్దము ధర్మమునకును, రహస్యమునకును పేరు. సర్వే అర్థా ఉపనిషీదంత్యస్యామితి ఉపనిషత్. ద. సీ. షద్ ౡ విశరణ గత్యవసాదనేషు. దీనియందన్ని యర్థములు నుండును.

**స్యా దృతౌ వత్సరే శరత్,**

శరచ్ఛబ్దము ఋతువిశేషమునకును, సంవత్సరమునకును పేరు. శృణాతి పంకమితి శరత్. ద. సీ. శౄ హింసాయాం. పంకమును బో మొత్తునది. 'స్త్రీసంవిత్' అనుచోట స్త్రీశబ్దము ఉపనిషచ్ఛరచ్ఛబ్దముల యందు

సన్వయించును గనుక ఉపనిషచ్ఛరచ్ఛబద్దములు స్త్రీలింగములు.

**పదం వ్యవసిత త్రాణ స్థాన లక్ష్మాఙ్ఘ్రివ స్తుషు.** 94

పదశబ్దము ఉద్యోగముకును, రక్షించుటకును, స్థానమునకును, చిహ్నమునకును, అడుగునకును, వస్తువునకును పేరు. పద్యతే అనే నేతి పదం. పద్ ౙగతౌ. దీనిచేత పొందుదురు.

**గోష్పదం సేవితే మానే -**

గోష్పదశబ్దము గోవులున్న దేశమునకును, ఆవుగొరిజ దిగఁబడిన గుంటకును పేరు. గావః పద్యంతే ఽత్ర గోష్పదం. పద్ ౙగతౌ. గోవులు దీనియందు సంచరించును.

**ప్రతిష్ఠా కృత్య మాస్పదమ్,**

ఆస్పదశబ్దము స్థానమునకును, చేయఁదగినదానికిని పేరు. ఆ సమంతతః పద్యత ఇ త్యాస్పదం – అంతట పొందఁబడునది.

**త్రిషు -**

స్వాదుశబ్దము మొదలు దాంతము లన్నియుఁ ద్రిలింగములు.

**ఇష్ట మధురౌ స్వాదూ -**

స్వాదుశబ్దము ఇష్టమైనదానికిని, మధురమయినదానికిని పేరు. స్వదత ఇతి స్వాదు. త్రి. ష్వద ఆస్వాదనే. రుచించునది. 'స్వాదు ర్మృష్ట మనోజ్ఞయో' రిత్యజయః.

**మృదూ చాతీక్ష్ణకోమలౌ.** 95

మృదుశబ్దము క్రూరముగానివానికిని, మెత్తనివానికిని పేరు. మృద్యత ఇతి మృదు. త్రి. మెదపఁబడునది.

**మూఢాల్పాపటు నిర్భాగ్యా మన్దాస్స్యుః -**

మందశబ్దము మాఢునికిని, అల్పునికిని, సమర్థుఁడు గానివానికిని, నిర్భాగ్యునికిని పేరు. మందతే స్వపితీతి మందః. మది స్వప్నే. నిద్రవోయినట్టు లుండువాఁడు. టీ. స. మూఢః ప్రజ్ఞాహీనః. తత్ర___ 'మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతా' మితి రఘువంశే. అల్పే___ అగ్నిమాంద్యం. అపటుర్వ్యాధితః, తత్రమందం చికిత్సతి భిషక్. దరిద్రే ___ 'నాస్తిమందస్య కాంక్షిత'మితి. 'మందో మందే మంద కార్యే స్వైకకారీభ భేదయో' రితి శేషః. శనైశ్చరగ్రహోఽపి మందః.

**ద్వౌతు శారదౌ,**

**ప్రత్యగ్రా ప్రతిభౌ -**

శారదశబ్దము నూతనమైనదానికిని, సమర్థుఁడు కానివానికిని పేరు. శరది భవః శారదః–శరత్తునందుఁ బుట్టినది. 'శారదస్సప్తపర్ణే స్యాత్సరస్వత్యాంతు శారదా, శారదా గజపిప్పల్యాం మృదువర్షభవే(త్రి' ష్వితిశేషః.

**విద్వత్సు ప్రగల్భౌ విశారదౌ.** 96

విశారదశబ్దము విద్వాంసునికిని, ప్రౌఢునికిని పేరు. విశిష్టా శారదా అస్యేతి విశారదః – అధికమైన సరస్వతి గలవాఁడు.

## ధాంతములు

**వ్యామో వటశ్చ న్యగ్రోధౌ -**

న్యగ్రోధశబ్దము బారకును, మఱ్ఱిచెట్టునకును పేరు. న్యక్ రోహతీతి న్యగ్రోధః. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. అడ్డముగా వ్యాపించునది.

**ఉత్సేధః కాయ ఉన్నతిః,**

ఉత్సేధశబ్దము శరీరమునకును, పొడవునకును పేరు. ఉత్సేధతీతి ఉత్సేధః. షిధు గత్యాం. మీఁదికిఁ బెరుగునది.

**పర్యాహారశ్చ మార్గశ్చ వివధౌ వీవధౌ చ తౌ.** 97

వివిధ వీవధశబ్దములు కావడికిని, మార్గమునకును పేళ్లు. పర్యాహారమనఁగా వర్తకుఁడు దేశాంతరమునుండి తెచ్చి విక్రయస్థానమందుంచిన వస్తువని కొందఱు. వివిధోవధో వహనదుఃఖ మత్రేతి వివధః, వీవధశ్చ. దీనియందు వహనదుఃఖము గలదు గనుక వివధము, వీవధమును.

**పరిధి ర్యజ్ఞియతరో శ్శాఖాయా ముపసూర్యకే,**

పరిధిశబ్దము యజ్ఞార్హమైన మేడిచెట్టు మొదలయిన దానికొమ్మకును, పరివేషమునకును పేరు. పరితో ధీయతే పరిధిః. పు. డు ధాఞ్ ధారణపోషణయో. చుట్టును ధరింపఁబడునది.

**బంధకం వ్యసనం చేతః పీడాధిష్ఠాన మాధయః.** 98

అధిశబ్దము క్షేత్రాదులను కుదువపెట్టుటకును, ద్యూతము మొదలైన వ్యసనములకును, మనఃపీడకును, ఆశ్రయించుటకును పేరు. ఆధీయత ఇత్యాధిః. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః. పెట్టఁబడునది.

**స్యు స్సమర్థన నీవాక నియమాశ్చ సమాధయః,**

సమాధిశబ్దము శంకాపరిహారమునకును, అగ్గువైన ధాన్యాదుల యందుఁ గల జనులయొక్క ఆదరమునకును, ఇంద్రియనిగ్రహమునకును పేరు. కొందఱు నీవాకము వచనాభావము, నియమము, అంగీకారమునని చెప్పుదురు. సమ్యగాధీయతే మనో ऽత్రేతి సమాధిః. పు. డు ధాఞ్ ధారణ పోషణయోః. దీనియందు మనస్సు లెస్సగా నుంచఁబడును. “సమాధిర్హృదయైకాగ్ర్యే వైశ్యభేదప్రకారయో” రితి శేషః.

**దోషోత్పాదే ऽనుబన్ధ స్స్యాత్ప్రకృత్యాదిషు నశ్వరే.** 99
**ముఖ్యానుయాయిని శిశౌ ప్రకృతస్యానువర్తనే.**

అనుబంధశబ్దము దోషోత్పాదమునకును, ప్రకృతి ప్రత్యయాదుల యందు నశించిపోవు నక్షరమునకును, ముఖ్యులైన తండ్రి మొదలైనవారి ననుసరించి నడుచుకొను శిశువునకును, ప్రకృతమైనదాని ననువర్తించుటకును పేరు. “ముఖ్యానుయాయిని శిశౌ” అనుచోట ముఖ్యుఁడైనవాని ననుసరించువానికిని, శిశువునకును పేరని ప్రత్యేకముగాఁ జెప్పుదురు. దోషోత్పాదనమున కెట్లనిన ___ “అనుబంధ మవస్థాం జ్ఞాత్వాదండం నిపాతయేత్” అని స్మృతి. అనుబధ్నాతీతి అనుబంధనం, అనుబంధశ్చ. బంధ బంధనే. అనువర్తించునది గనుకను, అనుసరించుట గనుకను అనుబంధము.

**విధు ర్విష్ణౌ చన్ద్రమసి -**

విధుశబ్దము విష్ణువునకును, చంద్రునకును పేరు. వ్యధత ఇతి విధుః. వ్యధతాడనే. అసురులను అంధకారమును బోఁగొట్టువాఁడు.

**పరిచ్ఛేదే బలే ऽవధిః.** 100

అవధిశబ్దము మర్యాదకును, బలమునకును పేరు. అవధీయతే అనేనే త్యవధిః. పు. దీనిచేత నిశ్చయింపఁబడును.

**విధి ర్విధానే దైవే ऽపి -**

విధిశబ్దము చేయుటకును, దైవమునకును, అపిశబ్దమువలన బ్రహ్మదేవునికిని, ప్రకారమునకును, విధాయక వాక్యమునకును పేరు. విధానం, విదధాతీతి చ విధిః. పు. చేయుటయును, చేయువాఁడును విధి. “విధిః ప్రకారే కల్పే చ లిఙ్గాద్యర్థే ప్రజాపతౌ” వితి శేషః.

**ప్రణిధిః ప్రార్థనే చరే,**

ప్రణిధిశబ్దము ప్రార్థనకును, వేఁగులవానికిని పేరు. ప్రణిధానం, ప్రణిధీయత ఇతి చ ప్రణిధిః. పు. డుధాఞ్ ధారణపోషణయోః. ప్రార్థించుట, ప్రార్థింపఁబడువాఁడును ప్రణిధి.

**బుద్ధ వృద్ధౌ పణ్డితే ఽ పి -**

బుద్ధవృద్ధశబ్దములు విద్వాంసునికిని, అపిశబ్దమువలన వరుసగా బుద్ధదేవునకును ముసలివానికిని పేళ్లు. బుధ్యతీతి బుద్ధః. బుధ అవగమనే. ఎఱుఁగువాఁడు. ౧. వర్ధత ఇతి వృద్ధః. త్రి. వృధు వృద్ధౌ. వృద్ధిఁబొందువాఁడు.

**స్కన్ధ స్సముదయే ఽ పి చ.** 101

స్కంధశబ్దము అధ్యాయాది సమూహమునకును, అపిశబ్దమువలన మూఁపునకును, చెట్టుమొదటికిని, బౌద్ధ శాస్త్రోక్తమైన రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారములను పంచస్కంధములకును పేరు. స్కంధత ఇతి స్కంధః స్కందిర్ గతిపోషణయోః. పొందఁబడునది. 'సమీహో వృషయోః స్కంధ స్సైన్య రూపాది పంచక' ఇతి శేషః.

**దేశే నదవిశేషే ఽ బ్ధౌ సిన్ధు ర్నా సరితి స్త్రియామ్,**

సింధుశబ్దము దేశ విశేషమునకును, నద విశేషమునకును, సముద్రమునకును పేరైనపుడు పు. సామాన్యముగా నదికిని నదీ విశేషమునకును పేరైనప్పుడు స్త్రీ. స్యందత ఇతి సింధుః. స్యందూ ప్రస్రవణే. ప్రవహించునది. 'సింధు ర్గజమదే ఽ పిస్యా' దితి శేషః.

**విధా విధౌ ప్రకారే చ -**

విధాశబ్దము చేయుటకును, ప్రకారమునకును పేరు. చకారము వలన గజాన్నమునకును, కూలికిని పేరు. విధానం, విధీయత ఇతి చ విధా. స్త్రీ. డు ధాఞ్ ధారణ పోషణయోః. చేయుటయు, చేయఁబడునదియును గనుక విధ. పుంలింగమని కొందఱు. 'విధో విధానే హస్త్యన్నే ప్రకారేవేతనే ఽ పిచ' అని పుంలింగమం దజయుఁడు. "విధా నర్ధిప్రకారేషు గజాన్నే వేతనే విధా" అని రుద్రుడు.

**సాధూ రమ్యే ఽ పి చ త్రిషు.** 102

సాధుశబ్దము ఒప్పిదమైనదానికిని, అపిశబ్దము వలన సజ్జనునికిని పేరు. సాధ్నోతీతి సాధుః. త్రి. రాధసాధ సంసిద్ధౌ సాధించువాఁడు.

"సాధు ర్వార్ధుషికే చారౌ చాభిధేయవ" దితి విశ్వప్రకాశః.

**వధూ ర్జాయా స్ను షా స్త్రీ చ -**

వధూశబ్దము పెండ్లామునకును, కోడలికిని, స్త్రీమాత్రమునకును, చకారమువలన స్పృక్కయను గంధ ద్రవ్యవిశేషమునకును పేరు. ఊహ్యత ఇతి వధూః. సీ. వహ ప్రాపణే. వహింపఁబడునది. "నవోఢాయాం ప్రియంగౌ చ శటీశారిబయోర్వధూ" రితి శేషః.

**సుధా లేపో ఽ మృతం స్నుహీ,**

సుధాశబ్దము పూయునట్టి సున్నమునకును, అమృతమునకును, జెముడు చెట్టుకును పేరు. సుష్ఠు ధీయత ఇతి సుధా. డు ధాఞ్ ధారణ పోషణయో. ధేట్ పానే. లెస్సగా ధరింపఁబడునది, పాపము చేయఁబడునది సుధ. "సుధా పయసి మూర్వాయా" మితి శేషః.

**సంధా ప్రతిజ్ఞా మర్యాదా -**

సంధాశబ్దము ప్రతిజ్ఞకును మర్యాదకును పేరు. సంధీయతే క్షేత్రద్వయ ప్రాంతావనయేతి సంధానంచ, సంధా – దీనిచేత క్షేత్రద్వయ ప్రాంతములు చేర్చఁ బడును. ప్రతిజ్ఞ సేయుటయు గనుక సంధ.

**శ్రద్ధా సంప్రత్యయః స్పృహా.** 103

శ్రద్ధాశబ్దము భక్త్యతిశయమునకును, ఇచ్ఛకును పేరు. శ్రద్ధధతే అనయేతి శ్రద్ధా. డుధాఞ్ ధారణ పోషణయోః. దీనిచేత విశ్వసింతురు.

**మధు మద్యే పుష్పరసే క్షౌద్రే ఽ పి -**

మధుశబ్దము మద్యమునకును, పూఁదేనెకును, తేనెకును పేరగునపుడు న. అపిశబ్దమువలన చైత్రమాసమునకును, అసురునకును, ఇప్పచెట్టుకును పేరగునపుడు పు. మాద్యంత్యనేనేతి మధు. మదీ హర్షే, దీనిచేత మదింతురు. "మధుర్నా క్షత్రియే చైత్రే వసంతే దానవేద్రుమే, అస్త్రియాం మద్యభేదే స్యాత్ క్లీబం సలిలదుగ్ధయో" రితి శేషః.

**అన్ధం తమస్యపి,**

అంధశబ్దము అంధకారమునకు పేరగునపుడు న. అపిశబ్దము వలన గ్రుడ్డివానికిఁ బేరగునపుడు త్రి. అన్ధయతీ త్యన్ధం. అన్ధ దృష్ట్యుపసంహారే. కానరాకుండఁ జేయునదియు, కానరానివాఁడును అంధము, అంధుఁడును.

**అథ త్రిషు -**

ముందుఁ జెప్పఁబడు ధాంతము లన్నియు త్రిలింగములు.

**సమున్నద్ధౌ పణ్డితంమన్య గర్వితౌ.** 104

సమున్నద్ధశబ్దము తాను విద్వాంసుఁడు గాక విద్వాంసుఁడ నను నభిమానము గలవానికిని, గర్వము గలవానికిని పేరు. సమున్నహ్యత ఇతి సమున్నద్ధః. ణహ బంధనే. గర్వించువాఁడు.

**బ్రహ్మబన్ధు రధిక్షేపే నిర్దేశే -**

బ్రహ్మబంధుశబ్దము బ్రాహ్మణకర్మహీనుఁడైన బ్రాహ్మణునికిని, ద్వేషముచేతఁ బేర్కొనఁబడినవానికిని పేరు. బ్రహ్మణో బ్రాహ్మణస్య బంధుః బ్రహ్మబంధుః – అనుష్ఠానాదులు లేక బ్రాహ్మణునికి బంధుమాత్రుఁడైనవాఁడు. (ఈలాగే క్షత్రబంధు శబ్దమును తిరస్కారమందుఁ జెప్పఁబడును).

**అ థావలమ్బితే,**

**అవిదూరే ఉ ష్యవష్టబ్ధః -**

అవష్టబ్ధశబ్దము అవలంబింపఁబడినవానికిని, దగ్గఱ నున్నవానికిని, అపిశబ్దమువలన కట్టఁబడి వానికిని పేరు. అవష్టభ్యత ఇత్యవష్టబ్ధః. స్తంభు రోధనే. అవలంబింపఁబడును. “ఆక్రాంతే చావరుద్ధే స్యా దవష్టబ్ధ స్తిరస్కృత” ఇతి శేషః.

**ప్రసిద్ధౌ ఖ్యాత భూషితౌ.** 105

ప్రసిద్ధశబ్దము ఖ్యాతిగలవానికిని, అలంకరింపఁబడినవానికిని పేరు. ప్రకర్షేణ సిధ్యతీతి ప్రసిద్ధః. షిధు సంరాద్ధౌ. ప్రకర్షముచేతనైనవాఁడు.

## నాంతములు

**సూర్య వహ్నీ చిత్రభానూ -**

చిత్రభానుశబ్దము సూర్యునకును, అగ్నికిని పేరు. చిత్రాః భానవోయస్య సః చిత్రభానుః – నానావిధములైన కిరణములు గలవాఁడు.

**భానూ రశ్మి దివాకరౌ,**

భానుశబ్దము కిరణమునకును, సూర్యునికిని పేరు. భాతీతి భానుః. భా దీప్తౌ. ప్రకాశించును గనుక భానువు.

**భూతాత్మానౌ ధాతృదేహౌ -**

భూతాత్మన్‌శబ్దము బ్రహ్మకును, దేహమునకును పేరు. భూతానాం ప్రాణినా మాత్మా, పృథివ్యాది భూతస్వరూప ఇతి చ భూతాత్మా. న. పు. ప్రాణులకు ఆత్మ గనుకను, పంచమహాభూతస్వరూపముగను భూతాత్మ.

**మూర్ఖ నీచౌ పృథగ్జనౌ.** 106

పృథగ్జనశబ్దము మూర్ఖునికిని, హీనజాతివానికిని పేరు. పృథక్కార్యో జనః పృథగ్జనః – పృథక్కరింపఁదగిన జనుఁడు.

**గ్రావాణౌ శైల పాషాణౌ -**

గ్రావన్‌శబ్దము పర్వతమునకును, ఱాతికిని పేరు. గృహ్యాత ఇతి గ్రావా. న. పు. గ్రహింపఁబడునది.

**పత్త్రిణౌ వర పక్షిణౌ,**

పత్త్రిన్‌శబ్దము అమ్మునకును, పక్షికిని పేరు. పత్త్రాణి పక్షాః అస్య సంతీతి పత్త్రి. న. పు. ఱెక్కలు గలది.

**తరుశైలౌ శిఖరిణౌ -**

శిఖరిన్‌శబ్దము వృక్షమునకును, పర్వతమునకును పేరు. శిఖరాణ్యస్య సంతీతి శిఖరీ. న. పు. అగ్రములు గలది.

**శిఖినౌ వహ్ని బర్హిణౌ.** 107

శిఖిన్ శబ్దము అగ్నికిని, నెమలికిని పేరు. శిఖాః అస్య సంతీతి శిఖి. న. పు. జ్వాలలును, చుంచును గలిగినది.

**ప్రతియత్నావుభౌ లిప్సోపగ్రహౌ -**

ప్రతియత్నశబ్దము అభిలాషకును, చెఱపట్టుటకును పేరు. ప్రతి యతనం ప్రతియత్నః. యతీ ప్రయత్నే. యత్నము చేయుట ప్రతి యత్నము. "ప్రతియత్నః ప్రతీకారే గుణాధానే చ వస్తున" ఇతి శేషః.

**అథ సాదినౌ,**

**ద్వౌ సారథి హయారోహౌ -**

సాదిన్ శబ్దము సారథికిని, గుఱ్ఱపురౌతునకును పేరు. సీదతి నిషీదతి, సాదయతి తురగమితి చ సాదీ. న. పు. షద్ ౯ విశరణగ్యవసాదనేషు. కూర్చుండువాఁడును. గుఱ్ఱమును నొప్పించువాఁడును సాది. "సాదీ స్యాత్తురగారోహే రథేభారోహయోరపి" ఇతి ప్రతాపః.

**వాజినో ఽ శ్వేషు పక్షిణః,** 108

వాజిన్‌శబ్దము గుఱ్ఱమునకును, అమ్మునకును, పక్షికిని పేరు. వాజాః పక్షాస్సంత్యస్యేతి వాజీ. న. పు. ఱెక్కలు గలిగినది.

**కులే ఽ ప్యభిజనో జన్మభూమావపి-**

అభిజనశబ్దము కులమునకును, జన్మభూమికిని, అపిశబ్దమువలన కీర్తికిని, కులాగతమైన ధ్వజాదులకును పేరు. అభిజాయతే ఽ స్మిన్ని త్యభిజనః. జనీ ప్రాదుర్భావే. దీనియందుఁ బుట్టుదురు.

**అథ హాయనాః,**

**వర్షార్చి ర్వ్రీహిభేదా స్స్యుః -**

హాయనశబ్దము సంవత్సరమునకు, కిరణమునకు, వ్రీహి భేదమునకు, చకారమువలన శత్రువునకును పేరు. భావాన్ జిహీత ఇతి హాయనః. ఓ హాఙ్ గతౌ. అవస్థలను బొందునది.

**చన్ద్రాగ్న్యర్కా విరోచనాః.** 109

విరోచనశబ్దము చంద్రునికి, అగ్నికి, సూర్యునికిని పేరు. విరోచత ఇతి విరోచనః. రుచ దీప్తౌ. ప్రకాశించువాఁడు. 'విరోచనో బలేస్తాత' ఇతి శేషః.

**కేశే ఽ పి వృజినః -**

వృజినశబ్దము వెండ్రుకలకు పేరైనపుడు త్రి. అపిశబ్దమువలన పాపమునకు పేరైనప్పుడు న. క్లేశమునకు పేరైనప్పుడు పు. "వృజినం కల్మషే క్లీబం క్లేశేవా కుంతలేత్రిషు" అని రభసుఁడు. వృజ్యత ఇతి వృజినం. వృజీవర్జనే. విడువఁబడునది.

**విశ్వకర్మార్క సురశిల్పినోః,**

విశ్వకర్మన్‌శబ్దము సూర్యునికిని, దేవశిల్పికిని పేరు. విశ్వం కర్మాస్యేతి విశ్వకర్మా. న. పు. సకలమైన క్రియలు గలవాఁడు. టీ. స. విశ్వస్యకర్మాణి యస్మాదితి విశ్వకర్మేతి సూర్యపక్షే.

**ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధి స్స్వభావో బ్రహ్మ వర్ష్మ చ.** 110

ఆత్మన్ శబ్దము యత్నమునకు, ధైర్యమునకు, బుద్ధికి, స్వభావమునకు, పరమాత్మకు, దేహమునకు, చకారము వలన జీవునికిని పేరు. అతతీత్యాతా.న. పు. అత సాతత్యగమనే. ఎడతెగక తిరుగునది. టీ. స. యత్నే___

'ఆత్మానురూపం ఫల' మితి. యత్నానురూపమిత్యర్థః. ధైర్యే___ ఆత్మ వాన్నైవ ముహ్యతి. బుద్ధౌ___ స్వాత్మవేదో ఽ యమర్థః. స్వబుద్ధివేద్య ఇత్యర్థః. స్వభావస్సహజో ధర్మః. తత్ర___ దుష్టాత్మా క్రోధాత్మా. పరమాత్మని___ ఆత్మైవేదం సర్వం. శరీరే – స్థూలాత్మా కృశాత్మా. జీవే – నావాత్మానోవ్యవస్థాత ఇతి. "ఆత్మేంద్రియే ఽ నిలే జీవ" ఇతి శేషః.

**శక్ర ఘాతుక మత్తేభ వర్షుకాబ్దా ఘనాఘనాః,**

ఘనాఘనశబ్దము దేవేంద్రునికిని, చంపునట్టి స్వభావము గలవానికిని, మదపుటేనుఁగునకును, వర్షించునట్టి మేఘమునకును పేరు. ఘాతుక మత్తేభ మన్నచోట చంపునట్టి స్వభావముగల మదపుటేనుఁగని కొందఱు. హంతీతి ఘనాఘనః. హన హింసాగత్యోః. చంపునది, పోవునది.

**అభిమానో ఽ ర్థాది దర్పే ఽ జ్ఞానే ప్రణయహింసయోః.** 111

అభిమానశబ్దము దనరూప కులాదులచే వచ్చిన గర్వమునకు, జ్ఞానమునకు, ప్రార్థనకు, హింసకును పేరు. అభిమాననం, అభిమననం చ, అభిమానః. మాన పూజాయాం, మనజ్ఞానే. మీఙ్ హింసాయాం. గర్వించుట జ్ఞానము, హింసయును, అభిమానము.

**ఘనో మేఘే మూర్తిగుణే త్రిషుమూర్తే నిరన్తరే,**

ఘనశబ్దము మేఘమునకును, కాఠిన్యమునకును పేరైనపుడు పు. కఠినమయిన వస్తువునకు, దట్టమైనదానికిని పేరైనపుడు త్రి. హన్యత ఇతి ఘనః. హన హింసాగత్యోః. కొట్టఁబడునది. లోహముద్గరముస్తాకాంస్యతాలాదులకును పేరు. 'ఘనం స్యాత్కాంస్యతాలాదౌ పుంసి ముద్గర ముస్తయో' రితి శేషః.

**ఇక సూర్యే ప్రభౌ -**

ఇనశబ్దము సూర్యునికిని, ప్రభువునకును పేరు. ఏతీతి ఇనః. ఇణ్గతౌ. సంచరించువాఁడు. 'ఇన స్సూర్యేనృపే పత్యా' వితి విశ్వప్రకాశః.

**రాజా మృగాఙ్కే క్షత్రియే నృపే.** 112

రాజన్‌శబ్దము చంద్రునికి, క్షత్రియజాతివానికి, భూమి నేలు రాజునకును పేరు. కొందఱు 'ప్రభౌ' అనునది యిక్కడికిని సంబంధించును గనుక ప్రభువన కుంబేరని చెప్పుదురు. 'ప్రభౌ భూమిపతౌ రాజా క్షత్రియే

రజనీపతౌ' అని రభసుఁడు. రాజత ఇతి రాజా. న. పు. రాజృ దీప్తౌ. ప్రకాశించువాఁడు.

**వాణిన్యౌ నర్తకీ దూత్యౌ -**

వాణినీశబ్దము నృత్యమాడు స్త్రీకిని, దూతికకును పేరు. వణతి తాచ్ఛీల్యేనేతి వాణినీ. సీ. వణ శబ్దే. పలుకునట్టి స్వభావముగలది. పా. మత్తా విదగ్ధే వాణిన్యౌ. అప్పుడు మదించిన స్త్రీకి, నేర్పరియైన స్త్రీకిని పేరు. "వాణినీ వానినీ సమే" ఇతిశేషః.

**స్రవన్త్యా మపి వాహినీ,**

వాహినీశబ్దము నదికిని, అపిశబ్దమువలన సేనకును, సేనావిశేషమునకును పేరు. వహతి, వాహయతీతి చ వాహినీ. సీ. వహ ప్రాపణే. ప్రవహించునది, ప్రయత్నముసేయునది వాహిని.

**హ్రాదిన్యౌ వజ్రతటితౌ -**

హ్రాదీనీశబ్దము వజ్రాయుధమునకును, మెఱపునకును పేరు. హ్రాదో ఽ స్యా అస్తీతి హ్రాదినీ. సీ. హ్రాద అవ్యక్తేశబ్దే. మ్రోఁత గలిగినది.

**వన్దాయామపి కామినీ.** 113

కామినీశబ్దము బదనికకును, అపిశబ్దమువలన విలాసినియైన స్త్రీకిని పేరు. కామో ఽ స్యా అస్తీతి కామినీ. సీ. అభిలాష గలిగినది. "శామాపారావతీ స్త్రీషు చక్రవాక్యాం చ కామినీ" ఇతి ప్రతాపః.

**త్వగ్దేహయో రపి తనుః -**

తనుశబ్దము తోలునకును, శరీరమునకును పేరైనపుడు సీ. అపి శబ్దమువలన అల్పమైనదానికిని, సన్నమైనదానికిని పేరైనపుడు త్రి. తస్యత ఇతి తనుః. తను విస్తారే. విస్తరింపఁబడునది. "తనుస్తు వాచ్యలింగస్స్యా త్స్వల్పే ఽ పి విరళే కృశ" ఇతి శేషః.

**సూనాధో జిహ్వికాపి చ,**

సూనాశబ్దము కొండనాలికకును, అపిశబ్దమువలన వధాస్థానమునకును పేరు. సువతి ప్రేరయతి శ్లేష్మాదికమితి. సూయన్తే ప్రాణిన అత్రేతి చసూనా. షూ ప్రేరణే. శ్లేష్మాదులను వెళ్లించునది. మేఁకలు మొదలైన జంతువులు దీనియందు తొలఁబడును గనుకను సూన. "సూనాపుత్ర్యాం వధస్థాన గళశుంఠికయోరపి, శూన్యేతు వాచ్యవత్సూనం క్లీబే ప్రసవ

పుష్పయో" రితి శేషః. వధస్థానం = భక్ష్యప్రాణినాం హననప్రదేశః. గళ శుండికా = గళస్తానజాతో గ్రంథివిశేషః.

**క్రతు విస్తారయో రస్త్రీ వితానం త్రిషు తుచ్ఛకే.** 114
**మన్దే -**

వితానశబ్దము యజ్ఞమునకును, విస్తారమునకును పేరైనపుడు ప్న. రిత్తయైనదానికి, మందునికిని పేరైనపుడు త్రి. వితన్యత ఇతి వితానం. విగతః అనః అత్రేతి వితానం. తను విస్తారే. విస్తరింపఁబడునది. విస్తారములేనిదియు గనుక వితానము. "వితానో యజ్ఞవిస్తా రోల్లోచేషు క్రతుకర్మణి, నృత్తభేదావసరయో" రితి విశ్వప్రకాశః.

**అథ కేతనం కృత్యే కేతా వుపనిమన్త్రణే,**

కేతనశబ్దము చేయఁదగిన పనికిని, టెక్కెమునకును, బ్రాహ్మణుల నిమంత్రణము చేయుటకును పేరు. కేతం త్యనేనేతి కేతనం. కిత జ్ఞానే. దీనిచేత నెఱుఁగుదురు. టీ. స. అవశ్యకర్తవ్యే ___ "నివాపాంజలిదానేన కేతనై శ్శ్రాద్ధకర్మభి" ధ్వజే ___ 'మీనకేతనః' నిమంత్రణే ___ "కృతకేతనం బ్రాహ్మణం నాతిక్రామే"దితి.

**వేద స్తత్త్వం తపో బ్రహ్మ బ్రహ్మా విప్రః ప్రజాపతిః.** 115

బ్రహ్మన్ శబ్దము వేదమునకు, పరమాత్మకు, తపస్సునకును పేరైనపుడు న. బ్రాహ్మణునికిని, బ్రహ్మదేవునికిని పేరైనపుడు పు. బృంహతీతి బ్రహ్మ. నాంతః. బృహబ్రహి వృద్ధౌ వృద్ధిఁ బొందునది. "బ్రహ్మాచంద్రార్కయో ర్యోగే పుంసి స్యా దృత్విగంతర" ఇతి శేషః.

**ఉత్సాదచేత హింసాయాం సూచనే చాపి గన్ధనమ్,**

గంధనశబ్దము నలుఁగు పెట్టుటకును, హింసకును, ఎఱిఁగించుటకును, అపిశబ్దమువలన ప్రకాశమునకును పేరు. 'ఉత్సాహనే చ హింసాయై' అనుపాఠము నందు ఉత్సాహమునకును, హింసించుటకై కొండెము చెప్పుటకును పేరు. గంధ్యతే అనేనేతి గంధనం. గంధ అర్దనే. దీనిచేత పీడింపఁబడును. "హింసార్థసూచనే హింసోత్సాహనే ఉపిచ గంధన" మితి శేషః.

**ఆతఞ్చనం ప్రతీవాప జవ నాప్యాయనార్థకమ్.** 116

ఆతంచన శబ్దము ప్రతీవాపమునకును, వేగమునకును, తృప్తి చేయుటకును పేరు. ప్రతీవాప మనఁగా కరఁగిన బంగారము మొదలైనవి ద్రవ్యాం

తరముతోఁ గూర్చి పొడిసేయుటకు పేరని కొందఱు. పెట్టినదానిని మరలఁ దీయుటకు పేరని కొందఱు. పాలలో తోడుపెట్టుట యని కొందఱు. ఆసమన్తాత్తంచనం ఆతంచనం. తంచుగతౌ. అంతట వ్యాపించుట.

**వ్యఞ్జనం లాఞ్ఛన శ్మశ్రు నిష్ఠానావయవే ష్వపి,**

వ్యంజనశబ్దము గుఱుతునకును, గడ్డము మీసాలకును, తిమ్మనమునకును, స్త్రీపురుషుల గుహ్యావయవములకును, అపిశబ్దముచేత కకారాది వర్ణములకును పేరు. వ్యజ్యతే అనేనేతి వ్యంజనం. అంజూ వ్యక్తి శ్లక్షకాంతిగతిషు. దీనిచేత ప్రకటముగాఁ జేయఁబడును. "వ్యంజనం కాదిహాంతేస్యా"దితి శేషః.

**స్యా త్కౌలీనం లోకవాదే యుద్ధే పశ్వహి పక్షిణామ్.** 117

కౌలీనశబ్దము లోకాపవాదమునకు, పశు సర్ప పక్షులయొక్క యుద్ధమునకును పేరు. కులే భవం కౌలీనం–కులమందుఁ బుట్టినది. టీ. స. నిందితః పురుషో నమితముఖత్వేన కౌ భూమౌలీన ఇవ భవతీతి కులీనః; తస్యేదం కౌలీనం. "కౌలీనం స్యా త్కులీనత్వే గుహ్యే జన్యే కుకర్మణి, కౌలేయక విహంగాహి పశూనాం సంగరే ఉపిచ" ఇతి ప్రతాపః.

**స్యా దుద్యానం నిస్సరణే వనభేదే ప్రయోజనే,**

ఉద్యానశబ్దము గృహాదులనుండి వెడలుటకును, శృంగారపుఁదోఁటకును, ప్రయోజనమునకును పేరు. ఉద్గతం యానం, ఉద్యాంత్యే తదిచి చ ఉద్యానం. యా ప్రాపణే. పోవుట గనుకను, దీనిఁగూర్చి పోదురు గనుకను ఉద్యానము.

**అవకాశే స్థితౌ స్థానమ్ -**

స్థానశబ్దము తావునకును, ఉనికిపట్టునకును పేరు. తిష్ఠంత్యస్మిౙ్, స్థితిశ్చ స్థానం. ష్ఠా గతినివృత్తౌ. దీనియందుందురు గనుకను, ఉండుట గనుకను స్థానము. "స్థానం స్యాద్వృద్ధనృత్తార్థే సాదృశ్యే సన్నివేశన" ఇతి శేషః.

**క్రీడాదావపి దేవనమ్.** 118

దేవనశబ్దము క్రీడకు, ఆదిశబ్దము వలన విజిగీషా వ్యవహార ద్యుతిస్తుతి మోద మద స్వప్న కాంతిగతులకును, అపిశబ్దమువలన విలాస

మునకును పేరు. ద్యూతి ర్దేవనం. క్రీడించుట మొదలైనది దేవనము.

**ఉత్థానం పౌరుషే తన్త్రే సంనివిష్టోద్గమే ౾ పిచ,** 119

ఉత్థానశబ్దము ఉద్యోగమునకును, సైన్యమునకును, కూర్చున్నవాఁడు లేచుటకును, అపిశబ్దమువలన మలోత్సర్గమునకును, చైత్యాది గృహ వాస్త్వంతరమునకును పేరు. ఉద్గతం స్థానం, ఉత్ స్థీయతే అనే నేతిచ ఉత్థానం. ష్ఠా గతినివృత్తౌ. ఉద్యోగించుటయు, దీనిచేత నుద్యోగింతురు గనుకను ఉత్థానము. టీ. స. ఊర్ధ్వ విస్తృతదోః పాణిపురుష ప్రమాణమత్ర పౌరుషశబ్దేన వివక్షితం. యథా___ 'సప్తోత్థాన మిదం హర్మ్య మాప్తరక్షిశతావృత' మితి క్షేమేంద్రః. సైన్యే ___ ఉత్థాన సంపన్నోరాజేతి. "మలోత్సర్జన ఉత్థానం హర్షోద్యోగ సమాప్తిష్వి"తి శేషః.

**వ్యుత్థానం ప్రతిరోధే చ విరోధా చరణే ౾ పిచ.**

వ్యుత్థానశబ్దము అడ్డపెట్టుటకును, ప్రతికూలము చేయుటకును, అపిశబ్దమువలన సమాధి మానుటకును పేరు. విరుద్ధముత్థాన మత్రేతి వ్యుత్థానం – దీనియందు విరుద్ధమైన యుద్యోగము గలదు.

**మారణే మృతసంస్కారే గతౌ ద్రవ్యే ౾ ర్థదాపనే,**
**నివర్త నోపకరణాను వ్రజ్యాసు చ సాధనమ్.** 120

సాధనశబ్దము వధించుటకును, మృతిని సంస్కరించుటకును, గమనము నకును, ధనమునకును, అప్పుపుచ్చుకొన్న యర్థము నిప్పించుటకును, ప్రయోజనమును సాధించుట కుపయుక్తమైన పదార్థమునకును, వెంటఁ బోవుటకును, చకారమువలన లింగకరణమేఢ్ర సైన్యాదులకును పేరు. సాధ్యతే అనేనేతి సాధనం. రాధసాధ సంసిద్ధౌ. దీనిచేత సాధింపఁబడును. "సాధనం కరణే లింగ సైన్యయోర్మేహనే ౾ పిచ" ఇతి శేషః. టీ. స. మారణే మృతసంస్కార ఇత్యత్ర అకార ప్రశ్లేషేణ ఛేదంకృత్వా అమృతస్య వత్సనాభ్యాదేర్విషస్య నిర్విషీ కరణరూపే సంస్కార ఇతికశ్చి ద్వ్యాచష్ట.

**నిర్యాతనం వైరశుద్ధౌ దానే న్యాసార్పణే ౾ పిచ,**

నిర్యాతనశబ్దము పగ సాధించుటకను, దానమునకును, దాఁచఁబెట్టిన సొమ్మును తిరుగ నిచ్చుటకును, అపిశబ్దము వలన అప్పుతీర్చుట మొదలైనదానికిని పేరు. నిశ్శేషేణ యాతనం నిర్యాతనం. యతీ

ప్రయత్నే. నిశ్శేషముగా దీర్చుట.

**వ్యసనం విపది భ్రంశే దోషే కామజ కోపజే.** 121

వ్యసనశబ్దము ఆపదకును, పడుటకును, కామక్రోధములవలనఁ బుట్టిన స్త్రీ ద్యూతాది సప్తవ్యసనములకును పేరు. వ్యస్యతే శ్రేయోమార్గాత్ప్రచ్యావ్యతే పురుషో ఒనేనేతి వ్యసనం. అసు క్షేపణే. దీనిచేత పురుషుఁడు శ్రేయోమార్గమునుండి తొలగఁ ద్రోయఁబడును.

**పక్ష్మాక్షిలోమ్ని కింజల్కే తన్త్వాద్యంశే ఒ ప్యణీయసి,**

పక్ష్మ౯శబ్దము ఱెప్పవెండ్రుకలకును, ఆకరుపువ్వులకును, నూలు మొదలయినదాని సన్నపు తునుకలకును, అపిశబ్దమువలన పక్షుల తుప్పుడునకును పేరు. పక్ష్యత ఇతి పక్ష్మ. న. న. పక్ష పరిగ్రహే. పరిగ్రహింపఁబడునది.

**తిథిభేదే క్షణే పర్వ -**

పర్వ౯శబ్దము పున్నమ మొదలయిన పర్వతిథులకును, ఉత్సవమునకును పేరు. మఱియును పున్నమపాడ్యమి సంధికిని, కనుపునకును, ప్రస్తావమునకును పేరు. పర్వతీతి పర్వ. న. న. పర్వపూరణే. పూరించునద. టీ. స. తిథిభేద స్థిథి విశేషః "చతుర్దశ్యష్టమీచైవ పూర్ణిమాచ కుహూస్తథా, పర్వాణ్యేతాని రాజేంద్ర రవి సంక్రాంతిరేవ"చేతి. 'దర్శప్రతి పదోస్సంధౌ విషువ త్ప్రభృతావపి, పర్వ స్యా దుత్సవే గ్రంథౌ ప్రస్తావే లక్షణాంతర' ఇతి ప్రతాపః.

**వర్త్మనేత్రచ్ఛదే ఒ ధ్వని** 122

వర్త్మ౯శబ్దము ఱెప్పకును, తెరువునకును పేరు. వర్తయతీతి, వర్తంతే ఒ స్మిన్నితి చవర్త్మ. వృతు వర్తనే. వర్తింపఁజేయునది. దీనియందు వర్తింతురు గనుకను వర్త్మము.

**అకారగుహ్యే కౌపీనమ్ -**

కౌపీనశబ్దము చేయరానిపనికిని, గుహ్యమునకును పేరు. లక్షణచేత గుహ్యచ్ఛాదకమైన వస్త్రమునకును పేరు. కూపం ప్రవేష్టుమర్హతీతి కౌపీనం – కూపమును ప్రవేశింప నర్హమైనది. "కౌపీనం చీరఖండే స్యా" తిది శేషః.

**మైథునం సంగతౌ రతే,**

మైథున శబ్దము సంబంధమునకును, సురతమునకును పేరు. మిథు

నస్య కర్మ మైథునం - మిథునముయొక్క క్రియ.

**ప్రధానం పరమాత్మా ధీః -**

ప్రధానశబ్దము పరమాత్మకును, ప్రజ్ఞకును, మఱియు ప్రకృతికిని, ప్రధానికిని, ముఖ్యునికిని పేరు. ప్రకర్షేణ దధాతీతి ప్రధానం. డు ధాఞ్ ధారణపోషణయోః. ప్రకర్షముచేత నన్నిటిని ధరించునది. "ప్రధానం ముఖ్యమంత్రిణో" రితి శేషః.

**ప్రజ్ఞానం బుద్ధి చిహ్నయోః.** 123

ప్రజ్ఞానశబ్దము బుద్ధికిని, గుఱుతునకును పేరు. ప్రకృష్టం జ్ఞానం, ప్రజ్ఞాయతే అనేనేతి చ ప్రజ్ఞానం. జ్ఞా అవబోధనే. ప్రకృష్టమైన జ్ఞానము, దీనిచేత లెస్సగా నెఱుఁగఁబడును గనుకను ప్రజ్ఞానము.

**ప్రసూనం పుష్పఫలయోః -**

ప్రసూనశబ్దము పుష్పమునకు, ఫలమునకును పేరు. ప్రసూయత ఇతి ప్రసూనం. షూఞ్ ప్రాణిప్రసవే. పుట్టునది.

**నిధనం కుల నాశయోః,**

నిధనశబ్దము కులమునకును, నాశనమునకును పేరు. నియతం ధనమత్రేతి, నిర్గతం ధన మస్మాదితి చ నిధనం - నియతముగా దీనియందు ధనము గలదు గనుకను, దీనివలన ధనము పోవును గనుకను నిధనము. 'సామభక్తౌ తు నిధన' మితి శేషః.

**క్రన్దనే రోద నాహ్వానే -**

క్రందన శబ్దము ఏడ్చుటకును, పిలుచుటకును పేరు. క్రందః క్రందనం. క్రది ఆహ్వానే రోదనేచ. ఏడ్చుటయు, పిలుచటయును క్రందనము.

**వర్ష్మ దేహ ప్రమాణయోః.** 124

వర్ష్మన్‌శబ్దము దేహమునకును, కొలఁదికిని పేరు. వృష్యతి ఇతి వర్ష్మ. న. న. వృషు సేచనే. తడుపఁబడునది.

**గృహ దేహ త్విట్ప్రభావా ధామాని-**

ధామన్‌శబ్దము గృహమునకును, దేహమునకును, కాంతికిని, ప్రభావమునకును పేరు. దధాతి, ధీయతే చ ధామ. న. న. డు ధాఞ్ ధారణపోషణయోః. ధరించునదియు, ధరింపఁబడునదియును ధామము."ధామ స్థానే చ జన్మ" నీతి శేషః.

**అథ చతుష్పథే,**

**సంనివేశే చ సంస్థానమ్ -**

సంస్థానశబ్దము నాలుగుతెరువులు గూడిన దిక్కునకును, సన్నివేశమునకును, చకారమువలన ఆకృతికిని, మరణమునకును పేరు. కొందఱు సన్నివేశ మనఁగా నవయ వరచనావిశేషమనియు, కొందఱు ఊరిచుట్టునుండు బయలనియును జెప్పుదురు. సమ్యక్ తిష్ఠంత్యస్మిన్నితి సంస్థానం. ష్ఠా గతినివృత్తౌ. లెస్సగా దీనియం దుందురు. "సంస్థాన మాకృతౌ మృత్యా" వితి శేషః.

**లక్ష్మ చిహ్న ప్రధానయోః.** 125

లక్ష్మన్‌శబ్దము చిహ్నమునకును ప్రధానమునకును పేరు. లక్ష్యతే అనేనేతి లక్ష్మ. న. లక్ష దర్శనాంకనయోః. దీనిచేత గుఱుతుపడును గనుకను, కానఁ బడునది గనుకను లక్ష్మము.

**ఆచ్ఛాదనే సంపిధాన మపవారణ మిత్యుభే,**

ఆచ్ఛాదనశబ్దము వస్త్రమునకును, కప్పుటకును పేరు. ఆచ్ఛాద్యతే అనేనేతి ఆచ్ఛాదనం. ఛద అపవారణే. దీనిచేత కప్పఁబడును కనుకను, కప్పుట గనుకను ఆచ్ఛాదనము.

**ఆరాధనం సాధనే స్యా దవాప్తౌ తోషణే ఽ పి చ.** 126

ఆరాధనశబ్దము సిద్ధించుటకును, ప్రాప్తికిని, సంతోషించుటకును పేరు. ఆరాధః ఆరాధనం. రాధ సాధ సంసిద్ధౌ. ఆరాధించుట ఆరాధనము.

**అధిష్ఠానం చక్ర పుర ప్రభా వాధ్యాసనేష్వపి,**

అధిష్ఠానశబ్దము బండికంటికిని, పట్టణమునకును, ప్రభావమునకును, ఆక్రమించుటకును పేరు. అధితిష్ఠంత్యత్రేతి అధిష్ఠానం. ష్ఠా గతి నివృత్తౌ. దీనియం దుందురు గనుక అధిష్ఠానము.

**రత్నం స్వజాతిశ్రేష్ఠే ఽ పి-**

రత్న శబ్దము స్వజాతియం దుత్కృష్టమైన వస్తువునకును, అపి శబ్దమువలన పచ్చ, కెంపు మొదలయిన మణులకును పేరు. రమన్తే ఽస్మిన్నితి రత్నం. రము క్రీడాయాం. దీనియందు రమింతురు గనుక రత్నము.

**వనే సలీల కాననే.** 127

వనశబ్దము నీళ్లకును, అడవికిని పేరు. వన్యత ఇతి వనం. వనుయాచనే. అడుగఁబడునది వనము.

**తలినం విరళే స్తోకే -**

తలినశబ్దము పలుచనిదానికిని, ఇంచుకంతకును పేరు. విరళమనఁగా నిర్మల మని కొందఱు. "త్రిష్వచ్ఛే తలినం లవే" అని రభసుఁడు. తలతీతి తలినం. త్రి. తల ప్రతిష్ఠాయాం. నిలుకడగలిగియుండునది.

**వాచ్యలిఙ్గా స్తథోత్తరే,**

టీ. స. అత్ర తథాశబ్దస్యాయమర్థః. యథాపూర్వ వాక్యస్థస్తలి నశబ్దో వాచ్యలింగః – తథా నాంతవర్గ సమాప్తిపర్యంతాః పక్ష్యమాణా అపి వాచ్యలింగా ఇతి. తథాచ మురారినాటకే___ కస్య తలినా తాదృశీజిహ్వేతి – తలినశబ్ద మెట్లు విశేష్యలింగమో అత్తెఱఁగుననే ముందుఁ జెప్పఁగల సమానశబ్దము మొదలు నాంతవర్గ పర్యంతములైన శబ్దములు విశేష్య లింగములు.

**సమానా స్సత్స మైకేస్యుః -**

సమానశబ్దము సజ్జనునికిని, సదృశమైనదానికిని, ఒకటైన వస్తువునకును పేరు. సహమానేన వర్తత ఇతి సమానః. మాన పూజాయాం, మాఙ్ మానే. పూజతోడను, కొలఁదితోడను గూడినది.

**పిశునౌ ఖల సూచకౌ.** 128

పిశునశబ్దము దుర్జనునికిని, కొండెగానికిని పేరు. పిశ్యతీతి పిశునః. శో తనూకరణే. పీడించువాఁడు.

**హీన న్యూనా వూన గర్హ్యా -**

హీనన్యూనశబ్దములు తక్కువయినదానికిని, నిందింపఁబడినదానికిని పేళ్లు. హీయత ఇతిహీనః. ఓహాక్ త్యాగే. విడువఁబడువాఁడు. నితరాం ఊనయతీతి న్యూనః. ఊన పరిహాణే. మిక్కిలి తక్కువైనవాఁడు.

**వేగి శూరౌ తరస్వినౌ,**

తరస్విన్ శబ్దము వేగముగలవానికిని, బలవంతునికిని పేరు. తరః జవో బలం చాస్యాస్తీతి తరస్వీ. న. త్రి. వేగమును బలమును గలవాఁడు.

**అభిపన్నో ఽ పరాద్ధో ఽ రిగ్రస్త వ్యాపద్గతావపి.** 129

అభిపన్న శబ్దము అపరాధముఁ జేసినవానికిని, శత్రువుచేత నాక్ర

మింపఁబడినవానికిని, ఆపదఁ బొందినవానికిని పేరు. అభిపద్యత ఇత్యభిపన్నః. పద్ ఌ గతౌ. అపరాధము మొదలయినదానిని బొందినవాడు.

## పాంతములు

**కలాపో భూషణే బర్హే తూణీరే సంహతావపి,**

కలాపశబ్దము భూషణమునకును, నెమిలిపురికిని, అమ్ములపొదికిని, సమూహమునకును పేరు. కలాః ఆప్నోతీతి కలాపః. ఆప్ ఌ వ్యాప్తౌ. కళలఁ బొందునది.

**పరిచ్ఛదే పరీవాపః పర్యుప్తౌ సలిలస్థితౌ.** 130

పరీవాపశబ్దము గుడారము మొదలైనదానికిని, అంతట విత్తులు వెదపెట్టుటకును, నీళ్లు నిలుచుటకును పేరు. కొందఱు పరిచ్ఛద మనఁగా పరివార మనియును సలిలస్థితి యనఁగా నీళ్లుండు స్థలమనియుఁ జెప్పుదురు. 'పరీవాపః పర్యుప్తౌ; అన్నచోట 'పర్యాప్తౌ' అని పఠించి తృప్తికిని పేరని కొందఱు. పరివపణం పరీవాపః. టువప్ బీజసంతానే. అంతట విత్తులు చల్లుట పరీవాపము. ఉపసర్గవశమున కడమయర్థములు నూహింపఁదగినవి.

**గోధు గ్గోష్ఠపతీ గోప్తౌ -**

గోపశబ్దము గొల్లవానికి, ఆవుల కధిపతియైనవానికిని పేరు. గాఃపాతీతి గోపః. పా రక్షణే. ఆవులను రక్షించువాఁడు. "గోపో గ్రామౌఘ గోష్ఠాధికృతయోర్వల్లవే నృపే, గోపయోషాశారిబయో ర్గోపీ గోపాతు రక్షకే" తిప్రాతపః.

**హర విష్ణూ వృషాకపీ,**

వృషాకపిశబ్దము శివునకును, విష్ణువునకును పేరు. ప. అగ్నికి, ఇంద్రునికిని పేరు. వృషేణ ధర్మేణ అకంతి యాంతితి వృషాకాః ధర్మశీలాః, తాణ్పాతీతి వృషాకపి. పు. అక కుటిలాయాం గతౌ. పా రక్షణే. ధర్మముచేత చరించువారు వృషాకులు; వారిని రక్షించువాఁడు.

**బాష్ప మూష్మాశ్రు -**

బాష్పశబ్దము ఆవిరికిని, కన్నీళ్లకును పేరు. వాయతి = శోషయతి, వాతి = స్రవతి చ బాష్పః. ఓవై శోషణే, వా గతిగంధనయోః. వబయో రభేదః. శోషింపఁజేయునదియు, జాఱునదియును బాష్పము.

**కశిపు స్త్వన్న మాచ్ఛాదనం ద్వయమ్.** 131

కపిపుశబ్దము అన్నము, వస్త్రము ఈరెంటికిని ఏకోక్తిచేఁ గాని ప్రత్యేకముగాఁ గాని పేరు. "ఏకోక్త్యా కశిపూ భక్తాచ్ఛాదనే ద్వేపృథక్కృతే" అని రభసుఁడు. కశ్యత ఇతి కశిపుః. ష్న. కశ గతి శాతనయోః. పొందఁబడునది కశిపువు.

**తల్పం శయ్యాట్ట దారేషు -**

తల్పశబ్దము పానుపునకును, అట్టళ్లకును, భార్యకును పేరు. తలంత్యత్రేతి తల్పం. తల ప్రతిష్ఠాయాం. దీనియందుందురు. తల్పశబ్దము రూపభేదమున నపుంసకము. "యయు స్సుషుప్సవ స్తల్పాన్ భీమైర్వచన కర్మభిః" అను భట్టి ప్రయోగమువలనఁ బుంలింగమును గలదు.

**స్తమ్బే ఽ పి విటపో ఽ స్త్రియామ్,**

విటపశబ్దము కసవుగంటకును, అపిశబ్దమువలన చిగురునకును, కొమ్మకును పేరు. వటతి వేష్టత ఇతి విటపః. వట వేష్టనే. చుట్టుకొనియుండునది. "వృక్షస్కంధోర్ధ్వశాఖాయాం తృణగుత్సే ద్రువిస్తృతౌ, పల్లవే విటముఖ్యే చ విటపః పుంనపుంసక" ఇతి ప్రతాపః.

**ప్రాప్తరూప సురూపాభిరూపా బుధ మనోజ్ఞయోః.** 132
**భేద్యలిఙ్గా అమీ -**

ప్రాప్తరూప సురూపాభిరూపశబ్దములు మూఁడును పండితునికి, ఒప్పువానికిని పేరు. ప్రాప్తం రూపం యస్య ప్రాప్తరూపః, శోభనం రూపం యస్య సురూపః, అభిమతం రూపం యస్య అభిరూపః. మంచి రూపము గలవాఁడు ప్రాప్తరూపుడు, సురూపుఁడు, అభిరూపుఁడును. ఈ 3 శబ్దములును విశేష్య నిఘ్నములు.

**కూర్మీ వీణాభేదశ్చ కచ్ఛపీ,**

కచ్ఛపీశబ్దము ఆఁడుతాఁబేటికిని, సరస్వతివీణకును పేరు. కచ్ఛం పాతీతి కచ్ఛపీ. సీ. పా రక్షణే. జలప్రాయభూమిని బాలించునది.

## ఫాంతములు

**రవర్ణే పుంసిరేఫ స్స్యాత్కుత్సితే వాచ్యలిఙ్గకః.** 133

రేఫశబ్దము రవర్ణమందు వర్తించునప్పుడు పు. కుత్సితునందు వర్తించునప్పుడు త్రి. రిఫ్యతే రిఫతివా రేఫః. రిఫహింసాయాం. హింసింపఁబడునది, హింసించునది (అధికపాఠము).

## బాంతములు

**అన్తరాభవసత్త్వే ౽ శ్వే గన్ధర్వో దివ్యగాయనే,**

గంధర్వశబ్దము అంతర పిశాచమునకును, గుఱ్ఱమునకును, దేవలోకమందు పాడునట్టి విశ్వావసువు మొదలయినవారికిని పేరు. గంధమర్వతీతి గంధర్వః. అర్వపర్వగతౌ. గంధమును బొందును గనుక గంధర్వము, గంధర్వుఁడును.

**కమ్బు ర్నావలయే శఙ్ఖే -**

కంబుశబ్దము కడియమునకును, శంఖమునకును పేరు. కామ్యత ఇతి కంబుః. పు. కము కాంతౌ. కాంక్షింపఁబడునది.

**ద్విజిహ్వౌ సర్ప సూచకౌ.** 134

ద్విజిహ్వశబ్దము సర్పమునకును, కొండెగానికిని పేరు. ద్వేజిహ్వే అస్యేతి ద్విజిహ్వః. రెండునాలుకలు గలిగిన (వాఁడు) ది.

**పూర్వో ౽ న్యలిఙ్గః ప్రా గాహ పుంబహుత్వే ౽ పి పూర్వజా౯,**

పూర్వశబ్దము పూర్వదిక్కున నుండు వస్తువునకు పేరైనపుడు విశేష్యలింగము. 'పూర్వోగ్రామః', 'పూర్వంధనం', 'పూర్వా నదీ' అని. పూర్వులైన పితృపితామహాదులకు పేరైనపుడు పుంలింగ బహువచనమందు వర్తించును. 'పూర్వేవదంతి', 'పూర్వైః కృతం' అని. పూర్వతీతి పూర్వః. పర్వ పుర్వ పూరణే. పూరించునది. గంధర్వాదిశబ్దములు 'వబయో రభేదః' అను న్యాయముచేత నీబాంతమందుఁ జెప్పఁబడినవి.

## భాంతములు

**కుమ్భౌ ఘటేభ మూర్ధాంశౌ -**

కుంభశబ్దము కడవకును, ఏనుఁగు కుంభస్థలమునకును పేరు. కుంభతీతి కుంభః. కుభి ఆచ్ఛాదనే. కప్పియుండునది. "కుంభస్స్యా త్కుంభకర్ణస్య పుత్రే వారాంగనాపతౌ, రాశిభేదే మానభేదే గుగ్గులు త్రివృతోరపి, కుంభీతు పాటలా వారిపర్ణీ పిఠరకట్ఫలే" ఇతి శేషః.

**డిమ్భౌతు శిశు బాలిశౌ.** 135

డింభశబ్దము శిశువునకును, మూర్ఖునికిని పేరు. డయతే డింభః. డీఙ్ విహాయసా గతౌ. ఎగురువాఁడు.

**స్తమ్భౌ స్థూణా జడీభావౌ -**

స్తంభశబ్దము కంబమునకును, బ్రమాను పడియుండుటకును పేరు. స్తభ్నాతి గృహం చేష్టితం చేతి స్తంభః. స్తంభు రోధనే. గృహమును వ్యాపారమును నడ్డగించునది.

**శంభూ బ్రహ్మ త్రిలోచనౌ,**

శంభుశబ్దము బ్రహ్మకును, శివునికిని పేరు. శం సుఖం భవ త్యస్మాదితి శంభుః. భూ సత్తాయాం. ఇతనివలన సుఖము గలుగును. టీ. స. విష్ణావపి శంభుశబ్ద ఇతి చంద్రః.

**కుక్షి భ్రూ ణార్భకా గర్భాః -**

గర్భశబ్దము కడుపునకు, కడుపులోని శిశువునకును, బాలునికిని పేరు. గిరతీతి గర్భః. గృా నిగరణే. మ్రింగునది. "అంతర్భవేచ గర్భస్స్యాత్సంధౌ పవనసంకట" ఇతి శేషః.

**విస్రమ్భః ప్రణయే ఒపిచ.** 136

విస్రంభశబ్దము పరిచయమునకును, అపిశబ్దమువలన క్రీడకును, విశ్వాసమునకును పేరు. విస్రంభంత్యనేన విస్రంభనం చ, విస్రంభః. స్రంభు విశ్వాసే. దీనిచేత విశ్వసింతురు, విశ్వసించుటయు విస్రంభము. విస్రంభః కేళికల హే విశ్వసింతురు, విశ్వసించుటయు విస్రంభము. విస్రంభః కేళికల హే విశ్వాసే ఒపిచ హింసనే" ఇతి శేషః.

**స్యా ద్భేర్యాం దున్దుభిః పుంసి స్యా దక్షే దున్దుభిః స్త్రియామ్,**

దుందుభిశబ్దము భేరికి పేరైనపుడు పు. పాచికలయందలి ఇత్తిగకు పేరైనపుడు సీ. 'దైత్యేనాదుందుభిర్భేర్యాం స్త్ర్యక్షేబిందుత్రికద్వయే' అని రభసుఁడు చెప్పినాఁడు గనుక పాచికలకే పేరని కొందఱు. 'దుందు' ఇతి భాషతే దుందుభి. భాష వ్యక్తాయాం వాచి. 'దుందు' అని పలుకునది. టీ. స. అక్షే యథా____ "దుందుభ్యా కిల కింతయా పతితయా యత్ ద్రౌపదీహారితా" ఇతి.

**స్యా న్మహారజనే క్లీబం కుసుమ్భం కరకే పుమాన్.** 137

కుసుంభ శబ్దము కుసుమపువ్వునకు పేరైనపుడు న. కమండలువునకు పేరైనపుడు పు. కుస్యతీతి కుసుంభః. కుసశ్లేషణే. కూడియుండునది.

**క్షత్రియే ఒపిచ నాభి ర్నా-**

నాభిశబ్దము క్షత్రియునికిని, అపిశబ్దము వలనఁ విజిగీషుఁ డైన రాజునకును పేరైనపుడు పు. ప్రాణ్యంగమునకు పేరైనపుడు ప్స. బండి

కంటి నడిమికిని, ప్రధానమునకును, కస్తూరికిని పేరైనపుడు సీ. నహ్యత ఇతి నాభిః. ణహ బంధనే. కట్టఁబడునది. "ముఖ్యరాట్ క్షత్రియో ర్నాభిః పుంసి ప్రాణ్యంగకే ద్వయోః, చక్రమధ్యే ప్రధానే చ స్త్రియాం కస్తూరి కామదే" ఇతి రభసః.

**సురభి ర్గవి చ స్త్రియామ్,**

సురభిశబ్దము ఆవునకు పేరగునపుడు సీ. చకారమువలన వసంత ఋతువునకు పేరైనపుడు పు. మంచి పరిమళము గలిగినదానికిని. మనోహరమైన దానికిని పేరైనపుడు త్రి. కామధేనువునకు పేరైనపుడు సీ. సుష్ఠు రభత ఇతి సురభిః. రభ రాభస్యే. మిక్కిలి వేగిరపడునది. "సురభి ర్నా జాతిఫలే వసంతే చంపకద్రుమే, సల్లక్యాం స్త్రీ మాతృభేదే మనోజ్ఞేతు విశేష్యవ" దితి శేషః.

**సభా సంసది సభ్యేచ.**

సభాశబ్దము ఆస్థానమునకును, సజ్జనునికిని, చకారమువలన సమూహునకును, శాలకును, ద్యూతమునుకును పేరు. సహ భాంత్యస్యామితి సభా. భా దీప్తౌ. దీనియందుఁగూడి ప్రకాశింతురు. లక్షణచేత సభయందుండు వానికిని పేరు. "సభా దురోదరే ఽపిస్యాత్ సమూహేభాన్వితేత్రి" ష్వితి శేషః.

**త్రి ష్వధ్యక్షే ఽపి వల్లభః.** 138

వల్లభశబ్దము అధ్యక్షునికిని, అపిశబ్దమువలన ప్రియమైనదానికిని పేరు. వల్లతీతివల్లభః త్రి. వల్లప్రీతౌ. సౌత్రో ఽయం ధాతుః. ప్రియమును జేయునది. "వల్లభస్తు ప్రధానాశ్వ" ఇతి శేషః.

## మాంతములు

**కిరణ ప్రగ్రహౌ రశ్మీ-**

రశ్మిశబ్దము కిరణమునకును, పగ్గమునుకును పేరు. అశ్నుత ఇతి రశ్మిః. పు. అశూ వ్యాప్త్యాం. వ్యాపించునది.

**కపి భేకౌ ప్లవంగమౌ,**

ప్లవంగమశబ్దము కోఁతికిని, కప్పకును పేరు. ప్లవేన గచ్ఛతీతి ప్లవంగమః. గమ్ ౙగతౌ. దాఁటులచేతఁ బోవునది.

**ఇచ్ఛా మనోభవౌ కామౌ -**

కామశబ్దము ఇచ్ఛకును, మన్మథునికి పేరు. మిక్కిలి యెనడు నర్థమున న. కామయతే కామనా చ కామః. కు కాంతౌ. కామింపఁజేయువాఁడు కామించుటయు, కామము. "కామః కామ్యే త్రిఘస్మృతః, రేతో నికామయోః క్లీబ" మితి శేషః.

**శౌ ర్యోద్యోగౌ పరాక్రమౌ.** 139

పరాక్రమశబ్దము సామర్థ్యమునకును, ఉద్యోగమునకును పేరు. పరాక్రమ్యతే అనేనేతి పరాక్రమః. క్రము పాదవిక్షేపే. దీనిచేత మిక్కిలి పరాక్రమింపఁబడును.

**ధర్మాః పుణ్య యమ న్యాయ స్వభా వాచార సోమపాః,**

ధర్మశబ్దము పుణ్యమునకును, యమునికిని, నీతికిని, స్వభావమునకును, ఆచారమునకును, సోమయాజికిని పేరు. సోమపాశబ్దము యజ్ఞమునకును పేరని కొందఱు. ధరతీతి ధర్మః. ధృఞ్ ధారణే. ధరించునది. "ధర్మః పుణ్య యమే న్యాయే స్వభావాచారయోః క్రతౌ, ఉపమాయా మహింసాయాం కార్ముకే చ నిగద్యత" ఇతి విశ్వప్రకాశః.

**ఉపాయపూర్వ ఆరమ్భ ఉపధాచా ప్యుపక్రమః.** 140

ఉపక్రమశబ్దము ఉపాయము నెఱిఁగి ప్రారంభించుటకును, అమాత్యాదులఁ బరీక్షించుటకును, అపిశబ్దమువలన నిది మొదలని చెప్పుటకును పేరు. ఎట్లనిన___ 'నందోపక్రమణం ద్రోణం' అని. ఉపక్రమణ ముపక్రమః. క్రము పాదవిక్షేపే. ఉపక్రమించుట యుపక్రమము. "ఉపక్రమస్తు ప్రారంభే చికిత్సాయాం చ విక్రమ" ఇతి శేషః.

**వణిక్పథః పురం వేదో నిగమో -**

నిగమశబ్దము అంగడివీథికిని, పట్టణమునకును, వేదమునకును పేరు. నియతం గమ్యత ఇతి నిగమః. గమ్ ౣ గతౌ. నియతముగాఁ బొందఁబడునది.

**నాగరో వణిక్,**

**నైగమౌ ద్వౌ -**

నైగమశబ్దము పట్టణమం దున్నవానికిని, వర్తకునికిని, ప్రత్యేకముగాఁగాని, ఏకముగాఁగాని పేరు. నిగమే భవో నైగమః–పట్టణమందును, అంగడియందును నుండువాఁడు నైగముఁడు.

**బలే రామో నీల చారు సితే త్రిషు.** 141

రామశబ్దము బలభద్రునికి పేరైనపుడు పు. నల్లనిదానికిని, అందమైన దానికిని, తెల్లనిదానికిని పేరైనపుడు త్రి. రమయతీతి రామః. రము క్రీడాయాం. రమింపఁజేయు(నది) వాఁడు.

**శాబ్దాదిపూర్వోబృన్దే ఽ పి గ్రామః -**

గ్రామశబ్దము 'శబ్దము, అనుశబ్దము, మొదలయిన శబ్దములు పూర్వమందుఁ గలదైనప్పుడు సమూహమునకు పేరు. ఎట్లనిన ___ 'శబ్ద గ్రామః, గుణగ్రామః' అని వరుసగా ఈరెంటికిని 'శబ్దముల సమూహము', 'గుణముల సమూహము' అని యర్థము. అపిశబ్దమువలన ఊరికిని, స్వర సమూహమునకును పేరు. గ్రస్యత ఇతి గ్రామః. గ్రసు అదనే. అనుభవింపఁబడునది.

**క్రాంతౌ చ విక్రమః,**

విక్రమశబ్దము ఆక్రమణమునకును, చకారమువలన పరాక్రమమునకును పేరు. విక్రమణం విక్రమః. క్రముపాద విక్షేపే. విక్రమించుట.

**స్తోమః స్తోత్రే ఽ ధ్వరే బృన్దే -**

స్తోమశబ్దము స్తోత్రమునకును, యాగమునకును, గుంపునకును పేరు. స్తూయత ఇతి స్తోమః. ష్టుఞ్ స్తుతౌ. పొగడఁబడునది.

**జిహ్మాస్తు కుటిలే ఽ లసే.** 142

జిహ్మశబ్దము వంకరయైనదానికిని, మందమైనదానికిని పేరు. జహాతీతి జిహ్మః. ఓ హాక్ త్యాగే. విడువఁబడునది.

**గుల్మా రుక్ స్తమ్బ సేనాశ్చ -**

గుల్మశబ్దము వ్యాధి భేదమునకు, పొదకును, సేనాభేదమునకును, చకారమువలన ఉక్కళము మొదలయినదానికిని పేరు.

**జామి స్స్వస్ృ కులస్త్రియోః,**

జామిశబ్దము తోడఁబుట్టినయామెకును, కులస్త్రీకిని పేరు. జమతీతి జామి. సీ. జము అదనే. సొమ్ముఁ దినునది. పా. యామిః. 'ప్రహరే సంయమే యామో యామిస్స్వసృకులస్త్రియోః' అని యకారాదుల యందు రభసుఁడు. 'జిహ్మాస్తు కుటిలే మందే జామి స్స్వసృ కుల స్త్రియోః' అని జకారాదులయం దజయుఁడు. 'స్యాజ్జామ్యవ్యయ

మాలస్యే' ఇతి శేషః.

**క్షితి క్షాన్త్యోః క్షమా యుక్తేక్షమం శక్తే హితే త్రిషు.** 143

క్షమాశబ్దము భూమికిని, ఓర్పునకును పేరగునపుడు స్త్రీ. ఉచితమునకు పేరగునపుడు మకారాంతమైన యవ్యయమని కొందఱు. సమర్థునికిని, హితునికిని పేరగునపుడు త్రి. క్షమతే, క్షాంతిశ్చ క్షమా. క్షమూష్ సహనే. ఓర్చునది, ఓర్చువాడు, ఓర్చుట.

**త్రిషు శ్యామౌ హరి త్కృష్ణౌ శ్యామా స్యా చ్ఛారిబా నిశా,**

శ్యామశబ్దము పచ్చనిదానికిని, నల్లనిదానికిని పేరగునపుడు త్రి. సుగంధ పాలకును, రాత్రికిని పేరగునపుడు స్త్రీ. శ్యాయత ఇతి శ్యామః, శ్యామా చ. శ్యైఙ్ గతౌ. వ్యాపించునది. 'శ్యామః ప్రయాగ న్యగ్రోధే ఘనే వృద్ధే చ దారకే, అప్రసూతాంగనాయాం స్త్రీ తథా సోమలతౌషధౌ, కృష్ణాప్రియంగ్వో ర్గుంద్రాయాం నీలీ త్రివృతయోరపి, శ్యామం మరీచే లవణ' ఇతి శేషః.

**లలామం పుచ్ఛ పుణ్డ్రాశ్వభూషా ప్రాధాన్య కేతుషు.** 144

లలామశబ్దము తోఁకకును, తిలకమునకును, అశ్వభూషణమునకును, ప్రాధాన్యమునకును, టెక్కెమునకును పేరు. 'అశ్వభూషా'యను చోట గుఱ్ఱమునకును, భూషణమునకును ప్రత్యేకముగా పేరనియును, లలామశబ్దము నకారాంతము గలదనియును కొందఱు. 'లలామ చ లలామం చ భూషావాలధివాజిషు, చిహ్నప్రభావపుండ్రేషు ప్రధానే ధ్వజశృంగయో' రిత్యజయః 'లలమో ఉస్త్రీలలామాపి ప్రభావే పురుషే ధ్వజే, శ్రేష్ఠే భూషాపుచ్ఛ శృంగపుండ్ర చిహ్నహయేష్వ' పీతి యాదవ ప్రకాశః. లలతీతి లలామం. లల విలానే. ఒప్పునది.

**సూక్ష్మ మధ్యాత్మమపి -**

సూక్ష్మశబ్దము పరమాత్మకును, అపిశబ్దమువలన స్వల్పమైనదానికిని పేరు. సూచ్యత ఇతి సూక్ష్మం త్రి. సూచింపఁబడునది.

**ఆదౌ ప్రధానే ప్రథమః త్రిషు,**

ప్రథమశబ్దము మొదటిదానికిని, శ్రేష్ఠమైనదానికిని పేరు. ప్రథత ఇతి ప్రథమం. ప్రథప్రఖ్యానే. ప్రసిద్ధమైనది. ఇది మొదలు మాంతసమాప్తి పర్యంతము గల శబ్దములు మూఁడులింగములయందు వర్తించును.

**వామౌ వల్గు ప్రతీపౌ ద్వౌ -**

వామశబ్దము మనోహరమైనదానికిని, ప్రతికూలమైనదానికిని పేరు. వాయతే వమ్యత ఇతిచ వామః. వా గతి గంధనయోః; టు వము ఉద్గిరణే. పొందఁబడునది; విడువఁబడునదియును గనుక, వామము. "వామ పుంసి హరే క్లీబం ద్రవిణే స్త్రీతు యోషితి, వామీ సృగాలీ బడబా రాసభీ కరభీషుచే"తి శేషః.

**అధమౌ న్యూన కుత్సితౌ.** 145

అధమశబ్దము తక్కువైనదానికిని, నిందింపఁబడినదానికిని పేరు. అధో భవః అధమః-క్రిందుపడియుండునది.

**జీర్ణం చ పరిభుక్తం చ యాతయామ మిదం ద్వయమ్,**

యాతయామశబ్దము చివికినదానికిని, భోగింపఁబడినదానికిని పేరు. యాతాః యామాః కలాంశా అస్య యాతయామం___ సారాంశములేనిది. టీ. స. ప్రహరవాచినా యామశబ్దేన కాలమాత్రం లక్ష్యతే, యాతోయామః కాలో ఉస్యేతి యాతయామం.

## యాంతములు

**తురంగ గరుడౌ తార్క్ష్యౌ -**

తార్క్ష్యశబ్దము గుఱ్ఱమునకును, గరుడునికిని పేరు. తక్ష స్యాపత్యేం పుమాన్ తార్క్ష్యః___ తృక్షప్రజాపతి సంతతి తార్క్ష్యము. టీ. స. వేగేన తార్క్ష్యసాదృశ్యా దశ్వో ఉపితార్క్ష్యః. "తార్క్ష్యో ఉనూరా వశ్వకర్ణే రథేన తు రసాంజన" ఇతి శేషః.

**నిల యాపచయౌ క్షయౌ.** 146

క్షయశబ్దము ఇంటికిని, నాశమునకును పేరు. క్షయం త్యస్మిన్ క్షయనం చేతి క్షయః. క్షి నివాసగత్యోః. క్షి క్షయే. దీనియందు నివసింతురు గనుకను, నశించుట గనుకను క్షయము. "క్షయో గతౌ చ హింసాయా"మితి శేషః..

**శ్వశుర్యౌ దేవర స్యాలౌ -**

శ్వశుర్యశబ్దము మగనితోడఁ బుట్టినవానికిని, ఆలితోడఁబుట్టిన వానికిని పేరు. శ్వశుర స్యాపత్యం శ్వశుర్యః. మామకొడుకు.

**భ్రాతృవ్యౌ భ్రాతృజ ద్విషౌ,**

భ్రాతృవ్యశబ్దము తోడఁబుట్టినవాని కొడుకునకును, శత్రువునకును పేరు. భ్రాతు రపత్యం భ్రాతృవ్యః ___ తోడఁబుట్టినవాని కొడుకు భ్రాతృవ్యుఁడు. వీనికి ధననిమిత్తమైన వైరము గలుగును గనుక తత్సామ్యమున శత్రవునందును వర్తించును. టీ.స. 'వ్యఞ సపత్న' ఇతిసూత్రేణ భ్రాతృశబ్దాత్ ప్రకృతి ప్రత్యయ సముదాయా నపేక్షయా శత్రావభిధేయే వ్యఞ ప్రత్యయే భ్రాతృవ్యశబ్దో నిష్పన్నః. అత్రకశ్చిదాహ___ భ్రాతృపుత్రః కదాచి ద్దాయహరత్వేన పితృవ్య మభిభవతి. ఏవమభి భావకత్వ సాధర్మ్యాత్ శత్రురపి భ్రాతృవ్య ఇత్యుచ్యత ఇతి. తదనుపన్నం. ముఖ్య లాక్షణికయోః స్వరవై లక్షణా నుపపత్తేః; క్షణాసిద్ధే ఽర్థే సూత్రారంభ వైయర్థ్యా చ్చేతి.

**పర్జన్యౌ రసద బ్దేన్ద్రౌ -**

పర్జన్యశబ్దము ఉఱుముచున్న మేఘమునకును, దేవేంద్రునికిని పేరు. పర్షతీతి పర్జన్యః. పృషు సేచనే. వర్షించును గనుక పర్జన్యుఁడు.

**స్యా దర్యః స్వామి వైశ్యయోః.** 147

అర్యశబ్దము ప్రభువునకును, వైశ్యునికిని పేరు. అరణీయః అర్యః. ఋ గతౌ. పొందఁదగినవాఁడు.

**తిష్యః పుష్యే కలియుగే**

తిష్యశబ్దము పుష్యనక్షత్రమునకును, కలియుగమునకును పేరు. త్వేషతే తిష్యః. త్విష దీప్తౌ. ప్రకాశించునది. "తిష్యా త్వామలకీ స్త్రియా" మితి శేషః.

**పర్యాయో ఽ వసరే క్రమే,**

పర్యాయశబ్దము అవసరమునకును, వరుసకును పేరు. పర్యయనం పర్యాః. ఇణ్ గతౌ. క్రమముదప్పక వచ్చుట గనుక పర్యాయము. "నిర్వాణే చ ప్రకారే చ పర్యాయ" ఇతి శేషః.

**ప్రత్యయో ఽ ధీన శపథ జ్ఞాన విశ్వాస హేతుషు.** 148

**రన్ధ్రే శబ్దే -**

ప్రత్యయశబ్దము అధీనమునకును, శపథమునకును, జ్ఞానమునకును, విశ్వాసమునకును, హేతువునకును, అవకాశమునకును, కృత్తద్ధితలు మొదలైన శబ్దములకును పేరు. అధీనునికి ___ 'రాజప్రత్యయాః ప్రజాః' శపథ

మునకు ___ 'గూఢద్రవ్యాభిశంకాయాం ప్రత్యయ స్తత్ర కీర్తితః' అని స్మృతి. జ్ఞానమునకు ___ 'ప్రత్యక్షః ప్రత్యయః' అని. విశ్వాసమునకు ___ 'న శత్రౌ ప్రత్యయం గచ్ఛేత్' 'మూఢః పరప్రత్యయనేయబుద్ధిః' అని కాళిదాసుఁడు. హేతువునకు 'అపేక్షతే ప్రత్యయ ముత్తమంత్వాం బీ జాంకురః ప్రాగుదయాది వాంభః' అని కాళిదాసుఁడు. అవకాశమునకు 'రిపౌ ప్రత్యయ మాసాద్య ప్రహరేత్' అని. ప్రత్యేతి ప్రతీయతే అనే నేతిచ ప్రత్యయనం చ, ప్రత్యయః. ఇణ్ గతౌ. ఎఱుఁగువాఁడు, దీనిచేత నెఱుఁగఁబడును; ఎఱుఁగుటయు ప్రత్యయము. "ప్రత్యయః పున రాచారే ప్రథనే" ఇతి శేషః.

**అ థానుశయో దీర్ఘ ద్వేషాను తాపయోః,**

అనుశయశబ్దము దీర్ఘద్వేషమునకును, పశ్చాత్తాపమునకును పేరు. అనుశేత ఇత్యనుశయః. అనుస్యూతమై వచ్చినది, అనుతపించుటయు అనుశయము.

**స్థూలోచ్చయ స్త్వసాకల్యే గజానాం మధ్యమే గతే.** 149

స్థూలోచ్చయశబ్దము సంపూర్ణము గాకుండుటకును, మిక్కిలి తీవ్రమును మందమునుగాని యేనుఁగులయొక్క గమనమునకును పేరు. స్థూలస్య ప్రధానభాగస్య ఉచ్చయ స్సంగ్రహో உ స్యేతి స్థూలోచ్చయః–ప్రధానభాగముయొక్క సంగ్రహము గలిగినది. "స్థూలోచ్చయో గండోపలో మత" ఇతి శేషః.

**సమయా శ్శప థాచార కాల సిద్ధా న్త సంవిదః,**

సమయశబ్దము శపథమునకును, ఆచారమునకును, కాలమునకును, సిద్ధాంతమునకును, జ్ఞానమునకును పేరు. ఇంకను సంకేతమునకు, అవసరమునకు, నియమమునకును పేరు. సమ్యక్ ఈయతే అనేనేతి సమయః. ఇణ్ గతౌ. దీనిచేత నెఱుఁగఁబడును గనుక సమయము. "సంకేతే సమయః ప్రోక్తో నియమే ऽ వసరే ऽ పిచ" ఇతి శేషః.

**వ్యసనా న్యశుభం దైవం విపది త్యనయా స్త్రయః.** 150

అనయశబ్దము ద్యూతము మొదలైన వ్యసనములకును, పూర్వ మందుఁ జేసిన యశుభకర్మమునకును, ఆపదకును పేరు. న విద్యతే న యో ऽ త్రేతి; అయో న భవతీతి చ అనయః – నీతి లేనిది; శుభావహవిధి

గానిదియు అనయము.

**అత్యయో ఽ తిక్రమే కృచ్ఛ్రే దోషే దణ్డేపి -**

అత్యయశబ్దము ఉల్లంఘించుటకును, దుఃఖమునకును, దోషమునకును, దండించుటకును, అపిశబ్దమువలన నాశమునకును పేరు. అత్యయనం, అయమతిక్రాంతిశ్చ అత్యయః. ఇణ్ గతౌ. అతిక్రమించుటయు, శుభావహావిధి నతిక్రమించినదియు అత్యయము. "వినాశే ఽ ప్యత్యయః ప్రోక్త" ఇతి శేషః.

**అ థాపది,**

**యుద్ధాయత్యో స్సంపరాయః.**

సంపరాయశబ్దము ఆపదకును, యుద్ధమునకును, భవిష్యత్కాలమునకును పేరు. సమంతా త్పరాయం త్యత్రేతి సంపరాయః. ఇణ్గతౌ. అంతట దీనియందు మృతులౌదురు. "సంపారాయః స్మృతో యుద్ధే విపదుత్తరకాలయో" రి త్యజయః. పా. సాంపరాయః.

**పూజ్యస్తు శ్వశురే ఽ పి చ.** 151

పూజ్యశబ్దము మామకును, అపిశబ్దమువలన పూజార్హు లయిన పెద్దలకును పేరు. పూజ్యత్వము గలిగినను, "సర్వస్యైవహి దానస్య గ్రహీతా గురు రుచ్యతే, కన్యాయాశ్చైవ విద్యాయాః ప్రదాతా గురురుచ్యతే" అను స్మృతివలన విశేషముగా పూజ్యతముఁడు గనుక ప్రత్యేకముగాఁ జెప్పినాఁడు. పూజనీయః పూజ్యః. పూజ పూజాయాం. పూజింపఁదగినవాఁడు.

**పశ్చాదవస్థాయిబలం సమవాయశ్చ సన్నయౌ,**

సన్నయశబ్దము సేన వెనుకనుండు దుముదారి పౌఁజునకును, సమూహమునకును, చకారమువలన సంబంధమునకును పేరు. సమ్యక్ నీయత ఇతి సన్నయః. ణీఞ్ ప్రాపణే. లెస్సగాఁ గొనిపోఁబడునది.

**సంఘాతే సన్ని వేశే చ సంస్త్యాయః -**

సంస్త్యాయశబ్దము సమూహమునకును, ఊరిచుట్టునుండు బయలునకును, ప. అవయవ సంస్థాన విశేషమునకును, చకారమువలన గృహమునకును పేరు. సంస్త్యయనం, సంస్త్యాయంత్యస్మిన్నితి చ సంస్త్యాయః-కూడుటయు, దీనియందు కూడియుందురు గనుకను సంస్త్యాయము.

**ప్రయాణ స్త్వమీ.** 152

**విస్రమ్భ యాచ్ఞా ప్రేమాణో -**

ప్రణయశబ్దము విస్రంభమునకును, అడుగుటకును, ప్రేమకును పేరు. విస్రంభమనఁగా విశ్వాసమని కొందఱు; పరిచయమని కొందఱు. ప్రకర్షేణనీయత ఇతి ప్రయణయః. ణీఞ్ ప్రాపణే. ప్రకర్షముచేత పొందఁబడునది.

**విరోధే ఽ పి సముచ్ఛ్రయః,**

సముచ్ఛ్రయశబ్దము వైరమునకును, అపిశబ్దమువలన పొడవుకును పేరు. సముల్లంఘ్య శ్రయణం, ఊర్ధ్వశ్రయణం చ సముచ్ఛ్రయః. శ్రిఞ్ సేవాయాం. ఉల్లంఘించి ఆశ్రయించుటయును, ఊర్ధ్వముగా నాశ్రయించుటయును సముచ్ఛ్రయము. "సముచ్ఛ్రయ స్స్యాదున్నత్యా మూర్ధ్వాశ్రయణ ఏవచ" ఇతి శేషః.

**విషయో యస్య యోజ్ఞాత స్తత్ర శబ్దాదికేష్వపి.** 153

విషయశబ్దము ఎవ్వనిచేత నెయ్యేది నిత్యము పరిచయము సేయఁబడునో దానికిని, శబ్దస్పర్శరూపరసగంధాదులకును, అపిశబ్దమువలన దేశమునకును పేరు. వి షినోతి బధ్నాతీతి విషయః. షిఞ్ బంధనే. బంధించునది. "విషయస్స్యాదిద్రియార్థే దేశే జనపదే ఽ పిచ, గోచరే చ ప్రబంధాదే ర్యస్య జ్ఞాతిశ్చ తస్యచ" ఇతి విశ్వప్రకాశః.

**నిర్యాసే ఽ పి కషాయోస్త్రీ -**

కషాయశబ్దము కషాయమునకును, అపిశబ్దమువలన ఒగరునకును, అంగరాగమునకును, పరిమళించుదానికిని, కారమునకును పేరు. "రసభేదే చాంగరాగే నిర్యాసేచ విలేపనే, కషాయో ఽ స్త్రీ త్రిలింగస్తు సురభౌ రూషితే ఽ పిచ" అని రభసుఁడు. కషతీతి కషాయః. ష్న. కషహింసాయాం. పీడించునది. 'కషాయస్తు వరే నస్త్రీ నిర్యాసే రంజకాశ్మని, సురభా వపటౌ రాగే భావనాయాం చ విప్లవే" ఇతి కేశవః.

**సభాయాం చ ప్రతిశ్రయః,**

ప్రతిశ్రయశబ్దము సభకును, చకారమువలన ఉనికిపట్టునకును, గృహమునకును పేరు. "ప్రతిశ్రయ స్సభాయాం స్యా దాశ్రయే మందిరే ఽ పిచ"అని యజయుఁడు. ప్రతిశ్రయత ఇతి ప్రతిశ్రయః. శ్రిఞ్ సేవాయాం. ఆశ్రయింపబడునది.

**ప్రాయో భూ మ్న్యన్తగమనే.**

ప్రాయశబ్దము బాహుళ్యమునకును, మరణార్థమై యాహారము మానియుండుటకును పేరు. ఇది సమాసమునం దుత్తరపదమైనచో సదృశార్థమునకును పేరు. ప్రైతీతి ప్రాయః. ఇణ్ గతౌ. ప్రకృష్టముగాఁ బొందఁబడునది. టీ. స. బాహుళ్యే ___ ప్రాయేణ ధర్మశీలః అంతగమనం = మరణసంకల్పః. తత్ర– "ప్రాయోపవేశ నమతిర్నృపతిర్బభూవ" ఇతి రఘువంశే. సదృశార్థే ___ మూర్ఖప్రాయః. "ప్రాయో వయసి బాహుళ్యే తుల్యానశనమృత్యుషు" ఇతి వైజయంతీ. "ప్రాయస్స్యాద్భోజనత్యాగ" ఇతి హలాయుధః.

**మన్యు ర్దైన్యే క్రతౌ క్రుధి.** 154

మన్యుశబ్దము దైన్యమునకును, యజ్ఞమునకును, కోపమునకును పేరు. మన్యత ఇతి మన్యుః. మను జ్ఞానే. ఎఱుఁగఁబడునది.

**రహస్యోపస్థయో ర్గుహ్యమ్ -**

గుహ్యశబ్దము దాఁచఁదగినదానికి పేరగునపుడు త్రి. స్త్రీపురుషుల గుహ్యావయవములకు పేరగునపుడు న. తాఁబేలునకు పేరైనపుడు పు. గూహనీయం గుహ్యం. గుహూ సంవరణే. దాఁచఁదగినది. "గుహ్యో నా కమఠే దంభ" ఇతి శేషః.

**సత్యం శపథ తథ్యయోః,**

సత్యశబ్దము ఆనకును, నిజమునకును పేరు. మఱియు, యుగభేద లోకభేదములకును పేరందురు. సతి సత్పురుషే సాధు సత్యం–సత్పురుషునియం దొప్పునది. "సత్యస్తు సప్తమే లోకే సత్సు సాధుని వాచ్యవ" దితి శేషః.

**వీర్యం బలే ప్రభావే చ -**

వీర్యశబ్దము సత్తువకును, ద్రవ్యశక్తికిని, చకారములవలన రేతస్సునకును పేరు. వీరయితుం యోగ్యం వీరస్య స్వభావః కర్మ వావీర్యం. శూర వీర విక్రాంతౌ. విక్రమింప యోగ్యమైనదియు, వీరునియొక్క భావమైనను, కర్మమైనను వీర్యము.

**ద్రవ్యం భవ్యే గుణాశ్రయే.** 155

ద్రవ్యశబ్దము మంచి పదార్థమునకును, గుణాశ్రయమైన వస్తువు

నకును పేరు. భవ్యుఁ డనఁగా భాగ్యసంపన్నుఁడనియును, యోగ్యుఁడనియును కొందఱు. ద్రవణీయం ద్రవ్యం. ద్రుగతౌ. పొందఁదగినది. "భవేద్ద్రవ్యం త్రిభుక్లీబం ద్యుమ్నే జతుని భేషజ" ఇతి శేషః.

**ధిష్ణ్యం స్థానే గృహే భే ౨ గ్నౌ -**

ధిష్ణ్యశబ్దము తావునకు పేరైనపుడు పు. ఇంటికిని, నక్షత్రమునకును పేరైనపుడు న. అగ్నికి పేరైనపుడు పు. ధృష్ణోతీతి ధిష్ణ్యం. ఞి ధృషా ప్రాగల్భ్యే. సమర్థమైయుండునది. "స్థానాగ్న్యోః పుంసి ధిష్ణ్యస్స్యాత్ ధిష్ణ్యం శక్తా" వితి శేషః.

**భాగ్యం కర్మ శుభాశుభమ్,**

భాగ్యశబ్దము శుభకర్మమునకును, అశుభకర్మమునకును పేరు. భజనీయం భాగ్యం. భజ సేవాయాం. పొందఁదగినది.

**కశేరు హేమ్నో ర్గాఙ్గేయమ్ -**

గాంగేయశబ్దము కమ్మరేఁగున (ఒకరకము చేఁప) కును, బంగారమునకును పేరు. కశేరువనఁగా కొందఱు తామర కలువ మొదలయినవాని దుంపయనియును, కొందఱు తృణ విశేషమనియు నందురు. గంగాయాం భవం గాంగేయం – గంగ యందుఁ బుట్టినది. '.....షడాననే, గాంగేయః పుంసి భీష్మే చ గాంగేయం ముక్తకే భవే' ఇతి శేషః.

**విశల్యా దన్తికాపిచ.** 156

విశల్యాశబ్దము దంతిచెట్టునకును, అపిశబ్దమువలన పాఁపరచెట్టునకును, తరిగొట్టుచెట్టునకును, నాఁగేటిచాలికూరకును పేరు. విగతం శల్యం యస్యాః విశల్యా – శల్యములేనిది. విశల్యా గతశల్యా స్యాల్లాంగలీ త్రిపుటామృతా, మహౌషధి విశేషో ౨ పి" ఇతి శేషః.

**వృషాకపాయీ శ్రీ గౌర్యోః -**

వృషాకపాయీశబ్దము లక్ష్మికిని, గౌరీదేవికిని పేరు. వృషాకపేః స్త్రీ వృషాకపాయీ. ఈ. సీ. వృషాకపు లనఁగా హరిహరులు. వారి భార్యలు. టీ. స. అగ్నిభార్యాయా మింద్రాణ్యాం చ వృషాకపాయీ శబ్దోవర్తతే.

**అభిఖ్యా నామ శోభయోః,**

అభిఖ్యాశబ్దము నామధేయమునకును, కాంతికిని పేరు. అభిఖ్యాయత ఇత్యభిఖ్యా. ఖ్యా ప్రకథనే. పలుకఁబడునది.

**ఆరమ్భో నిష్కృతి శ్శిక్షా పూజనం సంప్రధారణమ్.** 157
**ఉపాయః కర్మ చేష్టాచ చికిత్సా చ నవ క్రియాః,**

క్రియాశబ్దము ఉద్యోగమునకును, ప్రాయశ్చిత్తమునకును, శిక్షించుటకును, పూజకును, వ్యవహారమందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖిత సాక్ష్యాదులకును, ఉపాయమునకును, వ్యాపారమునకును, బుద్ధి పూర్వక వ్యాపారమునకును, చికిత్సకును, చకారమువలన ధాత్వర్థము మొదలైనదానికిని పేరు. ఆరంభమునకు___ సర్వాఃక్రియా మంత్రమూలా నృపాణాం ___ నిష్కృతికి ___ మహాపాతకినాం పుంసాం భవేత్ప్రాంతికా క్రియా. శిక్షకు___ క్రియా హి ద్రవ్యం వినయతి నా ద్రవ్యం. పూజకు ___ గురవే దత్తాః క్రియాః. సంప్రధారణమునకు ___ క్రియాంవినా కోహి జానాతికృత్యం. ఉపాయమునకు ___ సప్తసామాదికాః క్రియాః. కర్మమునకు ___ పరక్రియా. చేష్టకు___ స్తంభేస్యాన్నిష్క్రియో జంతుః ప్రళయే గతచేతనః. చికిత్సకు ___ పునర్జ్వరే సముత్పన్నే క్రియా పూర్వజ్వరానుగా. క్రియతే కరణం చక్రియా. డు కృఞ్కరణే. చేయఁబడునదియు, చేయుటయు క్రియ. "సంస్కారాఖ్యాత ధాత్వర్థ రచనాసు క్రియా భవే" దితి శేషః.

**ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః.** 158

ఛాయాశబ్దము సూర్యుని పెండ్లామునకును, కాంతికిని, ప్రతి బింబమునకును, నీడకును పేరు. ఛ్యతి తాపాదికమితి ఛాయా. ఛోచ్ఛేదనే. తాపము మొదలయినదానిని బోమొత్తునది. "ఛాయా స్యాత్పాలనో త్కోచ స చ్ఛోభాకావ్యరీతి" ష్వితిశేషః.

**కక్ష్యా ప్రకోష్ఠే హర్మ్యాదేః కాఞ్చ్యాం మధ్యేభబన్ధనే,**

కక్ష్యాశబ్దము మేడలు మొదలయిన రాజగృహముల యొక్క అంతరు వులకును, మొలనూలునకును, ఏనుఁగు నడుమునఁ గట్టెడు మోకునకును పేరు. ఉదా.అంతరువులకు__సప్తకక్ష్యా అతిక్రమ్య. మొలనూలునకు__పరిధానాద్బహిఃకక్ష్యా. ఏనుఁగుమోకునకు హేమకక్ష్యోగజః. కక్షే భవాకక్ష్యా–కక్షమందుండునది. సీ. కక్షశబ్దేన బాహుమూల

వాచినా సామీప్యాన్మధ్యభాగః, తిరోహితసాదృశ్యాత్ గృహమధ్యస్థా సంచ లక్ష్యతే "కక్ష్యా బృహతికాయాం స్యా" దితి శేషః.

**కృత్యా క్రియా దేవతయో స్త్రిషు భేద్యే ధనాదిభిః.** 159

కృత్యాశబ్దము చేయుటకును, దేవతాభేదమునకును పేరగునపుడు స్త్రీ. ధనాదులచేత లోఁబఱచుకొనఁదగిన పరరాష్ట్రపు రాజులు మొదలైనవారికి పేరగునపుడు త్రి. కరణం, కరణీయా చ కృత్యా. డు కృఞ్కరణే. చేయుట, చేయఁదగినదియును కృత్య. "...కృత్యం కార్యే నపుంసకం, హింస్రేగ్రంథ్యే చ్ఛేదనీయేత్రిషు తవ్యాదికే పుమా"నితి శేషః.

**జన్యం స్యాజ్జనవాదే ఽ పి.**

జన్యశబ్దము లోకాపవాదమునకును, అపిశబ్దమువలన యుద్ధమునకును పేరైనపుడు న. పుట్టఁదగినవానికి పేరైనపుడు త్రి. అల్లుని చెలికాండ్రకును, తండ్రికిని పేరైనపుడు పు. "జన్యో నవోఢాభృత్యాదౌ జామాతురపి వత్సలే, జనీయే జనితరి జన్యం కౌలీన యుద్ధయోః" అని అజయుఁడు. జననీయః, జాయతే, జనయతీతి చ జన్యః. జన జననే. పుట్టింపఁదగినదియు, పుట్టునదియు, పుట్టించునదియు జన్యము. "జనితవ్యేరణే క్లీబే ఉపవాదజన జల్పయోః, అస్త్రీ వరవధూజ్ఞాతి ప్రియతుల్య హితేషు చ జన్యస్త్రిషు జనే సాధౌ జనిత్య్రాత్పాదనీయయో" రితి శేషః. "జన్యం హట్టే పరీవాద" ఇతి ప్రతాపశ్చ.

**జఘన్యో ఽ న్త్యే ఽ ధమేపిచ,**

జఘన్యశబ్దము వెనుకఁబుట్టినవానికిని, అధమునికిని పేరు. అపిశబ్దము వలన తోఁకకు, గొరిసెకు, శిశ్నమునకును పేరు. జఘనే భవో జఘన్యః – నికృష్టమైన దేశమందుండువాఁడు, ఉండునది. "జఘన్యం శేఫసి క్లీబే" ఇతి శేషః.

**గర్హ్యాధీనౌ చ వ క్తవ్యౌ -**

వక్తవ్యశబ్దము కుత్సితునికిని, చెప్పినట్టు చేయువానికిని, చకారము వలన పలుకఁదగిన శబ్దములకును పేరు. వక్తుం యోగ్యో వక్తవ్యః. వచ పరిభాషణే. పలుకఁదగినవాఁడు. "వక్తవ్యం శబ్దవార్తిక" ఇతి శేషః.

**కల్యౌ సజ్జ నిరామయౌ,** 160

కల్యశబ్దము సంపాదింపఁబడిన దానికిని, రోగములేనిదానికిని పేరు.

కల్యత ఇతి కల్యః. కల సంఖ్యానే. ఎన్నఁబడునది గనుక కల్యము. "కలాను సాధౌ దక్షే చ కల్య" ఇతి శేషః.

**ఆత్మ వా వనపేతో ఽ ర్థ్యా దర్థ్యా -**

అర్థ్యశబ్దము ఎఱుక గలవానికిని, అర్థమువలనఁ బాయనిదానికిని పేరు. అర్థనీయః, అర్థా దనపేతశ్చ అర్థ్యః. త్రి. అర్థ ఉపయాచ్ఞాయాం. ప్రార్థింపఁబడువాఁడును, అర్థమువలనఁ బాయనిదియు అర్థ్యము. 'అర్థ్యోవిబుధే పుమాన్, క్లీబే శిలాజతు న్యర్థ్యే 'ష్వితి శేషః.

**పుణ్యం తు చార్వపి,**

పుణ్యశబ్దము సుందరమైనదానికిని, అపిశబ్దమువలన సుకృతమునకును పేరు. పుణతీతి పుణ్యం. పుణ శుభకర్మణి. శుభమును జేయునది.

**రూప్యం ప్రశస్తే రూపే ఽ పి.**

రూప్యశబ్దము మంచిసౌందర్యము గలవానికి పేరైనపుడు త్రి. అపి శబ్దమువలన ముద్ర గల వెండికిని, బంగారునకును పేరైనపుడు త్రి. ప్రశస్తమాహతం చ రూప మస్యేతి రూప్యం – మంచిరూపమును, ఆహతమైనరూపమును గలది గనుక రూప్యము.

**వదాన్యో వలువాగపి.** 161

వదాన్యశబ్దము లెస్సగా మాటలాడువానికిని, అపిశబ్దమువలన దాతకును పేరు. వదతీతి వదాన్యః. వద వక్తాయాం వాచి. మంచిమాటలాడువాఁడు.

**న్యాయ్యే ఽ పి మధ్యమ్**

మధ్యశబ్దము ఉచితమయినదానికిని, అపిశబ్దమువలన నడుమునకును, అవకాశమునకును, అధమునికిని పేరు. "న్యాయ్యావలగ్నయోర్మధ్య మంతరే చాధమే త్రిషు" అని రభసుఁడు. మన్యత ఇతి మధ్యం. మన జ్ఞానే. తలపఁబడునది.

**సౌమ్యం తు సున్దరే సోమదైవతే,**

సౌమ్యశబ్దము ఒప్పెడువానికిని, సోముఁడు దేవతగాఁ గలహ విస్సూక్తాదులకును పేరు. సోమో దేవతాస్యేతి సౌమ్యం. త్రి. సోముఁడు దేవతగాఁ గలది గనుక సౌమ్యము.

## రాంతములు

**నివహావసరౌ వారౌ -**

వారశబ్దము సమూహమునకును, ప్రస్తావమునకును పేరు. వ్రియత ఇతి వారః. వృఞ్ వరణే. వరింపఁబడునది. 'వారస్సూర్యాది దివసేఽక్రమే కూపకవృక్షకే, సంభాగే వరణే శ్రీఘే హాలేమద్యస్యభాజన' ఇతి శేషః.

**సంస్తరౌ ప్రస్త రాధ్వరౌ.** 162

సంస్తరశబ్దము దర్భాదులచేతఁ జేయఁబడిన పాన్పునకును, యజ్ఞమునకును పేరు. సంస్తీర్యతే వస్త్రాదికమత్రేతి; సంస్తీర్యంతే దర్భా అత్రేతి చ సంస్తరః. స్తృఞ్ ఆచ్ఛాదనే. దీనియందు వస్త్రాదులును, దర్భలును పఱచఁబడును గనుక సంస్తరము.

**గురూ గీష్పతి పిత్రాద్యౌ -**

గురుశబ్దము బృహస్పతికిని, తండ్రికిని, మంత్రోపదేష్ట మొదలైన పూజ్యులకును, భారమైన వస్తువునకును పేరు. గృణాతి హితముపదిశతీతి గురు. గౄశబ్దే. హిత ముపదేశించువాఁడు. టీ. స. ఆద్యశబ్దార్థః కూర్మపురాణే ప్రపంచితః ___ "ఉపాధ్యాయః పితా జ్యేష్ఠోభ్రాతా చైవ మహీపతిః, మాతుల శ్శ్వశుర స్త్రాతా మాతామహపితామహౌ, వర్ణజ్యేష్ఠః పితృవ్యశ్చ పుమాంసో గురస్స్మృతాః, మాతా మాతామహీగుర్వీ పితుర్మాతుశ్చ సోదరాః, శ్వశ్రూః పితామహీ జ్యేష్ఠా భగినీ గురవః స్త్రియ' ఇతి. 'దుర్జరా లఘునో దీర్ఘసంయుక్త పరయోర్గురుః' ఇతిశేషః.

**ద్వాపరౌ యుగ సంశయౌ,**

ద్వాపరశబ్దము మూఁడవయుగమునకును, సందేహమునకును పేరు. ద్వాభ్యాం కృతత్రేతాభ్యాం పరః, ద్వౌ పక్షౌ పరౌ యస్యేతిచద్వాపరః – కృతత్రేతా యుగముల రెంటికిని పరమయినదియు, రెండుపక్షములు ముఖ్యముగాఁ గలదియు ద్వాపరము.

**ప్రకారౌ భేద సాదృశ్యే -**

ప్రకారశబ్దము విశేషమునకును, పోలికకును పేరు. భేదమునకు___ బహుప్రకారా గీః. సాదృశ్యమునకు ___ విషప్రకార పిశునః. ప్రక్రియ ఇతి ప్రకారః డుకృఞ్ కరణే. ప్రకటముగాఁ జేయఁబడునది ప్రకారము.

**ఆకారా విజ్గి తాకృతీ.** 163

ఆకారశబ్దము ఇంగితమునకును, ఆకృతికిని పేరు. ఇంగిత మనఁగా భావసూచకమైన చేష్ట. ఆకృతి యనఁగా వైవర్ణ్యాది శరీరవికారము. ఇంగితము వైవర్ణ్యాది శరీర వికారము. ఆకృతి సంస్థానము అని కొందఱు చెప్పుదురు. ఆ క్రియత ఇత్యాకారః – చేయఁబడునది.

**కింశారుూ ధాన్యశూ కేషూ -**

కింశారుశబ్దము వరిముంటికిని, అమ్మునకును పేరు. కించిత్ కుత్సితంచ శృణాతీతి కింశారుః. పు శ్యా హింసాయాం. ఇంచుకంత పీడించునది. కుత్సితముగాఁ బీడించునది. 'కింశారుః కంకపక్షిణి' ఇతి శేషః.

**మరుూ ధన్వ ధరాధరౌ,**

మరుశబ్దము నిర్జలభూమికిని, పర్వతమునకును పేరు. మరుభూమి యందుండు పర్వతముపేరని కొందఱు. మ్రియంతే ఉస్మిన్నితి మరుః. పు. మృజ్ ప్రాణత్యాగే. దీనియందు మృతులౌదురు.

**అద్రయో ద్రుమ శైలార్కాః -**

అద్రిశబ్దము వృక్షమునకును, పర్వతమునకును, సూర్యునికిని పేరు. ఆద్యతే, అత్తీతిచ అద్రిః. పు. అద భక్షణే. భక్షింపఁబడునది, భక్షించువాఁడును అద్రి. 'నిద్రాముద్రాం ద్రావయన్నంబుజానా మద్రావద్రిశ్శోణయత్యద్రిజాత' మితి రామాభ్యుదయే.

**స్త్రీ స్త నాబ్దౌ పయోధరౌ.** 164

పయోధరశబ్దము స్త్రీలయొక్క స్తనములకును, మేఘమునకును పేరు. పయసో దరః పయోధరః. ధృ ధారణే. నీళ్లను ధరించునది. 'భిక్షుభేదే నారికేళే కశేరౌ చ పయోధర' ఇతి శేషః.

**ధ్వాన్తారి దానవా వృత్రాః -**

వృత్రశబ్దము చీఁకటికిని, శత్రువునకును, వృత్రాసురునికిని పేరు. వృణోతీతి వృత్రః. వృఞ్ వరణే. ఆవరించునది. 'శైలేచక్రఘనేవృత్ర' ఇతి శేషః. చక్రాకారో మేఘ శ్చక్రఘనః.

**బలి హ స్తాంశవః కరాః,**

కరశబ్దము అప్పనమునకును, చేతికిని, కిరణమునకును పేరు. కీర్యతే, కరోతీతి చ కరః. కౄ విక్షేపే; డు కృఞ్‌కరణే. ఇయ్యఁబడునది,

చేయునదియును కరము. 'శుండాకరక కర్తృషుకర' ఇతి శేషః.

**ప్రదరా భంగ నారీరు గ్బాణాః -**

ప్రదరశబ్దము విఱుచుటకును, స్త్రీల రక్తస్రావాది వ్యాధికిని, అమ్ముకును పేరు. ప్రదారణం, ప్రదీర్యతే అనేనేతి చ ప్రదరః. దౄ విదారణే. వ్రక్కలించుట గనుకను, దీనిచేత వ్రక్కలింపఁబడును గనుకను ప్రదరము. "భీ ర్దారణం దీర్ణః స్వయం చ ప్రదరో వట" ఇతి శేషః.

**అస్రాః కచా అపి.** 165

అస్రశబ్దము వెండ్రుకలకు పేరైనపుడు పు. అపిశబ్దమువలన నెత్తురునకును, నీళ్లకును పేరయినపుడు న. అస్యంత ఇత్యస్రాః. అసుక్షేపణే. త్రోయఁబడునది. దీర్ఘాదియును గలదు. అస్ర ఆస్రశ్చ.

**అజాతశృఙ్గో గౌః కాలే ऽ ప్యశ్మశ్రు ర్నా చ తూబరః,**

తూబరశబ్దము కొమ్ములు రాఁదగినకాలమందు కొమ్ములు రాని యెద్దునకును, మీసాలు రాఁదగు కాలమందు మీసాలు రాని పురుషునికిని పేరు. తన్యతే గోత్వాదిక మనయేతి తూః. శృంగశ్మశ్ర్వాది లక్షణం. తను విస్తారే. తాం వృణో తీతితకాబరః. వృఞ్ వరణే. గోత్వాదికము దీని చేత విస్తరింపఁబడును గనుక తూః. అనఁగా శృంగశ్మశ్ర్వాది లక్షణము దాని నాచ్ఛాదించును.

**స్వర్ణే ऽ పి రాః**

రైశబ్దము బంగారునకును, అపిశబ్దమువలన పదార్థమునకును పేరు. రీయత ఇతి రాః. ఐ. పు. రీఙ్ గతి రేషణయోః. పొందఁబడునది.

**పరికరః పర్యఙ్క పరివారయోః.** 166

పరికరశబ్దము పాన్పునకును, పరివారమునకును పేరు. పరితః కీర్యత ఇతి పరికరః. కౄ విక్షేపే. చుట్టు నిలువఁబడినది. "పరికర స్స్యా దారంభ సమూహయో" రితి శేషః.

**ముక్తాశుద్ధౌ చ తార స్స్యాత్ -**

తారశబ్దము ముత్యముల నిర్దోషత్వమునకును, చకారమువలన నక్షత్రమునకును, అత్యుచ్చస్వరమునకును, కనుగ్రుడ్డునకును పేరు. తరంత్యనేనేతి తారః–దీనిచేత తరింతురు. "తారో నామౌక్తికే శుద్ధే గురుసుగ్రీవ భార్యయోః, బౌద్ధదేవ్యాం తారకయో స్తారా దౌరూప్యవర్ణ

యోః, తారమత్యృచ్ఛ నిధ్వానతరీ సంబంధయోస్త్రిషు" ఇతి శేషః.

**శారో వాయౌ స తు త్రిషు,**

**కర్బురే -**

శారశబ్దము వాయువునకు పేరగునపుడు పు. నానావర్ణములు గలదానికి పేరగునపుడు త్రి. శృణాతీతి శారః. శౄ హింసాయాం. హింసించునది.

**అథ ప్రతి జ్ఞాజి సంవిదాపత్సు సంగరః.** 167

సంగరశబ్దము ప్రతిజ్ఞకును, యుద్ధమునకును, క్రియానిశ్చయమునకును, అపదకును పేరు. ప్రతిజ్ఞ ___ సత్యసంగరః. యుద్ధమునకు ___ సంగరే మరణం పుణ్యం. క్రియా నిశ్చయమునకు ___ అన్యోన్యం కృత సంగరౌ. ఆపదకు ___ సంగరే శరణం. సంగరణం. సమ్యగ్గిరతీతిచ సంగరః. గౄ నిగరణే. ప్రతిజ్ఞ చేయుటయును, మిక్కిలి పీడించుటయును సంగరము. "విషాపదోః క్రియాకారే సంగరం తు శమీఫల" ఇతి విశ్వప్రకాశః.

**వేదభేదే గుప్తవాదే మన్త్రః -**

మంత్రశబ్దము గాయత్ర్యాది వేదమంత్రములకును, రహస్యాలోచనకును పేరు. మన్యత ఇతి మంత్రః. మనజ్ఞానే. విచారింపఁబడునది. "మంత్రో దేవాదిసాధన" ఇతి శేషః.

**మిత్రో రవావపి,**

మిత్రశబ్దము సూర్యునికి పేరగునపుడు పు. అపిశబ్దమువలన చెలికానికి పేరగునపుడు న. మేద్యతీతి మిత్రః. ఞి మిదా స్నేహనే. స్నేహించువాఁడు.

**మఖేషు యూపఖణ్డే ఽ పి స్వరుః-**

స్వరుశబ్దము యజ్ఞమునకును, అమ్మునకును, యూపము చెక్కునప్పు డెగసిన చెక్కకును పేరు. మఱియు వజ్రాయుధమునకును పేరు. ఖండ మనుచోట ఖడ్గమని కొందఱు, స్వరతీతి స్వరుః. పు స్వృశబ్దోపతాపయోః. మ్రోయునది, తపింపఁ జేయునదియు స్వరువు. "యూపఖండే సాయకే చ స్వరు రధ్వర వజ్రయో" రితిశేషః.

**గుహ్యే ఽ ప్యవస్కరః.** 168

అవస్కర శబ్దము గుహ్యప్రదేశమునకును, ఆపిశబ్దమువలన మల

మునకును, కడవ అడుగంటునకును పేరు. అవకీర్యత ఇ త్యస్కరః. కౄ విక్షేపే. నిషేధింప బడునది.

**ఆడమ్బర స్తూర్యరవే గజేన్ద్రాణాం గర్జితే,**

ఆడంబరశబ్దము వాద్యముల మ్రోతకును, ఏనుఁగులయొక్క గర్జనమునకును, చకారమువలన సంరంభమునకును పేరు. ఆదమ్యంతే భీరవో ఽ నేనేత్యాడంబరః. దము ఉపశమే. దీనిచేత పిఱికివాండ్రు నిగ్రహింపఁబడుదురు. 'ఆడంబరో ఽ స్త్రీ సంరంభ' ఇతి శేషః.

**అభిహారో ఽ భియోగే చ చౌర్యే సన్నహనే ఽ పి చ.** 169

అభిహారశబ్దము అపకారము చేయుటకొఱ కెదిరించి యాక్రమించుటకును, ముచ్చిలించుటకును, ఆయత్తపాటునకును పేరు. అభిగమ్యహరణం అభిహారః. హృఞ్ హరణే. ఎదురుగాఁ బోయి హరించుట అభిహారము.

**స్యాజ్జఙ్గమే పరీవారః ఖడ్గకోశే పరిచ్ఛదే,**

పరీవారశబ్దము తిరుగుప్రాణికిని, కృతియొఱకును, పరిజనమునకును పేరు. పరివ్రియతే అనేన పరీవారః. వృఞ్ వరణే. దీనిచేత చుట్టఁబడును గనుక పరీవారము.

**విష్టరో విటపీ దర్భముష్టిః పీఠాద్యమాసనమ్.** 170

విష్టరశబ్దము వృక్షమునకును, దర్భ పిడికిలికిని, పీట మొదలైన యాసనములకును పేరు. విస్తీర్యత ఇతి విష్టరః. స్తృఞ్ ఆచ్ఛాదనే. విస్తరింపఁ బడునది గనుక విష్టరము.

**ద్వారి ద్వార్స్థే ప్రతీహారః ప్రతిహార్యప్యనన్తరే,**

ప్రతీహారశబ్దము వాఁకిటికిని, వాఁకిటి కావలివానికిని పేరు. వాఁకిలి కావలివానికి ప్రతీహారీ శబ్దమును పేరగును. ఇది యీకారాంత స్త్రీలింగమని కొందఱు. అప్పుడు వాకిలిగాచునట్టి యెగ్గడికత్తెకును పేరు. ప్రతిహ్రియతే నివార్యతే అత్ర, అనేనేతి చ ప్రతీహారః; ప్రతీహా చ. హృఞ్ హరణే. ప్రవేశము దీనియందును, దీనిచేత నడ్డగింపఁబడును గనుక ప్రతీహారము, ప్రతీహారియును, 'ప్రతీహారీ తు రాజానం సంభావ యతి యానదా' ఇతి వైజయంతీ.

**విపులే నకులే విష్ణౌ బభ్రుస్స్యాత్పిఙ్గళే త్రిషు.** 171

బభ్రుశబ్దము ముంగిసకును, విష్ణువునకును పేరైనపుడు. పు. పింగళవర్ణము గలదానికి పేరైనపుడు. త్రి. విపులే అనుపదము నకులమునకు విశేషణము. 'విశాలనకులే విష్ణౌ బభ్రుర్నా పింగళే త్రిషు' అని రుద్రుఁడు. భ్రియతే బిభర్తీతి చ బభ్రుః. డు భృఞ్ ధారణపోషణయోః. భరింపఁబడునది, భరించువాఁడును గనుక బభ్రువు. 'బభ్రుర్వహ్నౌ విధాతరి,విలాస మునిభేదే చ భావా ద్దాక్షాయణీధవే' ఇతి శేషః.

**సారో బలే స్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు,**

సారశబ్దము సత్తువకును, చేవకును పేరైనపుడు. పు. యుక్తమైనదానికి పేరైనపుడు న. శ్రేష్ఠమైనదానికి పేరైనపుడు త్రి. సరతి స్థిరీభవతీతి సారః. సృ గతౌ. స్థిరమైయుండునది.

**దురోదరో ద్యూతకారే పణే ద్యూతే దురోదరమ్.** 172

దురోదరశబ్దము జూదమాడువానికి పేరైనపుడు పు. పందెమునకును, జూదమునకును పేరైనపుడు న. దుష్ట మాసమంతా దుదరమస్యేతి దురోదరః – అంతట దుష్టమైన యుదరముగలవాఁడు. ఆద్యచ్చు ఉకారము. 'కిం మే దురోదరేణ ప్రాయతు యది గణపతి ర్న తే భీమః' అని యలంకారసర్వస్వమున వక్రోక్త్యలంకారమందుఁ జెప్పినాఁడు. ఆద్యచ్చు అకారమని కొందఱు. 'ఆశ్రిత్య దుర్గం గిరికందరోదరం క్రీడన్తి చాస్తిక సతతం దరోదరం' అని గోపవర్ధనుఁడు.

**మహారణ్యే దుర్గపథే కాన్తారం పుం నపుంసకమ్,**

కాంతారశబ్దము దొడ్డయడవికిని, పోవ శక్యముగాని త్రోవగలదానికిని పేరు. కస్య జలస్య సుఖస్యవా అంతం నాశమృచ్ఛతీతి కాంతారం. ప్న. ఋ గతౌ. జలనాశమునుగాని సుఖనాశమునుగాని పొందునది.

**మత్సరో ౨ న్యశుభద్వేషే తద్వత్కృపణయోస్త్రిషు.** 173

మత్సరశబ్దము పరుల మేలు చూడఁజాలమికి పేరగునపుడు పు. ఆమత్సరము గలవానికిని, కృపణునికిని పేరగునపుడు త్రి. మదేన సరతీతి మత్సరః. సృ గతౌ. మదముచేత వర్తించును. మాద్యతి పర క్లేశేన హృష్యతీతి మత్సరః. మదీ హర్షగ్లేపనయోః. పరుని దుఃఖముచేత సంతోషించువాఁడు. 'మత్సరౌ మక్షిక క్రోధా' వితి శేషః.

**దేవాద్వృతే వరశ్శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ప్రియే,**

వరశబ్దము దేవతలవలనఁ బొందఁబడిన యభీష్టార్థమునకు పే రగునపుడు. పు. శ్రేష్ఠునికి పేరగునపుడు త్రి. ఇంచుకంత ప్రియమైనదానికి పేరగునపుడు న. అవ్యయమును గలదని కొందఱు. వ్రియత ఇతి వరః. వృఞ్ వరణే. వరింపఁ బడునది. 'వరో జామాతృ షిద్గయో' రితి శేషః.

**వంశాఙ్కురే కరీరో ఽ స్త్రీ తరుభేదే ఘటే చ నా.** 174

కరీరశబ్దము వెదురు మొలకకు పేరగునపుడు ప్న. వెఱుతురు చెట్టునకును, కడవకును పేరగునపుడు. పు. కీర్యత ఇతి కరీరః. కౄ విక్షేపే. తొలఁగఁ ద్రోయఁ బడునది. 'కరీరీ చిరికాయాం చ దంతభేదే చ దంతినా' మితి శేషః.

**నా చమూ జఘనే హస్తసూత్రే ప్రతిసరో ఽ స్త్రియామ్,**

ప్రతిసరశబ్దము సేన వెనుక దిక్కునకు పేరగునపుడు. పు. శుభముల యందుఁ గట్టెడు కంకణమునకు పేరగునపుడు ప్న. ప్రతిశ్రియత ఇతి ప్రతిసరః. సృ గతౌ. పొందఁబడునది. 'విభూషణే ప్రతిసరో మాల్య మంత్రవిశేషయో' రితి శేషః.

**యమానిలేన్ద్ర చద్ద్రార్క విష్ణు సింహాంశు వాజిషు.** 175

**శుకాహి కపి భేకేషు హరి ర్నా కపిలే త్రిషు,**

హరిశబ్దము యమునికిని, వాయువునకును, ఇంద్రునికిని, చంద్రునికిని, సూర్యునికిని, విష్ణువునకును, సింహునకును, కిరణమునకును, గుఱ్ఱమునకును, చిలుకకును, పామునకును, కోతికిని, కప్పకును పేరైనపుడు పు. కపిలవర్ణముగలదానికి పేరైనపుడు త్రి. కపిలవర్ణ మనఁగా బంగారు చాయ. హరతీతి హరిః హృఞ్ హరణే. హరించును గనుక హరి.

**శర్కరా కర్పరాంశే ఽ పి-**

శర్కరాశబ్దము పెంచికకును, అపిశబ్దమువలన మొరపనేలకును, చక్కెరకును పేరు. శీర్యత ఇతి శర్కరా. శౄ విశరణే. వ్రక్కలౌనది. 'శర్కరా ఖండవికృతా వుపలా కర్పరాంశయోః, శర్కరాన్విత దేశేచ రేగ్భేదే శకలేరు ఽ పి చ' ఇతి విశ్వప్రకాశః. టీ. స. కర్పరో భిన్న ఘటాదేః కపాలం. తథా చ ప్రతాపః___ 'కర్పరస్తు కపాలే స్యా చ్ఛస్త్ర భేదకటాహయో' రితి.

**యాత్రా స్యాద్యాపనే గతౌ.** 176

యాత్రాశబ్దము భోజనము మొదలైన వర్తనములకును, గమనమునకును పేరు. భోజనాదివర్తనమునకు ___ 'శరీరయాత్రా' 'ప్రాణయాత్రా' గమనమునకు ___ 'విజయయాత్రా' అని. యూయతే అనయా, యానంచేతి యాత్రా. యా ప్రాపణే. దీనిచేత కాలము త్రోయఁబడును గనుకను, పోవుట గనుకను యాత్ర. 'యాత్రా దేవార్చనోత్సవ' ఇతి శేషః.

**ఇరా భూవాక్సు రాప్సు స్యాత్-**

ఇరాశబ్దము భూమికిని, వాక్కునకును, కల్లునకును, నీళ్లకును పేరు. ఈయత ఇతి ఇరా. ఇణ్ గతౌ. పొందఁబడునది. "ఇరాప్సరస్సు" ఇతి శేషః.

**తన్ద్రీ నిద్రా ప్రమీలయోః,**

తంద్రీశబ్దము నిద్రకును, ఒడలెఱుఁగకుండుటకును పేరు. తామ్యం త్యనయేతి తన్ద్రీ. పా. తన్ద్రా. సీ. తము గ్లానౌ. దీనిచేత బడలుదురు. 'తంద్రీ తంద్రా సమార్థకే' ఇతి శేషః.

**ధాత్రీ స్యాదు ప మాతాపి క్షితిరప్యా మలక్యపి.** 177

ధాత్రీ శబ్దము దాదికిని. భూమికిని, ఉసిరికచెట్టునకును పేరు. రధాతీతి ధాత్రీ. సీ. డు ధాఞ్ ధారణపోషణయోః. ధరించునది, పోషించునది ధాత్రి. టీ. స. ధయంత్యేనామితి ధాత్రీ. ధే ట్పానే.

**క్షుద్రా వ్యఙ్గా నటీ వేశ్యా సరఘూ కణ్టకారికా,**
**త్రిషు క్రూరే ఽధ(నే) మే ఽ ల్పేపి క్షుద్రః -**

క్షుద్రాశబ్దము అంగహీనురాలికిని, నాట్యమాడు స్త్రీకిని, వేశ్యకును, తేనెటీఁగకును, వాఁకుడు చెట్టునకును పేరైనపుడు సీ. క్రూరునికిని, అధమునికిని, కొంచెమైనదానికిని, అపిశబ్దమువలన కృపణునికిని పేరైనపుడు త్రి. క్షుద్యత ఇతి క్షుద్రా, క్షుద్రశ్చ. క్షుద క్షోదే. మెదుపఁబడునది గనుక క్షుద్ర, క్షుద్రమును.

**మాత్రా పరిచ్ఛదే.** 178

**అల్పే చ పరిమాణే చ మాత్రం కార్త్స్న్యే ఽ వధారణే,**

మాత్రా శబ్దము పరివారమునకును, కొంచెమునకును. కొలఁదికిని, చకారము వలన అక్షరావయవమునకును పేరైనపుడు సీ. సకల

మునకును, నిశ్చయమునకును పేరైనపుడు న. ఉదా. పరివారమునకు మహామాత్ర. అల్పమునకు ___ మాత్రయయా పరిలేపనం తాంబూలం చోపయుజ్య. పరిమాణమునకు ___ మాత్రాశీ నైవరోభాక్. సర్వమునకు___ జీవమాత్రం న హింస్యాత్. నిశ్చయమునకు ___ పయో మాత్రం భుజ్క్తే. మీయతే అనయా మాత్రా, మాత్రం చ. మాఙ్ మానే. దీనిచేత కొలఁది పెట్టఁబడును గనుక మాత్ర, మాత్రమును. "స్త్రియాం మాత్రాభూషణే స్యా ద్వర్ణ వృత్తాంశయోర్ధనే" ఇతి శేషః.

**ఆలేఖ్యాశ్చర్యయోశ్చిత్రమ్ -**

చిత్రశబ్దము చిత్తరువునకును, ఆశ్చర్యమునకును పేరు. చిత్రీయత ఇతి చిత్రం. చిత్రఙ్ ఆశ్చర్యే. అద్భుతమైనది. "అథ చిత్రకే, ఖేచిత్రం భాహ్యాప్సరస్సు స్త్ర్యాఖుపర్ణీ సుపర్ణయోః, గోతుంబౌ దంతికాయాం చ పుంసి స్యా ద్వహ్నిసంజ్ఞిక" ఇతి శేషః.

**కళత్రం శ్రోణి భార్యయోః.** 179

కళత్ర శబ్దము పిఱుఁదునకును, పెండ్లామునకును పేరు. కల్యత ఇతి కళత్రం. కల సంఖ్యానే. ఎన్నఁబడునది. "నృపతి ప్రభృతీనాం తు దుర్గస్థానం కళత్ర" మితి శేషః.

**యోగ్య భాజనయోః పాత్రమ్ -**

పాత్రశబ్దము యోగ్యునికి, భోజనపాత్రకును పేరు. మఱియు, నద్యాదుల యొక్క రెండుదరుల నడిమికిని పేరు. పాత రక్షితి, పీయతే ఽ స్మిన్నితి చ పాత్రం. పా రక్షణే; పా పానే. రక్షించుట గనుక, దీనిచేత పానము చేయఁబడును గనుకను పాత్రము. "నాటకాది ప్రవేశార్హే పాత్రం స్యాదా(ద్రా)జమంత్రిణి" ఇతి శేషః.

**పత్రం వాహన పక్షయోః,**

పత్రశబ్దము వాహనమునకును, ఱెక్కలకును పేరు. పతం త్యనేనేతి పత్రం. పత్ ౡ గతౌ. దీనిచేత పోవుదురు గనుక పత్రము.

**నిదేశ గ్రన్థయో శ్శాస్త్రమ్ -**

శాస్త్రశబ్దము ఆజ్ఞకును, వ్యాకరణాది గ్రంథములకును పేరు. శాసనం, శిష్యతే అనేనేతి శాస్త్రం. శాసు అనుశిష్టౌ. శిక్షించుటయు, దీనిచేత శిక్షింపఁబడును గనుకను శాస్త్రము.

**శస్త్రమాయుధ లోహయోః.** 180

శస్త్రశబ్దము ఆయుధమునకును, లోహమునకును పేరు. శస్యతే అనేనేతి శస్త్రం. శసు హింసాయాం. దీనిచేత హింసింపఁబడును.

**స్యాజ్జటాంశుకయో ర్నేత్రమ్-**

నేత్ర శబ్దము చెట్లుపేళ్లకును, వెలిపట్టుచీరకును పేరు, మఱియు, కవ్వపు త్రాటికిని, కంటికిని పేరు. వస్త్రమాత్రమునకు పేరని కొందఱు. నయతి నీయతే అనేనేతి చ నేత్రం. ణీఞ్ ప్రాపణే. పొందించునది గనుక, దీనిచేత పొందఁబడును గనుకను నేత్రము. "నేత్రం పాదపమూలే స్యాత్స్యందనే లోచనే ఽపి చ, వస్త్రే మథిగుణే నాడ్యాం నేత్రం నేత రితు త్రి" ష్వితి ప్రతాపః. మథిగుణో = మంథాన స్యాకర్షణ రజ్జుః. తథాచ పురాణం-'మంథానం మందరం కృత్వా నేత్రం కృత్వాచ వాసుకి' మితి.

**క్షేత్రం పత్నీ శరీరయోః,**

క్షేత్రశబ్దము పెండ్లామునకు, శరీరమునకును పేరు. మఱియు, వరిమడికిని, సిద్ధస్థానమునకును పేరు. క్షీయత ఇతి క్షేత్రం. క్షి నివాస గత్యోః. పొందఁబడునది. 'క్షేత్రం కళత్రే కేదారే సిద్ధస్థాన శరీరయోః, క్షేత్రం గణితశాస్త్రే' చేతి ప్రతాపః.

**ముఖాగ్రే క్రోడ హలయోః పోత్రమ్-**

పోత్రశబ్దము పందిమూఁతికిని, నాఁగేటికొనకును పేరు. పునాత్యనేనేతి పోత్రం. పూఞ్ పవనే. దీనిచేత పవిత్రమౌను.

**గోత్రం తు నామ్ని చ.** 181

గోత్రశబ్దము నామధేయమునకును, చకారమువలన కులమునకును, బలమునకును పేరైనపుడు న. పర్వతమునకు పేరైనపుడు పు. భూమికిని గోసమూహమునకును పేరైనపుడు సీ. 'గోత్రస్తు ధరిణీ ధరే, గోత్రా భువి గవాం బృందే' అని అజయుఁడు 'గ్రోత్రస్త్రాతా గవాం త్రిషు' అని శేషము. గూయతే అనేన గా స్త్రాయతే గోసమూహశ్చేతి గోత్రం, గోత్రః, గోత్రాచ. గుజ్ శబ్దే. త్రైజ్ పాలనే. దీనిచేత పిలువఁబడును గనుకను, గోవుల రక్షించును గనుకను, గోసమూహము గనుకను గోత్రము, గోత్రయును.

**సత్ర మాచ్ఛాదనే యజ్ఞే సదా దానే వనే ఽపి చ,**

సత్రశబ్దము కప్పుటకును, యజ్ఞమునకును, సంతత దానమునకును, వనమునకును, అపిశబ్దమువలన దంభమునకును పేరు. సీదం తస్మిన్నితి సత్రం. షద్ విశరణ గత్యవసాదనేషు. దీనియందు పాపములు మొదలయినవి నశించును. టీ. స. ఆచ్ఛాదనశబ్దేన గృహం వివక్షితం. నతు వస్త్రమితి సుబోధినీకారః 'సత్రం దంభే సాధనే చ సతా మవితరి త్రిషు, క్వచిత్ త్వాపే ఽథ సద్దేయే సత్రావ్యయ మధీనవ' దితి శేషః.

**అజిరం విషయే కా ఽ యేపి -**

అజిరశబ్దము శబ్దాది విషయములకును, శరీరమునకును, అపిశబ్దము వలన ముంగిలికిని పేరు. అజన్తి చక్షురాదీ న్యత్రేతి అజిరం. అజగతిక్షేపణయోః. దీనియందు చక్షురాదీంద్రియములు చరించును.

**అమ్బరం వ్యోమ్ని వాససి.** 182

అంబరశబ్దము ఆకాశమునకును, వస్త్రమునకును పేరు. అంబత ఇతి అంబరం. అబి శబ్దే. మ్రోయునది. 'అంబరం వ్యసనే వ్యోమ్ని కార్పాసే చ సుగంధిని' ఇతి విశ్వప్రకాశః.

**చక్రం రాష్ట్రే ఽ పి -**

చక్రశబ్దము దేశమునకును, అపిశబ్దమువలన చక్రవాకమునకును, సమూహమునకును, సైన్యమునకును, బండికంటికిని, గ్రామ సమూహమునకును, కుమ్మరసానకును, ఆయుధవిశేషమునకును పేరు. 'చక్రః శోకే వ్రజే పుంసి క్లీబం సైన్య రథాంగయోః, గ్రామజాలే కుంభకారభాండే చావర్తరాష్ట్రయోః రితి ప్రతాపః. చక్రంసైన్యే గ్రామజాలే సంగ్రామే సాధనాంతరే, తైలికీయే కౌంభకారే చావర్తే చాయుధాంతర' ఇతి శేషః. క్రియత ఇతి చక్రం. డు కృఞ్ కరణే. చేయఁబడునది. చకతీతి చక్రం. చక తృప్తౌ. తృప్తిఁ జేయునది.

**అక్షరం తు మోక్షే ఽ పి-**

అక్షరశబ్దము మోక్షమునకును, అపిశబ్దమువలన కకారాదివర్ణములకును, పరబ్రహ్మమునకును పేరు. న క్షరతీ త్యక్షరం. క్షర సంరక్షణే. చెడనిది గనుక అక్షరము. 'వర్ణే బ్రహ్మ ణ్యక్షరం స్యా' దితి శేషః.

**క్షీర మప్సు చ**

క్షీరశబ్దము నీళ్లకును, చకారము వలన పాలకును పేరు. ఘస్యత

ఇతి క్షీరం. ఘస్ ౙ అదనే. భక్షింపఁబడునది.

**స్వర్ణే ఽ పి భూరి చన్ద్రే ద్వే -**

భూరిశబ్దము చంద్రశబ్దమును బంగారుపేళ్లు. అపిశబ్దమువలన భూరిశబ్దము బహుళమునకును, చంద్రశబ్దము చంద్రునికిని, కర్పూరమునకును, కపిల మను గంధద్రవ్యమునుకును పేరు. 'ఇందు కర్పూర కాంపిల్యాశ్చంద్రా శ్చంద్రో ఽపి హేమని' అని రుద్రుఁడు. భూరిశబ్దము స్వర్ణ వాచకమైనపుడు న. బహుళ వాచకమైనపుడు త్రి. చంద్రశబ్దము సువర్ణమునకు పేరైనపుడు న. పుంలింగమని కొందఱు. భవతీతి భూరి అగునది గనుక భూరి. చంద్రయతీతి చంద్రః – ఆహ్లాదమును చేయును గనుక చంద్రము. 'ప్రాజ్యాచ్యుత విధాతృషు, చంద్రే చ భూరి' రితి శేషః. 'భూరిర్బ్రహ్మాచ్యుతేంద్రేషు భూరి ప్రాజ్ఞసువర్ణయో' రితి విశ్వప్రకాశ. 'చంద్రశ్శుభ్రాంశు కర్పూర కాంపిల్యేషు పుమాన్ భవే' దితి శేషః.

**ద్వారమాత్రే ఽ పి గోపురమ్.**

గోపురశబ్దము వాఁకిలికిని, అపిశబ్దమువలనఁ బట్టణపువాఁకిలికిని, తుంగము స్తలకను పేరు. గోప్యత ఇతి గోపురం. గుపూ రక్షణే. రక్షింపఁబడునది.

**గుహాదమ్భౌ గహ్వరే ద్వే -** 183

గహ్వరశబ్దము గుహకును, కపటమునకును పేరు. గాహ్యత ఇతి గహ్వరం. గాహూ విలోడనే. ప్రవేశింపఁబడునది. 'గహ్వరంతు గుహాదంభౌ నికుంజే గహనే ఽపిచ' ఇతి విశ్వప్రకాశః.

**రహో ఽ న్తి కముపహ్వరే,**

ఉపహ్వరశబ్దము ఏకాంతమునకును, సమీపమునకును పేరు. ఉపహూయతే ఽస్మిన్ని త్యుపహ్వరం. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ. దీనియందు పిలువఁబడుదురు.

**పురో ఽ ధిక ముపర్యగ్రాణి -**

అగ్రశబ్దము ముందరికిని, అధికమునకును, మీఁదికిని పేరు. ప్రధానునికి పేరగునపుడు త్రి. భిక్షాభేదమునకు పేరగునపుడు న. 'గ్రాస ప్రమాణం భిక్షాస్యాదగ్రంగ్రాస చతుష్టయం'. ఉదా___ ముంద

రికి అగ్రేసరః. అధికమునకు ___ సాగ్రంవర్షశతం. మీఁదికి – వృక్షాగ్రం. అగతీత్యగ్రం. అగి గతౌ. ముందరికిఁ బోవునది. 'అగ్ర మాలంబనే ప్రాంతే ప్రథమే ప్రమితాశన' ఇతి శేషః.

**అగారే నగరే పురమ్.** 184

**మన్దిరం చ -**

పురశబ్దమును, మందిరశబ్దమును ఇంటికిని, పట్టణమునకును పేళ్లు. పూర్యత ఇతి పురం. పౄ పాలన పూరణయోః. పరిపాలింపఁబడునది గనుక పురము. మందతే ఽస్మిన్నితి మందిరం. మది స్తుతి మోద మదస్వప్న కాంతి గతిషు. దీనియందు సంతోషింతురు గనుక మందరిము. "గృహో పరిగృహేపురం, దేహే పాటలిపుత్రే చ గుగ్గులౌ కథితః పురః, పురావ్యయం పూర్వకాల" ఇతి. "మందిరో మకరాలయ" ఇతి చ శేషః.

**అథ రాష్ట్రో ఽ స్త్రీ విషయే స్యా దుపద్ర వే,**

రాష్ట్రశబ్దము దేశమునకును, ఉపద్రవమునకును పేరు. ఉదా ___ పరరాష్ట్రభయం. రాజత ఇతి రాష్ట్రం ప్న. రాజృదీప్తౌ. ప్రకాశించునది.

**దరో ఽస్త్రియాం భయే శ్వభ్రే-**

దరశబ్దము భయమునకును, గుంటకును పేరు. దరణం, దీర్యత ఇతి చ దరః. ప్న. దౄ భయే; దౄ విదారణే. వెఱచుట, త్రవ్వఁబడునదియును దరము. ఈషదర్థమందు దరశబ్ద మవ్యయము. "దరదళిత హరిద్రాపింజరాణ్యంగకాని" "ఈషదర్థే ద రాలింగ" మితి శేషః.

**వజ్రోస్త్రీ హీరకే పవౌ.** 185

వజ్రశబ్దము వజ్రమను రత్నమునకును, వజ్రాయుధమునకును పేరు. వజతి ప్రతిబంధ రాహిత్యేనేతి వజ్రః. ప్న వజ గతౌ. అడ్డములేకపోవునది. "వజ్రం కులిశ శస్త్రయోః, మణివేధే రత్నభేద" ఇతి కేశవస్వామీ. "వజ్రస్త్వామలకే యోగే స్త్రీలింగస్స్యాన్మహౌషధా" వితి శేషః.

**తన్త్రం ప్రధానే సిద్ధాన్తే సూత్ర వాయే పరిచ్ఛదే,**

తంత్ర శబ్దము ప్రధానమునకును, సిద్ధాంతమునకును, నూలి పడుగునకును, పరివారమునకును పేరు. ఉదా. ప్రధానమునకు ___ 'స్వతంత్రః' సిద్ధాంతమునకు ___ 'చతుః పీఠమిదం తంత్రం' సూత్రవాయమునకు ___

'తంత్రావాపః' పరివారమునకు ___ 'తంత్రపతిః' అని. తన్యత ఇతి తంత్రం. తను విస్తారే. విస్తరింపఁబడునది. "అథ తంత్రం స్యాత్కుటుంబార్థే చ కర్మణి, ఇతి కర్తవ్యతాయాం చ సాధారణవిధౌ తథా, శిలాయా మమృతాయాం చ తంత్రవీణాగుణే తనా" వితి శేషః. 'తంత్రం స్వరాష్ట్రచింతా స్యా' దితి వైజయంతీ.

**ఔశీర శ్చామరే దణ్డే ౯ ప్యౌశీరం శయనాసనే.** 186

ఔశీరశబ్దము చామరమునకును, యష్టికిని పేరైనపుడు పు. అపిశబ్దమువలన వట్టివేళ్లసంబంధమైనదానికి పేరైనపుడు త్రి. శయనమునకును, పీఠమునకును పేరైనపుడు న. శయన మనఁగా నిద్రయని కొందఱు. 'చామరే దండే' అనునపుడు 'చామరదండ' మని సుభూతి. ఉశ్యతే కామ్యత ఇ త్యుశీరం. ఉశీర మేవ ఔశీరం. వశ కాంతౌ. కోరఁబడునది.

**పుష్కరం కరిహస్తాగ్రే వాద్య భాణ్డముఖే జలే,**
**వ్యోమ్ని ఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః.** 187

పుష్కరశబ్దము ఏనుఁగు తొండముకొనకును, మద్దెల మొదలైన వాద్యముల ముఖమునకును, నీళ్లకును, ఆకాశమునకును, కత్తివాఁదరకును, పద్మమునకును, తీర్థభేదమునకును, ఓషధి విశేషమునకును పేరు. ఉదా. తీర్థభేదమునకు ___ 'పుష్కరం దుష్కరం గంతుం' ఓషధి భేదమునకు ___ 'పుష్కరమూలం' అని. పుష్ణాతీతి పుష్కరం. పుష పుష్టౌ. పోషించునది. "ద్వీపే సర్పే పుష్కర స్స్యా" దితి శేషః.

**అ న్తర మవకాశావధి పరిధా నాన్తర్ధి భేద తాదర్థ్యే,**
**ఛిద్రాత్మీయ వినా బహి రవసర మధ్యే ౯ న్తరాత్మని చ.** 188

అంతరశబ్దము ఎడమునకును, మర్యాదకును, కట్టుకోకకును, వ్యవధానమునకును, విశేషమునకును, దానికొఱ కిది యను నర్థమునకును, రంధ్రమునకును, తన సంబంధమైన దానికిని, అది వెలిగానను వినార్థమునకును, వెలుపలికిని, అవసరమునకును, మధ్యప్రదేశమునకును, పరమాత్మకును, చకారము వలన అన్యమైన దానికిని పేరు. ఉదా. ఎడమునకు ___ 'మృనాళ సూత్రాంతర మప్యలభ్యం.' మర్యాదకు ___ 'మాసాంతరం దేయం'. కట్టుకోకకు ___ 'అంతరే శాటకాః'. వ్యవధానమునకు ___ 'పర్వతాంతరితో దేశః'. విశేషమునకు ___ 'యదంతరం వాయసవైనతేయ

యోః'. తాదర్థ్యమునకు ___ 'ఓదనాంతరస్తండులః' రంధ్రమునకు ___ 'అంతరం లబ్ధ్వాఅరేః ప్రహరేత్', 'కుడ్యాంతరే ప్రవిష్టశ్చోరః' తన సంబంధమైనదానికి ___ 'అయ మభ్యంతరోమమ'. దానిఁ బాసి యను నర్థమునకు ___ 'అంతరేణ పురుషకారం నకించి త్సర్ధ్యతి' వెలుపలికి ___ 'అంతరే చండాలగృహాః', అవసరమునకు ___ 'అత్రాంతరే కిమపి మాన్మథమావిరాసీత్'. మధ్యప్రదేశమునకు 'ఆవయోరంతరేజాతా స్సరిత్సా గర పర్వతాః'. పరమాత్మకు ___ 'దృష్ట్వాంతరం జ్యోతి రుపరరామ.' అన్యార్థమునకు ___ 'ధాన్యాంతరం వాచ్యాంతరం' అని. అంతం రాతీత్యంతరం. రా దానే. అంతము నిచ్చునది. "అంతర స్సదృశాన్యయో" రితి శేషః. "అంతరః పరిధానీయే బాహ్యే స్వీయే ఽ న్తరాత్మని, క్లీబే మధ్యే ఽ వకాశే చ తాదర్థ్యే ఽ వసరే ఽ వధౌ. విశేషే వివరాంతర్ధి ష్వవస్థాన వినార్థయో" రితి వైజయంతీ.

**ముస్తే ఽ పి పిఠరమ్ -**

పిఠరశబ్దము తుంగము స్తెలకును, అపిశబ్దమువలన కుండకును, కవ్వపుకోలకును పేరు. పచ్యతే పచత్యస్మిన్నితి, పిఠతీతి చ పిఠరం. డుపచ్ ష్పాకే, పిఠ హింసాయాం. పాకము చేయఁబడును; దీనియందుఁ బాకము చేయుదురు. హింసించునదియును పిఠరము.

**రాజకశేరుణ్యపి నాగరమ్,**

నాగరశబ్దము రాజకశేరువునకును, అపిశబ్దమువలన సొంఠికిని పేరు. రాజకశేరు వనఁగా భద్రముస్త. తామరదుంప యని కొందఱు. తృణవిశేషమని మఱికొందఱు. నగరేభవం నాగరం – నగరమందుఁ బుట్టినది. "ప్రవీణం కుత్సితం వినా, అసంజ్ఞా నగరే జాతం నాగరం నాగరాయకే, త్రి ష్వథో సౌరతే బందే నాగర" మితి శేషః.

**శార్వరం త్వన్ధత మసే ఘాతుకే భేద్యలిఙ్గకమ్,** 189

శార్వరశబ్దము కటికచీఁకటికి పేరగునపుడు న. చంపు స్వభావము గలవానికి పేరగునపుడు త్రి. భేద్యలింగక శబ్దము ఇది మొదలుకొని రేఫాంతములు ముగియుదనుక ననువర్తించును గనుక ముందుఁ జెప్పఁబడు రేఫాంత శబ్దములు మూఁడు లింగములయందును వర్తించును. శర్వర్యాంభవం, శృణాతీతి చ శార్వరం. శౄ హింసాయాం. రాత్రియందుఁ బుట్టునది

గనుకను, హించించువాఁడు గనుకను శార్వరము. పా. ఘాతుకే భే ఽన్యలింగకం. చంపు స్వభావము గల యేనుఁగు.

**గౌరో ఽ రుణేసితే పీతే -**

గౌరశబ్దము ఎఱుపు వస్తువునకును, తెలుపువస్తువునకును, పచ్చని వస్తువునకును పేరు. మఱియు, మృగవిశేషమునకును పేరు. గూయత ఇతి గౌరః. గుజ్ గతౌ. పొందఁబడునది గాని, యెఱుఁగఁబడునదిగాని గౌరము.

**వ్రణకార్య ప్యరుష్కరః,**

అరుష్కరశబ్దము వ్రణముఁ జేయుదానికి పేరు. అపిశబ్దమువలన జీడిచెట్టునకుఁ బేరగునపుడు పు. అరుః కరోతీ త్యరుష్కరః. డు కృఞ్ కరణే. వ్రణమును జేయునది.

**జఠరః కఠినే ఽ పి స్యాత్ -**

జఠర శబ్దము కఠినమయిన వస్తువునకు పేరు. అపిశబ్దమువలన కడుపునకు పేరగునపుడు ప్న. జాయతే ఽస్మిన్నితి జఠరః. జనీ ప్రాదుర్భావే. దీనియందు పుట్టును గనుక జఠరము. "కుక్షౌ తు జఠరోన స్త్రీ త్రిషు వృద్ధ కఠోరయో" రితి రుద్రః.

**అధస్తాదపి చాధరః.** 190

అధరశబ్దము దిగువ నుండు వస్తువునకును, అపిశబ్దమువలన హీనునికిని పేరగునపుడు త్రి. పెదవికి పేరగునపుడు పు. అధరత్వా దధరః. దిగువ నుండును. "నికృష్టే ఽ ప్యధర స్త్రి" ష్వితి శేషః.

**అనాకులే ఽ పి చైకాగ్రః-**

ఏకాగ్ర శబ్దము కలఁతలేనివానికిని, అపిశబ్దమువలన సావధానుఁ డైనవానికిని పేరు. ఏకమగ్రం చింతనీయమస్యే త్యేకాగ్రః – ఒక్కటే విచారించఁ దగినదిగాఁ గలవాఁడు. "ఏకాగ్ర మేకతానేస్యా దేకాగ్రంచాప్యనాకుల" ఇతి విశ్వప్రకాశః.

**వ్యగ్రో వ్యాసక్త ఆకులే,**

వ్యగ్రశబ్దము ఒకదానియందు మనస్సు తగిలినవానికిని, వేగిరపడువానికిని పేరు. విశేషేణ వివిధం చాంగతీతి వ్యగ్రః. అగి గతౌ మిక్కిలిగాని, వివిధముగాఁ గాని పోవువాఁడు.

**ఉప ర్యుదీచ్య శ్రేష్ఠే ష్వ ప్యుత్తర స్స్యాత్ -**

ఉత్తరశబ్దము మీఁదికిని, ఉత్తరదేశము మొదలయినదానికిని, శ్రేష్ఠునికిని పేరు. అపిశబ్దమువలన ప్రత్యుత్తరమునకును పేరు. ఉదా. మీఁదికి–'ఇత ఉత్తరం.' ఉత్తరదేశమునకు–'ఉత్తరే కుబేరః.' శ్రేష్ఠునికి–'లోకోత్తరః' అని. అతిశయే నోద్గత ముత్తరం – మిక్కిలి కనిపించునది. "ది శ్యుత్తరా స్త్రియాం పుంసి విరాటనయే ఽపి చ, ఉత్తరం ప్రతివాక్యే స్యా" దితి శేషః.

**అనుత్తరః.** 191

**ఏషాం విపర్యయే శ్రేష్ఠే -**

అనుత్తరశబ్దము మీఁదఁ జెప్పిన యర్థముల వ్యత్యాసమునందు వర్తించును. అనఁగా మీఁదుగానిదానికిని, ఉత్తరపుదేశము కానిదానికిని, ఉత్తమము గానిదానికిని, శ్రేష్ఠునికిని పేరు. ఉత్తరోన భవతీతి, న విద్యతే ఉత్తరో ఽస్మాదితి చ అనుత్తరః– ఉత్తరముగానిది గనుకను, దీనికంటె నుత్తమమైనది లేదు గనుకను అనుత్తరము.

**దూరా నా త్మోత్తమాః పరాః,**

పరశబ్దము దవ్వయినదానికిని, తనకంటె నన్యమైనదానికిని, శ్రేష్ఠమైన దానికిని పేరు. శత్రువునకు పేరైనపుడు పు. పూర్యత ఇతి పరః. పౄ పాలన పూరణయోః. పూరింపఁబడునది. "పరశ్శత్రా వలింగస్స్యాత్కేవల" ఇతి శేషః.

**స్వాదు ప్రియౌ తు మధురౌ -**

మధురశబ్దము తీయని వస్తువునకును, ఇష్టమైన వస్తువునకును పేరు. మధు మాధుర్య మస్యాస్తీతి మధురః – మాధుర్యము గలిగినది.

**క్రూరౌ కఠిన నిర్దయౌ.** 192

క్రూరశబ్దము కఠినమయినదానికిని, దయలేనివానికిని పేరు. మఱియు, భయంకరమైనదానికిని పేరు. కృణాతీతి క్రూరః. కృఞ్ హింసాయాం. హింసించునది.

**ఉదారో దాతృ మహతోః -**

ఉదారశబ్దము దాతకును, దొడ్డవానికిని పేరు. ఉదియ ర్తీత్యు దారః – ఔన్నత్యమును బొందువాఁడు. "దక్షిణే ఽపి చ, స్యా దుదా

రో ఽ నుకూలే” తీతి శేషః.

**ఇతర స్త్వన్య నీచయోః,**

ఇతరశబ్దము పరునికిని, క్షుద్రునికిని పేరు. ఏతీతి ఇతరః. ఇణ్ గతౌ పోవువాడు.

**మన్ద స్వచ్ఛన్దయోః స్వైరః-**

స్వైరశబ్దము అలసునికిని, స్వతంత్రునికిని పేరు. స్వేన ఈర్తే గచ్ఛతీతి స్వైరః. ఈర గతౌ. స్వేచ్ఛచేతఁ జరించువాఁడు.

**శుభ్ర ముద్దీప్త శుక్లయోః.** 193

శుభ్రశబ్దము ప్రకాశించువానికిని, తెల్లని వస్తువునకును పేరు. శోభత ఇతి శుభ్రం. శుభ శుంభ శోభార్థే. ప్రకాశించునది. “విజ్ఞేయం శుభ్ర మభ్రక” ఇతి శేషః.

## లాంతములు

**చూడా కిరీటం కేశాశ్చ సంయతా మౌళయస్త్రయః,**

మౌళిశబ్దము శిఖకును, కిరీటమునకును, కొప్పునకును పేరు. ఇదిగాక అశోకవృక్షమునకును పేరు. మల్యత ఇతి మౌళిః. మల మల్లధారణే. ధరింపఁ బడునది. ‘త్రయః’ అని పుంలింగ నిర్దేశము మౌళిశబ్దము పుంలింగ మని సూచించుటకొఱకు. స్త్రీలింగము గలదు. “కిరీటే మౌళీ రక్లీబే చూడా సంయతకేశయోః” అని రభసుఁడు. “కంకేళి పాదపేమౌళి” రితి శేషః.

**ద్రుమప్రభేద మాతఙ్గకాణ్డ పుష్పాణి పీలవః.** 194

పీలుశబ్దము గోఁగుచెట్టునకును, ఏనుఁగునకును, అమ్మునకును, పువ్వులకును పేరు. పిలతి, పిల్యతే చ పీలుః. పు, పిల గతౌ పోవునదియు, పొందఁబడునదియు పీలువు. “పీలవః పరమాణవ” ఇతి శేషః.

**కృతాన్తానే హసోః కాలః -**

కాలశబ్దము యమునికిని, కాలమునకును పేరు. కలయతి ప్రాణిన ఇతి కాలః. కల కిల క్షేపే. ప్రాణులను పోఁ ద్రొబ్బువాఁడు.

**చతుర్థే ఽపి యుగే కలిః,**

కలిశబ్దము కలియుగమునకును, అపిశబ్దమువలన కలహమునకును పేరు. కల్యన్తే ఽస్మిన్నితి కలిః. పు. కల కిల క్షేపే. దీనియందు

ద్రొబ్బఁబడుదురు.

**స్యా త్కురఙ్గే ౨ పి కమలః -**

కమలశబ్దము ఇఱ్ఱికి పేరైనపుడు పు. అపిశబ్దమువలన తామరకును, నీళ్లకును పేరైనపుడు న. మహాలక్ష్మికి పేరైనపుడు సీ. కామ్యత ఇతి కమలః. కము కాంతౌ. కోరఁబడునది. 'కమలం సలిలే తామ్రే జలజే క్లోమ్ని భేషజే, మృగప్రభేదే కమలః కమలా శ్రీవరస్త్రియో' రితి విశ్వప్రకాశః.

**ప్రావారే ౨ పి చ కమ్బళః.** 195

కంబళశబ్దము ఉత్తరీయమునకును, అపిశబ్దమువలన కంబళికిని, గంగడోలునకును, సర్ప విశేషమునకును పేరు. కామ్యత ఇతి కంబళః. కము కాంతౌ. కోరఁబడునది. 'సాస్నాయాం నాగరాజే చ కంబళో ౨థ కృమావపి' ఇతి శేషః. 'కంబళో నాగరాజే స్యా త్సాస్నాప్రావారయోరపి' ఇతి విశ్వప్రకాశః.

**కరోపహారయోః పుంసి బలిః ప్రాణ్యఙ్గజే స్త్రియామ్,**

బలిశబ్దము అప్పనమునకును, పూజోపకరణమునకును పేరైనప్పుడు పు. ఒడలితఱులకు పేరైనప్పుడు సీ. బలిచక్రవర్తికి పేరైనపుడు పు. బలంత్యనేనేతి బలిః. బల ప్రాణనే. దీనిచేత బ్రతుకుదురు. 'బలీచామరదండే స్త్రీ త్వక్కోశే గృహదారుణి, బాణతాతే గంధకే నా నైవేద్య కరయోరపి' ఇతి ప్రతాపః.

**స్థౌల్య సామర్థ్య సైన్యేషు బలం నా కాక సీరిణోః.** 196

పలశబ్దము బలియుటకును, సత్తువకును, సేనకును పేరైనపుడు న. కాకికిని, బలభద్రునికిని పేరైనపుడు పు. బలంత్యనేన బలం. బలప్రాణనే. బలతి చిరంజీవతీతి, బల మస్యాస్తీతి చ బలః–దీనిచేత బ్రతుకుదురు బహుకాలము జీవించును, బలముగలవాఁడును గనుక బలము, బలుఁడును.

**వాతూలః పుంసి వాత్యాయామపి వాతాసహే త్రిషు,**

వాతూలశబ్దము వాయుసమూహమునకు పేరైనపుడు పు. గాడ్పును సహింపనివానికి పేరైనపుడు త్రి. కొందఱు గాలిని సహించువానికిని పేరందురు. 'వాతూలో వాతసంఘాతే వాతకే మరుత స్సహే'

అని అజయుఁడు ఉన్మత్తునికిని పేరని స్వామి. వాతసమూహో వాతాసహశ్చ వాతూలః–వాయుసమూహమును, వాయువు నోర్వనివాఁడును వాతూలము, వాతూలుఁడు.

**బేద్యలిఙ్గ శ్శఠే వ్యాళః పుంసి శ్వాపద సర్పయోః.** 197

వ్యాళశబ్దము దుర్జనునకు పేరైనపుడు త్రి. పులికిని, పామునకును పేరైనపుడు పు. విరుద్ధ మాసమంతా దలతీతి వ్యాళః. అల భూషణాదౌ. అడ్డగింపఁబడును.

**మలో ౽స్త్రీ పాప విట్కిట్టాని -**

మలశబ్దము పాపమునకును, విష్ఠకును, కిట్టమునకును పేరు. కిట్టమనగా, 'వసా శుక్లమసృఙ్మజ్జా మూత్ర విట్కర్ణవిణ్ణఖాః, శ్లేష్మాశ్రు దూషికాస్వేదో ద్వాదశైతే మలా నృణాం' అను ద్వాదశమలములు. చిట్టెపుఱాయి యని కొందఱు. మల్యత ఇతి మలః. స్న. మల మల్లధారణే. ధరింపఁబడునది. 'మలస్తు కృపణే త్రిషు' ఇతి శేషః.

**అస్త్రీ శూలం రుగాయుధమ్,**

శూలశబ్దము శూలరోగమునకును, ఆయుధ భేదమునకును పేరు. శూలయతీతి శూలం. శూల రుజాయాం. వ్యథ పెట్టునది. రోగభేదే భవే చ్ఛూలం మృత్యోః ప్రావరణాంతరే, యోగభేదే ధ్వజే శూలః శూలాపణ్యస్త్రియాం మతా. శూలం విక్రయణే ౽పి స్యా'దితి ప్రతాపః.

**శఙ్కావపి ద్వయోః కీలః -**

కీలశబ్దము చీలకును, అపిశబ్దమువలన అగ్నిజ్వాలకును పేరైనపుడు ప్న. మోఁచేతిపోట్లకు పేరైనప్పుడు సీ. కీల్యత ఇతి కీలః. కీల బంధనే. బంధింపఁబడునది. 'అథ కీలా స్యాత్ ప్రహరే రతి సంభవ' ఇతి శేషః.

**పాళిః స్త్ర్య శ్ర్యఙ్క పఙ్క్తిషు.** 198

పాళిశబ్దము అంచునకును, అడియాలమునకును, పఙ్క్తికిని పేరు. మఱియు, మీసాలు గల స్త్రీకిని, ప్రస్థమునకును, చెవి తమ్మెకును పేరు. 'సశ్మశ్రుయువతిః పాళిః ప్రస్థకర్ణలతాపిచ' అని త్రికాండ శేషము. అంకమనఁగా ప్రదేశమని కొందఱు. పాల్యత ఇతి పాళిః. సీ. పాలరక్షణే. రక్షింపఁబడునది. 'పాళిః ష్తపఙ్క్యంకభేదయోః, అస్రే చ కర్ణతా

ళాగ్రే పాళిస్స్యా త్ర్యస్థయూకయోః. సంజాతశ్మశ్రుయోషాయా' మితిప్రతాపః.

**కలా శిల్పే కాలభేదే ౨ పి -**

కలాశబ్దము చిత్తరువు మొదలైన పనులయందలి నేర్పునకును, ఏనూటనలువది ఱెప్పపాట్లు గల కాలమునకును, చకారమువలన చంద్రుని పదియాఱవపాలికిని, మూలద్రవ్యవృద్ధికిని, కళలకును, అవ్యక్తమధురమయిన ధ్వనికిని, జీర్ణమైనదానికిని పేరగునపుడు త్రి. కల్యత ఇతికళా. కల సంఖ్యానే. ఎన్నఁబడునది. 'అంశమాత్రే మూలవృద్ధౌ సుషమావిద్య స్తథా, తత్తదాగమసిద్ధాసు గురుణి స్త్రీ రజస్యపి. కలం శుక్రేవాచ్యలింగ మవ్యక్త మధురధ్వనౌ' ఇతి శేషః.

**ఆళి స్స ఖ్యావళీ అపి,**

ఆళిశబ్దము చెలికత్తెకును, పజ్త్కికిని, అపిశబ్దమువలన కట్టకును పేరు. అలతీ త్యాళిః. సీ. అల భూషణాదౌ. అలంకరించును గనుక ఆళి.

**అబ్ధ్యమ్బువికృతౌ వేలా కాలమర్యాదయో రపి.** 199

వేలాశబ్దము సముద్ర ముప్పొంగుటకును, కాలమునకును, మర్యాదకును పేరు. అపిశబ్దమువలన అనాయాస మరణమునకును, చెల్లెలి కట్టకును, రాజుల భోజనముకును పేరు. వేలతీతి వేలా. వేల్ఱ చలనే. చలించునది. "వేలా కాలే జలనిధే స్తీరనీర వికారయోః, అక్లిష్టమరణే రాగే సీమ్ని వారి బుధస్త్రియా" మితి ప్రతాపః.

**బహుళాః కృత్తికా గావో బహుళో ౨ గ్నౌ సితౌ త్రిషు,**

బహుళశబ్దము కృత్తికానక్షత్రమునకు పేరైనపుడు సీ. బహువచనమువలన నల్లని వస్తువునకును పేరగునపుడు త్రి. గోవునకును, చకారము వలన ఏలకులకును పేరగునపుడు సీ. అగ్నికిని, కృష్ణపక్షమునకును పేరగునపుడు పు. 'కృత్తికాసు స్త్రియాం భూమ్ని బహుళా బహుళా గవి, ఏలాయాం చ పుమానగ్నౌ కృష్ణపక్షే సితే త్రిషు' అని రభసుఁడు. బహుత్వాత్, బహూనర్థా౯ లాతీతి చ బహుళా. లా దానే. అనేకములైనవి గనుకను, అనేకార్థముల నిచ్చునది గనుకను బహుల.

**లీలా విలాస క్రియయోః -**

లీలాశబ్దము స్త్రీల శృంగారచేష్టలకును, క్రియకును పేరు. లీయత

ఇతి లీలా. లీఙ్ శ్లేషణే. కూడుకొనియుండునది.

**ఉపలా శర్కరాపి చ.** 200

ఉపలాశబ్దము మొరపమంటికి పేరైనపుడు సీ. అపిశబ్దమువలన రత్నమునకును, ఱాతికిని పేరగునపుడు పు. "ఉపలౌ రత్నపాషాణా వుపలా శర్కరాపి చ" అని రుద్రుఁడు. ఉప లాతీత్యుపలా, లా ఆదానే. సమీపమునకు తేఁబడునది.

**శోణితే௨ మ్బుసి కీలాలమ్ -**

కీలాలశబ్దము నీళ్లకును, నెత్తురునకును పేరు. కీలా నగ్నిజ్వాలా నలతీతి కీలాలం. అల భూషణ పర్యాప్తి వారణేషు. అగ్నిజ్వాలల నడ్డగించునది. టీ. స. కీల్యతే మాంసే బధ్యతే, అల్యతే త్వచా వార్యత ఇతి కీలాలం – శోణితం. కీల బంధనే, అల భూషణాదౌ.

**మూల మాద్యే శిఫా భయోః,**

మూలశబ్దము మొదటికిని, ఊడకును, మూలానక్షత్రమునకును పేరు. మూలతీతి మూల. మూల ప్రతిష్ఠాయాం. నిలుకడగలిగియుండునది. "మూల మంతిక కుంజయో" రితి శేషః.

**జాలం సమూహ ఆనాయో గవాక్ష క్షారకా వపి.** 201

జాలశబ్దము సమూహమునకును, వలకును, గవాక్షికిని, పసరు మొగ్గలకును, అపిశబ్దమువలన దంభమునకును పేరైనపుడు న. పొల్ల చెట్టునకు పేరైనపుడు 'జాలీ' అని స్త్రీలింగము. జలతీతి జాలం. జలఘాన్యే. దట్టమైయుండునది. "పుమాన్నీ పద్రు మే జాలో జాలీ కోశాతకీ భవేత్, దంభేంద్రజాలయోః క్లీబ" మితి శేష.

**శీలం స్వభావే సద్వృత్తే -**

శీలశబ్దము స్వభావమునకును, మంచినడతకును పేరు. శీలతీతి శీలం. శీల సమాధౌ. నియతమై యుండునది.

**సస్యే హేతుకృతే ఫలమ్,**

ఫలశబ్దము పండునకును, ప్రయోజనమునకును పేరు. మఱియు, బాణాగ్రమునకును, అరిగెకును పేరు. ఫలతీతి ఫలం. ఫల నిష్పత్తౌ. పుట్టునది. "ఫలం జాతిఫలే ముష్టౌ ముక్తాధాన్య కణేషు చ, బాణాగ్రవా ర్క్ష త్రిఫలే తక్కోలే ఫలకే௨ పి చ" ఇతి శేషః. "ఫలం భావే ధనే

బీజే నిష్పత్తౌ భోగలాభయో" రితి కేశవస్వామీ.

**ఛది ర్నేత్రరుజోః క్లీబం సమూహే పటలం న నా.** 202

పటలశబ్దము ఇంటికప్పునకును, కండ్లవ్యాధికిని పేరైనపుడు న. సమూహమునకు పేరైనపుడు స్న. స్త్రీలింగమైనపుడు పటలీ అని ఈకారాంతరూపము. పటం విస్తారం లాతీతి పటలం. లా ఆదానే. విస్తారమును బొందునది. 'తిలకే చ పరిచ్ఛదే పటలం' ఇతి శేషః.

**అధస్స్వరూపయోరస్త్రీ తలమ్ -**

తలశబ్దము క్రిందికిని, స్వరూపమునకును పేరు. ఇదిగాక, అల్లెత్రాటిదెబ్బ తాఁకకుండఁ జేతికిఁ దొడుగుకొను అత్తెమునకును, అఱచేతి దెబ్బబలకును పేరు. తలతీతి తలం. తల ప్రతిష్ఠాయాం. నిలిచియుండునది. "అథ తలం ముష్టిచపేటయోః, పృష్ఠే క్లీబం తాళతరౌ వితస్తౌచ పుమాన్ భవే" దితి శేషః.

**స్యాచ్చామిషే పలమ్,**

పలశబ్దము మాంసమునకును, ౩౨౦ గురిగింజల యెత్తునకును పేరు. పల్యత ఇతి పలం పల గతౌ. పొందఁబడునది.

**ఔర్వ్యానలే ఽపి పాతాళమ్-**

పాతాళశబ్దము బడబాగ్నికిని, అపిశబ్దమువలన పాతాళలోకమునకును పేరు. పత త్యస్మిన్నితి పాతాళం. పత్ ఌగతౌ. దీనియందుఁ బడుదురు.

**చేలం వస్త్రే ఽ ధమే త్రిషు.** 203

చేలశబ్దము వస్త్రమునకు పేరయినపుడు న. అధమునికి పేరయినప్పుడు త్రి. స్త్రీలింగమైనప్పుడు ఈకారాంతము. చిల్యత ఇతి చేలం. చిలవసనే. కట్టుకొనఁ బడునది. 'నపుంసి వసనే చేలం గర్హితాధ మయోస్త్రిషు' ఇతి రుద్రః.

**కుకూలం శఙ్కుభిః కీర్ణేశ్వభ్రే నాతు తుషానలే,**

కుకూల శబ్దము పసులు నాటిన గుంటకు పేరగునపుడు న. కుమ్మునకు పేరగునపుడు పు. కుత్సితం కూల మస్యేతి కుకూలం-కుత్సితమైన దరి గలిగినది. టీ.స. దుర్గసమీపే ప్రతిపక్షసేనాసంచార పరిహారాయకృతే తీక్ష్ణ లోహాదిశంకునిచితే మహాగర్తే నపుంసకలింగః కుకూలశబ్దః. తుషా

గ్నౌతు పుల్లింగః. దుష్ప్రవేశ త్వేన కుత్సితకూల సాదృశ్యాత్ కుకూలః.

**నిర్ణీతే కేవల మితి త్రిలిఙ్గం త్వేకకృత్స్నయోః.** 204

కేవలశబ్దము నిర్ణయింపఁబడినదానికి పేరగునప్పుడు న. ఇతి శబ్దము వలన మకారాంతమైన యవ్యయమని కొందఱు. ఒకటికిని, అంతటికిని పేరగునపుడు త్రి. ఉదా. నిర్ణీతమునకు ___ 'కేవలం దంతభంగాయ దంతిన శ్శైలతాడనమ్. ఒక్కటికి ___ 'కేవలో ఽ యంవ్రజతి'. అంతటికి ___ 'కేవలాభిక్షవః' అని కేవృత ఇతి కేవలం. కేవృ సేవనే. ఆశ్రయింపఁబడునది.

**పరాప్తి క్షేమ పుణ్యేషు కుశలం శిక్షితే త్రిషు,**

కుశలశబ్దము సామర్థ్యమునకును, శుభమునకును, పుణ్యమునకును పేరగునపుడు న. శిక్షింపఁబడినదానికిని పేరగునపుడు త్రి. కుత్సిత మమంగళం శ్యతీతి కుశలం. శో తనూకరణే. అశుభమును జెఱుచునది. కుశాన్ లాతీతి కుశలః – కుశలను బుచ్చుకొనువాఁడు. లక్షణచేత నేర్పరిని జెప్పును.

**ప్రవాళ మఙ్కు రే ఽ ప్యస్త్రీ -**

ప్రవాళశబ్దము చిగురునకును, అపిశబ్దమువలన పవడమునకును, వీణా దండమునకును పేరు. ప్రవలత ఇతి ప్రవాళం. ప్న. వల సంచలనే. కదలునది. టీ. స. అంకురో ఽ త్ర నవకిసలయః.

**త్రిషు స్థూలం జడే ఽ పి చ.** 205

స్థూలశబ్దము మందబుద్ధి గలవానికిని, చిగురునకును, ఆపిశబ్దము వలన బలిసినవానికిని పేరు. స్థూలయతీతి స్థూలం. త్రి. స్థూల పరిబృంహణే. వృద్ధిఁ బొందునది.

**కరాళో దన్తురే తుంగే -**

కరాళశబ్దము ఒడ్డుమిట్టనేలకును, మిట్టపండ్లవానికిని, పొడవైన దానికిని పేరు. కరోతి భయమితి కరాళః. త్రి. డు కృఞ్ కరణే. భయమును జేయునది. 'కశేరుణి కరాళం నప్ భీషణే వాచ్యలింగక' ఇతి శేషః.

**చారౌ దక్షే చ పేశలః,**

పేశలశబ్దము అందమైనదానికిని, నేర్పరికిని, చకారమువలన కోయిలకును, ముసలమునకును పేరు. పింశతీతి పేశలః. పిశి అవయవే. అవయమై యుండునది. 'పేశలో మృదులే ప్రోక్తో ముసలే కోకిలే

హర' ఇతి శేషః.

**మూర్ఖే ఽ ర్భ కే ఽ పి బాల స్స్యాత్ -**

బాలశబ్దము మూర్ఖునికిని, పిన్నవానికిని పేరైనపుడు త్రి. అపిశబ్దమువలన కురువేరునకు పేరైనపుడు న. పుచ్ఛమునకు పేరైనపుడు పు. వలత ఇతి బాలః. వల సంచలనే. చలించువాఁడు. 'బాలో ఽ జ్ఞే ఽ శ్వేభపుచ్ఛయోః, శిశౌ హ్రీబేకరచయో ర్బాలాతు త్రుటియోషితోః. బాలీ భాషాంతరే మేధా' వితి సర్వధరః. త్రుటిః = సూక్ష్మేలా. మేధిః = ఖలేదారు.

**లోలశ్చల సతృష్ణయోః.** 206

లోలశబ్దము కదలుదానికిని, ఆశ గలవానికిని పేరు. లోలతీతి లోలః. లుల సంచలనే. కదలునది.

## వాంతములు

**దవ దావౌ వనారణ్య వహ్నీ -**

దవ దావశబ్దములు ౨ను అడవికిని, కాఱుచిచ్చునకును పేర్లు. దూయతే అనేనేతి, దునోతీతి చ దవో దావశ్చ. దూఙ్ పరితాపే, టు దు ఉపతాపే. తపింపఁ జేయునది గనుక దవము, దావమును.

**జన్మహరౌ భవౌ,**

భవశబ్దము పుట్టుటకును, ఈశ్వరునకును పేరు. మఱియు, సంసారము నకును పేరు. భవనం, భవ త్యస్మా త్సర్వమితి చ భవః. భూసత్తాయాం. పుట్టుట గనుకను, ఇతనివలన పుట్టును గనుకను భవము. సత్తా సంసార కల్యాణ ప్రాప్త్యుపాదాన భస్మసు, భవ' ఇతి శేషః.

**మన్త్రీ సహాయస్సచివౌ-**

సచివశబ్దము మంత్రికిని, తోడైయుండువానికిని పేరు. సచతి సమవైతీతి సచివః. షచ సమవాయే. కూడుకొనియుండువాఁడు. టీ. స. బుద్ధిసచివో మంత్రీ. కృష్యాదికర్మ స్వనుగ్రాహక స్సహాయః.

**పతిశాఖినరా ధవాః.** 207

ధవశబ్దము ఏలికకును, పెనిమిటికిని, చండ్ర చెట్టునకును, మనుష్యునికిని పేరు. దూయతే నేన, ధువతీతి చ ధవః. ధూఞ్ కంపనే. వీనిచేత కంపింపఁజేయఁబడును. కదలునదియును గనుక ధవ్యుఁడు. 'ధవ

స్తు ధూతౌ స్యా' దితిశేషః

**అవయ శ్శైల మేషార్కాః -**

అవిశబ్దము పర్వతమునకును, గొఱ్ఱెకును, సూర్యునికిని పేరు. అవతీత్యవి. పు. అవ రక్షణే. రక్షించును గనుక అవి. 'అవిర్మూషిక కమ్బళే' ఇతి శేషః. ఆఖౌ కంబళే చేత్యర్థః. పుష్పవత్యాం తు విసర్జనీయ ఈకారాంతః ప్రాగుక్తః.

**ఆజ్ఞాహ్వానాధ్వరా హవాః,**

హవశబ్దము ఆజ్ఞకును, పిలుచుటకును, యజ్ఞమునకును పేరు. హూయతే ఉస్మిౝ హూతిః, హూయంతే ఉస్మిన్నాజ్యాదీని చ హవః. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ. హుదానాదనయోః. దీనియం దాజ్యాదులు వేల్వఁబడును గనుక హవము.

**భావస్సత్తా స్వభావాభిప్రాయ చేష్టాత్మజన్మసు.** 208

భావశబ్దము కలుగుటకును, స్వభావమునకును, అభిప్రాయమునకును, క్రియకును, ఆత్మకును, పుట్టుటకును పేరు. 'జంతుషు' అని పఠించి జంతువునకును పేరని కొందఱు. ఇంకను శృంగారచేష్టలకును, పూజ్యునికిని, శబ్దప్రవృత్తి నిమిత్తమునకును పేరు. భవనం, భవతీతి చ భావః. భూ సత్తాయాం. పుట్టుటయు, పుట్టునదియు భావము. 'భావో బుధే విభూతౌ చ యోనౌ లీలాపదార్థయోః, రతివేగే శబ్దవృత్తినిమిత్తే రసబంధిని, వికల్పనాధిషు ప్రాప్తౌ జనన్యపి పుమాన్భవేత్, భావః స్యాద్భువ సంబంధే భంభామవతి చ త్రి' ష్వితిశేషః. టీ. స. ద్రవ్యాదీనామస్తిత్వం సత్తా. యథా ___ 'సర్వత్ర సర్వదా భావః కాలాకాశ దిగాత్మనాం' సత్తాఖ్యాపరజాతిరపి భావ ఇతి తార్కి కాణాం వ్యవహారః. స్వభావో యావద్ద్రవ్యభావీ ధర్మః. యథా ___ 'భావానురక్త వనితాసురతైశ్శపేయం'. అభిప్రాయస్తాత్పర్యం. యథా ___ 'అస్య శ్లోకస్య అయం భావ' ఇతి. చేష్టానామ ధాత్వర్థరూపా క్రియా. యథా ___ 'ధాత్వర్థః కేవలశ్శుద్ధో భావ ఇత్యభిధీయతే' ఆత్మని యథా ___ 'స్వం భావం భావయేద్యోగీ.' జంతుషు యథా ___ 'వనధర్మేషు శక్త్యా కాలభవైర్ద్రవ్యైః సర్వభావానుపాలనమితి. అత్రత్యబుధశబ్దస్య భావో విద్వానితి ప్రాగు క్తనాట్యజ్ఞస్యైవ గ్రహణం.'

**స్యాదుత్పాదే ఫలే పుష్పే ప్రసవో గర్భమోచనే,**

ప్రసవశబ్దము పుట్టుటకును, ఫలమునకును, పుష్పములకును, ప్రసూతికిని పేరు. ప్రసవనం, ప్రసూయతే చ ప్రసవః. షూఙ్ ప్రాణిప్రసవే. పుట్టుటయు, పుట్టునదియు ప్రసవము. టీ. స. ఉత్పద్యత ఇత్యుత్పాదః. అప్యతం. యథా ___ 'అహో పశూనామపి ప్రసవవాత్సల్య' మితి మురారిః. అయ మనుజ్ఞాయామపి "భగవతః ప్రసవే."

**అవిశ్వాసే ఽపహ్నవే ఽపి నికృతావపి నిహ్నవః.** 209

నిహ్నవశబ్దము అవిశ్వాసమునకును, అపలాపించుటకును, తిరస్కరించుటకును, అపిశబ్దమువలన కపటమునకును పేరు. నిహ్నవనం నిహ్నవ. హ్నుఙ్ అపనయే. మోసపుచ్చుట నిహ్నవము. టీ అవిశ్వాసే – 'మమ చిత్తం ముహురేతి నిహ్నవం' అపహ్నవః అపలాపః. యథా ___ "నిహ్నవే భావితో దద్యా" దితి. నికృతి స్తిరస్కారః. తత్ర ___ 'స్ఫురత్తుషారాంశుమరీచిజాలై ర్వినిహ్నుతా స్ఫాటికసౌధపఙ్క్తి'రితి మాఘః. నికృతిశ్శాఠ్యమితి చంద్రః.

**ఉత్సేకామర్షయోరిచ్ఛాప్రసవే మహ ఉత్సవః,**

ఉత్సవశబ్దము ఉప్పొంగుటకును, కోపమునకును, ఇచ్ఛ పుట్టుటకును, పండుగునకును పేరు. ఉత్సవతి సువతి చ ఉత్సవః. షూ ప్రేరణే, షుప్రసవైశ్వర్యయోః. ప్రేరేపించునది, పుట్టునది గనుక ఉత్సవము.

**అనుభావః ప్రభావే చ సతాం చ మతి నిశ్చయే.** 210

అనుభావశబ్దము ప్రభావమునకును, పెద్దలయొక్క బుద్ధి నిశ్చయమునకును, చకారమువలన సాత్వికాదిభావముల నెఱింగిచునట్టి భ్రూవిక్షేపాదులకును పేరు. అనూభూయతే. అనేనే త్యనుభావః. భూ సత్తాయాం. దీనిచే ననుభవింపఁబడును.

**స్యాజ్జన్మ హేతుః ప్రభవః స్థానం చాద్యోపలబ్ధయే,**

ప్రభవశబ్దము జన్మమునకు కారణమైనదానికిని, మొదట నెఱుఁగుటకు స్తానమైన దానికిని, చకారమువలన ప్రభవసంవత్సరమునకును పేరు. మొదట నెఱుఁగుటకు స్థానమైన దనఁగా, 'హిమవతో గంగా ప్రభవతి' అనుతావున గంగను మొదట నెఱుఁగుటకు స్థానమైనది హిమవంతము. ప్రభవనం, ప్రభవత్యస్మాదితి చ ప్రభవః. భూసత్తాయాం.

పుట్టుటగనుకను, దీనియందుఁ బుట్టుదురు గనుకను ప్రభవము. టీ. స. జన్మ హేతుః జన్మకారణం. తత్ర యథా___"క్వ సూర్యప్రభవో వంశ" ఇతి.

**శూద్రాయాం విప్రతనయే శస్త్రే పారశవో మతః.** 211

పారశవశబ్దము శూద్రవనితయందు బ్రాహ్మణునివలనఁ బుట్టిన వానికిని, ఆయుధమునకును పేరు. పరాన్ శృణాతీతి పారశవః – ఒరులఁబీడించువాఁడు. పరస్త్రియా అపత్యం వా – పరస్త్రీకిఁ బుట్టినవాఁడుగాని, "పుంసి పారశవః పుమాన్, పరస్త్రీతనయే శస్త్రే ద్విజాచ్ఛూద్రాసుతే ఽపి చ" ఇతి మేదినీ.

**ధ్రువో భభేదే క్లీబం తునిశ్చితే శాశ్వతే త్రిషు,**

ధ్రువశబ్దము ధ్రువుఁడను నక్షత్రమునకు పేరైనపుడు పు. నిశ్చయింపఁ బడినదానికి పేరైనపుడు న. నిత్యమైనదానికి పేరైనపుడు త్రి. నిశ్చితమైన దాని కెట్లనిన ___ "ధ్రువం ప్రణాశః ప్రహితస్య పత్రిణః" అని భారవి. నిత్యమునకు ___ 'ధ్రువా విశ్వంభరా ద్యౌశ్చ ధ్రువం సర్వమిదం జగత్' అని. ధ్రువతీతి ధ్రువః. ధ్రువ స్థైర్యే. స్థిరమైయుండునది. "శివే వసౌ వధేయోగే ధ్రువః స్త్రీ గీతి మూర్వయోః ధ్రువం తు నిశ్చయే తర్కే అవధా" వితిశేషః. శివః = కీలః. వధో = న్యగ్రోధతరుః, యోగో = విష్కం భాదిషు ద్వాదశః. తర్క = ఉత్ప్రేక్షా. స్రుగ్భేదే స్త్రిలింగః ప్రాగుక్తః.

**స్వో జ్ఞాతావాత్మని స్వం త్రిష్వాత్మీయే స్వో ఽస్త్రియాం ధనే.** 212

స్వశబ్దము జ్ఞాతికి పేరైనపుడు పు. తా ననుటకు పేరైనపుడు న. పుంలింగమని కొందఱు. తన సంబంధమైనదానికి పేరైనపుడు త్రి. ధనమునకు పేరైనపుడు ప్న. ఉదా. జ్ఞాతికి – 'ఉల్ముకానీవ మయి తే స్వాః –' ఆత్మకు–'హృది స్వ మవలోకయ'. ఆత్మీయమునకు – 'స్వదారనిరతః' ధనమునకు–'ప్రభూతా స్వాదీయంతే' అని. స్యతి దుఃఖం స్వః. షో ఽన్తకర్మణి. దుఃఖమును జెఱుచునది గనుక స్వము. "జ్ఞాత్యాత్మనోః స్వః స్వంస్వో ఽర్థః స్వం స్వః స్వాత్మీయమాత్రేకే" ఇతి నానార్థరత్న కోశః. లక్ష్మీభృతో ఽంభోధితటాధివాసాన్ బహూకృతాన్ స్వానివ పశ్యతి స్మ' ఇతి స్వశబ్దస్య ఆత్మవచనత్వే పుంలింగప్రయోగో మాఘకావ్యే.

**స్త్రీకటీవస్త్రబన్ధే ఽపి నీవీ పరిపణే ఽపి చ,**

నీవీశబ్దము కోఁకముడికిని, మూలధనమునకును, అపిశబ్దమువలన

పందెముగట్టిన ద్రవ్యమునకును పేరు. నితరాంపీయత ఇతి నీవీ. వ్యేఞ్ సంవరణే. నియతముగా దాఁచఁబడునది. "నీవీ స్యాద్బంధనాగారే" ఇతి శేషః.

**శివాగౌరీ ఫేరవయోః -**

శివాశబ్దము గౌరీదేవికిని, నక్కకును పేరు. మఱియును, కరక చెట్టునకును, ఉసిరికచెట్టునకును పేరు. శివునికిని పేరగునపుడు పు. శ్యతి దుఃఖాదికమితివా శివా. శో తనూకరణే. దుఃఖాదులఁ జెఱుచునది. "మోక్షే భద్రే సుఖే శివం, హారే యోగాన్తరే వేదే వాలుకే గుగ్గులావపి" ఇతి శేషః.

**ద్వన్ద్వం కలహ యుగ్మయోః,** 213

ద్వంద్వశబ్దము యుద్ధమునకును, జతకును పేరు. మఱియు మిథునమునకును, రహస్యమునకును పేరు. ద్వయో రిదం, ద్వౌ ద్వౌచ ద్వంద్వం–ఇద్దఱి సంబంధమైనది, రెండును గనుక ద్వంద్వము. టీ. స. కలహే 'బాహుద్వంద్వః ప్రవృత్తయో' రితి. మిథునే–'ద్వంద్వాని భావం క్రియయా వివవ్రు'రితి. "ద్వంద్వం రహస్యమర్యాదా యజ్ఞపాత్ర ప్రయోజన" ఇతి శేషః.

**ద్ర వ్యాసు వ్యవసాయేషు సత్త్వమస్త్రితు జన్తుషు,**

సత్త్వశబ్దము ద్రవ్యమునకును, ప్రాణమునకును, ఉద్యోగమునకును పేరగునపుడు న. జంతువులకు పేరగునపుడు ప్న. సతో భావస్సత్త్వం – కలిగిన వస్తువుయొక్క భావము సత్త్వము. టీ. స. ద్రవ్యే – "సత్త్వేనివిశతే ఉ_పై' తీతి. అసుషు–'అంతస్సత్త్వ' ఇతి. వ్యవసాయ ఉత్సాహః, తత్ర–'సర్వత్ర సత్త్వసంపన్న' ఇతి. ప్రాణిమాత్రే యథా–సర్వసత్త్వహితే రతి' ఇతి. "సత్త్వం గుణే పిశాచాదౌ బలే ద్రవ్య స్వభావయోః, సద్భావే వ్యవసాయే చ చిత్తే ప్రాణిషు శబ్ద్యత" ఇతి విశ్వప్రకాశః.

**క్లీబం నపుంసకే షణ్డే వాచ్యలిఙ్గ మవిక్రమే.** 214

క్లీబశబ్దము నపుంసకునికి పేరగునపుడు న. పరాక్రమహీనునికి పేరగునపుడు త్రి. క్లీబత ఇతి క్లీబం. క్లీబృ అధార్ష్ట్యే. దిట్టతనములేనివాడు.

## శాంతములు

**ద్వావిశౌ వైశ్య మనుజౌ-**

విట్‌శబ్దము వైశ్యునకును మనుష్యునికిని పేరు. విశతీతి విట్. శ. పు. విశ ప్రవేశనే. ప్రవేశించువాఁడు. టీ. స. మనుజో మనుష్యమాత్రం. తత్ర–'విశాంపతి ర్విష్టరభాజ మారా' దితి రఘువంశే.

**ద్వౌ చా రాభిమరౌ స్పశౌ,**

స్పశశబ్దము వేగులవానికిని, యుద్ధమునకు పేరు. ద్రవ్యార్థమై యేనుఁగుతోఁగాని, పులితోఁగాని పోరెడు (జెట్టి) వాఁడని కొందఱు. స్పశతీతి స్పశః. స్పశ బాధన స్పర్శనయోః. బాధించువాఁడు. "స్పశః ప్రణిధి శుద్ధయో" రితి విశ్వప్రకాశః.

**ద్వౌ రాశీ పుఞ్జ మేషాద్యౌ -**

రాశిశబ్దము ప్రోగునకును, మేషము వృషభము మొదలైన ద్వాదశ రాసులకును పేరు. అశ్నుత ఇతి రాశిః. అశూ వ్యాప్తౌ. వ్యాపించునది.

**ద్వౌ వంశౌ కుల మస్కరౌ.** 215

వంశశబ్దము కులమునకును, వెదురునకును పేరు. వన్యత ఇతి వంశః. వన షణ సంభక్తౌ. ఆశ్రయింపఁబడునది. "పృష్ఠాస్థి గేహోర్ధ్వకాష్ఠే వంశే వేణౌ గణేకుల" ఇతి విశ్వప్రకాశః.

**రహః ప్రకాశౌ వీకాశౌ-**

వీకాశశబ్దము ఏకాంతస్థలమునకును, ప్రకాశమునకును పేరు. ప్రకాశమనగా స్ఫుటమైనది. "వీకాశో విజనే స్ఫుటే" అని అజయుఁడు. విగతో, విశిష్టశ్చ కాశః ప్రకాశో ఽస్యేతి వీకాశః. కాశృదీప్తౌ. విగతమైనట్టియు శ్రేష్ఠమైనట్టియు ప్రకాశము గలది. పా. నీకాశః.

**నిర్వేశో భృతి భోగయోః,**

నిర్వేశశబ్దము కూలికిని, భోగమునకును పేరు. ఉదా. భృతికి – 'ప్రతిగ్రహ జయక్రయ నిర్వేశాధిగతైరర్థైః'. భోగమునకును – 'వస్త్రాన్న పానం నిర్వేశః' అని. నిర్విశ్యత ఇతి నిర్వేశః. విశ ప్రవేశనే. నిర్వార్వోభోగే. అనుభవింపఁబడునది.

**కృతాన్తే పుంసి కీనాశః క్షుద్ర కర్షకయోస్త్రిషు.** 216

కీనాశశబ్దము యమునికి పేరగునపుడు పు. దరిద్రునికిని, దున్ను వానికిని పేరగునపుడు త్రి. కుత్సితం నాశయతీతి కీనాశః. ణశ అదర్శనే.

కుత్సితమును జెఱుచువాఁడు.

**పదే లక్ష్యే నిమిత్తే౽పదేశ స్స్యాత్-**

అపదేశశబ్దము స్థానమునకును, వ్యాజమునకును ప. గుఱికిని, నిమిత్తమునకును పేరు. మఱియు, ప్రసిద్ధికిని పేరు. ఉదా. స్థానమునకు ___ 'త్యక్తాపదేశో యాతి'. వ్యాజమునకు ___ 'రక్షాప దేశాన్మునిహోమధేనోః'. నిమిత్తమునకు ___ "కేనాప్యపదేశే నాగతః'. ప్రసిద్ధికి ___ 'ఔదార్యశౌర్య ధైర్యేషు నిస్సీమవ్యపదేశభాక్' అని, అపదిశ్యత ఇత్యపదేశః. దిశ అతిసర్జనే. విరుద్ధముగా నీయఁబడునది. "ప్రసిద్ధా వపదేశ స్స్యా" దితి శేషః.

**కుశ మప్సుచ,**

కుశశబ్దము నీళ్లకును, చకారమువలన దర్భకును పేరు. కౌ శేత ఇతి కుశం. శీఙ్ స్వప్నే. భూమియం దుండునది. "ద్వీపరాజన్వయోః కుశః, ఛందోగస్తోత్ర గణనాశంకా వౌదుంబరే మత" ఇతి శేషః.

**దశా వ స్థానేక విధాపి -**

దశాశబ్దము బాల్యము మొదలైన యవస్థలకును, అపిశబ్దమువలన పత్తికిని, కోకచెఱఁగునకును పేరు. దశ్యతే ఛిద్యత ఇతి దశా. దంశ దశనే. చెఱుపఁ బడునది. "దశా ప్రదీపవర్తా" వితి శేషః.

**ఆశా తృష్ణాపి చాయతా.** 217

ఆశాశబ్దము అధికమైన అపేక్షకును, అపిశబ్దమువలన దిక్కునకును పేరు. అశ్నుత ఇత్యాశా. అశూ వ్యాప్తౌ. వ్యాపించునది. అశాసనమాశా. ఆఙ్పూర్వ శ్శాసు ఇచ్ఛాయాం. ఇచ్ఛయించుట ఆశ. 'ఆశోవ్యాప్తౌ భుజౌ చ నా" ఇతి శేషః.

**వశా స్త్రీ కరణీ వన్ధ్యా -**

వశాశబ్దము స్త్రీకిని, ఆఁడుయేనుఁగునకును, గొడ్డుటావునకును పేరు. అధికమైనదానికి పేరైనపుడు త్రి. ఉశ్యత ఇతి వశా. వశ కాంతౌ. ఇచ్ఛయింపఁ బడునది. "ప్రభుత్వేచ్ఛాయత్తతాసు వశోనా త్రిషుతద్వతి, స్త్రీ గవీసుతయోః స్త్రీస్యా" దితిశేషః. సుతా దుహితా. తథాచ వైజయంత్యాం–'వశాకరిణ్యాం వంధ్యాయాం రామాయాం దుహితర్యపి' ఇతి.

**దృగ్ జ్ఞానే జ్ఞాతరి త్రిషు,**

దృక్ఛబ్దము జ్ఞానమునకు పేరగునపుడు సీ. ఎఱుఁగువానికి పేరగునపుడు త్రి. ఇదిగాక, నయనమునకును, చూచుటకును పేరగునపుడు సీ. చూచువానికి పేరగునపుడు త్రి. దర్శనం, పశ్యతీతి, దృశ్యతే అనయేతి చ దృక్. శ. చూచుటయు, చూచువాఁడును, దీనిచేత చూడఁబడును గనుకను దృక్కు.

**స్యా త్కర్కశ స్సాహసికః కఠో రామసృణావపి.** 218

కిర్క శశబ్దము సాహసము గలవానికిని, కఠినునకును, పరుసనిదానికిని, అపిశబ్దమువలన దయలేనివానికిని పేరు. కృణాతీతి కర్కశః. త్రి. కృహింసాయాం. హింసించునది. "కర్కశౌ క్రూరనిర్దయా" వితి శేషః. 'కఠోరమసృనావపి' ఇతి కేచిత్.

**ప్రకాశో ఽ తిప్రసిద్ధే ఽ పి-**

ప్రకాశశబ్దము మిక్కిలి ప్రసిద్ధమైనవానికి పేరగునపుడు త్రి. అపి శబ్దమువలన, ఎండ మొదలయిన వెలుఁగునకును పేరు. ప్రకాశతే, ప్రకాశనం చ ప్రకాశః. కాశృ దీప్తౌ. ప్రకాశించునదియు, ప్రకాశించుటయు, ప్రకాశము. 'ప్రకాశః కాశవా నపి' ఇతి శేషః.

**విశా వజ్ఞే ఽ పి బాలిశః,**

బాలిశశబ్దము పిన్నవానికిని, ఎఱుక లేనివానికిని, అపిశబ్దమువలన మూర్ఖునికిని పేరు. బలిం శ్యతీతి బలిశః. శో తనూకరణే. బలిశ ఏవ బాలిశః. పూజను జెఱుచువాఁడు బలిశుఁడు; బలిశుఁడే బాలిశుఁడు.

**నృశంస ఖడ్గౌ నిస్త్రింశౌ-**

నిస్త్రింశశబ్దము హింసించువానికిని, ఖడ్గమునకును పేరు. నిష్క్రాంత స్త్రింశదంగులీభ్యో నిస్త్రింశః – ముప్పదియంగుళములకంటె ఘనమైనది గనుక నిస్త్రింశము ఖడ్గము. తత్సామ్యమున హింసించువాని యందును వర్తించును.

**పాశో బన్ధన శస్త్రయోః.** 219

పాశశబ్దము బంధనమునకును, ఆయుధమునకును పేరు. బంధనమనగా కట్టుటయును, త్రాడును. పశతీతి పాశః. పశ బాధన స్పర్శనయోః. బాధపెట్టునది.

**కోశో ఽ స్త్రీ కుట్మలే ఖడ్గపిధానే ఽ ర్థౌఘ దివ్యయోః,**

కోశశబ్దము మొగ్గకును, కత్తియొరకును, ధనసమూహమునకును, దివ్యప్రమాణ భేదమునకును పేరు. 'దివ్యయోః' అనుదానిని 'దీప్యయోః' అని పఠించి ప్రకాశించువానికిని పేరని కొందఱు. కుశతీతి కోశః. ప్న. కుశ సంశ్లేషణే. కూడుకొనియుండునది గనుక కోశము. టీ. స. కుట్మలో ముకుళః, తత్ర – "కాశద్వంద్వ మియం దధాతి నళినీ కాదంబ చంచుక్షత" మితి. ఖడ్గపిధానే యథా–'ఉన్ముక్త కంచుకతయే యముదారకాంతిశ్శస్త్రీవ శంబరరిపోరపనీతకో'శేతి. ఖడ్గగ్రహణముపలక్షణం – పిధాయక మాత్రే కోశశబ్దః అన్నమయాదీనాం పంచానామపి బ్రహ్మస్వరూపావరకత్వేన కోశ ప్రసిద్ధిః. అర్థౌఘః కృతాకృతో భయరూప సువర్ణ రజత సముదాయః. తత్ర – 'కోశాగార' మితి. దివ్యం = శపథః – దుర్గాభైరవాద్యాలయ దేవతాస్నానోదకపానరూపః. తత్ర 'విప్రం న పాయయేత్కోశ'మితి. "కోశ శ్శిశ్నే జాతిఫలే తథా శబ్దార్థసంగ్రహే" ఇతి శేషః. శేఫసి యథా–'కుర్వ౯ కరికర క్రీడాం శనైః కోశం ప్రవేశయే' దితి రతిరహస్యే. అయం శబ్దః స్త్రీయోనావపి. యథా 'స్త్రీపుంసయోః కోశసామ్యే భావసామ్యం భవేద్ధ్రువ' మితి తత్రైవ ప్రయోగః. అత్ర శబ్దార్థ సంగ్రహశబ్దేన పుస్తకమప్యుచ్యతే. తత్ర – 'కోశాంతరే త్వయం పాఠ' ఇతి లిఖంతి వ్యాఖ్యాతారః. 'వైదేశికేషు కోశేషు పాఠభేదాన్నిరీక్ష్యతా' దితి దక్షిణావర్తనాథశ్చ. "కోశవానాచార్య" ఇతి చ. అత్ర కేచిత్ కోశో ఽ స్త్రీతి శ్లోకార్ధం షాంతేషు పఠంతి. వ్యాఖాతృభిః కైశ్చి త్తత్రైవ వ్యాఖ్యాతం. అస్మాభిస్తు కతిపయ టీకాకారపద్ధత్యా నానాగ్రంథ దర్శనేన లోకవ్యవహారదర్శనేన చ శాంతేష్వేవలిఖిత మితి.

## షాంతములు

**సుర మత్స్యా వనిమిషా-**

అనిమిషశబ్దము దేవతలకును, మత్స్యమునకును పేరు. న నిమిషత్య నిమిషః. మిష నిమీలనే. ఱెప్పపాటు లేనిది.

**పురుషా వాత్మ మానవౌ.** 220

పురుషశబ్దము జీవునికిని, మనుష్యునికిని పేరు. పిపర్తీతి పురుషః. పౄ పాలన పూరణయోః. పాలించువాఁడు.

**కాక మత్స్యా త్ఖగౌ ధ్వాజ్ఞౌ-**

ధ్వాంక్షశబ్దము కాకికిని, కొక్కెరకును పేరు. ధ్వాంక్షతి మాంసమితి ధ్వాంక్షః. ధ్వాక్షి కాంక్షాయాం. మాంసము నిచ్ఛయించునది. "ధ్వాంక్షౌ తు బక వాయసౌ" విత్యమరమాలా.

**కక్షౌ చ తృణవీరుధౌ,**

కక్షశబ్దము తృణమునకును, తీఁగెపొదకును, చకారమువలన నెండిన యడవికిని, చంకకును, పాపమునకును పేరు. కష్యత ఇతి కక్షః. కషహింసా యాం. హింసింపఁబడునది. "కక్ష పాప పరీధాన పశ్చాదంచల పల్లవ" ఇతి శేషః.

**అభీషుః ప్రగ్రహే రశ్మౌ-**

అభీషుశబ్దము పగ్గమునకును, కిరణమునకును పేరు. అభి ఇష్యత ఇ త్యభీషుః. పు. ఇషు ఇచ్ఛాయాం. ఇచ్ఛయింపఁబడునది.

**ప్రైషః ప్రేషణ మర్దనే.** 221

ప్రైషశబ్దము అంపుటకును, పీడించుటకును పేరు. ప్రకృష్ట మేషణం ప్రైషః. ఇష గతౌ. ప్రకృష్టమైన గమనము ప్రైషము.

**పక్ష స్సహా ఽ యేపి -**

పక్షశబ్దము సహాయమునకును, అపిశబ్దమువలన శుక్లకృష్ణపక్షములకును, ఱెక్కలకును, సాధ్యమునకును, విరోధమునకును,పార్శ్వమునకును పేరు. పక్ష్యత ఇతి పక్షః. పక్ష పరిగ్రహే. పరిగ్రహింపఁబడునది. "పక్షః పతత్రే కుచయోః పార్శ్వే సఖ్యౌనృపస్య చ, గజే స్యా చ్ఛుల్లిరంధ్రే చ బలే సాధ్య విరోధయో" రితి శేషః. "పక్షో మాసార్ధకే పార్శ్వే గ్రహే సాద్య విరోధయోః, కేశాదేః పరతో బృందే బలే సఖి సహాయయోః, పరతంత్రే ఛుల్లిరంధ్రే దేహాంగే రాజకుంజర" ఇతి విశ్వప్రకాశః.

**ఉష్ణీషం శిరోవేష్ట కిరీటయోః,**

ఉష్ణీషశబ్దము తలకుఁ జుట్టు పాగా మొదలయినదానికిని, కిరీటమునకును పేరు. ఉష్ణనివారణార్థ మిష్యతే ఉశ్యత ఇతి వా ఉష్ణీషః. ఇషు ఇచ్ఛాయాం, వశ కాంతౌ. ఉష్ణనివాణార్థమై యిచ్ఛయింపఁబడునది గనుక ఉష్ణీషము.

**శుక్రలే మూషికే శ్రేష్ఠే సుకృతే వృషభే వృషః.** 222

వృషశబ్దము వీర్యవృద్ధి గలవానికిని, ఎలుకకును, శ్రేష్ఠునికిని, పుణ్యమునకును, ఆఁబోతునకును పేరు. ఉదా:– వీర్యవృద్ధిగలవానికిని–'వృష్యాః ప్రయోగాః'. ఎలుకకు – 'వృషదంశకః'. శ్రేష్ఠునికిని – 'పురుషవృషః'. పుణ్యమునకు– 'వృషోహి భగవాన్ ధర్మః.' వర్షతి, వృష్యతేవావృషః. వృషు సేచనే. వర్షించునదిగాని, వర్షింపఁబడునదిగాని వృషము. "వృషః పుంసిచరాశౌ నా కపికచ్ఛాటరూపయోః, శృంగ్యామపి వృషా స్త్రీస్యాద్వ్రతినామాసనం వృష" ఇతి శేషః.

**ద్యూతే ౨ క్షే శారిఫలకే ప్యాకర్షః -**

ఆకర్షశబ్దము జూదమునకును, పాచికలకును, సారెలుండు పలకకును, అపిశబ్దమువలన ఆకర్షించుటకును పేరు. ఆకర్షతి, ఆకర్షణంచ ఆకర్షః. కృష విలేఖనే. ఆకర్షించునది, ఆకర్షించుటయును ఆకర్షము.

**అథాక్ష మిన్ద్రియే,** 223

**నా ద్యూతాఙ్గే కర్షచక్రే వ్యవహారే కలిద్రుమే.**

అక్షశబ్దము ఇంద్రియములకు పేరైనపుడు న. పాచికలకును, ఇరువది రూకలయెత్తు తూనికగలదానికిని, బండికంటికిని, వ్యవహారమునకును తాండ్రచెట్టునకును పేరైనపుడు పు. అక్ష్ణోతీ త్యక్షః. అక్షూ వ్యాప్తౌ. వ్యాపించునది. 'అక్షో వ్యాప్తావాత్మనిచ'. ఇతి శేషః.

**కర్షూ ర్వార్తా కరీషాగ్నిః కర్షూః కుల్యాభిధాయినీ,**

కర్షూశబ్దము వార్తకును, పిడుకనిప్పునకును పేరైనపుడు పు. నదికి పేరైనపుడు స్త్రీ. వార్తయనఁగా కృషి. కర్షణం, కర్షతి, కృష్యతే చ కర్షూః. కృష విలేఖనే. దున్నుటయును, పీడించునదియును, దున్నఁబడునదియును గనుక కర్షువు.

**పుంభావే తత్క్రియాయాంచ పౌరుషమ్-**

పౌరుషశబ్దము మగతనమునకును, పురుషుడు చేయు క్రియకును, చకారమువలన మానిసి చేయెత్తుపొడవునకును పేరు. పురుషస్య భావః కర్మచ పౌరుషం – పురుషునియొక్క భావమును క్రియయును పౌరుషము. "పుంస్తేజసితు పౌరుష" మితి శేషః.

**విష మప్సుచ.** 224

విషశబ్దము నీళ్లకును, చకారమువలన విషమునకును పేరు. వేవేష్టీతి విషయం. విష్ ౹౯ వ్యాప్తౌ. వ్యాపించునది.

**ఉపాదానే ౨ ప్యామిషం స్యాత్ -**

ఆమిషశబ్దము కానుకకును, అపిశబ్దమువలన మాంసమునకును పేరు. ఉపాదాన మనఁగా లంచమని కొందఱు. అమ్యత ఇ త్యామిషం. అమగత్యాదౌ. పొందఁబడునది. టీ. 'ఉపాచ్చారః ప్రదానం దాహారోగ్రాహ్యయనే అపి' ఇతి అభిధానచింతామణౌ. ఉపశబ్దా దుత్తరేషాం చారదానాది శబ్దానాం పర్యాయత్వాభిధానా దిహ ఉదానశబ్దేన ఉపాయన ముచ్యతి ఇతి.

**అపరాధే ౨ పి కిల్బిషమ్,**

కిల్బిషశబ్దము అపరాధమునకును, అపిశబ్దమువలన పాపమునకును పేరు. కిల్యత ఇతి కిల్బిషం. కల కిల క్షేపే. ద్రొబ్బఁబడునది. 'కిల్బిషం దురితే రుజి' ఇతి శేషః.

**స్యా ద్వృ ష్టౌ లోకధాత్ర్యంశే వత్సరే వర్ష మస్త్రియామ్.** 225

వర్షశబ్దము వానకును, భారతవర్షము మొదలయిన భూఖండములకును, సంవత్సరమునకును పేరు. వర్షణం, వర్షత్యాప్యాయ యతీతిచ వర్షః. ప్న. వృషు సేచనే. వర్షించుట గనుకను, ఆప్యాయనము చేయునది గనుకను వర్షము. 'వర్షం క్లైబ్యేపుమాన్మేఘు' ఇతి శేషః. 'పున్నపుంసక యోర్వర్షం జంబూద్వీపాబ్దవృష్టి' ష్వితి రుద్రశ్చ.

**ప్రేక్షా నృత్తేక్షణ ప్రజ్ఞాః-**

ప్రేక్షాశబ్దము నాట్యమునకును, చూచుటకును, బుద్ధికిని పేరు. పా. నృత్తేక్షణం ప్రజ్ఞా. నృత్తమును జూచుటకును బుద్ధికిని పేరు. ప్రేక్షణం, ప్రేక్ష్యతే అనయేతిచ ప్రేక్షా. ఈక్ష దర్శనాంకనయోః. చూచుటయును, చూడఁబడు నదియును ప్రేక్ష.

**భిక్షా సే వార్థనా భృతిః,**

భిక్షాశబ్దము సేవించుటకును, యాచించుటకును, కూలికిని పేరు. భిక్షణం భిక్షా. భిక్ష యాచ్ఞాయాం. అడుగుట గనుక భిక్ష. "భిక్షాభిక్షిత వస్తుషు" ఇతి శేషః.

**త్వి ట్శోభాపి-**

త్విట్‌శబ్దము ఒప్పిదమునకును, అపిశబ్దమువలన దీప్తికిని పేరు. త్వేషణం త్విట్. ష. సీ. త్విష దీప్తౌ. ప్రకాశించుట గనుక త్విట్టు. "త్విడ్దీప్తౌ వ్యవసాయే చ జిగీషాయాం గిరిధ్వనౌ" వితి శేషః.

**త్రిషు పరే-**

ఇఁకమీఁద షాంతములన్నియు మూఁడులింగములయందు వర్తించును.

**న్యక్షం కార్త్స్న్యే నికృష్టయోః.** 226

న్యక్షశబ్దము అంతయు ననుటకును, అధమునికిని పేరు. నితరాం నికర్షేణ చ అక్ష్ణోతీతి న్యక్షం. అక్షూ వ్యాప్తౌ. మిక్కిలియును, నికృష్టముగాను వ్యాపించునదిగనుక న్యక్షము. టీ. స. అత్ర కార్త్స్న్య శబ్దస్య ధర్మవచనత్వే ఽపి పూర్వవాక్యే న్యక్షశబ్దస్యాపి వాచ్యలిఙ్గవిధానాత్ కృత్స్నరూపే ధర్మిణ్యేవ పర్యవసానం 'న్యక్షః పరశురామే స్యా' దితి శేషః.

**ప్రత్యక్షే ఽ ధికృతే ఽ ధ్యక్షః -**

అధ్యక్షశబ్దము సాక్షాత్తుగా నెఱుఁగఁబడుదానికిని, గ్రామాదుల కధికారియైనవానికిని పేరు. అక్ష మధికృతః, అధ్యక్ష్ణోతీతి చ అధ్యక్షః. అక్షూ వ్యాప్తౌ. ఇంద్రియములను బొందునది గనుకను, ఉత్కృష్టముగా వ్యాపించునది గనుకను అధ్యక్షము, అధ్యక్షుఁడును.

**రూక్ష స్త్వప్రేమ్ణ్యచిక్కణే,**

రూక్షశబ్దము ప్రేమలేనివానికిని, పరుసనిదానికిని పేరు. రూక్షయతీతి రూక్షః. రూక్ష పారుష్యే. పరుసనై యుండును గనుక రూక్షము. 'రూక్షస్స్యాత్పాదపాంతర' ఇతి శేషః.

# సాంతములు

**రవిశ్వేతచ్ఛదౌ హంసౌ -**

హంసశబ్దము సూర్యునికిని, హంసకును పేరు. మఱియు, లోభములేని రాజునకును, విష్ణువునకును, అంతరాత్మకును, మత్సరములేని వానికిని, ఉత్తమ సన్న్యాసికిని, ఉత్తరపదమైయుండునపుడు శ్రేష్ఠునికిని పేరు. 'నిర్లోభనృపతౌ విష్ణావంత రాత్మన్య మత్సరే, యతిభేదే చ హంసస్స్యా చ్ఛ్రేష్ఠే రాజాదిపూర్వక' ఇతి. 'హంసో నిర్లోభనృపతౌ శారీర

మరుదంతరే, హయభేదే యోగిభేదే మంత్రభేదే విమత్సరే, పరమాత్మని విష్ణౌ చ శ్రేష్ఠే రాజాదిపూర్వక' ఇతి శేషః. హంతీతి హంసః. హన హింసాగత్యోః. పోవును గనుక హంస.

**సూర్యవహ్నీ విభావసూ.** 227

విభావసుశబ్దము సూర్యునికి, అగ్నికిని పేరు. విభైవ వసు ధనమస్యేతి విభావసుః. పు. ప్రభయే ధనముగాఁ గలవాఁడు. 'విభావసుర్హారభేద' ఇతి శేషః.

**వత్సౌ తర్ణకవర్షౌ ద్వౌ -**

వత్సశబ్దము దూడకును, సంవత్సరమునకును పేరు. వసతి, వసత్య స్మిన్నితి చ వత్సః. వస నివాసే. ఉండునది. గనుకను, దీనియందన్నియు నుండును గనుకను వత్సము.

**సారఙ్గాశ్చ దివౌకసః,**

దివౌకశ్శబ్దము చాతకపక్షికిని, చకారమువలన దేవతలకును, పక్షికిని పేరు. ద్యౌః ఓకః స్తానమేషామితి దివౌకసః. పా. దివోకసః. స. పు. ఆకాశము స్థానముగాఁ గలది.

**శృఙ్గారాదౌ విషే వీర్యే గుణే రాగే ద్రవే రసః.** 228

రసశబ్దము శృంగారము మొదలైన నవ సరసములకును, విషమునకును, వీర్యమునకును, మధురాది షడ్రసములకును, అనురాగమునకును, ద్రవమునకును పేరు. విష మనఁగా నీళ్లును, విషమును; వీర్యమనఁగా బలిమియును, పాదరసమును; ద్రవ మనఁగా ఆర్ద్రమైనదియును, పులి నీళ్లును. రస్యత ఇతి రసః. రస ఆస్వాదనే. ఆస్వాదింపఁబడునది. 'జలే శరీరధాతౌ చ తిక్తాదౌ పారదే రస' ఇతి త్రికాండశేషః.

**పుంస్యుత్తం సావతంసౌ ద్వౌ కర్ణ పూరే ఽ పి శేఖరే,**

ఉత్తంసశబ్దమును అవతంసశబ్దమును, అంకారార్థమై చెవులకుఁ బెట్టు పువ్వులు సొమ్ములు మొదలైనవానికిని, శిరోభూషణమునకును పేళ్లు. ఉత్తంస్యతే అవతంస్యతే చానేనేతి ఉత్తంసః. అవతంసశ్చ. ప్న. తసి భూషాయాం. దీనిచేత నలంకరింపఁబడును గనుక ఉత్తంసము, అవతంసమును. 'శేఖరే కర్ణపూరే ఽ స్త్రీ స్యా దుత్తంసో ఽ వతంసవత్' అని రుద్రుఁడు.

**దేవభేదే ఽనలే రశ్మౌ వసూ రత్నే ధనే వసు.** 229

వసుశబ్దము అష్టవసువులకును, అగ్నికిని, కిరణమునకును పేరైనపుడు పు. రత్నమునకును, ధనమునకును పేరైనపుడు న. వసతీతి వసుః. పు. వస నివాసే. ఉండును గనుక వసువు. టీ. స. కిరణధనయోర్యథా___ 'నిరకాసయ ద్రవి మపేతవసుం వియదాలయా దపరదిగ్గణికా' ఇతి మాఘకావ్యే.

**విష్ణౌ చ వేధాః-**

వేధశ్శబ్దము విష్ణువునకును, చకారమువలన బ్రహ్మకును, విద్వాంసునకును పేరు. విధతీతి వేధాః. స. పు. విధ విధానే. విధించువాఁడు. "వేధా బుధే" ఇతి శేషః.

**స్త్రీ త్వాశీర్హితాశంసాహి దంష్ట్రయోః,**

ఆశీశ్శబ్దము హితమైన యర్థము గావలయు ననుటకును, పాముకోఱకును పేరు. ఆశాసనం, ఆశంసతీతి చ ఆశీః. స. స్త్రీ. ఆజ శ్శాసు ఇచ్ఛాయాం. ఇచ్ఛయించుటయు, హింసించునదియు ఆశీస్సు.

**లాలసే ప్రార్థనౌత్సుక్యే -**

లాలసశబ్దము అడుగుటకును, ఔత్సుక్యమునకును పేరైనపుడు పు. విషయాసక్తునికి పేరైనపుడు త్రి. ఔత్సుక్య మనఁగా నభీష్టవస్తు వెపుడు దొరకునా యను ననురాగవిశేషము. లాలసనం లాలసః-మిక్కిలి యిచ్ఛయించుట. 'తృష్ణాతిరేకా వాంఛాయా మౌత్సుక్యే లాలసాద్వయో' రితి రభసః.

**హింసా చౌర్యాదికర్మ చ.** 230

హింసాశబ్దము దొంగతనమునకును, ఆదిపదముచేత కొట్టుట మొదలయిన దానికిని, చకారమువలన చంపుటకును పేరు. హింసనం హింసా. హిసి హింసాయాం. చంపుట గనుక హింస.

**ప్రసూ రశ్వాపి -**

ప్రసూశబ్దము ఆఁడుగుఱ్ఱమునకును, అపిశబ్దమువలన తల్లికిని పేరు. ప్రసూయత ఇతి ప్రసూః. స్త్రీ. షూఙ్ ప్రాణిప్రసవే. బిడ్డలఁ గనునది.

**భూద్యావౌ రోదస్యౌ రోదసీ చ తే,**

రోదసీశబ్దము భూమికిని, ఆకాశమునకును ప్రత్యేకముగాఁ బేరై

నపుడు ఈకారాంతస్త్రీలింగము. ఒక్కటిగాఁ బేరగునపుడు సకారాంతన పుంసకము. కొందఱు రోదసీ రోదశ్శబ్దములు రెండును భూమికిని, ఆకాశమునకును ఏకముగాను, ప్రత్యేకముగాను బేళ్లందురు. రుదంత్యస్మిన్నితి రోదః, రోదసీ చ. రుదిర్ అశ్రువిమోచనే. దీనియందు దుఃఖపడుదురు గనుక రోదస్సు, రోదసియును.

**జ్వాలాభాసో ర్న పుంస్యర్చిః -**

అర్చిశ్శబ్దము అగ్నిజ్వాలకును, కాంతికిని పేరు. అర్చ్యత ఇత్యర్చిః. స. స్న. అర్చ పూజాయాం. పూజింపఁబడునది.

**జ్యోతి ర్భ ద్యోత దృష్టిషు** 231

జ్యోతిశ్శబ్దము నక్షత్రమునకును, తేజస్సునకును, దృష్టికిని పేరు. ద్యోతతత ఇతి జ్యోతిః. స. న. ద్యుత దీప్తౌ. ప్రకాశించునది. సూర్యునికిని, అగ్నికిని పేరగునపుడు పుల్లింగమును గలదు. 'జ్యోతి ర్నా భాస్కరే ఉగ్నౌ చ క్లీబం ఖద్యోత దృష్టిషు' ఇతి రుద్రః. 'జ్యోతిః ప్రకాశేతారాయాం వేదాంగాంతర నేత్రయో' రిత్యజయశ్చ. 'జ్యోతిః పుంస్యత్ని సూర్యయోః, చంద్రే చ' ఇతి శేషః.

**పాపాపరాధయో రాగః -**

ఆగశ్శబ్దము పాపమునకును, అపరాధమునకును పేరు. అగంత్యనేనే త్యాగః. స. న. అగ కుటిలాయాం గతౌ. దీనిచేత కుటిలముగాఁ జరింతురు.

**ఖగ బాల్యాదినోర్వయః,**

వయశ్శబ్దము పక్షికిని, బాల్యము యౌవనము మొదలయిన వయస్సులకును పేరు. యౌవనమాత్రమునకును పేరని కొందఱు. వాయత ఇతి వయః. స. న. వీ గతిప్రజనకాంత్యసన ఖాదనేషు. పొందఁబడునది. టీ. స. యౌవనే యథా ___ 'పయఃప్రాదుర్భావం ప్రథయతి పరీహాసఫణితి' రితి.

**తేజః పురీషయో ర్వర్చః -**

వర్చశ్శబ్దము తేజస్సునకును, విష్ఠకును పేరు. వర్చతీతి వర్చః. స. న. వర్చదీప్తౌ. ప్రకాశించునది. 'వర్చస్తురూపవ' దితిశేషః. రూప ఇవేత్యర్థః.

**మహ స్తూత్సవ తేజసోః.** 232

మహశ్శబ్దము పండుగునకును, తేజస్సునకును పేరు. మహ్యత ఇతి మహః.స. న. మహ పూజాయాం. పూజింపఁబడునది. ఉత్సవమునకు

పేరగునపుడు అకారాంతపుంలింగముగాఁ జెప్పఁబడెను. 'న ఖలు దూరగతో ఽ ప్యతివర్తతే మహ మసా వితి బంధుతయోదితైః' అని మాఘము.

**రజో గుణో ఽ పి స్త్రీపుష్పే -**

రజశ్శబ్దము రజోగుణమునకును, స్త్రీలఋతువునకును పేరు. చకారము వలన ధూళికిని పేరు. రంజ్యతే అనేనేతి రజః. స. న. రంజరాగే. దీనిచేత నెఱ్ఱఁగాఁ జేయఁబడును.

**రాహూ ధ్వాన్తే గుణే తమః,**

తమశ్శబ్దము రాహువునకును, చీఁకటికిని, తమోగుణమునకును పేరు. తామ్యం త్యనేనేతి తమః. స. న. తము గ్లానౌ. దీనిచేత బడలుదురు. 'క్లీబం తమోగుణే లోకే సైంహికే యాంధకారయోః' అని రభసుఁడు. రాహువునకు పేరైనపుడు పుంలింగమును గలదు. 'స్వర్భానుశ్చ తమా రాహుః సైంహికేయో విధుంతుదః' అని అమరమాలయందు పుంలింగకాండమునందుఁ జెప్పినాఁడు.

**ఛన్దః పద్యే ఽ భిలాషే చ -**

ఛందశ్శబ్దము గాయత్రి మొదలైన ఛందస్సులకును, ఇచ్ఛకును పేరు. చకారమువలన వేదమునకును పేరు. ఛందయతీతి ఛందః. స. న చది ఆహ్లాదనే. ఆహ్లాదమును జేయునది. అభిలాషకు పేరయినపుడు, అకారాంతమును గలదు. 'ఛందానువృత్తి దుస్సాధాస్సుహృదో విమనీకృతా' ఇతి మాఘకావ్యే. 'ఛందో ఽ భిలాషే ఛందశ్చ ఉత్సవేచమహో మహః' ఇతి శబ్దభేద ప్రకాశః.

**తపః కృచ్ఛ్రాదికర్మ చ.** 233

తపశ్శబ్దము సాంతపనము, చాంద్రాయణము మొదలయిన కృచ్ఛ్రములకును, చకారమువలన ధర్మమునకును పేరైనపుడు న. శిశిరర్తువునకును, మాఘ మాసమునకును పేరైనపుడు పు. తపంత్యత్రేతి తపః, తపాశ్చ. స. తప సంతాపే. దీనియందు తపింతురు. 'తపౌ లోకే ధర్మమాత్రే క్లేశే శిశిర మాఘయో' రితి శేషః.

**సహో బలం సహా మార్గో -**

సహశ్శబ్దము బలిమికి పేరైనపుడు న. మార్గశీర్షమాసమునకు పేరైనపుడు పు. సహంతే అనేన, అస్మిన్నితి చ సహః, సహాశ్చ.

స. షహ మర్షణే. దీనిచేత, దీనియందును ఓర్తురు గనుక సహస్సు. 'సహో జ్యోతిషి హేమంతే నా హాసవతి వాచ్యవ' దితి శేషః.

**నభః ఖం శ్రావణో నభాః,**

నభశ్శబ్దము ఆకాశమునకు పేరైనపుడు న. శ్రావణమాసమునకు పేరగునపుడు పు. శూన్యత్వాత్, మేఘచ్ఛన్నత్వాచ్చ నభాతీతి నభః, నభాశ్చ. స. భా దీప్తౌ. శూన్యమయ్యును, మేఘచ్ఛన్నమయ్యు నుండుట వలన ప్రకాశించనిది. 'నభః క్లీబం జలధరే నా తు ఘ్రూణే పతద్గ్రహే, మృణాళసూత్రవర్షాసు' ఇతి శేషః.

**ఓక స్సద్మాశ్రయ శ్చౌకాః -**

ఓకశ్శబ్దము ఇంటికిని, తావునకును, చకారమువలన వేగమునకును పేరు. ఉచ్య త్యస్మిన్ని త్యోకః. స. న. ఉచసమవాయే. దీనియందు కూడియుందురు గనుక ఓకస్సు. అకారాంత పుంలింగమును. 'స్యాదోకః పుంస్యదంతక' ఇతి శేషః.

**పయః క్షీరం పయో ఒ మ్బు చ.** 234

పయశ్శబ్దము పాలకును, నీళ్లకును పేరు. పీయత ఇతి పయః. స. న. పా పానే. పానము చేయఁబడునది.

**ఓజో దీప్తౌ బలే -**

ఓజశ్శబ్దము బలిమికిని, తేజస్సునకును పేరు. ఉబ్జతి వ్యక్తీభవతీ త్యోజః. స. న. ఉబ్జ ఆర్జవే. స్పష్టమై యుండునది. మఱియు జ్యోతిశ్శాస్త్ర పరిభాషచేత విషమసంఖ్యకును పేరైనపుడు అకారాంతము.

**స్రోత ఇన్ద్రియే నిమ్నగారయే,**

స్రోతశ్శబ్దము చెవులు మొదలయిన యింద్రియ ద్వారములకును, నదీ వేగమునకును పేరు. స్రువతీతి స్రోతః. స్రు ప్రస్రవణే. స్రవించునది గనుక స్రోతస్సు. టీ. స. ఇంద్రియ మింద్రియ స్థానగతం ద్వారం. 'స్రోతోభిస్త్రిదశజా మదం క్షరంత' ఇతి భారవిః. రయశబ్దేనాత్ర ప్రవాహః. యథా - తీవ్రస్రోతాః.

**తేజః ప్రభావే దీప్తౌ చ బలే శుక్రే ఒ పి -**

తేజశ్శబ్దము ప్రభావమునకును, కాంతికిని, బలిమికిని, రేతస్సునకును, అపిశబ్దము వలన తిరస్కారము నోర్వకుండుటకును పేరు, 'అధిక్షే

పావమానాదేః ప్రయుక్తస్య పరేణ యత్, ప్రాణాత్యయే ఽ ప్యవస్థానం తత్తేజ స్సముదాహృతం' అని. తేజయతీతి తేజః. స. న. తిజ నిశాతనే. కృశముగాఁ జేయునది.

**అథ త్రిషు.** 235

ఇఁకమీఁద వచ్చు సాంతములన్నియుఁ ద్రిలింగములు. వీనిలో బీభత్సశబ్ద మొండు దక్క తక్కినవి స్త్రీలింగమున నీకారాంతములే.

**విద్వా న్విదంశ్చ -**

విద్వచ్ఛబ్దము ఎఱుక గలవానికిని, చకారమువలన ఆత్మజ్ఞునకును, విద్వాంసునికిని పేరు. వేత్తీతి విద్వాన్. స. విద జ్ఞానే. ఎఱిఁగినవాఁడు. 'విద్వా నాత్మవిది ప్రాజ్ఞే పండితే చాభిధేయవ' దితి శేషః.

**బీభత్సో హింస్రో ఽ పి -**

బీభత్సశబ్దము హింసించుస్వభావము గలవానికిని, అపిశబ్దము వలన రోఁతగలవానికిని, అర్జునునికిని పేరు. బీభత్సా స్యాస్తీతి బీభత్సః – రోఁతగలవాఁడు గనుక బీభత్సుఁడు, 'పార్థో ఘృణావాన్ బీభత్స' ఇతి శేషః.

**అతిశయే త్వమీ,**

ముందరఁ జెప్పఁగల జ్యాయశ్శబ్దము మొదలు ౪ స్వార్థాతిశయమందు వర్తించును.

**వృద్ధ ప్రశస్యయో ర్జ్యాయాన్ -**

జ్యాయశ్శబ్దము మిక్కిలి వృద్ధునికిని, మిక్కిలి శ్రేష్ఠునికిని పేరు. అతిశయేన వృద్ధః ప్రశస్తశ్చ జ్యాయాన్. స. మిక్కిలి వృద్ధుఁడును మిక్కిలి ప్రశస్తమైనవాఁడును.

**కనీయాంస్తు యు వాల్పయోః.** 236

కనీయశ్శబ్దము మిక్కిలి ప్రాయపువానికిని, మిక్కిలి యల్పమైన వానికిని పేరు. అతిశయేన యువా అల్పశ్చ కనీయాన్. స. మిక్కిలి ప్రాయపువాఁడును. మిక్కిలి కొంచెమైనవాఁడును.

**వరీయాం స్తూరు వరయోః -**

వరీయశ్శబ్దము మిక్కిలి ఘనమైనవానికిని, మిక్కిలి శ్రేష్ఠునికిని పేరు. అతిశ యేన ఉరుః, వరశ్చ వరీయాన్. స. మిక్కిలి అధిక

మైనవాఁడు, శ్రేష్ఠమైనవాడును.

**సాఢీయాన్ సాధు బాఢయోః,**

సాఢీయశ్శబ్దము మిక్కిలి మంచివానికిని, మిక్కిలి దృఢమైనవానికిని పేరు. అతిశయేన సాధుః బాఢశ్చ సాఢీయాన్. స. మిక్కిలి మంచివాఁడును, మిక్కిలి దృఢమైనవాఁడును గనుక సాఢీయస్సు.

## హాంతములు

**దళే௨పి బర్హమ్ -**

బర్హ శబ్దము ఆకునకును, అపిశబ్దమువలన నెమిలిపురికిని పేరు. బర్హతీతి బర్హం. బృహ వృద్ధౌ. వృద్ధిఁ బొందునది. 'బర్హం మయూరపింఛే௨థ ప్రాధాన్యో ద్యోతవృద్ధిషు, పరివారే పుమా' నితి శేషః.

**నిర్బన్ధోపరాగార్కాదయో గ్రహాః.** 237

గ్రహశబ్దము నిర్బంధమునకును, సూర్యచంద్రగ్రహణములకును, సూర్యాది నవగ్రహములకును పేరు. నిర్బంధమనగా పట్టుట యని కొందఱు. గృహ్ణాతీతి గ్రహణం, గృహ్యత ఇతి చ గ్రహః. గ్రహ ఉపాదానే. పట్టును గనుకను, పట్టుటగనుకను, పట్టఁబడును గనుకను గ్రహము. "గ్రహో௨నుగ్రహ నిర్బంధ గ్రహణేషు రణోద్యమే, సూర్యాదౌ పూతనాదౌ చ సైంహికేయోపరాగయో" రితి శేషః.

**ద్వార్యాపీడే క్వాథరసే నిర్యూహో నాగదన్తకే,**

నిర్యూహశబ్దము వాఁకిలికిని, సిగను ముడిచిన పూలందండకును, కషాయమునకును, కొణిగె మొదలయినదాని కాధారముగా గోడ మొదలయిన దానియందు నాఁటిన కొయ్యకును పేరు. చిలకకొయ్యకు పేరని కొందఱు. నిర్యాం త్యస్మాత్, నిర్యాతీతి చ నిర్యూహః. యా ప్రాపణే. దీనివలన పోదురు గనుకను, పోవును గనుకను నిర్యూహము. టీ. స. ద్వారి ప్రతీహారిదేశే. ఆపీడశబ్దేన కుడ్యాద్బహిర్నిర్గతం దారు కథ్యత ఇతి క్షీరస్వామి సుబోధినీకారౌ. తదుక్తం విశ్వకర్మణా ___ 'స్థూణాతూ లాగ్ర యోర్లగ్నం ద్విప్రాంతం తిర్యగున్నతమ్, ఆపీడ ఉచ్యతే దారుస్వోర్ధస్యాపీడ్య ధారణాత్' ఇతి. సుభూతిచంద్రస్తు 'శేఖర' ఇతి వ్యాఖ్యాయ. తత్ర రుద్రాభిధాన మాహ ___ 'నిర్యాసే శేఖరే ద్వారి నిర్యూహో నాగదంతక' ఇతి.

**తులాసూత్రే ఽ శ్వాదిరశ్మౌ ప్రగ్రాహః ప్రగ్రహో ఽ పి చ.** 238

ప్రగ్రాహ ప్రగ్రహశబ్దములు ౨ త్రాసు తూనుకోల మొదలైనవాని త్రాటికిని, గుఱ్ఱము మొదలైనవానిఁ గట్టెడు పగ్గము మొదలైన దానికిని పేరు. ప్రగృహ్యతే అనేనేతి ప్రగ్రాహః, ప్రగ్రహశ్చ. గ్రహఉపాదానే. దీనిచేత కట్టఁబడును గనుక ప్రగ్రాహము, ప్రగ్రహమును. 'రశ్మౌ బంద్యాం నియమనే భుజే, హరిపాదపహేమ్నోశ్చ ప్రగ్రహ' ఇతి విశ్వప్రకాశః.

**పత్నీ పరిజ నాదాన మూల శాపాః పరిగ్రహాః,**

పరిగ్రహశబ్దము పెండ్లామునకును, పరివారమునకును, పుచ్చుకొనుటకును, మొదటికిని, శాపమునకును పేరు. పరిగృహ్యత ఇతి పరిగ్రహః – పరిగ్రహింపఁ బడునది.

**దారేష్వపి గృహాః -**

గృహాశబ్దము పెండ్లామునకును, అపిశబ్దమువలన నింటికిని పేరు. గృహ్యంత ఇతి గృహాః. గ్రహ ఉపాదానే. పుచ్చుకొనఁబడునది. పుంలింగము. నిత్యబహువచనము.

**శ్రోణ్యా మ ప్యారోహో వరస్త్రియాః.** 239

ఆరోహశబ్దము ఉత్తమస్త్రీ యొక్క పిఱుఁదునకును, అపిశబ్దము వలన నేనుఁగు మావటివానికిని, ఎక్కుటకును, నిడుపునకును, పొడవునకును పేరు. ఆరుహ్యతే, ఆరోహతి, ఆరోహణం చ ఆరోహః. రుహ బీజజన్మని ప్రాదుర్భావే. ఎక్కఁబడును గనుకను, ఎక్కును గనుకను, ఎక్కుట గనుకను ఆరోహము. "ఆశ్వాసాదిని, ఆరోహణే ద్రాఘిమని మానేప్యారోహ ఇష్యత" ఇతి శేషః.

**వ్యూహో బృన్దే ఽ పి -**

వ్యూహశబ్దము సమూహమునకును, అపిశబ్దమువలన పౌజుఁ దీర్చుటకును పేరు. విశేషేణోహ్యత ఇతి వ్యూహః. ఊహ వితర్కే. విశేషముగా విచారింపఁ బడునది. "వ్యూహో నా బలవిన్యాస నిర్మాణ నికురుంబయో" రితి రుద్రః.

**అహి ర్వృత్రే ఽ పి -**

అహిశబ్దము వృత్రాసురునికిని, అపిశబ్దమువలన పామునకును

పేరు. హంతీ తృహిః. పు. హన హింసాగత్యోః. హింసించును గనుక అహి. అంహతి లోకాన్ వ్యాప్నోతీతి అహిః. అహి గతౌ. వృత్రేయథా ___ "ధృతం దనుష్షండ మివాహివిద్విష" ఇతి భారవిః. "సర్పే వృత్రాసురే ఉప్యహి" రితి రభసః.

**అగ్నీన్ద్వర్కా స్తమోపహాః,**

తమోపహశబ్దము అగ్నికిని, చంద్రునికిని, సూర్యునికిని పేరు. తమో ధ్వాంతమపఘ్నంతీతి తమోపహాః. హన హింసాగత్యోః. చీఁకటిని బోమొత్తుదురు గనుక తమోపహులు.

**పరిచ్ఛదే నృపార్హే ఉర్థే పరిబర్హః -**

పరిబర్హ శబ్దము పరివారమునకును, రాజయోగ్యమైన శ్వేతచ్ఛత్ర చామరాది వస్తువులకును పేరు. పరిబర్హత ఇతి పరిబర్హః. బర్హప్రాధాన్యే. ప్రధానమై యుండునది.

## నానార్థావ్యయములు

**అవ్యయాః పరే.** 240

ఇఁకముందర లింగాది సంగ్రహ వర్గ దనుకఁ జెప్పఁగల శబ్దము లవ్యయములు. వానిలో నానార్థవర్గ ప్రస్తావమువలన నానార్థములైన యవ్యయములను ముందుఁ జెప్పి, పిమ్మట నేకార్థములైన యవ్యయములు చెప్పఁ బడుచున్నవి. ___

**ఆ జీషదర్థే ఉభివ్యాప్తౌ సీమార్థే ధాతుయోగజే,**

ఆఙ్, అను అవ్యయము ఙకారానుబంధమైన ఆకారము. ఇది ఇంచుక యనునర్థమందును, అభివ్యాప్తియందును, సీమార్థమందును, క్రియాయోగమందుఁ బుట్టిన క్రియార్థద్యోతకత్వమందును వర్తించును. ఉదా. ఈషదర్థమునకు – 'ఆపాండరీభూతముఖచ్ఛవీనాం' అభివ్యాప్తికి – 'ఆకుమారం యశః పణినేః' అభివ్యాప్తియనఁగా మేరగాఁ జెప్పు నర్థమునకు క్రియాసంబంధము గలుగుట. ఇక్కడ మేరగాఁ జెప్పిన కుమారులును పాణినియొక్క కీర్తి నెఱుంగుదురని యర్థము. సీమార్థమునకు – 'ఓదకాత్ప్రియం పాంథ మనువ్రజేత్' సీమార్థ మనఁగా మేరగాఁ జెప్పిన యర్థమునకు లోనైనదానికే క్రియాసంబంధము గలిగి, మేరయైన యర్థము

నకు క్రియాసంబంధము లేకుండుట. ఇక్కడ మేరగాఁ జెప్పిన యుదకము దనుకనే బంధువుల నంపఁ బోవలయుఁగాని, ఉదకము దాఁటి పోఁగూడదు గనుక క్రియాసంబంధము మేరయైన యుదకమునకు లేదు. ధాతు యోగజమునకు ఆహరతి, ఆదత్తే, ఆక్రామతిః ___ ఇక్కడ – ఆఙ్ క్రియతోఁ గూడుకొని ధాతువునం దుండు ఆహరణమును, ఆదానమును, ఆక్రమణమును సూచించుచున్నది. టీ. ధాతుయోగజే అర్థ ఇతి. ధాతూనామనేకార్థత్వే సత్యపి అనభివ్యక్తార్థా ఏవ ధాతవః. ఆఙాద్యుపసర్గయోగవశా దవిశేషే వర్తంతే. అతో ధాత్వర్థద్యోతకత్వేన ఉపసర్గాణా మపితదర్థత్వ ముచ్యతే. ఆఙత్యస్య ఈషదాద్యర్థత్రయస్యాభిధాయకత్వం. ధాతుయో గజార్థస్య తు ద్యోతకత్వమితి వివేకః. ఏవ ముత్తరత్రాపి యథాయథం ద్రష్టవ్యం. ధాతుయోగజ ఇత్యస్య వివరణం శేషకారేణ దర్శితం. యథా___ 'క్రియోద్గమ గ్రహాధర్షా శ్లేష శాపాభికాంక్షణే, అవష్టంభే కాలహృతా వుత్కంఠా నికటత్వయోః. స్వర్థావాపనిషేధేషు వినామే బంధనే వధే, స్నానే సంస్థాసంప్రదాయ దర్శనేషు విమర్శనే. విజ్ఞానే జ్ఞాపకే పారతంత్ర్యే త్యాగనియోగయోః, భూషా సంభాషణాలేఖ్యాభి ముఖ్యాక్రమణేషు చ. వృత్త్యావృత్తిప్రాపణేషు ప్రతిశ్రవణవిస్తృతౌ, విస్రంభాభివిధోద్యోగే సంభ్రమాభ్యవహారయోః. స్థాన ఆవరణా హ్వానే ఆధాపూజాశ్రమేషు చ, ఉక్తిదుః ఖానందనేషుసంచయే చాఙ్ ప్రవర్తత' ఇతి.

**ఆ ప్రగృహ్యః స్మృతౌ వాక్యే** ఽ **పి -**

ఆ అనుప్రగృహ్యసంజ్ఞక మయిన యవ్యయము స్మరణమందును, మునుపు చెప్పినవాక్యార్థమును సూచించుటయందును, లేక వాక్యపూరణమందుఁగాని వర్తించును. ఉ. స్మరణమునకు – ఆ ఏవం కిల తత్. వాక్యమునకు – 'ఆ ఏవం మన్యసే – ఆ అద్య స్వా దిష్టం భోజనం లబ్ధ' మితి. ప్రగృహ్య సంజ్ఞమైనందుకు 'ఆ ఏవం' అనుదిక్కున సంధి లేక స్వభావమున నుండుట ప్రయోజనము.

**ఆస్తు స్యా త్కోప పీడయోః.** 241

'ఆః' అనునవ్యయము విసర్గముతోఁ గూడిన ఆకారము. ఇది – కోపమందును, పీడయందును వర్తించును. ఉదా. కోపమునకు – 'ఆః రక్ష

న్నిష్ఠ. పీడకు ___ 'విద్యాం మాతర మాః ప్రదర్శ్య నృపశూన్ భక్షస్వ. ఆః కష్టం వర్తంతే' అని.

**పాప కుత్సేషదర్థే కు -**

కు – ఇది పాపమందును, నిందయందును, ఇంచుక యను నర్థమందును వర్తించును. ఉ. పాపార్థమునకు – 'త్యజేత్కుజనసంగతిం' నిందకు–కుభోజనం' ఈషదర్థమునకు ___ 'కోష్టం కవోష్ణం.'

**ధి జ్నిర్భర్త్సన నిన్దయోః,**

ధిక్ – ఇది తిరస్కరించుటయందును, దోషము చెప్పుటయందును వర్తించును. ఉ. తిరస్కారమునకు – 'ధిగ్గ్రామం నిష్ఠురాలాపం' నిందకు – 'ధి గిమాం దేహభృతా మసారతామ్'.

**చాన్వాచయ సమాహారేత రేతర సముచ్చయే.** 242

చ–ఇది అన్వాచయమందును, సమాహారమందును, ఇతరేతర యోగమందును, సముచ్చయమందును వర్తించును. మఱియు, పాదపూరణ, పక్షాంతర, హేతు, నిశ్చయములయందును వర్తించును. అన్వాచయమనఁగా రెండు క్రియలలో నొకటి ప్రధానమై, మఱియొకటి యప్రధానమైయుండుట. ఎట్టులనిన ___ భిక్షామట గాం చానయ, ఇక్కడ భిక్షాటన మవశ్యమ్ము గనుక ప్రధానము. ఆవును జూచినయెడలఁ దోలుకొనిరమ్ము; లేనియెడల ప్రయత్నమునఁ బోవలదని భావము గనుక గవానయన యప్రధానము. సమాహార మనఁగా–ఒక క్రియలో నవయవములయిన అర్థములకు ప్రాధాన్యములేక సముదాయమే ప్రధానమై యుండుట. ఎట్లనిన ___ ఛత్రోపానహం. అశ్వబలీవర్దం. ఇక్కడ అశ్వబలివర్దాది సముదాయమునకే ప్రాధాన్యముగాని, అవయవములైన యశ్వాదులకును, బలీవర్దాదులకును ప్రాధాన్యములేదు. ఇతరేతర యోగమనఃగా, పరస్పర సాపేక్షములైన యవయవార్థములకు, ఒక క్రియతో సంబంధము గలుగుట. ఎట్టులన ___ దేవదత్తయజ్ఞ దత్తాభ్యామిదం కార్యం. ఇక్కడ దేవదత్తయజ్ఞ దత్తులు కూడుకొని కార్యము చేయవలెను గనుక, అవయవార్థములు పరస్పరసాపేక్షములు. సముచ్చయ మనఁగా, పరస్పర నిరపేక్షములయిన యవయవార్థములకు నొక క్రియతో సంబంధము గలుగుట. 'రాజ్ఞో గౌ రశ్వః పురుషశ్చ' అని. ఇక్కడ గవాదు లొక

టొకటి నపేక్షించక ప్రత్యేకము సంబంధించును. "చ చేదర్థే నకారే స్యా దవధారణ భేదయో, పాదస్య పూరణే హేతౌ తుల్యయు గ్వినియోగయో" రితి శేషః. యదాచేతి నిపాతస్య ణకార ఇత్సంజ్ఞా. తదాచేదర్థే వర్తత ఇత్యర్థః. తదుక్తం 'చణ్ చేదర్థ' ఇతి.

**స్వస్త్యాశీః క్షేమ పుణ్యాదౌ**

స్వస్తి ___ ఇది ఆశీర్వాదమందును, నిరుపద్రవమందును, పుణ్యము నందును, ఆదిశబ్దమువలన శుభాదులయందును వర్తించును. ఉ. ఆశీర్వాదమునకు ___ 'స్వస్తితే ఽస్తు లతయా సహవృక్ష'. నిరుపద్రవమునకు ___ 'స్వస్తి ప్రజాభ్యః', 'భూతానుకంపా తవ చేదియంగౌ రేకాభవేత్స్వస్తిమతీ త్వదంతే'. పుణ్యమునకు ___ 'స్వస్తిమాఞ స్వర్గమశ్నుతే. శుభమునకు ___ 'స్వస్తివాక్యం తతః కుర్యాత్' 'ప్రాస్థానికం స్వస్త్యయనం ప్రయుజ్య' స్వస్తిశ్రీ మదిత్యాదులును.

**ప్రకర్షే లఙ్ఘనే ఽప్యతి,**

అతి ___ ఇది మిక్కిలి మను నర్థమందును, దాఁటె ననునర్థమందును, అపిశబ్దమువలన పూజయందును వర్తించును. ఉ. మిక్కిలి యనుటకు ___ 'అతివృద్ధః' 'అతిశేతే'. గడచుటకు ___ 'అతీతకాల స్త్వహమభ్యువేతః" 'అతిః పూజాతి క్రమణాతి దేశవ్యాధియాపనే, ఆరోపణే చ నిర్బంధే వినాశానుజ్ఞయో రపి' ఇతి శేషః. అపిశబ్దాత్ భయకపటయోః.

**స్విత్ప్రశ్నే చ వితర్కే చ -**

స్విత్ ___ ఇది ప్రశ్నయందును, వితర్కమందును వర్తించును. ఉ. ప్రశ్నకు ___ 'కస్విదేకాకీ చరతి'. వితర్కమునకు, 'అధ స్విదాసీ దుపరి స్విదాసీత్'.

**తు స్యా ద్భేదే ఽవధారణే.** 243

తు ___ ఇది విశేషమందును, నిశ్చయమందును వర్తించును. మఱియు, హేతుపాద పూరణములయందును వర్తించును. ఉ. విశేషమునకు ___ 'పూజ్యా గౌః కపిలా తు పూజ్యతరాc. నిశ్చయమునకు ___ 'వేదాస్తుప్రమాణం'. పూజకు ___ 'వేదాధ్యస్తు ద్విజాతీనాం'. హేతువునకు ___ 'దిశస్తు జలదైశ్ఛన్నా భవిత్రీ వృష్టిసంహతిః' పాదపూరణమునకు. 'తతస్తు ధర్మరాజం తం', 'త్వర్భాహేత్వోః పాదపూర్తా' వితి శేషః.

**సకృ త్స హైకవారే స్యాత్ -**

ఇది కూడా ననునర్థమందును, ఒకసారి యనుటయందును వర్తించును. ఉ. కూడ ననుటకు ___ 'దేవదత్త యజ్ఞదత్తౌ సకృద్భుంజాతే'. ఒకసారి యనుటకు ___ 'సకృత్ప్రదీయతే కన్యా' టీ. స. అపిశబ్దాత్సర్వదేత్యర్థే. 'సకృత్తరుణా దేవాః' సర్వదా యువాన ఇత్యర్థః.

**ఆరా ద్దూర సమీపయోః,**

ఆరాత్ ___ ఇది దూరమందును, సమీపమందును వర్తించును. ఉ. దూరమునకు ___ 'ఆరాద్గతో దృష్టిపథం వ్యతీతః'. సమీపమునకు ___ 'త మర్చ్యమారా దభివర్తమానం'.

**ప్రతీచ్యాం చరమే పశ్చాత్ -**

పశ్చాత్ ___ ఇది పడమటిదిక్కునందును, వెనుకదిక్కునందును వర్తించును. ఉ. పడమటిదిక్కునకు-'పశ్చాదస్తం గతో రవిః' వెనుకకు-'పశ్చాద్యాతి', శ్రోత్రియేభ్యః పూర్వం దీయతాం పశ్చాదితరేభ్యః'.

**ఉతాప్యర్థ వికల్పయోః.** 244

ఉత-ఇది అప్యర్థమందును, వికల్పమందును వర్తించును. అప్యర్థమనగా దృఢార్థమును, ప్రశ్నయును. ఉ. దృఢార్థమునకు-'ఉత భింద్యాచ్ఛిరసా శిలోచ్చయం'. ప్రశ్నకు ___ 'ఉత దండః పతిష్యతి'. వికల్పమునకు ___ 'ఉత పర్వతో భిద్యేత' 'ఉత తృప్యేద్వజ్రీ' "వితర్కే ఉపి భవే దుత, పాదస్య పూరణే ప్రశ్నే" ఇతి శేషః.

**పున స్సహార్థయో శ్శశ్వత్ -**

శశ్వత్ - ఇది మఱియు ననునర్థమందును, కూడ ననునర్థమందును వర్తించును. పా. పునస్సదార్థయోః. ఉ. మఱియు ననుటకు-శశ్వత్పశ్యత శబ్దవార్ధి లహరీ విద్యోల్బణం'. కూడ ననుటకు - 'శశ్వద్భుంజాతే'. సదాయను నర్థమందు- 'శాశ్వతంవైరం', 'స్యాచ్ఛశ్వత్సహ సంతతే' ఇతి శేషః.

**సాక్షాత్ప్రత్యక్ష తుల్యయోః,**

సాక్ష్యాత్ ___ ఇది ప్రత్యక్షమందును, సమానమందును వర్తించును. ఉ. ప్రత్యక్షమునకు ___ 'సాక్షాద్దృష్టో ఉసి'. సమానమునకు-'ఏషాసాక్షా ల్లక్ష్మీః'.

**ఖేదానుకమ్పా సంతోష విస్మయామన్త్రణే బత.** 245

బత – ఇది ఖేదమందును, దయయందును, సంతోషమందును, ఆశ్చర్యమందును, పిలుచుటయందును వర్తించును. ఉ. ఖేదమునకు – 'అహో బత మహత్కష్టం'. దయకు–'మా రోదీర్బత పుత్ర త్వం'. సంతోషమునకు – 'బత ముక్తాః స్మ కిల్బిషాత్'. ఆశ్చర్యమునకు – 'అహోబతాసి స్పృహణీయవీర్యః' ఆమంత్రణమునకు–'ఏహి బత' 'బత వితరత తోయం తోయవాహా హిమాన్తం'.

**హన్త హర్షే ఽనుకమ్పాయాం వాక్యారమ్భ విషాదయోః,**

హంత–ఇది సంతోషమందును, దయయందును, వాక్యారంభమందును, దుఃఖపడుటయందును వర్తించును. ఉ. సంతోషమునకు – 'హంతజీవితాస్మ్ః', దయకు–'మారోదీర్హన్త పుత్రక', వాక్యారంభమునకు – హంత తే కథయిష్యామి', విషాదమునకు –'హంత హతాః పథికగేహిన్యః.'

**ప్రతి ప్రతినిధౌ వీప్సా లక్షణాదౌ ప్రయోగతః.** 246

ప్రతి–ఇది సదృశార్థమందును, వీప్సయందును, లక్షణమందును, ఆది శబ్దమువలన ఇత్థం భూతాఖ్యానమందును, భాగమందును, ప్రతిదానమందును వర్తించును. వీప్సయనఁగా, గుణక్రియలచేత నన్ని వస్తువులను ప్రత్యేకముగా వ్యాపింప నిచ్ఛయించుట. లక్షణ మనఁగా, చిహ్నము. ఇత్థం భూతాఖ్యాన మనఁగా, ఒక ప్రకారమును బొందినవానిఁగాఁ జెప్పుట. ప్రతిదానమనఁగా, నొకటి నిచ్చి మఱి యొకటిఁ బుచ్చుకొనుట. ఉ. ప్రతినిధికి – 'అభిమన్యు రర్జునాత్ప్రతి'. వీప్సకు – 'వృక్షం వృక్షం ప్రిసించతి' లక్షణమునకు–'వృక్షం ప్రతివిద్యోతతే విద్యుత్'. ఇత్థం భూతా ఖ్యానమునకు–'సాధుర్మాతరం ప్రతి'. భాగమునకు – 'యదత్ర మాంప్రతి స్యాత్ తద్దీయతాం' ప్రతిదానమునకు–'తిలేభ్యో మాషాన్ ప్రతియచ్ఛతి' టీ. స. ప్రయోగత ఇత్యస్యాయమర్థః. న కేవలం సూత్రద్వయానుసారేణోక్తాః. ఏత ఏవ ప్రిశబ్దస్యార్థాః. కింతు లోక ప్రయోగానుసారేణ అన్యే ఽప్యర్థా లక్షణాదా విత్యాదిశబ్దేన సంగృహీతాః. తే చ 'శేషకారేణ దర్శితాః___ "పరిజ్ఞానే పదప్రాప్తౌ కాలహృత్యాం నివారణే, వ్యలీకావిష్కృతౌ తుష్టౌ సేవాయాం నిష్క్రమే ఽపి చ, ప్రోత్సాహేచా వినాభావే విఘ్నాఙ్గీకారయోరపి, వ్యావర్తనే వినిమయే పునరావర్తనే ఽపి చ, వైపరీత్యే వినిద్రత్వే అవేక్షాక్షేపయోరపి, సంక్షేపస్పర్ధసా

దృశ్యే స్వీకారాభ్య వహారయోః, ఉత్తరస్తోకయత్నేషు ఉపసర్గః ప్రతిస్మృత” ఇతి.

**ఇతి హేతు ప్రకరణ ప్రకాశాది సమాప్తిషు,**

ఇతి – ఇది కారణమందును, ప్రకరణమందును, ప్రకాశమందును, మొదలను నర్థమందును, ముగియుటయందును వర్తించును. ఉ. కారణమునకు – 'హంతీతి పలాయతే'. ప్రకరణ మనఁగా ప్రకారము. దానికి – 'గౌరశ్వోహస్తీతి జాతిః'. ప్రకాశమునకు–'ఇతి ప్రాణినః'. మొదలనునర్థమునకు– 'హేలాలీ లేత్యమీహావాః'. ముగియుటకు–'ఇతి ప్రథమస్సర్గః' కొందఱు 'ఇతి హేతుప్రకరణ ప్రకర్షాది' యనియును, 'ప్రకరణప్రకారాది' యనియును బఠింతురు. “ఇతి రుక్తార్థనిర్దేశే మత్యేవం నియమేషుచ, వక్ష్యమాణ పరామర్శే వివక్షానియమే ఽపిచ” ఇతి శేషః.

**ప్రాచ్యాం పురస్తాత్ప్రథమే పురార్థే ఽగ్రత ఇత్యపి.** 247

పురస్తాత్ – ఇది తూర్పుదిక్కునందును, మొదలను నర్థమందును, తొల్లియను నర్థమందును, ముందర ననునర్థమందును వర్తించును. ఉ. పూర్వదిక్కునకు– 'పూరస్తాదుదేతి సూర్యః'. మొదటికి – 'పురస్తాత్క్రియతే కర్మ పశ్చాత్సిద్ధ్యతి తత్ఫలం'. తొల్లిటి–'పురస్తాద్రామో ఽభూత్'. ముందరికి – 'పురస్తా త్సేనా నిర్యాతి.'

**యావ త్తావచ్చ సాకల్యే ఽవధౌ మానే ఽవధారణే,**

యావత్, తావత్–ఈ ౨ ను అంతయు నను నర్థమందును, మేరయందును, పరిమాణమందును, పరిమాణ నిశ్చయమందును వర్తించును. ఉ. సాకల్యమునకు – 'యావత్కార్యం తావత్కురు'. మేరకు–'యావత్సస్యం క్షేత్రం తావ త్కంటకి వృక్షైః పరివృతం'. పరిమాణమునకు – 'యావద్దత్తం తావద్భుక్తం'. పరిమాణ నిశ్చయమునకు – 'యావదమత్రం తావద్బ్రాహ్మణానా మంత్రయస్వ'. 'భవిష్యదర్థ సాంతత్యం యావదప్రతి యుగ్వదే' దితి శేషః. 'తావచ్ఛబ్దా సహచరితః కేవలో యావచ్ఛబ్దః భవిష్యదర్థం సాంతత్యం చాభి దధాతి'.

**మఙ్గళానన్త రారమ్భ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ.** 248

అథో, అథ – ఈ ౨ ను మంగళార్థమందును, తర్వాత నను నర్థమందును, దొరఁకొనుటయందును, ప్రశ్నయందును, అంతయు నను

నర్థమందును వర్తించును. ఉ. మంగళమునకు–'అథవర్ణమామ్నాయః' అనంతరమునకు–'అథ ప్రజానామధిపః ప్రభాతే.' ఆరంభమునకు–'అథేదానీ మేతన్నిరూప్యతే' ప్రశ్నకు–'అథైకధేనో రపరాధచండాద్గురోః కృశాను ప్రతిమాద్బిభేషి'. కార్త్స్న్య మునకు 'అథ చురాదయఃకథ్యంతే'. 'అంగీకారే ఽధికారే చ సముచ్చయ వికల్పయోః, మతాంతరే ఽప్యథాథో చ అన్వాదేశే త్వథో' ఇతి శేషః.

**వృథా నిరర్థకావిధ్యోః -**

వృథా ఇది వ్యర్థమనుటయందును, విధిలేక చేయుటయందును వర్తించును. ఉ. నిరర్థకమునకు–'ప్రాసాదశృంగాణి వృథా ధ్యరుక్షః'. విధిలేక చేయుటకు. 'ప్రపచ్యతే స నరకేయో వృథా ఽఽలభతే పశుమ్'.

**నానానేకోభయార్థయోః,**

నానా–ఇది బహుప్రకారమందును, రెంటియందును వర్తించును. ఉ. అనేకార్థమునకు – 'నానాచేష్టైర్జలద లలితై ర్నిర్జితం తం నగేంద్రం'. రెంటికి– 'నానాగ్రాం సమిధం త్యజేత్'. టీ. స. నానానేక వినార్థయోః. వినార్థే యథా ___ 'నానా నారీం నిష్ఫలా లోకయాత్రా'. 'వినానేకార్థయోర్నానేతి గణరత్నమహోదధౌ చ.

**ను పృచ్ఛాయాం వికల్పే చ -**

ను–ఇది ప్రశ్నయందును, వికల్పమందును వర్తించును. ఉ. ప్రశ్నకు–కో ఽనుధావతి'. వికల్పమునకు–'భీమోను ఫల్గునోను యోద్ధా'. ప్రత్యుక్తావుపమానే చ విషాదోత్ప్రేక్షయో రపి, ను పాదపూరణేజ్ఞేయో జిజ్ఞాసాయాం సముచ్య' ఇతి శేషః.

**పశ్చాత్సాదృశ్యయో రను.** 249

అను–ఇది వెనుక అనునర్థమందును, సాదృశ్యమందును వర్తించును. ఉ. వెనుక అనునర్థమునకు–'త మనుధావతి'. సాదృశ్యమునకు–'మాతర మను కరోతి'. లక్షణేత్థం భూతాఖ్యాన భాగ వీప్సలయందును వర్తించును. 'అనుర్హీనే లక్షణే చ సహదైర్ఘ్యాను పూర్వయోః, లక్షణేత్థం భూతాఖ్యాన భాగవీప్సా సమీపయోః. అథోపసర్గో విజ్ఞేయ స్సహపశ్చాద్దయాను చ, అవబోధే చానుమతౌ సాదృశ్యే సాంత్వ సేవయోః. ప్రశ్నే చలోచనాచారే ఆనుకూల్యే చ మార్గణే, ఆసక్తా వా

నుపూర్వ్యాం చ సాతత్యేచ్ఛోపకారవత్, ప్రోత్సాహే చాసుతాపే చ వాసనే చ ప్రసాధనే, అన్వయే చ నియోగే చ' ఇతి శేషః.

**ప్రశ్నావధారణానుజ్ఞాను నయామన్త్రణే నను,**

నను-ఇది ప్రశ్నయందును, నిశ్చయమందును, అనుమతియందును, ఊరడించుటయందును, సంబోధనమందును వర్తించును. ఉ. ప్రశ్నకు-'నన్వభోజి'. నిశ్చయమునకు-'నన్వథ గచ్ఛామః'. అనుమతికి-'నన్వాదిశ'. ఊరడించుటకు-'నను చండి ప్రసీద మే'. సంబోధనమునకు-'నను దేవదత్త'. 'నను క్షేపే మతస్య చ, ప్రత్యుక్తా వేషణాయాంచ' ఇతి శేషః.

**గర్హాసముచ్చయ ప్రశ్న శఙ్కా సంభావనాస్వపి.** 250

అపి - ఇది నిందయందును, సముచ్చయమునందును, ప్రశ్నయందును, శంకయందును, ఇది యిటుల సంభవించు నను నర్థమందును వర్తించును. ఉ. నిందకు - 'అపి సించేత్పలాండుం'. సముచ్చయమునకు-'భీమో ఽ ర్జునో ఽ పి.' ప్రశ్నకు-'అపి క్రియార్థం సులభం సమిత్కుశం.' శంకకు-'అప్యాగచ్ఛే ద్వ్యాఘ్రః'. సంభావనకు-'సముద్రమపి లంఘయేత్'.

**ఉపమాయం వికల్పే వా -**

వా-ఇది పోలికయందును, వికల్పమందును వర్తించును. ఉ. పోలికకు -'ఆశీవిషో వా సంక్రుద్ధః'. వికల్పమునకు - 'యవైర్వ్రీహిభిర్వా యజేత'.

**సామి త్వర్ధే జుగుప్సితే,**

సామి-ఇది సగమను నర్థమందును, నిందింపఁబడినదానియందును వర్తించును. ఉ. సగమునకు - సామి నిమీలితాక్షి', నిందింపఁబడినదానికి- 'సామ్యధ్యయన మనధ్యాయే.'

**అమా సహ సమీపే చ -**

అమా-ఇది కూడ నను నర్థమందును, సమీపమందును వర్తించును. ఉ. కూడ నను నర్థమునకు-'అమా సహ వసతో ఽస్యాం సూర్యాచంద్రమసా విత్యమావాస్యా'. సమీపమునకు-'అమా సమీపే భవః అమాత్యః.'

**కం వారిణి చ మూర్ధని.** 251

కం–ఇది నీళ్ళయందును, శిరస్సునందును, చకారమువలన సుఖము నందును వర్తించును. ఉ. నీళ్లకు – 'కంజం పద్మం'. శిరస్సునకు – 'కంధరా'. సుఖమునకు – 'కందర్పః'. "కం సుఖే వ్యోమ్ని" ఇతి శేషః.

**ఇవేత్థ మర్థయో రేవమ్ -**

ఏవం – ఇది పోలికయందును, ఈప్రకార మనుటయందును వర్తించును. ఉ. పోలికకు 'భాను రేవం మునిర్భాతి'. ఈ ప్రకారమనుటకు 'ఏవంవాదిని దేవర్షౌ'. "ఏవమంగీకృతావపి, నిర్ధారణే చ ప్రకృతపరామర్శోపదేశయో"రితి శేషః.

**నూనం తర్కే౽ర్థ నిశ్చయే,**

నూనం – ఇది ఊహయందును, అర్థనిశ్చయమందును, మఱియు నుత్ప్రేక్షయందును వర్తించును. ఉ. ఊహకు–'నూన మున్నమతి యజ్వానాంపతిః'. అర్థనిశ్చయమునకు–'క్షుద్రే౽పి నూనం శరణం ప్రపన్నే'. ఉత్ప్రేక్షకు – 'మదనస్యైషవో నూనం యువతీనాం దృశశ్శితాః'.

**తూష్ణీ మర్థే సుఖే జోషమ్ -**

'జోషం' ఇది మౌనమందును, సుఖమందును వర్తించును. ఉ. మౌనమునకు –'ఇతి జోష మవస్థితే మునౌ'. సుఖమునకు–'జోష మాసీత వర్షాసు'.

**కిం పృచ్ఛాయాం జుగుప్సనే.** 252

కిం–ఇది ప్రశ్నయందును, నిందయందును వర్తించును. ఉ. ప్రశ్నకు–'కిం గతో౽సి. 'నిందకు–'కిం రాజా యో న రక్షతి.' "కిమీషదతి శాయిన" ఇతి శేషః.

**నామ ప్రాకాశ్య సంభావ్య క్రోధోపగమ కుత్సనే,**

నామ – ఇది ఎఱిఁగింపఁదగిన యర్థమందును, ఈలాగే సంభవించు నను నర్థమందును, కోపమందును, అంగీకారమందును, నింగియందును వర్తించును. ఉ. ప్రాకాశ్యమునకు – 'హిమాలయో నామ నగాధిరాజః' సంభావ్యమునకు–'అపీహ సీతా నామ సంభవిష్యతి.' కోపమునకు–'ఆః కంసస్య భయం నామ గోపా న్నాపి సురద్విషః'. అంగీకారమునకు–'అస్తు నామ ధనీ కించిద్దదాతి' నిందకు – 'కో నామాయాం ప్రతపతి విభో ర్నిర్విశంకం సభాయాం'. "నామాళికే విస్మయే చా మంత్రణార్థే

ఉ థ చింతనే" ఇతి శేషః.

**అలం భూషణ పర్యాప్తిశక్తి వారణవాచకమ్.** 253

అలం – ఇది భూషణమందును, పూర్ణ మను నర్థమందును, సమర్థుఁడను నర్థమందును, చాలించు మను నర్థమందును వర్తించును. ఉ. భూషణమునకు –'అలంచకారాస్య వధూ రహస్కరః. పర్యాప్తికి– 'తస్యాలమేషా క్షుధితస్య తృప్త్యై.' శక్తికి–'అలం దశాస్యస్యవధాయ రాఘవ'ః. చాలించుమనుటకు – 'అలం వివాదేన యథా శ్రుతం త్వయా.'

**హుం వితర్కే పరిప్రశ్నే -**

హుం – ఇది ఊహయందును, ప్రశ్నయందును, మఱియు కోపమందును, భర్త్సించుటయందును వర్తించును. ఉ. ఊహకు – 'హుంజలం మృగతృష్ణా'. ప్రశ్నకు – 'హుం దేవదత్తో ఉ యం' కోపమునకు–'హుంహన్తి సహసా యుధి శత్రూ౯'. భర్త్సవమునకు – 'హుం నిర్లజ్జం'. "ఆమంత్రణే భర్త్సనే హు" మిత్య జయః.

**సమయాన్తిక మధ్యయోః.**

సమయా – ఇది సమీపమందును, మధ్యమందును వర్తించును. ఉ. సమీపమునకు – 'గంగాసమయా వారాణసీ'. మధ్యమునకు – 'సమయాశైల యోర్నదీః'.

**పున రప్రథమే భేదే -**

పునః – ఇది మఱియు నను నర్థమందును, విశేషమందును వర్తించును. ఉ. మఱియు నను నర్థమునకు–'పునర్బభాషే తురగస్య రక్షితా' విశేషమునకు– 'భ్రాతృషు పున ర్దీర్ఘో భవా౯'.

**ని ర్నిశ్చయ నిషేధయోః.** 254

నిః – ఇది నిశ్చయమందును, ప్రతిషేధమందును వర్తించును. ఉ. నిశ్చయమునకు – 'నిర్ణయః'. ప్రతిషేధమునకు–'నిర్దనః'. "సుఖప్రాప్తావభావే చ ప్రాదురర్థే పృథక్కృతౌ, భేదనిగ్రహకార్త్స్న్యపభోగాధిషని రీరిత" ఇతి శేషః.

**స్యాత్ప్రబన్ధే చిరాతీతే నికటాగామికే పురా,**

పురా–ఇది వాక్యరచనయందును, అనేకకాలమందును, పోయినకాలమందును, సమీపమందును, రాఁగలదానియందును వర్తించును.

ఉ. వాక్యరచనకు – 'పురాణం'. అనేకకాలమునకు–'పురాతనం'. అతీతమునకు–'పురాగతః'. సమీపమునకు – 'పురా గచ్ఛతి'. భవిష్యదర్థమునకు–'ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకులా వా.' కొందఱు నిరంతర పాఠమందును, పూర్వ మనేక కాలము గడచినదానియందును, ఆసన్న భవిష్యదర్థమందును వర్తించునని చెప్పుదురు. ఉ. నిరంతరపాఠమునకు–'ఉపాధ్యాయేన పురా ఉధీయతే స్మ.' పూర్వమనేక కాలము గడచినదానికి–'పురాతనం త్వాం పురుషం పురావిదః.' ఆసన్నభవిష్యదర్థమునకు – 'గచ్ఛ శీఘ్రం పురా దేవో వర్షతి.'

**ఊరర్యూరీ చోరరీ చ విస్తారే ఽ ఙ్గీకృతౌ త్రయమ్.** 255

ఊరరీ, ఊరీ. పా. ఉరీ, ఉరరీ. ఈ 3 ను విస్తారమందును. అంగీకారమందును వర్తించును. ఉ. విస్తారమునకు – ఊరరీకరోతి, ఊరీకరోతి, ఊరరీకరోతి. 'అర్థిషు స్వయ మురీకృతకామ్యః'. అంగీకారమునకు – 'ఆజ్ఞామురరీకృత్య యాతి'.

**స్వర్గే చ పరలోకే స్వః -**

స్వః – ఇది స్వర్గలోకమందును, పరలోకమందును, చకారమువలన జన్మాంతరమందును వర్తించును. ఉ. స్వర్గలోకమునకు – 'స్వర్ణద్యాంస్నాతి నారద'ః. జన్మాంతరమునకు – 'స్వర్గతస్య క్రియాః కుర్యాత్ పుత్రః పరమ భక్తితః'. 'స్వర్యాతస్య హ్యపుత్రస్య పత్నీ తద్భాగమర్హతి'. మరియు, సుఖమందును, ఆకాశమందును వర్తించును. 'స్వ రాకాశే శర్మణి చ' ఇతి శేషః.

**వార్తా సంభావ్యయోః కిల,**

కిల–ఈపదము సంప్రదాయ (లోవాడుక) మందును, ఇది సంభవించునను నర్థమందును, అస్యతమందును వర్తించును. ఉ. సంప్రదాయమునకు – 'జఘాన కంసం కిల వాసుదేవః'. సంభవించు నను నర్థమునకు – 'అర్జునః కిల విజిష్యతే కురూన్'. అసత్యమునకు – 'గోత్రస్ఖలితం కిలాశ్రితం'. 'అళికే ఽపి కిల స్మృతః, న్యక్కారే ఽనుచితే హేతా' ఏతి శేషః.

**నిషేధ వాక్యాలంకార జిజ్ఞా సానునయే ఖలు.** 256

ఖలు – ఇది ప్రతిషేధమందును, వాక్యాలంకారమందును, ఎఱుంగ

నిచ్ఛయించుటయందును, ఊరడించుటయందును వర్తించును. ప్రతిషేధమునకు – 'నిర్ధారితే ఽర్థే లేఖ్యేన ఖలూక్త్వా ఖలు వాచికం'. వాక్యాలంకారమునకు 'అథ ఖలు భగవాన్'. ఎఱుఁగ నిచ్ఛయించుటకు. 'కిం ఖల్వధీతే పుత్రః.' ఊరడించుటకు– 'న ఖలు ముగ్ధేసాహసం కార్యమేతత్.'

**సమీపోభయత శ్శీఘ్ర సాకల్యాభి ముఖే ఽభితః,**

అభితః – ఇది సమీపమందును, ఇరుపార్శ్వములయందును, అంతయు నను నర్థమందును, ఎదురుగా నను నర్థమందును వర్తించును. ఉ. సమీపమునకు – 'వారాణసీ మభితో భాగీరథీ'. ఇరుపార్శ్వములకు – 'భేజే ఽభితః పాతుకసిద్ధిసింధోః'. శీఘ్రమునకు – 'అభిత శ్శత్రు రాయాతి' అంతయు నను నర్థమునకు – 'భుఙ్క్తేన్న మభితో ఽతిథిం'. ఎదురుగా ననుటకు – 'అభితో హింసకో దంతీ మామేవ పరిధావతి'.

**నామ ప్రాకాశ్యయోః ప్రాదుః -**

ప్రాదుః – ఇది నామధేయమందును, ప్రకాశించుదానియందును వర్తించును. ఉ. నామధేయమునకు – 'విష్ణోర్దశ ప్రాదుర్భావా.' కొందఱు 'నామ' అను దిక్కున 'జన్మ' అని పాఠమును జెప్పుదురు. అప్పుడు ఉ. 'ప్రాదుర్భూతాని సౌధేతృణాని'. ప్రకాశించుదానికి – 'ప్రాదురాసీద్వసుంధరా.'

**మిథో ఽన్యోన్యం రహస్యపి.** 257

మిథః – ఇది తమలోఁ దా మను నర్థమందును, ఏకాంతమందును వర్తించును. ఉ. తమలోఁ దా మను నర్థమునకు– 'వాసిష్ఠ కౌండిన్య మైత్రావరుణానా మిథో న వివాహ్యాః'. ఏకాంతమునకు – 'మిథస్త్వదాభాషణ లోలుపం మనః', 'మిథః కృతే మన్మథ ఏవ సాక్షీ'.

**తిరో ఽన్తర్ధౌ తిర్యగర్థే -**

తిరః–ఇది కప్పుటయందును, అడ్డముగా నను నర్థమందును వర్తించును. ఉ. కప్పుటకు–'కృష్ణ మేఘ స్తిరోదధే'. అడ్డముగా ననుటకు–'గతంతిరశ్చీన మనూరుసారథేః'.

**హా విషాద శు గా ర్తిషు,**

హా – ఇది వ్యథపడుటయందును, శోకమునందును, పీడయందును వర్తించును. ఉ. విషాదమునకు – 'పుణ్యాంతఃపురమేవ హా ప్రవిశతి

క్రుద్ధో ముని ర్భార్గవః'. శోకమునకు–'హా ప్రియే జనకరాజపుత్రి'. పీడకు–'హాహతో ఽస్మి', 'విస్మయే చ జుగుప్సాయాం హా మత' ఇతి శేషః.

**అహ హే త్యద్భుతే ఖేదే -**

అహహ – పా, అహహో – ఇది ఆశ్చర్యమునందును, దుఃఖపడుట యందును వర్తించును. ఉ. ఆశ్చర్యమునకు – 'అహహ మహతాం నిస్సీమాన శ్చరిత్ర విభూతయః'. ఖేదమునకు – 'అహహ కష్ట మపండితతా విధేః'. 'అహహో భిక్షమాణో ఽపి క్షుధా సంపీడ్యతే జనః' అని.

**హి హేతా వవధారణే.** 258

హి – ఇది కారణమందును, అవధారణమందును వర్తించును. ఉ. హేతువునకు–'జానా మ్యగ్ని రిహో స్తీతి మహా౯ ధూమో హి దృశ్యతే'. అవధారణమునకు – 'చంద్రోహి శీతః'. 'పురుషోక్తిః కథం తస్మి౯ బ్రూహిత్వం హి తపోధన'. 'స్ఫూటార్థే హి వినిశ్చిత్యాం పాదపూరే ప్రకీర్తిత' ఇతి శేషః.



# అవ్యయ వర్గము

**చిరాయ చిరరాత్రాయ చిరస్యాద్యా శ్చిరార్థకాః,**

చిరాయ, చిరరాత్రాయ, చిరస్య ఈ 3 అవ్యయములును, ఆద్యశబ్దమువలన 'చిరం, చిరేణ, చిరాత్' అనునివి మొదలైనవియును బహుకాల మను నర్థమందు వర్తించును. ఉ. 'చిరాయ సంతర్ప్య సమిద్భిరగ్నిం' 'చిరరాత్రాయ సంచితం' 'చిరస్య దృష్టేవ మృతోత్థితేవ' 'చిరంన సహతే స్థాతుం పరేభ్యో భేదశంకయా' 'చిరేణ నాభిం ప్రథమోదబింబవః' 'చిరా త్సుత స్పర్శరసజ్ఞతాం యయౌ'.

**ముహుః పునఃపున శ్శశ్వ దభీక్ష్ణ మసకృ త్సమాః.** 1

ముహుః, పునఃపునః, శశ్వత్, అభీక్ష్ణం, అసకృత్ ఈ ౫ ను మాటిమాటికి నను నర్థమందు వర్తించును. ఉ. 'అవేక్షమాణం మహతీం ముహుర్ముహుః', 'పునః పున స్సూతనిషిద్ధచాపలం', 'వన్యవృత్తి గిమాంశశ్వత్', 'అభీక్ష్ణ మాస్ఫాలయతీవ కుంభం', 'అసకృదనవ గీతం గీతమాకర్ణయంతః', 'వారంవారం శశ్వదర్థే వారంవారేణ చేష్యత' ఇతి శేషః.





**స్రా గ్ఘడి త్యఞ్జ సాహ్నాయ ద్రాఙ్మఙ్క్షు సపది ద్రుతే,**

స్రాక్, ఝడితి, పా. ఝటితి, అంజసా, అహ్నాయ, ద్రాక్, మంక్షు, సపది ఈ ౭ ను శీఘ్రముగా నను నర్థమందు వర్తించును. ఉ. 'స్రాగ్వయో యాతి దేహినాం', 'సుతశత మత్యంత దుర్భరం ఝడితి', 'అంజసాయాతి తురగః', 'అహ్నాయ తావ దరుణేన తమో నిరస్తం', 'ద్రాగ్భవిష్యతి సుఖం తవ ప్రియే', 'మంక్షూదపాది పరితః పటలై రళీనాం', 'వచసస్తస్య సపదిక్రియా కేవల ముత్తరం'. టీ. స. ఝగితీతి కంఠ్యవర్గ్య తృతీయ మధ్యాక్షరో ఽ ప్యస్తి. తథాచ గణరత్న మహోదధౌ ___ అహ్నాయ మంక్షు ఝగితి ఝటితి ద్రాక్ స్రాక్ శైఘ్ర్య ఇతి.

**బలవ త్సుష్ఠు కిముత స్వ త్యతీవ చ నిర్భరే.** 2

బలవత్, సుషు, కిముత, సు, అతి, అతీవ ఈ ౬ ను మిక్కిలి యను నర్థమందు వర్తించును. ఉ. 'పునర్వశిత్వా ద్బలవ న్నిగృహ్య', 'సుష్ఠు పీతం మయా శృతం', 'కిముతాద్య కృతం కార్యం', 'సువృష్టి స్సస్యవర్ధనీ', 'అతివృష్టిరనావృష్టిః', 'అతీవ శోభతే రాజా'.

**పృథ గ్వి నాన్తరే ణర్తే హిరుజ్నానా చ వర్జనే,**

పృథక్, వినా, అంతరేణ, ఋతే, హిరుక్, నానా ఈ ౬ ను పాయుటయందు వర్తించును. ఉ. 'కించిద్దత్వా పృథక్క్రియా, 'క్షనమపుత్యత్సహ తే న మాం వినా', 'అంతరేణ మతం నాస్తి సుఖం సంసారిణాం భువి, 'ఋతే రవేః క్షాళయితుం క్షమేత కః', 'హిరుక్కర్మణామోక్షః', 'నానా విష్ణుం మోక్షదో నాస్తి దేవః'.

**యత్త ద్యత స్తతో హేత్వౌ -**

యత్, తత్, యతః, తతః ఈ ౪ ను కారణమందు వర్తించును. ఉ. 'యద్విద్యాసు ప్రగల్భో ఽ సి తత్సర్వైరపి పూజ్యసే', 'యతో గంగాభసి స్నాత స్తతో నిష్కల్మషో నరః'.

**అసాకల్యే తు చి చ్చన.** 3

చిత్, చన ఈ ౨ ను కొంత యను నర్థమందు వర్తించును. ఉ. 'కరోతి కించి దభ్యాస్యాత్', 'అపాత్రే కుశలై ర్దేయం న కించన ధనం సదా.'

**కదాచి జ్జాతు -**

కదాచిత్, జాతు ఈ ౨ ను ఒకానొకప్పు డను నర్థమందు వర్తించును. ఉ. 'కదాచి దాసన్నసఖీముఖేన సా', 'నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి'.

**సార్ధం తు సాకం సత్రా సమం సహ,**

సార్ధం, సాకం, సత్రా, సమం, సహ ఈ ౫ ను కూడా నను నర్థమందు వర్తించును. ఉ. 'సార్థముద్ధవసీరిభ్యాం', 'సాకం శక్తిధరేణ తత్రభవతో దేవా ధ్భవానీపతేః', 'సత్రాకళత్రేణ సుఖం సమశ్నుతే', 'సమంవధూభిర్వల భీర్యువానః', 'నిశ్వాసధూమం సహ రత్నభాభిః'.

**ఆనుకూల్యార్థకం ప్రాధ్వమ్ -**

ప్రాధ్వ–ఇది అనుకూలత యను నర్థమందు వర్తించును. ఉ. 'సవ్యేతరం ప్రాధ్వ మితః ప్రయుఙ్క్ష్వ'. టీ. స. అత్ర 'ప్రాధ్వం బంధన' ఇతి సూత్రేణ బంధన హేతుక మానుకూల్య మభిప్రేతం. తతశ్చసవ్యేతరం భుజమంగులీ బంధనేనాను కూల్యం కృత్వా ప్రయుఙ్క్ష్వ ఇత్యర్థః.

**వ్యర్థకే తు వృథా ముధా.** 4

వృథా, ముధా ఈ ౨ ను వ్యర్థ మను నర్థమందు వర్తించును. ఉ. 'ప్రయుక్తమవ్యస్త్రమితో వృథా స్యాత్', 'తత్ర భ్రమత్యేవ ముధా షడంఘ్రిః'.

**ఆహో ఉతాహో కిముత వికల్పే కిం కి మూత చ,**

అహో, ఉతాహో, కిముత, కిం, కిము, ఉత ఈ ౬ ను వికల్పమందు వర్తించును. ఉ.'స్థాణు రయ మాహో పురుషః'. పా. అహో. "ఈశ్వరే ఉ_వ్యధికే ఉ_పి స్యా ద్వికల్పే విస్మయేప్యహో" అని రుద్రుఁడు. 'ఉతాహో స్విద్భవో రాజా నలః పరపురంజయః', 'కిము తత్వం శివో బ్రహ్మ', 'స్థాణు రయం కింపురుషః', 'కిముతే కార్యముతాన్యదీయ కార్యం'.

**తు హి చ స్మ హవై పాదపూరణే -**

తు, హి, చ, స్మ, హ, వై ఈ ౬ ను పాదపూరణమందు వర్తించును. ఉ. 'రామస్తు లక్ష్మణం ప్రాహ', 'అహం హి యాస్యే నగరం', 'స చ ప్రాహ చ రాజానం', 'మయా స్మ భుక్తం సహసా', 'రామం హప్రాహ లక్ష్మణః', 'తేన వై రాక్షసో హతః.'

**పూజనే స్వతీ.** 5

సు, అతి ఈ ౨ ను పూజార్థమందు వర్తించును. ఉ. 'సుపంథా అతి పంథాశ్చ'.

**ది వాహ్నాతి -**

దివా–ఇది పగటియం దను నర్థమందు వర్తించును. ఉ. 'కేచిద్దివా తథా రాత్రౌ ప్రాణిన స్తుల్యదృష్టయః'.

**అథ దోషా చ నక్తం చ రజనా వితి,**

దోషా, నక్తం ఈ ౨ ను రాత్రియం దను నర్థమందు వర్తించును. ఉ. 'చోరా దోషా యయుః పథి', 'నక్త మాపానుభూమిషు'.

**తిర్యగర్థే సాచి తిరో ఒ పి -**

సాచి, తిరః ఈ ౨ ను అడ్డముగా నను నర్థమందు వర్తించును. ఉ. 'సాచి లోచనయుగం నమయంతీ', 'తిరో ఒంచతి'.

**అథ సంబోధనార్థకాః.** 6

**స్యుః ప్యా ట్పా డజ్గ హే హై భోః -**

ప్యాట్, పాట్, అంగ, హ, మై, భోః, పా. భో ఈ ౬ ను సంబోధనమునందు వర్తించును. ఉ. 'ప్యాట్పుత్ర పఠ సర్వదా', 'పాట్ప్రియే హ్యేహి మందిరం'. 'ఫాట్సఖే ఫలితశ్చూతః', 'శ్రూయతామంగవామపి', 'హే వటో భైక్షమాహర', 'హైవృక్షకింకంపసే', 'భోస్సప్తద్వీపవర్తినో రాజానశ్చేతయధ్వం', 'భో రావణోత్తిష్ఠ మమాగ్రతోయుధి'.

**సమయా నికషా హిరుక్,**

సమయా, నికషా, హిరుక్ ఈ 3 ను సమీపార్థమందు వర్తించును. ఉ. 'సమయా పర్వతం నదీ', 'విలంఘ్య లంకాం నికషా హనిష్యతి', 'పర్వతస్య హిరు జ్నదీ'. కొందఱు 'సమయాంతిక మధ్యయోః', 'నికషాత్వంతికే మధ్యే రక్షోవాచి త్వనవ్యయం' అని విశ్వప్రకాశమందు మధ్యవాచకముగాఁ జెప్పఁబడినది గనుకను, సమీపవాచియే యైనచో ముందుఁ జెప్పఁగల 'నికషాంతికే' అను స్థలమందు పౌనరుక్త్యమగును గనుకను ఈ 3 ను మధ్యమునకు పేళ్లందురు.

**అతర్కితే తు సహసా -**

సహసా – ఇది విచారించక యను నర్థమందు వర్తించును. 'సహసావిదధీత న క్రియాం'.

**స్యా త్పురః పురతో ఽ గ్రతః** 7

పురః, పురతః, అగ్రతః ఈ 3 ను ముందర నను నర్థమందు వర్తించును. 'పురస్సఖీనా మమిమీత లోచనే', 'నాసీరధూళిధవళాః పురతః ప్రయాంతి', 'ప్రత్యర్థినోగ్రతో లేఖ్యం'.

**స్వాహా దేవహవిర్దానే శ్రౌష డ్వౌష ద్వష ట్స్వధా,**

స్వాహా, శ్రౌషట్, వౌషట్, వషట్, స్వధా అను నీ ౫ ను దేవతలకు హవిస్సు నిచ్చుటయందు వర్తించును. 'అగ్నయే స్వాహా', 'అస్తుశ్రౌషట్, 'శిఖాయై వౌషట్', 'వషట్కరోతి', 'స్వధాపితృభ్యః'.

**కించి దీష న్మనా గల్పే -**

కించిత్, ఈషత్, మనాక్ ఈ3 ను ఇంచుకంత యను నర్థమందు వర్తించును. 'కించిత్కుంచిత మూర్ధజః', 'ఈషదుష్ణం పయః పిబ', 'మనాగనభ్యావృత్త్యా వా'.

**ప్రే త్యాముత్ర భవాన్తరే.** 8

ప్రేత్య, అముత్ర ఈ ౨ ను జన్మాంతరమునందు వర్తించును. 'అన్యో ధనం ప్రేత్య గతస్య భుఙ్క్తే', 'ఇహ వాముత్రవా కేషాం భవా నత్ర ప్రయోజనం'.

**వ ద్వా యథా తథే వైవం సామ్యే -**

వత్, వా, యథా, తథా, ఇవ, ఏవం ఈ ౬ ను పోలికయందు వర్తించును. ఉ. 'సోమవత్ప్రియ దర్శనః', 'పుష్పేక్షణైర్లంభితలోచకైర్వా', 'తస్యార్తస్య యథౌషధం', 'యథాచైత్రస్తథా మైత్రః', 'ఇందుః క్షీరనిధావివ', 'అగ్ని రేవం ద్విజో భస్మసాత్కుర్యా దవమానితః'.

**అహో హీ చ విస్మయే,**

అహో, హీ ఈ ౨ ను ఆశ్చర్యమందు వర్తించును. ఉ. 'అహో మే సౌభాగ్యం మమ చ భవభూతేశ్చ ఫణితౌ', 'హత విధిలసితానాం హీ విచిత్రో విపాకః''.

**మౌనే తు తూష్ణీం తూష్ణీకామ్ -**

తూష్ణీం, తూష్ణీకాం ఈ ౨ ను మౌనమందు వర్తించును. ఉ. 'మునిస్తూష్ణీమాస్తే', 'జపన్నాస్తే మునిర్దేవీం తూష్ణీకాం జలమధ్యగః'. తూష్ణీం శబ్దము మీఁద అజ్ఞాతాద్యర్థమందు కాంప్రత్యయము వచ్చినం

దున తూష్ణీకాం శబ్దము అజ్ఞాతాద్యర్థ విశేషవిషయమైన మౌనమును జెప్పును గావున తూష్ణీం శబ్దముకంటె భేదము గలదైనను మౌనమాత్ర సామ్యముచేత పర్యాయముగాఁ జెప్పినాఁడు.

**సద్య స్సపది త త్క్షణే.** 9

సద్యః, సపది ఈ ౨ ను అప్పు డను నర్థమందు వర్తించును. ఉ. 'సద్యః పతతి మాంసేన', 'సపది ప్రదహ త్యుతో ఽ గ్నిః'.

**దిష్ట్యా సముపజోషం చే త్యానన్దే -**

దిష్ట్యా, సముపజోషం ఈ ౨ ను సంతోషమందు వర్తించును. ఉ. 'దిష్ట్యా త్వమసి మేధావీ', 'సముపజోషం భవాౝ జయతి'. కొందఱు 'దిష్ట్యా' 'శమ్' 'ఉపజోషం' అని మూఁడనియును, 'శం' అని తాలవ్యమనియును జెప్పుదురు. ఉ. 'శంకర శ్శంకరోతు నః', 'ఉపజోష మిహాస్మహే', 'సుఖే దిష్ట్యోపజోషం శం' అని వైజయంతి.

**అథాన్తరే ఽ న్తరా.**

**అన్తరేణ చ మధ్యే స్యుః -**

అంతరే, అంతరా, అంతరేణ ఈ 3 ను నడుమ ననుటయందు వర్తించును. ఉ. 'ఆవయో రంతరే జాతాః', 'అంతరాత్వాం చ మాం చ కమండలుః', 'మృణాళసూత్రామల మంతరేణ స్థిత శ్చలచ్చామరయోర్ద్వయం సః'.

**ప్రసహ్య తు హఠార్థకమ్.** 10

ప్రసహ్య – ఇది బలాత్కారమందు వర్తించును. ఉ. 'ప్రసహ్య విత్తాని హరంతి చోరాః'.

**యుక్తే ద్వే సాంప్రతం స్థానే -**

సాంప్రతం, స్థానే ఈ ౨ ను తగు నను నర్థమందు వర్తించును. ఉ. 'స్వయం ఛేత్తు మసాంప్రతం', 'సంప్రత్యసాంప్రతం వక్తు ముక్తే ముసలపాణినా', 'స్థానే భవా నేకనరాధిప స్సౝ'.

**అభీక్ష్ణం శశ్వ దనారతే,**

అభీక్ష్ణం, శశ్వత్ ఈ ౨ ను ఎల్లప్పుడు నను నర్థమందు వర్తించును. ఉ. 'అభీక్ష్ణ ముష్ణైరపి తస్య సోష్మణః', 'శశ్వద్యాతి'.

**అభావే న మ్య నో నా ఽ పి -**

నహి, అ, నో, న, ఈ ౪ ను లేదనుటయందును, కాదనుటయందును వర్తించును. ఉ. 'నహి స్వాత్మారామం విషయ మృగతృష్ణా భ్రమయతి', 'అవిప్ర ఇవ భాషసే', 'నో చక్రీకిం కులాలః', 'నమే కించి న్న దహ్యతే' అపిశబ్దమువలన 'అ' అను నవ్యయమును అభావమునందు వర్తించును. "నహినో అన మా మాన్మ ప్రతిషేధే ప్రకీర్తితాః" అని త్రికాండశేషము. 'అనోపమా తే బుద్ధిః' అని శృంగారప్రకాశిక.

**మాస్మ మా ఽలం చ వారణే.** 11

మాస్మ, మా, అలం ఈ 3 ను వద్దనుటయందు వర్తించును. ఉ. 'సౌధోత్సంగ ప్రణయవిముఖో మా స్మ భూరుజ్జయిన్యాః', 'మాభూదాశ్రమపీ డేతి', 'అలం మహీపాల తవ శ్రమేణ.'

**పక్షాంతరే చే ద్యది చ -**

చేత్, యది ఈ ౨ ను ఇటువలెనైన అను నర్థమందు వర్తించును. ఉ. 'సత్యం చేత్తపసా చ కిం', 'శుచిమనో యద్యస్తి తీర్థేన కిం'.

**తత్త్వే త్వ ద్ధా ఽ ఞ్జసా ద్వయమ్,**

అద్ధా, అఞ్జసా ఈ ౨ ను సత్యమనునర్థమందు వర్తించును. ఉ. 'ఆరాధితో ద్ధామను రప్సరోభిః', 'అంజసేతి రురుదుః కచగ్రహైః'.

**ప్రకాశే ప్రాదు రావి స్స్యాత్ -**

ప్రాదుః, ఆవిః ఈ ౨ ను సత్య మను నర్థమందు వర్తించును. ఉ. 'ప్రాదు రాసీద్వసుంధరా', 'ఆవిర్బభూవ కుశగర్భముఖం మృగాణాం యూథం.'

**ఓ మేవం పరమం మతే.** 12

ఓం, ఏవం, పరమం ఈ 3 ను అంగీకారమందు వర్తించును. ఉ. 'ఓ మిత్యుక్తవతోఽథశార్ఙిణ ఇతి', ఏవం యదార్థ భగవన్ 'తతః పరమ మిత్యుక్త్వా'.

**సమన్తత స్తు పరిత స్సర్వతో విష్వ గిత్యపి,**

సమంతతః, పరితః, సర్వతః, విష్వక్ ఈ ౪ ను అంతటనను నర్థమందు వర్తించును. 'ఇత్యపి' అన్నందువలన 'సమంతాత్' అను నవ్యయమును వర్తించును. 'సమంతతో వర్షతి మేఘసంఘః', 'ఆయాంతి పరితః శ్రియః', 'త్వం సర్వతోగామి చ సాధకంచ', 'విష్వక్తటేషు

పతతి స్ఫూటమంతరిక్షం', 'సమంతా ద్భవ స్సామంత'.

**అకామానుమతౌ కామమ్ -**

కామం – ఇది మనస్సురాక యంగీకరించుటయందు వర్తించును. ఉ. 'కామం నృపాస్సంతుసహస్రశో ఒన్యే'. కొందఱు 'ఆకామానుమతౌ' అని దీర్ఘాదిగాఁ జెప్పి, మిక్కిలి యంగీకరించుటయందు వర్తించునని చెప్పుదురు. "కామం కామాభ్యనుజ్ఞాయాం" అని త్రికాండశేషము.

**అసూయోపగమే ఒస్తు చ.** 13

అస్తు – ఇది కోపముచేత నంగీకరించుటయందు వర్తించును. చకారము వలన 'భవతు' అనునదియును. ఉ. 'జాన న్నేవ దశాననో ఒపహరతే మత్ప్రేయసీ మస్తు వా', 'భవతి భవ త్వసుహృజ్జన స్స కామః'.

**నను చ స్యా ద్విరోధోక్తౌ -**

ననుచ – ఇది ఒకడు పలికినందుకు విరుద్ధముగాఁ బలుకుటయందు వర్తించును. ఉ. 'ననుచాత్ర తుగాగమః కథం భవతి'.

**కచ్చి త్కామ ప్రవేదనే,**

కచ్చిత్ – ఇది ఇష్టార్థ ప్రశ్నయందు వర్తించును. ఉ. 'కచ్చి జ్జీవతి మే మాతా'.

**నిష్షమం దుష్షమం గర్హ్యే -**

నిష్షమం, దుష్షమం ఈ ౨ ను నిందింపఁదగినదానియందు వర్తించును. ఉ. 'నిష్షమం వక్తి మూర్ఖః', 'దుష్షమం వర్తతే వధూః'.

**యథాస్వంతు యథాయథమ్.** 14

యథాస్వం, యథాయథం ఈ ౨ ను తమతమ వస్తువులను నర్థమందును, తాము తామను నర్థమందును వర్తించును. ఉ. 'యథాస్వమాశ్రమైశ్చక్రే', 'యథాయథం పలాయంతః'.

**మృషా మిథ్యా చ వితథే -**

మృషా, మిథ్యా ఈ ౨ ను అసత్యమందు వర్తించును. ఉ 'ఉచ్ఛ్రాయ సౌందర్యగుణా మృషోద్యాః', 'మిథ్యావాదిని దూతిబాంధవ జనస్యాజ్ఞాతపీడాగమే'.

**యథార్థంతు యథాతథమ్,**

యథార్థం, యథాతథం ఈ ౨ ను సత్యమందు వర్తించును.

ఉ. 'యథార్థ ముక్తవా న్నాన్యత్', 'గురుర్వక్తి యథాతథం'.

**స్యు రేవం తు పున ర్వై వే త్యవధారణవాచకాః.** 15

ఏవం, తు, పునః, వా, ఏవ ఈ ౫ ను ఇదియ యను నిశ్చయమందు వర్తించును. ఉ. 'ఏవ మేత ద్యథాప్రాహ విష్ణు స్తు జగతాంపతిః', 'రావణంహి దురాత్మానం భవిభిర్రాఘువః పునః', 'వ్యాసో వా సర్వధర్మజ్ఞః', 'త్వమేవ సాక్షాత్కరణీయ ఇత్యతః'. కొందఱు 'స్యు రేవం తు పునర్వైచ' అని పాఠమును జెప్పి, 'ఏవం, తు, పునః, వై, చ' అనునీ ౫ ను అవధారణమందు వర్తించునని చెప్పుదురు.

**ప్రాగతీతార్థకమ్ -**

ప్రాక్ ___ ఇది పోయినకాలమందు వర్తించును. ఉ. 'ప్రవేదిరే ప్రాక్తన జన్మ విద్యాః.'

**నూన మవశ్యం నిశ్చయే ద్వయమ్,**

నూనం, అవశ్యం ఈ ౨ ను నిశ్చయమందు వర్తించును. 'నూనం హంతాస్మిరావణం', 'అవశ్యం యాతారశ్చిరతర ముషిత్వాపి విషయాః'.

**సంవ ద్వర్షే -**

సంవత్ ___ ఇది సంవత్సరమందు వర్తించును. ఉ. 'రామః పంచదశే సంవ దయోధ్యాం ప్రవివేశహ'.

**అవరే త్వర్వాక్ -**

అర్వాక్ ___ ఇది మేరగాఁ జెప్పు వస్తువునకు క్రిందటి దైనకాలమందును, దేశమందును వర్తించును. ఉ. 'యామా దర్వా జ్న భుంజీత', 'గ్రామా దర్వా జ్నదీ'.

**ఆమేవమ్ -**

ఆమ్, ఏవం ఈ ౨ ను ఒకఁడు చెప్పినదాని నంగీకరించుటయందు వర్తించును. ఉ. 'ఆం కరోమి తవప్రియం', 'ఏవం కుర్మః'. కొందఱు 'ఆమైవం' అని చెప్పి, 'ఆమ' అను నవ్యయము జ్ఞాననిశ్చయమందు వర్తించునని చెప్పుదురు. "ఆమ జ్ఞానవినిశ్చయే" అని వోపాలితుఁడు.

**స్వయ మాత్మనా.** 16

స్వయమ్ ___ ఇది తనచేత నను నర్థమందు వర్తించును. 'స్వయంకృత ప్రసాదస్య'.

**అల్పే నీచైః -**

నీచైః ___ ఇది కొంచెము అను నర్థమందు వర్తించును. ఉ. 'తథాపినీచై ర్వినయో దదృశ్యత'.

**మహ త్యుచ్చైః-**

ఉచ్చైః ___ ఇది అధికార్థమందు వర్తించును. ఉ. 'శృంగముచ్చైర్గిరే రిదమ్'.

**ప్రాయో భూమ్ని -**

ప్రాయః ___ ఇది తఱుచుగా నను నర్థమందు వర్తించును. 'ప్రాయోనవవధూః కాంతం.'

**అద్రుతే శనైః,**

శనైః ___ ఇది మెల్లగానను నర్థమందు వర్తించును. ఉ. 'ఆలింగతి శనై శ్శనైః'.

**సనా నిత్యే -**

సనా ___ ఇది నిత్య మను నర్థమందు వర్తించును. ఉ. 'సనాతనః'.

**బహిర్బాహ్యే -**

బహిః ___ ఇది వెలపట నను నర్థమందు వర్తించును. ఉ. 'దాసీ కుంభం బహిర్గ్రామాత్'.

**స్మాఽతీతే -**

స్మ ___ ఇది కడచె నను నర్థమందు వర్తించును. ఉ. 'సేవతేస్మ శయనం పరాఙ్ముఖీ'.

**అస్త మదర్శనే.** 17

అస్తమ్ ___ ఇది కానరాకుండుటయందు వర్తించును. టీ. స. అదర్శనం దర్శనాభావః నాశప్రయుక్తః తిరోభావప్రయుక్తో వా. తత్ర ఉభయత్ర మాంత మస్త మిత్యవ్యయం వర్తతే. యథా – 'అస్తంగతో రావణః', అస్తంగతో భాస్కర' ఇతి.

**అస్తి సత్వే -**

అస్తి – ఇది కలదను నర్థమందు వర్తించును. ఉ. 'అస్తిక్షీరా గౌః'.

**రుషోక్తావు -**

ఉ – ఇది కోపముచేత పలుకుటయందు వర్తించును. ఉ. 'ఉ ఆగత

శ్వశ్రుః' పా. రుషోక్తౌ హుం. 'వృద్ధా స్తేన విచారణీయచరితా స్తిష్ఠంతు హుం వర్తతాం'.

**ఊం ప్రశ్నే -**

ఊం–ఇది ప్రశ్నయందు వర్తించును. 'ఆగత శ్వశ్రురూం'. టీ. స. పరోదీరితం మనసి కృత్య ప్రకృత ప్రసంగ విశేషజిజ్ఞాసా విష్కరణ మిహప్రశ్న శబ్దేన వివక్షితం, తత్ర ఊ మిత్యవ్యయం వర్తతే.

**అనునయే త్వయి,**

అయి ఇది ఊరడించుటయందు వర్తించును. ఉ. 'అయిముగ్ధే'.

**తర్కే ను స్యాత్ -**

ను – ఇది ఊహయందు వర్తించును. 'అస్తశైలగహనం ను వివస్వా నావివేశ జలధిం ను మహీం ను'. కొందఱు 'తర్కేతుస్యాత్' అను పాఠమందు 'స్యాత్' అను నవ్యయము ఊహయందు వర్తించును అందురు. ఉ. 'స్యా త్కించి న్నోపపద్యతే'.

**ఉషా రాత్రే రవసానే -**

ఉషా – ఇది ప్రాతఃకాలమందు వర్తించును. ఉ. 'ఉషా జనాః ప్రతి బుధ్యంతే', 'ఉషా తమో వాయు రుపైతి మందం' పా. ఉషః. 'ఉషా స్యా ద్రజనీశేషే ఉష ఇత్యపి దృశ్యతే' అని రభసుఁడు.

**నమో నతౌ.** 18

నమః – ఇది మ్రొక్కుటయందు వర్తించును. ఉ. 'నమోవిష్ణవే'.

**పునరర్థే ఽఙ్గ –**

అంగ – ఇది మఱియు నను నర్థమందు వర్తించును. ఉ. 'మూర్ఖస్తు నావమంతవ్యః కి మంగ విద్వాన్'. టీ. స. అత్ర పునరర్థో భేదరూపః.

**నిన్దాయాం దుష్ఠు -**

దుష్ఠు – ఇది చెడ్డది యను నర్థమందు వర్తించును. 'దుష్ఠువృత్తి ర్దుర్జన స్స్యాత్'.

**సుష్ఠు ప్రశంసనే,**

సుష్ఠు – ఇది మంచిది యను నర్థమందు వర్తించును. 'సుష్ఠు భుక్తం మయా గృహే.'

**ఆ మానుగుణ్యే -**

ఆమ – ఇది ఆనుకూల్యార్థమందు వర్తించును. ఉ. 'ఆమ వర్తతే'.

**స్మరణే ౽ యే -**

అయే – ఇది స్మరణమందు వర్తించును. ఉ. 'అయే పూర్వం కృతం మయా'.

**ఫ డ్విఘ్ననివారణే.** 19

ఫట్ – ఇది విఘ్నమును బోఁగొట్టుటయందు వర్తించును. ఉ. 'అస్త్రాయఫట్'.

**అఙ్గీకృతౌ స్యా దథకిమ్ -**

అథకిం – ఇది అంగీకారమందు వర్తించును. 'దేవదత్త కిం భోక్ష్యసిః అథకిం'.

**హీనసంబోధనే తు రే,**

రే – ఇది హీనుని బిలుచుటయందు వర్తించును. ఉ. 'రేరే పాప మామాంతికా దపసర'. టీ. స. కేచిత్తు 'హీనసంబోధనే త్వరే'. ఇతి పఠిత్వా 'అరే' ఇతి స్వరాదిద్వ్యక్షరంవదన్తి. తత్ర యథా ___ 'రేరే వానర కో భవా నహ మరే త్వత్స్వామహన్తా ౽హవే ఇతి', 'ఆమానుగుణ్యే' అనునది మొదలుకొని యీ ౧ శ్లోకము ప్రక్షిప్తమని కొందఱు.

**సాయం సాయే -**

సాయం – ఇది సాయంకాలమందు వర్తించును. ఉ. 'సాయంతన మల్లికాసు'.

**ప్రగే ప్రాతః ప్రభాతే -**

ప్రగే, ప్రాతః ఈ ౨ ను ప్రాతఃకాలమందు వర్తించును. ఉ. 'ప్రగే నృపాణా మథ తోరణా ద్బహిః', 'ప్రాత స్సంధ్యా ముపాసీత'.

**నిక షా న్తికే.** 20

నికషా – ఇది సమీపమందు వర్తించును. ఉ. 'విలంఘ్య లంకాంనికషా హనిష్యతి.'

**పరుత్పరా ర్యైషమో ౽ బ్దే పూర్వే పూర్వతరే యది,**

పరుత్, పరారి, ఐషమః ఈ 3 ను వరుసగా పోయినయేఁటి యందును, అంతకును మున్నేఁటియందును, నడచునట్టి యేఁటియందును వర్తించును. ఉ.'పరారి సంచితం విత్తం పరు న్నష్ట మభోగతః, విష

మశ్చీయతే యత్నా త్తతః కిం వా భవిష్యతి'.

**అ ద్యా త్రాహ్ని -**

అద్య – ఇది జరుగుచున్న పగటియందును, వర్తమానకాలమాత్రము నందును వర్తించును. ఉ. 'నరలోకే ఽద్య దుర్లభః.'

**అత పూర్వే ఽ హ్నీ త్యాదౌ పూర్వోత్తరాపరాత్.** 21

**తథా ఽధరాన్యాన్యతరేతరా త్పూర్వేద్యురాదయః,**

పూర్వోత్తరాపరాత్ = పూర్వోత్తరాపరశబ్దములవలనను, అధరాన్యాన్యత రేతరాత్ = అధారాన్యాన్యతరేతరశబ్దములవలనను గలిగిన, పూర్వేద్యురాదయః = పూర్వేద్యుః, ఉత్తరేద్యుః, అపరేద్యుః, అధరేద్యుః, అన్యేద్యుః, అన్యతరేద్యుః, ఇతరేద్యుః అను నన్యయములు, పూర్వే ఽహ్నీత్యాదౌ = పూర్వే ఽహ్ని, ఉత్తరే ఽహ్ని, అపరే ఽహ్ని, అధరే ఽహ్ని, అన్యస్మిన్నహ్ని, అన్యతరస్మిన్నహ్ని, ఇతరస్మిన్నహ్ని అను నర్థములయందు వర్తించును. ఉదా. పూర్వేద్యుః – తొలినాఁటికి పేరు. 'నిమంత్ర యత పూర్వేద్యుః'. ఉత్తరేద్యు, అపరేద్యుః ఈ ౨ ను మఱునాఁటి పేళ్లు. 'నాందీముఖా దుత్తరేద్యు ర్వివాహః'. 'ఆగతా నపరే ద్యుస్తాన్'. అధరేద్యుః – క్రిందటినాఁటికి పేరు. 'అధరేద్యు స్సమాగతా.' అన్యేద్యుః, ఇతరేద్యుః ఈ ౨ ను మఱియొకనాఁటికి పేళ్లు. 'అన్యేద్యురాత్మానుచరస్య భావం', 'కష్టదినా దితరేద్యుః ప్రియో ద్రష్టవ్యః' అన్యతరేద్యుః – రెండుదినములలో నొకనాఁటికి పేరు. 'పంచమీ షష్ఠ్యోరన్యతరేద్యుః పితరం ద్రక్ష్యసి.'

**ఉభయద్యు శ్చోభయేద్యుః -**

ఉభయద్యుః, ఉభయేద్యుః ఈ ౨ ను రెండుదినములను నర్థమందు వర్తించును. ఉ. 'ఉభయద్యు రుత్సవః', 'ఉభయేద్యు రుత్సవః'.

**పరే త్వహ్ని పరేద్యవి.** 22

పరేద్యవి – ఇది మఱునాఁటికి పేరు. ఉ. 'ద్రష్టాస్మిపరేద్య విసఖాయం.'

**హ్యో ఽ తీతే -**

హ్యః – ఇది నిన్నటికి పేరు. ఉ. 'హ్య స్సర్వ మభవత్కార్యం'.

**అనాగతే ఽ హ్ని శ్వః -**

శ్వః – ఇది ఱేపటికి పేరు. ఉ. 'శ్వః కార్య మద్య కుర్వీత'.

**పరశ్వ స్తత్పరే ౽ హని,**

పరశ్వః – ఇది ఎల్లుండికి పేరు. ఉ. 'పరశ్వో వా భవిష్యతి'.

**తదా తదానీమ్ -**

తదా, తదానీం ఈ ౨ ను అప్పు డను నర్థమందు వర్తించును. ఉ. 'తదా చక్షుష్మతాం ప్రీతిః', 'యదా స్యాత్ప్రియయా సంగః తదానీ మేవ మే సుఖం'.

**యుగప దేకదా -**

యుగపత్, ఏకదా ఈ ౨ ను ఒక్క కాలమందను నర్థమందు వర్తించును. ఉ. 'యుగపద్వ్యానశే దిశః', 'ఏకదా మిళితా ద్విజాః'.

**సర్వదా సదా.** 23

సర్వదా, సదా ఈ ౨ ను ఎల్లప్పుడు నను నర్థమందు వర్తించును. 'సర్వదా సర్వదో ౽ సీతి యాచతే యాచక స్సదా'.

**ఏతర్హి సంప్ర తీదానీ మధునా సాంప్రతం తథా,**

ఏతర్హి, సంప్రతి, ఇదానీం, అధునా, సాంప్రతం ఈ ౫ ను ఇప్పుడను నర్థమందు వర్తించును. 'భవంత మేతర్హి మనస్వి గర్హితం', 'సంప్రత్య సాంప్రతం వక్తుం', 'ఇదానీ మస్మి సంవృత్తః', 'బలావలేపా దదునాపి పూర్వవత్', 'కో ౽ న్యస్మిన్ సాంప్రతం లోకే'.

**దిగ్దేశకాలే పూర్వాదౌ ప్రా గుద క్ప్రత్యగాదయః.** 24

ప్రాగుదక్ప్రత్యగాదిశబ్దములు పూర్వాది దిగ్దేశకాలములయందు వర్తించును. ప్రాక్ – ఇది పూర్వదిక్కునకును, తూర్పు దేశమునకును, పూర్వకాలమునకును పేరు. ఉదక్ – ఇది ఉత్తరపుదిక్కునకును, ఉత్తర దేశమునకును పేరు. ప్రత్యక్ – ఇది పడమటిదిక్కునకును, పడమటిదేశమునకును పేరు. ఆది శబ్దమువలన అర్వాక్, అధస్తాత్ అనునవి మొదలయినవి గ్రహింపఁబడును. ఉ. దిక్కునకు – 'ప్రాఙ్ముఖో ౽ న్నాని భుంజీత' దేశమునకు 'ప్రాగ్భాగతః పత ది హేద ముపత్యకాసు'. కాలమునకు – 'ప్రా క్సృష్టేః కేవలాత్మనే'. ఈలాగున నుదగాది శబ్దములకు నుదాహరణము లూహించుకొనునది. టీ. స. 'దక్షిణోత్తరాభ్యామతసు' ఇతి సూత్రే దిగ్దేశకాలే ష్విత్యర్థత్రయానువృత్తావపి దక్షిణశబ్దస్య కాలేవృత్త్యసంభవా దుత్తరశబ్దాదే వార్థత్రయవృత్తే రతసుజ్విధి రంగీకృతో

వృత్తికారాదిభిః. ఏవం ప్రకృతే ఽ పి దిగ్దేశకాల ఇత్య విశేషే ణోక్తావపి ప్రాక్పదస్యైవార్థత్రయే విధి రుదగాది శబ్దానాం తు కాలరూపార్థే వృత్త్యసంభవా దర్థద్వయఏవ విధిః.

## లింగాది సంగ్రహ వర్గము

అవ. టీ. స. ఇహహి గ్రంథాదౌ గ్రంథకారః 'సంపూర్ణ ముచ్యతే వర్గై ర్నామలింగానుశాసన' మితి ప్రతిజ్ఞాయ, ఏతదంతేన గ్రంథ సందర్భేణ సలింగానాం నామ్నాం శాసనం విధాయ, లింగవిధే రసం పూర్ణతాం మన్వానః, తన్నిరూపణాయ వర్గాంతర మారభతే – గ్రంథకర్త తాను గ్రంథాదియందుఁ జేసిన 'సంపూర్ణ ముచ్యతే వర్గైర్నామ లింగానుశాసనమ్' అను ప్రతిజ్ఞ చొప్పున లింగములతోఁగూడ నామముల కనుశాసనముఁ జేసియు, లింగానుశాసనము సంపూర్ణము కాలేదని తలఁచినవాఁడై ఆ లింగానుశాసనముకొఱకు వర్గాంతరమును బ్రారంభించుచున్నాఁడు___

**సలిఙ్గశాస్త్రై స్సన్నాదికృత్తద్ధిత సమాసజైః,**
**అను క్తైస్సంగ్రహే లిఙ్గం సంకీర్ణవద్ధి హోన్నయేత్.** 1

సలింగశాస్త్రైః = పాణిని వరరుచి మొదలైనవారిచేతఁ జెప్పఁబడిన లింగలక్షణములతోఁ గూడినట్టియు, సన్నాదికృత్తద్ధితసమాసజైః = సనాద్యంత ధాతువులమీఁద విధింపఁబడిన అప్రత్యయము మొదలైన కృత్ ప్రత్యయముల వలనను, కేవల ధాతువులమీఁది కృత్ప్రత్యయములవలనను, తద్ధిత ప్రత్యయముల వలనను, సమాసములవలననుం బుట్టిన వాక్యములచేతను, అనుక్తైః = పూర్వ వర్గములయందుఁ జెప్పఁబడని, 'స్త్రియామీ దూద్విరా మైకాచ్', 'స్త్రీభావాదావని క్తిణ్', 'తత్ర్కీడాయాం ప్రహరణం', 'అదంతైర్ద్విగురేకార్థః'. ఇవి మొదలగు వాక్యములచేత, ఇహసంగ్రహే = ఈలింగాది సంగ్రహవర్గయందు, లింగం = స్త్రీ పుం నపుంసకలిఙ్గములను, ఉన్నయేత్ = ఊహించుకొనునది. ఎట్లనిన ___ సంకీర్ణవత్ = సంకీర్ణవర్గయం దెత్తెఱంగునఁ బ్రకృతి ప్రత్యయార్థములచేత లింగము

తెలుసుకొనఁబడునో, ఆరీతిగ నిక్కడనుం దెలిసికొనునది. ఇందుకు తాత్పర్యము. లింగాదిసంగ్రహవర్గయందు 'స్త్రియామీదూద్విరామైకాచ్' అనునవి మొదలయిన లింగలక్షణములతోఁ గూడిన శబ్దములును, 'చికీర్షా, జహీర్షా' అనునివి మొదలైన సన్నాది ప్రత్యయాంతములను, 'కృతిః, హృతిః' అనునివి మొదలయిన కృత్ప్రత్యయాంతములును, 'దాండా, కాష్ఠా' అనునివి మొదలయిన తద్ధితప్రత్యయాంతములును, 'త్రిలోకీ, త్రివేదీ' అనునివి మొదలైన సమాసములవలనఁ బుట్టిన శబ్దములును, ఈ శబ్దములలో మునుపటివర్గములయందు తఱుచుగాఁ జెప్పఁబడనివానికి లింగసంగ్రహము చెప్పఁబడును. ఆ లింగసంగ్రహమును 'స్త్రియాం', 'పుంసి', 'క్లీబే' అను ననువాదమాత్రమునఁ దెలిసికొనక ప్రకృతి ప్రత్యయార్థాదులగు లక్షణములవలననే తెలిసికొనఁదగియుండును. ఎట్లనిన ___ ప్రకృతిచేత నర్ధర్చాది శబ్దములును, ప్రత్యయముచేత కృతి హృత్యాది శబ్దములును, అర్థమువలన మాతృష్వస్రాది శబ్దములును, ఆదిశబ్దముచేత న్యాయమువలన క్రియావ్యయ విశేషములును తెలిసికొనఁదగినవి. టీ. అనుక్తమిత్యస్య అయమాశయ. సకలస్య శబ్దస్య ప్రాతిపద్యేనలింగ నిర్ణయకరణానుపపత్తేః యత్కించి దుపాధిముఖేనైన శబ్దజాతం క్రోడీకృత్య లింగనిర్ణయః కర్తవ్యః. సచ పూర్వ మకృత ఏవసంకీర్ణవర్గే ప్రకృత్యాదిభి రున్నయనమాత్ర ముపక్షిప్తం. అత్ర తూన్న యనోపాయో వివిచ్య దర్శితః. అతః పర్యాయకాండే కృతమపి లింగాను శాసనం అసాకల్యా దనుక్తప్రాయమే వేతి.

**లిఙ్గశేషవిధి ర్వ్యాపీ విశేషై ర్య ద్య బాధితః,**

అవ. టీ. స. సమనంతరవర్గస్య లింగనిర్ణయార్థత్వే 'పాత్రామత్రే చ భాజన' మిత్యత్ర కేవల నపుంసకలింగత్వ ముక్తం. లింగసంగ్రహేతు 'త్రిషు పాత్రీ'తి త్రిలింగత్వం వక్ష్యతే. తథా 'కువలఫేనిలే' ఇతి కువలశబ్దస్య నపుంసకత్వం ప్రాగుక్తం. అత్రతు త్రిలింగత్వ మభిధాస్యత ఇత్యాది స్థలేషు విరోధే కస్య ప్రసంగ ఇత్యాకాంక్షాయా మాహ ___ ఈ సర్గమునందుఁ జెప్పఁబడు లింగ లక్షణములకు మునుపటివర్గముల యందుఁ జెప్పిన విశేషవిధులతో విరోధము వచ్చినపుడే లక్షణము ప్రవర్తించు ననుశంకను పరిహరించుచున్నాఁడు.

లింగశేషవిధిః ___ ఈవర్గలయందుఁ జెప్పఁబడు సామాన్యమైన లింగ లక్షణము, విశేషైః = ఈశాస్త్రమం దక్కడక్కడఁ జెప్పఁబడిన విశేషవిధులచేత, అబాధితో యది = బాధింపఁబడనిదయిన, వ్యాపీ = ప్రవర్తించును. ఎట్లనిన ___ ఈవర్గయందు స్వర్గపర్యాశబ్దములు పుంలింగములని చెప్పిన లింగలక్షణము 'ద్యోదివౌ ద్వేస్త్రియాం క్లీబేత్రివిష్టపం' అని చెప్పిన విశేషవిధులను విడిచి కడమ దిక్కులయందే ప్రవర్తించును.

## స్త్రీలింగ శేషము

**స్త్రియామ్ -**

స్త్రియాం అనుపదము 'పుంస్త్వే సభేదానుచరాః' అను పుంలింగాధికార పర్యంతము అనువర్తించును.

**ఈదూద్విరా మైకాచ్ -**

ఒక యచ్చుగలిగిన ఈకారాంత ఊకారాంతశబ్దములు, స్త్రీలింగమునందు వర్తించును. శ్రీః, ధీః, భూః, భ్రూః.

**నయోని ప్రాణినామచ.** 2

యోనగలిగిన ప్రాణులకు పేరయిన శబ్దములు స్త్రీలింగములు. ఉ. ఇయం, మాతా, స్వసా, దుహితా, యోషిత్, గౌః, సురభిః, కరేణుః.

**నామ విద్యు న్ని శా వల్లీ వీణా ది గ్భూ నదీ హ్రియామ్,**

మెఱపునకును, రాత్రికిని, తీఁగకును, వీణకును, దిక్కునకును, భూమికిని, నదికిని, సిగ్గునకును పేరైన శబ్దములు స్త్రీలింగములు. ఉ. మెఱపునకు–తటిత్, విద్యుత్. రాత్రికి–రాత్రిః, రజనీ. తీఁగకు–వీరుత్, వ్రతిః, వీణకు – విపంచీ, వల్లకీ. దిక్కునకు – దిక్, కకుప్. భూమికి–కుః, క్షితిః, భూమిః, అవనిః. నదికి–సరిత్, త్రిస్రోతాః. సిగ్గునకు–హ్రీః, లజ్జా. పర్యాయములలో మందాక్షశబ్దము నపుంసకలింగము. 'వ్రీ డా దముందేవ ముదీక్ష్య మాన్యే'. అను కాళిదాస ప్రయోగము వలన వ్రీడాశబ్దము పుంలింగమందును గలదు గనుక నీ చెప్పిన లక్షణమునకు బాధ గలిగినను, 'శేషంతు జ్ఞేయం శిష్టప్రయోగతః' అని చెప్పఁ బోవుచున్నాఁడు గనుక శిష్టప్రయోగానుసారముగ విశేషవిషయము తెలిసికొనునది. వీణాపర్యాయములన్నియు జ్యంతములును, ఆబంతములును; లజ్జాపర్యాయములలో హ్రీశబ్దము ఈకారాంతమైన యే కాచ్చును ; కడమ శబ్దములు ఆబంత

ములును గనుక, ముందరఁజెప్పఁగల 'జ్యాబూజంతమ్' అనుదానివలనను 'స్త్రియామీ దూద్ధిరామైకాచ్' అనుదానివలనను, స్త్రీలింగము సిద్ధమైనను విస్పష్టార్థమై చెప్పినాడు. 'కొందఱు వీణాదిగ్భూనదీప్రియాం' అను దిక్కున 'వాణీదిగ్భూనదీప్రియాం' అని పఠించి వాక్పర్యాయములైన 'చిత్, సంవిత్, ప్రతిపత్' అను శబ్దములను స్త్రీలింగములని చెప్పుదురు.

**అదన్తైర్ద్విగు రేకార్థః -**

అకారాంతమైన సమాహారమందలి ద్విగుసమాసము స్త్రీలింగము. 'అకారాంతో త్తరపదో ద్విగుః స్త్రియాం భాష్యతే' అను వార్తికము వలన స్త్రీలింగము. ద్విగుసమాస మనఁగా, సంఖ్యాపూర్వకమైన సమాసము. ఉ. పంచానాం పూలానాం సమాహారః – పంచపూలీ, త్రిలోకీ. (పూలా = గడ్డిమోపు).

**న స పాత్ర యుగాదిభిః.** 3

సః = ఆద్విగుసమాసము, పాత్రయుగాదిభిః = ఉత్తరపదములైన పాత్రయుగాదిశబ్దములతోఁ గూడినదైన, న = 'పాత్రాదిభ్యః ప్రతిషేధో వక్తవ్యః' అను వార్తికముచేత స్త్రీలింగము కాదు. పంచపాత్రం. చతుర్యుగం. త్రిభువనం.

**తల్**

'తస్యభావ స్త్వతలౌ' అని భావార్థమందును. 'గ్రామజనబంధుభ్యస్తల్' అని సమూహార్థమందును, 'దేవాత్తల్' అని స్వార్థమందును విహితమైన తల్ప్రత్యయాంతమైన శబ్దము స్త్రీలింగము. ఉ. భావార్థమందు అశ్వతా, పురుషతా. సమూహార్థమందు గ్రామతా, జనతా, బందుతా, సహాయతా. స్వార్థమందు దేవతా.

**బృన్దే యేనికట్యచ్త్రా -**

'పాశాదిభ్యోయః' 'ఖలగోరథాత్' 'ఇనిత్రకద్యచశ్చ' అను సూత్రములచేత సమూహార్థమందు విధింపఁబడిన య, ఇని, కట్యచ్, త్ర అను ప్రత్యయము లంతములుగాఁ గల శబ్దములు స్త్రీలింగములు. ఉ. య ప్రత్యయమునకు – పాశానాం సమూహః పాశ్యా, ధూమ్యా, ఖల్యా, వన్యా. ఇని ప్రత్యయమునకు – ఖలానాం సమూహః ఖలినీ. కట్యచ్ప్రత్యయము

నకు రథానాం సమూహో రథకట్యా. త్ర ప్రత్యయమునకు – గవాం సమూహో గోత్రా.

**వైర మైథుని కాదివున్,**

'ద్వంద్వాద్వు౯ వైరమైథునికయోః' అని విరోదార్థమందును, వివాహార్థమందును, ఆదిశబ్దముచేత 'పాదశతస్య సంఖ్యాదే ర్వీప్సాయాంవు౯ లోపశ్చ', 'దండవ్యవసర్గయోశ్చ' అను సూత్రములచే వీప్సయందును, దండమందును విధింపఁబడిన వున్ప్రత్యయము అంతముగాఁ గల శబ్దములు స్త్రీలింగములు. వున్ప్రత్యయము 'వుఞ్' ప్రత్యయమున కుపలక్షణము గనుక 'ద్వంద్వమనోజ్ఞాదిభ్యశ్చ', 'గోత్రచరణాచ్ఛ్లాఘాత్యాకారతదవేతేషు' అను సూత్రములచేత విధింపఁబడిన వుఞ్ ప్రత్యయాంతములును, ఒకానొక దిక్కున స్త్రీలింగములు. ఉ. విరోధమునకు – అశ్వమహిషయోర్విరోధః – అశ్వమహిషికా. వివాహమునకు – అత్రిభరద్వాజ యోర్వివాహః అత్రిభరద్వాజికా; వసిష్ఠకుశికికా. వీప్సార్థమునకు – ద్వౌ ద్వౌ పాదౌ దదాతి, ద్విపదికాం దదాతి, ద్విశతికాందదాతి. దండమందు–ద్వౌ పాదౌ దండితః ద్విపదికాం దండితః. దానమందు – ద్వౌపాదౌ వ్యవసృజతి ద్విపదికాం వ్యవసృజతి, ద్విశతికాం వ్యవసృజతి. వుఞ్ ప్రత్యయమునకు శిష్యోపాధ్యాయో ర్భావః శైష్యోపాధ్యాయికా. శ్లాఘాదులకు గారికా, కారికా.

**స్త్రీభావాదా వని క్తిన్ణ్వుల్ణ జ్ణ్వ చ్క్య బ్యు జ ఇఞ్ ఇఞ్ని శాః.** 4

స్త్ర్యధికారమందు భావాద్యర్థములయందు విధింపఁబడిన అని. క్తి౯, ణ్వుల్, ణచ్, ణ్వుచ్, క్యప్, యుచ్, అఞ్, అ, ఇఞ్, ని, శను ప్రత్యయములు తఱచుగాఁ గల శబ్దములు స్త్రీలింగములు. ఉ. అకరణిః, అజననిః – ఇవి 'అక్రోశేన ఙ్యనిః' అను సూత్రముచేత ఆక్రోశార్థమందు వచ్చిన 'అని' యను ప్రత్యయము. కృతిః, శ్రుతిః – ఇవి 'స్త్రియాంక్తి౯' అనుసూత్రము చేతనైన భావార్థమందలి క్తిన్ప్రత్యయాంతములు. ప్రవాహికా, ప్రచ్ఛర్దికా – ఇవి 'రోగాఖ్యాయాం ణ్వుల్ బహుళమ్' అను సూత్రముచేతనైన రోగాఖ్యయందలి ణ్వుల్ కారికా, జీవికా–ఇవి 'ధాత్వర్థ నిర్దేశేణ్వుల్ వక్తవ్యః' అను వార్తికముచేతనైన ధాత్వర్థ మందలి ణ్వుల్. 'అన్యో వ్యాక్రోశనం వ్యావక్రోశీ వ్యాత్యుక్షీ' ఇవి 'కర్తృవ్యతీ

హారే ణచ్' అను సూత్రముచేతనైన కర్మ వ్యతిహారమందలి ణచ్. 'భవతః శాయికా', 'భవతః ఆసికా ఇవి 'పర్యాయార్హణోత్పత్తిషు ణ్వుచ్' అను సూత్రముచేతనైన పర్యాయార్థమందలి ణ్వుచ్. భవా నర్హతి ఇక్షుభక్షికాం, పయః పాయికాం-ఇవి అర్హార్థమందలి ణ్వుచ్. ఇక్షుభక్షికాం మే ధారయసి, ఓదనభక్షికాం-ఇవి ఋణార్థమందలి ణ్వుచ్. ఇక్షుభక్షికామే ఉదపాది, ఓదనభక్షికా - ఇవి ఉత్పత్తియందలి ణ్వుచ్. వ్రజ్యా ఇజ్యా ఇవి 'వ్రజయశోర్భావే క్యప్' అను సూత్రముచేతనైన భావార్థమందలి క్యప్పు. మండనా, ఆసనా, శ్రంథనా ఇవి 'ణ్యాసశ్రన్థో యుచ్' అనుసూత్రముచేతనైన భావార్థమందలి యుచ్. పదాచ్ఛిదా, మృజా, ఇవి 'షిద్భిదాదిభ్యోఙ్' అనుసూత్రముచేత భావమందలి అఙ్. చికీర్షా, జిహీర్షా - ఇవి 'అప్రత్యయాత్' అనుసూత్రముచేత అప్రత్యయాంతము. 'కాం కారిమకార్షీత్' 'ఇమాంకరి మకార్షం' ఇవి 'విభాషాఖ్యాన పరిప్రశ్న యోరిఞ్చ' అను సూత్రముచేత ప్రశ్నాఖ్యానమందైన ఇఞ్. జ్యానిః, గ్లానిః, మ్లానిః-ఇవి 'గ్లా మ్లాజ్యాహాభ్యోనిః' అను సూత్రము చేతనైన ని ప్రత్యయము. క్రియా, ఇచ్ఛా - ఇవి 'కృఞః శచ ఇచ్ఛా' అను సూత్రముచేతనైన శ ప్రత్యయాంతములు.

**ఉణాదిషు నిరూరీశ్చ -**

ఉణాదులయందలి ని ప్రత్యయమును, ఊప్రత్యయమును, ఈ ప్రత్యయమును అంతములుగాఁగలశబ్దములు స్త్రీలింగములు. ఉ. శ్రేణి-ఇది ని ప్రత్యయాంతము. అగ్నిః, వహ్నిః, యోనిః, పార్ష్ణిః ఇవి ని ప్రత్యయాంతములైనను దేవతావాచకములు పుంలింగములని ముందరఁ జెప్పుచున్నాఁడు గనుకను, 'యోనిర్ద్వయోః పుమాన్ పార్ష్ణిః' అని పూర్వము చెప్పినాఁడు గనుకను, ఆ విశేషములచేత నిక్కడ చెప్పినందున బాధ గలిగి పుంలింగములు గలవౌను. ఊ ప్రత్యయమునకు-ఖర్జూః, కండూః, చమూః. ఈ ప్రత్యయమునకు-తంద్రీః, లక్ష్మీః.

**జ్యాబూజన్తం చలం స్థిరమ్,**

జీప్, జీష్, జీన్ అను ప్రత్యయములు అంతములుగాఁ గలిగిన జ్యంతములును, టాప్, డాప్, చాప్ అను ప్రత్యయములు అంతములు

గాంగలిగిన అబంతములును, ఊఙ్ప్రత్యయాంతములును, విశేష్యనిఘ్నములును, నియతలింగము లైనవియును స్త్రీలింగములు. ఉదాహరణములు___ వివేష్యనిఘ్నములకు-పుంసః ఇయం పౌంస్నీ బుద్ధిః, ఔపగవీ. నియంతలింగమునకు- కరిణీ, కర్త్రీ, హర్త్రీ ఇవి 'ఋన్నేభ్యోఙీప్' అను సూత్రముచేత ఙీబంతములు. దాక్షాయణీ, గౌరీ ఇవి 'షిద్గౌరాదిభ్యశ్చ' అను సూత్రముచేత ఙీషంతములు. శార్ఙ్గరవీ, ఖైదీ ఇవి 'శార్ఙ్గరవా ద్యఞోఙీన్' అను సూత్రముచేత ఙీనంతములు. 'అజా', 'ఏడకా', 'రమా' ఇవి 'అజాద్యతష్టాప్' అను సూత్రముచేత టాబంతములు. 'సురాజా బహుసీమా - ఇవి 'డా బుభాభ్యా మన్యతరస్యాం' అనుసూత్రము చేత డాబంతములు. కౌరీగంధ్యా వారాహ్యా- ఇవి 'యఙశ్చాప్' అను సూత్రముచేత చాబంతములు. రంభోరూః ఇది 'ఊరూత్తరపదా దౌపమ్యే' అను సూత్రము చేత ఊఙంతము.

**తత్క్రీడాయాం ప్రహరణం చే న్మౌష్టా పాల్లవా ణ దిక్.** 5

తత్ - ఆ ముష్టిపల్లవాదులు, క్రీడాయాం = ఈ క్రీడయందు, ప్రహరణం చేత్ = ఆయుధమాయెనేని, అప్పుడు ఈయర్థమందు 'తదస్యాం ప్రహరణ మితి క్రీడాయాం ణః' అను సూత్రముచేత విహితమైన ణ ప్రత్యయమున కుదాహరణము లైన మౌష్టపాల్లవాది శబ్దములు స్త్రీలింగములు. ముష్టిః ప్రహరణమస్యాం క్రీడాయాం మౌష్టా, పాల్లవా, దిక్ అన్నందువలన దాండాదిశబ్దములు ఉదాహరణములు.

**ఘఞో ఞః స్సా క్రియా ఽస్యాం చే ద్దాణ్డపాతా హి ఫాల్గునీ,**
**శ్యైనంపాతా హి మృగయా తైలంపాతా స్వధేతి దిక్.** 6

సాక్రియా = ఆదండపాతాదిక్రియ, అస్యాం చేత్ = ఈఫాల్గున్యాదులయందు కలిగెనేని అను నర్థమందు, ఘఞః ఞః = ఘఞంతముమీఁద 'ఘఞస్సాస్యాంక్రియేతిఞః' అనుసూత్రముచేత విహితమైన ఞ ప్రత్యయమంతముగాఁ గలిగిన శబ్దములు స్త్రీలింగములు. ఉదా. 'దండపాతో ఽస్యాం ఫాల్గున్యామితి దాండపాతా ఫాల్గునీ, శ్యేనపాతో ఽస్యాం మృగయాయామితి శ్యైనంపాతా మృగయా, తిలపాతో ఽస్యాం స్వధాయామితి తైలంపాతా స్వధా' అని. దిగ్గ్రహణమువలన మౌసల పాతాదులును.

**స్త్రీ స్యా త్కా చి న్మృణాళ్యాది ర్వివక్షాపచయే యది,**

అల్పార్థమందు వివక్ష గలిగినప్పుడు మృణాళీశబ్దము మొదలయిన కొన్ని శబ్దములు స్త్రీలింగములు. అల్పం మృణాళం మృణాళీ. అల్పో ఘటో ఘటీ. ఇటువలెనే శస్త్రీ, విషాణీ, పీఠీ, ఖర్జూరీ అనునివి మొదలైనవి తెలిసికొనునది. 'కొన్ని' అన్నందువలన అల్పో వృక్షో వృక్షకః అనునివి మొదలైన శబ్దములకు లేదు. కొందఱు అపచయ మనఁగా స్త్రీత్వమని, స్త్రీత్వవివక్షయందు మృణాళ్యాదిశబ్దములు స్త్రీలింగములందురు.

ఈ ప్రకారము పాణిత్యాదులు చెప్పిన లక్షణములచేత లింగ నిర్ణయమును జెప్పి, ఇంక నామముఖమున కకారాంతాది క్రమముచే లింగ నిర్ణయమును జెప్పుచున్నాఁడు___

**లఙ్కా శేఫాలికా టీకా ధాతకీ పఞ్జికా ఽఽ ఢకీ.** 7
**సిధ్రకా శారికా హిక్కా ప్రాచి కోల్కా పిపీలికా,**
**తిన్దుకీ వణికా భ్గీ సురఙ్గా సూచి మాచయః.** 8
**పిచ్ఛా వితణ్డా కాకిణ్య శ్చూర్ణి శ్శాణీ ద్రుణీ దరత్,**
**సాతిః కన్థా కథా ఽఽ సన్దీ నాభీ రాసభా ఽ పిచ.** 9
**ఝల్లరీ చర్చరీ పారీ హోరా లట్వాచ సిధ్మలా,**
**లాక్షా లిక్షాచ గణ్డూషా గృధ్రసీ చమసీ మసీ.** 10

లంకాశబ్దము మొదలు మసీ శబ్ద పర్యంతము ౪౩ శబ్దములు స్త్రీలింగములు. లంకా = రావణపట్టణము, శేషాలికా = వావిలి, టీకా = వ్యాఖ్యాన గ్రంథము, ధాతకీ–ఆరెమ్రాఁకు, పంచికా = వ్యాఖ్యానగ్రంథ విశేషము, ఆఢకీ = తువరిమన్ను, సిధ్రకా = వృక్షవిశేషము, శారికా = గోరువంక, హిక్కా = వెక్కిళ్లు, ప్రాచికా = అడవియీఁగ, ఉల్కా = కొఱవి; తోఁకచుక్కయును, పిపీలికా = చీమ, తిందుకీ = తుమ్మికిచెట్టు, కణికా = పరిమాణ భేదము ; వ్రీహిభేదమును, గోధుమపిండి యని కొందఱు. భంగీ = రచనాప్రకారము, సురంగా = కన్నము, సూచిః = సూది, మాచిః = దేశ విశేషము, వీచియని కొందఱు. పిచ్ఛా = గంజి; బూరుగుబంకయును, వితండా = స్వపక్షస్థాపనములేని వాచవిశేషము, కాకిణీ = కర్షమెత్తులో

నాలవపాలు, పలములో నాలవపాలని కొందఱు. చూర్ణిః = భాష్యము, శాణీ = సాన, ద్రుణీ = చెవిఁదూఱుపాము, తాఁబే లని కొందఱు. దరత్ = విషముపుట్టు దేశము, చఱియ యని కొందఱు. సాతిః = దానము, తీవ్రవేదన యని కొందఱు. కంథా = బొంత, కథా = చరిత్ర, ఆనందీ = పేమునఁ జేసిన చెక్కడము; పెండ్లిపీఁట, శవవాహన మని కొందఱు. నాభి = బొడ్డు, రాజసభా = రాజు కొలువుకూటము, ఝల్లరీ = వ్యాదవిశేషము, చర్చరీ = నృత్తవిశేషము, పారీ = పాలుపిదుకు కుండ, పెరుఁగుచిలుకు కుండ యని కొందఱు. హోరా = లగ్నాంశము. లట్వా = ఊరఁబిచ్చుక, సిద్మలా = పూతిమత్స్యక్షోదము; సిబ్బెము గలదియును, లాక్షా = లత్తుక, లిక్షా = పేను, గండూషా = పుక్కిలించుట, గృధ్రసీ = రొంటిలోని వాతవ్యాధి, చమసీ = సోమపానపాత్రము, మసీ = మసి.

## పుంలింగ శేషము

ముందర నపుంసకే అనువఱకుఁ జెప్పఁబడుశబ్దము పుంలింగములని యెఱుంగవలయును.

**పుంస్త్వే సభేదానుచరా స్సపర్యాయా స్సురాసురాః,**

పర్యాయములతోఁగూడిన సురలపేళ్లను, సురవిశేషములపేళ్లను, సురానుచరుల పేళ్లను, అసురుల పేళ్లను, అసురవిశేషముల పేళ్లను, అసురానుచరుల పేళ్లను పుంలింగములు. ఉదాహరణములుః–సురలపేళ్లకు–సురా, అమరాః, దివౌకసః; సురవిశేషపర్యాయములకు – ఇంద్రః, బిడౌజాః, శక్రః, అగ్ని, వరుణః, యమః; సురానుచరులకు – హాహాః, హూహూః, మాఠరః, పింగళః, దండః; అసురులకు – అసురాః, పూర్వ దేవాః, దానవాః; అసుర విశేషములకు – విరోచనః, బలిః, నముచిః; అసురానుచరులకు–హస్తః, చండః, ముండః. ఈ శబ్దములలో విశేషవిధి గల శబ్దములయందు నీ విధి ప్రవర్తించదు.

**స్వర్గ యా గాద్రి మేఘాబ్ధి ద్రుకా లాసి శ రారయః.** 11
**కర గణ్డోష్ఠ దోర్దన్తకణ్ఠ కేశ నఖ స్తనాః,**

స్వర్గమునకును, యజ్ఞమునకును, పర్వతమునకును, మేఘమునకును, సముద్రమునకును, వృక్షమునకును, కాలమునకును, ఖడ్గమునకును,

బాణమునకును, శత్రువునకును, హస్తమునకును. ప. అప్పనమునకును. ప. కిరణమునకును, కపోలమునకును, అధరమునకును, బాహువునకును, దంతములకును, కంఠమునకును, కేశములకును, గోళ్లకును, స్తనములకును పేళ్లైనశబ్దములును సంభవించినచోట తద్విశేషములకు పేళ్లైనశబ్దములును పుంలింగములు. ఉ. స్వర్గమునకు - నాకః, త్రిదివః; ద్యోదివ్‌శబ్దములు విధ్యంతరముచేత బాధితములు. యజ్ఞమునకు-క్రతుః, సప్తతంతుః, తద్విశేషమునకు-అగ్నిష్టోమః, అతిరాత్రః; పర్వతమునకు-అద్రిః, పర్వతః, గిరిః; తద్విశేషమునకు-మేరుః, హిమవాన్, సహ్యః; గంధమాదనశబ్దము రూపభేదముచే బాధితము. మేఘమునకు-మేఘః, వారివాహః, స్తనయిత్నుః; అభ్రశబ్దము రూపభేదముచేత బాధితము. తద్విశేషమునకు - పుష్కలావర్తః; సముద్రమునకు - సముద్రః, అబ్ధిః; తద్విశేషమునకు-క్షీరోదః; వృక్షమునకు-వృక్షః, మహీరుహః; తద్విశేషమునకు-ఆమ్రః, కాలః, తమాలః; హరిచందన శింశుపాది శబ్దములు రూపభేదముచేత బాధితములు. కాలమునకు - కాలః, దిష్టః; తద్భేదమునకు-క్షణ, ముహూర్తః, మాసః, ప్రతిపత్ పక్షతిశిశిరవర్షాశరదాదులు విశేషవిధి బాధితములు. ఖడ్గమునకు-ఖడ్గః, అసిః, కరవాలః; తద్భేదమునకు - నందకః, చంద్రహాసః; బాణమునకు - బాణః, శరః, సాయకః; ఇషు శబ్దము విశేషవిధిచేత బాధితము. తద్భేదమునకు - క్షురప్రః; శత్రువునకు-అరిః, శత్రుః, అమిత్రః; హస్తమునకు-హస్తః, కరః, పంచశాఖః; అప్పనమునకు - కరః, బలిః, భాగధేయః; కిరణమునకు-కిరణః, అస్రః, మయూఖః; మరీచిదీధిత్యాదులు విధ్యంతరముచేత బాధితములు. కపోలమునకు-గండః, కపోలః; ఓష్ఠమునకు - ఓష్ఠః, అధరః, దశనవాసశ్శబ్దము విధ్యంతరముచేత బాధితము. బాహువునకు-దోః; భుజబాహుశబ్దములు విశేషవిధిచేత బాధితములు. దంతములకు - దంతాః, దశనాః, రదాః; దంష్ట్రాశబ్దము ఆబంతము గనుక ట్యాబూజంతం అను విధ్యంతరముచేత బాధితము. విషాణశబ్దము నానార్థమందు మూఁడులింగములయందు చెప్పఁబడియున్నది గనుక విధ్యంతరముచేత బాధితము. కంఠమునకు - కంఠః, గళః; కేశములకు-కేశాః, కచాః, చికురః; తద్విశేషమునకు

– కాకపక్షః; జటా సటాశబ్దములు ఆబంతములు గనుక 'జాబూజంతం' అను విధిచేత బాధితములు. నఖములకు – కరజః, పునర్భవ; స్తనములకు – స్తనః, కుచః, ఉరోజః.

**అహ్నాహాన్తాః -**

అహ్నాంతములును, అహాంతములును నైన శబ్దములును పుంలింగములు. ఉ. అహ్నాంతములకు–పూర్వాహ్ణః, అపరాహ్ణః, మధ్యాహ్నః, సాయాహ్నః. అహరతిక్రాంతం అత్యహ్నో భోజనం. 'అహ్నోనిర్గతారనిహ్నో వేలా' అనుచోట అన్యపదార్థము నపుంసక స్త్రీలింగమైనను పుంలింగమే వచ్చునని కొందఱు. అహాంతములకు–ఉత్తమాహః, పరమాహః, ద్వయోరహ్నోర్భవః ద్వ్యహః, త్ర్యహః. ఇక్కడ 'రాత్రాహ్నాహాః పుంసి' అను సూత్రముచేత పులింగము.

**క్ష్వేళభేదాః -**

విష విశేషములకు పేళ్లైనశబ్దములు పులింగములు. ఉ___ సౌరాష్ట్రికః, శౌక్లికేయః, బ్రహ్మపుత్రః, ప్రదీపనః. కాకోలకాలకూటహలా హలశబ్దములు 'పుంసి' 'క్లీబే' అను విధ్యంతరముచేత బాధితములు.

**రాత్రాన్తాః ప్రాగసఙ్ఖ్యకాః.** 12

సంఖ్యాపూర్వపదములు గాని రాత్రాంతశబ్దములు పుంలింగములు. ఉ. పూర్వరాత్రః, అపరరాత్రః, అహోరాత్రః. రాత్రాంతమైన శబ్దము సమాహారమునందు నపుంసక మని కొందఱు. ఉ. అహోరాత్రం. అన్యపదార్థము భిన్నలింగమైనను పుంలింగమే యని కొందఱు. ఉ. అతిక్రాంతో రాత్రి మతిరాత్రః. సంఖ్యా పూర్వపదములైన రాత్రాంతశబ్దములు నపుంసకములు. ఉ. గణరాత్రం, పంచరాత్రం.

**శ్రీ వేష్టాద్యాశ్చ నిర్యాసాః -**

మానిబంకకు పేళ్లయిన శ్రీవేష్టాదిశబ్దములు పుంలింగములు. ఉ. శ్రీవేష్ట, సర్జరసః, కర్పూరః, యావనః ఇత్యాదులు.

**అసన్నంతా అబాధితాః,**

విధ్యంతరములచేత బాధితములుగాని అసంతములును, అనంతములును పుంలింగములు. ఉ. అసంతమునకు – అంగిరాః, పురోధాః

పురూరవాః ఇత్యాదులు. అన్నంతములకు–అధర్వా, సుత్రామా, మాతరిశ్వా ఇత్యాదులు. యశః, పయః, నామ ఇవి మొదలైనవి 'ద్వ్యచ్కమస్' అను విధ్వంతరముచేత బాధితములు.

**కశేరు జతు వస్తూని హిత్వా తు రు విరామకాః.** 13

'తు' అనువర్ణమును, 'రు' అనువర్ణమును అంతమందుఁ గల కశేర్వాది వ్యతిరిక్తములైనశబ్దములు పుంలింగములు. ఉ. తు వర్ణాంతమునకు–ధాతు, సేతుః, హేతుః, ఓతుః ఇవి మొదలైనవి. రువర్ణాంతమునకు – కారుః, వేరుః, త్సరుః ఇవి మొదలైనవి. కశేర్వాదిశబ్దములు ఉపలక్షణములు. మస్తు, వాస్తు, అశ్రు, శ్మశ్రు ఇవి మొదలయినవి నపుంసకములు.

**క ష ణ భ మ రోపాన్తాయ ద్యదన్తా అమీ అథ,**
**ప థ న య స టో పాన్తాః -**

క, ష, ణ, భ, మ, ర, ప, థ, న, య, స, ట, ఈ వర్ణములు ఉపాంతములుగాఁ గలిగిన అదంతశబ్దములు పుంలింగములు. ఉ. అర్కః, స్ఫటికః, పక్షః, రోషః, కోణః, బాణః, గుణః, కుంభః, స్తంభః, గర్భః, వ్యామః, గ్రామః, క్రమః, హారః, సారః, ధూపః, శాపః, సూపః, అర్థః, శపథః, జనః స్తనః, కులాయః, తంతువాయః, రసః, దాసః, వటః విటః, ఘటః.

**గోత్రాఖ్యాశ్చరణాహ్వయాః.** 14

గోత్రాపత్యవాచకములైన శబ్దములను, శాఖాధేతృవాచకములైన శబ్దములును పుంలింగములు. ఉ. గోత్రాంతమునకు– గార్గ్యః, వాత్స్యః, భారద్వాజః, వాసిష్ఠః. శాఖాధ్యేతలకు – శఠః. కలాపః ఇత్యాదులు.

**నా మ్న్యకర్తరి భావేచ ఘు ఱ జ బ్న జ్ఞఘూ థుచః,**

నామ్ని – కర్తృ రూపార్థ విషయే తద్వ్యతిరిక్తార్థ విషయేవా సంజ్ఞామాత్రే, అకర్తరి – సంజ్ఞావ్యతిరిక్తార్థత్వే ఉపి కర్తృవ్యతిరిక్తకారకమాత్రే, భావే శుద్ధే ధాత్వర్థమాత్రే చ యథాసంభవం ఘఞాదిసప్త ప్రత్యయాంతాః అబాధితాః పుంసి భవంతి. సంజ్ఞయందును, కర్తృవ్యతిరిక్తకార

కమునందును, ధాత్వర్థమాత్రమందును, యథాసంభవముగా విధింపఁబడిన ఘఞ్, ఆచ్, అప్, నఙ్, ఙ, ఘ, అథుచ్ ఈ ప్రత్యయములు అంతములుగాఁ గల శబ్దములు పుంలింగములు. ఉ. సంజ్ఞయందు ఘఞ్ ప్రత్యమునకు – పాదః, రోగః, వేశః. కర్తృవ్యతిరిక్తకారకము నందలి ఘఞ్ ప్రత్యయమునకు – ప్రక్రియత ఇతి ప్రాకారః, పచ్యత ఇతి పాకః, రజ్యతే అనేనేతి రాగః, ప్రపతంత్యస్మాదితి ప్రపాతః, ప్రసీదంత్యస్మిన్నితి ప్రాసాదః. బావార్థమందలి ఘఞ్ ప్రత్యయమునకు – త్యాగః, భోగః, యాగః. ఆచ్ప్రత్యయమునకు – నయః, చయః, జయః. అప్ప్రత్యయమునకు – కరః, గరః, లవః. నఙ్ప్రత్యయమునకు–విఙ్ఞః, యత్నః, ప్రశ్నః. ఙ ప్రత్యయమునకు–న్యాదః. ఘ ప్రత్యమునకు – ఉరశ్ఛదః, దంతచ్ఛదః. అథుచ్ప్రత్యయమునకు – క్షవథుః, వేపథుః, శ్వయథుః ఇవి మొదలైనవి.

**ల్యుః కర్తరి -**

కర్త్రర్థమందు విధింపఁబడిన ల్యుప్రత్యయాంతములైన శబ్దములు పుంలింగములు. ఉ. నందనః, రమణః, దహనః, పవనః ఇవి మొదలయినవి.

**ఇమని జ్భావే -**

భావార్థమందు విధింపఁబడిన ఇమనిచ్ప్రత్యయాంతము లయిన శబ్దములు పుంలింగములు. ఉ. ప్రథిమా, మహిమా, గరిమా ఇవి మొదలయినవి.

**కోఘోః కిః ప్రాది తో ఽ న్యతః.** 15

భావార్థమందు విధింపఁబడిన క ప్రత్యయాంతములును, ప్రాద్యుప సర్గముల కంటెఁ బరమైన ఘు సంజ్ఞకమైన ధాతువుమీఁద విహితమైన కి ప్రత్యయాంత శబ్దములును ప్రాదివ్యతిరిక్తమైన శబ్దములకంటెఁ బరమైన ఘుసంజ్ఞికధాతువుమీఁద విధింపబడిన కిప్రత్యయాంతములయిన శబ్దములును పుంలింగములు. ఉ. భావార్థక ప్రత్యయమునకు–ఆఖూత్థః, శ్యేనోత్థః, ప్రస్థః, విఘ్నః. ప్రాదిపరఘువునకు– నిధిః, విధిః. ప్రాదివ్యతిరిక్తఘువునకు–వారిధిః, అంబుధిః ఇవి మొదలయినవి.

**ద్వన్ద్వే ఽ శ్వబడబా వశ్వబడబా వసమాహృతే,**

అసమాహృతే = సమాహారవ్యతిరిక్తమైన, ద్వందే = ఇతరేతర

యోగద్వంద్వమందున్న అశ్వబడబశబ్దములు పుంలింగములు. అశ్వబడబౌ. 'పూర్వవదశ్వబడబౌ' అనుసూత్రమందు ద్వివచనము అవివక్షితమని తెలుపుటకై 'అశ్వబడబాః' అని బహువచనాంతముగా మూలకారుఁడు చెప్పినాఁడు. సమాహారమందు 'అశ్వబడబం' అని నపుంసకము.

**కాన్త స్సూర్యేన్దు పర్యాయపూర్వో ఽ యః పూర్వకో ఽ పిచ.** 16

సూర్యేందుపర్యాయపూర్వః = సూర్యపర్యాయ శబ్దములును, ఇందు పర్యాయ శబ్దములును పూర్వముగాఁ గలిగినదియు, అయఃపూర్వకః = అయశ్శబ్దము పూర్వముగాఁ గలిగినట్టి, కాంతః = కాంతశబ్దము పుంలింగము. సూర్యకాంతః, రవికాంతః ఇందుకాంతః చంద్రకాంతః, అయస్కాంతః ఇత్యాదులు. అపిచ అన్నందున అయఃపర్యాయమైన లోహశబ్దముకంటెఁ బరమైన కాంతశబ్దము పుంలింగమని కొందఱు.

**వటక శ్చానువాకశ్చ రల్లకశ్చ కుడుఙ్గకః,**
**పుఙ్ఖో న్యూఙ్ఖ స్సముద్గశ్చ విట పట్ట ధటాః ఖటః.** 17
**కో ట్టారఘట్ట హట్టాశ్చ పిణ్డ గోణ్డ పిచణ్డవత్,**
**గడుః కరణ్డో లగుడో వరణ్డశ్చ కిణో ఘుణః.** 18
**దృతి సీమన్త హరిత రోమ న్థోద్గీథ బుద్బుదాః,**
**కాసమర్దో ఽ ర్బుదః కున్దః ఫేన స్తూపౌ సయూపకౌ.** 19
**ఆతపః క్షత్రియే నాభిః కణయ క్షుర కేదరాః,**
**పూర క్షురప్రచుక్రాశ్చ గోల హిఙ్గుల పుద్గలాః.** 20
**వేతాళి మల్లభల్లాశ్చ పురోడాశో ఽ పి పట్టసః,**
**కుల్మాషో రభసశ్చైవ సకటాహః పతద్గ్రహః.** 21

వటకశబ్దము మొదలు పతద్గ్రహాంత శబ్దములు పుంలింగములు. వటకః= భక్ష్యవిశేషము, అనువాకః = ఋక్కులయొక్కగాని, యజుస్సుల యొక్కగాని సముదాయము, రల్లకః = కంబళవిశేషము; మృగవిశేషమును, కడుంగకః = పొంద, పుంఖః = బాణపుపిడి, న్యూఙ్ఖః = నిరంతరముగా నుచ్చరింపఁబడిన యాఱు ఓంకారములు, సముద్గః = సంపుటము, విటః = కాముకుఁడు, పట్టః = లలాటభూషణము, ధటః = త్రాసు, ఖటః = తృణవిశేషము,

కోట్టః = దుర్గవిశేషము, అరఘట్టః = మహాకూపము, హట్టః = అంగడివీథి, పిండః = గ్రాసము, గోండః = దేశవిశేషము, పిచండః = ఉదరము, గడుః = కణితి, కరండః = సంపుటము, లగుడః = దుడ్డుకఱ్ఱ, వరండః = ముఖరోగము, కిణః = పుంటికాయ, ఘుణః = మ్రానుతొలుచు పురుగు, దృతిః = తోలుతిత్తి, సీమంతః = పాపట, హరితః = పక్షివిశేషము, రోమంథః = నెమరుపెట్టుట, ఉద్గీథః = సామప్రణవము, బుద్బుదః = నీరుబుగ్గ, కాసమర్దః = కసింద, అర్బుదః = వ్రణవిశేషము, కుందః = మల్లెచెట్టు, ఫేనః = నురుగు, స్తూపః = మన్ను మొదలయినవానిదిన్నె, యూపః = యజ్ఞమందలి పశువునుగట్టు స్తంభము, ఆతపః = ఎండ, నాభిః = ఒకానొకరాజు, కణయః = కుంతభేదము; శరభేదమని కొందఱు. క్షురః = కత్తి, కేదరః = వృక్షవిశేషము; పశువిశేషమును, పూరః = ప్రవాహము, క్షురప్రః = శరవిశేషము, చక్రః = పుల్లప్రబ్బలి, గోళః = వర్తులాకారమైన మృత్పిండాదులు, ఇంద్రియాధారమైన అవయవవిశేషము, విధవాపుత్రుఁడును, హింగులః = ఇంగిలీకము, పుద్గలః = జైనప్రసిద్ధుఁడైన జీవుఁడు; పరమాణువును, వేతాళః = పిశాచవిశేషము, భూతావిష్టశవమును, మల్లః = జట్టి, భల్లః = ఆయుధవిశేషము, పురోడాశః = పిండిచేతఁ జేసిన సహోమద్రవ్యము, పట్టసః = ఆయుధవిశేషము, కుల్మాషః = అర్ధపక్వములైన ముద్గగోధూమాదులు, రభసః = త్వర, కటాహః = బహు ద్రవ్యాధారమైన మృణ్మయాది భాండవిశేషము, పతద్గ్రహః = తమ్మపడిగ.

## నపుంసకలింగ శేషము

**నపుంసకే ఽ న్యత్ -**

అన్యత్ = పూర్వోక్తము లయిన స్త్రీలింగ పుంలింగములకంటె వేఱైన ముందరఁ జెప్పఁగల శబ్దములు. నపుంసకే = నపుంసకమందు వర్తించును. పా. తృతీయే ఽ న్యచ్చ' టీ.స 'తృతీయ ఽ న్యచ్చయ చ్ఛబ్దరూపం 'స్త్రీలింగే పుంలింగేవా వర్తతే' తతో ఽ న్యత్సర్వం తృతీయే నపుంసకలింగే భవ తీత్యర్థః. తదేవవివృణోతి. వజ్ర విమాన బింబమండలాది శబ్దానాం సత్యపి నపుంసకలింగత్వే తేషాం స్రీపుంసయోరపి వృత్తేః తదన్యత్వాభావనే వక్ష్యమాణ ప్రకరణవిషయత్వం నాస్తి. కింతు కేవల నపుసంకలింగానామేవేతి బోద్ధవ్యమ్.

**ఖారణ్య పర్ణశ్వభ్ర హిమోదకమ్,**
**శీతోష్ణమాంస రుధిర ముఖాక్షి ద్రవిణం బలమ్.** 22
**ఫల హేమ శుల్బ లోహ సుఖ దుఃఖ శుభాశుభమ్,**
**జలపుష్పాణి లవణం వ్యఞ్జనాన్యనులేపనమ్.** 23
**భయామృత శకృ ద్వస్త్ర చాపాభరణ లాఞ్ఛనమ్,**
**దార్వౌషధ మృధాపత్య హృదయోదర కాకుదమ్.** 24
**పత్త నాజిర శృంగార్మ ద్వార బర్హోడు మానసమ్,**
**ధ్వాన్తం చ -**

ఖం, అరణ్యం, పర్ణం, శ్వభ్రం, హిమం, ఉదకం, శీతం, ఉష్ణం, మాంసం, రుధిరం, ముఖం, అక్షి, ద్రవిణం, బలం, ఫలం, హేమం, శుల్బం, లోహం, సుఖం, దుఃఖం, శుభం, అశుభం, జలపుష్పం, లవణం, వ్యంజనం, అనులేపనం, భయం, అమృతం, శకృత్, వస్త్రం, చాపం, ఆభరణం, లాంఛనం, దారు, ఔషధం, మృధం, అపత్యం, హృదయం, ఉదరం, కాకుదం, పత్తనం, అజిరం, శృంగం, అర్మ, ద్వారం, బర్హం, ఉడు, మానసం, ధ్వాంతం. ఖం అనఁగా ఆకాశము, ఇంద్రియమును. తక్కినశబ్దముల యర్థము సుబోధ్యము. ఈయాకాశాదులకు పేళ్ళయిన శబ్దములును, సంభవించిన దిక్కున తద్విశేషవాచకములైన శబ్దములును, విశేషవిధిచేత బాధింపఁబడనివి నపుంసకములు. భయామృత యనునది మొదలు రెండుశ్లోకములు అధికశ్లోకములని కొందఱు వ్యాఖ్యాతలు వ్యాఖ్యానముఁ జేయరైరి. మఱికొందరు వ్యాఖ్యానముఁ జేసిరి.

**అవ్యక్తలింగస్య భణితౌ యత్ప్రయుజ్యతే.** 25

అవ్యక్తలింగస్య = స్త్రీయనిగాని పురుషుఁడనిగాని యెఱుఁగఁబడని వస్తువు యొక్క, భణితౌ = చెప్పుటయందు, యత్ = ఏశబ్దము, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నదో, ఆశబ్దము నపుంసకము. ఉ. స్త్రీ వాపుమాన్వాకిం తస్య జాతం తద్బ్రూహి పండిత.

**కోట్యాశ్శతాది సఙ్ఖ్యా ఒన్యా -**

కోట్యాః = కోటికంటె, అన్యా = వేఱైన, శతాదిసంఖ్యా = నూఱు మొదలయిన సంఖ్యావాచకశబ్దములు నపుంసకములు. కోటిశబ్దము స్త్రీలింగము.

**వా లక్షా నియుతంచ తత్,**

లక్షశబ్దము వికల్పముగా నపుంసకలింగము. పక్షాంతరమందు స్త్రీలింగము. తత్ = ఆలక్ష, నియుతం = నియుత మనంబడును. ఉ. స్త్రీ లింగమునకు - 'కియతీ పంచసహస్రీ కియతీ లక్షా ఉ థకోటిరపి కియతీ, ఔదార్యోన్నత మనసాం రత్నవతీ వసుమతీ కియతీ'.

**ద్వ్యచ్కమసి సుసన్నన్తమ్ -**

ద్వ్యచ్కం = డచ్చులు గలిగిన అస్, ఇస్, ఉస్, అన్ ఈ ప్రత్యయములు అంతములుగాఁ గలిగిన శబ్దములు నపుంసకములు. ఉ. అసంతమునకు - యశ, పయః, తేజః, తమః, ఛందః, నభః, వర్చః, వయః, రజః, మహః. ఇసంతమునకు- బర్హిః, సర్పిః, రోచిః, జ్యోతిః. ఉసంతమునకు - యజుః, నపుః, ధనుః. అనంతమునకు - సామ, లోమ, వర్మ ఇత్యాదులు.

**యదనాన్త మకర్తరి** 26

అకర్తరి - కర్త్రర్థవ్యతిరిక్తములైన కరణాధికరణభావాద్యర్థముల యందు విధింపఁబడిన ల్యుట్ ప్రత్యయము మొదలైన ప్రత్యయములకు నాదేశమైన, అనాన్తంయత్ = అన అనునది అంతముగాఁ గల శబ్దములు నపుంసకములు. ఉ. కరణార్థమునకు - సాధ్యతే అనేనేతి సాధనం. అధికరణార్థమునకు - అధిక్రియతే అస్మిన్నితి అధికరణం. భావార్థకమునకు-పచనం ఇత్యాదులు. టీ. స. అత్ర అనశబ్దేన 'యువోరనాకా' వితి సూత్రప్రాప్తం ఆదిష్టరూపం వివక్షితం. తేన సునః, అభినః, సంతానః, సమాన ఇత్యాదౌ న ప్రసంగః. అత్ర కర్తృపదం కారక మాత్రోపలక్షకం, సర్వేషామపి కారకాణాం స్వస్వవ్యాపారే కర్తృత్వాత్. తదుక్తం - "స్వవ్యాపారేషు కర్తృత్వం సర్వేషాముపజాయతే, విక్లిద్యంతి జ్వలంతీతి బిభ ర్తీతిచ దర్శనాత్." విక్లిద్యంతి తండులా ఇత్యత్రవచనరూపే వ్యాపారే కర్మభూతానాం తండులానాం విక్లిత్తౌకర్తృత్వం. జ్వలంతి కాష్ఠానీత్యత్ర జ్వలనవ్యాపారే కరణభూతానాం కాష్ఠానాం కర్తృత్వం. బిభర్తిస్థాలీత్యత్ర తండులధారణరూపవ్యాపారే అధికరణాయాః స్థాల్యాఃకర్తృత్వం. తతశ్చ, కారకవ్యతిరిక్తేభావమాత్రే విహితానాంతం నపుంసకలింగం భవతీత్యుక్తం. యథా___ హరణం, గమనం,

భోజనమిత్యాది. అకర్తరీతికిం. నందయతీతి నందనః. ముఖసహితయా నాసికయా ఉచ్యత ఇతి ముఖనాసికావచనః. రాజభి ర్భుజ్యంత ఇతి రాజ భోజనాశ్శాలయః. ఇధ్మః ప్రవ్రశ్చ్యతే అనేనేతి ఇధ్మప్రవ్రశ్చనఃకుఠారః. మాంసంపచ్యతే అత్రేతి మాంసపచనీ. ఇత్యాది కారకార్థానా మనపుంస కత్వమవగంతవ్యం. అకర్తరీత్యస్య భావవచనం అనాంతం నపుంసక మిత్యత్రైవతాత్పర్యాత్. అన్యత్ర చ ఔ దాసీన్యాత్. భావార్థవ్యతిరిక్త వృత్తానాం తస్యాపి క్వచిన్నపుంసకత్వం న నిషిధ్యతే. యథా సాధ్యతే అనేనేతి సాధనమిత్యాదీని.

**త్రాన్తం సలోపధం శిష్టమ్ -**

శిష్టం = విశేషవిధిలేని, త్రాంతం = త్ర అనువర్ణము అంతముగాఁ గల శబ్దమును, సలోపధం లకారోపధములతోఁ గూడుకొనియున్న శబ్దములును నపుంసకములు. ఉ. త్రాంతమునకు–పత్రం, పాత్రం,పతత్రం, గోత్రం, గాత్రం; సలోపధమునకు – కులం, ఫలం, ఆవాలం, ఆలవాలం ఇత్యాదులు. కొందఱు సలోపధం అనుదానికి సకారోపధములును నపుంసకము లని చెప్పి బిసం, సాధ్వసం, సాహసం అని యుదాహరణములు చెప్పుదురు. మఱికొందఱు, త్రాన్తంసనోపధం అనుపాఠమును జెప్పి కేవలత్రాంతములయిన పాత్రకళత్రాదిశబ్దములును, సకారోపధములై త్రాంతములయిన వస్త్రశస్త్రాదిశబ్దములును, నకారోపధములై త్రాంతములయిన ఆంత్ర తంత్రాది శబ్దములును నపుంసకలింగము లని యర్థము చెప్పుదురు.

**రాత్రం ప్రాక్సంఖ్యయా ఽ న్వితమ్,**

సంఖ్యాపూర్వపదమైన రాత్రశబ్దము నపుంసకలింగము. ఉ. త్రిరాత్రం, పంచరాత్రం.

**పాత్రాద్యదన్తై రేకార్థో ద్విగు ర్లక్ష్యానుసారతః.** 27

పాత్రాద్యదంతైః = పాత్రశబ్దము మొదలయిన అకారాంత శబ్దములు త్తరపదములుగాఁ గల, ఏకార్థః = సమాహారార్థమందు వర్తించిన, ద్విగుః= ద్విగుసమాసము. లక్ష్యానుసారతః = ప్రయోగానుసారమువలన నపుంసక లింగము. ఉ. పంచరాత్రం, చతుర్యుగం, త్రిభువనం. పాత్రాదిగణ మాకృతిగణము గనుక, 'లక్ష్యానుసారతః' అని చెప్పినాఁడు.

**ద్వన్ద్వైక త్వావ్యయీభావౌ -**

సమాహారార్థమందు వర్తించునట్టి ద్వంద్వసమాసమును, వ్యయీభావ సమాసమును నపుంసకలింగములు. ఉ. సమాహారద్వంద్వమునకు– పాణిపాదం, అశ్వబలీవర్దం, ధవఖదిపలాశం. అవ్యయీభావమునకు – ఉపకుంభం, యావదమంత్రం.

**పథస్సంఖ్యావ్యయా త్పరః,**

సంఖ్యావాచక శబ్దములకును, అవ్యయములకును పరమై కృత సమాసాంతమైన పథశబ్దము, విశేషవిధిబాధితముగానిది నపుంసకలింగము. ఉ. సంఖ్యాపూర్వకమునకు – త్రిపథం, చతుష్పథం; అవ్యయపూర్వకమునకు – విపథం, సుపథం.

**షష్ఠ్యా శ్ఛాయా బహూనాంచే ద్విచ్ఛాయమ్ -**

షష్ఠ్యంతమునకు పరమందుండు చాయాశబ్ద మంతముగాఁగల తత్పురుషసమాసము ఆఛాయ బహువస్తువులయొక్క సంబంధము గలదైన 'ఛాయాబాహుళ్యే' అనుసూత్రముచేత నపుసంకలింగము. ఉ. వీనాం పక్షిణాం ఛాయా విచ్చాయం. ఈలాగుననే శలభచ్ఛాయం ఇత్యాదులు.

**సంహతౌ సభా.** 28

**శాలార్థాపి పరా రాజా మనుష్యార్థా దరాజకాత్,**
**దాసీసభం నృపసభం రక్షస్సభ మిమా దిశః.** 29

షష్ఠ్యంతమునకు పరమైన సమూహార్థమందు వర్తించునట్టి సభాశబ్దము అంతముగాఁ గల తత్పురుషసమాసమును, షష్ఠ్యంతములైన రాజశబ్దవ్యతిరిక్తములయిన రాజపర్యాయములకును, అమనుష్యార్థములయిన రక్షః పిశాచాది శబ్దములకును పరమై శాలార్థమును జెప్పెడు సభాశబ్దము అంతముగాఁ గల తత్పురుషసమాసమును. 'సభారాజా మనుష్యపూర్వా, అశాలాచ' అను సూత్రముచేత నపుంసకలింగములు. ఉ. సమూహార్థమందలి సభాశబ్దమునకు – 'దాసీసభం'. రాజశబ్దపర్యాయపూర్వమైన సభాశబ్దమునకు – 'నృపసభం'. అమనుష్యార్థమునకు – 'రక్షస్సభం, 'ఇమాదిశః' అన్నందువలన 'ఈశ్వరసభం', 'పిశాచసభం' ఇత్యాదులును.

**ఉపజ్ఞోపక్రమాన్తశ్చ తదాదిత్వ ప్రకాశనే,**
**కోపజ్ఞ కోపక్రమాది -**

ఉపజ్ఞ యనఁగా తనంతట నెఱుఁగఁబడినది. ఉపక్రమ మనఁగా నొకడు చెప్పకయే తనచేత నారంభింపఁబడినది. ఈ ఉపజ్ఞోపక్రమశబ్దములు అంతములుగాఁ గల షష్ఠీతత్పురుష సమాసము ఈయర్థములకు మొదటఁ దోచునపుడు నపుంసకలింగము. ఉ. కోపజ్ఞం, కోపక్రమం అని ఉపజ్ఞాయత ఇత త్యుపజ్ఞా, కస్య బ్రహ్మణః ఉపజ్ఞా కోపజ్ఞం వేదః. తేన ఆదౌ జ్ఞాయత ఇత్యర్థః. ఉపక్రమ్యత ఇత్యుపక్రమః. కస్య బ్రహ్మణః ఉపక్రమః కోపక్రమం సర్గః. తేనాదౌ కృత ఇత్యర్థః. ఆదిశబ్దముచేత, ప్రాచేతసోపజ్ఞం రామాయణం ఇత్యాదులు.

**క న్థో నర నామసు.** 30

ఉశీనర దేశముయొక్క నామధేయములు విషయములైనప్పుడు కంథాశబ్దము అంతముగాఁ గల షష్ఠీతత్పురుషము నపుంసకలింగము. ఉ. సౌశమీనాం కంథా సౌశమికంథం ఆహ్వారకంథం, ఇత్యాదులు.

**భావే న ణ క చిద్భ్యో ఽ న్యే సమూహే భావ కర్మణోః,**
**అదన్తప్రత్యయాః -**

న ప్రత్యయ ణ ప్రత్యయ క ప్రత్యయ చకారేత్ప్రత్యయముల కంటె నన్యములయి ధాత్వర్థమందు విధింపఁబడిన కృత్ప్రత్యయములును, సమూహార్థ మందును, భావకర్మార్థములయందును విధింపఁబడిన అకారాంత తద్ధిత ప్రత్యయములను అంతములుగాఁ గల శబ్దములు నపుంసకలింగములు. ఉ. ధాత్వర్థమందలి కృత్ప్రత్యయమునకు–త్వయా వస్తవ్యం, అసితవ్యం ఇవి 'తవ్యత్తవ్యానీయరః' అను సూత్రముచేత తవ్యప్రత్యయాంతములు. చేయం, జేయం ఇవి 'అచోయత్' అను సూత్రముచేత యత్ప్రతయయాంతములు. బ్రహ్మభూయం, దేవభూయం ఇవి 'భువోభావే' అను సూత్రము చేత కృత్ప్రత్యయాంతములు. సాంరావిణం వర్తతే–ఇది 'అభిధౌ భావ ఇనుణ్ అను సూత్రముచేత ఇనుణ్ ప్రత్యయాంతము. అకారాంతతద్ధితములకు సమూహార్థ మందు– భిక్షాణాం సమూహో భైక్షం, గార్భిణం, యౌవతం. ఇవి 'భిక్షాదిభ్యో ఽ ణ్' అనుసూత్రము చేత అణ్ప్రత్య యాంతములు. భావ కర్మార్థములకు – శుక్లస్య భావః కర్మ వా

వా శౌక్లం. బ్రాహ్మణస్య భావః కర్మ వా బ్రాహ్మణ్యం. ఇవి 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చ' అనుసూత్రముచేత ష్యఞ్ ప్రత్యయాంతములు. న ణ క చిత్ప్రత్యయాంతములు నపుంసకలింగములు కావు. ఎట్లనిన ___ యజ్ఞః, యాచ్ఞా, యత్నః, విశ్నః, ప్రశ్నః, రక్ష్ణః-ఇవి 'యజయాచ యత విచ్ఛ ప్రచ్ఛ రక్షో నఙ్' అనుసూత్రముచేత నఙ్ప్రత్యయాంతములు. వందనః, ఆసనా, శ్రంథనా-ఇవి 'ణ్యాసశ్రన్థోయుచ్' అనుసూత్రముచేత యుచ్ప్రత్యయాన్తములు.

**పుణ్యసుదినాభ్యాం త్వహః పరః.** 31

పుణ్య సుదినశబ్దములకు పరమందుండు కృతసమాసాంత ప్రత్యయమయిన అహశ్శబ్దము 'పుణ్యసుదినాభ్యామహ్నః క్లీబతేష్టా' అను వార్తికముచేత నపుంసక లింగము. ఉ. పుణ్యాహం, సుదినాహం, సుదినశబ్దము శోభనవాచకము.

**క్రియావ్యయానాం భేదకా న్యేకత్వే ఽ పి -**

క్రియావిశేషణములును అవ్యయవిశేషణములును నపుంసకలింగములును ఇవి యేకవచనములై యుండును. ఉ. క్రియావిశేషణములకు-మందం పచతి, మృదు పచతి. అవ్యయవిశేషములకు-శ్వశ్శోభనం, శ్వోరమణీయం ఇత్యాదులు. ఈ ప్రకారముగా లక్షణముఖమున లింగనిర్ణయమును జెప్పి యిపుడు కొన్నిటికి స్వరూపముచేత లింగనిర్ణయమును జెప్పుచున్నాఁడు.

**ఉక్థ తోటకే,**

**చోచ ముక్తం గృహ స్థూణం తిరీటం మర్మ యోజనమ్.** 32

**రాజసూయం వాజపేయం గద్య పద్యే కవేః కృతౌ.**

**మాణిక్య భాష్య సిన్దూర చీర చీవర పఞ్జరమ్.** 33

**లోకాయతం హరీతాళం విదళం స్థాల బాహ్లికమ్,**

ఉక్థశబ్దము మొదలు బాహ్లికశబ్ద పర్యంతములయిన శబ్దములు నపుంసక లింగములు. ఉక్థం = సామవిశేషము, తోటకం = వృత్తవిశేషము, చోచం= భుక్తశేషమయిన ఫలాదులు ; లవంగమని కొందఱు. ఉక్తం = ఏకాక్షరఛందస్సు, పింఛమను పాఠమున నెమలిపురి యర్థము. గృహస్థూణం = ఇంటికంబము, తిరీటం = చుట్టుట, పా.కిరీటం. మర్మ = ఆయము,

యోజనం = నాలుగు క్రోశములు. రాజసూయం, వాజపేయం = యజ్ఞవిశేషములు, కవేః కృతౌ గద్యం, పద్యం = కవియొక్క కృతియందుండెడు గద్యమును, పద్యమును; వరుసగా ఛందోబద్ధముగాని వాక్యరచనయును, ఛందోబద్ధమైన వాక్యరచనయును. కవికృతివ్యతిరిక్తమందుండు గద్యపద్య శబ్దములు మూఁడులింగములయందును వర్తించును. గద్యా వాక్ గద్యో ఽ ర్థః, గద్యంవచనం, పద్యాధూళిః, పద్యః పంకః, పద్యం రజః అని. మాణిక్యం = రత్నము, భాష్యం = సూత్రవ్యాఖ్యాన గ్రంథము, సిందూరం = రాగద్రవ్య విశేషము, చీరం = నారచీర, చీవరం = మునివస్త్రము, పంజరం = పంజరము, లోకాయతం= చార్వాకశాస్త్రము, హరితాళం = హరిదళము, విదళం = దానిమ్మగింజ; కొందఱు = పెసరబేడలు, వెదురుబద్దలు మొదలయినవని చెప్పుదురు. స్థాలం = భోజనపాత్రము, బాహ్లికం = దేశవిశేషము, కుంకుమపువ్వని కొందఱు.

## పుంనపుంసకలింగ శేషము

**పుంనపుంసకయో శ్శేషః -**

'పుంనపుంసకయోః' అనుపదము స్త్రీపుంసాధికారముదనుక ననువర్తించును. శేషః = పున్నపుంసకవివరణములందుఁ జెప్పఁబడని అర్ధర్చాది శబ్దములు, పుంనపుసంకయోః = పుంలింగ నపుంసకలింగముల యందు వర్తించును.

**అర్ధర్చ పిణ్యాక కణ్టకాః.** 34
**మోదక స్తణ్డకష్టఙ్క శ్శాటకః ఖర్వటో ఽ ర్బుదః,**
**పాత కోద్యోగచరకతమాలామలకా నడః.** 35
**కుష్ఠం ముణ్డం శీధు పుస్తం క్ష్వేడితం క్షేమ కుట్టిమమ్,**
**సంగమం శతమానార్మ శమ్బళావ్యయ తాణ్డవమ్.** 36
**కవికం కన్ద కార్పాసం పారావారం యుగన్ధరమ్,**
**యూపం ప్రగ్రీవ పాత్రీవే యూషం చమస చిక్కసే.** 37

ఋచో ఽ ర్ధం అర్ధర్చం = ఋక్కులో సగము. పిణ్యాకః = గానుగ పిండి, ఇంగువ మొదలయినవి, కంటకః = ముల్లు, క్షుద్ర శత్రువు, రోమాంచము మొదలయినవి. మోదకః = అపూపవిశేషము, తండకః = భూషణ విశేషము. 'దండక' అని కొందఱిపాఠము. అప్పుడు వృత్తభేదము. టంకః =

ఉలి, శాటకః = చిన్నచీర, ఖర్వటః = గ్రామశతమధ్యమందుండు ప్రధాన గ్రామము, ఉపగ్రామమని కొందఱు, కంటకావృతగ్రామమని కొందఱు. పా. కర్పటః = చిన్నపంచె, కౌపీన మని కొందఱు. అర్బుదః = మాంసము, పక్షి, సంఖ్యావిశేషము, దంతరోగమును. పాతకః = పాపము, ఉద్యోగః = ఉత్సాహము, చరకః = వైద్యగ్రంథము, కూర్చిన రెండు కోకలని కొందఱు. తమాలః = చీఁకటిమ్రాను, అమలకః = ఉసిరికకాయ, నడః = క్రాలుకసవు, కుష్ఠం = రోగము, చెంగల్వకోష్ఠును, ముండః = కబంధము, శీధుః = మద్యవిశేషము, పుస్తం = పూయుట మొదలయిన క్రియ పుస్తకమును, బుస్తమని కొందఱి పాఠము. అప్పుడు మాంసవిశేషము. క్ష్వేడితం = సింహనాదము, క్షేమం = కుశలము, కుట్టిమం = శిలాదులచేతఁ గట్టఁబడిననేల, సంగమం = కూటమి, శతమానం = పలపరిమితమైన వెండి, తూమెఁడు ధాన్యము మొదలైనవని కొందఱు. అర్మ = నేత్రరోగము, నకారాంతము అకారాంతము, శంబళం = సంబళము, అవ్యయం = చాదులు మొదలయినవి, తాండవం = నాట్యము, కవికం = కళ్లెము, కవీయమని కొందఱు. కందం = వేరుదుంప, కార్పాసం = ప్రత్తి, పారం = అవ్వలిదరి, అవారం = ఇవ్వలిదరి, యుగంధరం = రథమునొగ, పర్వతవిశేషమని కొందఱు పూయం = చీము, ప్రగ్రీవం = గవాక్షి మదనచేతులని కొందఱు. పాత్రీవం = యజ్ఞోపకరణము, యూషం = పెసలు మొదలయినదానికట్టు, చమసం = యజ్ఞపాత్ర, చిక్కసం = యవాదులయొక్క పిష్టము.

**అర్ధర్చాదౌ ఘృతాదీనాం పుంస్త్వం యద్వైదికం ధ్రువమ్,**
**తన్నోక్త మిహ లోకే ఽ పి తచ్చే ద స్త్యస్తు శేషవత్.** 38

అర్ధర్చాదిగణమందు ఘృతక్షీరాదిశబ్దములకుఁ జెప్పఁబడిన పుంలింగము నిశ్చయముగా వేదసిద్ధము. ఇక్కడ లింగనిర్ణయము లౌకికశబ్దములకేకాని వైదికశబ్దములకుఁ గాదు గనుక ఆఘృతక్షీరాదులకు పుంలింగ మిక్కడ చెప్పఁ బడలేదు. లోకమందును పుంలింగప్రయోగము గలిగెనేని, 'శేషం తు జ్ఞేయం శిష్టప్రయోగతః' అని ముందరఁ జెప్పుచున్నాఁడు గనుక పూర్వికులైన మహాకవుల యొక్క ప్రయోగమువలనఁ దెలిసికొనునది.

# స్త్రీ పుంలింగ శేషము

**స్త్రీపుంసయోః -**

'స్త్రీపుంసయోః' అనుపదము స్త్రీనపుంసకాధికారము దనుక ననువర్తించును.

**అపత్యాన్తాః -**

"తస్యాపత్యం, అత ఇఞ్, గర్గాదిభ్యో యఞ్" ఇవి మొదలైన సూత్రములచేత నపత్యార్థమందు విధింపఁబడిన అణ్, ఇఞ్, యఞ్ ఇవి మొదలైన ప్రత్యయములు అంతములుగాఁ గల శబ్దములు స్త్రీపుంలింగములయందు వర్తించును. ఉ. ఔపగవః, ఔపగవీ – దాక్షః, దాక్షీ – గార్గ్యః, గార్గీ.

**ద్విచతుష్షట్ప దోరగాః,**

**జాతిభేదాః -**

ద్విపద చతుష్పద షట్పదజాతిభేదములఁ జెప్పు శబ్దములును, సర్పజాతి విశేషవాచక శబ్దములును, స్త్రీలింగపుంలింగములయందు వర్తించును. ఉ. ద్విపజాతికి – పురుషః, పురుషీ; కుక్కుటః, కుక్కటీ. చతుష్పద జాతికి – మృగః, మృగీ, అయం గౌః ఇయం గౌః; అయం కపిః, ఇయం కపిః. షట్పదజాతికి – భ్రమరః, భ్రమరీ. సర్పవాచకములకు – ఉరగః, ఉరగీ; అయమహిః, ఇయమహిః; ద్విపదాదిజాతులను నిది ఉపలక్షణము గనుక ద్విపదాతులు కాని మత్స్యః, మత్సీ; ద్రూణిః, ద్రూణీ అనునివి మొదలైన జాతివాచకశబ్దములును స్త్రీపుంలింగములు.

**పుమాఖ్యాశ్చ స్త్రీ యోగైస్సహ -**

పురుషవాచకములైన ప్రష్ఠగోపాలశబ్దములు ఆపురుషసంబంధమువలన 'పుంయోగాదాఖ్యాయాం' అను సూత్రముచేత స్త్రీయందు వర్తించెనేని స్త్రీ పుంలింగములు. ఉ. ప్రష్ఠః, ప్రష్ఠీ; గోపాలః, గోపాలీ; గణకః, గణకీ. టీ. స. పుంస ఆచక్షత ఇతి పుమాఖ్యాః. పురోగత్వాది గుణ విశిష్ట పురుషేష్వేవ ప్రయుక్తత్వా దత్ర పుమాఖ్య బ్దేన ప్రష్ఠమహామాత్రగణకాదిశబ్దా ఉచ్యన్తే. స్త్రీతి భిన్నపదం, స్త్రీ కర్త్రీ. యోగైః స్వస్వపురుష సంబంధైః స్వస్వామిభావాదిభిః హేతుభూతైః పుమాఖ్యాం స్వస్వపురుషాఖ్యాం లభతే. పురుషే వర్తమానం ప్రాతిపదికం

తత్సంబద్ధాయాం స్త్రియామపి వర్తత ఇత్యర్థః. తథాచ. ఏకస్యైవ లింగద్వయవర్తిత్వ మిత్యాశయః. యథా ___ ప్రష్టస్య భార్యా ప్రష్ఠీత్యాది. తథాచ జయాదిత్యః 'పుంయోగాద్ధేతోః ప్రాతిపదికం పుంస ఆఖ్యాభూతంస్త్రియాం వర్తత' ఇతి. అస్మిన్వ్యాఖ్యానే సహేతి పద ముత్తరేణ సంబధ్యతే. అన్యస్తు వ్యాచష్ట స్త్రీయోగైరిత్యనంతరస్య సహశబ్దస్య పూర్వేణ సంబంధః. పుమాఖ్యాప్రష్ఠగణకాదిశబ్దాః స్త్రీయోగై స్సహ స్త్రీణాం పుంయోగ నిమిత్తకాఖ్యాభిః ప్రష్టీత్యాదిభిస్సహ స్త్రీపుంసయోర్వర్తంత ఇతి.

అవ. ఈప్రకారముగా లక్షణముఖమున లింగనిర్ణయమును జెప్పి ఇంక నామముఖమున లింగనిర్ణయమును జెప్పుచున్నాఁడు___

**మల్లకః.** 39

**యోని ర్వరాటక స్స్వాతి ర్వర్ణకో ఝాటలో మనుః,**
**మూసా సృపాటీ కర్కన్ధూ ర్యష్టి శ్శాటీ కటీ కుటీ.** 40

మల్లశబ్దము మొదలు కుటీశబ్ద పర్యంతములైన శబ్దములు స్త్రీ పుంలింగములు. మ్లకః, మల్లకా = ప్రమిద, యోనిః; మునియని కొందఱు. అపుడు మునిః = తపస్వి, తపస్విని. వరాటకః, వరాటికా = గవ్వ, తామరదుద్దని కొందఱు. అయం స్వాతిః, ఇయం స్వాతీ = నక్షత్ర విశేషము. వర్ణకః, వర్ణికా = నీలి మొదలయిన వన్నెలు. వల్లకః–అని పాఠముగలదు. అపుడు వల్లకః, వల్లకీ = వీణ. ఝాటలః, ఝాటలీ = మొక్కపుచెట్టు. అయం మనుః, ఇయం మనుః = మనువు, మనువు పెండ్లామును. మూషః, మూషా = బంగారు మొదలైనవి కరిగించెడు క్రోవి. సృపాటిః, సృపాటీ = పరిమాణవిశేషము, నదీవిశేషమని కొందఱు. పా. కృపాటిః, కృపాటీ. అయం కర్కంధూః, ఇయం కర్కంధూః = రేఁగుచెట్టు. అయంయష్టిః, ఇయంయష్టిః = కోల. అయం శాటః, ఇయం శాటీ = కోక. కటః, కటీ – మొల. కుటీ = గుడిసె.

**స్త్రీనపుంసకయోర్భావ క్రియయో ష్ష్యఞ్ క్వచిచ్చ వుఞ్,**
**ఔచిత్య మౌచితీ మైత్ర్యం మైత్రీ వుఞ్ ప్రాగుదాహృతః.** 41

'స్త్రీనపుంసకయోః' అనుపదము త్రిలింగాధికార పర్యంతము అనువర్తించును. భావకర్మార్థముల యందు 'గుణవచన బ్రాహ్మణాదిభ్యః

కర్మణి చ, వర్ణదృఢాదిభ్యః ష్యఞ్చ' ఇత్యాదిసూత్రములచేత విధింపఁబడిన ష్యఞ్ ప్రత్యయమును, 'ద్వంద్వమనోజ్ఞాదిభ్యశ్చ, గోత్రచరణాచ్ఛ్లాఘాత్యాకారతదవేతేషు' ఇత్యాది సూత్రములచేత విధింపఁబడిన వుఞ్ ప్రత్యయమును అంతముగాఁ గల శబ్దములు ఒకానొక దిక్కున స్త్రీలింగ నపుంసకలింగములు. ఉ. ష్యఙ్ప్రత్య యాంతమునకు– ఔచిత్యం, ఔచితీ; మైత్ర్యం, మైత్రీ అని. ఇవి దిఙ్మాత్రములు గనుక వైదగ్ధ్యం, వైదగ్ధీ; ఆనుపూర్వ్యం, ఆనుపూర్వీ; త్రైలోక్యం, త్రైలోకీ అనునివి మొదలయినవి తెలిసికొనునది. 'క్వచిచ్చ' అన్నందువలన బ్రాహ్మణ్యం, దార్ఢ్యం, జాడ్యం, శౌక్ల్యం అనునివి మొదలయిన దిక్కుల నపుంసక లింగమేకాని స్త్రీలింగము కాదు. వుఞ్ ప్రత్యయాంతమునకు–మనుష్య వర్గాదులయందు చౌరికా, ఆహోపురుషికా, వార్ధకం అని మునుపు చెప్పఁబడెను. ఇక్కడ క్వచిద్గ్రహణమువలన వుఞ్ ప్రత్యయాంతములు కొన్ని స్త్రీలింగములే; కొన్ని నపుంసకలింగములే; కొన్ని స్త్రీనపుంసకలింగములు. ఉ. ఆహోపురుషికా, ఆముష్యపుత్రికికా, శైష్యోపాధ్యాయకా, గార్గికా, కారికా అనునివి మొదలయినవి స్త్రీలింగములే. మానోజ్ఞకం, వార్ధకం, రామణీయకం అనునివి మొదలయినవి నపుంసకములే. చౌరికం, చౌరికా అనునివి మొదలయినవి స్త్రీనపుంసకములు గనుక ప్రయోగమువలనఁ దెలిసికొనునది. టీ. స. ఇహ ష్యఞంత వుఞంత శబ్దమధ్యే కేషాం కేవల స్త్రీ లింగత్వం కేషాం నపుంసకలింగత్వం కేషాముభయలింగత్వమితి జిజ్ఞాసాయాం, క్వచిచ్ఛబ్దసంజాతాం శంకాం వారయితుం శేషకార ఆహః___ 'స్యా దౌచిత్యం మైత్ర్యం శైల్యానుపూర్వ వైదగ్ధ్యసామగ్ర్యం, చాతుర్యం వాణిజ్యం పారిఖ్యాత్య మపి సామాచార్యం, వైదుష్యం మౌఖర్యం యాథా కామ్యార్థ్వం త్యసాహిత్యం, స్యాదౌచితీ చ మైత్రీ శైల్యానుపూర్వీ చ వైదగ్ధీ, స్యా త్సా మగ్రీ చాతురీస్యాత్ వాణిజ్యా పారిఖ్యాత్యపి, సామాచారీ వైదుషీ చ యాథాకామీ చ మౌఖరీ, ఆర్త్వంతీ సాహితీ చ స్యురితి పంచదశ ష్యఞి, స్త్రీనపుంసకయో రేవం చౌరికా చౌరికం తథా, ధౌర్తికం ధౌర్తికా శారపత్రికా శారపత్రకం, కౌలపుత్రికా కౌల పత్రికమేతే స్త్రియాంనపి, ఆమోపౌరుషికా చ స్యాదాహోపురుషికా తథా, ఆముష్య పుత్రికా చా

దో రూపికా వైశ్యదేవికా, కుమారికా పుత్రికా చ కులికాచ కులాలికా, షండికా చేతి పంచ స్యుః గ్రామశబ్దా త్పరేస్త్రియామ్, పరిశిష్టం మనోజ్ఞాదౌ నపుంసక మితి స్థితిః".

**షష్ఠ్యన్తప్రాక్పదా స్సేనా ఛాయా శాలా సురా నిశాః,**
**స్యు ర్వా నృసేనం శ్వనిశం గోశాల మితరే చ దిక్.** 42

షష్ఠ్యంతము పూర్వపదముగాఁ గలిగిన సేనా, ఛాయా, శాలా, సురా, నిశాశబ్దములు 'విభాషా సేనా సురా ఛాయా శాలా నిశానాం' అను సూత్రముచేత స్త్రీనపుసంకలింగములు. ఉ. 'నృసేనం' అనునివి మొదలయినవి. నృనాం సేనా నృసేనం. శునాం నిశా శ్వనిశం-కృష్ణచతుర్దశీ. గవాంశాలా గోశాలం. స్యుర్వా అని వాగ్రహణమువలన నృసేనా, శ్వనిశా, గోశాలా అనునివి స్త్రీలింగములునని తెలిసికొనునది. ఇతరే చ అన్నందువలన వృక్షచ్ఛాయా, వృక్షచ్ఛాయం. యవసురా, యవసురం అని కడమ యుదాహరణములు తెలిసికొనునది. దిక్ అన్నందున ఈ యుదాహరణములు దిఙ్మాత్రములు గనుక పాండవసేనా, పాండవసేనం అనునివి మొదలయినవి తెలిసికొనునది. టీ. స. శ్వానః కస్యాం చి చ్చతుర్ధశ్యాముపవసంతి త చ్ఛ్వనిశ మితి క్వచి త్ప్రసిద్ధిః.

**ఆబన్నన్తో త్తరపదో ద్విగు శ్చాపుంసి నశ్చ లుప్,**
**త్రిఖట్వం చ త్రిఖట్వీ చ త్రితక్షం చ త్రితక్ష్యపి.** 43

ఆబంతమును, అన్నంతమును ఉత్తరపదముగాఁ గల ద్విగుసమాసము 'ఆబంతో వా అనూనలోశ్చ వాస్త్రియాం' అనువార్తికమువలన స్త్రీ నపుంసక లింగములయందు వర్తించును. అన్నంతముయొక్క సకారమునకు లోపము వచ్చును. 'త్రిఖట్వం' అనునివి మొదలైనవి యుదాహరణములు. తసృణాం ఖట్వానాం సమాహారః త్రిఖట్వం, త్రిఖట్వీ. త్రయాణాం తక్ష్ణాం సమాహారః త్రితక్షం, త్రితక్షీ.

## త్రిలింగ శేషము

**త్రిషు పాత్రీ పుటీ పేటీ వాటీ కువల దాడిమౌ,**

పాత్రీశబ్దము మొదలు ౬ శబ్దములు మూఁడులింగములయందు వర్తించును. పాత్రీ, పాత్రః, పాత్రం = భోజనాదిపాత్ర. పుటీ, పుటః, పుటం = దొప్ప. ఆచ్ఛాదన మని కొందఱు. పేటీ, పేటః, పేటం = పెట్టె. వాటీ,

వాటః, వాటం = చుట్టు నావరణము గల స్థల విశేషము. పఙ్క్తియు. కువలీ, కువలః, కువలం = రేఁగుచెట్టు. దాడిమీ, దాడిమః; దాడిమం = దానిమ్మచెట్టు. కువలదాడిమ శబ్దములు నపుంసకము లైనప్పుడు ఫలములఁ జెప్పును.

## పరల్లింగ శేషము

**పరలిఙ్గం స్వప్రధానే ద్వన్ద్వే తత్పురుషే ఽపి చ.** 44

స్వప్రధానే ద్వంద్వే = ఇతరేతరయోగద్వంద్వమందును, తత్పురుషే ఽపిచ = తత్పురుషసమాసమందును, పరలింగం = పరవలింగం ద్వంద్వ తత్పురుషయోః అనుసూత్రముచేత పరపదమునకు ఏలింగమో ఆ లింగము గలుగును. ఉ. ఇతరేతర యోగద్వంద్వమునకు - కక్కుటశ్చ మయూరీ చ కుక్కుటమయూర్యౌ, మయూరీతామ్రచూడౌ, తత్పురుష సమాసమునకు-అర్ధం పిప్పల్యాః అర్ధపిప్పలీ, కరికిసలయం, భుజలంతా.

## వాచ్యలింగ శేషము

**అర్ధాన్తాః ప్రాద్యలం ప్రాప్తాపన్నపూర్వాః పరోపగాః,**

అర్ధశబ్దము అంతముగాఁగల సమాసమును, ప్రవరాద్యుపసర్గలును, అలంశబ్దమును, ప్రాప్తశబ్దమును, ఆపన్నశబ్దమును పూర్వముగాఁ గల సమాసములును తత్పురుషసమాసములైనను, 'అర్ధేన నిత్యసమాసస్సర్వలింగతా చ వక్తవ్యా, ద్విగుప్రాప్తాన్నాలం పూర్వగతి సమాసేషు' అను వార్తికములచేత 'పరవల్లింగం ద్వంద్వతత్పురుషయోః' అను సూత్రముచేత వచ్చిన పరలింగమును బాధించి విశేష్య మేలింగము గలదో ఆలింగము గలదౌను. ఉ. అర్ధాంతమునకు - బ్రాహ్మణాయాయం బ్రాహ్మణార్ధస్సూపః, బ్రాహ్మణార్ధా యవాగూః, బ్రాహ్మణార్ధం పయః. ప్రాదులకు-అతిక్రాంతః ఖట్వా మతిఖట్వః పురుషః, అతిఖట్వా స్త్రీ, అతి ఖట్వం బ్రాహ్మణకులం; అవకృష్టః కోకిలయా అవకోకిలః పుష్పస్తబకః, అవకోకిలా మంజరీ, అవకోకిలం ఫలం; పరిగ్లానో ఽధ్యయనాయ పర్యధ్యయనః మాణవకః, పర్యధ్యయనా వటుసంహతిః, పర్యధ్యయనం కఠబృందం; నిష్క్రాంతః కాశాంబ్యా నిష్కౌశాంబిః పురుషః, నిష్కౌశాంబీ సేనా, నిష్కౌశాంబి అజావికులం; అలంపూర్వ సమాసకు - అలంజీవికాయై అలంజీవికః గ్రామః, అలంజీవికా భూమిః అలంజీవికం ధనం; ప్రాప్తో జీవికాం ప్రాప్త జీవికః, ఆపన్నో జీవికా మాపన్నజీవికః.

**తద్ధితార్థే ద్విగుః -**

'తద్ధితార్థో త్తారపదసమాహారే చ' అను సూత్రముచేత తద్ధితార్థమందు విధింపఁబడిన ద్విగుసమాసము విశేష్యనిఘ్నలింగము. ఉ. పంచసు కాపాలేషు సంస్కృతః పంచకపాలః పురోడాశః, పంచకపాలాయవాగూః, పంచకపాలం హవిః.

**సంఖ్యా సర్వనామ తదన్తకాః.** 45

సంఖ్యావాచకములైన శబ్దములును, సర్వనామ శబ్దములును, ఆసంఖ్యా సర్వనామములు అంతముగాఁ గల శబ్దములును విశేష్యనిఘ్నములు. ఉ. సంఖ్యావాచకములకు – ఏకాస్త్రీ; ఏకః పురుషః; ఏకంకులం. చత్వారః పురుషాః; చతస్రః స్త్రియః; చత్వారిబ్రాహ్మణకులాని. బహవః పురుషాః; బహ్వ్యః స్త్రియః; బహూని కులాని. పంచన్‌శబ్దము మొదలు అష్టాదశశబ్దపర్యంతమైన సంఖ్యలకు 'షట్సంజ్ఞ కాస్త్రిషు' అని ముందర మూఁడులింగములయందును సమానముగాఁ జెప్పుచున్నాఁడు గనుకను ఏకోనవింశతి మొదలుకొని నవతిపర్యంతము 'తాసుచానవతేఃస్త్రియః' అని పూర్వము స్త్రీలింగములుగాఁ జెప్పినాఁడు గనుకను, శతాదిసంఖ్యలకు 'కోట్యాశ్శతాదిసంఖ్యాన్యా' అని నపుంసకములుగాఁ జెప్పినాఁడు గనుకను, ఇక్కడ తద్వ్యతిరిక్తమైన సంఖ్య లుదాహరణములు. సర్వనామ శబ్దములకు – సర్వః, 'పురుషః, సర్వాస్త్రీ, సర్వం కులం. స పురుషః. సాస్త్రీ, తత్కులం. సంఖ్యాంతములకు – పరమైకః, పరమైకా, పరమైకం. సర్వనామాంతములకు– పరమసర్వః, పరమసర్వా, పరమసర్వం. టీ. తత్ర సంఖ్యావాచినాం మధ్యే 'తాసుచానవతేఃస్త్రియ' ఇతి వింశత్యాదీనాం స్త్రీలింగత్వ ముక్తం వైశ్యవర్గే. శతాదీనాం తు అత్రైవ వర్గే 'కోట్యాశ్శతాదిసంఖ్యా' న్యేత్యాదినా నపుంసకత్వ ముక్తం. అతో ఉత్ర సంఖ్యాశబ్దేన ఏకాద్యాః, అష్టాదశాంతాః, బహుశబ్దాశ్చ గృహ్యంతే. 'షట్సంజ్ఞకాస్త్రిషు సమా' ఇత్యనేన పంచన్నాదీనా మష్టాదశాంతానాం త్రిలింగత్వమాత్ర ముక్తం. అనేన తు 'పరోపగత్వముచ్యత' ఇతి.

**బహువ్రీహి రదిఙ్నామ్నా మున్నేయం త దుదాహృతమ్,**

'దిఙ్నామాన్యంతరాళే' అనుసూత్రముచేత దిగ్వాచక శబ్దములకు అంతరాళము వాచ్యమైనప్పుడు చెప్పిన బహువ్రీహిసమాసమును

విడిచిపెట్టి తక్కిన బహు వ్రీహి సమాసములు విశేష్యనిఘ్నములు. తదుదాహృతం = దానికి నుదాహరణములు, ఉన్నేయం = ఊహించుకొనఁదగినది. ఎట్లనిన ___ ప్రాప్తముదకం యంప్రాప్తోదకో గ్రామః, ప్రాప్తోదకానగరీ, ప్రాప్తోదకం నగరం. చిత్రాః పటా యస్య స చిత్రపటః పురుషః, చిత్రపటాస్త్రీ, చిత్రపటం కులం. అపగతా దశా యేషాం తే అపదశాః; పుత్రేణ స హాగత స్సపుత్రకః. అస్తిక్షీరా గౌః. దిఙ్నామశబ్దములకు – ఉత్తరస్యాః పూర్వస్యాశ్చ దిశోర్యదంతరాళం ఉత్తరపూర్వా. దక్షిణ పూర్వా అని స్త్రీలింగములు.

**గుణ ద్రవ్య క్రియా యో గోపాధయః పరగామినః.** 46

గుణమును, ద్రవ్యమును, క్రియయును, ప్రవృత్తి నిమిత్తముగాఁ గల శబ్దములు విశేష్య నిఘ్నములు. ఉ. గుణోపాధికి – శుక్లా శాటీ, శుక్లః పటః, శుక్లం వస్త్రం. ద్రవ్యోపాధికి – దండినీ స్త్రీ, దండీ పురుషః, దండి కులం. క్రియోపాధికి – పాచికాస్త్రీ, పాచకం కులం, పాచకః పురుషః.

**కృతః కర్త ర్య సంజ్ఞాయామ్ -**

సంజ్ఞావ్యతిరిక్తమైన కర్త్రర్థమందు విహితములైన కృత్ప్రత్యయములు అంతములుగాఁ గల శబ్దములు విశేష్య నిఘ్నములు. ఉ. కర్త్రీ, కర్తా, కర్తృ. కుంభకారీ, కుంభకారః, కుంభకారం. సంజ్ఞయందయిన సింహః, వ్యాఘ్రపాదః అని పుంలింగములు.

**కృత్యాః కర్తరి కర్మణి,**

కర్త్రర్థమందును, కర్మార్థమందున విహితమైన కృత్ప్రత్యయము అంతముగాఁ గల శబ్దములు విశేష్య నిఘ్నములు. ఉ. కర్త్రర్థమునకు – భవ్యస్తరుః, భవ్యా లతా, భవ్యం ఫలం. వాస్తవ్యః, వాస్తవ్యా. వాస్తవ్యం. కర్మార్థమునకు – వక్తవ్యః, వక్తవ్యా, వక్తవ్యం. భావార్థమందైన నపుంసకలింగము. స్థాతవ్యం త్వయా.

**అణాద్యన్తా స్తేన రక్తాద్యర్థే నానార్థ భేదకాః.** 47

"తేనరక్తం రాగాత్" అనునది మొదలయిన సూత్రములచేత రక్తాద్యర్థముల యందు విధింపఁబడిన అణ్ప్రత్యయము. మొదలైన తద్ధిత ప్రత్యయములు అంతములుగాఁ గల శబ్దములు నానార్థములకు విశేషణములై

విశేష్య నిఘ్నములౌను. ఉ. కుసుంభేనాక్తః కౌసుంభః పటః, కౌసుంభీశాటీ, కౌసుంభం వస్త్రం. లాక్షికా, లాక్షికః, లాక్షికం. ఇంద్రోదేవతా అస్యా ఐంద్రీ ఋక్, ఐంద్రః పురోడాశః; ఐంద్రం హవిః. అసంజ్ఞాయాం అనునది ఇక్కడను సంబంధించును గనుక, సంజ్ఞయందయిన శ్రావణీ పౌర్ణమాసీ; ఉష్ణికా యవాగూః అని నియతలింగములు. కొందఱు నానార్థభేదకాః అనునది ప్రత్యేకమని చెప్పి, నానార్థవాచక శబ్దములు విశేష్యలింగములు. అది యెట్లనిన ___ 'శివో రుద్ర శ్శివా గౌరీ శివం భద్రం' అని యుదాహరింతురు.

## అలింగ ప్రకరణము

**షట్సంజ్ఞకా స్త్రిషు సమా యుష్మ దస్మత్తి ఙవ్యయమ్,**

'ష్ణాంతాష్షట్–డతి చ' అను సూత్రములచే షకారాంత నకారాంతములయిన సంఖ్యావాచక శబ్దములకును, డతి ప్రత్యయాంతమైన కతి శబ్దమునకును షట్సంజ్ఞ విధింపఁబడెను. ఆ షట్సంజ్ఞకశబ్దములును యుష్మ దస్మచ్ఛబ్దములును తిఙంతములును అవ్యయములును మూఁడులింగముల యందు నొక్కరూపముగలవై యుండును. ఉ. షకారాంతసంఖ్యకు – షట్స్త్రియః, షడ్రసాః, షట్కులాని నకారాంతసంఖ్యకు–పంచ స్త్రియః, పంచ శరాః, పంచేంద్రియాణి. యుష్మచ్ఛబ్దమునకు– త్వం స్త్రీ, త్వం నపుంసకం. అహం నపుంసకం, అహం పుమాన్, అహంస్త్రీ. తిఙంతములకు – పచతి పుమాన్, పచతి వనితా, పచతి కులం. అవ్యయములకు – ఉచ్చైర్గిరిః, ఉచ్చైశ్శాలా, ఉచైర్గృహం. టీ. స. ఇహహి శబ్దా ద్వివిధాః. అవ్యక్తలింగా వ్యక్తలింగాశ్చేతి. తత్ర వ్యక్తలింగానామనుశాసనం కృతం. అన్యేషామప్యభిధేయతయా ప్రతిజ్ఞాతాయాః, లింగశాసనపూర్ణోక్తేః వ్యాహతి స్స్యాదితి మన్వానః సంప్రత్యలింగా న్నిరూపయతి. షట్సంజ్ఞకా ఇతి ___ "షడ్యుష్మదస్మదంతాశ్చచ తత్రప్రధానా స్సమాస్త్రి" ష్వితి శేషః.

**పరం విరోధే -**

లింగాది సంగ్రహవర్గమందుఁ జెప్పిన లక్షణములు రెండును అన్యత్ర చరితార్థములైనవి యొకయుదాహరణము నందు ప్రాప్తమైన యెడల అక్కడ పరమైన లక్షణముచేత లింగనిర్ణయము తెలిసికొనునది. అది

యెట్లనిన – అసురపర్యాయములన్నియు పుంలింగములని పుంలింగ శేషమందుఁ జెప్పిన లక్షణము. నైఋతః, రాక్షసః – ఇత్యాదులయందు చరితార్థము. 'ద్వ్యచ్కమసి సుసన్నంతం' అని నపుంసకలింగ శేషమందుఁ జెప్పిన లక్షణము యశః, పయః ఇత్యాదులయందు చరితార్థము. ఈ రెండు లక్షణములును రక్షః అనుదిక్కున ప్రాప్తములైనవి గనుక నిచ్చట 'ద్వ్యచ్కమపి సుసన్నంతం' అను పరలక్షణముచేత నపుంసకలింగమని తెలిసికొనునది. ఇటులనే 'క ష ణ భ మ రోపాంతాః' అని పుంలింగ శేషమందుఁ జెప్పిన లక్షణమును, 'ద్విచతుష్షట్పదోరగాః' అని స్త్రీపుంలింగశేషమందుఁ జెప్పిన లక్షణమును, మానుష భ్రమర శబ్దములయందు ప్రాప్తముకాఁగాఁ బరమైన స్త్రీ పుంలింగ శేష లక్షణముచేతనే లింగనిర్ణయము. మానుషః, మామషీ; భ్రమరః, భ్రమరీ.

**శేషం తు జ్ఞేయం శిష్టప్రయోగతః.** 48

ఈశాస్త్రమందుఁ దెలియఁజేయఁబడని నామలింగనిర్ణయము శిష్ట ప్రయోగములవలనఁ దెలిసికొనునది. అది యెట్లనిన___ ధర్మపరమైన తయ ప్రత్యయాంతము స్త్రీనపుంసకలింగములయందు వర్తించును. వర్ణానాం చతుష్టయీ, వర్ణానాం చతుష్టయం. ఛందోవాచకమైన గాయత్రీ శబ్దము స్త్రీనపుంసకలింగము. గాయత్రం ఛందః; గాయత్రీ ఛందః; ఇక్ స్తి బంతములు పుంలింగములు. అయం పచిః.అయం పచతిః. ప్రమాణాదిశబ్దములు నియతనపుంసకలింగములు. వేదాః ప్రమాణం, స్మృతయః ప్రమాణం. భూతమియం బ్రాహ్మణీ. విప్రాశిషో భ్రదం. టీ. స. శేషం తుజ్ఞేయం శిష్టప్రయోగతః. అయ మర్థః – ఇహాస్మాభి రజ్ఞానా దస్మరణా దత్యంతోపయోగాభావేన గ్రంథగౌరవ భయాద్వాయన్నానుశిష్టం తత్సర్వం శిష్టానాం మహాకవీనాం ప్రయోగతః ప్రయోగాలోచనేన సమ్యగవధాతవ్యం. యథా – విష్ణుపర్యాయేషు ముంజకేశాదయ శ్శబ్దా నాభిహితాః, శంభుపర్యాయేషు మహానటాదిశబ్దా నోక్తాః, సముద్రపర్యాయేషు క్షీరోదవాచకః కలశాంబుధిః పరిత్యక్తః, బిందుపర్యాయేషు తంతుర్పశబ్దః న స్మృతః. తథా వృక్షలతా పక్షిధాన్యభేదా బహవో నానుశిష్టాః, అనుశిష్టేష్వపి క్వచిత్క్వచిత్ కేచన పర్యాయా న నిబద్ధాః. తథా కోరక మౌక్తికాది శబ్దానా మనేకలింగానామపి లింగాంతరం నాఖ్యాతం. తథా నానార్థ

వర్గే ఽపి కతిచిదేవ నానార్థవాచకాః శబ్దాః పఠితాః, తేషామపి సర్వే అర్థా న కథితాః. లింగసంగ్రహే ఽపి బహువక్తవ్యమస్తి. యథా___ ఇక్‌స్తిపౌ ధాతునిర్దేశే ప్రత్యయద్వయం శాస్త్రే కథితం త దిహనోక్తం. స్వార్థక ప్రత్యయానామపి కేషాంచిత్ ప్రకృతిలింగాతి వృత్తిర్దృశ్యతే. యథా ___ చత్వారో వర్ణా శ్చాతుర్వర్ణ్యం. ఛందసా మణ్‌ప్రత్యయే - గాయత్రం, త్రైష్టుభం, జాగతం. తథా సమాహారవృత్తే స్తయప్ప్రత్యయాంతస్య స్త్రీనపుంసకోభయలింగత్వం. 'స్తనద్వయం చారుతథా ప్రవృద్ధం', 'జగత్త్రయీ మండనమందిత్రైషా', 'భువనత్రయ' మిత్యాది. తథా వ్యావర్తకైకస్వభావా అపి కేచన అజహల్లింగా ఏవ. యథా ___ వేదాః ప్రమాణం; స్మృతయః ప్రమాణం; ప్రమాణ మియం బ్రాహ్మణీ. గమనే మంగళం హేషా; మంగళం బ్రాహ్మణాశిషః; విప్రా శిషో భద్రం. ఇత్యాదిక మనేక మిహ బహుజ్ఞైరుదాహర్తవ్యమ్.

**ఇత్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే,**
**తృతీయకాణ్డ స్సామాన్య స్సాఙ్గ ఏవ సమర్థితః.**

ఇతి = ఇట్లు, అమరసింహకృతౌ = అమరసింహుని కృతియగు, నామలిఙ్గానుశాసనే = నామలింగానుశాసన మను కోశమందు, తృతీయః = మూఁడవదగు, సామాన్యకాణ్డః = సామాన్యకాండము, సాఙ్గఏవ = సమగ్రముగానే, సమర్థిః = నెఱవేర్పఁబడెను.

# తృతీయ కాండము సమాప్తము

సంస్కృతాంధ్రవ్యాఖ్యాన సహితమైన

# అమరకోశము సంపూర్ణము



శ్రీరస్తు

# అమరకోశ

## శబ్దానుక్రమణిక

# అమరకోశం

## (అను)

## నామలింగానుశాసనము

## (గురుబాలప్రబోధికావ్యాఖ్యతో)

'అమరం చదవని వానికి నేను అమరను' అని సరస్వతీ దేవి వచనంగా ప్రచారంలో ఉన్న 'నామలింగాను శాసనం' అనే నిఘంటువు సుమారు రెండు వేల సంవత్సరాలకు పైగా భారత భూమిలో ప్రచారంలో ఉన్నది. సంస్కృతం నేర్చుకొనే ప్రతి విద్యార్థి అమరం వల్లెవేయటం ప్రాథమికమని భావించబడిన మహా గ్రంథం ఇది. ఆయుర్వేద మహాశాస్త్రవేత్త ధన్వంతరి కూడా ఈ నిఘంటువు మీద ఆధారపడి తన ధన్వంతరి కోశమనే ఆయుర్వేద నిఘంటువును రచించాడంటే ఈ నామలింగానుశాసనం యొక్క విశిష్టతను తెలుసుకోవచ్చు.

'నామలింగానుశాసనం' రచించిన అమరసింహుని పేరు మీదనే ఈ నిఘంటువు అమరకోశం అని ప్రాచుర్యం పొందింది. పదిహేను వందల సంవత్సరాల క్రిందటే చైనా భాషలోనికి కూడా అనువాదం పొందిన నిఘంటువు ఇది. అమరకోశం తనకు పూర్వం రచింపబడిన నిఘంటువుల నడుమ మహోజ్జ్వలమై నాటికీ నేటికీ ప్రకాశించే కోశరత్నం. అమర కోశానికి సంస్కృత ప్రచారానికీ శాశ్వతమైన అవినాభావ సంబంధం ఏర్పడింది. ఈనాటికీ ప్రతి సంస్కృత విద్యార్థి 'యస్యజ్ఞాన దయా సింధో' అనే ప్రార్థనా శ్లోకంతో మొదలుపెట్టి సంస్కృత అధ్యయనాన్ని ప్రారంభిస్తున్నాడు. ఈ విధంగా అమరకోశం సంస్కృత వాఙ్మయంలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్న విషయం యథార్థం.

అలాంటి అమరకోశాన్ని లింగాభట్టీయం అనే టీకా సర్వస్వంతో కలిపిఉన్న గురుబాల ప్రబోధికా వ్యాఖ్యతో ప్రస్తుతం సమర్పిస్తున్నాము. ఇది తెలుగువారికి కల్పవృక్షమై భాసిల్లాలని మా కోరిక....

– పబ్లిషర్స్.




VICTORY PUBLISHERS
# 30-17-3A, Varanasivari Street,
Seetharamapuram, VIJAYAWADA - 2.
Ph : 0866 - 2444156